| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| 26. శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రిగారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | ౭౦౭ |
| 27. శ్రీ ఘంటాల హనుమంతరావుగారు | ... | ... | „ |
| 28. శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ. | ... | ... | ౭౦౮ |
| 29. శ్రీ దర్భనాల లక్ష్మీసత్యనారాయణయ్యగారు | ... | ... | ౭౦౯ |
| 30. శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు | ... | ... | ౭౦౯ |
| 31. శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు | ... | ... | ౭౧౦ |
| 32. శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారు | ... | ... | ౭౧౨ |
| 33. శ్రీ సాగి రామనాథశర్మగారు | ... | ... | ౭౧౩ |
| 34. శ్రీ దేశపాండ్య సుబ్బరావుగారు | ... | ... | ౭౧౪ |
| 35. శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తిగారు, బి. ఏ., యల్. టి., యస్. డి. | ... | ... | ౭౧౬ |
| 36. శ్రీ చిట్టా సుందరరామయ్యగారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | ౭౧౭ |
| 37. శ్రీ న్యాయభూషణ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు | ... | ... | „ |
| 38. శ్రీ చిలుకూరి మాడభూషి వేంకటరాఘవాచార్యులుగారు | ... | ... | ౭౧౮ |
| 39. శ్రీ సురభి తులసీదాసుగారు | ... | ... | „ |
| 40. శ్రీమాన్ శ్రీమత్తిరుమల శ్రీగుదిమెళ్ల వరదాచార్యులుగారు, ఎం. ఏ. ... | | ... | ౭౨౧ |
| 41. శ్రీ గొట్టిముక్కుల రామశాస్త్రిగారు | ... | ... | „ |
| 42. శ్రీ పి. ఎస్. శర్మగారు | ... | ... | ౭౨౪ |
| 43. కవిమండలమండన శ్రీ మంగళగిరి కృష్ణద్వైపాయనాచార్యులుగారు | ... | ... | ౭౨౫ |
| 44. శ్రీ వైద్యవిద్వాన్ పండిత నారునాగనార్యగారు | ... | ... | ౭౨౭ |
| 45. శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు | ... | ... | ౭౨౮ |
| 46. శ్రీమతి సి. సరస్వతీబాయిగారు | ... | ... | ౭౨౯ |
| 47. శ్రీ వరిగొండ సత్యనారాయణమూర్తిగారు | ... | ... | ౭౩౨ |
| 48. శ్రీ కాదురాజు సీతారామ కవిగారు | ... | ... | ౭౩౪ |
| 49. శ్రీ కల్లా సుబ్బలక్ష్మమ్మగారు | ... | ... | ౭౩౯ |
| 50. శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు, బి. యే. | ... | ... | ౭౪౩ |
| 51. శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు, బి. ఏ., బి. ఎల్. | ... | ... | ౭౪౫ |
| 52. శ్రీ పింగళి వేంకట్రామయ్యగారు, బి. యస్. సి. (ఆనర్స్) | ... | ... | ౭౪౯ |
| 53. శ్రీ చెవ్వాప్రగడ భానుమూర్తిపంతులుగారు | ... | ... | ౭౫౦ |
| 54. శ్రీ వావిలాల వేంకటసుబ్బయ్యగారు | ... | ... | „ |
| 55. శ్రీ మల్లెల శ్రీరామమూర్తిగారు | ... | ... | ౭౫౧ |
| 56. విద్యాసుందరి గానకళావిశారద శ్రీ బెంగుళూరు నాగరత్నమ్మ | ... | ... | ౭౫౨ |

విషయము. పుట.


57. శ్రీమాన్ సీ. విజయరాఘవాచారిగారు ... ... ౨౪౪
58. శ్రీ గౌ॥ రావుబహదూరు జస్టిస్ పి. వెంకటరమణారావుగారు ... ... ౨౪౫
59. శ్రీ గౌ॥ న్యాయమూర్తి కే. పి. లక్ష్మణరావుగారు ... ... ,,
60. శ్రీ కలిశెట్టి రామరావుగారు ... ... ౨౪౬
61. శ్రీ పి. కెంచయ్యగారు, యం. యల్. ... ... ౨౪౭
62. శ్రీ దివాన్ బహద్దరు వి. ఎన్. విశ్వనాథరావుగారు ... ... ౨౪౮
63. శ్రీ ఓ. పుల్లారెడ్డిగారు, ఐ. సి ఎస్. ... ... ,,
64. శ్రీ రావుబహదూరు ఎం. నరసింహంపంతులుగారు, బి. ఏ., బి. ఎల్ ... ... ,,
65. శ్రీ ఖాన్ బహదూరు అదము హాజీమహమ్మద్ సేఠ్ గారు ... ... ౨౪౯
66. శ్రీ దివాన్ బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసుగారు ... ... ,,
67. శ్రీ పిఠాపురము మహారాజాగారు ... ... ౨౫౦
68. శ్రీ కే. శ్రీరాములునాయుడుగారు ... ... ,,
69. శ్రీ ఎస్. సత్యమూర్తిగారు, యం. యల్. యే. ... ... ౨౫౧
70. శ్రీ పీ. వాసుదేవ్, బి. ఏ., బి. ఎల్. ... ... ,,
71. శ్రీ రావుబహదర్ ఎం. సి. రాజాగారు, ఎం. ఎల్. ఏ. ... ... ౨౫౨
72. శ్రీ రాజసేవాప్రవీణ ఖాన్ బహదూరు జి. ఎస్. కరీంసాహేబ్ గారు, ఎం. బి. యి. ... ,,
73. శ్రీ ఎస్. గురుస్వామిగారు ... ... ,,
74. శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు ... ... ౨౫౩
75. శ్రీ రావుబహదూరు ఎం. రామన్ గారు, బి. యే., యం. యల్. సీ. ... ,,
76. శ్రీ డాక్టరు పీ. వరదరాజులునాయుడుగారు ... ... ౨౫౪
77. శ్రీ కే. వైకుంఠరావుగారు, బి. ఏ. ... ... ,,
78. శ్రీ సర్: ఫ్రెడరిక్ జేమ్సుగారు, కేటి, ఎం. ఎల్. ఏ. ... ... ౨౫౫
79. శ్రీ సర్: జమ్నాదాసుమెహతాగారు, ఎం. ఎల్. ఏ. ... ... ,,
80. శ్రీ యం. యస్. అణేగారు, బి. యల్., యం. యల్. ఏ. ... ... ౨౫౬
81. శ్రీ డాక్టర్: బి. యస్. మూంజిగారు ... ... ,,
82. శ్రీ టీ. జి. ఖపర్డేగారు, బి. ఏ, యల్. యల్. బి., అడ్వొకేటు, యం. యల్. యే. ౨౫౮
83. శ్రీ రామరావు దేశముఖగారు, బార్-అట్-లా, యం. యల్. ఏ. ... ... ,,
84. శ్రీ జీ. వి. దేశముఖగారు, బార్-అట్-లా, యం. యల్. యే. ... ... ౨౫౯
85. శ్రీ కే. సీ. దాస్జీగారు, బి. యే., యల్. యల్. బి. ... ... ౨౬౦
86. శ్రీ రావుబహదూరు యన్. కే. కేళ్కరుగారు ... ... ,,
87. శ్రీ వెంకటరావు శిష్టాగారు ... ... ౨౬౧

విషయము. ... పుట.

88. శ్రీ కె. యఫ్. నారిమన్‌గారు, యల్. యల్. బీ. యం. యల్. యే. ... ౨౨౧
89. శ్రీ ఆరూరు వేంకటరావుగారు, బి. ఏ., యల్. యల్. బీ. ... ... ౨౨౨
90. శ్రీ దివాన్‌బహాదరు సి. యస్. రత్నసభాపతిమొదలారిగారు ... ... ౨౨౩
91. శ్రీ కె. నట్రాల్ ఎస్క్వయర్, యం. యల్. యే. ... ... „
92. శ్రీ జి. హెచ్. హాడ్గుసన్, ఎస్క్వయర్, యం. యల్. యే. ... ... „
93. శ్రీ జి. ఈ. వాకర్, ఎస్క్వయర్, యం. యల్. ఏ., ... ... ౨౨౪
94. శ్రీ రావుబహాదూరు సీ. గోపాలమీనన్‌గారు ... ... „
95. శ్రీ గా॥ నారాయణదాసు గిరిధరదాసుగారు ... ... ౨౨౫
96. శ్రీ దివాన్‌బహాదరు జి. నారాయణస్వామిచెట్టిగారు, సి. ఐ. ఈ. ... ... „
97. శ్రీ జనాబ్ యూసుఫ్‌సేట్, బహాదరు, బి. ఏ. ... ... ౨౨౬
98. శ్రీ పి. సీతారామశెట్టిగారు ... ... „
99. శ్రీ యం. పి. గోపాలశెట్టిగారు ... ... ౨౨౭
100. శ్రీ కొత్తూరు రంగనాయకులుశెట్టిగారు ... ... „
101. శ్రీ హెచ్. డీ. రాజాగారు ... ... ౨౨౮
102. శ్రీ ఏ. వరదప్పశెట్టిగారు ... ... „
103. శ్రీ పి. యమ్. బాలసుబ్రహ్మణ్యమొదలియారుగారు ... ... ౨౨౯
104. శ్రీ గా॥ యం. సీటీ. యం. చిదంబరంచెట్టియారుగారు, బి. ఏ., బి. ఎల్., ... „
105. శ్రీ ఖాన్‌బహాదరు మహమ్మదుసాదుల్లా బాద్షాసాహెబ్ బహాదరుగారు ... ౨౩౦
106. శ్రీ యన్. రామరావుగారు, బి. ఏ., బి. ఎల్. ... ... „
107. శ్రీ రావుసాహెబ్ యం. బి. కృష్ణయ్యశెట్టిగారు, యఫ్. టీ. యస్. ... ౨౩౧
108. శ్రీ రాజసేవాసక్త దివాన్‌బహాదూరు డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారుగారు ... „
109. శ్రీ రావుబహాదూరు ఆర్. కృష్ణరావుభోంస్లేగారు, ఐ. యస్. వో.... ... ౨౩౨
110. శ్రీ ప్రొఫెసరు యన్. రంగనాథంగారు ... ... ౨౩౪
111. శ్రీ పి. శేషాద్రిగారు, యం. యే., యం. బి. ఇ. ... ... „
112. శ్రీ డాక్టరు బి. శివరామ్‌గారు, యం. ఏ., పి. యచ్. డీ. ... ... ౨౩౫
113. శ్రీ డాక్టరు కె. ఆర్. శ్రీనివాసయ్యంగారు, యం. యే., డి. లిట్. ... ... „
114. శ్రీ రావ్‌సాహెబ్ యన్. కే. వెంకటేశన్‌పంతులుగారు, యం. ఏ., యల్. టీ. ... ౨౩౮
115. శ్రీ ప్రొఫెసరు యస్. కె. యజ్ఞనారాయణఅయ్యరుగారు, యం. యే. ... ౨౩౯
116. శ్రీ విద్యాసాగర విద్యావాచస్పతి పీ. పీ. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బి. ఏ. (ఆక్సన్), ఎం. ఏ. ౨౪౦
117. శ్రీ పి. ఆర్. రామచంద్రదీక్షితరు, యం. యే. ... ... „
118. శ్రీ ప్రొఫెసరు బి. వి. రామనరసుగారు, డి. బి. ఆర్. ... ... ౨౪౧

విషయము. ... పుట.


119. శ్రీ సి. యచ్. బాలకృష్ణశాస్త్రిగారు, యం. యే., యల్. టీ. ... ... ౨౯౧

120. శ్రీ రావుసాహెబ్ మహాకవి సాహిత్యభూషణ ఉల్లూరు యస్. పరమేశ్వరఅయ్యరుగారు ౨౯౨

121. శ్రీ కె. గంగన్నగారు ... ... ,,

122. శ్రీ టీ. బీ. వెంకటరావుగారు, ఎం. ఏ., ఎల్. టీ. ... ... ౨౯౪

123. శ్రీ దివాన్‌బహదూరు సర్: అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు ... ... ౨౯౫

124. శ్రీ రావుబహదూరు ఆర్. ఎన్. అయ్యంగారు ... ... ౨౯౬

125. శ్రీ రావుబహదరు ఎం. చెంగయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౨౯౭

126. శ్రీ రావుబహదూరు వి. ఎన్. కృష్ణరావుపంతులుగారు, బి. ఏ., బి ఎల్. ... ౨౯౮

127. శ్రీ రావుబహదరు కే. పీ. కృష్ణస్వామిఅయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్. ... ౨౯౯

128. శ్రీ రావుబహదరు కే. వి. శేషఅయ్యంగారు. ఎం. బీ. యి., బి. ఏ., బి. ఎల్. ... ,,

129. శ్రీ కే. బాలసుబ్రహ్మణ్యఅయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౩౦౦

130. శ్రీ కే. భాష్యంగారు, బి. ఏ., బి. ఎల్. ఎం. ఎల్. ఏ. ... ... ౩౦౧

131. శ్రీ కే. కృష్ణస్వామిఅయ్యంగారు, బి. ఏ, బి. ఎల్. ... ... ,,

132. శ్రీ ఆర్. సూర్యారావుగారు, బి. ఏ.,బి. ఎల్. ... ... ౩౦౨

133. శ్రీ సీ. సాంబశివరావుగారు, బి. ఏ. ... ... ౩౦౩

134. శ్రీ ఈ. వినాయకరావుగారు ... ... ౩౦౪

135. శ్రీ కే. ఎల్. నరసింహారావుగారు, బి. ఏ., బి ఎల్. ... ... ,,

136. శ్రీ ఈ. ఎల్. అయ్యరుగారు, బి. ఏ. బార్-అట్-లా ... ... ౩౦౬

137. శ్రీ జే. సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్. ... ... ౩౦౭

138. శ్రీ సీ. ఆర్. పట్టాభిరామన్‌గారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౩౦౮

139. శ్రీ యస్. ముత్తయ్యమొదల్యారుగారు, సి. ఐ. ఈ. ... ... ,,

140. శ్రీ తేకుమళ్ల రామచంద్రరావుగారు, యం. యే., బి. యల్. ... ... ౩౦౯

141. శ్రీ బీ. వెంకటపతిరాజాగారు, సీ. ఐ. ఈ. ... ... ,,

142. శ్రీ పీ. సోమసుందరంగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౩౧౦

143. శ్రీ ఏ. సూర్యనారాయణయ్యగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ,,

144. శ్రీ రావుబహదరు వారణాసి రఘునాథరెడ్డిగారు ... ... ౩౧౧

145. శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డిగారు ... ... ,,

146. శ్రీ నిరంజనానందస్వామిగారు ... ... ౩౧౨

147. శ్రీ బీ. పీ. నరసింహస్వామిగారు ... ... ౩౧౨

148. శ్రీ సచ్చిదానందసంఘము అధ్యక్షులు శ్రీ స్వామి రాజేశ్వరానందగారు ... ,,

149. శ్రీ దివాన్‌బహదరు టి. ఏ. రామలింగంశెట్టియారుగారు ... ... ౩౧౩

విషయము. | పుట.

150. శ్రీ లెఫ్టినెంటుకల్నల్ వీ. మహాదేవన్‌గారు, ఐ. యం. యస్. ... ... ౨౧౩
151. శ్రీ డాక్టరు డి. యస్. రామచంద్రరావుగారు, యం. ఏ. యం. డి. ... ,,
152. శ్రీ రావుసాహెబు కె. రంగస్వామినాయుడుగారు ... ... ౨౧౪
153. శ్రీ కె. శ్రీనివాసన్‌గారు ... ... ,,
154. శ్రీ డాక్టరు సర్: సీ. వై. చింతామణిగారు ... ... ౨౧౫
155. శ్రీ ఖాసా సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్. ఎల్. టి. ... ... ౨౧౭
156. శ్రీ సీ. ఆర్. శ్రీనివాసన్‌గారు ... ... ౨౨౧
157. శ్రీ కె. పున్నయ్యగారు ... ... ,,
158. శ్రీ పి. ఎస్. వెంకట్రామన్‌గారు ... ... ౨౨౨
159. శ్రీ ఎస్. పీ. శర్మగారు ... ... ౨౨౩
160. శ్రీ ఏ. పద్మనాభయ్యరుగారు ... ... ౨౨౪
161. శ్రీ జీ. వి. కృపానిధిగారు, ఎం. ఏ., బి. ఎల్. ... ... ౨౨౫
162. శ్రీ ఏ. స్వామినాథయ్యరుగారు, బి. ఏ. ... ... ,,
163. శ్రీ ఏ. ఆర్. భట్‌గారు. ... ... ౨౨౬
164. శ్రీ యన్. సుబ్రహ్మణ్యయ్యరుగారు, ఎం. ఏ. ... ... ౨౨౭
165. శ్రీ ఎన్. ఎస్. శ్రీనివాసయ్యరుగారు ... ... ,,
166. శ్రీ జే. లక్ష్మన్నగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౨౨౮
167. బాబూ శ్రీ అమల్‌హోంగారు ... ... ౨౨౯
168. శ్రీ మేడం సోఫియా వాడియాగారు ... ... ,,
169. ఏ. ఏ. హెయిల్సు, ఎస్క్వయరు ... ... ౨౩౦
170. శ్రీ యస్. కణ్ణన్‌గారు ... ... ,,
171. శ్రీ టంగుటూరు ప్రకాశముపంతులుగారు, బార్-ఎట్-లా ... ... ౨౩౧
172. జే. ఏ. ఏట్సు, ఎస్క్వయర్, యం. ఏ. ... ... ,,
173. డాక్టరు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ... ... ,,
174. శ్రీ పి. శేషాద్రిగారు, ఎం. ఏ., ఎం. బీ. యి. ... ... ౨౩౨
175. ప్రొఫెసర్ శ్రీ పి. ఆర్. కృష్ణస్వామిగారు, యం. ఏ., ... ... ,,
176. శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ,,
177. డాక్టరు శ్రీ భో. పట్టాభిసీతారామయ్య, బి. ఏ., యం. బి. అండు సి. ఎమ్ ... ౨౩౩
178. శ్రీ వి. వి. ఎస్. అవధానులుగారు, బి. ఏ. ... ... ,,

విషయము. పుట.

179. శ్రీ యం. వీ. సుబ్బరావుగారు, బి. ఏ., బి. ఎల్. ... ... ౨౩౩
180. శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బి. ఏ., సి. బీ. యి. ... ... ,,
181. శ్రీ కాళహస్తి సుబ్బయ్యశాస్త్రిగారు ... ... ౨౩౪
182. శ్రీ వెల్లాల రామకృష్ణశాస్త్రిగారు, బి. ఏ. ... ... ౨౩౫

ఈ క్రిందిఅభినందనాలను కీర్తిశేషులైన పెద్దలు
శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్‌వారికి బంపినది.

183. రాజా సర్: టీ. మాధవరావుగారు ... ... ౨౩౬
184. ఆనరబిల్ రావుబహాదర్, శ్రీ పీ ఆనందాచార్యులుగారు, బి. ఎల్., సి. ఐ. ఈ. ... ,,
185. గౌ॥ శ్రీ పీ. చెంచలరావుపంతులుగారు, సీ. ఐ. ఇ. ... ... ,,
186. దివాన్‌బహాదరు శ్రీ కే. రామానుజాచారిగారు, ఎం, ఏ., బి. ఎల్. టి ... ౨౩౭
187, రావుబహాదరు శ్రీ కందుకూరి వీరేశలింగంపంతులుగారు ... ... ,,
188. మహారాజామిర్జా శ్రీఆనందగజపతి రాజ్‌మన్నేసుల్తాన్‌బహాదర్ ... ... ,,
189. శ్రీ వెలుగోటి శ్రీరాజగోపాలకృష్ణయాచేంద్రబహాదరువారు, కే. సీ. ఐ. ఇ.
శ్రీవేంకటగిరి మహారాజావారు ... ... ౨౩౮
190. రాజా శ్రీ ఏ. వి. జగ్గారావుబహాదూరుగారు, ఎం. ఆర్. ఏ. ఎస్. ఎఫ్. ఎం, యు. ... ,,
191. శ్రీ గౌ॥ న్యాపతి సుబ్బరావుపంతులుగారు ... ... ,,
192. శ్రీ దివాన్‌బహుదూరు వై. జానకిరామయ్యపంతులుగారు ... ... ,,
193. శ్రీ గుర్జాడ అప్పరావుపంతులుగారు, బి. ఏ., యఫ్. యం. యు. ... ... ౨౪౦
194. శ్రీ కే. చెంగయ్యపంతులుగారు, బి. ఏ. ... ... ,,
195. శ్రీ స్వామి విద్యానందపరమహంసగారు, బి. ఏ. ... ... ,,
196. శ్రీ బీ. రామకృష్ణరావుగారు, బి. ఏ. ... ... ,,
197. శ్రీ వై. నారాయణమూర్తిపంతులుగారు, బి. ఏ. ... ... ,,
198. శ్రీ జీ. హనుమంతరావుగారు, బి. ఏ. ... ... ౨౪౧
199. శ్రీ టి. వీ. స్వామినాథఅయ్యరుగారు, బి. ఏ., యల్, టి. ... ... ,,
200. శ్రీ పండిత అల్లాడి మహాదేవశాస్త్రిగారు, బి. ఏ. ... ... ,,
201. శ్రీ కీర్తనాచార్య సీ. ఆర్. శ్రీనివాసఅయ్యంగారు, బి. ఏ. ... ... ౨౪౨

---


ఆంధ్రుల చరిత్ర
(స్తోత్రప్రియులు క్షమించాలి)
తలిశెట్టి రామారావు

# ఆశీస్సు


శ్రీ ఆకుండి వేంకటశాస్త్రిగారు,

శ్రీమహారాజాగారి సంస్కృతకళాశాల, విజయనగరము.


శా. శ్రీమద్వాఙ్మయజాలమున్ శ్రుతితతుల్ శ్రీతాలపత్రాబ్ధ్యధో
భూమిన్మగ్నుటఁ గాంచి జ్ఞానయుతమౌ భూరిప్రమోదమ్మదె
ట్లౌ? మర్త్యాళికటంచు శ్రీవిభుఁడు నీయౌన్నత్యముం గూర్చె స
ద్రామస్వామ్యవతారమూని విలసద్వావిళ్లముద్రాలయా. 1

శా. చేవల్మీఱఁగ సత్కవీశ్వరులు నిశ్చింతం బురాణాదులన్
భావోద్రేకము లొప్పఁ గూర్చి తమజవ్యాతాలపత్రావళిన్
వేవే నిల్పిరి గాని వాని జగతీ విఖ్యాతి యె ట్లీవు స
ద్భావంబందక యున్న? శ్రీనిలయ! సద్వావిళ్లముద్రాలయా! 2

శా. ఎన్నో ముద్రణశాల లిప్పు డిల మేమే యంచు నిండారుటల్
నిన్నుం జూచియె గాదె? వానికరయ న్నీనేర్పు నీవ్యాప్తి తా
మెన్నే నేండ్లు తపమ్ము చేసినను రాదే! వాక్సరోజాతికిన్
వన్నెల్గూర్చినదాన వీవ గద! సద్వావిళ్లముద్రాలయా! 3

శా. గీర్వాణాంధ్రముఖాఖిలప్రచురవాక్చిత్రాత్మకంబై ధరా
సర్వస్వం బయినట్టి సత్కవియశస్సౌవర్ణముల్ చెన్నస
త్పూర్వర్వాంధ్రమహీజనంబులకుఁ బెంపుం గూర్చుటల్ నీవగా
యుర్విఖ్యాతయశోరమానిలయ! ఓహో! భవ్యముద్రాలయా! 4

శా. ఆర్వాక్ప్రాక్కవిగుంభితంబులగు గ్రంథాళిల్చరింపంగ నం
తర్వాణ్యాదృతిఁ గూర్చుచున్ ఘనతరద్రవ్యంబుచే వానినిం
బౌర్వాపర్యవిరోధశూన్యముగ సంప్రాప్తింపఁగాఁ జేసి యీ
పూర్వాస్తాచలమధ్యసీమ నిడితౌ హో! భూరిముద్రాలయా! 5

శా. రామస్వామిబుధుండు నాఁటె నిను సౌరక్షారుహంబట్లు త్వ
ద్భామవ్యాప్తిని వేంకటేశ్వరుఁడు సంధానించుచున్నాఁడు నీ
కేమీ! లోపము రాజతోత్సవము లెన్నే నిట్లు గల్గం ధరా
స్వామిత్వమ్ము వహింపు ముద్రణలకు న్నావిర్లముద్రాలయా! 6

శా. ప్రజ్ఞాశాలి యితండు నాఁబరఁగి శాస్త్రంబుల్ పురాణాళి త
త్త్వజ్ఞానార్జనసాధనౌపనిషదవ్యాహారము ల్కావ్య లో
కజ్ఞానమ్ములఁ గూర్చు గ్రంథములు గల్గంజేసి శ్రీవేంకటా
ఖ్య జ్ఞానోరుయశుండు నిన్బెనుచు నాహా! భవ్యముద్రాలయా! 7

శా. రాగాంధత్వము మాన్పి భక్తియుత వైరాగ్యంబు బోధించి స
త్త్యాగిం జేయు త్రిలింగపత్రికను సంస్థాపించి సద్విశ్వవి
ద్యాగారాన సెనేట్పదాదుల ననాయాసమ్మునం బొందు స
ద్భోగుంజేరితి వేంకటేశ్వరుని మేల్ పో! భవ్యముద్రాలయా! 8

శా. శ్లోకశ్యాణకరుండు స్వాశ్రితసురక్షాజంబునై యొప్పు ల
క్ష్మీకాంతుండు ఘటించుఁగాతఁ జిరసుశ్రీలాయురారోగ్యముల్
నీకున్ లోకము మెచ్చు ద్రవ్యము కడు న్వొచ్చించు నీస్వామికిన్
లోకారాధ్యయశమ్ము మీకిడు బుధాలోకమ్ము ముద్రాలయా! 9

**శ్రీభారతీతీర్థపండిత: శ్రీ దేవగుప్తాపు వేంకటరమణకవిరాజాగారు,**

కవిరాజ గ్రంథమండలాధిపతి, కరణము, వెంపడము, విశాఖపట్ణం జిల్లా.

అణువున-బ్రహ్మాండంబున, నణురూపము-విశ్వరూప మలరారెడి యా
ప్రణవముః-సంరక్షించుత, నినసన్నిభ తేజ-వేంకటేశ్వరశాస్త్రిన్ 1

భాషాయోషకు వేఱుపాధులు నశింపం, బ్రేమ నాయమ్మకున్
భూషా ప్రాయుఁడవై పురాకవికృతంబుల్ గ్రంథముల్ మాలగా
దోషా ల్దూలిచి కాన్క లిచ్చితివి సంతోషించి దీవింపఁగా
భాషోద్ధారక! వేంకటేశకవి! నిన్ వర్ణింపఁగా శక్యమే. 2

మరియు నీకున్న భాషాభిమానమునకు, ప్రేమచిహ్నఁగ వెలయు త్రిలిఙ్గపుత్రి
కిపుడురజతోత్సవ మొనర్చు టెల్లరకును, హర్షదాయక మగుగాదె! ఆంధ్రపుత్ర!

పుత్ర పౌత్రాభివృద్ధి-సన్మిత్ర వృద్ధి, ఆయురారోగ్యవృద్ధి-ధనాభివృద్ధి
నాంధ్రభాషాభిమాని వైనట్టినీకు, వేధ సమకూర్చుగాత ఇతోఽధికముగ. 4

ఇమ్మహావిశ్వమను సముద్రమ్మునందు, నాంధ్ర విజ్ఞానమను వస్తు వఱయుకోఱకు
శ్రీయుతుఁడుశాస్త్రి కర్ణధారిత్వమునను, గమ్యము త్రిలిఙ్గ నౌక వేఁ గాంచగలదు!

ప్రాచీనంబగు నాంధ్రవాఙ్మయకళా ప్రాశస్త్యముం జాటుచున్
వాచాగోచరమైన బ్రహ్మవిషయప్రస్తావనల్ తోడఁ బూ
ర్వాచారంబుల వెల్లడించుచు నిజాఖ్యత్రిఙ్గిణితోఁబాటుగా
ప్రాచీనాంధ్రభువిం జరించెదవు కావా? పత్రికాబాలరో! 6

నారచితంబులైన రచనాసుమసంతతి చేరుమాత్రనే
కూరిమిమీరఁ గంఠమునఁ గూర్చుక నీవు త్రిలిఙ్గభూమి వి
స్ఫారపరీమళంబులను చల్లి ముదం బొనగూర్తు; వట్టిచో
నీరజతోత్సవంబు హృది నించకయుండునె మాకు మోదమున్? 7

జలజము నీటిలో మెలఁగుచాడ్పున, మల్లియ పూలతోఁటలో
వెలసినభంగి, చంద్రుఁ డుడువీథి వెలుంగునటుల్, పవిత్రమౌ
ఫలమది పత్రమధ్యమున భాసిలుపోలిక, రత్నముద్రిలో
నిలుచువిధాన, హంసమది నిర్మలదివ్యతటాకమందు నౌ
ప్పులలిని, మాలలో కొలికిపూసగతిన్, శరదభ్రమాలలోఁ
గలమెఱపట్లు నీవు చిరకాలము బాల 'త్రిలిఙ్గ' పుత్రితో
వెలయుము వేంకటేశ్వరకవిప్రవరా! ద్విజరాజశేఖరా! 8

వేఙ్కటాఖ్యేన కవినా శుభే కణ్ఠే సమర్పితా,
నవరత్నావళీ శ్రీమద్వేఙ్కటేశ్వర శాస్త్రిణః. 9

**శ్రీ రాజా మంత్రిప్రగడ భుజంగరావుబహాదరుగారు, ఏలూరు.**

శా. శ్రీమద్వావిళవంశచంద్రుఁడయి కీర్తిజ్యోత్స్నలన్ సత్కవి
స్తోమం బుబ్బఁగ నెన్నదైదుసమముల్ సొంపారఁగాఁ జిమ్మె, నా
రామస్వామికి వేంకటేశ్వరుఁడు పుత్రత్వంబునుం గాంచి వి
ద్యామాధుర్య మెఱింగి పెంపరము సేయంబూనె నక్కార్యమున్. 1

క. భవికత్రిలింగరజతో,త్సవమునకుం గాన్కయిడ ముదంబందుచు మ
త్కవితాకన్యక నంపితి, నవరత్నస్థగితమాల నలువుగ నొసఁగన్. 2

క. భాషను బెంపొందించుట, భాషవలన వీరు వృద్ధిఁ బడయుటచేతన్
"భాషోద్ధారక"బిరుదము, దోషజ్ఞులు వీరికిడుట దోషము గాదే! 3

ఉ. ద్రావిడసంస్కృతాంధ్రకవితల్లజు లెల్లరు నుల్లసిల్లఁ, గా
వ్యావళి నచ్చునట్టులుగ నచ్చునఁ బెట్టఁ దనర్చుసంస్థకున్
వావిళవారె ముందడుగు వైచినవారని చెప్పవచ్చు. వా!
భావిఫలార్థలాభము నెవండు తొలిం దెలియంగ నేర్చెడున్. 4

గీ. అరవమనువారుఁ గూడ మీయాంధ్రకావ్య
రాజములఁ జూచి సత్సభారంగములను
బరగ మీకీర్తి వేనోళ్ల నరచి రరవ
వారటన్నఁ దదితరు లెట్లూరకుంద్రు! 5

క. మానితఘనసభలను స,న్మానముఁ గన్నట్టి మీయమందకళావి
జ్ఞానము గానము సేయం,గానోపనివారినెందుఁ గాన జగానన్. 6

చ. అవనిఁ ద్రిలింగ కీర్తిరువదైదవయేడు వినూత్న రాజతో
త్సవకుతుకంబునన్మెలఁగు సర్వకళావనితాప్రియంబునన్
స్తవమును గాంచు నెల్లెడఁ బ్రశస్తగుణంబుల కాటపట్టు స
త్యవచన ధర్మరక్షణపదంబు ముదంబునఁ గాంచి మించెడున్. 7

క. అమరుక మున్నదె యనఁగా, నమరం బున్నయది యంచు నాడని సంస్థం
బ్రమదమున వేంకటేశ్వరుఁ, డమరిచి జనకాభిమతము నాదట నిలిపెన్. 8

సీ. తలనొప్పియెత్తినఁ దొలఁగించి మతిఁ బెంచు చక్కని గ్రంథరాజి యొక కొంత
యరుచిబాధలనెల్ల నడఁగించి రుచినించు చక్కని గ్రంథరాజములు కొన్ని
కుంటునడక వోవ గెంటఁజాలిన మేలి నడలిచ్చునట్టి గ్రంథతతి కొంత
నాస్తికవాదంబు నాస్తియంచుఁ దలంచి యమరఁగాఁ జేయు గ్రంథములు కొన్ని

గీ. నీప్రచురణాలయంబున నెగడుచుండె
వేంకటేశ్వర! కొఱఁత లెవ్వియును లేవు
కనఁ; "గలౌ వేంకటేశ్వర"యనెడుబిరుదు
నిలుపుకొని లోకమునఁ గీర్తినలరు మీవు. 9

## కావ్యపురాణతీర్థ, విద్వాన్ జనమంచి శ్రీవేంకటసుబ్రహ్మణ్యశర్మగారు,

ప్రధానాంధ్రోపాధ్యాయులు, మునిసిపలు హైస్కూలు, కడప.

క. శ్రీ వావిళ్లకులాంబుధి, పావనహిమధామ! విబుధపరిపాలన స
ద్భావా! భాషోద్ధారక, హేవాకప్రకృతి! వేంకటేశ్వరశాస్త్రీ! 1

చ. సరసుల్ విద్వరులున్ ద్రిలింగకు లసత్సత్కారముం జేయఁగా
నురవో కాలమటంచు నెంచి యిపు డత్యుత్సాహులై కాన్కలన్
వరుసం దద్రజతోత్సవంబునకుఁ బంపం బ్రీతి శ్రీవేంకటే
శ్వరశాస్త్రీ! కయికొమ్ము భూషలుగఁ దత్పద్యార్ఘ్యరత్నంబులన్. 2

శా. భావం బార్యపథానుసారి చరిత ల్భావింప దేశోపకా
రావిష్కారకము ల్యశోంచితములై యర్థ్యంబులై మించ గ్రం
థావిర్భూతిని, బత్రికాప్రకటనాద్యభ్యున్నతిం గాంచి, తో
వావిళ్లాన్వయ! వేంకటేశ్వరసుధీవర్యా! ప్రశంసాస్తుతుల్. 3

శా. ఏవీటం గనుఁగొన్న మీకృతులె సంతృప్తిం గడుం గూర్చు నె
య్యేవేళన్ భవదీయముద్రణములే యిచ్చున్ ముదం బాత్మ, కా
యావార్తల్ తెలుపుం ద్రిలింగ మునుగా నర్హక్రియం బత్రికల్
వావిళ్లాన్వయ వేంకటేశ్వరసుధీ! త్వత్కీర్తి నిర్ణిద్రమా. 4

మ. 'సరవిన్ నిత్యము దేశసేవయును భాషాసేవయుం జేయుచున్
దిరమౌ సద్యశముం గడించితివి నీధీయుక్తి విద్వద్వరుల్
విరచింపంగఁ గృతుల్యథార్థముగ వావిళ్లాన్వయా! వేంకటే
శ్వరశాస్త్రీ! కలరే త్వదన్యులు ధరన్ భావింప ధన్యాత్మకుల్. 5

చ. ఎనుబదియేండ్లక్రిందట మహీదివిజోత్తముఁ డార్యవర్యుఁడౌ
జనకుఁడు రాజపూజితుఁడు సత్కృతి ముద్రణశాలఁ బెల్లుబా
సను గలయక్కరంబులను సంస్కృతపుస్తకరాజినెల్లఁ దీ
ర్పునఁ బ్రకటించుచున్ యశముఁ బొందె నముద్రితగ్రంథసంస్కృతిన్. 6

మ. అమితం బౌ శ్రమ కోర్చి త్వజ్జనకుఁ డెం దావంతయున్ వస్తులో
పము లేనట్లుగ సంస్కరించి భువి సంభావింప నుద్యత్ప్రబం

ధములం బూర్వపురాణరత్నముల విద్వత్పూజ్యుఁడై యార్యధ
ర్మమునం దేరును గాంచె నున్నతిని రామస్వామిశాస్త్రి ప్రథన్. 7

చ. జనకుఁ డొనర్చుకార్యములు సాధుపథంబున వృద్ధిచేసి త
ద్ఘనయశమున్ సతంబును జగంబున నిల్పఁగఁ జాలువాఁడె నం
దనుఁడను సార్థకాహ్వయముఁ దాల్చు ననందగు నార్యవాక్యమున్
మనిచినవాఁడ వీవె జనమాన్యగుణాకర! వేంకటేశ్వరా! 8

మ. వరుసం బూనినకార్యము ల్సఫలమౌపర్యంతమున్ వీడ కు
ద్ధురయత్నంబునఁ జేయువా రెవరు నీతో సాటి లేరంచు నె
వ్వారవుం గైకొనినం గనంబడరు వావిళ్లాన్వయా! వేంకటే
శ్వరశాస్త్రిప్రవరా! జనోపకృతులోఁ జర్చింప మీపద్ధతుల్. 9

మ. భవదీయోద్యమమున్ సతంబుఁ దమి మద్భావంబునం దెంచి మా
నవసంఘోపకృతుల్ కృతు ల్దలఁచి సన్మానంబుగాఁ బద్యరూ
పవిరాళంబు నొసంగినాఁడను దయం బాలింపుఁ డిద్దాని; మా
ధవుఁ డెల్లప్పుడు మీకొసంగు శుభసంతానంబు లత్యున్నతిన్. 10

మ. సరవిం బాల్యమునం దరిష్టతతి నిస్సారంబుగాఁ జెండి య
వ్వరుసం బెంపును గాంచి ప్రౌఢ యయి సంభావింపఁగా నెల్లెడన్
బరఁగె న్మోదమునం ద్రిలింగ జనతా ప్రాగల్భ్యయై వేంకటే
శ్వరశాస్త్రీ! భవదీయపుత్రికకు లోపం బేది యూహింపఁగన్. 11

చ. ఇరువదియైదువత్సరము లెంతయు నిండె జనప్రమోదతన్
బెరుగుచు నున్న దేకొదువ పేర్కొనఁగా నెదియేని లేక ని
బ్బరముగ నీత్రిలింగసుత భాసురరూపయనన్మనోజ్ఞతన్
గరము ప్రశస్తిఁ గాంచెఁ గుణగౌరవ మొప్పఁగ లోకమందునన్. 12

చ. జనకునినాఁడు తెల్గులిపి సాగెను ముద్రణశాలయందు; నే
ర్పున నిపుడాంగ్లమున్ దమిళమున్ మఱి కన్నడమున్ మరాటి పెం
పునెనయు హింది సంస్కృతము మున్నగు నక్షరముద్రణంబు లె
ల్లను విలసిల్లఁజేసితి బళా! చతురుండవు వేంకటేశ్వరా! 13

మ. పరమాహ్లాదముతోఁ ద్రిలింగ జగతిం బ్రఖ్యాతితో మీరుఁ గీ
ర్తిరమంగూర్చుఁ ద్వదీయపోషణమునం బ్రీతిన్ జగత్పూజ్యస
చ్చరితన్ సంతతసత్ప్రచారమున నత్యంతంబు శ్రీవేంకటే
శ్వరశాస్త్రీ! సుకృతీ! శుభోదయముతో నాచంద్రతారార్కమున్. 14

మ. పరమప్రీతియుతాత్మ! సత్కృతితతిం బాలించుచుం గీర్తి సు
స్థిరమై శోభిలఁ బూన్కి వీడక జగత్సేవాఢ్య! వావిళ్లవం
శ్య! రమాకాంతుని సత్కృపన్ వెలయు మిచ్ఛావాప్తి శ్రీవేంకటే
శ్వరశాస్త్రీ! బహుభోగభాగ్యముల నశ్రాంతంబు సుప్రాంగుచున్. 15

తే. మదిఁ దమియు, భక్తి, ప్రేమయుఁ బొదల నొసఁగు
వాఁడ నీచంద్రకళ యను పద్యరత్న
భూషణంబును గొనుము సంపూర్ణతృప్తిఁ
జంద్రునకు నూలుపోగన్న చందమునను. 16

**శ్రీ ఉమర్ అలీషాకవిగారు, ఎం. యల్. ఏ., (సెక్రటరీలు), పిఠాపురము.**

శా. శ్రీవావిళ్లకులాబ్ధిచంద్రుఁడు ప్రజాసేవారతుం డిద్ధవి
ద్యావాచస్పతి వేంకటేశ్వరుఁడు మాయాంధ్రత్వ మేపార నెం
తే వార్తాప్తి త్రిలింగ మాంగ్లఫెడరేటెడ్ ఇండియా పత్రికల్
శీఘ్రన్ నిల్పి యనల్పకల్పతరువై డిందించె దారిద్ర్యమున్. 1

శా. రామస్వామిని మించి యిద్ధసుగుణాలంకారవిద్యాప్రతి
ష్ఠామాహాత్మ్యము లంది సాంస్కృతికనిష్ఠన్ దెల్గునన్ ద్రావిడ
ప్రామాణ్యం బగు పుస్తకావళిని ముద్రారూపసారస్వత
శ్రీమర్యాదను వేంకటేశ్వరుఁడు గూర్చెన్ భారతక్షోణికిన్. 2

తే. సిరి సరస్వతి వేంకటేశ్వరునియింట
నలరి గజ్జెలందెల నాట్యమాడుచుండు
దానధర్మాల నిత్యకళ్యాణములును
పచ్చతోరణములు సదా పరగుచుండు. 3

## శ్రీ కావ్యతీర్థ విద్వాన్ రావాడ వేంకటరామశాస్త్రిగారు,

ప్రధానాంధ్రపండితులు మునిసిపలుహైస్కూలు, బళ్లారి.

తే. శ్రీసముల్లాసితాక్షరచిత్రలీల, సకలబుధరంజకుండగు శౌరి తనదు
చెయిదములఁ బోలు పనులను జేయునట్టి, వేంకటేశ్వరుఁ బ్రోచు వావిళ్లవంశ్యు. 1

ఉ. ఎప్పుడు శాంతతన్ దనరి యింపులమించు ముఖేందుబింబమున్
విప్పుగనుండి భావగత విస్తృతిదాఁటెడు కన్నుదమ్ములున్
మెప్పులఁ గుల్కు తేనెలను మీఱుచు నుండెడు మాటనేర్పు నీ
గొప్పతనంబుఁ జాటుఁ గద కోవిదసన్నుత వేంకటేశ్వరా. 2

క. ద్వేష మొకించుక లేకయె, భాషల ద్రవిడాదికములఁ బరమప్రీతిన్
బోషించునీకు నొసఁగిన, భాషోద్ధారకపదంబు వఱలు నుచితమై. 3

సీ. అఖిలభారతభూమి నకలంకమగురీతి "ఫెడరేష"నసుబుద్ధి పొడము నపుడె
"ఫెడరేటెడిండియా"పేరున నొకయాంగ్ల పత్రిక వెడలించి ప్రబలినావు
ఇరువదియైదేండ్లయీడును గలదియై సంస్కర్తృవాదముల్ చక్కడంచి
తెలుఁగుసుద్దులముద్దులొలయఁ బల్కు "త్రిలింగఁ" జాతుర్యమున నడ్పసాగినావు
గీ. తివిరి నీతండ్రి పంక్తుల దిద్దినావు, బుధకవీంద్రులదీవెనల్ పొందినావు
నీదువంశంబు మేల్బంతి నిలిపినావు, ఈడ్యసుగుణాఢ్య శ్రీవేంకటేశశాస్త్రి. 4

క. శ్రీవేంకటేశ్వరుండవు, నీవా శేషాద్రికవికి నిరతముఁ బ్రాపై
భూవిదితరీతి నుండుట, పూవున్ దావియును బొంది పొసఁగుట గాదే. 5

ఉ. చక్కనియక్కరంబులు పసందుగ నుండెడు కాగితంబులున్
మిక్కిలి మేలి బైండుఁగల మీప్రచురించెడు గ్రంథముల్ భువిన్
గ్రక్కునఁ బర్వె యాంధ్రులనిరక్షరతన్ బరిమార్చె నౌర! నిం
కొక్కని కీయుదారమతి యుండునె రొక్కమదెంత గల్గినన్. 6

క. భావింప రవియుఁ దూరని, తావైనను దొరకవచ్చు ధారుణి వెదకన్
వావిళ్లవారిపొత్తము,చే వెలయని యాంధ్రునిల్లు చిక్కక యుండున్. 7

చ. సురుచిరసంస్కృతోక్తిపరిశోధనవేళ వరాంధ్రకావ్యపున్
సరసవిమర్శకాలమున శాస్త్రవిచారము సల్పునప్పుడున్

బరమనిఘంటుచర్చలను వైద్యము జ్యోతిషమాదిగాఁగఁదాఁ
బరఁగు మహావివాదముల వావిళవారి స్మరింపకుందు మే. 8

తే. శశివిభాకరు లెందాఁక సరణి విడరు
ప్రాచ్యవిజ్ఞాన మెందాఁకఁ బ్రబలియుండు
నార్యధర్మంబు లెందాఁక నమరుచుండు
నంతవఱ కాంధ్రఋణములహక్కు నీకు. 9

### శ్రీ కప్పిగల్లు సంజీవమూర్తిరావుగారు, బళ్ళారి.

క. శ్రీవిద్యానిలయంబై, పావనరుచిరార్యధర్మపరిపాలనకున్
దావలమై తా వెలయున్, వావిళ్లాన్వయ మదెంత వంద్యమొ జగతిన్. 1

తే పండె నాంధ్రులనోములపంట యనఁగఁ, దత్పవిత్రవంశజుఁడు విద్యాఘనుండు
జననుతుండు రామస్వామిశాస్త్రి పూనె, నుత్తమగ్రంథరాజి సముద్ధరింప. 2

క. ఆతండ్రికిఁ దనయుండై, యాతనియడుగులనె నడచు చసమానయశో
స్వీతుండై మృదుహృజ్జల,జాతుండై వేంకటేశశాస్త్రి రహించున్. 3

చ. కనుఁగొనినంత నీతఁ డుపకారపరుండని యార్యధర్మవ
ర్ధనుఁడని శిష్టసమ్మతపదప్రవణుండని భూరిసత్కృపా
ఘనుఁడని తోఁపఁజేయఁగల కాంచనవిగ్రహు వేంకటేశ్వరున్
దనయునిగాఁ గనన్ దెనుఁగుతల్లి యొనర్చినపుణ్య మెట్టిదో. 4

ఉ. పండితుఁ డాదిగాఁగఁ జదువన్ గల పామరుదాఁక నొక్కఁడే
నుండునె వీరిగ్రంథముల నొండయినన్ బఠియింపకుండు నా
తం డఖిలాంధ్రదేశమున? ధన్యులు కారొకొ విద్యయెల్లెడన్
నిండఁగ నిట్లు యత్నముల నిచ్చలు సల్పెడు పుణ్యపూరుషుల్. 5

చ. మినమినలాడుపత్రముల మేలిమి ముత్తెములట్టి వర్ణముల్
పొనరఁగ నాసలూరు గతి ముద్దులనీనెడు వీరిపొత్తముల్
గనుఁగొనినంతఁ గైకొనుతలంపును గైకొనినంత లోపలన్
గని పఠియించుబుద్ధియును గల్గకపోవునె యెట్టివారికిన్. 6

మ. తమగ్రంథావళు లిట్టియాకృతుల సౌందన్ బల్వురుత్సాహులై
యమితానందమునన్ బఠించి కడుఁ దమ్మగ్గింప నాయాకవుల్
గములై మింట వసించి సమ్ముదము పొంగన్ గాంచి యెంతెంతగా
మమతన్ వీరిమహోపకారమును సంభావించి దీవింతురో. 7

సీ. ఏమూలఁ బడియొ నశింపనుండిన గ్రంథవారంబు తలయెత్తుదారి గలిగె
నాగ్రంథములరసం బాని యానందింప రసికవర్యులకు మార్గంబు గలిగెఁ
దిరముగాఁ దమపేరు ధరణి నిల్పుకొనంగఁ దొంటిసత్కవులకుఁ ద్రోవ గలిగెఁ
జనిన సత్కవిపరిచయభాగ్య మీనాఁటివారికి లభియించుపథము గలిగె
గీ. సార! శ్రీయుతుల్ వావిళ్లవార లిట్లు
పూర్వసత్కావ్యవితతి నపూర్వరీతు
లొప్పఁ బ్రకటించి ప్రచురించుచుండుకతన
నాంధ్రులయమోఘభాగ్య మేమనఁగవచ్చు. 8

చ. కడుమదమెక్కఁ గాలబలగర్వము మీఱఁగ నన్యసంస్కృతిన్
బొడమినదృష్టిదోషమునఁ బూజ్యసనాతనధర్మతత్వమున్
గెడపఁగఁ జూచు కీచకుల నిర్భయలీల నెదిర్చి నిల్వఁ జొ
ప్పడియెడు సద్యశంబునకుఁ బాత్రత వీరికె చెల్లు నియ్యెడన్. 9

సీ. ధరకు వాలెడు సనాతనధర్మవృక్షమున్ బ్రీతిమై నాఁపు చేయూఁతయనఁగ
నాశ్రయరహితులై యల్లాడు వృద్ధపండితు లాఁగి నిలువంగ నీడ యనఁగఁ
బండితమ్మన్యులై వాగు దుర్వాదుల కఠినజిహ్వలకు వాకట్టనంగ
నతులార్యధర్మసంస్కృతి తనంత విహారమొనరించు నుద్యానవనమనంగ
గీ. వేయికన్నులఁ దన్ను వావిళ్లవారు, గన నెదుగువారి ముద్దులతనయ యనఁగఁ
బరఁగెడు త్రిలింగపత్రిక నరసినంత, నెత్తి తనకన్నుగవ కొప్పఁ డొత్తికొనఁడు! 10

క. ఘను వేంకటేశశాస్త్రిన్, గని భాషోద్ధారకుం డనన్ దగినటులే
యనుగతధర్మము నిలుపఁగ, బెనఁగుట ననఁ దగదె ధర్మవీరుండనియున్. 11

ఆ. అసమభంగి నిట్టు లమితోపకారముల్, సలుపు వేంకటేశశాస్త్రి నెపుడుఁ
జిరతరాయు విచ్చి సురుచిరారోగ్యంబు,నిచ్చి మనుచుఁ గాక యీశ్వరుండు. 12

## శతావధాని శ్రీదోమా వేంకటస్వామిగుప్తగారు.

శా. వావిళ్లాన్వయరత్న రామసుధి దివ్యంబైన కీర్తిం ద్రిలో
కీవిన్యస్తము వేంకటేశ్వరుఁడు తద్గేయాత్మ నాత్మోద్భవుం
డావిర్భూతముదంబునం జలుప సర్వాశాంతపర్యంత మ
శ్చావైదగ్ధ్య మగుఁ ద్రిలింగశుభవాగంభోజపత్త్రాత్తికిన్. 1

మ. పొరి నింగ్లీ షది రాజభాష యగుచుఁ ముఖ్యత్వముం జెంద నిం
కొరిమఁ హిందిమ తేను దేశమునయం దొక్కౌత్తిగా నొప్పదుఁ
బరఁగంగా నని యాడ నోరు మెదలింపఁ లేక తట్టాడు చం
తరమం దున్న ద్రిలింగవాగ్రమణికిఁ దాత్పర్య మొప్పంగ సే
వరహిం జల్పు ద్రిలింగపత్త్రికకు దిగ్వ్యాప్తిప్రభ ల్మించుతన్. 2

మ. మహితంబై తగు వావిళాన్వయుడు రామస్వామిశాస్త్రజ్ఞు కీ
ర్తి హరిన్మండలమండనం బగుట యెంతే నిక్క మప్పేరికిఁ
మహిమం బొప్ప మహిం ద్రిలింగశుభవాఙ్మానిస్యదారాదృతి
స్పృహఁ దత్పుత్త్రుఁడు వేంకటేశ్వరుఁడు వాసిం జల్పు యత్నాన క
న్వహముం బండితపామరప్రకరమర్యాదల్ గరం బొప్పుతన్. 3

## కవిరాజా శ్రీపట్టిసపు శ్రీరామమూర్తికవిగారు,

శ్రీజయపురసంస్థానాధీశుల అభిమానకవి కవితాసమితి, వరహాపురము, గవరవరముపోష్టు, విశాఖపట్టణముజిల్లా.

**వేంకటేశ్వరా!**

ఉ. చిత్రములైన వార్తలు విచిత్రపువ్యాసములుఁ సినీమలో
చిత్రములుఁ మతార్థికవిశేషములుఁ వరరాజకీయచా
రిత్రము లిట్టివెల్లఁ బ్రచురింపుచు నొప్పు ద్రిలింగపత్త్రికా
* పుత్త్రికఁ గన్నసీదు యశముఁ గణనీయము వేంకటేశ్వరా! 1

**త్రిలిఙ్గ పత్త్రికాంగనా!**

చ. సరసపుమాట లారసితొ? సత్యము బల్కెదవంచు నెంచితొ?
వరమతసాంఘికాంశము లపారముగా నెరిఁగింపఁ జూచితొ?

---

* పుత్త్రిక యన్న నీవు కడు ముద్దు గదా! బలె! వేంకటేశ్వరా! (పాఠాంతరము.)

తరుణవయస్సు నాగరికతకా గనితెంచు దలంచితివో? జనుల్
నిరతముఁ జూడఁగోరుదురు నిన్నె త్రిలింగ సుపత్రికాంగనా! 2

**నవమన్మథుఁడు.**

సీ. చంద్రుఁడు చంద్రికా చర్చితుఁడై త్రోలిగింప మందమారుతజవాశ్వంబు నడువ
పరభృత మార్గణీస్వరములు బలికింప నళిమేళములు గానములు నొనర్ప
బర్హిసురాంగనల్ భరతనాట్యము సల్ప శారికావిప్రులు స్వస్తిఁ జెప్ప
శుకకోకహంసాది సకలసైన్యము గొల్వ వెస వసంతదివాను వెంటనడువ

గీ. త్రావి శ్రీరామసత్కవితారసమ్ము,చిల్కమోటరులోన విచ్చేసి మరుఁడు
వివిధపుష్పాయుధమ్ముల వేచి సొమ్మసిలఁ బరచుచుండెగద యౌవనులఁ బలారె!

**కవిమండలమండన మంగళగిరి శ్రీకృష్ణద్వైపాయనాచార్యులుగారు,**

సంస్కృతోపాధ్యాయులు, మునిసిపలుహైస్కూలు, విజయనగరము.

ఉ. శ్రీరమణీయవర్ణవయి చిన్నిపదంబులతోఁడ వెల్గిసం
చారముఁ జేయఁగల్గి ఘనశాసనచే నఖిలజ్ఞవై రమా
ధారునిఁబట్టి వన్నెఁగని ధారుణిఁ బాలవునై "త్రిలింగ" ఈ
డేరితివి ష్టలంకృతులఁ దేటగ వంశము వృద్ధిఁజేయుమా. 1

చ. నిజముగ పేరులేని జననీజనకు ల్గనునట్టి పిల్లలుకా
ప్రజలను గీర్తిఁగాంతురఁట! భవ్యగుణాకరుఁడైన వేంకటే
శజనక కేమిలోటు? భువి సర్వసుఖంబులఁ గీర్తిఁగాంచుచుకా
విజయముతోఁ "త్రిలింగ"! యొక వేయుసమంబుల మన్కినందుమా! 2

గీ. తల్లి! రజతోత్సవమునొంది తనియఁ బోకు, జననదశ యెట్టిదో గాని స్వర్ణరత్న
సంజ్ఞగల యుత్సవంబులజాడ గూడ, చూడఁజూడఁగఁ బొడకట్టుచుండె నీకు. 3

గీ. చంద్రలేఖాదిగాఁ గల్గు సాధ్వులిలను, తలల వంచిరి సూ నీదు తళుకు బెళుకు
కులుకు పొలుపుల కాఁగఁగాఁ గొంకి క్రుంకి,'వేంకటేశత్రిలింగ'! నీవిఁక ప్రబలుము.

శా. శృంగారంబుల కీవు తావు శుభసంసిద్ధంబు నీమేను సా
రంగాంకేద్యుఁడు కన్నతండ్రి మనసార న్సేవల న్సేతురే
భంగం బందఁగనీక తద్విబుధు లో భవ్యా"త్రిలింగా"భిధా
రంగత్తుంగతరంగగాంగజలసంరంభార్భటి న్వొల్లుమా. 5

## అభినవతిక్కన శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు, నెల్లూరు.

స్రగ్ధర — శ్రీమద్వావిళ్లవంశామృతనిధిశశియై శ్రీకరాంధ్రాంగ్లగీర్వా
ణామూల్యగ్రంథముద్రావ్యయకృతిజనితోద్యద్యశశ్శోభితుండై
ధీమద్విద్యార్థిసార్థార్థితధనకలనోదీర్ణుఁడౌ భవ్యమూర్తిన్
బ్రేమన్ శ్రీశుండు ప్రోచున్ విమలగుణఖనిన్ వేంకటేశార్యవర్యున్.

## శ్రీమతి కవితిలక కవితావిశారద కాంచనపల్లి కనకాంబగారు.

భాషోద్ధారక ధర్మదీక్షయది శ్రీవాగ్దేవి మీకిచ్చి సం
తోషంబొందుఁ ద్రిలింగదేశమున కావ్యుల్ మీరె గ్రంథాకృతిన్
భూషల్ ధీరులచేతులందమరు మీపుణ్యంబునన్ గాదె యో
భాషోద్ధారక వేంకటేశ్వరసుధీ వంశాబ్ధిచంద్రాకృతీ! 1

రామస్వామి భవద్గురుండు తొలియాంధ్రంబందు గీర్వాణమం
దామూలాగ్రము గ్రంథసంతతినిఁ దానచ్చొత్తి మేల్చేసె నీ
వామార్గంబునఁ దంక్రమించితి బుధప్రారంభముల్ నిల్పఁగాఁ
బ్రేమం జేసెద వెంతొ సాయ మది కీర్తింపన్ దగున్ సర్వదా. 2

ఆస్తికులైనవారల సమాదరణంబునఁ బ్రోత్సహించుచున్
నాస్తికదుష్ప్రచారము నణంతువు భారతధర్మబోధనన్
స్వస్తియొనర్తు వాంధ్రులకు వారమువారము నీత్రిలింగలో
వాస్తవతత్త్వబోధకులవార్తను వర్తనముగ్గడింపుమా! 3

చిల్లరపొత్తముల్ సరకుఁజేయక పండితసత్కవీంద్రసం
ఫుల్లముఖారవిందములఁ బుట్టినపుస్తకరాజి లోకమం
దెల్లడ నింతు నీకు సరియే పృథివీశులు వేంకటేశ వా
విళ్లగృహప్రదీపమ కవిప్రవరుల్ నినునెంతురెంతయున్. 4

సౌమ్యుఁడవౌదు వాంధ్రకవిచంద్రులకీవు సఖుండవెందునన్
సామ్యములేనిశీలము సనాతనధర్మహితైకభావ మ
గ్రామ్యము నీప్రచార ముపకారము నైజము నీకు ధాత్రిలో
రమ్యము నీచరిత్ర బుధరాజి నుతింపఁగఁ బెంపుఁ గాంచుమా! 5

### సరసకవి శ్రీ మోచర్ల రామకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్., నెల్లూరు.

సీ. ఆంధ్రదేశప్రసిద్ధాజానశుద్ధవిద్వత్ప్రదూర్ద్రాశ్రివిడాభరణమునకుఁ
బ్రథితవావిళ్లాన్వవాయదుగ్ధార్ణవశారదపూర్ణిమాచంద్రమునకు
మహితానుభావ రామస్వామిశాస్త్రికల్పద్రుమసురభిళప్రసవమునకు
వేదవేదాంగాదివిద్యానిధానసంరక్షణైకవ్రతదీక్షితునకు

తే. రుచిరపత్రనిబద్ధ నిర్దుష్టవర్ణ, కలితసద్గ్రంథజాలప్రకాశకునకు
వేంకటేశ్వరశాస్త్రికి వివిధశుభము లిచ్చుఁగావుత మెపుడు విశ్వేశ్వరుండు. 1

### శ్రీ పసుపులేటి శ్రీనివాసులనాయుడుగారు, కడప.

కవులసంకటముల గట్టునవేయంగఁ, బుట్టినట్టి పుణ్యమూర్తి వీవు
వాసిగాంచె మిగుల వావిళ్లవంశంబు, వేంకటేశుఁ డుద్భవించుకతన. 1

### కవితావినోద: శ్రీ గొట్టిముక్కల గోపాలకృష్ణశాస్త్రిగారు,

కవులకుంట్ల, బద్వేలుతాలూకా, కడపజిల్లా.

చ. కలుముల కెక్కువౌచుఁ గలకాలముఁ బండితకోటిఁ దన్పుచున్
గులమున కొప్పు భూషవయి! కోరినకోర్కెలనెల్లఁ దీర్చుచున్
విలసితకీర్తి దిక్కుల సువిస్ఫురతన్ వెదజల్లుచున్ బళీ
బళి! యని యందఱున్ బొగడ భాసిలు మెప్పుడు వేంకటేశ్వరా! 1

ఉ. భాషను నుద్ధరించుతఱి బాధ్యుఁ డికెవ్వఁడు లేక యింతకున్
శేషముగాఁగ నిల్చెఁ గవిశేఖరు లంతట నిండియుండఁగన్
భాషను నుద్ధరింపు బుధపాలుఁడ వీవని పండితావనా!
వేషముమాటగా దిది వివేకముతో వచియింతు రెల్లరున్. 2

### ఆంధ్రవ్యాసనిపుణ: శ్రీ అవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు, వంగిపురము.

తెలుఁగుమాతకు ముద్దుబిడ్డ- తెలుఁగుభాషకు జీవగఱ్ఱ
తెలుఁగుబిడ్డలపట్టుకొమ్మ—వేంకటేశుఁడు.
తెలుఁగుతల్లుల తీయదనము- తెలుఁగుబిడ్డల మురిపజాలము
తెలుఁగు వెలుఁగు మిశ్రరూపము—వేంకటేశుఁడు. 1

తెలుఁగుబాసకు జేసినట్టి-తెలుఁగుబాసకు నిచ్చినట్టి
వెలుఁగుఁదనమే దాస్యరూపము—వేంకటేశుఁడు.
మాటలాడిన మణులు రాలును-మాటలాడిన గ్రంథమగును
ప్రియము మీఱఁగఁ జేయువాఁడు—వేంకటేశుఁడు. 2
తెలుఁగుకీర్తి త్రిలిఙ్గరూపము-తెలుఁగుకీర్తి వెలుఁగురూపము
తెలుఁగు వెలుఁగు తళుక్కుముక్కఱ—తెలుఁగుతల్లికి.
అడిగినంతన నాస్తి యనఁడు-అడుగునంతన తెల్లవడఁడు
పెట్టుపోతలలోన నీతని—కీతఁడే సాఁటి. 3

**శ్రీ ఎస్. బుడన్‌సాహేబుగారు, ప్రారంభవిద్యాపాఠశాల ఉపాధ్యాయుడు, కడప.**

క. శ్రీకర వావిళ్లాంబుధి, రాకాతుహినాంశుధామ! రాజత్ప్రతిభా
స్తోకా! భాషోద్ధారక!, ప్రాకటగుణ! వేంకటేశ్వరా! యివె మ్రొక్కుల్. 1

శా. ఈమత్తైనను బల్కరింపఁ గరుణావిర్భూతులే లేక గీ
ర్వాణీభాషణ; మాశుశుక్షణిశిఖాదుర్యమ్మాలనప్రక్రియన్
శోషంబొంది నశించువేళ భరమౌ క్షోభం దొలంగించి యో
భాషోద్ధారక! వేంకటేశ్వర! జయం భావించితీవిద్ధరన్. 2

మ. తెలుగున్ ముద్దులపల్కులన్ మధురమౌ చెల్వంపుఁ బెన్నుడ్కులన్
గులుకుల్మీఱఁగ సాగిపోవు తెలుఁగున్ గ్రొమ్మించు పూఁబోఁడి యీ
చెలువంబు న్గనుభాగ్య మీవలననే చేకూఱె మాకండ్లకున్
విలసద్విగ్రహ! వేంకటేశ్వర! సుధీ! నీకెల్లెడన్ శ్రేయమౌ. 3

ఉ. పల్లియమూలసందు నడిబాటను బెంచిక బిళ్లలాడుచున్
అల్లరిఁజేయుబాలికలు హస్తపుటంబున నుండునట్టి వా
విళ్లసుముద్రణాలయపుఁ బ్రేమపుఁబొత్తపుఁబాటలొక్కటన్
గొల్లుగఁ బాడి నీయశము గొప్పగనెంతురు చిత్రరీతిగన్. 4

ఉ. ఇంక వచింపనేల భవదీయవదాన్యపుఁగీర్తికాంత నిక్కం
కతఁ జక్రవాళగురుశాతశిరోగ్రములందు నెంతయున్
బింకముమీఱ నీవిజయవిభ్రమశాసనముల్ రచించునో
వేంకటశాస్త్రి! నీరిపులు వెల్వెలఁబాఱి పఱుంగు లెత్తఁగన్. 5

**శ్రీ వెల్లాల ఉమామహేశ్వరుఁడు, బి. ఏ., బి. ఎల్., గారు, కడప.**

సీ. ఏసంస్థనో వెన్క నిడికొని తలమించు పదవులఁ దారాడుపంద లేడ!
అక్షరాస్యులుగాక అర్థసాధనలచేఁ బండితసభ లెక్క పరిగ లేడ!
తాతముత్తాతల ధనకీర్తులేతప్ప వేరురూపము లేని పెద్ద లేడ!
ఇంతవి మావేరు లంతవి యని సంతలందు వాగుచునుండు వ్యర్థలేడ!
తే. శక్తివంచనసేయక సంస్కృతాంధ్ర, తమిళభాషామహాగ్రంథతతులనెల్ల
నుద్ధరించుచు నుండియు నొక్కమాట, నేనినాడని నిర్గర్వివేడ! ప్రోడ! 1

**శ్రీ విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు.**

శా. ఆవిశ్వేశ్వరుఁ డీప్రపంచమును విద్యాభాసిఁ గావించు స
ద్భావంబుంగలఁడేని యద్దియె నిజవ్యాపారమై యొప్పు నీ
వావిళ్లాన్వయ వేంకటేశ్వరసుధీవర్యున్ యశోధుర్యుల
క్ష్మీవాల్లభ్య చిరాయురున్నతుల వాసిం గూర్చి రక్షించుతన్. 1

**శ్రీ వేపకొమ్మ ఆదిశేషయ్యగారు, కడప.**

జ్ఞానమయుఁడు దైవంబు జ్ఞానప్రబోధకోజ్జగ్రంథాళి వానిచ్చొత్తియిచ్చు
పుణ్యుఁడగునిన్ను శుభములు పొందుటరుదె, ఇద్ధగుణమూర్తి శ్రీవేంకటేశశాస్త్రి.

**విద్వాన్ శివపురపు వేంకటలక్ష్మీనరసమ్మగారు,**

శ్రీయువతీవిద్యానిలయము, తెలుఁగుపండితురాలు, బాపట్ల.

చ. గురుతరవర్ణశోధనముఁ గోర్కెనొనర్చి దురక్షరంబులన్
గరము తొలంగఁజేసి వరగాత్రము నర్థకలాపయుక్తి సుం
దరముగఁ గూర్చి సత్కృతినితంబిని సద్గతులన్ యథేష్టసం
చరణము గాంచఁజేసితి యశఃప్రవిభాసుర వేంకటేశ్వరా. 1

మ. ధనముంగోరక యాశ్రితావళికృతుల్ దళ్కొప్ప ముద్రించి యి
చ్చిన యీయుంగల యిచ్చుచున్న సుగుణశ్రేష్ఠుండవీవౌట ని
న్ననురక్తిం గొనియాడు సాధుకవు లాహా ధన్యులేకారె మే
దిని నీకీర్తి యొసంగుఁగాక యుడు లద్రిస్తోమమున్నంతకున్. 2

## శ్రీ శిఘాకొల్లు గురవయ్యశాస్త్రిగారు,

వర్ణాశ్రమస్వరాజ్యసంఘకార్యదర్శి, కావలి.

చ. పరమపవిత్రమైతనరు భారతధర్మరహస్యమెల్ల సా
దరమున దేవభాష విశదంబుగఁ బల్కిరి మౌనివర్యు లా
గురుతరశాస్త్రసంచయము గూర్చితి జీర్ణముగాకయుండ నె
వ్వ రిటులఁ జేయఁగల్గిరి భవత్కృతము ల్భువిదేవతాగ్రణీ. 1

ఉ. ఘోరముమార్పఁగోరెడి రిఫార్మరువ్రాతల రోతలెల్ల యీ
భారతనీతికెంతయు నపాయమటంచును సద్విమర్శనా
గౌరవమొప్పవ్యాసము లఖండముగాఁ గురిపించుచుండు నా
ధీర "త్రిలిఙ్గ" దెల్పెద సుధీవర త్వన్మహితాశయంబులన్. 2

## శ్రీ బాలకవి, కవిరత్న కసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డిగారు,

పర్లపాడు, ప్రొద్దుటూరుతాలూకా, కడప.

తే. భూరిసంస్కృతాంధ్రగ్రంథముద్రణమున, నాంధ్రులకు మీరాయుపకరించి నట్టిమేటి
పుణ్యమనుకొండమీఁద వేల్పు! మహాను,భావ వావిళ్ల వేంకటేశ్వర! నమస్సు. 1

తే. ధార్మికాగ్రణీ! శేషాద్రిశర్మగారు, దొడ్డవాదోడు బ్రాహ్మి చేదోడు మీరు
గలుగఁగద గ్రంథగోపురాల్ కట్టినారు, పండితప్రభు వేంకటేశ్వర! నమస్సు. 2

తే. ఆంధ్రభారతికోవెలయం దఖండ,ముగ వెలింగెడు గోఘృతపూర్ణమైన
పెద్దజాళువాసెమ్మె వావిళ్ల రామ,స్వామిశాస్త్రులు అండ్సన్సువారికీర్తి. 3

తే. ఎన్నియెన్ని గ్రంథంబులో యెంతొ గొప్ప, పండితులచేఁ బరిష్కృతిఁ బడయఁగల్గి
శుద్ధముగ సుందరముగ నచ్చుపడియున్న, భాగ్య మెవరిది వావిళ్లవారిభిక్ష. 4

## శ్రీ ఏచూరు వేంకటరంగయ్యగారు,

ఉపాధ్యాయులు, మునిసిపల్ సెకండరీస్కూలు, కడప.

తే. సంతఁజెప్పెడిశిష్యులు సన్నగిలిరి, శాస్త్రములనేర్పుపండితుల్ చాలరంచుఁ
గనుచు ముద్రించితే మొ సద్గ్రంథములను, వేంకటేశ్వర! విద్యార్థిసంకటహర! 1

తే. ఒకరు మెచ్చిన మెచ్చకయున్న నీవు, తండ్రినిర్మితవాణిజ్యధర్మసరణి
కొంచెమైనను దాటక మించిమనుట, హేతువగుఁగాదె యెంతటిఖ్యాతికైన. 2

## శ్రీ కామరాజు సీతారామకవిగారు,

హనుమత్సందేశరచయిత, కవులకుంట్ల, బద్వేలుతాలూకా.

సీ. వావిళ్లవంశపావనసుధానిధిఁ బెంప సాంద్రదీధితి పూర్ణచంద్రుఁ డగుచు
మహనీయుఁ డైనరామస్వామిశాస్త్రికిఁ గులదీపకుం డగుకొమరుఁ డగుచు
భాషోద్ధరణఁజేయ బద్ధకంకణ యగు శారద యపరావతార మగుచు
శుద్ధసద్గ్రంథసముద్ధరణంబునఁ బాతకజవతపఃఫలము నగుచు
గీ. సరససద్గుణనిధియయి జగతియందు, సర్వశాస్త్రార్థముల రహస్యంబు లెఱిఁగి
కవిజనశరణ్యుమై కీర్తిఁ గాంచి వెలసె, వేంకటేశ్వరశాస్త్రి సద్విమలయశుఁడు. 1

క. ఆకవికల్పకమును భువి,నాకల్పముగాఁగ నిల్పి యమరవరులు న
స్తోకాశీర్వచనసుధా,శీకరముల వృద్ధిఁబొందఁ జేయుత మిగులన్. 2

## శ్రీ సవరము వీరబ్రహ్మమునాయుడుగారు.

చ. పలుకులయందు భావము లపారముగాఁ బొలుపొంద వింతగాఁ
బలికెడుపల్కు క్రొత్తదయి పక్కన నవ్వఁగఁ జేయుచుండఁగాఁ
బలువురు కూడి సమ్మతి నపారపుదీవన లిచ్చుచుండఁగా
వెలసెఁ ద్రిలింగ మోదమున వేవురచేతులలోన ధీరుఁడా! 1

క. చిత్రవిచిత్రంబుగ బహు,పత్రిక లీనాఁ డిలం బ్రబలుచుండఁగ స
న్మిత్రమయి భారతీయ ప,విత్రముగఁ ద్రిలింగ వెలసె వితతగుణాఢ్యా! 2

క. లలితము త్రిలింగపత్రిక, నలినాప్తునికాంతిలీల నరులకు హితమై
నలుగడలఁ వ్యాపించుచు, నిల సంశయములను దీర్చి యొసఁగును గాతన్. 3

ఆ. దేవలోకమెల్ల దీవన లిడునట్టు, లింపుగులుకుముద్రణంపునేర్పు
భవదధీన మగుచు భాసిల్లెఁ గీర్తిని, జెన్నపట్టణమునఁ జెలువుమీఱ! 4

## శ్రీ కమలపురి వేంకటసుబ్బారావుగారు, హైస్కూలు, కడప.

శా. శ్రీరామాహృదయేశుఁడై వరదుఁడై శ్రీమంతుఁడై సుందరా
కారుండై యణురూపుఁడై విమలుఁడై కల్యాణగాత్రుండునై
శూరుండై యసమానదేవుఁడయి తేజోరాశియై మాన్యుఁడౌ
కారుణ్యామలమూర్తి ప్రోచుఁ గృపతో వావిళ్లవంశాగ్రణిన్. 1

## శ్రీమతి కట్టా సుబ్బలక్ష్మమ్మగారు,
చంద్రకళావిలాసప్రబంధకర్త్రి, శ్రీకాళహస్తి.

క. శ్రీయుతుఁడు వేంకటేశ్వరుఁ, డాయువు శ్రేయము నొసంగి యనుపమకరుణా
ఛాయనిసిరు లభివృద్ధిగఁ, జేయుచు రక్షించు మిమ్ము శ్రీకరమొప్పన్. 1

క. నెలవాఁడతాల్పువేలుపు, కలుములదొరసానివిభుఁడు ఘననిభగాత్రుం
డలపలుకువెలఁదిమగఁ డిచ్చలు గూర్తురు మీకు నెపుడు సౌజన్యనిధీ. 2

క. శైలాధినాథతనయను, బాలామృతకిరణమాళిఁ బ్రార్థింతు మతిన్
వేలాతిక్రాంతసుగుణ,శీలా ! మీయిష్టతతులు చేకూర్చుటకున్. 3

క. నిరవధికసుఖశుభపరం,పరలను మీకొసఁగుమని భవానీచరణాం
బురుహాంబుల నిరతంబును, కరుణంబుగ వేఁడుదాన కరుణాభరణా. 4

## శ్రీ గొట్టిముక్కల రామశాస్త్రిగారు, బద్వేలుతాలూకా, కవులకుంట్ల.

ఉ. భాషల నుద్ధరింపఁగ స్వభాషను గ్రంథము లచ్చువేసి త
త్పోషణఁజేయఁ బండితుల పొందొనఁగూర్చియు నాంధ్రదేశసం
తోషము గూర్చినారలు బుధోత్తములెల్లరు మెచ్చ నిత్యసం
తోషము పచ్చతోరణముతో మిముఁబ్రోచు రమేశుఁడెప్పుడున్. 1

## సరసకవి కరణము శ్రీ కృష్ణరావుగారు, బేవినహాళ్లి, హిందూపురంతాలూకా.

శా. శ్రీవాణీగిరిజాత్మకప్రకృతిలన్ జేరం ద్రిమూర్త్యాత్మకుం
డై విశ్వస్థితిసృష్టిసంహరణకార్యం బూని గావించు స
ద్భావాతీతుఁ డనంతుఁ డీడ్యుఁడు పరబ్రహ్మంబు చేకూర్చుతన్
వావిళ్లాన్వయవేంకటేశ్వరునకున్ వాంఛార్థసంసిద్ధులన్. 1

క. రమయును బలుకులకొమయును, దమలోఁ బగలుడిగి సఖ్యతన్ మెలఁగుదు రా
యమరగురువిభుఁడు రామయ,కొమరునిమందిరమునందు గురుకృప నెపుడున్. 2

మ. అమితౌదార్యము చారుశీలమును విద్యార్జక్తి సత్పాత్రదా
నము విద్వజ్జనరక్షణంబు బుతవాకై పుణ్యముల్ శంభుప

త్కమలారాధన మార్తపోషణము నేతత్కృత్యముల్ మీకుల
క్రమముగా బాయనివంచు వింటి మిది భాగ్యంబన్నఁ దప్పున్న దే? 3

మ ప్రతిభాశాలి భవద్గురుండు నుతగీర్వాణాంధ్రసాహిత్యసం
గతచిత్తుండు సుదాత్తశేముషిని వ్యాఖ్యానించె బహ్వర్థగుం
భితసత్కావ్యకదంబకంబు తెను మేల్మేలంచు విద్వజ్జనుల్
నుతియింపన్ ప్రతిబింబమాతనికి నిన్నున్ జెప్పఁగా నేటికిన్? 4

ఉ. ఆరయ రజ్జుబంధనములంది మనంబునఁ గుంది లోకసం
చార మొనర్పఁగా ననువుచాలమి ఛాందసులిండ్లమూలలం
జేరి యజస్రముగ్ గొఱుకుచిమ్మటబాధలదద్దరిల్లు మా
భారతిబంధనంబుఁ బెడబాపితి దూరెపుబంధువయ్యునున్. 5

## సాహిత్యసరస్వతి శ్రీ రెడ్డిభీమరావుగారు,

కిరికెర, హిందూపురముతాలూకా, అనంతపురముజిల్లా.

క. శ్రీవావిళ్లకులాంబుధి, జైవాకృత! వేంకటేశశాస్త్రీ! భాషా
దేవీపాదపయోరుహా, సేవాపరతంత్ర! సత్యశీలాభరణా! 1

ఉ. మూలల దూలి బ్రుంగి తముఁబోల్చికొనంగను లేని దుస్థితిన్
జాలగఁ గాంచి గ్రంథములు సన్నగిలం బడియుండునట్టిచో
జాలిఁ దలంచి సంస్కరణసత్పథ మొక్కఁడు ద్రొక్కి ముద్రణం
బొలి నొనర్చి కష్టములకోర్చి మహోపకృతిం బొనర్పవే? 2

మ. అలనాఁ డాదనుజుండు సోమకుఁడు తానామ్నాయరత్నంబులన్
జలధిన్ ముంపగ శార్ఙ్గి వేడ్క మెయి తత్సంరక్షణోద్యోగ మిం
పలరన్ సల్పినయట్లు చిమ్మటల దంష్ట్రాక్రాంతమై జీర్ణమై
విలయంబున్ గనువేళ గ్రంథముల వేవే పట్టి ముద్రింపవే?

క. ఎద్దడిబీతునఁ జిక్కుచు, విద్దెలఁ జదువం దలంచు విద్యార్థి యెవం
డొద్దిక నీవిడుదానం, బద్దిర యని కొనకయుండె? నవనీదేవా!

క. పలుకులవెలంది సేవల, సలిపినప్రాజ్ఞుండు నీదుజనకుం డీవా
సలలితమతిపుత్త్రుండ వీకఁ, బులికడుపున నక్కతూన పుట్టునె? విబుధా!

## శ్రీ మఠ్తిబోయిన రామసుబ్బయ్యగారు,

అహల్యాదిగ్రంథకర్త, సాకేతము, నాగరాజాపేట, కడప.

గీ. పూజ్యవావిళ్లవంశాబ్ధిపూర్ణసోమ! వేంకటేశ్వర! నీదగువిమలయశము
తెనుఁగు మిన్నేటితెఱలపై దేలియాడు, హంసవలెనుండుసన మాప్రశంస లెంత.1

గీ. "సోమకాసురుచేఁ జిక్కి చొక్కియున్న, వేదరాశిని మును బ్రోచె విష్ణుమూర్తి
మలినమై మూలఁ జెదలచే మ్రగ్గుచున్న, సంస్కృతాంధ్రగ్రంథంబుల సంస్కరించి. 2

గీ. భాష పోషింప సద్ధర్మపథముఁ జూపి, తండ్రి దివికేగ నాయాజ్ఞ తలను దాల్చి
భాష నుద్ధరించితి వతిభక్తితోడ, ధన్యుఁడవు నీవు కొనుము సత్కార మిదియె.3

## శ్రీ జాగరగల్లు సుబ్బరాయుఁడుగారు, సాహిత్యవినోది, గుంతబజారు, కడప.

సీ. భారతం బెల్లెడఁ బ్రకటించినందున శ్రీకవిత్రయపుటాశీస్సు కలుగ
భాగవతంబును బ్రకటించినందున శ్రీపోతనార్యునాశీస్సు కలుగ
మనుచరిత్రంబును మహి వెల్లడించిన శ్రీపెద్దనార్యునాశీస్సు కలుగ
రామాయణంబును బ్రచురించినందున శేషాద్రిశర్మయాశీస్సు కలుగ

తే గ్రంథముల నన్యములఁ జక్కఁ గ్రాలఁజేసి, సిద్ధకవివరులిడిన యాశీస్సులంది
వఱలు వావిళ్ల వేంకటేశ్వరుల సవ్య,సాచిసఖుఁ డన్నివిధములఁ బ్రోచుఁగాత! 1

క. భాషకు మూలము గ్రంథముఁ,బోషించుట; దాని మీరు పోషించుటచే
భాషావిశారదుఁడవై, 'భాషోద్ధారక' బిరుదము వడసితి వార్యా! 2

## శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

తెలుఁగుపండితులు, కవితాసామ్రాజ్యము, నంద్యాల.

క. భాషకుఁ జేసిన సేవకు, నీషల్లాంఛనము గాఁగ నిపు డిచ్చిన యీ
'భాషోద్ధారక' బిరుదము, భూషింపుము వేంకటేశ! బుధజనతోషా! 1

శా. కోశాగారము నీదుమందిరము కన్గోఁజాలి భాషించుచోఁ
గోశాధ్యక్షుఁడ వీవు నీకృషియు లోకుల్ పంచుకొన్నట్టి ది
చ్చో స్వీకుల్యంబుగ నైన నిచ్చుకొనఁ జూచుంగాక లోకం బటం
చాశల్ జేసెడి సేవగాక యిది యేమౌ! వేంకటేశాహ్వయా! 2

## శ్రీ కోడూరు నారు నాగనార్యకవిగారు,

ఆంధ్రవాణిగ్రంథకర్త, కోడూరు, కడపజిల్లా.

సీ. వెనుపోటునపజయమును గలనేఁలేని వీరులఁగన్నట్టి వీరమాత
విజ్ఞానకళలెల్ల వివరింపఁబండితాళినిఁగాంచు పచ్చిబాలెంతరాలు
"పాహి మాం రక్ష" నాఁబరదేశజాలుమ్రొక్కి యడిగినంతనె పోషించునన్నపూర్ణ
సిరిసంపదలు రెండుఁ దఱుఁగక యీవిశ్వరక్షఁగాఁజాలిన రత్నగర్భ
ప్రథితకీర్త్యన్నతుల కుదాహరణమనఁగ, భవ్యగంగాహిమాద్రులఁబడయుజనని
పరమపూత! జయోపేత! భరతమాత! యురుతరాశీస్సులిచ్చి మిమ్మోముఁగాత. 1

సీ. మాబాల్యమందె రామస్వామివ్యాఖ్యాన మనుచరిత్ర పఠించుకొనుటకతన
మఖఁబుట్టి పుబ్బలో మడఁతపెట్టక యేకధాటి నేటికిఁ గృషి దనరుకతన
గ్రంథములేవేని గావలె నన్న ననన్యశరణము మీరగుటకతన
స్ఖాలిత్యములు లేనిచక్కని పొత్తముల్ తుదికెట్లొ మీయొద్ద దొఱకుకతన
ఆంధ్రభాషామహోదయవ్యాప్తికొఱకు, పెట్టఁబడినట్టి "వావిళ్లప్రెస్సు" ఆంధ్ర
కేంద్రకార్యాలయంబునై కెరలిస్వీయ, జాతిపునరభ్యుదయకారియౌత ప్రజకు.2

### శ్రీ కవిసింహ డి. రాజశేఖరశతావధానిగారు, ప్రొద్దుటూరు.

మ. ధర పేరొందిన వేంకటాద్రి యది ముద్రాశాలగాఁగాఁ దదీ
శ్వరతాప్తిఁ గలికాలభాగ్యరచనాబంధప్రబంధాళిఁ బా
మరులన్ బండితులన్ దరిద్రులను సంపన్నాస్యులన్ జేర్చి మే
లరయన్ నేర్చిన వేంకటేశ్వరుఁడ వయ్యా! నీకు బ్రహ్మాయువౌ! 1

### శతావధాని శ్రీ గాదేపల్లి వీరరాఘవశాస్త్రిగారు, గద్వాల.

క. రసవద్భాషోద్ధారత, నెసఁగిన వావిళ్ల వేంకటేశ్వరమణి వా
క్ప్రసవములఁ దనిపినావా?, రసికకవిస్తోమధామ రాయలసీమా! 1

సీ. గజఘటాంతైశ్వర్యక్రమసింహాసనాసీనత నానాఁట జీర్ణమైన
అరిగాపుల భయజ్వరార్తుల శమియింపఁ జేయు సమర్థత చేయఁబడిన
దుర్మదరిపురక్తదుష్పంకవీరాంకభయదతనుద్యుతుల్ ప్రాఁతగిలిన
అష్టకవ్యగ్రేసరాద్యవిద్వత్కృష్ణరాట్ప్రభుప్రతిభ దూరమునఁబడిన

గీ. ఆంధ్రకవితాపితామహాద్యనుపమాన, బిరుదములొసంగునిజశక్తి బీదగిలిన
పూజ్యభాషాభిమానంబు బోవలేదు, చేసితెదురేమి? రాయలసీమభూమి ! 2

సీ. కనుసన్న వైరుల గడగడలాడించు కవికృష్ణరాణ్ణృపుఁ డవని విడిన
భువనేశ్వరీదయాపూర్వసాచివ్యవిద్యారణ్యదీప్తులు హ్రస్వమైన
శ్రుతిచతుష్టయభాష్యసూత్రార్థషట్శాస్త్రమహిమలు కలలోని మాటలైన
ప్రాక్పశ్చిమసముద్రప్రబలవిదేశవాణిజ్యంబు లంతట త్యాజ్యమైన
గీ ఇంగువయిపోవ వాసన నెట్లు విడచు, ప్రాంతగుడ్డను సామెతాంధ్రమున బిరుదు
పాదుకొల్పుట నీసుస్వభావమమ్మ, చేయుమెదురేమి? రాయలసీమభూమి ! 3

## శ్రీ కొత్తపల్లి శ్రీసూర్యరావుగారు,

(శ్రీవేంకటేశ్వరవిన్నపమునుండి)

ఉ. నీ దగు దేశసేవయును నీకవి పండిత బాంధవాదృతుల్
నీదు సనాతనార్యమతనిష్ఠయు నీఋజుబుద్ధి విద్యలం
దాదరము న్మఱొక్కరునియందుఁ గనంబడవంచు నిచ్చలున్
నీదు 'త్రిలింగ' దేశమున నేఁడు ప్రచారము చేయుచుండుటన్. 1

శా. వావిళ్లాన్వయ మెన్న బ్రహ్మకుల మవ్వాణీమహాదేవి త
ద్దేవాజ్ఞం గులదేవతాగతిగనుద్దీపించుఁ దత్సేవచే
వైవిధ్యంబున సంపదల్గలుగుఁ దత్ప్రాప్తి న్సదార్యావనం
బేవేళం బొనరించు నిర్మమతనం చే దాని దీవించెదన్. 2

మ. మతమున్భాషను నీవ యేగతిని సమ్యగ్రీతికిం దెత్తువో
హితమౌనట్లుగ సుద్ధరించెదవొ నీకే చెల్లు నీచేత న
ప్రతిమానంబగు నాత్రిలింగ గల దాంధ్రజ్యోతియై, శాస్త్ర పం
డితజాలంబును వేంకటేశ్వరభవన్నిఘ్నంబు ముమ్మాటికిన్. 3

## శ్రీ రామ్ వీరబ్రహ్మకవిగారు, బందరు.

క. భాషోద్ధారకబిరుదవిభూష ! మనీషావతంస ! బుధజనగణసం
తోషప్రదసచ్ఛీలవిశేషా ! సుయశోభిలాష ! శ్రితజనపోషా ! 1

సీ. వివిధశాస్త్రపురాణ వేదవేదాంతాది సంస్కృతాంధ్ర గ్రంథసమితి యెన్నొ
కలకాలముగఁ గాలగర్భంబునఁ డాగి పడియుండఁ దద్గ్రంథపటలినెల్ల
వెదకి తెప్పించి కోవిదపరిష్కృతమున నలరించి కరతలామలకమటుల
అర్థసౌలభ్య మౌనట్టుల నాణిముత్యములమించిన మంచియచ్చు దీర్చి
ఆ. ప్రకటనం బొనర్చి భాషామతల్లి న,శేషభవ్యభూషభూషితనుగఁ
జేసి కీర్తి గంటి శ్రీయుత వావిళ్ల, వేంకటేశ్వరాఖ్య! విబుధముఖ్య! 2

సీ. వేలకువేలుగ వివిధపుస్తకము లచ్చొత్తించి ప్రకటించుచుండు టొండు
ప్రతివారముఁ "త్రిలిఙ్గ" పత్రికతో మఱి రెంటిఁ గూడను బ్రమరించు టొండు
శ్రీమదాంధ్రమహాసభాముఖ్యకార్యదర్శిపదంబు గైకొని చెలఁగుటొండు
దూరభారవ్యయాదుల దలఁపక సభాహ్వాన మందిన నట కఱుగు టొండు
తే. అరయఁ దమకుఁ గలట్టి యాంధ్రాభిమాన, మెల్ల విస్పష్టమగుచుండ నింకవేల
రాకయుండు మాకాంధ్ర రాష్ట్రంబు శాస్త్రి!, సరగ గొనిరాగదే దాని శ్రద్ధపూని. 3

మ. గురుశుశ్రూష యొనర్చియే దెలియనౌ గూఢార్థముల్ నేడు మీ
కరుణన్ దేటతెలుంగుతో నలరు వ్యాఖ్యానంబు సేకూరుటన్
గురుసాహాయ్యము లేక నేర్పగల రాగూఢార్థ మట్లౌటచే
గురునిన్ బంపిరి పంగనామమిడి లోకుల్ మీకతానన్ గదా. 4

## శ్రీ సి. విశ్వేశ్వరరావుగారు, బందరు.

సీ. ఆంధ్రవిజ్ఞానతోయములు భూమికినిచ్చి కీర్తిగైకొన్న భగీరథుఁడవొ
తేనెలైనతీయని తెనుఁగువాక్పీయూషమును మాకునిచ్చు మోహినివి నీవొ
వేదాదిసద్గ్రంథవితతిని గొనివచ్చి మోదమందెడు మత్స్యమూర్తివీవొ
తెనుఁగుకావ్యాలను తీరుగా వ్రాయించి రాణింపుగను కృష్ణరాజువీవొ
తే. మున్ను పౌరాణరచనలు మొదలుపెట్టి, రవణిగాంచిన చాళుక్యరాజువీవొ
యనుచుఁ దలపోసి యాశ్చర్యమందె జగము, అరసి నీసేవ వేంకటేశ్వరసుధీంద్ర.

## శ్రీ సి. ప్రకాశరావుగారు, బందరు.

గీ. ఉజ్వలములైనభావంబు లూహచేసి, తేనెసోనలుజిప్పిలు తెలుఁగునందు
భారతీమూర్తులౌ కవుల్ వ్రాసినట్టి, గ్రంథముల్ కంటబడియె నీకారణమున. 1

క. చీలికలై వాలికలై, పోలికచెడి మూలబడిన పుస్తకతతి యెం
తో లావణ్యముగనె నీ,యాలోకనవలన నూతనాకృతి దాల్చెన్. 2

క. కావున నాంధ్రావనినీ, కీవిధి సన్మానమొసఁగి ఏకగ్రీవం
బౌవాక్కున మనభాషకు, నీవుద్ధారకుడవనుచు నిర్ణయమిచ్చెన్. 3

**బాలకవి సవరము శ్రీ చేసికంటినాయుడుగారు, హోసపేట, బళ్లారిజిల్లా.**

సీ. ఆజానుబాహుఁడు రాజీవనయనుండు మణికుండలుఁడు రత్నమండితుండు
కంబుకంఠుఁడు కనకాంబరధరుఁడు విశాలవక్షుఁడు ! శంఖచక్రధరుఁడు
భుజగేంద్రశయనుండు పుణ్యస్వరూపుండు గజరాజవరదుండు ఘనయశుండు
కౌస్తుభాభరణుండు కవిలోకపూజ్యుండు శ్రీయుతాకారుండు శ్రీకరుండు

గీ. భానుకోటిప్రకాశుండు పాపహరుఁడు, రాఘవుండు దయాసాగరహృదయుండు
సతతమును కోర్కెలెల్లను చక్కఁదీర్చి, వేంకటేశ్వరశాస్త్రిని ప్రేమఁ బ్రోచు. 1

సీ. ఏయింటఁ గాంచిన నాయింట 'వావిళ్ల' గ్రంథరాజంబులే క్రాలుచుండు
ఏపండితునిఁ జూడ నాపండితునికేల వావిళ్లగ్రంథాలు వఱలుచుండు
ఏబడిలోఁ జూడ నాబడిలోన వావిళ్లపుస్తకములే వెలయుచుండు
ఏకవిఁ గాంచిన నాకవికరమున వావిళ్లపొత్తముల్ పరఁగుచుండు

గీ. నీ వదెంతధన్యుండవో నిపుణచరిత, నిన్ను నాశక్తికొలఁదిగా సన్నుతింపఁ
దనివి తీరంగలేదయ్య దానకర్ణ, విబుధజనగ్రంథపోషక వేంకటేశ. 2

**శ్రీమతి చదలువాడ నాగరత్నముగారు, పరసత్యాళ్లూరు.**

సంస్కృతాంధ్రాంగ్లభాషావిశారదులయి
జనకునిం బోలి గ్రంథముద్రణమొనర్చి
విమలయశ మందుచుండు వావిళ్ల వేంక
టేశ్వరులఁ బ్రోచుఁ గావుత మీశ్వరుండు.
ఇరువదయిదేండ్లనుండి చరించి ఆంధ్ర
దేశమం దెనలేని కీర్తిని వహించి
వృద్ధిఁ జెందు త్రిలిఙ్గపత్రికకు నీశుఁ
డొనరఁజేయుఁగావుత ! రజతోత్సవంబు 2



**కళాప్రపూర్ణ, కావ్యస్మృతితీర్థ, జనమంచి శేషాద్రిశర్మగారు, లలితావిలాసము, కడప.**

సీ. అలసితి వెందఱో యల్పచిత్తులు నీసువర్ణలోపము చేయువలను వెదుక
గాసి చెందితివి నిక్కపుసోదరుల మాడ్కి భవదలంకృతులసవరణహూన
విసుగునొందితి వల్పవిషయజ్ఞులేచి నీసద్భావమారణసరణి నెమకఁ
గన్నీరు వదలితి కామదవగు నీసుగుణరాజి నెన్నొ భంగులఁ గలంప
తే. నకటకట యంచు నడలితివంబ నీదు, సహజమృదుపాకశయ్యల సంస్మరింప
మానుజాల్ములఁ గని యింక నైన వేంక, టేశశాస్త్రితోడున మాసు నీయవస్థ. ౧

ఉ. భావకవీంద్రు లేచి యొకవంకను నిస్గుదియింప నిత్తఱిం
గావలె మార్పులే దురవగాహము గాదగు నిప్డు భాషయం
చావిలమానసుల్ తమక మంది ప్రయత్నము లొప్పఁ జేయఁగా
దైవమె దిక్కు నాకు నిఁకఁ దక్కుడుగా మరియాద యంచు నీ
వోవరవర్ణినీ! వగవకుండుము చింతలఁ దీర్చి నీమస
ద్భావము వృద్ధినొందఁగ స్వభావము మార్పులఁ గుందకుండ నీ
కేవిధినైన లోపము లవేవియుఁ గల్గకయుండఁ గావఁగా
ధీవిభవుండు పూనెఁ దమి దీక్షను భక్తిని వేంకటేశుఁడే. ౩

తే. పరఁగు వావిళ్ల వేంకటేశ్వరులవంక, నీదు నభివృద్ధి యెంతయు నిత్యమగుచు
సజ్జనాదృతిఁ గాంచుచు సాధుమార్గ, సంయుతిఁ గని త్రిలింగభాషాసవిత్రి. ౪

సీ. తాళపత్రస్థపుస్తకరాజిఁ దెప్పించి పండితాఖండలపటలిఁ గూర్చి
శోధింపఁ బంచి సంశుద్ధంబు గావించి ముక్తామణులె యనఁ బొలుచునక్ష
రములఁ బొల్గాఁటుపత్రములపై ముద్రించి గట్టియానట్టులఁ గ్రాలఁ జేసి
పరిశుద్ధహాటకాక్షరనామములఁ గూర్చి యల్పమూల్యంబున కందునట్లు
తే. బీదలకుఁ గూడ నందుబాటు దగురీతిఁ, బెక్కుతావుల దొరకంగ నక్కటికము
వెలయ నొనరించి యశమున విలసిలు ఘను, వేంకటేశ్వరశాస్త్రి శ్రీవిభుఁడు ప్రోచు ౫



# ప్రబోధము

చింతలపూఁడి సన్న్యాసిరావుగారు, విజయనగరము.

[ఇది విజయనగరము కౌముదీపరిషత్తులో శ్రీ బుట్టా శేషగిరిరావుగారి ఆధిపత్యమున చదువబడినది]

చాటరా నీయాంధ్రభాషా
పాటవమునకు దీటులేదని
యేర్చి మృదుజాతీయపదములఁ
గూర్చి సతతము మధురఫణితిని
    బలుఁగుపలుకులలేమి నెఱుఁగని
        తెలుఁగుకవితనయా!

నాఁటి పెద్దలరాచబాటల
నేఁటి లేతగులాబితోఁటలు
నాటి తెలుఁగుసుమాలిఁ బంచుము
సాటి భూముల పాంథకోటికి
    లలితవాక్కులకోఱంత నెఱుఁగని
        తెలుఁగుకవితనయా!

తెలుఁగుబుధులు పునాదులేసిన
తెలుఁగుకవిరాజేంద్రులేలిన
తెలుఁగువాఙ్మయరాజ్యమందున
వెలసినాఁడవు నీవుఁ గరువా
    కులుకులొలికెడి తేనెపలుకులు
        తెలుఁగుకవితనయా!

భక్తకర్షకసార్వభౌముఁడు
భక్తరక్షకు ప్రీతిగా మును
తెలుఁగుతల్లి నలంకరింపఁగ
నలఘువాఙ్మణులను వెకల్చిన
    యిలను బుట్టితి వరుదె పలుకులు
        తెలుఁగుకవితనయా!

రెడ్లు రాజులు పద్మనాయకు
లొడ్లు వైశ్యులు భట్లు కుమ్మరు
లీరు వారన కుండ నాంధ్రులు
చేరి కొలిచిన తెలుఁగుతల్లికిఁ
    గలిగినాఁడవు కలువె పలుకులు
        తెలుఁగుకవితనయా!

బాలచంద్రునిపౌరుషమునుం
చాలవీరవిహారతేజము
పలుకుపళ్లెరమందునిడి తమ
తెలుఁగుతల్లికి హారతిచ్చిరి
    కులముసాములు, వారిఁ గనమా
        తెలుఁగుకవితనయా!

మాధవునిమురళీనినాదము
రాధనిర్మలప్రణయగానము
కలిసి నీమృదువాక్యమధురిమఁ

త్రిలిఙ్గరజతోత్సవము

పులకితము గావించె విశ్వము
పలుకు కిలికించితము నెఱిఁగిన
తెలుఁగుకవితనయా!

భావబంధుర కావ్యమాలల
ధీవిశారదులై నసోదరు
లమ్మనర్చించెదరు నీవును
లెమ్ము చిక్కనితేనెలూరెడి
తెలుఁగుపలుకులు నీదుసొమ్ములు
తెలుఁగుకవితనయా!

శ్రవణయోగ్యసుధామయోక్తుల
నవరసాంచితకావ్యమధువులు
బుధులకామెతలొనరఁజేసెడి
విధము వంశాచారమదినీ,
కలఘుమతి కులవృత్తిఁ బూనుము
తెలుఁగుకవితనయా!

ప్రాతక్రొత్తల కలయికల వి
ఖ్యాతమగు ముత్యాలసరములఁ
తెలుఁగుతల్లి నలంకరింపుము
కులము పెద్దలు గౌరవింపఁగఁ
గులముగౌరవ మెఱిఁగి నడచెడి
తెలుఁగుకవితనయా!

---

**విద్వాన్ శ్రీ త్యాడీ వేంకటశాస్త్రిగారు, సారస్వతపరిషత్తు, మాడుగుల.**

శ్లో. శ్రీవాగ్మైమవతీశ్వరాత్మకపయోజాతాప్తబన్ధో హరే
గాయత్రీపరమార్థముఖ్య సతతం పాహ్యాయురారోగ్యశ్రీః
సత్కార్యైకధియా సమార్జితయశశ్శ్రేష్ఠంచ దత్వా ముదా
వావిళ్లప్రథితాన్వయాబ్ధిశశినం శ్రీవేఙ్కటేశాహ్వయమ్. 1

**శ్రీ భాగవతుల కుటుంబరావుగారు, ఎం., ఏ., సాహిత్యశిరోమణి.**

జీయాచ్ఛ్రీవేంకటేశశ్శ్రితవిబుధగణశ్శ్రీనివాసస్సుధీరః
క్లిన్నాంగీ మాంగ్లభాషావివశజనమనోమోహవార్ధౌ నిమగ్నాం
దత్వా హస్తౌ ప్రసృష్టౌ కరుణకలితధీః క్లేశజాతం ప్రసహ్య
క్షేమం యః ప్రోద్దధార ప్రకటితవిభవః ప్రీతిమానాంధ్రవాణీమ్. 1
శ్రీర్బ్రహ్మేశషడాననాగణపతిర్విష్ణుస్సర్కవైశ్వానరాః
వాణీసోమపురందరావతులితాం లక్ష్మీం చిరంజీవితాం
క్షేమం సిద్ధిమరోగతా మనుపమాం విద్యాం బలౌజోద్యుతీః
దత్తాన్తే దదతామ్ దదాతు దదతామ్ దేయాత్ దదాతామ్ చిరమ్. 2

---

# చెబుదునా వొక చిన్నముచ్చట

## డాక్టరు: శ్రీ బుర్రా శేషగిరిరావుగారు, ఎం. ఏ., పిహెచ్. డి.

["త్రిలిఙ్గ" పత్రికలోను, ఇతరత్రాను, తమభారతీతీర్థమునకున్ను, "వర్తమానాంధ్రసాహితీప్రవర్తకము" నకున్ను
చేదోడువాదోడుగానున్న శ్రీ భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిమిత్రవర్యులకు
కృతిగా నీ "రజతోత్సవసంచిక"కు శ్రీ బుర్రా శేషగిరిరావుగారి సమర్పణ.]

**చెబుదునా వొక చిన్న ముచ్చట.**

చిన్న నాటను కని విసున్నది
చేవగల గురుజాడ అప్పా
రాయకవితలజాడ వెంబడి॥ చె॥

పసిమిమనసులు బలిసి కొలిచిరి ;
విసపునగవుల వెకిలిచూపులు
వీథివిటులటు వేర్చివిసిరిరి ;
మాయ లెరుగనిమానవతులగు
నమ్మలక్కలు సొమ్మసిల్లిరి॥ చె॥

నగిరికటకంనాటివారట
మేటియా గంగాన్వయులె యట
వివిధశాఖల బ్రాహ్మ లేనట
మహిషరాజ్యం వలసవారట॥ చె॥

అదుపు ఆజ్ఞా పెట్టడానికి
అత్తమామలు లేనివారట ;
పెద్దవిద్దెలు చేరి యొకచో
తినుచు తిరుగుచు తెచ్చుకొనిరట
కమలభాస్కరులూ॥ చె॥

"వారుకోరిక నొకరికొక్కరు
మీరి, మమతలఁ జేరి, వరియిం
చారటో, యీవింత వింటివో
అక్క రాజాంబా"

అంది కనకాంబ.

"ఆలుమగలై యలరి యలరిం
పంగ, నంగజునింగి కెగరగ
కొత్తపద్ధతి, రిత్తవోనిది
వింటివా కనకాంబ, మనకై
వీరుకని పెట్టారటో"

అంది రాజాంబ.

సిగ్గు బిడియం బుగ్గి గలియగ
గ్రామపెద్దలు కలియుతావుల
కాసుపీసని బాసలాడుచు
చెట్టపట్టలు పట్టి నడుతురు
చూస్తివో జోగాంబా.

... ... ...

పేరుపేరుల వరసబెడుతూ
పిలుచుకొంటూ కిలకిలంటూ

వాకరిచెంపలు వాకరు చరుచుక
వీథి బడుదురు చూస్తిరా ?
కరము కరమున కలిపినపుడే
కర్మసాక్షిగ నాలుమగలగు ;
కమలకలిపేయువకకరముల
కంతులేదే ! యేమి మనువిది !
ప్రేమ యిదియేనా ?
భాస్కరునిచెలికాండ్రతో సం
లాపముల బడి కమలవుంటే
ఆతడేవో కవిత లల్లుచు
కూనిరాగము తీయుచుండట
అక్కలారా మనువటోయిది ?”
అంది కనకాంబ.

“ఇంగిలీజులన్నవిద్యట !
అంగబలముకు నేర్పినారట !
మిత్రులంతా బలే అనగా
అడుగు లేస్తూ పాడతారట !
కులస్త్రీ కా కూటలాస్యము
వీరకవి “రాజాంబా” ”
అంది జోగాంబ

“ఆలుమగలే అనుదు; అయితే
అన్యులెదటా ఆటపాటలు ?
కోరచూపులు కోరిమాచుటా ?
వీరిసిగ్గులు చిమిడిపోను !
పోకిరీలవు; వీరలేమిటి
ఆలుమగలై మనువు కేమిటి ?
మాటపోటీ ఆటజయముకు
ముద్దులిచ్చి పుచ్చుకొనుటట !

పోకిరీలవు ; ప్రేమ లివియా ?
యిటకు నేటికి వచ్చిరో ? యెవ
రెరుగరా ? మరి యెరిగి చెప్పరా”
అనుచు శ్రీకాకుళపు కోటీ
శ్వరునియాలయ వీథిదరిగల
యేటిలోనీలాటిరేవున
నడిగె రాజాంబా.

నాటిరేయిని మాటుమడిగిన
వీలుచూసుకు వీరరాజును
మనసు కరిగే మాట లంటూ
కమలభాస్కరకలాపంతా
మమ్మలక్కలు నమ్మురీతిని
జాడగానూ లీలగానూ
జారనిచ్చెను రాజమాంబా॥ చె॥

వీరకవి వీఱ్ఱాజుయెమ్మెలు (M. L.)
తగవరులలో తగవ రంటూ
రసికవరులలో రసికు డంటూ
కవులలో కవిరాట టంటూ
బంతియాటల బలియు డంటూ
ఇహాముపరమును వాక్కరీతిని
నడుపుకొను వాకనాయకాగ్రణి
కొడుకుకొన్మూ లేనిగిడసరి
“కోటి కొకపడ గెత్తడానికి
కొంచమే లోటున్నదంటూ
పచ్చికూరలె మెచ్చి తింటూ
కూడబెట్టిన కూటిలోభని
కారుకూతలుకోరికొందరు
ప్రేలితే నేమి”?

మానవతి రాజాంబికామణి
మానసము నాతనికి నంతయు
నిచ్చి, నిచ్చలు నొచ్చులేయగు
నోముపంటగ మనువు గడుపును
కోరివీరునితోడ చిత్రము!
ప్రేమయిది కాదా?॥ చె॥

... ... ...

ఫట్టుమని వొకచెంప వేసెను
చెట్టు విరిగినయట్లు సోలుచు
రాజమాంబారమణియనె "మా
రాజ; నాతప్పేమిటండీ?
వీరులౌదురు! బలే; యేలిటు
లాగ్రహావేశమును జూపుట?
మంచిచెడుగులు యెంచి తెలుపగ
యింకనాకెవరు?
ప్రేమ తీరుల తెస్నులా అవి
అయిన యేమీ రాణివాసము?
వారలట్లే మనముకూడా
వరలు చుందామా?"
తప్పు; తప్పటుప్రేలబోకిక
తగనివారలు విన్న నిదియొక
తగువుగా నగు తగవరులలో;
భాస్కరంగారైసియస్సట! (I. C. S.)
మనకళింగపుమాననీయులు
తగువులకు నధికారిగానిట
నుండి మండలమేలువారట!
అమ్మలారా, అక్కలారా
నోళ్లు మూసుక వుండుడింకను
అనుచు మించినబుద్ధి గరపెను
వీరరాజపుడు.

బ్రేవొ కమలా; "బ్రావో" భాస్కర్
కమలకూ జై; భాస్కరం జై
అంచు దశమీవిజయవేళను
అమ్మలక్కలకగ్గజంగా
సాగెనుత్సవము॥ చె॥

పూలుగుచ్చిన యీతకొమ్మల
బార్లు తీర్చిరి బడులపిల్లలు
వారివెంబడి రంగురంగుల
తోరణాలను పట్టి తురకలు
అవల కెన్నిసుబ్యాట్లు లీలగ
భుజముపైగా నెత్తి పట్టిన
పోటీయువకులబూటుసందడి
వారివెన్కను కిమిడి గాంగవ
హామహీశులహార్సుతురుపులు
బ్యాండు మేళపుమార్చిగతులకు
మిలిటరీలటు లడుగువేసిరి
వీరకవివీర్రాజుప్రముఖులు
వారివెంటను తెల్లగుర్రము
లల్లనల్లన ఖదం దొక్కగ
పూలమాలలు మెడలు నిండగ
పచ్చశకటమునుండి పౌరుల
వందనంబుల నందుకొంటూ
బ్యాటుపందెపుగిన్నె పట్టిరి
భాస్కరా కమలల్॥ చె॥

పచ్చిపారులు రిచ్చవోయిరి
కళ్లు తెరవకయిట్లజగమని
పళ్లుకొరికే నోళ్లు కట్టిరి
రాజబాటను "రాతిబరి" దరి

బాలికలు హారతులు పట్టిరి
కుంటిమాష్టరు కూర్మనాథం
గొబ్బిపువ్వులు గుచ్చిదండలు
కమలకేస్తే కాంతమురియుచు
కలిపెనతనితో చేయిచేయిని
మ్రోసె కరతాళములు మింటికి
"కలియుగాంతం! చూడవేమో
సోమిదేవీ;" అంది పేరమ.
"గుంటవెధవలు పెచ్చురేగిన
రేగెపో; మనకూర్మిగాడికి
మిన్నుమన్నూ కన్నుగానని
చేటుకాలమిదేటికో"—

అంది సోమమ॥ చె॥

... ... ...

వుత్సవమువారిల్లుచేరెను
వూరిపెద్దలు సెలవు చెప్పిరి
"నేడు మన కీవిజయదశమీ
విజయవేళను ప్రేమవిజయపు
కానుకగ నా "పికమ" యీసుమ
దామమును నీమెడను వేతునా?"
అనుచు భాస్కరు డతనిమెడలో
హారమెత్తుక కమలజేరగ
కమలమెడలో హారమాతని
కంఠమున వ్రాలెక్
"ప్రేమపరుగున విజయమెవరిది
గాంగెయార" ని తట్టె కమలా
దేవి; భాస్కరుడామెనక్కున
జేర్చి ముద్దాడెక్

## భరతవాక్యం

"అనెడునిది" బుత్తాన్వవాయ "ప్ర
ధానిశేఖర" శేషగిరిరా
వ,మలమిత్రత శుద్ధి, భాషో
ద్ధారకమునకు "గద్ది" యౌ శ్రీ
వేంకటేశ్వరశాస్త్రి నిల్పిన
"త్రిలింగ" కు వరరాజతోత్సవ
కాను కిదు "కృతి"; వరలు గావుత
సహృదహృదయంగమము గావుత
కవిత యిదియౌ యంచు యువకవు
లరసి తడవుచు పెనుగులాడగ
నిత్య శ్రీకరమంగళంబుగ,
నిత్యహర్షదమై.



# *పృథ్వీరాజు—మహోబాయుద్ధము

(సంయమరాయని రాజభక్తి)

## [మహమ్మదీయ మహాయుగచరిత్రయందలి యొక మహాఘట్టము]

రచయిత: శ్రీభారతీతీర్థ పండిత: దేవగుప్తాపు వేంకటరమణకవిరాజుగారు,
వెంపడాం గ్రామం, భీమునిపట్టణం తాలూకా.

"మాసము దాటె, నేను పరమాలనృపాలకురాజ్యసీమపైఁ
జేసెడి దండయాత్ర; రిపుశేషము మాత్రము సాగరోర్మికా
రాసులయట్లు పైఁబడి పరాకును బూనెడి మద్భటావళిం
రాసులుగాఁగఁ గూల్చి, సమరంబున దారును గూలుచుండ్రిపో. 1

"ఢిల్లిని గొల్లగొందునను తీవిఁ బరోక్షమునందు గ్రొవ్వుమై
ప్రల్లదనాళినిం బలుకు రాట్పరమాలుని జీవనాళితో
నెల్లి తదీయరాజ్యరమనెల్ల హరింపకయున్న రాజనం
జెల్లునె నన్ను? క్షత్రియుఁడనే! బలశాలినె! పృథ్వీరాజునే! 2

"మోహప్రాయము జీవితంబు, చరితంబుం గర్హితం, బుత్సుకం
బా హింసాచరణంబునందుఁ, గుతుకం బామద్యమాంసాదులా
ఆహారంబున, బందిఁగొన్నసతులాహా! జాయ, లీకిల్బిష
వ్యాహారంభకు, మద్రిపుం గలతు దర్పోద్దీప్తి నేఁ డాజిలోన్. 3

"హూణులు, పారశీకరణయోధులు మున్నగువార లీ విరాడ్
శ్రేణిని పృథ్వీరాజొకఁడె శ్రేష్ఠుఁడు - శిష్టుఁడు - ధర్మశీలుఁ - డ
క్షీణపరాక్రముండని వచించెద; రీపరమాలుఁ డొక్కఁడే
జాణుఁడు కాఁడు హీనుఁడని చాటుచునుండును కక్ష్యఁ బూనుచున్. 4

"ముందీధారుణిలో రణంబు లనయంబుం జేయుచుం గ్రూరులా
మందులొక్కండ అశాంతిఁ గూర్పఁ, గని అస్మద్ధాటిఁ దూలించి ఈ

---

* మద్విరచిత హిందూదేశచరిత్రనుండి.

హిందూరాజ్యము నిల్ప శాంతి తిరమయ్యెన్; గాని నేఁ డీద్విష
ద్బృందం బాత్మకశాంతిఁ గూర్చెడిని, ఈదేశంబునం దెల్లెడన్. 5

"పరుషోక్తిన్నను నొవ్వఁజేసిన రిపువ్రాతంబునెల్లన్ రణో
ర్వి రహిన్నైన జయించి ఏలవలె 'ఢిల్లీతో' ద్విషద్రాజ్యమున్;
బరమాలుండయినన్ జయించియు 'మహోబా' తోడ ఢిల్లీపురీ
వరసామ్రాజ్యము నేలఁగావలయు శుంభద్విగ్రహప్రక్రియన్. 6

"తనువును గోసి యిచ్చు సరదారులు, నాకయి వహ్నినైనఁ దా
వెనుకకుఁ బోక దూకు రణవీరులు విగ్రహరంగసీమలో
సునిశితచంద్రహాస శర శూల కుఠార మహాయుధాలిచే
త నుసురులం దృజించి, తమధర్మము దీర్చిరి రంగభూమిలో. 7

"వీరులగునూద లల్హాలు † పేరుపొందు - భటులు, యోధులు శాత్రవప్రకరమందు
దెగిరి; కావున నింక సందియము వీడి - నిజకరంబునఁ జేకొందు విజయలక్ష్మి 8

"సైన్యము వీడుఁడింక సరదారుఁడు సంయమరాయఁ డల్లదే
మన్యువుఁ బూనియున్న పరమాలుని బంధితుఁ జేసి, కూలె నా
మాన్యుఁ డటంచు కేకలవె మద్భటులందు వినంగనయ్యె; నా
ధన్యునిఁ జూచి అశ్రుజలతర్పణ మిచ్చెద రాజభక్తికిన్." 9

అని చింతించుచు హర్షమాత్మఁగను; చాహాయంచు, మేలంచు; నా
అనఘుం డంతట సంయముం గనెడి ఊహాం బోవుచుండన్; మహా
శనిపాతంబన; ఖడ్గఘాతము మహేశాధీశుశీర్షానఁ బొ
ల్చినయంతన్ రుధిరప్రవాహమున వ్రాలెం భూపుఁ డుర్వీస్థలిన్. 10

అంత పెనుమూర్ఛఁ దవిలి బాధావిలమున
మరణవేదనఁ గూడి అమ్మనుజవిభుఁడు
స్పృహ దొరసి చూడనొప్పె స్తంభితునిపగిది,
మరియు యోగస్థభంగి, చిత్తరువుమాడ్కి. 11

ప్రభువాకఁడు శత్రుగణముచేఁ బట్టువడుట బ్రభువాకఁడు మరణించెనన్ భ్రాంతిచేత
చాలఁగా విచారించి పక్షద్వయరణ శేషము: స్వకీయశిబిరముల్ జేరిరపుడు. 12

† వీరు మహోబాసైన్యమందలి సరదారులు.

అంతట గృధ్రకాకనిచయంబులు మానవరక్తపానవి
భ్రాంతి, భయంకర ప్రధనరంగమునం దిరుగాడు చొక్కచో
సంతసమారఁ జూచె, శరసంవృతశోణితగాత్రు, మూర్ఛ నా
వంతయుఁ దెల్విమాలి భువి వ్రాలినవీరునిఁ, బృథ్వీరాడ్విభున్. 13
కాంచి శవమను భ్రాంతి హర్షించి, దరిఁ
బోయి తుండాగ్రతతితోడఁ బొడుచుకొనుచు
నానృపుశరీరమందలిశోణితమును
పలలమును గ్రోలుచుండె నాపక్షిగణము. 14
తగుఘాతంబులచేత గాయపడి బాధం జెందు తన్నిట్టు లా
ఖగబృందంబు మఱేంత బాధపఱుపన్ గాలైనఁ జేర్చైన నె
మ్మొగమైనన్ మఱి త్రిప్పఁ, డార్తిఁగొనఁ, డాభూపుండుః దుర్వారమై
స్వగతం, బార్తికరంబునై ఎసఁగు మూర్ఛావేశతన్ మున్గుటన్. 15
తన్ను పోషించు ప్రభుఁడు మృతతనుతతుల - నడుమ పక్షిగణంబుచేఁ బడెడిబాధఁ
గాంచి, వారింపఁగా లేవనెంచి, నేల - వ్రాలి, చింతించె సంయమరాయఁ డిట్లు.
" హా సుచరిత్ర! చారుదరహాసప్రఫుల్లసరోజనేత్ర! వి
ద్యాసుయశఃపవిత్ర! శరణాగతరక్షణనిర్మలాంచితో
ద్భాసితమై, పవిత్రమయి భాసిలు కీరితిఁ గన్న నీకు నేఁ
డీ సమరోర్వి నిట్లు ఘటియించెనె బ్రహ్మ దయావిహీనుఁడై. 17
" మృదుతల్పమాయెనే? రుధిరసమ్మిళితబంధురరథయోత్పాత మీాకఱకునేల!
పరిజనంబే? పురోభాగాల దెబ్బలు తవిలి నేలంగూలు శవగణంబు!
వందిపై తాళికవారంబె నీకు? సృగాలకాకాదిముష్కరరవంబు!
పరిమళం బాయెనే- ప్రహతమనుష్యాశ్వగజనికరాదిదుర్గంధచయము!
లనఘ! రాజాధిరాజ వైనట్టి నీకు - కాలగతి నెట్టివిపరీతఘటన కూడె!
కృత్స్నదిజ్ఞ్నర్తనోద్భాసికీర్తిసాంద్ర! రమ్యగుణసాంద్ర! మాపృథ్వీరాజచంద్ర! 18
" కమలవనికి మార్తాండోదయమువడువున - కల్పవృక్షమ్మునకు సుమోద్గమముభంగి
వారినిధికి సుధాసంభవమ్ముమాడ్కి - రమణుఁ డీవౌట రాజ్యంబు రమణ నొప్పె.
" కఱకుతురుష్కభూపతినికాయమునెల్లను బారఁద్రోలి సు
స్థిరముగ రాజ్యమున్నిలిపి దేశమునందలి స్వప్రజావళుల్

గరము శుభంబులంద ఘనకార్యములం బొనరించి శాంతికిం
దిరవగునట్లు లీభరతదేశము నేలుప్రభుండ వీవెగా. 20

"అమృతరసమున నభము పూయఁబడినట్లు - పాలచే సస్యమది తడుపఁబడినట్లు,
లిద్ధవీర్యసంపద భువినేలుచున్న - ప్రభువ నీవేడ- ఈపడుబాధలేడ! 21

"తానొకటి నెంచ దైవమ్ము తలఁచునొకటి
అనెడిచందాన నేకాకినై నృపాలుఁ
డిట స్మృతి దొఱంగి బాధలొందుటయు; నాకు
నూరుభంగంబు ప్రాప్తించు టొదవె నొకట. 22

"కనఁగా నియ్యది పూర్వజన్మకృతమౌ కర్మంబుఁ గాకున్న, మా
జననాథోత్తముఁడేమి మూర్ఖజనుఁడా? సంగ్రామభీతాత్ముఁడా?
రణరంగప్రతిగామిసైనికజనవ్రాతేభకుంభస్థలీ
గణభిన్నప్రవరక్తపానవిలసత్ కంఠీరవుం డౌగదా! 23

"చండపరాక్రమస్ఫురణ సంగరరంగపరీతశాత్రవో
ద్దండమదప్రభంగకర ధైర్యగభీరపరాక్రమోల్లస
న్మండనమూర్తివై, జయరమం గొని హర్షతరంగమాలికా
మండలి దూఁగె దీవిఁక నమానుషకీర్తినటంచు నెంచితిన్. 24

"భావోత్పన్నసమానరూపుఁ, డలఘువ్యాపారుఁ, డారావలీ‡
గ్రావప్రస్థితభిల్లకాననవినిద్రాణాగ్నిహోత్రుండు, ఆ
శావిస్తారితకీర్తిసాంద్రుఁడు, స్వరాజ్యస్థాపనాచార్యుఁ, డే
తావన్నీచపథంబుఁ జిక్కుటకు స్వాంతంబందు శోకించెదన్. 25

"శూరు, లపారపౌరుషవిశుద్ధయశోధను లీభటాళి లిం,
దేరయినం గమించి ధరణీశుఁడు మూర్ఛవహించియుండెనో,
మారణమొందెనో అని విమర్శన సేయక మూర్ఖచిత్తులై
చేరిరి చింతచే శిబిరసీమలఁ, గాసిలుభూపు వీడియున్. 26

"తల్లిదండ్రులు చిన్నతనమున మరణింప మించుప్రేమమునఁ బోషించినాఁడు
పలుగాకి నగుచు నొప్పారునం దరిఁ జేర్చి విద్యలెన్నిఁటినొ చెప్పించినాఁడు

‡ ఆరావలీ పర్వతము రాజపుత్రస్థానమునందు గలదు.

కులసంప్రదాయము ల్గలసతిఁ గూరిచి తీఁతి నన్నొకగృహస్థుఁ జేసినాఁడు
పదివేలసైనికుల్పయిని సర్దార్ పదవినొసంగి కడు గౌరవించినాఁడు
కన్నసుతుచందమునను నాకెన్నొ విధుల-మించుసదుపాయములను గల్పించినాఁడు
ఈధరావల్లభుకతానఁ గాదె నేఁడు - నిర్మలయశుండనై భువి నెగడుచుంటి. 27

" అట్టి మదీయరక్షకు ఖగావలి ప్రేతశరీరుఁ గాఁగ ని
ప్పట్టున నెంచి శోణితము పానముసేయుచు, తుండపాళిచే
నట్టిటు లాగికొంచు తనువందలిమాంసము మెక్కుచుండ, నే
నిట్టి విషాదకృత్య మిసిసీ! కనియుఁ మతిమాలి చూచెదన్." 28

" తొడలు తెగిపోవుకతన నిప్పుడ రయమున - లేచి మత్ప్రభు రక్షింప లేనయితిని;
ప్రాణములు దాల్చి ఏలినవానిబాధఁ - జూపఁజాలని నేనెంత పాపమతినొ! 29

" ఆయెనుగాని ఈశ్వరకృపాతిశయంబున రాజరక్షణో
పాయము లేశమాత్రమది స్వాంతమునం బొడకట్టెడిన్, మహా
శ్రేయము గల్గు, నన్వయము చెందు పవిత్రము నట్టి త్యాగమే
నీయెడఁ జూపి శీఘ్రముగ నిప్పుడ రక్షణసేతు మత్ప్రభున్. 30

" సంశయింపక నేనట్లు జరిపినఎడ - తొలి నృపుంగాచుసుకృతిఁ బొందుటయగాక:-
భూమిని దధీచి కర్ణ జీమూత శిబిది - లీపులయశంబుఁ గాంతు నిర్ణిద్రఘణితి. 31

" ఎవని ఉప్పు దినుట నీశరీరము వృద్ధి - అయ్యెఁ; నతనికొఱకు నాశరీర
మిపుడ సంతసమున నుపయోగపఱచెద - నింతకన్న శ్రేయ మేది నాకు! 32

" అందుకు తగ్గ సాధనమునైన సమార్జన సేతువన్న లే
వందగు శక్తి లేదు కటిభాగమదెల్లను భగ్నమౌట ; దై
నందినఘోరశాత్రవజనవ్రజహృద్గతరక్తపానని
ష్పందయశుండ, దైవగతి చాలక యిప్పుడ పందనైతిఁగా! " 33

అని చింతించి సమీపమందుఁ గల భగ్నాసిన్ గరంబబ్బురం
బునఁ జేపట్టి స్వకీయదేహమున నెమ్ముల్ దూర నాటించి, అం
త నిపాతామిషఖండసంచయము లాధాత్రీశునగ్రంబునం
దున నొక్కొక్కటి వైచుచుండె మదినెంతో హర్షముప్పొంగఁగా! 34

సగమిటు మాంసఖండములు సంయమరాయఁడు ముందు వైవ, నా
ఖగతతి భూవిభున్విడిచి కౌతుకమొప్పఁగ ముక్కులేరికొం
చు గుములు గూడి అన్నియును చుట్టును జేరుచునుండ, నాతఁడా
వగనె ఖగాళి కామిషము వైచుచుఁ బుచ్చుచునుండె నెంతయున్. 35

తెలివి కాసంత గాంచి నల్దిశలు చూచి - సంయముండెదుర నొనర్చు సాహసంబుఁ
గాంచి ప్రేమాశ్రు వితతి నర్పింపనతని, చెంత కెగబ్రాకి జనియెభూకాంతుఁడపుడు.

చని సమీపస్థమగు పక్షిగణము నెల్లఁ - ద్రోలుచును - శేషజీవంబుతో నతండు
చేయు నభివాదములఁ బ్రేమస్వీకరించి - అశ్రుపూరితనయనుఁడై అతఁడనియె.

" అతులారాతినృపాలభంజనరణవ్యాపారపారీణతన్
తతసామర్థ్యము నాఁడు నేఁడు రిపుబృందం బాత్మఁ గుందన్, అనా
రతముం జూపి, జయేందిరాన్వితము సామ్రాజ్యేందిరన్నాకు స
న్నుతకీర్తిప్రభమీరఁ గూర్చితి వ దెన్నోమార్లు; వీరాగ్రణీ! 38

" స్వామిభక్తికి నిజమైన వంశమందుఁ - బుట్టుటనె గదా! నీకిట్టి బుద్ధివొడమె!
జగతివిస్తారమున నెక్కుడగునె నీదు - ప్రాణమునకంటె నాదైనప్రాణ మనఘ!"

" జగమందేవ్వరు తత్వసారవిదు లీచందంబు కావించి కా
సుగతిం బొందిరి మున్నటంచు వినవచ్చుంగాని, నేఁడారయన్
జగతీభాగమునందు నీపగిది ప్రాణత్యాగముం జేయుదా
త గనంజాలము స్వామిరక్షణకు; నార్తత్రాణపారాయణా! 40

" పరమాలాభము నెవ్వఁడీ కలనిలో బంధించు, నవ్వీరుఁడే
అరిరాజ్యానకు రాజు కాఁగలఁడటం చానాఁడు గావించితిన్
బరమంబైన ప్రతిజ్ఞః కావున 'మహాబా' లక్ష్మి నీ కొందె నా
దరముం జూపకయుంట నీకదియ సద్ధర్మంబె; వీరాగ్రణీ! 41

" లోఁగొనును రాజ్యమెంతటి త్యాగినైనఁ! గాని నీపట్ల వమ్మయ్యె దానిమాయ!
అరయ జీవనత్యాగివై వరలునీకు రాజ్యరమ వీడుకార్యంబు లఘువుకాదె! 42

" ప్రాప్తయౌవనయైన సామ్రాజ్యలక్ష్మి - ఐహికాస్థిర సుఖదాయి యంచు రోసి;
మోక్షలక్ష్మి శాశ్వతసుఖములు పరమునఁ - గూర్చునం చిప్పుడే గాదె కోరికోరి. 43

" అనయంబై హికవాంఛ లల్పము, లసహ్యంబంచు నీరీతి నెం
చి నినుం జేరెడి లక్ష్మి వీడెదవె? పోనీ, మోక్షరాజ్యేందిరా
ఘనభోగంబుల కిప్పుడే ద్యుతులు గల్గన్ నిన్ను పట్టాభిషి
క్తునిగాఁ జేసెద పంచభూతములముందున్ బాష్పసేకంబుచే. " 44

తనప్రభుండీరీతి తత్కృతజ్ఞతఁ దెల్ప నరమోద్భవకనులతో నాలకించి
అభిషిక్తుచందాన - అఖిలిప్తునివిధాన - ప్రక్షాళితుఁడు వోలి ప్రమదమంది
కాయంబు బహువిధాపాయంబు దీనిఁ బ్రభూత్తముకై విని యోగపఱచి
జన్మధన్యంబైన చక్కిఁ దోపించిన భగవంతునకు నాత్మఁ బ్రణతు లిడుచుఁ
బ్రభుని నిమురుచు నాత్మదీవనల నిడుచు - ఖడ్గఘాతాళిఁ బెనుబాధ కనులుమూసి
అమరలోకయాత్రారతి నైహికమగు యాత్రను ముగించె నాసచ్చరిత్రుఁ డపుడు.
అంతయును జూచి ఆరాజు దాంతి - వీడి, చాల శోకించి, తమనివేశములకడకు
వెడలె; తన్నాజిరంగాన వెదకుచున్న, *చందు బర్దాయి యను కవిచంద్రుతోడ.

*  *  *  *

సుంతయు రాజ్యలాభమును చూడక, యౌవనయైనభార్య నా
వంతయు లెక్కకుంగొనక, స్వామికిఁ గాను విహంగతృప్తికై
చింతల నాత్మ వీడి, తనచేత శరీరముఁ గోసి మాంసమున్
సంతసమారఁగా నొసఁగు సంయమరాయని సంస్తుతించెదన్. 47

ధనముల్ ధాన్యము లిండ్లు వాకిళులు వస్త్రాలాదివస్త్వోఘమిం
పున త్యాగం బొనరింత్రు కొందరు మహాత్ముల్ కష్టకాలాన గొం
త నరశ్రేణికిఁ; గాని నేఁ డిటుల నాత్మత్యాగముంజేసి భూ
పునిప్రాణంబులు గాచినట్టి సుకృతాత్ముం జూడ మూర్వీస్థలిన్. 48

స్వస్థానంబున సర్వసౌఖ్యములు విస్తారంబుగాఁ బొంది, పృ
థ్వీస్థానంబున స్థాయిగా వెలుఁగు కీర్తిజ్యోత్స్న భాసిల్లఁగా
ప్రస్థానంబునకేగి; మాంస మతఁ డాపత్కాలికిన్ రాజపు
త్రస్థానంబున నేఁడు వైచెడు: చరిత్రన్ గీర్తి కాయంబుచేన్. 49

---

* ఇతఁడు పృథ్వీరాజు ఆస్థానమందలి సుప్రసిద్ధకవీశ్వరుఁడు—

# అలంకారశాస్త్రోత్పత్తి

శ్రీ మేడేపల్లి వెంకటరమణాచార్యులుగారు,
రిటైర్డు సంస్కృతపండితుఁడు, మహారాజావారి సంస్కృతకళాశాల, విజయనగరము.

చ. స్థిరరుచిరప్రభావిసరదీప్రతటిచ్ఛతవేల్లితంబు భా
స్కరతనయాతటీత్రిదశసాలవనాంతవిహారి సత్కృపా
ఝరి నిజపాదపద్మరతచాతకవర్గము దన్పు మేఘము
ద్ధురభవదావవహ్నిరుజఁ దూలఁగఁ జేయ భజింతు నిచ్చలున్.

తే. వేంకటేశునిఘనకృపఁ బృథ్విఁ బుట్టి, పంచవింశతివత్సరప్రాయమంది
వివిధదేశాటనము సల్పి విదితవాచు, శ్లాఘనీయార్థసంతతి సంగ్రహించి
అనఘవిద్వత్కరోపలాలనముఁ జెంది, పెంపు వహియించి పెద్దల కింపు బెంచి
రాజతోత్సవసంచికారత్నపీఠి, నధివసించి చెలంగు మీయవనియందు
జ్ఞానవార్ధిసముత్థితానూనభంగ, ఉచ్ఛవర్ధితశృంగ నేఁడో త్రిలిఙ్గ.

మనుష్యజాతి యెంత ప్రాచీనమైనదో కవనము కూడ నంత ప్రాచీనమైనది. మనుష్యజాతివారి ప్రాచీనమతగ్రంథము లన్నియుఁ గవితామయములు. కవనరూపమగు భాషలో నలంకారము లుండక మానవు. హిందువులవేదము, ఉపనిషత్తులు, పురాణములు, ఇతిహాసములు, క్రైస్తవులబైబిలు, పారశీకులచందోఽవస్థానము (Zendavesta), మహమ్మదీయుల ఖురాను మొదలగు ప్రాచీనగ్రంథములు అత్యుత్కటసారస్వతావేశముతోఁ గూడిన మహానుభావుల ముఖములనుండి నిరర్గళధారగా స్వయంప్రస్వీతములైన కవితాస్రోతోరూపములు. వీనియం దెల్లెడల నలంకారము లుండును. ఇందుకు నిదర్శనముగా మనఋగ్వేదము, ఉపనిషత్తులు, పురాణములు, మొదలగువానిసఁ బరీక్షించినయెడల నిపుడు మన మెఱింగిన అలంకారసమూహమంతయుఁ గానరాకపోయినను ఉపమ, రూపకము, అతిశయోక్తి విరళముగాఁ గానవచ్చుచున్నవి. ఉపమ రూపకము లేకుండ నేభాషయు వృద్ధి నొందఁజాలదు. దీపకాలంకారము భాషాభివృద్ధికి ముఖ్యకారణమని బహుగ్రంథకర్తయగు కారలైల్ (Carlyle) వ్రాసియున్నాఁడు. ఋగ్వేదమందున్న ఉపమాలంకారములు:—

I 124.7 అభ్రాత్రేవ పుంస ఏతి ప్రతీచీ గర్తారుగిరివసనయోధనానాం,
జాయేవ పత్య ఉశతీ సువాసా ఉషా హస్రేవ నిరిణీతే అప్సః.

టీ. సోదరులులేనిస్త్రీ తండ్రిమొదలగువారివద్ద కెట్లు పోవునో, మగడులేనియాఁడుది తనకు రావలసినధనమును రాబట్టుకొనుటకు కచ్చేరి కెట్లు పోవునో, కామముగలస్త్రీ వస్త్రాభరణాదులచే దేహము నలంకరించుకొని భర్తృసమీపమున కెట్లు చనునో, హాసము దంతపంక్తి నెట్లు ప్రకాశింపఁజేయునో, అట్లు సకలపదార్థములను ప్రకాశింపఁజేయు ఉషస్సు సూర్యునినివాసస్థానమగు అంతరిక్షమునకుఁ బోవుచున్నది. ఈబుక్కులో ఆరు ఉపమలు కలవు.

VII 33.8 సూర్యస్యేవ వక్షథో జ్యోతిరేషాం సముద్రస్యేవ,
మహిమా గభీరః వాతస్యేవ ప్రజవో నాన్యేన స్తోమో వసిష్టా అన్వేతవేవః.

టీ ఓవసిష్ఠులారా! మీమహిమ సూర్యునిప్రకాశమువంటిది. సముద్రమువలె గంభీరమయినది. వాయువువలెఁ బ్రకృష్టజవముగలది. ఇందులో మూఁడుపమలున్నవి.

I 123.10 కన్యేవ తన్వా శాశరాన్నాషి దేవి దేవమియిక్షమాణామ్.

టీ. ఓ ఉషాదేవీ! కమనీయమగు కన్యకవలె నీవును నీశరీరముచే స్పష్టమగుచున్న దానవై అభిమతముల నొసంగుసూర్యునివద్దకుఁ బోవుచున్నావు. దీనిలో నొక ఉపమ.

IV 58.3 చత్వారి శృంగా త్రయో అస్య పాదా ద్వే శీర్షే సప్త హస్తాసో అస్య
త్రిధా బద్ధో వృషభో రోరవీతి మహోదేవో మర్త్యాౕ ఆవివేశ.

ఇందులో రూపకాతిశయోక్తి

కఠోపనిషత్ప్రథమాధ్యాయే తృతీయవల్ల్యాం తృతీయమంత్రః.

3 మం. ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ,
బుద్ధిం తు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవ చ.
ఇంద్రియాణి హయానాహుః విషయాంస్తేషు గోచరాౕ,
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః.

ఈశ్రుతిలో రూపకాలంకారము.

I 164.20 ద్వాసుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే,
తయోరన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకసీతి.

టీ. శోభనములైన రెక్కలుగలవి కలిసియుండునవి పరస్పరమైత్రిగలవి యగు రెండు పక్షు లొకచెట్టు నాశ్రయించియున్నవి. ఆ రెండుపక్షులలో నొకటి రుచిగలఫలము నాస్వాదించుచున్నది. మరియొకపక్షి యేమియు దినకుండ బ్రకాశించుచున్నది. ఈ శ్రుతిని జగన్నాథపండితుడు రసగంగాధరములో అలంకారప్రకరణమందు అతిశయోక్త్యలంకార మునకు ఉదాహరణముగా నిచ్చెను. "విషయిణా విషయశ్చ నిగరణం అతిశయః తస్యోక్తిః అతిశయోక్తిః" అని లక్షణము చెప్పెను. ఇచట నుపమానమగుపక్షులచే నుపమేయమగు "జీవాత్మపరమాత్మలు ఉపమానమగు వృక్షశబ్దముచే నుపమేయమగు శరీరమును నిగీర్ణము లైనవి.

ఇంద్రియేభ్యః పరా హ్యర్థా అర్థేభ్యశ్చ పరం మనః,
మనసశ్చ పరా బుద్ధిః బుద్ధేరాత్మా మహాన్పరః.
మహతః పరమవ్యక్తమవ్యక్తాత్పురుషః పరః,
పురుషాన్న పరం కించిత్ సా కాష్ఠా సా పరా గతిః.

పై శ్రుతిలో నశ్వములుగా రూపితములైన ఇంద్రియములకంటె మార్గములుగా బోల్పబడిన విషయములు వశపర్చుకొనుటయందు కష్టమైనవి. ఏలయనగా, జితేంద్రియుని గూడ విషయసన్నిధియందు దుర్నిగ్రహములగు నింద్రియములు లోభపెట్టి ఆకర్షించును. విషయములకంటె మనస్సు వశపర్చుకొనుటయందు హెచ్చు కష్టము కలిగించును. ఎట్లన: మనస్సు విషయములఁ గోరునదియై యుండగా విషయాసన్నిధానము మనఃప్రవృత్తి నడ్డ లేదు. మనస్సుకంటె సారథిగా రూపితమైన బుద్ధిని వశపర్చుకొనుట మిక్కిలి కష్టము. బుద్ధికంటెఁ గర్తృత్వముగలవాడగుటచే ప్రధానుడగునాత్మను వశపర్చుకొనుట మరింత కష్టము. జీవుడు సకలపురుషార్థసాధనమునకు శరీరాయత్తస్థితి గలవాడుగావున వానికంటె శరీరము వశపర్చుకొనుట ఎక్కువ కష్టము. అంతకంటె సర్వాంతరాత్మయగు పరమ పురుషుని వశపర్చుకొనుట మిక్కిలి కష్టము. ఇట్లుత్తరోత్తరముగా నొకదానికంటె మరియొకటి వశపర్చుకొనుటయందు గష్టమైనదని చెప్పఁబడినది. దీనికి సారాలంకారమని పేరు. "ఉత్తరోత్తరముత్కర్షః సార ఇత్యభిధీయతే" అని దానిలక్షణము. ఇదియు రసగం గాధరకారునిచే సారాలంకారమున కుదాహరణముగా నియ్యబడెను. "విజ్ఞానసారథిర్యస్తు మనఃప్రగ్రహవాన్నరః, సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదం, ప్రణవో ధను శ్శరో. హ్యాత్మా బ్రహ్మ తల్లక్ష్యముచ్యతే, అప్రమత్తేన వేద్ధవ్యం శరవత్తన్మయో భవేత్." (ద్వి-ముం-ఖం-4)ఇత్యాదులయందు రూపకాలంకారము. "ఆసీనో దూరం వ్రజతి శయానో

యాతి సర్వతః, కస్తం మదామదం దేవం మదన్యో జ్ఞాతుమిచ్ఛతి." (కఠ-ప్ర-అ-ద్వి-వ-21) ఇత్యాదులయందు విరోధాభాసము గానవచ్చుచున్నది. శ్వేతాశ్వతరోపనిషత్ (ప్ర-అ-4.) "తమేకనేమిం త్రివృతం షోడశాంతం శతార్ధారం వింశతిప్రత్యరాభిః, అష్టకైః షడ్భిః విశ్వరూపైకపాశం త్రిమార్గభేదం ద్వినిమిత్తైకమోహం."

టీ. కారణావస్థయనెడు నొకకమ్మి గలది, సత్వరజస్తమస్సులనెడు మూడుచుట్లతో గూడినది, వికారరూపములగు పంచభూతములు, ఏకాదశేంద్రియములు అనుపదునారు అరములు గలది, దశేంద్రియములు, వానివిషయములు, అనుఇరువదిపైపూటీలు గలది, ఆరుఅష్టకములతో గూడినది, నానారూపమగుకామమనెడు త్రాడుగలది, పుణ్యపాపములు రెండును నిమిత్తముగాగల మోహమును బుట్టించునది, మూడుమార్గములయందుఁ బోవునది అగు చక్రమువలె నున్న కారణబ్రహ్మను ధ్యానింపుచున్నాను,- (సేతా-అ-౫.) "పంచస్రోతోంబుం పంచయోన్యుగ్రవక్త్రాం పంచప్రాణోర్మిం పంచబుధ్యాదిమూలాం, పంచావర్తాం పంచదుఃఖౌఘవేగాం పంచాశద్భేదాం పంచపర్వామధీమః."

టీ. చక్షురాది ఇంద్రియము లను పంచప్రవాహములు కలది, అయిదుమూలములచే నుగ్రమైనది, వక్రమైనది, పంచప్రాణములనెడు తరంగములు గలది, పంచవిషయములనెడు (శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు,) సుళ్లుగలది, అయిదువిధములగు దుఃఖములను (గర్భ, జన్మ, జరా, వ్యాధి, మరణములు,) ప్రవాహ వేగములు కలది, లజ్జాఘృణాదులగు నేబది భేదములతోఁ గూడిన బుద్ధులే శాఖలుగా గలది, అవిద్యాస్మితారాగద్వేషాభినివేశములనెడు పంచసోపానములతో గూడినది యగునొకనదివలె నున్న పరబ్రహ్మమును ధ్యానింపుచున్నాము.- ఈరెండుమంత్రములలో మొదటిదానియందు సంసారమును చక్రరూపముగాను, రెండవదానియందు నదిగాను, నిరూపించి చెప్పుటచే రూపకాలంకారము, ఇది సావయవరూపకము. పైఁ జూపింపబడినట్లు వేదమందు, ఉపనిషత్తులయందేగాక స్మృతులయందు గూడ విరళముగా నలంకారములు కానవచ్చుచున్నవి. "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమి, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః." అని భగవద్గీత. దీనిలో నతిశయోక్త్యలంకారము. కవికర్మనుగురించి శ్రుతియే యిట్లు చెప్పుచున్నది. "ఏకశ్శబ్దః సుష్ఠుప్రయుక్తః స్వర్గే లోకే కామధుక్ భవతి సమ్యక్ జ్ఞాతః." అనుటచే, జాతివాచకములనియుఁ, గ్రియావాచకములనియు, గుణవాచకములనియు, యదృచ్ఛాశబ్దములనియు నాలుగుతరగతులుగా విభజింపబడిన శబ్దములఁ జక్కఁగాఁ దెలిసికొని బాగుగా బ్రయోగింపబడినయెడల నైహికాముష్మికఫలప్రదాయి యగును. "బ్రహ్మైవ

రసః." "రసో వై సః" "రసగ్గ్ హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి" ఇత్యాది శ్రుతులచేఁ గావ్యజీవాతువగు రసముకూడ నుపదేశింపబడుచున్నది.

అతిప్రాచీనమగు వేదమం దీయలంకారము లిట్లు యాదృచ్ఛికముగా బ్రయోగింపబడియున్నను వీనికి సరియైన లక్షణనిరూపణము, వీనిలో నవాంతర భేదములు, వీనివర్గీకరణము (Classification) మొదలగునవి వేదమునకు దరువాత నెంతో దీర్ఘకాలమున కేర్పడినవి. ఇట్లు కాలక్రమమునఁ గావ్యసంబంధమగు సామగ్రి భాషలోఁ బెరిగినకొలది మనుష్యులు కావ్యలక్షణములను, అలంకారలక్షణములను నిరూపించుటకుఁ దగిన నిర్వచనముల నాలోచింప దొడఁగిరి. క్రీస్తుశకమునకు మున్నే కొన్ని యీయలంకారశాస్త్రపుగురుతులు వాఙ్మయమం దున్నట్లే వ్యాసమునందు సమర్థింపబడును.

వ్యాకరణకర్తయగు పాణిన్యాచార్యుడు కూడ నొకకవిగా నున్నట్లు గ్రంథనిదర్శనమువలనఁ గానవచ్చుచున్నది. ఔచిత్యవిచారచర్చాద్యనేకగ్రంథకర్తయగు క్షేమేంద్రుడు తాను రచించిన సువృత్తతిలకమను గ్రంథమందు పాణినికి ఉపజాతివృత్తరచనయం దసామాన్యప్రావీణ్యము గలదని చెప్పియున్నాఁడు. "స్పృహణీయత్వచరితం పాణినేరుపమాదిభిః, చమత్కారైకసారాభిరుద్యానస్యేవ జాతిభిః." (3-30) రుద్రటుని కావ్యాలంకారమునకు వ్యాఖ్యానము వ్రాసిన "నమిసాధు" అనునొక జైనపండితుఁడు పాణిని పాతాళవిజయమను నొకమహాకావ్యమును రచించెనని చెప్పియున్నాఁడు. మహాకవులు కూడ ప్రామాదికముగాఁ దమకృతులయం దపశబ్దములను ప్రయోగించిరనుసందర్భమం దిట్లు వ్రాసెను. "తథాహి పాణినేః పాతాళవిజయే మహాకావ్యే." "సంధ్యావధూం గృహ్య కరేణ"ఇత్యత్ర గృహ్యేతి క్త్వోల్యబాదేశః (2-8) మరియొకచోట నిట్టిసందర్భమందే "గతేఽర్ధరాత్రే పరి మందమందం గర్జంతి యత్ప్రావృషి కాలమేఘాః, అపశ్యతీ వత్సమివేందుబింబం తచ్ఛర్వరీ గౌరివ హుంకరోతి." ఇచట అపశ్యతీ అనునది అపప్రయోగము. వల్లభదేవునిసుభాషితావళి యందు శార్ఙ్గధరపద్ధతియందుఁ బాణిని రచించినశ్లోకములు ఉదాహరింపఁబడినవి.

"శుద్ధస్వభావాన్యపి సంహవతాని నినాయ భేదం కుముదాని చంద్రః, అవాప్య వృద్ధిం మలినాంతరాత్మా జడో భవేత్ కస్య గుణాయ వక్రః." (సుభాషి.336 పుట 1968 శ్లో)

"ఉపోఢరాగేణ విలోలతారకం తథా గృహీతం శశినా నిశాముఖం, యథా సమస్తం తిమిరాంశుకం తయా పురోఽపి రాగాద్గలితం న లక్షితం." (సుభాషిత. పుట 336-1969 శ్లో.)

వ్యంగ్యముచే ననుగతమగు వాచ్యమే ప్రధానముగాఁ బ్రతీయమాన మగునని చెప్పుట కానందవర్ధనాచార్యుఁడు పైశ్లోకమును ధ్వన్యాలోకమం దుదాహరించెను.

"ఐంద్రం ధనుః పాండుపయోధరేణ శరద్దధానార్ద్రనఖక్షతాభం, ప్రసాదయంతీ సకలంకమిందుం తాపం రవేరభ్యధికం చకార" ఈశ్లోకమును వామనుఁ డలంకార సూత్రములో నాక్షేపాలంకారమున కుదాహరణముగా నిచ్చెను. అమరకోశవ్యాఖ్యానములో రాయమకుటుఁడు "పయః పృషంతిభిః స్పృష్టా వాంతి వాహీః శనైశ్శనైః" అను నొక శ్లోకము నుదాహరించి యిది పాణిని వ్రాసిన జాంబవతీవిజయములోనిదని చెప్పెను. ఇందువలనఁ బాణిని మరియొక కావ్యమును కూడ వ్రాసినట్లు తెలియవచ్చుచున్నది. కాని పదునొకండవశతాబ్దియందు ఈగ్రంథకర్తలు ప్రాచీనతముఁడగు పాణినిగురించి వ్రాసిన వ్రాతలయందు విశ్వాసముగలవారలయి యుండుట కొంత సాహసకృత్యమని నాఅభిప్రాయము. వైయాకరణ పాణినికంటె గవిపాణిని భిన్నుఁడనియే మనము నమ్మవలెను. వైయాకరణ పాణినియే పాతాళవిజయమను కావ్యమును వ్రాసినవాఁడైనచో "గృహ్య" "అపశ్యతీ" మొదలగు నపశబ్దములను బ్రయోగించునా? కావున వీరిద్ద రొక్కటి గానేరరు. అయినను నమ్మదగినప్రమాణము మనకు లభించువరకు వీరుభయు లొక్కటియే అని యొప్పుకొందము. ఏలయనగా నట్లుకానిచో నాప్తతములు విమర్శకులునగు నమిసాధుక్షేమేంద్రులు పూర్వోక్తకావ్యకర్తృత్వమును పాణినికారోపింతురా? సూక్తికర్ణామృతమును వ్రాసిన రాజశేఖరుఁడు "నమః పాణినయే తస్మై యస్య రుద్రప్రసాదతః ఆదౌ వ్యాకరణం కావ్యమను జాంబవతీజయమ్" అను శ్లోకమందు పాణిని మహావైయాకరణుడై యుండుటయే కాక మహాకవి యైయున్నాఁడనియు, జాంబవతీవిజయమను కావ్యమును రచించెననియుఁ జెప్పుచున్నాఁడు. "సుబంధౌ భక్తిర్నః క ఇహ రఘుకారే నరమతే, ధృతిర్దాక్షీపుత్రే హరతి హరిచంద్రోఽపి హృదయం, విశుద్ధోక్తిశ్శూరః ప్రకృతిమధురా భారవిగిర, స్తదాప్యంతర్మోదం కమపి భవభూతిర్వితనుతే" అని సూక్తికర్ణామృతములోఁ జెప్పబడిన దాక్షీపుత్రశబ్దము పాణినినే చెప్పునుగావున దీనిచేఁ బూర్వోక్తాంశము మరింత బలపరచఁబడుచున్నది.

కాత్యాయనునికాలమందుగాని లేక యతనికాలముకంటె ముందుగాని ఆఖ్యాయికలని వ్యవహరింపఁబడెడు గద్యకావ్యవిశేషము లుండెనని రుజువుచేయుటకుఁ గాత్యాయనుని వార్తికములే తగినంత సాక్ష్యమిచ్చుచున్నవి.

"అధికృత్య కృతే గ్రంథే"(4-3-83) అనుసూత్రముతో సంబంధించిన "లుబాఖ్యాయికాభ్యో బహుళం" అను వార్తికమువలన నీయంశము స్పష్టమగుచున్నది. వరరుచి కాత్యాయను లొక్కటియేయని తెలుపుటకు "తస్యాహం వసుదత్తాయాం జాతః శ్రుతిధరాభిధః, కాత్యాయనో వరరుచిశ్చేత్యన్వర్థకృతాహ్వయః" (1-2-15) అను మహత్కథామంజరీ శ్లోకమే మనకుఁ బ్రమాణము. సుభాషితావళిలో వరరుచి వ్రాసినవని యనేకశ్లోకములు చూపింపఁబడినవి. రాజశేఖరుని సూక్తిముక్తావళిలోని యొకశ్లోకము వరరుచి కంఠాభరణమును నొకకావ్యమును రచించినట్లు చెప్పుచున్నది. "యథార్థతాకథం నామ్ని మాభూద్వరరుచేరిః, వ్యధాత్ కంఠాభరణం యస్సదా రోహణప్రియః" "న్యంచచ్చుంచల చంచుచుంబన చలచ్చూడాగ్రముగ్రం పవత్ చక్రాకారకరాళకేసర శతాస్ఫారస్ఫురత్కంధరం, వారం వారముదంఘ్రిచంచల ఘనభ్రస్యన్న ఖక్షుణ్ణయోర్దృష్ట్వా కుక్కుటయోః ద్వయోః స్థితిరతి క్రూరక్రమంయుధ్యతోః"—"అపి సదివసః స్యాద్యత్ర ప్రియాముఖపంకజే మధు మధుకరీ వాస్మద్ధ్రిష్టిర్వికాసిని పాస్యతి, తదను చ మృదుస్నిగ్ధాలాపక్రమాహితనర్మణః సురత సచివైరంగైః స్సంగో మమాపి భవిష్యతి." పైనఁజెప్పబడిన యీనిదర్శనములవలనఁ గ్రీస్తుశకమునకు మున్ను నాల్గవశతాబ్దమందుఁ గావ్యము లున్నట్లు నిశ్చయింపఁబడుచున్నవి. క్రీస్తుశకమునకుముందు రెండవశకమువాఁడైన మహాభాష్యకారుని (పతంజలి) కాలమందు ప్రజలకుఁ గవనోత్సాహము మెండుగా నున్నట్లు కానవచ్చుచున్నది. "లుబాఖ్యాయికాభ్యో బహుళం" అనువార్తికమునకు వ్యాఖ్యానము వ్రాయుచుఁ బతంజలి వాసవదత్త, సుమనోత్తర, భయిమరథి అను మూఁడుఆఖ్యాయికలను చెప్పెను.

"అధికృత్య కృతే గ్రంథేత్యత్ర ఆఖ్యాయికాభ్యో బహుళం లుబ్వక్తవ్యః" వాసవదత్తా సుమనోత్తర న చ భవతి భయిమరథి (Kielhorn's Edition of Maha Bhashya Vol II Page 213). పతంజలి మహాభాష్యములో "కంసవధ, బలిబంధము" అను రెండు కావ్యములను చెప్పెను. "కంసవధ మాచష్టే కంసం ఘాతయతి, బలిబంధమాచష్టే బలిం బంధయతి." (M B. Vol II P 34.)

మహాభాష్యములో పతంజలి తనకంటెఁ బ్రాచీనులైనకవులు గ్రంథకర్తలు వ్రాసిన గ్రంథములనుండి వందలకొలఁది శ్లోకముల నుదాహరించెను. అందులోఁ గొన్ని మిక్కిలి సొగసైనవి. చారిత్రాంశవిశేషములను(Historical Events) దెలుపునవి. వీనిలో గొన్నింటి నిచట వ్రాయుచున్నాను. "అసిద్వితీయోఽనుససార పాండవం", "సంకర్షణద్వితీయస్య

బలం కృష్ణస్య వర్ధతాం" (M. B. Vol I, P 426). "జఘాన కంసం కిల వాసుదేవః" (M. B. Vol II, P. 119) "జనార్దనస్త్వాత్మచతుర్థ ఏవ" (M. B. Vol III, P. 143)

ప్రియాం మయూరః ప్రతినర్నృతీతి యద్వ్యక్తం నరవర నర్నృతీషి వ్యాప్తః (Vol. III., పే. 338) ఆత్మం భరిశ్చరతి యాథమసేవమానః (Vol III., పే 102) బుభుక్షితం న ప్రతి భాతి కించిత్ (Vol I. పే. 144) ఆవనాంతాదోదకాంతాత్ప్రియం పాంథమనువ్రజేత్ (Vol I పే. 340) కాలః పచతి భూతాని కాలస్సంహరతి ప్రజాః, కాలః పక్వోయమన్వేతి యస్తం వేద స వేదవిత్. (Vol. I, పే. 167) కేమే సుభిక్షే కృతసంచయాని పూర్ణాని రాజ్ఞాం వినయంతి కోపం (Vol II, 438) ఏతి జీవంతమానందో నరం వర్షశతాదపి (Vol I పే. 277) వరతను సంప్రవదంతి కుక్కుటాః (Vol I పే. 283).

పతంజలికి దరువాత జెప్పదగిన మహాకావ్యములు రామాయణము, మహాభారతము. వీనిప్రణయనకాలనిర్ణయమునుగురించి విమర్శకులకు భిన్నాభిప్రాయములున్నవి. క్రీస్తుశకప్రారంభమందు రచింపబడినవని చెప్పినచో నంత వివాదాధ్యాసితమై యుండదు. కవితారామణీయకపరసీమలై వెలయు శ్లోకము లీరెండుకావ్యములలో నచ్చటచ్చట బహుళముగా గానవచ్చుచున్నవి. ఆనందవర్ధనుడు మొదలగు నాలంకారికులు రామాయణ మహాభారతశ్లోకములను తాము రచించిన అలంకారగ్రంథములలో ననేకస్థలములయం దుదాహరించియున్నారు. రామాయణమందు మిక్కిలి సుందరమైనవర్ణనలు మెండుగా నున్నవి. యుద్ధకాండ నాల్గవసర్గలో నున్న సముద్రవర్ణనము, సుందరకాండలో చంద్రవర్ణనము, కిష్కింధకాండలో వర్షర్తుశరదృతువులవర్ణనము, మిగుల మనోహరము లై యున్నవి.

"హసంతమివ ఫేనౌఘైః నృత్యంతమివ చోర్మిభిః, చంద్రోదయసముద్ధూతం ప్రతిచంద్రసమాకులం, పినష్టీవ తరంగాగ్రైః సముద్రః ఫేనచందనం, తదాదాయ కరైరిందుః లింపతీవ దిగంగనాః. (యుద్ధ 4-సర్గ-శ్లో 112-13)

హంసో యథా రాజతపంజరస్థః సింహో యథా మందరకందరస్థః, వీరో యథా గర్వితకుంజరస్థః చంద్రో విభ్రాజ తథాంబరస్థః. స్థితః కకుద్మానివ తీక్ష్ణశృంగో మహాచల శ్శ్వేత ఇవోచ్చశృంగః, హస్తీవ జాంబూనదబద్ధశృంగో రరాజ చంద్రః పరిపూర్ణశృంగః. శిలాతలం ప్రాప్య యథా మృగేంద్రో మహారణం ప్రాప్య యథా గజేంద్రః, రాజ్యం సమాసాద్య యథా నరేంద్రః తథా ప్రకాశో విరరాజ చంద్రః. (సుందర 5-స.) ఇట్టిలోకోత్తర వర్ణనాలంకృత కవితామయములగు నీభారతరామాయణములే తరువాత బుట్టిన మహాకవు

లగు, కాళిదాస, భవభూతుల కవిత్వమునకుఁ బ్రౌఢినిఁ గలిగించినవి. "ఇతిహాసోత్తమా దస్మాత్ జాయంతే కవిబుద్ధయః, అస్య కావ్యస్య కవయో న సమర్థా విశేషణే, ఇదం కవి వరైస్సర్వైః ఆఖ్యానముపజీవ్యతే. (ఆది II) అని భారతమునుగురించియు, "కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్, రసైశ్శృంగారకారుణ్యహాస్యవీర భయానకైః, రౌద్రాదిభిశ్చ సంయుక్తం కావ్యమేతదగాయతాం. (బాలకా-4-సర్గ) అని రామాయణమునుగురించియు, చెప్పఁబడియున్నది. దశరూపకకారుఁడగు ధనంజయుఁడు బృహత్కథ మొదలగువానినుండి కథలను దీసికొని నాటకములను వ్రాయుఁడని కవుల కుప దేశించుచున్నాఁడు.—

"ఇత్యాద్యశేషమిహ వస్తువిభేదజాతం రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ, ఆసూత్రయేత్తదను నేతృరసానుగుణ్యాచ్చిత్రాం కథాం ఉచితచారువచః ప్రపంచైః. (దశరూ 1 పరి-1 శ్లో.)

క్రీస్తుశకప్రారంభమందు భరతఖండములో నత్యుదారరచనతోఁగూడిన గద్యపద్య కావ్యములు నిర్మింపఁబడినవని ప్రాచీనచరిత్రాంశశోధనలవలన (Historical Research) నూతనముగాఁ గనుఁగొనఁబడినది. క్రీస్తుశకము రెండవవత్సరశతకములో వ్రాయఁబడిన గిర్నార్ శాసనములలో నొకదానియందు దీర్ఘసమాసభూయిష్ఠము, ననుప్రాసయమకాది శబ్దాలంకారశోభితము, నుపమారూపకాద్యర్థాలంకారప్రచురము నగునొకగద్య కలదు. దానిలో రుద్రదాముఁడనుమహాక్షత్రపుఁడు మహోద్ధతిచే వీరమాన్యులై తనకు లోఁబడని రాజులనందరిని వధించెననియు, నతఁడు వ్యాకరణము, మీమాంస, సంగీతము, తర్కము, మొదలగుశాస్త్రములలో నతిప్రవీణుఁ డనియు వర్ణింపఁబడినది.

"సర్వత్రావిష్కృతవీరశబ్దజాతోత్సేకావిధేయానాం యౌధేయానాం ప్రసహ్యోత్సాద నేన శబ్దార్థగాంధర్వన్యాయాద్యానాం విద్యానాం మహతీనాం పఠనధారణవిజ్ఞానప్రయో గావాప్తవిపులకీర్తినా. (Indian Epigraphy Vol 8, P 44)

తరువాత నాల్గవశతాబ్దములోని యొకశాసనములో బాణుని గద్యశైలిని మించిన యొక గద్య కలదు. దానిలో "విద్వజ్జనోపజీవ్యానేకకావ్యక్రియాభిః ప్రతిష్ఠితకవిరాజ శబ్దస్య" అని సకలవిద్వాంసులకుపజీవ్యములగు ననేక కావ్యములను రచించినవాఁడగుటచేఁ గవిరాజనిపించుకొనిన సముద్రగుప్తుఁ డిందులో వర్ణింపఁబడెను.

ఆశాసనములలోనే సముద్రగుప్తునికీర్తి "హరజటాజూటవినిర్గతనిరర్గళప్రవహ ద్గంగాప్రవాహోమివా" అని వర్ణింపబడెను. "కృపణదీనానాథాతురజనోద్ధరణసమంత్ర దీక్షా

ద్యుపగతమనసఃసమిద్ధస్య విగ్రహావతో లోకానుగ్రహస్య ధనదవరుణేంద్రాంతకసమస్య, స్వభుజబలవిజితానేకనరపతివిభవప్రత్యర్పణనిత్యవ్యాపృతాయుతపురుషస్య. (Dr : Fleet's Gupta Inscriptions)

క్రీస్తుశకమునకు ముందువెనుక శతాబ్దములయం దలంకారశాస్త్రమనునొక శాస్త్రము నేర్పాటుచేయుటకుఁ దగినంతకావ్యసామగ్రి వృద్ధినొందినదని పూర్వోక్తాంశములవలన స్పష్టమగుచున్నది. కావ్యలక్షణము వానినియమములు వానివిధులు అలంకారముల లక్షణము వానినియమములు మొదలగువానినిఁ బరిష్కరించి వ్రాయుట క్రీస్తుశకప్రారంభమందు మొదలైనదని యిఁక చెప్పఁబోవుచున్నాను. నూతనకావ్యరచన, అట్టికావ్యమునకు లక్షణమును జెప్పుసూత్రములు ఏకకాలమందే బయలుదేరినవి.

మొట్టమొదట యాస్కుఁడు నిరుక్తమం దుపమ కిట్లు లక్షణముఁ జెప్పియున్నాఁడు.— "అథాత ఉపమా,యదతతు తత్సదృశమితి గార్గ్యస్తవానాం కర్మ ద్యాయసాగు ణేన ప్రఖ్యాతతమేన వాతమేనవా కనీయాంసం వా ప్రఖ్యాతం వా ఉపనీయతే, అథాసి కనీయసా జ్యాయాంసం" (నిరుక్తం-3) ఇది కావ్యప్రకాశికాకారుఁడగు మమ్మటభట్టు చెప్పిన "సాధర్మ్య ముపమా భేదే" అనులక్షణముతోఁ దుల్యముగా నున్నది. ఉపమానము సుప్రసిద్ధమైనది గాను, గుణబాహుళ్యముగలదిగాసుండవలయునని సాధారణముగా నొకనియమము కలదు. ఉపమేయముకంటె నుపమానముతక్కువది యైయుండుట దోషము. యాస్కుఁడు "జ్యాయసా కనీయాంసం" (పెద్దవస్తువుతోఁ జిన్నవస్తువును బోల్చుట) అని సామాన్యవిషయమును చెప్పి వేదమం దుపమాన ముపమేయముకంటెఁ దర్చుగాఁ దక్కువది యైయుండునని తెలుపుటకు ఋగ్వేదశ్రుతి నొకదాని నుదాహరించెను. దీనిలో నశ్వినీదేవతలు దొంగలతో నుపమింపఁబడిరి.

X-4-6 "తనూత్యజేన తస్కరాపనర్గూరశనాభిర్దశభిరభ్యధీతామ్, ఇయంతే అగ్నే నవ్యసీ మనీషా యుక్ష్వా రథం న శుచయద్భిరంగైః.

పాణిని "ఉపమితం వ్యాఘ్రాదిభిః సామాన్యాప్రయోగే" (2-1-56) "ఉపమానాని సామాన్యవచనైః." (2-1-55) అను సూత్రములయం దుపమానోపమేయసామాన్యధర్మములనుబేర్కొనెను. బాదరాయణుని వేదాంతసూత్రములయం దుపమ,రూపకము గానవచ్చుచున్నది. "అత ఏవ చోపమా సూర్యకాదివత్." (3-2-18) పరబ్రహ్మము నానావిధస్థానములయం దున్నను, ఆయాయిస్థానములయందుండు దోషము లీతని కంటవు. ఈహేతువును బట్టియే శాస్త్రములయం దచ్చటచ్చట పరబ్రహ్మము జలమందుగాని దర్పణమందుగాని

ప్రతిఫలించిన సూర్యాదులతోఁ బోల్పఁబడియె. "ఆనుమానికమప్యేకేషామితి చేన్న శరీర రూపకవిన్యస్త గృహీతేర్దర్శయతి చ." (1-4-1) ఈసూత్రమునకు విషయవాక్యమైన "ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవ చ" అను ఉపనిషద్వాక్యమందు ఆత్మను రథికుని గాను, శరీరమును రథముగాను, బుద్ధిని సారథిగాను మనస్సును పగ్గముగాను నిరూపించి యొకరూపకము చెప్పఁబడెను. భరతుఁడు నాట్యశాస్త్రమం దుపమ,రూపకము,దీపకము, యమకము, నని నాలుగే అలంకారములని చెప్పినాఁడు. "ఉపమా దీపకం చైవ రూపకం యమకం తథా, కావ్యస్యైతే హ్యలంకారాః శ్చత్వారః పరికీర్తితాః." (నాట్యశాస్త్రము. 16-41)

భరతముని వ్రాసిన నాట్యశాస్త్రము క్రీస్తుకు దరువాత పంచమ శతకముకంటె ప్రాచీనము కాదని అలంకారశాస్త్రప్రణేతలకాలమును నిర్ణయించుప్రకరణమందు నిర్ణయింపఁబడును. అశ్వఘోషునిబుద్ధచరిత్ర నలంకారశాస్త్రవిషయములు కొన్ని పుట్టినతరువాతకాలమందు రచింపఁబడియున్నట్లు కానవచ్చుచున్నది. ప్రతిసర్గకుఁ గొనసుండుశ్లోకములాకాలమందుఁ బ్రచురముగా నున్నవృత్తములకంటె విలక్షణమైన వృత్తములలో వ్రాయఁబడినవి. ప్రతికవియు ననేకస్థలములయందు శబ్దాడంబరమయ మగుకవనము చెప్పుటకే ప్రయత్నించును. "హరతురంగతురంగవత్తురంగ" ఇత్యాద్యనుప్రాసములఁ దరుచుగా వాడుకచేయును. బుద్ధిచరిత్రకారుఁడు యథాసంఖ్యాలంకారమును వాడుకచేయుటయందు మిక్కిలి యభిలాషగలవాఁడు. ఈబుద్ధచరిత్ర మయిదవశతాబ్దిలో చైనాభాషలోను, ఏడవశతాబ్దిలో టిబెటుభాషలోను, అనువదింపఁబడెను. కావున నిది క్రీస్తుశక మైదవశతాబ్దికంటె ముందు వ్రాయఁబడినది యై యుండవలెను. సుబంధుఁడు వాసవదత్తలో శ్లేషవిరోధాభాసము ఉత్ప్రేక్ష మొదలగు నలంకారములను వ్రాసెను. "ప్రత్యక్షరశ్లేషమయప్రబంధవిన్యాసవైదగ్ధ్యవిధిర్నిబంధం" అనుశ్లోకమం దీసుబంధుఁడు శ్లేషయం దతిప్రాగల్భ్యముగలవాఁడనని చెప్పుకొనుచున్నాఁడు. ఇతఁడు సత్కావ్యలక్షణ మిదియని తనగ్రంథములో నిట్లు చెప్పెను. "సత్కవికావ్యబంధఇవానాబద్ధతుహినిపాతః, దీర్ఘోచ్ఛ్వాసరచనాకులంసుశ్లేషవక్త్రఘటనాపటుసత్కావ్యవిరచనమివ." (పాదపూర్ణార్థమై వాడుకచేయబడు తుహి మొదలగు నిపాతలులేనిది ఉచ్ఛ్వాసము లనబడు గ్రంథవిచ్ఛేదములు గలది. శ్లేషతోగూడిన వక్త్ర మనువృత్తవిశేషము గలది,) శృంఖలాబంధము, ఉత్ప్రేక్ష, ఆక్షేపము మొదలగు నలంకారముల నిందుఁ బొందుపరచెను. "శృంఖలాబంధోవర్ణగ్రథనాసు ఉత్ప్రేక్షాక్షేపాకావ్యాలంకారేషు" కావ్యాలంకారసూత్రవృత్తిలో వామనుఁడు "విపరీత ముత్కలికాప్రాయం" (1-3 25) అనుసూత్రమునకు "కులిశశిఖరఖరనఖరప్రచయప్రచం

డచపేటాపాటితమత్తమాతంగకుంభస్థలగళన్మదచ్ఛటాచ్ఛురిత చారుకేసర భారభాసురముఖే కేసరిణి" అను వాసవదత్తగద్యభాగము నుదాహరించుటవలన సుబంధుఁ డారవశతాబ్దము కంటె దరువాతవాఁడుకాఁడని స్పష్టముగాఁ జెప్పవచ్చును. "కవీనామగళద్దర్పోనూనం వాసవదత్తయా శక్త్యేవ పాండుపుత్రాణాం గతయా కర్ణగోచరం"అని బాణుఁడు తన హర్షచరిత్రో పోద్ఘాతమందు సుబంధుని గొనియాఁడెను. కావున శృంఖలాబంధము, శ్లేష, ఆక్షేపము, ఉత్ప్రేక్ష, వానిలక్షణము మొదలగునవి ఆరవశతాబ్దమునకు చాలకాలము ముందే వాడుక లోనికి వచ్చియున్నవని పూర్వోదాహృతప్రమాణములచే నిశ్చయింపఁబడుచున్నది. బాణకవికాలమున కలంకారశాస్త్రము మిక్కిలి పెరిగినట్లు కానవచ్చుచున్నది, ఏలయనఁ, గాదంబరిలో, 1 అక్షరచ్యుతకము. 2 మాత్రాచ్యుతకము. 3 బిందుమతి. 4 ప్రహేళిక మొదలగు శబ్దచిత్రములు గానవచ్చుచున్నవి.

ఆచార్యదండి స్వకృతకావ్యాదర్శమందు ప్రహేళికలో ననేకావాంతరభేదములను జూపించెను. 1 సమాగత. 2 వంచిత. 3 వియుత్క్రాంత. 4 ప్రముషిత. 5 సమానరూప. 6 పరుష.7 సంఖ్యాత 8 ప్రకల్పిత. 9 నామాస్తంత. 10 నిభృత. 11 సమానశబ్ద. 12 మూఢ. 13,పారిహారికి. 14 ఏకచ్ఛన్న. 15 ఉభయచ్ఛన్న అను మొదలగు ప్రహేళికాభేదములను వ్రాసెను. ఇదివరకే నావ్యాసము ద్రాఘిష్ఠమై యుండుటచే వీనికన్నిటికి లక్షణములను వ్రాయుట గ్రంథవిస్తరహేతువని వెరచి మానితిని.

భట్టికావ్యములోని దశమైకాదశద్వాదశత్రయోదశసర్గలు ప్రత్యేకముగా నలంకారశాస్త్రమున కుదాహరణముగా వ్రాయఁబడినవి. వానిలో పదియవసర్గలో మొదటి ఇరువదియొక్కశ్లోకములచేఁ గ్రమముగా ననుప్రాసము, యమకము, పాదాంతయమకము, పాదాదియమకము, పాదమధ్యయమకము, చక్రవాళయమకము, సముద్గకయమకము, కాంచీయమకము, యమకావళి, అయుగ్మపాదయమకము, పాదాద్యంతయమకము, మిథునయమకము, వృంతయమకము,పుష్పయమకము, పాదాదిమధ్యయమకము, విషమయమకము, మధ్యాంతయమకము, గర్భయమకము, సర్వయమకము, మహాయమకము, ఆద్యంతయమకము, మొదలగు శబ్దాలంకారము లుదాహరింపబడినవి. మిగిలిన ఏబదిరెండు శ్లోకములచే యథాక్రమముగా, నాదిదీపకము, అంతదీపకము, మధ్యదీపకము, రూపకము, దీనిలో నవాంతరభేదములగు, ఉపమాయుక్తరూపకము, ఖండరూపకము, అర్ధరూపకము, ఉపమాయుక్తలలామకము, ఇవోపమ, యథోపమ, సహోపమ, తద్ధితోపమ, లుప్తోపమ, అర్థాంతరన్యాసము, ఆక్షేపము, వ్యతిరేకము, విభావన, సమాసోక్తి, అతిశయోక్తి, యథా

సంఖ్యము, ఉత్ప్రేక్ష, వార్త, (ఇది విశిష్ట నిర్విశిష్ట యని రెండువిధములు) వార్త యనగా, 'స్వభావోక్తిం స్వభావోక్తిరలంకార ఇతి వార్తాం ప్రచక్షతే' ప్రేయము, రసవత్, ఊర్జస్వి, పర్యాయోక్తము, సమాహితము, ఉదారము, శ్లిష్టము, అపహ్నుతి, విశేషోక్తి, వ్యాజస్తుతి, ఉపమారూపకము, తుల్యయోగిత, నిదర్శనము, ఉపమేయోపమ, సంసృష్టి, ఆశీస్సు, హేతువు, నిపుణము. (కనిష్ఠుఁడు జ్యేష్ఠున కుపదేశించుట యనుచితమైనను నిపుణముగాఁ జెప్పబడినది గావున నిది నిపుణాలంకారమని ప్రాచీనులు వ్యవహరించిరి. ఇది ప్రియతరాఖ్యానరూపమగు ప్రేయసిలో నంతర్భూతమని దేవనాథుడు - ఉదాత్తాలంకారాంతర్భూతమని మరికొందరు చెప్పుదురు) మొదలగు నర్థాలంకారము లుదాహరింపఁబడినవి. ప్రాతఃకాలవర్ణనాపరమగు నేకాదశసర్గమంతయుఁ గావ్యమునకు ప్రధానగుణమగు మాధుర్యము నుదాహరించుటకు రచింపఁబడినది. ద్వాదశసర్గలో ప్రబంధవిషయగుణమగు భావికత్వ ముదాహరింపఁబడినది. భావికత్వ మనగా? "భావికత్వమితి ప్రాహుః ప్రబంధవిషయం గుణం, ప్రత్యక్షా ఇవ దృశ్యంతే యత్రార్థాభూతభావినః. చిత్రోదాత్తాద్భుతార్థత్వం కథాయాః స్వభినీతతా, శబ్దానాకులతా చేతి తస్య హేతుం ప్రచక్షతే." (భావికత్వము ప్రబంధమునకు ముఖ్యముగా నుండఁదగినగుణము. ఇందులో భూతభవిష్యదర్థములు కంటియెదుట జరుగుచున్నట్లు వర్ణింపఁబడును. శబ్దములనాకులముగా నుండును. కథ చక్కగా నభివ్యక్తము చేయఁబడును. చిత్రము, ఉదారము, అద్భుతము నగు అర్థము కలిగియుండును.) త్రయోదశసర్గలోఁ బ్రాకృతభాషాసమావేశ ముదాహరింపఁబడినది. అనఁగా నీసర్గలో సమసంస్కృతప్రాకృతభాషతో సేతునిర్మాణము వర్ణింపఁబడినది. ఈభట్టి వలభిరాజైన శ్రీధరసేనుని యాస్థానమందుంటినని తానే కావ్యాంతశ్లోకమునందుఁ జెప్పుకొనుచున్నాఁడు. "కావ్యమిదం విహితం మయా వలభ్యాం శ్రీధరసేన నరేంద్రపాలితాయాం, భవతాన్నృపస్య తస్య క్షేమకరః క్షితిపో యతః ప్రజానాం" భ. కా. 22 సర్గ. 35 శ్లో. శ్రీధరసేనుఁడను పేరుగల వలభిరాజులు నలుగురున్నట్లు శాసనములవలనఁ దెలియవచ్చుచున్నది. కావున భట్టికవి ప్రథమచతుర్థ శ్రీధరసేనులకాలమైన గత 500—650 మధ్యను జీవించినవాఁడై యుండవచ్చును.

ఇట్లుపమారూపకాలంకారములు వానిసాదృశ్యముకల మరికొన్ని యలంకారములు, వానిలక్షణములు చాలకాలముక్రిందటనే యేర్పడియుండెననియుఁ గ్రీస్తుశకమునకు దరువాత శతాబ్దములలోఁ దక్కిన మరికొన్ని యలంకారములు పుట్టి పెరిగెననియు రుజువు చేయుటకుఁ బ్రయత్నించితినిగాని అందుకు నిశ్చాయకమైన దృఢప్రమాణములు లభించలేదు. ఏడవశతాబ్దమునకుఁ బైగా నలంకారశాస్త్రప్రణేత లనేకులు బయలుదేరిరి. వారి

వృత్తాంతము లికముందు నేను వ్రాయ సమకట్టిన అలంకారశాస్త్రచరిత్రలో వివరింపఁబడ గలవు.

అలంకారశబ్దార్థము బహిష్కరించుట కిది యుచితస్థలము. ఈశబ్దమునకు సాధారణ ముగా నందరిచే నొప్పుకొనఁబడిన రెండు అర్థములుగలవు. వానిలో నొకటి విస్తృతము. మరి యొకటి సంకుచితము. ఈరెండర్థములును, వ్యవహారములో నున్నవి. విస్తృతార్థమం దుప యోగింపబడినపు డీశబ్దమునకు 'సొగసు' యని యర్థము. అపుడు కావ్యశోభావహ మగునది యంతయు నీయర్థమం దంతర్భవించును. అలంకారశాస్త్రమను సమస్తపదమందున్న అలం కారశబ్దమున కిదియే అర్థము. రుద్రట కావ్యాలంకారము. వామనకావ్యాలంకారసూత్ర వృత్తి లోనగుగ్రంథముల నామములందున్న అలంకారశబ్దమున కిదియే యర్థము. వామ నుఁడు కావ్యాలంకారసూత్రవృత్తిలో నలంకారమనఁగా "సౌందర్య మలంకారః" అని నిర్వచించెను.

సంకుచితార్థమం దుపమా ద్యలంకారములని యర్థము. ఈయర్థమందే తరుచుగా నీశబ్దము వాడుక చేయఁబడుచున్నది. ఈయుపన్యాసమం దీశబ్దముయొక్క సంకోచార్థమునే స్వీకరించి అలంకారములనుగురించి వ్రాసినగ్రంథకర్తల వృత్తాంతమును బూర్ణముగా దెలియజేయ నిశ్చయించినాను.

ఇట్లీశాస్త్రము వేదములు మొదలుకొని పైనిగనుపరచినట్లు ఉపనిషత్తులు, రామాయ ణాదికావ్యములు, పురాణములు మొదలగువానియం దంకురించి పిదప తొల్లిట మమ్మట రుద్రటహేమచంద్రాదుల కాలమునకు గొంతపెరిగి నవీనులగు సాహిత్యదర్పణకారుఁడు మొదలగువారికాలమునకు రసము, వ్యంగ్యము, గుణములు, దోషములు మొదలగు వానితో శతశాఖముగాఁ బెరిగినది.

# ర స వా ద ము

లే క

## (సహృదయహృదయావలోకనము)

శ్రీ భాగవతుల కుటుంబరావుగారు, M.A , సాహిత్యశిరోమణి, మచిలీపట్నము.

కావ్యము పఠించునపుడు సహృదయునకును, నాటక మవలోకించునపుడు ప్రేక్షకుల కందఱకును, అనిర్వచనీయమగు నొకయానందము కలుగుననుట సర్వజగద్విదితము. అందును కరుణరసప్రధానమగు నాటకప్రదర్శన మవలోకించుచో నెక్కుడగు సంతస ముదయించును. ఈ యానందము కలుగుటకు కారణమేమి ? ఆనందస్వరూప మెట్టిది? కరుణరసప్రధానమగు ప్రదర్శనముల పరికించునప్పుడు కూడ శోకము కలుగుటకు బదులు ముదమే యుదయించుటకు హేతువేమి యనుప్రశ్నలు ప్రతివిమర్శకుని హృదయమునను పొడసూపును. మన దేశమందుకూడ పెక్కుఱు విమర్శకులు పలుపలు తెఱగుల నీప్రశ్నలకు సమాధాన మొసంగిరి. పాఠకప్రేక్షకుల కుదయించు నీయానందమునే 'రసమని' యందురు. ఈరసతత్త్వమును గూర్చి విమర్శించినవారిలో ప్రథముడు భరతముని. ఈభరతముని ప్రణీతమగు నాట్యశాస్త్ర మందు రసోత్పత్తినిగుఱించి సూత్ర మొండు కాననగు. "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" యనునదే రససూత్రము నాబడు. ఈసూత్రముపైని నాలుగు ప్రసిద్ధములగు వ్యాఖ్యానములు కలవు. ఈనాలుగువ్యాఖ్యానములలోని సారమును గ్రహించుటకుఁ బూర్వము, భరతముని యేయభిప్రాయములో నీసూత్రమును రచించెనో యరయ నగు.

**భరతముని మతము**—సామాన్యముగా చూచుచో, "విభావములయొక్కయు అనుభావములయొక్కయు, వ్యభిచారిభావములయొక్కయు సంయోగమువలని రసాస్వాదన కలుగును." అని పైనుదహరించిన రససూత్రమున కర్థము చెప్పనగు. ఈసూత్రమునందలి, విభావశబ్దమున కర్థమేమి?

**విభావశబ్దార్థము.**—"విభావః కారణం, నిమిత్తం, హేతురితి పర్యాయాః." (నాట్యశాస్త్రము పుట 347) అను భరతమునివాక్యము ననుసరించి విభావశబ్దమునకు "కారణము" అని అర్థము చెప్పనగు. కారణమన దేనికో తెలియవలయును గదా! అభినవ

గుప్తనివ్యాఖ్యయందు "ప్రకరణము ననుసరించి చిత్తవృత్తి యుదయించుటకు హేతువని తెలియుచున్నది. "ప్రకరణాచ్చిత్తవృత్త్యుద్భవహేతుః విషయః విభావశబ్దస్యార్థః."

**అనుభావము.**—వాచికములు, ఆంగికములు, సాత్త్వికములు నగు అభినయములే అనుభావములు. అనగా హృదయములో నున్న భావములను, చిత్తవృత్తులను ప్రకటించుట కుపయోగమగు స్మితవదనము, మధురవచనము, భ్రూక్షేపము కటాక్షము మొదలగునవి.

"తామభినయేత్ స్మితవదనమధురవచన భ్రూక్షేపకటాక్షాదిభి రనుభావైః" "విభావేనాహృతో యోఽర్థ స్త్వనుభావేన గమ్యతే వాగంగసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః."

అనువాక్యములవలని యీభావము స్ఫుటమగుచున్నది. కాన విభావములన చిత్తవృత్తి యుదయించుటకు కారణములనియు అనుభావము లాచిత్తవృత్తులయొక్క కార్యము లనియు తేలుచున్నది.

**వ్యభిచారిభావములు.**—ఏదేని నిమిత్తమువలన నుద్భవించి తత్తదనుభావములచే ప్రకటించుటకు వీలగునవి వ్యభిచారిభావములు ఇవి క్షణకాలికములగు చిత్తవృత్తులు. తక్కుంగలకారణములతో కలిసి ఈ వ్యభిచారిభావములు కూడ రసాభివ్యక్తిహేతువు లగును "వ్యభిచారిభావము" అనుపదముయొక్క యౌగికార్థమే ఈభావమును వ్యక్త పరచును.

"వి అభి ఇత్యేతా వుపసర్గౌ, చర ఇతి గత్యర్థో ధాతుః, వివిధమాభిముఖ్యేన రసేషు చరన్తీతి వ్యభిచారిణః, వాగఙ్గసత్త్వోపేతాన్ప్రయోగే రసాన్నయన్తీతి వ్యభిచారిణః."

**స్థాయిభావములు.**—రస సూత్రార్థము పూర్తిగా తెలియుటకై స్థాయిభావ సాత్త్వికభావశబ్దముల యర్థముల గూడ తెలియుట యావశ్యకమగు. వ్యభిచారిభావముల వలె నస్థిరముగాక స్థిరమైనదై, విభావానుభావవ్యభిచారిభావపరిష్కృత మగునపుడు రస స్వరూపముగా పరిణమించునది స్థాయిభావమునాబడు. ఇచ్చట నొకప్రశ్న కలుగుచున్నది. "ఏవమేతే కావ్యరసాభివ్యక్తిహేతవః ఏకోనపంచాశద్భావాః ప్రత్యవగన్తవ్యాః ఏభ్యశ్చ సామాన్యగుణయోగేన రసా నిష్పద్యన్తే." అనువాక్యమున నలువదితొమ్మిదిభావములును రసాభివ్యక్తిహేతువులే యగుగదా. అగుచో స్థాయిభావముమాత్రమే రసముగా మారు నని చెప్పుటేల? ఈప్రశ్నకు భరతుడు సమాధాన మిచ్చియున్నాడు. విభావానుభావవ్యభిచారిభావములు స్థాయిభావముల నాశ్రయించియుండును. కాన విభావాదులు పరిజనభూత ములు. స్థాయిభావములు నరేంద్రునివంటివి. బహుపరివారజనపరివృతుడైనను నరేంద్రు

డగు పురుషు డొకడే యానరేంద్రనామమును బొందును. ఎంత గొప్పవాడైనను తదాశ్రితు డానరేంద్రనామమును బడయజాలడు. ఆవిధముగనే స్థాయిభావము నాశ్రయించి యుండు విభావాదులు రసనామమును బొందవు.

"బహ్వాశ్రయత్వాత్ స్వామిభూతాః స్థాయినో భావాః. తత్ స్థానీయపురుషగుణభూతా అన్యే భావా స్తాన్గుణతయాశ్రయన్తే......యథా నరేన్ద్రో బహుజనపరివారోఽపి సన్ స ఏవ నామ లభతే నాన్యః సుమహానపి పురుషః తథా విభావానుభావవ్యభిచారిపరివృతః స్థాయీభావో రస నామ లభతే."

**సాత్త్వికభావములు** — మొత్తము నలువది తొమ్మిదిభావములు కలవు. వానిలో నెనిమిది స్థాయిభావములు. ముప్పదిమూడు వ్యభిచారిభావములు. ఎనిమిది సాత్త్వికభావములు. ఈభావములన్నియుకూడ రసాభివ్యక్తిహేతువు లనిగదా పైని చెప్పబడినది. అందు సాత్త్వికభావములుగూడ నుండుటచే వానిలక్షణముగూడ తెలియుట ముఖ్యము. స్తమ్భము, స్వేదము రోమాఞ్చము మొదలగున వెనిమిది సాత్త్వికభావములు. వీనిపేరు చూడ "భావము" అని యుండుటచే చిత్తవృత్తివిశేషములగునట్లు తెలియుచున్నది. కాని స్తమ్భము స్వేదము మొదలగునవి చూడ ననుభావములుగా కనుబడుచున్నవి ఇట్లు నామకరణమునందే లోపమున్నట్లు కనుబడును. మఱియు, ఈభావములనే సాత్త్వికభావము లనుటలో గల యుద్దేశమేమి? మిగిలిన భావములు సత్వహీనములా యని గూడ యడుగవచ్చును గదా. ఈప్రశ్నలకు సమాధాన మీవిధముగా చెప్పుకొనవలయును. స్తమ్భము, స్వేదము, రోమాఞ్చము మొదలగునెనిమిది యనుభావములునే చిత్తవృత్తులయొక్క సూచకములో యాచిత్తవృత్తులు సాత్త్వికభావములు. అనగా నీయెనిమిది యనుభావములకును సూచ్యములగు భావములు సాత్త్వికభావములు. ఇటులే వ్యభిచారిభావములయందు గూడ కానగు. గ్లాని శ్రమ మొదలగునవి వ్యభిచారిభావములుగా పరిగణింపబడినను, వాస్తవముగా నవి యనుభావములే యగుగాన విరోధపరిహారమునకై గ్లానిశ్రమసూచ్యములగు భావములను వ్యభిచారిభావము లందురు. ఈవిధముగనే ప్రస్తుతమందు గూడ హృదయమునకు కలుగు స్తమ్భమును స్వేదమును మనము సాత్త్వికభావము లందుము. ఇవి బాహ్యములగు స్తమ్భాదులచే ప్రకటించబడుచున్నవి. ఇక, మిగిలిన భావములు సత్వహీనములా యనుప్రశ్న మిగిలియున్నది భరతుడగుననియే చెప్పుచున్నాడు. అనగా నీయెనిమిది సాత్త్వికభావములయందును మనస్సున కెంత సత్త్వోద్రేక ముండునో అంత సత్త్వోద్రేకము మిగిలినభావములయందుండదు. అనగా మిగిలినభావములను సత్వము లేకున్నను అభినయించ వీలగును కాని, ఈభావములను మాత్రము సమాహితమనస్కుడు కానిదే ఎవడును అభినయింపలేడు.

"అత్రాహ—కిమన్యే భావాః సత్త్వేన వినా అభినీయన్తే యస్మాదుచ్యతే ఏతే సాత్త్వికా ఇతి. అత్రోచ్యతే—ఏవమేతత్. కస్మాత్? ఇహహి సత్త్వం నామ మనః ప్రభవమ్, తచ్చ సమాహితమనస్త్వాదుచ్యతే మనసః సమాధౌ సత్త్వనిష్పత్తిర్భవతీతి, తస్య చ యోఽసౌ స్వభావో రోమాఞ్చాశ్రువైవర్ణ్యాదిలక్షణో యథా భావోపగతః స న శక్యో అన్యమనసా కర్తుమితి"...దుఃఖం నామ రోదనాత్మకం తత్కథమదుఃఖితేన సుఖం చ ప్రహర్షాత్మకమసుఖితేనాభినయేత్, ఏతదేవాస్య దుఃఖితే న ప్రహృష్టే న వా ప్రరోమాంచౌ ప్రదర్శయితవ్యావితి కృత్వా సాత్త్వికా భావా ఇత్యభివ్యాఖ్యాతాః."

నిష్పత్తిశబ్దార్థము.—"ఏభ్యశ్చ సామాన్య గుణయోగేన రసా నిష్పద్యన్తే-

2. ఏవమేతే రసాభివ్యక్తిహేతవః ఏకోనపంచాశద్భావాః" అనువాక్యముల ననుసరించి నిష్పత్తి యన అభివ్యక్తియనునర్థము తేలును. కావున రసనిష్పత్తి యన రసాభివ్యక్తి యని నిష్కృష్టార్థమగును.

**సారము:**—ఇప్పుడు రసముగా పరిణమించున దేది యనుప్రశ్నకు సమాధాన మింతకు మున్నే యీయబడినది. అనగా స్థాయిభావమే రసముగా పరిణమించును. కావున మనమాస్వాదించునది స్థాయిభావమే. ఈస్థాయిభావము మనలోనే నిలీనమై యుండును. విభావాదులచే అభివ్యక్తము చేయబడును. ఇది నిలీనమైయుండునంతవఱకు ఆస్వాద్యము కానేరదు. కారణకార్యసహచారులగు విభావానుభావవ్యభిచారిభావసహకృతమైనప్పు డభివ్యక్తమై ఆస్వాదనయోగ్యమగును. ఈరసాస్వాదన కలుగునది ప్రేక్షకునకు. కాన ప్రేక్షకునిహృదయమందే నిలీనమైయున్న స్థాయిభావమునే ప్రేక్షకుడే, ఆభావమభివ్యక్తమైనప్పు డాస్వాదించును.

నటులు అనుకార్యగతభావములను విభావాదులచే నభినయింతురు. విద్వాంసులగు ప్రేక్షకు లాప్రదర్శనమును చూచునప్పుడు, వారిహృదయములందు నిలీనమైయున్న భావములు, అభినీయమానములగుభావములతో ననుగుణముగా తన్మయీభావమును చెందును. ప్రదర్శింపబడుచున్న విభావములచే సుదోద్బోధితములై, అనుభావముచే ప్రకటింపబడి పెంపొందింపబడి, వ్యభిచారిభావములచే పోషింపబడి, తుదకు రసాత్మకముగా పరిణమించును, అనగా ఆస్వాదనయోగ్యముగా మారును. అప్పుడు ప్రేక్షకు డాభావము నాస్వాదించును. ఇప్పుడు ప్రథమమున నుదహరించినప్రశ్నలకు సమాధాన మీయనగును. 1. విభావాదులచే, నింతకుపూర్వము నిలీన మైయున్న స్థాయిభావ మభివ్యక్తమగుటయే రసాస్వాదనకు హేతువు. 2. అభివ్యక్తమైన స్థాయిభావమే రసము. 3. శోకమును కలుగ చేయు ప్రదర్శనమును చూచుచున్నను, మనకు శోకము కలుగుటకు కారణములే లేవు.

శోకము నిజముగా కలిగినది సీత శకుంతల మొదలగునాయికలకే. శోకవ్యంజకములగు విభావాదులు మనకు లేమిచే మనకు శోకము కలుగదు. కాని మనలో నున్న స్థాయిభావ ముద్బుద్ధమై, మనస్సు సత్త్వపూర్ణ మైయుండును కాన మనకు సంతసమే యుదయించును.

ఇట్లు భరతుని నాట్యశాస్త్రము నవలోకించుచో మనకు రసాస్వాదనసిద్ధాంతము స్పష్టము కాగలదు. ఇక భరతునితరువాతవచ్చిన విమర్శకు లీరససూత్రమున కెట్లు వ్యాఖ్యానము చేసిరో చూతము. సూత్రమునందలి సంయోగశబ్దమునకు చెప్పు అర్థమును బట్టి ఆయావ్యాఖ్యాతలయుద్దేశము కూడ గాంచనగు. అనగా సంయోగశబ్దమునకు 1 ఉత్పాద్యోత్పాదకభావము, 2 అనుమాప్యానుమాపకభావము, 3 భోజ్యభోజక భావము, 4 వ్యంగ్యవ్యంజకభావము అని నాలుగువిధముల నర్థము నిర్వచించబడినది. ఈమతభేదము నే యనుసరించి నిష్పత్తియనుశబ్దమునకు కూడ 1 ఉత్పత్తి, 2 అనుమితి, 3 భుక్తి, 4 వ్యక్తి అని అర్థము చెప్పబడినది. ఇందు మొదటిది రసోత్పత్తివాదము, రెండవది రసానుమితివాదము, మూడవది రసభుక్తివాదము, నాల్గవదిరసాభివ్యక్తివాదము. వీనికి క్రమముగా భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు అను వారు ప్రతిపాదకులు............

## ఉ త్ప త్తి వా ద ము.

శృంగారరసము నుదాహరణముగా తీసికొని భట్టలోల్లటునిమతమును ప్రతిపాదింప వచ్చును. నాయికానాయకులు పరస్పరము చూచినప్పుడు హృదయములు సంచలించును. ప్రేమాంకురము లుదయించును. పిదప వెన్నెల, మందమారుతము మొదలగు నుద్దీపన విభావములచేత రతి యనుస్థాయిభావ ముత్పత్తిని పొందును. అనగా శకుంతలయందు రతి యను స్థాయిభావ ముదయించుటకు దుష్యంతుడును, దుష్యంతునియందు ప్రేమబీజ ముద యించి రతిగా మారుటకు శకుంతలయు హేతువులు. కావున విభావములచే రతియను స్థాయిభావ ముత్పాదింపబడినది. ఇప్పుడు విభావమునకును స్థాయిభావమునకును గల సంబంధ ముత్పాద్యోత్పాదకభావమని తేలుచున్నది.

రతియనుస్థాయిభావ ముదయించినట్లు క్రీగంటిచూపులు, స్మితవదనము మొదలగు ననుభావములచే ప్రకటింపబడును. ఈయనుభావముల నవలోకించినపుడే మన కానాయికా నాయకులహృదయములందు రతియను స్థాయిభావ ముత్పత్తిని పొందినట్లు తెలియనగును.

అనగా, అనుభావముల నాధారముగా గొని రతియనుస్థాయిభావము ననుమానించుచున్నాము. కాన అనుభావములకును స్థాయిభావమునకు గల సంబంధమను మాప్యానుమాపకభావము.

ఉత్పత్తినిబొందిన ఈస్థాయిభావమును వ్యభిచారిభావములు పోషించును. కాన వ్యభిచారిభావములకును స్థాయిభావములకును గలసంబంధము పోష్యపోషకభావము. ఇట్లు పుష్టినిబొందిన స్థాయిభావము రసముగా మారును.

నిష్పత్తియను మాటకును విభావాదిభేదమునుబట్టి ఉత్పత్తి, అనుమితి, పుష్టియను నర్థభేదము సంభవించును.

సంయోగశబ్దమునకు నిట్టులే పైమూడుసంబంధములను అర్థముగా చెప్పవలసియుండును.

స్థాయిభావమునకు పైనుదహరించిన సంబంధములతో విభావానుభావవ్యభిచారి భావములయొక్క సంయోగమువలన, స్థాయిభావము రసముగా పరిణమించుననునర్థము నందు పర్యవసానము చెందును.

**ప్రేక్షకునియందు రసావిర్భావము.**—ఇంతవఱకును భట్టలోల్లటుడు, రామాదులయం దేవిధముగా రసముద్భవించినదో చెప్పినాడు. కాని ప్రస్తుత మగువిషయమును—ప్రేక్షకునియందు రసావిర్భావ మేల కలుగుచున్నది— స్పృశించనే లేదు. ఇప్పుడావిషయమాలోచింతము. ప్రేక్షకుడు నటునియందు దుష్యంతాద్యారోపణ చేయును. నటుడను జ్ఞానము నశించి, నటుడే దుష్యంతుడని భ్రమించును. ఈభ్రమాత్మకమగు నారోపజ్ఞానము వెనువెంటనే దుష్యంతగతమగు రతియను స్థాయిభావము గూడ నటునియం దారోపించ బడుచున్నది. ఇట్లారోపితదుష్యంతత్వముగల నటునియందు ప్రేమను, రసావిర్భావమును, చూచి ప్రేక్షకు డానందించును. భ్రమాత్మకమగు నారోపితజ్ఞానము సంతోషము నెట్లు కలుగచేయునందురేమో! రజ్జువునందలి సర్పభ్రాంతి భయమును కలుగచేయుట లేదా !

**ఉత్పత్తివాదమునందలి దోషములు.**— స్థాయిభావమునకును ఆనందమునకును సామానాధికరణ్యము లేకుండుటయే ఈవాదములోని దోషము. దేవదత్తునియందు రతి యనుస్థాయిభావమున్నను విష్ణుదత్తునకు సంతోష మేల కలుగవలెను. కారణ మొకచో నున్న కార్యము వేఱొకచోట నుండునా? రజ్జుసర్పదృష్టాంతము సరిగా కుదురదు. రజ్జువు సర్పమేననువిశ్వాసము దేవదత్తునిమనస్సునందే యున్నదికాన, భయమును దేవదత్తునకే

జనించును. ప్రస్తుతమం దట్లున్నదా? లేదు. స్థాయిభావోదయము రామాదులయందు లేక రామత్వారోపణముగల నటునియందు. సంతసమా ప్రేక్షకునియందు. కార్యకారణములకు సామానాధికరణ్య మెట్లు? ప్రస్తుతము కూడ నటునియందు రతియున్నదని ప్రేక్షకుడు విశ్వసించినచో ప్రేక్షకునకు సంతోష మేల కలుగదు? అని ప్రశ్నింపవచ్చును. కాని యొకని యందున్న సంతోషము మఱియొకనియందు గూడ సంతసము నుత్పాదింప గల్గుచో, నొకని యందున్నదుఃఖమును చూచునప్పుడు గూడ వేఱొకనికి దుఃఖముదయింపవలయును గదా! ప్రస్తుత మట్లు గాక కరుణరసప్రధానమగునాటకముల చూచునప్పుడు గూడ సంతోషమే కలుగనేల? ఆరోపితమగు భ్రమాత్మకసంతోషమే, ప్రేక్షకునకు కూడ సంతోషము కలుగ చేయునుగాని, వాస్తవమగుసంతోషమును చూచునప్పుడు పరునకు సంతసముదయించ దనుట హాస్యాస్పదమగు ఇక నారోపితమగుసుఖదుఃఖాదులు మాత్రమే సుఖదుఃఖములను కలుగచేయు ననుటయు దోషమే యగు. రామాదులయందున్న సుఖదుఃఖములను చూడని ప్రేక్షకుడు వానిని వేఱొకవ్యక్తియందారోపించుట మాత్ర మెట్లు కుదురును? రామాదుల యందుకాని నటునియందుకాని రసోత్పత్తి యసంగతమే యగు. ప్రేక్షకునియందుండునన్నను, ప్రేక్షకునకు విభావాదులు లేవు గదా. రంగస్థలమున చూచినకాంతను స్వీయగాభావించుట, సీతాదులయందు కుదురదు. తనయందు రామత్వము నారోపించుటయు హాస్యాస్పదమే యగును. ఇట్లు భట్టలోల్లటునిమతమునందు, సామానాధికరణ్యము లేకుండుట కరుణరస ప్రధానములగు నాటకములు సంతోషము నీయలేకుండుట యను నసంగతులు రెండు తప్పవు. మఱియు భట్టలోల్లటునిమతప్రకారము పుష్టిని పొందినస్థాయిభావమే రసముగా మారుచో, పుష్టియందలి తారతమ్యము ననుసరించి రసమునందు గూడ మందతరమందతమ భావము లుదయించునగత్య ముండవలసియుండును. అట్లు గాక ఏదేని యొకపరిమితి గల పుష్టిని పొందువఱకు రసముగా మారదనెదరా, భరతుడు చెప్పినట్లు హాస్యరసములో నాఱువిధములు కుదురవు. హాస్యరసములో భేదముల నంగీకరించుచో మిగిలినరసముల యందును భేదముల నంగీకరించ వచ్చును. కాని యట్లన్నిరసములలోను భేదములను భరతుడు చెప్పలేదు.

రతి యను స్థాయిభావమునకు క్రమమగు పరిపోషము కుదిరినను శోకక్రోధవిస్మయ ములకు పరిపోషము ఘటించదు. అవి ప్రథమమున తీవ్రముగానున్నను క్రమముగా మాంద్యమునే పొందును. అట్లగుటచేసి కరుణరౌద్రాద్భుతరసములే యుండకపోవుట సంభ వించును. ఇట్లు దోషము లనేకము లున్నను, వీనికెటులో సమాధానము చెప్పవచ్చును.

కాని సామానాధికరణ్యభంగవిషయమునను, శోకరసము కూడ ప్రేక్షకుల కానందమేల కలిగించుననెడి విషయమునను సరియగు సమాధానము మాత్ర ముత్పత్తివాదమున సమంజసముగా సంభవింపదు.

## శ్రీశంకుకుని రసానుమితివాదము

శ్రీశంకుకునిరసానుమితివాదమునందు, ప్రేక్షకుడు నటుని చూచి 'యితడు రాముడు' అని తలచును. ఈజ్ఞానము, రజ్జుసర్పదృష్టాంతమునం' దిది పాము గాదు' అనుజ్ఞానముచేతను వలె, "ఇతడు రాముడు గాడు" అనుజ్ఞానముచే పోగొట్టబడకుండుటచే భ్రమాత్మకమైనది కాదు. "ఇతడే రాముడు" "రాముడే ఇతడు" అను అయోగవ్యవచ్ఛేదఅన్యయోగవ్యవచ్ఛేదాత్మకమగు ప్రతీతి యున్ననే ప్రామాణికజ్ఞాన మగుటంజేసియు, అట్టిజ్ఞానము లిందు లేకుండుట జేసియు "రాము డితడు" అనుజ్ఞానము ప్రమాత్మకమును కాజాలదు. "ఇతడు రాము డగునా కాదా" యను సంశయము లేమిచే నిది సంశయాత్మకజ్ఞానము కూడ కాదు. "రామసదృశుడిత" డనుజ్ఞానము లేమిచే నిది సాదృశ్యజ్ఞానము కూడ కాదు. ఏతద్విలక్షణ మగుజ్ఞానమిది. చిత్రించబడినగుఱ్ఱమును, అనగా చిత్రతురగమును చూచునప్పుడు మనకు కలుగుజ్ఞానమును బోలియుండును.

దుష్యంతవేషధారియగు నటుడు శకుంతలవేషధారిణియగు నటిని చూచియనుకొను వచనముల నాధారముగాగొని దుష్యంతునకు శకుంతల ఆలంబనవిభావమైనదనియు చంద్రికాదు లుద్దీపనములైనవనియు మది దలచును. అటులే మధురవచనరోమాంచాద్యనుభావాభినయదర్శనమువలన ననుభావవ్యభిచారిభావముల గూడ నటునియం దున్నట్లు తెలిసికొనును.

ఈవిధముగా పక్షమగునటునియందు విభావానుభావవ్యభిచారిభావములు గలవను జ్ఞాన ముదయించినతోడనే, ప్రేక్షకునకు వ్యాప్తిజ్ఞానము కూడ కలుగును.

"శకుంతలయను నాలంబనవిభావమును, ఉద్యానచంద్రికలను నుద్దీపనవిభావములును ఉత్కంఠాదివ్యభిచారిభావములును కలిగియుండుటచే దుష్యంతుడు, శకుంతలవిషయమగు రతిగలవాడు" అనుజ్ఞానమువలన సామాజికునియం దలౌకికమగుసంతోష ముదయించును.

నిజమగు రతి దుష్యంతాదులయందే యుండును. మనము నటులయం దనుమానించునది దుష్యంతాదులయందున్నరతియొక్క అనుకరణ మాత్రమే. ఈఅనుకరణాత్మకమగు

రతియే, అనుమానించబడినదై రసముగా పరిణామమునుబొంది సామాజికున కానందమును కలిగించును. ఇది సామాన్యముగా శ్రీశంకుకునివాదము.

**స్వవాదసమర్థనము.**—అయ్యా, "తదభావవతి తత్ప్రకారకం జ్ఞానమయథార్థ జ్ఞానమ్" అని గదా అయథార్థజ్ఞానమును పెద్దలు నిర్వచింతురు. ప్రస్తుతము కూడ దుష్యంతుడు కానివానియందు దుష్యంతజ్ఞాన ముంచుట అయథార్థజ్ఞానమే కదా! అట్టిజ్ఞానము వలని వాస్తవికమగుసంతోష మెట్లు లభించుననియెదరా? వినుడు. మణిప్రభను చూచి మణియను బుద్ధితో పరుగెత్తునతనికి మణి లభించలేదా? అటులే ప్రస్తుతము గూడ నిజమగు సంతోష ముదయించుట కభ్యంతర మేమి?

విభావాదులు నటునియందుండునవి కృత్రిమములుగదా. కృత్రిమములగు హేతువుచే అనుమితియెట్లు కలుగునని ప్రశ్నించుట కవకాశము లేదు. ధూళిని చూచి ధూమమని భ్రమచెంది అగ్ని ననుమానించుట లేదా? అనుమానపరంపర నంగీకరించుటచే, ద్విక్షణావస్థాయియగు ననుమితిజ్ఞానముచే దీర్ఘకాలావస్థాయియగు ముదముదయించుటయు నసంభవము కానేరదు. జ్ఞానవిషయమునందలి చారుతయే చమత్కారహేతువగునుగాని జ్ఞానమేమాత్రము నిదానము కాదు. కాన నిత్యవ్యవహారములందలి యనుమితి సంతోషమును కలిగింపకున్నను, కావ్య నాటకాదులయందున్నవి భావాదులవలని కలిగినమనోభావముల రమ్యతవలనియానంద ముద్భవించుట లోకవిరుద్ధము కానేరదు. ఇట్లు స్వమతదోషోద్ధారణ చేయబడినదిగాన శ్రీశంకుకునిమతము దోషరహితముగా ప్రతిపాదింపబడినట్లే.

**సూత్రవివృతి.**—ఇక నీతనిమతమున సూత్రమునందు సంయోగపదమున కనుమాప్యానుమాపకభావమర్థము. నిష్పత్తిపదమున కనుమితి యని యర్థము చెప్పనగును.

**ఉత్పత్త్యనుమితిమతములకు పరస్పరభేదము.**—ఉభయులమతమునను "ఈ దుష్యంతుడు శకుంతలవిషయకమగు రతికలవాడ"ను జ్ఞానమే సామాజికునియానందమునకు నిదానము. కాని జ్ఞానస్వభావములో భేదముకలదు. భట్టలోల్లటునిమతమున "ఇతడు దుష్యంతుడు" అనుజ్ఞానము ఇతనియందు శకుంతలావిషయకమగురతి కలదు అనుజ్ఞానమును ఆరోపాత్మకమగు ప్రత్యక్షజన్యములే. మఱియు నితనిమతము ననుసరించి రతియనుస్థాయిభావము దుష్యంతాదులయం దుత్పత్తినిపొందును. ఇదియే వృద్ధిపొందును. ఈస్థాయిభావమునే రసమని పిలుతుము. కాని శ్రీశంకుకునిమతమున "ఇతడు దుష్యంతుడు" అనుజ్ఞానము భ్రమప్రమాదివిలక్షణమైనది. విభావాదు లారోపితములు గావు. స్థాయిభావము అనుకార్యము

నందుకాని నటునియందుగాని సామాజికునియందుగాని పుట్టినవి గావు కాక నటునియందున్న ట్లనుమానింపబడుచున్నవి.

**అనుమితిమతమునందలిదోషములు.**—ఈమతమునందును, కార్యకారణములకు సామానాధికరణ్యము లేదు. 2. కరుణాద్భుతాదిరసప్రధానములగు నాటకముల చూచి నప్పు డానందమే యేల కలుగవలెనో తెలుపబడలేదు. 3 అనుమిత్యాత్మకజ్ఞాన మలౌకికా నందము నీయజాలదు. పుత్రోత్పత్తిదర్శనజ్ఞానముకన్న, పుత్రోత్పత్తి కలుగునను ననుమితి యొక్కడానందము నీయునా? 4. మణిప్రభాదృష్టాంతము కూడ సమంజసముగా లేదు. మణిప్రభను చూచి వెళ్లినను మణియొక్క ప్రత్యక్షదర్శనమే మణిలాభమునందు హేతు వైనదికాని మణిప్రభాజ్ఞానము కాదు. కావున "ఇతడు రాము డ"నుజ్ఞానము ప్రామాణి కము గాదనినచో నీమతమున దోషమే వాటిల్లును. 5. రసాస్వాదన బ్రహ్మానందముతో సమానమనియు విజాతీయభావాతిరస్కృతమనియు చెప్పబడుచున్నది. ఇట్టిస్థితిలో అనుమితి పరంపర యెట్లు సిద్ధించును? "నాకీవిషయమున ననుమితి కలుగుగాక"యను కోరిక యున్న గదా ప్రతిద్వితీయక్షణాంతమునను తిరిగి యనుమితి కలుగుట అగుచో నిచ్ఛావిచ్ఛిన్నములగు భావములతో బ్రహ్మానందసబ్రహ్మచారియగు రసాస్వాదన కలుగుటెట్లు? 6. ప్రతిసామాజి కుడును నేనానందము ననుభవించినానని చెప్పునుకాని, నేను ప్రతిక్షణమును రత్యాదుల ననుమానించుచున్నానని యెవడును చెప్పడు. 7. నటునియందు సామాజికు లనుమానిం చునది అనుకార్యగతభావాద్యనుకరణమే యని గదా, శ్రీశంకుకుడు చెప్పుచున్నాడు. దుష్యంతాదిగతభావాద్యనుకరణమే నటనిష్ఠమనుటయందు ప్రమాణమేమి? అనుకార్యగత చేష్టాదుల చూచినవా డున్నచో నటు డాభావముల ననుకరించుచున్నాడని చెప్పవచ్చును. అనుకార్యమగు రామాదిపాత్రము నెఱుగని సామాజికుడు నటనిష్ఠతదనుకరణమును గాంచుచున్నాడనుట వెఱ్ఱి. ఏదేని యొకయద్భుతమగు శక్తిచే రామాది నిష్ఠవిభావాదుల జ్ఞాన మున్నదని" తుష్యతు దుర్జనన్యాయము ననుసరించి చెప్పినను, కల్పితమగు నితివృత్త ముగల ప్రకరణాదులయందు, నటుడు చారుదత్తునివలె నటించుచున్నాడని చెప్పుట నవ్వు లాటకు తావొసగుట కాదా? 8. నటునిచేష్ట లనుకరణములనుట తప్పు అనుకరణము సాదృశ్యము పరస్పరభిన్నములు. వేషభాషాదులవలన నటుడు మనయూహాకల్పితమగు రాముని బోలి యుండవచ్చునుగాని రాముని యనుకరించుచున్నాడనుట భ్రమ. గవయ మృగము గోవుమాదిరిగానున్నంత మాత్రన గోవును గవయమృగ మనుకరించుచున్న దనవచ్చునా? 9. "ఇతడురాముడు" అనుజ్ఞానము ప్రమాభ్రమలకు భిన్నమైనదని చెప్పుట

తప్పు. ప్రతిజ్ఞానమును తప్పో యొప్పో యగును. ఈరజ్జువు సర్పము కాదని భ్రాంతునికి తెలియనంతమాత్రమున రజ్జువునందలి సర్పజ్ఞానము ప్రమాత్మకమగునా? మనబుద్ధియందలి మాంద్యమువలన జ్ఞానతత్త్వమందు గూడ మార్పుకలుగునా? 10. చిత్రతురగన్యాయము పరిశీలింతము. చిత్రస్థాశ్వమును చూచి ఇది గుఱ్ఱమువలె నున్నదందురు కాని ఇది గుఱ్ఱమని యనరు. "ఇది గుఱ్ఱమ"ని యన్నను వక్త ఆచిత్రముయొక్క సాదృశ్యముచే మోసపోయి నాడని యెంచవలయునే కాని వాస్తవముగా నాచిత్రము గుఱ్ఱము కానేఱదు. కావున "వీడు రాముడు" అను నది సాదృశ్యజ్ఞానమే యగును. 11. నటుడు కూడ "నేను రాము ననుకరించుచున్నా"నని భావింపడు. తానెప్పుడైన రాముని చూచియున్న గదా యాభావన. అట్లేనిమఱ్ఱకున్నకైనను అనుకిరణాత్మకజ్ఞాన ముండనే యుండదు. ఇట్లు శ్రీశంకుకునిమతము నందును దోషములు కాననగును.

## భు క్తి వా ద ము.

కావ్యనాటకములయందు అభిధావృత్తికంటె విలక్షణమగు భావకత్వమనువ్యాపార విశేష మొందు కలదు. ఈభావకత్వవ్యాపారము నంగీకరించుటచే భట్టనాయకుడు శ్రీశంకు కునిమతమునందు గల సామానాధికరణ్యాభావదోషమును తొలగించి, కరుణరసప్రధాన మగునాటకప్రదర్శనమునందలి ప్రేక్షకులకు కూడ సంతస ముదయించుట సమంజసమే యగు నని నిరూపించుచున్నాడు.

శకుంతలవేషమును ధరించిన నటుని చూచినప్పుడు "ఈమె దుష్యంతునిభార్య యగు శకుంతల" యను దేశకాలపురుషసంబంధావచ్ఛిన్నజ్ఞాన ముదయించదు. ఈమె యొకసుందరి యనుజ్ఞానము మాత్రమే యుండును. దుష్యంతునియందు గూడ నటులే యితడొకరాజని భావనయుండదు. కేవలము పురుషుడనియే యుండును. వారియందు ప్రకటింపబడు స్మితవద నాద్యనుభావములు గూడ సామాన్యస్వరూపముగానే భావింపబడును. ఇట్లు విభావాను భావాదులను దేశకాలపురుషవిశేషానవచ్ఛిన్నములుగా భావించుటచే వారిమనోభావము లను గూడ సాధారణస్వరూపముననే తలచును. ఆమనోభావ జ్ఞానమువలని, వారిరువుర కును గల ప్రేమను గూడ, "వారిప్రేమ" యనుభావన లేక, సామాన్యముగా "ప్రేమ" యనెడు రీతిగ నవగాహనము చేసికొనును. ఈప్రేమ నటునియం దుండునది కాదు. తన యందుండునది కాదు. దుష్యంతునియం దుండునది కూడ కాదు. ఇట్లు సాధారణీకరణమగు టతోడనే సామాజికునియందు రసోదయమగుటకాటంకమేమియును లేదు. భట్టనాయకు

డాఖ్యాతివాది. అఖ్యాతివాదిమతమున కారణము వేరొకచోట నున్నను కార్యము తన యందు కలుగుటలో దోసగేమియు లేదు. ఆవిభావాదులు తసవి కావనుజ్ఞానము లేకున్న చాలును. ఈసాధారణీకరణమునకు భావకత్వ మవసరము. భావకత్వవ్యాపారము లేనిచో సాధారణీకరణము కుదురదు. భాగత్యాగలక్షణచే నీసాధారణీకరణము సిద్ధించుననుట కూడదు. భాగత్యాగలక్షణ యన లక్షణావ్యాపారమే యగు గదా. దీనిలో నిరూఢలక్షణకు నభిధకును భేదమే లేకుండుటచే నిరూఢలక్షణప్రస్తుతము నిష్ఫలము. ప్రయోజనవతీ లక్షణకు ముఖ్యార్థబాధ, లక్ష్యార్థవాచ్యార్థములకు సంబంధము, ప్రయోజనమునను మూడంశము లుండవలయును. సామాజికుడు ప్రతిక్షణము నీమూడంశములను పరిశీలించుచున్నచో వానికానందము కలుగున దెప్పుడు? ఇంత విశ్రాంతి యేడ? పోనిమ్ము లక్షణచేతనే రామాదులను సాధారణముగా భావింపవచ్చును. కాని తద్గతభావములకు సాధారణీకరణము పొసగుటెట్లు? లక్షణకుపూర్వ మభిధయుండవలయును కదా. ప్రస్తుత పాత్రగత మనోభావము లనుభావాదులచే నూహింపబడుచుండుటచే, అభిధావ్యాపారమునకు ప్రసక్తియే లేనిచోట లక్షణ యెట్లు సిద్ధించును? ఇట్లు భావకత్వవ్యాపారమహిమచే రత్యుత్సాహాదులు సాధారణీకృతము లగుటచేతను, అనుకార్యమునం దుత్పత్తిని పొందుటగాని, నటునియం దనుమానింపబడుటగాని స్థాయిభావమున కిప్పుడు లేకుండుట స్థాయిభావ మొకచోనుండ సంతస మింకొకచోట నెట్లున్నదను ప్రశ్న కవకాశము లేకుండుటచే, సామాజికునియందు సంతసముండు నని చెప్పుటయందు తప్పేమియు లేదు. ఈసంతసమిచ్చుటకు భట్టనాయకుని మతమున "భోగకృత్త్వ"మను వ్యాపార మింకొకటి కలదు. దీనివలని రత్యాదులు చర్వణచేయబడి సంతసము నిచ్చుచున్నవి. తత్క్రిమ మిట్లు వర్ణింపనగు.

**భోగకృద్వ్యాపారమహిమ.**—మనసు త్రిగుణాత్మకమైనది. అందు సత్వగుణ మెక్కుడగుచో నానందము కలుగును. భోగకృత్యవ్యాపారముచే సత్వోద్రేకము కలుగును. సత్వోద్రేకము కలుగుటతోడనే విఘాతకరములగు ప్రతీతు లన్నియు నడుగంటును. మనస్సు నిర్మలమగును. ఆస్వచ్ఛమైన మనస్సుతో, భావకత్వవ్యాపారముచే సాధారణీకృతములగు విభావానుభావవ్యభిచారిభావసహితమగుస్థాయిభావము నాస్వాదించును. ఇప్పుడు సామాజికునకు కలుగునానందము బ్రహ్మానందసబ్రహ్మచారియే యగును.

**కరుణరసమువలని సంతోషముదయించుట.**—ప్రస్తుతము శోకమనుస్థాయిభావము వలనికూడ నానంద ముదయించుటయం దనుపపత్తి యేమాత్రము లేదు. స్థాయిభావ మేదియైనను, భోగకృత్వవ్యాపారము మహిమచే రజస్తమోగుణము లడుగంటి సత్వో

ద్రేకము కలుగుటచేతను మనస్సే యానందాత్మకముగ మారుటచే, సత్త్వోద్రేకప్రకాశానంద మయ సంవిద్విశ్రాంతిలక్షణమగు బ్రహ్మానందసబ్రహ్మచారియైన సుఖము కలుగుటయం దసంభావిత మేమియును లేదు.

**భావకత్వవ్యాపారముయొక్క ఆవశ్యకము.**—అభిధావ్యాపారవ్యతిరిక్తమగు వ్యాపారమే లేనిచో కావ్యమునందు గుణదోషపరిగణన కుదురదు. అనగా శృంగారరస మును వర్ణించుశ్లోకమునందు కఠినములగు పదములున్నచో మన మాశ్లోకమును దోష యుతమని యెంచుచున్నాము. మృదుశబ్దము లున్నచో గుణముగా పరిగణించుచున్నాము కేవలమభిధయే చాలుచో, నావ్యాపారమువలన వాచ్యార్థము లాభించుచున్నను శబ్ద కాఠిన్యమును బట్టి దోషమెన్న నేల? వ్యవహారములో మనము మాట్లాడునప్పు డీశబ్దకా ఠిన్యమృదుత్వముల నిర్లక్ష్యముగా చూచుట లేదా? అగుచో కావ్యమునందే యొక్కచో శబ్దకాఠిన్యము దోషమనియు, రౌద్రాదులయందు గుణమనియు చెప్పనేల? దీనికి దోషత్వ మెట్లు సిద్ధించినది. శృంగారరసప్రతీతికి భంగము వాటిల్లుననెడి సిద్ధాంతమే గదా, శృంగార రసవర్ణనలందు శబ్దపారుష్యమునకు హేయతను సంపాదించినది. ఇట్లు హేయతను సంపా దించునది భావకత్వవ్యాపారము కాక మత్తేమి? కేవలమర్థమును తెలియచేయుటతో నభి ధావ్యాపార మణగిపోయినది గదా! ఈవిధముగనే, శబ్దసంఘటన, మాధుర్యము ఓజస్సు మొదలగుగుణములు, ఉపనాగరికా పరుషా మొదలగు శబ్దవృత్తులు, కైశిక్యారభట్యాదిఅర్థ వృత్తులును, భావకత్వవ్యాపారమనెడిది లేనిచో వ్యర్థమే యగును. అలంకారములు, పైచెప్పిన వృత్త్యాదులును రసోద్బోధనకు హేతువు లగుచున్నవన, భావకత్వవ్యాపార మహిమచేతనే గదా. కావున భావకత్వభోగకృత్త్వవ్యాపారములు రెండును కావ్యనాట కాదులయం దావశ్యకములు.

**సూత్రవివరణము.**—సూత్రమునందలి సంయోగశబ్దమున కిప్పు డర్థమరయుచో "సాధారణీకరణ" మని తేలును. భోజ్యభోజకభావసంబంధమని కూడ సంయోగపదమున కర్థము చెప్పవలెను. నిష్పత్తిపదమునకు భోగమని యర్థము స్థాయిభావమునకును విభా వాదులకును గల సంబంధము భోజ్యభోజకభావము. విభావాదులు సాధారణీకృతము లగుటతోడనే రత్యాదిస్థాయిభావములును సాధారణీకృతము లగును. సాధారణీకృతమగు నీస్థాయిభావము సత్త్వోద్రేకముగలమనస్సు గల సామాజికునిచే భోగకృత్త్వవ్యాపారసహాయ మున ననుభవింపబడును.

**భుక్తివాదమునందలి దోషములు.**—భట్టనాయకుడు క్రొత్తగా తీసికొనివచ్చిన వ్యాపారములు రెండును నిరర్థకములే అనగా పూర్వమే యాలంకారికులచేత నభ్యుపగతమగు వ్యంజనావ్యాపారముతోనే భావకత్వవ్యాపారము గతార్థమగుచుండ, ప్రత్యేకముగా దీనినెన్న నేల? భావకత్వవ్యాపారము నంగీకరించిన భట్టనాయకునకు కూడ వ్యంజనా వ్యాపారము నంగీకరింపక తప్పదు. కావ్యాదులయందు శబ్దములచే ప్రతిపాదింపబడిన విభావాదులను భావకత్వవ్యాపారము సాధారణములైనవానినిగా చేయును. కాని శబ్దముల నుండియు, అనుభావాదులనుండియు, విశేషరూపముగా నైనను ప్రథమమున మనము తెలిసికొనుటకు సాధనమేమి? కొన్ని శబ్దసంఘటనలచేతను, వృత్త్యాదులచేతను, అనుభావాదులచేతను స్థాయిభావము లేదేని యొక వ్యక్తికి సంబంధించినట్లు ప్రతిపాదింపబడుట ప్రథమమున నెట్లు. ఈవిషయమున నభిధ నిష్ప్రయోజనమే యగును. కావున భావకత్వ వ్యాపారమునకు ముందు వ్యంజనావ్యాపారము నంగీకరింపక తప్పదు. మఱియు "భ్రమ ధార్మికవిస్రబ్ధం." "గచ్ఛ గచ్ఛసి చేత్కాన్త" అనుస్థలములయందు విపరీతప్రతీతిని గలిగించునదేది? "కిమివ న కృతం త్వయా." "మథ్నామి కౌరవశతం సమరే న యోధాః" అనునప్పుడు స్వరవైలక్షణ్యమువలని విపరీతార్థము భాసమగుట యేవ్యాపారమువలన? "అస్తమేతి గభస్తిమా"ననునప్పుడు శ్రోతృస్వభావభేదము ననుసరించి విభిన్నార్థముల కలిగించునదేది? కాన వ్యంజనావ్యాపారము నంగీకరించవలసినప్పుడు, భావకత్వము నంగీకరింప నేల? భావకత్వము సాధారణీకరణమును సంపాదించును, భోగకృత్త్వవ్యాపారము సత్త్వోద్రేకమును, సంవిద్విశ్రాంతిని సంపాదించి సాధారణీకృతరత్యాదుల ననుభవింపజేయును. ఇవి రెండును లేకపోయినను, వ్యంజనావ్యాపారము సహజముగా గలిగియున్న గుణాలంకారాభినయములే యీసంవిద్విశ్రాంతి నొసంగి రసప్రతీతివిఘ్ననిరాసమొనర్చి యానందమును చేకూర్ప గలిగినప్పుడు నూత్నములగు నీరెండువ్యాపారముల ప్రయోజనమేమి? భట్టనాయకునిమతము ననుసరించి యైనను భోగకృత్త్వ మనావశ్యకము. భావకత్వవ్యాపారముచే విభావాదులు సాధారణీకృతము లైనగదా భోగకృత్త్వవ్యాపారము వచ్చుట. అనగా భోగకృత్త్వవ్యాపార మెంతవఱకుండునో యంతవఱకును భావకత్వ ముండి తీరవలయును. భావకత్వము ముందనుటకు వీలులేదు భావకత్త్వము నశించుటతోడనే సాధారణీకరణముకూడ నశించును. అప్పుడు భోగకృత్వవ్యాపారమునకు పనియేది? ఒకేకాలమున రెండువ్యాపారముల నంగీకరింపనేల. సంవిద్విశ్రాంతిని గూడ భావకత్వమే ఫలింపజేయును. సత్త్వోద్రేకముతో సంవిద్విశ్రాంతి యుండుటకంటె వేరుగా భోగమనున దికేమి కలదు? లేదు. కాన భోగకృత్త్వవ్యాపారము నిష్ప్రయోజనమై వ్యర్థాకల్పమగు.

భట్టనాయకుడు "రసోన ప్రతీయతే" అని సిద్ధాంతము చేసినాడుకాని యిది, తాను తనసిద్ధాంతములో "భుజ్యతే రసః." అని చెప్పుటచే, స్వవచోవ్యాఘాతమును సంపాదించినాడు. జ్ఞానవిషయమే కానిచో రసము ననుభవించు టెట్లు పొసగును?

మఱియొకదోషము కూడ కలదు. భట్టలోల్లటశ్రీశంకుకులమతమునందువలె సామానాధికరణ్యభంగము కార్యకారణములకు కలుగకున్నను, ప్రేక్షకున కానందము కలుగుటలో సామంజస్య మేమియు కనుబడలేదు. తనయందు భావములే లేకున్నచో తా ననుభవించు టెట్లు? "రసో నాభివ్యజ్యతే" యని భట్టనాయకుడు చెప్పుటకూడ తప్పేయగును. తానే భట్టలోల్లటుని యుత్పత్తివాదమును ఖండించియున్నాడు. అనగా రసము పుట్టదు, అభివ్యక్తిని పొందదని గదా యర్థము తేలును. ప్రపంచములో ప్రతివస్తువునకు నుత్పత్తియైన నుండవలె. లేక నిలీనముగా నున్నచో నేదేని యొకశక్తివలన నభివ్యక్తినైన పొందవలెనుగాని యుభయవిలక్షణమగు వస్తువు సిద్ధించుటెట్లు? కావున "రసో నాభివ్యజ్యతే" యనుటయు తప్పే. ఇవి సంగ్రహముగా భట్టనాయకునిమతమందలి దోషములు.

## ర సా భి వ్య క్తి వా ద ము.

అభివ్యక్తివాదప్రతిపాదకుడగు నభినవగుప్తునిమతమున రసాస్వాదనకధికారి సహృదయుడు. కావ్యానుశీలనాభ్యాసవశమున విశదీభూతమైన మనోముకురముగలిగి వర్ణ్యమాణవిషయతన్మయయోగ్యత యెవనికి కలదో అతడు సహృదయుడు. ఆసహృదయునకు కావ్యనాటకములలో ప్రథమము వాక్యార్థప్రతిపత్తి కలుగును. అనగా దుష్యంతుడను నొకరాజనియు, నాతడు మృగము ననుసరించుచున్నాడనిగాని, లేక శకుంతల నవలోకించుచున్నాడనిగాని యవగాహన చేసికొనును నటగతచేష్టాదులవలని తాను చూచుపాత్రలకు గలసంబంధము వ్యంగ్యము చేయబడును. ఆవ్యంగ్యమహిమవలన నాయాపాత్రగతమనోభావములను సహృదయుడగు సామాజికు డవధరించును. తరువాత గుణాలంకారవృత్తిరీత్యాదుల వ్యాపారముచేతను, కవిప్రతిభవలనను, రంగస్థలమునందలి జవనికాదిపరికరములవలనను క్రమముగా సామాజికునకు పాత్రవిషయకమగు విశేషజ్ఞానము నశించును. ఇట్లాయాపాత్రలయందు ప్రకటింపబడుభావములు కూడ సాధారణీకృతము లగుటచే సాధారణీకృతమగు రతిభయాదిమానసికసాక్షాత్కారమే కలుగును. "నేను భయపడితి"నని గాని, "నామిత్రుడు భయపడుచున్నాడ"ని గాని యిట్టి మిత్రత్వశత్రుత్వాదిసంబంధములతోగూడిన ప్రతీతి యుండనే యుండదు. అట్లున్నచో వీతవిఘ్నమగు ప్రతీతి కానేఱదు.

ఇట్లు సాధారణీకృతములగు విభావాదులు ప్రేక్షకునియందు వాసనాత్మకముగాని లీనమై యున్న రతిభయాదిస్థాయిభావముల నుద్బోధించును. (ప్రతిమానవునకును రత్యాదిస్థాయి భావములన్నియు వాసనాత్మముగా నుండుననియు, కాని యవి హృదయకుహరమందు నిలీనమై యుండుననియు తెలియవలెను.) ఇందు విభావములు నిలీనమై బీజావస్థయందున్న స్థాయిభావమున కంకురదశ నర్పించును. అట్లంకురించినభావమున కనుభవయోగ్యతను సంపాదించున వనుభావములు. వ్యభిచారిభావము లాస్థాయికే ప్రాకట్యమును సంపాదించును. ఇట్లు పూర్ణోద్బోధము కలిగిన స్థాయిభావమే యానందము నొసగును. ఇట్లాత్మయం దుద్బుద్ధమైన స్థాయినిగూడ నాత్మీయమను జ్ఞానము సామాజికునకు లేదని జ్ఞప్తియం దుంచవలయును. ఆత్మీయము పరకీయమునను జ్ఞానశూన్యమై యున్న నే రససిద్ధి కలుగును. స్థాయి భావ ముద్బుద్ధమగుటతోడనే సహృదయున కైకాగ్రత కుదురును. విఘ్నములు వెనుబడును. అప్పు డాసామాజికునకు సుషుప్తియందువలె, యోగమునందువలెను, ఆత్మానందముతో దాదాపు సరియగు నానందము కలుగును.

ఈ రసాస్వాదన యొకవిధమగు మానసికప్రతీతి. ఆనందమయమైనది.దుఃఖసంభిన్నము కానిది.

**భుక్త్యభివ్యక్తిమతములలో పరస్పరభేదము.**—భట్టనాయకునిమతమున అనుకార్యగతరత్యాద్యాస్వాదులు సహృదయుని యానందమునకు కారణములు. అభినవగుప్తునివాదమున సహృదయహృదయనిలీనమై సాధారణీకృతవిభావాదిప్రతిబుద్ధ మైనభావములే కారణములు. ఉభయులమతమునను సాధారణీకరణము తప్పదు. 2. సాధారణీకృతమగు అనుకార్యస్థభావసాక్షాత్కార మైనపిదప భోగకృత్త్వవ్యాపారము మొదలిడునని భట్టనాయకుడు చెప్పును ప్రబుద్ధస్వాత్మగతస్థాయిభావసాక్షాత్కారమే యానందమని యభినవగుప్తుడు చెప్పును. 3. సహృదయహృదయమునందు రసాస్వాదనకు కలుగువిఘ్నములను పోగొట్టుటకు భావకత్వవ్యాపార మావశ్యకమని భట్టనాయకుడు వాదించుచుండ, భావకత్వమునకు కూడ నిదానమగు వ్యంజనావ్యాపారమే భావకత్వవ్యాపారము కూడ నిర్వర్తించునని యభినవగుప్తుడు వాదించును. ఇంతకును భావకత్వవ్యంజనావ్యాపారములకు భేదమే లేదు. 4. అభినవగుప్తునిమతమున భోగకృత్త్వవ్యాపారము నిష్ప్రయోజనము.

**అనుమిత్యభివ్యక్తివాదములలో భేదము.**—ఉభయమతములను రసము స్థాయిభావముకంటె వ్యతిరిక్తమైనది కాదు. కాని శ్రీశంకుకు డీస్థాయిభావ మనుమితి లబ్ధమని చెప్పుచుండ నభినవగుప్తు డిది సహృదయనిలీనమై యుత్తేజక మున్నప్పు డుద్బుద్ధమగునని

సిద్ధాంతము చేసినాడు. 2. అనుమితివాదమున నీస్థాయిభావ మనుకార్యనిష్ఠమై, అనుకార్యముగా భావింపబడు నటునియం దనుమానించబడుచున్నది. అభివ్యక్తివాదమున నీస్థాయి సామాజికనిష్ఠమే యగుటంజేసి వేరుప్రక్రియ లేనే లేదు. 3. వాస్తవముగా చూచినచో ననుమితివాదలబ్ధమగు స్థాయిభావ మూహాకల్పితమగుట వంధ్యాపుత్రసదృశము. అభివ్యక్తి వాదమునందలి స్థాయిభావము పరమార్థమైనది. మఱియొకవిశేషము కూడ కలదు. స్థాయిభావము విభావాదులచే పోషింపబడి వృద్ధినిబొంది రసముగా మారునని శ్రీశంకుకుడు చెప్పుటలేదు. కేవలము స్థాయిభావము రసముగా ననుభవింపబడు టెట్లనుశంకయే యతని కుదయించలేదు. అభినవగుప్తునిమతమున విభావానుభావవ్యభిచారములు మూడును కలసియున్నప్పుడే, స్థాయిభావము క్రమము పరిపోషింపబడు నపుడే ఆస్వాదనయోగ్యముగా మారును.

అభినవగుప్తుడు, రసాస్వాదనకు పూర్వము, రసప్రతీతిని ప్రతిబంధించు విఘ్నము వినాశ మొందవలెనని చెప్పియున్నాడు.

**రసప్రతీతికి విఘ్నములు.**—ఆరసవిరోధుల చూతము. 1. ఔచిత్యాభావము—అనగా వత్సరాజును తీసికొనివచ్చి సముద్రలంఘనముచేసినట్లు వర్ణించుచో నది యాపాత్రకనుచితమగును. హనుమంతునకన్నచో ననుచితముకాదు. ఇట్లు దేశకాలపాత్రవచనాద్యౌచిత్యము పాటించనిదే రసప్రతీతి కలుగనే కలుగదు. చూ. "అనౌచిత్యాదృతే నాన్యద్రసభంగస్య కారణమ్." 2. "స్వగతత్వ పరగతత్వ నియమేన దేశకాలవిశేషావేశః" అనగా రంగస్థలమునందు చూపింపబడు సుఖదుఃఖాదులను స్వగతములనిగాని పరగతములనిగాని భావించుటచేత, ప్రేక్షకునకు తత్తత్ భావాపగమభీరుత్వముగాని, తత్పరిరక్షావ్యగ్రతగాని, తద్గోపనేచ్ఛగాని, తనయందు సుఖదుఃఖాదుల నధ్యవసానము చేయుటయందు వ్యగ్రతగాని యుదయించుటచే సంవిద్విశ్రాంతికి భంగము వాటిల్లును. 3. నిజసుఖదుఃఖాదివివశీభూతుడగు సామాజికున కానందము కలుగదు. 4. ప్రతీత్యుపాయవైకల్యము—అనగా రసప్రతీతి సామాజికునియందు కలుగవలెనన్న అభినయములు, సంగీతము, అభినయానుకూలమగు సామగ్రి యుండవలెను. లేక సర్వమును సామాజికునియూహాకే వదలినచో రసప్రతీతి కలుగదు. నటుడు మొద్దువలె కూర్చొని "నామనసు ప్రియురాలినుండి మరలుట లేదను" భావము గలశ్లోకమును చదువుచున్నమాత్రన, యుద్ధము చేయుచున్నానని మాట చెప్పినమాత్రన, సామాజికునియందు రసోదయమగునా? కాన స్ఫుటమగు ప్రతీత్యుపాయము లుండవలెను. ౫. అప్రధానత—ప్రధానమగు రసప్రతీతి కనుకూలమగు భావాదుల వర్ణిం

చక అప్రధానమగువిషయముల ప్రదర్శించుచో, సామాజికునకు ప్రధానవస్తువునందు మనసు లగ్నము కాకుంటజేసి యానందము కలుగదు. 6. సంశయమనున దాఅవది. ఈయను భావము లీస్థాయియందే యుండుననునియమము లేదు ఒకేయనుభావ మనేకస్థాయిభావ ములయం దుండవచ్చును. చింతయనెడు వ్యభిచారిభావము భయవిషాదములయం దుండ వచ్చును. బాష్పమనెడిది యానందార్తిరోగములయందు కురుయును. వ్యాఘ్రమనెడి విభావము క్రోధభయాదులకల్పించును ఇట్లీవిభావాదు లీస్థాయికే యనునియమను లేమిచే, సామాజికునకు, వ్యంగ్యమగురస మేదియో, దేని నుద్దేశించి యీవిభావాదులు ప్రదర్శింప బడుచున్నవో తెలియనికారణమున రసప్రతీతి కలుగదు. కావున రసాస్వాదన కేవిఘ్నములు లేకుండునప్పుడే ప్రవృత్తి కలుగును ఈవిఘ్నములు వోయి సంవిద్విశ్రాంతి కలుగుటయే యానందమగు.

**సూత్రవివరణము**—ఇప్పుడు భరతునిసూత్రమునకు వివరణము చూడనగు. సంయోగ మనుశబ్దమునకు అనుకార్యగతభావములకు సంబంధించినంతవఱకు వ్యంగ్య వ్యంజకభావము. సామాజికుని స్థాయిభావము విషయమున ఉద్బోధ్యోద్బోధకభావము. అటులే నిష్పత్తి యనుశబ్దమునకుసు "అభివ్యక్తి", "ఉద్బోధము" అనునర్థము వచ్చును.

**కరుణరసమువలని యానందము.**—ఏరసమైనను, సంతోష మిచ్చునది రసస్వభా వము కాకుండుటచేతను సామాజికునియందు సంవిద్విశ్రాంతియే సుఖస్వరూపమగుటను, అవిశ్రాంతియే దుఃఖస్వరూపమగుటను, ప్రతిరసమును మనసునందలి చాంచల్యమును పార ద్రోలి విశ్రాంతినీయ సమర్థమగుటను, కరుణరసమువలని కూడ నానందము కలుగుటయం దసంభావ్య మేమియును లేదు.

ఇట్లభినవగుప్తుడు యుక్తియుక్తముగా అభివ్యక్తివాదమును సమర్థించినాడు. భర తునివాక్యముల కూడ విమర్శించుచో నీతనిమతము సర్వవిధముల భరతున కభిమతమైనదే యని తెలియగలదు. ఇక నీభావములనే అభినవగుప్తుడు ధ్వన్యాలోకగ్రంథమునందు విస్త రించియున్నాడు. జగన్నాథుడు కూడ నీసిద్ధాంతమును విమర్శించి, యీరసాస్వాదనకు వేదాంతులు చెప్పు బ్రహ్మానందముతో సమానతను సంపాదించి, "ఆవరణభంగమే"యానంద స్వరూపమనియు నాటకాదులందు చిత్స్వరూప నావరించియున్న మాయ యడుగంటుననియు నందువలని యానందము కలుగుననియు నిర్వచించి యున్నాడు. జగన్నాథపండితుని రస గంగాధరమున నింక నేడుమతము లీయబడినవి. కాని వాని నంతగా పరిశీలింప ప్రయో జనముండదు.

## సర్వమతసంగ్రహము.

**భట్టలోల్లటునియుత్పత్తివాదము.**—న రత్యాదిస్థాయిభావములు ప్రథమమున విభావమహిమచే రామాదినాయకులయందే యుదయించి వ్యభిచారిభావములచే వృద్ధిని పొందును. నాట్యకుశలుడగు నటుని, సామాజికుడు చూచి, యానటుడే రాముడని తల చును. అనగా నతనియందు రామత్వ మారోపించి, తన్మూలకముగా రామనిష్ఠభావములను గూడ నానటునియందే యారోపించును. ఇందువలన సామాజికున కానంద మొదవును.

**శ్రీశంకుకునివాదము.**—చిత్రతురగమును చూచి మనుజు లాచిత్రము నెట్లు నిజ మగుగుఱ్ఱమని తలచెదరో అటులే, నటుని యభినయమును, వేషభాషాదులను చూచి, సామాజికుడు, తాను చూచునది నటునిమాత్రమే యనుజ్ఞానము నశించి, యానటుడే రాము డనుకొనును. నటుడు ప్రదర్శించు ననుభావములను వ్యభిచారిభావములను చూచి, యాభావములు కృత్రిమములని మదినెఱుంగక, సామాజికు డొకయపూర్వమగు నను మితిచే నటనిష్ఠమగునట్లు తాననుభవించును. "ఇతడు సీతావిషయకమగు రతిగలవాడు" అను నొకయలౌకికమగు ననుమితిచే సామాజికు డానందము ననుభవించును.

**భట్టనాయకునిమతము.**—కావ్యనాటకములయందు ప్రథమమున నభిధావ్యాపార ముచే విభావములు ప్రతిపాదింపబడును. ఇట్లు ప్రతిపాదింపబడిన విభావాదులు స్థాయిభావ ములును, భావకత్వవ్యాపారముచే సాధారణీకృతము లగును. సామాజికునిహృదయమున నున్న ప్రాపంచికసుఖదుఃఖవిషయకచిత్తవృత్తులును చాంచల్యమును గూడ నశించును. తరు వాత భోగకృత్వవ్యాపారముయొక్క మహిమచే సామాజికునిహృదయమున సత్వగుణో ద్రేకము కలుగును. కలుగుటతోడనే మన మానందమయమే యగు.

**అభినవగుప్తునిమతము.**—కావ్యానుశీలనాభ్యాసవశమున విశదముగు మనోముకు రము గలసహృదయుడు, నాటకశాలను ప్రవేశించుటతోడనే తననుగూడ విస్మృతిచెందును. తనప్రాపించికసుఖదుఃఖముల మఱచును. ఇతడు నటుడనుజ్ఞానముకూడ కలిగియుండడు. ఇట్లు తాజూచువిభావానుభావాదులకు సాధారణీకరణత్వమును సంపాదించును. సాధారణీకృత ములగు నీవిభావాదులు సామాజికుని హృదయము నందు నిలీనమై యున్న భావముల నుద్బో ధించును. అప్పు డుద్బుద్ధమై, విభావాదులచే పరిపోషితమైన యాస్థాయిభావము రసముగా పరిణమించును. సామాజికు డనిర్వాచ్యమగు నానందమున నోలలాడును.

**అభినవగుప్తునివాదమునందలి ముఖ్యసిద్ధాంతములు.**—ప్రతిసహృదయునిహృదయమునను వాసనాత్మక మగుభావము లణగియుండును. ఇవి సముచితసామగ్రి యున్నప్పు డుద్బుద్ధమగును. 2. విభావానుభావములు పాత్రయందలి మనోభావముల నభివ్యక్తి చేయును. 3. సామాజికుడు తాఁజూచు నట తద్గతానుభావవ్యభిచారిభావస్థాయిభావాదుల నపహసితతత్తత్కాలదేశవ్యక్తి విశేషావచ్ఛిన్నములుగా నవలోకించునుగాని ఏదేని యొక వ్యక్తికి సంబంధించినట్లు గాంచడు. 4. ఇట్లు స్థాయ్యాదులను సాధారణభావముతో గాంచిన నాడు సామాజికునిహృదయమున, నాతడు చూచినభావముల కనుగుణమగు భావములుత్తేజమును బొంది యుద్బుద్ధమగును. 5. నటగతాభినయాదులు (కావ్యగతాలంకారాదులు) సామాజికునకు రసప్రతీతి నాటంకపరచువిఘ్నములఁ బారద్రోలుటయందు దోడ్పడును. 6. ఉద్బుద్ధమగుస్థాయియే రసాత్మకమై యాస్వాదింపబడుచున్నది. ఈయాస్వాదన మానసికప్రత్యక్ష విశేషమే యగు.

ఇట్లు మనప్రాచీనులు వివిధగతుల మనమనోతత్త్వముల నన్వేషించి కూర్చిన సిద్ధాంతముల నధునాతను లవలోకించి, యీభావములను పాశ్చాత్యవిమర్శకాగ్రేసరులభావనలతో సరిపోల్చి చూచి యుక్తాయుక్తముల నఱయుదురుగాక.

---

**శ్రీ శ్రీ శ్రీ జయపురము సంస్థానాధీశ్వరులు శ్రీవిక్రమదేవవర్మ మహారాజావారు, జయపురము.**—

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి కానుక కమిటీవారు ఆరంభించిన కార్యక్రమము ఏనాడో జరిగియుండవలసినది. వారిసేవ ఇప్పటికి బహిరంగముగ అనుమోదింపబడినందుకుముద మొందుచున్నాను. కీ॥ శే॥ శ్రీరామస్వామిశాస్త్రులవారు భారతీయవాఙ్మయసేవ ముఖ్యముగా దక్షిణఇండియాలోనివాఙ్మయసేవ చేయనారంభించిరి. శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు ఆపనిని నిరంతరశ్రద్ధతోను దేశాభిమానముతోను సాగించినారు. వావిళ్ల కార్యాలయమువారు తెనుగు, సంస్కృతము, అరవము, ఇంగ్లీషుభాషలలో అముద్రితమైన ఎన్నియో గ్రంథములను ముద్రించియు పునస్సంపాదించియు ప్రకటించియు వైజ్ఞానికతేజమును నిలుపుకొనివచ్చినారు. ఇట్టి కార్యము వీరు తలపెట్టకపోయినయెడల తెలుగువాఙ్మయము నేటి ఉదారస్థితియం దుండియుండదు. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి విజయాభ్యుదయపరంపరల నాశించుచున్నాను.

# రసానుభూతి

శ్రీ జమ్ములమడక మాధవరామశర్మగారు, ఉపాధ్యక్షులు, సంస్కృతకళాశాల, తెనాలి.

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్, ఆనందాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, ఆనందేన జాతాని జీవంతి, ఆనందం ప్రయంత్యభి సంవిశంతి".

కావ్యవిద్యాప్రవృత్తిని బరిశీలించినచో నానందము పరమప్రాప్యముగ నవభాసించును. ఆనందమును గోరుసాధకున కనేకమార్గములు, సంప్రదాయములు నిరూపింపబడినవి. సాధ్యసిద్ధికి వలసినసాధనసంపద యున్నప్పుడే సాధకుడు సాధకుడు కాగలడు. సాధకునిసాధన ఉపాసన. ఉపాసన స్వరూపసంపత్సిద్ధికి సూచిక. ఉపాస్తి వేద్యము సమగ్రము కాదు. కాని వేద్యవేదనమున కుపాసనయే కావలయును. విద్యలన్నియు నుపాసనలు. విద్యలలోని యుపాస్తిరహస్యము తెలిసి ప్రవర్తించుటవలననె భ్రాంతి నశించును. ప్రధానఫలమును బెడద్రోసి పామరులు పరాఙ్ముఖులై యానుషంగికక్షుద్రఫలముల కాంక్షింతురు. అప్పుడు విద్యలు గూడ నవిద్య లగుచున్నవి. స్వరూపసంవిత్తి ప్రధానప్రయోజనము దానినే ఉద్దేశించి జీవితరథమును నడుపుమానవుడు అవిద్యలగూడ విద్యల నొనర్పగలడు. విద్యలందలి విద్యాత్వ మాతని కవగతమగును. కావ్యవిద్యయు విద్య స్వరూపాభినివేశమున జెప్పినచో గావ్యవిద్యయే విద్య యనవలయును. కావ్యవిద్య విజ్ఞప్తి యున్మేషోల్మీలనముల నవగాహము చేసికొనినపుడు స్వరూపోపాస్తిగా నవగతమగును. అప్పుడు రసానుభూతి యున్నది.

రస మాత్మ. తదనుభవమాత్మసాక్షాత్కారము. అదియే స్వరూపజ్ఞానము. దాని నహామానందమని వ్యపదేశింపవచ్చును. దీనివివేకమున కనుబంధవిచార మొనర్పవలయును. రసానుభూతియం దధికారి సహృదయుడు, ఈతడే సామాజికుడు, రసికుడు, భావకుడు, అహామానందసాధకుడు. అట్టి సహృదయత సామాన్యముగా లబ్ధముకాదు. "బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే" అనునట్లు సహృదయత్వమును ఎప్పుడోకాని రాదు. సహృదయతను సంపాదించుసామగ్రి పుష్కలముగా నున్నను సామాన్యముగా నందరు సహృదయులు కాజాలరు. హృదయముతో నుండునాతడు సహృదయుడు. మానవునకు హృదయ ముండకపోదు. కాని అదియున్నట్లు తెలియువా డొక్కడే యగును. హృదయ

మాత్మసత్తను గోచరింపచేయును. ఆత్మవేదనోన్ముఖమయిన అంతరంగముగలవానిమాత్రమే సహృదయపదమున వ్యపదేశింపగలము. హృదయ మాత్మప్రతిబింబనము పొందుట కర్హము. ఆత్మ నిత్యచేతనము. ఆచైతన్యకలితమగు నంతరంగము నాకు గలదని భావించునాతడు సహృదయతాభాజనుడగును. అందువలన సహృదయునకు భావనాబల ముండునని తెలియ గలము. సహృదయుడు నిరూపితార్థముల నంధదృష్టితో స్వీకరింపడు. వానిని భావనలో వడపోతపోయును. వానిసామంజస్యము నవలోకించును. దృశ్యజగత్తునందు సమన్వయిం చును. ఆత్మసంవాదమును సంపాదించును. ఇన్నిరూపాంతరముల సంపాదించినగాని నిరూ పితార్థముల నిరూఢము చేసికొనడు. అఖండమగు భావనాధార యాతనికి సంవిద్బలము నిచ్చును. ఆతనిభావన నికషోపలము. అందు నిరూపితములన్నియు కషింపబడును. అప్పు డాతడు ఉచ్చావచముల తెలియును. కాని యాతడు స్వీకార్యమునే స్వీకరించును. ప్రాచీ నార్థములు బంగారములే యగుగాక. వానిని భావనాగ్నియందు పుటముబెట్టువాడే సహృద యుడు. ఇదివరలోని వానిరూపధేయములు పోయి నూతనభావనారూపములు సిద్ధించును. అట్లు పరిణత పరిణామమనోహరనీలపీతాదుల గ్రహించుసహృదయుని భావనాబలమున అద్భుతమహత్త యున్నది. భావన సామాన్యకార్యముకాదు. ఆత్మనిధ్యానము భావన. భావ నచే నెయ్యది సిద్ధముకాదు ? అది విజ్ఞానరేఖ.

భావనలో జాగతికపదార్థములసంబంధ మవసరముకాదు. అయినను అది నిరాలం బముకాదు. ప్రపంచవస్తువులలోని సహజనిత్యవస్తుత్వమును భావనావగాహనముచేసుకొని సకలవస్తువులకు వస్తుత్వమును సంపాదింపగలిగిన నిత్యసంవేదనము భావనలో లక్ష్యమై యుండును. మనస్తత్వ మట్టిది కాదు. ప్రపంచపద్ధతులు మనోభూమిలో శబలితములై యుండును. మనోరసమును జాగతికతత్త్వములు కలుషితములు చేయగలవు అట్లు కలుష మైన మనోధారలో సిద్ధభూమి యుండదు. అందువలననే గమ్యగతిలేక అనేకములైన యూహాధారలు ప్రసరించును. అవియే సంకల్పవికల్పములు. అట్టిసంకల్పవికల్పములు భావ నలో నుండవు అవి అన్నియు ఇందు పరాహతములగును సంకల్పమందలి సంకల్పత్వముగాని వికల్పములోని వికల్పత్వముగాని సహృదయునకు గోచరముకాదు. మనోభూమికను అతిక్ర మించిన అసహృదయుడు సంకల్పవికల్పములోని మూలసత్తనే అవలంబించును. తనస్వరూప సంవేదనమునకు ఆవరణ మున్నదని సహృదయుడే తెలియగలడు. అట్టి యావరణమును భంజించుటకు ఆతడు సర్వదా ప్రయత్నించును. ఆవరణభంజనసమర్థత గలయాతడే భావనా బలము కలవాడగును. అట్టి ఉద్రిక్తభావన కాంతభావనయై ఆవరణభంజనము చేయగలదు.

సహృదయునకు హార్దికధర్మములు సముల్లాసము పొందును. మనోరసములోని ధారాగతి ప్రసరించుచున్నంతవరకు హృదయధర్మములు వికాసము పొందవు. సహృదయుడు మాత్రమే వానిని వికసింపచేసుకొనగలడు. ఆతడు హార్దికధర్మవిలాససుందరుడు. ఇట్టి సౌందర్యమును ఆత డవగాహము చేసుకొనుటకు సమర్థుడగును, శబలితమైనను కలుషితము కానప్పుడు అంతరంగముల సహజస్ఫూర్తి సముల్లసించును. అంతరంగములోని సత్త్వ జన్మాంతరములలోని సంస్కారము ననుబంధించియుండును. కేవలము ఒక్కప్రాక్తన సంస్కారమే సహృదయునకు చాలదు. అధునాతనసంస్కారము కూడ నాతనికి నిత్యాపేక్షితమై యున్నది. కేవలము ఇప్పటి సంస్కారము కాని, కేవల మప్పటి సంస్కారముకాని సహృదయతకు ఉపకరించవు. ఉభయసంస్కారములు సమరసము లయి సహృదయునియందు అనుగతములగును. వీతరాగులకు ఇప్పటిసంస్కారముండదు. కావుననే రసానుభూతి కలుగదు. కొందరకు ప్రాక్తనసంస్కార ముండదు. అట్టివారు రసానుభూతిని పొందజాలరు. రెండువిధములైన సంస్కారములు ఆత్మసముస్ముఖతను సంపాదించును. ఆత్మదీపమునకు అంతరంగములోని ధర్మములు ఉన్ముఖములై దీపితములగును. అట్టి దీపకాంతి రంజితములైన అంతరంగవృత్తులు రసానుభూతికి అర్హతను సంపాదింపగలవు. అంతరంగమంతయు గుణమయమేకాని గుణప్రకృతికంతకు అంతర్ముఖమయినవృత్తిని సంపాదింపగలిగినపుడే సహృదయుడు కాగలడు. గుణముల ప్రస్తారప్రవాహములో పతితమయిన అంతరంగము గుణమూలమును పొందజాలకపోవచ్చును. అది బహిర్ముఖవిహారములోని విశేషము. అంతర్జగత్తును అవలోడించి భావనాపరిపక్వతను పొందినయాతడే గుణప్రకృతి నంతను రసాత్మసమన్వితము చేయగలడు. అందువలననే గుణమునందలి గుణత్వమును అతడు పరిహరించుకొనును. అధ్యాసవశమున రసమే గుణముగ భాసించుచున్నది. భావనావివేకము అధ్యాసను నశింపచేయగలదు. కావుననే అప్పుడు గుణమునందు గుణత్వ ముండదు. సర్వవస్తుస్వీకారములో తృప్తిని పొందునాతడు అసహృదయుడు. నిఖిలపదార్థపరిహారములో సంతృప్తిని సంపాదించునాతడు సహృదయుడు.

సహృదయపదము కావ్యనాటకములందు కన్పించునంతమాత్రమున కేవల కావ్యనాటకపఠితసహృదయుడని తలచరాదు. సహృదయతకు వలయుపరికరము బహుళముగానున్నది. వేదతదర్థవిజ్ఞానపటిమయుండుట యావశ్యకము. సాహితీనిషేవణమునకు వలసిన సమర్థత కావలయును. కావ్యనాటకాదులే సాహిత్యమని తలచరాదు వైదికవిజ్ఞానము కూడ సాహితీరంగమున నంతర్భవించును. అందువలన వేదవేదిత సహృదయతకు గావల

యును. వేదాంతవిజ్ఞానబలము కూడ నపేక్షితము. వేదవేదాంత వాసనాబలమున్నగాని హృదయధర్మములు వికాసము పొందజాలవు. మనోవికల్పములలోని దొంతరలు కూడ నాతడు తెలియవలసియున్నది. కావున శాస్త్రీయసంస్కారపటిమయు నావశ్యకము.

వేదశాస్త్రములవాసనలు వ్యాపించినపిమ్మటనే సహృదయత సమున్మేషము పొందును. సహృదయత కిది సామగ్రి యనుటవలన సహృదయునియం దాసంస్కార మనుగతమై యున్నదని యూహింపవలయును. జన్మాంతరములలోని సంస్కారము కూడ కస్తూరీపరిమళ మువలె సంక్రాంతమై యుండును. సాహితీభావకు డొకయోగి. ప్రాణవృత్తుల ప్రసర ప్రభావముల నవగాహము చేసుకొనినగాని రసానుభూతివైభవము గోచరముకాదు. రససంక్రాంతిలో నెట్టి సూక్ష్మగతిని దాను హృదయఫలకమున ననుభవించుచున్నాడో దాని తెలియుటకు వాయుసంస్కారముగల సాహితీయోగియె తెలియగలడు. రసవేదనము పొందు భావకుడు విజ్ఞానభూమీవిహారి. మానవునివిజ్ఞానధార క్షణక్షణపరిణామశీలముతో నుండును. అందనంతపరిణామములు గల్గుచున్నప్పటికిని విజ్ఞానసాతత్యమును భావకుడు పరిశీలింపగలడు. సహృదయునియందు విజ్ఞానకేంద్రము లనేకము లుండును. అవియన్నియు కూడ నానందస్రోతోమూర్తిని కురిపించుకొనుచుండును పూర్వ పూర్వకేంద్రమునకన్న నుత్తరోత్తరవిజ్ఞానకేంద్రమున నానందానుగతి విస్పష్టముగా నుండును. ఈవిజ్ఞానకేంద్రములన్నియు నానందభూమికలని వ్యవహరింపవచ్చును. ఈభూమికలం దొడుదుడుకులులేని సరళగతిని సంపాదించినప్పుడు చక్కనిభావుకత సంసిద్ధమగును. భూమికలం దవాంతరములైన జ్ఞానప్రసారము లుండవచ్చు. వానివైభవమును ప్రజ్ఞావత్తతో శీలింపగలిగినభావకునకు సహృదయత సొమ్ము. స్వరూపప్రతిభాసంపన్నుడైననే సహృదయతగలవాడగునని భావింపవలయును. స్వరూపసంవేదనము రసానుభూతి యగుటవలన స్వాత్మదేవతాసమావేశ మున్నప్పుడే సర్వప్రమాతృస్ఫురత్తాసారమగు రసమున ప్రవణత కలుగును నిఖిల ప్రమాతృభావస్వరూప మైనప్పటికి ప్రమాతృవిశేషరహితమైన స్వరూపసంవేదనమున ప్రతిభానత్వము కల్గిననే పూర్ణభావుకత సిద్ధమగును. భావుకత యొకవిశిష్టధర్మము. సర్వవిశేషము లొకేసమయమున రూఢములు కావు. ఒక్కొక్కప్పు డొకవిశేషము సంకలితమగును. అట్లే జన్మజన్మల గూడుకొనిన విశేషములు సంస్కారాత్మతను పొంది భావనాదేహము ననుబంధించి యుండును. ఒక్కొక్కజన్మలోని ఒక్కొక్కవిశేషమునం దొక్కొక్కయంశము నభిమానింపగల శక్తతయే యేర్పడును. విశిష్టరసభోక్తృత్వమునకు సర్వ

విశేషముల సమరసత కావలయును. కావుననే జన్మజన్మలసంస్కారసాహిత్యమే రసానుభూతి కనుగుణసామర్థ్యమును సంపాదించి సహృదయత్వము నాపాదించును.

శాస్త్రజ్ఞానకైవల్యము భావుకతకు విరోధికాదుగాని సాధకము కాజాలదు. సర్వశాస్త్రములసారము సహృదయత కపేక్షితము. కేవల మేకైకశాస్త్రవిషయపరిజ్ఞానమున భావుకతాకోశ ముద్ఘాటింపబడనేరదు. మెఱుగుపూతతోగూడుకొనిన శాస్త్రీయానుభూతి రసానుభూతి నాపాదింపగలదు. భావుకునకు కేవల మానందమునే పొందవలయు ననెడి యభిలాష ముచితము. లోకసంగ్రాహకమైన యానందప్రేప్సయున్నప్పుడే సహృదయతాముద్ర శోభితమగును. సర్వగమ్య మానందమె అయినను నెల్లని ఆనంద చుంబనము చేయవలయు ననుకొనరాదు. అట్టి యభిలాషలోని తీవ్రతవలన నానందము సంప్రాప్తము కాకపోదుగాని యది హఠాదానందము, అది స్వరూపసత్త కుపకరింపదు. దానివలన సర్వావరణభంజనము కలుగదు. సర్వసంవృత్తిభగ్నత నాపాదించుకొనునాతడే సిద్ధభావకతను పొందగలడు. కావుననే వ్యుత్పన్నప్రతిభ యపేక్షితము వ్యుత్పత్తియందలి పరమాకాంక్ష విజ్ఞానము నాపాదించును విజ్ఞానయుతమైనభావుకతయే యారాధనీయము. అట్టి భావకుడె తగినరసానుభవము పొందుట కర్హుడు కాకపోయినచో భావకతాభాసమున స్వయంహాతత్వమును పొందుటయేకాక పరాహతిత్వ పాపభాజనత్వమున గూడ దుర్భగుడు కావలసివచ్చును. సహృదయతాభాస సముచితము కాదు. దానివలన శ్రేయఃప్రవిఘాతము కలుగును. రసానుభూతిలోని యాభాసవివేకము గూడ నాతనికి లభింపదు. భావుకతను నటించువాడు మిథ్యాచారుడు. ఆతడు సహృదయలోకమునకు క్షంతవ్యుడుకాడు. వేదాంత జిజ్ఞాస యొనర్చునట్టి సాధకునకు యోగ్యత లనేకము లపేక్షితములై యున్నవి. "చతుర్భిస్సాధనైః సమ్యక్ సంపన్నో యుక్తిదక్షిణః, మేధావీ పురుషో విద్వాన్ అధికార్యత్ర సమ్మతః" అని శంకరభగవత్పాదుడు పల్కుచున్నాడు. సాధనచతుష్టయసంపదగలవాడు, యుక్తిబలమును సిద్ధార్థమున కనుకూలము చేసుకొనగలవాఁడు, చక్కనిమేధాసంపదగలవాడు, స్ఫుటచైతన్యాభివ్యక్తియుక్తుడు; నానావిషయపరిజ్ఞాత యగువాడే యౌపనిషదబ్రహ్మవేదనమున కధికారి కాగలవాడని యందలి తాత్పర్యము. ఇట్టి యర్హతలన్నియు రసానుభూతిని పొందు సాహితీపరమయోగికి నిత్యావసరములై యున్నవి. ఇంతియేకాదు. సాహిత్యాధికారియందు విశిష్టత యున్నదన్నను భావాద్వైతమార్గులు కోపింపరు. వేదాంతాధికారియందు సంవేదనక్షుద్బాధ యధికము. సాహిత్యాధికారియందు స్వసంవిన్మయీదేవతావేదనమున శాంతభావన యున్నది. శివశక్తుల కబళించుకొను నఖండవిశిష్టవిజ్ఞప్తి సహృద

యునకే గలదు. దృశ్యజగత్తు నీతడు హేయముగా దలచడుగాని యదియే నిత్యమని ప్రాకులాడడు. అనాసక్తితో జాగతికతత్త్వవిలాసముల నాత డనుభవించుస్వభావము గల వాడగును. ప్రపంచములోని నీలాదిపదార్థానుభూతిలో నాతడు లాలసతను జూపడు. అవియన్నియు నాత్మరసానుభూతి కుపకరించునని యాతడు తెలియును. సర్వేంద్రియవృత్తు లకు గోచరమగు నాయాపదార్థములందు సంవిత్స్వభావము లేవిధమున ననుగతములై యున్నవో సాహిత్యాధికారి యన్వేషించును. రసాత్మ యొక్కటియే నిత్య మనుజ్ఞాన మున్నప్పుడే భావుకత వికసించును తదతిరిక్తములుగా భాసించునవి యన్నియు నిత్యము లనికాని యనిత్యములనికాని యాతడు తలచడు. వానియం దతనికి యుదాసీనభావ ముండును. అయినను వానినన్నిటిని వలయునంతవరకు అనుభూతిసహకారులనుగా గైకొనును. వానియం దనుషక్తతను జూపడు. కావుననే వానిని రసాంగములుగా సమన్వ యించుకొని విభావవ్యపదేశ ముంచి భావించును. ఇట్లొనరింపగలయాతడే రసానుభూతి కధికారి. జాగతికపదార్థములన్నియు భావకుని యుపభోగభూమిలో నుండకపోవు. వాని నుదాసీనానుభవమున శీలించును. ఉపభోగసామగ్రి లేనపుడు కొందరకు నివృత్తి ఉదయిం చును. అట్టి యలబ్ధినివృత్తి భావుకతాసంపాదకము కాదు సర్వోపభోగసామగ్రి యున్న ప్పుడే నివృత్తిపథమున పదముంచునాత డుత్తముడు. ఇట్టి శోధకుడే సహృదయుడు కా గలడు. భోగ్యములసన్నిధానమున నివృత్తిరసికుడైనను భోగ్యానుభవదూరుడని తలచ రాదు. భోగ్యలాలసత్వ మాభావకునకు లేదు. అది యాతని విశిష్టతశబ్దస్పర్శరూపరస గంధము లన్నిటియందును నాయాతత్వసంపాదకమైన నిత్యసంవిత్పదార్థమును సమీకృత దృష్టిలో నన్వేషించునాతడే సహృదయుడు. పృథివ్యప్తేజోవాయ్వాకాశాత్మకములయిన సర్వభూతభావముల నేకీకరించి భావించుభావకుడు విశిష్టభోక్తృత్వమును పొందగల్గు చున్నాడు. ఆవిశిష్టభోక్తయే తనసంవిదాత్మయందు భూతపృథగ్భావమును విలాప మొన రించి రసానుభూతిని పొందును. ఇట్టి యలౌకికసముల్లాసముననే సహృదయత్వము సమున్మే షము పొందుచున్నది. దీని నితరులు ఈర్ష్యింపరాదు. ఇట్టి సాహిత్యయోగి సహృదయుఁడు, సుహృదయుఁడు.

ఇంతవరకు నిరూపింపబడిన స్వరూపలక్షణములు గలమానవుడు ముఖ్యాధికారి. ఏతదధికారితాసంపాదనమున కనేకసాధనము లున్నవి. కొన్ని బహిరంగములు. కొన్ని యంతరంగములు. మీమాంసాన్యాయవ్యాకరణాదిశాస్త్రాభ్యాసము బహిరంగసాధన. పౌనః పున్యమున భావనాప్రసారము గలవాడగుట యంతరంగసాధన. కావ్యామృతములచే

నాతనిహృదయము మృదులమైనప్పుడే యర్హత యాపాదిత మగును. సాహితీవిద్యాస్వీకారమునకు వలసినయోగము నవలంబించినసాధకుడు నైతికవర్తనమున నుండవలయుట యావశ్యకము. కొందరు సాహితీయోగులలో నైతికాచరణము దూరమగుచున్నది. వారు సాహితీపతితులు. తా మర్హతాసంపాదనకై యెట్టి శాంతిదాంత్యాదుల నవలంబించిరో యట్టి శాంత్యాదులు తమ్ము దర్శించువారికిని కలుగునటుల తా మాదర్శసాహితీసేవకులై యుండుట యుత్తమము. గౌణాధికారులం దీలక్షణములు సమగ్రముగా నుండవు. వారు సాహితీవిద్యయొక్క యనుత్తమత్వమును భావింపజాలరు. అది సర్వప్రధానమని తలచలేరు. తా మభ్యసించినశాస్త్రములకు సాహితీవిద్య నంగముగా భావింతురు. దీనిప్రాధాన్యము నొకప్పుడు శాస్త్రవిషయపరాహతబుద్ధులై యపలాపింప జూతురు. వారలకు నిర్మలాత్మరసానుభూతి కలుగదు. మలినరసమును వారనుభవింతురు. అందువలననే రసమందు శబలితత్వమును జెప్పబూనుదురు. రసకైవల్యమును ఖండింపజూచు నాగౌణాధికారులకు సాహితీవిద్యానుగ్రహము కలుగదు. కొందరు మిథ్యాధికారు లుందురు. రసానుభూతి కర్హమైన యధికారసంపద తమయందు లేకున్నను నున్నట్లభినయింతురు. వారలనుజూచి లోకము మోసపోవును. రసమయగ్రంథములు వారివలన మిథ్యాభిశంసితము లగును. వారియనంతరకాలమున నుత్తమభావకులయందును లోకమునకు ప్రత్యయము నశించిపోవును. భావకు డుత్తమ విమర్శకుడు. ఆతడే మిథ్యారూపుడైనచో లోకము హతమగును. సాహితీపథమున గొందరు దుష్టాధికారు లుందురు. వారు తమతాహతు నెఱుంగరు. రసానుభూతికి తమ కర్హత లేదని యంగీకరింపరు. సాహితీకన్యను వారు బలవంతపెడుదురు. రసమున సముల్లసితము గనే వా రాస్వాదింపజూతురు. తమకృత్యమందలి యనుచితత్వమును వారు శీలింపజాలరు. రసమయరచనల విసరవిశేషముల దాము తెలియజాలరు. తెలియనివానిని తెలిసినట్లు నటించుటయె కాదు. తమకు తెలియనివి యుండవనుకొందరు. ఏవియేని తమయూహకు గోచరము కాకపోయినచో వాని దూషింతురు. అసంగతము లందురు. ఉపహసింతురు ఈదుష్టాధికారుల పరిహాసమువలన రసరేఖలు రూపుమాసిపోవుచున్నవి. దుష్టాధికారు లప్రాజ్ఞలోకమున జక్కగా మెచ్చికోలు పొందుదురు. తమభావవిషము నితరులకు వారు ప్రసాదించుచున్నారు. దాని నమృతముగా స్వీకరించువా రనేకు లుందురు. ఈబహుళసమ్మతి హానికరము. రసదీప్తులు చక్కగా ప్రసరించినగాని పఠితలు తమసామర్థ్యము నెఱుంగజాలరు. తనబలమును దెలియునాతడే సహృదయుడు.

## వి ష య ము

కావ్యవిద్యలో విషయము రసము. రసమునునది యుపలక్షణము. భావము, రసాభాస, భావాభాస, భావసంధి, భావోదయము, భావశాంతి, భావశబలత యనునవియు విషయములుగా నెన్నదగియున్నవి. రసభావాదుల కంగములుగా నుండునవియు నుపాంగములుగా నుండునవియు కూడ విషయములుగా పరిగ్రహణీయములు. వానివానిని దత్తత్స్వమయమున నుల్లేఖింతుము. వేదాంతవిజ్ఞాననునిశ్చితార్థులకు బ్రహ్మయే విషయము. అయినను దద్వికారములుగా దలచబడునవియు విషయములుగా, విజ్ఞేయములుగా నిశ్చప్రచములగుట నిరుక్తార్థమే. అట్లె యిచట రస మొక్కటియె మహావిషయమైనను తదంగోపాంగము లన బడు తద్వైకారిక ప్రణాలికాపతితములన్నియు స్వీకరింపతగియున్నవనియె తెలియవలయును. రసమాత్మ. అది బ్రహ్మ. అది నిత్యచేతనము. ఆచేతనాధాతువుయొక్క లీలాయితమైన మహాశబ్దవిశ్వము అనాద్యనంతమైనను సాపేక్షమైయున్నది. కావుననే శబ్దగోళముయొక్క వికాసనముద్భూతికి రసచేతన సర్వహేతువై యున్నది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అంతయు నాత్మరసమె. అందువలన రస మొక్కటియే పరమార్థము. భావుకసాహితీనిష్యందము రసాధారముగా వెలారుచున్నది. ఆచ్ఛన్నతత్వము స్థూలదృష్టికి ప్రతిభాతముకాదు, అప్పుడన్వేషణ మధికమగును. రసము మన కన్వేష్యము. రసమే వస్తువు. ఇప్పటి యవస్థలో కన్పడు వస్తువు వస్తువు కాదు. ఇదియు వస్తువనుటకు సహజవస్తువయిన రసమే హేతువు. వస్తువయినరసము ప్రస్తుతపు టవస్తువుగా నేల వివర్తించినది? దీని సమాధానాన్వేషణాయాసము ప్రయోజనకరముగాదు. ఆవస్తువు ప్రస్తుతిలోనున్న మనము వస్తుతాసముల్లాసమునకు గవేషించుట యుచితము. వస్తుగవేషణమునకే వస్తు వుపకరింపదనుట సత్యమే. అవిద్యాపథము ననుసరించియే విద్యామార్గమును దెలియవలయును గదా? ఈవిశ్వజగద్విలాసమంతయు నవస్తువు. దీనియనుసరణమున రసవేదనము పొందవచ్చును. జాగతికభావము నిందు తుచ్ఛముగా భావింప నక్కరలేదు. అతుచ్ఛముల తుచ్ఛభావనచే తుచ్ఛమగుటగాని తుచ్ఛమతుచ్ఛభావమువలన నతుచ్ఛమగుటగాని మనము తలచినచో మోసపోవుదుము. తుచ్ఛము తుచ్ఛమే, అతుచ్ఛ మతుచ్ఛమే కాని మనప్రతిభానములో తుచ్ఛ మతుచ్ఛముగా నతుచ్ఛను తుచ్ఛముగా భాసించుచున్నదేమో? ఏమో యననేల! రసము విశ్వమై గోచరించుచున్నది. విశ్వము రసమేగదా! దీనినేల రసేతరముగా భావింపవలయును? రసము నరసముగా భావించుట సరసముకాదు. కావున నీమహావిశ్వము నంతను రసమయముగా భావింపవలయును. రసమయమగు జగత్తునందలి పదార్థమంతయు రసమువలె విషయమే యగుననుట

నిర్వివాదము. రసమును నిర్వచించుటకు ముందుగా భావపర్యాలోచనచేయుట సముచితము. ప్రపంచమునందు జడాజడపదార్థము లనంతములుగా నున్నవి. జడములుకాని యజడములు కాని రసపరమార్థదృష్టిలో భిన్నములు కావు. అయినను లౌకికవ్యవహార నిర్వహణమునకు భేదము నంగీకరింపవలయును. జడవస్తువులకన్న నజడములందు చైతన్యవిలాస మధికముగా నుండును. పాషాణమునకును చిత్తము కలదేమో కాని యది స్ఫుటము గాదు. చేతనము లందు చిచ్ఛక్తి యధికముగా భాసించును ఆచిదవభాసమును దెలియుట కజడపదార్థము లందు సమర్థచిత్త మున్నది. చిత్తము పరిణామస్వభావము. చిచ్ఛక్తి ధారాపాతమువలన చేతమునం దనంతస్పందము లుదయించును. ఆయంతరంగపరిస్పందము నిలుకడలేని ధారా గమనము గలదైనచో వ్యపదేశ్యత్వము పొందజాలదు నిరాధారముగా లక్ష్యరహితముగా బయలుదేరు స్పందములలో నిర్ణీతతత్వ ముండదు. ఒకలక్ష్యము నుద్దేశించిన యంతరంగ పరిస్పందమే గణనీయము. స్పందసామాన్యమునకు రసీభావసంపద గమ్యమనుట వాస్తవమే. అయినను స్పందవిశేషములే యవసరాపేక్షితములై యున్నవి. లక్ష్యానుధావన మొనరించు విశిష్టస్పందములగతి ప్రగతులలో సమష్టిశక్తి వ్యూహము భాసించును. అట్టి స్పందశక్తులు సాధారములై లక్ష్యసహితములై యుండునని తెలియగలము. స్పందధారలో ననేకముల నేకీకరింపగల కేంద్రీకరింపగల ప్రకటసత్త యున్నది. అట్టి ప్రకటసత్తవలన స్పందములందు నిలుకడ కలుగుచున్నది. విశిష్టస్పందములు భావములుగా వ్యపదేశింపబడుట కర్హములై యుండును. సామాన్యముగా స్పందమును భావముగా దెలియుట కీవిషయము మూలాల వాలము. ఆయావస్తువులందున్న చిచ్ఛక్తి యుపాధిభేదమున భిన్నభిన్నముగా నుండును. భిన్నశక్తుల కేకీకృతిపదార్థసంసర్గములందు భాసించును. అచేతనవస్తువులోని శక్తిస్పందము కన్న చేతనములోని శక్తిస్పందము స్ఫుటముగా నుద్గమించును. కావుననే వస్తుసన్నిధానము నందు చిత్తపరిస్పందమును మన మనుభవింతుము. ఇట్లు కలుగు ననంతస్పందములలో కొన్నియే నిలుకడకలవి యగును. నిలుకడతో నుండునట్టిస్పందమును భావముని గమనింప గలము. ఇట్టి భావసామాన్యమంతయు స్వరూపసంవేదనమునకే యుపకరించు ననుటను మనము మఱువరాదు. భావములన్నియు రసీకృతిని పొంది చరితార్థము లగును. రసమే భావము. భావమే రసము. భావరసములకు శబ్దభేదము మాత్ర మున్నది. చిత్త స్పందరూపమగుభావము రసాత్మగా వ్యపదేశింపబడుట కింకను గొన్ని ప్రక్రియా విశేషము లవశ్యాపేక్షితములై యున్నవి. భావమునకు స్థాయితానిష్పత్తి యుండవలయును విరుద్ధావిరుద్ధముల సంవలనము లేకపోవుటయే స్థాయికత్వము. అంతరంగమున నుపహితమై

యున్న భావధర్మమునకు తదితరాంతర్వృత్తుల శబలితత్వము పనికిరాదు. కేవలము భావో ద్దీప్తిని కలుగచేయుచున్న వేశమే యవసరము. అందువలననే మొదటిభావమున కంగభూత ములుగా నెన్నియున్నను హానిలేదు మొదట నంతరంగసంబంధముతో నున్నచిత్పరిస్పంద మునకు నానాసంబంధమున న్యూనత కలుగకుండుటకొరకై స్థాయిత్వ మాకాంక్షింప బడును. మొదటియవస్థలో చైత్తికములశబలత యుండరాదు. అట్టిసమయమున నేకవిధ మైన స్పందశక్తులు ప్రాదుర్భావము పొందును. అపుడు భావము స్థాయి కాగలదు. స్థాయి తాభివ్యక్తిలో విరుద్ధములుకాని యవిరుద్ధములుగాని యంగభావమును పొంది శోభించును. భావసామాన్యమంతయు స్థాయిత్వము పొందజాలదు. కొన్నియే స్థాయిత్వమున కర్హములు. హృదయ మష్టదళసహితమైనపద్మమని చెప్పు నుపనిషదర్థము నాకళించుకొన్నప్పుడు పైభావ నియమమున కుపపత్తి గోచరమగును. జ్యోతీరూపుడైనజీవున కష్టదళ విశ్రాంతిలోగల నియతిభావచక్రమును నియమించును. దిశావిదిశలలోని జీవసంచారము 8 భావముల నుత్పత్తిని సూచించును మూలకందమున జీవస్థితిలో సిద్ధభావ మొకటి పరిగణనీయము. అందువలన నవభావములే స్థాయిత్వమును పొందుటకు యోగ్యములు. దళముల సంధిసంధు లందు జీవవిశ్రాంతి యుండవచ్చును అప్పుడును పరిస్పందములుండును. అవి స్థాయిత్వమును పొందజాలవు. ఇంక నొకయుక్తి విభావకులు భావింపదగును. అంతరంగము గుణమయము. సత్వరజస్తమస్సులను గుణముల పరస్పరసంబంధవశమున నవవిధములైన యంతరంగవృత్తు లుదయించుచున్నవి. ఈ 9 వృత్తుల ననుబంధించియున్న పరిస్పందములలో ననుగతములైన భావములు తొమ్మిదియే యగును. అవియే స్థిరత్వమును పొందగలవు. ఇంకను గుణప్రసృతి లో ననేకభావము లుదయింపవచ్చును. వానియందు భౌతికరంజన మధికమగుటవలన స్థాయితాయోగ్యత లేదు. ఈవిధమున స్థాయిత్వమును పొందుట కర్హములయిన భావ ములు సముల్లసితములయినచో రసత్వము సిద్ధించును. సముల్లసితభావమే రసము. భావమునకు గలుగు సముల్లాసమున ననేకసామగ్రులు కలిసియున్నవి. భావ్యమానమగునది భావము. స్వరూపసంవేదనాత్మకమైనభావము మనలను భావింపచేయును. ఆభావసత్తవలన భావకులు విశిష్టభావన కలవారగుదురు. ఈభావసామాన్యమును అయిదువిధములుగా భాగింప వచ్చును. పదార్థము, క్రియ, సత్త, వికారము, మానసము, సత్తారూపము లైనభావములే స్థాయిభావములుగా చెప్పబడుచున్నవి. ఇతరములన్నియు నీభావసత్తకు సముల్లాసమును సంపాదించును. పదార్థక్రియావికారమానసములైన ఆభావములు విభావానుభావవ్యభిచారి సాత్వికములని చెప్పబడుచున్నవి. పదార్థసామాన్యమును విజాతీయమగు విశిష్టతతో

భావింపచేయుభావములు విభావములగును. అంతరంగములో నిస్పందములనుబట్టి రసములందు భేదము లంగీకరింపబడుచున్నవిగాన ఆయాభిన్న భిన్న రసములకు భిన్న భిన్నములైన విభావసామగ్రు లుండును అయినను కొన్ని కొన్ని విభావములు అనేకరసములకు సాధారణములు కావచ్చును. అయినప్పటికి తమతమ ఇతరపరికరములతో కూడుకొని అవి సముల్లాసమును సంపాదింపగలవు. కాబట్టి స్వస్వవిషయమున వానిసామర్థ్యము వినష్టము కాదు. వీనియం దంతరంగములు కొన్నిగలవు. కొన్ని బహిరంగములు. అవియే ఆలంబనములని ఉద్దీపనములని వ్యపదేశింపబడును. రసోత్కర్షలో భావాంతరములతో సంసృష్టములైనచో ఉద్దీపనములని వ్యపదేశము సిద్ధమగుచున్నది లలితములు, లలితాభాసములు, స్థిరములు, చిత్రములు, ఖరములు, రూక్షములు, నిందితములు, వికృతములు అని విభావములందు భేదములను తెలియవలెను ఈలలితాదిభావములన్నియు ఆలంబనమునం దనుగతములై స్థాయిభావములను పోషించునవి యగును. క్రియారూపమైన భావములు అనుభావములు. విభావితార్థముల అనుభూతి వీనియందుండును. సత్త్వాత్మకమైనభావమును అనుబంధించి యుండవచ్చును. మనోవాక్కాయబుద్ధులలో ఇవి సంయుతములగును. మనః ప్రారంభానుభావములు పది కలవు. వాగారంభములు ద్వాదశభావములు. శరీరారంభములు పది. రీతి వృత్తి ప్రవృత్తులు బుధ్యారంభానుభావములు ఆలంబనమునందు కన్పడునట్టి రీత్యాదులే ఇచ్చట పరిగ్రాహ్యములు. వ్యభిచారులకే సంచారులని పేరు. వానియందు నిలుకడయుండదు. మరల మరల యుత్పన్నమగుచుండును. వానియుత్పత్తి వినాశములవలన రసపరిపోషణము సిద్ధమగును. విశేషముగ సంతతము సంచరించుటనుబట్టి వాని కానామము సార్థకమగుచున్నది. ఇవి ముప్పదిమూడు. సత్త్వమువలన యుత్పన్నములగునవి సాత్త్వికము లగుచున్నవి. ఇవి ఎనిమిదని పరిగణన మొనర్చిరి. మనోభూమిలో కూడుకొనిన పంచభూతముల సూక్ష్మాంశ ప్రక్రియలను పరిశీలించినచో "జృంభాచనవమః సాత్త్వికః ఇతి ప్రతిభాతి" అను భానుదత్తునివచనము నిరవకాశము. ఇది మానసవికారము. నిర్వేదాదివ్యభిచారులు కూడ అట్టివే అయినను వీనియందలి విశిష్టవిశేషమువలన ఇవి యిట్లు పరిగణింపబడుచున్నవి. అంతఃకరణరూపమున ద్రవ్యమునకు పరిణామము సిద్ధము కాగా మనోవ్యవహారము కల్గుచున్నది. ఐశ్వర్యమైనభావమే జీవగతిలో మనోరూపమున పరిణామము పొందుచున్నది. జీవనమున కుపాధియైన అంతఃకరణము గుణమయము కాబట్టి సత్త్వరజస్తమస్సులవలన పరిణామములో సత్త్వప్రాణవాక్కులు కల్గుచున్నవి. సత్త్వప్రాణవాక్కులలో అధిష్ఠాతగా నున్న జీవుడు తనసన్నిధిని కల్గుభావములలో సాక్షిభూతుడై యుండును. ఎట్టి మనోవికారము

లేక మొదట భాసించు సిద్ధభావము ఆద్యస్పందము. అదియే సత్తాభావమని చెప్పబడినది. వాఙ్మనఃప్రాణములలోని విశేషవిశేషితమైన ఆసత్తసముల్లాసము పొందును. ఈసముల్లసనమే రసీభావమును కల్గచేయుచున్నది. సముల్లాసము కలిగినపుడు భావము నిరావరణమైన సంవిత్ప్రకాశస్వభావమును పొందుచున్నది. అదియే స్వరూపసంవేదనము. అది రసీభావ సంపద. తను మనఃప్రాణముల అస్పృష్టయోగముతో భావము రసానుభూతిమార్గమున ప్రవేశము పొందుచున్నది. సముల్లసనమాహాత్మ్యమున భావమునకు రసత్వము సిద్ధముకాగనే తనుమనఃప్రాణములందు తనుమనఃప్రాణత్వములు వినిష్టములై కేవలము రసమయత్వమావిష్కరించును. ఆవస్తువులందలి సహజవస్తుత్వము స్ఫురించును. ఆస్ఫురణమే సంవిత్స్ఫురణము. దీనినే రససముల్లాస మందుము. విభావాదుల విశిష్టసత్తయున్నగాని రసీభావ సంపత్తి కలుగనేరదు. రసము స్వరూపసంవిత్. అది అఖండము. అయినప్పటికి దానిస్వరూపము అన్యథాన్యథాగా గోచరించుటచే అనేకులనేకవిధముల పేర్కొనియున్నారు. రసేతరములయిన శాస్త్రములందు అభినివేశము కలిగినభావకులు ఆయాశాస్త్రముల అభిమానముల విడిబుచ్చలేక రససంభూతిని భావించుచు ఆయాశాస్త్రమర్యాదలను ఇందు కల్పినారు. స్వరూపసంవేదనాత్మకమైన రసతత్త్వమును పర్యాలోచించుటకు రసాత్మప్రత్యభిజ్ఞ అపేక్షితమై యున్నది. విభావాదిరూపమున నానాత్వముతోనున్న జాగతికవిలాసమంతయు రససముల్లాసము కలిగినపుడు స్వరూపలీనమగును. అపుడు రసాతిరిక్తత్వము వానికి లేదు. మనోరసప్రవాహాపతితము లైనప్పుడు విభావాదిరూపముల పరిజ్ఞానమున్నది. మనోభూమి నతిక్రమించిన విజ్ఞానసత్తాప్రాబల్యమున నానందవిహారమే సర్వసిద్ధము. కాబట్టి విభావాదులేవియు నుండవు. మనోవికాసము ననుసరించిన పరిశీలనలో విభావభూమికాత్యాగములేదు. కాబట్టి విభావాదులసంయోగమున రసనిష్పత్తి యుండునని భావింపక తప్పదు. కేవల రసకైవల్యములో పృథక్త్వ మేమియు లేదు. ఇచటి విషయవిస్తరము 'మారసభారతి' యందు జూడనగును.

రసము పిమ్మట విషయకోటిలో చేరదగినది భావము. రసభావానందములందు వేరుతన మేమియులేదు భావానుభూతిలో సకలజైవవ్యవహారము విస్మృతమగును. అద్వితీయమగు భావాద్వైతమవభాసించును. విభావాదులస్వరూపము దగ్ధపటసదృశమగును. నిర్వికల్పక సమాధ్యవస్థలోని స్వరూపసంవేదన మిచట గోచరమగును. అంతర్వృత్తులసంవలన మిచట లేకపోవచ్చునుగాని కేవల మవి యసత్ప్రాయములగునని యనజాలము. ఎన్నిఎన్ని పదార్థముల అవభాసమున్నను నవియన్నియు నభిన్నప్రాయములగును. వానియందు భేదము కన్ప

డదు. భేదావభాసరహితమయిన భావానంద మిచట నున్నట్లు భావకులు భావింపగలరు.భావముల సంఖ్యానము శక్యక్రియ కాదు వానియనంతత్వమును నిస్సీమత్వములను భావించినభావ నిరూపకులు పంచాశద్భావముల బరిగణించినారు. మనోదర్పణములోని భావప్రతిబింబములు పంచాశద్రూపమున వారలకు గోచరములయినవి. పంచభూతముల సూక్ష్మాంశగతిప్రగతులనుబట్టి ఈవిభాగపరిగణనము లుపపన్నములు గావచ్చునని తోచుచున్నది. భావ ముదయించుటలో శమించుటలో నన్యభావముతో గలయుటలో ననేకభావములు కూడుటలోని విజాతీయాస్వాదములనుబట్టి అన్యాన్యభేదపరిగణన మావశ్యక మగుచున్నది. రసమునకు సముల్లాసము వలయునట్లే భావమునకుగూడ నపేక్షితము. వీనిసముల్లాసకసామగ్రి విభావాదులనుట విశదము లౌకికప్రగతిలో కూడుకొనినవిశేషమునుబట్టిభేదప్రభేదములను చెప్పవలయును. అవి యవ్యవస్థితములు. కేవల మేకరసభేదములను చెప్పుటయే దుశ్శకము.

రసభావములకు సముల్లాసము సంపాదించుటకు విభావాదు లవసరములు. విభావాదులు విశిష్టములై యుండవలయును. వానియందలి విజాతీయమగు విశిష్టతయున్నగాని సముల్లసనమున కవి సమర్థములు కావు. అట్టి విశిష్టతాపాదకము లగువిశేషము లనేకవిధములై యుండును. గుణాలంకారాదు లావిశేషములు. వానికి స్వరూపగతశోభ యున్నది. వానిస్వగతమైన శోభ రసభావాంగత్వము పొందవలయును. ముఖ్యార్థపరత్వము వానికి లేకపోయినచో నవి సాహితీవిద్యయందలి విశేషములని యనబడవు. కావుననే వానియందు సమీక్ష యత్యవసరమని ధ్వన్యాలోకము చెప్పుచున్నది. రసభావములన్నియు నర్థరూపములు. అర్థమును దెలియుటకు శబ్దమావశ్యకము. రసభావముల దెలియుటకు శబ్దముల నాధారముగా చేసుకొనవలయును. శబ్దగతవిశేషములన్నియు నర్థతత్పరములు గావలసియున్నది శబ్దాలంకారములు, గుణములు, సంఘటనాత్మక మగురీతి, మొదలగునవి శబ్దవిశేషములు. శబ్దాత్మకప్రపంచ మెట్టిచిత్రవిచిత్రతో నుండునో యర్థాత్మకజగముగూడ నట్లే యుండును. అర్థములందలి విశేషములు విభావాదుల కంతరంగములై యుండును. కావుననే యర్థవిచిత్రతాప్రతిపాదనమునకు సాహితీనిబంధకు లనేకవిధముల ప్రయత్నించినారు. అర్థాలంకారములు, అర్థగుణములు, కైశిక్యాదులు మొదలగునవి యర్థవిశేషములు. వీని నిరూపణము కావ్యాలంకారములందు బహుళప్రతిపాదనము పొందినది. రసభావాక్షిప్తహృదయుడైనకవి వీనియందు సమాహితచేతస్కుడు కారాదు. తత్పరీతమనస్కుడై యుండగా నీయంగముల యత్నసంపన్నములు కావలయును. అప్పుడే యవి రసభావాంగ

ములు కాగలవు. వానియందు పృథగ్యత్నమున్నచో వివక్షితరసభావనిబంధనము గుదురదు. వానియంగత్వమును లుప్తమగును. అంగత్వమునఁ బ్రత్యవేక్షణ ముండవలయుట దప్పనిసరి. రసతదంగముల ప్రతిపాదన మంతట నంగాంగిభావశబలితమై చమత్కారము నాపాదించును. వికార్థ్యమున కచట హానియుండదు. అంగముల కంగి ననుసరించుటచే గలుగుసుందరతయే కాని ప్రత్యేకసుందరత యుండదు. వానిసుందరత వేరుగా గన్పడినచో నది ఖండాత్మకమగు సుందరత యనియే భావింపవలయును. శబ్దసముపాశ్రితములైన యంగోపాంగములవలన శబ్దోపారూఢములైన విభావాదులరమణీయత భాసించుటయేగాక వాఙ్మయప్రపంచములోని నిఖిలచిత్రగమనికలన్నియు నవభాసించును. వానిని భావనాపథమున విహరింపచేయుభావకుడు వైఖరీశబ్దతత్త్వమును రూఢము చేసుకొనఁగలడు. అంతటితో నాశబ్దభావన పర్యాప్తముగాదు. క్రమికవికాసము ననుసరించి యది మధ్యమాపశ్యంతీస్వభావముల నవగతముచేసి పరావేదనము సంపాదించును. లక్ష్యప్రాప్తికి భిన్నభిన్న సాధనములుండును. శబ్దమార్గమున పరాసంవేదన మొకటియే లక్ష్యము. కాని యంతరాంతరా గూడుకొను నవాంతరప్రయోజనసూత్రముల గలిపికొనుచు శబ్దపథము మహాశబ్దము ననుసంధింపజేయును. కావ్యవిద్యలో శబ్దార్థములు గుణీభావముపొందుట సత్యమేయైనను మధ్యఫలముల జేదోడుపుచ్చుకొనుటయు నుండకపోదు. అర్థము ననుసరించిన విశేషములబట్టి ఈక్రిందియర్థమును భావింప చేసికొనగలము. అర్థపథికులైనభావకులు విశ్వవిహారము చేయుదురు. కవిప్రపంచమునుండి బ్రహ్మప్రపంచమున గాలిడుదురు. మానసభౌతికప్రపంచములకు నిచట తేడాలు గోచరింపవు. విశ్వవిశ్వమంతయు మానసవికారమేయనుతత్త్వనిర్ణయమున కిది స్థానము కాదు. భావకు డన్నప్రాణమనోవిజ్ఞానానందభూముల విహృతి సలుప నుత్సుకిడైనను గవి గుంభితార్థప్రవాహమున బడి సకలప్రపంచమున బర్యటించును. జలీయవిలాసము నాస్వాదించును. ఆగ్నేయవిభూతుల నవగతము జేసుకొనును. వాయవీయతత్త్వముల నవలోడించును. అనంతకథవిలాసముల విలోకించును. అర్థాలంకారగతి యింకను భావకునకు హృదయమ్రదిమను సంపాదింపగలదు. కేవల మొకే సంకుచితప్రదేశమున నున్నభావకుని విశాలదేశవిదేశముల రమణీయపదార్థములను ఆస్వాదింపచేయును. స్వపరదేశవిశేషవిభాగములు ఆతనినుండి తొలగిపోవునట్లుగా యవి యొనర్పగలవు. తనకు పరిచితమైనలోకమున నున్నవానిని గూడ అపరిచితానంతలోకములకు తీసికొనిపోయి అర్థపద్ధతులు విదితత్వావిదితత్వములను విదూరము చేయును. భూర్భువరాదిలోకములు ఎన్నియైన నుండుగావుత. సర్వలోకముల సమైక్యము వానిచే సంపాదింప

గిరామగోచరమని నుడివినారు. వారిభావమును మనము ద్వివిధముగా గ్రహింపగలము. వ్యంజనయనునది ధ్వని. ఆధ్వనితత్త్వము వాక్కుల కందదు. అది కేవలము కొందరు తలచు నట్లు నాస్తివిషయము కాదు. దానియస్తిత్వమునఁ బ్రతిక్షేపము లేదు. కాని యది వాగ గమ్యము. అట్టిదానిని చెప్పుట యెట్లు? ఇది యొకపక్షము. ధ్వని యుండవచ్చుగావుత. దాని లక్షణము దుశ్శకము లక్షణీయము కాజాలనిదానిని చెప్పలేము గదా! ఇది రెండవపక్షము. కావ్యవిద్యావిషయములుగా జెప్పబడిన రసభావాదులు శబ్దములందుం డభిధాదులచే దెలియచేయబడును. రసభావకూటములందు జేరునవిమాత్ర మెప్పుడును ముఖ్యవ్యాపార మగు నభిధచేగాని యముఖ్యవ్యాపారమనబడు లక్షణచేగాని చెప్పబడనేరవు. అభిధాలక్ష ణలు కేవలము లౌకికార్థమునుఁ జెప్పుటకే సమర్థములు. రసభావము లలౌకికము లగుటవలన లౌకికవ్యాపారము లగునవి ప్రసరింపనేరవు. కావుననే యలౌకికార్థమును ప్రతిపాదించుటకు వ్యంజన నవశ్య మంగీకరింపవలసియున్నది. కొన్ని నిరలంకారవస్తువులు కొన్ని సాలంకార వస్తువులు నభిధాలక్షణలచేఁ దెలియఁబడును. అభిధాలక్షణలు దెలియఁజేయువానిని వ్యంజ నయు దెలియజేయగలదు. కావుననే ధ్వని లౌకికాలౌకికవిషయప్రసారముగలదని యంగీక రింపవలసియున్నది. రసభావానుభూతి కలుగునపుడు భావకుని యంతరంగమున వ్యంజనా కృతముగా కలుగునట్టివిశేషము కేవలయోగప్రజ్ఞావేద్యమై యుండును. యౌగికములయిన యనుభవములలో నున్నసీభావ మొకటిగా నున్నది. అట్టి యౌన్నన్యము రసానుభూతి కవ్యవహితపూర్వక్షణమున భాసించునట్లు భావకుడు తెలియఁగలడు. రసభావానుభూతిలో నౌన్నన్యమునకు పూర్వభావులు కావలసినయర్థముల నభిధ తెలియచేయును. అటుపిమ్మట వ్యంజనామాహాత్మ్యము ప్రభావించును. అభిధాలక్షణలచే జాగతికములుగా నవభాసించిన పదార్థము లజాగతికము లగును. ఇది భావనాసామ్రాజ్యము. ఇచట నసాధారణమగు సాధారణీకృతి యావిర్భవించును. ఈసాధారణీకృతిమాహాత్మ్యమున నచింత్యప్రభావ మున్నది సీతారాములవృత్తాంతము కావ్యమున బ్రతిపాదింపబడినను నది సీతారాముల వృత్తాంతముగా నుండదు. అచట సీతాప్రత్యయముగాని రామవిజ్ఞానముగాని యుండదు. సీతావ్యక్తియందు సీతాత్వము భాసింపదు. రామవ్యక్తియందు రామత్వము భాసింపదు. సీతాదిసంబంధవిశేష ముండదు. సంబంధపరిహార ముండదు. కేవల కామినీత్వము గోచ రించును. కేవల కాముకత్వము భాసించును. సామాన్యముగా నభిధప్రతిపాదనమున నియత ప్రమాతయందు సంబద్ధములై గోచరించునుగాని సాధారణీకృతి గలుగునప్పటికి నియత ప్రమాతృగతమే యగుననుజ్ఞాన ముండదు. పరిమితప్రమాతృభావము కలవాడేయయినను

భావకు డాపరిమితప్రమాతృభావమును కూడ విస్మరించును. అఖండాపరిమితప్రమాతృభావ మపుడు సాక్షాత్కరించును. ఇదియంతయు వ్యంజనామహాత్మ్యముననే కలుగును.

వ్యంజనవలన వ్యంగ్యము తెలియచేయబడును. వ్యంగ్యము సామాన్యముగా త్రివిధము-వస్తువ్యంగము, అలంకారవ్యంగము,రసవ్యంగ్యము. వస్త్వలంకారములు వ్యంగ్యములగునపుడు పైచెప్పినవిశేష మవభాసింపకపోవచ్చును. వస్త్వలంకారములును లోకవ్యవహారప్రవాహపతితములే యగుటవలన సాధారణీకృతి యవసరము కాదు. కేవలము రసాసాధారణమగు సాధారణీకృతిప్రభావముననే భావకు డలౌకికవిషయవేదనము పొందగలడు. లౌకికపథమునుండి యలౌకికపథమును సహృదయుడు పొందుటకే వ్యంజనాసంబంధముపకరించును. అలౌకికపథానువర్తియయినను నచటి యలౌకికత్వమును భావింపడు. అలౌకికమండలి యలౌకికత్వ మాతనికి ప్రతిభాతము కాదు. అప్పుడు లౌకికత్వప్రతిభానము కూడనుండదు. లౌకికత్వాలౌకికత్వపరిముక్తమైన యొకానొక నిర్వికల్పపథికుడై రసానుభవమున స్వరూపనిష్ఠితుఁడగును. ఈవ్యంజనా సంబంధమున భావకుని మాయావరణము నశించును. మాయికమైన శబలత యాతని నంటదు. మాయావాగురమును దాటుటయు స్వరూపసంసర్గము పొందుటయు రెండు నొకటే కావుననే స్వరూపప్రాప్తికిని వ్యంజనయే సమర్థము. 'సర్వమాత్మైవాభూత్ తత్కేన కం పశ్యేత్ కేన కం విజానీయాత్' మనోరససముపారూఢముల నన్నిటి గుణీకరించుకొని స్వరూపరసమందు సంలీనముచేసికొని నిత్యరసాత్మవిహారమొనరించుసహృదయునకు సర్వము రసముగా ప్రతిభాసించుసమయమున లౌకికమని యలౌకికమని విభాగ మేమియు లేదు. స్వరూపధిష్ఠితమైన సర్వలోకము నాత్మగా భావించిన యాతనికి నితరవిజ్ఞేయవిషయము లేవియు నుండవు. ఇద మేతత్ప్రిజ్ఞనంతను నశింపచేయు వ్యంజనావిశిష్టత యనిర్వచనీయము. వ్యంజనాఖ్యసంబంధము నంగీకరింపకపోయినచో ప్రసిద్ధసంబంధమువలన నిట్టి భాస్వరవికాసము గల్గునసుట కవకాశము లేదు. కావ్యభావకునకు రసముల్లాసము గల్గుచున్నది. అత డాత్మలో రసానుభూతి నొందుచున్నాడు. అది యెట్లు గలుగుచున్నదియు గొందర కవగతము కాలేదు. ప్రసిద్ధవ్యాపారములవలన గలుగుటలేదని యనుభవమున దెలిసికొని యనున్మీలితాభిఖ్యతోనున్న వ్యంజనానందవర్ధనుడు ద్యోతింపచేయగా దాని చక్కగా దెలియచేయుట కభినవగుప్తుడు లోచనోన్మీలన మొనర్చినాడు. ధ్వనివిషయవిస్తరము నాధ్వనిప్రకాశమున జూడనగును. కేవల శబ్దాత్మకమైనదాని కర్థములలో బరమార్థముగ నెన్నదగుఁ దత్త్వముఁతో నిట్టి సంబంధమును సువిశదముచేయు వ్యంజనమూలశక్తిగా చెప్పఁదగియున్నది. రసమునుండి భావవ్యూహ ముత్పన్నమై దానినుండి

నిఖిలార్థప్రపంచ మవభాసించినట్లు వ్యంజనాశక్తిని సర్వాధారముగా చేసికొని లక్షణ యభిధలావిర్భవించిన వనవచ్చును. లక్షణగల ప్రతిస్థలమునను వ్యంగ్య ముండితీరును వ్యంగ్యములేనిదే లక్షణ నంగీకరించుటకే వలనుపడదు. లక్షణలోనివ్యంగ్యము వ్యంజనాగమ్యమే కావలయును. వివక్షితముగనో యవివక్షితముగనో వ్యంజనయున్న గాని లక్షణకు ప్రసారమే యుండదని నిశ్చయింపవచ్చును. అట్లే అభిధయు. అభిధచే నిరూపితమైన యర్థము స్వతోరమణీయము కాజాలదు. "న హి తాదృశోఽస్తి వాచ్యోఽర్థః. యో మనాగనామృష్టప్రతీయమాన ఏవ స్వతోరమణీయతా మాధాతుం ప్రభవతి" యను ధ్వనికారుని వచనార్థమున నీయర్థము గర్భీకృతమై యున్నది. వ్యంజనానిరూప్యమగు వ్యంగ్యార్థ సంస్పర్శ లేకుండగా వాచ్యము రమణీయత్వము నాపాదింపజాలదు. కావున వివక్షావిషయము కాకపోయినను వ్యంజనయున్న గాని యభిధయు సరింపనేరదని యనిచ్ఛచేనైన నంగీకరింపక తప్పదు. అసలు వాస్తవమైనశక్తి వ్యంజనయే. అభిధాలక్షణములు కాల్పనికములు. కాల్పనికములై యసత్యభూతములయినను గావ్యోపాయతనుబట్టి నిరూపింపబడుచున్నవి. అపథపరాపతితములుగూడ నేర్పి కూర్చుట యావిద్యకప్రపంచప్రాణులకు సౌకర్యము గలుగును. "అసత్యే వర్త్మని స్థిత్వా సత్యం వర్త్మసమీహతే" అసత్ప్రాయములైనను నభిధాలక్షణల నవశ్యము ముందుగా దెలియవలసియున్నదని శాస్త్రకారులు వానిని నిరూపించినారు. వానిసంస్కారము హృదయమున చిరరూఢమైననే వ్యంజనావిత్తి కలుగును. అభిమానికమైన వాదనిరూపణతత్పరమతులై వ్యంజనను కొందరాక్షేపించినను సత్యార్థభావనాపూతహృదయులైనపు డవశ్యము వారును వ్యంజన నంగీకరింపక తప్పదని వారిచరమనిరూపణమే చెప్పుచున్నది. మఱి కుపథవికలము కాకపోయినచో వ్యంజన నంగీకరింపని శాస్త్రమార్గానుయాయి యుండడు. ప్రథమనిరూపణములో నభిధ ముందుగా మత్యారూఢమగును. కావున నర్థమునకు గావ్యమునకు వాచ్యవాచకభావసంబంధము కలదని యనవలయును. ముఖ్యార్థబాధాద్యనుసంధానము కలుగగా లక్షణ యావిర్భవించుటచే నలక్ష్యలక్షకభావసంబంధము నంగీకరింతము. అనంతరము ద్వితయసముత్తీర్ణమైన వ్యంజన సుప్రకాశము పొందునుగావున రసకావ్యములకు వ్యంగ్యవ్యంజకభావముగలదని యందుము. మొత్తముపై గావ్యమునకును తద్గోచరమగు నర్థమునకును ప్రతిపాద్యప్రతిపాదకభావసంబంధమును మనోనిరూఢము చేసుకొనగలము.

## ప్ర యో జ న ము.

రసానుభూతి యను నుపక్రమవిశేషముననే ప్రయోజనము నిరూపితప్రాయము. చరమఫల మొక్కటియే. అంతరవస్థలలో నదియే బహురూపముల పొందును. అంగోపాంగ సహితమైన మహాప్రయోజనమే ప్రయోజనపదముచే చెప్పఁదగినది. కావ్యవిద్య కాను షంగికములుగా చెప్పఁదగిన ప్రయోజనము లనంతములు. వానిలో గొన్నియే పరిగణనీయ ప్రయోజనములుగా నున్నవి. ఏ ప్రాణికైనను సుఖాభిలాషను విడువజాలదు. మానవుఁడు నిత్యము సుఖమునే ఆకాంక్షించును నాసుఖమునందు దుఃఖగంధ మేమాత్రము నుండ రాదనియు ఆతని యభిలాషము. తనకు గలుగు దుఃఖాస్పృష్టమైన సుఖము చిరకాలస్థాయి కావలెనని యనుకొనును. అంతియెకాదు అది తనను విడువరాదని తాను దానిని విడుచు నట్టివాఁడు కారాదనియు నతని తలంపు. తనసుఖము తనకు నిత్యము కావలయును. తానును దనసుఖము నేకమైయుండవలయునని మానవుని పరమవాంఛ. ఇంతటి వాంఛాదృఢబంధము గలుగుటకు మానవుఁడు కొంతటియర్హత గలవాఁడగును. ఆతని యాయర్హతకు గొన్ని ఫలములు పునాదిగా నుండును. ఆయాఫలాస్వాదమున నాత డుత్తరోత్తరప్రయోజనముల ప్రబలకాంక్ష గలిగినవాఁడగును. ఇట్లమాయకమైన సృష్టియం దున్నప్పటినుండియు ప్రయోజనసంబంధ మాతని నంటియుండును. ప్రయోజనప్రనాడిక మానవునిజీవితమందు మార్పుపొందు చుండును. తుట్టతుదకు మహాప్రయోజనమైన రసానుభూతియం దాత్మ ప్రతిష్ఠ యుండును. కావున సర్వవాంఛలు రసానుభూతియందు పర్యవసానము పొందును. ఇది పొందినపిమ్మట నితర మాకాంక్షితము కాదు. "యం లబ్ధ్వా చాపరం లాభం మన్యంతే నాధికం తతః." ఇంతకన్న నధికమగుఫలము లేదు. ఇట్లు మానవవృత్తి ప్రయోజనాకాంక్షి తమై యుండుటచే నందులకొరకగుసాధనలగూడ సాధింపవలసియున్నది. అట్టిసాధనల నిర్దే శమునకే యనేకశాస్త్రములు వెలువడినవి. అందలి పరిభాష జటిలత్వమున వానివానిసార మును వడబోసి సాహితీవిద్య సమరససరససరణి నాశ్రయించినది. కావున నాయాశాస్త్ర ములు సంపాదించునవాంతరఫలములగూడ సాహితిసంపాదించుటగాక నాయాశాస్త్రలక్ష్యము ననే తాను కేంద్రీకరించుకొన్నది. ఆయాశాస్త్రములు తమలక్ష్యబలనిర్ణయమునకు ప్రత్యేక ప్రత్యేకముగా ననేకసాధనముల నిర్దేశించినవి. వ్యాకరణశాస్త్రమున స్ఫోటాఖ్యమగు శబ్ద బ్రహ్మానుసంధానము కర్తవ్యము దానివలన పరావాగ్విలాసము గలుగుననియు నాపరా సంవేదనమే పరమానందమనియు వారల తలంపు. ఆవిధానము కావ్యమున నచుంబితము కాదు. ఇచట శబ్దము కావ్యస్వరూపముగనే నిశ్చయింపబడినది. శబ్దములందు నానావిధ

చిత్రవిచిత్రలలితగతు లెట్లుండునో సాహితీమార్గముల జూపబడిన ట్లితరముల జూపబడ లేదు. శబ్దతత్వస్ఫుటానుసంధానము కావ్యారాధకునకు కర్తవ్యము. ఆయనుసంధాన మొక యుపాసన. పాఠకులయర్హత ననుసరించి యుపాసన ప్రదర్శింపబడును. కావ్యరీతిలో నను స్పృతములైన యనేకశబ్దవిన్యాసములు శబ్దారాధన కుద్దేశించియే యున్నవి. ఏయేయారాధ నకు నెట్టియెట్టిశబ్దగతి జన్మాంతరసంస్కారము ననుసరించి యభీష్టమగునో యట్టి యట్టి శబ్ద గతి నాతఁ డనుసరించు గావుతమనియే కవిహృదయము. ఇతరములైన శాస్త్రములు శబ్ద మర్యాద నతిక్రమించి యర్థపరిధిలో ప్రవేశించి సాధనముల విరజిమ్ముచున్నవి. అర్థము ననుస రించిన భావనలో మానవుఁడు తనకర్తవ్యమును జూచుకొనుచు లక్ష్యము ననుసరించుచుం డును. కర్తవ్యశ్రద్ధను బూనుటతోపాటు అకర్తవ్యనిరాసమునుగూడ నిశ్చయించునుగావున కర్తవ్యాకర్తవ్యబోధను శాస్త్రఫలముగా కొందరు చెప్పుకొనినారు. కావ్యదర్పణమునం దవి యన్నియు స్ఫుటముగా ప్రతిబింబనము పొందియే యున్నవి. ఆయాఫలములన్నియు నిచట సుసంపన్నము లగుచున్నవి. ప్రకృతమున ఇంక నొకవిశేష మున్నది. ఇచటిది సరసవచోరీతి. కర్కశదుర్గమదుర్ఘణదురధిగమత్వాదిదోషదుష్టత శాస్త్రముల కున్నది. కాని కావ్య విద్యకు లేదు. ప్రవృత్తిసామాన్య మంతయు ప్రయోజనముఖముగా నుండును. ప్రయోజ నోద్దేశరహితముగా బ్రవృత్తి యుదయింపదు. శాస్త్రప్రవృత్తు లన్నియు సప్రయో జనకములై యున్నవి. కావ్యవిద్యాప్రవృత్తియు సప్రయోజనకము. లోకమున నెన్నియెన్ని ప్రయోజనములు గలవో యవన్నియు నిందున్నవని వేర చెప్పనక్కరలేదు. ఇందొకచో ధర్మ మొకచో క్రీడ యొకచోట నర్థ మింకొక్కస్థలమున శమము ఒకచో హాస్యము వేరొకట యుద్ధము మరియొకట గామము ఇంకొకచోట వధ యిట్లు త్రిలోక భావానుకీర్తనము గలదు. భూతభవిష్యద్వర్తమానకాలత్రయమందలి యర్థముల నిది చక్కగా నిదర్శించును. ఇది ధర్మ్యము, అర్థ్యము, యశస్యము. వేదాదు లిట్టివే. అయిన నిది చక్కని ఉపదేశమధురమై యుండును. అన్యూనానతిరిక్తమృదులవచనములతో వక్తవ్యాం శమును గావ్యవిద్య సుధాసూక్తులతో జెప్పును. సర్వకర్మానుదర్శకము సర్వశాస్త్రార్థసంప న్నము సర్వశిల్పప్రవర్తకము నగునిది యితిహాసములతో సుఖాస్వాదమగును. ధర్మచింత తో గూడుకొనినధార్మికుల కిది యుత్తమధర్మముల సాధర్మ్యమున వైధర్మ్యమున నుపదే శించును. కావ్య ముపదేశకమైనను గురువువలె నుపదేశింపదు. భావకునిబుద్ధినే వర్ధింప చేయును. ఆతనిప్రతిభను వికసింపచేయును. విపరీతప్రతిభ నిది వర్ధిల్లచేయదు. ఇది హిత ప్రతిభాజనకము. కావ్యవిద్యలో నీతులు వినీతులు నిదర్శింపబడును. అచట గర్తవ్యత్వము

గాని యకర్తవ్యత్వముగాని స్పష్టముగా చెప్పఁబడదు. అచటి ఔచిత్యసమీక్షతో సహృదయులు కర్తవ్యమునే గ్రహింతురు. కావ్యమున నీతిబాహ్యములు వర్ణింపబడునని యట్టివాని పఠించువారల కవి యవినీతిబోధించునని కొందరందురు. వారట్లు భయపడనవసరము లేదు. కావ్యమే యయిన నందవినీతి యుండదు. అవినీతియే యున్నచో నది కావ్యమే కాదు. కావ్యమనబడు గ్రంథమున నవినీతిగా గన్పడువచనములున్నను నవి యవినీతి ప్రతిపాదనమునకు ప్రయోగింపబడినవి కావు. భణితిభంగీ విచిత్రత కవిచంద్రున కభిమతమగుట వలన తదర్థనిరూపణరూపమున గర్తవ్యమునే నిర్దేశించుచున్నాఁడని నిశ్చయింపవలయును. కావ్యవిద్యావ్యాసంగమున రసానుభూతి కర్హతను సంపాదించునాతఁడు మనోవికాసము గలవాఁడే యగును. కాన తనసమర్థహృదయధర్మప్రభావానుసారమున గర్తవ్యమునే గ్రహించువాఁడగు విద్యాప్రవృత్తి బీజమును భావించునాత డన్యమార్గగామి గాడు. కావున కావ్య మసదోభ్ధక మని భ్రమింపరాదు. ధర్మప్రవృత్తిగలవారలకు ధర్మప్రబోధము గలుగచేసి కావ్యవిద్య వారల నుత్సాహుల చేయును. అధర్మరతు లిచట ధర్మతేజమును భావించి ధర్మానుయాయు లగుదురు. ఆయాయభీష్టముల సిద్ధింపచేసికొనవలయు ననునభిలాషగల గామోపసేవులనింద్యమైన ధర్మహితమగు కామసిద్ధిని గావ్యమున బడయవచ్చును. దుర్వినీతులగువా రుచ్ఛృంఖలప్రవృత్తిగలవారై లోకబాధకు లగునపు డుత్తమకావ్యసేవనము వారలకు తగిననిగ్రహమును సంపాదించును. వినీతులగువారు చక్కని దమక్రియనుపొందుట కిం దవకాశ మున్నది. అసమర్థులై బెంబేలుపడి క్లీబవృత్తితో సంచరించువారలకు కావ్యవిద్య కార్యకరణదక్షమగు ధార్ష్ట్యమును సంపాదింపగలదు. అపండితులకు విబోధము కలుగును. సరసమగువ్యుత్పత్తి కలుగును. విద్వాంసులకు వైదుష్యము సిద్ధించును. సమర్థమగుస్మృతి యుదయించును. ఉత్తమమతి యావిర్భవించును. ఈశ్వరులు విలాసముపొందుట కవకాశ మున్నది. దుఃఖార్దితులు వ్యవసాయాత్మకమగు నుత్సాహముపొంది స్థైర్యయుక్తులు కాగలరు. అర్థోపజీవు లర్థమును పొందుదురు. ఉద్విగ్నచేతస్కులకు ధైర్యము కలుగును. వ్యాధ్యాద్యదులవలన వ్యథకలిగినను మార్గాయాసమున శ్రమకలిగినను బంధుమరణాదులవలన శోక ముత్పన్నమైనను నాయాబాధాప్రసరణవిఘాత మొనర్చి సాహితీవిద్య యాహ్లాదధృత్యాదుల నాపాదించును. అనవరత కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతముల యాచరణమున దౌర్బల్యాతిశయము కలుగగా పరిఖిన్నమానసులైన తాపసులకును విశ్రాంతిప్రదమైన యీవిద్యమతివిబోధాదుల నాపాదించును. ఇంతియే కాదు. ఇది కాలాంతరమునకూడ పరిపాకమును సంపాదించును. సుఖకరమగు నుపదేశ

మిచ్చును. దుఃఖితులు దుఃఖప్రశమమును పొందుటయేగాక తత్కాలసుఖభాజను లగుదురు. కాలాంతరమునగూడ సుఖలబ్ధిని బడయగలరు. అదుఃఖితులు సుఖభూయిష్ఠవృత్తు లగుదురు. జ్ఞానము, శిల్పము, విద్య, కల, యోగము,కర్మ అన్నియు సాహితీ ప్రయోజనములుకాగలవు. ఐహికములైన నానాప్రయోజనములను సాహితీవిద్య సంపాదింపగలదు. కేవల మైహిక ప్రయోజన మానుషంగికము.

ఈచెప్పఁబడినప్రయోజనముల నన్నిటికన్న నతిశయితమగు మహాప్రయోజనమును గలదు. శబ్దమయప్రపంచమున గూడుకొనిన యభిధాదివ్యాపారములన్నియు సహృదయుని మనఃపీఠమున నిభినవార్థనిబంధన మొనరించుటకు ప్రయత్నించును. వానిప్రయత్నసఫలత వలన నొకానొకయర్థము ముద్రితమగును. అట్లు ముద్రితములైనయర్థగతు లనంతవేగము గల విజ్ఞానధారానుగతికములై యానందోపసంహృతిని బొందుట కుద్యమించును. అచటి విజ్ఞానస్కంధమున నెన్నియేని యాపాతమధురవికారము లుదయించును ఆవికారగతము లైన పల్లవశోభల తిలకించి కొంద రుద్విగ్నహృదయులై భావనీయార్థముల మఱచిపోవు దురు. భావకుఁడు విజ్ఞానధారాప్రనాడికయందు యనుస్యూతమైన సంస్కారచిహ్నలను చూచి హృదయవాసనల వెలువరించుకొనును. భావకునిమనస్సును చిత్రవాసనావిశిష్టము చేయుటకు సాహితీవిద్యయే సమర్థము. లోకోత్తరచరితములందును సహృదయులకు హృదయసంవాదమును సంపాదించి కావ్యవిద్య తనప్రయోజనమును విశదముచేయును. కావ్యవిద్య యుత్తమవాసనల నావిర్భవింపజేయును. జాతి దేశకాలవ్యవహితములైనను భావకునివాసన లనాదిత్వమును స్ఫుటము చేయుచునే యుండును ఈవాసనలన్నియు ప్రవాహానాదులు నానాయోనులందు జన్మించుజీవు లాయాయోనులనుపొంది యేదేని యొకజన్మలో నుత్తమసంస్కారమును పొందుదురు. మరల నాజన్మను విడువవలసివచ్చినను యోన్యంతరసహస్రవ్యవధాన మున్నప్పటికి పూర్వప్రయోనిని బొందుదురు. పూర్వాను భూతజన్మయం దట్టిశరీరాభివ్యంజకము లుండుట నాయావాసనలు ప్రకటమగును. వ్యంజక ములు లేనపుడు తిరోహితము లగును. జన్మకోటులతో స్వర్గాదిదేశములతో కల్పశతము లతో వ్యవహితములయినను కావ్యవిద్యవలన నావాసన లుద్బుద్ధములగును. స్మృతిసంస్కారము లేకములే యగుటవలన నవి భోగాదిహేతువులు కాగలవు. సముచితవిశిష్టవిభావాది సామగ్రిసహిత సత్కావ్యనిషేవణము సకలవాసనల నెంతటివ్యవధానమున్న నుద్బుద్ధము చేయగలదు. స్వర్గఫలము లంకురీభావముపొందును. యాగాదికర్మలు శక్తిరూపమున నవ పొందును. భావకున కట్టి భోగ్యభోక్తృత్వరూపమగుసామర్థ్య ముదయించును.

సంస్కారము నస్మృతి యస్మృతివలన సుఖదుఃఖోపభోగమును గలుగును. తదుపభోగమున మరల సంస్కారస్మృత్యాదు లుద్భవించును. సాహితీవిద్యాసముస్ముఖీభావమున నున్నవానికి "సుఖసాధనములే నాకు గలుగవలయును. వానితో నాకెన్నడును వియోగము గలుగ రాదు" యనుమహాసంకల్పము నిరత ముండుగావున నదియే వాసనలో నిత్యహేతువుగా నుండును. కారణీభూతమగు కావ్యవిద్య సన్నిహితమె యగుటవలన ననుభవసంస్కారాది కార్యముల ప్రవృత్తి యవశ్య ముండునని నిశ్చయింపవలయును. కాగా సహృదయులకు గావ్యమువలన రసనాత్మకమగు రసప్రతీతి యుదయించునని భావము హృదయసంవాద మున కుపయోగించునట్టి లోకచిత్తవృత్తిని తెలియుటకు సామర్థ్య ముదయించును. హృదయసంవాదమహిమవలన లోకస్వభావమునంతను తనయందే సమన్వయించుకొనునట్టి శక్తి యుదయించును. రసాస్వాదోపాయమగు స్వప్రతిభావిజృంభణము కలుగగా నలౌకిక మగుచర్వణ యుదయించును. ఆచర్వణయే రసభావన. ఈభావనామహిమవలన దర్పణము నందువలె విశ్వవిశ్వపదార్థములు స్ఫుటావభాసమును పొందును. అన్నిటి నపుడు తన యందు సాక్షాత్కరించుకొనునట్టిశక్తి భావకున కుదయించును. అనుభవస్మరణప్రతిపత్తుల కన్న విలక్షణమగునట్టి అద్వితీయభోగము భావకునియం దావిర్భావము పొందును. అప్పటి అంతరంగము ధృతివిస్తరవికాసాత్మకముగా నున్నప్పటికి భౌతికభావపరిదూనము కాదు. అంతరంగమునకు గలసహజావస్థ యీమహాప్రయోజనానుభవసమసమయమం దుద్భూత మగును. అంతరంగమునకుఁగల నానావిధావస్థలు కేంద్రీకృతములై యనిర్వచనీయమైన యొకయద్భుతావస్థయందు సమీభావమును పొందును. అయినను వానికెబలత్వము గోచ రము కాదు వానియందలి ఆదిభావము ఆవిర్భవించును. సత్వరజస్తమోగుణాత్మక మైన అంతరంగముద్రలో గుణముల పరస్పరప్రస్తారమునుబట్టి యనేకవృత్తిచిహ్నలు లౌకికగతిలో నుండవచ్చునుగాని యీయనుభూతిసమయమునందు రజస్తమోగుణముల వైచిత్ర్యానువిద్ధమగు నొకయవస్థ సముస్మేషము పొందును. సత్వమయమైన నిజచిత్స్వ భావము భాసించుచు. నిర్వృతివిశ్రాంతిరూప మగుపరబ్రహ్మాస్వాదసవిధమగు లోకోత్తరా నందానుభూతికి సమర్థమైన విగలితహేద్యాంతరస్థితి సముద్బుద్ధమగును. ధృతివిస్తర వికాసము లున్నప్పటికి రజఃకార్యమైనధృతి విశేషము కాని తమోనువేధకుల విస్తారవిశే షముకాని సత్వవికాసములో ననుగతములు కావు. క్రమక్రమముగా రజస్తమోగుణా స్పృష్టమైన సాత్వికసాత్వికమగు సహజసిద్ధావస్థ యుదయించును. అప్పుడు నిర్వికల్పాను భూతికి యనుకూలముగా నున్నచిత్తవృత్తిలో స్వరూపసాక్షాత్కార మొక్కటియే నిబిడీ కృతమగును. విమర్శాత్మకమైన విశ్వవిశేషమంతయు ప్రకాశాత్మకమైన నిత్యసంవేదనములో

ప్రవిలీనమగును. కేవల ప్రకాశాత్మకమగు నానందమయసంవిదున్మీలనము గలుగును. సాత్వికసాత్వికానువేధతో గూడుకొనిన సంవిద్విశ్రాంతిస్వరూప సాక్షాత్కారభూమియై గోచరించు ననవలయును. అప్పటి నిస్పందీకృతమైన శాంతిపరిధిలో ఆనంద ముద్వేల్లిత మగుచుండును.

సాహితీవిద్య నిరంతరభావనావిశేషమున పరబ్రహ్మాస్వాదమును సంపాదింపచేయును. అచటి రసానుభూతిలో గుణమయమగు ప్రాకృతికతత్వమంతను దాటిపోయి మాయా భూమిని గూడ నధిగమించి భావకుఁడు విశ్వోన్మీలన మొనరింపఁగలడు. అప్పుడు ఈమహా జగమునంతను అహమాత్మకముగనే భాసింపచేసుకొనును. అహ మను ప్రత్యయముగాని అహ మిద మను ప్రత్యయముగాని యాతని యనుభవస్వభావములో ననుసంధిరూపముగా భాసింపదు. సంవిన్మాత్రమే యప్పటివిషయము వ్యుత్థితచిత్తత కలిగినపుడు పునఃప్రత్యవమర్శము కలుగగా నంతయు శక్తివిలాసముగా భాసించును. దేహాదిప్రమాతృతాభిమాన దశలోకూడ ప్రకాశభావము గోచరింపవచ్చును వెంటవెంటనే అపోహనపరాయణత ప్రమాతృసంలీనత సముత్పన్న మగును. అప్పటి అపోహన జీవితములోని యనుభవజ్ఞాన మందు ప్రకాశవిశ్రాంతి కలుగును. అనాయాససిద్ధమైన విశ్వాంతర్విలాపము నైసర్గికమై గోచరమగును. ఈమహాజగత్తునందంతను ప్రకాశాత్మకతనే భావించునుకాన సహజోన్మేష మున విహారము కలుగును. క్రమక్రమముగా గలిగినయంతర్లీనవిమర్శసద్భావమువలన తన ప్రకాశసంవేదనము స్ఫుటపరిస్ఫురణము పొందును. ధారావాహికమైన చర్వణ యతిశయించుటచే కావ్యనిగూఢమైనతత్వము హృదయప్రవేశనపొందును. తనయందలి స్త్రీత్వ పురుషత్వములను విద్యాభావనాసమయమున భావకుఁడు విస్మరించును. తనమానవత్వమే తనకు లేదు. విశ్వవ్యాప్తమయిన సహజబోధ సాక్షాత్కరించును. అప్పటి అఖండార్థబ్రహ్మా నందములో తదతిరిక్తమగువస్తువు ఏదియు లేదు. అఖండమైన సామరస్యము సహృదయునకు కావ్యవిద్య సంపాదించి తనప్రయోజనవత్తను ఖ్యాపనచేయును.

అజాతవాదములోని పరమార్థప్రకాశమును సాహితీవిద్య సంపాదించి వాస్తవసత్యమును భాసింపచేయును. స్వభావసిద్ధమైన జరామరణనిర్ముక్తభావమును గోచరింపచేయును. బద్ధతగాని ముక్తతగాని లేనట్టి యద్వితీయబ్రహ్మరసానుభూతిని సంపాదించి సాహితిచరితార్థమగుచున్నది. మాయికమైన యావరణమునంతను క్షణములో తొలగించి నిత్యచేతనాత్మకమగు కల్యాణానందమయరసప్రకాశమును కలుగచేయును.

# నైసర్గిక ప్రతిభ

శ్రీ కొన్నలగడ్డ సత్యనారాయణమూర్తిగారు, యం. ఏ., బి. యల్., మైలాపూరు.

బహుజన్మసంచితతపఃఫలము నైసర్గికప్రతిభ. దీని ప్రధానగుణము ఆత్మప్రకాశము. అనలమును ఉదరమందిడికొనిన జంత్రము పొగలు చిమ్ముచు నులుకుచందమున ప్రతిభాప్రదీప్తహృదయముగలతపసి తనయాదర్శము వెస ముందంజవేయుటకై అనవరతము ఉవ్విళ్లూరుచుండును. ఇతడు భావోపాసనమున బద్ధదీక్షితుఁడై యుండును. సమీరస్పర్శచే దశదిశల రివ్వున నెగయు దివ్యగంధమట్లు, ఆధ్యాత్మికమైన ఆవేశము హృదయమును సోకిన తనకోయిలకుత్తుకనుండి రాలి, నిస్తబ్ధప్రకృతిరాజ్యమును పీయూషప్లావిత మొనరించు 'కూహు కూహూ'లవలె, ఈశ్వరాదేశమందిన రవిమయూఖము గగనహృదిపై వ్రాలిన చీకటులను వాడికత్తివలె పరపర గోసినతోడన దోచుస్వర్ణవర్ణమువడువున, పున్నమచందురుడు పక్కున నవ్వినంతన కిలకిల నేలరాలు తెలివెలుగులలీల, నందనమునుండి జగన్మోహిని జారవిడిచిన దివ్యమణిమేఖలయో యన ప్రకృతిసీమంతిని కటిప్రదేశమున తళ్కొత్తు మెఱపురేకపోలుపున, ప్రతిభాసముద్భాసితహృదయము ఆవేశసంచలితమైనంతన వెడలుభాసమాన భావరుచులు సహృదయునకును రసభరితహృదయునకును అపరిమితానందము నొసగును. ప్రపంచచరిత్రలను పరికించితిమేని, ఇట్టి హృదయములుకలవారిని వ్రేళ్లపై లెక్కింపగలము. నోబిల్‌పారితోషికము నందినవారిలో నగ్రగణ్యుఁడనదగు రవికవి ఇట్టి మహనీయులలో నొక్కఁడు. ఈతనిహృదయ మమృతమయమైనది. తన్మయభావమున నోలలాడు పరమహంసవలె దానియం దీతనియాత్మ మును గీత నీదుచుండును. తనకలమును రవీంద్రుడు నిజాత్మకందించును. దాని నది యమృతమున ముంచును. కావున నాలేఖనీముఖమునుండి ఆధ్యాత్మిక భావసుధాపూరము అవిరళధారగా వెల్వడును. రవీంద్రునిదాపున నిలుచుట కర్హతగలవారు వసుమతియందు నేఁ డెందఱో లేరు.

ఏయుగమందైనను, ఏసీమయందైనను మానవునకు పూజనొసగునది నైసర్గికప్రతిభయే! ఒక్కొక్క లలితకళ దీనికి నిక్కమైన ఆటపందిరి యగును. లలితకళోపాసకులకు నెందును శత్రువులు లేరు. జగదీశునిసయితె మెదిరింప దలఁచు దుర్మతులు ప్రతిభాసమన్విత హృదయము మ్రోల సాగిలపడి తీరుదురు. వ్యాసవాల్మీకులకు, హోమరుడాంటేలకు, గొటె

షేక్స్పియరులకు, కాళిదాసభవభూతులకు, రోలండురవీంద్రులకు పుష్పాంజలి సమర్పించుటకు వసుంధరలో మక్కువపడనివా రెవరు?

నైసర్గికప్రతిభాసమన్వితుఁడు రంగారుబంగారుతలఁపులతో స్వప్నము లల్లుకొని మురియును. ప్రతిభకు భావనావేశము మిగుల గూర్చునెచ్చెలి. ఈయావేశముగల అదృష్టవంతుఁడే పదునాలుగుభువనములందును మసలగలడు. నిద్దుర యొడియందు వసుంధర శయించియుండ నీతఁ డల్లన నందనములోనికి కదలి పోయి, అందలి పొదరిండ్లయందు పవ్వళించి, ఏమేమో తలపోసి గంపెడుపూలు ప్రోగొనరించుకొని తీయనితీవలతో, కెంపుదారములతో మాలగ్రుచ్చి చరచర సాగిపోయి కులుకుచు సాహితీసీమంతినికి దాని నప్పన మొనరించి "తన్వీ! నన్ను నీచేతివీణె జేసికొను"మని యామెను వేడుకొని, మనోరథసిద్ధి నందును. మంచుకొండకొననుండి అల్లనస్రవించు సురశైవలినీధారయ ట్లాతఁ డాలాపించుగీతిక కవితాహార్యశిఖరమునుండి మెల్లగ స్రవించును. కళోపాసన మొనరించుచు, ఈతఁ డాత్మవిస్మృతుఁ డగుచుండును. పరమప్రమోదముతో నీతఁ డాడును, పాడును. ముద్దుబిడ్డను చూచి మురియు కన్నతల్లివలె తనసృష్టి నవలోకించి నిభృతమున నీతఁడు కులుకును. కళోపాసకునిజీవిత మెంత చిత్రమైనదో! వీనిరక్తమాంసము లవనియందే నిలిచినను, నిలింపులనెచ్చెలిరై యీతఁడు విహరించును. ఇతఁడు సర్వాంతర్యామి కాడు, కాని సర్వాంతర్యామి కంటె నదృష్టవంతుఁడందును. సర్వాంతర్యామి కదలుటకు చోటేది? బ్రహ్మాండమందు ఆతఁడు నిండియుండువాడు కాదా! మంచిచెడుగులు, సుఖదుఃఖములు, సుగంధదుర్గంధములు, చీకటివెలుతురులు ఆతని కట్టెదుట కానుపించును. ఈదృశ్యమును విలోకించి ఆతఁ డొకకంట బొగిలి, రెండవకంట నానందింపవలెను. ప్రతిభాసమన్వితుఁడో? కళావ్రతుఁడో? ఈతఁడు ప్రతికూలసంఘటనములదెస పోడు. పోయినచో, ఏమి బీజాంకురముల నీతఁ డుచ్చరించునో కాని ముండ్లకంపలుపోలు పరిస్థితు లీతనిమ్రోల చిఱునవ్వులు రాలుచు పూవులతలగును! సెగలును, పొగలును ఈతనికనులబడినంతనే, మకరందధారలై వీనికి పాదప్రక్షాళన మొనరించును! ప్రతిభాశాలి నిప్పులు త్రొక్కినను, అవి హఠాత్తుగ నిత్యమల్లెలై జగన్మోహినికాళ్లబడి మురియు సురవీరు లట్లు మురిసిపోవును. కసుగాయలై ఈతఁ డెన్నఁడేని వాపోయినను, వరూధినివలె కలస్వనముతోడనే యేడ్చును. అఱపులును, చఱపులును పండితునకు తగునేమో కాని ఆనందవ్రతునకు కాదు. సుత్తెదెబ్బలవలె, సమ్మెటపోటులపగిది మనసుపై మాటలుపడెనేని, ఫిరంగిశబ్దమున రివ్వుమను పిట్టయట్టులు ఈతఁ డెందేని యెగసిపోవును. ఈతనిగుండె పూవురేకుకంటె మృదువైనది. అబలవలె నున్న నేమి? అక్కఱగువేళ

నీతనియెడంద వజ్రాదపి కఠోరమగును. చల్లనితల్లి పార్వతి మహిషాసురమర్దని కాలేదా! పిడుగుల నీతఁడు గోలీలట్లాడగలడు. భయంకరమేఘములను చింతగింజలట్లు గుప్పగలడు. బడబానలమును త్రిచూర్ణము జేసి, నొసట దాల్పఁగలఁడు. మహోదధులను పురిషిట గ్రోలఁగలఁడు. కళోపాసకుని ప్రజ్ఞాప్రతిభలు కావలెనని నొడిబడునా! బడులందు నేర్చుకొనిననవి యలవడునా! నరనారాయణులట్లు దివ్యబదరికాశ్రమమున బహుయుగములు తపసు చేసినమహాత్ముఁడే సౌందర్యోపాసకుఁడు కాజాలును. ఈమహాత్ముఁడే శ్రీనాథుఁడనిన "దుర్భర కరుణాధురీణ యగుప్రాణము"వలె తనయద్భుతసృష్టినుండి "పెరుగును, వంటకంబు, వడపిందియలం గొనితెచ్చి," విజ్ఞానడింభకుల కిచ్చును.

ప్రతిభావంతున కిట్టి యద్భుతశక్తి నిచ్చునది వానిపవిత్రోద్వేగమే! ఈయుద్వేగము వట్టిపొంగు అనిన దోషము సుడీ! ఇది కాగుడుబిందెలోని మరుగునీరుకాదు. త్రిమూర్తలును యక్షగంధర్వకిన్నరకింపురుషులును అనంతకాలము గ్రుంకులిడు నాకమానససరోవరమునుండి యుబుకు మహత్తరపూర మీయుద్వేగము! తెలికెరటాలమీది తళుక్కులందూగాడు ప్రభాతకిరణశాబకములలీల ఉద్వేగతరంగములనుండి వెడలు తలపుతుంపురులు మనశ్చక్షువునకు మిఱుమిట్లు గొలుపును! నవరతనములపుంజమట్లు, ఏడురంగులబంతిలీల, సర్వకాంతులకందుకముకైవడి, గుండచేయబడి నిండుచెండువడువున దోఁచు ఇంద్రధనువు చందమున నీతలపుగుంపు మనోహరమై, ఆత్మచే తన్మయనృత్యము జేయింపదా? హృదభ్రమమునుండి కుంభవృష్టిగ భావములు కురియనుంకించుచుండ, తనబిడ్డ వడముడిని తన చేతులందు మాయఁజాలనికుంతివలె ప్రతిభావంతుఁడు తనతలపులను తనమాటలందు, తన రంగులందు, తనయాలాపనమందు తననృత్యమందు తానువలచురీతిని ఒక్కొకపుడు వ్యక్తీకరింపఁజాలకపోవచ్చును. అపు డుద్వేగభరితుఁడై ఈతఁడువెఱ్ఱిగ నెగయును; పరమహంస వలె గంతులువేయును. నైసర్గిగభావము, భావనావేశభరితభావము మనసునందు కుమిలి కుమిలి యుండనేరదు. ప్రతిభామూర్తులైన సూర్యచంద్రులు మేఘగుహాలందు కైదీలైయుందురా? కళోపాసకునిభావము దివ్యభావము కావున, కౌస్తుభమున కెనరైనదికావున, శమంతకమునుబోలునది కావున, శ్రీపతి శయ్యాగారమందలి రత్నదీపిక కీడైనదికావున, సౌదామిని నెచ్చెలికావున ప్రకాశము నందితీరవలెను. మాటల కది యందనపుడు రాగాలాపనమందును, నృత్యమందును, చిత్రలేఖనమందును—అన్నిఁటియందును అవతరించును. జగదీశుఁడు దశావతారములెత్తిగాని ఆత్మప్రకాశము గావించుకొనజాలకపోయినాడు. ఆత్మ

ప్రకాశ మొనరించుకొనుటకై నైసర్గికప్రతిభాసమన్వితుఁడు సహస్రావతారము లెత్తిన నెత్తును.

ఈతనిది యొంటరిబ్రదుకు కాదు. వీనికి నలువురు సైదోదులున్నారు. ప్రవక్త, మహావీరుఁడు, మహాత్ముఁడు, పరార్థజీవి యనువారేకదా వీరు! ద్రౌపదియట్లుద్వేగ మీయేవురను వరించినది. ప్రపంచేతిహాసములను వెతకుఁడు, నిక్కము గోచరించును. నెపోలియన్‌చే ఆప్సి నైర్‌కొండలను ఫుట్‌బాలులట్లు తన్నించిన దీయుద్వేగమేకదా! మహమ్మదుప్రవక్తచే మహాద్భుతధృతిని విజృంభింపజేసిన దీయుద్వేగమేకదా! కళావ్రతునిచే తారకలను మల్లికలట్లు త్రుంపించి, సాహితీజగతిపై జల్లించుచున్న దీయుద్వేగమేకదా! మహాత్మునిచే బ్రహ్మాండమును పుటికీలుకొట్టించుచున్న దీయుద్వేగమేకదా! ఈయుద్వేగములేనివాడు కళాక్షేత్రమందుగాని, కురుక్షేత్రమందుగాని యుండఁదగడు, అత డుండనేలేడు, ఉండనే యుండడు.

కవియును, యోధుఁడును తమసైదోదులవలెనే తమయుద్వేగమును చిత్తమువచ్చినట్లు పాఱనీయరు. గట్టులనడుమ స్రవించు సరిల్లలామమే కలరవ మొనరించునట్లు, నియమబద్ధమైన పంక్తులనడుమపాఱు ఆవేశమే మనసును తనుపుమధురస్వర మొనరించును. కవితావనియందు కట్టల నేర్పఱచునది ఛందస్సు. ఛందోబద్ధమైన పంక్తులు నది కవ్వల నివ్వలగల గట్టులువంటివి. ఈగట్టులే కవిత్వ మనుకొనువారు నదీపూరమని మన్ను నోటగొట్టుకొను మొఱకులు పోలువారు. కదనాంగణమున నొకవ్యూహ మేర్పఱచుకొనియే మహావీరుడు ఆహవమునకు దొడరును. లక్షణసూత్రములచే నిర్మింపబడిన పంక్తులపగిది, ధునీకూలములందు గట్టఁబడిన గట్టులట్టులు, రణోర్వియందలి వ్యూహము ఎంతేని నేర్పును సూచించును. ఈకౌశలము భావఝరికాదు, వారిపూరముకాదు, శౌర్యవాహినికాదు. బాహ్యావరణమైన శరీరమునుచూచి, 'ఇదియే మనుష్యుఁ' డనువాఁ డెట్టిబుద్ధిమంతుఁడు? నైసర్గికప్రతిభ సౌందర్యసందీపితమైనశైలియందే, మంజులమైనరవమందే, కాంతులీనురంగులందే, మనసు నలరించులయయందే, లయతో సహకరించునృత్యమందే ఆత్మ వ్యక్తీకరణము నవలోకించును.



# మిల్టను—వాల్మీకి

విద్వాన్, శ్రీవేదము లక్ష్మీనారాయణశాస్త్రిగారు, B. O. L.

ఆంధ్రప్రధానోపాధ్యాయులు, హిందూథియలాజికలు హైస్కూలు, మదరాసు.

దేశపరిస్థితులమార్పులును, కాలప్రవాహమందలి పరివర్తనములును, ప్రతియుగమందును, ప్రతిఖండమందును, గోచరించుచునే యుండును. ప్రకృతిసౌందర్యమును, కళానైపుణ్యమును, భావసౌష్ఠవమును, గానమాధుర్యమును, మహోన్నతాదర్శములును ఒకరిసొమ్ములు కావు. సర్వజనసౌహార్దమును, సర్వమానవసంఘీభావమును, సర్వమతసహిష్ణుతను పెంపొందించుటలో సారస్వతమునకుఁ గలశక్తి మఱియొకదానియందుఁ గన్పట్టదు. పామరులు సామాన్యముగ తాత్కాలికోద్రేకచిత్తులు; కాన విద్యావంతులు స్వప్రయత్నములచే వివిధసారస్వతముల తఱచి యందలి యుత్తమోత్తమాదర్శములును ఆశయములును మనవానికంటె భిన్నములు కాఁజాల వని చాటఁగల్గిననాఁడే సౌహృద్యమును, సౌభ్రాతృత్వమును చేపడి, మానవులలోని నేఁటిదురంతమును దౌరాత్మ్యమును పలాయనమై శాంతిసౌఖ్యములు తలయెత్తుకొనఁ గల్గియుండును. ఈవ్యాసముచే నీయుద్దేశము నొక్కింత నెఱవేర్ప నెంచితిని. అది యెందాఁకసాధ్యమో గుణదోషగ్రహణపారీణులగు పాఠకమహాశయులే నిశ్చయింతురుగాక.

భారతీయైతిహాసికప్రపంచమున వాల్మీకిమహర్షి కెంతగౌరవోన్నతి కలదో యంత యాంగ్లేయైతిహాసిక ప్రపంచమున మిల్టనుకవికిని కలదు. వాల్మీకి మిల్టనులకాలదేశవర్తమానములును వారిరచనావస్తువుల తుల్యతాతుల్యతలును ప్రస్తుతవ్యాసమునకు విషయములు కావు. వారి యాంతరంగికభావప్రకటనమే మనకు ముఖ్యము.

వాల్మీకిమహర్షి మన కాదికవి;

“కూజంతం రామ రామేతి మధురం మధురాక్షరమ్,
ఆరుహ్య కవితాశాఖాం వందే వాల్మీకికోకిలమ్.”

అనికదా భారతీయుని పరమవిశ్వాసము. మిల్టనుంగూర్చి యాంగ్లసారస్వతవేత్తలు “మిల్టనురచనామృతముఁ గ్రోలుటయే పాండిత్యమునకు పరమావధి; సాహిత్యపఠనమునకు ఫలము.—**An appreciation of Milton is the last reward of consummated scholarship,**” అని ఘంటాపథముగ వాక్రుచ్చియున్నారు.

## త్రిలిఙ్గరజతోత్సవము

ఈకవికంఠీరవులనామములు ప్రభామండలపరివేష్టితములు, పరమపావనములు, సుకుమారతేజఃప్రసారకములు. వారిపేరు విన్నంతమాత్రాన వారియందు ప్రేమగొని వారిని శ్లాఘించి సంభావింపనివా రరుదు. ఇంత దీర్ఘకాలము గడచినను ప్రజలకు వారియం దిసుమంతయు గౌరవన్యూనత కలుగదు. కాల మతిక్రమించుకొలఁదియు వారిప్రాబల్యము దృఢతరమై వారికీర్తి దిగంతముల దట్టముగ నల్లుకొనుచున్నది. ఆమహనీయులకీర్తికాయ ములముందు నిలిచి యిరువుర నేకకాలమున కనులారఁ గాంచి వినోదింతము. వా రిపుడు లోకాంతరముల వెలయుచుండినను వారివదనారవిందములనుండి సోనలుగట్టి కురియుచున్న యమృతనిష్యందము భూమి నార్ద్రీభూతముం గావించుచున్నది.

వారు దివ్యాంశసంభూతులు గావుననే కాలవాహిని వారిని ముంచి రూపుమాపఁ జాలకున్నది. ఈయంశము బుద్ధిగోచరమైనక్షణమున మనశ్శక్తిహీనతయు వారియు త్కృష్టతయు స్ఫుటమగును సముద్రతరంగముల యురవడికి పాలైన శిలలవలె వారును శతాబ్దములతరబడి నిరంతరము కాలతరంగముల దెబ్బలకు పాల్పడి యుండినను అందు మూలమున వారియసాధారణప్రజ్ఞయు కావ్యసౌందర్యమును సాహితీసౌష్ఠవమును తేటతెల్లమగును. వారికీర్తికాయములు హిమాలయములకన్నను పొడవైనవి. కనుకనే వారిదృష్టిపథమున కందనిచోటిలోకమున దొరకదు.

వాల్మీకి క్రీస్తుపూర్వ మెన్నియోశతాబ్దములముం దుండినవాఁడు; మిల్టను క్రీస్తువునకు కొన్నిశతాబ్దముల వెనుకటివాఁడు. ఒకరు ప్రాచీమండలమున నింకొకరు ప్రతీచీమండలమున వెలసినవారు. ఒకరిభాష దేవవాణి యగుగీర్వాణి, రెండవవారి దాంగ్లము. అట్టి యీయిరువురలోను సామాన్యదృష్టికి సామ్యమేమియుఁ గన్పట్టదు. భిన్నభిన్నపరిస్థితులం దుదయించి, భిన్నభిన్నపరిసరములందు పెరిగి, అంతకన్న భిన్నములగు ననుభవములకు వశులైనందున ఆధ్యాత్మికముగనేమి, భౌతికముగనేమి లేశమైనను తౌల్యత వారియందు గోచరింపదు. వాల్మీకి శుద్ధహిందువు; మిల్టను శుద్ధక్రైస్తవుఁడు. వారిలోఁగల విలక్షణ మిది యొక్కటే; సమస్తమున కిది మూలకందము.

అట్లయ్యు నాయిరువురఁ జేరఁదీయు దివ్యశక్తి యొకటి కలదు. అది గుప్తమై నిలీనమై యుండునట్టిది. తాపసలక్షణములు మిల్టనునందును గన్పట్టును. మిల్టను నగరవాసి యగుతాపసి, వాల్మీకి అరణ్యవాసి యగుతాపసి. ఆకవిద్వయము తుల్యగుణముల ప్రకటనమున కిది చాలును.

దుర్జ్ఞేయము, దుర్గ్రాహ్యము నగుభగవంతుని లీలలను యథామతి యథాశక్తి నిరువురు వర్ణించినారు. ఆవర్ణనములు వారివారి చిత్తవృత్తులనుండి యుద్భవిల్లినను సార్వకాలికములు సార్వజనీనములు నైనవి. భిన్నసంస్థలవారగుటచే వర్ణనలందు ఈషత్తు వైషమ్యము పొడసూపినది. అది వాస్తవమున భిన్నలక్ష్యములకు గుఱియైన యేకవిషయమే కాని వేఱుకాదు, భిన్నమునం దభిన్నము, బాహ్యాళికమున నేకీభావము. "అది సార్వకాలికసృష్టి; కాని యేకముఖమైనది కాదు."

ఈకవిద్వయమందుఁ గలసాదృశ్యతాసాదృశ్యతల నిరూపించునుద్యమ మెన్నటికిని నిష్ఫలము కానేరదు. కాని యీకార్యనిర్వహణమునకు సారస్వతసామగ్రియు చారిత్రిక సామగ్రియు నత్యావశ్యకములు. సారస్వతసామగ్రిమూలమునఁ గొన్నిసిద్ధాంతముల నిరూపింపఁగలముగాని మానవప్రకృతి సాహిత్యరచయితకును మానవవ్యక్తికిని గలతారతమ్య నిర్దేశమందే ప్రియపడుచుండును. చారిత్రికసామగ్రి లేనిచో మనయత్నమున కంతరాయము కలుగదు; అంతమాత్రాననే వారిరచనాతత్త్వము దుర్గ్రాహ్యముకాఁబోదు. కాని యదియు నున్న మఱింత సంతృప్తికరముగ నుండునేమో యన్నయనుమానముచే బాధితుల మగుచుందుము.

వాల్మీకిరచితము 24,000 గ్రంథము. అందొకమాటమాత్రమేనియు స్వవిషయముం గూర్చిన ప్రసక్తిగా చూపట్టదు. ఆయనకు సమకాలికుఁ డగువిశ్వామిత్రమహర్షి రచనము, ఇరువదినాల్గుశ్లోకములపరిమితిగలది, బహుక్లిష్టమైనది గలదు. ఆదికవిచరిత్రము నింతక్లిష్టముగ రచించుటలో రచయితబుద్ధివైశద్యమును చాటునుగాని మనయుద్యమమున కేలాటి యుపకారమును తోడ్పాటును చేయఁజాలదు.

ఏది యెట్లున్నను, "**The man is only half himself, the other half is his expression**" అన్నట్లు కవిరచనములే సాఁబాలుపురుషుని వెల్లడింపఁ గల్గును. మిల్టనుచేసిన కావ్యము "స్వర్గపదభ్రష్టము-Paradise Lost;" వాల్మీకికావ్యము రామాయణము. ఆ యిరువురును నిరుపమానకవులు.

రామాయణపఠనానంతరముననే లాక్షణికు లితిహాసమున కిదమిత్థ మని లక్ష్యలక్షణ సమన్వయమును సిద్ధాంతీకరింపఁ గల్గిరి. అట్టి ప్రాచీనైతిహాసికలక్షణము లన్నియు మిల్టను కావ్యమున దృశ్యములు. "నిషేధవృక్షఫలాపహరణ మాధారముగాఁ గొని ముల్లోకముల, స్వర్గమర్త్యనరకలోకముల చరిత్ర మల్లఁబడినది. ఈచరిత్రము జరిగినరంగము విశాల విశ్వము. వర్ణితకాలము ఆనంత్యము. అందలిపాత్రములు భగవంతుఁడును ఆయనసృష్టియు." ఇది మిల్టనుకావ్యకథావస్తువు. అట్లే రావణసీతాపహరణ మను నేకవృత్తము నాశ్రయించి.

నట్టిది రామాయణము. భూస్వర్గములు కథారంగములు. కాల మానంత్యము. మానవులు, దేవదానవులు, భగవంతుఁడు నిండలిపాత్రములు. ఈయితివృత్తద్వయములో మొదటిది కల్పనాప్రపంచమున మహోన్నతిని గన్నది; రెండవది ప్రకృతిసారళ్యములచే సర్వజనానంద కరమైనది.

పురవనసముద్రపర్వతసూర్యోదయసూర్యాస్తమయచంద్రోదయాదులును, ఉపవన విహారములును, నాయికానాయకులసంయోగవియోగములును, పుత్రోత్పత్తి, రాజకీయాందోళనములు, రాయబారములు, యుద్ధములు, ప్రయాణములు మున్నగువానివర్ణన లుత్తమ కావ్యలక్షణము లని విద్యానాథకవి శాసించియున్నాఁడు. వీనితోపాటు సుఖదుఃఖసాధనములును కొలఁదిమాత్రము అవసరము. కొన్నిసమయములందు లాలిత్యసౌకుమార్యములు సూక్ష్మవాహినులై యాద్యంతము వ్యాప్తినందును. కథాపాత్రములన్నియు నితివృత్త సంవిధానమునకు తోడ్పడుచుండఁగా కావ్యము గద్యపద్యములలో నొకరూప మందవచ్చును.

ఆంగ్లభాషయందు మిల్టను కావ్యమునకుఁ బూర్వ మితిహాసము లనఁదగినవి రెండే. "బ్యూవుల్ఫు" అనున దొకటి; స్పెన్సరురచితమగు "ఫెయిరీక్వీన్—యక్షిణీరాజ్ఞి" అనునది రెండవది. వీనికి తర్వాతఁ జెర్కొనఁ దగినది "Idylls of the King" (రాజుల లఘు చరిత్రము.) రామాయణమునకుఁ బూర్వ మితిహాసములు లేవు. తరువాత కాళిదాసుచే రఘువంశము రచితమైనను అది మహాకావ్య మనిపించుకొనుచున్న దేగాని నైతిహాసిక గౌరవము గడించుకొనలేదు. బాణునికాదంబరి కల్పనాకథ. శాసితకావ్యలక్షణముల కిసుమంతేనియు లోటురానీయక పాటించి వ్రాసిన గ్రంథములవి కాని యాగ్రంథజాలము "Paradise Lost," "రామాయణ" కావ్యములంతటి యున్నతపదవుల నాక్రమించుటయు పండితపామర సర్వజనాదరణీయములగుటయు సిద్ధింపలేదు.

పాశ్చాత్యులదృష్టియంతయు చారిత్రికపురుషులమీఁదనే నిలిచియున్నది. పురాణ దంపతులగు ఆదము ఈవులను (Adam and Eve) స్మరించుటయే లేదు. సాధారణముగా కంటి కతి సమీపవస్తువును, అతిదూరవస్తువును కనఁబడదు గదా! మనదృష్టికి బహుదూర వస్తువుల దర్శింపఁగలశక్తి సున్న. అంతమాత్రాననే ఆవస్తువులు మృగ్యము లనియు, అట్టివి కేవలకల్పితములు అనియు త్రోసివేయఁదగినవి కావు. కాలాంతరమున మఱి రెండువేలేండ్లకు తర్వాత నిప్పటి మనచరిత్రములకునైత మీఁదశ పట్టక తప్పదు. అప్పటివారి కిది మాయగా, ఇంద్రజాలముగా చూపట్టును. అతిదూరగతములగు వస్తువుల మూర్తీభవింపఁజేయుటలో బుద్ధిబల మత్యవసరము.

ఇతరరచనములం దైతిహాసికలక్షణములు న్యూనములు. వానిలోఁ గలకథాపాత్రములు సజీవములు గావు. అందు వాస్తవికత లేదు. అవి కేవలకల్పనము లనుబుద్ధి రూఢి

పడును. ఆపురుషులసంతతి లోకమున మనకు గోచరించు ననుభావము తోఁచదు. కనుకనే యాకావ్యములు కాలగర్భమున లీనమైనవి. మిల్టను వాల్మీకులకావ్యము లట్టివిగావు. అందు భావనాప్రపంచ మతిస్వల్పము; భావనాసృష్టి యెన్నటికి నౌన్నత్యము నందఁజాలదు. మిల్టను వాల్మీకులకావ్యములందు దివ్యసృష్టి సత్యము వర్ణితము. కనుకనే యవి శాశ్వతముగ నిలిచినవి. సత్యాశ్రయముల కెట్లు పతనము కల్గును.?

పారడైస్లాస్టును చదువునపుడు చివరిభాగము లుత్సాహములేనివై చల్లఁబడుననునభిప్రాయము కొందఱు వెల్లడింతురు. కథాంశము రసవంతమగుట నిజము; మనకుఁగల ఫలగ్రహణశక్తిమాత్రము తక్కువ. విందు పెద్దది; మృష్టాన్నయుతము ప్రతిభోజ్యవస్తువును ప్రియమై మనచవికాటియుండును. ఏవస్తువునుగాని త్యజించుటకు మనసు గొల్పదు. ఒక వస్తువునుమాత్రమే కడుపారఁ గ్రోలి తృప్తినంద మనసు నిలువదు. కనుక మనసు వివిధవస్తువులమీఁదికిని గంతులువేయుచుండును. చిట్టచివరకు తృప్తియం దేదో న్యూనత తోఁచుచుండును. అంతట విందేమో అంత చక్కఁగా నుండ లేదని యభిప్రాయపడుదుము. మన యశక్తిని అన్నదాతకును అతనివిందునకును ఆరోపింతుము.

మిల్టనువాల్మీకులు గానప్రియములగుకోకిలములు. కనుకనే వారికృతులు గేయములు. కావ్యములు రెంటను ప్రారంభభాగములు గానమున కుచితములైనవి. వానియం దనిర్వచనీయమగుగానరసము సూక్ష్మముగా ప్రవహించుచుండును. పారడైస్లాస్టులో కొన్ని భాగము లీయాదర్శమునకు న్యూనములు కావచ్చును కాని రామాయణమున గేయహీనమైనశ్లోక మొకటేనియు కన్పట్టదు.

ప్రకృతిసౌందర్యవర్ణనావసరములందు మానవహస్తము సోకని వనలక్ష్మిశోభను చిత్రించిరేకాని కృత్రిమ ప్రకృతిని చేపట్టలేదు. ఈకవులచేతులలో ప్రకృతిశోభకు మఱింత శోభ కలిగెను. అవ్వయాదాములును, సీతారాములును వనలక్ష్మి యొడిలోఁ బెరిగినవారు. ప్రకృతికిని వారికిని అవినాభావసంబంధము స్థిరము.

వారిసూక్ష్మదృష్టికి గోచరముకాని ప్రకృతిరహస్యము కనఁబడదు. సృష్టిధర్మము వారితో దాఁగుడుమూఁత లాడఁజాలకపోయెను. ఆయాపట్టులందు వారు వాడిన యుపమానములను పరిశీలించిన వారిదృష్టిసూక్ష్మత యెఱుకపడును. మిల్టనునకు మహాకవి యన్న పదవి లభ్యపఱిచిన వాతనియుపమానములే. అవి పాఠకులమనస్సుల నాకర్షించి భావోద్రేకము పుట్టింపఁగల్గినవి. ఆయిరువురగాంభీర్యమును శృంగారకల్పనలును అనుభవైకవేద్యములు. ఉదయాస్తమయవర్ణనలును ఋతువర్ణనలును కేవలము దివ్యప్రాయములైనవి. అవన్నియు నన్నిశబ్దచిత్రములు. కొన్నివేళలలో తత్రప్రదర్శితదృశ్యము నవగతముచేసికొన

నశక్తుల మగుదుము. అడుగడుగున దానిసంపూర్ణత మనోగోచరమగుచుండఁగా మధ్యమధ్య ననవసన వైపుల్యత యాచిత్రముల నెక్కడ పాడుచేయునో యనుభీతి మనల బాధించు చుండును.

“మిల్టను నిర్మలప్రేమమును, క్రోధమును, విజయమును, లోకదహనాదులను కనులయెదుట ప్రత్యక్షముగా నటింపఁజేసినాఁడు. అందు ప్రధానదాహమును, దారుణ మైనదానిని, విపులముగా వర్ణించినాఁడు. దేవపుత్త్రుని ప్రవేశవర్ణనము వాఙ్మయమంతటికిని తలమానికమైనది.” వాల్మీకి వర్ణించిన లంకాదహనము అత్యద్భుతమైనది. ఎట్టిఱాతిగుండె నైన కరగించును. విజయలక్ష్మిని చేకొని విజయోత్సవముతో లంకాపురమును ప్రవేశించు లక్ష్మణువర్ణనము ఇట్టిదని వివరింపఁదరమగునా?

ఈకవిద్వయమున యుద్ధవర్ణనాకౌశల్యమున కెవరిని ప్రస్తుతించి బహూకరించుటయో సాధ్యముకానిపని. ఇరువురు నొకరికొకరు తీసిపోరు. తళతళ మెఱయు నిశితఖడ్గజాలమును జళిపించుచు నెట్టికవచములనైన భేదింపఁజేయుటలో నిరువురు నసమానులు. మిల్టను స్వర్గ లోకయుద్ధమును వర్ణించును; వాల్మీకి భూలోకయుద్ధమును చిత్రించును. స్వర్గసేనా విన్యాసమును భూలోకసైనికవ్యూహమును కనులయెదుట తాండవమాడుచుండును.

మఱొక విశేషము. కథాపాత్రములు తఱుచుగా దీర్ఘసంభాషణావశు లగు చుందురు. పదభ్రష్టులైన దేవతలవాదప్రతివాదముల మూలమున మిల్టనువాల్మీకు లిరువురు అలంకారవర్షము కురిపించిరి. ఆయలంకారవృష్టి వారిసూక్ష్మవివేకనాగరకతలకు నిదర్శన ప్రాయము. వారిభాష కేమాత్రము న్యూనతకల్గినను వారిపదవులకు హైన్యత యేర్పడును. వారినడవడులందును, సంభాషణములందును గాంభీర్యము తొలకాడుచుండును.

మిల్టనుకావ్యమున ప్రతిపంక్తియందును స్వాతంత్ర్యాభిలాష ప్రతిఫలించుచుండఁగా, వాల్మీకికావ్యమున రాజగౌరవము గభీరమై యుండును. పదభ్రష్టులైన దేవతలు పరమ స్వాతంత్ర్యప్రియులు. వారిసమావేశములందు జరిగెడు తర్కవాదములు స్వేచ్ఛాభి మానముతో పొంగుచుండును. కాని హద్దుమీఱి నడచుట మాత్రము కానరాదు. మర్యా దకు భంగములేదు. సైతాను (శని) ఆలోకమున కథ్యక్షుఁడు. తద్విరోధులగు దేవతలు ప్రభుభక్తిపరాయణులు, వారికిని సభాసమావేశములు కలవుగాని యందు తర్కవాద ములకు స్థలములేదు. భగవంతుఁడే సర్వాధికారి.

# బాలగీతికలు

శ్రీ జయంతి గంగన్నగారు, రాజమహేంద్రవరము.

## I

### పిల్లవాని చదువులు

ఇరుగువారి పిల్లవాఁడు
  ఎక్కాలు వేయఁగానె,
ఇంటిపెద్దలెక్కలన్ని
  హెచ్చుతగ్గులైపోయె!

పొరుగువారిపిల్లవాఁడు
  పుస్తకాలు పట్టఁగానె,
వీథిలోనిపెద్దలెల్ల
  వేయుకేక లణఁగిపోయె!

మాపిల్లవాఁడు ఓన
  మాలు మొదలుపెట్టఁగానె,
నోరు తెఱచి మాటలాడ
  నేరనైన నేరనట్టి

ఊరిలోని గోడలన్ని,
  ఊరిబయటి చెట్లుకొన్ని,
చాపతాళ్లగుట్ట కూడ
  చదవులతో నిండిపోయె!

## II

### గాలిబుగ్గ

బుగ్గా, ఓబుగ్గ!
  పొంకమైన గాలిబుగ్గ!
సబ్బునీటిబుగ్గా! ఓ
  చక్కందనాలబుగ్గ!

చూడ చిత్రమైన బుగ్గ,
  చోద్యాల బుగ్గ!
నిగనిగలబుగ్గా, ఓ
  నిండువిగ్రహంపుబుగ్గ!

ఇంపుగాను, సొంపుగాను,
  నీటుగాను, గోటుగాను,
ఠీవిగాను నీవమ్మ,
  టెక్కుగాను పోవుచుండ
లోపమొకటి కానరాదు—
  లోపల పసలేదు గాని!

రంగురంగుల బుగ్గా, ఓ
  రమ్యమైన బుగ్గ!

డాబుడాబుల బుగ్గా, ఓ
డంబాల బుగ్గ!
నీయింపు, నీసొంపు,
నీరంగు, నిగనిగలు,
నీటెక్కు, నీఠీవి,
నీడాబు డంబాలు,
వట్టివట్టివే నమ్మ,
ముట్టుకున్న కానరావు!

వంగుచుండు వాడుచుందువు,
వాలుచుండు వెగురుచుందువు,
చెంగుచెంగున దాటుచుందువు,
చెలరేగుచుందువమ్మ!
తిరుగుచుందువో బుగ్గ,
పరుగులిడుదువోయమ్మ!
శూరత్వ మెంతెంతో
చూపఁగలవు గాని, చిన్న
సూదిపోటు తగలఁగానే
చుంయిమని పోదువమ్మ!

—బుగ్గా ఓబుగ్గా—

## III

### బంగారము—గుఱిగింజ

అఱిగిపోయి, లొత్తవోయి, అచ్చటచట చిల్లులు వడి,
విఱుగుచూపి, బిడ్డులోడ, ముఱికితోను నిండియున్న
నగయొక్కటి—బంగారపు నగయొకటి—

దిక్కులేని ముసలియవ్వ తెఱఁగున నేతెంచె నొక్క
దినమున కంసాలికడకు, దిగులొందుచు, తడబడుచును,
మొగము చూప వెఱచుచుఁ, గడు వెగటుచెందుచు.

పేరికి బంగారుగాని, బిచ్చగానికైన లేని
దారిద్ర్యము వెల్లడిల్ల, దైన్యమొలుకుచుండ, చూచు
వారిమనసు కఱఁగ, కనుల నీరు గారఁగ.

చేతను నగయెత్తి చూచి, మూతి విఱిచి విశ్వకర్మ
"చేసినపుడు మంచిసరకె, చెడిపోయిన," దనుచు సుత్తి
తీసి రెండు పెట్లుపెట్టి వేసె త్రాసున.

మనసులోను భగభగమని మండుచున్న దుఃఖమణఁచి
కొనఁజాలక, చెంతనున్న గుంటిగింజను గాంచి పల్కె-
నగ యప్పుడు, బంగారపు నగ యిట్లు——

"చూడుమోయి తమ్ముఁడా, తోడివార లబ్బురపడి
చూడ, పెద్దబ్రతుకు బ్రతికి, నేడు తుదకు, ప్రారబ్ధము!
పాడుసుత్తిప్రేట్లు తినఁగవలసివచ్చెను."

ఈవిధమున నింకనింక నేమేమో తలపోయుచు,
నేడ్చుచున్న నగను గాంచి, యిట్లనె గుంటిపెందగింజ,
"ఎందుకండి, అన్నగారు, ఈవగపు?

"అన్ని దెలిసియున్న మీరె యలజడి పడిపోయినయెడ,
నిన్న లేదు మొన్న మొన్న కన్ను తెఱచి కలవరపడు
చున్న నన్నుఁ బోల్చుకూన లోర్వనేర్తురా?

ఇంతవచ్చె విధివశమున, నంతయు సరిచేయు విధియె;
అంతరించి మార్తాండుం డంతలోనె మగుడ నూత్న
కాంతులతో నిండు భూనభోంతరాళముల్."

"నీనోటనె దేవుఁడుండి, నీవచనమె ఫలియించిన,
నేనీపృథివీస్థలిపై నిలిచియుండునంతకాల
మేనాఁడును నిన్ను మఱవఁబోను తమ్ముఁడా!"

అనుచుఁ బల్కి బంగరునగ, మనసుకొంత దిట్టపఱచు
కొనుచు బయలుదేరి, మార్గమున నాలుగుకాసులతోఁ
గూడిపోయి మునిఁగె నగ్నికుండమందున.

మురికి పోయె, జిడ్డు పోయె, ముసలి యవ్వరూపు పోయె;
పూటపూట పాలుపెరుగు పోసి తల్లి పెంచినట్టి
ముద్దుబిడ్డవంటి నిండుముద్ద వెల్వడె.

వెలువడి యాపసిఁడిముద్ద విలపించుట యనఁగనేమొ
తెలియని గంభీరచిత్తుతెలుఁగునఁ జని తిన్నగాను,
తులను గూరుచుండె శివి విలసిల్లఁగను.

అప్పుడు గుజగింజ వచ్చి, "అన్నగారు, చూచితిరా—
చెప్పియుంటిఁ జెదుదినములు స్థిరముగఁ గూర్చుండవనుచు,
ఇప్పుడు మీకే యది కాన్పించుచుండెఁగా!

"సుత్తివ్రేటులనుచు వనరఁ జొచ్చితి రండన్నగారు,
సుత్తియు కమ్మెచ్చుకారు కత్తెర మొదలైనవి మీ
గుత్తగొన్న బానిసలను గుట్టుదెలిసెఁ గా!"

అని పలుకఁగ, ఆమాటలు విని యచ్చటినుండి లేచి,
పనియున్నది, మరల వత్తు," ననుచు పసిఁడిముద్ద త్వరగఁ
జనియెను, గుజగింజ, "చిత్త" మని మ్రొక్కఁగను.

దినము దినము క్రొత్తతీరు, దినమున కొక క్రొత్తసొరు,
దినము దినము క్రొత్తచిన్నె, దినమున కొక క్రొత్తకుదురు,
తనరఁగ బంగారుముద్ద దాల్చుచుండె రూపము.

దినదినమును గుజగింజయు, మనమున నాత్రంబు హెచ్చ,
కనకపునగ యెపుడు వచ్చుననుచును గనుపెట్టియుండె,
జనని రాక కెదురుచూచుచంటివానిరీతిగా.

తుదకు వచ్చె శుభదినంబు, తులను మరల బంగరునగ
తూఁగుచుండె—హర్షాంబుధినూఁగుచు గుజగింజ నగను
"స్వాగత!" మని పలుకరించె చనువుమీఱఁగ.

జిగజిగమను చిత్రమైన జిలుగుకాంతిపుంజముతో,
ధగధగమను దట్టమైన తళుకుల మొత్తంబుతో,
నగ మెఱయుచు నుండె, పసిఁడినగ యపుడు.

చనువుమీఱ పలుకరించి, తనియక గుఱిగింజ యింక
ననుచునుండె నేమేమియొ, తనదే యావిభవమంత
యనున ట్లుప్పొంగి పొరలు నానందముతో.

జిగజిగమను జిలుగులు, మఱి ధగధగమను తళుకులు, మది
దగులుచున్న యాగ్రహమున, భగభగమని ప్రజ్వరిల్ల,
నగయిట్లని, బంగారపునగ, గదిమె——

"వెనుకఁగూడ ఈరీతినె పిలిచి యడిగినట్లు మొదలు
పెట్టితివాక పెద్దసోదె, విని యేమన కూరకొంటి,
వెడఁగుజనులతోడ వాదుపడ నేలయని."

నగగర్జన కడలుచెంది వగచుచు గుఱివెందగింజ
నగగర్జన కడ్డు వచ్చి, "నావలనను తప్పు గలిగె,
పగఁ బూనకుఁ డన్నగారు ప్రార్థింతు మిమున్."

అని మ్రొక్కఁగ, బంగరునగ, "అదిగదిగో! ఆమాటయె
యనుచుంటివి జాగ్రతసుమి! అన్నగారు! గిన్నగారు!
తినిపోయెద వింక నోరు తిన్నగ రాకున్న!

"ఎక్కువ తక్కువలు గనక, యెప్పటి కపు డేదో నెప
మొక్కటి గల్పించుకొనుచు, నక్కఱగలవానిపగిది
గ్రక్కున వదలెదవు కాల్వ, గ్రుక్కకు పదివేలు.

అన్నమన్న మనుచు కఱవులందు చచ్చు నంతమంది
అన్నలు మఱితమ్ములు నీకచట ముండ్లడొంకలలో
నున్నారా మూఁకఁజేరి యుత్సాహముతో,

ఆడుకొనుము సల్లాపము, లంతెకాని మాబోఁటుల
తోడఁ జుట్టరికము గలుపఁజూడకు మోతులువా, నా
నీడ నంటనైనఁ గలదె నీకు యోగ్యత?"

త్రిలిఙ్గరజతోత్సవము

జిగజిగ మనుజిలుగులతో, ధగధగ మనుతళుకులతో,
భగభగ ఈరీతి మండిపడుబంగరునగను గాంచి,
పలికెను గుఱివెందగింజ, బదులు పలికెను—

"నీమనసెరిగించినావు, నామాటయు విను మించుక,
నేల నింగి కెంతదవ్వొ, నింగి నేల కంతదవ్వొ,
ఏల యిట్టు లెంచిపెట్ట హెచ్చుతగ్గులు?

"ఎక్కువ నీవాదొ కావో, ఎవరికంటె నెక్కువయో,
నిక్కము శోధింపవలయు—నీదుబుద్ధిమాత్రము గడు
తక్కువయని తెల్లమయ్యె చక్కగ నిపుడు.

"అన్నలు మఱి తమ్ములు నాకగణితసంఖ్యాకులుంట,
అందఱు చనిపోవుచుంట, అదియంతయు నిజమె కాని,
అంతటితో వారలేమి యంతరింతురా?

"చనిపోయియు పుడమిపైని సంతానమురూపమునను
మనుచుందురు శాశ్వతముగ, మరల మరల నీబోటుల
పెనుగర్వముఁ దూచి పాఱవేయుచుందురు—

"ఆగు మొక్కక్షణము నీవనఁగ నున్నవిషయమంత
బాగుగాను నాకె తెలియు—బహుళముగా నీకు కూడ
సాగుచుండుసంతతి, చెలరేగుచుండును—

"చౌర్యము, మఱి కుట్రలు, మఱి శాఠ్యము, మఱి మోసము, మఱి
క్రౌర్యము, మఱి ఈర్ష్యలు, మఱి కపటము, మఱి డంబము, మఱి
కలహంబులు, అన్యాయము, కల్లలమితము—

"తరుగులేక విఱుగులేక పెరుగుచుండుసంతతి యది,
కలవుకాలమందైనను కడతేరని మొండిమూక,
పరువన్నది యెఱుఁగనట్టి పాపపుసంతానము.

"పాపములన్నిఁటికి మూలపాపము బంగారమనెడి
ప్రాజ్ఞులవచనంబు వినియు, పాటింపక నాయెడ నేఁ
బాతక మొనరించుకొంటి ప్రారబ్ధమునన్.

"తమ్ముఁడ యని నీవు పిల్వ, తప్పుపట్టకన్న యంటి;
తమ్ములు నన్నలును నీకు దండిగ నుందురు లుబ్ధులు
త్రవ్వి పూడ్చుగోతులందు తరలు మనకయుంటిని

"నీతోడను వావివరుస సలుపుచుంటకంటె వేతె,
నీతోడను సంభాషణ సలుపుచుంటకంటె వేతె
పాతక మింకేమి గలదు, పాపదేవతా!

"పొమ్మింకను, నేను గూడ పోవలయును నీయనుజులు
ముగ్గురరిగొ సుత్తిప్రేట్లు పొందుచునున్నారు, వారి
పొగరు తూచవలయు నెంత మిగిలియున్నదో."



డాక్టర్ సర్: సి. వై. చింతామణిగారు, లీడరుపత్రికాసంపాదకులు, అలహాబాదు:—

మనమిత్రులు శ్రీవేంకటేశ్వరశాస్త్రులగారి పనియంటేనే నాకు గౌరవము. వారివ్యాపారసంస్థలకు 90 ఏండ్లు నిండి ఉత్సవము జరుగుట ముదావహము. శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారితండ్రియు నాతండ్రియు గొప్పస్నేహితులు. అట్లనే నేనును వారును గొప్పస్నేహితులుగా ఉండుట సంతోషప్రదము. వారియొక్కయు వారి సంస్థయొక్కయు కడచినచరిత్రయే ఉజ్వలము. ముందుచరిత్ర ఉజ్వలతరముగ నుండుగాక అని కోరుచున్నాను. సంస్కృతము, తెనుగువాఙ్మయములకు వీరు చేసినసేవ అపారము. వీరికి శుభంబగుఁగాక! శ్రీవేంకటేశ్వరశాస్త్రులకును వారిసంస్థకును ఇతోధికవిజయంబగుఁగాక!

# స్త్రీల సారస్వతము

## కొన్ని పాటలు - సవిమర్శపఠనము.

శ్రీ ఆడిదము రామారావుగారు, ఆంధ్రవిజ్ఞానసమితి, విజయనగరము.

మన ప్రాచీనులజీవితవిధానమును, సాంఘికపరిస్థితులను, ఆచారములను, సంప్రదాయములను గొంతవఱకుఁ దెలుపునట్టియు, మిగుల నింపగునట్టియు పాటలను "సారస్వత" మను పెద్దపేరితోఁ జెప్పుట, సాహసముకాదని ప్రాజ్ఞులు దలంతురుగాక!

ఈ మనోహరము లగుపాటలు కతిపయసంవత్సరముల కాలమువఱకు మనతల్లులయు, ముత్తమ్మలయుజిహ్వాగ్రంగముననే నెలకొనియుండి, రూపురేఖలు చెడక వెలయుచుండెడివి. ఇటీవల ముద్రాపకుల యౌదార్యమునఁ జిన్నపుస్తకరూపమును జెంది కులగోత్రాదులు గోల్పోయిన భ్రష్టవ్యక్తివలె సమగ్రముగ రూపుచెడి ముద్రితమై రూ 0-0-3 మొదలు 0-2-0 లకు సాధారణముగా మించనివెలకు లోకమునఁ జెలామణి యగుచున్నవి. నన్నయకుఁ బూర్వముననున్న శాసనాదులనైనఁ జదువుకొని, విషయగ్రహణముచేయుట సులభముగాని, యిటీవల ముద్రితములగు స్త్రీలపాటలను బఠించి, విషయమును దెలిసికొనుటకుఁ గించిత్తైనను నవకాశము చిక్కకుండుట మిగుల విషాదకరమైనసంగతి. అయినను నెవరైన భాషాభిమానముతో నీపాటలను సవిమర్శగఁ జదివినఁ గొంతగుణము కనుఁగొన వీలున్నదని నాయూహ. అయితే యిట్టి పరిశీలనమువలనఁ బ్రయోజన మేమియని ప్రశ్న కలుగవచ్చును. మనపూర్వులనుండి తరములవెంబడిగవచ్చి లభించిన యీపాటలను బరమపూతభావముతో భద్రముచేసికొనుట యుక్తకార్యము, అనిచెప్పుటయే మీఁదిప్రశ్నకు సమాధానము. నామమాత్రావశిష్టములైన బాలక్రీడలవలె (వామనగుంటలు, etc.,) నీపాట లడుగంటఁగలవను భీతి లేకపోలేదు. ఆంధ్రావనిలో భాషోద్ధారకులై పాటుపడుచున్న శ్రీ వావిళ్లవారు ప్రాథమికవిద్యావిషయమునఁ బనిచేయుచున్న శ్రీ యీదరవారు మొదలగు నుదారులీ వెనకపడియున్న సారస్వతముపై దృష్టిపఱపి పనిచేసినచో కాంతాజనవాఙ్మయము నిలిచి యుండఁగలదని నాదృఢవిశ్వాసము.

ప్రకృతము రూ 0-0-3 మొదలు రు 0-2-0 అణాల వెలగలిగి, తప్పులతడకలుగా నుల్లిపొరకాగితములమీఁద నచ్చుపడి, వింతయగురూపముతోనున్న యీపావనములగు ప్రాచీనగేయములను నుద్ధరింప నాప్రార్థన.

ఇంకc బ్రస్తుతము ప్రచారములోనున్న పాటలన్నియు నించుమించుగా భారత, భాగవత, రామాయణములలోని కథలనే యితివృత్తముగాc గలిగియున్నవి. వాటిలోని భాష సర్వసాధారణమగు వ్యావహారికశిష్టజనభాష. ఛందోవిషయము పరిశీలించి చూచిన, సీసచ్ఛేదముతో ద్విపదవలె నడుచు పద్యరూపములో నున్నవి. దేశీయవృత్తములగు సీసము, గీతము, అక్కర,మంజరి మున్నగునవన్నియుc బ్రాచీనతరములగు నీపాటలనుండియే యుద్భవిల్లినట్టుగాc జూపట్టెడిని. ఈపాటలలో సర్వసాధారణముగ గణనియమమే కానవచ్చును గాని, యతిప్రాసనియమ మంతగాc గానరాదు. వీటిలోc గొన్నియనcగా 1. ధర్మరాజు జూదము, 2. ఊర్మిలాదేవినిద్ర, 3. లంకాయాగము, 4. కాళీయమర్దనము (లాలిపాటవరుస) మున్నగునవి ప్రశస్తములై యధికజనాదరము గలిగియున్నవి. ఈపాటల నెవరు ఎప్పుడు రచించిరో తెలియరాదుగాని, యివి యాకస్మికముగా నుద్భవిల్లినవి మాత్రము గావు. వీటి రచనకుc దగినకారణ ముండుటచేతనే తరములవెంబడిగ సంఘమునc బ్రచారముగల్గి నేటికిని లభ్యములైయున్నవి. ఒకానొక ఆంగ్లపండితవిమర్శకుcడు, ఈజాతివాఙ్మయమునుగూర్చి యిట్లు చెప్పియున్నాcడు.

"............Though a man, not a people, has composed them, still, the author counts for nothing, and it is not by mere accident, but with the best reasons that they have come down to us anonymous."

The proper destiny of its author is inglorious obscurity, and its appropriate place is enshrinement in the heart and memory of the people.
(The Ballad in Literature by T. F. Henderson.)

1. **ధర్మరాజుజూదము:**—ఇది ప్రసిద్ధమగు భారతకథ, సభాపర్వాంతరగతము. దుర్యోధనుcడు ధర్మరాజుతో జూదమాడి తొలుత నోడినట్టును, పిదప నాతcడు లక్ష్మీదేవి యక్కయగు జ్యేష్ఠాదేవి నుపాసించి, యామె యనుగ్రహమువలనc బాండవులకలిమిని దొలcగించినట్లును, నొకవిచిత్రకల్పన యీపాటయందుc జేయcబడినది. దీని నాధారముగాc గొని, కొన్నిసంప్రదాయములు వెల్లడింపcబడినవి. సాధారణముగా మనతల్లులు మొదలగువారు, ముగ్గుపెట్టని అలికినగుమ్మమును దాటరాదనియు, మునిమాపువేళ ముంజూరుముట్టరాదనియుc, బువ్వ లొాడిలోc గోయరాదనియు, కాళ్లు కడుగుకొనునపుడు పొడియుండరాదనియు, మొదలగునాచారములను (మూఢాచారములని కొందరనుచున్నారు) మిక్కిలి పట్టుదలతోc బాటించుచు వాటిని నాచరణలోc బెట్టుచుండుట యనుభవవేద్యమైన విషయమే గదా! ఇవియే యిందుగ్గడింపcబడినవి.

"అలికి విడచిన గడప దాటడేరాజు
ఇంట ముగ్గులులేక నడవడేరాజు
మునిమాపు ముంజూరు దూయడేరాజు"

ఇంక ధర్మరాజు జూదమునం దోడినపిదప, ద్రౌపది తెరచాటుననుండి, దుర్యోధనునితో జూదమాడి,జయముం గాంచెనని మఱియొక వింతకల్పన గావింపఁబడినది. ఈయాటలో, దుర్యోధనుఁడు చేతితో వేయుపాచికలను ద్రౌపది కాలితోఁ ద్రోచుచువచ్చెనని చెప్పఁబడినది:—

"ఆరాజు తనచేత వేసె పాచికలు
పాంచాలి తనకాల్లఁ ద్రోచె పాచికలు"

ఈతీరున నాడి ద్రౌపది, గెలుపొందుట జూచి, గ్రుడ్డిరాజు తనకుమారుఁడు పొందిన పరాజయపరాభవములకు మిగుల విషాదముఁ జెందినవాఁడై, కోడలికి వరములిత్తునని పిలిపించి, పాండవాగ్రజుఁడోడిన సర్వస్వమును దిరుగ నిచ్చివేసినట్టుగఁ గథ ముగింపఁబడినది.

ఈ "ధర్మరాజుజూదము" మంజరీద్విపదలో వ్రాయఁబడినది. యతిమాత్రము పాటింపఁబడలేదు. గణములు మాత్రము సరిపోవును.

"అల్లంత తమయక్కరాకను జూచి
ఎదురు లేచీ వెళ్లె మహాలక్ష్మి యపుడు
వలగొని ముమ్మారు ప్రణతులుచేసి
ఏమిరొూ యక్క నీవచ్చినపనులు"

ఇట్లీతీరున పాటయంతయు ద్విపదగా నడుచుచు వ్యావహారికభాషలో సులభగ్రాహ్యముగ నున్నది.

**2. ఊర్మిళాదేవినిద్ర:—** ఇది యింకొకమనోహరమగుపాట. లక్ష్మణుఁడు సీతారాములవెంట నరణ్యమునకుఁ బోయినదిమొదలు, తిరుగ రావణసంహారానంతరమున నతఁడయోధ్యకు వచ్చుదాక నతనిభార్యయగు నూర్మిళ, నిద్రావస్థలో నున్నట్టుగా లోకములోఁ బ్రచురమైయున్న వింతకథయే యీపాటలోఁ జెప్పఁబడినది. శ్రుతిసుఖముగాఁ బాడి విను వారలను రంజింపఁజేయ ననువగురీతిని నిది కూర్పఁబడినది. ప్రతిపాదమునకు "రెండింద్రగణములు+ఒకగురువు, తిరుగ మూఁడింద్రగణములు+గురువు" ఇట్లుగాఁ బాదముండును. బహుశః ఇట్టిపాటలే "అక్కరలకుఁ బ్రాతిపదికలై యుండునేమో యని నాసందియము. సర్వసాధారణముగ నిట్టిపాటలయందుఁ గానవచ్చు వ్యావహారికభాషలోనే యిది గూడ

నున్నది. వాక్యములయందలి భావములు వెన్వెంట మనస్సునకుఁ దాకి యానందమును గూర్చుటయే యీరచనలయందలివిశేషగుణము. కేవలము నిద్రావస్థలోనుగాక, జాగ్రదవస్థలోనుగాక, మధ్యస్థితిలోనున్న ఊర్మిళాదేవినోటనుండి పరకాంతాగమనేచ్ఛ యెంత చక్కఁగా గర్హింపఁబడినదో యరయుదురు గాక!

"ఒకడాలి కోరిగాదా, ఇంద్రునికి నొడలెల్ల హీనమాయె;
పరసతిని కోరిగాదా, రావణుడు మూలతో హతమాయెను;
ఒకడాలి కోరిగాదా, కీచకుడు ప్రాణాలు గోల్పోయెను.

ఇట్టిద్రోహములు మీరు, యెరుగుండి యింతద్రోహము చేతురా ఆడతోడున బుట్టరా మావంటి తల్లిలేదా మీకును"etc.

ఇంతియేగాక సీతారాములకు లక్ష్మణస్వామిమీఁదఁ గలప్రేమాభిమానములు చాల చక్కఁగా నిందుగ్గడింపఁబడుట చూడనగును.

3. **లంకాయాగము:—** ఇది బహుజనాదరముగల చక్కనిపాట. రామాయణకథోపేతము. వ్యావహారికభాషలో వ్రాయఁబడినది. ఇందు నచ్చటచ్చట మనోహరములగు కల్పనలు కవితయనుటకు నర్హములైనవి చేయఁబడినవి చూడుడు:—

"మ్రానుపారినతీఁగె మ్రానుదప్పినవెనుక మరియెట్లు నిల్వఁగలదు...
...ఎలుకలు పిల్లితో నెదురాడవచ్చునా? నరుఁడు నాతో గెలుచునా?
ఉప్పుకోసమువచ్చి సుగ్రీవుఁడా! నేను కప్పురము గోల్పోతిని.
(శ్రీరామువిలాపము లక్ష్మణునిగూర్చి)

ఇంక నీపాటలోనిప్రతిపాదము కొంచెము కొఱతగా సీసపద్యపాదమునకు సరిపోవుచున్నది. యతినియమము బాటించి కొంచెముగఁ బెంచిన సీసమగును చూడుడు.

"శ్రీరాముఁ దండ్రిగా సీతమ్మ తల్లిగా భావించు లక్షుమన్నా!
ప్రొద్దున్న పోదురూ మాపటికి వత్తురూ, మరిదిక్కు లేదురన్నా!"

ఇట్లు శ్రద్ధమైఁ బరికించి చూడ మీఁద నేఁజెప్పినచొప్పున నీప్రాతపాటలే తెనుగునందలి దేశీయవృత్తములకు అనగా, సీసము, ద్విపద మొదలగువాటికి మూలములని యూహింపవచ్చును. ఏలయందురా? పద్యకవిత్వమునకు ముందు గేయకవిత్వమే వెలసెనని భాషాతత్త్వవేత్తలసిద్ధాంతము. నాయీవిమర్శనయందుఁ జూపట్టులోపము లిట్టివియని ప్రాజ్ఞులు దెలిపినచో నట్టిసవరణలను గృతజ్ఞతతోఁ గైకొందును.

# ఆంధ్రవాఙ్మయము—శతకములు

రచయిత: శ్రీ అయల సోమయాజులకృష్ణమూర్తిగారు,

శ్రీమహారాజావారి సంస్కృతకళాశాల, విజయనగరము.

మనవాఙ్మయంలో స్వతంత్రగ్రంథాలు చాలా తక్కువ. లేవనే చెప్పాలి. మనవాఙ్మయం భాషాంతరీకరణంతో ప్రారంభమైనది. ప్రబంధాలుకూడా సంస్కృతానుసరణంకలవె. ఆధునికయుగంలో నవలలు మొదలయిన కొన్నిస్వతంత్రరచనలు బయలుదేరుతున్నాయి. అవి సంస్కృతసంపర్కం చాలవఱకు లేనివేకాని స్వతంత్రములుమాత్రం కావు. పాశ్చాత్యభాషల యనుసరణములని భావము. మనవాఙ్మయంలో ప్రబంధాలు, ఇతిహాసాలు, పురాణాలు, నవలలు, నాటకాలు, మొదలైన వెన్నో జాతులగ్రంథములు కనపడ్తున్నాయి. శతకాలుకూడా వాఙ్మయవృక్షంయొక్క శాఖకింద చెప్పవచ్చును. మనవాఙ్మయంలో చాలా వఱకు స్వతంత్రములయినగ్రంథాలు శతకాలనటం సాహసంకాదు. ఇంక ముస్ముందు శతకాలంటే ఏమిటి? ఇవెలా పుట్టేయి? మొదలయినవిషయాలు తెలుసుకోవాలి.

వేదం స్తుతులతోను, ప్రార్థనలతోను నిండిఉంది. భక్తిభావాల కనుగుణంగా స్తుతులు మొదలయినవి శాంతులు మొదలైన క్రియలుగా మారిపోయాయి. ఆక్రియలుగా మారినప్పుడే ఆక్రియ ఇన్నిసార్లుచేయవలయును, అనేనియమం పుట్టింది. "అధికస్యాధికం ఫలం," అన్నారు కాబట్టి ప్రతిక్రియ నూటఎనిమిదిసార్లు చేయాలన్నారు. దానికే అష్టోత్తరశతకమన్నా రార్యులు. శతశబ్దమందుండే ఆదరాభిమానాలవల్ల జపమాలికల్లోను 108 పూసలే నిర్ణయించారు. ఇలాగే సూర్యనమస్కారాలు ప్రదక్షిణలు కొసకు దేవునిపూజలు కూడ 108 సంఖ్యాపరిమితిగానే పెట్టారు. ఆనియమమే సామాన్యంగా భక్తిప్రతిపాదకాలైన శతకాలలోకూడా 108 సంఖ్యే స్థిరమైపోయింది. కాబట్టి భక్తిప్రతిపాదకములైన పద్యములుగలపుస్తకమునకు శతకమనుపేరుంచేరు. పాణిని కూడా "శతం పరిమాణమస్య" అనే అర్థంలో "శతాత్కన్" అనే కన్, ప్రత్యయం వచ్చి శతకం అవుతుందని చెప్పారు.

ఈశతకం అనేది కేవలం మనవాఙ్మయంలోనే పుట్టిందా? లేక మరి ఏభాషలోనైనా ఇటువంటిశతకా లున్నాయా? ఇవి ఏశతకాల్నాదర్శంగా తీసుకొని బయల్దేరాయి? అనే విషయాల్ని ఆలోచించాలి. శతకస్వరూపానికి మూలంగా వేదాల్లోకూడా కొన్ని స్తుతులు,

దశకములు, పంచవింశతులు మొదలయినవి కనపడ్తున్నాయి. అస్తుతులే శతకాలన్నిటికి మూలం అని చెప్పటానికి సందేహం నహి. కాని సంపూర్ణలక్షణాలుగల శతకాలనేవి ఎప్పటినుండి బయలుదేరాయి? అనే ప్రశ్న రావచ్చు. ప్రాకృతభాషలో 'అవదానశతకం' నుండి, శతకాలు పుట్టేయని చెప్పాలి. శతకస్వరూపం, పద్యసంఖ్య, దశకవిభాగం మొదలైనవి ప్రాకృతశతకములు పెట్టినభిక్షే. అనిచెప్పాలి. ఈశతకాలనేవి కేవలం ప్రాకృతంలోను, తెలుగులోనే కాకుండా గ్రీకు, ఇంగ్లీషువాఙ్మయాల్లో సెంచరీస్, గార్లెండ్స్ అనే శతకాలు కనపడ్తున్నాయి. బెంగాలీలో భక్తిశతకాలు కనపడ్తున్నాయి. గ్రీకు, ఇంగ్లీషు, బెంగాలీ, మొదలైనభాషలలో శతకాలున్నప్పటికీ ఆశతకాలకూ తెలుగుశతకాలకూ చాలా భేదం కనపడ్తోంది.

శతకాల్లో ప్రతిపద్యం "దాశరథీ కరుణాపయోనిధీ" మొదలయినదైవముల పేరులతో కాని, "బద్దెభూపతీ" "గువ్వలచెన్నా" మొదలయినప్రభువుల నామములతో కాని, "సుమతీ" త్యాదిసామాన్యసంజ్ఞలతో కాని పూర్తిచెందుతుంది.ఆకొసనువచ్చే సంబోధనాంతపదములనే మకుటముగా మనంవాడుతున్నాము. ఈమకుటం కేవలం మనభాషలోనేకాకుండా సంస్కృతంలో చిదానందద్వాదశస్తోత్రంలో, "చిదానందరూపశ్శివోఽహం శివోఽహం" అనే మకుటం కనపడుతోంది. పాశ్చాత్యభాషలలో కూడా 'థోమ్సన్, వ్రాసిన Rule Britannia' లో బరన్సు కవివ్రాసిన "My heart's in Highlands" లోను, రెజినాల్డు హీబరు వ్రాసిన "God provideth for the norrow"లోను, మూరువ్రాసిన "Oft in the Silly Night" మొదలయినపుస్తకాల్లో మకుటం ఉన్నది అని శ్రీ వంగూరివారు వ్రాసినారు. ఈమకుటం శతకాలకు ప్రాణంవంటిది. శతకాలు సాధారణంగా ఒకేరకమైనవృత్తాలతో, అంటే మిక్కిలి సాదృశ్యంకల చంపకోత్పలాలు, శార్దూలమత్తేభాలు, మొదలైనవాటితో రచింపబడటానికి మకుటమే ముఖ్యకారణము. వేమన్నశతకం ఆటవెలదుల్లో ఉండటానికి "విశ్వదాభిరామ వినురవేమ" అన్నమకుటమే కారణం. 'సుమతీ' అన్నమకుటం కారణంగా సుమతిశతకం కందపద్యాలతో వ్రాయాల్సి వచ్చింది. కాబట్టి, శతకాలకు మకుటం ప్రధానం విధిగా వుండితీరాలి. కాని మకుటం సరిగా లేని వేరెండుమూడో తెలుగున ఉన్నాయి. శివతత్వసారంలో 'శివా' అనేమకుటం ప్రధానమైనా 'అజా', 'రుద్రా', మహేశా, మొదలైనవి మకుటాలుగా వున్నాయి. అలాగే బద్దెనసీతిసారముక్తావళిలో 'నరేంద్రచతురాననుడా', 'కీర్తినారాయణుడా', 'బద్దెభూపతీ' మొదలయిన వనేకములు మకుటాలుగా కనపడ్తున్నాయి. ఈ రెండుశతకాలుకూడా పరమప్రాచీనశతకాలు. దీన్నిబట్టి,

చూస్తే ఆకాలంలో మకుటపదములకు పర్యాయపదాలు మకుటంతరపున ఉపయోగించే వారు. ఇంక శతకాన్ని గూర్చి తెలుసుకుందాం.

శతకం అనటంతోడనే నూఱుసంఖ్య జ్ఞాపకం వస్తుంది. నూఱుపద్యములుగలది అని జ్ఞాపకం వస్తుంది. పూర్వలాక్షణికులు, దశకము, తారావళి, పంచవింశతి, శతకము, ముక్తకం, స్తవరత్నమాల, సహస్రం, మొదలయినవాటినన్నిటినీ క్షుద్రకావ్యాలన్నారు. అక్కడ నీచకావ్యాలని అర్థంకాదు. మఱి చిన్నకావ్యాలంటే బాగుంటుంది. కవి ఉద్రిక్తహృదయంతో, పొంగిపొరలివచ్చే భావావేశంతో, తన్నుతా మఱచిపోయి, రససముద్రంలో మునిగిపోయి చెప్పినపద్యాలే శతకరూపాన్ని దాలుస్తాయి. కాబట్టి, పెద్దలు శతకాల్ని చాటుప్రబంధాలన్నారు. "భావోద్రేకజనితములు శతకములు"అని శతకాలకు లక్షణం చెప్పొచ్చు. మకుటంవిషయం ముందే మనవిచేసుకున్నాను. ఇంక శతకాల్లో ఏపద్యాని కాపద్యంతో అన్వయం సరిపోతుంది. ప్రక్కపద్యంతో అన్వయ మనవసరం. కథలేకపోవటమే దీనికి్కారణము. కాని పై వాక్యానికి విరుద్ధాలైనశతకాలు లేకపోలేదు. ప్రసన్నరాఘవ శతకం. ఈశతకంలో రామాయణకథ యితివృత్తంగావుంది. తక్కినమకుటం మొదలయిన శతకలక్షణాలన్నీ ఉన్నాయి. అలాగే రంగేశకృష్ణశతకం కూడా. ఇందులో రుక్మిణీకల్యాణాదిభాగవతకథాభాగా లున్నాయి.

మనవాఙ్మయంలో శతకాలకు మూలంగా నన్నయభారతంలో అక్కడక్కడ శతకచ్ఛాయలు కనపడ్తున్నాయి. చూడండి మచ్చుకొకటి. ఉదంకుడు తెస్తూండే కుండలాల్ని తక్షకుడు దొంగిలించి నాగలోకానికి వెళ్లిపోయాడు. ఉదంకుడు కూడ నాగలోకానికి వెళ్లి సర్పాలను స్తుతిచేస్తున్నాడు:—

చ. బహువనపాదపాద్రికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహిత మహామహీభరమజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిం జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

చ. అరిది తపోవిభూతి నమరారులబాధలు పొందకుండఁగా
సురగులనెల్లఁ గాచినమహోరగనాయకుఁ డానమత్సురా
సురమకుటాగ్రరత్నరుచిశోభితపాదున కద్రినందనే
శ్వరునకు భూషణంబయిన వాసుకి మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్.

ఉ. దేవమనుష్యలోకములఁ ద్రిమ్మరుచుఁ విపులప్రతాపసం
భావితశక్తిశౌర్యులు నపారవిషోత్కటకోపవిస్ఫుర
త్పావకతాపితాఖిలవిపక్షులు నైన మహానుభావు లై
రావతకోటిఘోరఫణిరాజులు మాకుఁ బ్రసన్ను లయ్యెడున్.

ఉ. గోత్రమహామహీధరనికుంజములఁ విపినంబులం గురు
క్షేత్రమునం బ్రకామగతి ఖేలన నొప్పి సహాశ్వసేనుఁడై
ధాత్రిఁ బరిభ్రమించుబలదర్పపరాక్రమదక్షుఁ డీక్షణ
శ్రోత్రవిభుండు తక్షకుఁడు శూరుఁడు మాకుఁ బ్రసన్నుఁడయ్యెడున్.

అని "మాకుఁ బ్రసన్నుఁడయ్యెడుఁ." అన్నమకుటంతో పైపద్యాలు కనపడ్తున్నాయి. ఇలాగే ఆస్తీకుడు సర్పయాగనివారణసందర్భంలో జనమేజయుడ్ని, అతనియాగమహిమని మొదలయినవాటి నారుపద్యాలతో స్తోత్రంచేశాడు. వాట్లో మకుటంలేదు. ఇంకా ఇటువంటి వరణ్యపర్వంలో వున్నాయి. ఇవేమన శతకాలకి మనవాఙ్మయంలో మూలాధారాలని చెప్పాలి. తరువాత క్రీ॥ శ॥ 1165 ప్రాంతంలోవున్న పండితారాధ్యులు ఇంచుమించు శతకలక్షణాల్ని పట్టించి శివతత్వసారమనే శతకాన్ని వ్రాశాడు. ఇందులోను శతకలక్షణాలన్నీ సంపూర్తిగా లేవు.సంపూర్ణశతకలక్షణాలు కలిగినది వృషాధిపశతకం. ఇదే శతకాల్లో ప్రాచీనమైన దనుకోవాలి. శివతత్వసారం శైవమతప్రతిపాదకమైన గ్రంథము. మనశతకాలు 17 వ శతాబ్దంవఱకు చాలా స్వల్పంగా శతాబ్దాని కైదారు మాత్రం రచింపబడుతూ ఉండేవి. 17 వ శతాబ్దాంతంనుండి శతకాలు మితిమీరిపోయినాయి. వేంకటరామప్రధాని కృష్ణార్జునసంవాదమను తనగ్రంథంలో కృతిపతి తన్ను సంబోధించినట్లుగా

సీ "వినయంబుతో బంచవింశతిశతకముల్ విరచించి హరికి నర్పించినావు."

అని చెప్పినాడు. అలాగే సత్యవోలు భగవత్కవి తనప్రభావాన్ని చెప్పుకుంటూ

క. "ధీరత శతశతకంబులు, దారావళులుఁ దశావతారావళులుఁ
చారూదాహరణంబులు, శ్రీరాజితదండకములు చెప్పినవాడన్

అని చెప్పికొనినాడు. శ్రీమండపాక పార్వతీశ్వరశాస్త్రి సుమారు నూఱు చాటుప్రబంధాలు వ్రాసేడని వాడుక. వీళ్ల ముగ్గురివిమాత్రమే రెండువందలశతకాలులా కనపడ్తున్నాయి. ఇంకా తాడేపల్లి పానకాలరాయడు, అమలాపురపు సన్యాసికవి మొదలయినవాళ్లు వ్రాసినవెన్నో వున్నాయి. వీటినిబట్టి చూస్తే ప్రాచీనాలు, ఆధునికాలు, అచ్చుపడినవి అచ్చుపడనివి

మొత్తం 600 శతకాలుంటాయి. అచ్చుపడిన వే మూడువందలో. ఇలా మనశతకవాఙ్మయం అభివృద్ధిపొందింది.

పై శతకవాఙ్మయంలో శతకాల్ని 1 భక్తిశతకాలు, 2 జ్ఞానశతకాలు, 3 దూషణశతకాలు, 4 నీతిశతకాలు అని నాలుగువిధాలుగా విభజింపవచ్చు. ఈనాలుగువిధాలలో భక్తిశతకా లగ్రతాంబూలా న్నందుకుంటాయి. అందులోను శైవం, వైష్ణవం అని రెండువిధాలు. దాశరథీశతకం, భద్రాద్రిరామశతకం, మరున్నందనశతకం మొదలయినవి వైష్ణవమతప్రతిపాదకశతకాల్లోచేరితే వైష్ణవశతకాలే ఎక్కువగా కనపడ్తాయి. జ్ఞానశతకాలు రెండోస్థానా న్నాక్రమిస్తాయి. దూషణశతకాలు మూడవపీఠా న్నధిష్ఠిస్తాయి. నీతిశతకాలు చాలాతక్కువ. పై వాటివిషయం నేను చదివినశతకాల్లో స్థాలీపులాకన్యాయంగా వ్రాస్తాను. ఏవేనా మరచిపోయినా, తప్పులున్నా క్షమించాలని ప్రార్థిస్తున్నాను.

అసలు శతకస్వరూపం భక్తికోసం పుట్టింది. ఈశతకాలు కవనప్రారంభమందు ఏదేనా దేవుడ్నిగూర్చి స్తోత్రరూపంగా వ్రాస్తారు. లేదా కావ్యాల్నివ్రాసి రాజులకు మొదలయినవాళ్లకు కృతులిచ్చి విసిగి కొసకు స్వేచ్ఛగా స్వతంత్రంగా శతకాల్ని వ్రాస్తారు. ఈరెండింట్లోను రెండోదే సాధారణంగా ప్రచారంలో ఉండేది. భగవద్భక్తుఁడైనటువంటి కవి జ్ఞానముగ్ధుఁడై, యుక్తాయుక్తవివేకశూన్యుఁడై, సాకారుఁడైన తన ఇష్టదైవాన్నిగూర్చి రోతపుట్టించే ఈసంసారబంధంనుండి విడదీసి మోక్షాన్నియ్యమని భక్తిపరవశుఁడై పొంగి పొరలివచ్చే భావోద్రేకంతో, తన్నుతామరచిపోయి పద్యరూపంతో ప్రార్థిస్తాడు, ప్రస్తుతిస్తాడు, గుణాల్ని పాడుతాడు. ఆపద్యాలే భక్తిశతకాలరూపాన్ని దాలుస్తాయి. కాబట్టే భక్తిశతకాలు రాగాలాపనతో పాడటాని కనువైనవృత్తాలతో రచింపబడ్డాయి; రచింపబడుతున్నాయి. మొట్టమొదటి శతకాలైన శివతత్వసారం మొదలైనవి భక్తిశతకాలే. అవన్నీ భక్త్యావేశంతో వ్రాసినవే. చూడండి శివతత్వసారంలో మచ్చుకొకటి :

క. ఒండేమి మల్లికార్జునపండితుఁడన నుండుకంటెఁ బ్రమథులలోనె
న్నండొకొ నీయాజ్ఞోన్నతి, నుండఁగఁ గాంతునని కోరుచుండుదు రుద్రా.

క. కడుమండెడిబడబాగ్నిక, దడయక వడిఁ గూడ దిగిచి తనసుదుటనుబో
ట్టిడుకొని యానందంబున, వెడసోలుచు నాడు ప్రమథవిభుఁ డొకఁడు శివా.

చూచారా! ఇవి భక్త్యుద్రేకంతో వ్రాసినపద్యాలు కావా? ఇంకా ఎన్నోపద్యాలు ఇటువంటివి. ఇంతకంటె గొప్పవి కూడా వున్నాయి.

శివతత్వసారము తరువాతిశతకము వృషాధిపశతకము. ఇది ప్రచారముగలశతకా లలో ప్రాచీనతమశతకంగా పరిగణింపబడుతోంది. ఇందులో శైలి సంస్కృతపదాల్తో కూడుకుని ఉంటుంది. ఒక్కసమాసంతో పద్యమంతా నడిపించేడు. చూడండి.—

చ. విరచితశుద్ధసాళవనవీనమృదుస్వరమంద్రమధ్యతా
రరుచిరదేశిమార్గమధురస్వరగీతసుధాతరంగిణీ
తరలతరంగజాలసముదంచితకేళివిలోలసంగమే
శ్వర శరణయ్య నాకు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

వృషాధిపశతకం అంత్యప్రాసాలకు, ముక్తపదప్రాసాలకు, శబ్దాలంకారాలకు, తరువాతిశతకాలకు మార్గదర్శకంగా ఉంది. చూడండి ఒకటిరెండుదా:—

ఉ. ఉద్ధతభక్తవృద్ధ వినుతోత్తమసిద్ధపరీతజంగమ
శ్రద్ధ సదాత్మశుద్ధగణరాజసమృద్ధ విముక్తపాశస
న్నద్ధ మహాప్రసిద్ధ యగుణత్రయబద్ధ శరణ్యమయ్య భా
స్వద్ధతచిత్ప్రబుద్ధ బసవా! బసవా! బసవా వృషాధిపా!

చ. సురవరపూజ్య పూజ్యగుణశోభిత శోభితరూప రూపవి
స్ఫురతరశీల శీలగుణపుంగవ పుంగవసత్వ సత్వసం
వరపరవాద వాదభయవర్జిత పాపవిచారచార యీ
శ్వరసమ నీవె దిక్కు బసవా! బసవా! బసవా! వృషాధిపా!

ఇంకా ఇటువంటి వెన్నో పద్యాలు కనపడ్తున్నాయి. ఈశతకంలోనె మణిప్రవాళశైలి నుపయోగించాడు. ఈశతకం భక్తులభరణి.

1240 వ సం॥ ప్రాంతంలో శతకరాజం ఒకటి పుట్టింది. అదె యథావాక్కుల అన్నమయ్యవ్రాసిన సర్వేశ్వరశతకం. 'సర్వేశ్వరా', అన్నమకుటంలో కూడుకొని ఉన్నాది. ఇందులో భక్తిభావాలు ప్రధానంగా ఉన్నాయి ఇందులో నున్నపద్యాలన్నీ అమూల్య రత్నాలు. కృష్ణానదిలో ఎదురీది వచ్చినవి. ఆంధ్రసాహిత్యపరిషత్తువారు ప్రకటించినశతకం పీఠికలో ఒకకథవ్రాసినారు, దానిసారాంశము:—

"అన్నమయ్య శ్రీశైలయాత్రనుండి తిరిగివస్తూ కృష్ణాతీరంలో మల్లికేశ్వరస్వామి వారివద్ద ఈశతకాన్ని వ్రాశాడట. ఇతడు మెడకు గండకత్తెర తగుల్చుకుని ఒకొక్కపద్యం వ్రాస్తూ కృష్ణానదిలో వేశేవాడట, ప్రవాహంలో కొట్టుకుపోకుండా ఎదురీదివచ్చినదాన్నె

శతకంలో చేర్చేవాడట, ఒకపద్య మలా రాకపోవటాన మెడకత్తిరించుకోవటానికి సిద్ధంగా ఉంటే సర్వేశ్వరుడు గొల్లవానిరూపంతో వచ్చి నాకొకతాటియాకు దొరికిందని ఇచ్చి అదృశ్యుడయాడట. ఆ రెండుపద్యాలు వ్రాస్తాను.

ఎదురీది రాక కొట్టుకొనిపోయినపద్యములు:—

మ. తరులం బువ్వులు పిందెలై యొదవి తత్తజ్జాతితోఁ బండ్లగుఁ
హార మీపాదపయోజపూజితములై యత్యద్భుతం బివ్విరుల్
కరులా నశ్వములా ననర్ఘమణులోఁ గర్పూరమా హారమా
దరుణీరత్నములా బటీరతరులోఁ దథ్యంబు సర్వేశ్వరా."

అనునది గొల్లవాఁడిచ్చిన తాటాకులోనిపద్యం:—

మ. ఒకపుష్పంబు భవత్పదద్వయముపై నొప్పంగ సద్భక్తిరం
జకుఁడై పెట్టినపుణ్యమూర్తికిఁ బునర్జన్మంబు లేదన్నఁ బా
యక కాలత్రితయోపచారముల నిన్నర్చించుచోఁ బెద్దనై
ష్ఠికుఁడై యుండెడువాఁడు నీవగుట దాఁ జిత్రంబె సర్వేశ్వరా! .

ఇతని కవితాధార గంగాస్రవంతిలా అడ్డుఆపులులేకుండా అనర్గళంగా ప్రవహిస్తుంది. ఏపాటివాచకుడైనా దీన్ని చదవగలడు. ఉత్తమభావాలకు, శైలికి, భక్తికి తరువాతిశతకాలకు మార్గదర్శకంగా ఉందంటే అతిశయోక్తికాదు.

భక్తిశతకాల్లో కాళహస్తీశ్వరశతకం దీనికంటెకూడా గొప్పదని చెప్పాలి. అది "శ్రీకాళహస్తీశ్వరా" అన్నమకుటంతో 110 పద్యాలుగలది. దీన్ని కృష్ణరాయల ఆస్థానంలో అష్టదిగ్గజాలని ఆంధ్రకర్ణాటాల్లో ప్రసిద్ధివహించినవారలో ఒకడైన ధూర్జటి రచించాడు. రాజభోగాల్నన్నీ అనుభవించి కొసకు విరక్తుఁడై భోగాలు నాశనంకలవని గ్రహించి, రాజుల్లోనుండే దుర్మార్గపుస్వభావాల్ని తెలిసికొని వ్రాశాడీశతకాన్ని. అతను ఈభోగాల్ని ఎన్నాళ్లు అనుభవించాడో చూడండి:—

శా. కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు వక్షోజముల్
రాయన్రోసి డె ఱొమ్ము మన్మథవిహారక్లేశవిభ్రాంతిచే
బాయంబాయెను బట్టుగట్టె దలచెప్పన్ రోత సంసారమే
జేయంజాల విరక్తుఁజేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా.

శతకరచనాకాలమునకు ఇక సంసారాన్ని చేయలేనన్నాడు. బోధావిర్భావనిధానములు చదువులు కాజాలవన్నాడు. ధూర్జటి ఏది సౌఖ్యమో చాల బాగుగా చెప్పినాడు.

తేనెలొలుకుతూ భక్తిభావాల్ని రేకెత్తించి ప్రతిదినపారాయణకు తగిఉన్న రెండుమూడు పద్యాల్ని ఉదాహరిస్తాను. భక్తిభావాలకు:—

"దినముం జిత్తములో సువర్ణముఖరీతీరప్రదేశామ్రకా
ననమధ్యోపలవేదికాగ్రమున నాచందంబునం బంకజా
సననిష్ఠ న్నినుఁ జూడగన్న నదివో సౌఖ్యంబు లక్ష్మీవిలా
సిని మాయానటనల్ సుఖంబు లగునే శ్రీకాళహస్తీశ్వరా"

బంధువులు మరణించినప్పుడు శ్మశానంవద్ద ఏడుపు నితడు చాలా బాగా సమర్థించి వ్రాసినాడు!—

"చనువారిం గని యేడ్చువారు జముఁడా సత్యంబుగా వత్తుమే
మనుమానం బిక లేదు నమ్ముమని తారావేళ నారేవునన్
మునుగంబోవుచు బాససేయుట సుమీ ముష్టాటికిన్ జూడగా
చెనటుల్గానరు దీనిభావ మిది వో శ్రీకాళహస్తీశ్వరా."

జ్ఞాతుల్ని, పండితుల్ని నిందించాడు ఈశతకం భక్త్యుద్రేకంతో చాటువుగా వ్రాసినట్లు కనపడుతోంది. "కన్నారన్ భవదీయకాంతి సగుణాకారంబుగా జూపవే" అని కాళహస్తీశ్వరుని ప్రార్థించాడు. ఈశతకంలో భాష, శైలి, భావాలు, ఒకదాన్ని మించి ఒకటి చదువరిని సంతోషసముద్రంలో ముంచేస్తాయి. ఇన్నెందుకు! ఇటువంటిశతకం ఇంకొకటి ఆంధ్రభక్తిశతకాల్లో లేదు. అక్కడక్కడ శంకరాచార్యులు రచించినశివానందలహరి అనుసరణలు కనపడ్తున్నాయి.

కాళహస్తీశ్వరశతకంతరువాత భావావేశంతో వ్రాయటంలోను, చాటువుగా వ్రాయటంలోను, సింహాద్రినారసింహాశతకం గొప్పదని నావుద్దేశం. ఈశతకంలో "వైరిహారరంహాసింహాద్రినారసింహా" అనేమకుటంతో 101 సీసపద్యాలున్నాయి. ఇది గోగులపాటి కూర్మకవిచేత సింహాద్రి ఆలయాన్ని తురకలు, పాశ్చాత్యులు ముట్టడించినప్పుడు వారిపెట్టేబాధల్ని కన్నులార చూచి సహించలేక ఆబాధల్ని తీర్చుమని వ్రాయబడ్డది. ఈ శతకంలో ఇతని ఆవేశం ఇంతా అంతాకాదు. చెప్పటానికి సాధ్యంకాదు. ఈశతకంలో పద్యాల్ని, వ్రాసినకాలాన్ని సంగతిసందర్భాల్నీ పరిశీలించి చూస్తే కవికన్నులెంట వెడలిన అశ్రుధారలతోపాటు పద్యాల్ని చాటుధారలుగా రచించాడనిచెప్పవచ్చు. ముట్టడిసమయంలోపెట్టే బాధలు కళ్లారచూచి కంపితగాత్రంతో ఉన్నదున్నట్లుగా పడినపాట్లు పడినట్టుగా చెప్పాడు చూడండి:—

సీ. నీకొండపై నెక్కి నియతులౌ భక్తుల కొట్టి నానావస్థపెట్టకుండ
గాంగధారాతీరకలితమండపముల మద్యపానముచేసి మలయకుండ
నీవంటశాలలో నిశ్శంకతో మాంసఖండము ల్మెండుగా వండకుండ
నీగుడిజొచ్చి దుర్నీతిఁ గామాంధులై పరవధూటుల భంగపరుపకుండ
తే. పౌరుషంబునఁ దురకలఁ బాఱఁదఱుము, వేటకాడిల మెత్తనావేళలేడి
మూడుకాళ్లను నడచు నిర్మూలితాంహ, వైరిహరరంహ సింహాద్రినారసింహ.

ఇంకా:—

సీ. యవనేశుధాటికి నడలి సర్వస్వమ్ము విడిచి మందిరములు వెడలువారు
వెడలియు దలదాప నేమియు గానక యడవుల నిడుమలు బడెడివారు
పడియు నెచ్చట గూడు గుడువగానక తమశిశువులతో వెతజెందువారు
చెంది డెందముగుంద గాందిశీకత నభిమానార్థమై దుఃఖ మూనువారు
తే. నైరి యొక్కొకభార్యతో నవనిప్రజలు
అష్టమహిషులపైఁ బదియాఱువేల
సతులతో నీవు వలస యెచ్చటికరిగెదు, వైరి......

సీ. గ్రామముల్ నిర్ధూమధామంబులయ్యెను సస్యంబు లెల్ల నాశనముచెందె
దొడ్లలో శాకముల్ దుంపశుద్ధిగబోయె దోచిరి సర్వంబు గోచి దక్క
చెట్టొకపిట్టరై చెదరిరి దిక్కులు బలువెతఁ బడరానిపాట్లుబడిరి
యన్న మందరికిని నమృతోపమంబయ్యె వరుసగా నటమీద వానలేదు.
తే. ప్రజలపసతీరె నిక మొదల్పదిలమయ్యె
దరిదరికి వచ్చె నిదె మెండు తురకదండు
చిత్తమున జూచుకోవయ్య శీఘ్రబుద్ధి, వైరి.............సింహ.

ఇటువంటి బాధల్ని సహించలేక శతకాన్ని వ్రాశాడు. శతకంలో భక్త్యుద్రేకంవల్ల నరసింహస్వామిని భయపెట్టినాడు. ఎత్తిపొడిచినాడు. కేలిచేసినాడు. చూడండి! ఒక్కటి:—

సీ. పుడమిపై నడుగిడి నడువనేరనివారి దీవ్రతపరువు లెత్తించినావు
పైమీదిదుప్పటిబరువనివారిచే మించైనమూటమోయించినావు
గడపదాటనికులకాంతామణులబృథ్వి నెల్లెడఁ గలయఁ ద్రిప్పించినావు
షడ్రసోపేతాన్నసంభోక్తజనపరంపర బలుసాకు పాల్పఱచినావు

తే. భళిర యఘటనఘటనప్రభావ మెల్ల, దీనుజనులందె చూపితి దెలిసివచ్చె
నయ్యసామెల్ల నింటనే యన్నమాట, వై......సింహ.

ఇందులో ఎత్తిపొడు పెంతమనోహరంగా ఉందోచూచారా! ఇదేకాదు. ఇంతకన్న ఎంతో మనోహరాలైన పద్యాలున్నాయి. భక్త్యావేశముచే కృష్ణుడ్ని ఎలా భయపెడ్తున్నాడో చూడండి:—

సీ. చాటకపోఁ జుమీ చాల బ్రోవకయున్న నాటి వ్రేపల్లెలో బోటిమాట
ప్రకటింతుఁ జుమి మమ్ము రక్షింపకుండిన తగ గొల్లచెలులవస్త్రములమాట
దాచను జుమి మమ్ము దరిజేర్పకుండిన కొంకక మధురలో కుబ్జమాట
బైటపెట్టెదఁ జుమీ పాలింపకుండిన కాలయవనునాఁటి కానిమాట
తే. మర్మ మెఱిగినవారితో మాను వాదు, బైసిపోగొట్టుకోకు మాపాలగలిగి
సాధురక్షణ దుష్టశిక్షణ మొనర్పు, వైరి,......సింహ

ఇంకా ఇటువంటి వెన్నో పద్యాలున్నాయి. ఉదాహరణలుగా ఇయ్యాల్సివస్తే శతకమింతా ఇయ్యాలి. ఇంకొక్క విషయము. ఎత్తిపొడుచుట భయపెట్టుటచే లొంగకపోవటాన బాధ లంతకంతకు అధికమవటాన చూచి సహించలేక నిందించాడు:—మచ్చుకొక్కటి.

సీ. పాలీయవచ్చినభామిని ప్రాణంబు లపహరించి చెలంగినట్లుగాదు
యాఁగోత్సవమున కతిమోదమునఁ బిల్వ నపుడు మామను ద్రుంచినట్లుగాదు
చేతగా కొకనరుచేత చుట్టంబుల నందఱిఁ జంపించినట్లుగాదు
తుంగ గల్పించి యుత్తుంగవంశద్రోహ మాచరించి చెలంగునట్లుగాదు
తే. పరబలం బిది నీప్రజ్ఞ పనికిరాదు, లెమ్మికను మీనమేషము లెక్కయిడక
చొరవ తురకలు గొట్టగా చుక్కలెదురె? వైరి.........సింహ

ఇదంతా భక్త్యావేశంతో చెప్పిందికాదా? పైనిచెప్పిన భక్తిశతకలక్షణములన్నీ ఇందులోలేవా? ఇతను మంచిలోకోక్తులను సందర్భానుసారంగా ప్రవేశపెట్టి రమ్యంగా కవిత్వం చెప్పగలడు. ఉదా:—

సీ. నిఖిలవిశ్వంబును నీయం దణఁగియుండు విశ్వంబులో నీవు వెలసినావు
విశ్వరూపకుఁడవు విశ్వమయుండవు విశ్వసాక్షివి విశ్వవిభుఁడ వీవు
విశ్వసర్గస్థితి విదళనకరుఁడవు విశ్వంబునకు నీకు వేఱు లేదు
కినుక విశ్వద్రోహ మొనరించుదుష్టుల శిక్షించి ప్రజల రక్షింపవేమి?

తే. ఇంత బ్రతిమాల మాకేల యెట్టులైనఁ, గాని శుభకంద కందకు లేనిదూల
బచ్చలికి నేల గల్గునో పరమపురుష, వైరి.........సింహ.

విశ్వమునకును విష్ణువునకును నభేదము చెప్పినాడు. ఇలాగే ఇంకొకచోట:—

తే. బాగులే యిట్టి నెఱవైన ప్రాపు గల్గి, యల్పులకు లొంగి తిరుగలేమయ్య మేము
కర్మమా మాకు గజమెక్కి కంతదూర, వైరి.........సింహ.

ఇంతెందుకు—ఆంధ్రభాషలో తెలుగుసామెతల్ని ఇంతచక్కగా అమర్చి కవిత్వం చెప్పేవారులేరని చెప్పవచ్చు. భావోద్రేకజనితములు శతకము లనటానికి పై శతకం ఉదాహరణం కాదా!

భక్తిశతకాలలో మూఁడవది భక్తచింతామణిశతకమని చెప్పవచ్చును. ఇది వడ్డాది సుబ్బారాయుడుగారిచే వ్రాయఁబడినది. భక్తిచింతామణియందలి పద్యములురాని ఆంధ్రుఁ డుండటం అరుదు. అతనిశతకంలో పద్యాల్ని ఏర్చికూర్చి మంచివి ఉదాహరించాలంటే శతకాన్నంతటినీ పూర్తిగా ఉదాహరించాలి. పైపద్యం చదువుతున్నపుడల్లా క్రిందిపద్యం నిస్సారమనిపిస్తుంది. ఏపద్యాని కాపద్యమే సాటి. మిక్కిలి సులభశైలిలో పండితులకు పామరులకూ తెలిసేటట్టుగా ఈశతకాన్ని శ్రీ వడ్డాదివారు వ్రాశారు. ఇప్పటి కెన్ని వేనవేలు ప్రతులు చెల్లేయో లెక్కలేదు. ఇలా ఇన్నిప్రతులు చెల్లటానికి, ఇన్నిసారులు ముద్రింపబడటానికి సులభశైలిలో పండితపామరులకు తెలిసేటట్టుగా వ్రాయటమే. ఆతనువ్రాసిన గ్రంథాలన్నిఁటిలోను గొప్పదని చెప్పవచ్చును. సులభశైలితో, సూటిసూక్తులతో, సంగ్రహమైనరచనతో కవిత్వం చెప్పటంలో వేమన్నతర్వాత వడ్డాదివారేనని చెప్పవచ్చు. చింతామణిశతకము చదువని ఆంధ్రు లరుదు. కాబట్టి ఉదాహరణా లధికంగా ఇయ్యదలచుకోలేదు. అయినా ఒక్కటి:—

ఎఱుకుఁ పిల్లలతల్లి కోడివలె మమ్మెందే పగల్ ద్రిప్పు దీ
శ్వర మేలోర్వక మాయగ్రద్ద యెడబాపం జూచెడిఁ త
త్ఖరపాదాహతి నొకకుండ మము తెక్కల్ గ్రప్పి కాపాడ నీ
చరణాబ్జంబులె నమ్మినాను జగదీశా భక్తచింతామణీ!

కంచర్ల గోపన్న దాశరథీశతకాన్ని "దాశరథీ కరుణాపయోనిధీ" అన్నమకుటంతో వ్రాశాడు. రామదాసుగారి రామభక్తి చెప్పతరమా! అందుబట్టి అందులో భక్త్యావేశం గుఱించికాని మరేవిషయంగుఱించికాని ఉదాహరణ లియ్యటంవల్ల లాభంలేదు. ఎందుచేత

నంటారా? నాకన్న లోకానికే యెక్కువ తెలుసు. రామదాసుయొక్క రామభక్తి ఎవరికి తెలియదు? అయినను ఒకటి రెండు:—

"నీలఘనాభమూర్తి వగునిన్ను గమంగొనఁ గోరి వేఁడినం
జాలమునేసి డాగెదవు సంస్తుతికెక్కిన రామనామమే
మూలను దాచుకోగలవు ముక్తికిఁ బ్రాపది పాపమూలకు
ద్దాలముగాదె మాయెడల దాశరథీ కరుణాపయోనిధీ".
"భండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్వలబాణతూణకో
దండకలాప్రచండభుజతాండవవర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదైవ మిక లేఁడనుచుం గడ గట్టి భేరికా
డండడడాండడాండనినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ!

కాసుల పురుషోత్తమకవి వ్రాసిన శతకములలో ఆంధ్రనాయకశతకం ప్రసిద్ధివహించింది. ఇది భక్తిప్రధానమైనశతకం. దీనిమకుటం "చిత్రచిత్రప్రభావదాక్షిణ్యభావహతవిమతజీవ శ్రీకాకుళాంధ్రదేవ" అని. ఈశతకం 1800 ప్రాంతంలో కృష్ణాతీరంలోఉన్న శ్రీకాకుళంలో కృష్ణరాయాదులవల్ల గ్రామాలనిపొంది ప్రఖ్యాతుఁడైన ఆంధ్రనాయకస్వామి మీద చెప్పబడినది. ఈకవి ఆంధ్రదేశమంతటను మంచిపేరు ప్రఖ్యాతులుగలవాడు. ఇతని కీశతకంవల్లనే ఇంత పేరు ప్రసిద్ధులు వచ్చాయని చెప్పవచ్చును. నిందాస్తుతిచేయటంలో ఇట్టికవి ఆంధ్రదేశంలో ఇంతవఱకు పుట్టలేదు. ఇట్లే యింకా భక్తిశతకాలనుగూర్చి చెప్పతూంటె చెప్పాలనే ఉంటుంది. ఇంకా ఎన్నో రామతారకశతకం మొదలయినవి ప్రసిద్ధశతకాలు చాలావున్నాయి. అవన్నీ పాఠకులే చూచుకోండి. ఇంతటితో ఈశతకాల విషయం ముగిస్తాను. తాడేపల్లి పానకాలరాయడు, అమలాపురపు సన్యాసికవి వ్రాసిన శతకాలన్నీ భక్తిప్రధానంగాగలవి ప్రసిద్ధములైనవి.

శృంగారశతకములుగూడ భక్తిశతకాల్లోనే చేరుతాయి. ఎందుచేతనంటారా? చాలావఱకు శృంగారశతకాలన్నీ భగవంతునిమీదనే వున్నాయి. కాబట్టి అవి భక్తిప్రతిపాదకాలని చెప్పటానికి అవకాశా లవుపడుతున్నాయి. శృంగారశతకాలలో లావణ్యశతకం, చంద్రవదనశతకం మొదలైనవి కేవలం కాముకులకుతప్ప మరెవరికీ పనికిరావు. కాబట్టి వాటిలో పద్యాల్ని ఉదాహరించ దలచుకోలేదు.

మల్లికార్జున, కలువాయి మొదలైనశతకములు దైవశృంగారములను వర్ణిస్తున్నాయి. కాబట్టి, అవిభక్తిశతకాలలో చేరుతాయి. మల్లికార్జునశతకము "వనిత నీవేగి శ్రీశైలవాసుఁడైన, మల్లికార్జుని దేగదె మధురవాణి" అన్నమకుటంగల 103 సీసపద్యాలతో కూడుకుని ఉంది. పార్వతి తనచెలికత్తెతో మల్లికార్జునుని తీసుకురమ్మనటం అందులో చెప్పలు మొదలైనవి ఉన్నాయి. ఈకలువాయశతకంకూడా పైశతకంలాంటిదే. ఇందులో "చెలియ నీవేగి కలువాయ చెన్నకృష్ణు తోడుకొని వేగరాగదే తోయజాక్షి" అన్నమకుటంగల 101 సీసపద్యాలు గలవు ఇందులో శృంగారకరుణరసాలు ప్రధానంగా ఉన్నాయి. కలువాయ చెన్నకృష్ణుడు రాకపోవటాన అతనిప్రియురాలి విరహం ఇందు వర్ణించబడ్డాది. ఇదికూడ భక్తిశతకాల్లో చేరుతుంది, కృష్ణునియొక్క శృంగారం వర్ణించేదు కాబట్టి.

జ్ఞానవైరాగ్యములు చెప్పబడినశతకములు జ్ఞానశతకాలు. జ్ఞానశతకాలలో వైరాగ్యబోధకాల్లో భర్తృహరిసుభాషితరత్నావళిగొప్పది. దీనిని చాలామంది తెలిగించారు.అందులో ముగ్గురు ముఖ్యులు. ఎలకూచి బాలసరస్వతి,ఏనుగు లక్ష్మణకవి,పుష్పగిరి తిమ్మకవి అనేవాళ్లు. అందులో ఎలకూచి బాలసరస్వతి మల్లభూపాలీయమనుపేరుతో "సురభిమల్లా నీతివాచస్పతీ, సురభిమల్లా మాననీమన్మథా" అన్నమకుటాలతో మల్లభూపాలుని కంకితమిచ్చినాడు. ఇందులో మకుటనియమంవల్ల కొన్నిభావాల్నిగోల్పోయినాడు. ఈబాధలు కలుగుతాయనే తలంపున ఏనుగు లక్ష్మణకవి మకుటమును వదలివేసినాడు. కాన భావములు బాగున్నాయి. అందులో వైరాగ్యాన్నిబోధించే ఒకటి రెండుపద్యా లుదాహరిస్తాను. చూడండి:—

ఉ. "తుంగతరంగభంగములతోఁ దులతూగు విలోలభోగముల్
భంగపడుఁ గా నిమేషమునఁ బ్రాణము కొన్నిదినంబులే సుఖం
బంగనలందు నిట్లు మది నారసి బ్రహ్మవిచారయత్న ము
ప్పొంగుచుఁ జేయఁగావలయు భూరిజగద్ధితబుద్ధిఁ బండితుల్."

ఇంకా జన్మలో సౌఖ్యములులేవని చెప్పినారు. అంతా దుఃఖమయమని చెప్పినాడు : చూడండి:—

ఉ. "కాయము గుంచి గర్భనరకంబున నుండుట దుఃఖమాది యం
దాయతలోచనావిరహ మబ్బుట దుఃఖము జవ్వనంబునం
బాయక భామినీహాసనపాత్రము దుఃఖము వృద్ధభావ మిం
కేయెడ గల్గు సౌఖ్యలవ మించుకయే జనులార చెప్పుఁడీ."

ఈశతకాలు సాధారణంగా ప్రతిమానవుడు చదవటానికి ఉత్సహించరు. వీరనారాయణ జగన్నాయక, సీతాపతీ, మొదలైనశతకాలు సామాన్యంగా జ్ఞానవైరాగ్యబోధకాలు, కాని వైరాగ్యమందు భర్తృహరిసుభాషితరత్నావళితో సాటికావు.

ఆదినాల్లో వినయవిహీనులై ప్రవర్తిస్తూ సంఘాని కపకారాలు చేసే దుర్మార్గులయిన రాజులను,పండితులను,మంత్రులను, పామరులను, దుర్మార్గులను నిందించేశతకాలకు దూషణ శతకాలని పేరువచ్చేసింది. వీటిలో ప్రసిద్ధిపొందినవి రామలింగేశశతకం,కుక్కుటేశ్వరశతకం, కవిచౌడప్పశతకం, చంద్రశేఖరశతకం అన్నవి. అందులో మొదటిదైన రామలింగేశశతకంలో "రామలింగేశ రామచంద్రపురనివాస" అన్న మకుటంగల 105 సీసపద్యాలు గలవు. కవిజన రంజనకవిసంశయవిచ్ఛేదాదికర్తయిన అడిదము సూరకవి పైశతకాన్ని వ్రాసినాడు. ఇతని కవిత్వం ఆంధ్రలోకాని కానందదాయకమని అందఱూ అంగీకరించారు. రామలింగేశశతకంలో ప్రతిపద్యంలోను నీతి బోధింపబడుతూ వుంటుంది. ఈశతకంలో ప్రధానంగా అవినయంగా ప్రవర్తిస్తూ ప్రజల్ని నానాబాధలుపెడ్తున్న ప్రభువుల్ని ఎక్కువగా నిందించాడు కవి. మహానీచంగా వర్ణించాడు రాజుల్ని. చూడండి.

సీ. పదుగురు కోతివెంబడి సంచరింపరే వాహకుల్లేరె శవంబునకును
గంగిరెద్దుకు లేవె ఘనతూర్యరావముల్ కలిమి గల్గదె వారకామినులకు
పులి గోవుఁ జంపి నక్కలను బోషింపదే స్థూలకాయము లేదె దున్నలకును
పుప్పిపంటికి లేదె పుట్టంబు జుట్టుట వేణుధరుం డెద్దువెంట రాడే
తే. న్యాయపద్ధతి నడువని యవనిపతికి, నెన్నిచిన్నెలుగలిగిన నెందుకొఱకు
అంతమునఁ జూడవలయు నాయయ్యసుఖము, రామలింగేశ రామచంద్రపురవాస.

పైపద్యమున న్యాయంగా నడవనిరాజును మర్కటంతోను, గంగిరెద్దుతోను, శవంతోను, వారకామినులు మొదలయినవాళ్లతో సాటితీసుకువచ్చాడు. ఈక్రిందిపద్యంలో గంగిరెద్దుకున్న లక్షణాల్ని మూర్ఖభూకాంతుడికి సమన్వయిస్తున్నాడు-

సీ కడువింత యగుస్థూలకాయంబు గల్గుట చిత్రభూషాంబరస్థితి నలరుట
తూర్యనాదంబులతోఁ జను దెంచుట వాలవీజనసమావాప్తి గనుట
శృంగవేత్రోద్ధతిఁ జేరరాకుండుట చూపరుల్ పలువురు చుట్టుకొనుట
స్వనయంత్రవాద్యముల్ విని తలయూచుట మౌనముద్రవహించుమతము గనుట
తే. గంగిరెద్దుకు మూర్ఖభూకాంతునకును, భేద మించుకయును గానుపింప దట్టి
ప్రభుని వేడిన సత్కవిపటిమ చెడదె? రామ......వాస.

ఇంకొకస్థలంలో దుర్జనుల్ని, దుష్ప్రభువుల్ని కలిపి చక్కటినిదర్శనాలతో వారివారికి తగినట్టుగా మిక్కిలి మనోహరంగా ఎలావర్ణించాడో చూడండి!—

సీ. చెఱకుపిప్పికిమూగు చీమలభంగిని వ్యాఘ్రములఁ నాశ్రయించు వరళ్లపోల్కి
నెంగిలిపుల్లైపై నెనయుకాకులరీతి గోప్యాంగమున మూగుకొాణుజు లట్లు
శవముపై గవిసినజంబుకంబులమాడ్కి మలముపై ముసురునీగలవిధమున
గోరింటపొదలపై కొనునోష్ఠములవలె కాటిలో పొరలాడు ఖగము లట్లు
తే. కటికిచీకటి దిరుగుపైకములపోల్కి, కుళ్లుతిత్తికి గవిసినకుక్కలవలె
దుష్ప్రభువు నాశ్రయింతురు దుర్జనులును, రామ.....వాస.

ఇలాంటిపద్యాలెన్నోవున్నాయి. ఇది నీతులనిధి అని చెప్పాను. దుర్మార్గుఁడు ఇతరుల సంపదల్ని పాడుచేసేస్తాడు. కాని దానివల్ల వాడికేమీ లాభంలేదు. అన్ననీతిని మంచి ఉపమానాలతో ఎంతో రమ్యంగా వర్ణించాడు. మచ్చుకొక్కటి.

సీ. సారమేయం బుట్టిచేరు ద్రెంచునుగాని పడకుండ బట్టునే పాలకుండ
కోతి కొబ్బరికాయ కొనకెక్కి పడద్రోయు దానిజలంబులు ద్రావగలదె
ముదుసలిపెండ్లాడి ముదితయౌవనము వ్యర్థముచేయుఁ గాకేమి దానఁ గాంచుఁ
గాకి ముంగర నోఱగఱచి డొంకలపాలు గావించు గాకేమి గాంచుదాన
తే. చెడుగు నరుఁ డొరుసంపదఁ జెఱచుఁగాని, తనకు ఫలమేమి గలుగదు తథ్యమరయ
నిందమాత్రంబు వానికి నిలుచు జగతి, రామ.....వాస.

ఏవి మంచిపనులో ఏవి మంచికార్యములు కావో ఈకవి చాల బాగుగా చెప్పాను-

సీ. పరునితో రమియించుభార్య గూడుటకంటె మేలు దాసీసంగమంబుసేయ
అని కోహటించుసైన్యాధిపత్యముకంటె గోపాలకత్వంబు కొంత మేలు
పరుని పీడించిన ప్రాభవంబునకంటె నందమై తోచు భిక్షాటనంబు
మనవి చెప్పగలేని మంత్రిత్వమునకంటె కైపుగాదే సూపకారవృత్తి
తే తనదు చెల్లెలి దొడ్డభూధవున కిచ్చి, యతనివల్లను సిరిగాంచునంతకంటె
సరసమై తోచె గొంటె దాసరితనంబు, రామ.....వాస.

ఇతనిశతకంలో ఇటువంటివి చాలావున్నాయి. ఏవో రెండుమూడుమాత్రం ఉదాహరించేను. మొత్తంమీద శతకంలో నీతులకన్న దూషణాలే తక్కువ. ఈశతకంలో అవినయంగా ప్రవర్తిస్తూ, దుర్మార్గపుకార్యాలను సాగించేరాజులను, దుర్మార్గులను విశేషంగా నిందించాడు కవి.

రామలింగేశశతకంతరువాత పేరుప్రఖ్యాతులనుపొందినది కుక్కుటేశ్వరశతకం. ఇది "భూనుతవిలాస పీఠికాపురనివాస, కుముదహితకోటిసంకాశ కుక్కుటేశ" అన్న మకుటంగల 92 సీసపద్యాలుగలశతకం, దీన్ని తేనియతేటలొలికేపలుకులుగలిగియు, రసికజనమనోభిరామం మొదలుగా చాలాగ్రంథాల్ని చేసినటువంటి కూచిమంచి తిమ్మకవి, అచ్చతెలుగులో గ్రంథాలువ్రాసి కవిసార్వభౌమబిరుదాన్ని పొందినటువంటితిమ్మకవి, కౌండిన్యగోత్రజుడైన తిమ్మకవి వ్రాసేడు. పైనిచ్చినపద్యసంఖ్యనుబట్టి చూస్తే శతకం పూర్తిగా దొరకలేదని తెలుస్తోంది. ఈశతకంలో కుచ్ఛితకవుల్ని, గ్రామకరణాల్ని నిందించినవాళ్లని, విద్యాహీనుల్ని, విశేషంగా నిందించాడు. ఇతని శతకంకూడా రామలింగేశశతకంలాగున దూషణలకన్న నీతులే ఎక్కువగా కలది. కవిసార్వభౌముడు, కౌండిన్యగోత్రజుడు అంటే చాలు. అతని కవిత్వం గుఱించి వ్రాయటం అనవసరం. అక్కడక్కడ ఆయాజనుల ననుసరించి గ్రామ్య భాషతోకూడా వ్రాస్తాడు.

బ్రాహ్మణులను దూషించిన పామరుల్ని తలపెట్టకూడదన్నాడు. వాళ్లెలా నిందిస్తారో బ్రాహ్మణుల్ని, చూడండి:—

సీ. పాతపాత్తపుకట్ట సేత పట్టుకవచ్చి దోసి బాపడ నంట దోసిలొట్టి
జలము సంద్రుడటంట పనిసాల దనుకొంట సెడుగు వాసారులు సెప్పుకొంట
తిండికి దెమ్మంట దేయిరింపుచు తూపె తూపెకు సేతులు సాపుగాని
మఱచ లెన్నడు పెద్దమనిసైన దంటేను తప్ప కేమాత్రంబు సెప్పలేడు

గీ. ఇతనికంటె సాకలి సెల్లిగాడు, మేలనెడు మోటకొయ్యల నేలదెలుప
భూనుతవిలాస పీఠికాపురనివాస, కుముదహితకోటిసంకాశ కుక్కుటేశ.

చూశారా గ్రామ్యా నెంతమనోహరంగా ప్రయోగించి పద్యం చెప్పారో; కరణాలు దుర్మార్గులు తంత్రగుట్టులు అని తిట్టేవార్ని కూడా ఇతను దూషించేడు. దూషించటమేకాదు, వారివిషయం తలంచనైనా తలంచవద్దన్నాడు.

సీ. కరణాలటంటను కైలకట్టలయిప్పి పాతికలంటను పరిగలంట
కాన్లంట గీన్లంట కలయిలేనియి కొన్ని సెల్లులు బాకీలు సెప్పుకొంట
బిరబిర గంటాలు గిరగిర దిప్పుతా నాకులన్నియు సెడ గోకుకుంట
ఎగరాసి దిగరాసి సగమేసి యెగదొబ్బి కొంపలు పడదోసి సంపుతారు

గీ. దయ్యపూ కాయకసురైన దక్కనియ్య
రేమిసేయుద మనుమోటులిలను గలరు, భూనుత...శ

బహూళ: ఇది కవిగారి అనుభవంగాబోలు. అనుభవంలేనిదీ యింతరమణీయంగా వర్ణించటం చాలాకష్టం. వర్ణించలేరుకూడాను. కవిగారు కరణంగారుకూడా కాబట్టి అనుభవించి ఉంటారు.

కుచ్ఛితకవుల్ని దూషించటానికి:—

సీ. ఇలజొన్నబడుగ్రుడ్డియెద్దుచాడ్పున మృదుపదగతులరయక పరువుగొనుచుఁ
వెనకువనోడిన పిరికిబంటుచుబోలె వడిలేక ప్రాసంబు విడచివైచి
సారె గొక్కురరీతి జడధులనెఱుసుల నెమకుచు మిగుల భంగములదోగి
పెంటలపైఁ బొరల్పొట్టిరాసభమట్లు పలుమఱు నపశబ్దములె పలుకుచు
గీ. తస్కరునిచందమునఁ బదార్థములు మ్రుచ్చి
లించుచుఁ జరించు కుకవుల నెంచనేల, భూసుత...శ.
అని మిక్కిలి నీచంగా తిట్టాడు. సూరకవిలాగునే ఈతడుకూడా రాజుల్ని తిట్టాడు. రాజులను తిట్టి తరువాత ఎట్టివాడు రాజో నిరూపించినాడు.
రాజులను నిందించినపద్యములలో ఒకటి రెండు:—

సీ. ఘూకంబు తెఱగున గొందుల నిరుకుచు భుజగంబుచాడ్పున బుస్సుమనుచు
చెబ్బులికరణి గంపిలడాకసేయుచు భేకంబుగతి మేనిపెంపు గనుచు
భల్లూకమట్లు చొప్పడ విఱ్ఱవీగుచు నాబోతుకైవడి నామునొనుచు
గోమాయువట్ల ఎన్నోమాయ లూనుచుఁ గ్రోడంబువలె గొర గొర నెగపుచుఁ
గీ. దనరుక్రూరనృపాలకాధముల నమ్మి"

అని మిక్కిలి హీనంగా, కప్పలతోను, నక్కలతోను, పాములతోను, కొట్టుకొనకు పందితోను ఉపమానంతెచ్చి అసహ్యంగా వర్ణించాడు. ఇతనికి రాజులమీద ఇంత అసహ్యభావ ముండటాన తనకృతులు కుక్కుటేశ్వరునికిచ్చేడు. ఇంకా రాజుల కలంకారములు సాహసౌదార్యాదులుకాని వేషభూషాదులుకావని ఆఅలంకారాల్ని అతినీచంగా సొగసుగా చెప్పాడు:—

సీ. అందలం బెక్కుట యవని ప్రశస్తమా? మ్రానెక్కి నిక్కదే మర్కటంబు
తొడవులు దొడుగుట దొడ్డసౌభాగ్యమా? కడుసొమ్ము లూనదే గంగిరెద్దు
విత్తంబు గూర్చుట విమలప్రచారమా? బహునిధుల్ గావఁడే భైరవుండు
ప్రజల దండించుట పరమసంతోషమా? ప్రాణులనెల్ల నేపఁడె జముండు

గీ. దొరతనంబున కివిగావు వరుసలరయ
సాహసౌదార్యఘనపౌరుషములు కాని, భూనుత......శ.

ఇంక నీతి కొక్కటిః—

సీ. నింబభూజమునకు నిర్మలోదక మిడి మనిచిన నది చేదు మానఁగలదె?
పాపకూనకు మంచిపాల్పోసి పెంచిన నెడరూను తనవిషం బుడుగఁగలదె?
ఉల్లిగడ్డ తుషారోదకం బిడి ప్రోదిఇడినను దనకంపు విడువగలదె?
కందదుంపకుఁ బానకముపోసి పెంచిన గొద లేని తనదూల వదలఁగలదె?
గీ. దుర్గుణున కెన్ని మంచివస్తువులు పెట్టి
మనుపఁ జూచిన తనయోజ మానఁగలఁడె? భూనుత......శ.

ఇలాటినీతు లాశతకంలో తిట్లకన్న అధికంగా ఉన్నాయి.

కవిచౌడప్పశతకం ప్రసిద్ధికెక్కిన తిట్టుశతకాల్లో గొప్పది. కవిచౌడప్పశతకంలో పద్యం రాని ఆంధ్రుడు సామాన్యంగా ఉండడు. దీనినిండా బండబూతులున్నాయని అవన్నీ కవిచౌడప్పచే చేయబడ్డాయనిన్నీ చాలామంది అంటారు. 'బూతులబుంగ' అన్న టైటల్ కూడా ఇచ్చారు పండితులు. కవిచౌడప్ప స్వయంగా బూతుల్ని చెప్తానని చెప్పాడు. చూడండిః—

క. నీతులకేమి యొకించుక, బూతాడక దొరకు నవ్వుపుట్టదు ధరలో
నీతులు బూతులు లోక,ఖ్యాతులురా కుందవరపు కవిచౌడప్పా!

కాని ఆతనిశతకంలో "పడతుకయును వంకాయయు" మొదలయిన ఏపది పది హేనుపద్యాల్లోతప్ప అవేనా ధ్వనిప్రధానంగా పండితజనైకవేద్యంగా వున్నాయి. అంతే కాని ఇప్పుడు మనవాళ్లు కవిచౌడప్పశతకంలో వని చదువుతూన్న పచ్చిబూతుపద్యాలు కవిచౌడప్పవి కావనే నామతం. తెనాలిరామకృష్ణుడిమీద వాడుచేసినట్లు ఎలా కథలు మొదలయినవి కల్పించారో అలాగే కొంతమందికవులు పచ్చిబూతులతో పద్యాలల్లి శతకం లో చేర్చేశారు. ఆపద్యాలుతప్ప కవిచౌడప్పశతకం చాలా మంచిది. అందులో భక్తి, నీతి కూడా వర్ణింపబడ్డాయి.

భక్తికిః—

క. అలసట వేసటనైనం, గలనైనఁగనుచునైన గరుడధ్వజునిఁ
దలఁచినవారలఁ జేరవు, కలుషంబులు కుందవరపు కవిచౌడప్పా!

హాస్యమునకు:—

క. పప్పే పస బాపలకును, నుప్పే పస రుచులకెల్ల నువిదలకెల్లన్
కొప్పే పస దంతములకు, కప్పే పస కుందవరపు కవిచౌడప్పా!

నీతికి:—

క. తనసతి యిడగా మనుమలు, తనయులు తలిదండ్రు లన్నదమ్ములు బంధుల్
దినదినమును భుజియించుట, ఘనవిభవము కుందవరపు కవిచౌడప్పా!

ఆడినమాటతప్పి తిరుగువారి నిందకు:—

క. ఆడినమాటలు తప్పిన, గాడిదకొడు కంచు దిట్టగా విని మదిలో
వీడా కొడుకని యేడ్చును, గాడిదయును కుందవరపు కవిచౌడప్పా.

ఇట్టి భక్తిపద్యాలు, నీతిపద్యాలు చాలావున్నా యతనిశతకంలో. బండబూతు పద్యాలు తరువాతివాళ్లు ఇతను కాస్త వ్యంగ్యంగా బూతులుచెప్తాడని వాళ్ల వెర్రిమొర్రి పద్యాలుకూడా ఈశతకంలో చేర్చారు. ఇంతటితో దూషణశతకాలవిషయం ముగిస్తాను.

నీతిశతకాలు మిగిలాయి. ప్రతిశతకంలోను నీతనేది ఉంటుంది. మళ్లీ వేరేనీతిశతకాలని విభాగం ఎందుకు? అని అడుగవచ్చు. నిజమే నీతిబోధలేనిశతకం ఉండదు. కాని నీతి అనేది రాజనీతి, లోకనీతి, సేవకనీతి మొదలుగావిభజింపబడ్డాది. అందులో లోకనీతి సామాన్యంగా కొంచెమో గొప్పో ప్రతిశతకంలో నుండటం కద్దు. కేవలం నీతిశతకం అంటే ఆమూడునీతులే వర్ణింపబడతాయి. ఈనీతిశతకాలు మనభాషకు వేదములవంటివి. అంటే ప్రభువులతో సమానములని మనవి. అవి కావ్యాలలో చేరవని కొందఱన్నారు. ఈనీతి శతకశాఖకి చెందినవి భాస్కర సుమతీ మొదలయినశతకాలు. వాటిలో సుమతిశతకం గొప్పదని చెప్పతగింది. దానివిషయం తరువాత మాట్లాడదాం. భాస్కరశతకం చక్కని నీతుల్ని అందరికి తెలిసేట్టుగా ప్రసిద్ధాలైన ఉపమానాదులతో చెప్తుతుంది. ప్రతిపద్యంలోను రెండుపాదాలు నీతి రెండుపాదా లుపమానంక్రింద సాధారణంగా ఉంటాయి. కర్తృత్వం నిర్ణయంకాలేదు. ఇందు 'భాస్కరా' అనేమకుటంగల 108 పద్యాలున్నాయి. లోకనీతిని వర్ణించటంలో ఇతనికంటె పై చెయ్యిలేదు. ఈశతకకర్త ఎవరో తెలియకపోవటం ఆంధ్రుల దురదృష్టమే. నూటఎనిమిదిపద్యాలుకూడా నీతులతో నిండిఉన్నాయి. ప్రతి పద్యంలోను నీతి బాగా తెలియటంకోసం ఉపమానాలుకూడా వ్రాశాడు. మచ్చుకి రెండు మూడుపద్యాలు చూపిస్తాను.

"ఎడ్డమనుష్యుఁ డేమెఱుఁగు నెన్ని దినంబులు గూడియుండియున్
దొడ్డగుణాఢ్యునందుఁ గలతోరపువర్తనలెల్లప్రజ్ఞలే
ర్పడ్డవివేకిరీతి రుచిపాకము నాలుక గా కెఱుంగునే?
తెడ్డది కూరతోఁ గలయఁ ద్రిమ్మరుచుండినఁనైన భాస్కరా!"

"దానపరోపకారగుణధన్యత చిత్తములోన నెప్పుడున్
లేనివివేకశూన్యునకు లేములు వచ్చినవేళ సంపదల్
పూనినవేళ నొక్కసరిబోలును జీకున కర్ధరాత్రియం
దైన నదేమి పట్టపగలైన నదేమియు లేదు భాస్కరా".

"వలవదు క్రూరసంగతి యవశ్య మొకప్పుడు సేయబడ్డచో
కొలఁదియెకాని యెక్కువలు గూడవు తమ్మలపాకులోపలం
గలసినసున్న మించుకయె కాక మరించుక యెక్కువైనచో
నలుగడ చుఱ్ఱు చుఱ్ఱు మని నాలుక పొక్కక యున్నె భాస్కరా."

"పూనిన భాగ్యరేఖ చెడిపోయినపిమ్మట నెట్టి మానవుం
డైనను వాని నెవ్వరుఁ బ్రియంబుగఁ బల్కరు పిల్వ రెచ్చటన్
దా నది యెట్లొకో యనిన తథ్యము పుష్పము వాడి వాసనా
హీనత నొందియున్నయెడ నెవ్వరు ముట్టుదురయ్య భాస్కరా".

"బలయుతుఁ డైనవేళ నిజబంధుఁడు తోడగుఁగాక నాతఁడే
బలిమి దొఱంగెనేని తనపాలిటి శత్రు వదెట్ల పూర్ణుఁడై
జ్వలనుఁడు కానఁ గాల్చుతఱి సఖ్యము జూపును వాయుదేవుఁడా
బలియుఁడు సూక్ష్మదీపమగుపట్టున నార్పడె గాలి భాస్కరా".

ఇట్టి వెన్నో పద్యములు గలవు. ఈశతకమందు పద్యాల్ని ఏర్చికూర్చి ఇయ్యటం సాధ్యంకాదు ఎందుచేత నంటారా? కొత్తపద్యం చదివితె పాతపద్యం ఏమీ బాగుండ దనిపిస్తుంది, అప్పటికి చదివినపద్యంతో ఏపద్యం సాటిరా దనిపిస్తుంది. దానిప్రక్కపద్యం చదువుతే ఇది మంచిదికా దనిపిస్తుంది మనస్సుకి. మానవుడన్నవాడు అందులోను ఆంధ్రు డన్నవా డల్లాతప్పని సరిగా చదవాలి. ఆశతకం గుణాలు చెప్పలేము.

నీతిశతకాలలో భాస్కరశతకంకన్న గొప్పది సుమతిశతకం. ఈశతకం పిల్లలుకూడా చదవటానికి తగిఉన్నది. కవికి సులభమైనశైలి. తేటతెలుగుపదాలలో పద్యాలల్లటం సంగ్ర

హారచన ప్రకృతిసిద్ధగుణాలులా గున్నాయి. ఈశతకంలో కవి స్త్రీలను విస్తారంగా దూషించేడు. చూడండి ఒకటి రెండు పద్యాలు:—

క. అల్లుని మంచితనంబును, గొల్లని సాహిత్యవిద్య కోమలినిజముం
బొల్లున దంచినబియ్యము, తెల్లనికాకులును లేవు తెలియుర సుమతీ.

క. "వాదు సుమీ యప్పిచ్చుట, లేదు సుమీ సతులవలపు లేశము సుమతీ."

క. కోమలి విశ్వాసంబును, బాములతో చెలిమి యన్యభామలవలపుం
వేముల తీయదనంబును, భూమీశుల నమ్మికలును బొంకుర సుమతీ.

క. తలపొడుగు ధనముపోసిన, వెలయాలికి నిజములేదు వివరింపంగాఁ
దలదడవి బాసచేసిన, వెలయాలిని నమ్మరాదు వినురా సుమతీ.

ఇలాగే చాలాచోట్ల స్త్రీలను నిందించేడు. ఒక్కచోటమాత్రము:—

క. కులకాంతతోడ నెప్పుడు, కలహింపకు వట్టితప్పు ఘటియింపకు మీ
కలకంఠకంఠికన్నీ, రొలికిన సిరి యింట నుండనొల్లదు సుమతీ.

అని కులకాంతతో ఎప్పుడు దెబ్బలాడవలదనినాడు. కాబట్టి పైదూషణలు వేశ్యకని చెప్తే బాగుంటుందని నామతం. ఇంతకన్న నీచంగా వేశ్యల్ని నిందించాడు. ఈశతకంలో లోకనీతికన్న రాజనీతి ఎక్కువగా వర్ణింపబడ్డాది. లోకనీతికూడా వర్ణింపబడింది. నీతులకు కొన్ని ఉదాహరణాలు:

క. మాటకుఁ బ్రాణము సత్యము,కోటకుఁ బ్రాణంబు సుభటకోటి ధరిత్రిం
బోటికిఁ బ్రాణము మానము, చీటికిఁ బ్రాణంబు వ్రాలు సిద్ధము సుమతీ.

క. పరుల కనిష్టము చెప్పకు, పొరుగిండ్లకుఁ బనులులేక పోవకు మెపుడుం
బరుగదిసినసతి గవయకు, మెఱఁగియు బిఱుసైనహయము నెక్కకు సుమతీ.

క. నవ్వకుమీ సభలోపల, నవ్వకుమీ తల్లిదండ్రి నాథులతోడం
నవ్వకుమీ పరసతితో, నవ్వకుమీ విప్రవరుల నయ మిది సుమతీ.

ఇంతకన్న మేలైననీతు లెన్నోవున్నాయి. అవి ఉదాహరించాలంటే శతకమంతా ఉదాహరించాల్సిందే. కాబట్టి మరి ఉదాహరించను. అతని ప్రతిజ్ఞ:—

క. శ్రీరామునిదయచేతను, నారూఢిగ సకలజనులు నౌరా యనఁగా
ధారాళ మైననీతులు, నోరూరఁగఁ జవులు పుట్ట నుడివెద సుమతీ.

అనే ప్రతిజ్ఞను సఫలంచేసుకున్నాడు. మొత్తంమీద శతకమంతా కలయవెదికితే అయిదారు వ్యర్థపదాలకన్న ఎక్కువ ఉండవు. ఇతనిభావాలు, భాష తెలుగుజాతి కలంకారాలు. ఇత నిందులో బలముకలవానికన్న నీతిగలవారే బలవంతురని చెప్పినాడు:—

క. లావుగలవానికంటెను, భావింపగ నీతిపరుఁడు బలవంతుండౌ

గ్రావంబంత గజంబును, మావటివాఁ డెక్కినట్లు మహిలో సుమతీ.

ఇం తెందుకు! సులభమైనశైలిలో, సంగ్రహమైనరచనలో, సూటిసూక్తులతో, ఏమాత్రం వాచకంవచ్చినవాడుకూడా చదవటాని కనువైనభాషలో కందపద్యాలలో ఉత్తమమైననీతుల్ని ఇలా చెప్పగలవాఁడులేడని చెప్పాలి వేమనతప్ప. ఆంధ్రుడన్న వాఁడే కాదు మానవుఁడన్న వాడు ఈశతకాన్ని చదివితీరాలి. ఈశతకంవల్ల మంచి లోకజ్ఞానం అలవడుతుంది.

ఇప్పుడుకూడా చాలామంది శతకాలు వ్రాస్తున్నా పూర్వపుపక్కీని కొన్ని బయల్దేరుతున్నాయి. భారతీశతకం మొదలయినవి. కొన్ని కొత్తవి బయల్దేరుతున్నాయి. ఆంధ్ర వీరకుమారశతకం, శ్రీహరవిలాసం (అముద్రితం) మొదలైనవి. ఈశతకాలు చాలా బాగున్నాయి. ఆధునికంగా అంటే ప్రస్తుతం ఆంధ్రరాష్ట్రం విషయమై, మతాన్నుద్ధరించే హరనాథుడు, రాధాస్వామి మొదలైన మతోద్ధారకులమీద పుట్టుతున్నాయి. ఇందులో ఆంధ్ర వీరకుమారశతకం చాలా ఉత్కృష్టమైనది. ఆశతకం చదువుతున్న ప్రతిఆంధ్రునిహృదయం ఉప్పొంగుతుంది. వేడిరక్తం ప్రవహిస్తుంది. ఆశతకం వొకానొకప్పటి ఆంధ్రులసామ్రాజ్యాన్ని ఆంధ్రులవైభవాన్ని కన్నులకు చూపెట్టుతుంది. ఇటువంటి శతకా లింకా బయల్దేరాలి. ఆశతకం ఆంధ్రవనితలకుకూడా ఉద్రేకాన్ని కలిగిస్తుంది. పూర్వపు ఆంధ్రవనితలు కత్తి ఘంటములుపట్టి తుదకు తమదేశానికై తమప్రాణాల్ని అర్పించిన వీరమాతలయొక్క కవయిత్రులయొక్క చరిత్రలున్నాయి అటువంటిశతకం పుట్టటం ఆంధ్రుల అదృష్టం అని చెప్పాలి.

రెండోది శ్రీహరవిలాసం. దీన్ని నామిత్రులయిన సామవేదుల వేంకటశాస్త్రిగారు రచించారు. (ముద్రణలో నున్నది) ఇది హరనాథునిమీది భక్త్యావేశముచేతరచింపఁబడినది. ఇది 'హరా' అన్న మకుటంతో ఉంది. ఇది హరనాథునికే అంకితమయింది. వేంకటశాస్త్రిగారిదివఱకు రాఘవేశ్వరశతకం, అనే శతకాన్ని వ్రాశారు. అది ముద్రితమయింది. అదికూడా భక్త్యావేశంచేతనే వ్రాశారు. హరవిలాసంలో స్తుతిదశకము మొదలైనవి భాగాలుకూడా కనపడ్తున్నాయి. పూర్వపుశతకాల్లో అనుసృతులు చాలావఱకు కనపడ్తున్నాయి. చూడండి. మచ్చు కొకటి రెండు:—

క. నిన్నే తల్లిగ తండ్రిగ, నిన్నే సద్గురునిగాగ స్నేహితునిగ లో
నెన్నుచు నాదైవంబుగ, సన్నుతు లొనరింతు నీవె శరణంబు హరా!

క. ఇల్లా లిల్లును బిల్లలుఁ, దల్లులు దండ్రులును బంధుతతి దబ్బర యా
త్మోల్లాస మిడగ నీవే, ఎల్లపు డెల్లెడల నుందు విది నిజము హరా!

మొదలయినవి. కేవలము అతనిగూర్చిన భక్తిస్తోత్రములే కాకుండా హరనాథుని బాల్యక్రీడాదులుకూడా వర్ణింపబడ్డాయి. కవిత్వ మంత రసవంతం కాకపోయినా వయసుకి తగినట్లుగానే ఉంది. అక్కడక్కడ వ్యర్థపదాలు కూడా కనపడ్తున్నాయి. హరనాథుని మహిమవర్ణన!—

క. ఒకగంట సముద్రధ్వని, సకలం బాపితివి నీవు సంకల్పింపన్
వికలంబై త్రిజగంబులు, నొకపరి దగ్ధంబు గాకయుండు నెటు హరా.

ఈపద్యమే అతని భక్త్యావేశాన్నికూడా కనపరచలేదా! భక్తి కింకొక్కటి

క. సర్వము మత్కర్తృక మను, గర్వంబునఁ గర్మ గంగఁ గలపుటకంటెన్
సర్వము నీపైనిడి స,న్నిర్వహణత దగదె ముక్తినిన్ బొంద హరా!

భక్త్యావేశకరములైన పద్యా లెన్నో వున్నాయి. మొత్తంమీద చూస్తే శతకం చాలా ఉత్కృష్టమైనదనే చెప్పొచ్చు. హరనాథుడు, రాధాస్వామి మొదలయినవారి మీద శతకాలు చెప్పటంలో నేను చూపినశతకాల్లో ఇదే మొదటిది. ఇందులో కొన్ని పద్యాలు రత్నాల్లాంటి వున్నమాట యథార్థము. మిత్రుడని చెప్పినమాటలు కావు.

శతకా లెవరువ్రాసినవి వారిదగ్గఱనే ఉంటున్నాయికాని వ్యాప్తికి రాలేదని కొందఱు మహానుభావులంటారు. కాని అది అవిచారితమైనవచనం. సుమతీ, వేమన, కృష్ణ, నారసింహ శతకాలలో పద్యాలురానిపిల్ల డరుదు. కవిచౌడప్పశతకం, గువ్వలచెన్నశతకం రాని గ్రామం ఉండదు. వేమనశతకం రానివేదాంతులు బైరాగు లుండరు. 'దాశరథీకరుణాపయోనిధీ' అన్నమకుటం చెవినిపడని ఆంధ్రుడు, పద్యాలురాని తాతగారున్ను అరుదు. కుమారీశతకం రానిస్త్రీ లుండరు. భక్తచింతామణిశతకం అన్నిసార్లు ముద్రించబడి వేనవేలుప్రతులు చెల్లి పోతూంటే శతకాలు వ్యాప్తిలో లేవనగలమా?

"ధర సింహాసనమై నభంబు గొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండ మాకారమై

సిరి భార్యామణియై విరించి కొడుకై శ్రీగంగ సత్పుత్రియై
వరుస న్నీఘనరాజసంబు నిజమై వర్ధిల్లు నారాయణా ?"

అన్నపద్యం లేనిదసరా ఉంటుందా? పైవాక్యాలవల్లనైనా శతకాలు వ్యాప్తిగంచున్నాయని ఆవిమర్శకులు తెలుసుకోవాలి. కన్నులారా ఈవిషయాలన్నీ చూస్తూ శతకాలు వ్యాప్తిలో లేవనటం తెలివితక్కువతనం.

శతకాలు ఇంత ఉత్కృష్టాలు, వ్యాప్తిలోనున్నవీ అయినట్లైతే పూర్వం,శతాబ్దానికై దారుమాత్రం ఎందుకు పుట్టేవి? అన్న శంకకి ఆదరణలేకపోవటమేనని సమాధానం శతకాలవిషయమై పూర్వపుప్రభువులల్లో కొంతమందికి ఆదరాభిమానాలుండేవి. ప్రభువులు కవులకు సొమ్మిచ్చి మకుటం తమమీదపెట్టి శతకాల్ని చెప్పించుకొనేవారు. పైమాటను గువ్వలచెన్నశతకం, బుర్రా వెంకన్నశతకం, కృష్ణభూపతి, లలామశతకం, మొదలైనవి ఋజువుచేస్తున్నాయి. లాక్షణికులలో అప్పకవి అక్కడక్కడ మరున్నందన, భాస్కర మొదలైనశతకాల్ని ఉదాహరించేరు. ఏమేనా! సవతితల్లిప్రేమే చూపెట్టారుకాని, యథార్థమైన ప్రేమ లేదు. అనాదరణే యెక్కువ. ఎటువంటిగ్రంథమైనా స్త్రీవ్రాసిందనటంతోనే కవుల చరిత్రలో స్థానంఇచ్చే శ్రీ వీరేశలింగంపంతులుగారు కూడా, మదిన సుభద్రమ్మగారు శతకాల్ని వ్రాసేరని తరిగొండ వేంకమాంబచరిత్రలో చెప్పి ఈమెచరిత్ర వ్రాయటం మానేశారు. తక్కినచరిత్రకారులమాట చెప్పేదేముంది. బహుజనపల్లి సీతారామాచార్యులుగారు త్రిలింగలక్షణంశేషంలో "తియ్యబెల్లిమాటలు" మొదలయిన క్షేత్రయ్యపదాల్ని తారాశశాంకంలో పద్యాలు ఉదాహరించారు. ఆతఁడే ఆంధ్రశబ్దరత్నాకరమనే నిఘంటువును కూడా వ్రాశారు. కాని ఆగ్రంథంలో ఎక్కడా శతకాన్నుదాహరించటం మానేశారు. వైరాగ్యనీతిబోధకాలైన శతకాలు క్షేత్రయ్యపదములలాంటివి కావేమో? ఆచార్లగారి దృష్టిలో, శతకకవులు లాక్షణికులు కానందున వారిశతకాల్నుదహరించలేదనటానికి వీల్లేదు. బసవపురాణం మొదలయినగ్రంథాలు చేసినసోమనవృషాధిపశతకం లాక్షణికం కాదంటారా? కవిజనరంజన కవిసంశయవిచ్ఛేదము ప్రమాణగ్రంథాలై అతఁడుచేసిన రామలింగేశశతకం అప్రామాణికమా? సర్వలక్షణసారసంగ్రహాన్ని వ్రాసినతిమ్మకవితాలూకు అచ్చతెలుగురామాయణం ప్రామాణికం కాదూ? ధూర్జటితాలూకు ప్రథమరచనఅయిన కాళహస్తీశ్వరమాహాత్మ్యం సర్వలాక్షణికసమ్మతమై తరువాతవ్రాసిన కాళహస్తీశ్వరశతకం ప్రామాణికం లాక్షణికం కాదా? రావిపాటి తిప్పన్న చాటుధారలు, మేధావిభట్టతిట్టు పద్యములు మొదలైనవి లాక్షణికములయి కావ్యసౌలభ్యంకలిగి కావ్యాలతో సమానగౌర

వాన్ని పొందుతూ, ప్రజల ఆదరాభిమానాలను మన్ననలను పొందుతున్న శతకములు లాక్షణికములు ప్రామాణికములు కావా? ఎంత దారుణము! ఎంత వింత! ఇంతెందుకు? బండబూతులు వ్రాసిన ముద్దుపళని రాధికాసాంత్వనము, స్తనాదుల నతిస్పష్టముగ వర్ణించిన సారంగుతమ్మయ వైజయంతీవిలాసమున్ను, తారాశశాంకము, పరమప్రామాణికాలై ప్రతిలక్షణగ్రంథం లోను ఉదహరించతగినవై, భక్తి, నీతి, వైరాగ్యాదుల్ని బోధిస్తూన్న కాళహస్తీశ్వర భాస్కర సుమతిశతకాదు లుదాహరింప తగనివి, అప్రామాణికములు, అలాక్షణికములు అనటం శోచనీయము నింద్యమున్ను అయినవిషయంకదా!

ఇంక శతకములలోగల ఉత్కృష్టగుణాల్ని సంక్షేపంగా చెప్పి విరమిస్తాను. శతకాలు ప్రధానంగా సంస్కృతపురాణేతిహాసకావ్యసంపర్కంలేనివవటాన ఆంధ్రులప్రత్యేకతను సూచిస్తాయి. శతకాలు భావోద్రేకజనితాలవటాన వారిస్వతంత్రములైన అభిప్రాయాలు శతకాలలో వెల్లడిఅవుతాయి. ప్రబంధాలలో పాత్రలనే తెరలవల్ల కవియొక్క స్వతం త్రాభిప్రాయాలు మరుగుపడిపోతాయి. పాఠకులకు తెలియవు ఉపజ్ఞతో కూడుకున్న వ్రాతల్ని కనిపెట్టాలంటే శతకవాఙ్మయం ఉపకరించినట్టు ప్రబంధా లుపయోగించవు. శతక కవు లందరు లోకానుభవజ్ఞులు. లోకానుభవంలేనిదే శతకం వ్రాయలేరు. ప్రబంధకర్తల కంతగా అనవసరం. శ్రీ రెడ్డిగారు చెప్పినట్లు పూర్వప్రబంధాల్ని చూచి నిఘంటువులు తిరగ వేసి యమకం మొదలయిన శబ్దాలంకారాలు శ్లేష మొదలయిన అర్థాలంకారాలు వ్రాయ టానికి లోకానుభవ మెందుకు? తెలుగుపలుకుబడులలో శతకాల్ని పోలిన గ్రంథాలు ఆంధ్ర వాఙ్మయంలో లేవంటే అతిశయోక్తికాదు. శతకకవులు ప్రబంధాల్ని మిక్కిలి సులభంగా వ్రాయగలరుకాని ప్రబంధకర్తలు శతకాల్ని శీఘ్రంగా వ్రాయలేరు. ప్రబంధములను వ్రాసి బుద్ధి, కవిత్వము, పరిపాకమును పొందినపిమ్మట లోకానుభవం వృద్ధిపొందినతర్వాత శతకాలు వ్రాయటం ఆచారం. కాళహస్తీశ్వరశతకం మొదలైనవి ఉదాహరణాలు. కాబట్టి ప్రబంధాలకన్న శతకాలు ఉత్తమము లనటం సంభవించినది. పూర్వమే కాదు నేడు కూడా ప్రబంధాలు పుడ్తున్నాయి, శతకాలు రచింపబడుతున్నాయి. ఇప్పటిశతకాల్లో ఆంధ్రవీర కుమారశతకం చూడండి. అందులో ఆంధ్రులజాతీయత, వ్యక్తిత్వము, ఆంధ్రులమహాత్త్వము మొదలైనవాటిని వాటిలో నూరవవంతైన వర్ణించేప్రబంధం ఇంకొకటుందా? ఆశతకంలో వీరులచరిత్ర చదువుతున్నపుడు ప్రతిఆంధ్రుఁ డనఁబడుతున్న మానవుడిహృదయం ఉప్పొంగి రక్తం వేడెక్కుతుంది. ఏదీ అటువంటిప్రబంధం ఒక్కటేనా ఉందా? ఆశతకం ఆంధ్రుల ఉత్సాహాన్ని రెట్టిస్తున్నాది గదా? ఆకవివతంసులు ఆంధ్రుల ఆదరాభిమానాలకు నమస్సు లకు, ప్రేమదీవలనకు పాత్రులు.

ఇంక పర్యవసాన మేమిటంటే! ప్రబంధాలకంటె అన్నివిధాలా శతకాలు శ్రేష్ఠములు. కాని పూర్వలక్షణకర్తలయొక్క, కవిజీవితకారులయొక్క ఆదరాభిమానాలు సంపూర్ణ కటాక్షం లేకపోయినా కీగంటిచూపు కూడా లేకపోవటం శోచనీయమైనవిషయం. పూర్వంనుండి శతకాల్ని ఆంధ్రులందఱు ఆదరాభిమానాలతో చూచినట్లైతే ఈకాలాని కావాఙ్మయం ఎంత ఉత్కృష్టంగా అధికంగా ఉండేదో! ఇప్పటికైనా ఆంధ్రవీరకుమార శతకంలాంటిశతకా ల్నాధునికంగా వ్రాసి వ్రాయించి ఆంధ్రుల ఉత్సాహాన్ని రెట్టించి ఆంధ్రభాషను ఆంధ్రులఉద్యమాల్ని ఫలవంతములైనవాటినిగా చేయాలని మనవి. అటువంటి అమూల్యములైనశతకాలంకారాలతో ఆంధ్రభాషాయోష నలంకరించాలి. అట్టి శతకకర్తలకు నామనఃపూర్వకమైన నమస్సులు.

---

**శ్రీమాన్ యస్. శ్రీనివాస అయ్యంగారు :—**

తెనుగు త్రిలిఙ్గవారపత్రిక రజతోత్సవసందర్భమున శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారికి కానుకసంచిక సమర్పింతురని విని సంతోషించుచున్నాను. మేము ఇరువురమును చాలకాలముగ స్నేహితులమైనుండుటచేత ఆయన, ఆయనశీలము, ఆయనసేవ, వీనిగురించి తగినరీతినివర్ణించుట నాకు కష్టము. విస్తారమై సత్కార్యాచరణమున అతడుచూపిన నిరాడంబరత్వమును అప్రతిమానము. బలవంతుడు పేద అనుభేదము చూడక పాత్రులయినవారు ఏదర్జావారైనను ఈయన వారికి గావించిన ఎన్నోమేళ్లను వారికి ఇతనియందుకల కృతజ్ఞతాపూర్వకమైన అనురాగమును వీరికి ఉత్తమమైన స్మరణచిహ్నములు. ప్రాతకాలపుశీలములోని ఏసుగుణములు మనము నేడుమరచిపోయి ఎక్కువఎక్కువగా నష్టపడుచున్నామో అట్టి సుగుణముల ఎడల ఇతడు వీడరానిభక్తి కనబరచినవాడు. స్నేహమునకు నిజమైనఅర్థము నెరింగిన బహుకొద్దిమందిలో ఈయన గణింపదగినవాడు. స్వోత్కర్షాభిలాషలేక సత్యముగా పత్రికాప్రచురమునకును దేశమునకును సేవచేసినవాడు. చూపునకు ఈయన బహుసాధువుకాని సునిశితమైన బుద్ధివైశద్య మితనికి గలదు. నిర్ణయములచాకచక్య మున్నది. నైతికోత్సాహమును వితరణదృష్టియు గలవాడు. తెనుగు, సంస్కృతవాఙ్మయముల ఎడలను హిందూ ఆదర్శములఎడలను, వీరికి తన్మయత్వము కలదు. వీరుజీవితమునకు ఈఆదర్శములే మార్గదర్శకతారలు.

ఈరజతోత్సవసందర్భమున త్రిలిఙ్గకును శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులకును నాహృదయపూర్వకఅభినందనములు సమర్పించుచున్నాను. వారికి ఆరోగ్యము సౌఖ్యములుగలిగి ఇతోధికముగా సేవచేయుటకు అవకాశము కలుగుగాక!

# ముత్యాలసరముల విమర్శనము

**రచయిత: శ్రీవేములపల్లి సత్యనారాయణచౌదరిగారు**

[తే 10-1-41 దీనిని శ్రీగురజాడ అప్పారావుగారి జయంత్యుత్సవములో ఆంధ్రభారతీతీర్థమున జయపురమహారాజా కుమార్ శ్రీ శ్రీ కమలనాథరాయిగారి అధ్యక్షత్వాన జదువబడినది.]

ఆధునికంగా బయల్వెడలిన నవ్యకవిత్వంతో చేయిగలిపి పేరువ్రాసినవారిలో శ్రీ గురజాడ అప్పారావుగారు వొకరు. వీరి అన్నికృతులు ఆంధ్రలోకానికి సుపరిచితాలు. వీరి కావ్యములన్నీ పాఠకుని హృదయాన ఒకపరి చదివినవెంటనే చొచ్చుకొని ముద్రపడ్తాయే కాని, మరపునకు వచ్చేయికావు. వీరి ప్రతిమాటాకూడ సమయానికి స్ఫురణకువచ్చి చెవులలో గింగురుమని ప్రతిధ్వనిస్తూనే ఉంటుంది. ప్రతివాక్యము సనాతనునికూడా సంస్కరణానికి తార్చజాలి వుంటుంది. ఒకపరి చదివినవెంటనే ఆహృదయం సంస్కరణాన్ని అభిలషిస్తుంది. వీరు అన్నింటను క్రొత్తనే అభిలషించారు. మొత్తం సర్వవిధాలా నవ్యతనే నెలకొల్పారు. పాతపుంత వారి కెంతమాత్రం రుచించేదికాదు.

ఇన్నివిధాల సంస్కరణానికి పూని ప్రతికక్షుల నెదుర్కొన్నవారు వీరొకరేయనాలి. వీరేశలింగంగారున్నా వీరు నడచినన్ని నవ్యపంథాలవారు త్రొక్కినారు కారు. అందు వారి కట్టి అవసరమూ లేకపోయింది. వీరిరువురకు సంఘసంస్కారం సమానాభిలాషమైనా గురజాడవారిలో వ్యావహారికవాద మొకటి ఛందంచందా న్నతిక్రమించి ముత్యాలసరాల రచించడ మొక్కటి విశేషాలు. కన్యాశుల్కంలోనే రూపొందింది వీరిసంఘసంస్కరణం. అయినా ముత్యాలసరాల కిరణప్రసారాలు సనాతనహృదయాల్లోనిబూజు దుల్చి ప్రసాదన మొనర్చుతూనే యున్నయి.

దేశాభిమానము వర్థిల్లి దేశమౌన్నత్యం జెందాలంటే తప్పకుండా కవితకోకిలములు దేశాభిమాన మొదవేటిరున పాడాలని వీరివాంఛితం. అదే యిది.

"ఆకులందున అణగి మణగీ
కవితకోకిల పలుకవలెనోయి
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి!" అని

తమ ముత్యాలసరాల తేటతెనుగుమాటలతో క్రొత్తపాతల మేళనగావించి నవ్యకళ లొప్పేటీరున వ్రాస్తామని చెప్పారు. అదే ఇది.

"గుత్తు నాముత్యాలసరములు
కూర్చుకొని తేనైనమాటల
క్రొత్తపాతలమేలుకలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా" అని.

ముత్యాలసరాలకు లక్షణాలు పట్టి చప్పరించిన సనాతనపండితుల నిలా అన్నారు.

"మెచ్చనంటావీవు; నీవిక
మెచ్చకుంటే మించిపోయెను
కొయ్యబొమ్మలె మెచ్చుకళ్లకు
కోమలులసొరెక్కునా?" అని చక్కని వుపమానంతో ఎత్తి

కుడవైచారు.

మొత్తంమీద తనకావ్యాలమీద నీసుచూపే పండితులపై విసువుచెందారు. "లోక మందలి మంచిచెడ్డలు లోకులెరుగుదురా" యని లోకం గుడ్డిది అన్నలోకోక్తిని జ్ఞప్తికి తెచ్చారు.

ముత్యాలసరాలను ప్రభాతంలో ప్రారంభంచేసారు. దానిభావం ఉదయంలా తమ కావ్యం అనంతప్రభలతో క్రమాభివృద్ధి చెందాలని, మరియు తనకవిత్వం విశ్వనాట్య రంగాని కొకసుప్రభాతమని. అదే ఈక్రిందిపద్యంలో స్పష్టపరిచారు.

"వెలుగునీటను గ్రుంకె చుక్కలు;
చదల చీకటి కదలబారెను;
యెక్కడనొ వొక చెట్టుమాటున
నొక్కకోకిల పలుకసాగెను." అని తర్వాత తాను చెప్పబోయే

"ఆకులందున అణగి మణగి కవితకోకిల పలుకవలెనోయీ" అనుదానికి తార్కాణంగా తానే ఒక కోకిలరై పాడ సాగారు.

## 1. ము త్యా ల స ర ము లు.

మొదటి ముత్యాలసరములలో తాను పట్నం పోవడం, సంఘసంస్కరణులతో నుండడం, తిరిగి ఇల్లు చేరడం, వేకువనే ప్రేయసిని లేపడం, ఆకాశాన ఉల్కాపాతం జర

గడం, బుద్ధిమాలినవాళ్లంతా కీడుగా భావించడం, తాను మాత్రం సంఘసంస్కరణప్రయాణంకు పతాకగా తలంచడం, తన ప్రియుతానిట్లంటం, ఏమన, పెద్దవారి పలుకులమహిమతో జాతివిభేదశృంఖలాలు విరిపోతాయి చూడు, మరి సంపదలు వృద్ధిపొందుతాయి ఎల్ల లోకాలు ఒక్కఇల్లుగా వర్ణభేదాలు లేక మతాలన్నీ సమసిపోయి జ్ఞానమొక్కటే నిలుస్తుంది. సంపదలకి కొదువుండదు అని, మరి మొన్న పట్నంలో మానవుడు చేరాల్సినస్థానం 'ఇదే అని అన్నికులాల నైక్యం చేసి ఒకవిందుచేశారు. నీవు వినలేదూ? అంత నాతనిప్రియురాలు కనుల నీరుకారుస్తూ మీచేష్టలు తెలిసినయి, కంటికి కూరుకేనా పట్టడం లేదు ఇదేమన్నా గొప్పనుకున్నారా అనంది. అంత నత డామెతో సరసమాడ మొదలిడేడు. తిరిగి ఆయువతి కలిసి తిరిగినంతలో ఐకమత్యం అంటూవచ్చేదికాదు. ఎవ్వతెనేనా మాలదాన్ని చూసి ముడిపెట్టుకోండని సరులతో కొట్టి వెళ్లిపోయింది. ఇది ఇందలి విషయం.

ఇందు ఎల్లలోకాలు ఏకం కావడం మతాలైక్యం జెందడం జ్ఞానం స్థిరతపొందడమనేది కవిచికీర్షితము. అయినా ఇందు చక్కనిసతీపతులసన్నివేశాన్ని గూర్చి లోకంపురీతుకు చాల దాపుగా బహుచతురంగా నడపినారు. నేటిసంస్కరణాభిలాషకు ఇట్టివి నిత్యమూ అనుభూతములే కదా!

## 2. కా సు లు.

ఈకాసులు అనేదానిలో కవికుమారుడు తన ప్రియురాలితో ప్రేమ అనేది కొలుకుకు తినేది కాదని సహజనిర్మలత్వాన్ని ఆశ్రయించి ఉంటుందనీ, అంతే కాక, "ప్రేమ పెంచక పెరుగదని" సతులకు పతులప్రేమలే భూషలనీ, ప్రేమలేని జీవనమే గుడ్డిదనీ

"యెటులనంటివా? తాల్చితదె నా
కంట చూడుము? సతులసారసు
కమలవనముకు సతులప్రేమయె
వేవెలుగుప్రేమ కలుగక బ్రతుకు
చీకటి." అని

మరిన్నీ ప్రేమ సుఖానికి రాజమార్గమని "ప్రేమ యిచ్చిన ప్రేమవచ్చును." "ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" అని సతికి పతియే దైవమనేది పాతమాటని సతికి ప్రాణమిత్రుడుగా పతి ఉండాలనీ కాసువీసము యివ్వనొల్లక కవితాసరాన్ని ప్రియురాలికంఠములో వైచాడు.

ముత్యాలసరముల విమర్శనము.

ఎంత చదివినా అర్థంగాని ప్రేమసూత్రరహస్యాన్ని బహుసూక్ష్మంగా అతిచిత్రంగానూ యీకాసులూ అనేచిన్ని కావ్యములో ఇమిడ్చిచెప్పారు. "ప్రేమవిద్దెకు ఓనమాలివి" అని అన్నారు. నిజంగా ఈతర్వాత బయలువెడలిన ప్రేమకవిత భావకావ్యకర్తల కది ఓనమాలే అయిందనుకోవచ్చును.

3 లవణరాజుకథ.

లవణుడు కొలువు తీరి గారడీచూడ్డం ఒక వెల్లగుఱ్ఱము పుట్టడం అతను దానిమీద ప్రయాణము చేయడం అది అంతటా తిరిగి ఒక అడవిలో పడగా ఒకచెట్టుతీగవల్ల క్రింద వ్రాలడమూ, ప్రయాణబడలికవల్ల నిదురచెందడం, అప్పుడిలా కలగాంచడం. అదియొక సంధ్యాసమయము. ఆకటితో వున్నలవణరాజు కోమధురగీతం విన్పించింది. లవణు డావంక కెళ్లాడు. ఒకసుందరి కన్పడ్డది. ఆమెపై మనస్సు తగిలి ఆమెప్రేమాన్నాన్ని గోరి ఆరగించాడు. ఆమెను వివాహమాడి ఆమాలపల్లెలోనే ఉన్నాఁడు. ఇంతలో మామ మరణించాడు. మాలవాడను మడ్డితన మల్లుకుంది. లవణదంపతు లడవిని బట్టారు. సతీపతు లిద్దఱు చిలిలో సురికారు. తరువాత లవణుడు మేల్కొని తనస్వప్నసుందరికై విచారింప సాగాడు. ఇంతలో ఆస్వప్నసుందరి వచ్చింది. అందర్నీ అద్భుతాశ్చర్యాలు అలుముకొన్నై. లవణుడు ప్రియాపరిష్వంగములో ఒళ్లు మరిచాడు. ఇది ఇతివృత్తం. దీన్ని బహునిపుణంగా అద్భుత సన్నివేశాలతో నడపినారు.

బలము కలిగినవాళ్లు మలినవృత్తులని మాలల విడగొట్టారనీ మలినత్వమే మాలకానీ మనుష్యులు కాదనీ జాతిధర్మంగా పశువులు నరకినవారికి కులము లేకుంటం క్రౌర్యముతో మానవుల హింసించేవారికి కులము కలుగుట అన్యాయమని దేహమలినం కలిగినవాళ్లను మాలలని మలినహృదయులను అధికకులములవారండం అన్యాయమని చక్కగాఒక్క నిశ్చయము చేశారు. అవే యివి.

"మలినవృత్తులు మాలవారిని
కులము వేర్చిన బలియురొకదే
శమున కొందరి వెలికి ద్రోసిరి మలిన మే, మాల
కులము లేదట వొక్క వేటున
పసరముల హింసించువారికి,

కులము కలదట నరులవ్రే చెడి క్రూరకర్మలకును
మలినదేహుల మాలలనుచును
మలినచిత్తుల కధికకులముల
నెలవొసంగిన వర్ణధర్మమ

ధర్మధర్మంబె" అని యిట్లు అస్పృశ్యతానివారణోత్సాహులకు చక్కని ఉపపత్తుల నేర్చి చెప్పారు. అసలు ప్రతియొక విషయాన్ని తగు సన్ని వేశాలను గూర్చి రెండుపాత్రల ప్రవేశ పెట్టి సంభాషణా ప్రతిసంభాషణములతో ఒక్కొక్కడ తన్నుదా విమర్శించుకుంటూ కథలసాగించారు. ఇదే నాటకశైలంటారు. ఇట్టితీరున చెప్పడమనేది అందరికీ అంత సులభసాధ్యమైన పనిగాదు. ఇలా కవిత చెప్పినవాళ్లు ప్రాచీనుల్లో గూడా వేళ్లమీదనే లెక్కించ జాలకున్నారు.

## క న్య క.

కన్యక అనే చిన్ని కావ్యంలోని ఇతివృత్తం పడుచుప్రాయపు వైశ్యకన్యక పూజార్థమై దేవళానికి పోతూవుంటే ఆపట్నమేలే రాజు ఆమెమీద కన్నువైచాడు. నట్టవీథిని దుష్ట మంత్రులతో ఆమెను పట్టదలచాడు. కాని కన్యక నన్ను ముట్టవలదు. దేవకార్యం తరువాత రాచకార్యం అన్నారు మీరు మహారాజులు నేను వైశ్యకన్యకను ఎక్కడకు దాటి పోతానని నిపుణంగా పలికింది. తరువాత వైశ్యుడు రాజుతో మీరు బలిమిని పట్టాలా లేకుంటే ఈమె మీ యది కాదా! ఇప్పుడు దేవళానికి వీరభద్రపళ్లెరం పట్టబోతున్నాం తరువాత ధర్మసమ్మతమైతే వివాహమాడుదురుగా నన్నాడు. కాదు తాతకుతలచినదే పెళ్లని మేమూ దేవాలయానికొస్తాం. అక్కడ వివాహమాడ్తాం అన్నాడు రాజు. అట్లే వెళ్లారు. వైవాహికాగ్ని యెదుట భక్తిభావభరితయైన కన్యక తమ కులముసాములకు కాసువీసముతో తృప్తిబొందక బాహుబలమును బుద్ధిబలమును సంపాదించి మీయాలుబిడ్డలు కాపాడుకోండని ఉపదేశించింది. రాజును చూసి పట్ట సమర్థుడవైతే యిప్పుడు పట్టవయ్యా అని ఒక్కమాటున అగ్నిగుండాన వురికింది. ఇది.

ఈకథను తీసికొని చూచిన సుందరులన్నెల్ల తమ మొరటుకామానికి బలియిచ్చే రాజుల క్రౌర్యాన్ని, రాజులకున్నూ సామాన్యవైశ్యులకున్నూ వుండే అంతరువును బహు చాకచక్యంతో నిరూపించారు. అంతేకాక

"విద్య నేర్చినవాడు విప్రుడు
వీర్యముండినవాఁడు క్షత్రియుడు."

అని తమ మనోగతభావాన్ని వెలిపుచ్చాడు.

డా మ న్ - పి తి య స్.

ఈకథలో "మనుజులిద్దఱు మనవయొక్కటె మాన్యులీజగతిన్" అన్నది తేలువిష యము. డామన్ పితియస్ అను యీయిద్దరు ప్రాణస్నేహితులు. రాజుకు డామన్ మీద కోపం గలిగి తల దరుగ నాజ్ఞ యిచ్చాడు. డామన్ ఒకసారి పెళ్లాంబిడ్డలు చూసి వస్తానని కోరాడు. ఏమో నమ్మకమేమిటి జామీను కావాలన్నాడు రాజు. నేనని నిలబడ్డాడు పితి యస్. డామన్ వెళ్లాడు. వస్తానన్నగడువు సమీపించింది. డామన్ తనయింట్లో విందు చేసాడు. బంధుమిత్రులంతా వచ్చారు. డామన్ మెల్లగా యిలా అన్నాడు. నాకు చాలా కష్టకాలం వచ్చింది. నాకై మీలో ఒకరైన ప్రాణాలిస్తారా? అంతా చల్లచల్లగా సాగి పోయారు. ఇక్కడ పితియస్ ఒకవిందు చేసాడు మనస్సులో మిత్రుడు రాకుండా వుండా లనీ తానే మిత్రునికొఱకు ప్రాణాలిచ్చి చరితార్థుణ్ణి కావాలని వేయిదేవుళ్లని మొక్కు తున్నాడు. సంభాషణలో డామన్ రాకకూర్చి ప్రస్తావన వచ్చింది. పితియస్ భార్య అందు కొని యింకా వస్తాడని ధైర్యము లేదని భర్త తెలివిమాలినతనానికి అతనికొచ్చిన ఆపదకు వూరికే విచారింపసాగింది. పితియస్, రాకపోతే మాన్లే నేను సంతోషంతో ప్రాణాలిస్తా నంటున్నాడు. ఇంతలో డాగియున్న డామన్ ఎదుటికి వచ్చాడు. అంతా రాజుగారు మిమ్మల్ని విడిచారన్నారు. ఇంతలో రాజావచ్చి ఆమిత్రుల్ని చిరమైత్రితో నుండమన్నాడు. ఇది కథ.

దీనిలో రాజుల యవివేకాన్ని మిత్రత్వం యొక్కఫలితసారాన్ని సంపదలుగల్గినప్పుడు చుట్టూ మూగి కష్టమొస్తే కనునలుసులైపోయే లోకులస్వభావాన్ని భర్త అమాయకంగా ప్రాణమొడ్డినందులకు పితియస్ భార్య పడ్డబాధను బహు అందంగా కూర్చి వర్ణించారు. అంతియేకాక

"మ్రందుటన్నది బొంది మార్చుట
"ముందుభవమున కలుగువిభవము
"నందజేయుట కాదె, యేలిక!
దండమనుమిషను."

అని వైరాగ్యమును బోధించి లోకమునకు నిండుధైర్యాన్ని నిలుపనెంచారు.

## ఆడపిల్లలపాటలు.

కొండకోనలో ఒక కోవె లుంది. దానిలో ఒక పూజారి వున్నాడు. ఆయనకు ఒక కూతురు. ఆమెదుర్గభక్తి యపరిమితము. వయసువచ్చిన పూర్ణను కాసుకులోనై తండ్రి ముదుసలికిచ్చాడు. తర్వాత ఎంతో దుఃఖించింది పూర్ణ. కొంతకాలమైనాక తీసికెళ్ల వచ్చాడు పూర్ణమగడు. అందరిదగ్గర సెలవుతీసికొని అన్నదమ్ములకు దుర్గపూజ వదలకండని మీకన్నబిడ్డల కొక్కరికేనా నాదు పేరుంచండని దుర్గాలయాని కెళ్లింది పూర్ణ. దుర్గసన్నిధిని దేహత్యాగం చేసి దుర్గలో కలిసింది పూర్ణ. ఇది యిందలి గాథ.

మన కవీశ్వరుడు కన్యాశుల్కం వల్ల వచ్చే నష్టాన్ని అతినిపుణంగా యీచిన్నకథలో ఇమిడ్చి రాళ్లు కరిగేలా రచించారు కన్యాశుల్కమన్నది వారిరోజుల్లో అతి ముఖ్యమైన విషయము. అందులకే సంస్కారప్రియుడైన మనకవీశ్వరుడు కన్యాశుల్కమనే ఉద్గ్రంథాన్ని రచించాడు. బహుశః కన్యాశుల్కనాటకప్రేరణకు ఇదియే తొల్లింటిరచనయై యుండాలి. వీరికావ్యాల్ని బట్టిచూస్తే వీరిసంఘసంస్కరణవిషయాల్లోకల్లా మిక్కిలి యభిమానమైనటువంటిది కన్యాశుల్కాన్ని రూపుమాపటమనే తోస్తుంది.

## దేశభక్తి.

ఆంగ్లవ్యామోహంలో చిక్కుకొన్న భారతీయులు వెనుక దిరిగినవెనుక మొలకయెత్తిన భారతస్వాతంత్ర్యోద్యమదినములవి. మన అప్పారాయకవి సమయమునకు దగిన ప్రబోధమును చక్కగాజేసారు. కేవలప్రబోధరూపమగుట ఆయనదేశభక్తిభావం యీగీతమును మహాచక్కగా పాడించింది. అణగియున్న ఆయనప్రేమభావం దేశభక్తి, కార్యకారిత్వం శాంతము మొదలగు ఆర్యజాతికి సహజములగు గుణాలు తొలకరిమొలకలవలె వొక్కసారి యీభావగీతంతో పైకుబికినయి. దానికంతకు ఆయనదేశాభిమానమే కారణము. డాంబికవేషాలు వేసుకొని నిత్యం మనకండ్లకు కన్పడే ఛోటానాయకుల నప్పుడే యాయన చూసారు. అందులకే యిలా అన్నారు.

"దేశాభిమానం నాకు కద్దని
వొట్టిగొప్పలు చెప్పుకోకోయి,
పూని యేదైనాను వొకమేల్
కూర్చి జనులకు చూపవోయి!" అని

ముత్యాలసరముల విమర్శనము.

మొత్తంమీద నే వ్రాసేకన్న ప్రతితెలుగువాడును అంతేకాక ప్రతిభారతీయుడు సైతము అనువాదం చేసుకొని మరీ పాడాలి. ఒక్క చదవడంతో ఫాయిదా లేదు. దాన్ని సంపూర్ణంగా ఆచరణలో పెట్టాలి. అందులకే తనకవితాఫలాన్ని కూడా ఇలా ఆకాంక్షించారు.

"ఆకులందున అణగిమణగీ
కవితకోవిల పలకవలనోయి
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలెనోయి!
దేశమనెయెడి దొడ్డవృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి,
నరులచమటను తడసి మూలం,
ధనంపంటలు పండవలెనోయి!"

ఇంతా జరిగితేనేకాని ఆయనహృదయం స్వస్థతచెందేటట్లు అగుపడడంలేదు.

## లంగరెత్తుము.

ఈలంగరెత్తుము అనేకావ్యంతో చివరకు తనజీవితాన్ని సింహావలోకనము చేస్తూ గడచిపోయిన పాతగాథలను స్ఫురణకు దెచ్చుకుంటూ తన్నుచుట్టిన దాస్యశృంఖలాల్ని తెంచి వెలికి రాజాలని జన్మము నిరర్థకమని దేశంకొఱకు యుద్ధం చేయమని లంగరెత్తించారు. ఇది యిందలిభావము.

## దించులంగరు.

ఈదించులంగరనేదాన్ని కడచినజర్మనీయుద్ధసమయంలో వ్రాసారు. ధర్మానికి జయం కలుగనుంది. ఇక శాంతివృక్షం వెలుస్తుంది. పాతసంధులు మానివేసి లోకమంతా యుద్ధాన్ని మాపుచేయాలన్నకోర్కెతో దించులంగరని లంగరు దింపించారు.

## మనిషి.

మనిషి అన్న ఈచిన్న కావ్యంలో జీవంలేనిరాళ్లను స్వాములుగా మ్రొక్కుతా వెందుకు? తోడిమనుష్యులన్న రాయిరప్పలకన్న నికృష్టంగా చూస్తావేమని దేవుడెక్కడో కొండల్లో కోవెల్లో వున్నాడని దేవులాడతావే కాని నీవు నిజంగా కళ్లుతెరచి చూస్తే

మనుష్యమాత్రుడిలో లేడా? మానవసేవ దైవసేవ కాదా! అని తెలివిమాలిన వెఱ్ఱి లోకాన్ని గూర్చి చక్కటి ప్రశ్న వేసారు. మానవసేవనుమించిన దైవసేవ లేదని ఆయన భావం దీనివల్ల స్పష్టపడుతూనే వుంది.

## కో రు కొం డ.

విజయనగరసంస్థానాధీశులైన శ్రీపూసపాటి విజయరామగజపతీంద్రుల కోరుకొండ రాజభవనప్రవేశోత్సవములో ఈకోరుకొండ అనేపాటను శ్రీఅప్పారావుపంతులువారు పాడారు. చివరతమ్ముగూర్చి యిలా చెప్పుకొని ముగించారు.

" మాటమర్మమెరిగినట్టి మేటికవులజాడలరసి బోటి,
అప్పకవి యమర్చె మాటలముత్యాలపేట" అని

నిజమాలోచిస్తే యెంతో లోకానుభవము లేనిది పూర్వకవులపోకడలు తెలియందీ యీవింతఫక్కీని వీనులవిందుగ ముత్యాలసరాలు రచించడమన్నది చాల కష్టసాధ్యమైన విషయము. అందువల్ల వారిలా చెప్పుకొన్నారంటే యిందులో అతిశయోక్తి యేముంది?

అంతే కాకుండా ముత్యాలసరాలప్రచారము మనమెఱుగంది కాదు. వీరుచేసిన రాచబాటను యీతరువాత నడచిన నవ్యకవు లనేకులున్నారు. వసుచరిత్రముకు పిల్లవసు చరిత్రలవలె అప్పరాయముత్యాలసరాలకు చిట్టిముత్యాలసరాలు, చిఱుతముత్యాలసరాలు చిన్నిముత్యాలసరాలు ఎన్నెన్నో వున్నయి. వసుచరిత్రప్రబంధరచనకు పరిశుభ్ర మగురాజ మార్గంవుంది. ముత్యాలసరాలకు అట్టిదేమియు లేదు. అప్పరాయకవి తనప్రతిభామహత్త్వం వల్ల సృష్టించినదే. అందులో ఈముత్యాలసరాలు ఇంతవిరివిగా ప్రచారం చెందడానికి ఆయనచేతిచలువే అనాలి. ఆధునికనవ్యకవులలో కావ్యాలలో అప్పరాయనికి తద్విరచిత ముత్యాలసరాలకు మహోన్నతస్థానం ఉండగలదు. ఉండి తీరుతుంది.



# ధూర్జటిమహాకవి

శ్రీ బులుసు వేంకటేశ్వర్లుగారు, బి. ఏ., కాకినాడ.

ఆంధ్రసారస్వతరంగమున భక్తాగ్రేసరు లగుకవిపండితులకుఁ దలమానికమై, తన కావ్యకన్యను మనుజేశ్వరాధముల కీయనోపక, శ్రీహరి కిచ్చి తననిరంకుశత్వముతోఁబాటు పరమేశ్వరునిపైఁ గలపరిపూర్ణవిశ్వాసమును బ్రదర్శించిన పరమపావనజీవుఁడు పోతనకవీంద్రుఁడు. ఈతని హరిభక్తి యద్వితీయము. భగవంతునిపై సమస్తభారమును వైచి, హాలిక జీవనమే గడపుచు, రాజాశ్రయమున ధనార్జనేకాక తృణమైనను గ్రహింప నిచ్చగింపక, మహోత్కృష్టజీవనము ననుభవముచేఁ జూపి ప్రపంచమున కాదర్శపురుషుఁడైనాఁడు పోతన కవియోగి. ఆతనితరువాత అట్టి వ్రతాచారపరాయణునిగాని, యట్టి నిరంకుశజీవననిరతుని గాని మనసారస్వతప్రపంచమునఁ గానలేము; కాని తత్తుల్యుఁ డనఁదగి పండితుఁడై, పండితుఁడేకాక కవియై, కవిమాత్రుఁడేకాక భక్తుఁడై, భక్తుఁడేకాక జ్ఞానియై, జ్ఞానియేకాక విరాగియై, సర్వజ్ఞుఁడునై, తనకావ్యకన్య నీశ్వరునకుఁ దక్కొ్కరుల కొసంగక

"నీకుంగాని కవిత్వ మెవ్వరికి నే నీనంచు మీఁదెత్తితిన్
జేకొంటిన్ బిరుదంబు కంకణము ముంజేఁ గట్టితిన్ బట్టితిన్
లోకుల్ మెచ్చ వ్రతంబు......".

అని దివ్యనిశ్చయనినాద మొనరించిన యీశ్వరభక్తుఁడు ధూర్జటి. తాము జ్ఞానోదయ మంది దానిమూలమున తరించి యితరులఁగూడ తరింపఁజేయఁగలజ్ఞానులు మొదటితరగతి వారు. తామొక్కరు మాత్రమే తరించి యితరులఁ దరియింపఁజేయఁజాలక ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుచు నేపక్షివ్రాలినను మునిఁగిపోవు చిన్నకఱ్ఱవంటివారు రెండవతరగతివారు. ధూర్జటి జ్ఞానియై లోకమునకు జ్ఞానభిక్ష పెట్టిన మొదటితరగతిలోనివాఁడు.

ధూర్జటి భరద్వాజగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, బాంధవస్తోత్రపాత్రుఁడు, పాకనాటార్వేలవంశప్రసిద్ధుఁడు. కుమారధూర్జటి కృష్ణదేవరాయలవిజయముఁబట్టియు లింగ రాజకవి పెదకాళహస్తిమాహాత్మ్యమునుబట్టియు, ధూర్జటి పదునాఱవశతాబ్దమునఁ గృష్ణ దేవరాయలయాస్థానమువాఁడనియు, నష్టదిగ్గజములలో నొకఁడనియుఁ దెలియుచున్నది.

ధూర్జటి రచించినగ్రంథములు శ్రీకాళహస్తిమాహాత్మ్యము, శ్రీకాళహస్తీశ్వరశత కమును. అందు శ్రీకాళహస్తిమాహాత్మ్యమునకు "ఈశ్వరుఁడుకాదా మత్ప్రబంధాధిపత్యా

గణ్యార్ష్ణుఁడు, వేఱొకండు గలఁడే" యని యా 'శుభకావ్యరత్నమున కీశు నధీశునిఁ' జేసి నాఁడు. ధూర్జటికవీంద్రుఁడు తెలుఁగురాయలయాస్థానమున, గాంచినవిశిష్టస్థాన మీక్రింది పద్యముఁ బట్టి తెలియనగును.

"శ్రీకాళహస్తి గౌరీనాథపదపద్మసద్భక్తియుక్తి నిశ్చలతఁ గాంచి
సారసుధాసారసరసోక్తిగుంభనఁ గాళహస్తిమహాత్మ్యకథ నొనర్చి
కృష్ణరాయకిరీటకీలితమణిగణార్చితపదాబ్జద్వయశ్రీ వహించి
యాసేతుకాశీతటావనీవిఖ్యాతసత్కీర్తి విస్ఫూర్తిఁ జాల వెలసి
ధరణిఁ జెలువొందె నేకవీశ్వరవతంస, రత్నమమ్మహాసీయ ధూర్జటిసుధీంద్రుఁ
డలఁతు జలనిధివీచికాకలకలాను,కారి భూరికవిత్త్వవాక్పటిమ గులుక."

(లింగరాజకవి, కాళహస్తిమాహాత్మ్యము.)

ధూర్జటికవిపౌత్రుఁడు వేంకటార్యుఁ డనఁబరఁగు కుమారధూర్జటి. కాని యితఁ డెట్టిపౌత్రుఁడో తెలియదు. 'ధూర్జటిపౌత్రుఁ' డని యొకచోట, 'పెదతాత' యని యొక చోట నుండుటచే సంశయాస్పదమైనది. రత్నావళీపరిణయకర్తయు నతనివంశస్థుఁడుగనే తోఁచుచున్నాడు. కాని ధూర్జటిపుత్రునిగుఱించిమాత్ర మేమియుఁ దెలియదు. ధూర్జటి మాత్రము సింగమరమాజక్కయ తనూభవుఁడ నని తనకాళహస్తిమాహాత్మ్యమునఁ జెప్పుకొన్నాఁడు. దీనిఁబట్టి యీతనివంశవృక్ష మిట్లుగా గ్రహింపవచ్చును.




ఈవంశవృక్షమునుబట్టి ధూర్జటికి స్త్రీసంతానమును గలదనియు, ధూర్జటిపుత్రిని చెఱుకుమూడి వేంకన కిచ్చినాఁడనియు నామె పుత్రుఁడే శృంగారరాఘవము, వామదేవ

చరిత్రము మున్నగు గ్రంథముల వ్రాసెననియు, నాతనిగ్రంథములమూలముననే దెలియు చున్నది. ఏదియెట్లున్నను ధూర్జటివంశమువారు కవిపండితులు. ధూర్జటినిగుఱించి వేంకట రాయకవి తనకావ్యమున నిట్లు ప్రస్తుతించినాఁడు.

"పటుగంగాలహరీతరంగపటుశుంభత్ప్రౌఢతాంచత్కళా
ఘటనుఁ జాదవినమ్రకృష్ణనరరాడ్గంభీరకోటీర వి
స్ఫుటరత్నద్యుతిపాటలీకృతపదాంభోజాతు సర్వజ్ఞు ధూ
ర్జటినిం గొల్చెద నస్మదీయకులకర్తన్ భక్తి రంజిల్లఁగన్."*

అందుచే ధూర్జటి సర్వజ్ఞుఁడై, శివభక్తాగ్రేసరుఁడై కృష్ణరాయలవంటి పుడమిఱేఁడున్న యుగమునఁగూడ తనకావ్యమును ఈశ్వరాంకితముచేసి యమరత్వమునందిన పరమ యోగీంద్రుఁడు. ఈతని కాళహస్తిమాహాత్మ్యము, పాండురంగమాహాత్మ్యము, శివ రాత్రిమాహాత్మ్యము మొదలగువానిఁ దలదన్ని వన్నె కెక్కినదానిగా నెన్నవచ్చును. ఆగ్రంథవిమర్శన మటుంచి ప్రస్తుత మాతనిపై బయలువెడలిన కొన్నిదుర్విమర్శముల నిట ఖండింపవలసియున్నది.

ధూర్జటికవీంద్రుని జారునిగా నెంచినవారిలో కవిచరిత్రకర్త కీ॥ శే॥ కందుకూరి వీరేశలింగముపంతులుగారొకరు. ఈయన యభిప్రాయమున కాధార మీక్రిందిపద్యము

"స్తుతమతియైనయాంధ్రకవి ధూర్జటిపల్కులకేల గల్గెనో
యతులితమాధురీ (చాతురీ) మహిమ... (హా తెలిసెన్ భువనైకమోహనో
ద్ధతసుకుమారవారవనితాజనతాఘనతాపహారిసం
తతమధురాధరోదితసుధారసధారలు గ్రోలుటం జుమీ.")

దీనిపై వారిభావ మిది:—"పైపద్యముఁబట్టి చూడఁగా ధూర్జటికవి సంతతవేశ్యా ప్రియుఁడయిన రసికపురుషుఁడైనట్టు కన్పట్టుచున్నాఁడు. అట్టి యఖండశివపూజాధురంధరుఁ డైన భక్తాగ్రేసరు నిట్టి జారత్వదోష మేల విడువకుండెనో యూహింపఁజాలకున్నాము. మన దేశముయొక్క దౌర్భాగ్యముచేతఁ జిరకాలమునుండి యిచ్చట విశుద్ధచరిత్రము మతము నుండి విడిపోయినది." (కం. వీ. కవులచరిత్రము.) ఈవిమర్శకుఁ దగినసమాధానము శ్రీ వంగూరు సుబ్బారావుగారు తమశతకకవులచరిత్రమున నిచ్చియున్నారు. కృష్ణదేవరాయలన్న మొదటిరెండుచరణములను కుమారధూర్జటి నుద్దేశించి యనెననియు, "హా తెలిసెన్"

* వేంకటరాయకవి అమరకావ్యము.

మొదలగునది ధూర్జటియన్న గిట్టనిధూర్తులదే యనుటయు సమంజసము. కృష్ణరాజవిజయమున నిట్లు కలదు.

"మాధురీమహిమ నామును మీపెదతాత చాల సన్నుతిఁ గనెఁ గృష్ణరాయల మనోజ్ఞసభ న్వీను మీవు నట్ల మత్కృతబహుమానవైఖరులఁ గీర్తివహింపుము ధాత్రిలోఁ పలన్." కనుక, నింతమాత్రమున ధూర్జటి జారుఁడనుట సహింపరానిది

ఈవిషయముననే శ్రీశేషాద్రిరమణకవులును శ్రీకాళహస్తీశ్వరశతకమునకుఁ టీక వ్రాయుచు కాళహస్తీశ్వరశతకమే ధూర్జటిజారత్వమునకు నిదర్శనమని వాక్రుచ్చిరి. ఇది యసంగతము నసంబద్ధమును. వీరి కాధారము "కాయల్ గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్ రాయన్ రాపడె ఱొమ్ము" "అమరస్త్రీలరమించినన్ జెడదు మోహాంబింతయున్" మొదలగుపద్యములట. ఇందు కవివర్ణించునది స్వానుభవమే కానక్కఱలేదనియుఁ దనతోడి సోదరజీవులదురవస్థఁ గనియుఁ దదవస్థలు పద్యముల వెల్లడింపవచ్చుననియు వీరికిఁ దెలియదు. పైఁగా, వధూనఖాగ్రములన జారకామినులన్న యర్థములేదే? స్వస్త్రీసంభోగము దోషముకాదే! కనుక ధూర్జటివంటి భక్తాగ్రేసరునికి జారత్వదోషమున్న కృష్ణరాయలు సహించునా? అష్టదిగ్గజములలో నగ్రేసరుఁడై, "కృష్ణరాయకిరీటకీలితమణిగణాశ్చితపదాబ్జశ్రీ" వహింపఁగలఁడా? కాన, ధూర్జటి ముక్తికామినీలోలుఁడేకాని, వారకామినీరతుఁడు కానేరఁడు, కాఁడు.

శ్రీవం.గూరు సుబ్బారావుగారు ధూర్జటి కాళహస్తీశ్వరశతకమున భారతపద్యములను, శివానందలహరి ననుకరించినాఁడని వ్రాసినారు. ఇది ఆధారరహితము. ఏలన; వారు చూపిన:—

"మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనితెచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించిరి,"

అనుపద్యమునకును, కాళహస్తీశ్వరశతకమందలి

"మదమాతంగము లందలంబులు హరుల్మాణిక్యముల్ పల్లకుల్
ముదితల్ చిత్రదుకూలముల్ పరిమళంబుల్ మోక్షమీఁజాలునే"

యనుపద్యమునకు నెందును అనుకరణము కానవచ్చుటలేదు. పైఁగా ధూర్జటివంటిమహాకవి యీశ్వరతాదాత్మ్యమునొంది గంగాప్రవాహవేగమున రచించినపద్యముల నొకరి ననుకరింపవలసినయవస్థ యేమున్నది?

ఇఁక ధూర్జటి కృష్ణదేవరాయలనడుమఁగల సంబంధముఁగూర్చి కొందఱికపోహ కలదు. అందు ధూర్జటి కృష్ణదేవరాయలచే ననాదరింపఁబడి యభావవిరక్తినంది కాళహస్తీశ్వరశతకమున రాజుల నిందించినాఁడనియు నందుచేతనే యాతనికిఁ దనకృతుల నర్పింప లేదనియు ననువారున్నారు. "ధూర్జటి శైవుఁ డగుట కృష్ణరాయలు సంపూర్ణదయ చూపలే" దని కొందఱు వాక్రుచ్చిరి. *ఇట్టి విమర్శము లాధారరహితములే కాక మహాకవి ధూర్జటికి మహారాజగు శ్రీకృష్ణదేవరాయలకు నీలాపనింద లొనగూర్చుచున్నవి. కుమారధూర్జటియు, లింగరాజకవియు శ్రీకృష్ణరాయలు ధూర్జటికిఁజేసిన గౌరవాదరాభిమానములఁ గీర్తింప నిట్టి విమర్శములకు స్థానమేలేదు. అట్టి వ్యతిరేకభావమేయున్న ధూర్జటి క్షణమైన యాస్థానమున నుండునా? అష్టదిగ్గజములలో నొకఁడగునా? కృష్ణరాయలు మతాంతరసహనమునకుఁ బేరెన్నికగన్నవాఁడు. కనుక నిట్టివిమర్శన లాధారరహితములు. ఇఁక ధూర్జటి రాజుల నిందించుటకుఁ గారణ మాదినములలో రాజాస్థానముల జరగుదారుణములు, నుత్తములు పీడింపఁబడుటయుఁ గాంచియుండుటే.

ధూర్జటి కాళహస్తీశ్వరశతక మాంధ్రసారస్వతమున గొప్పస్థాన మాక్రమించినది. ప్రాచీనకవులు సైతము కాళహస్తీశ్వరశతకమునకు వాఙ్మయమున నున్నతస్థాన మిచ్చిరనుట కుదాహరణముగా మెచ్చు కస్తూరిరంగకవి తనయానందరంగరాట్ఛందోగ్రంథమున "నీకుంగాని కవిత్వ మెవ్వరికి నే నీ నంచు మీఁదెత్తితిన్" అనుపద్యమును నభేదయతి కుదాహరించియున్నాఁడు.† ధూర్జటి కాళహస్తిమాహాత్మ్యమును రచింపకపోయినను వాఙ్మయమునకు లోటులేదు; కాని కాళహస్తీశ్వరశతకము లేనిచో గొప్పలోటే యగును. అడ్డెతిమ్మకవి కుక్కుటేశ్వరశతకమును. ‡ దీనినిగుఱించి కీ. శే. శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగా రిట్లు వ్రాసియున్నారు. "రసానుభవము కావ్యమునకుఁ బ్రయోజనము. నవరసములందును శృంగారకరుణరసములు ప్రధానములు. శృంగారకరుణారసములు కామపరమైనపుడు బంధమునకు, దైవపరములైనపుడు మోక్షమునకు మూలము లగుచున్నవి. శృంగారకరుణామూర్తి యగుభగవంతుని శృంగారకరుణాలీలావిలాసము లనంతములు. అనంతమైన శృంగారకరుణావిలాసముల యానందానుభవమున కనన్యమైనభక్తి సాధనముగనున్నది. అనన్యమైన భక్తిపారవశ్యానందమును వర్ణించుటకు శతకములే యోగ్యములు.

---

* శతకకవులచరిత్రము పుట ౧౧౭.

† ఆనందరంగరాట్ఛందము 3, 275.

‡ శతకకవులచరిత్రము పుట xii. శతకపరిశీలనము.

అందుఁ గాళహస్తీశ్వరశతక మొకటి." మఱియు నిందు ధూర్జటి భక్తకవిపండితజ్ఞాన వైరాగ్యముల నొక్కఁడై తనస్వానుభవభక్తి ముక్తిమార్గముల సందర్భోచితముగా, మహానుభవపూర్వకముగాచేసి వాక్రుచ్చియున్నాఁడు. వివిధవ్యవస్థలలో వివిధవిషయ లోలురగు విశ్వజనావని సకలపరిస్థితుల కనుగుణముగా నిందలిపద్యము లున్నవి. మానవ మానసముల వివిధకాలముల, వివిధవిషయములపై జనించు సమస్తసమస్యలకుఁ జక్కనిపరి ష్కారపద్ధతు లీశతకమునఁ గలవు. అందుచేఁ గాళహస్తీశ్వరశతకము పరమపవిత్రము, భక్తి జ్ఞానవైరాగ్యసంబోధకము, ముక్తికన్యాప్రదాత్రియు ననక తప్పదు. ఈకాళహస్తీశ్వరశత కము ధూర్జటిచేతలో శతకము పరిపూర్ణస్థితికి వచ్చినదని నిరూపించుటకేగాక సమస్తవేదో పనిషత్సార మిందు తేటతెలుఁగుమాటలలోఁ దేనెచినుకులుగాఁ జిల్కఁబడినదనుట కనేక నిదర్శనము లిందుఁగలవు. అందుచే నిది ఆంధ్రవాఙ్మయమున కాయువుపట్టు, నాధ్యాత్మిక జీవనమున కాదర్శప్రాయము నని చెప్పకతప్పదు.

ధూర్జటిమహాకవి రచించిన కాళహస్తిమాహాత్మ్యము పైనిపేర్కొన్నవిధమున నాంధ్ర సారస్వతమునఁగల మాహాత్మ్యములకెల్ల మహోన్నతస్థాన మాక్రమించుననుటఅతిశయోక్తి కాదు. ఈగ్రంథము నవరసాలంకారకవితామహాకావ్యము. ఇందు ధూర్జటి పరమభక్తుఁడుగా, రాజయోగిగా, సరస్వతీప్రసన్నుఁడుగాఁ గానవచ్చును. ఈమాహాత్మ్యమందలి శివభక్తా గ్రేసరు లీతని కాదర్శప్రాయు లగుట వారివల్లఁ దాఁబొందిన భక్త్యుత్సాహములకుఁ గృత జ్ఞతాపూర్వకముగా వారిని తనకాళహస్తీశ్వరశతకమునఁ గీర్తించియున్నాఁడు. అందుచే ధూర్జటిగ్రంథములు అవినాభావసంబంధముగలవి. కాళహస్తిమాహాత్మ్యమునందలి కథా క్రమము తెలిసిననేకాని శతకమందలి కథాసందర్భము లర్థముకావు. ఈరెండుగ్రంథములు శివునిమాహాత్మ్యము నుగ్గడించుటేకాక కవితాసౌష్ఠవముననేమి, పాండిత్యప్రకర్షచేనేమి, భావగాంభీర్యౌన్నత్యముచేనేమి ఆంధ్రభాషాయోషామణికమూల్యరత్నహారములే. ఈ రత్నహారద్యుతి యవిరళము, నదృష్టశ్రుతపూర్వమును. ఇట్టి యమూల్యరత్నహారముల మన భాషామతల్లి కొసఁగిన ధూర్జటిమహాకవియోగి కాంధ్రు లాజన్మము ఋణపడి యున్నారు. ఏతద్గ్రంథపఠనపారాయణాదికముచే నిసుమంతైన లబ్ధినందఁజాలనిచో మన జీవితము వ్యర్థము.

## మా తెలుఁగు బాస

శ్రీమతి చెరుకూరి కమల, మునిసిపల్ హైస్కూలు, కడప.

సీ. తపియించినది కొన్ని తరము లేకాకియై దండకారణ్యమధ్యంబునందు
గడియించినది వేల్పుగనుడికారపుం జెల్మి శబ్దశాసనుసమక్షంబునందు
విహరించినది భూరివిబుధానుమతినొంది వివిధభావాంబరవీథులందు
క్రీడించినది భక్తితోడఁ గ్రొంజెలువంది సతతమందాకినీఝరమునందు
తే. ఆనినది నవ్యదివ్యకావ్యామృతంబు, ముదముతోఁ గృష్ణదేవుసమ్ముఖమునందు
చెన్నుగన్నది వాఙ్మయశ్రేణియందు, అతులవిభవైకమంజూష యాంధ్రభాష.

సీ. పాలబుగ్గల పిన్నప్రాయమందునఁ దల్లి పుణికి తేనియ నుగ్గుపోసెనేమొ!
కలికిపల్కుల నేర్పుకాలమందున ధాత్రి కోదమకోయిల జోడు గూర్చెనేమొ!
మనసారఁ జెలులాడుకొనువేళ నెచ్చెలుల్ కమ్మపుప్పొడి మేనఁ గ్రమ్మిరేమొ?
ఎలమేని సోయగం బలరఁ జేటికలెల్ల చిన్నిజాజులపాన్పు చేసిరేమొ?
తే. తనగుణంబుల మధురమోహన మనోజ్ఞ, సురభిళాత్యంతమార్దవస్ఫురణ మెఱసి
సాహితీజీవములకు నిశ్చలతఁ గూర్చు, దేశభాషలరాణి మా తెలుఁగు రాణి. ౨

తే. కండచక్కెరకన్న దుగ్ధములకన్న, తియ్యమామిడికన్నను తేనెకన్న
మధురమధురానుభవమును మదికిఁ దార్చు, మంత్రదేవత మముఁగన్న మాతృభాష.

సీ. చంపకోత్పలసారసౌరభం బొకనాఁడు రారాజుగద్దెపై రాజ్యమేలె
తేటకందపుఁ గమ్మతేనియ లొకనాఁడు నెల్లూరువీథుల వెల్లివిరిసె
సీసముల్ ముత్తెంపురాసులై యొకనాఁడు పట్టాభిషేకసౌభాగ్య మెసఁగె
స్వాదుమోహనగానసస్యంబు లొకనాఁడు త్యాగభూముల విఱ్ఱవీగి పండె
తే. కరుణ తొలుకాడఁ దనయులవరయు జాడ
నేగి యందందు నీవు కాలిడినవేళ
నీప్రభావంబు మాకు వర్ణింపఁదరమె
కన్నతల్లి! నిజాశ్రితకల్పవల్లి!
తెల్గుతల్లి! నిజాశ్రితదివ్యవల్లి! ౪
ఆ. స్వీయరాజ్యవిపులసింహాసనంబున, దేశమాత కొలువు తీర్చియుండ
అమృతమూర్తి యగుచు నఖిలేశ యగుఁగాత, తేనెలొలుకు తేట తెనుఁగుపలుకు.
తే. ఇట్టి మా తెల్గుతల్లి నీపట్టు చేరి, సతతసంపోషణక్రియాసరణి మీఱి
కడుముదంబునఁ జెలువొందుఁ గళలఁ దేఱి, శ్రీత్రిలింగాఖ్యసత్కీర్తి నో త్రిలింగ.



# శ్రీమహామండలేశ్వర పూసపాటి—తమ్మభూపాలుఁడు

శ్రీ గంటి సూర్యనారాయణశాస్త్రిగారు, కార్యదర్శి, ఆంధ్రవిజ్ఞానసమితి, విజయనగరము.

[శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ఆంధ్రికి చేయుచున్న సారస్వతకృషిని యుగ్గడించి వ్రాయవలెనన్న నొకగ్రంథరాజమగును. "ఆంధ్రదేశమునకు, ఆంధ్రులకు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు, 'త్రిలిఙ్గ' పత్రికారాజము, వాగర్థములు" అని సూత్రప్రాయముగ నాఅభిప్రాయమును వివరించుచున్నాను. త్రిలిఙ్గపత్రికారాజము షష్టిపూర్తిమహోత్సవమును పొందుగాక. వేంకటేశ్వరులను శ్రీతాతపాదులగు శ్రీరామస్వామి రక్షించుగాక.]

ఉ. బంధుగులున్, బుధోత్తములు, భవ్యచరిత్రులు, భూసురాగ్రణుల్
వందిజనుల్, కవుల్, సుభటవర్గములున్ గొనియాడ దేవతా
మందిరమున్ హసించు వరమందిరమందున నున్న మాన్యులన్
చందనశీతలంబగు వచఃప్రచయంబునఁ బ్రస్తుతించెదన్.

ఉ. చందనభూధరప్రభవచారుసమీరకుమారపుష్టమా
కందమరందతుందిలితకావ్యసుమాంచితదివ్యభారతీ
మందిరవాసులన్, సుగుణమండలమండితమండలేశులన్
డెందము కందళింప ధరణీశ్వరముఖ్యుల నుగ్గడించెదన్.

ఉ. నందనపారిజాతతరునవ్యమనోజ్ఞప్రసూనరాజిని
ష్యందమరందబిందునిచయంబులతో దులదూగు సత్కృతిన్
ఇందుకళార్ధశేఖరికి నింపుగనిచ్చిన తమ్మభూపనం
క్రందుని, మండలేశ్వరుని, రాజకవీంద్రుని యెన్న శక్యమే!

శ్రీకృష్ణవిజయప్రబంధగ్రంథకర్తయు, గోపాలభూపాలపుత్రుడును అగుయీతమ్మభూపాలుడు విశాఖపట్టణమండలమునకు కృష్ణానదీతీరమునుండి 1651 సంవత్సరప్రాంతమున ననగా, గోలుకొండవంశమును ఔరంగజేబుపాదుషా నిర్మూలము గావించుటకు 35 సం. పూర్వము వచ్చినట్లు తెలియుచున్నది. ఈతనికి మాధవవర్మయను నామాంతరము కలదు. ఈతమ్మభూపాలునిపూర్వులగు రాజచంద్రులు, కొలిపాక, పూసపాడు, బెజవాడ, నిడుదవోలు, కేతవరము, మొగలితుర్రు, మొదలగు పట్టణములయందు, దుర్గములను నిర్మించుకొని,

రాజ్యపాలనము జేయుచు ప్రబలులై యుండిరి. ఈరాజకవినిగూర్చి తనచే రచియింపబడిన శ్రీకృష్ణవిజయ ప్రబంధరాజమునను, ఈతనియనంతరము రెండుమూడుపురుషాంతరముల పిమ్మట నీకళింగవిజయనగరనరనాథుఁడగు శ్రీవేంకటపతిమహీపతిచే రచియింపబడిన "ఉషాభ్యుదయము" అను ప్రబంధమునను దెలియుచున్నది.

గీ. ఈసహోదరులెల్ల దయాసుధావ,లోకముల, బ్రత్యహంబు బహూకరింప
శ్రీమహాదేవికరుణావిశేషమహిమ, బ్రతిభ గాంచితి తమ్మభూపతిని నేను. (కృ)

ఉ. ఆతనిసోదరుండు, చతురాననధీకుశలుండు, నీతివి
ఖ్యాతుఁడు, తమ్మభూపతి యఖండపరాక్రమశక్తి వైరిభూ
నేతల గీటణంచి, ధరణీతలచక్రము కీర్తిచంద్రికా
ద్యోతచయంబుచే వెలుగ దోరముగా నొనరించె నెంతయున్. (ఉ)

సీ. దుర్ధరారాతిసందోహతమఃపటలార్కుఁడై తనరె నేయధికయశుఁడు
జయవాటికాపురస్థానదుర్గాలబ్ధవైభవుండయ్యె నేపార్థివుండు
బాహుమన్నెభూపాలార్చితార్ద్రపాదాబ్జాతు డయ్యె నేపార్థివుండు
ధార్మికమతితోడ తమ్మమాంబాప్రాణవల్లభుం డయ్యె నేబల్లిదుండు
నతడు వినుతికి దగు సమస్తావనీశ, చంద్రహృద్వల్లనిభుఁ డరిసాంద్రచతుర
సైన్యవారణదారుణసాహసాంక,బాహుబలహేళి తమ్మభూపాలమౌళి.

ఈతమ్మధరాకాంతుఁడు 1640 సంవత్సరప్రాంతమున, కండచక్కెరముక్కలనుబోలు పదములను రచనయందు జొప్పించుచు, శ్లేషయమకచమత్కారసంకలితకావ్యసరణిని సృష్టించుచు, రసాంచితభావగాంభీర్యమును పోషించుచు, ఆంధ్రగీర్వాణముల కలంకారప్రకారములను గూర్చుచు, "శ్రీకృష్ణవిజయము" అను ప్రబంధరాజమును రచించి, ప్రాచీనాంధ్రవిద్వత్కవులను కవితత్త్వమున స్మరింపజేయుచు, యిదానీంతనకవివర్యుల కాదర్శప్రాయుడై యొప్పెను. ఈరాజకవి యశోధనసంపాదనప్రాధాన్యమును గూర్చి తనగ్రంథమున చక్కగ చిత్రించెను.

ఉ. రాజకులంబునం బొడమి రాజ్యవిభూతి జెలంగుమర్త్యుడీ
భూజనులెల్ల సంతసిల పుణ్యయశోధనసంగ్రహంబుచే
రాజిలకున్న నట్టి యుదరింభరికన్న వనాంతరంబులో
భూజము మేలుః మేలు మృగముల్, ఖగముల్, జనులూహ సేసినన్.

త్రిలిఙ్గరజతోత్సవము

చ. బలి శిబియుం భగీరథుడు భార్గవరాముడు రామచంద్రుడున్
నలుడు దిలీపుడు న్నృగుడు నాహుషియుం మొదలైనయట్టి రా
జులు జనియించి, ధాత్రిని యశోధనమే కడుశాశ్వతంబుగా
దలచి యొనర్చిరే బహువిధంబుల దుష్కరపౌరుషోన్నతుల్.

గీ. ధరణి నీదృశమగు యశోధనము సంగ్రహించుట కుపాయముల్గల వెన్నియైన
నందులోపల ముఖ్యంబు లారునొకటి, తరుగణంబులలో దేవతరువులట్లు.

గీ. సుత నిధి తటాక ధారుణీసురవివాహ, కృతి వరోద్యాన దేవతాగృహము లవని
సప్తసంతతు లనగ ప్రశంసగాంచు, గృతియె యన్నిటిలోన నగ్రేసరంబు.

ఉ. ఒక్కెడ నిల్వ నక్కడనె యుండును దేవనికేతనాదులా
చక్కని యారు సంతతులు; సత్కృతి యన్నది ధర్మచాతురీ
వాక్కమనీయతం బుధులు వర్ణనసేయగ నంతనంత, నల్
దిక్కుల సంచరించుచు సుదీర్ణయశంబొనరించు గర్తకున్.

సీ. వాల్మీకిరచితకావ్యమున గీర్తికెక్కె శ్రీరామచంద్రునిపౌరుషంబు
వ్యాసనిర్మితభాగవతవర్ణితము లయ్యె దైత్యారివివిధావతారకథలు
భారతసంహితాసారోదితము లయ్యె కౌరవపాండవగౌరవములు
నానాపురాణసంతానసూక్తము లయ్యె పూర్వరాజులమహాద్భుతచరితలు
గాన నాచంద్రతారకం బైనకీర్తి, వైభవమునొంద గోరెడివారికెల్ల
రసికసంభావ్యనవకావ్యరచనకన్న, నన్యమైనట్టి యొకయుపాయంబు గలదె.

ఈతమ్మభూపాలకవిసార్వభౌముడు

సీ. ఏవంశమునకు ద్రయీవర్ణనీయుడౌ కమలబాంధవు డాదికర్త యయ్యె
నేవంశమునకు నభీష్టదేవత నీలగళురాణి బెజవాడకనకదుర్గ
ఏవంశమున నుదయించి మాధవవర్మ ఖ్యాతిగా గురియించె కనకవృష్టి
యేవంశమున నుదయించువారలు క్షత్రవంశోద్భవులకెల్ల వందనీయు
లట్టిదౌపూసపాటి మహాన్వయమున, గలశవారాశి చంద్రునిగతి జనించి
గీర్తిగాంచిన గోపాలకృష్ణరాయ, పార్థివేంద్రుని తమ్మభూపాలకుడను.

క. బెజవాడకనకదుర్గా, భజనాధికపుణ్యయోగభావితకవితా
నిజచాతుర్యకవీంద్ర, ద్విజవరసంతోషజనకవిజయోన్నతుడన్.

గద్యము. శ్రీ జయవాటికా కనకదుర్గామహాదేవీ ప్రసాదలబ్ధ నిరర్గళ కవితా చమత్కార, మాధవవర్మవంశాలంకార శ్రీమహామండలేశ్వర, మహీమండలరాయ మన్నె సులతాను, శ్రీపూసపాటి గోపాలరాయపుత్ర, వశిష్టగోత్రపవిత్రనిశ్శంకకవితరణ క్రీడాసంతోషితాశేషవిద్వత్కవిజాల, తమ్మభూపాలప్రణీతంబైన 'శ్రీకృష్ణ విజయం' బను మహాప్రబంధంబు...అని గ్రంథభాగమునను, ఆశ్వాసాంత్యగద్య మునను తనప్రతిభాదికమును వ్రాసుకొని యుండెను.

ఈమహాప్రబంధరచనాప్రారంభసమయమున శ్రీవిజయవాడ కనకదుర్గామహాదేవి యీతమ్మభూపాలకవిమనోసీరజాతకర్ణికామధ్యసీమమున, ప్రాచీనకవివతంసులకువలె సాక్షా త్కరించగ, నాదేదీప్యమానయగు శ్రీదేవిని సోత్రము గావించిన ట్లీహృద్యపద్యరచనలు దెలుపుచున్నవి.

సీ. సరసకటాక్షవీక్షణవశీకృతభర్గ, శరణాగతౌఘ రక్షణనిసర్గ
నిజభక్తలోకతృణీకారితస్వర్గ, యఖిలయోగీంద్రదత్తాపవర్గ
భూూచలనాధీనభువనత్రయీసర్గ, స్వజనసందర్శితజ్ఞానమార్గ
పరిచరీకృతహరి బ్రహ్మాదిసురవర్గ, సమదదైత్యాననజలజమార్గ
సహజచాపల్యకలితవిశాలనయన, వికసితాకారనిర్జితచకితమార్గ.
శాంభవాచారసారవిస్రంభరహిత, జననిచయదుర్గ, బెజవాడకనకదుర్గ

సీ. పదివేలబాలార్కు లుదయమందినయట్లు దిశలగ్రమ్మెడి దేహదీప్తితోడ
తొగరేడు తనకందు దొలగి వచ్చినయట్ల, మురువు గుల్కెడు నవ్వుమోముతోడ
ముకుళితాంజలులైన సకలదేవతలపై కరుణజల్లెడు చూపుగములతోడ
శంబరాసురవైరిజయలక్ష్మికొజ్జయై తనరునిక్కుపుజక్కదనముతోడ
ముమ్మరపు గ్రొత్తమెఱుగులు గ్రుమ్మరించు, చారుమాణిక్యభూషణచ్ఛటలతోడ
నిశ్చలంబైన మన్మనోసీరజాత, కర్ణికామధ్యసీమ సాక్షాత్కరించె.

సీ. జయవాటికాపురస్థానవిరాజితే దేవేంద్రపూజితే తే నమోస్తు
జితసుధామధురిమస్మితపూర్వభాషణే ధృతచంద్రభూషణే తే నమోస్తు
పరిపక్వమృదుబింబతులితాధరాధరే త్రిగుణలీలాధరే తే నమోస్తు
శారదాప్రముఖనిర్జరవధూవందితే త్రిపురారినందితే తే నమోస్తు
దివ్యమాణిక్యహారిణి తే నమోస్తు, మానిహృదయాబ్జచారిణి తే నమోస్తు
దితిసుతచమూవిదారిణి తే నమోస్తు, దీనదైన్యాపహారిణి తే నమోస్తు.

ఈతమ్మమహీపాలవిద్వత్కవివర్యునికవితాధార హృద్యమైనపద్యగద్యసరణియందే గాక, దండకరూపఛందోమార్గమునగూడ నిరాఘాటముగ పూతగంగా ఝరీపాతపాతము వలె నిరర్గళముగ నిర్గమించి మించియున్నది. గ్రంథవిస్తరభీతిచే నిచ్చట నుదాహరించలేదు. మద్విరచిత కళింగవిజయనగరచరిత్రమున చూడనగు. ఈతడు రాజకవియేగాక, కవిరాజగుటంజేసి, తనమంత్రిశేఖరుడు కవిశేఖరుడయ్యెను. మండలాధీశ్వరుడగు మహారాజు, కవిపండితమండలాధీశ్వరుడగుప్రధాని, రాజ్యపాలనము గావించునప్పుడే, సామ్రాజ్యమున సర్వతోముఖముగ సాహితీసతి సంచరించుట కెట్టియడ్డంకు లుండజాలవు. కృతికర్తయగుప్రభువు, కృతికర్తయగుప్రధాని వెలసినప్పుడే, దివ్యసాహిత్యవికాసమునకు మహోదయము, 'మణినా వలయం, వలయేన మణిః" ప్రకాశిస్తుంది. ఈకళింగవిజయనగరపరిపాలకులగు పూసపాటి మహారాజులకులమున నిట్టి సాహితీసమరాంగణసార్వభౌము లనేకులు గలరు. మహారాజులకు తగిన మంత్రిపుంగవులు కూడ వెలసిరి. శ్రీకృష్ణవిజయమును రచించి, బెజవాడ కనకదుర్గామహాదేవికి సమర్పించిన దుర్గాభక్తుడు- తమ్మభూపాలుడు- ప్రభువు. 'సీమంతినీ కల్యాణ' మనుప్రబంధరాజమును భక్తిరసమున లిఖించి, శ్రీభ్రమరాంబికాద్వితీయుఁడగు మల్లేశ్వరునకు భక్తిపురస్సరముగ సమర్పించిన పెనుమళ్ల సోమప్రధాని. శివభక్తుడు-మంత్రిపుంగవుడు. అందువలననే తత్కాలమున నాంధ్రభారతి రాజాంతఃపురములయందు, ప్రధానులప్రాసాదములయందు, కేళీభవనములయందు, క్రీడాప్రాకారాంతములయందు, పట్టణములయందు, పల్లెలయందు, విపణివీథులయందు, వీరవరులసమరాంగణములయందు, ఇందు, అందు అననేల? సర్వేసర్వత్ర తాండవించినది. ఈసోమనమంత్రి కవిత్వమున నెంత దిట్టరియో, రాజ్యకార్యనిర్వహణమున నంతకంటె దిట్టరి. ఈతఁడు శ్రీపూసపాటి తమ్మభూపాలునివద్ద మంత్రిగ నున్నట్లు సీమంతినీకల్యాణమున నీక్రిందు విధమున గలదు.

సీ. జయవాటికాపురాశ్రయయైన దుర్గాంబ కృపగాంచెనే నృపాగ్రేసరుండు
మాధవవర్మ క్షమాధవోత్తమవంశభూషణుం డయ్యెనే భూభుజుండు
కఠినారిహృదయభీకర మన్నెసులతానుబిరుదంబు పూనెనే నరవరుండు
సకలయాచకులయాశాపూర్తి యొనరించు నతిదానశూరుడే యవనినేత

తే. భువనవర్ణితుఁడైన యాపూసపాటి, తమ్మభూపాలకుని సమ్ముఖమ్మునందు
మంత్రివై తద్దయాసుధామయకటాక్షమహిమ గాంచితివయ్య! సోమప్రధాని.

ఈసోమనమంత్రిప్రతిభ, పాండిత్యము, కవితావైశద్యము, జీవితవిశేషములు మున్నగునవి విజయనగరమునందని యాంధ్రవిజ్ఞానసమితి ద్వితీయగ్రంథరాజమగు "విస్మృత

కళింగాంధ్రకవులచరిత్రము"న శ్రీ అడిదము రామారావుపంతులుగారు విపులీకరించుటచే నిచ్చట విరమించితిని ఈతమ్మభూపాలుని "శ్రీకృష్ణవిజయము" మాత్రము ఏకవారముద్రితము. సత్యభామాయుద్ధవ్యాపార మిందు వర్ణింపఁబడినది. సీమంతినీకల్యాణము కూడ ముద్రణవిషయమున ప్రభుగ్రంథమునే యనుసరించినది. ఇంక నీతమ్మభూపాలుని రాజ్యపాలనమునుగూర్చియు, రాజ్యవిస్తృతినిగూర్చియు కొంచెము వివరించెదను.

ఈతమ్మభూపాలుడు 1651 సంవత్సరమున విశాఖమండలమునకు షేరు మహమ్మద్ ఖానుతో వచ్చినట్లు తెలియుచున్నది. శ్రీకాకుళంలో ఫౌజుదారుగానుండిన షేరుమహమ్మద్ ఖాను డెప్యూటీమండలమునకు వచ్చెనో ముందుగ దెలుసుకొనవలసియున్నది. ఇందుకుగాను రెండుమూడు ఆధారములు కానుపించుచున్నవి. 1. ఇతఁడు శ్రీకాకూళపుసర్కారునకు నవాబుగా సల్లష్కరుగా నియమింపబడినను, మెట్టున నుత్తరసర్కారులలో రాజమహేంద్రవరము మొదలు దానికుత్తరముననుండు మూడుసర్కారులకు గూడ ప్రభుఁడయ్యెను. దీనికి కారణములనుజూపి, యనంతరము కాలనిర్ణయము గావించెదను. రాజమహేంద్రవరంసర్కారులో మహారాజులని ప్రసిద్ధివడసిన వత్సవాయివారను ప్రసిద్ధసంస్థానికులలో నొక రీషేరుమహమ్మద్ ఖానునివలన, నొకగౌరవమందినట్లు యీపద్యము పలుకుచున్నది.

ఉ. షేరుమహమ్మదు క్షితిపశేఖరుఁ డద్భుతశౌర్యధైర్యదు
ర్వారుఁడు మెచ్చి పైడియొరవాల్ దనకేల నొసంగు వేళ దై
త్యారిసమానమూర్తి తనహస్తముమీఁదుగనందె వార్ధిగం
భీరుఁడు వత్సవాయికులపేరయ తిమ్మనృపాలుఁ డున్నతిన్.

అని యేనుగు లక్ష్మణకవి తనరామవిలాసగ్రంథప్రథమాశ్వాసమున వివరించెను. ఇందులో వివరింపబడిన పేరయతిమ్మరాజు కాలమెద్దియో మనకు దెలిసిన షేరుమహమ్మద్ ఖానునికాలము ఇంచుమించుగా దెలియగలదు. ఆపేరయతిమ్మరాజుకాలము వారివంశస్థులలో నొకరును, విద్యానిధులని యెంచబడిన శ్రీరాయజగపతిరాజుగారిచే వారికడనున్న యాధారములనుబట్టి క్రిందువిధముగ సంపాదితమైయున్నది.

"శ్రీపేరరాజుగారికుమారుఁడైన శ్రీముసలి తిమ్మరాజుగారు. ఈయన యీస్థలమున (పెద్దాపురమునకు) నధికారము సంపాద్యముచేసినారు. జననము వికృతిసంవత్సర ఆషాఢ శుద్ధ ౫ లు. 76 సంవత్సరములు జీవించిరి. అధికారకాలము 52 సం. 2 నె. 25 దినములు అనగా ఆనందనామసంవత్సర భాద్రపద బ ౭ అనఁగా 1065 ఫసలీవరకు."

ఇట్లుండుటచేత 1665 సంవత్సరమున, నీపేరయతిమ్మరాజమహారాజు కాలములో పైషేరుమహమ్మద్ ఖానుని వ్యవహారకాల ముండుననుటకు సందేహాము లేదు.

2. ఈకాలముననే లోకలురికార్డ్సు అను గ్రంథములనుండియు నిర్ణయింపవలసియున్నది. 'హాకీకత్ పూసపాటి విజయరామరాజుగారివంశావళిన్నీ, వారు నవాబుచేత శ్రీకాకూళం, కస్సికోటతాలూకాలలో పుచ్చుకొన్నపరగణాలవగైరాలకు జమాబందిన్నీ హాకింవద్ద సర దారీమొకర్రరు అయినందులకు తప్సీలు" అనుపేరుతో నొప్పు నొకహాకీకత్తులో నీషేరు మహామ్మద్ ఖానునిగూర్చి యీక్రిందివిధముగా నున్నది.

"హైదరాబాదు పత్తానీషాపాదుషాహాతు యేలుబడిచేస్తూవుండే కాలమందు షేరు మహమ్మద్ ఖానుని వెంబడిని కొంతఫౌజునుకూడా కూర్చి శ్రీకాకుళంరాజ్యం తోరణం కట్టించుమని సెలవుయిచ్చి పంపించినారు.1061 ఫసలీ అనగా 1651 సంవత్సరములో నాషేరు మహమ్మద్ ఖానుఁడు హైదరాబాదునుంచి తరలి కొండపల్లి వురఫ్ముస్తాపాన్నగరు సర్కా రుకువచ్చి ప్రవేశించినాడు......1092 ఫసలీకి అనగా 1682 సంవత్సరం తానీషావాదుకుం నమోజుఅయిన షేరుమహమ్మద్ ఖానునికిబదులు, ముస్తఫాఖులీఖానుడు శ్రీకాకుళంసర్కా రులో ప్రవేశించినాడు. ఆషేరుమహమ్మద్ ఖానుడు 30 సంవత్సరములు హాకింగిరీచేసినాడు." ఇట్లుండుటంబట్టి షేరు మహమ్మద్ ఖానుడు 1651 సం. మొదలు 1682 వరకు శ్రీకాకూళ ములో నవాబుగానుండెనని నిశ్చయమగుచునది పైనవివరించిన షేరుమహమ్మద్ ఖానునితో తమ్మభూపాలుఁడు వురఫ్ మాధవవర్మ 1651 సంవత్సరమున నీవిశాఖమండలమునకువచ్చినట్లు కొన్నియాధారములు కానుపించుచున్నవి. వాటిని వివరించెదను.

1. "1652 సంవత్సరమున శ్రీకాకూళములో ఫౌజుదారుగానుండిన షేరుమహమ్మద్ ఖానుయొద్దకు మాధవవర్మ యనునతఁడు వచ్చి, కుమిలె, భోగాపురముల నిజారాచేసెను. ఆయనయనంతరము ఆయనకుమాళ్లగు సీతారామచంద్రుఁడుగా రీ రెండుపరగణాలేగా కుండ, నింకను పదిపరగణాలను కౌలుకుతీసుకొనెను. 125 గుర్రములసేన, 450 కాల్బలము తోకూడుకొన్నపరివారముతోకూడ పొట్నూరులో వసించియుండెను. పర్లాకిమిడి గజపతి దేవుతో సఖ్యముజరిగినందున సీతారామచంద్రునకు విశేషఘనతకలిగెను." అని కార్మైకలు దొరగారు విశాఖమండలచరిత్రమున వ్రాసియుండిరి.

2. షేరుమహమ్మద్ ఖానుఁడు క్రోధి 1651, మన్మథ 1652 సం.లలో విశాఖమండల మునకువచ్చి పూసపాటి మాధవవర్మకు విశ్వావసు, కీలక 1655 సం॥ లలో కుమిలె, భోగా

పురం పరగణాలిచ్చెను. భోగాపురంలో యిల్లుకట్టించి యిచ్చెను జమాబందీ రూ.5207-0-0 రాణువవారీజీతాలు...భీలు సాదరు 2500 రూ. ఈషేరుమహమ్మద్ ఖానుఁడు 30 సం॥ హాకింగిరీచేసెను. వీనియనంతరం 1632 సం॥ ముస్తఫాఖులీఖానుఁడు వచ్చెను. శ్రీకాకుళం సర్కారుతోకూడా కొండవీడు, పురప్ ముస్తఫానగరం, మచిలీబందరు, నిజాంపట్నం, యేలూరు, రాజమహేంద్రవరంకూడా హాకీమైనాడు. మాధవవర్మ సరదారుగానుండెను. 1635 సం॥ మాధవవర్మ గతించెను. అప్పటికి 33 సం॥ సరదారీచేసెను." అని మద్రాసుగవర్నమెంటు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములోని సి. పి. బ్రౌనుదొరగారి 'లోకల్ రికార్డ్సు' అనుగ్రంథజాలములోగల కైఫియత్తునందు గలదు.

3. పై రెండింటికిని, విరుద్ధముగ నీతమ్మభూపాలుఁడు పురఫ్ మాధవవర్మ, పూసపాటి సీతారామచంద్రుని దత్తపుత్త్రుఁడనియు, యీపూసపాటి సీతారామచంద్రునికి జ్ఞాతియగు బసవరాజునుండి, బసవరాజు తదనంతరము యీరెండుపరగణాల సంక్రమించినటుల నొక ప్రథ కలదు. బసవరాజు గజపతులకుమార్తెను వివాహముజేసుకొని యీరెండుపరగణాలను పొందినట్లుకూడ గలదని యొక, యుపప్రథ కలదు.

4. కొండపల్లిసర్కారులో గోలుకొండనవాబులపక్షమున సరదారుగానున్న పూసపాటి రఘునాథరాజు ఆయనకుమారుడు సీతారామచంద్రుడు 1655 సంవత్సరమున భోగాపురమున ప్రవేశించెను రాయడప్ప అను నొకవెలమసరదారుడు షేరుమహమ్మద్ ఖానుతో నీప్రాంతమునకువచ్చి 'కవిటి' 'రాజాం' అను రెండుపరగణాలను కౌలునకుపుచ్చుకుని షేర్ మహమ్మద్ ఖానునికి సరదారుగా నుండగా పూసపాటివారు ఆకస్మికముగ విజృంభించిరి. అని యొకగాథ కలదు.

5. పూసపాటివారు గోలుకొండనవాబులకు సరదారులు కానే కారనియు, షేరు మహమ్మద్ ఖానునికి పూర్వమే యనగా 1651 సం. పూర్వమే యీకళింగరాజ్యమునకువచ్చి యిచ్చట స్థిరనివాసమేర్పరచుకొనిరనియు, 1669 సం. ప్రాంతమున పూసపాటివారి విజయ పరంపర లెక్కువగుటచేత, పూసపాటి సీతారామచంద్రుని తనకు లోపుచేసుకొనును ద్దేశమున నాతనికి, తమ్మభూపాలకవిరాజువద్ద మంత్రిగనున్న పెనుమళ్ల సోమమంత్రి పెద్ద తండ్రియగు పెనుమళ్ల బసవయ్యప్రధానిగాగల జయపురాధీశ్వరకృష్ణదేవు, తనకుమార్తె నిచ్చి వివాహముచేసి 'కుమిలె,' 'గంద్రేరు' అను రెండుపరగణాలును కుమార్తె పసుపు, కుంకుమక్రింద నొసగినట్లును, దీనితో, తనరాజ్యసంరక్షణార్థము సూరెడ్డివారికి రేకపల్లి, శివరామపాత్రునకు కొట్టక్కి, జగ్గారాయునికి మేదినీరాయబిరుదముతో దేవుపల్లి, ముత్తా

వారికి కోటపాలెము, ఇ_ల్త్యబేగనుమహమ్మదీయునకు బొబ్బలిని యొసగినట్లును, యీాయి_ల్త్యబేగు తనస్వస్థలమగు హైదరాబాదునకు పోవుచు, తాను తిరిగివచ్చువరకును, చూచుచుండుడని యొకవెలమవారయగు గోపాలకృష్ణరాయనికి యిచ్చి వెళ్లినట్లును కొన్ని గాథలు కలవు.

6. పూసపాటి సీతారామచంద్రుఁడను నతడు, తమ్మరాజును పెంచుకొని యుండుటచేతను, ఆసీతారామచంద్రునివృత్తాంతము కటకమువారిపిల్లను వివాహముచేసుకొనిన బసవరాజుచారిత్రములో గానుపించుటచేతను తూర్పుకళింగదేశమున స్థిరపడియున్న సీతారామచంద్రుడు ప్రస్తుతము విజయనగరసంస్థానములో చేరియున్న కుమిలె (కుంభిళాపురము) భోగాపురము మొదలగుపరగణాల నేలుచున్నట్లును, అన్నమరాజను నతడు, కృష్ణానదీతీరమునందుగల కేతవరపట్టణమున కనతిదూరస్థమగు పశ్చిమరాజ్యము నేలుచున్నట్లును, అన్నమరాజుపాలనములో నున్న ప్రాచీనమును, పిత్రార్జితమును, స్వార్జితమును అగురాష్ట్రమునుగూడ కొంతకాలమునకు తమ్మరాజు స్వాధీనమునకు వచ్చినట్లును, తమ్మభూపాలుడు కళింగదేశమును వదలి, తిరిగీ కృష్ణానదీతీరమునకు పోయియుండనికారణమున నారాజ్యభాగమంతయు నన్యాక్రాంతమైనట్లును, కింవదంతి కలదు.

ఏదియెట్లున్నను, తమ్మభూపాలుడు 17 వ శతాబ్దమున కృతికర్తయై విశాఖమండలమున ప్రవేశించుటలో సందేహమునకు తావు కానుపించదు. ప్రబలప్రమాణములను సంపాదించిన నివి యపాస్తము కాగలవు.

ఈతమ్మభూపాలునికి ప్రపితామహుడగు పూసపాటి రాచరాజుగారు నవభారతమును రచించి యాంధ్రికి సమర్పించిరిగాని ప్రస్తుతము వినబడుచున్నది. 1690 సంవత్సరప్రాంతమున శ్రీవేంకటపతిమహీపాలుడు "ఉషాభ్యుదయము" అనుప్రబంధమును రచించిరి. రేగులవల్సజమీాందారగు శ్రీపూసపాటి విజయరామరాజుగారు "విష్ణుభక్తి సుధాకరమ"ను రసవత్తరగ్రంథరాజమును లిఖించిరి. ఈరెండుగ్రంథములును అరుంధతీతారలవలె ఆంధ్రభాషావిహాయసమున ప్రకాశించుచున్నవి. త్వరలోనే ముద్రణభాగ్యమును పొందగలవని విశ్వసించుచున్నారము. శ్రీపూసపాటి మహారాజకవులగ్రంథజాలమును ముద్రించి, యాంధ్రమాతకు సమర్పించుటకు శ్రీవిజయనగరసంస్థానాధీశ్వరిణి శ్రీ శ్రీ శ్రీ విద్యావతీదేవి మహారాణీసాహెబావారు పూనుకొనెదరుగాక యని కోరుచున్నారము.



# శ్రీ వేమన యోగి

సాహిత్యవినోది శ్రీ జాగరగల్లు సుబ్బరాయుడుగారు,
గుంతబజారు, కడప.

వేమననుగురించి యిప్పటి కెందరెందరో పండితులు ఆంగ్లేయభాషావిజ్ఞానులు గొప్ప గొప్పవ్యాసములను రచించియే యున్నారు. ఈతనిచరిత్రకై ప్రయత్నించినంతమంది భాషా సేవకు లింకొక తెలుఁగుకవిచరిత్రకై ప్రయత్నింపలేదనుట సత్యేతరముకాదు. వారికన్నను నేనెక్కువ తెలిసినవాఁడను కాను. కాని నేను కడపమండలనివాసిని గనుక కడపమండల మునఁబుట్టి కడపమండలమున నివసించి కడపమండలముననే శివసాయుజ్యమునొందిన భోగి, త్యాగి, యోగి, వేదాంతి, కవి యగు వేమననుగురించి నాచిన్నియూహలనే భాషా పరిజ్ఞానవిజ్ఞానులకు వెల్లడిచేయకుండడమా యని యిప్పనికి పూనుకొంటిని, తప్పులున్న భేదాభిప్రాయములున్న సహింతురుగాక!

## నివాసము.

ఈతనినివాసస్థలమునుగూర్చి యిదివఱకు విమర్శకులు పలువిధములుగా వ్రాసి యున్నారు. పలువురు కొండవీటిలోఁ బుట్టి గండికోటలోఁ జెరిగి కటారుపల్లెలో సిద్ధిఁబొందె నని యూహించియున్నారు. ఒకవ్యక్తి జన్మస్థానమును కనుగొనుటకుముం దాతఁ డేప్రాంతమువాఁడని కనుగొనవలసియుండును. కనుక వేమన ఏప్రాంతమువాఁడని కనుగొందము. దానిని కనుగొనుటకు మన కేయాధారములు లేనప్పు డాతనికవిత్వము యుపయోగించిన పదగుచ్ఛములపొందును బట్టియైన కనుగొనవలసియున్నది. ప్రతివ్యక్తి తానెంత కవిత్వము నేర్చినను, పాండిత్యము గడించినను తనతల్లి యుగ్గుపాలతోఁబెట్టినభాష, పదజాలము వీడ లేదు. అది స్వాభావికము. 'ఒకానొకప్పుడు కృష్ణదేవరాయలయాస్థానమున కొకపండితుడు వచ్చి తనను తెలుఁగు, సంస్కృతము, కన్నడము, తురకము మొదలగుభాషలలో తర్కించి గెల్వవచ్చుననియు తానేకులమువాఁడై నదియు కనుగొనుఁడని చెప్పెను అందుల కంద ఱెం తెంత ప్రయత్నించినను బయలుపడలేదు. కడపట తెనాలిరామకృష్ణుఁ డాలోచించి ఆపండి తుఁడు గాఢనిద్రలో నుండినప్పుడు కొరడాతో ఘాటుగా నొకదెబ్బ వేయగా నాతఁడు 'అల్లా'యని యరచి లేచెనట. వెంటనే రామకృష్ణుఁడు నీవు మహమ్మదీయుఁడ వనెనట' ఈ

కథ యెంతవరకు నిజమోగాని స్వాభావికమును మనుజుఁడు వీడలేడనుట నీకథ చాటుచున్నది. ఆవిధముగనే వేమన పద్యములను తనయిష్టమువచ్చినప్పుడు, తనకు తోచినట్లు చెప్పెనేకాని కవిత్వముపైనాశతో చెప్పలేదు. కనుక ఆపద్యములలోని పదజాలముల గాంచిన కొంతవఱకు యేప్రాంతమువాఁడని కనుఁగొనవచ్చును. 'మనువు' యనుపదమును యితరజిల్లాలలో విధవావివాహమునకే యందురుకాని కడపమండలమునందు ప్రతిపెండ్లి ప్రయత్నమునకు ఉపయోగింతురు. వేమనకూడ ఆవిధముగనే ఉపయోగించియున్నాఁడు గొడ్డు, దుడ్డు, చద్ది, కూసము, ఎంబెరమతము, పలికి, అలిగండ్లు, మలిగండ్లు, మోస్తరు, దొబ్బుట, సంతబసివి, కంచము మొదలగుపదముల నెన్నిటినో కడపమండలమున జనసామాన్యము సాధారణముగా నుపయోగించిన ట్లుపయోగించియున్నాఁడు. కాన నీతఁడు కడప మండలవాసియని యూహింపవచ్చును. క్యాంబెలుదొరగారుకూడ వేమన కడప కర్నూలు ప్రాంతములవాడని నిస్సందేహముగా చెప్పవచ్చునన్నాడు.

వేమన రెడ్డికులమునకు చెందినవాఁడా లేక కాపుకులమునకు చెందినవాడా యని తెలిసికొన్న కూడ యీతనిజన్మస్థానము కనుగొనవచ్చును. ఈవ్యాసములో క్రింద 'కులము' అనుశీర్షిక క్రింద వేమన 'కాపు'కులమునకు చెందినవాఁడే యని తేలుచున్నది. ఐతే గోదావరి కృష్ణమండలములందు రెడ్లు, కాపులు వేఱుగా నున్నారు. కాపులనగా 'తెలఁగాలు' 'నాయుళ్లు'అని వాడుదురు. కాని దత్తమండలములందు 'రెడ్లు' 'కాపులు' అనుపదములు పర్యాయపదములుగా వాడుచున్నారు. కనుక వేమన కడపమండలములోని 'కాపు' కులమునకు చెందినవాఁడే యని తలంపవచ్చును. వేమనవంశీయులమని పసుపుగుడ్డలఁ గట్టుకొని గుఱ్ఱములపైనవచ్చి యూరూర వేమన్నకొసంగు మర్యాదలను గైకొనువారు కడపమండలముననే పెక్కులున్నారుకాని మరి యేమండలమందును లేరు వేమన కడపమండలవాసి కాక వేరేయున్న ఆప్రాంతములవారు వీరికి యద్దుతగులకుందురా? కనుక వేమన కడప మండలముననే పుట్టెనని నిశ్చయింపవచ్చును. ఇప్పటికి వేమన్నకు కడపమండలఁ బుట్టఁజేసితిమి ఇక యేగ్రామమున పుట్టెననుట ప్రశ్న!

ఆ. ఊరు కొండవీడు కునికి పశ్చిమవీధి, మూగచింతపల్లె మొదటి యిల్లు
ఎడ్డి రెడ్డికుల మదేమని తెల్పుదు, వి...

అని వేమన్న యన్నాడు కనుక 'మూగచింతపల్లె' కడపమండలమున నెక్కడనున్నదని పరిశోధింతము. కడపమండలమున తూర్పుదక్షిణదిశన అయిదామడలదూరముననున్న 'చిట్టివేలు'గ్రామమునకు 7, 8 మైళ్లదూరమున నొకచింతపల్లె యున్నది. అచ్చట వేమన్న సమాధి

కూడ నున్నది. ఇదియే వేమనచెప్పిన చింతపల్లెయైయుండనోపును. కొండవీటికి పడమరనున్న దని చెప్పియున్నాడు. కొండవీటి నెందుకు పేర్కొనెనని యడుగవచ్చును. అది సహజమే. ఎట్లన, సాధారణముగా మన మీనాడుకూడ గ్రామాంతరమునకు వెళ్లిన ఎవరైన మీదే గ్రామమనిన మనదొకచిన్నపల్లియయ్యె యుండిన, ఆపల్లెను చెప్పక దానికి సమీపముననున్న యొకగొప్ప గ్రామమును చెప్పుట వాడుక. మరి వేమననాటికి యింత నాగరికత లేదు. కొండ వీడు రెడ్డిరాజులచే పాలింపబడి ప్రఖ్యాతిలోనుండెను గనుక వేమన ఆవిధముగా చెప్పి యుండును. బ్రౌనుదొరగారు కూడ వేమన 'చిట్టివేలు' గ్రామము ప్రాంతమువాఁడనియే చెప్పియున్నారు కనుక నిక యేసందేహము లేకుండ వేమన కడపమండలమున చిట్టివేలు గ్రామప్రాంతమున నున్న చింతపల్లెలో జన్మించెనని యూహింపవచ్చును.

## కాలము

వేమనకాలము నూహించుటకు వేమన చెప్పినపద్యములలోని చరిత్రాంశములనే ప్రబలాధారములు చేసికొనవలసియున్నది.

ఆ. పరగ రాయనికుల బాచనిధనమెల్ల, భట్లపాలు కవులపాలు దలఁపఁ
నొనర హీనజనునిధనము దాయాదుల,పాలు జారకాంతపాలు వేమ.

ఈపద్యమునుబట్టి రాయని భాస్కరునికాలమువాఁడు వేమన యని తేలుచున్నది. కనుక నీరాయని భాస్కరుఁ డెవ్వఁడా యని కనుఁగొందము. ప్రఖ్యాతికెక్కిన రాయని భాస్కరు లిద్దరు భిన్నకాలములలోఁ గానవచ్చుచున్నారు కాని మనకిప్పుడు కావలసినది భట్టురాజులస్తోత్రములతో నానందించుచు దానముల నిచ్చుచుండిన రాయనిభాస్కరుఁడు. ఒక రాయనిభాస్కరునిగూర్చి యొకభట్టీవిధముగా చెప్పియున్నాఁడు.

సీ. భట్టు దీవించుచు బాసికంబునుఁ జూప వెలయఁ బెండిలిచేసి వేడ్కఁ బంపె
జొప్పకట్టెలమీద సోలియుండగఁ జూచి పట్టెమంచము పాన్పు భట్టు కొసఁగె
వలెత్రాడుఁ జూపిన చెలఁగి యెద్దునొసంగె బలుపుఁ జూపినఁ బాడిపశువు నిచ్చె
కల్లెంబుఁ జూపినఁ గడిగి గుఱ్ఱము నిచ్చెఁ జుట్టఁ జూపిన దాసి సుదతి నిచ్చె
తే. స్నాన మాడంగ గడియంబు జాలుఁ గడమ
కడియమును వేయ శాంభవి కరముఁ జూపె
వెలయ రాయలకుం గ్రమ్ము వేసి చూపె
సర్వమాన్యుండు వినుకొండ శాసనుండు
భవ్యభరతుండు రాయని భాస్కరుండు!

ఈరాయనిభాస్కరుఁడే వేమనచెప్పిన భాస్కరుఁడై యుండనోపు. ఈరాయని భాస్కరుఁడు క్రీ. శ. 1516 ప్రాంతముల నున్నవాఁడు కనుక వేమన క్రీ.శ. 1516 ప్రాంతమువాఁ డను కొనవచ్చును.

ఆ. అధముఁడైన మనుజుఁ డర్థవంతుండైన, నతనిమాట నడచు నవనిలోన
గజపతింట నెన్న గవ్వలు చెల్లవా, వి...

గజపతు లోఢ్ర దేశమునుండివచ్చి కొండవీడు, కొండపల్లి, ఓరుగల్లు, ఉదయగిరి, కనిగిరిదుర్గముల నాక్రమించిరి. వారికాలమున గవ్వలే నాణెములుగా చెల్లియుండవచ్చును. ఈగజపతులను గృష్ణదేవరాయుఁ డోడించెను. వీరిరాజ్యము కృష్ణదేవరాయుని బాల్యావస్థలో మహోన్నతదశలో నుండియుండవచ్చును. కనుక వేమనచెప్పిన గజపతులయిల్లు క్రీ. శ.1520 ప్రాంతమున నుండియుండును కనుక వేమన క్రీ. శ. 1520 ప్రాంతమువాఁడని తెలియుచున్నది. వేమన తనపద్యములలో—

1. ఆ. తిరుపతికిని బోవ తురక దాసరి గాఁడు.

2. ఆ. కొయ్య గులామునకు జ్ఞానము.

అని చెప్పియున్నాఁడు. కనుక మహమ్మదీయు లాంధ్రదేశము నాక్రమించి దేవస్థానముల ముట్టడించినకాలమున వేమన యున్నట్టు లూహింపవచ్చును. రెడ్డిరాజులప్రతిభ తగ్గి యవసానకాలము వచ్చునంతవరకు తురకలు తెలుఁగునాడులోఁ బ్రవేశింపలేదు. కనుక వేమన యీపద్యములను క్రీ. శ. 1530 సంవత్సరము పిమ్మట చెప్పియుండును. కనుక వేమన క్రీ. శ. 1530 తర్వాతివాఁడని నిశ్చయింపవచ్చును.

ఆ. ప్రాకటముగ నిట్టె లోకములో గుంటుపల్లి ముత్తఁ డెన్నఁ బరమగుణుఁడు
అన్నదానమునను హరుపూజచేతను, హరుని లోనఁ గాంచె నరసి వేమ.

పైపద్యమువలన అన్నదానమువలనఁ బ్రఖ్యాతిఁగాంచిన గుంటుపల్లె ముత్తునికాలమువాఁడు వేమన యని స్పష్టముగా నిశ్చయింపవచ్చును. కనుక నీముత్తుఁ డెవ్వరని యాలోచింతము. ఈతఁడు గోలకొండ నవాబులకుఁ బ్రతినిధియై సర్వాధికారములతో కొండవీడు, వినుకొండ, బెల్లముకొండ, నాగార్జునకొండ యను నాలుగుదుర్గముల కధ్యక్షుఁడై యుండెను. ఈతని మరణమునుగూర్చి యీవిధముగా నున్నది.

క. పొందుగ శరజలనిధి హరి,చందనతరుచంద్రసంఖ్యశకవర్షంబుల్
దుందుభినాషాఢంబున, నందముగా వీరముత్తుఁ డరిగె న్దివికిన్.

కనుక నీముత్తునామాత్యుఁడు క్రీ. శ. 1623 లో గతించియుండవలయును. కనుక వేమన యీతని సమకాలికుఁడుగా నుండియుండవలయును. పైచరిత్రాంశములనుబట్టి వేమన్నను క్రీ. శ. 1500 కును క్రీ. శ. 1600 కు మధ్య పెట్టగలిగితిమి. ఇక వేమనను తమకావ్యాది యందు వ్రాసినకవులనుబట్టి కొంత కనుగొందము. మల్హణచరిత్రమును రచించిన 'ఏడపాటి ఎఱ్ఱాప్రగడ' యనుకవి తనకావ్యాదిని వేమన్న

చ. వినుతు లొనర్తు.................

...................................

.........వేము నలపోతన..................

.........వీరకవి ధూర్జటిఁ గేతన భట్టబాణునిన్.

ఈతనికావ్యమునం దీక్రిందిపద్యముండుటవలన నీతడు గృష్ణదేవరాయుని సమకాలికుఁడని సంశయింపవచ్చును.

ఉ. ఇట్టి మహాప్రధాన పరమేశ్వరమూర్తివి గాన నీవు చే
పట్టితి మేలుచుండి పురపాలక కాశనమంత్రిచంద్ర! ము
న్కట్టిగఁ గృష్ణదేవరాయజనకాంతున కీయక దాచినట్టి యా
రట్టడిదైన యెఱ్ఱకవిరాజిత మల్హణకావ్యకన్యకన్.

కాని యీతఁడు కావ్యాదిని చెప్పినకవులలో కృష్ణదేవరాయుని అష్టదిగ్గజములలో నొక్కఁడగు ధూర్జటినికూడ చెప్పియున్నవాఁడు. కనుక యీకవి కృష్ణదేవరాయుని చరమావస్థయం దీకావ్యమును రచించి ఆతని మరణానంతరము కాశనమంత్రికి యంకిత మొసంగియుండును. దానివలనకూడ వేమన 16 వ శతాబ్దమువాఁడని చెప్పనగును. 'తోభ్య చరిత్రము' రచించిన పింగళి యెల్లనార్యుడుకూడ తనకావ్యాదిని వేమనను కవులలో చెప్పి యున్నాఁడు. ఈకవి క్రీ. శ. 1590-1620 ప్రాంతములవాఁడని కవులచరిత్ర మనుచున్నది. ఈతఁ డీకాలమున జన్మించి ప్రౌఢవయస్సున కావ్యము రచించియుండునని యూహింప వచ్చును. కనుక నీయాధారములనుబట్టి వేమన్నను ఒకవందసంవత్సరముల వలయములోనికి తేగల్గితిమి. ఇక నీతఁడు జన్మించినసంవత్సరమును కనుగొనగలమేమొ చూతము.

క. నందనసంవత్సరమున, పొందుగ కార్తీకశుద్ధ పున్నమనాడుఁ
వింధ్యాద్రిసేతుబంధన, సందున నొకవీరుఁ డేలు సరగున వేమా.

ఈపద్యము వీరభోగవసంతరాయలనుగూర్చి వేమనచెప్పినదని కొందరియూహ. అటుగాక తననుగూర్చియే చెప్పికొనియున్న క్రీ. శ. 1500 కును, క్రీ. శ. 1600 కును మధ్యనున్న

నందనసం॥లకు సరియగు క్రీ. శ. 1532 లేక క్రీ. శ. 1592 లోనో జన్మించియుండవలయును. కాని 1592 లో జన్మించియుండిన పింగళి యెల్లనార్యాదులతో చేర్కొనుట వీలులేకుండును గాన క్రీ. శ. 1532 లోనే జన్మించినట్లు నిశ్చయింపవచ్చును. కనుక వేమన జన్మదినము క్రీ. శ. 1532 సరియగు నందనసంవత్సర కార్తీకశుద్ధ ౧౫ లనుట సత్యేతరముకాదు.

## కు ల ము

మనమునఁ జేసిన మైనపుజెడ్డీ, ప్రణుతమునై దగురావులదొడ్డీ
యవుపుగఁజేసెను నందఱ నొడ్డీ, వితతముగాఁగను వేమన రెడ్డీ.

అని యున్నది కనుక వేమన 'రెడ్డి' కులమునకుఁ జెందినవాఁడని తెలియుచున్నది. కాని,

ఆ. కలియుగమున నున్న కాపుకులానకు, వేమన తనకీర్తి విక్రయించె
నున్న ధర్మమెల్ల నుర్విపై నరులకు, గోరువెట్టు పరముఁ గోరి వేఁప.

అనుటవలన వేమన 'కాపు' కులానకు చెందినట్లు తెలియుచున్నది. లేకున్న తనకీర్తినెల్ల 'కాపు' కులమున కేల విక్రయించితినని వ్రాసికొనును. అదియునుగాక,

ఆ. ఒరుల కొఱకుభూమి నొదిగించువారలు, నవనిపతికి వశ్యులైనవారు
పాలవంటికులమువారు కాపు లెఱుంగు, వి...

అనుటవలన తనకులమైన 'కాపు' కులముపైఁ దనకున్న నిష్కల్మషాభిమానము స్పష్టముగాఁ గానవచ్చుచున్నది. పైచర్చనుబట్టి వేమన 'రెడ్డి' కులమునకుఁ జెందినవాఁడా? 'కాపు' కులమునకుఁ జెందినవాఁడా యనుసంశయము కలుగుచున్నది. గోదావరి కృష్ణా జిల్లాలలో రెడ్లకు, కాపులకు భేదమున్నది. కాపులను 'తెలగాలు' 'నాయుళ్లు' అని పిలుచుచుందురు. కాని కడప కర్నూలుప్రాంత్రములలో 'రెడ్ల'న్నను 'కాపు' లన్నను, ఒక్కకులమునకే వాడుచున్నారు. పర్యాయపదములుగా నుపయోగించుచున్నారు. రెడ్లరాజ్యము మహమ్మదీయులచేతులలో పడినపిమ్మట 'వేంకటేశ్వర స్తుతిశతకము' అను నొకనిందాస్తుతి పుస్తకము వ్రాసినకవి యీవిధముగా వ్రాసియున్నాఁడు. మహమ్మదీయులు దేవస్థానముల నెల్ల లోబరచుకొని తిరుపతిదేవస్థానమును తురకలు ముట్టడించినప్పుడు భక్తుఁడు చెప్పిన పద్యములు.

తే. బంటుపంతము తగదంచుఁ బంటకాఁపు, దనము గైకొంటి విది మంచిగుణము దినము
జనము దెచ్చినధనము లప్పణము లిచ్చి, శత్రుసంహార వేంకటాచలవిహార.

సీ. మలలపై పెద్దహోబలము సింగారెడ్డి మంగళగిరికోట మరుగురెడ్డి
పోలుపొందు మారకాపురము చెన్నారెడ్డి రంజిల్లు నుదయాద్రి రామిరెడ్డి
వెలయ తిరువళ్లూరి వీరరాఘవరెడ్డి వన్నెవాసుల కంచివరదరెడ్డి
నీటికెక్కిన గండికోట మాధవరెడ్డి తగుతాడిపర్తి చింతాలరెడ్డి
తే. సేయుకాపుదనంబుల సూచి నీకుఁ, గోర్కెఁ బుట్టను తిరుమలకొండరెడ్డి
మగతనము మాని కాపైన నగవుకాదె, శత్రుసంహార వేంకటాచలవిహార.

సీ. పలుపును మోకును బగ్గంబు మునికోల కాడియు మేడియు గట్టుగలప
యేమియు లేక యేతెద్దు గల్గిన కాళహస్తీశునకు నెక్కుడైన యట్టి
పసిగాపు నంచు నబాబుచే రెడ్డితనానకు విడెమందినావు నీవు
బలభద్రమూర్తివై హలము పూనినమాత్ర పైరెట్లు పండేవి? పన్ను వెట్ట
తే. కున్నఁ బోనీరు తుఱకలు నిన్ను బట్టి, కట్టివేసేరు చాలించు కాఁపుతనము
కటికిబంట్రోతు కిదియ ప్రఖ్యాతిగాదె, శత్రుసంహార వేంకటాచలవిహార.

ఈపద్యములవలన 'కాపు' 'రెడ్డి' యనుపదములు పర్యాయపదములుగా నుపయోగించి యున్నట్లు తెలియుచున్నది. వేమన కూడ 'రెడ్డి' 'కాపు' కులములను పర్యాయపదములుగా నుపయోగించుటవలనను 'కాపు' కులమునకు చెందినవాఁడనియే యూహింపవలసియున్నది.

ఇఁక నీతఁడు ప్రభువంశమునకు చెందినవాఁడా? లేక సాధారణమైన సేద్యగాండ్ర తెగకు చెందినవాఁడా? యనునది తేల్చవలసియున్నది. పాశ్చాత్యులు వేమనయందుఁ గల గౌరవముచేఁ జేసినవిచారణవలనకూడ వేమన సాధారణసేద్యగాడని తెలియుచున్నది.

'Vemana belongs to the Kapu or farmer caste.' C. P. Brown. 1915 సంవత్సరములో "The Age of Vemana" అని జి. ఆర్. సుబ్బరామయ్యపంతులు 'Some Mile Stones in Telugu Literature" మాలికలో నాంగ్లేయమున నొకగ్రంథ మును బ్రకటించియున్నారు. అందులో "**Vemana was a typical Kapu and never tried to conceal the fact. He made no pretention to scholastic attainments or to priestly power, but, like the sturdy herdsman of Jehoa, professed to be a mere plain unlettered farmer**"

మఱి శ్యాంబెలుదొరవారికాలమునకైనను వేమన ప్రభువంశమువాఁడని చెప్పుటలేదు. బహుశః 100 సంవత్సరములకు పూర్వముదైన వేమనచరిత్రమునందు కూడ వేమన ప్రభు వంశమువాఁడని కానరాదు. ఇప్పటికి కటారుపల్లెనుండి వేమనవంశీయులమని తిరిగెడు

వారు కూడ వేమన ప్రభువంశమువాఁడని చెప్పుటలేదు. ఇఁక వేమనపద్యములలో తా నుపయోగించియుండు లోకోక్తులనుపమానములు చూడ వేమన సాధారణకాపువంశము నకు చెందినవాఁడని తెలియును

1. పచ్చికాయఁ దెచ్చి పడవేయ ఫలమౌనె.
2. చేనిలోని బొమ్మ చేసి కట్టినయట్లు.
3. ఓటికుండ నీరుపోసినచందాన.
4. చెట్టు ముదరనిచ్చి చిదిమిన పోవునా?
5. పాలకుండ రాయి పగిలించు తగిలిన.
6. గొఱ్ఱె చంకఁబెట్టి గొల్ల వెదకినరీతి.
7 కాపు లేనిదాని కాపుర మడగనా?
8. ప్రాత యెనుముపాలు రోతనవచ్చునా?
9. పంటచేను విడచి పరిగ యేరినయట్లు.
10. తడిక బిఱ్ఱుపెట్ట తలుపుతో సరియౌనె.

ఇట్టి యుపమలను కవి తనయనుభవమునుండియే తీసికొనును. ఎట్లనగా:—'పేలుకు పేలుకు ఆడే ఊరుకుంటాడుపో వోస్ సాంగశీతలమైన మందుగుడగుడలాడి సల్లబడినట్లు' అని శూద్రవైద్యుఁడనును. 'ప్రత్తిరాట్టములా ఏమి టాధ్వని' యని కమ్మసంసారి యనును. 'బ్రహ్మ కాయలా వాగకు' మని విప్రుఁడనును కావున నుపయోగించిన యుపమానములనుబట్టి మన మావ్యక్తిస్వభావము లూహింపవచ్చును. ఆవిధముగనే సాధారణవ్యవసాయకుఁడైన 'కాపు' ఉపయోగించునట్టి పైపదియుపములవంటియుపముల నెన్నిటినో యుపయోగించిన వేమనను 'సాధారణ వ్యవసాయకుటుంబములోనివాఁడు కాదు. ప్రభువంశములోనివాఁడని చెప్పుట సాహసముకదా? కాని 'వేమనచరిత్ర' మను ద్విపదకావ్యమునందు వేమునకుటుంబ మును ప్రభుకుటుంబములను వర్ణించినట్లు వర్ణించియున్నారు. అది కొంతవరకు నతిశ యోక్తియై యుండును. లేకున్న వేమన్నకుటుంబమువా రేదైన చిన్నగ్రామాధికారులుగా నుండియుండవచ్చును. ఆదినములలో గ్రామమునసబున కెంతయో గౌరవము జరుగుచుండె డిది. వేమన కూడ

ఆ. కాపుబల్మియున్న కరణాని కది బల్మి, కరణముబలిమెల్ల కాపుబల్మి
కాపుసంతసంబు కరణముసంతోష, మరసి చూడు లోకమందు వేమ.

కనుక గ్రామమునకు కరణము కాపు నిట్లుండ యగుచు నుభయు లుండిరేని
గండిపడి యుగళ ముండినరీతిని, బుద్ధి కూడి బ్రతుకుచుంద్రు, వేమ.

అని యనుభవమును చెప్పియున్నాఁడు. నీతిని గరపియున్నాఁడు. ఇప్పటికి వేమన 'రెడ్డి' 'కాపు' పర్యాయపదములుగా నుపయోగించుకులమునకుచెందిన నొకవ్యవసాయకుటుంబమునకు చెందినవానినిగా నిశ్చయించితిమి. కాని 'వడ్లవేర్లను రెడ్లపేర్లను చెప్పుట కష్ట'మని యన్నట్లు ఇతఁడు రెడ్లలో ఏతెగకుచెందినవాడని మన మెఱుంగవలసియున్నది. వేదాంతసిద్ధాంతమునందును, వేమనయోగీంద్రచరిత్రమునందును వేమన 'పాకనాటిరెడ్డి' యని యున్నది. కటారుపల్లెలో వేమనవంశీయులమని చెప్పుకొనువారు కూడ 'పాకనాటికాపుల' మని చెప్పుచున్నారు. మఱియు వేమన యొకచోట

ఆ. పాకనాటిరెడ్డి పరగ మోటాదెడ్డి, యెసఁగ తోటపెద్ద యెట్టిరెడ్డి
మొఱకులందరు భువి మొనగాండ్లు అయిరయా, వి...

అనినాడు. మొదట పాకనాటివారినే చెప్పుటవలన వేమన పాకనాటికాపనియే నిశ్చయింపవచ్చును.

## వైరాగ్యము

వేమన తండ్రి తుంగకేశవుఁడు, తల్లి లక్ష్మాంబ, సోదరులు పాపన్న కేశవనారాయణులు అని వేమనయోగిచరిత్రమునుండి తెలియుచున్నది. వేమన్న విరాగియగుటకు జనవాక్యమున నొకకథ యున్నది.

'వేమనకు నరసమ్మ యనువదిన యుండెను. ఆమె వేమన్నను తనకన్నకొమారుని మారుగా ప్రేమించుచుండెను. వేమన్న కూడ ఆమెను తనతల్లితో మర్యాదగా చూచుచుండెను. వేమన్న వివాహాదులు లేక వేశ్యాలోలుఁడై విశ్వద యను నొకవేశ్యాలంపటుఁడై తిరుగుచుండెను. ఈవిధముగా కొన్నిదినములు జరిగినపిమ్మట నొకనాఁడావేశ్య వేమన్నవదిన కుడిముక్కులోని ముక్కుపుడకను కోరెను. వేమన్న వదిన నావిషయము నడుగలేక చింతాక్రాంతుడై యూరకుండెను. అందులకు నరసమ్మ చింతించి వేమన్నను బుజ్జగించి నిక్కువమును కనుగొనెను. చింతింపవలదు నాముక్కుపుడకను నిచ్చెదను కాని నేను చెప్పిన దొకపని చేయవలయుననియెను. అదేదని వేమన యడుగ ఈముక్కుపుడకను వేశ్య చేతికి ఇయ్యవలదు. క్రిందపెట్టి వేశ్యను విగతవస్త్రయై వెనుకకు మొగ్గ వేసి తీసికొనుమని చెప్పుమని చెప్పెను. ఆవిధముగనే వేమన వేశ్యతో చెప్పెను. వేశ్య సిగ్గు చిన్ననాడే దార

బోసినది కనుక నొప్పుకొనెను. వేమన వేశ్యముందర నిలవఁబడియుండ వేశ్య నరసమ్మచెప్పిన ట్లావస్తువును తీసికొనెను. వేమన్న వెంటనే విరాగియయ్యెను. ఈకథ యెంతవరకు నిజమో కాని యిందులకు సంబంధించినపద్యములు వేమనపద్యములలో నున్నవి

ఆ. వెనుకఁ జూతమన్న వెసను కష్టపుగుంట, ముందు చూతమన్న ముఱికిగుంట
వెలఁది చూచి యేల వేడుకపడుదురు, వి...

యీపద్యమువలన పైకథ నిజమనియే నమ్మవచ్చు నదియుఁగాక,

ఆ. విటునిగన్న వలపు విశదమై యుండును, బోటిచూపునకును సాటిగలదె
కంటిలోనిపాప కుంటెనగాడయా, వి...

ఆ. బొల్లిమాటలాడు బోగముదానితో, దొల్లిడుల్ల నిల్లు గుల్లఁజేసి
వెల్లి రమ్మటంచు వెడలించు నింటిని, వి...

యని చెప్పియున్నాడు కనుక వేమనకు వేశ్యాపరిచయ మెక్కువగా నుండియుండునని తెలియుచున్నది. లేకున్న నింత యనుభవముగా చెప్పగల్గునా? పైకథకు ప్రబలాధార మేదన తనపద్యములమకుటమునందె తనవేశ్యనామమును పేర్కొని వినుమనుచున్నాఁడు. 'విశ్వదాభిరామ వినురవేమ' విశ్వద=వేశ్యపేరు (దానికి), అభిరాముడు=ప్రియుడు (అగు), వేమ=వేమన్నా, వినుర=వినుమురా అనుటవలన విశ్వద యనువేశ్యాలంపటుఁడై యిన్నిదినములు గన్నుగానక చరించిన వోవేమా! వినురా యని తనకుతానే చెప్పుకొనుచున్నాఁడు. పిమ్మట వేమన్న దిగంబరియై తిరుగుచుండెను. అందుల కీక్రిందిపద్యములే తార్కాణములు.

ఆ. తల్లిగర్భమందుఁ దాఁ బుట్టినప్పుడు, మొదలు బట్ట లేదు తుదను లేదు
నడుమ బట్టఁ గట్ట నగుబాటు కాదొకో, వి...

ఆ. గోచి యూడెననుచు గోతి యాటలనాడి, వెఱ్ఱియోగి నూరు వెడల మంద్రు
ఎవరిగోచు లూడ వీప్రొద్దు గ్రుంకిన, వి...

## ఖం డ న ము లు

వేమన్న మతములను మానవులచర్యలను ఖండించియున్నాఁడు. తాను చెడ్డదను కొన్నదాని నెల్లను అభిమానము చూపక గర్హించియే యున్నాఁడు. ఇందుల కుదాహరణ ముల నిచ్చుటకన్న వేమనపద్యముల నొకతూరి పఠింపుఁడని చెప్పుట మేలని తలంతును. కాని మనసుండక కొన్ని క్రింద కనపరతును.

మతము.—

ఆ. ఆఱుమతములకన్న నధికమైనమతము, లింగమతముకన్న లేదు జగతి
లింగదారికన్న దొంగలు లేరురా, వి...

ఆ. పట్టుబట్టగట్టి పట్టెనామముబెట్టి, వట్టి భ్రాంతిజెంది వైష్ణవుడయి
లొట్టి దాగి యతఁడు లోకులఁ జెఱచురా, వి...

ఆ. అచ్చువేసికొనుచు నడియేని ననుచును, తమ్మ దిన్న వెనుక దాసుఁ డనిన
పరమపదమురాదు ప్రకటనార్థమెగాని, వి...

ఆ. ఎంబెరుమతమందు నెసఁగ మాంసము తిని, మారుపేరుబెట్టి మధువు ద్రావి
వావివరుసదప్పి వలికిపాలౌదురు, వి...

స్త్రీలు.—

ఆ. సతులు జపతపములు సేయగ సాగితే, పురుషు లేల యికను పుడమిలోన
బాప మెంచవద్దు పట్టి శిక్షింపుఁడీ, వి...

కులములు.—

ఆ. వేముకన్న విషము వెఱ్ఱిపుచ్చు ధరిత్రి, పాముకన్న విషము ప్రథమశాఖ
నాభికన్న విషము నల్లనిబాపడు, వి...

ఆ. కోయిటోనినిష్ట గుఱికి రా దెన్నడు.

ఆ. పేరు సోమయాజి పెనుసింహబలుఁడయా, మేకపోతుబట్టి మెడలు విఱుచు
గాక క్రతువువలన గలుగునా మోక్షంబు, వి...

## కవిత

వేమన కవిత్వము పరిశ్రమచేసి నేర్చికొన్నదికాదు. తనమాతృభాష. తనతల్లికడ నభ్యసించినభాష. సజీవమగు తెలుగుభాష. కృత్రిమాలంకారములు లేక సహజాలంకారములతోఁ గావ్యసంప్రదాయసంపర్క మంతగా నెఱుఁగని సహజభాష. ఈతనినోటినుండి వెలువడినభాషయే కవిత్వము. ఈతనికి ఛందోవ్యాకరణజ్ఞానములుకూడ వినికిడివలన గలిగిన వేకాని పరిశ్రమచేసి నేర్చికొన్నవి కాదు. అతని నిరంకుశభావప్రకటనమే కవిత్వము. చిన్న చిన్నమాటలతో పెద్దపెద్దభావములఁ గష్టపడకుండ, క్లిష్టాన్వయములు లేకుండ పండిత పామరజనవేద్యముగాఁ జెప్పుచుఁ బోయెను. వ్యాకరణశుద్ధి, ఛందోనియమము, అలంకార

విభేదములు, మొదలగుసారస్వతనియమము లున్ననే కవిత్వమని యెంచి యొక్కొక్కని కవిత్వమును జూచినప్పుడెల్ల వానివలె వ్రాయవలెనను పిచ్చిపట్టి నేడు నన్నయవలెను, రేపు పోతనవలెను మరునాడు రవీంద్రునివలెను వ్రాయబోయి చెడునట్టి యంగడికవులవలె కాక వేమన ఫలాపేక్షలేక యితరులను సంతోషపరచుటకుగాక తాముచేయుపనికి భవిష్యత్కాలమునఁగలుగఁగలవిలువను గమనింపక, 'నీకవనము బాగుగలేదు నీరస'మని యెవ్వరైన ననినఁ బాగున్నదనికాని యందు రసముకలదనికాని వారితో వాదించి స్థాపింపక, నిందనము నందనము రెండును నొక్కటిగా చూచుచు కవిత్వమునకు నూతనాభిరుచిని గల్పించుచు నిచ్చవచ్చినప్పు డిచ్చవచ్చినట్లు కవిత్వమును పాడుకొని సంతోషించుచు నిర్దాక్షిణ్యముగా తమకంటి కెదురుపడిన ప్రతివస్తువును గర్హించి ఖండించుచుండెడి వేదాంతకవుల (Metaphysical poet)కుఁ జెందినవాఁడు. ఈతడు 'రసాత్మకమ్ కావ్యమ్' అనువాఁడు. ఊరక యతిగణప్రాసలనేర్చివేసి కష్టపడి ఛందస్సును కుదిర్చి వ్రాసినకవిత్వము నీతడు క్రింది విధముగా గర్హించినాడు.

ఆ. నిక్కమైన మంచినీల మొక్కటి చాలు, తళుకుబెళుకురాళ్లు తట్టెడేల
చదువ పద్యమరయ చాలదా యొకటైన, వి...

కనుక నీతనికవనమునందు ఛందోభంగములు గ్రామ్యరూపములు నిండియున్నవి.

1. పిడుగుపడినఁ గొంప నడికిఁ గూలు
2. పెద్ద లుసుకుమన్న పెనుమంట లెగయవా?
3. గంధంబు మోసుక గాడిద తిరుగదా?
4. మెలగెడు ద్విజులెల్ల మేదినందు.

కాని తెలుఁగుభాష జాతీయము (Idiom) నీతనివలెఁ గావ్యమున నుపయోగించినకవి యిక లేఁడనియే చెప్పవచ్చును.

ఆ. ఔనటంచు నొక్కఁ డాడినమాటకు, కాదటంచుఁ బల్కఁ గ్షణముపట్టు
దాని నిలువదీయఁ దాతలు దిగవలె, వి...

పైపద్యమునందు క్రిందగీతలు గీచినపదముల జాతీయత వేమన్న తెలుఁగునోరు నెంతగా చెప్పుచున్నదో చూడుఁడు. ఇక నాతనియుపమలను చెప్పనక్కఱలేదు. ఈతఁ డుపమలలోఁ గాళిదాసంతటివాఁ డనుటలో నేమియు నాశ్చర్యములేదు.

ఆ. ఉప్పుకప్పురంబు నొక్కపోలికనుండు, చూడఁ జూడ రుచులజాడ వేరు
పురుషులందుఁ బుణ్యపురుషులు వేఱయా, వి...

ఈపద్యమునందలి సాధర్మ్య మెంత సాగదీసినను సాగుచున్నది. ఇట్టి యుదాహరణములను వేమనపద్యములనుండి వందలకొలఁది నీయవచ్చును. ఈతనిపద్యములలో వేదాంతరహస్యార్థము లున్నవి. ద్వంద్వార్థము లున్నవి. వానిబాహ్యార్థములు వేరు.

ఆ. చెప్పులోని రాయి చెవులోని జోరీగ, కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత కాదయా, వి...

బాహ్యార్థము స్పష్టముగా నున్నది. వేదాంతార్థము (నీవు) చెప్పు=చెప్పుము, లోని=నీశరీరములోని, రాయి=పరమాత్మను, చెవులోనిజోరీగ= చెవిలోనిప్రణవనాదమును, (నేను) కంటి=చూచితిని, లోని=నాలోని, నలుసు = పరమాత్మకిరణలేశమును, కాలిముల్లు=సంసారమును, ఇంటి=వింటిని, లోని=నాలోని, పోరు=తగవులాటను, యింతింత కాదయా=యింతని చెప్పుటకు వీలులేదు.

## ప ద్య ము ల సం ఖ్య

వేమన వ్రాసినపద్యము లెన్నియని చాలమంది కనుమాన ముండవచ్చును. వానిని యిన్నియని చెప్పుటకు వీలులేకున్నది.

ఆ. శ్రీకరశివతత్వశీలుఁడా వేమన్న, పదియు నైదు వేలపద్యములను
లోకమందుఁ జెప్పె ప్రాకృతుల్ దరిజేర, వి...

అని తాను 15000 పద్యములఁ జెప్పినట్లు చెప్పియున్నాడు. కాని మనకిప్పుడు రమారమి 5000 పద్యములు గానవచ్చుచున్నవి. మిగతవి కనపడుటలేదు.

## నీ తు లు

వేమన చెప్పినట్లు మరి యేకవియు నీతుల చెప్పియుండలేదు. భర్తృహరికూడ అన్ని నీతుల చెప్పియుండలేదు. పురాణేతిహాస, భారతభాగవతరామాయణాదినీతుల, తన కనుభవముననున్న నీతుల, తనకంటబడిన దురాచారదురాభ్యాసముల నడచివేయునీతుల నెన్నిటినో చెప్పియున్నాఁడు. ప్రతిపద్యము, ప్రతిపాదము, ప్రతిపదము, ప్రతియక్కరము నీతిబోధదాయకమై యున్నవి. ఉదాహరణములఁ జూపవలెనన్న వేమన వేలపద్యములనే యిచ్చట వ్రాయవలసియుండును. అయినను రెండుమూడు వ్రాసెదను.

క. మొదట తనమతము వదలక, తుద నెవ్వరిమతమునైన దూషింపకయుఁ
పదిలుఁడయి కోర్కె గోరక, ముదమునఁ జరియించువాఁడె ముఖ్యుఁడు వేమా!

ఆ. తండ్రికన్న సుగుణి తనయుఁడై యొప్పగా, చిన్నపెద్దతనము లెన్న రెవరు
వాసుదేవు విడచి వసుదేవు నెంచిరా, వి...

ఆ. చంపదగిన యట్టిశత్రువు తనచేతఁ, జిక్కెనేని కీడుసేయరాదు
పొసఁగ మేలుచేసి పొమ్మనుటే చాలు, వి...

ఆ. యోనియందె పుట్టి యోనికి రుచిచేయు, చన్నుగుడిచి పెరిగి చన్నుబట్టి
సృష్టిలోన ప్రాణి సిగ్గేల యెరుగదు, వి...

ఈవిధముగా సంసారము మాయ, శైవులు శ్వపచులు, వైష్ణవులు త్రాగుబోతులు, లింగదారులు దొంగలు, విప్రులు గాడిదెలు, బట్టకట్టుకొనినవారు భడవాలు, బిడ్డలు రక్తపుముద్దలు, దంపతులు బూతులు, యజ్ఞములు రంభాసంభోగములు, తద్దినములు దగాలు, అని సర్వసృష్టిని తెగడుచు భావవైశాల్యము, ఉపమానసంధానశక్తి, విమర్శనజ్ఞానము, సృష్టితత్వవిజ్ఞానము, వచోసౌలభ్యము, సహజధార మొదలగుసద్గుణముల గల్గి ముద్దుమూటలొల్కు తేటతెలుంగుమాటలచే పద్యములఁ జెప్పుచు వేమన గండికోట మొదలగుస్థలములన్నియుఁ దిరిగి కడపట చరమదశయందు పూర్వము కడపమండలమునకుఁ జెందియుండి యిప్పుడు అనంతపురము మండలమునకుఁ జెందియున్న కదిరితాలూకాలోని కటారుపల్లెలో శివసాయుజ్యమందెను.



సర్: ఏ. పీ. పాత్రోగారు:—

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నిరాడంబరముగాను పూనికతోను చేసినసేవ ఉచితరీతిని ఆమోదమొందుచున్నదని సంతసించుచున్నాను. సారస్వతమునకు ఇంత చక్కనిసేవచేసినవారు ఇంకొకరు ఈరాష్ట్రమునందు లేరు! తెనుగు సంస్కృతములలోని ప్రాచీనకావ్యములను సవిమర్శకదృష్టితో ప్రకటించుటయందు వీరు నూతనోత్తేజమును చూపిరి. పండితులగు వీరితండ్రిగారిగౌరవము మర్యాదలను చక్కగానిలిపిరి. ప్రజాహితజీవనమునకు వీరు ఎల్లప్పుడును హృదయపూర్వకముగాపనిచేయుటకు సిద్ధులైయుండినారు.

# రాయలసీమకవులు

శ్రీకళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మగారు, కడప.

## నాచనసోమనాథుఁడు.

ఈమహాకవి ఉత్తరహరివంశమను ప్రౌఢకావ్యమును రచించి సుప్రసిద్ధిం గాంచెను. ఆఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. నాచనకుమారుఁడు. ఈయుత్తమగ్రంథమును హరిహరనాథున కంకిత మొసంగి ధన్యుఁడయ్యెను. హరిహరనాథున కంకితము చేయుటంబట్టియే నెల్లూరు మండలమున నేనగరమందో, యేమహాగ్రామమునందో, ఏగ్రామమునందో, ఏపల్లెయందో నివసించినవాఁడని యూహింపఁబడినది. ఎఱ్ఱాప్రగడకుఁ దరువాతివాఁడనియు ననుమానింపఁబడినది. అంతతోఁ బోక ఎఱ్ఱనకవిత్వమునందుఁ బ్రీతిలేనివాఁడనియు; ననఁగా నది ప్రౌఢముగా నుండలేదనునభిప్రాయము కలవాఁడనియు శంకింపఁబడినది. అంతమాత్రమునఁ జరిత్రకారులు వదలినవారు కారు. ఎఱ్ఱనకవిత్వమునకంటె సర్వవిధముల మేలైనదనియు, నొక్క యెఱ్ఱనకవిత్వమే కాదు. భారతగ్రంథకర్తృత్రయమునం దనేకుల కవిత్వము కూడ గొన్నివిషయములలో నీతనికవిత్వమునకు సమానము కాదనియు నొక్కి వక్కాణించిరి. పైవాక్యములో భారతకర్తలకవిత్వమనియే కదా తాత్పర్యము. నన్నయ తిక్కన ఎఱ్ఱన యనువారేకదా భారతకవులు. ఎఱ్ఱాప్రగడను బేర్కొని తరువాత ననేకులనుటంజేసి యిరువురనియే కదా యర్థము. కవిత్రయము కవితకన్న మేలుబంతి సోమనాథుని కవిత్వమని యభిప్రాయమైనట్లు కనుపట్టు. అతిశయోక్తి యనునలంకారము కలదు. అద్భుతాతిశయోక్తియు నుండవచ్చును. కాని యత్యద్భుతాతిశయోక్తి యనునది యున్నదని యెవ్వరు చెప్పినట్లు గానము. ఇప్పలు కద్దాని కుదాహరణముగా గ్రహింపవచ్చును. మెప్పునకుంగూడ నొకహద్దున్నదని వీరెఱుఁగరు కాఁబోలు.

ప్రౌఢ మనఁగా నర్థమేమి? వృద్ధినొందినదని కదా. శబ్దార్థాలంకారభూయిష్ఠమని తాత్పర్యము. ప్రౌఢిమ యనునది దీని పర్యాయపదమే యనవచ్చు. ఏగ్రంథము నందైన నెందే నొకతావునఁగాక పెక్కుతావుల లేక ప్రాయికముగా నట్టుండుటంజేసి ప్రౌఢముగా నున్నదందురు. శబ్దచిత్రము, అర్థచిత్రము, ఈయుభయము ప్రధానముగాఁజేసి కొని గ్రంథముల రచించినవారున్నారు. ఒక్కొక్కరి కొక్కొక్కదానిపై నిష్టముండును.

నాచనసోమనాథునియం దన్నియు సమములుగానున్నవనవలయును. అంతటిమాట తెగించి వ్రాయుట సాహసమేమో. పట్టుదలంబూని తాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనువారికి నచ్చఁజెప్పుట కష్టమేమో ! ఏవిషయమున నన్నయాదుల మించెనో తెలిపియుండిన బాగుండెడిది. కొన్నివిషయములలో ననుట మొత్తముమీఁద ననుట సాధారణముగా ననుట యిట్టివన్నియు గోడమీఁదిపిల్లివలె నిదమిత్థమని సిద్ధాంతముచేయ నవకాశ మీయనివని గ్రహింపవలసియుండును. కవిత్వపటుత్వసంపదనుబట్టి సర్వజ్ఞుఁడని బిరుదుపేరు వచ్చినది. ఆపేరున కీతఁడు తప్పక తగినవాఁడే అనువాక్యములు రెండును బహుపాత్రైకదోష తకములే. కవిత్రయము గాక పోతన శ్రీనాథాదులకుం గూడ నీబిరుదు చెల్లునన్నఁ జెల్లదనుటెట్లు ? ఈపైవ్రాఁతవలన నీమహాకవికవిత్వమున నాకసూయగలదని గ్రహించువారుందురేని వారికిఁ బదివేల చేమోడ్పులు. సాధుమతులు నాభావ మెద్దియని గ్రహింపక పోరన్నవిశ్వాసము నాకుఁ గలదు.

ఈతనికాలము నిర్ణయించుట కొకశాసనము దొరకినదనియు, దానింబట్టి భారద్వాజసగోత్రుఁడు, ఆపస్తంబసూత్రుఁడు, సకలాగమవేది, అష్టాదశపురాణార్థవిదుఁడు, అష్టభాషాకవిత్వరచనావిశారదుఁడు, నాచనకులాంభోధిసోముఁడు అనునివి తెలియవచ్చుచున్నవనియు చరిత్రకారులు వ్రాసిరి. ఆశాసనమునుండి కొన్నిభాగము లుదహరించెదను.—

తారణాబ్దే చైత్రమాసే నవమ్యాం శుక్లపక్షకే. ౧౭
పంపాయాం భాస్కరక్షేత్రే విరూపాక్షస్య సన్నిధౌ,
ఆపస్తంబాఖ్యసూత్రాయ ఆభారద్వాజాన్వవాయినే. ౧౮
యాజుషాణాం వరేణ్యాయ సకలాగమవేదినే,
అష్టాదశపురాణానా మభిజ్ఞాతార్థవేదినే. ౨౦
అష్టభాషాకవిత్వశ్రీవాణీవిజితసంపదే,
సోమాయ నాచనాంభోధేస్సోమయామితతేజసే. ౨౧
గుత్తి దుర్గాభిధే రాజ్యే కోడూరాఖ్యమహీతలే,
పెన్నమాగాణివిఖ్యాతే సర్వసస్యోపశోభితే. ౨౨
కోడూరు నాగమల్లాఖ్య భిన్నాఖ్యా మపి పశ్చిమం,
గ్రామోత్తమాద్వేళు మంకూరోః ప్రాచ్యాద్దిశి సమన్వితమ్. ౨౩
ఊరచింతలనామ్నశ్చ గ్రామాద్దక్షిణసంస్థితం,
వంగలూరోడ్డుతాళాభ్యా ముత్తరాశాముపాశ్రితమ్. ౨౪

పినాకినీతటే పెంచుకలదిన్నాహ్వాయం పురా,
బుక్కరాయపురాఖ్యాతప్రతినామ్నా చ శోభితమ్. ౨౫
నిధినిక్షేపసంయుక్తం జలపాషాణసంయుతం,
అక్షీణ్యాగామిసహితం సిద్ధసాధ్యసమన్వితమ్. ౨౬
అష్టభోగ మిదం సర్వస్వామ్యమాచంద్రతారకం,
సహిరణ్యపయోధారాపూర్వకం దత్తవాన్ముదా. ౨౭
శ్రీమన్నాచనసోమాఖ్య మహాకవివరోప్యథ,
రాజాన మాశిషం చైవ చిరజీవీ భవత్వితి. ౨౮
స్వయమన్వకరోద్వృత్తిం దశోత్తరశతం కవిః,
షట్త్రింశదత్ర భాగాస్స్యుర్యజమానాహ్వాయ స్తతః. ౨౯

అని యందే ముద్రింపఁబడినది. ఈశాసనముంబట్టియే నాచనసోమనాథుని యోగ్యత నిర్ణయింప వలనుపడునా? ఈశ్లోకములవైఖరి మనకిపుడు చర్చింప నవసరములేనిదే. ఇందుఁగల విశేషణముల ననుసరించియే యీమహాత్ముని యోగ్యత నిర్ణయింప వలనుపడదు. ఉత్తరహరివంశమునుబట్టియే నిర్ణయింపవలయును.

పెంచుకలదిన్నె కడపమండలమున నుండునది. అందు ముప్పదియాఱుభాగములు సోమనాథునకు బుక్కరాయలచే నీయఁబడినవి. ఈదానము శ్రీవిరూపాక్షస్వామిసాన్నిధ్యమునందు భాస్కరక్షేత్రమునఁ బంపాఖ్యసరోవరముకడ నీయఁబడినది. గ్రామము కడపమండలములోనిది. ఇచ్చువారు విరూపాక్షక్షేత్రమునకుఁ జెంతనుండు విజయనగరవాసులు. ప్రతిగృహీత లెందుండువారని యూహింపవచ్చునో తెలియఁజాలకున్నాఁడను. నెల్లూరువారను ప్రమాణవచనము దొరకునంతదనుక నీమహాకవి కడపమండలవాసుఁడనియే నిర్ణయింపవలయును. లోకస్వభావానురూప మిదియే హరిహరనాథున కంకితము నిచ్చెనన్న కారణము ననుసరించి నెల్లూరుమండలనివాసుఁడనుట న్యాయదూరము "తిక్కయజ్వకు నాచనసోమునకు మఱియు నాకుం దక్క" అన్న వాక్య మందఱెఱింగినదియే. హరిహరనాథుఁ డనఁగాఁ బరబ్రహ్మమని పరతత్త్వమని భావము. అట్టి పరతత్త్వమున కంకితము చేయువారు కొలఁది మందియే యుందురు. దానినింబట్టియే నెల్లూరుమండలమువాఁడనుట విరసము. కడపమండలమువాఁడనుటయే సరసము. పెంచుకలదిన్నెకు సమీపమున నివసించువాఁడనుట సముచితము.

## త్రిలిఙ్గరజతోత్సవము

ఈమహాకవి కవిత్రయము తర్వాతికవులలోఁ బ్రథమగణ్యుఁ డనవచ్చునని కొందఱి మతము. అది యుచితముకా దనునంతయవసర మేదియుఁ గానరాదు. సంస్కృతాంధ్రముల యం దనూనపాండిత్యము గణించి మహాకవి యనుప్రఖ్యాతిం గాంచెను. ఎఱ్ఱనకవిత్వము ప్రౌఢముగా నుండ లేదన్నయభిప్రాయముతో నీతఁ డీయుత్తరహరివంశమును రచించె ననుట సరసముగా నుండఁజాలదని నాభావము. హరివంశమునఁ గొంతభాగము వ్రాయ నిష్టపడెననుట న్యాయ్యము. ఎఱ్ఱనార్యుఁడు స్వభావోక్తిని వివరించుటలో నిస్సమానుఁ డన వచ్చును. ఒక్కయుదాహరణముం జూపెదను. శ్రీకృష్ణబాల్యచేష్టలను దెలుపునపుడు

సీ. పాలుపారఁగా బోరగిలి పాన్పు నాల్గుమూలలకును వచ్చును మెలఁగి మెలఁగి
లలిఁ గపోలంబులు గిలిగిలింతలు పుచ్చి నవ్వింపఁ గలకల నవ్వి నవ్వి
ముద్దులు దొలుకాడ మ్రోఁకాలఁ గేలను దడవుచు నెందును దారి తారి
నిలుచుండఁబెట్టి యంగుళు లూఁత చూపఁగాఁ బ్రీతిఁ దప్పడుగులు పెట్టి పెట్టి
తే. అన్నఁ గంటిఁ దండ్రిని గంటి నయ్యఁ గంటి, నిందు రావయ్య విందులవింద వనుచు
నర్థిఁ దనుఁ బిలువఁగ నడయాడి యాడి, యుల్లసిల్లెఁ గృష్ణుఁడు శైశవోత్సవముల.
౫ ఆ. ౧౯౩ ప.

ఇంకొక్క యుదాహరణము.—

సీ. ఎదువు తిప్పలుగొని యెల్లమందలు గొణుజెక్కు మేపులచోటు త్రొక్కువడియెఁ
చరులోలి నఱుక మొదళులు చిక్కంగ జొంపము లేది జాడలు వడియెఁ బొదలు
మడువులు పసులకాల్మడిఁ బుచ్చె దొరుగండి వ్రంతలు పెనురొంపి వ్రంతలయ్యెఁ
బూరి పంటలు చెడిపోయె రాయిడిఁ గ్రంపలోనుగా దవ్వులఁగాని లేదు
తే. ఫులుఁగు పూరెడు ప్రియపడి పొలములందు, మెలఁగి వెదకినఁ బుట్టదు మెకము లడఁగెఁ
గూరగాయ కట్టియ విల్చి కొనఁగవలసి, యునికి వ్రేపల్లె వీటిపట్టునకు దొరసె.
౬ ఆ. ౫ ప.

ఈయుదాహరణములనుబట్టి పరికించిన స్వభావోక్తివర్ణనమునం దసమానుఁ డీతండని తోఁపదా?

మ. మహితశ్రావణమేచకాష్టమి నిశామధ్యంబునన్ బ్రస్ఫుర
ద్గ్రహముల్ స్వోచ్చగృహంబులందయిదు విభ్రాజిల్లఁ బుత్త్రున్ యదూ
ద్వహుఁ బుణ్యాంగన గాంచె విశ్వజగదాధారోదయున్ ధర్మని
ర్వహణారంభధురీణు నిత్యవిభుతావర్ధిష్ణునిం గృష్ణునిన్. ౫ ఆ. ౧౧౬ ప.

సీ. గోపికానయనచకోరపూర్ణేందు వి వ్వదనంబు మధురవాగ్వైభవంబు
లక్ష్మీస్తనాభోగలాలితం బిమ్మహావక్షంబు శ్రీవత్సలక్షణంబు
దైత్యనిర్మథనదుర్దాంతదివ్యాయుధార్హ్యంబు లీభుజములు లతాయతములు
త్రైలోక్యనిత్యశరణ్య మీచరణద్వయంబు నిసర్గరక్తాంగుళీక
తే. మీతనికెకాక యమరునె యితరమూర్తి, కీలసన్మేఘసమవర్ణుఁ డీసువర్ణ
పర్ణవాసుఁ డీకౌస్తుభోదీర్ణహారుఁ, డచ్యుతుఁడు సర్వదేవతాభ్యర్చితుండు.

౮ ఆ. ౧౩౮ ప.

మచ్చున కీరెండుపద్యములం జూపితిని. సంస్కృతవాక్యరచన యెంతసుకుమారమో పరికింపుఁడు. ఇట్టి మహాకవి ప్రబంధపరమేశ్వరబిరుదాభిరాముఁడు నగుశంభుదాసునికవిత్వము ప్రౌఢముగా నుండలేదని నాచనసోమనాథుఁడు హరివంశమును వ్రాసె ననునభిప్రాయము సరసముకాదని నాయాశయము.

ఇఁక సోమనాథమహాకవి కవితాప్రౌఢిమ నించుక పరిశీలించి కృతార్థుఁడ నగుటకుం బ్రయత్నింతును.

క. ఘను నన్నయభట్టునుఁ దిక్కన నెఱ్ఱాప్రగడఁ బొగడి యలికంబున న
క్షుని డాఁచినట్టి సర్వజ్ఞుని నాచనసోమనాథు స్తుతి యొనరింతున్.

అని పరవస్తు చిన్నయసూరిగారు వినుతించిరి. దీని నాధారముగాఁ జేసికొని శ్రీబహుజనపల్లి సీతారామాచార్యులుగారు "ఆగ్రంథమిక్కడ సమగ్రముగాఁ జిక్కకపోయినను జిక్కినంతవట్టు పరికించిచూడఁగా నది మిక్కిలి ప్రౌఢముగను భారతమునకంటె నెల్లవిధముల విశేషించినదిగను గానంబడుచున్నది" అని వ్రాసిరి. ఇది సత్యమా యని పరిశీలించితిమేని సత్యదూరమని తోఁచెడిని వారిశైలికిని దీనికిని సంబంధమే లేదు. సూరిగారిపద్యమును నమ్మి ఆచార్యులుగారు పొరపడిరనక తప్పదు. సూరిగారికి భారతకవులపై గౌరవములేదన వలనుపడునా? తిక్కనఎఱ్ఱాప్రగడలకుఁ దగినవిశేషణములను జేర్పక ప్రాసపూరణార్థము "అక్షుని డాఁచినట్టి సర్వజ్ఞుని" అని వర్ణించె ననవలయు. ప్రబంధపరమేశ్వరుఁడని శంభుదాసునకు బిరుదముకలదని సూరిగారెఱుంగరా? పాపము వారు ప్రాసము నీమిషచే రక్షించుకొనిరనక తప్పదు. విశేషించి కవిత్రయము తరువాతిలోఁగూడ నీతని కుద్దియగువారు లేరనుటయు మహాపాపమేమో. మనమిచట నట్టిపరిశీలనమునకుం బూనక వీరిశైలిం బరిశీలింతము.

సీ. అభ్రంకషంబైన యాలపోతు నితండు త్రుంచినాఁ డీతఁడు పెంచినాఁడు
సాధుసమ్మతముగా సామజంబు నితండు గాచినాఁ డీతఁడు ద్రోచినాఁడు

బర్హిర్ముఖార్థమై పర్వతేశు నితండు దాల్చినాఁ డీతఁడు వ్రాల్చినాఁడు
ఫణపరంపరతోడి పన్నగేంద్రు నితండు మెట్టినాఁ డీతండు చుట్టినాఁడు
తే. నేఁడు నాఁడును నాఁడును నేఁడు మనకుఁ, జూపఁ జెప్పంగఁ జెప్పంగఁ జూపఁగలిగె
ననుచుఁ గొనియాడుసంయమిజనుల కొదవె, రజతగిరిమీఁద హరిహరారాధనంబు.
౨ ఆ. ౧౭౬. ప.

శా. జంభారాతివిజృంభమాణహృదయోత్సాహైకసాహాయ్యుఁడై
యంభోజాసనుపంపునన్ జని ప్రసూనాస్త్రున్ దలంచెన్ నటా
రంభస్తంభనదంభభేదవిహరద్రంభాపరీరంభణ
స్తంభాసంభవగుంభరత్నరచనాస్థానస్థితస్థేముఁడై. ౨ ఆ. ౧౫౫. ప.

సీ. మకరంద మూని మైమఱచినగొనయంబు పెడమ్రోయఁ గడివోని వింటితోడ
జలజకేసరరాజి జల్లిదెమూఁకగా దాఁటువతారిరథ్యములతోడఁ
గర్ణికారపుమొగ్గ కనకంపుగుబ్బఁగాఁ గోయిల నోరూరు గొడుగుతోడ
రతికన్నుఁగవ మచ్చరముచేయు టెక్కెంబు వడఁక వీతెంచు సేవకులతోడ
తే. వలపుఁదూపులు గరసాన వాఁడిచేసి, మందునెలతోడఁ దన మేనమామమైన
నిండునెలతోడ వలరాజు నిర్జరేంద్రు, సభకు నేతెంచె భుజబలోత్సాహ మెసఁగ.
౨ ఆ ౧౯౦. ప.

ఈపద్యరత్నములం దిలకించితిరి. శైలి యెంత ప్రౌఢమో తెలియనయ్యెఁగదా. సమాసబాహుళ్యముగల శార్దూలపద్యముం బరికింపుఁడు. ఈక్రింద నుదాహరింపఁబడు శ్రీనాథునిపద్యముం బఠింపుఁడు.

శా. ధాటీఘోటకరత్నఘట్టనమిళద్ధాత్రీఘృష్టకళ్యాణఘం
టాటంకారవిలుంఠలుంఠితమదోన్మత్తాహితక్షోణిభృ
త్కోటీడాకితకుంభినీధరసముత్కూటాటవీఘాటక
ర్ణాటాంధ్రాధిపసాంపరా యని తెలుంగా నీకు దీర్ఘాయువౌ.
శా. గంభీరప్రతిపక్షరాడపయశః కాళిందియున్ వీనిదో
స్తంభోద్భూతయశోభ్రగంగయు ననిన్ సంశ్లేషముం బొందు; నా
సంభేదంబునఁ గ్రుంకి కాంచును మహాక్షత్త్రంబు రంభాపరీ
రంభానందనికేతనందనవిహారప్రౌఢివిస్రంభముల్
వాగనుశాసనునిదగు నీపద్యములం గాంచుఁడు.

మ. మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసం
పదలోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయుల్ ధర్మజుఁ దత్సభాస్థితు జగత్పూర్ణప్రతాపోన్నతున్.

చ. దళితనవీనకందళకదంబకదంబకకేతకీరజో
మిళితసుగంధబంధురసమీరణుఁడర్ల సఖుఁ డూఁచుచుండఁగా
నులియుచు మొల్లగుత్తులను నుయ్యెల లొప్పుగ నెక్కి యూఁగెను
ల్లలదళినీకులంబు మృదులధ్వనిగీతము విస్తరించుచున్.

కవిబ్రహ్మగారి యీపద్యముం దిలకింపుఁడు.

శా. దుర్వారోద్యమబాహువిక్రమరసాస్తోకప్రతాపస్ఫుర
ద్గర్వాంధప్రతివీరనిర్మథనవిద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్డు నిను దోర్లీలన్ వెసం గిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిం గీచకా.

సీ. తెలిగన్నుఁగవకాంతి పాలుపార నించుక గనువిచ్చి చూచినఁ గాదె యబల
చెలువంపునెమ్మోము నెలమిసొంపినుమడిగా నల్లనవ్వినఁ గాదె యింతి
దంతముక్తికరుచి దలకొన మఱుమాట పలికినఁగాదె యుత్పలదళాక్షి
యుల్లంబుసరసత దెల్లంబుగా లీలఁ గైకొన్నఁగాదె పంకరుహవదన

ఆ. యనుచుఁ జూచుఁ జేరు నమ్ముగ్ధపలుకులు, వినఁగఁ గోరుఁ గేలు తనదు కేలఁ
గీలుకొలుపఁ దలఁచుఁ గీచకాధముఁడు నిజాసురక్తిఁ దెలుప నప్పళించు.

ఈపద్యరత్నముల నొక్కొక్కదానిని బరిశీలించి యిందేది యుత్తమము, ఏది మధ్యమము. ఏది యధమము అని తీర్మానించు నవకాశము కలదా? ఒక్కొక్కదానియం దొక్కొక్క ప్రౌఢిమ యలరారుచుండును. వీరిని నాచనసోమనాథుఁ దేవిషయమున మించఁజాలెనో యెఱుంగఁజాలక యున్నాఁడను. భారతకవులతర్వాతివారిలో శ్రీనాథాదు లీతనికిం దీసిపోవువారా. కారనియే నావిశ్వాసము. ప్రౌఢకవి యనుమాట సత్యము. ఎల్లరను మించునన్న మాట కేవల స్తుతివాక్యమని నామనోనిశ్చితము.

ఇట్లనుటంజేసి యీసోమనాథుఁడు సామాన్యుఁడని చెప్పందలంచితినని భావింపరాదు. సర్వజ్ఞబిరుదాభిరాముఁడే యనువారిమాటకుం దలయొగ్గుదు. భారతకవిత్వమునకం టె ననేక

విషయముల నీసోమనాథునికవిత మిన్నగ నున్నదన్నను డికి నంగీకరింపఁజాల నవలసి యున్నది. ఇట్టిమహాకవి కడపమండలవాసుఁడని యనువదించుటయే నాకుతూహలము. రాయలసీమ యిట్టిసత్పుత్త్రులం గాంచి కడుధన్యురాలయ్యెననుట ముఖ్యవిషయము. ఇఁక వీరి తరువాతివాఁడగు పోతనకవీంద్రునిగుఱించి నాలుగుమాటలు వ్రాసెదను.

## పోతనకవిచంద్రుఁడు.

ఇమ్మహాకవి శ్రీభాగవతము నాంధ్రీకరించెను. ఈతఁడాఱువేలనియోగిబ్రాహ్మణుఁడు. కౌండిన్యసగోత్రుఁడు. ఆపస్తంబసూత్రుఁడు. తండ్రిపేరు కేసన్న. తల్లిపేరు లక్కాంబిక. ఇంటిపేరు బమ్మెరవారు. నరకేసరి యనుపేరు తాఱుమాఱయి తుదకు నది కేసన్న యనఁబడెను. లక్ష్మమ్మ లక్కమ్మగా మార్పునొంది పిలువఁబడెనని యూహింపవలయు. ఇమ్మహాకవి శైవుఁడని కొందఱందురు. అది న్యాయదూరము. అద్వైతభక్తికి శివకేశవభేదము లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" యనుదానిని నమ్మువా రద్వైతులు. సకలదేవతలు భగవదంశములు. సర్వేశ్వరుఁ డుపాసకులతృప్తికొఱకు బహువిధరూపనామములం దాల్చును. ఏరూపము నేనామమును ధ్యానించినను స్మరించినను నాపరమాత్మకే యది చెందుననునదియే యద్వైతవిశ్వాసము. అట్టి విశ్వాసముగలభక్తుఁ డీపోతన యనుదానిని.

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని, గలుగ నేటికిఁ దల్లుల కడుపుచేటు.

అను నీపద్యము దృఢపఱచుచున్నది. భాగవతాంధ్రీకరణము తనయదృష్టలబ్ధమని సంతోషించెనని యీక్రిందిపద్యము తెలుపుచున్నది.

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
తెనుఁగుంజేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు తానెట్టిదో
తెనుఁగుంజేయరు మున్ను భాగవతమున్ దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్.

గ్రంథము రామాంకితముచేసి షష్ఠ్యంతములలో శ్రీకృష్ణునిం జేర్చుట యేలొకో యని కొందఱాక్షేపించిరి. రామకృష్ణభేదమును బాటించువారు పామరులలోఁ బామరులు. హరిహరాభేదమును బాటించువార లిట్టిభేదములుకూడఁ బాటింతురా! భాగవతకథావస్తువును షష్ఠ్యంతములలోఁ జేర్చుట లోపమేమియో తోఁపకున్నది. ఇట్లు భాగవతమును దెనిఁగించి తజ్జనితపుణ్యమున మోక్షసామ్రాజ్యమును వశపఱచుకొనఁదలంచిన యీమహాకవి భక్తా

గ్రేసరుఁ డెందు నివసించెనో యావిషయము రాజన్వంతమనునట్లు సుకృతవంతము ననవల యునుగదా.

ఏకశిలానగరములు మూఁడుగలవు. ఆపేరు ఓరంగల్లునకే చెల్లునని శ్రీవీరేశము పంతులుగారు నుడివిరి. ఆపేరేల వచ్చినదనఁగా నాయూర నొంటిరాతిస్తంభము కలదనియు నద్దాన నాపేరు వచ్చెననియుఁ గొందఱు సిద్ధాంతీకరించిరి. ఆపక్షమున నాపేరు ప్రతిగ్రామమునకుంగూడ నన్వయించును. కొన్నిదేవాలయములలో ధ్వజస్తంభము శిలాకల్పితముగా నుండును. ఆదేవాలయములు గలగ్రామములన్నియు నేకశిలానగరములే కావలసివచ్చును. ఆపేరునకుఁ గారణములఁ బరికింపసాగిన నేవియో యాక్షేపణము లుండకపోవు. ఒక్కవిషయము నిట వ్రాయక తప్పినది గాదు. "ఈతనినివాసస్థలము కడపమండలములోని ఒంటిమెట్ట. ఇదియే భాగవతమున నేకశిలానగరమని చెప్పఁబడియున్నది." అని మొదటిపర్యాయమునను,

"ఈతనినివాసస్థలము నైజాము రాజ్యములోని ఓరుగల్లు. ఇదియే భాగవతమునం దేకశిలానగరమని చెప్పఁబడియున్నది." అని రెండవసారియు వ్రాయుటయే వీరిసత్యాభిరతిని సూచించెడు. తొలుతఁ బరిశీలింపక గతానుగతికమనునట్లు వ్రాసిరనియుఁ బిదపఁ బరిశీలించి ఓరుగల్లని సిద్ధాంతముచేసిరనియుఁ గొందఱు సమాధానము చెప్పఁబూనుదురేమో. వీరికంటె ముందుగా ఓరంగల్లని సిద్ధాంతముచేసినవారు శ్రీరామమూర్తిపంతులుగారు. వారివ్రాతలఁ గొన్నింటి నాక్షేపించుటయు వీరికలవాటుపడినవిషయము. ఆసిద్ధాంతమును బరికించియు నద్దాని నంగీకరింపకయే ఒంటిమెట్ట యని వ్రాసిరనక తప్పదుగదా. కొంతకాలమునకు నాంధ్రాభిమానము వృద్ధికాఁగా రెండవమార్గమునకు దిగియు "స్థలాభిమానముచేతఁ గొంద ఱిప్పటికిని పోతనజననభూమి కడపమండలమేయని వాదించువారం దందుఁ గనఁబడుచున్నారు." అనియు వ్రాయుట విచిత్రమే. తొలుతటిసిద్ధాంతమును మార్చుకొని సత్యమును గనుఁగొన్నట్లు వ్రాయుట స్థలాభిమానముచేతనే యన్న బాధయేమి? "ఈబమ్మెరగ్రామ మోరుగంటికి రమారమి మూఁడామడదూరములో నల్లగొండ మండలమునం దున్నది. బమ్మెర యనుపేరుగల యూరేదియు నొంటిమెట్టచేరువనుగాని తుదకుఁ గడపమండలములో నెక్కడనైననుగాని లేదు." అని వ్రాయుట విచారకరము, సత్యదూరము కూడ ననవలయును. బమ్మెర యనునది యందును లేదు. బొమ్మర యనునది కలదనియు నది వాడుకలో బమ్మెరయని మార్పునొందెననియు శ్రీజయంతి రామయ్యపంతులుగారు వ్రాసియుండిరి. ఆమాటయే వీరు తలంపక బమ్మెరయందున్న దనుచున్నారు. ఆపేరు

గల గ్రామము కడపమండలమునం దెందుఁగాని లేదఁట! వీరెఱుంగుదురా? ఎవరో చెప్పఁగా నిట్లు వ్రాసినారా? అని శంకింపవలసియున్నది. బమ్మార మను గ్రామము ఒంటిమెట్టకు సమీపమునందే యున్నది. బొమ్మర బమ్మెరగా మార్పునొందఁగా బొమ్మరము బమ్మెరఁగా మార్పు నొందఁగూడదా? ఇంతటి సత్యదూరాభిమానమేల? ఇంక వారి వ్రాతను జర్చింపక నాకు దోఁచిన దొరకినసాధనములనుండి తెలినవిషయమును వ్రాసెదను.

తొలుతఁ జరిత్రసంబంధములగు విషయములు మార్పునొందక నిలుచునవి కావని కొందఱందురు. ఆరయఁగా నట్లే తెలును. బొమ్మరమునుండి జలస్థలభోగముల ననుసరించి యొంటిమెట్టఁ జేరి యింటిపేరు బమ్మెరవారని ప్రసిద్ధికాఁగా శ్రీరామాలయ మప్పటికే సుప్రసిద్ధిఁగాంచి రాజపోషణము గల్గియుండఁగా నందు నివసించి శాలిసస్యము పండించుకొనుచుఁ జిదానందయోగిదర్శనమున లబ్ధవిజ్ఞానసంపదున్నతుఁడై భాగవతమును రచించెను. మఱికొంతకాలమున కావంశమువారు కొమ్మద్ధి యను గ్రామము చేరిరి. అందుఁ గొంతకాలముండిరి. ఇంటిపేరు కొమ్మద్దివారని మాఱెను. అందు సుబ్బరాయకవి సూత్మతనువిద్యావిలాసమును రచించెను. ఆగ్రంథము శ్రమముపై నుపలబ్ధమైనది. తాటియాకుల ప్రతులు రెండు దొరకినవి. అందలిగద్య మిది. "ఇది శ్రీచిదానందసద్గురు ప్రసాదలబ్ధాత్మవిద్యారహస్య కౌండిన్యసగోత్రాపస్తంబసూత్ర కొమ్మద్ది సుబ్బరాయప్రణీతంబై సకలవిద్యార్థానుభవం బగు సూత్మతనువిద్యావిలాసంబునందు". బమ్మెరవారు కొమ్మద్దివారుగా మార్పునొంది రనుటెట్లు?

ఉ సమ్మతమైన భాగవతసారవియద్ధుని సంస్కృతాంతరి
క్షమ్మున నుండఁ దన్నదిని జయ్యన భూమికిఁ దెచ్చినట్టు పా
పమ్ము లడంపఁగాఁ దెనుఁగు పల్కిన మత్కులపూర్వుఁడైనయా
బమ్మెరపోతనార్యుఁ డనుభవ్యభగీరథు నాశ్రయించెదన్.

అని పూర్వకవిస్తుతి నొనరించెను. పూర్వకవిస్తుతియం దీపద్య మొక్కండే కానంబడియెడిని. మత్కులపూర్వుఁ డనునది దేనిం దెలుపునో నిర్వచింప నక్కఱలేదు. ఇప్పటికి మూఁడు వందల యేఁబదివత్సరములకు ముందు గ్రంథము రచింపఁబడినది. రమారమి భాగవతము పిదప మూఁడువందల కీగ్రంథము పుట్టినట్లు తేలును. ఇందుఁ బ్రొద్దుటూరుకడనుండు ముక్తిరామేశ్వరము వర్ణింపఁబడినది. చిదానందగురుప్రసాదమున వేదాంతవిజ్ఞానము నార్జించి ధన్యుఁడయ్యెనని నిర్ణయింప నవకాశము కలదు.

ఒంటిమెట్టయం దిప్పటికిని భాగవతమునకుఁ దాంబూల మిచ్చుమర్యాద శ్రీరామాలయమునందుఁ గలదు. ఏవో కొన్ని కారణము లిరువురకు నుండవచ్చును. భాగవతమున నుప

యోగించినభాష రాయలసీమదిగాని యాంధ్రమండలములది కానేకాదు. ఏదియెట్లున్నను స్వోత్తసిద్ధాంతముచేసి ధన్యులమైతిమని కొందఱానందించు నాంధ్రసోదరు లోరంగల్లనియే యూహించుకొనవచ్చును. శిథిలభాగములు పూరించినవారింబట్టి నివాస మోరంగల్లనుట కేవలము హఠవాదము. కాకదంతపరీక్షాన్యాయము ననుసరించి యింకను బెంచి వ్రాయనేల యని విరమించి విషయాంతరమునఁ బరిశ్రమింప మదిఁ బురికొలిపెదను.

పోతన భక్తాగ్రగణ్యుఁడు. అనర్గళకవితాధారగలవాఁడు. అయాచితవ్రతుఁడు. కర్షకవృత్తి జీవించువాఁడు. నిరాశుఁడు. శ్రీరామపాదధ్యానతత్పరుఁడు. సద్గురుకరుణాపాత్రుఁడు దరిద్రుఁడయ్యును జింతలు లేక యదృచ్ఛాలాభసంతుష్టుఁడై కాలము గడపువాఁడు. శ్రీరామపాదైకశరణుఁడు. కావుననే నిర్విచారముగాఁ గాలము గడుపంజాలెను. "సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్" అనుసూక్తి కుదాహరణభూతుఁడయ్యెను. "అసంతుష్టా ద్విజా నష్టాస్సంతుష్టా ఇవపార్థివాః" అన్నట్లు సంతృప్తి ధనవంతుఁడయ్యెను. గర్వశూన్యుఁ డనుట

ఆ. భాగవతముఁ దెలిసి పలుకుట చిత్రంబు, శూలికైనఁ దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంత గన్నంత, దెలియవచ్చినంత దేటపఱుతు

అను నీపద్యము తేటపఱచుచున్నది. బావమఱఁదియగు శ్రీనాథకవిసార్వభౌముఁడు తనకల వడిన రాజయోగానుభూతిచే నెంత లోభింపఁజేసినను నరాంకితముగ భాగవతమును వ్రాయుట కిష్టపడక యిట్టి యుత్కృష్టగ్రంథరత్నము నెట్టులైన సంగ్రహించి తమపేరా చంద్రార్కముగా నిలుపుకొనం దలంచి బలవంతముచేయ నుంకించినరాజుల నీసడించి "ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్...... సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీబమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్." అని పలికెను. అప్పటిరాజులయందలియందును బోతనగారి కిట్టియాశయమే కలిగియుండె ననరాదు.

బాలోఽపి నావమంతవ్యో మనుష్య ఇతి పార్థివః
మహతీ దేవతా హ్యేషా నరరూపేణ తిష్ఠతి

అను మనుస్మృతివాక్యమునకు విరుద్ధముగాఁ బ్రవర్తించుజాల్మఁ డనఁదగినంత మూర్ఖుఁడు కాఁడు. బలమునఁ దన్ను లోఁబఱచుకొనంజూచు కొందఱపై నిట్టియభిప్రాయము కలవాఁ డనవలయును. ఈతనితరువాతివారిలోఁ గొందఱ కీయభిప్రాయమే కలదు.

క. నృపులకుఁ గావ్యం బొసఁగిన, నపవర్గం బిడఁగఁగలరొ యటుగాకున్నన్
ద్విపతురగభూషణాంబర, తపనీయాదికముచేతఁ దనుపంగలరో.

అనునది మచ్చునకుం జూపితిని. దీనింబట్టి కవులందఱు ధనాశాతత్పరులుకారని తేలెడిని. రాజుల కంకిత మొనర్చిన కావ్యములు దుష్టములు కాఁజాలవు. నరాంకితము పాపమని యే స్మృతియందును గానరాదు. 'నా విష్ణుః పృథివీపతిః' అన్న ప్రాచీనవాక్యము వ్యర్థముకాదు.

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అన్న భగవద్వాక్యమును విశ్వసించువా రల్పపదార్థముల కాసఁగొనక భగవంతున కర్పించి ధన్యులమైతిమని భావించు టుత్తమమనునాశయము కలవారు నరాంకితముచేయ నిష్టపడ రని భావము.

"సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁడే
పరివారంబును జీరఁడు"

అనుపద్యముం గాంచి యేదో ఆక్షేపించెనని దానికిఁ బోతన సమాధానముం దెల్పక యతని కొడుకు నెక్కడనో దాఁచిపెట్టి నూతిలో పెద్దఱాయివేసి కుమారుఁడు నూతిలోఁబడెనని కేకవేసెనను నొకకథ కల్పింపఁబడినది. ఇది కేవలకల్పనయే యనవలయు. శ్రీనాథునివంటి మహాపండితకవిసార్వభౌమునకు భగవంతున కాసాధనములు లేకున్న నేమిచేయుటకుఁగాని శక్తిలేదని యూహించునంతయజ్ఞత యుండునా యని నామది కొందలమందుచుండును.

శ్రీనాథుఁడు
ఎటులమెప్పించెదో నన్ను నింకమీఁద, రావుసింగమహీపాలుధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు, సరససద్గుణనికురుంబ శారదాంబ.

అని శారదాంబను బ్రార్థించునంతటి యుపాసకుఁడు. తనశక్తి కాశారదాంబయే కారణ మనువిశ్వాసము గలమహాభక్తుఁడు. అట్టిభక్తుఁడు నుపాసకుఁడు పండితోత్తముఁడు కవి సార్వభౌముఁడు భగవచ్ఛక్తి యెట్టిదనికనుఁగొనలేకపోయెనని యూహించుట యసంగతమే యగును. పనిపాటలులేనివా రిట్టివానిని గల్పించి కాలముం బుచ్చుచుందురు. ఈకథయు నట్టివారిచేఁ గల్పింపఁబడినదే యగునని నాదృఢతమవిశ్వాసము. 'నహి కారణం వినా కార్యస్యోత్పత్తిః' అనున్యాయము ననుసరించి యీకథ కేదియో కారణ ముండకపోదనువారు నుందురు. పోతన భక్తుఁడని శ్రీనాథుఁడు భోగసంపన్నుఁ డగుకవియని భావించు నలసులే యీకథను గల్పించిరని నేనూహింతును.

"చిదానంద యోగీంద్రుండు పోతనకు గురుండే అయినచో నాతనిం గూర్చి స్తోత్రము గాని స్మరణముగాని అందుండకపోవునా అని తోఁచుచున్నది" అని శ్రీరామమూర్తి పంతులుగారు వ్రాసిరి. కాని

ఆత్మనామ గురోర్నామ నామాతికృపణస్య చ,
శ్రేయస్కామో న గృహ్ణీయాజ్జ్యేష్ఠాపత్యకళత్రయోః.

అన్న సూక్తిఁ బరికించియుందురే నట్లు వ్రాసియుండరు. కొందఱు గురుస్తుతిచేయువారుందురు. కొందఱు మనసునఁ దలంచువారుందురు. "ఇతఁడు రామమంత్రోపాసనచేసెనని చెప్పినవృత్తాంతము నంతమాత్రముగనే యున్నది. శ్రీరాముఁడు కృతిపతియేని అతనిస్తోత్రముండునుగదా. దానింజూచిన శ్రీకృష్ణస్తుతిగాఁ గాన్పించు." అనియు వ్రాసిరి. దీనికి సమాధానము ముందే యిందు వ్రాసితిని. అయిన నొక్కమాట చెప్పక యూరకుండ మనసొప్పకున్నది. "ఇది శ్రీపరమేశ్వరకరుణాకలితకవితావిచిత్ర...పోతనామాత్యప్రణీతంబైన" అను గద్యముం బరికించిన నీశంక కవకాశమే యుండదు. ఉపాసకుఁడని యీవాక్యమే తెల్పుచున్నది. కావునఁ బంతులగారియూహ నిరాధార మనవలసివచ్చుచున్నది. పరమేశ్వర శబ్దము రామపరమని గ్రహించినచో నేపాపము రాదు. రామోపాసకుఁడు కాన రామాంకింత మొనర్చెనని తలంచు టుత్తమము. గురుఁడు లేక పుస్తకములలోఁ జూచి మంత్రము గ్రహించి యుపాసించుభక్తులు పూర్వకాలమున లేరు. గురుధ్యానము ప్రప్రధానమని శాస్త్రము తెల్పుచున్నది. గురుభక్తివిహీనునకు మంత్ర ముపాసించినను ఫలింపదని శాస్త్రము విధించుచున్నది. కావున రామోపాసకుఁడు పోతన యనుటకు శంకింపఁ బనిలేదు. శ్రీరాముఁడు కృతిపతికాఁడను పంతులుగారిసందేహమును

క. శ్రీకరపరితోషితర,త్నాకరకమనీయగుణగణాకరకారు
ణ్యాకరభీకరశరధా,రాకంపితదానవేంద్ర రామనరేంద్రా.

అను నీపద్యము తీర్చుచున్నది. కావున నిట్టి శంకలనొందు నవకాశమే లేదని మనవిచేయువాఁడను. షష్ఠ్యంతములలో రామనామము చేర్పఁబడలేదే యనుప్రశ్నము ప్రదత్తోత్తరము.

పోతనమహాకవి భాగవతము నొనర్చి పిదప వీరభద్రవిజయము నొనరించె నందురు. దాని నాక్షేపింప నక్కఱయుండదు. కాని భాగవతములో శంకరుని దూషించినందులకుఁ బ్రాయశ్చిత్తముగా వీరభద్రవిజయము వ్రాసె ననునది యుక్తముకాదు. భాగవతమునందు

వీరు వలయునని శివదూషణము చేయలేదు. లేనిపాపమునకు శాచితముచేయవలయున, విధియు లేదు. విశేషించి పోతనగారి భాగవతశైలికి నిందలిశైలికిని భేదము కలదు. కుమరుఁడు వ్రాసి తండ్రిపేరుపెట్టెననియు వాడుక కలదు. ఆవాడుక వాస్తవమై యుండనోపు ముదిమిని వ్రాసియుండుననియుఁ గావున శైలి మార్పునొందియుండుననియుఁ గొందఱు వ్రాసిరి. ఇదమిత్థమని సిద్ధాంతముచేసి యపూర్వఖ్యాతిని గాంచఁబూనను. ఇమ్మహాకః రచించిన యొక్కపద్యరత్నము నుదాహరించి యీచరిత్రమునుండి విరమింతును.

సీ. ప్రాణేశ నీమంజుభాషలువినలేనికర్ణరంధ్రంబులకలిమి యేల
పురుషవల్లభ నీవు భోగింపఁగాలేని తనులతవలనిసౌందర్య మేల
భువనమోహన! నిన్నుఁ జూడఁగానఁగాలేని చక్షురింద్రియములసత్త్వ మేల
దయిత నీయధరామృతం బానఁగాలేని జిహ్వకు ఫలరససిద్ధి యేల
ఆ. నీరజాతనయన! నీవనమాలికా,గంధ మబ్బలేనిఘ్రాణ మేల
ధన్యచరిత! నీకు దాస్యంబుచేయని,జన్మ మేల యెన్ని జన్మములకు.

మఱొక్కఁడు:—

మ. జలజాతేక్షణుఁ దోడితెచ్చితివి నాసందేశముం జెప్పి నన్
నిలువం బెట్టితి నీకృపన్ బ్రదికితిన్ నీయంతపుణ్యాత్మకుల్
కలరే దీనికి నీకుఁ బ్రత్యుపకృతిం గావింప నేనేర నం
జలిఁ గావించెద భూసురాన్వయమణీ! సద్బంధుచింతామణీ.



డాక్టర్: భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు:—

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తెలుగుభాష తెలుగువాఙ్మయమునకును సంస్కృతవాఙ్మయమునకును నిరాడంబరసేవచేసినారు. వారి ఈవిగుప్త గామిని, వారు వారిత్యాగము దేశభక్తి గణనీయములు ఈకారణములచేత వీరు 25 ఏండ్లుగాచేసిన సేవవలన ఆంధ్రదేశములోను దక్షిణఇండియాలోను పేరు కనినారు. సమకాలికులమెప్పువడయుటకు అర్హులు. వీరికి చిరాయువు అగుగాక!

# మనుచరిత్రము

## పెద్దనగారి పెద్దతనము

**డాక్టరు: చిలుకూరి నారాయణరావుగారు, ఎం ఏ., ఎల్. టి., పి హెచ్. డి. అనంతపురం.**

పాడినదేపాట. మళ్లీ మనుచరిత్రముగురించి వ్రాయడానికేముంటుంది? కాని, 'చతురవచోనిధి'యైన కవిలలాముని "శిరీషకుసుమపేశలసుధామయోక్తుల" నెన్నిసార్లు స్మరిస్తే తనివి తీరుతుంది? కాని, ఒక్కటి గమనించాలి. కృష్ణదేవరాయల ఆస్థానములో ఇతరకవులున్ను ఉన్నారుగదా! వారెవ్వరున్ను అతనినిగాని, అతని కవిత్వమునుగాని, అతని సుధామయోక్తులనుగాని స్మరించలేదేమి? కవులు మాత్సర్యగ్రస్తులు."సమకాలమువారలు మెచ్చరే కదా!"

కవి ఏపరిస్థితులలో కావ్యరచనచేయనారంభించినాడో, ఏయేనియమములకు లోబడి రచింపవలసివచ్చినదో, ఏయేప్రతిజ్ఞలుచేసి నిర్వహించవలెననుకొన్నాడో వాటినిబట్టి మనుచరిత్ర కావ్యాలోకనముచేస్తే దానివిలువను మనము నిర్ణయించుకోగలము. అట్టి జిజ్ఞాసయే ఈవ్యాసరచనకు కారణము.

"నవీనకావ్యరచనకు ననుకూలకథలు" ఏమున్నవా అని తలంచినాడట కవి. తలంచినదేదో తలచుకొని తానే మంచికథను నిశ్చయించుకోకూడదూ? రాజుగారితో ఎందుకూ చెప్పడము? ఆయనగారేమిచేసినారు? "మనువులలో స్వారోచిష, మనుసంభవ మరయ రసనుమంచితకథలౕ, విన నింపు కలిధ్వంసక, మనఘ భవచ్చతురరచన కనుకూలంబుౕ" అని 'రికమెండు' చేసినాడు. రాజుగారు చెప్పినతరువాత వ్రాయక తీరుతుందా? కథను తన 'చతురరచన' కనుకూలముగా చేసుకోవలసినదేకాని గత్యంతరములేదు.

'రసనుమంచితకథలు,' 'కథలు' బహువచనములో ఉన్నవి. ఈకథలకు ఐక్యముకల్పించి ఏకకథగా సంతరించడములో తనరచనానిపుణబిరుదమును, రాజు ప్రసాదించినదానిని సార్థకముచేసుకోవలసినభారము కవిమీద పడినది.

కథ నవీనము కాదు. మార్కండేయపురాణములోనిది. దానికి నవీనత్వము రావలెనంటే దానిరచననుబట్టిమాత్రము రావలెను. అట్టి నవీనత్వమును కల్పించవలసినభారము కూడా కవిపై అధిరోహించినది.

ఇదిగాక "భరమై తోచు కుటుంబరక్షణకుఁగాఁ బ్రాల్మాలి, చింత న్నిరంతరతాలీదళ సంపుటప్రకరకాంతారంబునం దర్థపుం, దెరువాటుల్ దెగికొట్టి తజ్జ్ఞపరిషద్విజ్ఞాతచౌర్య క్రియావిరసుండై" కుకవి "పృథ్వీభృత్సమీపక్షితిన్" 'కొఱతంబడు' నని తానాక్షేపించిన దోషమునకు తానే పాల్పడకుండా ఉండే మెలకువను తాను చూపించుకోవలసిన బాధ్యతకూడా అతనిమీదపడినది.

కథ కలిధ్వంసకమని రాజు చెప్పినాడు. కవి దానిని కలిధ్వంసకముగా రచించవలసిన పూచీకూడా కవి కున్నదిగదా.

పెద్దన్న 'ఆంధ్రకవితాపితామహు' డనే సార్వభౌమదత్తబిరుదమునకు పాత్రుడు కావలెనంటే, పైజెప్పినగుణములను విస్తరించి, దోషములను పరిహరించి ఉండవలెను. అతడు తనకార్యము నెట్లు నిర్వహించినాడో చూదాము.

మొదటిది వస్త్వైక్యము. ఇది కుదురలేదు నీళ్లకు నీళ్లు; ప్రసాదానికి ప్రసాదము వరూథునీప్రవరుల విరసశృంగార మొకఘట్టము. దానితో ఆకథ సరి. వరూథునీమాయా ప్రవరుల వికటామానుషశృంగారము మరొకఘట్టము. దానికి స్వరోచిపుట్టుకతో అంతము. తరువాత స్వరోచి వేటవర్ణనమునకున్ను కథలలో దేనికిన్నికూడా సంబంధములేదు. పెద్దన్న గారు రాజుగారితో వేటకుపోయిఉంటారు. చూచినదంతా వర్ణించినదాకా ఉబలాటము తీరక దానినిగురించి వ్రాసిఉంటారు. లేకపోతే ఒకఆశ్వాసములో ముక్కాలుభాగము వేట వర్ణనముకోసము వినియోగించడమున్ను ఔచిత్యభంగమున్ను సంభవించి ఉండదు. సరే ఆస్వరోచికి అపశకునాలు కనబడ్డవి, వెంటనే శుభశకునాలున్ను కనబడ్డవి. అవి రానున్న ఆపదను దానినుంచి బయటపడి జయమంగళము కనబడడమునున్ను సూచిస్తున్న వనుకొంటూ ఉండగా మనోరమ అనే ఒకగంధర్వరాజుకూతురు 'రక్షించు, రక్షించు' అని కాళ్లమీద పడడము, అతని కస్త్రహృదయము నివ్వడము, రాక్షసుడు రావడము, రాక్షసస్వరోచుల యుద్ధము, తుదకు రాక్షసుడు గంధర్వుడై 'నేను నీతల్లిఅయిన వరూథునికి కడగొట్టుతమ్ము డను, మనోరమ నాకూతురు. దీనిని నీకిచ్చి పెండ్లిచేస్తా' ననిచెప్పి తనశాపకారణము చెప్ప డము, తనకువచ్చిన ఆయుర్వేదవిద్యతోబాటు మనోరమను రాజున కివ్వడము, వారిపెండ్లి, శోభనపుగదిలో మనోరమ తనచెలికత్తెలనుగురించి విచారిస్తే ఆగదినుంచి ఉన్నపాటుగా పోయి వారికి శాపమువల్ల వచ్చినరోగమును మాన్పి, వారిలో ఒకతె అయిన విభావసివల్ల మృగపక్షిజాతులభాషలను తెలుసుకొనేవిద్యను స్వీకరించి, ఆమెను పెండ్లిచేసుకొనడము, ఆతరువాత కళావతి అనేచెలికత్తె కథనువిని ఆమెనుంచి పద్మినీ విద్య నుపదేశముపొంది

ఆమెకథనువిని ఆమెనుకూడా పెండ్లాడడము, వారిముగ్గురితో సౌఖ్యము లనేకసంవత్స రములనుభవించి, పక్షుల, మృగముల సంభాషణముమూలముగా వైరాగ్యముపొంది, తపస్సుచేయపోగా అచ్చటివనదేవత తన్ను కామించడము, ఆమెయందు స్వారోచిషమనువు పుట్టడము, తరువాత ఆమనువుకు విష్ణుమూర్తి సాక్షాత్కరించడము అనేకథతో గ్రంథము పరిసమాప్తి పొందినది.

పై వాటిలో ఒకకథకున్ను మరొక్కకథకున్ను ఎట్టిసంబంధమున్ను లేదు. ఈకావ్య ములో నాయిక ఎవరో, నాయకు డెవరో నిర్ణయించ వీలులేదు. ప్రవరుడు, మాయాప్రవ రుడు, స్వరోచి—ఈముగ్గురకున్ను సమప్రాధాన్యము కనబడుతున్నది. వరూథుని ఒక నాయిక, మనోరమావిభావసీకళావతులు ముగ్గురున్ను ఒకవిధముగా నాయికలే. వనదేవత మాత్రమే కావ్యప్రయోజనమున కుపకరించేది; కాని, ఆమెకు ప్రాధాన్యమేలేదు.

స్వారోచిషమనువు పుట్టడానికి పూర్వము కావ్యములో చెప్పబడ్డకథలన్నీ ఉప కరిస్తున్నవి. కాబట్టి వస్త్వైక్యమున్నదని భావించుకోవలసినదే కాని, అసలు కథానిర్వహణ ములో ఆవిక్యము గోచరించడములేదు. పురాణకథ నున్నదున్నట్లుగా చెప్పివేయడమువల్ల ఈలోపము సంభవించినది. కవి శిల్పి; కథ కళ కుపకరించేవస్తువు. శిల్పి తాను చేపట్టినవస్తు వును దిద్దితీర్చడమువల్లనే అతనిప్రతిభ గోచరిస్తుంది; వస్తువుకు అందముకలిగి ఆనందహేతు వవుతుంది. స్వారోచిషమనువు పుట్టడమే ప్రధానమయితే పురాణమార్గములోనే కథ నెక్క డయినా ఆరంభించవచ్చునుగదా. పెద్దన్న ధర్మమా అని కథను బ్రహ్మపుట్టుకనుంచిన్ని ఆరం భముచేయలేదు; మనమదృష్టవంతులమే.

పెద్దన్నగారువ్రాసినది కావ్యముకాదు, కావ్యములు. చిన్నచిన్నచక్కనికావ్యములు. కృతిపతిప్రశంసపేరవ్రాసిన 'కృష్ణరాయప్రశస్తి' ఒకకావ్యము, వరూథునీప్రవరులవృత్తాం తము రెండవది; వరూథునీమాయాప్రవరులది మూడోది; మృగయావర్ణనము నాలుగోది; మనోరమావృత్తాంతము అయిదోది; కళావతికథ ఆరోది; ఇక విభావసికథ చెప్పవలెననుకొని కవి మరచిపోయినాడు. స్వారోచిషమనుసంభవమునకు ప్రధానహేతువైన వనదేవతా వృత్తాంతము నెత్తుకొని చప్పున ముగించినాడు. న్యాయముగా ఆలోచిస్తే ఈతుదికథనే పెంచి సవిస్తరముగా వ్రాయవలసి ఉండేది. అట్లా వ్రాయకపోవడము మనదురదృష్టము; కావ్యనిర్వహణానికి లోపము. కృష్ణరాయడు తలచినట్లు మనుచరిత్రము 'రససముచితకథల' "సంపుటి"గా తయారయినది. తుదకు స్వారోచిషమనువు పుట్టినాడు కాబట్టి మాత్రము స్వారోచిషమనుసంభవమయినది.

పెద్దన్న "కుకవు"లను నిందించకుండా ఉంటే బాగుండేది. కాని, ఔద్ధత్యము నెవరు వారించగలరు. ఆస్థానములో ముఖ్యుడు. రాజుగారిచెవిచేరడానికి తగినంతచనువు సంపాదించుకొన్నవాడు పెద్దన్న. అతడు రాజుకు 'హితుఁడు' 'చతురవచోనిధి'యై రాజుగారికి పథ్యమయినమాటలతో మెప్పించగలవాడు. 'అతులపురాణాగమేతిహాసకథార్థస్మృతియుతుఁడు.' రాజో పరమభక్తుడు; వైష్ణవభక్తుడు. వైష్ణవదేవస్థానముల కమూల్యములైన దానములనెన్నో చేసినవాడు తాను స్వయముగా 'ఆముక్తమాల్యద' అనేపేర వైష్ణవకథను ప్రౌఢకావ్యముగా వ్రాసినవాడు. పెద్దన్న 'విద్యానిలయుడైన శఠకోపయతిశిష్యుడు. అందుచేత రాజు కతనియెడల గాఢానురాగమే కాకుండా, భక్తిగౌరవములుకూడా ఉన్నవి. పెద్దన్న శీల కుల శమ దమసమన్వితుడని రాజు కాతనిమీద ఎంతో భక్తి, ఎంతో గౌరవము, అందులో 'చెల్వము, లేఁబ్రాయము.' రాజుమాత్రము చెల్వములో తక్కువవాడా? స్ఫురద్రూపి 'ఫుల్లాంభోజముఖుడు' IV-125. సంఫుల్లాబ్జపత్రేక్షణుడు IV-120. పంకజదృగంగీకారధీరాకృతి IV-123. కాంతాపంచబాణుడు IV-1. కాంతాలతాంతశరుడు VI-124. శ్రీనందనసౌందర్యుడు V-1. లీలామదనుడు II-1. బిసరుహనయనానవవిధకుసుమాయుధుడు II-80. పెద్దన్న ఉత్తప్రవరుడే. 'మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి,' 'ఆలేఖ్యతనూవిలాసుడు' I-61. పెద్దన్నగారికి వైరాగ్యమున్నదికాబట్టి జారకామినులతని చక్కదనమును చూచి మీదపడలేదు. రాజుగారు, పెద్దన్నగారు ఇద్దరున్ను 'పహిలాపచ్చీసు'లో ఉన్నారు. లేజవ్వనపుపసందు. రాజు 'భోగపురందరుడు' V-106, కవిగారో నిరుపహతిస్థలములో రమణీప్రియదూతిక కప్పురవిడెము తెచ్చియిస్తూ ఉంటే, సుష్ఠుగా నవవిధపాకములు ఆరగించి, ఉయ్యలపట్టెమంచములో ఊగుకొంటూ, ఒప్పూతప్పరయు రసజ్ఞులు తన్ను పరివేష్టించి తలలూపుతూ ఒకప్రక్కను, ఊహతెలియంగల పాఠకలేఖకోత్తములు వేరొకప్రక్కను కూర్చుండిఉండగా కవిత్వముచెప్పడాని కలవాటుపడినవాడు. ఆయనకు భరమైతోచు కుటుంబరక్షణకుగాఁ బ్రాల్మాలవలసిన అవసరములేదు. ధనాఢ్యుడు. మాన్యక్షేత్రముల్ పెక్కుచందాలంబందు. కోకటాద్యనేకాగ్రహారములను రాజడిగిన సీమలయందిచ్చినాడు. ఇక నతడు చిల్లరసాలగ్రామదానాలు పట్టుతాడా? అతనికర్మము కాలలేదు. ఇంట పాడీపంటా తరుగకుండాఉంది. ఇంటిలో 'కూకటుల్ కొలిచిచేసిన కూరిమిసోమిదమ్మ' ఒకర్తె, ముసలి తల్లిదండ్రులున్ను తప్ప ఎక్కువసంసారపు బెడదలేదు. అతనికి పిల్లాపిచికా ఉన్నారో లేదో తెలియదు. లేనట్లేతోస్తుంది. ఉంటే మరి కవిత్వము చెప్పనిస్తారా?

ఇట్టిపదవిలో ఉన్న పెద్దన్న ఏమన్నా చెల్లిపోతుంది. తాను మాత్రము 'తాలీదళ సంపుటప్రకరకాంతారంబునం దర్థపుందెరువాటుల్ దెగికొట్టలేదూ?' కొట్టలేదంటే తిక్కన, శ్రీనాథ, మారన లూరకొంటారా? పెద్దన్న కాలము నాటికి వారు బ్రతికిఉంటే ఏమిచేసి ఉందురో! మనుమసిద్ధి వీరభద్రారెడ్లకున్ను కృష్ణదేవరాయలకున్ను హోరాహోరి యుద్ధము జరిగి ఉండేదే. అయితే అడిగేనాథుడు లేకపోయినాడు. దరిద్రుడు దొంగతనము చేస్తే 'కొఱతం' బడతాడు. పెద్దవాడు దొంగతనముచేసి పట్టుపరుపుమీద పడతాడు. చిన్నవాడు ఆత్మరక్షణముకోసము చిన్నతప్పుచేసి కారాగృహములో ప్రవేశిస్తాడు. పెద్దవాడు దేశాలు కొల్లగొట్టి మహారాజవుతాడు. అంతే భేదము.

కవిత్వవిషయములో దొంగతనముచేయనివా డెవడున్నాడు? 'బాణోచ్ఛిష్టం జగత్సర్వ'మని అననే అన్నారు. బంగారునగలను దొంగిలించి కొంచెము కరగించివేస్తే దొంగకు మరి భయములేదు. కొంచెము మార్పుచేస్తే కవిత్వచౌర్యము విషయములో కూడా అంతే. అయితే ఇటువంటిదానికి చౌర్యదోషములేదని పెద్దలంటారు. సొత్తెవరిదయితే మనకేమి? అందులో కళావిషయములో అసలే మనకక్కరలేదు. అది మన కానందమును కల్పిస్తే చాలును.

పైనిచెప్పినదానినిబట్టి పెద్దన్న పెద్దతనాని కేమిన్నీ లోటులేదు. మనుచరిత్ర మానంద ప్రదాయకమై, ఉత్తమకావ్యకోటిలో చేరకనూ పోదు. కథ ఎట్లా కలిధ్వంసకమో తరువాత చెప్పుతాను. ఇతరవిషయాలలో అతడు దానికి నవీనత్వమును కల్పించినాడన్నమాట సత్యము. ఆనవీనత్వచిహ్నము లతనికిముందే కొంతవరకున్ను శ్రీనాథుడు, పినవీరభద్రుడు మొదలయినవారికావ్యములలో పొడచూపినవి. మనుచరిత్రమువలెనే శ్రీనాథుని హర విలాసము కూడా చిన్నఖండకావ్యములసంపుటి. రచనావిషయములో పినవీరభద్రుని శకుంతలాపరిణయము పెద్దన్నరచనకు బీజములు నాటినది. కాని, ఈరెండులక్షణములున్ను మనుచరిత్రములో ప్రస్ఫుటములై తరువాతికవులకు వరవడులైనవి.

మనుచరిత్రము ఖండకావ్యములసంపుటిగా ఆలోచిస్తే దానిప్రాశస్త్యము గోచరిస్తుంది. అప్పుడు మూడో ఆశ్వాసముతో కథ చప్పబడిపోయినదనేవిమర్శ కాధారము పోతుంది. ఆఖండకావ్యములో ప్రత్యేకముగా దేనికి దానిని విడదీసి విమర్శింతాము.

మొదటిది కృష్ణరాయప్రశస్తి. దీనిని పెద్దన్న ప్రత్యేకముగా మనుచరిత్రముకోసము వ్రాసిఉండడు. దానిలో కృష్ణరాయలదండయాత్రలు, అతని పరాక్రమము ఎక్కువగా

వర్ణింపబడ్డది. అతనివైభవము కొద్దిగా వర్ణితమైనది. అతని కళాప్రియత్వమునుగురించి కవి ఎక్కువగా వర్ణించిఉంటే బాగుండేది. కాని, పెద్దన్నకు రాజుతో సఖ్య మెక్కువ. అతనితో ఆయావిజయయాత్రలలో వెంటనే ఉండడముచేత అతని అద్భుతపరాక్రమచర్యలు తన మనస్సులో బాగా ముద్రితములైనవి. 'కృష్ణరాయబాహుప్రతాపజాగ్రన్మహాగ్ని' నిజముగా తోకచుక్కే. ఉదయాద్రి, కొండవీడు, జమ్మిలోయ, కోన, కొట్టాము, కనకగిరి, గౌతమి, పొట్నూరు, మాడెములు, ఒడ్డాది, కంకపురి, ఒకటితరువాత నొకటి ఆ అగ్గికి తాళలేక భస్మీపటలమైనది. దక్షిణదేశములో అరాజక మడగినది. ప్రజాజీవితమునకు స్థిమితత్వము కలిగినది. ఆబాలగోపాల మఖిలసద్విజమును నానందమునమన్కి నలిశయిల్లినది. ప్రజలకెల్లను గడురామరాజ్యమయినది. అతనివైభవము చెప్పతరమా? అపరచంద్రుడాకృష్ణరాజచంద్రుడు. నాగాంబికా కలశపాథోరాశిగర్భవీచిమతల్లి కడుపార నెవ్వానిఁ గన్నతల్లి! హంపివిరూ 'పానలాత్మఘనజటావనవాటి కెవ్వాఁడు వన్నెవెట్టు ననార్తవంపుఁ బువ్వు;' 'సకల (భూ) దైవతబుభుక్షాపూర్తి కెవ్వాఁడు పుట్టుగానని మేని మెట్టపంట,' 'కటికియవనచీకటితిండికరములగిలిగింత నెవ్వాఁడు తొగకన్నె నవ్వఁజేయు;' అట్టి కృష్ణరాయలు లక్ష్మి కనుగుదమ్ముడై, కళల కాస్పదమై, చక్కనిచుక్కలకు భర్తయై, మిసిమిపరసీమయై, వలరాజుతో మేనమామపోలికగలిగి, వేవెలుంగులదొర పగటిపూట మాత్రము భువనములకు ప్రతాపముతో గూడిన ప్రకాశము కలిగిస్తే తాను రాత్రికూడా చల్లనివెలుగుతో ప్రజలయెడలకు ముదము గూర్చుతూ, తారాపతి అయినచంద్రుడుత్తరాజు కాగా తాను రాజచంద్రుడై ఒప్పినాడు. అతడు భువనవిజయసభాభవనములో 'ఫణినసూనుకణాదబాదరాయణసూత్రఫక్కి విద్వాంసు లుపన్యసింప', ప్రాజ్ఞులగోష్ఠిలోనుండి, 'ఇందీవరంబులనీనుక్రాల్గన్ను లశరదిందుముఖులు చామరములు వీస్తూ ఉంటే; 'కుకురు కాశ కురు కరూశ కోసలాంధ్ర సింధు బాహ్లీక శ కాంగ వంగ సింహళేశుల' కన్యకామణులు చేతులతో రత్నపాదుకలు, కలాచికలు, ముకురములు, వీటికాకరండములు పట్టుకొని తన్ను పరివేష్ఠించి పరిచర్యలు చేస్తూఉంటే, అతనిపార్శ్వభూమిన భీరుభటకదంబకరాళహేతిచ్ఛటాచ్ఛాయ నిరులుకొంటూఉంటే, సామంతమండనోద్దామమాణిక్యాంశుమండలం బొలసి యీరెండ కాస్తూఉంటే, మూరురాయరగండపెండారమణిమరీచిరింఛోళి అంకపాళినటద్దుకూలాంచములపై ప్రతిఫలించి చిత్రమాంజిష్ఠవిభ్రమశ్రీని వహిస్తూఉంటే, ఆభూలోకఇంద్రవైభవమును చూడడానికి వేయికన్నులు కావలసివచ్చేవి. కృష్ణరాయలది చంద్రవంశమయినా కాకపోయినా, తుర్వసువంశమే తుళువాన్వవాయమయినా కాకపోయినా, తిమ్మరాజు,

ఈశ్వరరాజు, నరసరాజు, వీరనరసింహరాయలనుగురించి కవి వర్ణించినదానిలో కొంత అతిశయోక్తి ఉన్నా, లేకపోయినా, కృష్ణదేవరాయలవర్ణనము మాత్రము పెద్దన్న ఉన్న దున్నట్లుగానే వర్ణించినాడనడానికి సందేహము లేదు. ఆనాటిచరిత్రకారులందరున్నూ ఆయననుగురించి పెద్దన్నకంటే ఎక్కువగానే వర్ణించినారు.

రెండోది వరూధునీప్రవరుల వింతకథ. ఇది పెద్దన్నగారి ఆత్మకథ ఏమో అని పిస్తుంది. కాకపోతే అంత అందముగా చెప్పలేక ఉండునేమో. ఆర్యావర్తదేశములో వరణానదీతీరమందు అరుణాస్పదమనే పట్టణము. ఆపురమును విడువకుండా కాపురమున్నాడు మన్మథునివంటి, చంద్రునివంటి అందగాడయిన ఒక కుఱ్ఱవాడు. అతనిపేరు ప్రవరుడు. అతడు ప్రథమయావనదశలో, లేబ్రాయములో ఉన్నాడు. జారకామిని ఎవర్తె అతనిని చూచినా, వెల్లి మీద పడుదునా అనిపిస్తూ ఉండేది. కాని, యజ్ఞాలు చేసినాడు, శిష్యులకధ్యయనము చెప్పుతున్నాడు. నిత్యకర్మానుష్ఠానపరుడుగా ఉన్నాడు. అందుచేత అందరున్నూ అట్టి పనిచేయడానికి జంకుతూ ఉండేవారు. అతడు ధనాఢ్యుడు. ఇంట పాడీపంటా సమృద్ధిగా ఉన్నవి. ఇంట ముసలితలిదండ్రులను సేవించుకొంటూ, 'కూకటుల్ కొలిచి చేసిన తన కూరిమిసోమిదమ్మ' తన్ను సౌఖ్యావహార్యై భజిస్తున్నది. ఇంటికి వేయిమంది వచ్చినా, అర్ధరాత్రివేళ అయినా, వండిపెట్టుతుం దావిడ. వంటచేసి వడ్డించే అమ్మ ఉన్నప్పు డతిథులకూ అభ్యాగతులకూ ఏమి కొదువ? యాజులుగారు ఎంతదూరమైనాపోయి కూడా తీర్థ సంవాసులను, అతిథులను, అభ్యాగతులను ఇంటికి తీసుకవస్తూ ఉండేవారు. ఒకనాడు మధ్యాహ్నము దాటినతరువాత ఒక ఔషధసిద్ధుడు వచ్చినాడు. సుష్ఠుగా భోంచేసి కూర్చొని తానుచేసిన తీర్థయాత్రలను వివరించినాడు. చాదస్తపు ప్రవరునికికూడా బుద్ధి పుట్టింది తీర్థయాత్రలు చేయవలెనని. సిద్ధునితో చెప్పుకొన్నాడు. ఆసిద్ధు డదీఅదీ అని చెప్ప కుండా ప్రవరునిపాదాల కొకపసరుపూసి తనమాన తానుపోయినాడు. "జాయ్ పరమేశ్వరా! హిమవత్పర్వతముమీదికి పోవాల"ని అనుకొన్నాడు ప్రవరుడు. అనుకొనడ మేమిటి అక్కడ ఉండడమేమిటి? తత్‌క్షణం జరిగింది.

హిమవత్పర్వతమును పెద్దన్న చూచి వర్ణించినాడా, చూడకుండానే వర్ణించినాడా అని నాకు సందేహము. ఎట్లయినా మాబాగే. చక్కగానే వ్రాసినాడు. నైష్ఠికప్రవరుని దృష్టిలో ఆపర్వతరామణీయకత నరనారాయణచరణాంబురుహద్వయభద్రచిహ్నముద్రిత బదరీతరుషండమండితమై కనబడినది. అచటనే సగరు ముమ్మనుమడు తపస్సుచేసినాడు. అచటనే జరఠకచ్ఛపకులేశ్వరువెన్ను గానరా జగతికి మిన్నేఱు దిగినది. అచటనే పుచ్ఛపుండరీక

తనము పోచెట్టి గిరికన్య పతిగోల్వ నాయాసపడినది. ఆస్థలములోనే వలరాచరాచవాడలి కాముకనువెచ్చచేతనే కనికరముగా కరగిపోయినాడు. అచటనే తపసియిల్లాండ్రచెలువ మునుచూచిన ముచ్చిచ్చుకుకూడా విరాళము పుట్టినది. అచ్చటి కనుపపులులోనే కుమారస్వామి జనించినాడు. అచటనే సన్నాసిగా పిశాచాలతో తిరిగేరుద్రుడు శివుడై మెడలో జందెపుపోచ వేసుకొని ఒకయింటివాడయినాడు. అచటి చదలేటిలో శచి కీత గరపుతూ ఇంద్రుడు జలకేళిలో ప్రథమపాఠాలు నేర్చుకొన్నాడు. అచటనే హిమవంతుడు దూడ కాగా భూమి ఆపై కొండల కన్నింటికిన్ని తనపాదుగులోనుంచి ఓషధులు కారేటట్లు చేసింది. వేల్పుటింతులలో మెలగుతూ గర్వముతో మేనక నవరత్నరచనల ఆభరణమును కల్పించుకొన్నది. ఇచట జరిగినయజ్ఞములలో దేవతలందరున్ను జిహ్వా త్రుప్పుడుల్ల నామెత లెరిగినారు. ఇట్టి పవిత్రశృంగారవీథిలో పరిఫుల్లకలాపకలాపిజాలములు, హల్లోహాలమద బంభరమల్లధ్వనులు ప్రవరు నాకర్షించడ మద్భుతముకాదు. వీటితోబాటు ఏనుగులు, క్రోల్పులులు, వరాహములు, మనుబిళ్లు, ఎలుగుగొడ్లు కూడా ఆపర్వతముమీద ఉన్నవి. పెద్దన్న ఉంచుతే ఉండక ఏమిచేస్తవి? కాని, అవి నల్లమలఅడవులలో అందరున్నూ నిత్యమూ చూచేవే. అట్టే మాట్లాడితే విజయనగరమే అరుణాస్పదపురము, తుంగభద్రే వరణానది, మతంగపర్వతమే హిమవంతము. పెద్దన్న ఎంతోదూరము పోనక్కరలేకుండానే వర్ణించడానికి తగినవిషయము దొరకినది. వేరులో ఏమున్నది?

ప్రవరుడు కొంతసేపు అక్కడ తిరిగినాడు. 'ఈదినానికి చాలులే, తేపు చూడవచ్చు గదా. ఈపర్వత మెక్కడికి పోతుంది. పెరటిలోనే వున్నది' అనుకొని 'జయ' 'ఇంటికి పోవాలి' అని ఎగరబోయినాడు. కాళ్లు లేవలేదు. 'ఏమిరా' అని చూచుకొంటాడుగదా— మధ్యాహ్నమయినది ; మందుకరగినది ; నీళ్లచేత పసరు కడుగుకొని పోయినది.

మధ్యాహ్నమయినదట! ఔషధసిద్ధుడు కుతపకాలములోవస్తే, అతని స్నానము, ధ్యానము, భోజనము, కథలుచెప్పడము—ఇదంతా ఎంతకాలము పట్టి ఉంటుంది? వెంటనే ప్రవరుడు హిమవత్పర్వతాని కెగిరి వెళ్లినా, అక్కడ కొంతసేపు తిరిగి ఉంటాడుకదా! అప్పటి కెంతవేళ అయిఉంటుంది? ఇటువంటి కుశంకలన్నీ వేసుకొని కూర్చుంటే సరిపడుతుందా? కథకుకాళ్లేమిటి? పెద్దన్న చెప్పినాడు; మనము నమ్మవలెను. మన మతని అధీనములో ఉన్నాముగాని, అతడు మన అధీనములోలేడు. కవికి పంచాంగాలు గుణించుకొంటూ ఉండడమాపని? ఏదో అన్నాడు, సరిపోయింది. ఇక్కడ మనకు కావలసినది కాళ్లపసరు కరగిపోవడము. అయితే కుతపకాలముమాట ఎందుకెత్తుకోవలెనంటారా? అతిథులు కుతప

కాలములోనే రావాలి. ధర్మశాస్త్రములో అట్లా చెప్పినారు. అయితే మధ్యాహ్నముమాట యెక్కడెందుకు? అవును, మధ్యాహ్నము కాకపోతే, మంచుకొండమీది మంచు కరుగదే! మంచు కరుగకపోతే పసరు కడుగుకొనిపోదే! కడుగుకొనిపోకపోతే గారుడోత్కీర్ణమైన ఆగంధర్వభవనములోనికి పోవడము తటస్థించదే! పోకపోతే వరూధుని తారసిల్లదే! తారసిల్లకపోతే రక్తి ఏదీ? కావ్య మేదీ? పెద్దన్న ఏడీ?

పెద్దన్న సృష్టిచేసినది గంధర్వనగరము. అక్కడ కాలములేదు; దేశములేదు-కవి గారడీవాడు. కుంచెవిప్పి ఆడించి ఎట్లుకమ్మంటే అట్లవుతుంది. ఆ అద్భుతమును చూచి ఆనందించడానికే మన మధికారులము. ముందుకు సాగిపోదాము.

మా అమ్మమ్మ నాకు ఇరవైయేళ్లు వచ్చినదాకా అన్నము కలిపి తినిపించేది. ప్రవరుడు కూడా నావంటివాడే. ఎంత యౌవనముంటే ఏమికార్యము? ఎంత చదువుకొంటే ఏమి కార్యము? ఒక్కనిముసము కానరాకపోతే తండ్రి ఊరంతా వెతుకుతాడు. సందెవేళ అయే సరికి ఇంట్లో ఉండకపోతే తల్లి బెంగపెట్టుకొంటుంది. తనకులకాంత ఆసోమిదమ్మకు తా నొక్కక్షణ మెదుట లేకపోతే మనస దోకలా గవుతుంది. శిష్యులా విప్పకాయలుకారు; తనకు తోడునీడలై బాడీగార్డులవలె ఉండేవారు. ఇటువంటి విరికిబాపనయ్య హిమవత్ప ర్వతానికెందుకు వెళ్లాలి? 'దైవంబ! పాఱవైచితె మిన్నులు వడ్డచోట!' అని ఎందు కేడ్వాలి?

సరే! ఏడుస్తూ ఒకకోనలోనికి పోయినాడు. అక్కడ ఎర్రనినీళ్లతో ఒక ఏరు; దానిప్రక్క పోకలు, నారింజలు, అరటులు, టెంకాయచెట్లు (అన్నీ మా రాయలసీమవే) దట్టముగా అల్లుకొని ఉన్నవి. కోకిలలు, చిలుకలు, గోరువంకలు, నెమళ్లు (మళ్లీ మాపక్షులే) కిలకిలారావములు చేస్తున్నవి. అక్కడ క్రిందికి మణులుచెక్కినమెట్లు దారిని పోగాపోగా ఒకగారుడోత్కీర్ణమైన భవనము కనబడినది. ఇట్టి గారుడోత్కీర్ణభవనములను పెద్దన్న విజయ నగరములో ఎన్నిచూచినాడో! ఐందవగ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛముల నాతడు మాపెనుగొండలో ఎన్నిటిని చప్పరించినాడో—అవికూడా ఉన్నవి ఆకోనలో.

ఆకోన గంధర్వయక్షగానఘూర్ణితమై ఉన్నది. ప్రవరుడు దానిదగ్గరకు పోతూ ఉంటే "మృగమదసౌరభవిభవద్విగుణితఘనసారసాంద్రవీటీగంధస్థగితేతరపరిమళమై మగువ పొలుపుం దెలుపు నొక్కమారుత మొలసె" నట. ఈపరిమళము మనుచరిత్రమును చదివి ఆనందించగల రసికపాఠకు లున్నంతకాలమున్ను గుబాళిస్తూనే ఉంటుందని సోదరులు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు జోస్యముచెప్పినారు. ఆంధ్రులలో రసికత్వ మేనాటికయినా మందగిస్తే, ఈపద్య మారసికత్వమునకు తిరిగీ చురుకుపుట్టిస్తుందని నాజోస్యము.

ఆభవనము ముందరి అంగణములో ఒక తీయమామిడిచెట్టు. ఆచెట్టుక్రింద ఒక అరుగు. చల్లగా గాలివీస్తున్నది. ఆ అరుగుమీద ఒక మరున్నారీశిరోరత్నము. నిలుకడచెందిన మెరపుతీగ. ఆమె ఒక శశికాంత మణిపీఠముపై కూర్చున్నది. కావిపావడ కట్టుకొన్నది; దానిపై ఉల్లిపొరవంటి తెల్లనిబట్ట. ఆబట్టలోనుంచి పావడరంగు చంద్రకాంతమణిపీఠమున కెఱ్ఱదనము నిస్తున్నది. చేత నొకవీణ. ఆమె దానిపై క్రమక్రకరపంకరుహారత్నకంకణఝుణఝుణ ధ్వనితాళమానములు గొలుపుతూ ఉండగా గీతప్రబంధములను పలికిస్తూ పరవశత్వము పొంది కన్నులరమూసికొని ఉన్నది. ఆమెయెదుటికి పోయినాడు ప్రవరుడు. ఆమె తత్తర పాటు ఏమని చెప్పను? యక్షతనయేందు జయంత వసంత కంతులం జక్కదనంబునం గెలువ జాలిన ఆ ప్రాయపునవమోహానునిచూడగానే పుట్టింది విరాళము. అతని కడ్డముగా నిలిచింది. ఏమిటీ చొరవ? ఏమిటీ తెంపు? ఎట్టి బాజారులంజ అయినా ఇట్లా చేస్తుందా! ఎందు కీప్రశ్న? వరూధుని చేసింది. అతనిమీద మక్కువకలిగింది. అతని నెందుకు పొందగూడదు? ధర్మ శాస్త్రాలు శాస్త్రాలయితే ననవిల్తుశాస్త్రముకూడా ఎందుకు శాస్త్రముకాదు? వరూధుని ఈప్రశ్న వేస్తే ధర్మపన్నాలుపఠించే అయ్యలుచెప్పే సమాధానమేమిటి? ఆప్రశ్న వేసింది తన్ను నిరాకరించిన ప్రవరునికి వరూధుని. "పద్మసంభవ వైకుంఠభర్గసభలలో సాముగరిడీ లలో ఆరితేరినాను. నేను తక్కువజాతి లంజనుకాను; చిన్నివెన్నెలకందు వెన్నుదన్ని సుధాబ్ధిఁ బొడమినచెలువ మాకు తోఁబుట్టువు; గాంధర్వవిద్య నభ్యసించినాను. అశ్వమేధ రాజసూయయాగములు చేసినవారు నన్ను పొందగలుగువారు? ఏమి నీకు నేనక్కర లేదా." అన్నది. 'చెప్పకుమిట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపైఁదేనియల్' "డిక్లైన్డ్ విత్ థాంక్స్" అన్నాడు భాషాపరశేషభోగి అయిన ప్రవరుడు. అంతే మీదపడింది. పడితే త్రోసివేశాడు. 'కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్' అన్నాడు పెద్దన్న. పెద్దన్న అన్నమాటకు విచారించవలెనో, ప్రవరుని దురదృష్టానికి విచారించవలెనో తెలియదంటు న్నారు కొందరు రసికశిఖామణులు-"భళీ, సెబా" సంటున్నారు ఇనుపకచ్చడాల్ గట్టుకొను మునులు. మునిమ్రుచ్చులని వరూధుని అంటే అది ఆమెవ్యక్తిగతాభిప్రాయము. అది ఎవ్వ రినీ బంధించదు. "తరుణి ననన్యకాంత నతిదారుణపుష్పశిలీముఖవ్యథాభరవివశాంగి నంగ భవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీష ణస్ఫురణవహించెనోయన నభోమణి" మొగము జేవురించుకొంటే జేవురించుకొననీ. నేను మాత్రము నావోటు పెద్దన్నకే యిస్తాను.

ఇక మన కీప్రవరునితో పనిలేదు. అగ్నిని ప్రార్థించుకొంటాడో, ఎవరిని ప్రార్థించుకొంటాడో, ఇంటికి పోనిద్దాము. ఇచట వరూధునిమాత్రము మనలను వదలదు. ఏడుస్తుంది, మొత్తుకొంటుంది, కనబడినవారిని, కనబడనివారినికూడా తిట్టుతుంది. తన్ను తానుకూడా తిట్టుకొంటుంది. ఆమె అవస్థ చూచి మనము జాలిపడడమా? నవ్వడమా? జాలిపడనూవద్దు, నవ్వనూవద్దు; వినోదము పొందుదాము, ఆనందింతాము- తిట్టినా చక్కగానే తిట్టింది. మన కేమిన్ని బాధలేదు.

ఇక రెండోఘట్టములోనికి ప్రవేశింతాము. మాయాప్రవరుడు ప్రవేశిస్తున్నాడు. వీడొక గంధర్వుడు. ఇంతకుముందు వరూధునికి వీడొకసారి కనుగీటినాడు. ఆమె వానిని తన కాసకొంగున వారించి కడపినది. వాడేమో ఆచుట్టుప్రక్కలనే కాచుకొని ఉన్నాడు. ప్రవరు డామెను నిరాకరించడమును చూచి ఉంటాడు. ఈవిషయమును కవి మనకు చెప్పలేదు. అయినా ఊహించుకోవాలి. ప్రవరునివంటి రూపముంటే ఆమె తనకు వశ్య అవుతుందని నిశ్చయించుకొన్నాడు. అటువంటిరూపమునే ధరించినాడు. గంధర్వుడు కాబట్టి ఆమూ ర్పతనికి సాధ్యమయినదని పెద్దన్న నమ్మవలె నంటాడు.

అయితే ప్రవరమాయాప్రవరులరూప మన్నివిధములా ఒక్కతీరుగానే ఉన్నదా అని మనవినోదముకోస మాలోచింతాము. ప్రవరుడు 'యక్షతనయేందుజయంతవసంతకంతులం జక్కదనంబునం గెలువజాలినవాడు. మకరాంకశశాంకమనోజ్ఞమూర్తి' మకరాంకుని, యక్షతనయుని, వసంతుని, జయంతుని మనము చూడలేదు. శశాంకునిచూస్తూనే ఉన్నాము. "వివిధాధ్వరనిర్మలధర్మకర్మదీక్షాపరతంత్రుడు, అంబురుహగర్భకులాభరణంబు. అనారతాధ్యాపనతత్పరుండు." సరే, ఇప్పుడుకూడా అట్టివారున్నారు కాబట్టి, వీరి ఆకారమునుబట్టి అతని ఆకారమునుకూడా కొంతవరకు ఊహించుకోవచ్చును. యౌవనములో ఉన్నాడు; చొక్కపులేబ్రాయము, తరుణాగ్నిహోత్రి, ధనాఢ్యుడు. కాబట్టి అట్టే దీనమైన మొగముకాదు. వాని కింతలు కన్నులున్నవి. అవి 'వదనప్రభూతలావణ్యాంబుసంభూతకమలముల'వలె ఉన్నవి. అంటే సాధారణపద్మములకంటె ఎంతో మనోహరములుగా ఉన్నవన్నమాట. అవి శతపత్త్రజైత్త్రములు. వానిభుజములు ఘనములై గిరిక్రేపులవలె వీనులతో ఎక్కసక్కెములాడుతున్నవి. వాని వక్షఃస్థలము వెడదగా ఉన్నది. 'సంకల్పసంభవాస్థానపీఠికవలె' వానిపాదములు మృదువులై తమతో ఈసుగొన్న చిగుళ్లమీద కోపముతో ఎఱ్ఱబారినట్లున్నవి అతనిది కమ్మని కుందనమువంటిమేను ఇక అతనికి శరీరకాంతి కలుగడానికి బ్రహ్మదేవుడు చాలాకష్టపడ్డాడు. జంబూనదికిపోయి బంగారుబురద తెచ్చినాడు;

సూర్యునివేడికి తాళి సానపట్టి రాలిన కాలుతూ మెరుస్తూఉన్న పొడిని తెచ్చి, బురదమీదచల్లి మెదిపినాడు; ఆతరువాత ఇంద్రలోకములోనికిపోయి అమృతమును తెచ్చి దానితో ఆబురద ముద్దను పదనుచేసినాడు. అట్టి మట్టిని తనశిల్పనైపుణ్యముచూపించి ఆయా అంగనిర్మాణము చేసి ఒక ఆకారమును తేల్చినాడు. ఆబొమ్మకు పెద్దన్న ప్రాణముపోసి ప్రవరుడు అని పేరు పెట్టి రంగముసకెక్కించినాడు. అట్టిరూపము సుర, గరుడ, ఉరగ, నర, ఖేచర, కిన్నర, సిద్ధ, సాధ్య, చారణ, విద్యాధర, గంధర్వకుమారులలో ఎవ్వరికిన్ని లేదు. మొగము చంద్రబింబమును కిమ్మననీదు. తలవెండ్రుకలు తెగబారెడు. అవి ఎలదేటిదాటుల బమ్మెరపోవ దోలుతున్నవి.

ఇక మాయాప్రవరుని ఆకారమును తేల్చుదాము. అత డంగభవవిద్యాపారగుడు. అంటే టక్కులు, టిక్కులు బాగుగా తెలిసినవాడన్నమాట. అట్టివాడు శాంతరసమొల్కు బ్రహ్మతేజముతో వరూథుని కెదురయినాడు. అతడు తనకమనీయతనుకాంతికనకద్రవముతో ఆరామరంగము నలుకుతున్నాడు. ఇంతే మనకు తెలిసినంతమట్టుకు ప్రవరమాయాప్రవరులకు కవిచెప్పినపోలిక. ప్రవరునివిషయమై కవిచెప్పని కపటప్రవరుని బాహ్యాలంకారరచన మనకు కొంచెము తెలియవస్తున్నది. అతడు లలాటమునందు గంగమట్టితో అర్ధచంద్రుని తేటనవఘులించేటట్లు పట్టితీర్చినాడు. అద్దములవంటి చెక్కిళ్లమీద మణికుండలములు జిగి వెల్లువలను చిందుతున్నవి. పైని బంగారుచాయఅంచులుగల ఎర్రని ఉత్తరీయము వేసుకొన్నాడు. నీర్కావిదోవతిని పింజెకట్టు కట్టుకొన్నాడు. దానిమీద రత్నములుకూర్చిన బంగారుమొలత్రాడు కట్టుకొన్నాడు. తెల్లని జందెములు వేసుకొన్నాడు. వ్రేలికి కాశికాముద్రగలఉంగరము పెట్టుకొన్నాడు. బాహువుకు పసిడితోరము కట్టుకొన్నాడు.

ఇట్టి వీరిద్దరికిన్ని కుందనమువంటి మేనుతప్ప మరేమిన్ని సామాన్యలక్షణము కవి చెప్పినదానినిబట్టి కనిపించదు కాని భేదముమాత్రము స్పష్టముగానే గోచరిస్తున్నది. ప్రవరునిది అమాయకపుమొగము; అతనివి అమాయకపుచూపులు, అమాయకపుమాటలు, అంతా అమాయకమే. మాయాప్రవరు డెంతదాచుకొన్నా అతని టక్కరిచూపులు, టక్కరిమొగము, టక్కరిమాటలు, ఏపాటి తెలివిగలవారికయినా పట్టియిచ్చివేస్తున్నవి. అతడు విపంచీస్వరంబున జటచెప్పుతూ వచ్చినాడట! దొంగ! "నేనాహితాగ్నిని, తల్లీ! నన్ను ప్రజలలో చేర్పు; బ్రహ్మానందాధిరాజ్యపదవీచ్యుతుడను కాజాలను; ఇట్టి తుచ్ఛసుఖముల్ మీసాలపై తేనియల్" అనిపలికి ఆమెమీద పడినప్పుడు 'హా! శ్రీహరీ!' అని ఓరమోమిడి పొమ్మంచుం ద్రోచ్చి, ఆమె సోకినచోట తగిలినకస్తూరివాసనపోయినదాకా నీళ్లతో కడుగుకొన్న బాపనయ్య తిరిగి

తనకోసము విపంచీస్వరంబున జటచెప్పుకొంటూ వచ్చినాడంటే వరూధుని ఎట్లు నమ్మినది? మనమెట్లు నమ్మగలము?

కామాంధ, కామపరవశ, వరూధుని నమ్మినది. పాప మామె రాత్రిఅంతా ఏడ్చినది, చెప్పరానిబాధపడినది. తెల్లవారినది. వనవిహారముచేస్తూ ఉన్న దేకాని, మనసంతా ప్రవరుని మీదనే ఉన్నది. "వాడేమి ఇంద్రుడా, చంద్రుడా, ఉపేంద్రుడా? ఎందుకు బెంగపెట్టు కొంటావు? ఆనందనవనములో భూమిసురనందను డుండకపోడు. రా, పోదాము" అని చెలికత్తె ఆమెను తోటలోనికి తీసుకొనిపోయినది. ఉపేంద్రునిమాట మనకు తెలియదు గాని, అర్ధరాత్రివేళ అహల్యకొంపలో దూరిన ఇంద్రుని, గురువుగారి చక్కనిచుక్కను లేవదీసుకొనిపోయిన చంద్రుని ఇక్కడ ఉపమానముగా తీసుకొనడములోగల వెక్కిరింపు మనల నుక్కిరిబిక్కిరిచేస్తున్నది. 'వాడేమి ఇంద్రుడా, చంద్రుడా' అని లోకములో అను కొనే నానుడిని పెద్దన్న చక్కగా ఉపయోగించుకొని, మనకు మాయాప్రవరునిగురించిన సందేహమును మరపించివేసి 'రండి, నందనవనములో మాయాప్రవరు నుంచినాను. అతనితో వరూధునిచేత ఆటలాడిస్తాను చూతురుగాని!' అని మనలను ముందు కీడ్చుకపోతున్నాడు. రాత్రిఅంతా జాగరము చేయడముచేత వరూధునికి మైకముగా ఉన్నది. అతనిని తలవని తలంపుగా చూచినది. ఆమెకు గుండె ఝల్లుమన్నవి; కాళ్లు తొట్రుపడినవి; మొగమున దైన్యము తోచినది. కన్నులు మిరుమిట్లుగొన్నవి; లోకుత్తుకపడినది; లేజెమట క్రమ్మినది; కన్నీళ్లు కారుతున్నవి. ఆ అవస్థలో ప్రవరునితో ఏపాటిపోలికకలవాడు ఎదురయినా ఆమె వానిమీద పడితీరేదే- ఆమె మాయాప్రవరుని "కలంగాంచిన వస్తువుం దెలిసి కాంచిన యట్లనురక్తి" గాంచినది. సెబాస్! పెద్దన్న నిజముగా గారడీవాడే, నమ్మనివారినికూడా నమ్మజేస్తాడు.

తరువాతికథను వదలివేదాము. వరూధునీమాయాప్రవరుల నానందనవనములో వారిరహస్యక్రీడలకు విడిచిపెట్టుదాము........వరూధునికి స్వరోచి పుట్టినాడు.

ఇంక స్వరోచికథ. స్వరోచియౌవనవంతుడైనాడు. నానాయుధవిద్యాపారీణుడైనాడు. సాటిలేనిబలముగలవాడయినాడు. మంథాచలముతటమునందు విశ్వకర్మ అతని కొక పురము కట్టినాడు. దానిలో అతడు రాజ్యముచేస్తున్నాడు. పెద్దన్న వర్ణించడానికి 'కరకా చిటపటరవభీకరమై పెళపెళనినాదఘనమై ఝుంఝామరుదుచ్ఛ్రితబిలమంద్రస్వరమై' ఆకొండ మీద ఒకవర్షము కురిసినది. తెల్లవారింది. సెలయేళ్లు పారుతున్నవి. నెమళ్లు కేకలువేస్తున్నవి. అచ్చటి తలపోలము చూదామని స్వరోచి పోయినాడు. అక్కడ ఒకయెరుకురేడు 'నక్క

కొమ్ము, ఇజ్జిగోజుజము, జొన్న, చాఱపప్పు, పీలిగరులఅంపకోలలు, సెలవిండ్లు,' కానుక యిచ్చినాడు.ఒకజాతినక్కకు మనుబోతులకువలె నడినెత్తిని కొమ్ముంటుందనీ,ఆకొమ్మును ఎరుకు రేడు తెచ్చియిచ్చినాడనీ అర్థము వ్రాసినారు వ్యాఖ్యానకర్తలు. ఉష్ణప్రదేశాలజంతువులను గూర్చిన శాస్త్రాలలో దేనిలోను కొమ్ముగలనక్కలనుగురించి ఎవ్వరున్ను చెప్పలేదు. ఈజంతు శాస్త్రజ్ఞుల కట్టి నక్కలు కనబడలేదో, వారు శాస్త్రాలు వ్రాసేనాటి కానక్కలజాతి ఉత్పన్న మైనదో చెప్పలేము. అనేకమంది వేటగాళ్ల నడిగినానుకాని, ఎవ్వరికిన్ని తెలియదన్నారు. ఎక్కడనయినా నల్లమల అడవులలో దాగొని ఉన్నవేమో ఈనక్కలు. కిట్టెలు కన్నడ నిఘంటువులో 'నరికొమ్బు' అంటే "A Jackal's Fabulous Horn" కట్టుకథలలోచెప్పే నక్కకుగలకొమ్ము అని అర్థము వ్రాసినాడు. అంటే కిట్టెలుకుకూడా దానినిగురించి తెలియ దన్నమాట. విన్స్లో తమిళనిఘంటువులో, 'నరిక్కొమ్బు' అంటే "Small bud-like horns in a jackal, of rare occurrence." Is said to be very efficacious in magic" ఒక అరుదైన పెద్ద నక్కకుండే చిన్న మొగ్గలవంటికొమ్ములు—ఇవి గారడీవిద్యలో చాలాపనిచేస్తవంటారు' అని వ్రాసినాడు. ఇతడుకూడా నక్కకొమ్మును చూచి వ్రాసి ఉండడు. గారడీవాళ్లవద్ద నక్కకొమ్ముంటుందని అనుకొనడము, వాళ్లు చెప్పడముకూడా ఉన్నదిగాని వాళ్లు చూపరు; ఎవరున్ను ఇంతవరకు చూడనూలేదు. ఇతరులను వశము చేసుకొనడానికిన్ని, వారికి భ్రమపెట్టడానికిన్ని, నక్కకొమ్మును జాగ్రత్తపెట్టుకొంటారని ఒకనమ్మకము లోకములో ఉన్నది. కన్నడములో "నరికొమ్బిద్దరూ నరరిగె హెదరబేకు (నక్కకొమ్మున్నా నరులకు బెదరవలెను); నరికొమ్బిద్దరూ హురియోదు తప్పీతే? (నక్క కొమ్మున్నా కాలడముతప్పినదా?)" అని సామెతలున్నవి. తమిళములో "ఇవన్ కైయిల్ నరి క్కొమ్బిరుక్కిఱదు (ఇతనిచేతిలో నక్కకొమ్మున్నది) అంటే ఇతనివద్ద వశ్యవిద్య ఉన్నది అని అంటారు. నక్క అంటే రాయలసీమప్రాంతాలలోను కన్నడసీమలోను చిఱుతపులికి పేరుగాకూడా వాడుతారు. ఏదయినా ఒకబలిసిన చిరుతపులికోరలో ఒకటి పెదవులుదాటి బయటికి తోసుకొనివస్తే దానిని నక్కకొమ్ము అంటారని కొందరుచెప్పుతారట! నేనెప్పుడున్ను అట్లా వినలేదు. 'నక్కకొమ్ము' అనేది జంతువుశృంగము కాని, పులికోరకాని కాదేమో అని నాకనుమానము. అది ఒకవిధమైన వేరయి ఉంటుంది. 'వేళ్లు, వెల్లంకులు' వశ్యవిద్యలో ప్రసిద్ధములైనవి. 'నక్క' అనేమాట 'నక్కదోసకాయ, నక్కబుడమ, నక్కచారపప్పు, నక్కసగడ్డి' మొదలయినపదాలలోచేరి ఆయాచెట్ల, తీగల అడవిజాతులను తెలియజేస్తవి. ఇట్లే కన్నడములోకూడ 'నరిచెణ్డు, నరిబాలదహుల్లు, నరిబాలదహొన్నె, నరియుల్లిగడ్డె, నరి హొన్నె' అని 'నరి' (నక్క)పదము ఓషధులవేళ్లలో కనబడుతున్నది.'కొమ్ము' అనేది జంతువు

కొమ్ముకేకాకుండా వేళ్లకు కూడా వర్తిస్తుంది. పసుపుకొమ్ము, సొంటికొమ్ము, అల్లపుకొమ్ము, వసకొమ్ము మొదలయినపదాలలో కొమ్ము అంటే వేరు అని అర్థముకదా. అందుచేత కొమ్ములు గల నక్కలు కనబడేవరకు 'నక్కకొమ్ము' అంటే 'ఒక అడవివేరు' అని అర్థము చెప్పుకో వలెనేమో!

కృష్ణరాయలకాలములో అడవులను చక్కగా కాపాడేవారు. అడవిజంతువులను చక్కగా రక్షించేవారు. వాటి అలజడి ఎక్కువయ్యి జనులకు బాధకలిగేటప్పుడుమాత్రము వేటనెపమున వాటిరాయిడిని కొంత తగ్గించేవారు. మనుచరిత్రములో వర్ణింపబడినవేట స్వరోచిచేసినదే అయినా కృష్ణరాయలు చేసినదే అని మన మనుకోవలెను. అప్పటి అడవులలో 'సీరాముసేన' వలె వాలుమెకములు చెలరేగినవి. వాటిలో ముఖ్యములైనవి క్రొవ్విన యేకలములు. అవి తొండములేని యేనుగులవలె ఉండేవి. కైదువుతో వాటిని పొడిస్తే చాలును. దానికి మళ్లీ చమురుపూయనక్కరలేదు. వాటినంజుడును 'చెడుగట్టిల'కు గ్రుచ్చి అగ్గిసెగ చూపితే చాలును, నెయ్యి జొటజొట కారుతుంది. పందివేట ఆనాడు ఈనాడు కూడా ప్రసిద్ధికెక్కినది. 'పందినిపొడిచినవాడు బంటు, కందముచెప్పినవాడు కవి.' ఇక మనుబోతులు కదలలేకుండా బలిసినవి. వాటిమీదికి కుక్కలను విడువనక్కరలేదు. బాణములు ప్రయోగించనక్కరలేదు. వర్షముపడినతరువాత రాయలసీమ రేగటిబురదలో గొరిజలు దిగబడి అవి పరుగెత్తనేలేవు. దుప్పులబడళ్లు బోదచరచి ఉన్నవి. వాటికొమ్ములు నాల్గు, రెండు, నొకటి ప్రంగలుగా చీలి బరువెక్కి ఉండడముచేత అవికూడా పరుగెత్తలేవు. ఇఱ్ఱిపోతులను పట్టుకొనడానికి ముండ్లుగల మ్రాకుదీముల నుపయోగించేవారు. అంటే కఱ్ఱతో ఇఱ్ఱిపోతుల విగ్రహములుచేసి వాటికి ముండ్లు తగిలించేవారు. అవికూడా ఇఱ్ఱిపోతులని భ్రమపడి వాటిని పొడువబోయి వాటిలో అవి చిక్కుకొనేవి. అవి ఒకదానితో నొకటి పోట్లాడుతున్నప్పుడు మనుష్యులెదురుపడినా ప్రక్కకు తొలగిపోవు. ఇక పక్షులా! చెట్టడిచినచేటడేసి. భూవివరాలలో జీవించేజంతువులు ఉడుము, గరిమిడికొక్కు, వెల్లయెలుక, కల్లెలుక——భూమినంతటిని జల్లెడవలె కన్నములుచేసినవి.

స్వరోచి అక్కడ కూర్చుండగా ఒకసాహిణి ఒకసింధుదేశపు గొప్పగుఱ్ఱమును (సైంధవమును) తెచ్చి రాజు ఎదుట నిలిపినాడు. సాహిణులు మొదట ఆంధ్రదేశమువారు కారు. మేలిజాతిగుఱ్ఱములుకూడా ఈదేశములోనికి పరదేశములనుంచి వచ్చినవే. సాహిణులాగుఱ్ఱములతో ఉత్తరహిందూస్థానమునుంచి వచ్చినారు. రానురా నిచ్చటిరౌతులకు కూడా ఆపేరే కలిగినది. పదమూడోశతాబ్దమునాటికే సాహిణిశబ్దము తెనుగులో కుదురు

కొన్నది. గుఱ్ఱములకుచేసే అలంకారాదికముకూడా పరదేశపుదే. స్వారోచిగుఱ్ఱపు అలంకారమంతా అట్టిదే. దాని వాగెపక్కెర (వాహప్రగ్రహము)కు పెర్షియాదేశపు రేవుపట్టణమైన హుర్ముంజి (ఆర్మజ్ తీరమున సముద్రములోదొరికే మేలిజాతిముత్యములతో పనిచేసినారు. వాగె అంటే కళ్లెము అనిన్నీ, పక్కెర అంటే బొంత అనిన్నీ అర్థము చెప్పడము తప్పు-దానిమీాదవేసినపల్లము (పల్యాణము, పర్యాణము, పరియాణము) పారసి (పారసీక) దేశపుది. అది పట్టమయము. పట్టు అనేవస్తువు దానిపేరుతోబాటు విదేశీయమే. దానితోనేసిన పల్లముకూడా విదేశీయమే. ఇక 'పీలికుంచెతలాటము, పీలి లేక పికిలిపిట్టలు' కూడా విదేశీయు లిక్కడకు తీసుకొనివచ్చినవే. వాటియీాకలతో చేసినకుంచెను 'తలాటము'గా కూర్చడము విదేశీయాలంకారపద్ధతి. 'తలాట్' అనేది పారసీపదము. 'పేరొజంబు' మణులు 'ఫిరోజ్' అనే పారసీకపుమణులు. ఇవి విలువగలవి. ఇవి క్షుద్రమణులని వ్యాఖ్యాన కర్త వ్రాయడము తప్పు.

ఆగుఱ్ఱముమీాద అమర్చిన ఆయుధములపేళ్లున్ను విదేశీయములే. పైఠాణము (ప్రతిష్ఠానము) నుంచితెచ్చిన 'సింగిణి' (శృంగిణి) ధనుష్కోటులయందు శృంగాకారముగ వంచుట ఈదేశపద్ధతికాదు. 'లకోరి' లు లేక 'లకోటీ' లనేవి గుదులుగా కట్టబడినబాణములు. బాణము లొకదానికొకటి బంకతోనో దేనితోనో కరిపించి ఆగుదినంతటిని ఒక్కపారి ప్రయోగిస్తే, వేగముచేత ఆగుది విడిపోయి బాణము లన్నిదిక్కులకును చెదరి లక్ష్యములను కొట్టుతవి. అట్టి బాణములగుదులకే లకోరీలని పేరు. లకోరీలతోబాటు 'తరకసము'ల (తరకసాల) అనగా అమ్ములపొదులపేరుకూడా ఇతరదేశమునుండి ఆంధ్రములో చేరినదే. పసిఁడి మనదేశాని 'మిహిపసిఁడి' మనదికాదు. 'మిహి'పసిఁడి' అంటే తెల్లని బంగారము. వన్నెహెచ్చినబంగార మనికాదు. మంచువలె తెల్లనిబంగారము మిహిపసిడి. దానితోచేయబడిన 'పరుంజు' (ఫర్జు పారసీకపదము) లేక పిడికలిగిన 'మొహదా' అనే పారసీకములో చేయబడిన అడ్డకత్తి; ఆకత్తికి కెలంకులందు 'తావు గుజ్జరి సేత (సేఁత, వన్నె)' గల 'కేవడము.' 'కెలంకులతావు,' 'గుజ్జరిసేత' అని విడదీయగూడదు. కెలంకులతావు అంటే అర్థములేదు. 'తావుగుజ్జరి' అంటే 'స్థలఘూర్జరము' అయితే 'జలఘూర్జర'మున్నదా? ఉన్నవి. ఘూర్జరులు ఓడప్రయాణముల కలవాటుపడి పెర్షియాసముద్రములోని కొన్ని ద్వీపముల నాక్రమించుకొన్నారు. అదేజలఘూర్జరము. స్వారోచి గుఱ్ఱముమీాదనమర్చిన కేవడము స్థలఘూర్జరములో చేయబడినది. ఘూర్జరులు ఉక్కుపరిశ్రమలో ప్రసిద్ధికెక్కినారు. 'కేవడ' శబ్దము విదేశీయము. 'ఖేట'శబ్దభవము. 'ఉరస్త్రాణ' మని అర్థము. 'సిరాజ్'

పెర్షియాదేశములో 'షిరాజ్'; కరా చురకత్తి అంటే వాడిదైన చురకత్తి అనిఅయినా అర్థము చెప్పవచ్చును; లేదా 'కరాచుర' కత్తి అనేదానిలో 'కరాచీ' ప్రదేశము సూచితమైనదా? 'చురకత్తి' అనేది ఏకార్థకపదముల జంట. చుర అంటేనే కత్తి, 'ఛురికా' శబ్దభవము. 'కత్తి'కి 'చుర' చేరిస్తే 'చిన్న' అనే అర్థము నిస్తుంది. లేదా, 'సూరత్' ప్రాంతములనుంచి దిగుమతి అయినకత్తులు చురకత్తులా? 'గోరక'లు కూడా 'ఛురిక'లే. ఛురికల ఆకారముగల ఇనుపమొనలుగల బాణములు గోరకలు ఇవి మనవేనేమో!

ఏమయితే నేమి స్వరోచియో, కృష్ణదేవరాయలో వేటకోస మెక్కిన ఆగుఱ్ఱము తురకగుఱ్ఱము; దానికిచేసిన అలంకారము తురక అలంకారము. అతనికోస మేర్పరచినవి తురక ఆయుధములు. కృష్ణదేవరాయలు హిందూమతస్థాపనముకోసము తురకపరికరములనే వాడవలసివచ్చినది. ఆకాలమునకు మహమ్మదీయులప్రాబల్య మెట్లు వ్యాప్తిపొందుతూ వచ్చినదో తెలుపడాని కీగుఱ్ఱముపద్య మొక్కటి చాలును.

స్వరోచితో వేటకు పోయినవారు 'నృపాలనందనులు, వాగురికులు, డేగవేటకాండ్రు, బోయముదుసళ్లు.' రాచకొమాళ్లు తలవెంట్రుకలను జడలు చుట్టుకొని, వానిని భాగములుగా పాయదీసి చోళ్లెముగా చుట్టుకొన్నారు. చల్లడములు తొడుగుకొన్నారు. చల్లడములు ఇప్పటికిన్ని రాయలసీమవారే తొడుగుతున్నారు. వాటిమీద ఎఱ్ఱమట్టికాసెలను గట్టిగ బిగించినారు. ఆకాసెలలో పిడికత్తులను దోపుకొన్నారు. బాహువులమీద డేగలను నిలిపి వాటిని నిమురుతున్నారు. చేతులతో జాగిలములను పట్టుకొన్నారు. ఆకాలములోను, ఏకాలములోను కూడా జాగిలములవేటా, డేగవేటా చాలా ప్రసిద్ధికెక్కినవి. డేగలున్ను జాగిలములున్ను కూడా ఆంధ్రదేశపువి కానట్లే తోస్తుంది. 'డేగ' కు 'సాళువము' అనిపేరున్నది. డేగలు సాళ్వదేశపువేమో! సాళ్వదేశము భరతవర్షములోనిది కాదేమో! 'జాగిలము' అనేది తెనుగుమాటకాదు. అది 'జాంగల'శబ్దభవమయితే దానికి 'అడవి (కుక్క)' అని అర్థము చెప్పవచ్చును కాని, ఆమాట ప్రాచీనాంధ్రవాఙ్మయములో కానరాదు.

వలలు పట్టుకొనివచ్చినవారు నీలిదిండ్లు కట్టుకొన్నారు. "దిండు" అనేది బొంతవలె కొన్ని గుడ్డలు కలిపి కుట్టినది. అది దళసరిగా నుండడముచేత 'దిండు' అని పేరువచ్చినది. వారు పట్టుకొన్నవి సెలకట్టియవిండ్లు; వాటిని 'గౌసెన'లలో ఉంచినారు. గవుసెన అంటే బట్టతో కుట్టిన సంచియేమో! వారినొసళ్లపై 'జుంజుఱు పల్లసిగ' లున్నవి. 'పల్లసిగ'లంటే ఎఱ్ఱనిసిగలనే అర్థము సరికాదేమో! 'పల్ల'కు 'ఎఱ్ఱని'అనే అర్థము నాకు కనబడలేదు. వారు చుట్టినవి 'వంకర'సిగ లేమో! వారు మొలలలో మోటకత్తులను, అంటే మొనలులేనికత్తు

లను దోపుకొన్నారు. 'మేనులఁగార్కొను కప్పులేర్చి చేపట్టిన వేటయమ్ములు' కూడా వారి వద్ద ఉన్నవట. 'వేటయమ్ము'లంటే తెలుస్తూనే ఉన్నది కాని దానివిశేషణమే దురవబోధముగా ఉన్నది. ఆబాణము లుపయోగములో లేనప్పుడు వాటికి నల్లని రంగేదో పూసి అవి తుప్పుపట్టకుండా ఉంచేవారేమో. వాడుక చేసేటప్పు డారంగును తీసివేసేవారేమో!

ఇక 'డేగవేటకాండ్రు' వీరి(కుడి)చేతిలో కట్టెలున్నవి. ఎడమముంజేతికి అత్తెము తొడుగుకొన్నారు డేగలగోళ్ల చేత చేతులు చీలకుండా. ఆడేగలకాళ్లకు మువ్వ కట్టినారు. అవి ఎరలకోస మెగరడానికి తత్తరపడుచున్నవి. ఈవేటకాండ్ర వేష మెట్టిదో తెలియ లేదు.

బోయముదుసళ్లు ఆయాజంతువులు అడవిలో ఉండే స్థానములను బాగుగా తెలిసిన వారు. ముసలితనముచేత వారివీపులు గూనులైనవి. వారినరపమీసములు దూదిపేకులవలె ఉన్నవి. వారు పౌరుషముగల కుక్కపోతులవలె ఉన్నారు. పందివలలు నేలమీద పరవడము వారిపని.

ఈవేటకాండ్రవర్ణన మెంతస్వాభావికముగను జీవితమునకు సమీపముగను ఉన్నదో, వేటవర్ణన మంత అద్భుతముగను ఆనందదాయకముగను ఉన్నది. ఆవేటసందడి యిప్పుడు కూడా జరుగుతూ ఉన్నట్లే ఉన్నది. ఆవేటకాండ్రలో మనమున్ను వేటకాండ్రమై, అడవికి నిప్పంటించి ఆయాజంతువులు ప్రాణభీతితో పరుగులెత్తుతూ ఉంటే మనమున్ను చప్పట్లుచరచి కేరింతలు కొట్టుతున్నాము. మోటుకాండ్రతో గలిసి ఆయాప్రతిరూపములను ముందుంచుకొని, మృగముల నాకర్షించి కత్తుల కెర చేస్తున్నాము. గవిలోనికి చొచ్చి బెబ్బులులతో పోరాడి చంపుతున్నాము. ఏకలములను వెంటబెట్టి, అవి యెదురు తిరిగినప్పుడు ఈటెలతో పొడిచి చంపుతున్నాము. కారుపోతులటెంకులలోనికి జొరబడి వాటిని కడ తేర్చుచున్నాము. చిల్లరమృగములమాట లెక్కయేమిటి?

వేట నిశ్చయముగా వ్యసనమే. నే నెన్నోసార్లు వేటకాండ్లతో అడవులలో పంది వేటకు పోయినాను. పులివేటకు పోయినవారితో పోయి చెట్లపై మాటులలో దాగుకొన్నాను. మెకము సమీపించినప్పుడు హృదయములో కలిగే ఉత్సాహము వర్ణనాతీతము. దెబ్బతిని పారిపోయినమృగమును వెదకుచూ తిరిగేటప్పుడు నిద్ర అక్కరలేదు; ఆహార మక్కరలేదు. ఆకలిదప్పులజ్ఞానమే ఉండదు. బ్రాహ్మణుడనై సొంతముగా వేటాడని నావంటి వానికే ఇట్టి ఉత్సాహము కలిగేటప్పుడు వేటయే వినోదముగాను వృత్తిగాను అవలంబించే వారి ఉత్సాహముమాట చెప్పవలెనా? పెద్దన్న నావలెనే రాజుతో ఎన్నోసార్లు వేటకు

పోయిఉంటాడు. కాబట్టియే వేట నంత స్వాభావికముగా వర్ణించినాడు. లేకుంటే ఆహితాగ్ని ప్రవరునికి, ఆకతకోపయతిశిష్యునికి, ఆనందవరీకనిరోగిబాపనయ్యకు, పిశితఖండముల నాకుపాత్తరలలో కట్టడము, గుదులు కుట్టడము, చిక్కములలో నించడము, కావళ్లలో నుంచడము, చిదుగుపొగమంటల కడ్డము పట్టి మీసాలు చూడుచూడుతూ ఉంటే కత్తులతో తిత్తులొలిచి, కుత్తుకలు కోసి, గోళ్లతో పెకలించడము, గరువునేలలలో గుంటలు త్రవ్వి, గబ్బువలవక కమ్మతావులుగల నావురాకులు పరచి, ఎరచిలోమేలేరి, కారిజము, కందనకాయ, క్రొవ్వు మొదలయిన మెత్తనిపదార్థముల లో గ్రుక్కి, ఎక్కువతక్కువలు కాకుండ కండగల ఒలిచిన చింతపండు బొట్టలు దానిమీద పరచి, దానిమీద ఎసరుగా తేటలగులేటినల్లలు గుమ్మరించి, దానిమీద ఉప్పుజల్లి, దానిమీదలావుగా కావు కప్పి, దానిమీద కారెనుపపట్లనీరారు ఏరుపిడకల దాలులు పెట్టి, నెల్లికొయ్యలు త్రచ్చి, మచ్చులంటించగా పెచ్చుపెరుగు చిచ్చు లాత్రంపులకు తగిలించి, చిముడ సుడికించి, పైకితీసి, ఉప్పూ వెప్పూ గల ఆమాంసపుముక్కలను గరచి నిప్పులమీద చమురు చిప్పిల కఱకుట్లు కాల్చడము, ఇదంతా ఎట్లా తెలిసింది? ఆకఱకుట్ల కమ్మవలపు తగిలి నాలుగువందల యేళ్ల తరువాత చదువుతూ ఉంటేనే మాంసమంటే అసహ్యించుకొనే నాకే నోరూరిపోతూఉంటే, ఆనిత్యాగ్నిహోత్రి అంతదగ్గరగా ఉండి చూస్తూ ఎట్లా తాళుకొన్నాడా అని ఆశ్చర్యము కలుగుతున్నది. నేనే అయితేనా, కాశ్రేడూ గీశ్రేడూ దగ్గరకు రాకుండా తరిమి ఎవ్వరికిన్ని పాళ్లుపెట్టి ఉండను! అన్నా! పెద్దన్నా! రాజు మెప్పుపొందడాని కెంతచక్కగా వేటాడినావయ్యా! ఎటువంటి కరకుట్లు కాల్చినావయ్యా! మాటలతో!

* * * * *

వరూధునితో పరిచయము కలిగిన తరువాత మనోరమ ఎందుకు? ఆమెచెలికత్తెలయిన కళావతీ విభావసు లెందుకు? వాళ్లందరకత్తెలే. కాకపోతే స్వరోచి పెండ్లాడువాడా? అయితే వాళ్లు ముగ్గురున్ను తమవిద్యల సుంకువలుగా ఇచ్చి అతనిని పెండ్లాడుకొన్నారు. పెళ్లిళ్లు బాగానే జరిగినవి కాని, వాళ్లకథలు మాత్రము విచారకరములు.

వారిమాట కేమిగాని, స్వరోచి రాక్షసునితో చేసిన యుద్ధము మాత్రము చాలా భయంకరముగా ఉన్నది. ఆరాక్షసుడు వచ్చినవిధమును చదువుతేనే కాళ్లు వణకిపోతూ ఉంటే, నల్లమలలలోని (పొరపాటు, మంథాచలప్రాంతాటవిలోని చెంచులు—కాదు, కాదు, మంథాచలప్రాంతములో చెంచువాళ్లెక్కడనున్నారు?—మంథాచలము నల్లమలల లోని ఒకకొండయేమో!)—ఎవరైతేనేమి చెంచులు వెనుకకు దాడులీసినప్పుడు స్వరోచి

వారికిచేసిన హెచ్చరింపుమాటలు మాత్ర మాంధ్రులు నిరుత్సాహము పొందినప్పుడెల్ల ధైర్యమును పుట్టింపజాలి ఉన్నవి.

ఉ. కైదువు సున్న పూజ్యములు కంకట ఖేట శిరః స్థలత్రముల్
లేదరదంబు తత్తడి వాలికి సహాయము సర్వమంగళం
బీదనుజుండు చిక్కె భయమేటికి లుబ్ధకులార! యాత్మకుం
బీదతనంబు మేలె? మఱి మృత్యువు డాగెడిచోట లేదొకో?

ఆ నీడఁ గడవఁ బాఱ నేలకు వెలిగాఁగ, నడుగువెట్టి తిరుగ నాత్మ మొఱఁగి
యొకటిఁ దలఁప నరుల కొదవిన నొదవదే, కరణి మృత్యుదేవిఁ గన్నుఁ బ్రామి.

క. చావు దలపోసి మానవుఁ, డేవగ దుష్కీర్తి నొరయకే దినములు పొం
దై వెడలునట్లు నడవగ, దైవం బటమీఁద మేలు తాన ఘటించున్.

సీ. బుద్ధీంద్రియక్షోభములకుఁ బెట్టనికోట విపదంబురాశిదుర్వికృతికోడ
ఖలదురాలాపమార్గణవజ్రకవచంబు రణమహీస్థలికి శ్రీరామరక్ష
శాత్రవదుర్గర్వసంస్తంభనౌషధి మొనయు చింతాశ్రేణి మూఁకవిప్పు
యోగాదిసంసిద్ధు లొనఁగూర్పు పెన్నిధి తూలు నేకాకుల తోడునీడ
సకలసుగుణప్రధానంబు సకలకార్యజాలసాఫల్యకరనైకసాధనంబు
ధైర్యగుణ మట్టిధైర్యంబు దక్కిపోరఁ, దత్తరింతురె యకట! మీతరమువారు!

ఈపద్యములను మననము చేసుకొనే ఆంధ్రుల ఆతరమువారే కాదు, ఏతరము వారున్ను తత్తరింపరు. కృష్ణరాయ డానాడెత్తిన ఆదివరాహపతాకచ్ఛాయలం దాంధ్రవీరు లేనాడును ముందంజవేస్తారు. సందేహము లేదు. భారతవర్షములో— ప్రపంచములో— ధర్మప్రతిష్ఠాపన మాంధ్రులమూలముగా జరుగవలసి ఉన్నది; కలిధ్వంసము కావలసిఉన్నది. కృష్ణరాయడు తనకాలములో కలిధ్వంసము చేసినాడు; ఆర్యధర్మమును నిలిపినాడు. మను చరిత్రమున్నంతకాలమున్ను ఆంధ్రులలో కృష్ణరాయనివంటి ధర్మపరాయణు లున్నంత కాలమున్ను కలిధ్వంసము నిరంతరము జరుగగలదు.

మనుచరిత్రము నిజముగా చరిత్రము. కృష్ణరాయలనాటిచరిత్ర మందులో గర్భితమై ఉన్నదని పైని సూచించినాను కదా! కాని, అది ఆనాటిచరిత్రము మాత్రముకాదు. అది ఆంధ్రుల ఎల్లనాటిచరిత్రము. ఆంధ్రులది మిశ్రజాతి. వారిదేవత్వము మానుషత్వమును దాల్చినది.

మ. అనిమేషస్థితి మాన్పె చిత్తరపుంజూ; పస్వేదతావృత్తి మా
న్పె నవస్వేదసమృద్ధి; బోధకళ మాన్పెన్ మోహవిభ్రాంతి; తో
డనె గీర్వాణవధూటికిన్ భ్రమరకీటన్యాయమొప్పన్ మను
ష్యుని భావించుట మానుషత్వము మెయిం జూపట్టె నానత్తఱిన్.

ఆమెతో గూడిన మాయాప్రవరుడు కూడా గంధర్వుడే అయినా మానవాకారమును పొందియే మనోరథసిద్ధిని పొందినాడు. అయితే స్వరోచి గంధర్వుడా? మానవుడా? అతనికిన్ని వనదేవతకున్ను పుట్టిన స్వారోచిషమనువుమాట యేమిటి? అందరున్ను మనుష్యులే; మనుష్యులయిన దేవతలు. ఆంధ్రులు విశ్వామిత్రసంతతివారు. విశ్వామిత్రుడు దేవత్వమును సంపాదించిన మానవుడు; మేనక మానవత్వమునుపొందిన దేవతాస్త్రీ, కాని మనకేమో వారిద్దరున్ను మానవులే. వారిసంతతివారయిన ఆంధ్రులలో మానవత్వము ప్రకోపించినప్పుడు నిరుత్సాహము కలుగుతుంది; నిరుత్సాహస్థితిలో దేవత్వము పొడచూపి ధైర్యోత్సాహములను పురికొల్పుతుంది. ఇది ఆంధ్రులచరిత్రతత్త్వము. ఆతత్త్వమే మనుచరిత్రములో నిరూపితమైనది.



గా॥ డాక్టర్: యు. రామరావుగారు, మదరాసు లెజస్లేటివు కౌన్సిలు ప్రెసిడెంటు, మదరాసు:—

శ్రీ త్రిలిఙ్గ రజతోత్సవము జరుగనున్నది. ఈపత్రికను శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు 25 ఏండ్లక్రిందటప్రారంభించిరి. ఈసందర్భమున శ్రీశాస్త్రులుగారు చేసిన కృషినిగురించి ఆమోదవాక్యములు చెప్పగలుగుచున్నందులకు మిక్కిలి సంతోషించుచున్నాను. వీరు తెనుగువాఙ్మయపోషకులు. తెనుగుభాషకు ఉద్దండమైనసేవ చేసినవారు. తెనుగుజిల్లాలలోమాత్రమేకాక ఇతరభాషాప్రాంతములలో గలతెనుగువారందరికిని త్రిలిఙ్గ రాజకీయప్రభోదమును కలిగించుటకు తోడ్పడినదనుట నిస్సందేహము. అచ్చటి ఆర్థికసాంఘికతదితరసమస్యలతీర్మానములకును తోడ్పడినది. ఈరజతోత్సవశుభముహూర్తమున శ్రీశాస్త్రులుగారినిఅభినందించుచు త్రిలిఙ్గపత్రిక చిరాయువై అనేకసంవత్సరములు దేశసేవ నింకను ఎక్కువగ చేయునుగాక అని ఆశీర్వదించుచున్నాను.

# అల్లసానిపెద్దనమహాకవి

**విద్వాన్ శివపురపు వేంకట లక్ష్మీనరసమ్మగారు,**
శ్రీయువతీవిద్యానిలయము, తెలుఁగుపండితురాలు, బాపట్ల.

ఆ. కడపమండలమునఁ గామలాపురమున, కించుకంత చెంత నెల్లసిరుల
కాటపట్టనంగ నలరు కోకటనామ,మున జనించి మిగుల ఘనతఁ గాంచి. ౧

చ. గురువరుఁ డైనయట్టి శఠకోపయతీంద్రుని భక్తిఁ గొల్చి త
త్కరుణకుఁ బాత్రుఁడై సకలకాంక్షల నీను హయాస్యమంత్రమా
నిరుపమకీర్తి నీతనికి నేర్పు నొసంగఁగ నంచు నాయతీ
శ్వరుఁ డొసఁగంగఁ గైకొని యొసంగెడుశ్రద్ధ జపించి దీక్షచేన్. ౨

చ. తురగముఖంబుతో హరియుఁ దోఁచిన భక్తి యొసంగ మ్రొక్కి యు
ర్వరను మదాఖ్య నిల్చునటు భద్రద! నాకు వరం బొసంగు మా
దరమున నంచు వేఁడఁ గవితాధనపేటిక నిచ్చి యేగఁ ద
ద్వరమున సత్కవిత్వ మనుభాగ్య మనర్ఘము తా లభించుటన్. ౩

చ. నరపతిమౌళిరత్నపరిణద్ధమహోన్నతపాదపీఠుఁడై
పరమయశస్సమగ్రుఁడయి భాసిలుచుండెడు కృష్ణదేవభూ
వరతిలకుండు దాత కవివర్యుఁడు సారరసజ్ఞుఁ డంచు నె
ల్లరు వినుతింపఁ బెద్దన యిలాపతిపుంగవుఁ జూచు కోరికన్. ౪

చ. మనమున వీతివక్త్ర నసమానకృపానిధి నెంచుచున్ జనం
గనె బహుమాన ముప్పతిల క్ష్మాపతిపుంగవుఁ డాదరించుచుం
దనసఖుగాఁ దలంచి కవితల్లజ! నాదగుసన్నిధానమం
దు నిలువు మంచుఁ గోరెఁ దనతో సరిహానిగ నెన్ని సత్కవిన్. ౫

చ. అనుపమకల్పనల్ వెలయునట్లుగఁ బెద్దన పెద్ద లౌనన్
మనుచరితంబు వ్రాసె సభ మన్ననమీఱఁ గృతిన్ గ్రహించి యా
తనిఁ గవితాపితామహుని దానె కరంబుల గండపెండెరం
బును దొడుగంగ సమ్మదముఁ బూన నొనర్చె రసజ్ఞుఁ డౌటచేన్. ౬

ఉ. పెద్దనయోలి యెవ్వఁడు కవిత్వము చెప్పునొ వాని నెల్లరుం
బెద్ద యటంచు నెంచఁదగు విస్తృతకీర్తి గడించి శక్తిచేఁ
బెద్దన ధాత్రిపై వెలసెఁ జిరప్రతిష్ఠలఁ గాంచఁ గోరువా
రద్దిర యట్టు లుండఁదగు నన్వహ మంచు వచింపనౌఁగదా. ౭

ఉ. ఎద్దియొ శీర్షవాలములె యేర్పడకుండఁ గవిత్వ మల్లి తా
రుద్దియొ లేనివార మనునూహలనే వెలిఁబుచ్చువార లా
పెద్దనఁ గాంచి సిగ్గుపడి పృథ్విఁ జరించుట మంచిదౌను నే
ర్పెద్దియు లేకయున్న నెదియే నొనరింపక యూరకుండనౌ. ౮

చ. గురుకరుణైకపాత్రుఁడె యగుంగద మర్త్యుఁడు వృద్ధినొందు భా
గ్యరతిని గాంచునేని యటుగాక తనంతన వృద్ధినొందు నా
గరువముఁ గాంచునేని ఫలకారిగ నుండదు తత్ప్రియత్న మె
వ్వరుసఁ దలంచినన్ గురువె భద్రముఁ జౌనవచ్చు గట్టిగన్. ౯

ఉ. దైవము కోపమొంద గురుతల్లజుఁ డాపద లొందకుండ దా
నేవిధినైనఁ గావఁగలఁ డుత్తరినైనను రోష మూనునేఁ
బావనచిత్తుఁడౌ గురువు భద్రము దైవ మొసంగఁజాలదం
చీవిధిఁ దెల్పుశాస్త్రము తదీప్సితమే హిత మెల్లవారికిన్. ౧౦

చ. గురుమహిమం బపారమె యగుం దలపోయఁగ వల్పబుద్ధియౌ
నరుఁడును దత్కృపాలవమునం దగుప్రజ్ఞగణింప నేర్చునె
వ్వరును దమంతఁదాముగఁ బ్రభావముఁ గాంచఁగలే రటంచు ని
ద్ధరఁ గవివర్తనం బిదె యుదాహరణం బగుచుండుఁ జక్కఁగన్. ౧౧

సీ. పెద్దనపాడను పేరుగల్గినపల్లె పెద్దన చెఱువునా పృథ్వియందుఁ
గనఁబడుచుండుటఁ గామలాపురముచెంతనె యల్లసాని పెద్దనకవీంద్రుఁ
డున్నవాఁడని యెల్ల రూహింపఁదగియుండు దూపాటిసీమలో నేపగిదిని
దలపోసిన వసింపఁదగునని పలుకంగ సాధ్యంబుగాదు వ్యాజమెదో యున్నఁ
తే. గాని యదియొల చిహ్నముల్ గానఁబడవు, గాదె యిందున్నవాఁడు నిక్కం బటంచు
వాని విడనాడి వేఱొక వరుసఁ బలుకునంత యవసరమేదొ నే వరయఁజాల. ౧౨

క. కోకటముఁ గోర హేతువు, లేకుండునె జగతి స్వస్థలిం బూజ్యముగాఁ
ప్రాకటసంపద్యుతముగ, నేకొనియాడుటయు నైజమే యగుఁగాదే. ౧౩

ఆ. మెట్టపంటగల్గి మిట్టమీఁదనె యుండు, కోకటమును సుకవి కోరె ననఁగ
స్వస్థలం బనుటకు సందేహ మేలని, తెలుపు జనులకెల్లఁ దేటపడఁగ. ౧౪

క. కవి మెచ్చెడు భూపతి భూ,ధవు మెచ్చెడు సాధుకవివతంసుఁడు నుంటఁ
భువి యది పావనతమమై, స్తవనీయము నొట సత్యసమ్మతమగుఁగా. ౧౫

శ్రీ జీ. యస్. అరండేల్‌గారు, ప్రెసిడెంటు, దివ్యజ్ఞానసమాజము, అడయారు, మద్రాసు:—

శ్రీత్రిలిఙ్గరజతోత్సవసందర్భమున నాహృదయపూర్వకఆశీస్సులనైకొనుడు. ఇంకను పెక్కేండ్లివర్ధిల్లి భారతభూమికి సేవ చేయుగాక!

సర్: వేపా రామేశంగారు, రిటైర్డు హైకోర్టుజడ్జి, గోపాలవిహార్, 10, ఎడ్వర్డు ఎలియట్సురోడ్డు, మైలాపూరు, మదరాసు:—

తెలుగువారపత్రిక శ్రీ త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి అభినందనపూర్వకముగా ఉత్సవసంచికసమర్పింతురని తెలియుచున్నది. శ్రీశాస్త్రులుగారిప్రజాహితజీవనము అమూల్యము. వారు సంస్కృతము, తెనుగు, అరవములవాఙ్మయములకు శక్తిశ్రద్ధలతో సేవచేసినారు. వారికి చిరాయురారోగ్యైశ్వర్యములు అమరుగాత!

సర్: యమ్. వేంకటసుబ్బరావుగారు, రిటైర్డు హైకోర్టుజడ్జి, హైదరాబాదు. (తంతివార్త):—

అభినందనములు - త్రిలిఙ్గరజతోత్సవమునకు - అభివాదనములు-వేంకటేశ్వరశాస్త్రులకు—తెలుగువాఙ్మయమునకు వారిఅమూల్యసేవ పొగడ్తకుమించినది.

# శకుంతలాదుష్యంతోపాఖ్యానము

## ఆంధ్రశ్రవ్యకావ్యకర్తలరచనావిశేషములు


విద్వాన్ శ్రీసింగరాజు రామలింగశాస్త్రిగారు

ఆంధ్రపండితులు, పచ్చయప్పహైస్కూలు, మదరాసు.


భారతమునం దాదిపర్వములోని శకుంతలాదుష్యంతులకథను నితివృత్తముగా గ్రహించి శృంగారరసప్రధానమగు నాటకమును సర్వాంగసుందరముగ కాళిదాసమహాకవి రచించెననుట పండితజనైకవేద్యము. అట్టిరచనలో ప్రదర్శనయోగ్యముగ కథాసంవిధానమును మార్చుకొని యనుగుణ్యమైన పాత్రల నేర్చి కూర్చి యతఁడు తనయప్రతిమానప్రతిభను వెల్లడించెను.

ఆంధ్రకవులలోఁ బూర్వులు కాళిదాసుని కవితామాధుర్యమును గ్రోలి హృదయంగమమైనవిధమున గొన్నిమార్పులఁ గావించి యీకథనే ప్రబంధముగ రచించి యశఃకాయులైరి. అందు నాగరాజామాత్యుఁడు, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి, కృష్ణకవి యనువారు ముఖ్యులు. ఆధునికులలో కళాప్రపూర్ణ శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, శ్రీవీరేశలింగంపంతులుగారు, శ్రీరాయదుర్గం నరసయ్యశాస్త్రిగారు కాళిదాసునినాటకమును నాటకరూపముగఁ దెనింగించిరి.

పూర్వకవులు రచించినప్రబంధములలో పినవీరన రచించిన శృంగారశాకుంతలమును, కృష్ణకవిరచించిన శకుంతలాపరిణయమును నెక్కుడు ప్రచారములో నున్నవి. పరీక్షలకు సయితమిందలిభాగముల నిర్ణయించుచున్నవారు. ఈయిర్వురలోఁ బినవీరభద్రుని కవితానైపుణ్యమును ననేకులు ప్రశంసించియున్నవారు. ఇతని వర్ణనలోని చమత్కృతి, భావవిశేషములు వర్ణనాతీతములు. పినవీరన రచనావిశేషములు పిమ్మట కవులగు పెద్దన రామరాజభూషణులకు మార్గదర్శకములైన వనుట యందతెఱంగినదియ.

కృష్ణకవిరచితమైన శకుంతలాపరిణయమును బరిశీలించినపుడు కొన్నివిశేషములు కనఁబడుచున్నవి. కృష్ణకవికిఁ బూర్వము పినవీరన రసవత్తరముగ శృంగారశాకుంతలమును రచించియుండ నీకవి యీకథనే వ్రాయఁబూనుటలోని భావమెట్టిదని యూహింపవలసి యున్నది.

పినవీరన కావ్యరచనకుఁ గడంగుటలో తద్గ్రంథభర్తయగు వెన్నయామాత్యుని వాక్యప్రకారము నిర్వహించెను. ఆవాక్యము లిట్లున్నవి.

శా. ప్రఖ్యాతంబన మిశ్రబంధమన సుత్పాద్యం బనంగాఁ ద్రిధా
వ్యాఖ్యాతం బగువస్తు వందు మఱి యథ్యాహారముం జేయఁగాఁ
బ్రఖ్యాతం బితివృత్తమైనకృతి చెప్ప న్వక్తకున్శ్రోతకు
న్విఖ్యాతిం గలిగించుఁ బుణ్యమహిమ న్విశ్వంభరామండలిన్.

క. శృంగారము ముఖ్యంబగు, నంగియు నంగములు దలఁప నష్టరసములు
న్నంగ మగునేనిఁ డంకము, బంగారముతోడి యొఱ ప్రబంధము వొందున్.

గీ. కథ ప్రసిద్ధియు మిగుల శృంగారవతియుఁ, బరిగణింపంగ శ్రీమహాభారతమునఁ
గథిత మైనశకుంతలాఖ్యానభంగి, నది ప్రబంధంబుఁ జేయు ప్రఖ్యాతినొంద.

సీ.... ... ... ... ... ... ...

గీ. భారతప్రోక్తకథమూలకారణముగఁ, గాళిదాసునినాటకక్రమము కొంత
తావకోక్తికి నభినవశ్రీవహింపఁ, గూర్మిఁ గృతిసేయు నాకు శాకుంతలంబు.

దీనినిబట్టి పరిశీలింపఁ బినవీరనరచన యపారశేముషీవంతమై యొప్పియున్నది.

కృష్ణకవి కావ్యారంభమునఁ జెప్పుకొన్నపద్యములలోఁ జిరుమామిళ్ల పాపయ్య ప్రభుండు కృష్ణకవిని జూచి

క. అవ్యయభవ్యావహ మగు, కావ్యరచన మదియు మేలుగాదే బుధసం
భావ్యము విశ్వశ్రేయః, కావ్యం బనుసూత్ర మార్యఘటితం బగుటన్.

అనిచెప్పి తనతల్లికోర్కెను దెల్పి యొక్క రాజన్యచరిత్రము కృతిముఖంబుగా రచియింపం జేసి వేంకటేశ్వరార్పణంబుగా నివేదింపందగు నిది మదీప్సితం బనుటను వచించెను. అప్పుడు కృష్ణకవి శకుంతలాదుష్యంతోపాఖ్యానమును రచింపఁబూనెను. కృష్ణకవి కావ్యరచనాప్రారంభమునఁ జెప్పికొనినపద్యములలో కవిస్తుతిని గావించుసందర్భమున పినవీరన వలెనే భారతకవిత్రయమున నొకఁడగు నెఱ్ఱాప్రెగ్గడను పేర్కొనకుండుటకుఁ గారణము తెలియలేదు. కృష్ణకవిరచించిన శకుంతలాపరిణయమున నిట్లున్నది.

తే. సోము నన్నపఁ దిక్కనసోమయాజి, భీము శ్రీనాథు భాస్కరుఁ బెద్దనార్యుఁ
బోతనామాత్యు మఱియును బొలుపుఁ గాంచు, నాంధ్రకవితానిశాంతుల నభినుతింతు.

పినవీరనరచనలో సంస్కృతకవుల నుతించినపిమ్మట—

క. ఇట్టుల మగుమతి భారత, ఘట్టమునకు నడవ యచ్చుఁగట్టిన కవితా
పట్టాభిషిక్తు నన్నయ, భట్టోపాధ్యాయుఁ దలఁచి పరమప్రీతిన్.

గీ. ఉభయకవిమిత్రు నత్యంతశుభచరిత్రు, భానుసమతేజుఁ గొమ్మయప్రభుతనూజు
సుకృతవిభ్రాజిఁ దిక్కనసోమయాజిఁ, బ్రణుతబహుదేశకవిరాజిఁ బ్రస్తుతించి.

అనియున్నది. పినవీరన యెఱ్ఱాప్రెగ్గడను నుతింపకుండుటకుఁ దత్కృతిభర్తయగు వెన్న మంత్రికిని నెఱ్ఱాప్రెగ్గడకుటుంబమునకును గలిగినద్వేషమే కారణమై యుండునని కొందఱు పండితప్రకాండులును విమర్శకులును నూహించిరి. కృష్ణకవివిషయమున నెట్టియభిప్రాయము నిర్ణయించిరో నాకుఁ దెలియదు. కృష్ణకవి పేర్కొనినయాంధ్రకవులయం దతనికపారమైనభక్తి యున్నట్లు తద్గ్రంథపరిశీలనముఁబట్టి తెలియుచున్నది. అందునను బోతనామాత్యునిశైలియు, పెద్దన శ్రీనాథులశైలీభావములును ననేకసందర్భములఁ గన్పట్టుచున్నవి. మచ్చునకు నొకటి రెండుపద్యములఁ దెల్పెద.—

భాగవతమునఁ బోతన ప్రారంభమున నిట్లు తెల్పియున్నాఁడు.—

క. పలికెడిది భాగవతమఁట, పలికించెడివాఁడు రామభద్రుండఁట నేఁ
బలికిన భవహర మగునఁటఁ, బలికెద వేఱొండుగాథఁ బలుకఁగ నేలా.

కృష్ణకవి.—

కృతికన్యాపతి వేంకట, పతియఁట కృతిభారతార్థపద్ధతియఁట యా
కృతి భవనిష్కృతి యగునఁట, కృతివి గదా నీవు జగతిఁ గృష్ణకవీంద్రా.

భాగవతమున నరకాసురవధకథాసందర్భమున సత్యభామనుగూర్చి యిట్లున్నది.—

సీ. వీణెఁ జక్కఁగఁ బట్ట వెరవెఱుంగనికొమ్మ బాణాసనం బెట్లు పట్టనేర్చె

అనుపద్యము. ఇట్లే యొకచోట 'పాలతి దానవవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు' అనుభాగ వతములోని వాక్యము 'పాలతుక దానవపావకము పూరుషుఁ డాజ్యఘటంబు' అని కృష్ణకవి వ్రాసెను. కృష్ణకవిరచనలో ద్వితీయాశ్వాసము 70 వ పద్యము

సీ. పరుషవల్కలచీరపరిధాన మెట్లోర్చె? నీమేను నవనీతకోమలంబు......
... ... ... ... అనుపద్యము సరిపోలుచున్నది.

ఇంకను శబ్దాలంకారములఁ బ్రయోగించుటలోఁ బోతన భాగవతమును నీకవి చక్కఁగఁ జదివి మేలిబంతిగ నేర్పఱచుకొన్నట్లు తెలియుచున్నది.

శ్రీ బిల్హరజలోత్సవము

శృంగారమును వర్ణించుపట్ల పెద్దనను శ్రీనాథుని ననుసరించె ననుటకు ఇందులకు గృష్ణకవిరచనలోని తృతీయాశ్వాసమున 50, 51 పద్యములు నిదర్శనములు. సీసపద్యముఁ నడకలో నాచనసోమునిమార్గముఁ ద్రొక్కి యనూనవైఖరిని రచనను సాగించెను.

కృష్ణకవి ప్రారంభపద్యములలోఁ దన్నుఁగూర్చి యిట్లు పలికియున్నాఁడు.—

మ. నను రామానుజపాదపద్మయుగళీనవ్యావ్యయధ్యానపా
వనహృద్భాగవతావతంసపదసేవాసక్తచిత్తుఁ మరు
త్తనయారాధనచారులబ్ధకవితాధారుఁ సదారూఢభా
వను నాస్థానకవిఁ నిజాశ్రితునిఁ బిల్వంబంచి పల్కెఁ గృపన్.

ఇందుపాసనావిశేష మీతనియందున్నట్లు తెలియుట కీతనిరచనాచమత్కృతి నిర్దుష్టమై యొప్పియున్నది.

ఇఁక కథావిషయమునఁ గృష్ణకవి నడచినపద్ధతిని బరిశీలించి యతని యపారధిషణా విశేషమును దెలిసికొనఁదగును.

వ్యాసరచితభారతమున దుష్యంతుఁడు వేటకై వెడలినవిషయమునుగూర్చి యిట్లు తెలుపఁబడెను.

"స కదాచిన్మహాబాహుః ప్రభూతబలవాహనః,
వనం జగామ గహనం హయనాగశతైర్వృతః."

పినవీరన యిట్టిసందర్భమున పుళిందవల్లభులు దుష్యంతునికొలువుకూటమునకు రాగా వారిని జూచినదే రాజునకుఁ జిత్తంబు మృగయాయత్తంబైనదనియు నప్పు డతఁడు వేటకై వెడలెననియు నున్నది. కృష్ణకవిరచితకావ్యమున నారదాగమనమును నారదుఁడు దుష్యంతునివంశమును గీర్తించి యిట్లు నుడివెను.

గీ. వనులఁ గ్రీడించు దుష్టసత్త్వములవలన, నాశ్రమమ్ముల నొదవె మహాశ్రమమ్ము
వెడలు మడవికి నిపుడ కావింపు మింపు, తాపసహితాప్తి మాకుఁ బ్రతాపసహిత.

అని నుడివి "ఆశ్రమంబులకు సౌఖ్య మాపాదింపు మమ్మహామునులయనుగ్రహంబునం జక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం డుదయించి వంశకరుండగు"నని యాదేశించె.

శకుంతలాజన్మవృత్తాంతంబుఁ దెలుపుటలోఁ గృష్ణకవి యొక్కవయవకాశమును గ్రహించి మేనకావిశ్వామిత్రులసంభాషణాదికము నుంచెను. అట్లు పెంచుటయే కాక

మేనకకు శిశువును నర్పించుచు "నిక్కన్య చంద్రాన్వయప్రదీపకునకు నగ్రమహిషియై చక్రవర్తిలక్షణలక్షితుం డగుకుమారుం బడసి చతురుదధివేలావలయితసామ్రాజ్యసౌఖ్యం బనుభవించుచు నుభయకులంబులకుం గీర్తిపౌరుషంబులు సంపాదింపఁగలయది" యనెను. ఇట్టిభావమును రచించుట కృష్ణకవిత్రొక్కిన నూతనమార్గము.

శకుంతల విరహవేదన ననుభవించుటయు నప్పుడు ప్రియంవద నరేంద్రస్కంధావారమునకు వెళ్లి యట రాజునకు శకుంతలయున్నస్థితినిగూర్చి తెలిపి యతనిని దోడ్కొని వచ్చుటయుఁ గృష్ణకవి క్రొత్తగఁ జేర్చినభావములు.

కడపట శకుంతల పుత్త్రునితో సభ కేతెంచి దుష్యంతునకుఁ దన్ను దెల్పుకొని పుత్త్రుని తోడఁ దన్ను గ్రహింపవలసినదనినపుడు రాజంగీకరింపకుండె. అంత శకుంతల విష్ణువును బ్రార్థించుచు 'నశరణశరణ్య యాలింపుమాఁడుకుయులు' అని తనవేఁడికోలును దెలిపెను. అప్పుడు జలజాక్షుఁడు దేవతలతోఁడ సాక్షాత్కరించినట్లును శకుంతలను గ్రహింపవలసిన దని రాజునకుఁ జెప్పినట్లును గృష్ణకవి కల్పించెను. అందిట్లున్నది —

మ. ఫలదుండై తగుపార్వతీరమణుఁడుఁ భాషావధూనాథుఁడుఁ
బలభిద్వహ్నిముఖాఖిలామరవరుల్ పార్శ్వంబులం జుట్టిరా
లలదుత్తుంగపతంగరాజరథుఁడై లక్ష్మీసమేతంబుగా
జలజాక్షుండు శకుంతలావరదుఁడై సాక్షాత్కరించెఁ రహిన్.

అట్లు ప్రత్యక్షముకాగా రాజు తనయందుఁగలదోషమును దెల్పుకొని క్షమింపఁ బ్రార్థించి శకుంతలను బుత్త్రునితోడ గ్రహించినట్లు తెలుపఁబడినది.

పినవీరన యిప్పట్టున భారతమునందువలె నశరీరవాణిచేఁ దెల్పించెను. అంతియకాక రాజు తానుచేసినతప్పిదమునకై చింతించుచుండ నారదుఁడువచ్చి యతనికి గలిగినతాపమును బోఁగొట్టినట్లు రచించెను.

అంగుళీయకవిషయమునుగాని దూర్వాసమునీంద్రుని శాపవిషయమునుగాని కృష్ణకవి గ్రహింపలేదు. సభలో శకుంతల రాజునుగూర్చి పలికినపద్ధతి భారతభాగము ననుసరించినది. ఇరువ్వురిడ పినవీరన ప్రవర్తించినమార్గ మెక్కుడు శ్లాఘాపాత్రమైనది. అనసూయా ప్రియంవదలును మునికుమారులును రాజును నాక్షేపించినట్లు పినవీరన రచించెను. శకుంతల నోటినుండి మాటరానీయ లేదు.

## త్రిలిఙ్గరజతోత్సవము

శకుంతలాపరిణయకథను రచించుటలోఁ గథను నడుపుటలోఁగాని భావముఁ గ్రహించుటలోఁగాని కృష్ణకవి చాలవఱకు భారతకథాభాగమును గ్రహించి పాత్రలన జేర్పుటలోఁ గాళిదాసు నిర్మించినవానిని గొన్నిఁటిని జేర్చికొనెను. కావ్యవర్ణనలనన్నిటిని జాలవఱకు సక్రమముగఁ జేర్చెను. ఋతువర్ణన విశేషముగఁ గావింపఁబడినది.

భారతభాగవతాదులనుండి యితివృత్తముల గ్రహించి పూర్వకవులు ప్రబంధములను కావ్యవర్ణనావిశేషములతోఁ బెంచి వ్రాయుచువచ్చిరి. కొందఱు సంస్కృతకావ్యముల గ్రహించి యాంధ్రీకరించిరి. కృష్ణకవియు భారతకథను గ్రహించి యద్దానినే వర్ణనావిశేషములతోఁ జాలవఱకుఁ బ్రబంధమార్గము ననుసరించి వ్రాసినట్లు తోఁచుచున్నది. వసుమహారాజవృత్తాంతమును రామరాజభూషణుఁడు పెంచి వ్రాసినట్లే యితఁడును దనరచనావిశేషమును జూపుచు మహాకవియగు కాళిదాసునందలి గౌరవముచేఁ గొన్ని భావముల మాత్రము నతనినాటకరాజమునుండి గ్రహించెను. కావ్య మెట్లున్నను నిందలి మంచిని గ్రహింతురుగాక యని కృష్ణకవి పాఠకులను బ్రార్థించుచు నుడివినపద్యమును జూడుఁడు.

ఉ. శ్రీరమణీధవార్పితము సేయుకృతిన్ బ్రతికూలవృత్తిమై
క్రూరవచోవికారములఁ గుండగునెట్టినిమాడ్కిఁ జూచి వే
సారుచు సారె దూఱుచుఁ గుశంకలఁ బోవకుఁ డన్నలార! మీ
నేరుపు లన్యకావ్యసరణిన్ బురణింపఁగఁజేయు టొప్పగున్.

అని పీఠికయందు వ్రాయఁబడినది.

కృష్ణకవిరచనలోఁ గాళిదాసురచించిన శ్లోకములకు ననువాదములుగఁ గొన్నిపద్యములుమాత్రము దెలియుచున్నవి.

దుష్యంతుఁడు శకుంతలను జూచినపుడు తనమన మామెయెడఁ దగుల్కొనఁగా నామె మునికన్యయై యుండదని తన నిశ్చయమును దెలుపునెడ కాళిదాసురచితమైన 'అసంశయం క్షత్రపరిగ్రహక్షమా' యనుశ్లోకమునకుఁ దగినట్లు

ఉ. అంకిలిగాదు నాదుహృదయంబు తమోరహితంబు సూవె నీ
కుంకుమబొమ్మపై మరులుకొన్నవిధంబుఁ దలంచి చూచినన్
శంకిల నేటి కీవెలఁది క్షత్రపరిగ్రహపాత్రయై తగున్
మంకుఁదనంబులేని ఘనమానసవర్తనముల్ ప్రమాణముల్.

అని రచించెను. ఇట్లే 'యాస్యత్యద్య శకుంత లేతి' అనుశ్లోకమునకుఁదగినట్లు తృతీయాశ్వాసమున 102 వ పద్యము 'కనుగవ బాష్పపూరము గ్రమ్మెడు' అనియును, 'శుశ్రూషస్వ గురూన్కురు' అనుటకు, 109 వ పద్యము 'గురుశుశ్రూషలుసేయుమీ' అనుపద్యమును మిగులఁ బొందికగ రచింపఁబడినది.

కృష్ణకవిరచనలో శబ్దాలంకారము, రసగౌరవము, రసానుగుణ్యమైనభావ, భావానుగుణ్యమైనపదజాలములపొందిక యత్యంతశ్లాఘాపాత్రము. ఇందులకై యొకటి రెండుదాహరణల నొసంగి యింతటితో విరమించుచున్నాఁడ.

శబ్దాలంకారమునకు:—

సీ. సురసరిత్పరిసరస్ఫురదురస్సరపురస్సరదురుత్తరమరుత్తరువరంబు
దినదినస్తనితనిస్వనకనన్మునిమనఃపనితనూతనఘనాఘనఘనంబు
కలభలిట్కులచలచ్ఛలదలస్థలదలద్దలమిలజ్ఝలజలజ్ఝలజలంబు
ప్రవణవజ్జవనవత్పవనవన్నవనవశ్రవణవత్స్వపనవిప్లవపదంబు
తే. గజగవయగండభేరుండఖడ్గచమర, శరభశార్దూలశంబరశల్యవృకవ
రాహసింహావలీముఖప్రముఖదుష్టసత్వముఖరంబుఁ గనియెఁ దుషారనగము.

౨ ఆ. ౧౦౬ ప.

భావనావిశేషమునకు.—

మ. లలి నుర్వీతలముం బగిల్చి నభమెల్లం దానయై యిమ్ములా
గలకీలాలపుజాలు మేలుడిపి తన్గ్రాచం దలంపన్ మహా
బలు నవ్వేసవివహ్నిఁదా శరణమున్ బ్రార్థించి తన్మైత్రి ను
జ్జ్వలుఁడై నాటనుగోలె వాయుసఖుఁడన్ ప్రఖ్యాతిఁ గాంచెన్ ధరన్.

మ. అహహా లోకము లేకొలంది మనుఁ గీలాభీలవాతూలదు
స్సహమై తీండ్రిలి మండువేసవికి నీశ శ్రీశ వాగీశుల
న్వహమున్ మూర్ధమునందు శయ్యనిగమవ్యాపారపాత్రంబునన్
బహుమానింతురు వారిఁ దత్సమయతాపక్రాంతిశాంత్యర్థమై.





౨౫

# శ్రీనాథుని భీమేశ్వరపురాణము

శ్రీ కుందూరి ఈశ్వరదత్తగారు, బి. ఏ.

కొండవీటిరాజ్యమును బాలించి వాసికెక్కిన పెదకోమటి వేమభూపాలునియాస్థానమున విద్యాధికారిపదవి నధిష్ఠించి వేమమండలేశ్వరునిమంత్రిశిఖామణియైన సింగనామాత్యునకు ఆంధ్రనైషధగ్రంథము నంకితముగావించి కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతమున స్వర్ణాభిషేకము ననుభవించి, డిండిమభట్టుని నుద్భటవివాదమున జయించి, యాతని విజయడిండిమమును బగులగొట్టించి, తనయశోడిండిమము నాంధ్రమండలముల మారుమ్రోగించి, శ్రీనాథమహాకవి, కొండవీటిరాజ్యపతనానంతరము, రాజమహేంద్రపురరాజ్యమును బాలించిన రెడ్డిభూపాలుర యాస్థానమునకు వచ్చెను. దీనికి ముఖ్యకారణము అల్లాడ, వీరభద్రారెడ్లయామాత్యుడైన బెండపూడి అన్నమంత్రి శ్రీనాథునికి బంధువగుటయే. వీరిద్దఱును పాకనాటింటివారు. అందుకనేకాబోలు మునుముందు బాంధవుడైన మంత్రిరత్నమునకు తనకృతియైన భీమేశ్వరపురాణ మంకితమిచ్చి, తర్వాత రచించినకాశీఖండమును ప్రభువైన వీరభద్రారెడ్డికి కృతినిచ్చెను.

భీమేశ్వరమాహాత్మ్యము, స్కాందపురాణాంతర్గతము. దానినే శ్రీనాథుడు ఆంధ్రభాషాప్రబంధముగ జెప్పెను.

బెండపూడి అన్నమంత్రి శ్రీనాథుని బిలువనంపి, యిట్లని యానతిచ్చెనట.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున కఖిలపురాణవిద్యాగమములు
కల్పించినాఁడవు గాఢపాకంబైన హర్షనైషధకావ్య మాంధ్రభాష
భాషించినాఁడవు బహుదేశబుధులతో విద్యాపరీక్షణవేళలందు
వెదచల్లినాఁడవు విశదకీర్తిస్ఫూర్తి కర్పూరములు దిశాంగణములందుఁ

తే. బాకనాటింటివాఁడవు బాంధవుఁడవు, కమలనాభునిమనమఁడ వమలమతివి
నాకుఁ గృపసేయు మొకప్రబంధంబు నీవు, కలితగుణగణ్య శ్రీనాథ కవివరేణ్య.

తే. సప్తసంతానములు నాకు సంభవించె, నొకప్రబంధంబు వెలితిగా సుకృతగరిమ
నావెలితి మాన నాపేర నంకితముగ, శివపురాణంబు తెనుఁగుగాఁ జేయు మొకటి.

వ. అదియును.

క. బంధురసపాదలక్ష, గ్రంథంబై యొదుపదులు ఖండంబులతో
సంధిల్లును స్కాందంబన, సింధువునకుఁ గాల్వ లమరిచినచందమునన్.

మ అరవిందాప్తకృతప్రతిష్ఠుఁ డగుదక్షారామభీమేశ్వరే
శ్వరుమాహాత్మ్యముతోడఁగూడి భువనశ్లాఘాస్పదంబై యభం
గురమై స్కాందపురాణసారమగు శ్రీగోదావరీఖండముం
బరిపాటిన్ రచియింపు మంధ్రజగతీ భాషాప్రబంధంబుగన్.

కృతిపతి శివపురాణము నొకటి తెనుగుజేయమని చెప్పి, స్కాందపురాణాంతర్గతమైన భీమేశ్వరమాహాత్మ్యమునే, యేల భాషాంతరీకరించవలసినదని శాసించవలసివచ్చెనని చదువరు లడుగవచ్చును. తాత్కాలికమైనకారణ మొకటి గలదు. అన్నమంత్రి యొనర్చిన ధర్మకార్యములు శ్రీనాథుఁ డీక్రిందిపద్యములో వర్ణించెను.

సీ. రాజమహేంద్రదుర్గమునఁ గావించె శ్రీవీరభద్రునకుఁ బ్రాకారరేఖ
నిలిపె మార్కండేయనీలకంఠునిమ్రోల రామేశుఁ దమతల్లినామకముగ
సంగమేశ్వరదివ్యశంభులింగమునకుఁ గల్పించెఁ గళ్యాణగర్భగృహము
దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలివాకిట ధామమును రచించెఁ

తే. బ్రాగ్దిశావప్రగోపురప్రాంగణమున, సప్తమునిసింధుసోపానసరణికెలనఁ
దీర్చె భవనంబు భీమయదేవునగర, మంత్రిదేవయ యన్నయామాత్యవరుఁడు.

శ్రీనాథుడు సీసపద్యములో కడపటిచరణములందు వర్ణించినవిషయమునకు శాసనాధారముకూడ గలదు.[1]

అస్తిప్రశస్తమతి రల్లయవేమభూపో రాజ్యోన్నతో జగతి రాజమహేంద్రపుర్యాం
మంత్రీ హితోస్య మతినిర్జితదేవమంత్రిర్దివ్యశ్రియా జయతి దేవయ అన్నమంత్రీ.
శాకేపుష్కరబాణవిశ్వగణితే సంవత్సరే కార్తికాయాం
శనివాసరే సుకృతధీః శ్రీయన్నమంత్రీశ్వరః,
దాక్షారామజభీమలింగపురతః శ్రీసప్తగోదాతటే
ప్రాచీగోపురమండపం సమకరోద్రమ్యం శిలానిర్మితం.

1 South Indian Inscriptions Vol. IV No. 1381 దాక్షారామభీమేశ్వరాలయములోనిశాసనము. ఈ శాసనకాలము క్రీ. శ. 1428 అగుచున్నది.

> ద్వాదశసంఖ్యాస్తంభే సదా బహిర్ద్వారమండపే విహరన్
> రక్షతు భీమేశోయం శ్రీదేవయయన్నసచివమాకల్పమ్.

శ్రీనాథుడు భీమేశ్వరపురాణమును ప్రాచీనగోపురమండపనిర్మాణానంతరము రచించియుండె ననుట స్పష్టము. అనఁగా నతఁ డద్దానిని క్రీ. శ. 1428, లేక 1429-వ సంవత్సరమున రచించియుండును. అన్నమంత్రి భీమేశ్వరునియాలయమునకు గోపురమును, మండపమును నిర్మించుటచేత భీమనాయకునిమాహాత్మ్యము వర్ణించెడి భీమేశ్వరపురాణమును శ్రీనాథుని భాషాంతరీకరించమని శాసించియుండును.

ఈభీమేశ్వరస్వామి, ప్రస్తుతము తూర్పుగోదావరిజిల్లా రామచంద్రపురముతాలూకాకుచెందిన దక్షారామమునందు వెలసియుండిన మహాదేవుఁడు. ఈదక్షారామమునకు ప్రాచీనశాసనములందు డాకిరేమి యనుపేరుండెను. ఆడాకిరేమి యనుదేశీయనామమె, దక్షారామమని సంస్కృతిరూపమును దాల్చినది. ఈభీమనాయకుని, చాళుక్యనృపసోముఁడైన భీముఁడు ప్రతిష్ఠించి, యాదేవునికి తనపేరిడి, యచ్చట నొకశివాలయమును నిర్మించెను. ఇది చరిత్రప్రసిద్ధమైనవిషయము. అట్టి చరిత్రాత్మకమైన వృత్తాంతమున కొకపురాణమును బుట్టించి, డాకిరేమిని దక్షారామముగా మార్చి, దాని కొకక్షేత్రమాహాత్మ్యమును గల్పించి, యాస్థలమే దక్షసవనాగారమని సవరించి, యచ్చటనే గ్రహరాజగుభానుఁడు కైలాసమునుండి శివుని దీసుకొనివచ్చి, భీమేశ్వరుఁడనునామముతో నాసోమశేఖరుని, దక్షారామములో బ్రతిష్ఠించెనని, యొకపెద్దపురాణమును మనపూర్వులు గల్పించిరి. సృష్టికి ప్రతిసృష్టిచేయగల ప్రతిభాశాలురగుపండితుల అసమానప్రతిభయే దీనికి గారణము. ప్రథమచాళుక్యభీముని అత్తిలితామ్రశాసనమును బ్రకటించుచు, శ్రీకొమర్రాజు లక్ష్మణరావు పంతులుగారు ఇట్లు వ్రాసియున్నారు.

"చాళుక్యభీమనగరము—చాళుక్యభీముఁడు 360 యుద్ధములలో విజయుండై తన పేరిట చాళుక్యభీమేశ్వరదేవునిఁ బ్రతిష్ఠించి దేవాలయముల నిర్మించెనని పిఠాపురమునందలి మల్లపదేవుని శిలాశాసనమువలనఁ దెలియుచున్నది. ఆగ్రామమునకు భీమవరమను పేరు వచ్చెను. అయ్యది చామర్లకోట సమీపముననున్నది. ఈగ్రామమునకుఁ బూర్వము చాళుక్యభీమనగరి లేక చాళుక్యభీమపట్టణమని పేరుండెనని యిచ్చటిశాసనములవలనఁ దెలియుచున్నది. ఈరాజే దాక్షారామమున భీమేశ్వరునిదేవాలయము నిర్మించెను.[1]

1 ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్రశాసనము ఆంధ్రసాహిత్యపరిషత్పత్త్రిక సంపుటము 11. సంచిక. 6.

శ్రీలక్ష్మణరావుగారుదాహరించిన మల్లపదేవుని పిఠాపురశాసనములో పైవిషయమైన చాళుక్యభీమేశ్వరదేవుని ప్రతిష్ఠనుగూర్చిన శ్లోక మీదిగువ నుదాహరించుచున్నాను.[1]

"తద్భ్రాతుర్విక్రమాదిత్యస్య తనయశ్చాళుక్యభీమః
షష్ట్యుత్తరం యస్త్రిశతం రణానాం జిత్వా స్వనామ్నా ప్రథితం విధాయ
చాళుక్య భీమేశ్వరదేవహర్మ్యం త్రిశత్సమాభూతలమన్వరక్షన్."

ఈవిషయమే చాళుక్యవిశ్వేశ్వరభూపతి ధర్మలింగేశ్వరాలయశాసనములో సహితము పేర్కొనబడినది. [2]

"ఆసీదిన్దుకులాగ్రణీర్జనపతిః చాళుక్యభీమేశ్వర
స్తస్యక్షాత్రపవిత్రశైవపదవీవృత్తం విచిత్రం భువి
తేనా వార్పితవైభవాత్ ఖలు సదా చాళుక్యభీమేశ ఇ
త్యాఖ్యా మాపద పూర్వికామిహ కుమారారామభీమేశ్వరః"

విన్నకోటపెద్దన్న విశ్వేశ్వరభూపతి కంకితమిచ్చిన కావ్యాలంకారచూడామణిలో నీవిషయమే చెప్పెను.

సీ. శ్రీకంఠచూడాగ్ర శృంగారకరణ మేరాజున కన్వయారంభగురుఁడు
చాళుక్యవంశభూషణుఁడు శ్రీవిష్ణువర్ధనుఁ డేమహీశుతాతలకుఁ దాత
భృతకుమారారామభీముండు చాళుక్యభీముఁ డేన్నపకులాబ్ధికి విధుండు
రాజమహేంద్రవరస్థాతరాజనరేంద్రుఁ డెక్కువతాత యేవిభునకు

గీ. నంధ్రదళదానవోపేంద్రుఁ డగునుపేంద్ర
ధరణివల్లభుఁ డేరాజు తండ్రి తాత
ఘనుఁ డుపేంద్రాఖ్యుఁ డెవ్వనికన్నతండ్రి
అతఁడు విశ్వేశ్వరుఁడు లక్కమాంబసుతుఁడు.

కావ్యాలంకారచూడామణి ప్రథ. ప. 4.

ఈకుమారారామవర్ణనము శ్రీనాథుడు భీమేశ్వరపురాణము ద్వితీయాశ్వాసమునందలి 61, 62 పద్యములలో గలదు. అదియునుగాక శ్రీనాథుఁడే భీమేశ్వరపురాణములో మఱియొకచోట చాళుక్యభీమేశ్వరుని దక్షారామభీమనాయకునకు సరిసామంతుడుగా వర్ణించియుండెను.

---

1 Epigraphia Indica Vol. IV. P. 226

2 Epigraphia Indica Vol. 19. P. 164

మ. సరిసామంతుఁడు శ్రీకుమారవనికాచాళుక్యభీమేశ్వరే
శ్వరదేవుం డుపకంఠబాంధవుఁడు శ్రీసంవేద్యరాడ్భైరవుం
డిరువుం బొర్వును బల్వలేశుఁడు మృకండేశుండుగా నేల ని
ద్ధరణీమండలి భీమనాథుఁడు నిరాతంకప్రతాపోద్ధతిన్. భీమేశ్వర. పంచ. ప. 90.

ఈచాళుక్యభీమవరమునందలి భీమేశ్వరాలయములోనిశాసనములు దక్షిణహిందూస్థానశాసనసంపుటములలో బ్రకటింపబడినవి. [1]దక్షారామమునందలి భీమేశ్వరాలయశాసనములు పైవిధముగనే ప్రకటింపఁబడినవి. దక్షారామభీమేశ్వరాలయములోని ప్రాచీనశాసనములు పదునొకండవశతాబ్దమధ్యమునుండి గలవు. [2]ప్రథమచాళుక్యభీముఁ డాంధ్రదేశమును తొమ్మిదవశతాబ్దాంతమునను పదియవశతాబ్దప్రారంభమునందును బరిపాలించెను. కాఁబట్టి దక్షారామభీమేశ్వరాలయము పదియవశతాబ్దమునకు బూర్వము నిర్మింపబడియుండ లేదు. ఈదక్షారామభీమేశ్వరస్వామి పంటకులమండనులైన రెడ్డిమండలేశ్వరులకే గాక, చాళుక్యనృపాలుఁడును ఆంధ్రభారతకృతిపతియైన రాజనరేంద్రునకును ఇష్టదైవముగ నుండెను. ఇందుకు తార్కాణముగా నన్నయభట్టు దక్షారామభీమేశ్వరుని ఆంధ్రమహాభారతములో నీదిగువ నుదాహరించిన పద్యములలో బ్రశంసించెను.

క. శ్రీరాజరాజ వీర, శ్రీరమణీరమ్య గంధసింధురహయశౌ
ర్యారూఢదక్ష దక్షమ,ఖారిదయాలబ్ధసుస్థిరైశ్వర్యప్రదా. ఆదిపర్వము సప్త. 1

క. బిరుదాంక భీమ భీమే,శ్వరకృతనిత్యప్రసాద సౌజన్యగుణా
భరణ పరగండభైరవ,పరనృపమణిముకుటఘటితపద విబుధనుతా.
అరణ్యపర్వము ప్రథ. ప. 399

సీ. దక్షిణగంగనాఁ దనరారు గోదావరియు జగదాదియైన
భీమేశ్వరంబును బెడఁగగుచున్న శ్రీపర్వతంబును జూచి యుర్విలోన
ననఘమై శిష్టాగ్రహారభూయిష్ఠమై ధగణీసురోత్తమాధ్వరవిధాన
పుణ్యసమృద్ధమై పొలుచు వేఁగిదేశ విభవంబుఁ జూచుచు విభుఁడు దక్షి
తే. ణాంబురాశితీరంబున కరిగి దురిత,హారియైన కావేరీమహాసముద్ర

1 South Indian Inscriptions Vol. V Nos. 31-58

2 South Indian Inscriptions. Vol IV. No. 1014-1048. A.D. No 1012-1068 A. D. No. 1013-1064. A. D. No. 1011-1073 A. D. No. 1010-1065. A. D.

శ్రీనాథుని భీమేశ్వరపురాణము.

సంగమంబున భూసురేశ్వరుల కభిమతార్థదానంబుఁ జేసి కృతార్థుఁ డగుచు.
ఆదిపర్వము, అష్టమాశ్వాసము.

పైపద్య మర్జునునితీర్థయాత్రాసందర్భమున చెప్పినపద్యము. మహాభారతయోధుఁడును, పాండవమధ్యముఁడునైన అర్జునునకు క్రైస్తవాబ్దమైన పదునొకండవశతాబ్దమునందు నన్నయభట్టు తనకు నూరుసంవత్సరములక్రిందట ప్రతిష్ఠింపబడిన భీమయదేవుని జూపించిన ప్రాగల్భ్య మూహింపదగినదే.

అట్టి చరిత్రప్రసిద్ధమైన భీమేశ్వరాలయమునుగూర్చి పన్నిన పురాణగాథయే భీమేశ్వరపురాణము. ఇందలికథ రెండవయాశ్వాసమునుండి ప్రారంభము. వ్యాసుఁడీశ్వరశాపగ్రస్తుఁడై దక్షిణదేశయాత్రకు వెడలుట, మార్గమధ్యమందు పీఠికాపుర, కుమారారామ, సర్వపురములను జూచుటయు, అగస్త్యుని సందర్శింపగా నామహర్షికి వ్యాసుఁడు కాశిని బాసివచ్చుటకు గలకారణమును జెప్పుట, అగస్త్యుఁడు పారాశర్యునకు దక్షారామమహిమను జెప్పుట, వ్యాసుఁడు శిష్యగణములతో ఆకాశముననుండి భీమమండలమును గనుఁగొని దక్షారామమును బ్రవేశించుట, ఇంద్రాదిదేవతలు భీమేశ్వరు వర్ణించుట, అగస్త్యవ్యాసులు భీమేశ్వరాలయము ప్రవేశించి, యీశ్వరార్చనము సల్పుట, అగస్త్యుఁడు తీర్థమాహాత్మ్యము చెప్పుట, క్షీరసాగరమథనకథ, త్రిపురాసురవధ, తుల్యభాగఉత్పత్తిక్రమము, శ్రీభీమనాథేశ్వరుఁడు తనకు దానప్రతిష్ఠితుఁడగుట, సూర్యుఁడు కైలాసమున కేగి శివుని దక్షారామమునకు తోడితెచ్చుట, శివుఁడు దక్షారామము ప్రవేశించి భీమేశ్వరస్వామిలో నైక్యమగుట, భూదానమహిమ-ఈపురాణమునందు వర్ణింపంబడినవి. ఇది స్కాందపురాణాంతర్గతము. ఏకత్రింశోధ్యాయములుగల గ్రంథము. స్కాందపురాణము అనేకసంహితలతోను, ఖండములతోను మాహాత్మ్యములతోనుగూడి యష్టాదశపురాణములలో నొకటి యున్నది. ఏకాలము నెవరికి దోచినది వారు, వారివారిపాండిత్యకౌశల్య మనుసరించి, యేదియో యొకమాహాత్మ్యమో, ఖండమో, సంహితయో చేర్చి, ఈపురాణమున కొకతలయు తోకయులేకుండ చేసిరి. భీమేశ్వరపురాణమే పైయంశమున కొకనిదర్శనము. చరిత్రవిషయము నొక మాహాత్మ్యముగావించి, పురాణముతో సమ్మిళితము నేశైవాచారసంపన్నుఁడో చేసియుండవచ్చును స్కాందపురాణకాలమునుగూర్చి చర్చించుచు, విల్సన్ పండితుఁ డిట్లు వ్రాసెను.

“స్కాందపురాణము స్వతస్సిద్ధముగ నొకప్రత్యేకగ్రంథముకాదు. హిందూదేశమునందలి వివిధభాగములందు సంహితలు, ఖండములు, మాహాత్మ్యములు పురాణాంతర్గత

ములుగా భావింపబడిన విషయములన్నింటిని ఇందు జేర్చుటచేత నిది యొకశ్లోకమయమైన యుద్గ్రంథమైనది." [1]

ఎవరికి తోచినది వారు కల్పించి, పురాణమున కెక్కించి, సత్యాసత్యనిరూపణమునకు దారితెన్నుచూపలేకపోవుటచేత, నీపురాణమును అబద్ధపుపురాణము, తస్కరపురాణమని యొక ఆంగ్లేయవిద్వాంసుడు వ్రాసెను. [2] స్కాందపురాణము పదునొకండవశతాబ్దము తర్వాతనే రచింపబడియుండవచ్చునని పండితాభిప్రాయము. స్కాందపురాణరచనాకాలమును గూర్చి, తెలుగుత్రిలింగపదములనుగూర్చి చర్చించుచు రచనాకాలమునుగూర్చి వివరించియున్నాను. [3]

శ్రీనాథుని భాషాంతరీకరణమునుగూర్చి సమగ్రముగ వ్రాయుట కిది యదనుకాదు. సంక్షేపముగ మాత్రము తెల్పి యావిషయమును విరమించెదను. ఈపురాణము సంస్కృతములో ఏకత్రింశోధ్యాయములుగల గ్రంథము దానిని మనకవి సార్వభౌముఁడు ఆశ్వాసాది, ఆశ్వాసాంతపద్యములు గలుపుకొని షష్ఠాశ్వాసముల గ్రంథముగ వ్రాసియున్నాడు. ప్రథమాశ్వాసము కృత్యాదిపద్యములతో సరిపోయెను. కథ రెండవయాశ్వాసముతో ప్రారంభము.

---

1 The Vishnupurana. Page 44 Preface.

" It is uniformly agreed that the Skandapurana in a collective form has no existence ; and fragments in the shape of Samhitas, Khandas, and Mahatmyas, which are affirmed in various parts of India to be portions of Purana, present a much more formidable mass of stanzas than even the immense number of which it is said to consist."

2 " Other imposters have had recourse to Skanda, Brahmanda, and Padma puranas, a great part of which is not at present found, and for that reason they are called the Puranas of thieves and imposters though the genuineness of such parts, as in common use, has not been questioned "—Sacred isles in the West by Captain F. Wilford. Asiatic Researches, Vol VIII Page 252

3 ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక. 1939 ఆశ్వయుజ కార్తికమాససంచిక.

| సంస్కృతభీమఖండము. అధ్యాయములు. | ఆంధ్రభీమఖండము. ఆశ్వాసము, | గద్యపద్యసంఖ్య. |
|---|---|---|
| ప్రథమాధ్యాయము | 2 | 1- 50 |
| ద్వితీయాధ్యాయము<br>తృతీయాధ్యాయము | ... | 51-64 |
| చతుర్థాధ్యాయము | ... | 65- 86 |
| పంచమాధ్యాయము | ... | 87-108 |
| షష్ఠాధ్యాయము | ... | 109-146 |
| సప్తమాష్టమాధ్యాయములు | ... | 147-161 |
| నవమాధ్యాయము | 3 | 38- 57 |
| దశమాధ్యాయము | ... | 58- 95 |
| ఏకాదశాధ్యాయము | ... | 96-159 |
| ద్వాదశాధ్యాయము | ... | 160-188 |
| త్రయోదశాధ్యాయము | ... | 189-217 |
| చతుర్దశాధ్యాయము | 4 | 1- 38 |
| పంచదశాధ్యాయము | ... | 39- 57 |
| షోడశాధ్యాయము | ... | 58- 71 |
| సప్తదశాధ్యాయము | ... | 72- 95 |
| అష్టాదశాధ్యాయము | ... | 96-125 |
| ఏకోనవింశోధ్యాయము | ... | 126-151 |
| వింశోధ్యాయము | ... | 152-179 |
| ఏకవింశోధ్యాయము | ...<br>5 | 180-210<br>1- 3 |
| ద్వావింశోధ్యాయము | ... | 4- 18 |
| త్రయోవింశోధ్యాయము | ... | 19- 51 |
| చతుర్వింశోధ్యాయము | ... | 52- 92 |
| పంచవింశోధ్యాయము | ... | 93 125 |
| షడ్వింశోధ్యాయము | ... | 126-155 |
| సప్తవింశోధ్యాయము | ... | 156-168 |

| సంస్కృతభీమఖండము. అధ్యాయములు. | ఆంధ్రభీమఖండము. ఆశ్వాసము, గద్యపద్యసంఖ్య. | |
|---|---|---|
| అష్టవింశోధ్యాయము | ... | 169-201 |
| ఏకోనత్రింశోధ్యాయము | 6 | 1- 42 |
| త్రింశోధ్యాయము | ... | 43- 56 |
| ఏకత్రింశోధ్యాయము | ... | 57- 76 |

భాషాంతరీకరణము మూలమునకన్న మనోహరముగా నున్నది. దీనికి శ్రీనాథుని ప్రతిభయే కారణము. కొన్ని ఉదాహరణ లిచ్చెదను.

కుమారారామవర్ణనలో మూలములో నిట్లున్నది.

"ఏలాశక్తిం మహాదేవీ మేలాతీరనివాసినీం
ప్రసన్నాం రూపసంపన్నాం తుష్టావ మునిపుంగవః
విలోకయామాస తతః కుమారారామముత్తమం
వింధ్యోపకంఠ జగతీలలామం లోచనోత్సవం
బహుక్రీడావనశ్యామమభిరామం సరోవరైః
ప్రాకారభాసురం భూరి దేవాగారవిరాజితం
గణేశవీరభద్రాదిదేవతాశ్రేణిశోభితం
ధామాగ్రభీమజాంటేందుచంద్రికాధౌతసౌధకం
తదాకుమారతటినీస్వర్ణాబ్జమోదతుందిలాః
నారికేళవనీసూనకుహాళీపరిరంభణః
అప్సరోహేమహర్మ్యేందుశిలాజాలకచారిణః
భీమేశవక్షోభోగీంద్రహారహారప్రణయినః
నాజనాయనాగారతార్క్ష్యకేత్వానిలాస్యగాః.

భాషాంతరీకరణములో కుమారారామవర్ణనము మూలము నతిక్రమించి సహృదయ హృదయాహ్లాదకారిగా నున్నది.

శా. ఆలోకించె మహామునీంద్రుఁడు గుమారారామముం బింధ్యకు
టీకాలోపాంతధరాలలామము బహుక్రీడావనశ్యామముం
బ్రాలేయాచలకన్యకాధవజటాభారాసనార్ధేందురే
ఖాలానాయితహేమకూటకలధౌతాట్టాలకగ్రామమున్.

సీ. కోమటేటికల్యాణకమలషండంబులసౌరభ్యభారంబు సంతరించి
నారికేళాటవీనవపుష్పకుహాళి కావితతికన్నెఱకంబు వీడుకొలిపి
యప్సరఃకాంతావిహారవాటకహర్మ్య శశికాంతమణి గవాక్షములఁ దాటి
భీమనాయక దేవు పేరురంబునఁ గ్రాలుభుజగహారములకు భుక్తిపెట్టి

తే. రాజ నారాయణస్వామి రమ్యభవన, తార్క్ష్యకేతనపతికి వర్తనము గఱపి
పోలసె నధ్వరపరిశ్రాంతి పోడవడంగ, మానివరుపైఁ గుమారవనానిలములు.

మూలములో లేతయరటియాకు వర్ణన యిట్లున్నది.

సుదీర్ఘాణి విశాలాని సాగ్రాణి మృదులాని చ
అచ్ఛిద్రాణి నవీనాని రంభాపర్ణాని తా దదుః.
శ్రీనాథుఁ డీక్రిందిరీతిని ఆంధ్రీకరించెను.

క. మొగి విరిసి కఱకుగూడక, పగులక వెడలుపును నిడుపు బడిమియుఁ గలలేఁ
జిగురరఁటాకులు పెట్టిరి, దిగదిగ నద్దేవియాజ్ఞ దివ్యపురంధ్రుల్.

మాతృకలో అన్నపూర్ణవర్ణన మీవిధమున నున్నది.

కల్పద్రుకామధుగ్ధేనుచింతామణిసమంచితా
శింజన్మాణిక్యమంజీరమంజులాంఘ్రిసరోరుహా
పీనోత్తుంగకుచద్వంద్వభారకంపితమధ్యమా
బాలేందుసమఫాలాగ్రచారుస్వేదాంబుమౌక్తికా
గలత్కైశికమందారలోలచీనాంశుకాంచలా
కృపానూనసుధాధారాసారసారనిరీక్షణా
నీలాలకాన్నపూర్ణాంబా నిరాఘాటం చరత్తథా
అమృతాన్నం ప్రయచ్ఛంతీ స్వయం సర్వాసు పంక్తిషు
ఏవం మహాద్భుతస్తస్మింత్సమయే భోజనోత్సవః.

పుత్రికలో శ్రీనాథుఁడు పైవర్ణనము నాల్గుపాదములలో నిమిడ్చి మూలములోని 'పీనోత్తుంగకుచద్వంద్వా'ది రెండుపాదములు వదలి అన్నపూర్ణకు అమృతాన్నముపెట్టుట యందలి పరవశత్వమును వర్ణించి ఆయమను శృంగారచేష్టలనుండి తప్పించి ఔచిత్యము సంపాదించినాడు.

ఉ. వేలుపుగిడ్డియుం బరుసవేదియుఁ గల్పకుజంబుఁ దోడరా
లాలితపాదనూపురఝుళంఝుళనాదము యుల్లసిల్లఁ బైఁ
జేలచెఱంగు దూలఁగ విశృంఖలవృత్తిఁ జరించుచుండె నీ
లాలక యన్నపూర్ణ యమృతాన్నముఁ బెట్టుచు నన్నిపంక్తులన్.

మూలములో నొక్క వాక్య మున్నవిషయము శ్రీనాథుఁడు పెంచి పెద్దచేసి, పుత్త్రికలో నిరువది ముప్పదివాక్యములుగా వ్రాసినస్థలములు గలవు. దాక్షారామవర్ణనము మూలములో నొకచోట "నానాసస్యచయానూనఫలసంపత్సముజ్వలం" అన్నదానికి బదులుగా తృతీయాశ్వాసము ఏబదియేడవగద్యలో నానాసస్యము లేదో వర్ణించెను. ఆగద్యలో "జఱకు ముఱకంబును......వేలావనోపకంఠకంఠాలంకారహారధామంబైన" వఱకునుగల నానాసస్యవర్ణనము శ్రీనాథునికల్పితమె. మూలములో నున్న దక్షారామవర్ణనమునందలి

వేదశాస్త్రపురాణాదివిద్యాసంపద్ద్విజోత్తమం
ఔదార్యశౌర్యగాంభీర్యవిరాజద్రాజమండలం
ధనాధీశ్వరసాదృశ్యవైశ్యబృందసహస్రకం
ఆక్రాంతద్విజశిశ్రూషాసమాసక్తజఘన్యజం
రూపలావణ్యతారుణ్యగణ్యపణ్యాంగనాగణం
గంధకర్పూరకస్తూరీసౌరభవ్యాప్తదిఙ్ముఖం
మణిస్వర్ణాదిసద్వస్తుప్రపూర్ణవిపులాపణం
జంగమాచలవిభ్రాంతిప్రదాయిమదవారణం

... ... ... ... ... ... ...

అనేకదేవతాగారసహస్రకవిరాజితం
మహేశ్వరధ్యానసక్తతపస్విప్రకరాశ్రయం
శైవవైష్ణవగాణేశసౌరశాక్తప్రకాశితం

... ... ... ... ... ... ...

శ్రీదక్షవాటీనగరం చతురుత్సవదాయకం.

భాగము పూర్తిగా వదలివేసెను.

ప్రథమాశ్వాసములోని దక్షారామవర్ణనవాక్యములు వామనభట్టబాణుని వేమభూపాలచరిత్రములోని అద్దంకిపురవర్ణనములోని వాక్యములు నొక్కటియే.

## వేమభూపాలుని చరిత్రలోనివర్ణనము

"ఫలసంపదివ భారతవర్ష శాఖినః, శాఖానగరసహస్రసంబాధపరిసరా, సర్వభువననిర్మాణమాతృకేవ విశ్వసృజః, జననీ కృతయుగస్య, నిజనృపతినిరతిశయయశః ప్రతాపప్రసరనిరోధాపరాధబందీకృతేనేవ, చక్రవాలగిరిణా మహతా ప్రాకారవలయేన పరివృతా,......సలిలసంక్రాంతకనకవరణమండలప్రతిబింబితయా కులిశపతనభయాదపరజలనిధిశంకావగాఢకనకగిరిణేవ విరాజమానేన,........పర్యంతవిసర్పిబహుల ఫేనపటలాపదేశాదగస్త్యకరచులకితమంబురాశినివా, అపహసతాపరిఖాచక్రేణ పరిగతా...క్రీడాగజమదజలసేకపంకిలప్రాంగణైః...కుట్టిమఖచితమరకతమణికిరణవిసరణజనితాకాండప్రసారిత కదలీపలాశసంశీతిభిః..."

వేమభూపాలచరిత్ర. పుట. 10.

## భీమేశ్వరపురాణములో శ్రీనాథునివర్ణనము

"భారతవర్షంబునకు ఫలసంపదయునుంబోలె శాఖానగరసహస్రసంబాధపరిసరంబై సకలజగన్నిర్మాణమాతృకయగు కృతయుగంబునకుం గారణం బనఁ గనకగిరివప్రదీప్రప్రాకారబహుప్రకార వప్రప్రకర పరివేషవలయవలయితంబై, సలితసంక్రాంతకనకావరణమండలప్రతిబింబం బగుటంజేసి కులిశపతనభయావగాహహాటకక్షితిధరం బగునపరాంబురాశియుం బోని పరిఖాచక్రంబుచేతను, క్రీడాగజమదజలపంకిలప్రాంగణంబులగు."

భీమేశ్వరపురాణము, ప్రథమాశ్వాసము. గద్య. 110.

## వేమభూపాలీయములోని వర్ణనము

"కృష్ణాగోదావరీస్రోతఃసముదాయనదీమాతృకాయమానః సమంతాదఖండితాంభః సమృద్ధిభిః విశ్వంభరా భ్రూలతానుకారిసేతులేఖైః తటతరుకుసుమాంతరక్షరదమందమకరందస్యందకందలితకల్లోలైః సలిలకేలిలోలకలహంసకామినీకోలాహలానుకృత జలదేవతాచరణమణినూపురఝణఝణత్కారైః కారండవపక్షివిక్షేపపరిచరిత పంకజపరాగపాలివిరచితాలీకసంధ్యానుబంధచకితచక్రవాకయుగైః స్తనంధైయైరివ సాగరరాజస్య అనేకైః తటాకైః ఉపశోభితః.

వేమభూపాలీయము. పు. 5.

## భీమేశ్వరపురాణములోనియనుకరణము.

"గోదావరీతుల్యభాగాకౌంతేయా కణ్వాపగానదీమాతృకాయమానంబై, యిరుగారును బంటపొసంగుపంటవలంతికేదారక్షేత్రంబులచేతను, నఖండితాంభస్సమృద్ధి విజృంభించి

విశ్వంభరా భూ(స్రి)లతా కారి వేతు రేఖాలంకారంబులై, తటతరుకుసుమాంతరక్షరదమందమక రందసందోహస్యందనకల్లోలంబులై, సలిలకేళీలోలకలహంసకామినీ కోలాహలాను కృతజలదేవతాచరణమణినూపురఝుణఝుణత్కారంబులై, కారండవపక్షి విక్షేపపరిచరితపంకజపరాగపాళీవిరచితాళీకసంధ్యాను బంధచరితచక్రవాకమిథునంబులై, పయోధిగన్న బిడ్డలుంబోని యొడ్డు చెఱువులచేతను.   భీమేశ్వరపురాణము. పు. 17

## వేమభూపాలచరిత్ర.

"సరససహకారశాఖాశిఖాధిరూఢకోకిలకుల కోలాహలకలితవిరహిణీహృదయహాలాహలక్షేపైః, మధుకరగంజాయమానమాధవీనికుంజఖంజన్మిహిర కిరణపుంజైః, ఉద్భిన్నపున్నాగకుసుమపరిమలోద్గారనిర్హారిభిః, ఉల్లసితచంపకకలికాకలాప కల్పితకందర్పపావకాస్త్రసంపద్భిః పాకపరిస్ఫుటితపుండ్రేక్షుపరుర్ముఖోద్గీర్ణముక్తామణికిరణదర్శితాకాలరాకానిశాప్రకాశైః కోరకప్రకరతారకితకురువకానోకహైః, వనితావదనాసవవాసనా, సనాథవకులవనైః మహిలాకుచకాంతిచోరలికుచఫలైః, మాతులుంగామోదహృదయంగమైః, నవనారంగసంగిభిః, భుజంగలతాపరిష్వంగధన్యతరుణపూగభద్రైః, లలిత లవలీలతాలింగితలవంగైః...... గుహ్యకనగరీవ వివిధమనుష్యధర్మచరితపవిత్రా, లంకేవ పుణ్యజనాధ్యుషిత సన్నివేశా... కార్తవీర్యతనురివ అవిరలకరభాషితా,నృసింహలీలేవ ప్రథితహిరణ్యక్షయా, శరదివ విలసత్సత్పుత్రికాశా, బ్రాహ్మణజాతిరివ నిగమశాలినీ, మహాఘోషాన్వితాపి నిరాక్రోశా, ప్రకటభుజంగ ప్రచారాప్యపోహితాహిభయా, బలిరాజనిలయ భూతాపి గంధర్వభూమిః, అద్దంకి నామధేయా నగరే...   వేమభూపాలీయము. పుట. 5, 6, 7, 15

పై వర్ణనయే భీమేశ్వరపురాణమునం దీవిధముగ నున్నది.

"సరససహకారశాఖాశిఖాధిరూఢకోకిలకుటుంబినీకంఠనాళకోమలకుహూకారకోలాహలకలితవిరహిణీహృదయహాలహలక్షేపంబులును, మధుకరనికరగుంజాయమానమాధవీనికుంజకుంజన్నిహితకిరణపుంజంబులును, సముద్భిన్నపున్నాగకుసుమపరిమళోద్గారసీహారంబులును, సముల్లసితచంపకకళికాకలాపకల్పితకందర్పపావకాస్త్రపరిత్రస్తపథికలోకంబులును, పాకపరిస్ఫుటితపుండ్రేక్షుపర్వముఖోద్గీర్ణముక్తామణి దర్శితాకారరాకానిశాకరప్రకాశంబులును, కోరకప్రకరతారతారకితకురువకానోకహంబులును, వనితావదనాసవసనాథవకుళవనంబులును, మహేరుకుచకలశకాంతిచోరఫలకలితలికుచనిచయంబులును, మాతులుంగామోదహృదయంగమంబులును, నవనాగరంగసంగసుఖితసారంగమంగళగానసరససంగీతప్రసంగంబు

లును, భుజంగలతాపరిష్వంగధన్యతరుణపూగద్రుమంబులును, లలితలవలీలతాలింగితలవంగంబులును...గుహ్యకనగరంబునుబోలె వివిధమనుష్యధర్మచరితపవిత్రంబును, లంకానగరంబునుం బోలెబుణ్యజనాధ్యుషిత సన్నివేశంబును, గార్తవీర్యార్జునమూర్తియునుంబోలె నవిరళకరభూషితంబును, నృసింహలీలాడంబరంబునుంబోలె బ్రథిత హిరణ్యకశిపుక్షయంబును, శరత్కాలంబునుబోలె విలసత్ప్రకాశంబును, బ్రాహ్మణజాతి ధర్మంబునుంబోలె నిగమశాలియునునై, మహాభూషాన్వితంబయ్యును నిరాక్రోశంబును, బ్రకటభుజంగ ప్రచారంబయ్యును సదాహితాభయంబును, బలిరాజనిలయభూతంబయ్యును గంధర్వభూమియునై...

భీమేశ్వరపురాణము. పుట. 17, 18

ఇట్లు శ్రీనాథుఁడు వామనభట్టబాణుని వేమభూపాలచరిత్రములోని అద్దంకినగర వర్ణనములోనిభాగంబుల దక్షారామనగరవర్ణనములోని కెక్కించుకొనెను. శ్రీకురుగంటి సీతారామయ్యగారు భారతి ధాతసంవత్సర వైశాఖమాససంచికలో 'వామనభట్టబాణుఁడు శ్రీనాథుఁడు' అనుశీర్షికతో వ్రాసినవ్యాసములో శ్రీనాథుఁడు వామనభట్టబాణుని యనుకరించినవిషయము తెలిపిరి. పౌర్వాపర్యములు పరిశీలించినచో వేమభూపాలచరితమే పూర్వవిరచితగ్రంథము. వామనభట్టబాణుడును, శ్రీనాథుడును సమకాలికులై, పెదకోమటి వేమభూపాలునియాస్థాన మలంకరించి, బహుగ్రంథనిర్మాతలైన విషయము చరిత్రప్రసిద్ధము. కొండవీటి సామ్రాజ్యావసానమున శ్రీనాథుఁడు రాజమహేంద్రమేలిన రెడ్డిభూపాలుర నాశ్రయించి, భీమేశ్వరపురాణము రచించియుండుటచేత, అంతకు బూర్వము తనసమకాలికుఁడైన వామనభట్టబాణుఁడు రచించిన వేమభూపాల చరిత్రములోని వాక్యముల ననుకరించెననుటకు సందేహములేదు ఇది గ్రంథచౌర్యమనిచెప్ప సాహసించుటకు వీలులేదు శ్రీనాథునివిద్యాధికారిపదవియు, వామనభట్టబాణునితో నాస్థానమున సాహచర్యసంపర్కమును, బహుగ్రంథపఠనలబ్ధసాహిత్యసౌష్ఠవమును గారణములుగా, శ్రీనాథునికే సమాస పరిగ్రహణము సంభవించియుండును.

## దక్షారామవేశ్యలవర్ణనము-రెడ్లనాటిరసికత.

భీమేశ్వరపురాణమునందు దక్షారామవేశ్యల వర్ణనము, వామనభట్టబాణుడు అద్దంకిపురవారవిలాసినీవర్ణనము ననుసరించియున్నది. చూడుడు.

"లలాటశశికలావిలాసప్రతిపదా, భ్రూలతాలాసికాలాస్యలలితరంగభువా, నయనశఫరానుబంధనవకందర్ప పతాకయా, అధరబంధూకవికాసవిభ్రమశరదా, కంఠకంబుకమనీయ

బిబ్బోకసరితా, స్తనచక్రవాకయుగానుషంగశృంగారదీర్ఘికయా,...కరపల్లవస్ఫురణపర్యాయ వీరుధా, పన్నగపరిషదేత ప్రకటితవిలాసయా, మన్మథలీలయేవ రతిసుఖసంపాదనచతురయా, కుముదిన్యేవ రాజానుకూలదర్శనయా, కేశభరే కృష్ణయా వదనే మనోరమయా, వచసి మంజుఘోషయా, మధ్యదేశే మండోదర్యా, ఊరుయుగళే రంభయా, భూషాసు రుక్మిణ్యా, సురతకలాసు సుదక్షిణయా, వపుషి సుభద్రయా, వారవిలాసినీసంహత్యా సమలంకృతా. అద్దంకినగరవర్ణన. వేమభూపాలచరిత్రము, పుటలు 13, 14.

పైవర్ణనయే, శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణము షష్ఠాశ్వాసములో నిట్లు సంగ్రహించెను.

'వ. మఱియు మహనీయదేవగంధర్వాప్సరోవేశ్యాజాతి సంజాతకాంతాచికురతిమిరాంగసుమంగళ విభావరీలలాటశశికళావిలాసద్వితీయభ్రూలతా లాసికాలాస్యలలితరంగభూమియు, నయనశంబరానుబంధనవకందర్పపతాకయు, నధరబంధూకకుసుమయు, వికాస విభ్రమశరద్వేళాకంబుకమనీయకంఠయు, బిబ్బోకసరిదంబుధరవేణియుఁ, బృథులతా చక్రవాకయుఁ, గరపల్లవస్ఫురణపర్యాయవల్లీమతల్లీపన్నగపరిషత్తునుంబోలెఁ బ్రకటితవిలాస మన్మథలీలయుంబోలె, రతిసుఖసంపత్సంపాదన లంపటకుముదినియుంబోలె, రాజానుకూల దర్శనకేశభరంబునఁ గృష్ణవదన, వచోమనోహరవశంబున మంజుఘోష, మధ్యంబున మండోదరి, యూరుయుగళంబున రంభ, కనకభూషణధారణంబున రుక్మిణి, సురతకళాకౌశలంబున దక్షిణ, తనువున భద్ర, పుష్పాస్త్రద్వితీయజన్మభూమి........

ఈదక్షారామవారవిలాసినీప్రశంస శ్రీనాథుఁడు పెక్కుచోట్ల వ్రాసియున్నాఁడు. మాతృకలోలేని యీవర్ణనము, ఆకాలమునాటి రెడ్డిభూపాలురయొక్కయు, వారిసచివ సామంతసత్కవి శ్రేణియొక్కయు రసికత్వమును జాటుటకై, శ్రీనాథుఁడు భీమేశ్వరపురాణములోఁ జేర్చియుండును. ఈవర్ణనమంతయు శ్రీనాథుని భట్టబాణుని యనుకరణమేకాని సొంతమేమియు గాదు.

ప్రథమమున మనకవిసార్వభౌముడు, భీమేశ్వరదేవునికే రసికత్వమునంటగట్టి, తర్వాత నీధర్మమును తనకృతిపతులకును, తనకునుగూడ గలదని నిరూపించెను. భీమేశ్వరస్వామి "దక్షవాటికాకటకవిలాసినీవిటశిఖామణి' యై నడురేయి భోగినీసంభోగార్థము తనకూర్మి శిష్యుల కయిదండపట్టుకొని, సానివాడకు పోవుచుండెనట.

మ. ఎనయంగల్గిన కూర్మిభృంగిరిటిఁగానీ తండుఁగానీ నికుం
భునిఁగానీ కయిదండపట్టుకొని సంభోగేచ్ఛ నంతఃపురాం

గనలం గన్నుమొఱంగి యప్పురమునం గన్నేఱుకాఁదారిత్రా
ద్దున భీమేశుఁడు సానివాడకరుగుజ్ ధూర్తప్రకారంబునన్.

కృతిపతియైన అన్నమంత్రిని, భీమేశ్వరపురాణ తృతీయాశ్వాసాంతమున నిట్లు వర్ణించెను.

క. దక్షారామవధూటీ, వక్షోరుహమృగమదాదివాంఛితవిలస
ద్వక్షఃకవాటబాంధవ, రక్షావిధివజ్రపంజరకృపాజలధీ.

ఈ అన్నమంత్రినే కృత్యాదిని ని ట్లభివర్ణించెను.

శా. కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
లంచం బిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూఁడన్ననిన్
బంచాస్త్రోపముఁ దారతార కవయన్ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్వేలపురిన్ బ్రాఘేందుబింబాననల్.

కాశీఖండకృతిపతియైన వీరభద్రారెడ్డికి దాక్షారామధనకామినీసంపర్కము గలదు.

శా. పారావారపరీతవిశ్వవసుధాభారోత్థతీవ్రక్రియా
ధౌరంధర్య! సరోరుహేక్షణ! సమిద్గాండీవికోదండ! దా
క్షారామప్రమదాకరోరకుచకుంభాభోగసంక్షప్తక
స్తూరీస్థాపకముద్రితస్థగితవక్షోవీధికాభ్యంతరా? కాశీఖండము ప్రథ. ప. 141

క. పంచారామవధూటీ, పాంచాల! కళింగరాజపరమేశ్వర! య
భ్యంచిత దయాధురంధర!, చెంచూమల చూరకార! చిరపుణ్యనిధీ!.

కాశీఖండము. తృతీ. ప. 248

శా. ధారాపట్టణసార్వభౌమ సురథాణ్ణార్పాపహారక్రియా
ధౌరంధర్యపటిష్ఠనిష్ఠురభుజాదంభోళిసంరంభ! దా
క్షారామప్రమదాకటాక్షలహరీవ్యాపారనీరాజితా
కారశ్రీజితమత్స్యకేతన! సమిద్గాండీవబాణాసనా! కాశీఖండము. పంచ. ప. 337

మనకవిసార్వభౌమునియుదంతము చెప్పనక్కఱలేదు. వీరభద్రారెడ్డి శ్రీనాథుని యిట్లు ప్రశంసించెనట.

శా. ఈక్షోణి న్నినుఁబోలుసత్కవులు లేరీనేఁటికాలంబునన్
దక్షారామ చళుక్య భీమవరగంధర్వాప్సరోభామినీ

శ్రీ లిఙ్గరజతోత్సవము

వక్షోజద్వయగంధసారఘుసృణద్వైరాజ్యభారంబున
ధ్యక్షించుం గవిసార్వభౌమ! భవదీయప్రౌఢసాహిత్యముల్.

శ్రీనాథునికి దక్షారామసానిహూతులసంపర్కము భీమేశ్వరపురాణరచనాకాలము నుండి ప్రారంభమై కాశీఖండకృతిరచనాకాలమునాటికి నభివృద్ధిని జెందెను. కవిసార్వభౌముడు భీమఖండము వ్రాయునాటికి ప్రౌఢనిర్భరవయఃపరిపాకమున నుండెను. రసికశిఖావతంసుఁ డైన కవిలోకశిఖామణి దక్షారామవారవనితాసంభోగసుభగుఁడై, కాశీఖండ కృతిలో ప్రౌఢసాహిత్యసౌష్ఠవమును ఆంధ్రదేశమునకు ప్రదర్శించి, ఆచంద్రతారార్కము ను గీర్తనీయుఁడయ్యెను. దక్షారామవేశ్యలు నాటికిని నేటికిని రసికజనమనోరంజనులై తృతీయపురుషార్థసాధనతరణోపేతలై మాగోదావరీమండలవాసులకు విహారసౌఖ్యానందమును గావించుచున్నారు. శ్రీనాథుని దక్షారామవిలాసినీవర్ణనము తద్గ్రామనివాసినులగు పణ్యాంగనలగూర్చియేగాని, పుణ్యాంగనల నుద్దేశించి గాదని ఔచిత్యమెఱిగిన సహృదయులకు దెలిసినవిషయమే.

## అన్యకవ్యనుకరణములు

భీమేశ్వరపురాణములో చంద్రోదయవర్ణనమునందలి యీ క్రిందిపద్యము రాజశేఖరుని శ్లోకమున కనుకృతి.

తే. ఉదయరాగంబు నించించు కుజ్జగించి, నిండుచంద్రుండు కన్నులపండువయ్యె
దానరాగాంతరస్నిగ్ధదాక్షిణాత్య, రాజశుద్ధాంతదంతవజ్రములకాంతి.

మూడవపాదములోని 'దానరాగాంతర' యనుపదమున కర్థము తలబ్రద్దలు కొట్టుకొన్నను దెలియదు. అక్కడ 'థావనానంతర' యని యుండనోపు. పైభావము యీ క్రింది రాజశేఖరుని శ్లోకములోని భావమును గొంచెము మార్చి కవిసార్వభౌముఁ డాపద్యములో గూర్చి నాడు.

సద్యోమార్జితదాక్షిణాత్యతరుణీదంతావధౌతద్యుతి
చ్చంద్రః సుందరి దృశ్యతామయమితచ్చండీశచూడామణిః.

అట్లే యీ క్రిందిసూర్యాస్తమయవర్ణనము భట్టగోపాలునిశ్లోకమున కనుకరణము.

శా. ఆకాశాంచలవీథులన్నిగిడె సంధ్యారాగరేఖావళుల్
పాకోన్ముద్రితపారిభద్రకళికాపాండిత్యవైతండికో

తైనకస్ఫూర్జితచండతాండవరయోద్రేకారభట్యుద్భట
శ్రీకంఠస్థిరదీర్ఘపాటలజటాశ్రేణిశ్ విడంబించుచున్.
భద్రం పక్ష్మలయంతువో నరహరే రత్యుద్రశౌర్యానఖాః
స్తోకోన్ముద్రితపారిభద్రకళికాపాండిత్యపాటచ్చరాః.

శ్రీభీమేశ్వరపురాణకావ్యమునుగూర్చి యెంతేనియు వ్రాయవచ్చును. ప్రత్యేకముగా శ్రీనాథకవిత్వతత్త్వమునుగూర్చి గ్రంథమును వ్రాయుచున్నాడగాన వివరముగా నందు తెల్పెదను. ఈకావ్యభాషాంతరీకరణవిధానము పాఠభేదములు మొదలగు విషయములు వ్రాయుచున్నాడను. పాఠభేదములుగూర్చి యొకచిన్నవిషయమును దెల్పి యీ వ్యాసమును ముగించుచున్నాడను. భీమఖండములో ద్వితీయాశ్వాసమునందలి యీక్రింది పద్యద్వితీయచరణమును గమనింపుడు.

శా. శ్రీవిశ్వేశ్వరదేవదేవునికృపాశ్రీచే దివోదాసుబా
హావిశ్రాంతబలంబుచేత ధవళన్యాయప్రజావృద్ధి నా
పైఁ విశ్రామముగల్గి సుస్థిరతరంబై యుండి భాసిల్లఁగా,
నీవారాణసిలోన భిక్ష కఱవయ్యెం జూడు మోకుంభజా.

మూలములోని యీక్రిందిశ్లోకములను జదువుడు:—

శ్రీవిశ్వేశ్వరదేవస్య కారుణ్యవిషయే సదా
దివోదాసమహారాజదోర్దండబలరక్షితే
ధనధాన్యాయురారోగ్యప్రభాపశ్వాదితుందిలే
... ... ... ...
నిత్యోత్సవైస్థిరతరే శ్రీకరే కాశికాపురే
భిక్షా నాలభ్యతేదం కిం నాద్భుతం కలశోద్భవా.

పద్యములోని రెండవపాదములో "ధవళన్యాయప్రజావృద్ధి" యనుటలో నర్థము లేదు. అచ్చట "ధనధాన్యాయప్రజావృద్ధి" యని యుండనోపు. చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారములో నొకప్రతియందు 'ధరణ న్యాయప్రజావృద్ధి' యనియు, మఱియొకప్రతిలో 'ధవళన్యాయప్రజావృద్ధి' యనియు గలదు. రెండు పాఠములును దప్పే. ఇట్టి తప్పుపాఠములు భీమేశ్వరపురాణములో బ్రతిపుటయందును గలవు.



# కవిసార్వభౌముఁడు—కనకాభిషేకము.

డాక్టరు: యన్. వేంకటరమణయ్యగారు, ఎం. ఏ., మదరాసు యూనివర్సిటీ.

సర్వజ్ఞసింగభూపాలసందర్శనలాలసుఁడై తత్సభాంతరాళంబుఁ జొర నుద్యోగించుచు కవిసార్వభౌముఁడు శారదాంబ నీక్రిందిరీతిని స్తోత్రముజేసెనని వెలుగోటివారివంశావళి యందుఁ జెప్పఁబడియున్నది.

సీ దీనారటంకాలఁ దీర్థమాడించితి దక్షిణాధీశుముత్యాలశాలఁ
బగులఁగొట్టించి తుద్భటవివాదప్రౌఢి గౌడడిండిమభట్టుకంచుఢక్క
చంద్రభూషక్రియాశక్తి రాయలకడ బాదుకొల్పితి సార్వభౌమబిరుదు
పలుకుతోడై తాంధ్రభాషామహాకావ్యనైషధగ్రంథసందర్భమునను
గీ. ఎటుల మెప్పించెదో నన్ను నింకమీఁద, రావుసింగమహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు, సకలసద్గుణనికురంబశారదాంబ

ఈపద్యము శ్రీనాథునిజీవితచరిత్రయందలి ముఖ్యఘట్టములను గొన్నిటిని సూచించుచున్నది. అవియెవ్వియన, ౧. దక్షిణాధీశునిముత్యాలశాలయందు కనకాభిషేకము ౨. గౌడడిండిమభట్టుతోడివివాదము. ౩. చంద్రభూషణక్రియాశక్తియొక్కయు, రాయలయొక్కయు సముఖమున సార్వభౌమబిరుదస్థాపన ౪. నైషధరచన. ౫ సర్వజ్ఞసింగభూపతిదర్శనము. ఇందుఁబేర్కొనఁబడిన దక్షిణాధీశుఁడు లెవ్వరో, వారికి శ్రీనాథకవిసార్వభౌమునితోడి సంపర్కమెట్లు కలిగెనో విచారించవలసినయవసరము కొంతకలదు.

౧. దక్షిణాధీశుఁడు—తనయొక్కకనకాభిషేకమునుగూర్చి యితరత్ర శ్రీనాథుఁ డిట్లు ప్రశంసించుకొనియున్నాఁడు. కాశీఖండమున, 'కర్ణాటక్షితిపాలమౌక్తికసభాగారాంతరాకల్పిత। స్వర్ణస్నానజగత్ప్రసిద్ధకవిరాట్సంస్తుత్యచారిత్ర!' యని దక్షిణాధీశుఁడు కర్ణాటక్షితిపాలుఁడని నిరూపించినాఁడు. మఱియు, 'జననాథోత్తమదేవరాయనృపతీ,' 'లక్షణోపేంద్ర ప్రౌఢరాయక్షితీంద్ర' యనుచాటువులయం దాకర్ణాటక్షితిపాలుఁడే ప్రౌఢదేవరాయలని పేర్కొనియున్నాఁడు. కాని ఈప్రౌఢదేవరాయ లేప్రౌఢదేవరాయలో తెల్పలేదు. తెల్పకున్ననేమి? ఆధునికవాఙ్మయచరిత్రకారు లాతఁడు క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకు విజయనగరమును పరిపాలించిన ఇమ్మడిప్రౌఢదేవరాయలని నిశ్చయించిరి. ఈసిద్ధాంత

మంగీకార్యముకాదు. విజయనగరమును పాలించినరాజులలో ప్రౌఢదేవరాయలనుపేరు నలుగురికి గలదు.

1. క్రీ. శ. ౧౪౦౬ మొదలు ౧౪౨౨ వఱకు ప్రభుత్వముసల్పిన మొదటిదేవరాయలు. కొన్ని శాసనము లితనిఁ బ్రౌఢదేవరాయలనియుఁ బేర్కొనుచున్నవి

2. క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకు రాజ్యముజేసిన ఇమ్మడిదేవరాయలు. ఇతనినే ఆధునికచరిత్రకారులందఱును సామాన్యముగఁ బ్రౌఢదేవరాయలని చెప్పుదురు.

3. క్రీ. శ. ౧౪౪౫ మొదలు ౧౪౬౪ వఱకు నేలిన మల్లికార్జునరాయలు. ఇతఁడు తనకు ముమ్మడిప్రౌఢదేవరాయలను నామాంతరముండినట్లు పెక్కుశాసనములఁ జెప్పుకొని యున్నాఁడు.

4. వీరుగాక ఇమ్మడివిరూపాక్షరాయలకుమారుఁడు ప్రౌఢదేవరాయ లొకఁడు గలఁడు. ఇతఁడు క్రీ. శ. ౧౪౮౫ ప్రాంతముల విజయనగరమున కొంతకాలము దొరతన మొనర్చెను.

ఇట్లు ప్రౌఢదేవరాయనామాంకితులగు రాజులు నలుగురుండిరి. వీరిలోఁ గడపటి యిద్దరు శ్రీనాథునికిఁ దరువాతివారు. కాని మొదటివారిద్దరు సమకాలికులే. వీరిరువురియందు శ్రీనాథునికిఁ గనకాభిషేక మొనర్చిన ప్రౌఢదేవరాయ లెవ్వరో నిశ్చయించిచెప్పుటకుఁ దగు నాధారములు లేవు.

౨. ఇఁక గౌడడిండిమభట్టుమూలమున శ్రీనాథునికిఁ గనకాభిషేక మొనర్చిన ప్రౌఢ రాయలను గనుగొన వీలగునో చూతము. 'డిండిమభట్టు' అనునది పేరుకాదు; అది యొక బిరుదు. ఈబిరుదుగల కవులనేకులు గలరు. వీరందఱును నొకకుటుంబమునకుఁ జెందినవారే. విద్యానగరచక్రవర్తుల యాదరమునకు పాత్రులై, వారియాస్థానమున కవీశ్వరులై కీర్తిని గడించిరి.

ఇందు ప్రథమమున డిండిమభట్టబిరుదునువహించినవాఁడు సోమవల్లీ యోగానంద ప్రహసనకర్తయగు నరుణగిరినాథునియొక్క మాతామహుఁడు. ఇతనిపిమ్మట పైబిరుదును అరుణగిరినాథుఁడు ధరించెను. అరుణగిరినాథుని యనంతరము అతనిసంతతివారు డిండిమబిరు దాంకితులైరి. సాళువాభ్యుదయరచయితయగు రెండవ రాజనాథుఁడును, వీరభద్రవిజయ కర్తయగు రెండవయరుణగిరినాథుఁడును, అచ్యుతరాయాభ్యుదయకర్త మూఁడవరాజ నాథుఁడును దాము డిండిమభట్టారకులమని చెప్పుకొనిరి. వీరియందు మొదటియిద్దరే

శ్రీనాథునికాలము వారనుదగినవారు. మొదటి డిండిమ ప్రభువు వేదాంతదేశికుల ప్రత్యర్థి యనియు, రెండవవాఁడగు మొదటియరుణగిరినాథుఁడే శ్రీనాథుని ప్రత్యర్థియనియు ప్రభాకరశాస్త్రులవారభిప్రాయపడుచున్నారు. ఈయభిప్రాయము శ్రీనాథునికిఁ గనకాభిషేక మొనర్చిన ప్రౌఢదేవరాయఁడు ఇమ్మడిప్రౌఢదేవరాయలే యనునూహపై యాధారపడి యున్నది కనకాభిషేకి మొనర్చిన ప్రౌఢదేవరాయ లెవ్వరో నిశ్చయమైనఁగాని శ్రీనాథుని ప్రత్యర్థియగు డిండిమభట్టును గనుగొన సాధ్యముగాదు.

3. చంద్రభూషక్రియాశక్తియొక్కయు రాయలయొక్కయు సముఖమున సార్వభౌమబిరుదును బాదుకొల్పితి ననెను గదా శ్రీనాథుఁడు. ఈచంద్రభూషక్రియాశక్తి యెవ్వరు ? రాయలెవ్వరు ? వీరిమూలమున శ్రీనాథునికిఁ గనకాభిషేక మొనర్చిన ప్రౌఢదేవ రాయనిపోలిక నెఱుఁగ వీలగునో చూతము క్రియాశక్తులు శైవమతగురువులు. వీరు సంగమవంశీయులగు విద్యానగరచక్రవర్తులకు గురువులై యుండిరి. ఈగురుపరంపరకుఁ జెందిన వారిలో చంద్రభూషక్రియాశక్తి యొకఁడు. ఇతఁడు క్రీస్తుశకము ౧౪ వ శతాబ్దియొక్క యుత్తరార్ధమున నుండెను.

ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున మెకంజీగ్రంథపరంపరలో * చంద్రభూషణ క్రియాశక్తియొడయలకు రాయదత్తభూదానమును దెల్పు తామ్రపట్టికయొక్క ప్రతియొకటి కలదు. దానిమూలమున చంద్రభూషణాచార్యులకాలమును శ్రీనాథడిండిములవివాదకాల మును సువిదితము కాగలదు. ఆశాసనమునుగూర్చి మెకంజీపుస్తకమున నిట్లు కలదు.

'ములికినాటిసీమలోకి అడుకువఅయివుండేటి పాపఘ్నితీరమందలి కొండూరాభిధాన గ్రామముకు దేవేశపురమనే నామనిర్దేశముచేసి చంద్రభూషణాచార్యులవారికి సహిరణ్యోదకదానధారాపూర్వకంగాను సర్వాగ్రహారంగా దత్తంచేసిన శాలివాహనశకం ౧౨౯౨ అగునేటి సాధారణనామసంవత్సర శ్రావణ బ ౧౪ సోమవారం తామ్రశాసనం నాగరలిపితో వ్రాయించి వరాహముద్రతోకూడా కూర్చియిచ్చినారు.

'గనుక ఆచంద్రభూషణాచార్యులవారు తమగురువులయినట్టి క్రియాశక్తిఅయ్యవార్లకు ప్రీతిగాను కొండూరుప్రతినామమైన దేవేశపురానను యాభై రెండువృత్తులు యేర్పరచి బ్రాహ్మణులకు నిష్కరుషచేసి ఆప్రకారము వృత్తిదార్లు గ్రామంలో నివేశనాలుయేర్పరచుకొని అగ్రహారం ప్రబలంచేసుక అనుభవిస్తూవుండిరి

---

*Mac Mss. 15-3-56 pp. 44-55.

రాయదత్తంఅయిన తామ్రశాసనము హాలిస్థలములో హాజరు లేనందున అన్యస్థలమందు జాగ్రతచేసివున్నదనిన్ని చెప్పినందున అందుల నకలుగా అగ్రహారీకులయిన రాయపెద్ది కృష్ణశాస్త్రులు మొదలయినవారివద్ద కాగితముపైన లిఖించివున్న దానినకలు:—

శ్రీసాంబశివాయ నమః.

నమస్తుంగశిరశ్చుంబిచంద్రచామరచారవే,
త్రైలోక్యనగరారంభమూలస్తంభాయ శంభవే. ౧
శుండోద్దండముఖేన ఖండపరశోః పిఙ్గజ్జటామండితం
గంగాతుంగతరంగమాలివిహరచ్చంద్రాంశుజాలం జలం,
ఆసించ౯ పరివారదేవనివహానానందభద్రాంజలీ౯
హైరంబశ్శుభమాతనోతు భవతాం కౌమారకేళీపరః. ౨
ఆనందయ౯ సదాసన్నా౯ ద్విజాళీ౯ దానధారయా,
దంతావళముఖోదద్యాచ్ఛ్రియసాం వః పరంపరామ్. ౩
మథోల్లాసితహైమశైలకలశం నీలోత్పలశ్యామలం
పర్యంతాంబుధివీచిపల్లవపటం ఫేనాళిముక్తాఫలం,
దంష్ట్రాదండముఖేన యః ప్రవితతం విశ్వంభరామండలం
చిత్రచ్ఛత్రమివాదధత్స భగవా౯ దృష్టశ్చిరం పాతు వః. ౪
ధ్యానోన్మీలితఫాలలోచనమిళత్ పక్ష్మాంతరాళోల్లస
జ్జోతిర్జాతతటిత్ప్రశంగితపటత్వంగద్భుజంగస్రజః,
ఫుల్లద్ధల్లకమల్లికాగుణసుహృద్గంగాతరంగావళీ
ఖేలచ్చంద్రకళా చిరం దదతు వః శ్రేయో జటా ధూర్జటేః. ౫
మరీచిర్బ్రహ్మణః పూర్వం బ్రహ్మణః కస్యపోఽజని,
జగత్పితామహో యస్య సాక్షాదేవ పితామహః. ౬
యం నప్తారం ఋషిం దృష్ట్వా సృజంతం వివిధాః ప్రజాః,
విశ్రాన్తమానసో బ్రహ్మ బ్రహ్మజ్ఞానపరోఽభవత్. ౭
తదన్వయే సముత్పన్నా బ్రహ్మణ్యా బ్రహ్మవాదినః,
యజ్వాన స్సర్వయజుషాం దృష్టాన్తాదృష్టిపావనాః. ౮
యేషామాచార్యవర్యాణాం మందిరేషు నిరంతరం,
ఆధ్యైశ్యష్ట స్థిరతాం లక్ష్మీరదర్పం చ సరస్వతీ. ౯

సదాచారేషు సార్వజ్ఞ్యం దానేషు ధనసంపదః,
అదృశ్యంత పరం యేషాం దిగంతేషు చ కీర్తయః. ౧౦
రేఖామత్స్యాంకచరణాః పంకజాంకితపాణయః,
యద్వంశ్యాః శశివో? ద్వైవ సగౌరవమధిష్ఠితాః ౧౧
తేషాం మహోన్నతేవంశే సంజాతో రాజభూషణః,
సువృత్తో రుచిరః కశ్చిన్ముక్తామణిరివ ద్విజః. ౧౨
సర్వజ్ఞతామనితరాస్పదమీశ్వరత్వం లోకోత్తరం సుచరితం జితమన్మథత్వం,
ఆశుప్రసాదమపి సత్ఫలదం విలోక్యయం చంద్రభూషణమితి ప్రవదన్తిలోకాః.
దృష్ట్యా శ్రుత్యంతగామిన్యా స్ఫురన్నిర్మలతారయా
దైన్యపాశాభివిస్రంసం విధత్తే యశ్చిదాత్మకః. ౧౪
యద్వైరిగంధగజసంఘదురాసదాయాం సామంతమౌళిపదనర్తితవేత్రయష్ట్యాం
ద్వీపాంతరోపనతభూరితమోపదాయాం దౌవారికీవ ఖలు రాజతి రాజలక్ష్మీః.
ప్రదీయమానాని మహాంతి యేన దానాని సంఖ్యాతుమనావిధాతా,
యాన్యంతరిక్షే కతిని పృషంతి? విన్యస్తవాన్ పశ్యత తారకాస్తాః. ౧౬
విశ్వం విస్మయతే యస్య గుణగ్రామే ప్రతిక్షణం,
స సర్వజ్ఞక్రియాశక్తి రాత్మా యస్య తపోమయః. ౧౭
సకృద్దేవర్షిభిస్సాకమకరోద్భాణినః పిత్ర్యాన్.
.................................................. ౧౮
పుత్రేష్వనేకేష్వపి పుత్రకీర్తిం పూతేన పుత్రేణ స తేన ధత్తే,
ఖనిప్రదేశాగ్రతః కౌస్తుభేన రత్నాకరాఖ్యాం గమితః పయోధిః. ౧౯
ప్రత్యక్షమాలంబనమాగమానాం విశ్వోపకారైకనిధానమూర్తిం,
బ్రహ్మేవ శంభుం యమవాప్య సోఽయం కృతార్థమాత్మానమమంస్త ధీరః. ౨౦
తతో విచారవిరసాన్ విషయానప్యమానుషాన్,
విధూయ సగుణప్రాజ్యే తపోరాజ్యే స రాజతి. ౨౧
యత్రశ్రీః పరిచారికా మదగజాః ప్రాన్తేచరంతోమృగాః
ప్రాసాదోప్యలజం? మనోరథఫలైరాతిథ్యసంభావనా,
తత్సంపుష్యతి చంద్రభూషణమునిర్బ్రహ్మైకతానం తపో
వైరాగ్యం హి జగచ్ఛరణ్యవిహితం సౌభాగ్యమాలంబతే. ౨౨

స్వస్తి సమస్తవస్తువిస్తీర్ణవసుమతీవలయవిరాజమానదక్షిణవారాణసీ స్వయంభూత్రియంబక శ్రీపాదపద్మారాధక సకలశిష్యభవపాశవిభేదకో నిఖిలశైవాగమజ్ఞానశోధక శ్చతుర్విధముక్తిసాధకో౽ష్టవిధభక్తివేదకో వస్తుకవివిస్తీర్ణ కవికర్ణాభరణః సంస్కృతకవికాళిదాసః ప్రాకృతకవిప్రవరసేనః షడ్భాషాకవిచక్రవర్తీవాదీంద్రో వాదిప్రశమకమహాభైరవః కర్ణాటకకవికటకలుంటాకో వర్తమానకవిపితామహః బల్లాణరాయమస్తకశూలో యాదవరాయప్రతిష్ఠాచార్య ఆచార్యవర్యసతతసంపాదిత విద్వజ్జనకార్యభంగరాహుత్తరాయః శ్రీ క్రియాశక్తి శిష్యప్రతిశిష్యః కాశ్యపగోత్రపవిత్రీకృతః-డాగావి(రి)కకులోద్భవః సకలలోక ప్రసిద్ధేత్యాది బిరుదపద్దైరుపగీయమానః తస్య శ్రీమచ్చంద్రభూషణాచార్యస్య చరణసరసిజ రజఃపరమాణుగణరమాసామ్రాజ్య సంగమక్షితిపాలక్షీరపారావారచంద్రమాః రాజాధిరాజో మహారాజపరమేశ్వర శ్రీమన్మహామండలేశ్వర శ్రీవీరబుక్కభూపాలః సరత్నాకర మేఖలాం ప్రతిపాలయత్యుర్వీమంతఃపురవధూమివ. స కదాచిత్ దిగంతసామంతసీమంతినీసీమంతవిశ్రాంతసాంద్రసింధూరసౌందర్యసంధాయినీభిర్నిజతురగవరముఖరఖురముఖదళితధరాతలరజోరాజిభిఃరాజభిః తేజోభిరుత్తరపణం ప్రతిసేవాసమయరత్నోపదప్రదానయుత సమర్పై ర్లక్ష్మీమాసంబంధబంధుభిః సింధుభిః కృతసంధిః ప్రచండదండయాత్రాతో౽భినివృత్య శిఖామణి మరీచి మంజరీ సమర్చితచరణాయ చంద్రభూషణాచార్యాయ రిపుబలారణ్యసమున్మూలననిజభుజశ్రమం విజయమహోత్సవం కరాంజలిచులికితేన పరరాజమకుటముద్రాక్షతానికరకాంతిసలిలేనసమర్పితవాన్॥ కించ। చంద్రభూషణాచార్యపదపంకజయోః తదాగ్రామం కొండూరునామానం బుక్కక్ష్మాపతిరర్పయత్। అథ నిజతపోరాజ్యే జగత్క్షేమంకరే జాగ్రతి తదాకలికాలే ఏకసప్తత్యధిక ద్విశతాధికసహస్రాబ్దపరిమితే గతే సంవత్సరే పర్యాయస్య ద్వావింశత్యావర్తే సాధారణనామసంవత్సరే వర్తమానే శ్రావణమాసే కృష్ణపక్షే చతుర్దశ్యా మిందువాసరే యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణే తస్యేదం ప్రీతయే శ్రీచంద్రభూషణాచార్యో ద్విపంచాశద్భాగపరికల్పితం నిధినిక్షేపజలపాషాణ అక్షీణ్యాగామి సిద్ధసాధ్యరూపాష్టవిధభోగజుష్టం మురికినాడుమండలమధ్యవర్తి సంప్రసాదిత చతుస్సీమానం కొండూరునామానం గ్రామం ద్విపంచాశత్ బ్రాహ్మణేభ్యః ధారాపూర్వకం ప్రాదాత్. శ్రీక్రియాశక్తిగురోః దేవేశయితి నామైవ తస్య గ్రామస్య దేవేశపురమితి నామ కృతవాన్... ... ... ... ... ... ...

* * * * *

శ్రీదేవరాయర వప్పం। శ్రీత్రియంబకహరిహరమహారాయర వప్పం। శ్రీవిరూపాక్ష।

శ్రీబుక్కదేవరాయలవారివరాహముద్ర.

ఈదానశాసనకాల మిట్లు చెప్పఁబడియున్నది.—

అథ నిజతపోరాజ్యే జగత్క్షేమంకరే జాగ్రతి తదా కలికాలే ఏకసప్తత్యధికద్విశతాధికసహస్రాబ్దపరిమితే గతే సంవత్సరే పర్యాయస్య ద్వావింశత్యావర్తే సాధారణనామసంవత్సరే వర్తమానే శ్రావణమాసే కృష్ణపక్షే చతుర్థస్యా మిందువాసరే యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణే తస్యేదం ప్రీతయే శ్రీచంద్రభూషణాచార్యః......ప్రాదాత్.

అనఁగా కలికాలమున ౧౨౭౧ సంవత్సరములు గతించినవెనుక చంద్రభూషణాచార్యులవారి తపోరాజ్యము జరుగుచుండఁగా క్రియాశక్తియతీంద్రగురునియొక్క ౨౨ ది యగు పర్వదినమునకు సరియైన సాధారణసంవత్సర శ్రావణ బ ౧౪ సోమవారమునాడు ములికినాటి మధ్యస్థితమైన కొండూరుగ్రామము నగ్రహారీకరించి యాచార్యులవారు బ్రాహ్మణుల కొసఁగిరని తెలియుచున్నది. ఇందు 'కలికాలే'యనునది ప్రమాదజనితము. 'శకకాలే' యని యుండవలయును. మఱియు శా. శ. ౧౨౭౧-వ వత్సరమునకు సరియైన ప్రభవాది వర్షము విరోధిగాని సాధారణకాదు. గణించిచూచిన సాధారణసంవత్సరమునకు సరియగు శకవర్షము ౧౨౯౨ అని తెలియవచ్చుచున్నది. కావున చంద్రభూషణాచార్యులు కొండూరు నగ్రహారీకరించి బ్రాహ్మణులకు దానముచేసినది శా. శ. ౧౨౯౨ నకు సరియైన సాధారణ సంవత్సర శ్రావణ బ ౧౪ సోమవారమునాఁడు (౧౯ ఆగష్టు ౧౩౭౦)

'కలికాలే...పరిమితేగతే పర్యాయస్య సంవత్సరే ద్వావింశత్యావర్తే సాధారణనామ సంవత్సరే వర్తమానే...యతీంద్రస్య క్రియాశక్తిగురోః పర్వణే' యనుటవల్ల సాధారణ శ్రావణ బ ౧౪ నాడు క్రియాశక్తిగురుని ౨౨ వ యబ్దికమని తెల్లమగుచున్నది. శా. శ. ౧౨౭౧ కి సరియైన విరోధిసంవత్సరమునకును, సాధారణసంవత్సరమునకునుమధ్య ౨౨ యేండ్ల యెడముండుటచేతను సాధారణసంవత్సరముతో దేవేశక్రియాశక్తికి ౨౨ పర్వములు గడచుటచేతను శాసనోక్తమైన శా. శ. ౧౨౭౧ వ సంవత్సరము పైఁజెప్పినక్రియాశక్తిగురువు యొక్క శివసాయుజ్యసంప్రాప్తకాలమని తోఁచుచున్నది. ఆసంవత్సరముననే చంద్రభూషణాచార్యులవారును తపోసామ్రాజ్యపట్టబద్ధులై యుండవలయును. ఈశాసనము 'శ్రీవిరూపాక్ష' యను నరపతిచక్రవర్తులవ్రాలతోను, వరాహలాంఛనముతోను గూడియుండుటచేత బుక్కరాయలవారు చంద్రభూషణాచార్యులవారికి దానముచేసినకాలమును దానోపలబ్ధమైన గ్రామము నగ్రహారీకరించి యాచార్యులవారు బ్రాహ్మణులకొసఁగినకాలమును నొక్కటియే యనునూహ పొడముచున్నది.

ఈశాసనముయొక్కచివర శ్రీవిరూపాక్ష యనువ్రాలతోఁడ్పాటు, 'శ్రీదేవరాయర వప్పం,' 'శ్రీత్ర్యంబకహరిహరమహారాయరవప్పం' అనురెండువాక్యములు గానవచ్చుచున్నది. 'వప్పం' (ఒప్పం) అనఁగా కన్నడమున సమ్మతియనుభావము. రాయలిచ్చిన దానశాసనమునకు వీరిసమ్మతి యేలనఁగా, దానోపలబ్ధగ్రామమును స్వాయ మనుభవింపక చంద్రభూషణాచార్యులు బ్రాహ్మణులకు మరల దానము జేసెను. ఆచార్యులవారు మతవిషయములయందు రాజగురువైనను రాజకీయదృష్టియందు సామాన్యప్రజలయం దొక్కఁడు. కావున అతఁ డొనర్చు ఐహికకార్యములయందు రాజాజ్ఞకు లొంగి రాజశాసనమునకు బద్ధుఁడై ప్రవర్తించవలసియుండెను. కావున నాతఁ డొనర్చినదాన మాకాలము కట్టుదిట్టములననుసరించి రాష్ట్రపాలకులసమ్మతి లేక చెల్లుబడినందజాలదు; కావుననే యావరాజ్యపట్టభద్రుఁడగు త్ర్యంబకహరిహరరాయలయొక్కయు, దానోద్దిష్టగ్రామమునకు సంబంధించినరాష్ట్రమునకుఁ బైయధికారియు నుదయగిరిదుర్గాధ్యక్షుఁడును నగు దేవరాయలయొక్కయు ననుమతిని బొందవలసినయావశ్యకత కల్గెను.

ఈశాసనమువల్ల చంద్రభూషణక్రియాశక్తిగురువులు శా. శ. ౧౨౭౧ కి సరియైన క్రీ. శ. ౧౩౪౯ వ సంవత్సరము ఆచార్యపీఠము నధిష్ఠించి, క్రీ. శ. ౧౩౭౧ సంవత్సరమున బుక్కరాయలచే భూదానము గొనెననియు, మఱియు నతఁడా రాయలపుత్త్రుఁడైన హరిహరరాయలకును, మనుమఁడైన దేవరాయలకును సమకాలికుఁడనియు స్థిరమగుచున్నది.

చంద్రభూషణక్రియాశక్తిగురువులకాల మిట్లు సునిశ్చయముగఁ దెలియవచ్చినది. ఇంతవఱకు మనకుపలబ్ధమైన చరిత్రాంశముల నన్నిటినిఁ బరిశీలించి చూడఁగా క్రియాశక్తిగురుపరంపరలో చంద్రభూష [చూడ, లేక శేఖర] నామాంకితుఁడైన యాచార్యుఁ డెవ్వఁడును అటుతరువాత గానరాఁడు. శ్రీనాథడిండిములవాదమునకు మధ్యవర్తియై తీర్పుచెప్పినది చంద్రభూషణక్రియాశక్తియే కావున నావివాద మీయాచార్యులవారి కాలముననే జరిగియుండవలయును. మఱియు నీవివాదమున శ్రీనాథునకుఁ గలిగిన జయమును బ్రకటించుటకై కర్ణాటాధీశ్వరుఁడగు ప్రౌఢదేవరాయ లాతనికిఁ గనకాభిషేకమొనర్చెఁగావున, నది యాదేవరాయలరాజ్యకాలమునఁ జరిగెననుట నిస్సంశయము.

ఈప్రౌఢదేవరాయ లెవ్వరు? కర్ణాటకమునేలిన నలుగురు ప్రౌఢదేవరాయలలో కడపటియిరువురును శ్రీనాథుని సమకాలికులుగాకపోవుటచే వారిచ్చటననుకూలించరు. మిగిలిన ఇద్దఱిలోను క్రీ. శ. ౧౪౨౨ మొదలు ౧౪౪౬ వఱకును విజయనగరమును బాలించిన ఇమ్మడి ప్రౌఢదేవరాయఁడు శ్రీనాథునిసమకాలికుఁడయ్యును నీసందర్భమునఁ దలపెట్టఁదగినవాఁడు

గాదు. ఏలన, క్రీ. శ. ౧౩౪౯. వ సంవత్సరమున క్రియాశక్తిగురుపీఠము నధిష్ఠించి యనంతర మిరువదిరెండేండ్లకు, క్రీ. శ. ౧౩౭౧ లో బుక్కరాయలచే భూదానమును వడసిన క్రియాశక్తి చంద్రభూషణారుచార్యులు, అటుపిమ్మట నేబదివర్షములకు రాజ్యాభిషేకమొనర్చుకొనిన ఇమ్మడి ప్రౌఢదేవరాయనిరాజ్యకాలమున సజీవుఁడై యుండెననుట నమ్మదగినమాటకాదు. కావున నిక మిగిలియుండు ప్రౌఢదేవరాయ లొక్కఁడే. అతఁడు క్రీస్తు ౧౪౦౬ లో గద్దెయెక్కెను. శ్రీనాథవిజయసూచకమగు కనకాభిషేక మాతఁడే యొనర్చియుండవలయును. ఈప్రౌఢదేవరాయలరాజ్యాభిషేక మగునప్పటికి, చంద్రభూషణాచార్యులవారి తపోరాజ్యకాలమున (౧౪౦౬—౧౩౪౯=) ౫౭ వర్షములు గడచి యుండుటచేత నాతఁ డప్పటికిఁ గడువృద్ధుఁడై యుండవలయును. కావున శ్రీనాథడిండిముల వాదము మొదటి ప్రౌఢదేవరాయలరాజ్యారంభకాలమున నడిచియుండునని తలఁచుట యొప్పును. ఈప్రౌఢరాయలు విద్యావ్యాసంగపారీణుఁడు. గీర్వాణాంధ్రకవుల కాశ్రయుఁడు. వేమభూపాలీయాదిగ్రంథములను రచియించిన వామనభట్టబాణుఁడు ఉదయగిరియం దీతనియాస్థానమున గొంతకాలముండెను. మఱియు నుత్తరహరివంశకృతికర్తయగునాచనసోమునికి ములికినాటిసీమలోని తురిమెళ్లదిన్నె యనుగ్రామమును నగ్రహారముగ నొసఁగెను. మల్లినాథసూరిఁ దనయాస్థానమున ధర్మాసనాధికారిఁ జేసెను. కావున నతఁడు శ్రీనాథుని విజయమునకు సంతసించి యాతనికిఁ గనకాభిషేక మొనర్చి గౌరవించుట సహజమే.

శ్రీనాథునికిఁ గనకాభిషేకమునొనర్చిన కర్ణాటాధీశుఁ డిమ్మడిప్రౌఢదేవరాయఁడు గాకున్న, నతనితో వాదమునఁ బరాజితుఁడైన గౌడడిండిమభట్టును, (మొదటి) యరుణగిరినాథుఁడు గాఁజాలఁడు. ఈయరుణగిరినాథుని మాతామహునికిఁ గూడ 'డిండిమభట్ట' బిరుదముగలదని వ్రాసియున్నాను మఱియు నాతఁడు కవియు మహాపండితుఁడునై వేదాంతదేశికులతో వాదముసల్పినట్లు పండితులు చెప్పుదురు. అరుణగిరినాథుఁ డిమ్మడిప్రౌఢదేవరాయులకు సమకాలీనుఁ డగుటచేత నతని మాతామహుఁడగు ప్రథమడిండిమభట్టు మొదటిప్రౌఢదేవరాయలకాలమున నుండెననుటకు సందేహింపఁబనిలేదు.

౪. నైషధరచన:—'దీనారటంకాల' యందు వర్ణింపఁబడినక్రమము ననుసరించి శ్రీనాథుఁడు డిండిమభట్టు నోడించి చంద్రభూషణాచార్యులసముఖముననను రాయలసముఖముననను సార్వభౌమబిరుదును నెలకొల్పిన పిమ్మట నైషధమును రచించినట్లున్నది. కాని నైషధరచన తత్పూర్వమే నడచియుండునని సంశయము కలుగుచున్నది. 1. నైషధమున శ్రీనాథునికి సార్వభౌమబిరుదమున్నట్లుచ్చటను జెప్పియుండలేదు. 2. దీనికి వెనుకరచించిన

హారవిలాస, కాశీఖండములలోఁ "గవితామహారాజ్య భద్రాసనారూఢు" 'కవిసార్వభౌమ' యని సార్వభౌమబిరుదప్రస్తావము గానవచ్చుచున్నది. ఈబిరుదును బొందినపిమ్మటనే 'దీనార టంకాల' లోఁజెప్పినట్లు, శ్రీనాథుఁడు నైషధమును రచించియుండిన నందెచ్చటనేనియు పైబిరుదు పేర్కొనియుండదా?

2. ఇంకొకవిషయము నిచ్చటస్మరణకుఁ దెచ్చుకొనవలసియున్నది. శ్రీనాథడిండిముల వివాదమునుఁ గనకాభిషేకమును, సార్వభౌమబిరుదస్థాపనయును విద్యానగరప్రభువగు ప్రథమప్రౌఢదేవరాయలు గద్దెయెక్కిన తరువాత యచిరకాలమునకే జరిగెనని పైని దెల్పి యున్నాను. ఇంతకుపూర్వమే రచింపఁబడిన హారవిలాసమున శ్రీనాథుఁడు నైషధమును రచించియుంటినని చెప్పియున్నాఁడు. హారవిలాసరచనాకాలమునుగురించి పండితులు భిన్నాభి ప్రాయములు దెలియఁజేసియున్నారు. కీ. శే. కొ. వెం. లక్ష్మణరావుపంతులుగారు "హార విలాసము ౧౪౦౦ వ సంవత్సర ప్రాంతమున వ్రాయబడియె" ననిరి.* "క్రీ. శ. 1430 తర్వాత హారవిలాసరచనము జరిగిన ట్లేర్పడును". అని ప్రభాకరశాస్త్రులవారు తీర్మానించిరి.* కాని హారవిలాస కృత్యాదిని పరిశీలింపగా నాగ్రంథమును శ్రీనాథుఁడు క్రీ. శ. ౧౩౯౭, ౧౪౦౩ వ సంవత్సరములమధ్య రచియించియుండవలయునని తోఁచుచున్నది. ఇట్టియభి ప్రాయముఁబడుటకుఁ గలకారణములను దెల్పుచున్నాను.

హారవిలాసకృతిపతియగు తిప్పయతండ్రియగు నవచిదేవయఁగూర్చి యందిట్లున్నది.

క. శ్రీపర్వతసోపానస్థాపితుఁ డగురెడ్డివేమ జగతీపతికిఁ
బ్రాపైన యవచి ధీమణి, యాపావాణికి జనించె నభ్యుదయముతోన్. హార. ౧. ౧౮

శ్రీశైలసోపాననిర్మాపకుఁ డగురెడ్డివేమ జగతీపతి క్రీ. శ. ౧౩౩౦ మొదలు ౧౩౫౩ వఱకును రాజ్యపాలన మొనర్చెను. అవచిదేవయయు నప్పటివాఁడే.

కృతిపతితమ్ముఁడైన తిరుమలనాథసెట్టిఁగూర్చి యిట్లు చెప్పఁబడియున్నది.

చ. హరిహరరాయ ఫేరొజసహాసురథాణగజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు; మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వఁ డీడగున్.†

ఈపద్యములోఁ దృతీయపాదమునందలి 'నిర్వహించు' అనుక్రియాపదముపైఁ దృష్టి ద్రిప్పిచూడుఁడు; అది వర్తమానకాలమును దెలియఁజేయుచున్నది. కావున కృత్యాది రచనాకాలమునందు తిరుమలనాథసెట్టి కుమారగిర్యధీశ్వరుని వసంతోత్సవవైభవమును

*వ్యాసావళి పుట ౨౮. *హారవిలాసపీఠిక. పుట ౪. †హార. ౧. ౨౪.

సర్వము నడపుచుండెనని తెల్లమగుచున్నది. కుమారగిర్యధీశ్వరుఁడు గ్రంథరచనాకాలమున సజీవుఁడై యుండెననుట స్పష్టము. కుమారగిర్యధీశ్వరుఁడు క్రీ. శ. ౧౩౮౫ మొదలు ౧౪౦౩ వఱకును కొండవీట రాజ్యముజేసెను. హరిహరరాయలు క్రీ. శ. ౧౩౭౯ మొదలు ౧౪౦౪ వఱకు విద్యానగరమునను, ఫిరోజసహ క్రీ. శ. ౧౩౯౭ మొదలు ౧౪౨౨ వఱకును గలుబరిగెయందు ప్రభుత్వము సల్పిరి. ఈముగ్గురురాజులును క్రీ. శ. ౧౩౯౮, ౧౪౦౩ వ సంవత్సరము కాలమున రాజ్యము సల్పుచుండినందున, హరవిలాసరచనాకాల మదియే యని చెప్పవలసియున్నది. క్రీ. శ. ౧౩౩౦-౫౩ ల మధ్య రాజ్యముసల్పిన వేమారెడ్డికిఁ బ్రాపై యుండిన యవచిదేవయకుమారుఁడు క్రీ. శ.౧౪౦౦ ప్రాంతములనుండుట సహజమే. ప్రభాకరశాస్త్రులవారు చెప్పినట్లతఁడు క్రీ. శ. ౧౪౩౦ సంవత్సరము వెనుకఁగూడ జీవించియుండి యప్పుడు హరవిలాసమునుఁ గృతినందెనని నేను నమ్మజాలకున్నాఁడను.

క్రీ. శ. ౧౩౯౮, ౧౪౦౩ ల మధ్య విరచితమైన హరవిలాసమున నైషధముఁ బేర్కొనఁబడియుండుటచేత నైషధరచన యంతకుపూర్వమున నడిచెననుట నిస్సందేహము. పెదకోమటి వేమారెడ్డి కొండవీటిరాజ్యమునకు వచ్చినతరువాత 'శ్రీనాథుఁడు క్రీ. 1410, 1415 ప్రాంతముల శృంగారనైషధమును రచించెనని నేను నిశ్చయించుచున్నాడను'. 'శృంగారనైషధము పెద్దకోమటి వేమారెడ్డి రాజ్యమునకు రాకముందే కొమరగిరిరెడ్డి పరిపాలనకాలమునందే రచితమయ్యెననియు నావేమారెడ్డినిగూర్చియుఁ దన్మంత్రియగు మామిడి సింగనామాత్యునిఁగూర్చియుఁ జేయఁబడినవర్ణన మతిశయోక్తి యనియు, వేమారెడ్డి కంతకుఁబూర్వమును గొంతరాజ్య ముండెననియు నొకవాదమున్నది. దాని నేను విశ్వసింపఁజాలకున్నాఁడను," అని ప్రభాకరశాస్త్రులవారు వ్రాసియున్నారు. కాని యీవాదమున నిజము లేకపోలేదు. పోలయవేమారెడ్డియన్నయు పెదకోమటి వేమారెడ్డియొక్క తాతయునగు మాచారెడ్డి ధనదపురమును తత్ప్రాంతపట్టణములను నేలుచుండెనని వామనభట్టబాణుఁడు వేమభూపాలీయమునఁ జెప్పియున్నాఁడు.

తేషాం అనుపమకీర్తిరాదిమో మహాభిమానితయా వాసమ్ణాపికాం వసుధాం ధనదపుర ప్రభృతీని శాఖానగరాణి కులగిరికూటాని...భువనభారముద్వహాత్.*

మఱియుఁ బోలయవేముని కడగొట్టుతమ్ముఁడైన మల్లారెడ్డియును నతనియనంతర మతనిసంతతివారును నెల్లూరుమండలాంతర్గతమైన కందుకూరుసీమ నేలుచుండినట్లు శాసనములమూలమున తెలియుచున్నది. ఇట్లే మాచారెడ్డిసంతతివారును నాతనివెనుక ధనదపుర ప్రాంతపురము నేలుచుండిరని తలఁచుట యొప్పును. మఱియు నైషధమందెచ్చటను నద్దంకి కొండవీడుపట్టణముల మాట లేకపోవుటచే పెద్దకోమటి వేమారెడ్డి యప్పటికింకను రెడ్డిరాజ్యమున కధిపతికాలేదని తలఁచుట యుక్తము. శృంగారనైషధమున వర్ణించినట్లు

* వేమభూపాలచరిత్రసంగ్రహః పుట. ౫౭

మామిడిసింగయ మంత్రిపదవినంది ప్రాభవముగాంచియుండినను, నది పెదకోమటి వేమారెడ్డి కొండవీటిగద్దె యెక్కుటకుపూర్వమే శ్రీనాథుఁ డాగ్రంథమును రచియించియుండు ననువాదమునకు నిర్బంధము కాఁజాలదు.

ఈసందర్భమున జ్ఞప్తియందుంచుకొనదగినవిషయము లొండు రెండుగలవు.

1. పెదకోమటి వేమారెడ్డివి దానశాసనములు పెక్కు లబ్ధమైనవి. ఇవియన్నియు నాతఁడు కొండవీటిరాజ్యమును బాలించుకాలమునఁ జేసినవి. వీనియం దెచ్చటను మామిడి సింగయప్రస్తావము గానరాదు.

2. మఱియు శృంగారనైషధషష్ఠాశ్వాసారంభమున మామిడి సింగయయొక్క గురువు పేర్కొనఁబడియున్నాఁడు.

క. శ్రీగురుశంకరమాని ద,యాగౌరవనిత్యవర్ధితాన్వయకరుణా
సాగరవిజయరమైకస,మాగమలీలానుషంగ మామిడిసింగా.

ఈశంకరమాని యెఱ్ఱాప్రెగ్గడకుఁ గూడ గురువే.

ఉ. యామము లెన్మిదింట నియతాకృతిఁ బ్రత్యహముఁ శివార్చనా
రామతయొప్ప నిత్యశివరాత్రివ్రతంబుగఁ బూని భవ్యయో
గామృతతృప్తిమైఁ ద్రిజగదర్చితలీలఁ దనర్చు శంకర
స్వామిమునీంద్ర భక్తజనవత్సలు మద్గురు నాశ్రయించెదన్. *

ఎఱ్ఱాప్రగ్గడ క్రీ.శ. ౧౩౫౦-౬౦ ల మధ్య అనపోతారెడ్డిరాజ్యకాలమున సజీవుఁడై యుండెనని కొన్ని శాసనములవల్ల తెలియుచున్నది. అప్పటి కీతఁడు ముసలివాఁడై యుండ వలయును. శంకరస్వామియు నంతవఱకు సజీవుఁడై యుండె ననుకొనినను నాతని రెండవ శిష్యుఁడైన మామిడి సింగయ క్రీ.శ. ౧౪౦౦ల తరువాత పెదకోమటి వేమారెడ్డికి మంత్రియై రాజ్యకార్యనిర్వాహణము జేయునట్టిస్థితియం దుండెనాయనుసంశయము కలుగుచున్నది. పై విషయములనన్నిఁటిని విచారించఁగా శృంగారనైషధరచనాకాలము క్రీ. శ. ౧౪౦౦ లకు పూర్వమై యుండనోపుననుతలంపు కలుగుచున్నది.

౫. సర్వజ్ఞసింగభూపతిదర్శనము. శ్రీనాథునికాలమున సింగభూపతు లిద్దరుండిరి. ఇద్దఱును రేచర్లవంశజులే. 1. మొదటిసింగభూపతి క్రీ. శ. ౧౩౯౦ వ సంవత్సరప్రాంతమున నోరుగల్లు రాజుకొండపట్టణములు రాజధానులుగ తెలింగాణము నేలెను. రెండవవాఁ డీతని మనుమఁడు. అతఁడు ౧౪౨౫ మొదలు ౧౪౫౧ వఱకును రాజ్యముచేసినట్లు తెలియుచున్నది. వీరిలో రెండవవానికే సర్వజ్ఞుఁడనుబిరుదుగలదు; శ్రీనాథుడు పోయినది సర్వజ్ఞసింగనిసభ కగుటచేత నతఁడు క్రీ.శ. ౧౪౨౫-౫౦ లమధ్య భూపాలన మొనర్చిన రెండవసింగ భూపతికడకే పోయియుండవలయును.

* నృసిం. ౧-౧౧.

# విరాటపర్వము

## వ్యాసుడు—తిక్కన

శ్రీ కాభూరి వ్యాసమూర్తిగారు, విజయనగరము.

తిక్కన మూలములో నున్నలోపములను సవరించి స్వప్రతిభం జూపుచు మాతృక కంటె రసవత్తర మొనరించినాడని పలువురుప్రముఖులు అనేకగ్రంథములలోను, పత్రికల లోను వ్రాసియున్నారు. తిక్కన విరాటపర్వము పుట్టినపిమ్మట నాతని రచనాచమత్కార ముం దిలకించి మాతృకగూడ తదనుగుణముగా నచ్చటచ్చట మార్చబడియున్నదని యొకరు వ్రాసియున్నారు. తిక్కన మూలములోనిభావములను గొన్ని విడిచియున్నాఁడు. కొన్నిం టిని తావులు మార్చి రచించియున్నాఁడు. కొన్నిచోట్ల స్వతంత్రభావములను బ్రకటించి యున్నాఁడు. ఇట్లతిస్వేచ్ఛగా నాతఁ డాంధ్రీకరించియున్నాఁడు.

సంస్కృతభారతమందున్న గాంభీర్యము, రచనాచమత్కారము మఱియేభాషలోని కిని రాదనియు, నసలు సంస్కృతభారతస్వారస్యమునంతయు నెఱుంగుట నెంతటి మహనీ యులకైనను సాధ్యముకాదనియు, ఆస్తికులగు వైదికమతానుయాయులు దలంచియు న్నారు. సాక్షాత్ భగవదంశసంభూతుఁడైన వ్యాసుఁడు రచించినభారతములో గొన్నిభావ లోపములు గలవని తలంచుట సబబుకాదు. అందువలన సంస్కృతభారతమే వేయిమడుఁ గులు సమంజసముగానున్నదని ఋజువుచేయుటకుగాను విరాటపర్వమును బూర్తిగా విమ ర్శింపుచు నే నొకపుస్తకమును రచించుచున్నాను.

సంస్కృతవిరాటపర్వము అనేకవిధములుగా నున్నది. ఒకప్రతినిబోలి యొకటి లేదు. అయినను ఉత్తరదేశప్రతిని నాధారముగా దీసికొని నే నీపుస్తకమును వ్రాయుచున్నాను. ఇందు ఆయాప్రతులలోనున్న ముఖ్యమైనభేదములను గూడ నచ్చటచ్చట వ్రాయు చున్నాను. సంస్కృతములోనున్న స్వారస్యము నాంధ్రలోకమునకు బ్రకటించుటయే నా యాశయము. తిక్కన విరాటపర్వమును బహుసమర్థతతో రచించియున్నాఁడని అనేకులు రచించియున్నారు కావుననే నావిరాటపర్వమునే ఆధారముగా దీసికొని సంస్కృతమం దున్న గాంభీర్యమును వ్యక్తముచేయ దలంచినాను. తిక్కన మూలములోనిభావములను స్థలాంతరములందు రచించుటవలన గలిగిన అస్వారస్యమును, స్వతంత్రరచనయందున్న అస్వా

రస్యమును, మఱియు నాతఁడు మూలములో నున్నది చూచియు గ్రహింపలేక నస్వారస్య ముగా వ్రాసినవిషయములు గొన్నిఁటిని నిందు నిరూపించియున్నాను.

త్రిలిఙ్గపత్రికాధిపతులు, భాషోద్ధారకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు సంస్కృతవాఙ్మయస్వారస్య మాంధ్రలోకము గ్రహించుటకుగాను అనేకగ్రంథములను ముద్రించియున్నారు. వారు నడుపుచున్న త్రిలిఙ్గపత్రికయు వారియుద్యమమునకు మిగుల దోడగుచున్నది. ప్రస్తుతము వెలువడనున్నత్రిలిఙ్గరజతోత్సవసంచికయందు సంస్కృత వాఙ్మయస్వారస్యమును వ్యక్తపఱచు ఈ నాపుస్తకమందలి రెండువిషయములను బ్రకటింప నుత్సాహముగల్గి ఈవ్యాసమును వ్రాసి పంపినాను. శమీవృక్షముపైని పాండవు లాయు ధంబులనుంచుట, పాండవులు విరాటనగరమును బ్రవేశించుట అనువిషయము లిపుడు ప్రకటించుచున్నాను.

శమీవృక్షముపై నాయుధముల నుంచుటనుగూర్చి సంస్కృతములో నకులుఁడు చేసినట్లుగా నొకదానియందు, సహదేవుఁడు చేసినట్లుగా నొకదానియందు, ధర్మజుఁడుచేసిన ట్లొకదానియందు గలదు. తిక్కన ధర్మజుఁడే కట్టెనని వ్రాసినాడు. 'అజాతశత్రుండు ధర్మ దేవతాదత్తవరుం డగుటంజేసి, నిశ్శంకంబైన యంతఃకరణంబుతోడ శమీవృక్షసమా రోహణం బాచరించి ఆయుధములు వ్రేలగట్టెను' అని వ్రాసినాడు. ౨. ౧౭౩, ౧౭౪. ధర్మ రాజు సంపాదించినవరము పాండవులకు, ద్రౌపదికిగూడ పనికివచ్చుచున్నదిగాన ధర్మజుఁడే వృక్షమెక్కి కట్టుటయందలి స్వారస్యమేమియుఁ గనబడదు. ధర్మరా జిట్లు ఆయుధములు వ్రేలగట్టి తదీయాధిదైవతంబుల నుద్దేశించి నమస్కరించి

క. నరునకు నాకుం దక్కఁగ, నొరులకు మీరూపు సూపకున్నది విషవి
స్ఫురితభుజగభంగి భయంకరమూర్తులు దాల్చియుండఁగా వలయుఁజుఁడీ. ౧౭౬

ఉ భీముఁడు ధార్తరాష్ట్రకులభీషణరోషుఁడు చిత్త మెప్పు డె
ట్లై మద మెత్తునో యతనియాగ్రహవృత్తికి లోనుగాక మీ
రేమెయినైన వంచనవహించి తొలంగుట మత్సమీహితం
బేమఱకుండఁగావలయు నివ్విషమాబ్ధములోన నాతనిన్. ౧౭౭

వ. అని వేడికొని వృక్షంబు డిగ్గి దానికిం బ్రదక్షిణంబువచ్చి ప్రణమిల్లి భీమసేను దెస మరలి చూచి సాంత్వనవచనసమేతంబుగా నతనిం గౌగిటంజేర్చి యనునయించి తమచేసిన విధంబు దత్ప్రదేశవర్తులయిన గోపాలాదిక్షుద్రజనంబులకు మఱుగువెట్టందలంచి వారల కభిముఖులై పాండునందనులందఱు నిట్లనిరి. ౧౭౮

చ. ఇది శతవృద్ధ మాజనని యిప్పుడు మృత్యువుఁబొందె నిట్లు నే
యుదుము కులప్రయుక్త మగుచున్న సనాతనధర్మ మిత్తెఱం
గ దహనకర్మ మొల్ల మది గానిది గా మును నిశ్చయించి మా
మొదలిటివా రొనర్చువిధముం గొనియాడితి మేము నియ్యెడన్. ౧౭౯

ఇట్లుగా దిక్కన రచించినాడు. తనకును నర్జునునకు దప్ప అనుటలో విశేషమేమియు నేసంద ర్భమునగూడ గనబడలేదు. పైగా వారిద్దరే జాగ్రత్త అయినవారు, మిగిలినవారు తొందర పడువారు, కార్యసమాలోచనములేనివారు అని తేల్చినట్లగుచున్నది. ఇంక భీమునివిష యమై ప్రసంగించుచు ధర్మజుఁడు 'ఈతఁడు చిత్తము మదమెత్తివచ్చినచో వంచనవహించి తొలంగుట మత్సమీహితంబు' అని పలికెనని వ్రాసెను. ఈమాటలన్నియు ధర్మజుఁడు స్వగతమున బలుకలేదు. వృకోదరుడిగ్గి భీమసేనుదెస మరలిచూచి సాంత్వనవచనసమేతంబుగా నతనిం గౌగిటంజేర్చి యనునయించెనని వ్రాయుటచే బ్రకాశముగా నన్నాడని స్పష్టమగు చున్నది. ధర్మజుని మొదటిమాటప్రకారము అస్త్రములు భయంకరభుజంగములుగా భీమున కగపడవలసియున్నది. అయినను సాహసించి యాతఁడు గ్రహింపవచ్చినచో 'తొలంగుట మత్సమీహితంబు' అని ధర్మజుఁడు కోరెనని తేలుచున్నది. అప్పుడు ధర్మజుని మొదట మాట (భయంకరభుజంగములట్లు గనబడుడు అనుమాట) భీమునివిషయమై పొల్లగు చున్నది. సాహసించినవారికి ధర్మజు మొదటిమాట వర్తించదని వ్యక్తమగుచున్నది. ఈఅ సంగతమే తిక్కనరచనలో వ్యక్తమగుచున్నది. ఆయుధనిక్షేపము మఱుగుపెట్టదలచి 'ఇది శతవృద్ధ మాజనని మృతినొందెను. ఇట్లొనర్చుట మాకులాచారము' అని పలికినట్లుగా వ్రాసినాడు. క్షుద్రజనంబులు సాహసించి రారాదని తిక్కన ఈమాట పలికించినాడు. ఈమాత్రము సాహసము నకులసహదేవులకుండదని తలంచినాడేమో తెలియదు. కావున నిది అనవసరప్రచార మగుచున్నది. తనకు నర్జునునకుదప్ప నితరుల కస్త్రములు భుజంగము లట్లు గనబడవలెనని కోరినధర్మజుని ప్రార్థనమందున్న సొగసు చెడిపోయినది. అందువలన నీభాగమంతయు నభిప్రాయశూన్యమగుచున్నది. ఆత్మవిశ్వాసములేనివాఁడగు చున్నాఁడు ధర్మరాజు. తానే చెట్టునెక్కి కట్టుటయందలి స్వారస్యమేమియు లేకపోవు చున్నది. సంస్కృతమున నిట్లు గలదు.

శ్లో. అథాన్వశాసన్నకులం కుంతీపుత్రో యుధిష్ఠిరః. ౫, ౨౭
ఆరుహ్యేమాం శమీం వీర ధనూంషి తాని నిక్షిప,
తాముపారుహ్య నకులో ధనూంషి నిదధే స్వయమ్. ౩౦

(అనంతరము ధర్మరాజు నకులుని నిట్లు శాసించెను. 'వీరుఁడా! ఈశమీవృక్షమునెక్కి ధనుస్సుల నందుంచుము. నకులుఁడు వృక్షమునెక్కి యాయుధముల నందు గట్టెను.)

శ్లో. వివర్జయిష్యంతి నరాదూరాదేవ శమీమిమాం,
ఆబంధశవమత్రేతి గంధమాఘ్రాయ పూతికం. 33
అశీతిశతవర్షేయం మాతా న ఇతి వాదినః,
కులధర్మోఽయమస్మాకం పూర్వైరాచరితోఽపివా
సమాసజ్యాథవృక్షేఽస్మిన్నితివై వ్యాహరంతి తే,
ఆగోపాలావిపాలేభ్య ఆచక్షాణాః పరంతప
ఆజగ్ముర్నగరాభ్యాసం పార్థాశ్శత్రునిబర్హణాః. 34

(జను లాశమీవృక్షమును దూరముననే విసర్జించుటకుగాను దుర్గంధభూయిష్ఠమైన శవము నందుపై గట్టిరి. అశీతిశతవర్షప్రాయమైన మాతల్లి యిది. ఇట్లాచరించుట మాకులధర్మము. ఇట్లుగా గోపాలకులకు బ్రకటించుచు బాండవులు పట్టణసమీపమునకు వచ్చిరి.)

ఇట్లుగా సంస్కృతమున గలదు. అవకాశముండినను ఎంతటి విషమావస్థగలిగినను పాండవులు తొందరపడక ఆయుధముల దలంచకనే విరాటనగరంబున కార్యముల సాధించిరి అని యిందు వ్యక్తమగుచున్నది. రాజు కట్టుట సొగసుకాదు కావున ధర్మరాజు నకులునకీపని నాజ్ఞాపించినాడనుస్వారస్య మిందు గలదు.

పాండవులు విరాటనగరమును బ్రవేశించుటనుగూర్చి సంస్కృతప్రతులలో ననేక విధములుగా నున్నవి. భర్తలు వెడలినపిమ్మట భార్య వెడలుట సబబుగాన జ్యేష్ఠానుక్రమముగా బాండవులు ప్రవేశించినపైని ద్రౌపది ప్రవేశించుట సమంజసమని కొందఱు, వరుసగా బాండవులైదుగురు ప్రవేశించిరని వ్రాయబడినచో సొగసుగా నుండదుగాన మధ్యను ద్రౌపది ప్రవేశించినట్లు వ్రాయబడినదని కొందఱు, ముందుగా గొందఱు పిదప గొందఱు ప్రవేశించినపక్షమందు ద్రౌపదియొక్కస్థితికి రక్షగానుండునుగాన మధ్య ద్రౌపదిప్రవేశించుట సబబని కొందఱు, నకులసహదేవులు కవలుగాన వారినడుమ నర్జునుడు ప్రవేశించెనని కొందఱు నాయాప్రతులను సమర్థించుచు వ్రాసియున్నారు. కాని యివేవియు సమంజసము లగు నూహలుకావు. పాండవు లైదుగురు ద్రౌపదియు నొకేపర్యాయము విరాటనగరమునకు వచ్చిరని సంస్కృతభారతాభిప్రాయము. సభలో గూర్చొనియున్న విరాటునియొద్దకు ధర్మజుఁడు వచ్చెను.'తతో విరాటం ప్రథమం యుధిష్ఠిరో రాజా సభాయాముపవిష్టమావ్రజత్' 2-1. విరాటుఁడు సభను విడిచివచ్చునపుడు భీముఁడు కనబడెను. భీముఁడు వంటలవాఁడుగా

ప్రవేశించువేళకు ద్రౌపది సుధేష్ణను జేరినదని తెల్పుటకుగాను భీమప్రవేశానంతరము ద్రౌపదీప్రవేశవిషయము వ్రాయఁబడినది. ౮, ౯ వరుస అధ్యాయములలో వీరిప్రవేశవిషయము వ్రాయఁబడినది. విరాటుఁడు భవనసమీపములోనుండు గోశాలకురాగా నచ్చట నహదేవుఁడు కనబడెను. 'సహదేవోఽపి గోపానాం కృత్వా వేషముత్తమం, భాషాం చైషాం సమాస్థాయ విరాటం సముపాయయౌ. గోష్ఠమాసాద్య తిష్ఠంతం భవనస్యసమీపతః' ౧౦-౧,౨ అశ్వశాల దూరముగా నుండునుగాన విరాటు డచ్చటకు ఆఖరునవచ్చెననియు నచ్చట నకులుఁడు కనబడెననియు భావము 'సవై హయానైక్షత తాంస్తతస్తత స్సమీక్షమాణం సదదర్శ మత్స్యరాట్'౧౨-౨. అర్జునుఁడు సభాసమీపములోనే గనబడినాడు.'గతేన భూమిం ప్రతికంపయం స్తదా విరాటమాసాద్యసభాసమీపతః' ౧౧-౨. విరాటునకు సహదేవుడు ముందుకనబడెనా లేక అర్జునుడు ముందుకనబడెనా అనుసంశయము సంస్కృతమున నున్నది. ఇరువురును సభాసమీపములోనే కనబడినారు. ఈసంశయము సమయపాలనపర్వములో ౧౩ అధ్యాయములో దీరుచున్నది. పాండవు లేవరుసను బ్రవేశించిరో స్పష్టముచేయుటకుగాను ఆవరుసనే పాండవుల ప్రవర్తనను గూర్చి ముచ్చటింపబడినది. ౬ శ్లోకములో ధర్మరాజు ౭ భీమసేనుడు ౮ అర్జునుడు ౯ సహదేవుడు ౧౦ నకులుడు చెప్పబడిరి. కావున సహదేవుని కంటె నర్జునుఁడే ముందుకనబడెనని నిశ్చయించవలసియున్నది. వివిధస్థలములలో బాండవులు కనబడిరిగాన నొకరుప్రవేశించుతఱి నొకరచ్చట లేరని స్వారస్యము. ధర్మజునకు విరాటు డాశ్రయమిచ్చి సభనుండి వెడలుసమయమున ధర్మజుడు బసలోనికిబోయెననియు, భీముడు వంటశాలకుఁబోయెననియు, సహదేవుఁడు గోశాలసమీపముననే నిలచెననియు, నర్జునుడు అంతఃపురములోనికిబోయెననియు,నాఖరున నకులుఁడు కనబడెననియు సంస్కృతభారతాభిప్రాయము. ఇట్లుగా సంస్కృతభారతము పాండవప్రవేశమందు స్థలాంతరములను వ్యక్తము చేసినది. తిక్కన పాండవులను జ్యేష్ఠానుక్రమముగా బ్రవేశపెట్టెను. ధర్మజుఁడు విరాటనగరంబునకుబోవుచు 'నొంటిమై జనుదెం డనిపలికెను. దైవయోగంబున విరాటుం డపుడు బయలికొలువిచ్చుచుండెను. ౧-౧౮౬. భీముఁడు అగ్రజుఁడు వోయినదెసదప్ప నొండువలన విరాటసభ ప్రవేశించెను. ౨౧౧. అర్జుననకుల సహదేవులును రాజసభనే ప్రవేశించిరి. ౨౨౮-౨౫౭. ఇట్లుగా దిక్కన వ్రాయుటచే రాణివాసములో నున్నఉత్తరయు రాజాస్థానమునకు రావలసివచ్చినది. ౨౬౯. విరాటుఁ డశ్వములను రాజసభయందే పరీక్షించవలసివచ్చినది. ౨౫౭. ఈ అసందర్భములను దప్పుకొనుటకు దిక్కన యది బయలికొలువని వ్రాసినాడు. కావుననే మంత్రులు మొదలగువా రచ్చట నున్నట్లుగా వ్రాయలేదు. పాండవప్రవేశ

ములో నన్నిసందర్భములందుగూడ విరాటుఁడు పరివారముతో బలికినట్లుగనే గలదు. కాని ఇందొకచిక్కుగలదు. విరాటుఁడు బయలికొలువులో నుండగా ధర్మజుఁడు ప్రవేశించెను. వేఱొకమార్గమున భీముఁడు కొలువుప్రవేశించెనుగాని అంతకుముందు సభలో ప్రవేశించిన ధర్మరా జచ్చటనే యున్నాడు. విరాటుడును, నెవరును లేచి వెడలిపోకుండుటచే ధర్మజు డచ్చటనే యున్నాఁడని నిర్ణయించవలసియున్నది. అర్జునుఁడు ప్రవేశింపగా విరాటుడు ఉత్తరార్జునులను ఒండొరులకు నప్పగించెను. అనంతరము నకులుఁడు ప్రవేశించెను అని వ్రాసినాడు. ౨ ౫౫. ఇట్లుగా ధర్మజునివిషయ మేమిఁయు వ్రాయనందున నాతఁ డచ్చటనే యున్నాఁడని తేలుచున్నది. ధర్మజుఁడు ప్రవేశించునపుడు 'కురువిషయజాతుఁడ,ధర్మసుతుసఖుఁడ, బహువినోదకరుండ' నని పలికినాడు ౧౯౫. భీముఁడును 'తన్ను ధర్మసుతుఁడు పెద్దయుం జేకొనియుండు' నని పలికినాడు. ౨౨౨. ఇందువలన నావచ్చినయిద్దరు ధర్మజుని యొద్ద ప్రసిద్ధిగల్గియుండిరని తేటపడుచున్నది. ఇట్లే నకులుఁడును, సహదేవుఁడునుగూడ వెళ్లి ధర్మజునివలన మన్ననఁనొందియుంటిమని పలికినారు. ౨౬౭, ౨౮౫. విరాటుఁడు భీమాదులవిషయమై ఉబులాటపడి పరిజనము నడిగినాడేకాని చెంతనున్నధర్మజునిగూర్చి 'వీరిని నీవెఱుగుదువా' అని మాటవరుసకైన నడుగలేదు. సంస్కృతమందున్న స్వారస్య మిచ్చట లేదు. అస్వారస్యముగగూడ నున్నది.

సంస్కృతమున విరాటుడు పాండవు లొక్కొక్కరితో నొక్కొక్కరీతిని సంభాషించియున్నాడని గలదు. వచ్చినవారు పాండవులైయుందురని అనుమానించుటకు రాని హేతువని రూపింపబడియున్నది. ఆచమత్కారము తిక్కనరచనలో లేదు. తిక్కన ధర్మజుడు సన్యాసివేషమునఁ బ్రవేశించెనుగాన నాతఁడు 'ద్యూతవిరక్తిని సన్యసించితి' నని పలుకుట సమంజసముగా లేదు. ఇట్టివిషయము లిచ్చట వ్రాయవలసినని చాలగలవు.



# త్యాగరాజప్రశస్తి

శ్రీపాద కామేశ్వరరావుగారు, ఎం. ఏ., యల్. టీ., రాజమహేంద్రవరము.

## త్యాగరాజ పరిచితి.

కర్ణాటకసంగీతముతో పరిచయమున్నవారిలో త్యాగరాజు పేరుప్రతీతి నెరుగనివారుండరు, కాని వీరిపరిచితి సర్వంకషము కాదు. త్యాగరా జెట్టివాడో, అతనికీర్తి కావలమేమో, చాలామందికి సరిగా తెలియదు; అతడు సుప్రసిద్ధవాగ్గేయకారకుడని అందరు నెరుగుదురు; ఆతనికృతు లెట్టివో, వాటిలోనిభాషాభావము లెట్టివో, రచనాపద్ధతి యెట్టిదో, వాటిప్రయోజన మేదో తెలిసినవారిసంఖ్య చాలాతక్కువ. ఈవిషయమై తగినచర్చలు తరుచుగా జరుగవు; విషయప్రాముఖ్యత తెలియనపుడు వివరణ ఆవశ్యకము కాదు. త్యాగరాజకృతులగురించి కూలంకషవిమర్శ చేయదలచినవారు, ఉత్కృష్టపాండిత్యం కలవారు కావలెను. వారికి వైదికధర్మము సయుక్తికముగా తెలిసియుండుటే కాక, సాహిత్యప్రజ్ఞాగరిమ, సంగీతశాస్త్రాధ్యయనం, గానకళానైపుణ్యం, గీర్వాణాంధ్రభాషాపాండిత్యం, సాహిత్యరసపోషణసంవిధానం, వేదాంతాలంకారశాస్త్రపారగత్వం మొదలైనశక్తులు పేరునకుమాత్రమే కాక పేర్మిపెంపుల కాకరమై యుండవలెను. ఇట్టివ్యక్తులు చాలా అరుదు, కావుననే విషయ మెంత ముఖ్యమైనా మూలబడ్డది.

త్యాగరాజు జీవిత మతిక్లుప్తముగా నిట పొందుపరుస్తాను. అతడు ములికినాటివైదికుడని వాడుక; ఇంటిపేరు కాకర్లవారు, తాతగారు గిరిరాజు, తండ్రి రామబ్రహ్మం, తల్లి శాంతాదేవి. ఈకుటుంబం మొదట తిరువారూరున కాపురముండి, అక్కడ జరుగుబాటు సౌకర్యంలేక తిరువాడి (పంచనదక్షేత్రం) కి మారింది. గిరిరాజు గొప్పపండితుఁడు, కవి; రామబ్రహ్మం పండితుఁడై వైదికజ్ఞానసంపత్తి, ధర్మాసక్తి, నిరుపమభక్తికలవాఁడు కావున రాజాశ్రయంగాని ఉద్యోగంగాని స్వీకరించలేదు. ఇతనికి ముగ్గురుకొడుకులు, అందులో త్యాగరాజు కనిష్ఠుఁడు; మూడుతరాలనుండి వారింట వెలసినపాండితి, దైవభక్తి, ధర్మాచరణము, ఆత్మప్రత్యయం కలవాడౌటవల్ల ఉద్యోగస్వీకారం చేయనొల్లక, కులదైవమగు శ్రీరాము నర్చిస్తూ నిత్యం వేదశాస్త్రాలు, ప్రస్థానత్రయం, పురాణేతిహాసములు పఠిస్తూ సంగీతశాస్త్ర మభ్యసించేవాఁడు; అతని అన్నలిద్దరూ కొద్దిపాటి ఉద్యోగాలు సంపాదించి

జీవయాత్ర అతికష్టముతో గడిపేవారు. త్యాగరాజు పితరులు అతనికి పదిహేనుసంవత్సరాలు నిండేసరికి స్వర్గస్థులైరి. అన్నలింటికి యజమానులై త్యాగయ్యను ఉద్యోగంచేసి ధన మార్జించుమని పదేపదే నిర్బంధించారు, కాని త్యాగయ్య అందుకు సమ్మతించలేదు. మరుచటిసంవత్సరం సిద్ధుఁ డొకడు దైవప్రేరితుఁడై త్యాగయ్యకడకువచ్చి (రామ) తారక మంత్ర ముపదేశించి, శ్రీరామనామం 96 కోట్లసార్లు జపిస్తే భగవంతుడు ప్రత్యక్షమై జీవన్ముక్తి యొసగునని చెప్పెను. తదాజ్ఞానుసారం తనకు 36 వత్సరములప్రాయ మగుసరికి త్యాగయ్య కృతకృత్యుఁడయ్యెను. ఇంకొనాడు పరమభాగవతోత్తముడైన నారదుడు సన్యాసిరూపమున కనఁబడి "స్వరార్ణవ" మనే అపూర్వసంగీతగ్రంథమిచ్చి, సంగీతంద్వారా లోకులయందు భక్తిప్రచారం ప్రారంభించుమన్నాడు; కృతిరచన కిదియే హేతువు, ఇందు వల్లనే అతనిఖ్యాతి భారతవర్షమందు ప్రబలమయ్యెను. అన్నలమాట తిరస్కరించినందున సోదరులలో మనోమనికితములు బలిసి త్యాగయ్య అనేకవిధముల బాధలపాలై తుదకు వేరింటికాపురంపెట్టి శిష్యులనుచేర్చి సంగీతంచెప్పడం ప్రారంభించెను.

ఇతనిపేర్మికి ముఖ్యకారణములు మూడు:—పాండితి, నడవడి, కృతులు; మొదటి రెండున్నూ మూడోదానిలో వ్యక్తమైనవి కావున కృతిపరామర్శ ప్రారంభింతాము.

## త్యాగరాజ కృతిప్రశస్తి

త్యాగరాజకృతులు ధర్మాసక్తిప్లావితములై అన్నివిధముల ఉత్తమోత్తమాలని ప్రతీతి; కృతిరచన త్యాగయ్యతో మొదలై అతనిరచనలోనే అత్యున్నతపదవి నాక్రమించినది. "Kriti is the most highly evolved form of musical compositions" ఇవి ఐహికసుఖదుఃఖజనితములై, అక్కడక్కడ పరమానందప్రాప్తిసూచకము లగుచున్నవి. "మానవజన్మం సుఖదుఃఖమిశ్రితము నరునికోర్కెలు గొప్పవేకాని నిర్వహించినకార్యము లత్యల్పములు" అని ఉదాహరణసహితంగా వెల్లడిచేస్తాయి. దారిద్ర్యము దౌర్భాగ్య మున్నూ మానవుని అనుభవజ్ఞానాన్ని వృద్ధిచేసి చిత్తానికి నిర్మలత నిశ్చలత చేకూర్చి చారుచర్య నలవడజేయును.

త్యాగయ్య పరమభక్తుఁడౌటచేత సగుణోపాసకుఁడు కావలసివచ్చెను; తనకుల దైవతమైన శ్రీరాముని పరాత్పరునిగా భావించి ఉపాసించేవాడు. ఆదినములలో దక్షిణ దేశములందు అద్వైతం ప్రబలి ఉండడంచేత విశిష్టాద్వైతపక్షపాతియైన త్యాగయ్యకు చాలామంది శత్రువు లుండేవారు.

త్యాగరాజున్న తిరువాడియందే ముత్తుస్వామిదీక్షితులు, శ్యామశాస్త్రి అనే వాగ్గేయకారకులు సంగీతాధ్యాపకులుగా నుండేవారు. ఈముగ్గురిశిష్యులు మరికొందరుప్రజలున్నూ పరస్పరాసూయాపరులై వైరాగ్ని ప్రజ్వరిల్లచేసేవారు. ఒకరికి తెలిసినశాస్త్రమర్మములు వేరొకరికి చెప్పకపోవడంచేత అవి వారితోనే అంతమొందెను. త్యాగరాజకృతు లెన్నో ఈరూపకంగా నశించినవి. వైదికగ్రంథములు, శాస్త్రాలు, పురాణేతిహాసములున్నూ శ్రద్ధతో పఠనచేయడంవల్ల త్యాగయ్యకు కవితాశక్తి అప్రయత్నపూర్వకంగా లభించింది; సరళమై మృదుమధురమైనభాషను వైదర్భీరీతి నాశ్రయించి, అక్కడక్కడ అలంకారములు చేర్చి, ద్రాక్షాపాకమున రచనచేసే రసపోషణసంవిధానచాతురి పట్టుబడింది. పదబాహుళ్యం లేకపోవడంచేత ఈతని కవిత్వమునకు భావపూర్ణత, హృద్యత, శుచి, జాతీయత, జీవకళ అనాయాసంగా సమకూరినవి. సంతతవిద్యాతురుడై సంగ్రహించినసాధనసంపత్తి వినియోగించుటలో అసమానకళాచాతురి అలవడింది.

నశించిపోగా మిగిలిన త్యాగయ్యకృతుల కింకొకీడు మూడింది. ఆంధ్రభాషాజ్ఞానం దాక్షిణాత్యుల కంతగా లభించకపోవడంచేత కృతులు అనేకవికృతులపాలైనవి—అపశబ్దాలుదూరినవి, పదాలుమారినవి, అన్వయం చెడిపోయింది; ఇట్లు పరివర్తనం చెందడంవల్ల కృతిభావం తెలుసుకోడానికి వీలులేకపోయింది. భాషాపరిచయశూన్యతకుతోడు సంగీతమందత్యంతాభిలాష, గానపాటవమున ఒకరినొకరు మించవలెననేమాత్సర్యం, భక్తిరసానురక్తిపోవడం మొదలైనకారణాలచేత గానవిశారదులు త్యాగయ్యకృతులసాహిత్యమును దోషభూయిష్ఠంగా జేసినారు. పాడేటప్పుడు సాహిత్యం కొంతవరకు విరూపం చెందడం సహజమే; కాని స్వరప్రస్తారం సంగీతపాండిత్యప్రకర్షకు మూలాధారమని యెంచేవాళ్లు సాహిత్యంజోలికిపోరు, దాన్ని సంస్కరించు ఉద్దేశ్యము నుంచుకోరు.

త్యాగరాజకృతులు సంగీతవిద్యాభ్యాసకులకు, ఆంధ్రభాషాభిమానులకు, విశేషించి భక్తులకూ పరమప్రయోజకములు. గానకళోపాసకులు శాస్త్రజ్ఞానం, అవిచ్ఛిన్నసాధకం, పండితులు పాడేతీరు తరుచు పరిశీలించడం అనే మూడుమార్గములం దారితేరి వీలైనచోట్ల తమ ఉపజ్ఞ Originality వ్యక్తంచేస్తేనే వారితెలివితేటలు వన్నెకెక్కుతవి; గురువు నేర్పినదాన్ని తు-చ-తప్పకుండా అప్పగించడం గొప్పకాదు. కొందరు వాగ్గేయకారకులు తమకృతులకు నియమితస్వరకల్పన అనే నిగళంచేర్చి అభ్యాసకుల ఉపజ్ఞ నున్మూలింతురు. వీరు శిష్యులకు మాత్రమేకాక గానకళకుకూడా పరమాపకారకులు; త్యాగయ్య ఉపజ్ఞకు

వీరైనంత అనువు కల్పించి కళాభివృద్ధిని ప్రోత్సహించినాడు. గానకళయందు కొత్తదారులు తీయడానికి త్యాగయ్యకృతు లుపచరించినట్లు ఇతరకీర్తన లుపచరించవు.

ఆంధ్రభాషాభిమానులు త్యాగయ్యగారిభాషాలాలిత్యం, రసపోషణసంవిధానము పరీక్షించి తమ కలవడజేసుకోవచ్చును. ఇక భక్తుల కివి కల్పభూజములే; కృతులన్నిటిలో ఏదో ఒక ధర్మసూక్ష్మ మిమిడియుండును. త్యాగయ్యకవిత వ్యంగ్యప్రధానం; కృతిలోని భావం పదముల అర్థము తెలిసినంతనే చాలదు, పదే పదే సాహిత్యమును మననముచేస్తేనే తప్ప భావస్ఫూర్తి గ్రహించ వీలుండదు; భావం తెలియకపోతే రసోదయం కాదు, ఆనందము కలగదు. కేవల శ్రవణముకన్న చింతన ఆవశ్యకము.

త్యాగరాజును మంత్రద్రష్ట (Seer, prophet) గా నెంచదగును. ఇతనికి దివ్యులు ప్రత్యక్షమై ధర్మసూక్ష్మములు తెల్పినారుకావున ఇతని బుద్ధి పరిపక్వమై బోధనాపద్ధతి శ్రోతలకు అమందానందం కల్గించును. భగవత్ప్రసాదం, భాగవతులకృపాకటాక్షం, బోధనామృతం జూరగొన్నవాడు కావున త్యాగయ్య బ్రహ్మర్షిపదవినొందినాడు, అతనిబోధన ఆర్షేయమని చెప్పవచ్చును, అతని కృతిజాలము ఉత్కృష్టజ్ఞానాభివృద్ధి కాలవాలము కావున దానిని నిత్యపారాయణ చేయవలయును. రామనామసంసర్గము కలిగియుండడంచేత భవతారకహేతువనుట నిర్వివాదాంశము. ఈకృతులలో ధర్మసూక్ష్మములు మెండు, తత్వబోధ విశాలము, గభీరము, సంగీతశాస్త్రజ్ఞానము, గానకళాపటిమ ప్రశంసనీయములు; ఇక భక్తి ప్రతిపదరసోదయమై, చిత్తచాపల్యం పోనాడి నిశ్చలత నిర్మలతల సమకూర్చును, ఇందువల్ల రామనామసుధారసము లభించి ముక్తి కరగతమగును, కావున ఈకృతులను "The Holy Bible in Song" అంటే యొప్పు.

త్యాగయ్య సన్యాసాశ్రమం తీసుకొన్నట్లు చాలామందికి తెలియదు; అందొక దేవరహస్యముంది,—శ్రీరామచంద్రమూర్తి ఇతనికి దర్శనమిచ్చి మోక్షమొసగెదను, కాని ఇంకోజన్మ ఎత్తినకాని నీకు ముక్తిలేదు అనగా ప్రభూ! ఇదివర కెన్నో జన్మాలైనవి, ఈ భవసాగరమును ఇంక తరింపలేను, నన్ను కరుణించు దీనదయాళూ, అని మొరపెట్టితే పరాత్పరు డొక ఉపాయము చెప్పెను. నీవిక సన్యాసివైతివా అది రెండోజన్మమగును, నీవు ముక్తుడవై నన్ను చేరుదువనెను; అందుచే త్యాగరాజు సన్యాసియయ్యె. పిదప కొద్ది కాలములోనే సిద్ధిపొందినందున ఈవిషయము మాటుపడెను.

## త్యాగరాజకృతి పరిశీలన

ఇప్పటికి ప్రచారంలోఉన్న ఇతనికృతులు దాదాపు నాల్గువందలు; వాటిని సర్వతోముఖ విమర్శచేయుట నాబోటి కించిజ్ఞునకు చేతకానిపని; నాశక్తికొలది కొన్ని యెంచి యందలివిషయవివరణ ప్రారంభిస్తాను.

మానవులకు కర్మాచరణ మత్యావశ్యకము; అందు ప్రవృత్తి నివృత్తి అని అవలంబన పద్ధతులు రెండు; ప్రవృత్తిమార్గగాములు ఇహాముత్ర ఫలభోగముల నాశింతురు; రెండోదారిని నడుచువారు ఈభోగములు దుఃఖమిశ్రితములేకాక నశ్వరములని భావించి కోర్కెలే లేక కర్మ ఆచరింతురు. ప్రవృత్తిమార్గచరులు సంసారచక్రమున తగుల్కొని పుట్టుతూ గిట్టుతూ చిరకాలము మాయావాగురుల జిక్కి అదే పొందవలసినసౌఖ్యమని యెంచి తృప్తిచెందుతారు. నివృత్తిమార్గావలంబకులు నశ్వరములైనసుఖము లాసించరు; వారిదృష్టి శాశ్వతము, భవతారకము, నిరతిశయము· పునరావృత్తిరహితమైన సుఖము నొందుటకు విషయభోగవాంఛలత్యజించి నిష్కామ్యంగా కర్మ నాచరింతురు. త్యాగరాజు రెండోపక్షమునకు చెందినవాడు; అతనిజీవితమునకు ఎన్నికగన్న ప్రాపులలో నిష్కామ్యకర్మ యొకటి. "అవశ్య మనుభోక్తవ్యం కృతం కర్మ శుభాశుభమ్"—మానవుఁడు తాను పూర్వజన్మమం దాచరించినకర్మఫల మీజన్మమం దనుభవించును; ఈకర్మ పూర్తిగా నశించవలెనంటే భగవత్కటాక్షం ఉండవలెను.

ప్రవృత్తిమార్గానువర్తులకోర్కె లెల్లప్పుడూ తీరేవి కావు, ఒకానొక సందర్భమున వారుకోరిన దొకటి, ఫల మింకొకటి అవుతవి, అందుచేతనే "Man proposes, God disposes" అని "తా దలచిన దొక్కటౌను మరి దైవ మొనర్చిన దన్యమయ్యెడుః" అనిన్నీ పెద్దలంటారు. ప్రవృత్తివైఫల్యం బోధించేకృతు లనేకములున్నవి, మచ్చుకు ఇదిగో—

> "ఎవరితో నేదెల్పుదు రామా నాలోని జాలి?
> కవగొని సదా భజనసేయు కార్యములన్ని వేరాయె;
> గణనాథు జేయగోరగ గడువానరుఁడై తీరెగా;
> గుణమయ మాయాంబుదసమీర గోపాల! త్యాగరాజనుత" (ఎవరితో)

ఎవరుచేసుకొన్నకర్మఫలం వారనుభవిస్తారు, స్వయంకృతాపరాధమునకు ఇతరమానవులనుగాని దైవమునుగాని నిందించుట తెలివిమాలినపని. "చేసుకొన్న బ్రాహ్మడా, అనుభవించు" అని సామెత. దీని కీకృతులు సాక్షి—

1. "నిన్నాడనేల నీరజాక్ష
కన్నవారిపైని కాకసేయనేల?
కర్మమునకు దగినకార్యములు నడుచును,
ధర్మమునకు దగినట్టు దైవము బ్రోచును;
చిత్తమునకు దగిన సిద్ధియు గల్గును,
సత్యరూప నిన్ను సన్నుతిజేయు
తత్వము తెలిసినత్యాగరాజునికి" (నిన్నాడనేల)

2. "మీవల్ల గుణదోషమేమి? శ్రీరామా,
నావల్లనే కాని నళినదళనయన!
బంగారు బాగుగ పదివన్నెగాకున్న
అంగలార్చుచు బచ్చునాడుకోనేల? (మీవల్ల)
తనతనయ ప్రసవవేదన కోర్వలేకున్న,
అరయ నల్లునిపై నహంకార మదియేల? (మీవల్ల)

1. మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే.
2. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.
3. సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.
4. అభయం సర్వభూతేభ్యః దదామీతి వ్రతం మమ.
5. సుదుష్టో వాప్యదుష్టో వా కిమేష రజనీచరః,
మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన.

మానవుఁడు దోషభూయిష్ఠుఁడు, వంచనాప్రియుఁడు, విషయలంపటుఁడు, అశక్తుఁడు కావున తనదుష్కర్మపరిపాకంచేత మోహాగ్నిలోబడి పరితపిస్తూ తప్పించుకొనేదారి గానరాక భగవంతుఁడే దిక్కని అతనిని అనన్యాసక్తితో సదా భజిస్తే దీనవత్సలుడు దయాసింధువునైన శ్రీరామచంద్రుడు మానవుని ఇక్కట్టులు బాపునని పురాణాలు ఘోషిస్తూన్నవి. ఇందుకు తార్కాణముగా ఈకృతి జూడండి—

"ఎందుకు దయరాదురా? శ్రీరామచంద్రా;
సందడి యని మరచితివో! ఇందులేవో;

తీరని భవనీరధియారడి నైరింపనేరక భయమొంది,
పంకజపత్రనీరవిధి నల్లాడ జూచి చూచి నీరదాభశరీర, నిరుపమశూరనీ;
జాగేల ఇది సమయముకాదు; (జాగు) చేసిన
నేగతి పలుకవయ్యా శ్రీరామ
నీవేగాని దరిలేదయ్యా దీనశరణ్యా,
త్యాగరాజవినుత తారకచరితనీ" (కెందు)

" పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాపసంభవః,
త్రాహి మాం కృపయా దేవ శరణాగతవత్సల !
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష రఘూద్వహ."

ఇట్టి ఆత్మసమర్పణను ప్రపత్తిమార్గమని అంటారు, భక్తులంద రీమార్గము ననుసరిస్తారు.

పరాత్పరుఁ డొక్కడే, ఇతరదైవములు పరమాత్మునికంటె తక్కువవారు ఈమాట తెలిసో తెలియకో చాలామంది ఇతరదైవములను గొలుస్తున్నారు. మానవునికోర్కెలు నాలుగుపురుషార్థములకు చెందును. ధర్మార్థకామమోక్షములన్నే చతుర్వర్గమనికూడ భావిస్తారు. పరాత్పరుఁ డొకడే మోక్ష మివ్వగలడు, తక్కినదైవములు త్రివర్గమునే ప్రసాదించగలరు.

"త్రైలోక్యనాథో రామః న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"

అని త్యాగరాజు నిశ్చితాభిప్రాయం, అందుకనే కృతులను రామాంకితమొనర్చెను. చాలా కృతులలో శ్రీరామునిరూపగుణవిభూతులు (ఐశ్వర్యము) వర్ణించబడినవి; చూడండి—

1. "ఇంతనుచు వర్ణింపదరమా బ్రహ్మేంద్రాదులకైన?
కంతునిగన్న మాచక్కనికళ్యాణరామచంద్రా! నీసొగసు (ఇంతనుచు)
చల్లనిచూపులకన్నులు మరిజాబిల్లికళలగేరినయౌవనము
మెల్లనిమాటలు అభయకరము లివియెల్ల సహజమైన నీగుణ (మింతనుచు)
అన్యులగోరి ఘోరతపము లెన్నెన్నో జేసి వరములంది
మూర్ఖన్యులైనవారి మదంబును రాజన్య!
లఘువున నణచు పరాక్రమ (మింతనుచు)
వాగీశాదిసురకోట్లకు వేదాగమశాస్త్రములకు గనగూడని

నాగరాజభూషణుడైన శ్రీత్యాగరాజసన్నుత నీదుమహిమ (యింతనుచు)

2. "ముమ్మూర్తులు గుమిగూడి పొగడెడి ముచ్చట వినుకోరే,
సమ్మతిగ రాజుకొడు కనగా విని సంశయము దీరక శ్రీరాముని (ము)
రోసముతో రఘురామునిగుణములు రూఢిగ తమగుణములనటువ్రాసి
త్రాసు నిడ సరి నిల్వగ లేదని త్యాగరాజనుతు డెవడో యనుచును (ముమ్మూ)

భగవంతుని తెలుసుకొనుటకు, అతని నాశ్రయించి సంసారాంబునిధి దాటి తాపత్రయమును రూపుమాప నెంచువారికి మూడుమార్గములు కలవు. 1. జ్ఞానము, 2. కర్మ, 3. భక్తి. వీటిలో మొదటి రెండున్నూ దుర్గమములు. కలికాలమందు ఈమూడింటిలో చివరది సర్వజనప్రాపణీయము. భక్తికి గురుతు సంకీర్తనం, అనగా భజన. అత్యంతసులభోపాయము. ధనమక్కరలేదు, ఇతరుల సాహాయ్యము ఆవశ్యకముకాదు, దేశకాలనియమము లుండవు. ఎవరిశక్తికి తగినట్లు వారు యత్నము చేయవచ్చును. ఈసంకీర్తనకే భజన అనిపేరు; భజన సేయువారు భక్తులు, అందులో అగ్రగణ్యులు భాగవతులు. భక్తి ఏకాంతమై నిష్కామము కావలెను, దీనికి సాత్వికభక్తియనిపేరు. భక్తునియందు నాల్గుభావము లుండవలెను—ఆత్మానాత్మవివేకం, ఇహాముత్రఫలభోగవిరాగం, శమాదిగుణసంపద, ముముక్షుత్వం. త్యాగరాజకృతులలో నివి పుష్కలంగా పేర్కొనబడ్డవి. భక్తియొక్క ప్రభావం వర్ణించునీకృతులు పరిశీలించండి —

1. "నీభక్తి భాగ్యసుధానిధి నీదేదే జన్మము
భూభారముగాని సురభూసురులై జన్మించిన ॥నీభక్తి॥
వేదోక్తంబౌ కర్మము వెతగల్గు గతాగతమౌ
నాదాత్మక త్యాగరాజ నాథా, అప్రమేయ సదా ॥నీభక్తి॥

2. "పదవి నీసద్భక్తియు గలుగుట చదివి వేదశాస్త్రోపనిషత్తుల
సత్తతెలియలేనిది పదవియా? ధనదారసుతాగారసంపదలు
ధరణీశులచెలిమి, యొకపదవియా? జపతపాదియణిమాదిసిద్ధులచే
జగముల నేచుట యది పదవియా? రాగలోభయుతయజ్ఞాదులచే
భోగము లబ్బుట యది పదవియా! త్యాగరాజనుతుడౌ శ్రీరాముని
తత్వము తెలియనిది యొకపదవియా?

1. ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతః,
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరః సదా.

2. భక్తిక్రీతో జనార్దనః.

3. భక్తిహీననరజన్మము భూభారము. సద్భక్తి చేకూరవలెనంటే పురుషకార ముండవలెను. "కామాదుల తెగకోసి, పామరత్వ మెడబాసి నేమముతో భగవంతుని పూజించవలెను." ఇందు మొదటిదానిని ఇంద్రియనిగ్రహమంటారు, అది యలవడుటకు భగవత్కృప కావలెను—

"ఎంత నేర్చిన, నెంతజూచిన నెంతవారలైన కాంత (కనలేక) దాసులే (ఎంత)
సంతతంబు శ్రీకాంతస్వాంతసిద్ధాంతమైన మార్గచింత లేనివా (రెంత)
పరహింస పరభామాన్యధన పరమానవాపవాద
పరజీవనాదుల కనృతమే భాషించెదరయ్య త్యాగరాజనుత." (ఎంత)

భక్తినిష్ఠ చేకూరగానే ఏకాంతభక్తితో కాలముగడుపవలెను. దీనికి మేలైన ఉపాయం సత్సంగం-"సత్సంగత్వే నిస్సంగత్వం నిస్సంగత్వే నిర్మోహత్వం, నిర్మోహత్వే నిశ్చలచిత్తం, నిశ్చలచిత్తే జీవన్ముక్తిః" అని శ్రీశంకరాచార్యులబోధ. భక్తకోటిలో రెండు తెగలు —సద్భక్తులు, భక్తవేషధారులు—సద్భక్తులను త్యాగరా జెట్లు వర్ణించినాడో పరికించండి.

"భక్తునిచారిత్రము వినవే మనసా! సీతారామ (భక్తు)
సక్తిలేక తాగోరుచు జీవన్ముక్తుడై యానందమునొందు (భక్తు)
జపతపములు తాజేసితి ననరాదు, అదిగాక
మఱి కపటాత్ముడు మనమై బల్కరాదు;
ఉపమ తనకు లేకయుండవలెనని ఊరూర తిరుగరాదు
చపలచిత్తుడై, యాలుసుతులపై సారెకు భ్రమకారాదను హరి (భక్తు)
భవవిభవము నిజమని యెంచరాదు, అదిగాక
మఱి శివమాధవ భేదము చేయగరాదు;
భువనమందుతానే యోగ్యుడని బొంకి పొట్టసాకగరాదు;
పవనాత్మజధృతమౌ సీతాపతిపాదములను యేమరరాదను హరి (భక్తు)
రాజసతామసగుణములు గారాదు, అదిగాకను
అవ్యాజమునను రాలేదన, గారాదు;
రాజయోగమార్గము నీచిత్తము రాజూచుట, విడువగరాదు,
రాజశిఖామణియైన త్యాగరాజ సఖుని మరవరాదను హరి (భక్తు)

## త్యాగరాజప్రశస్తి.

భగవదారాధనకన్న భాగవతారాధన గొప్పది. భక్తుడు భగవంతుని అనంతకళ్యాణ గుణగణమును లోకానికిదెల్పి అందరినీ తరింపజేయును. ఏకాంతమున భగవంతు నారాధించడమును 'దేవతార్చన' అంటాము, అదే బహిరంగముగా పదిమంది చేస్తే దాన్ని "భజన" అంటాము. ఈవిషయమున రెండుకృతులు పరిశీలించండి.—

1. చేతులార శృంగారముచేసి చూతును......

2. పరిపాలయ పరిపాలయ పరిపాలయ రఘునాథా.

కర్మజాలమున జిక్కి భవసాగరమందు మునిగి,పరమాత్మనుండి వేరై, విరహం సహించ నేరక, భవభయబాధల బాపుమని దైవమును భక్తుడు వేడుకొనును ఇందు భక్తి ప్రధానం సంగీతజ్ఞానంకూడా యుండవలెను. సద్భక్తితోగూడిన భజనను "నాదోపాసన" అంటారు. నాదము భగవంతుని దేహమనీ నాదసుధారసం రాముడై అవతరించెనని త్యాగరాజు భావించెను. నాదమునకు ఓంకారము పుట్టినిల్లు-"ఓమిత్యేకాక్షరం బ్రహ్మ" ఓంకారమునుండి సప్తస్వరములు వెలువడినవి, కావున సంగీతం మేళవించకుంటే భజన సద్భక్తి చేకూర్పదు. ఈక్రిందికృతులు పరికించండి.—

1. "నాదతను మనిశం శంకరం నమామి మే మనసా శిరసా,
మోదకరనిగమోత్తమ సామవేదసారం వారం వారం॥ (నాద)
సద్యోజాతాది పంచవక్త్రజ సరిగమపధని వరసప్తస్వర
విద్యాలోలం విదళితకాలం విమలహృదయత్యాగరాజపాలం" (నాద)

2. "నాద సుధారసం బిలను నరా(రామ)కృతియాయె మనసా,
వేదపురాణాగమశాస్త్రాదుల కాధారమౌ (నాద)
స్వరములారు నొకటిఘంటలు, వరరాగము కోదండము,
దురనయదేశ్యము త్రిగుణము, నిరతగతిశరమురా,
సరససంగతి సందర్భముగలగిరములురా,
ధరభజనభాగ్యమురా త్యాగరాజుసేవించు." (నాద)

3. "నాదోపాసనచే శంకర నారాయణవిధులు వెలసిరి-ఓమానస
వేదోద్ధరులు, వేదాతీతులు విశ్వమెల్ల నిండియుండెడివారలు (నాదో)
మంత్రాత్ములు, యంత్రతంత్రాత్ములు, మంత్రము లన్నిగలవారలు
తంత్రీలయస్వరరాగవిలోలురు,త్యాగరాజవంద్యులు, స్వతంత్రులు. (నాదో)

ఇక సంగీత ప్రశంస—

త్రివర్గఫలదాస్సర్వే దానయజ్ఞజపాదయః,
ఏకం సంగీతవిజ్ఞానం చతుర్వర్గఫలప్రదం.
సంగీతశాస్త్రజ్ఞానం సారూప్య (మోక్ష) సౌఖ్యదమని

త్యాగయ్యగారి అభిప్రాయము; వినండి—

"సంగీతశాస్త్రజ్ఞానము సారూప్యసౌఖ్యదమే మనసా
శృంగారరసాద్యఖిలసార పూరితరామకథానందాదియుత (సంగీ)
ప్రేమమీర సుగుణవాత్సల్యము శ్రీమద్రమావరకటాక్షము
నేమనిష్ఠయశోధనము గల్గునే నేర్పుగల్గుత్యాగరాజునేర్చిన. (సంగీ)

సంగీతజ్ఞానముతోగూడిన భక్తి సన్మార్గమున చేర్చును ఇట్టి జ్ఞానము ధాతవ్రాయవలెను. ఇది యాగయోగత్యాగభోగఫల మొసంగును. స్వరరాగసుధారసభక్తి స్వర్గాపవర్గము. సహజభక్తికి రాగజ్ఞానము జతసేయువాడు ముక్తుడు", పైని ఉల్లేఖించినవాక్యాలు త్యాగరాజకృతులలోనివే.

భక్తి, భజన ఫలప్రదములు కావలెనంటే మనస్సు నిర్మలముగాను నిశ్చలముగానుండవలెను; ఇంద్రియనిగ్రహశక్తి లేకున్న చిత్తమునకు శుచి లభించదు. చిత్తమాలిన్యానికి అహంకారమమకారములు కారణము. ఇంద్రియనిగ్రహశక్తిని సాధించినవాడు స్వాధీనమనస్కుడౌను—ఇట్టివానిని త్యాగరా జెట్లు వర్ణించెనో చూడండి—

"మనసు స్వాధీనమైన యాఘనునికి మఱిమంత్రతంత్రములేలా?
తనువు తానుకాదని యెంచువానికి తపసుజేయనేల? దశరథబాల (మన)
అన్ని నీవనుచు యెంచినవానికి ఆశ్రమభేదములేల?
కన్నుగట్టుమాయలని యెంచువానికి కాంతలభ్రమలేల? దశరథబాల (మన)
ఆజన్మము దుర్విషయరహితునికి గతాగత మికనేల?
రాజరాజేశ నిరంజన నిరుపమ రాజవదన త్యాగరాజవినుత (మన)

దీనినిబట్టి మోక్షసాధనకు ఇంద్రియనిగ్రహం మొదటి మెట్టు. ఇట్టి నిగ్రహం సత్సంగంవల్ల లభిస్తుంది. నిగ్రహంవల్ల నిర్మలత నిశ్చలత మనస్సుకు చేకూరును, అంతట భక్తుడు ఇహాముత్రఫలభోగవిరాగియై, నిష్కామ్యకర్మ'యం దాసక్తి (సాత్వికభక్తి) కలవాడగును. ఈనిచ్చెన నెక్కుటకు భగవత్కటాక్ష మవసరము. దివ్యులసందర్శనంచేత త్యాగరాజీశక్తుల నార్జించగల్గెను. అతని మానసబోధ వినండి—

"మనసా ఎటులోర్తునే? నామనవిని చేకొనవే
దినకరకులభూషణు(రాము)ని దీనుడవై భజనచేసి
దినము గడుపుచుండుమనిన వినవదేల? గుణవిహీన (మన)
కలిలో రాజసతామసగుణములు గలవారిచెలిమి
కలసి మెలసి తిరుగుచు మరికాలము గడపకయే,
సులభముగా గడతేరను సూచనములను తెలియజేయు
ఇలను త్యాగరాజుమాట వినవదేల గుణవిహీన (మన)

ఇంకొక్కకృతిని పరీక్షించి యీవిమర్శ సంక్షేపిస్తాను.

మోక్షముసాధించవలెనని ఇంద్రియనిగ్రహశక్తి నార్జించి, అనన్యాసక్తితో శ్రీరాముని సదా అర్చిస్తూ సద్భక్తుడైనా, పరమేశ్వరుడు తనకోర్కెలీడేర్చలేదని ఆత్రపడి శ్రీరాముని ఛలోక్తితో త్యాగయ్య వ్యాజనింద నొనర్చెను.—

"అడిగి సుఖము లెవ్వ రనుభవించిరిరా? ఆదిమూలమా రామా (నిన్నడిగి)
సడలని పాపతిమిరకోటిసూర్య, సార్వభౌమ, సారసాక్ష, సద్గుణ (నిన్నడిగి)
ఆశ్రయించి వరమడిగిన సీత అడవికి పోనాయె
ఆశరహరణ, రక్కసి యిష్టమడిగిన అపుడె ముక్కుపోయె ఓరామా (నన్నిడి)
వాసిగ నారదమౌని వరమడుగ వనితారూపుడాయె
ఆసించి దుర్వాసుఁ డన్నమడుగ నపుడె మందమాయె (నిన్నడిగి)
సుతునివేడుకజూడ దేవకి యడుగ యశోద చూడనాయె
సతులెల్ల రతిభిక్షం బడుగ వారివారిపతుల వీడనాయె ఓరామా (నిన్నడిగి)
నీకే దయపుట్టి ప్రోతువో ప్రోవవో నీగుట్టుబయలాయె
సాకేతధామ శ్రీ త్యాగరాజనుతస్వామి ఇదేటిమాయ. (నిన్నడిగి)

## ఉ ప దే శ సా ర ము

కాంతాకనకముల గాంచి అంటనిమనసుతో విషయతటాకమున మునుగక దృఢమనస్సై తప్పి బ్రతికిపోవతరమా?

భగవంతు నారాధించినవారికి మోక్షము లభిస్తుంది, భాగవతులు పరాత్పరునే కరగతం చేసుకొందురు; భగవంతుడు భాగవతులకు దాసుడు, అతనివల్ల కానిపని భాగ

వతులు చేయగలరు, కావున భాగవతుల ఆరాధన గొప్పది; వీరిని పోషించడం గృహస్థులకు విధి, నిందించడం మహాపాపం, కావుననే

"మద్భక్తం శ్వపచం వాపి నిందాం కుర్వంతి యే జనాః
కల్పకోటి శతేనాపి నక్షమామి కదాచన."

అని భగవంతుడు చేసిన హెచ్చరిక.

భగవన్నామమహిమ తెలుసుకోవడ మవసరం—

1. 'రా'శబ్దోచ్చారణాదేవ ముఖాన్నిర్యాంతి పాతకాః,
పునః ప్రవేశభీత్యా చ "మ" కారస్తన్నిరోధకః.

2. శ్రీరామరామ యనుచును, యేమానవుడైనగాని యేర్పడ మదిలో
నారాము గొల్చుచుండును, కారాకులు దుల్లినట్లు కర్మము దుల్లున్.

2. హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః,
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః.

దీనినిబట్టి రామనామస్మరణగాని హరినామస్మరణగాని పాపహరమే. కనుకనే శ్రీచైతన్య స్వామి నామస్మరణరూపము నిట్లు శాసించెను—

హరేరామ, హరేరామ, రామరామ, హరేహరే,
హరేకృష్ణ, హరేకృష్ణ, కృష్ణకృష్ణ, హరేహరే.
రామస్మరణాదన్యోపాయం న హి పశ్యామో భవతరణే.

భక్తులు అనన్యచింతతో నిష్కామముగా భగవంతుని సంతతము స్మరించగలరు, సాధారణ సంసారులమాట ఏమి? అన్న ప్రశ్నకు త్యాగరాజిచ్చిన జవాబు వినండి—

"సంసారులైన నేమయ్యా శిఖిపింఛావతంసు డెదుట నుండగ?
హింసాదు లెల్ల రోసి, హంసాదుల గూడి
ప్రశంసచేయుచు నేప్రొద్దు కంసారిని నమ్మువారు (సంసా)
జ్ఞానవైరాగ్యములు హీనమైనట్టి భవకాననమున దిరుగుమానవుడు
సదాధ్యానయోగయుతుడై నీనామము బల్కుచు నానాకర్మఫలము
(భగవంతునికి) దానముచేయువారు (సంసా)
ఏష మే సర్వధర్మాణాం ధర్మోఽధికతమో మతం,
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్నరస్సదా.

ఎట్టివారైనా సదాచారసంపన్నులై ఏకాంతభక్తితో భగవన్నామస్మరణ చేస్తూంటారో అట్టివారికి భక్తి భవతారకమవుతుంది—

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ,
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః.

అని భగవంతుడే ధైర్యముచెప్పినాడు; కావున ఎట్టివారైనా నిరాశోపహతులు కానవసరంలేదు.

భగవంతుడు తప్ప ఇతరజీవులందరికీ కర్మబంధమున్నది. కర్మ త్రిగుణా (సత్వ, రజ, స్తమా)త్మక మాయాకల్పితము; ఈమాయను మాపుకోవాలంటే పరాత్పరునికటాక్షం సంపాదించాలి.

"మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతి తే" అని భగవద్వాక్యం. ప్రపత్తిమార్గ మవలంబిస్తే మాయను దాటవచ్చును, అంతతో కర్మ నశిస్తుంది. ధన్యు డెట్టివాడో త్యాగరాజు వర్ణించినకృతి వినండి.—

"అతడే ధన్యుడురా
సతయాన సుతధృతమైన సీతాపతిపాదయుగమును సతతము స్మరియించు (నతడే)
వెనుకదీయక తనమనసు రంజిల్లగ ఘనమైన నామకీర్తన పరుడైనట్టి (యతడే)
సాయకు సుజనులబాయక తాను నుపాయమునను ప్రొద్దు హాయిగ గడపు (నతడే)
కరివరదునితత్వ మెరిగించి అరిషడ్వర్గమునందు పరవలేక తిరుగు (నతడే)
ఆర్తిని మఱియు ప్రవర్తిని తొలగించి కీర్తిగలిగిన రామమూర్తిని నెరనమ్ము (నతడే)
అందముగా నామ మందఱుజేసిన సుందరరామునియందు లక్ష్యముపెట్టు (నతడే)
రాజసజనులతో తాజతగూడక రాజిల్లు శ్రీత్యాగరాజనుతుని నమ్ము (నతడే)

రామబ్రహ్మానందము వదలి ఇతరభోగానందము నాశించువారు అగ్నిసాక్షిగ పెళ్లియాడిన భర్తను విడిచి విటునిజేరు స్త్రీలవంటివారు. ఇదొక వ్యామోహజనిత అవిమృశ్యకారిత; వ్యామోహము నశించినవెంటనే పశ్చాత్తాపము జనించును.

పరమేశ్వరుని విడిచి యితరదైవములనుగాని, మానవులనుగాని సేవించినవారికి మోక్షము ప్రాప్తించదు—ఈవిషయమునుగూర్చి

1 నిధి చాలసుఖమా, రాముని సన్నిధి సేవ సుఖమా

2 దుడుకుగల నన్నే దొరకొడుకు బ్రోచురా?

అనే కృతులు పరిశీలించండి—

పైని వివరించిన బోధన త్యాగరాజుగారి అనుభూతినుండి స్థాపించినదే కాని ఏధర్మ శాస్త్రమునుండియో ఎత్తివ్రాసినది కాదు. ఉత్కృష్టధర్మములు, సద్బోధన మొదలైన వాటితో నిండియున్న ఈకృతిసంచయమును కొందఱు "త్యాగబ్రహ్మోపనిష" దన్నారు. కలికాలములో ధర్మగ్లాని ప్రబలియున్నదినములలో ఎనుబదివత్సరములు జీవయాత్ర సల్పి, లోకానికి ఉత్కృష్టధర్మసూత్రములు, చారుచర్యయు నుపదేశించిన మహాత్ముని కృతయుగమునాటి మంత్రద్రష్టలగు మహాఋషులతో పోల్చుట యొప్పు, కావుననే త్యాగరాజస్వామిని వాల్మీకమహర్షి యవతారమని యందురు.



దివాన్‌బహదర్ కె. సుందరంశెట్టిగారు, రిటైర్డు హైకోర్టుజడ్జి, సేలం:—

వాఙ్మయ వికాసములకై శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుచేసిన అఖండసేవకు వారిని అభినందించుభాగ్యము కలిగినందులకు సంతోషించుచున్నాను. దొరకని ప్రాచీనమైనవిజ్ఞానసంచయములగు సంస్కృతకావ్యరత్నములను తెనుగు వాఙ్మయగ్రంథములను ప్రకటించియు పత్రికలను ప్రచురించియు వీరు ప్రసిద్ధులైనారు. ప్రజానురంజనము వడసినారు. జనుల విస్తారకృతజ్ఞతకు పాత్రులైనారు సుప్రసిద్ధులైన తండ్రివైచినట్టిపునాదులమీద వీరు దివ్యహర్మ్యనిర్మాణమొనర్పగలిగినారు. అందుచేత వీరిసేవకు ప్రజామోదప్రజాశీర్వాదములు ప్రకటితమగుట మిక్కిలి ఉచితము.

# నన్నెచోడుఁడు—తత్కాలప్రవృత్తి

శ్రీ గ. శ్రీ. న. ఆచార్య, యమ్. ఏ., టీచర్సుకాలేజీ, సైదాపేట, మదరాసు.

కవిరాజశిఖామణి నన్నెచోడుఁడు ఒరయూరి కధిపతి. తాను రాజు కావుటచే ఆకాలపురాజధర్మములను కొన్నిటిని తనగ్రంథమున వర్ణించి యున్నాఁడు. అందు కొన్ని:—

1. ఏలినవాఁడు భటుని శత్రురాజ్యాక్రమణార్థముగాని శత్రుసంహారార్థముగాని పంచునపుడు అతఁ డంగీకరించి ఏలినవాని కడనుండి తాంబూలాదులు కొని వెళ్లవలయును.[1]

2. చతురమతియైన విప్రుని రాయబారిగా పంపవలె. అతఁడు కులబ్రాహ్మణుఁడును, ప్రధానుఁడును అయియుండును.[2]

3. యుద్ధభటులకు జీతముక్రింద జొన్న లిచ్చెడివారు.[3]

తక్కిన భటులకు ధనము వాకిట కుప్పవోసి యిచ్చెడివారు.[4]

4. యుద్ధప్రయాణవేళ శూరు లర్థులకు దానము లిచ్చి బయలుదేరుట.[5]

---

1. ఇంద్రుఁడు మన్మథుని శివునిమీదికి పంపునపుడు "వ" నాఖందగిన కెలనంబు గంటె. దీని కింతకు మైకొంటె. తాంబూలమ్ము దయసేయుము.

2. దేవతలు బృహస్పతి మనుమఁడైన సుమతిని తారకాసురునొద్దకు రాయబారిగా పంపుచున్నము.

క. పతిహితు కులవిప్రోత్తము,చతురు సదాశుద్ధు కార్యసంవేది, పరేం
గితవిదు, ధైర్యాన్వితు నిర్గతమతియుతు, రాయబారిగా పంపనగున్. (488 ప)

క. ఏనమరదూత......ప్రధానుం డెందున్ (496 ప)

3. వీరావేశములో నొకభటుఁ డనుమాటలు.

చ. మునుమిడి వైరివాహినులు మట్టిపడ ల్వడవేసినట్టి కై
వున పయికెత్తువాహతుల పొంకమఱక తలఁకొంత కోసి ము
న్గొని వడివారుకందలను గోవుల సూరలు దోలి మార్చు పే
ర్చున బరికెల్లి గాల్లలన జొన్నలు గొన్నబుణంబు నీగుదున్.

4. మన్మథవసంతులు శివునితపోవనము ప్రవేశించునపుడు ఆవనములు వికసించుట.

క. భావజవిభుండు శుకపిక,సేవకతతికడరు దీర జీతము సేయం
గా వెలిబోసిన పసిడుల,ప్రోవులునా కమ్మ లెలమి పూచె వెడంగై.

5. చ. బలువడి దాకి వైరిజనపాలురకండలు కోసి పేర్చుతో
తలరక భూతకోటికిని తన్పుదు మెప్మెయి నాజి నంచు దో

5. ఇతనికాలమున శైవమతస్థులలో ఆహారనియమములలో కొన్నినియమము లున్నట్లు తెలియును. పరమార్థము సాధింప దలచినవాఁడు సరసాహారము భుజింపరాదని ఒకవాదమున్నట్లును, భుజించినను అది సాధ్యమే యని ఇతని ఆశయమయినట్లును ఈగ్రంథమువల్ల తెలియుచున్నది. సరసాహారములు రాగహేతువు లగుటచే పరిహార్యములని మొదటివారివాదము. మనస్సే ప్రధానము అనువాదమునకు చేరినవాఁడు నన్నెచోడుఁడు.[6]

హాలమతు లిచ్చి రు త్తమభటావలి కుంకుమకింకరాతపో
జ్జ్వలశిఖాబంధుజీవసమవర్ణ సువర్ణము లర్థికోటికిన్.

6 మ. సరసాహారము రాగహేతువను టజ్ఞానంబు పారావతో
త్కరముల్ చిక్కని రాలు మ్రింగుచుఁ సదా కామార్తులై యుండు కే
సరి సాంద్రామృతభుక్తియైనను సకృత్ సంభోగమందుక్ మనో
హరవిజ్ఞానముకాక రాగరసమందాహారనిర్వృత్తియే?"

---

గా॥ బి. సోమయ్యగారు, హైకోర్టుజడ్జి, లాయిడ్సురోడ్, రాయపేట, మద్రాసు:—

నాకు శ్రీ వావిళ్లవేంకటేశ్వరశాస్త్రులవారు 30 ఏండ్లుగా పరిచితులు. వీరి తండ్రి శ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రులవారు సంస్కృతము, తెనుగులలో అఖండ పండితులు. అంతేకాదు, వారు వైరాగ్యధనులగుమహాత్మ. వాఙ్మయపోషకులు. సంస్కృతమున ఒకలోకోక్తి కలదు. తండ్రి పుత్రునిచే పరాజితుఁడుకావలెనని కోరుకొనునట! శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు తండ్రిని మరపించి వాఙ్మయసేవచేయుచుండుట అభినందింపతగినవిషయము. వావిళ్లగ్రంథములులేని ఇల్లు ఆంధ్రదేశమున లేదు. వీరు గ్రంథములు ఉత్తమరీతిగ పండితులకేకాక సామాన్యజనులకు, పురుషులకు, స్త్రీలకు, పిల్లలకు, వాఙ్మయాభిమానులకు, వైద్యులకు తుదకు మంత్రవేత్తలకు అందఱికిని పనికివచ్చునట్లు ప్రకటించుచున్నారు. వీరి అసమానసేవ ఆంధ్రులకేగాక, సర్వభారతావనికిని చెందినది. త్రిలిఙ్గ 25 ఏండ్లుగా నిజమైన కొరవతీర్చి పనిచేసినది. దానికిని దానిసంపాదకులకును విజయంబగుగాక! వీరు తెలుగుదేశముసేవ ఇంకను ఒనర్తురుగాక!

# యతినియతి.

శ్రీ విద్వాన్ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు, నెల్లూరు.

అప్పకవీయములో 'యతినియతి' అనుశీర్షికక్రింద ఈపద్యము లున్నవి.

క. 'ఏకపదంబున విరతు ల,నేకంబులు గలిగియుండునేని పదాదిం
జేకొన్న లిపిరె యన్నిటఁ, బ్రాకటముగ నిలుచు సీసపదములఁ దక్కన్.

ఆ. ఒక్కపదములోనఁ బెక్కువిశ్రమములు, జఱుగుచోట మొదల జడ్డలున్న
నడుగు వెడలుదనుక నందొక్కటియెకాని,యుండ దొకట నదియు నొకట నిదియు.

జయభద్రరగడ.—

క్ష్మాపుత్రికాలోలకమనీయగుణజాల, ఘననీల యని చెప్పఁగా బహువిరతు లొప్పు;
క్ష్మాపాలకలలామకంధిగర్వవిరామ, సంగ్రామభీమ యనఁమహిని రెంటికిఁ దప్పు.

తే. ఒంటియడుగున బహుయతు లుండునపుడు, నడుమ నొకదాన జమిలివర్ణంబు గదియ
నందుఁ జరణాదికి సవర్ణమయ్యె నెద్ది, దానికయ నిల్చు విరతి ముందరను గృతుల.

విజయమంగళరగడ.—

వైరిమదతమఃపతంగ । స్వజనపోషితాంతరంగ
వ్రజవధూభుజంగ యనఁగ । వలయుఁ బెక్కువడులయెడల
దారితక్షమాకుమార । ద్వారకాపురీవిహార
వ్యాససన్నుతప్రచార । యనఁగఁ దప్పుఁ గడకువెడల.

ఆముక్తమాల్యదలో, సంజీవనీకర్తలు 'ఏకపదంబున' అనుపద్యము నుదాహరించి, పదోక్తలక్షణమునకు భిన్నముగా నున్నవన్న హేతువున, మూడుస్రగ్ధరలలో-నాలుగు తావులలో, (వావిళ్లవారిప్రతిలోనున్న) ప్రాతయతులను తొలఁగించి క్రొత్తయతులను ప్రవేశపెట్టినారు. పరిశీలించి చూడఁగా, ఆదిద్దుబాటుసరియైనది కాదని నాకుఁ దోఁచినది. నాపరిశీలన మొప్పో తప్పో పండితులు నిర్ణయింతురుగాక యని, ప్రాచీనపాఠమును దిద్దుబాటును నాయూహకుఁగల యుపపత్తులను, వివరించుచున్నాను.

1. "ఈరెం-డును దీనుల్గాంచు నమ్మా
డువులనె యడుగం
దోఁచు-" (1-58.)

ఇందు 2-3 స్థానములలోని 'దు-ందో' లకు మైత్రి లేదుగనుక తప్పని యీ క్రిందివిధముగా దిద్దినారు.

'ఈ రెం-డును దీను ల్గాంచు నోష్ఠ
స్కుపోలనె'.—

(లేక)

'దువ్వులనె యదుగం
'డోఁగు'.—

2. "చరదృష్టిఁ వైరిపక్షే
క్షణము సచివము
ఖ్య".— (4-28.)

ఇందు, 1-3, 'చ-ఖ' లకు చెలిమి చెల్లదుకావున దోషమని
'క్షణము సచివ 'ష
ష్ఠ'.—

అని మార్చినారు.

3. "ప్లవమానోత్పాతభూత
ప్రకరపటిమహా
లాహల".— (7-11.)

ఇందు, తొలుత గ్రహింపబడినవర్ణము పకారము కావున దానితో తుది యతిద్దైన లకారమునకు మైత్రి లేదు. అందువలన దోషమని యిట్లు సవరించినారు.

'ప్లవమానోత్పాతభూత
గ్లపన'.

4. "ప్లవబృందంబుల్ వనిఁ న
ల్గడఁ బోడు పొడుమఁ
పల్కులఁ." — (7-11.)

ఇందులో, 2-3 'ల్గ-ప' లకు మైత్రి కుదురదని,
'ప్లవబృందంబుల్ వనిఁ, బ
ల్వడి'—

అని సవరించినారు.

ఇచ్చట

అప్పకవీయపు 'యతినియతి' రగడలనుగూర్చినదిగాని, స్రగ్ధరలను గూర్చినదికాదు. కావుననే, ఆతఁడానియతికి రగడలనే యుదాహరించినాఁడు. అప్పకవికి పూర్వుఁడయిన అనంతుఁడును, 'సంయుక్తయతి' నిగూర్చి చెప్పుచోట,—

క. 'ఒక్కఁడుగున విశ్రాంతులు, పెక్కగుచో సంయుతములు పెనుపకమును జ
డ్డక్కరమునఁ దానెత్తిన, యక్కరమే యనుపవలయు నన్నిటఁ గృష్ణా.

క. వడి నెలవులలోఁ జేరువ, యెడ నొకసంయుతము నొలయెడ నొకటినిఁ దా
నిడి రేని కవులు తప్పట, (?) యొడఁబడదు పృథగ్యతిప్రయోగముల హరీ.'

అని లక్షణముచెప్పి, అందుకుదాహరణగా,

"క్ష్మావలయమంతయు విశేషాణమున నెత్తుకిటి
మహిమ దలపోయ నక్కజమనుచు నిట్లనక;
క్ష్మావలయ మంతయు విశేషాణమున నెత్తు కిట
సత్త్వమరుదన నొప్పుసంయుక్తయతి చెడక.

అని 'ద్విరదగతిరగడ' ను, 'మఱియొకవిధంబగురగడ'ను చూపినాఁడు. అంతేగాని స్రగ్ధరలను చూపలేదు.

కాఁబట్టి, అప్పకవి 'యతినియతి'యు, అనంతుని 'సంయుక్తయతి'యు రగడలను గురించినవేకాని, స్రగ్ధరలను గురించినవి కావనుట నిజము. తాతంభట్టుమాత్రము (సులక్షణసారములో) 'స్రగ్ధరలలో సంయుక్తయతినివాడరా' దని వ్రాసినాఁడు. కాని, ఆవ్రాత యంతగా నాదరణీయముకాదు. ఎందువల్లననఁగా, ప్రాచీనకావ్యములలో పెక్కుతావులలో స్రగ్ధరావృత్తములలో 'సంయుక్తయతి' వాడి యున్నది. మఱియు, 'స్రగ్ధరాయతులు మూఁడును పరస్పరము మైత్రి నెనసియుండనక్కఱలేదు. ఆమూటిలో నే రెండు మైత్రిని కలిగి యున్నను చాలు' ననుటకును ప్రాచీనులరచనలలో ప్రమాణము లున్నవి. కొన్నియుదాహరణలు.

1. "స—స్నానాధీనుండుగా వై
ష్ణవసుఖదుఁడుగా
మత్కృపా" (పాండు. 2-185.)

ఇందు, తొలియక్షరము 'స్నా' కావున, రెండవచోట నకారమునకును, మూడవచోట మకారమునకును యతి చెల్లింపఁబడినది.

(2-3, 'ష్ణ-మ' లకు మైత్రి లేదు.)

2. "క్షామాత్మ స్వామిధామ
క్రమణ కృశవపు
ర్ష ప్రవిశ్రాణితాతి"-(కళా. 7. 177.)

ఇందులో, తొలి 'క్షా' లోని కకారమునకును-షకారమునకును 2-3 స్థానములలో యతులు కూర్పఁబడినవి. (1-3, 'క-ష' లకు మాత్రము మైత్రి చెల్లదు)

3. "బాలవృద్ధా†ర్తస్త్రీశేషంబుగా నం
దఱుఁ బొలిసినవె
న్కఁ జయంబేల నాకున్." (భాస్క. యుద్ధ. 884)

ఇందు, తొలుత (1-2) తకార దకారములకును, పిమ్మట (2-3) బిందుపూర్వక దకార నకారములకును మైత్రి చెల్లింపఁబడినది (అంతేగాని, 1-3, 'ర్త,' 'న్క'లకు మైత్రి చెల్లనే చెల్లదు.)

4. "క్షితిఁ గూల్చెఁ గోటిసంఖ్యల్
గెడయఁ గరివరా
శీతి సాహస్రసంఖ్యల్" (ఉ. హరి. 6. 135)

ఇందును మొదటి 'క్షి' కారములోని కకార షకారములకు వరుసగా 2-3 యతులు చెల్లింపఁబడినవి. (కాని, 2-3, 'గె-శీ' లకు మైత్రి పొసఁగదు.)

ఇట్లు ప్రామాణికప్రయోగములు కనఁబడుచుండఁగా వావిళ్లవారి 'ఆముక్త' ప్రతిలోనియతులు దుష్టములగుట యెట్లు? దిద్దవలసిన అక్కఱయేమి?

ఇంతకును మన మీ ప్రాచీనప్రయోగములనుబట్టి 'ఆముక్త' యతులు సాధువులను కొనవలెనా? లేక ఆవ్యాఖ్యాలదిద్దుబాటునే హద్దుగాపెట్టుకొని ప్రాచీనరచనలలోని యతులును దుష్టములే యనుకొనవలెనా? పూర్వగ్రంథములను సరిగా పరిశీలింపక అప్పకవి తప్పుగా శాసనముచేసెనా? లేక, అప్పకవి పద్యము నర్థముచేసికొనుటలో వ్యాఖ్యాతలు పొరపడినారా?

అప్పకవిపద్యము స్రగ్ధరలనుగురించినదికాదు, సరే; ఒకవేళ అప్పకవి యట్టిశాసనము చేసియేయుండుఁగాక; అంతమాత్రమున నాతనిమాటనుబట్టి, ఆముక్తమాల్యదను సవరింపవలసినదేనా? 'ఆముక్త' కెన్నోతరాలివతలివాఁడైన అప్పన్న శాసనము-ఆముక్త

† ఈపాఠము వావిళ్లవారి ప్రతిలో 'బాలవృద్ధానతస్త్రీ'గా మార్పఁబడియున్నది. (విచార్యము.)

మాల్యదమీఁద చెలామణియగునా? అప్పకవీయమునుబట్టి ఆముక్తమాల్యదను, చిన్నయ్యసూరిని బట్టి నన్నయ్యభట్టును సవరించుట సరియైన సంస్కరణమగునా? అది యట్లుండఁగా, 'ఆముక్త' కవి, ఒకటికినాలుగుతావుల పాటించినయతివిధాన మాతని మతమగునుగాని ప్రమాదముకాదుగదా! మఱి కవి బుద్ధిపూర్వకముగాఁ గావించినరచనను మార్చివేయుటకు మఱియొకరి కధికార మెక్కడిది?

ఇంకొకమాట.—అప్పకవిమతమున, కవిరాజవిరాజితమునకు యతులు మూఁడు. ('ద్విరదాచలశైలములై త్రివిరామము లంది నిరర్గళకవిరాజవిరాజితవృత్తము...వ్రాలు'-అప్ప.) ఆముక్తమాల్యదలో,—"జయజయదానవదారణకారణ-శార్ఙ్గరథాంగగదాసిధరా" అని, ఒక్కయతితోనే యున్నది. అప్పకవివ్రాతనే ప్రమాణముగాఁ గొని ప్రగ్రంథాయతులను దిద్దినపెద్దలు, ఆకవిరాజవిరాజితపుయతుల జోలికి పోకుండుటకు కారణమేమో!

పూర్వోత్తరములను పరిశీలింపక, పూర్వకావ్యములను సాహసించి సవరించుట సరియైన భాషారాధనముకాదని నామనవి. పెద్దలేమందురో!



సర్: మహమ్మద్ ఉస్మాన్‌గారు, K. C. I. E., B. A., మదరాసు యూనివర్సిటీ ఉపాధ్యక్షులు, తేనాంపేట, మదరాసు:—

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు దక్షిణఇండియాలో పత్రికాప్రచారమునను తెలుగువాఙ్మయ ప్రకటనమునను అమూల్యసేవ చేసినవారు. వీరిసేవను కొనియాడుటకై ఉత్సవసంపుటి యొకటి వీరికి సమర్పింపనున్నట్లు తెలియుచున్నది. నేను శ్రీ శాస్త్రులవారిని అనేకసంవత్సరములుగ నెరుగుదును. సాంఘికరాజకీయ సమస్య లుద్భవించినప్పుడు వారు తొణకుబెణకులేకఇచ్చుచుండినఅభిప్రాయముల యెడల నాకు గౌరవము కలదు. వారికి ఆయురారోగ్యములను మంచిఅదృష్టమును కలుగుగాక యని కోరుచున్నాను.

# అభ్యనుజ్ఞ

## శ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, శతావధాని.

కాళిదాసు కుమారసంభవంలో పంచమస్సర్గలో "త్రియంబకం సంయమినం దదర్శ" అని ప్రయోగించి వున్నాఁడు కనుక సంస్కృతకవులే కాదు తెలుఁగుకవులే కాదు అందఱూ త్రియంబక (త్ర్యంబకశబ్దానికి పర్యాయంగా) శబ్దాన్ని నిరాఘాటంగా వాడుకోవడానికి అభ్యనుజ్ఞ యిచ్చినట్టయిందని నవకవులు తెలుసుకోవాలి. దీన్ని గుఱించి యీమధ్యనే "త్రియంబకశబ్దవిచార" మనేవ్యాసంలో (నాళం కృష్ణారావుగారికి యిచ్చేసంచికకు యిచ్చినదానిలో) విస్తరించడంచేత యిక్కడ చాలా సంకుచితంగా వ్రాయడ మైనది. కాళిదాసుకు ఆధారం- "త్రియంబకం యజామహే" అనే వైదికప్రయోగమున్నూ, తదనుసారంగా పుట్టిన స్కాందాదిపురాణస్థాలు—"త్రియంబకః పాతు తృతీయయామే" మొదలైనవిన్నీ. అవి ఆర్షాలుకదా? అవిలౌకికకవులకు అనుసరణీయా లవుతాయా! అనే శంకకు సమాధానంకూడా యితరత్ర యీఁబడింది—దీనితోపాటుగానే—'కృత్రిమపుత్రిక' శబ్దంకూడా చూచుకోండి, పుత్రికాశబ్దం ఆకారాంతస్త్రీలింగంగా వుండవలసివున్నా కాళిదాసు కుమారసంభవప్రథమ స్సర్గలో—'కృత్రిమపుత్రికైశ్చ'.అని ప్రయోగించడంచేత యీప్రయోగంకూడా "శంఖున పోసిన తీర్థం" వంటి దయింది. ఆశ్లోకంలో—"కృత్రిమపుత్రికాభిః" అన్నప్పటికీ కాళిదాసుకు క్షతి లేదు. లేకపోయినా 'పుత్రికైః' అని ప్రయోగించడాని క్కారణం లలితా మాహాత్మ్యంలో వుండే ప్రయోగమే, లలితోపాఖ్యానంలో నేను చూచి యాభైయేళ్లు కావచ్చింది. ప్రస్తుతం ఆగ్రంథం నాదగ్గిఱ లేక ఆశ్లోకం వుదాహరించలేదు. కావలసినవారు ఆగ్రంథంలో చూచుకోండి. క్షతి లేనప్పటికిన్నీ—

"శ్లో. పాంచాలికా పుత్రికా స్యా ద్వస్త్రదంతాదిభిః కృతా."

అని అమరనిఘంటు ఘోషిస్తూన్నప్పటికిన్నీ (అమరుఁడు కాళిదాసుకన్న నవీనుఁడనే కుక్షంలో మఱివొకకోశంలో యీశబ్దం వుండకపోదు) వీట్లనన్నిటినీ తోసి రాజని కాళిదాసు పుంలింగంగానో నపుంసకలింగంగానో ప్రయోగించడాని క్కారణం లలితోపాఖ్యానప్రయోగమే అని చెప్పక తప్పదు. నామవాచకాలు ఆర్షాలైనప్పటికీ ఆయాఋషు లేలా వాడివున్నారో ఆలా వాడడంలోనే స్వారస్యం వుంది గాని అన్యథాకరించడంలో స్వారస్యం లేదని కాళిదాసుతాత్పర్యం అయి వుంటుందని దీన్నిబట్టి మనం గ్రహించుకో

వలసి వుంటుంది. నామవాచకాలు దిద్ది వాడుకోవలసి వచ్చేయెడల—మారుతశబ్దాన్ని మారుదశబ్దంగా మార్చి వాడవలసి వుంటుందని ఆవ్యుత్పత్తికి (మాఁరుద=శోకింపకుము) సంబంధించిన యితిహాసంవల్ల స్పష్టపడుతుంది. ఆటబొమ్మల్ని చెప్పే కృత్రిమపుత్రికశబ్దం మాత్రమే హ్రస్వాంతంగా ప్రయోగించడం కాళిదాసుకుఁగాని వేఱొకమహాకవికిఁగాని అభిమతంగాని పుత్రీవాచకం గా వుండే పుత్రికాశబ్దవిషయంలో దీర్ఘాంతంగానే వుండడం యిష్టమని ఆయా ప్రయోగాలవల్లనే స్పష్టపడుతుంది. యీమధ్య భారతిలో వొకరు-"ముగ్ధిమాది ష్విమనిజ్ మృగ్యః" అనే ఆలంకారికవామనుని సూత్రాన్ని వుదాహరించి యేదో కొంత చర్చించి శ్రీనాథాదులగ్రంథాలనుంచి ప్రౌఢిమ, లోనైన ప్రయోగాలు కొన్ని యిమనిజంతాలు వుదాహరించి—

"ప్రౌఢియే కాని "ప్రౌఢిమ" సంస్కృతకావ్యములలోఁ బ్రచురప్రచారమునఁ గాన రాదు."

అంటూ వ్రాసి వూరుకున్నారు. ఆయీవ్యాసము వ్రాసినచౌదరిగారి పరిశీలనకున్నూ మహాకవిప్రయోగాలయందు వున్న గౌరవానికిన్నీ నాసంతోషాన్ని ప్రకటిస్తూ (చట్టన బుడబుడక్కల ప్రయోగాలంటూ అనడానికేం యెవరు పడితే వారనవచ్చునుగదా) "ప్రౌఢిమ"కు నేను సంస్కృతకావ్యాలలో చూచిన ప్రయోగాన్ని కూడా చూపుతూ వున్నాను.

శ్లో. ఇంధానే భవవీతిహోత్రనివహే కర్మౌఘచండానిల
ప్రౌఢిమ్నా బహులీకృతే. (మూకపంచశతి ,మందస్మిత స్తబకం. ౯౮)

యింకా నేను ఆయీప్రౌఢిమప్రయోగాన్ని సంస్కృతకవులకవిత్వంలోనే చూచి వున్నాను గాని ప్రస్తుతం జ్ఞప్తిలో వున్నది యిదిమాత్రమే అవడంచేత దీన్నే యిచ్చి చౌదరిగారి పరిశీలకత్వాన్ని మనఃపూర్వకంగా అభినందిస్తున్నాను. పూర్వసంస్కృత మహాకవులు వాడి వుండడంచేతనే చౌదరిగారుదాహరించిన శ్రీనాథ పింగళి కృష్ణరాయప్రభృతి మహాకవులు వాడిరనియు—"సంస్కృతముమాట యెటులైనను" అని సంశయింప నక్కఱ లేదనియు శ్రీచౌదరిగారిని హెచ్చరించుచు నిప్పటిబ్రాహ్మణవిమర్శకులలో నెందఱికన్ననో చౌదరిగారి విమర్శనాధోరణి యనేకవిధాల శ్లాఘనీయమని కూడా మనఃపూర్వకముగా అభినందిస్తూ న్నాను. నామరూపాలు గల యేమహాకవిగాని యేదేనా ప్రయోగిస్తే ఆఅపురూపప్రయోగం ఆమహాకవికి పూర్వమందువుండే యేమహాకవిగ్రంథంలోనో వుండితీరుతుందని మనం తెలుసు కోవాలి, కాని ఆయాప్రయోగాలు వెదకడంమాత్రం అందఱికీసాధ్యంకాదు. ఆయీపనిచేత

కాకే కొందఱు వృథాగా "ఆ ప్రయోగం లేదు ఈ ప్రయోగం లేదంటూ (పూరికే అనడం కాదు సప్రతిజ్ఞంగా కూడాను) పలికి లేనిపోనిచిక్కుల్లోఁబడి దానికోసం జీవితాన్నంతనూ ఖర్చుపెట్ట వలసినవారై కూడా కృతార్థులు కాకపోవడం తటస్థపడుతూ వుంటుంది. ('కలవు లేవని పెనఁగ శక్యంబె? భార, తాదులను లేని పదములు నవనిఁ గలవె?'- దేవీభాగవతము) చౌదరిగారువ్రాసే ధోరణి లేనిపోని ప్రతిజ్ఞలతో చేరింది కాదు. అందుచేత ఆయనకోసం యీవ్యాసంలో యిన్ని వాక్యాలు వ్రాయవలసి వచ్చింది. యీఅవాంతరపువ్రాతవల్ల తేలిన సారాంశం ఆలంకారిక వామనుఁడు పనికిరాదన్నప్పటికీ "ప్రౌఢిమ" మొదలైన ఇమనిజంతాలు మహాకవిప్రయోగ సిద్ధాలై "శంఖునఁ బోసిన తీర్థాలుగా పరిణమించడంచేత యిప్పటికవులందఱూ ప్రయోగించు కోవచ్చునని అభ్యనుజ్ఞ సంపాదించుకున్నట్టయిందనియ్యేనీ. సంస్కృతకవుల కవిత్వంలో— కోమలీ—అని స్త్రీవాచకంగా వున్నపదాన్ని యెక్కడా నేను చూడలేదు. సుమారు ౨౫ యేళ్ల నుంచి నేను ఆయీ లక్ష్యాలు వెదకే వుద్యోగంలో పని చేస్తూన్నాను. యిప్పటి కింకా జీతమూ బత్తెమూలేని యీనౌకరీనుండి తొలఁగింపఁబడనే లేదని పత్రికాపాఠకు లందఱూ యెఱిఁగిందే, యీమధ్యనే వొకరు నాయందు దయ పుట్టి యీవుద్యోగాన్నుంచి విరమించ వలసిందంటూ యెంతో గౌరవం కనపఱుస్తూ యెవరిపేరనో (నేరుగా నన్నువుద్దేశించలేదు) బహిరంగలేఖ వ్రాస్తూ సూచించారు. అది చూచి నేను 'బ్రతుకు జీవుఁడా' అని బ్రహ్మానంద పడ్డాను, కాని ఆయనసూచన బొత్తిగా ఆమోదించతగింది కాదనిన్నీ అవిచారమూలక మనిన్నీ, దానివెనువెంబడినే కొన్ని వాక్యాలు కనపడ్డాయి. అందుచేత మళ్లా యేదో కొంత వ్రాయవలసివస్తూవుంది. తత్తథాస్తామ్, కోమలీశబ్దాన్నిగూర్చి వ్రాస్తూన్నాను. ఆయీ శబ్దం తెలుఁగుభారతంలో యెక్కడ వడితే అక్కడే కనపడుతుంది. శ—ర—నిఘంటులో దీన్ని సంస్కృతశబ్దమని వ్రాయక వై-అని, తద్భవాలలో చేర్చాఁడు, దీన్నిఁబట్టి బహు గ్రంథ ద్రష్టగా వున్న ఆనిఘంటుకర్తకుకూడా సంస్కృతంలో దీనికి ప్రయోగం దొరకనే లేదని స్పష్టమే. మళ్లా—"కోమల" శబ్దాన్ని యెత్తుకొని—సం—అనియే వ్రాశాఁడు. శ—ర—నిఘంటుకర్త. అకారాంత మైనప్పుడు సంస్కృతం కావడమేమిటో? ఈకారాంత మైనం తలో తెలుఁగవడమేమిటో అనే శంకకు తృప్తికరమైన జవాబు కనపడదు. నామట్టుకు— "కోమలీ" అని సంస్కృతంలో యెక్కడో వుంటుందనిన్నీ, దాన్నిబట్టే నన్నయాదులు తెలుఁగులో—కోమలిపదం ప్రయోగించి వుంటారనే అనుమానం యిప్పటికీ వదలనే లేదు. ఒకరికి కనపడని ప్రయోగం మఱివొకరికి కనపడడం కలదు. యీప్రయోగాలు వెతకడం "పత్తిపని" అంటేః చాలా శ్రద్ధతో నిర్వర్తించ తగ్గది—యీమాట శ్రద్ధ కలిగి పరిశీలించే

ప్రయోగద్రష్టలకు మాత్రమే సంబంధించేది—కొందఱో? ఆబాలగోపాలమూ యెఱిఁగిన రామశబ్దంకూడా లేదని వాదించేవారుగా వుంటారు. (తేభ్యో మహద్భ్యో నమః—తే కేన జానీమహే,) వారిని "అయ్యా! వాల్మీకిరామాయణంలో వుంది" చూడండి అని హెచ్చరిస్తే వారు—ఆప్రయోగం—"రామో రాజీవలోచనః, అనేదే కాదా? అది నేనున్నూ యెఱుఁగుదును, అది ఆర్షం కనక మనం ప్రయోగించడానికి అర్హం కాదంటారు—ఋషిప్రయోగించిందల్లా ఆర్షమే అయినా—"ఆర్షత్వాత్సాధుః" అనే వ్యాఖ్యాతలవాక్యంలో వుండే ఆర్షపదం కేవల యౌగికం కాదు (పంకజాదివత్) యోగరూఢం, శాస్త్రవిరుద్ధమై ఋషిప్రయుక్తమైనప్పుడే ఆపదం వుపయోగపడుతుందిగాని "పిడుక్కీ బియ్యానికీ, వొకటే మంత్రం"గా వుపయోగపడదు. ఈవిశేషం యేవొకరిద్దఱికో తప్ప తక్కిన విమర్శకు లందఱికీ తెలిసేవుంటుంది గనుక విస్తరించేది లేదు. ఆర్షశబ్దానికి వుదాహరణాలు యేలాటివంటే?--

1. భద్రం కర్ణేభిః 2. బ్రాహ్మణాసః పితరస్సోమ్యాసః, ఆయీ ప్రయోగద్వయం కేవలం వైదికం, ఋషిర్వేదః, తత్సంబంధి ఆర్షం, యిఁక ఋషిప్రయోగాలు గృహ్యా, వ్యాకరాల్యబంతాలున్నూ మఱికొన్నిన్నీ-ఇవి తెలుఁగుకవులను బాధించేవి కానే కావు. "శ్లో. లక్ష్మణో లక్ష్మివర్ధనః" యీలాటివి తెలుఁగుకవులనుకూడా బాధిస్తాయి. లక్ష్మిశబ్దము స్త్రీప్రత్యయాంతంకాని స్త్రీలింగం,స్త్రీ ప్రత్యయాంతంకూడావుందని యేవ్యాఖ్యాతో వ్రాసినట్లు జ్ఞాపకం సంస్కృతంలో ప్రయోగించుకొనేవారికి గౌరీశబ్దంకంటె కొంచెం భిన్నమని తెలుసుకోవలసి వుంటుందిగాని తెలుఁగువారికి ఆశబ్దమెట్టిదో యిదీ అట్టిదే. వాల్మీకి-ఈకారాంతంగా లేక ఇకారాంతం (హ్రస్వాంతం)గాకూడా ప్రయోగించడం ఆర్షమనుకొని అస్మదాదులు "లక్ష్మి" అని సమాసమధ్యంలో వాడుకోఁగూడ దనుకొనేవారికి కౌముదీవ్యాఖ్యానం (బహుళీః తత్త్వబోధినే అవుతుంది. అది తెలుఁగులిపి, మైసూరులో యేభై యేళ్లకు పూర్వం అచ్చుపడ్డది) లో వున్నపంక్తులు చూచుకుంటే సంశయం నివర్తిస్తుంది. నావద్ద ఆపుస్తకం వుండేది గాని సమయానికి దాన్ని యెవరో యెరువు పట్టుకువెళ్లడంచేత లక్ష్మిశబ్దసాధుత్వానికి సంబంధించిన అక్షరాలు యిక్కడ వుదాహరించలేకపోయాను. కావలసినవారు దానిలో చూచుకోండి. ప్రస్తుతం వక్తవ్యాంశం యేమిటంటే, ఋషిప్రోక్తగ్రంథాలలో వున్నంతమాత్రంచేత అది యావత్తూ ఆర్ష మనుకో కూడదనిన్నీ దాన్నిగుఱించి యింతగా పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోవలసి వుంటుం దనియ్యేవే. ఆలాగే కాకపోతే రామశబ్దంకూడా యిటీవలికవులకు వాడుకోవడానికి అధికారం లేకపోవలసే వస్తుందని లోఁగడ తెల్పే వున్నాను. సంస్కృత శబ్దాలనుగూర్చి కొన్నిటికి పెద్దల అభ్యనుజ్ఞను తెల్పడం కొంచెం జరిగింది కనక యిఁక

తెలుఁగుశబ్దాలనుగూర్చికూడా సూత్రప్రాయంగా ముచ్చటించుకుందాం. ముందుగా గుప్తార్థప్రకాశికనుంచి వకవాక్యాన్ని వుదాహరించి మఱీ చర్చించుకుంటే బాగుంటుంది.

"చేసికొని, చదివికొని ఇత్యాది క్త్వాంతంబులకు బదులుగా చేసుక-చదువుక-ఇత్యాది క్త్వాప్రత్యయాంత సంగ్రహరూపంబు లనంతామాత్య తిమ్మకవ్యప్పకవ్యాది లాక్షణికులచే దమగ్రంథంబులయందు వాడంబడినవి. రూపంబు సూత్రంబున నిరూపింపఁబడలేదు."

అని వొకవాక్యం వ్రాసి అనంతామాత్యుఁడు మొదలు అప్పకవివఱకూ వున్న లక్షణ గ్రంథకర్తల గ్రంథాలనుంచి యిరవై అయిదు వుదాహరణాలు చూపి-"అప్రతిషిద్ధ మనుమతం భవతి" గా తమసమ్మతిని తెల్పి వున్నారు కల్లూరిమహాశయులు. యీవిద్వన్మౌళి పాణినీయశాస్త్ర పారంగతుఁడౌటచేత ఆశాస్త్రమర్యాదనుబట్టి లాక్షణికప్రవృత్తి సూత్రం తోపాటు ప్రవర్తకం అయి తీరుతుందిగదా అని యెఱిఁగినవాఁడవడంచేత కిక్కురు మన కుండా వూరుకొని యిష్టం వుండి యేకవేన ప్రయోగించుకుంటే యెవరూ ఆక్షేపించ కూడదు అన్న అంశాన్ని స్పష్టపఱిచి నప్పటికీ ఆయీ ప్రయోగాలు తప్పని (బుడబుడక్క-) ఆక్షేపించి జాపితాలు పెంచుకొనేవారి అభిజ్ఞత్వాన్ని యెంత అభినంధించినా యింకా యింకా అభినందించవలనే వుంటుంది గదా! కవిత్రయంవారు వాడనిమాట సత్యం అంత మాత్రంచేత ఆప్రయోగం వదులుకో వలసిందేనా? ఒకరుగాదు యిద్దఱున్నూ కాదు, చాలా మంది లాక్షణికులకు కలగని (భారతకవులు వాడలేదనేది) శంక మనకెందుకు కలగాలి. కనక ఆయీప్రయోగాలు నిరభ్యంతరంగా వాడుకోవచ్చుననే అభ్యనుజ్ఞ వుందని తెలుసుకో వాలి, ఎవరేనా మేము భారతకవులు వాడినప్రయోగాలుతప్ప వాడేది లేదని ప్రతిజ్ఞఁ బూని రచన పాఁగించే స్వయంపాకస్థులు వుండేయెడల వుండడానికి అభ్యంతరం లేదు. వారు ఆలా వుండవచ్చు. రైలెక్కమనేవా రుండేవారు (యిప్పుడు కాదు కొన్నాళ్లకిందట) యెక్కినా దానిలో కూర్చున్నంతసేపూ వుటనుకూడా మింగకుండా ప్రాణాలు బిగఁబట్టు కూర్చుని రైలు దిగినతర్వాత పంచగవ్యప్రాశనతోసహా శాస్త్రోక్త ప్రాయశ్చిత్తం జరుపు కొని పరిశుద్ధులైనవారినిన్నీ కొందఱిని నేను బ్రాహ్మణులలో మాత్రమే కాదు (వెలమ జమీందారులలోకూడా) ప్రత్యక్షంగా యెఱిఁగి వున్నాను—ఇది విషయాంతరం. బహు లాక్షణికమహాకవిసమ్మతమై వొకవ్యాకరణవ్యాఖ్యాత ఖండించలేక వూరుకొన్న వూర్వోక్త ప్రయోగాలు ఆక్షేపించడం మహాపరాధమని దీనిసారాంశం, యింప్వంతప్రయోగాలు మందలింపు-మేళగింపు-బిగింపు - లోనైనవాట్లనిగూర్చి యేదో వ్యాసంలో చాలా చర్చించి వున్నాను, కాఁబట్టి ఆప్రయోగాలకుకూడా మహాకవుల అభ్యనుజ్ఞ వుందనిమాత్రమే

యిక్కడ వ్రాస్తే చాలు ననుకుంటాను. ఇతరభాషాప్రయోగాలు కలగూరగంపగా వుండే తెలుగులోమాట కేమి? మడిగట్టుకొన్నప్పుడే వాడుకోతగ్గ సంస్కృతభాషలో కూడా క్వాచిత్కంగా మహాకవులు వాడుతూవచ్చారు.

"సుభేదారస్య మద్ద్రోహిణః" (మహిషశతకం) వగయిరాలు చూచుకోండి. అయితే అభ్యనుజ్ఞ పుట్టుపేరులకున్నూ వుద్యోగద్వారా (జడ్జీ, కలెక్టరు, మొదలైనవి) వచ్చిన వాట్లకున్నూ మాత్రమే "భూమీనాథ షహాబదీన" (మహిషశతకం) వగైరాలు చూచుకోండి. మనం సంస్కృతంలో కవిత్వం చెపుతూ వున్నాంగదా? అని ఆయీ నామధేయాలు మార్చి రచనసాగిస్తే యింక అడుగుతారూ ఆరచనసౌడభ్యం, "అహో స్వామిరూప మడగనా?" అన్నట్టే వుంటుంది. తెలుగులో ప్రయోగవైచిత్ర్యాలనుగూర్చి వ్రాస్తూ మధ్య అవాంతరంగా సంస్కృతాన్ని గూర్చి కొంచెం వ్రాశాను. ఆభాషని నడిపించినట్టు దీన్ని నడిపించడం సాగదు దానికి చాలినంత వ్యాకరణం వుంది. దీనికో? లేదు-వుండడానికి వీలున్నూ కనపడదు. యిది నాలుగువిభాగాలుగా విభజిస్తూ మళ్లా దేశ్యాన్ని రెండు విధాలుగా విభజించి-అన్యదేశ్యానిక్కూడా కొన్ని సీట్లు రిజర్వు చేసి వుంచారు వ్యాకర్తలు. ఆవిభజించేనాటికి తురకానికి యింకా ఆవశ్యకత్వం కలగేలేదు అప్పటికి యీఆంధ్రభాషా ప్రవాహంలోవచ్చి కలిసిశ వుపనదులేవో (యితరభాషాపదావళి అన్నమాట) చారిత్ర జ్ఞానం కలవాళ్లకేగాని నాబోట్లకు గోచరించదు. తరువాత తురుష్కభాషాపదాలు వాడుకలో వుండేవి చేరడానికి మొదలు పెట్టాయి. పిమ్మట, ఫార్సీన్ను, గ్రీకు, వగయిరా కొన్ని భాషా పదాలయితే దీనిలో చేరవలసిన ఆవశ్యకత్వం కొంత కలిగింది గాని-ఆయీప్రభుత్వాలు. "పుబ్బలో పుట్టి మఖలో మాడేవిగా" పరిణమించడంచేత కవులరచనలలోకూడా చేరవలసిన యోగ్యత వాట్లకు కలగ లేదు. సుమారు నూటయేభై యేళ్లనుంచి పాదుకొని వున్న ప్రభుత్వం ఇంగ్లీషుప్రభుత్వం కనుక ఇంగ్లీషుపదాలు కొన్ని మనభాషలో చేరడం తప్పని సరి అయిందని వొప్పుకోక తప్పదు. మేం మడిగట్టుకున్నాం అని భీష్మించుకున్నా ఆయీ పదాలు కొన్ని కవిత్వంలో దొర్లుతాయన్నమాటే. తురుష్కప్రభుత్వకాలంలో తురకభాష చేరితే వొప్పుకున్న తెలుగుభాష, ఇంగ్లీషుప్రభుత్వకాలంలో ఇంగ్లీషుపదాలు కొన్ని చేర్చుకోవడానికి యేవగించుకుంటుం దని భాషాస్వభావవేత్తలు యెవరూ అనుకోరనే నావిశ్వాసం.

"క...వారాంగన యిది సాహెూ,త్కారపుఁ బటికంపుబొమ్మ గావలెఁ జుమ్మీ"

అన్నాఁడు నర్సభూపాలీయంలో ఒకసందర్భంలో, తెలుఁగుభాష వైఖరికూడా అలాటిది గానే కనపడుతుంది. ఆయీకష్టసుఖాలన్నీ బాగా ఒడ్చి వడపోసియ్యేవే—

ఉ. కాలముఁబట్టి దేశమునుగాంచి ప్రభుత్వమునెంచి దేశభా
షాలలితాంగి మాఱుటది సత్కవిసమ్మతమాట నన్యదే
శ్యాలును దేశభాషఁ గలవౌటను నౌచితిఁబట్టి మేము క
బ్బాలను వాడుచుంటి మిది పండితు లేగతి నొప్పుకుందురో.

అని సుమారు యిప్పటికి నలభై యేళ్లనాడే వ్రాయవలసివచ్చింది. అప్పకవి—

"పూర్వకవీశ్వరవాక్ప్రయోగదక్షుఁడు కరుణామతి యెవ్వఁ డతఁడు కవి యనఁబరఁగు". అని కవిలక్షణంలో పూర్వకవిప్రయోగవేత్తృత్వం అత్యావశ్యకమని వ్యక్తీకరించి వున్నా కొందఱు యీవిషయంలో చాలా సంకుచితహృదయులుగా వుండడం శోచనీయం! పూర్వులంటే? యెవ్వరు? తనకు యేమాత్రం పూర్వులేనా సరేనా? అథమం ఒకనూఱేళ్లేనా పూర్వులు కావలసివుంటుందా? అంటే? వినండి. నామతంలో ఒకసంవత్సరం పూర్వుఁడైనా సరే, అనియ్యేవే, కాని ఆకవి విద్వత్కవిగామాత్రం వుండాలి. యేదో గణయతిప్రాసలు గుదిగూర్చడం మాత్రమే చేతనైనవాఁడై ధర్మధర్మిభావంగాని సుశబ్దాపశబ్దవిచారంగాని తెలియక తెలియనివాఁడు తెలియనట్టు పూరుకోక యేవో కుశంకలు చేసేవాఁడైతే మాత్రం ఆకవిప్రవృత్తిగాని నివృత్తిగాని భావికవులకు ప్రవృత్తినివృత్తిబోధకాలు కావు. విద్వత్కవి అయిందీ కానిదీ తెలుసుకోవాలంటే యెవరికో తప్ప యితరులకు అంత కష్టంలేదు. రచనను పట్టి (మారువాళీవర్తకులు పూటా రూపాయీని గుర్తించినట్టే) క్షణంలో గుర్తించ వచ్చును. యీపరిజ్ఞానమే ప్రామాణ్యానికి అవసరంగాని పూర్వత్వంగాని మఱీ పూర్వత్వం గాని మఱీమఱీ పూర్వత్వంగాని లేశమూ ప్రయోజకం గాదు. ఒకవిద్వాంసుఁడు (ఈయన ప్లీడరు కూడాను) కవులలో తారతమ్యాలను నిర్ణయిస్తూ వుపయోగించే మాటలు నవ్వు పుట్టించేవిగా వుండేవి - వాట్లని వుదాహరిస్తాను

## ప్రశ్నోత్తరాలు

ప్రశ్న. అయ్యా! చేమకూరకవిని గుఱించి మీ అభిప్రాయ మేమి?
ఉత్తరం. వాఁడా? అబ్బో? అమ్మమొగుడు.
ప్ర. అల్లసానికవో! మఱి,
ఉ. చెప్పేదేమిటి, అమ్మమ్మ మొగుడు.

యిదే మాదిరిపదాలతో ఆయన గురుత్వ లఘుత్వాలు నిర్వచిస్తూ వుండేవారు. యిది విషయాంతరం, కాళిదాసునాఁటికే యీబాధ పూర్తిగా వున్నప్పుడు మనరోజుల్లో మాత్రం వుండదా? (శ్లో. పురాణమిత్యేవ న సాధు కావ్యమ్. చూ.) కాళిదాసు చెప్పిన సమాధానంవల్ల పూర్వత్వ నవీనత్వాలనుబట్టి కవిత్వపు మంచిచెడ్డలు నిర్ణయించడం ప్రాజ్ఞేతరలక్షణ మనియ్యేవే, మంచికవిత్వ మయితే అది తనకాలంలోదైనా సరే ప్రయోగాది సందర్భాలలో దాన్ని వరవడిగాఁ బెట్టుకోవడానికి యెవరో కాదు, కాళిదాసే అభ్యనుజ్ఞ యిచ్చినట్లయింది. తిక్కన్న గారు—1 తనమయం 2 మెదడుప్రోవులమయం,అంటూ ప్రయోగించారు, యింకో కవి—అపరంజిమయం, అని దాన్నిబట్టి ప్రయోగించుకుంటే రసజ్ఞులు ఆమోదించాలి కాని ఆరెండుమాటలకే కాని మఱోమాటకు ఆ "మయట్ప్రత్యయం తగిలించకూడదని వాదించడం అభినందనీయం కాదు. (చెవికి యింపుగా వుండడం మాత్రం చూచుకోవాలి) అన్నిటికీ ఆదికవిసమ్మతినే చూపవలసిందంటే చూపడం సాధ్యపడుతుందా? "ద్రాక్షవాటికవిరాక్షసుఁ" డాలాటి నియమంచేస్తే చేశాఁడుకాక, అది "శారదాబిల్లు"లాగ కవిలోకంలో బహువిరళంగా అమలుజరుగుతూ వుండడం అందఱూ యెఱిఁగిందే! దేనిదాఁకానో యెందుకు! తెలుఁగుపదాలమీఁద యీ "మయ"ట్ప్రత్యయాన్ని వుపయోగించడానికి నన్నయ్యగారిసమ్మతిని చూపమంటే తిక్కన్నగారు (ఆకాలంలోనే అనుకుందాం) చూపఁగలరా? యింతవఱిదాఁకా చర్చించుకొనే శక్తిలేక గుంటపూవులు పూసినమాదిరి శంకలు చేస్తూ వుండడం శోచనీయం, అప్పకవివ్రాసిన కవిలక్షణం స్వకపోలకల్పితం కాదు. చాల ప్రాచీనమే. అహోబలపండితుఁడు వుదాహరించిన "సత్కులీన శ్శుచి ర్దక్ష శ్ఛందో వ్యాకరణాదివిత్" అనే శ్లోకానికి తెలుఁగు. ఆశ్లోకంలోవున్న 'సత్కులీనః' అనేపదానికి అప్పకవి—'ధరణీసురుఁడు' అని తెలిఁగించడం బుద్ధిపూర్వకంగా చేసినమోసం. అప్పకవినాటికి బ్రాహ్మణేతరులలో కవులు లేరేమో అనుకుందామంటే రాయలు మొదలైనవారు పలువురు వున్నారు. రాయలు ఆముక్తమాల్యదాకర్తకాఁడని అప్పకవితాత్పర్యంగాని అది న్యాయమైనదీ కాదు. న్యాయమైనదే అయినా అతఁడొక్కఁడు తగ్గితే మాత్రం అప్పకవివ్రాఁత బ్రదుకుతుందా? బ్రతకదు.

క. వెంకనప్రతిష్ఠ కోలెటి, వేంకటరామయయె హేతువే? అట్లగుచో
బొంకి కృతకృత్యతను గను, టంకెడిఁ గల రెండ తేని అన్యులు శిష్యుల్.

(ఇటీవలిచర్య.) ఇదేమాదిరిని అప్పకవివ్రాఁత పొల్లవుతుంది. కవిత్వం శిల్పంకదా? అదిన్నీ కాక సహజంగా ఆవిర్భవించేది, గానంమాదిరిది. దీనికి జాతినియమం పెట్టడం అనాలోచితం కాకపోదు. పోనీ మూలంలో ఆలావుందేమో? అంటే? అదిన్నీ కనపడదుకదా? సత్కులీనులంటే

బ్రాహ్మణులే కాని క్షత్రియాదులు కారని యేప్రాజ్ఞులూ చెప్పరు. వ్రాస్తే చాలా వ్రాయాలి, ప్రస్తుతం వ్రాయడానికి పూనుకొన్నది యిది కాదు. బ్రాహ్మణకవిగాని బ్రాహ్మణేతరకవిగాని మంచిగా కవిత్వం చెప్పినవాఁడైతే అతణ్ణి యితరులవారు అనుసరిస్తారు. ఇంతే నిష్కృష్టాంశం. రసవిహీనంగా వుండే కవిత్వమేనాసరే లక్ష్యలక్షణజ్ఞానం కలకవిదయితే అది అన్యులకు (ప్రయోగవిషయంలో మాత్రమే) అనుసరణీయం కావడానికి అభ్యంతరం వుండదు. కాని నీరసకవిత్వం భాషాప్రపంచకంలో చిరస్థాయిగా వుండడమే సంఘటించదు కనుక అట్టిపీడ భావికవులకు తగలనే తగలదనేది పరమార్థం. కొనుధాతువుకు 'క' అనేది ఆదేశంగాచేసిన ప్రయోగవిషయంలో కల్లూరివారి ఆశయాన్ని వ్యాఖ్యానించే సందర్భంలో మఱికొంత యితరవిషయం నడిచింది. యిఁక క్త్వార్థకేకారసంధివిషయంలో వీరి తాత్పర్యాన్నిగూర్చి కొంత ముచ్చటించుకుందాం—కల్లూరివారు క్త్వార్థకసంధినిగూర్చి భారతప్రయోగాలు కూడా చూపి వాట్లకు పాఠాంతరసత్తను నిరూపించి తరువాత కవిత్రయేతరప్రయోగాలుకూడా చూపి కొంత చర్చించి అంతతో గత్వా.—

"ఈప్రయోగంబులు నిరాకరంబులు" అని విరమించారు. వీరివ్యాఖ్యానము చాలాచోట్ల భాష్యప్రాయంగా అంటే కొంత స్వతంత్రించి వుండడం కలదు. ప్రస్తుతం సూత్రాభిప్రాయంలో యేకీభవించి వూరుకోవడాని క్కారణం కొంత చింత్యం, యేమంటే? యితర కవులమాట అలావుండఁగా "క. ... పురోహితు (డితనికి నెల్లపనులు నెఱిఁగించిపుడే" అనే భారతప్రయోగం కూడా కనపడుతూ వుండఁగా యెందుకు స్వతంత్రించ లేకపోయారో? అలా స్వతంత్రించేయెడల బహుమహాకవులప్రయోగాలు గౌరవించినట్లయ్యేది కదా? ఆయీ మార్గం భట్టోజిదీక్షితు లంతవానిక్కూడా సమ్మతమైనట్లు—ప్రాద్వాద్యా సూత్రవ్యాఖ్యానసందర్భంలో కాశికాకారాదులు ఉపసర్గే అనేపదాన్ని అనువర్తించి వుండఁగా దానివల్ల నైషధప్రయోగం "ధయార్ణ" అనేది సంరక్షింపఁబడక పోవలసి వస్తుందని యోజించి తద్రక్షణార్థం దాన్ని అనువర్తించకపోవడం మనోరమావ్యాఖ్యానంవల్ల విస్పష్టమే కనుక లక్ష్యానురోధంగా వ్యాఖ్యాతలు ప్రవర్తించడం శాస్త్రజ్ఞసమయమేకాని అయుక్తమార్గం కాదాయె. అట్టిస్థితిలో పాణినీయనిష్ణాతులైన యీమహాభాగులు (వీరిని నేను మహాభాగులుగా ప్రశంసించడం మహాపరాధంగా పరిగణించి నన్ను నెపపెట్టి దూషించేవారున్నూ యీకాలంలో వున్నారు. "కాలాయ నమః కలవికరణాయ నమః") బహుమహాకవిప్రయోగానురోధంగా వ్యాఖ్యానించకపోవడం ఆశ్చర్యకరంగా కనపడుతూ వుంది. అలాగే వ్యాఖ్యానించేపక్షంలో "క్త్వార్థతో న్వకదాచన" అనే కారికా తాత్పర్యం అన్యథాగానే వున్నా, లక్ష్యానురోధంగా వ్యాఖ్యానించే వీరికి కొంతసహాయం

చేసేది. ఆసహాయం యేలాటి దంటే:—క్త్వార్థేతః-క్త్వార్థక ఇకారానికి, కదాచ, యెప్పుడున్నూ,(సంధి) నేతిన=రాదనే మాటలేదు. అనఁగా: యెప్పుడేనా వస్తే రావచ్చుననే స్వారస్యం తీసుకోవచ్చును. ఆరావడం యేలాటిస్థలాలలో అంటే? యెక్కడ యీసంధిచేస్తే శ్రవణకటువుగా వుండదో అక్కడన్నమాట, ఆయీతాత్పర్యంతోటే అనుకుంటాను అడిదం సూరకవిగారు - తే. "ఇడఁగ వచ్చును లృప్పుపై నిత్యసంధి, మాత్ర మొక్కొక్కచోటను..." అని వ్రాయడం తటస్థించింది అయితే యిక్కడ వొకమాట వ్రాయడం మఱిచాను-కల్లూరివారుదాహరించినకారిక 'క్త్వార్థేతో న భవే త్సదా' అని వుంది. దీనిలో నేను చూపిన లక్ష్యానురోధవ్యాఖ్యానానికి అవకాశం కనపడదు. నాకు యేకారణంచేతనో "క్త్వార్థేతో న కదాచన" అన్నపాఠమే నోటికి వచ్చును. నా తెలుఁగువ్యాకరణపాండిత్యం చిన్నప్పుడు స్కూల్లో చదువుకొన్న వెంకయ్య వ్యాకరణానికి సంబంధించినదిన్నీ తరువాత భారతలక్ష్యాలకు సంబంధించిందీకాని ఆంధ్రశబ్దచింతామణి గాని అథర్వణకారికలు గాని చిన్నయసూరివ్యాకరణం గాని చదివి సంపాదించుకొన్నది కాదు. ఆపద్ధతిని నా కీకారిక మాత్రం యేలా నోటికి వచ్చింది అని శంక కలుగుతుందని యెఱుఁగుదును. యెవరో చదువుతూ వుండఁగా వినడంవల్లనే వచ్చి వుంటుం దనుకోక తప్పదు. ఆయీ వూహ నిక్కమే అయితే నాకు వచ్చినపాఠంకూడా వొకటి వుందనుకోవలసి వస్తుంది. యీవూహకు అడిదం సూరకవిగారి "ఇడఁగ వచ్చును లృప్పుపై" అన్నవ్యాఖ్యానం చేయూఁత నిస్తూవుంది. ఆయీవిధంగా సూరకవిగారు క్త్వార్థకేత్సంధికి సమర్థనోపాయం చూపడాని క్కారణం భారతాది మహాకవుల లక్ష్యాలే అన్నందుకు ఆపద్యంలోనే వున్న "కవిజనానుమతిని" అన్న పదం బోధకంగా వుందని వేఱే వివరింప నక్కఱలేదు. కారికలో పాఠభేదం వున్నప్పటికీ మొట్టమొదట నిషేధతాత్పర్యంతోనే అది పుట్టిం దనుట యథార్థమే. పాణినీయ సూత్రాలలోకూడా సూత్రకర్త అభిప్రాయం వొకలాగు వుండఁగా వ్యాఖ్యాతలు లక్ష్యానురోధంగా అన్యథాగా వ్యాఖ్యానించడం సుప్రసిద్ధమే కనక నాయీవ్యాఖ్యానాన్ని పాణినీయవేత్తృత్వమున్నూ బహుమహాకవి లక్ష్యగత రామణీయకతావేత్తృత్వమున్నూ కలపండితులు సమ్మతిస్తారని నానమ్మకం. యింకా చాలా వ్రాయవలసి వున్నప్పటికీ యీఅభ్యనుజ్ఞావ్యాసాన్ని యింతటితో ప్రస్తుతం ముగిస్తూన్నాను. ఆయీవ్యాసం జగత్ప్రసిద్ధులున్నూ భాషోద్ధారకులలో నగ్రగణ్యులుగా మనయావదాంధ్రదేశమున్నూ యేకవాక్యతగా శిరసా వహించతగ్గవారున్నూ అయిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల్లు గారికి మద్రాసులో కొలఁదిరోజులలో కానుకగా సమర్పించఁబోయే సంచికలో ముద్రించే కోర్కెతో శ్రీపి. యస్. ఆర్. ఆంజనేయులుగారు తే 15-వ జనవరి 1941 సం॥ దీకి లోగానే

అందచేయవలసిన దని గడువేర్పఱచి వుత్తరం వ్రాయుటచే సంగ్రహంగానే దీన్ని ముగించవలసి వచ్చింది. వేంకటేశ్వరశాస్త్రుల్లుగారు భాషోద్ధారకులు కావడంచేత వారికి సమర్పించే కానుక సంచికకు యిచ్చేవ్యాసం భాషావిషయకంగానే వుండడం యుక్తమని నాకు తోచి యిట్టివ్యాసం పంపివున్నాను.

నాకు వ్రాసినజాబులో "తమకుచితమని తోఁచిన విజ్ఞానవిషయమై వొకవ్యాసమును వ్రాసి పంపఁగోరెదము." అని వున్నది. ఇతరవిజ్ఞానాలన్నిటికీ భాషావిజ్ఞానమే మూలవిరాట్టు కాఁబట్టి నేను దీన్ని పంపినట్టుకూడా విజ్ఞులు తెలుసుకుంటారని నావిశ్వాసం. శ్రీవేంకటేశ్వర శాస్త్రుల్లుగారి యశస్సుతోపాటుగా ఆయన ఆయుర్భాగ్యంకూడా నిరామయంగా వర్ధిల్లుఁగాక అని ఆశీర్వచిస్తూ దీన్ని ఆపుతాను. స్వస్తి.

---

డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు, వైస్‌ఛాన్సలరు, ఆంధ్రయూనివర్సటీ, వాల్తేరు:—

మాతండ్రిగారికిని శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారికిని చాలస్నేహము. వాఙ్మయమునెడల వారికిగలభక్తియే ఈమైత్రికి కారణము. నేడు ఈఉత్సవమునకు పాత్రులయిన శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు జృంభణముగా సాగించి నడిపినవ్యాపారసంస్థను శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు స్థాపించిరి. తండ్రి కుమారు లిద్దరును ప్రసిద్ధపండితులు. వీరు తమప్రచురణవిషయమున చాల సునిశితమైనవిమర్శన పరిశీలనలతో మెలగువారు. కాబట్టి, వీరిద్వారా పుస్తకము ప్రకటితమైనదనిన అదియే దానికి ముద్రగా నేర్పడుచుండును. సంస్కృతము, తెనుగుసారస్వతములకు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చేసినసేవ లెక్కకుమిారినది. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు మదరాసు ప్రజాహిత జీవనమున ప్రసిద్ధిగాపాల్గొనినారు. అనేకసంస్థలలోనుండి పనిచేసి వానికి ప్రయోజనము తమకుప్రతిష్ఠ రెంటినిసంపాదించినారు. ఆయన మట్టుమర్యాదలు సహృదయము శాంతము వర్ణింపదగినవి. దేశములో తాను ప్రాచీనగ్రంథములను జనరంజకముచేయుటతో సమముగా ఇలెడు ప్రాతనాటిమర్యాదలపసయు చూపగలవాడు. ఈరజతోత్సవపువేడుకలలో నేనును హృదయపూర్వకముగా భాగర్థినగుచున్నాను. పండితుడు, ప్రచురణకర్త, ప్రజాహితజీవి, పత్రికారచయిత, నాకు ప్రాతనాటి మిత్రుడు నయిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి దీర్ఘాయువును ఇతోధిక విజయసంపదలును అగుగాక!

# ప్రాచ్య పాశ్చాత్య కవితలు

## శృంగార రసము.

శ్రీసత్యదుర్గేశ్వరకవులు, శతావధానులు,
ఆరిగ్ల అగ్రహారం, సూర్యారావుపేట, కాకినాడ, తూర్పుగోదావరిజిల్లా.

వర్డ్సువర్త్ కవి Wordsworth కవితను మానవ ప్రకృతుల ప్రతిబింబమని స్థిరీకరించినాడు. ఆంధ్రకవితాపితామహుఁడు హిమాచలమునుగురించి మనుచరిత్రలో,—

చ. అట జని కాంచె భూమిసురు డంబరచుంబి శిరస్సరర్ఝరీ
పటలముహుర్ముహుర్లుఠదభంగ తరంగ మృదంగనిస్వన
స్ఫుటనటనానుకూల పరిఫుల్ల కలాపికలాపజాలముఁ
గటకచరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్.

ఇట్లు వర్ణించినాఁడు. ఆహిమాద్రియొక్క ప్రకృతిశోభనంతయు చిత్రించి మనకన్నులయెదుట పెట్టినాడు పెద్దన్న. ఇక్కడ ఈకవితల్లజుఁడు హిమాద్రిని చూచియుండునా? యుండఁడా? అనువితర్కముతో పనిలేదు. నేఁడు ఫోటోగ్రాఫరులు తాము తమయంత్రసహాయమున మనమనప్రతిమల నెట్లు తీయుచున్నారో అదేవిధముగ ఈకవి సర్వాంగసుందరమగు తత్పర్వతముయొక్క ప్రతిమను కవితయను తనయంత్రసహాయమున తీసి మనముంగట పెట్టినాఁడు. హిమాలయపర్వతము ప్రకృతిసిద్ధము. ప్రకృతి. నేటికిని దానిమూలాకృతి చెంగలించుచునే యున్నది. ఇప్పుడు పెద్దన్ననాజను సృష్టికర్త యీపద్యమునాబడు దర్పణమున తన్మూలాకృతియొక్క ప్రతిబింబమును చదువరులమానసదృక్కులకు గనబడునట్లు ప్రతిఫలింపజేసి యున్నాఁడు. దీనంజేసి ఈపద్యమందలి కవిత హిమాచలమను తత్ప్రకృతియొక్క ప్రతిబింబముగ ఊహింపఁదగియున్నది. ప్రకృతియొక్క ప్రతిబింబము కవిత యనుసమస్య పరిష్కృతమైనది. ఇఁక కవిత మానవునియొక్క ప్రతిబింబమనుసమస్యచర్చనీయము. ద్రౌపదియొక్క వ్యాజనటనామోహాసల్లాపములకు లోఁగి యామె గవయుసమయాగమనమునకు సంభ్రమించుసింహబలుని సద్యస్సంపన్నాకృతిని తనభారతవిరాటపర్వమున తిక్కయజ్వ:—

చ. తలరు; నలందురుఁ; నవయు; దాపభగంబున వెచ్చ నూర్చు; మే
నలయఁగ నొల్లబోవు; వెగడందు, గలంగు; పరిభ్రమించు; గొం

దలపడు; తల్లడం బడరి ధైర్యము దూలిన బెగ్గడిల్లు, వి
చ్చలవిడి బేర్చు నెవ్వగలపండడి; డెందముగంది చేడ్పడున్.

ఏవంవిధముగ ఆవిష్కరించియున్నాడు. ఆసమయమున సింహబలుని చేష్టాకృతి యెట్లుండెనో దానికి ఈపద్యకవిత నఖలు. అట్లయిన తిక్కన సింహబలుని ఉపలక్షించి యుండడు కదా. అయినప్పు డిది సొంతము తత్ప్రతిమయే యనుట సమంజసమా? యని కొందరనవచ్చును. ఔను; చూచియుండడు, వాస్తవమునకు జూడను లేదు. కాని చూచెనా? చూడలేదా? యనుసందిగ్ధావస్థకు ప్రకృతము తావు పొసగదు. కవికి దివ్యదృష్టి యుండును. కాబట్టి కవిబ్రహ్మ తత్సమయమందలి కీచకుని దైహికవికార మేవంవిధముగ నున్నట్లు తనదివ్య దృష్టిలో వీక్షించి తదనుగుణంబుగ ఈపద్యకవితను పోషించినాడు. కనుక తాదృగ్దృష్టా కృతి సింహబలునిమూలవిగ్రహముగను ఈపద్యమందలి కవిత తత్ప్రతిబింబముగను మనము గ్రహింపనగును. అట్లు గ్రహించినప్పు డిందలికవిత మానవునిప్రతిబింబముగ వ్యక్తముకాక తప్పదు. ఇప్పుడు వరడ్స్వర్తుగారి సూత్రము మన కవితాసాంప్రదాయమున కెంతవరకు సరి పడినదో వ్యక్తమైనది. ఆంగ్లేయపండితుఁడైన చానింగు కవితకే దివ్యదృష్టియుండునని వ్రాసి నాడు. ప్రస్తుత మొకడు విచార్యము. విత్తుముందా? చెట్టుముందా? యనునట్లే కవిత లేనిచో గవియు మృగ్యుడే, కవిలేనియెడల గవితయు మృగ్యమే. కాబట్టి యాతాత్పర్య మిరువం కల వర్తింపగలదు. ఇఁక ఈకవుల పరస్పరకవితా సాంప్రదాయములు విమర్శనీయములు. పాశ్చాత్యకవితాసాంప్రదాయములలో కొన్ని మన ప్రాచ్యకవితాసాంప్రదాయములకు సరి పోవుచున్నవి; కొన్ని వికటించుచున్నయవి. ఆంగ్లకవిశేఖరులలో పేరెన్నికగాంచిన మిల్టను తమ 'కోమస్' Comus నాజను వీథినాటకమున ఒకజవరాలిని వర్ణించుచు తచ్ఛిరోజములు చంద్రునివలె నున్నవని ఉల్లేఖించినాడు. ఇదిగో చూడుడు;—

"..........and tresses like the moon."

(ఆమెయుంగర వెంట్రుకలు చంద్రునివలె నున్నవి) ఈవర్ణన మనకవి సమయమున గన బడదు. ఒకవేళ గనబడునేని అది యేముసలిదానికేశములనో సంబోధించియుండును. ఏల యన ముసలిదానివెంట్రుకలు నెరిసి తెల్లగనుండును అప్పు డవి చంద్రునకు పోలును. మరి యొకచోట "Ovid's Art of Love" అనుగ్రంథములో 'Maynwaring' నాజను ఒక పాశ్చాత్యకవి యొకజవరాలినేత్రములను, చేతులను

"...........her eyes like emerald's bright;
Her hands are snowy white,........

ఇట్లు చిత్రించినాడు. (అనగా: ఆజవరాలికన్నులు పచ్చలవలె మెరయుచున్నవి. చేతులు మంచువలె తెల్లగ నున్నవి.) ఇదియు మనసాంప్రదాయమునకు విరుద్ధమే. ఇప్పుడు మనము శీతోష్ణస్థితిగతుల గూడ గమనింపవలసియున్నది. పాశ్చాత్యదేశములు కడుంగడు శీతల ప్రదేశమున ఉన్నవి. దానంజేసి అక్కడిమానవులు మంచువలె తెల్లగ నుందురు. కాంబట్టి హస్తములను తత్కవి మంచుగతి తెల్లగనున్నవని వర్ణింపఁగలిగినాడు. వారివి పిల్లికన్నులు. అందుచేతనే కన్నులను పచ్చరంగుగల మరకతకాంతితో సరిపెట్టినాడు. ఇఁక మిల్టనుకవి తత్తరుణీశిరోజములను తెల్లనైన చంద్రునితో బోల్చినంతమాత్రమున పాశ్చాత్యయువతుల వెండ్రుకలు తెల్లగనుండుననుట యసమంజసము. దీనిని చక్కగ సమర్థింపవచ్చును. నిండు జవ్వనమున ఉన్న ఆపె మూర్ధజము లెన్నటికిని తెల్లగ నుండవు. ఇక్కడ మిల్టనుగారు స్పర్శ సౌఖ్యమునే యనుసరించెగాని దృక్సౌఖ్యము ననుసరించి యుండలేదు. మనకవులు జవరాలి వదనమును చంద్రబింబముతో బోల్తురు. కాని చంద్రబింబమునకు తన్ముఖమునకు నేమియు పోలిక గనబడదు. అయినప్పుడిక ఎందుకట్లు పోల్తురని ప్రశ్నింపనగును. చంద్రబింబమును గాంచుదృక్కులకు కడుంగడు హర్ష ముద్గమించును. అనఁగా శశిబింబదర్శనమున నేత్రము లెంత సంతసించునో సుందరీవదనదర్శనమున గూడ నేత్రము లంత సంతసించునని తాత్పర్యము తో ప్రాచ్యకవులు ముఖచంద్రబింబములకు ఉపమానోపమేయబాంధవ్యమును సంఘటించి యున్నారు. మఱియు చంద్రుని చూచినహృదయ మెంతయుల్లాసముగ నుండునో తద్వదనముగాంచిన అంత బ్రహ్మానందము జెందును. ఇదియే స్పర్శసౌఖ్యము, లేక స్పర్శవర్ణన. మిల్టనుగారిమార్గము దీనికి కలియుచున్నది. అనఁగా చంద్రదర్శనము యువదృక్కుల కెంత యానంద మొసగునో ఆయోషాశిరోజములును దర్శనమాత్రుల కంతటి నేత్రమానసికసౌఖ్యముల నొనగూర్చునని మిల్టనుగారి ఆంతరంగికభావన. అయినను తత్సాంప్రదాయము మనలో నింతవరకును లేదు. ఇక మనకు హస్తేడిసాంప్రదాయములగూడ వివరింతును.

'Maynwaring' కవి Ovid's Art of Love' నాజనుగ్రంథమునం దొకచక్కని తలోదరియొక్క రూపురేఖలను:—

Her head is round, and flaxen is her hair,
Her eyebrows darker, but her fore-head fair : :
Straight is her nose, her eyes like emerlad's bright;
Her well-made cheeks are lovely red and white;
Short is her mouth, her lips are made to kiss,
Rosy and full, and prodigal of bliss;

**Her teeth like ivory are, well sized and even ;**
**And to breath ethereal sweets are given :**
**Her hands are snowy white, and small her waist,**
**And what is yet untold is sure the best.**

ఇట్లు పేర్కొనినాడు. (అర్థము:—ఆజవరాలితల గుండ్రముగ నున్నది. శిరోజములు అతసీసూనవర్ణము కలిగియున్నవి. కనుబొమ్మలు మిక్కిలి నలుపురంగు కలిగి ఉన్నవి. ఫాలభాగ మెంతయు సుందరముగ నున్నది. ముక్కు తిన్నగ నున్నది. నేత్రములు మరకతశోభను జిలుకుచున్నవి. చెక్కిళ్లు మనోహరమైన రక్తస్వేతవర్ణములశోభను ప్రసరించుచున్నవి. నోరు చిన్నది వాతెర గులాబిపూవన్నె కలిగియున్నది. పల్వరుస చక్కనిపరిస్థితియం దిమిడి దంతమువలె తెల్లగ మెరయుచున్నవి. నాసికావాయువు మంచుగడ్డతోగూడిన మధురపానీయపువాయితనమును గడిసియున్నది. హస్తములు మంచువర్ణమున కుద్దియై యున్నవి. కౌను సన్నముగ నున్నది.)

ఇక్కడ శిరోజములను కవి యతసీసూనవర్ణముతో సరిపోల్చినాడు.అతసీసూనము నీలమేఘవర్ణము కలిగియుండును. మాఘుడు తన మాఘములో శ్రీకృష్ణునిగురించి వర్ణించుచు అతని దేహచ్ఛాయను ఈయతసీసూనవర్ణముతోనే పోల్చియున్నాడు కాబట్టి ఇక్కడ వెండ్రుకలు నిగనిగలాడు నీలమేఘపురంగు గలిగియున్నవని తాత్పర్యము. ఈయాచారము ప్రాచ్యసాంప్రదాయమునకు విరుద్ధముకాదు. కనుబొమలను నీలమేఘవర్ణము (నలుపు)తో పోల్చినాడు. మనవారును వీటిని నలుపువర్ణముతోనే పోల్తురు. కనుక ఇదియు మనసాంప్రదాయమునకు సన్నిహితమే. ఇక్కడ రదనపంక్తి దంతమువలె వెలుతురు కలిగి ప్రకాశించుచున్నవని కవియభిప్రాయము. మనవారును రదనపంక్తివర్ణము చౌకళించెడి తెలుపువర్ణముతోనే పోల్తురు. ఈసందర్భమును బురస్కరించుకొని రామరాజభూషణుడు తన వసుచరిత్రలో;—"గీ.........ఔర! యాకుందరదనరదాంశుకంబు. ఆ. 2. ప. 45. ఇట్లు విహరించినాడు. ఇక్కడ భట్టుమూర్తి పల్వర్ణమును మల్లెపూవుతో బోల్చినాడు. ఆయాంగ్లకవి ఏనుగుదంతచ్ఛాయతో బోల్చినాడు. ఇప్పుడు వస్తువులపరస్పరభిన్నతయేకాని వర్ణములు రెండు నొకటియే. దీనంజేసి ఇదియు ప్రాచ్యకవిసమయమునకు చుట్టమనియే చెప్పదగును. ఇంక **Maynwaring** గారు నడుమును చిన్నదిగానే వర్ణించినాడు. వసుచరిత్రలో రామరాజభూషణుడు; తరుణివిలాసమునుగురించి; —

చ. కలికిముఖేందుకాంతి కరకాంతవరోజలదాంతవేళ వ
ర్తులకుచగండశైలములు దోప వళిత్రయశేషరేఖ లిం

పలరగ మధ్యసీమబయలై కటిసైకత మొప్ప బాల్యముఁ
బలునది యింకుచో మెరసె నాభిగభీరజలాశయంబునన్. ఆ. 2 ప. 39

ఇట్లు వివరించినాడు. ఇక్కడ మనకు ప్రస్తుతము కావలసినది నడుము. దానిని ఇతడును సన్నదిగానే పేర్కొనినాడు. ఒక యితడేకాదు—ప్రాచ్యకవులందరు నిట్లే పేర్కొందురు. కాబట్టి ఇక్కడ కౌనువర్ణనపట్ల ప్రాచ్యపాశ్చాత్యకవిసమయములు రెండును ఏకీభవించిన వనుట యుక్తియుక్తము. ఇయ్యెడ Maynwaring కవీశ్వరుడు యోషానాసాగమవాయు స్పర్శసౌఖ్యమును అత్యద్భుతముగ వ్యక్తీకరించినాడు. అనగా:—హిమద్రవము కలసిన మధురపానీయము వేసవియందు జిహ్వ కెంత రుచికరంబుగ నుండునో యాప్రియురాలి నాసాగమవాయుస్పర్శ దేహమున కంతటి యపూర్వసౌఖ్యము నొసగుచున్నదని కవిగారి యాంతరంగికభావము. మనసాంప్రదాయమునగూడ నాసాగమవాయువర్ణన కలదు. కాని యది యీపాశ్చాత్యసాంప్రదాయమునకు సమీకృతమా? కాదా? యని ప్రశ్నించిన ఉత్తరమిచ్చుట కష్టతరమే. అయిన ఇంతవరకు నేనుగాలించిన సంస్కృతాంధ్రవాఙ్మయమున యోషానాసాగమవాయువుయొక్క యేతాదృశవర్ణన లభించినట్లు గురుతు చాలదు. ఒక వేళ ఉండిన ఎక్కడైన ఉన్నదేమొ. ఉన్నను లేకున్నను; ఆమనోహారకవిసమయము మన కును సంపాద్యమని నాయభిలాష. "నారీరత్నం దుష్కులాదపి" కనుక లోకోత్తరమైన కవిసమయ మేదిక్కున ఏజాతీయవాఙ్మయమునందున్నను దానిని సుకవులు గ్రహింపవలసి నదే. ఇఁక చెక్కిళ్లవర్ణనము భూగోళశాస్త్రపరిస్థితుల ననుసరించి మనప్రాచ్యకవి సమయ మునకు దూరమగుచున్నది. ఆమెచెక్కిళ్లు తెలుపుఎరుపురంగులతో చెంగలించుచున్నవని Maynwaring కవి వ్రాసినాడు. ఇది మనప్రాచ్యశీతోష్ణస్థితికి విరుద్ధము. ఇయ్యెడ కవి సమయములు శీతోష్ణస్థితి ననుసరించి యుండవలసినదేకాని యిష్టమువచ్చినట్లు క్రిందు మీదగుటకు వీలుపొసగదు. ఇఁక తక్కినవర్ణన ప్రస్తుత మనవసరము. తదుపరి;—ఈ Maynwaring కవి పడతిచూపుల నుద్దేశించి;—

'Her eyes......look like crystal pure

ఇట్లు వ్రాసియున్నాడు. ఇక్కడ 'eyes' శబ్దమునకు చూపులని యర్థము. (అర్థము: ఆమెచూపులు నిర్మలమైన స్ఫటికరుచులువలె మెరయుచున్నవి.)

చేమకూర వేంకటకవి తనవిజయవిలాసమున ఇదే సమస్యనుగురించి;—

సీ. ......తడవేలచేసెదే ధవళనయన!; ఆ. 2. 190. పద్యం.

ఇట్లు వ్రాసినాడు. ఇక్కడకూడ 'నయన' శబ్దమునకు చూపనియే చెప్పనగును. ఇక్కడ ఈయిరువురును చూపులను సితరుచులుగానే పేర్కొనిరి.

**Her golden hair, dishevell'd, crisp, and long,**

**(Ovid's Art of Love. p. 141.)**

(అర్థము:—ఆమె విరబోసినవెండ్రుకలు మెలికలుదిరిగి సువర్ణచ్ఛాయ కుద్దియగుచు పొడుగుగ నున్నవి.)

ఉ. ......నిడువాలుఁగురుల్......... 2 ఆ. 46 పద్యం.

(విజయవిలాసం.)

క. ఇటు లాతఁడుండఁగా నక్కుటిలాలక యంత నచట గుసుమశరార్తిన్.

విజయవిలాసం. ఆ. 3. ప. 19.

నవలాశిరోజములు దృగ్రమ్యమైనమెలికలు దిరిగి పొడవుగా నున్నవనుటలో ఇక్కడ వీరిరువురిభావములును ఏకీభవించినవి. కాని శిరోజములు సువర్ణచ్ఛాయకు పోలియున్నవను నుడికారము మనకవిసమయమునకు కాని, మనప్రాచ్యశీతోష్ణస్థితికికాని కలియదు. ఇక్కడ అలక శబ్దమునకు "నెఱికురులు" అని ఆంధ్రవాచస్పత్యకర్తగారు నిర్వచించినారు. నెఱిశబ్దమునకు సౌందర్యమనియు దద్గ్రంథమే వక్కాణించుచున్నది. కాబట్టి ప్రస్తుతము 'కుటిలాలక' యను బహువ్రీహిసమాసపదమునకు ఇంపైన ఉంగరపు దలవెండ్రుకలని యర్థము చెప్పనగును. అనఁగా మెలికలు దిరిగి మనోహరముగ గనబడు తలవెండ్రుకలని యర్థము. ఈకాలపు పాశ్చాత్యవనితలశిరోజములు నవనాగరకతకులోనై కత్తిరింపబడి పొట్టిగానే యుండును. మనవారిలోను ప్రస్తుత మీయాచారము నవలంబించినవారు కొందరు లేకపోలేదు. కాని ఇది పూర్వకాలపువర్ణన.

పూర్వకాలమున పాశ్చాత్యనవలలశిరోజములును మనవారివివలె నిడుదగానే యుండెడివి. దేశీయచరిత్రాదులలోగూడ నాటిపాశ్చాత్యవనితలతలవెండ్రుకలు కత్తిరింపబడక నిడుదగా నున్నట్లే మనము ఛాయాపటములను జూచుచుందుము. **Charles Hopkins** అను ఆంగ్లేయకవి యొకజవరాలినిగురించి;—

"............................................

**Saw 'Atalanta' swift as lightning pass,**
**Yet soft as Zephyrs, swept along the grass.**

**(Ovid's Art of Love. p. 156.)**

ఇట్లు వర్ణించినాడు. (అర్థము:—ఒకయువకుడు మెఱుపువలె మిరుమిట్లుగొలుపు నొకఅట లాంటా యనుయువతిని చూచినాడు. ఇక్కడ ప్రస్తుతమున కుపయోగకరమగు ప్రథమచరణ మునకే తాత్పర్య మొనర్చితిని)

క. చెలియలు సుభద్ర వచ్చెన్, జెలియలు వేయాఱులు నరుచెంతల గొలువన్
దొలకరిమెఱపో యిది యని, తొలకరిదొరబిడ్డ వెఱగుతోడం జూడన్.

విజయవిలాసం. 2. ఆ. 93. ప.

అర్జునుఁడు సుభద్రను దొలకరిమెఱపేమో యని భ్రమపడి యాశ్చర్యముతో వీక్షించినా డట. అనగా:—ఆమె మెఱుపువలె ప్రకాశించుచున్నదని తాత్పర్యము. ఏతత్సమయమందు ఈప్రాచ్యపాశ్చాత్యకవులసాంప్రదాయములు రెండును సరిసమానముగ దూగుచున్నవి. సుప్రసిద్ధుఁడగు మిల్టనుకవీంద్రుఁడు తాను గ్రథించిన కోమస్ Comus అను సుప్రసిద్ధవీథి నాటకమున కులుకులుబెలుకు యోషామణి కలికిచూపులనుగురించి;—

"................love-darting eyes............ 753—756.

(అర్థము:—ప్రేమబెలుకుచూపులు.) ఇట్లు వర్ణించినాఁడు.

సీ. కులుకులాడిని ప్రేమ దొలుకుచూపుల జూచి
యలుకు మీరగ దోస మనుచు దొలగు.

తారాశశాంకవిజయము—2. ఆ. 89. ప.

శేషము వేంకటకవి యింగ్లీషురాని యాంధ్రుఁడు. మిల్టనుకవి తెలుగురాని యాంగ్లేయుడు. అయినను ఈసందర్భమున వీరిరువురిమానసికకవితాభిప్రాయములును సరితూగుచున్నవి. ఇది దైవసంఘటనము. ఇట్టివి పైనగూడ కొన్ని చూపితిని. అవియు దైవసంఘటనములనియే చెప్పనగును.

ఉ. నీరజగంధిమోవి జిగి నెక్కొనుముక్కరముత్తియంబు దా
మారుడు ధాతువాటిపటిమన్ ఘుటికాకృతి గట్టినట్టి సిం
దూరితపారదం బనగ నూత్నరుచిన్ గనుపట్టె,......

తారాశశాంకవిజయం. ఆ. 3. 44 ప.

తారయొక్క మోవిసమీపమున ఉన్న అడ్డబాసముత్తియము సిందూరవర్ణముతో మేళ వించిన పాదరసమాత్రవలె బ్రకాశించుచున్నదని దీనిభావార్థము. ఇక్కడ ప్రస్తుతమునకు వలసిన తాత్పర్యము నేటూకీగా వ్రైకొంటిని. పాదరసమనుటకు ముత్తియమునకు దగ్గర

నున్న బంగారము తాదృగ్వర్ణకము. సిందూరమనుటకు వాతెరతద్విధవర్ణమును గలిగియున్న దని భావము. ముత్తియము మోవిదగ్గరగ నొక్కనియుండుటంజేసి యామోవివర్ణ మా ముత్తియములో ప్రతిఫలించుచున్నది. అనగా ముత్తియమునకుపైన సువర్ణవస్తువు; క్రింద సిందూరితోష్ఠము. కాఁబట్టి అందులో ఈరెండురంగులు కలిసి ప్రతిఫలించుచున్నవని కవి గారి యూహాగమనిక. ఇప్పుడు పెదవులు సిందూరవర్ణముకలవి యనుసారాంశము తేలినది.

**"What need the vermil-tinctur'd lips for that,**

అర్థము:—సిందూరవర్ణాయుతములైన పెదవులు.
ఇక్కడ ప్రస్తుతమునకు వలసినయర్థమునే కైకొంటిని.

**Comus of Milton. 753—756.**

ఇక్కడ కూడ మిల్టను వేంకటకవు లేకీభవించిరి.

ఇఁక సంపూర్ణశృంగారకవితాకళ నెత్తి జూపెదను.

చ. అన విని గుండె ఝల్లనఁగ అచ్చెరుపాటును దిచ్చపాటు నొ
క్కొన; గరుపాటునుం గదుర; కొండొకసేపటు లూరకుండె....

తారాశశాంకవిజయం. ఆ. 3. ప. 64.

చంద్రా! నిక్కముదాపనేల? మనసార నిన్ను వలచితిని. నన్నిక మదనసామ్రాజ్యసౌఖ్య ముల దేలింపుమని తార తనముఖ్యాభిప్రాయమును చంద్రున కెరిగించినప్పు డతనిశారీర కావస్థ యెట్లు పరిణమించినదో యదియంతయు నీపద్యమున ఇమిడియున్నది. ఇది మోహా మునకు లోఁగనున్న యువకునకుగాని యువతికిగాని యంకురించెడియవస్థ. గురుపత్ని యను హేతువు కల్మిచంద్రునిమనమ్ము పాపభీతికట్లు పరిపరివిధంబుల పరిణమించియుండునని సందే హింపవచ్చును. వాస్తవమునకు గురుపత్నియే. అయినను—చంద్రుఁ డింతకుమున్నే తద్రూప రేఖలకు లోఁగి యామెను తనహృదయమున వలచియున్న ట్లింతకుముందున్న ప్రకరణమున గవి నిరూపించియున్నాఁడు. కాఁబట్టి ఇక్కడ తాదృక్సందేహమునకు తావు నాస్తి. ఈసం దర్భమున,—

**Maynwaring** కవి;—

**At first sight a shiv'ring pain I found**
**In all my veins, my heart received a wound;**
**I dreaded much to speak, my voice was broke.**

**(Ovid's Art of Love. p. 146.)**

తనకింపైన యువతీలావణ్యమునకు లోఁగనున్న యువకునియవస్థ నిట్లు చిత్రించినాడు. (అర్థము:—ఆమెను జూచీచూడఁగనే నాదేహము పులకరించినది. గుండె ఝల్లుమన్నది. భీతిచే మాటాడుటకైన నోట మాటరాకుండెను) ఇక్కడీయువకునకు తొలిచూపునందే యీయవస్థ యావేశించినది. అక్కడాయువకునకు తొలిచూపు కాదది. అత డంతకుముందు నుండియు తారను గాంచుచున్నవాఁడే. ఇక్కడ ఇది యొకటియే భిన్నమగుచున్నది. అయితే యొకటి చెప్పనగును. తారయం దతనికి వాంఛయున్నను ఆమె తనహృదయము నిట్లొక్కమారుగ బహిర్గత మొనర్చునంతవరకు తన్నిర్మలాభిప్రాయ మతనికి వ్యక్తము కాలేదు. కాఁబట్టి తన్నూతనసమయములో నదియే తొలిచూపని చెప్పవచ్చును. అట్లయిన ఇక్కడియువకుఁడు మాత్ర మీయువతీహృదయము తనకనుకూలముగ నున్నదని తొల్తనే గ్రహించియుండెనా? యని ప్రశ్న వచ్చుచున్నది ఇక్కడియువకున కీయువతీహృదయము తొలుత తెలియకున్నను; చంద్రునకు దారకు ఉన్న పావనపువరుస యియ్యెడ మృగ్యము. కాఁబట్టి యీయువకుఁ డీమెను బాహాటముగ గోరనగును. మరియు గొంతవడికైనను ఈపె యియ్యకొనకపోదనుఆశ యితనిహృదయమున ఉండుటకును అవకాశమున్నది. కాని చంద్రున కట్లుకాదు. ఆమె యతనికి మాతృసమాన యగుగురుపత్ని. అతఁ డొకవేళ ఆమె సౌందర్యమునకు బరవశుఁడైనను; గురుపత్నికదా. ఏమో యీసంఘటన యెటుపోయి యెటువచ్చునో యనుశం కతనిని వెనుకకు లాగుననిన సమంజసముకాకపోదు. తుద కామె సాహసించినప్పుడే తదుద్దేశమును గ్రహించి చంద్రుడు పరవశుఁడైనాడు. కాఁబట్టి మార్గదర్శికముగ గాకపోయినను, అనుభవసిద్ధముగ నదియే తొలిచూపనదగును. అప్పుడు వీరిరువురిభావప్రవాహములును సంపూర్ణముగ నేకీభవించుచున్నవనిన అతిశయోక్తి గోచరింపదు.

మరియు బరప్రేమకు లోనవనున్న ప్రాచ్యపాశ్చాత్యయోషాదైహికవర్ణనల బరామర్శించెదను.

క. పట్టినమాత్రనె దేవకి,పట్టికరాబ్జము; లలాటపట్టిక చెమటల్
వెట్టె; గగుర్పొడిచెఁ జను, క; ట్టొకయిసుమంత తొలగె గట్టుంగొంగున్.
(విజయవిలాసం. 2. ఆ 178. ప.)

మనఃప్రియుని ప్రప్రథమకరస్పర్శవలన సంభవించిన సుభద్రయవస్థనుగురించిన పద్యమిది. అనఁగా: పరవశగా బోవుచున్నదనుమాట. ఇది చేమకూరది. ఇఁక ఛార్లెస్‌ఆఫ్ కిన్సు కవిది కూడ గమనింతము.

**Soft was her bosom grown, her throbbing breast,**
**Heav'd with her breath, swell'd gently to be prest.**
**Warm were her lips, and every pointed kiss,**
**With melting touches, met and moisten'd his.**

**(Ovid's Art of Love. p. 156.)**

(అర్థము:—తనప్రియుని తొలితాకుడునకు ఆమె నవనీతప్రాయమైన హృదయము విస్తరించెను. అనగా కోరిక లీరిక లెత్తినవనుట. అసియాడుచనుకట్టు ఊపిరితోనిండి నిక్కపొడిచెను—గగుర్పొడిచెను. పెదవు లుష్ణతవహించెను. మానసహారమగుతచ్చుంబనస్పర్శకు ఆమె హృదయము కరిగి చెమ్మగిల్లెను. అనఁగా: చెమటలు క్రమ్మినవనుట. ఇది కేంద్రీకృతభావము.)

ఇక్కడ వీరిరువురిభావములు పూర్తిగ గలియకపోయినను; కొంతమట్టుకు గలిసినవనుటకు సాహసింపవచ్చును. పైపద్యములోని చనుకట్టు గగుర్పాటుచెందుట; లలాటపట్టికపై జమట లుద్గమించుట యనుఅంశములుమాత్రమే యీ ఆఙ్గ్లభావముతో గొంతమట్టుకు ఏకీభవించుచున్నవి.

ఉ. కమ్మజవాదివాసనలు గ్రమ్మగ; నోర పయంట జాఱగా
నెమ్మెలు మీఱ నగ్గురునియింతి తొలంగక విమ్ము లేనిమా
ర్గమ్మున జంద్రునిం గదియఁగా జని; వానిభుజంబు సోఁకగా
జిమ్మును జన్మొనగ్గళలు; చెమ్మగిలుఁ దనువెల్ల; జల్లనన్.

(తారాశశాంకవిజయం. ఆ. 2 ప. 73)

(చంద్రునియొక్కభుజము తాకినంతమాత్రనే తారానవలకు చనుకట్టుకళలమించి ఉబుకెత్తినది; శరీరమంతయు చెమ్మగిల్లినది. అనఁగా చెమటలు క్రమ్మినవనికూడ చెప్పనగును. ఏలయన; ఇక్కడ 'ఉష్ణముష్ణేన శీతల' మన్నట్లు కోష్ణాధిక్యమువలన చెమ్మగిల్లుటకాని కేవలము శీతలప్రవృత్తివలన చెమ్మగిల్లుటకాదు.) పైపద్యముకంటె ఈపద్యము తదాఙ్గ్లపద్యమునకు చాలమట్టుకు సరిపోవుచున్నది. ఏదో కొంచెము వారయున్నను మొత్తముమీద ఈసందర్భము దిరువురిభావములును కలిసినవని చెప్పనగును.

క. కాముకుఁడగాక వ్రతినై, భూమి బ్రదక్షిణము సేయబోయెడివానిన్
గామించి తొడితే దగ,వా? మగువ! వివేక మించుకైనన్ వలదా?

(విజయవిలాసం. 1 ఆ. 88 ప.)

ఉలూపి యర్జునుని దైహికసౌందర్యమునకు లోగి యాత్మస్వీకృతి నొనర్చి మదన సౌఖ్యముల దేలింపవలసినదని యతనిని ప్రార్థించినప్పుడు పాండవమధ్యము డొసగిన ప్రత్యుత్తరభావ సమ్మిళితమగుపద్య మిది.

**She answered, Friend! Your service I disdain:**
(మిత్రమా! నీపరిచర్యతో నాకు బనిలేదు. అనగా: నిన్ను వలవననుట.)

**(Ovid's Art of Love. p. 147.)**

ఇది **Maynwaring** కవిది.

అక్కడ ఉలూపి ప్రార్థింప అర్జునుడు పెడమొగమువెట్టినాడు. ఇక్కడ యువకుడు ప్రార్థింప యువతి ససేమిరా యనుచున్నది. ప్రేమికుడుకాని ప్రేమికకాని తనకు దానై కోరినప్పు డెదుటివ్యక్తి కనబరచుమార్గ మెట్లుండునో యిప్పు డీరెండుభావములును వ్యక్త మొనర్చుచున్నవి. పైసందర్భమున అంతమాత్రముచేత ఉలూపి యతనిని వీడదు. ఎట్లో బ్రతిమాలి తుదకు కృతకృత్యయగును. క్రిందిసందర్భమునగూడ ప్రేమికు డంతతో ఆమెను వీడక ప్రార్థించి తుద కామెను వశ్యను జేసికొనును. అనగా: వారట్లు పెడజవాబు లిచ్చిరే కాని హృదయములందు ఎదుటివారిపై గోరికలు లేకపోలేదు. ఇప్పు డీకవులభావములు రెండును ఇయ్యెడ బూర్తిగ గలిసినవని అనదగును.

**" Who are you pray? Whence come you? what's your name?"**
**Maynwaring. (Ovid's Art of Love. p. 147.)**

(అ:—నీవెవరవు? ఎక్కడనుండి వచ్చితివి? నీపేరేమి?)

ఆయోష తన్నుప్రేమించివచ్చిన ప్రేమికుని పృచ్ఛించినప్రశ్న మిది.

ఉ. తొయ్యలివంక కన్గొని; వధూమణి! యెవ్వరిదాన వీవు? పే
రెయ్యది?..................... (విజయవిలాసము. ౧. ఆ. 78 ప.)

అర్జునుడు మాయాక్రియవలన ఉలూపిచే బాతాళమునకు గొంపోబడి తెలివివచ్చినంత తచ్ఛృంగారచేష్టలు గమనించి యామె నిట్లు ప్రశ్నించినాడు. అక్కడ తన్ను ప్రేమించినప్రేమికుని యువతి ప్రశ్నించినది. ఇక్కడ తన్నుప్రేమించినప్రేమికను యువకుడు ప్రశ్నించినాడు ఇక్కడంగభిన్న మొకడే కనబడుచున్నదికాని భావమంతయు నొకటియే. అది కథా సందర్భమునుబట్టి యుండును. ఇక వీరిజవాబులగూడ పరిశోధింతము,—

**'Men call me Celandon'..........** **(Ovid's Art of Love. p. 147.)**
(మానవులు నన్ను సిలేండను అని పిల్తురు.)

ఇది; ఆయువకుఁ డాయువతి కిచ్చిన ప్రేమపూర్వకసమాధానము.

ఉ.,....ఓ మదవతీనవమన్మథ! యీజగంబు పా
తాళము;నే నులూపి యనుదాన; భుజంగమరాజకన్యకన్.

(విజయవిలాసము. ౧. ఆ. 79. ప.)

ఇది యువతి యువకునికిచ్చిన ప్రియప్రత్యుత్తరము.

తెలుగుపద్యములో నున్నంతవివరణ మక్కడలేదు. అయినను భావములు మేళవించినవనుట యుచితము.

తానువలచిన దెట్టిదైనను తనకంటికి రంభయే యనుసామెత ప్రస్తుత ముపయుజ్యము;—అది యీక్రింద సవిస్తరముగ నరయదగును.

చ. ... విలసనమెన్నగన్నదియు విన్నదికా దిలలో లతాంగులా
పొలతుక కాలిగోరులకు బోలరు, పోలునొ యేమొ తారకల్.

(విజయవిలాసము. ౧. ఆ. 121. ప.)

అర్జునుడు తదులూపీసౌందర్యమునుగురించి ప్రశంసించినసందర్భములోనిది ఈపద్యము.

For all their beauties had too mean appear'd,
with Rosalinda's matchless charms compar'd.

(అ:—అసమానమైన రోసలిండాపడతి సౌందర్యమునకు దక్కుంగలసౌందర్యము లెవ్వియు జతగానేరవు.) By Maynwaring.

(Ovid's Art of Love. p. 147·)

ఇక్కడి రెండుసందర్భములలోను ప్రేమికులు తమతమప్రేమికలసౌందర్యధనమును స్తుతించుచున్నారు. పదసమ్మేళనవ్యత్యాసముతక్క తచ్ఛేషమంతయు నిక్కడ పూర్తిగ ఏకీభవించినది. అనఁగా కేంద్రభావములు రెండును సరిపోయినవి. స్త్రీయైనను బురుషుడైనను, ఒకరు మరొకరిని ప్రేమించినప్పుడు వారికి ఆవలివారిపై బొడమెడిపరిశుద్ధమైన ప్రేమతత్వముపట్ల ప్రాచ్యపాశ్చాత్యకవితావాతావరణములు రెండు నియ్యెడ సమానస్కంధత్వమును బడసినవి. ఈసందర్భములోనే మరొక ఆంగ్లేయకవి.

There are more beauties, but there's none like thine,
No other charms can e'er inspire my muse,

(Ovid's Art of Love. p. 248.)

ఇట్లు వ్రాయుచున్నాఁడు. (అ:—జగత్తులో ఎన్నియో సౌందర్యములు కలవు. అనఁగా సౌందర్యవతు లుండిరనుట. కాని అవేవియు నీసౌందర్యమునకు సరిపోవు. అనఁగా:—నీకు సరిపోరనుట. నన్నితరసౌందర్యము లెవ్వియు ఆకర్షించియుండలేదు. అనఁగా:—నీకువలె నాహృదయ మెవ్వరికిని లొంగలేదనుట) పైదానికి దీనికిని కొంత తారతమ్య మున్నది. దీనికి:—

ఉ. భామిని భామినీమణుల భూరివిలాసరసైకమాన్యలన్
వేమరు ప్రేమ ముల్లమున విస్తరిలన్ గనుగొందుమే కదా
కాముని మోహనాంబకముకైవడి దద్దయు సుద్ది మీరు న
క్కామిని రూపవైభవము గన్నులగట్టినయట్ల యుండెడిన్.

(రసికజనమనోభిరామము. ఆ. 5. ప. 29)

ఇది కూచిమంచితిమ్మకవిగారిది. ఈప్రబంధమునకు కథానాయకుఁడైన ఋతుధ్వజుఁడు తాను ప్రేమించిన సుశ్యామయొక్క సౌందర్యమహిమనుగూర్చి పలవరించుచున్నాఁడు. ఆపద్యభావమున కిదియే పునాది. ఈపద్యముయొక్క చివరపాదములో తత్సౌందర్య మాతని ఆకర్షించెననియు తదితరసౌందర్యము లాతని ఆకట్టలేకపోయిన వనియు నొక యంతరార్థము ధ్వనించుచున్నది. ఆంగ్లపాదమున తేటతెల్లముగనున్న యాభావ మిక్కడ అంతఃస్థితమై యున్నది. అదితక్క కేంద్రభావములలో ఈరెంటికి వ్యత్యాసమేమియు లేదు. మన్మథుని బలప్రాశస్త్యముపట్ల ప్రాచ్యపాశ్చాత్యమానసికవిశ్వాసము లెట్లున్నవో చూడుడు:—

**'Tis love that drives, and all must yield to love!**

**(Ovid's Art of Love. p. 247.)**

(అ:—ప్రేమతత్త్వమునకు దాసులు కానివా రెవరును లేరని దీనిముఖ్యభావన.)

ఉ. కాకయొ సంచరించినను కాదన నేటికి? కంతుబారికిన్
లోకువగానివారు ధరలో గలరే!... (తారాశశాంకవిజయము. 3. ఆ 61. ప.)

అక్కడికవిప్రయోగమున కిక్కడికవిప్రయోగమునకును శబ్దార్థవ్యత్యాస మొకఁడేగోచరించుచున్నదికాని ముఖ్యభావములు రెండు నొకటియే. మొదటగ సరిజవాబులిచ్చిన ప్రముఖులహృదయపరిస్థితులు చివర కెట్లు పరిణమించినవో చూడుడు:—

......................Thou slave, arise,
Cried Rosalinda : now thy love I pride.
I only tried thy heart ; and since I find
'Tis soft and tender, know that mine is kind :
Swear but to keep the oath you lately took,
And I'll be not so cruel as I look.'
Her eyes then languish'd and her face grew red,
And squeezing fast my hand, she laughing said,
'I know a way thy passion to appease,
And soon will set thy simple hert at ease.'
But ere she brought me to her promis'd bed,
The rapture walk'd me, and the vision fled.

(Ovid's Art of Love. p. 148.)

అర్థము:—ప్రియా! లెమ్ము. నీప్రేమ స్తవనీయము. నాకు నీయందు ప్రేముడి లేక పోలేదు. కాని నీహృదయసారళ్యమును బరీక్షింపగోరి నిన్నిట్లు కలఁచితిని. క్షమింపుము. నీవిప్పు డొనర్చినశపథము నేమఱేయుండకు. అని రోసలిండాయువతి తనప్రేమికు నూరడ బల్కగానే యాపె దృక్కులు చీకట్లుగ్రమ్మినవి. మోము కందినది. తదుపరి తత్కరము స్పృశించి యొకింత నగి ప్రియుఁడా! నీకోర్కె సఫలమొనర్చెద; నీసరళహృదయమునకు ప్రశాంతి చేకూర్చెదనని తిరిగి యాతని నూరడించినది. ఈవిధముగ యామె యనుగ్రహ మును సంపాదించినప్రేమికుఁ డామెపాన్పునకు జేరకమునుపే; పరవశతానందమున జగత్తునే మరి మునిఁగిపోయినాడు. ఇక్కడ ప్రేమిక ప్రేమికుని 'Slave'! దాసుఁడా! యని సంబో ధించినది. పవిత్రప్రేమగల భారతీయప్రేమిక తనప్రేమికు నిట్లెన్నడు తుచ్ఛముగ సంబో ధింపదు. ఇది మనసాంప్రదాయమునకు విరుద్ధము. ఇక్కడ నేను ముఖ్యముగ భావార్థమునే కైకొంటిని. కాఁబట్టి విమర్శకచూడామణులు తొందరపడకుందురుగాక. ఒక ఇక్కడే కాదు. ఈవ్యాసమందంతటను నేను ముఖ్యముగ భావార్థమునే సేకరించితిని.

చ. అని వచియించునప్పుడు ముఖాబ్జము నంటెడివిన్న బాటు చ
క్కని తెలిసోగకన్నుగవ గ్రమ్ముచు నుండెడిబాష్పముల్ గళం
బున గనిపించు గద్గదిక ముప్పిరిగొన్న వలవంత దెల్ప ని
ట్లను మదిలో గరంగి రసికాగ్రణి యాకరభోరుతో డుతన్.

(విజయవిలాసము. ఆ. 1. ప. 103.)

ఉ. చక్కెరబొమ్మ! నావ్రతము చందము దెల్పితి నంతెకాక, నీ
చక్కదనంబుగన్న నిముసంబయినన్ నిలుపోప శక్యమే!
యక్కున జేర్పకంచు దయ నానతియీఁ దలవంచె నంతలో
యెక్కడనుండివచ్చె? దర శేత్షణకున్ నునుసిగ్గుదొంతరల్.

(విజయవిలాసము. ఆ. 1. ప. 104.)

ఉ. కౌఁగిటజేర్చునప్పటిసుఖంబె లతాంగికి పారవశ్యమున్
మూఁగగజేసె... ... ... ... (విజయ. ఆ. 1. ప. 108)

మొదట రోసిలాండా తన్నువచ్చి బ్రతిమాలినప్రేమికుని నిర్లక్షించినది. చివర కతని యమలినప్రేమాతిశయమును గ్రహించి తలయూచినది. అదేవిధముగ అర్జునుడు తొలుత తన్నువలచిరాఁ బ్రార్థించిన ఉలూపీకన్యను నిర్లక్షించినాడు. పదపడి తత్ప్రేమాతిరేకమును గ్రహించి తలయూచినాడు. అక్కడ తనకై వినిర్మలప్రేమాయుతవేదనలో మునిగియున్న తనప్రియునియవస్థను గనినప్పుడు తుదకు రోసిలాండాయొక్క బాహ్యప్రవృత్తు లెట్లు పరివర్తితములైనవో యాంగ్లకవి చిత్రించి మనయెదుట బెట్టినాడు ఇక్కడ తనకై వినిర్మలప్రేమాయుతవేదనలో మునిగియున్న తనప్రియురాలియవస్థను గనినప్పుడు తుదకు పాండవమధ్యముని బాహ్యప్రవృత్తు లెట్లు మారినవో వెంకటకవి చక్కగ చిత్రించినాడు. అనగా:- అప్పుడు వారికి ఎదిరివారియందంకురించి మొదట అంతర్లీనమై తుదకొక్కపెట్టున ఉబుకొత్తి వెలువడిన అవిశుద్ధప్రేమలలోని కరుణాజ్యోతులే అందుకు మూలములు. తదుపరి రోసిలాండా తనప్రియునితో ఎట్లు ప్రేమమయంబుగ ముచ్చటించినదో; అర్జునుడు తనప్రియురాలి నెట్లు బుజ్జగించి పలికినాడో ఆయాసందర్భములను కవులిరువురు రూపించిరి. పిమ్మట లబ్ధమనోరథులగువారిరువురు తత్తత్కరస్పర్శలవలన ఎట్లు పరవశతా బ్రహ్మానందములో మునిగియుండిరో తత్సందర్భములనుగూడ రచయిత లిరువురు పేర్కొనియున్నారు. ఈసందర్భమందు కొన్నిచోట్ల ఆంధ్రములో ఉన్నన్నియంశము లాంగ్లమునలేవు; తదాంగ్లమున ఉన్నన్నియంశము లాంధ్రమున గనబడవు. అయినను ఇయ్యెడ ఇతివృత్తముల ననుసరించి యిరువురియొక్క ముఖ్యభావములు నేకీభవించినవి. ఒక రొకయంశమును కుంచించి వ్రాయవచ్చు, మరొక రింకొకయంశమును పొడిగించి వ్రాయవచ్చుగాని యక్కడ ఇరువురియభిప్రాయములు కలిసినవా? లేదా? యనువిషయమే పరస్పరసంబంధగ్రహణవిమర్శకు ముఖ్యముకాని తదన్యముతో పనిలేదు. కామితంద్రానుమానహృదయపరిస్థితిపట్ల ఈప్రాచ్యపాశ్చాత్యులభావలహరీ ద్వితయం బెట్లు ప్రవహించినదో గమనింతము.

"To press not daring, though by love inspir'd;
But still her image dwelt within my breast,
Too excellent to be in verse express'd."

(Ovid's Art of Love. p. 146.)

(అ:—కట్టా! ఇదెక్కడి పాపము. ఈయువతీలలామ తాఁబూర్తిగ నాహృదయశుకమును వశ్యమొనర్చుకొన్నను; నే నీపెకు నామానసికమును విప్పి చెప్పలేకపోవుచున్నాను. అనగా:—తానట్లు చెప్పినచో ఒకవేళ ఆమె యొప్పునో లేక యొప్పక ఏమనునో యను సందిగ్ధభీతి ఇందలియువకు నావహించినది.—కాని యీామె స్వరూపసౌందర్యమంతయు నాహృదయదర్పణమున దివ్యతరముగ ప్రతిబింబించుచున్నది.) ఇవి రోసిలాండాకన్యను గురించి తత్ప్రేమికు డనుకొనుచున్న పలుకులు.

క. ...ముద్దియ చనుదేర మిగుల మోహాతురుడై. (విజయ. ఆ. 2. ప. 144.)

చ. బలిమిని బట్టగా దివురు; బట్టిన ఒప్పక యిట్ట టన్నచో
బలువు రెతెంగిరేని నగుబాటని కొంకు; దలం పెరుంగకే
కలయగ జూచుటల్ తగవుగాదని యుండు; నతండు కాంతనె
చ్చెలుల నొకింత బాసి తనచెంత మెలంగుచు నున్న వేళలన్. (విజయ. ఆ. 2. ప. 145.)

ఇది సుభద్ర తనచెంత నున్నప్పుడు పాండవమధ్యముని హృదయాందోళన. అనఁగా:—తనహృదయ మామె కమ్ముడుపోయినను; తదభిలాష నామెకు సాహసించి చెప్పలేకయున్నాదని భావార్థము.

ఉ. ఎక్కడ జప్పుడైన దరశేక్షణ వచ్చె నటంచు లేచు నే
దిక్కున అల్కుడైన సుదతీమణి పల్కని యాలకించు; నే
చక్కి దళుక్కుమన్న అలజవ్వనిమై సిరి యంచు జూచు; న
మ్మక్క! కిరీటిమోహసముదగ్రత ఏమనవచ్చు నయ్యెడన్. (విజయ. ఆ. 3 ప. 6.)

సుభద్ర తనహృదయము జూరగొనిపోయిన పిమ్మట అసియాడెడుకిరీటిహృదయగోళ మిట్లున్నదని దీనితాత్పర్యము.

"But still her image dwelt within my breast,
Too excellent......................."

రోసిలాండాయువతి సమక్షములోనున్న ఆప్రేమికునిహృదయప్రపంచ మిట్లున్నదని దీని భావము. (చూ. పైన.) అక్కడ కిరీటికి లోకమంతయు సుభద్రామయముగ గనబడు

చున్నది. ఇక్కడ ప్రేమికునకు జగత్సర్వము రోసిలాండామయముగ గానవచ్చుచున్నది. కాని అక్కడీభావము తేటదెల్లముగ నున్నది. ఇక్కడ కొంచె మంతర్యుతమై యున్నది. అక్కడ సుభద్ర వెళ్లినపిమ్మట కిరీటిహృదయ మట్లున్నది. ఇక్కడ రోసిలాండాకన్య సమీప మందున్నప్పుడే ప్రేమికునిడెంద మిట్లున్నది. ఇక్కడ సమయములు ఛేదిల్లినను కేంద్రభావ మంతయు జాలమట్టుకు సరిపోవుచున్నది. ఏలయన,—'But......excellent' అనుపాద ములో అంతర్లీనమైయున్న భావమంతయు బైపద్యములో సువ్యక్తముగ వ్యాప్తమై యున్నదనుట నిర్బాధకము.

"To press.........................inspir'd ;

క.... ... ...మోహాతురుడై

చ. బలిమిని... ... ...వేళలన్.

ఇయ్యెడ ఆంగ్లపద్యపాదమున ఏభావమంతర్గతమై యున్నదో ఆభావ మీచంపకపద్యమున సువ్యక్తమై యున్నది. (చూ॥ పై—) పరిశీలించిన ఇక్కడకూడ ప్రాచ్యపాశ్చాత్యకేంద్రో ద్దేశము లేకీభవించినట్లు స్పష్టమగుచున్నది. ఇక ప్రేమికులు తాము ప్రేమించినవారిని ఇయ్య కొన బ్రార్థించుటలో ఆంగ్లాంధ్రకవులమార్గము లెట్లున్నవో గమనింతము.

Accept my service, thou celestial fair!
And oh! relieve a dying lover's care; (Ovid's Art of Love. p. 146.)

(సుందరీ! నాసేవ నంగీకరింపుము. అట్లంగీకరించి పంచశరుబారికి తాళలేమి అసువులు గోల్పోవనున్న ఈప్రేమికుని సంరక్షింపుము.)

ఇవి రోసిలాండాను సంబోధించుచు దత్ప్రేమికు డనుపలుకులు.

మ.... ... ఈచంద్రాననస్మార్చి నన్
బ్రతికింపంగదె ముద్దుకీరమ సుధాబంధూభవద్గీరమా!. (విజయ. ఆ. 2 ప. 184.)

చ. సమదగజేంద్రకుంభవిలసత్కుచకుంభయుగంబు రొమ్మునన్
దమి నిగుడన్ ఘటించి; ప్రమదమ్మున బిగ్గ గవుంగలించి; యీ
సుమశరతాపమార్చి నను సొంపుగ బ్రోవు, మదభ్రమద్భ్రమ
ద్భ్రమరవినీలవేణి! నిను బల్మరు కేల్మొగిడించి వేడెదన్.
(రసికజనమనోభిరామము. ఆ. 5. ప. 143.)

'Accept my service' అనుపదములో అంతర్లీనమైయున్న భావ మీతిమ్మకవిగారిపద్యమున బహిర్గతమై యున్నది. ఒకవిషయ మిప్పుడు గమనీయము. ఈశృంగారరసాయుతకవితపట్ల ఆంధ్రకవిశేఖరులు చిత్రించిన యపూర్వమనోహర చిత్రవర్ణనాభావనలు నిజమున కాంగ్లకవితలో గన్పడవు. తరచి చూచిన భావములు దొరకవచ్చునేమోకాని యీవర్ణన లయ్యెడ లభించుట కష్టతమము; మృగ్యములనియు జెప్పనగును. అందులోగల కొన్నియపూర్వ వర్ణన లిందును లేవనిన అనవచ్చును. కాని యీసందర్భమున ఈరెంటిని త్రాసునబెట్టి తూచిన విలువ తెలుగుకైతకే లభించగలదు. అక్కడ ప్రేమికుడు 'రోసిలాండా' ను నాసేవ నంగీకరింపుమని బ్రార్థించినాడు. అనగా: అభిలాష దీర్పుమనుట. ఇదేఉద్దేశమునుగురించి మన తిమ్మనాంధ్రుని డెంత మనోహరకవితా ప్రతోళికలలో విహరించినాడో గమనింపుడు. (చూ॥ రసిక.) 'పుణ్ణే కొకబుద్ధి' అన్నారు మనపెద్దలు. కాబట్టి ఏదెట్లున్నను ఇక్కడ సమయములే వేధిల్లుచున్నవికాని ముఖ్యోద్దేశములు కలియుచున్నవి.

అక్కడ 'రోసిలాండా'ను ప్రప్రథమమందే ప్రేమికుడు బ్రతిమాలును: ఇక్క డాంధ్రమున సుభద్రాసుశ్యామలను కిరీటి ఋతుధ్వజులు కొంతవడిని కడచినపిమ్మట బ్రతిమాల నుంకింతురు. అయితే కిరీటి సుభద్రను బ్రతిమాలుటలో సుభద్రనే సంబోధించలే దిక్కడ. ఒక కీరమును సిఫార్సుచేయవలసినదని కోరును. (వివరము లరయగోరువా రాయాగ్రంథముల జూడుడు. ఇందు ప్రస్తుతావసరములైన విషయములే పొందింపబడును) అక్కడి— 'Relieve a dying lover's care' (చావసిద్ధముగ నున్నప్రియునితాప ముడిపి బ్రతికింపుము.) ఈపాదార్థమునకు దెనుగులోని "ఈసుమశరతాపమార్చి నను సొంపుగ బ్రోవు"..."ఈచంద్రాననగ గూర్చి నగ బ్రతికింపంగదె"...యీపాదార్థములు సరిసమానములుగ నున్నవి. ఇక్కడ 'Care' శబ్దమునకు తాపమని అర్థము చెప్పవలయును. సమయములు పొందికలు మున్నగునవిమాత్రమే కలియకున్నవికాని కేంద్రోద్దేశము లిక్కడ పరస్పరభిన్నత గాంచియుండలేదు. ఇక యువతులుకాని యువకులుకాని తాము ప్రేమించిన వ్యక్తులయందలి మోహావేశమును కొన్నికొన్ని వస్తువులయం దారోపించి తమలో దా మెట్లు పరాయణచేయుచున్నారో; తత్తత్సమయములందు ప్రాచ్యపాశ్చాత్యకవితావాతావరణము లెంతవరకు నేకీభవించినవో పరిశీలింతము;—

"Why do I have? thou little trifle go,
And that I die for her let the dear creature know."

(Ovid's Art of Love. p. 245.)

(ఒకప్రేమికుడు తనప్రియురాలి కొకయుంగరమును పంపుచు దదంగులీయకముతో నిట్లు ప్రసంగించును.—"ఓయుంగరమా! పలుమాటలేల? నీవు కొంచెము వెళ్లి యామెకై ప్రాణములు విడువనున్నానని నామాటలుగా నాప్రియురాలికి విన్నవింపుము.)

చ. అమరనితంబినీసురుచిరాననసారససారసౌరభ
భ్రమ బరతెంచె దేమొ; మదబంభరరాజమ! శంబరాహితా
సమసుమసాయకవ్యథలజాల కలంగుచు నున్న నాతెరం
గమలకృపాంతరంగమున నప్పువుబోడి కెరుంగజెప్పుమా.

(రసికజనమనోభిరామము. ఆ. 3. ప. 134.)

ఋతుధ్వజుడు తనవద్ద కరుగుదెంచినతుమ్మెదతో సంభాషించిన పలుకులివి.

"To touch her hand thou wilt the pleasure have ;
I now must envy what my self I gave." (Ovid's Art of Love. p. 245.)

(అ:—అత డాయుంగరముతో మరియు నిట్లనుచున్నాడు. "ఉంగరమా! ఆసుందరీ హస్తమును స్పృశింపగల పరమభాగ్యమును సంపాదించితివి. ధన్యురాలవు. కాని నేనను భవింపవలసిన నాప్రియురాలిసంగతిసౌఖ్యభాగ్యమును నాకంటె ముందే నీవనుభవించు చున్నందులకు నాకసూయత కలుగుచున్నది. నాచేతులార నేనే నీకాభాగ్యము నొడగూర్చు చున్నాను.)

చ. చెలిమి దలిర్ప నానవకుశేశయపత్రవిశాలనేత్రను
న్నలపపుగమ్మతావులు ఘనమ్ముగ నిమ్ముగ గ్రుమ్మరించు బ
ల్కులుకుమిటారిగబ్బిచనుగుబ్బల నొత్తి కవుంగలించె; నౌ
బళిబళి! యిక్కురంటకముభాగ్యము చెప్పదరంబె? నెచ్చెలీ!

(రసికజనమనోభిరామము. ఆ. 3. ప. 123.)

ఋతుధ్వజుడు తనప్రియురాలి యురఃస్థలమున గుబాళించుచున్న చంపకదామమునుగూర్చి తనమిత్రునితో నిట్లు సంభాషించును.

"O ! would a proteus or circe change
Me to thy form, that I like thee might range
Then would I wish thee with her breast to play
And her lefthand beneath her robes to stray."

(Ovid's Art of Love. p. 245.)

(అ:—ఓహో! భగవంతుడు నన్నే నిన్ను నిన్నే నన్నుగా బుట్టించినాడు కాఁబోలు. అయితే నీమీద నాకిక అసూయలేదు. నీవిఁక వెళ్లి ఆమె యురఃస్థలముపై జక్కఁగ నాడుకొనుము. ఆమె సిగ్గిలి యాతంకపరిచినను; ఆమె నెట్లో మరులుగొలిపి తత్కంచుకాంతరమున జొచ్చి యథేచ్ఛగ నయ్యాటలాడుకొనుము. మరల అత డాయుంగరముతోనే యిట్లు సంప్రదించును.)

గీ. కలికి యురమున నెత్తావికలపమలఁది, విరిసరంబులు దమి నుంచువేళ జాల
వరల జేయుదుగాని; మేల్మరచియేను, నిన్ను జిక్కఁల నిడజుమీ; బన్నసరమ!
(రసికజనమనోభిరామము. ఆ 5. ప. 58.)

ఋతుధ్వజుడు తనప్రియురాలివద్దనుండివచ్చిన బన్నసరముతో నిట్లు సంభాషించును. ఇవియే తత్సందర్భము ననుసరించిన ఆంగ్లాంధ్రకవుల సూక్తులు.

**"Why do I rave...... .........know."**

చ. "అమర ... ... ...జెప్పుమా."

అక్కడ ప్రేమికుడు తత్ప్రేమికావిరహతాపదుర్భరంబునం జేసి యశ్వాతింపనున్నానని ప్రియురాలికి విన్నవింప నుంగరమును ప్రేరేపించియున్నాడు. ఇక్కడ ప్రియుడు తన్మనోహారీ విరహదుర్భరకలన గృశించుచున్నానని ప్రియకు మనవిజేయ భ్రమరమును బ్రతిమాలుచున్నాడు. అక్కడ వార్తావహ మొనర్పనున్నయుంగర మచేతనము. ఇక్కడిది తుమ్మెద చేతనము కలది. అయినను తుమ్మెద ఒక కీటకమువంటిది. ఉంగర మెట్లు మానవాదులతో మాటాడజాలదో యీతుమ్మెదయు తదన్యజాతులతో బ్రసంగింపజాలదు. కాబట్టి యిక్కడి భ్రమరాంగులీయకముల నొకటిగా జెప్పనగును.

**"To touch......... .........gave."**

"చెలిమి... ... ...నెచ్చెలీ!"

ఇక్కడి యుంగర సంపెగదండలు రెండు నచేతనములే. అయితే ఆంగ్లప్రేమికు డుంగరముతోనే సంభాషించినాడు. ఆంధ్రప్రేమికుడు దండను నిర్దేశించి తననెచ్చెలితో సంభాషించినాడు. (ఇక్క డాంధ్రాంగ్లప్రేమికులను రచన కవితాప్రత్యేకతల నరయుటకుమాత్రమే వాడబడినది.) ఆంగ్లమున తనప్రియురాలిస్పర్శసౌఖ్యమును తనకంటె ముందే యుంగర మనుభవించునను కుళ్లుబోతుతనము ప్రేమికున్నట్లు పఠనమాత్రముననే వ్యక్తమగుచున్నది. ఆంధ్రమున అయ్యది యంతర్గతమై పైకి ఋతుధ్వజున కొకయచ్చెరువుమాత్రమే పొడముచున్నదను భావ మొకదే స్ఫురించుచున్నది.

శేషు

"O !.............................stray."

"కలికి...                ...                ...సరమ !"

ప్రేమికులనుండి ప్రేమికలకు సందేశముల గొంపోవ నియమింపబడిన ఇక్కడివస్తువులు రెండు నచేతనములే. ఇరువురును వస్తువులను బుజ్జగించుచున్నారు. వీటితో నిట్లు సంభాషించినవారి కేమిఫలితమని కొందరనవచ్చును. లాభములేనిమాట నిజమే. కాని ఇది విరహులకు సహజము. తమతమహృదయములలో అతిశయించి యుబుకెత్తుచున్న నానావిధోత్కళికావేశమును దిగమ్రింగజాలక ఏవో కొన్నివస్తువులయం దారోపించి తమలోదామట్లు సంభాషించుకొందురు విరహులు. ఇది ఆంధ్రకవితాసమయము. ఇప్పు డీసమయ మాంగ్లకవితను గూడ కలదని తెలిసినది. ఇక్క డుభయకవితలలోను వస్త్వంతరాదులైన కొన్ని భేదములు తక్క సందర్భావశ్యకములైన ప్రధానోద్దేశములలో వ్యత్యాస మేమియు గనబడదు. అనఁగా.—విరహుల చేష్టాదులను బేర్కొనుసప్పు డుభయభాషాకవుల ముఖ్యభావము లేకీభవించుచున్నవి. ఇంకను ఈప్రాచ్యపాశ్చాత్యులుకామాతురులచిత్తవృత్తుల బేర్కొనుటయం దెంతవరకు ఏకీభవింతురో సమీక్షింతము;—

> Unless some pity on my pains you shed,
> The frosty grave will quickly be my bed.
>
> (Ovid's Art of Love. p. 148.)

(అః—ఇఁక నీకు నాపై అనుగ్రహమురాదేని; నీమూలమున నాచావు నిక్కువము.)

రోసిలాండాకన్య యెంతకు మెత్తపడకుండ నున్నతఱి ప్రేమికుడుపలికిన అంత్యవచనములివి. ఇక్కడ కామాతురుడు ప్రేమికుడు.

> శా. రావై రాగ్యము బూని నీవు కడునిర్దాక్షిణ్యచిత్తమ్మునన్
> రావైతే జవిగాని యిందులకు హాహారాహారిగాఁ బోరి యే
> లా వాలాయము సేయగా; బ్రతుకు నీవాచారవంతుండవై
> చావో యెక్కుడో నీయెడం బొడము వాంఛన్ భూసురగ్రామణీ !
>
> (మనుచరిత్ర. ఆ. 3. ప. 94.)

గంధర్వుని నిజప్రేమితప్రవరునిగా నెంచినవరూధుని ప్రేమికుని బ్రతిమాలి బ్రతిమాలి తుదకు విసివి పలికినపలుకు లివి. (నీవు దయచూడవేని నాకు ఇఁక చావే నిక్కువము. ఇది చివరకు దేలెడియర్థములోని ముఖ్యార్థము.) ఇక్కడ కామాతుర వరూథిని. దూరదృష్టి నిగిడింతుమేని, ఈసందర్భమున పెద్దన్న మేయన్‌వారింగు కవులపోకడలు పూర్తిగ సంగమించినవని

విశ్వసింపక తప్పదు. అయితే అక్కడి ప్రార్థకుడు పురుషుడు. ఇక్కడి ప్రార్థకి స్త్రీ. కాబట్టి యొక లింగవ్యత్యాసమే కనబడుచున్నది. అది ఇతివృత్తసంబంధకము.

"Let me a fair and gentle mistress have,
And then proclaim aloud that I'm her slave."

(అ.—నాకు అనుకూలవతియగు గృహిణి నొసగి ఆపెకు నన్ను సదా దాసునిగ నుండునట్లొనర్పుము) (Ovid's Art of Love. p. 247.)

గీ. ...నన్ను బంటుగా నేలుము; నలినవదన!. (భా. విరాటపర్వము. ఆ. 2. ప. 118.)

ఇవి ద్రౌపది నుద్దేశించి సింహబలు డనినపలుకులు. ఇక్కడి ప్రేమవిజితు లిరువురును తమతమప్రేమికలకు దాసులమై యుందుమని వక్కాణించుచున్నారు. ఇది కామాతురుల లక్షణము. ఈలక్షణ మిక్క డుభయస్థానములోను సమస్థితిగానే వివృతింపబడినది.

"To your commands my faithful heart I bind,
And have forever liberty resign'd. (Ovid's Art of Love. p. 146.)

(నీయాజ్ఞానువర్తినై మెలగెదను. నీకు సంపూర్ణస్వేచ్ఛ నిత్తును.)

క. నాకులకాంతల నెల్లను, నీకుం బనిసేయ బనిచి నెయ్యంబుననే
నీకనుసన్నన మెలగెద; నేకార్యంబైన నడుపు, మీావ తగంగన్.

(భా. విరాటపర్వము ఆ. 2. ప. 124.)

ద్రౌపదితో కామాతురుడైన కీచకుడు పలుకు పలుకులివి. ఇక్కడ కూడ ఉభయకవితా సమయములు పరస్పరేకీభూత సందర్భముల నిమిడియున్నవి. ఇప్పు డుభయకవితలలోని కామాతురవైఖరీసమత్వముల గనుగొంటిమి. ఇవి చదువునప్పుడు పాఠకులు "కామాతురాణాం న భయం న లజ్జా" ఈశ్లోకమును జ్ఞప్తినుంచుకొనదగును.

ఇక వియోగశృంగారరసావతరణమును గూడ జవి జూతము.

"పురపురజిత్తంబు పొక్క నందంద,కరుణతో నారాజకాంతాలలామ
సుతుడును దాను నేడ్చుచు జనుదెంచి,పతిపాదనులమీాద భక్తితో వ్రాలి
కొడుకు మ్రొక్కించి డగ్గుత్తిక బెట్టి,కడగోర గాటుకకన్నీరు మీాటి
పాణిపల్లవములు పరగంగ మోడ్చి,ప్రాణేశ! నేటితో బాసితే మమ్ము
బాయద్రోవలు చేసె బ్రతిబంధ మకట! (ద్విపద హరిశ్చంద్ర—ఉత్తరభాగము.)

ఇది గౌరనగారిది. ఈపంక్తులు చంద్రమతి తా గాలకౌశికుని వెంటబోవనున్నప్పు డాచరించిన కర్మసమనుసృతములు. చిరకాలమిత్రుడు; నిష్కల్మషహృదయాధివిహారి; పతిదైవమగుహరిశ్చంద్రుని యెడబాటు తప్పని సరియగుచున్నందులకు చంద్రమతి విలపించెడి యెడ తెగని గద్గదికాశ్రుకర్మసంయుక్తవిషాదపుంజీకృతార్థవివృణకములగు పలుకులవి.

"On his dear neck her snowy arms she hung,
And streaming tears a while restrain'd her tongue
But at the last her dismal silence broke,
These mournful words the weeping princess spoke.
(Ovid's Art of Love. p. 173.)

(అ:—యువతి తనప్రియుని గౌగిలించుకొని, విషాదబాష్పఝరీగాద్గదికస్వరనిరోధములు కతన గొంతవడి నిశ్చేష్టయై చివరకు విలాపస్వరసంకలితంబులగు ఈపలుకులు పలికెను. ఇది ఛార్లెస్ హాఫ్‌కిన్సు కవిగారిది. సమరాంగమున యుద్ధము బాహాటముగ సాగుచున్నది. అతడు బాధ్యతగలయోధుడు ఆలమునకు వెళ్లక తప్పదు. అక్కతన సర్వసంసిద్ధుడైనాడు ప్రయాణమునకు. తనప్రియతమ హృదయేశ్వరుని విడనాడలేక అదేసమయమున తద్గృహిణి యుద్ధమునకు బోవలదని హృదయేశ్వరు నెంతయు బ్రతిమాలును. కాని అతడు పోకమానడు. ఆసమయమున అతనితో బలుకనున్న ఆమె విషాదవైఖరీప్రకాశిక పంక్తులివి. ఇక్కడ ఉభయత్ర పతివియోగశృంగారరససమాశ్లిష్టసందర్భంబులగు సంఘటనలే..."a while restrain'd her tongue." ఇది "డగ్గుత్తికబెట్టి...దీనితో బూర్తిగ సరిపోవుచున్నది. అక్కడ ప్రేయసి ప్రేయసుని సాంజలిబద్ధయై సంబోధించుచున్నది. ఇక్కడ కౌగిలిజేర్చి సంబోధించుచున్నది. ఇక్కడ ఆచారాదికములు కొన్ని వ్యతిరిక్తములైనను, మొత్తముమీద సారాంశ మొకటియే. ఆసారాంశమున రెండిటికి ఏకీభావము చాల సన్నిహితమై కనబడుచున్నది. ఇక్కడ కలుగబోయెడి పతివియోగసందర్భమున సతులకు సంభవించెడివైఖరుల జేర్కొనుటలో ఉభయకవులును చాలమట్టుకు ఒకదారిలోనే నడిచిరి. అంతియేకాక ఈ ఆంగ్లకథ మనమహాభారతములోని యుద్ధమునకు బోనున్న అభిమన్యుని వలదని విలపించుచు బ్రతిమాలుకొనెడి తన్మనోహారికథకు పూర్తిగ సరిపోవుచున్నది.

ఈవ్యాసమున చాలమట్టుకు సాంతముగా బూర్వకవులనేకాని నవ్యుల నెత్తుకొనలేదు. ప్రాచ్యపాశ్చాత్యకవితలలోని దైవికసాదృశ్యములుగలభావము లెత్తి చూపవలయుననిన నవ్యుల నెత్తవలనుపడదు. ఏమనగా:—నవ్యులకు ఇంతో అంతో ఆంగ్లభాష వచ్చి

యుండుటో లేక ఆవాసన యొదిగియుండుటో సహజమైయున్నది. దానంజేసి మానసికముగ ఆయాభావచ్ఛాయలు వీరికవితాస్రవంతిలో అక్కడక్కడ పడుచుండుట కాలధర్మము. ఇందు కొక ఉదాహృతిని గమనింపుడు;—

చ మిసమిసలాడుయౌవనము మేలిమిబంగరువన్నె మేనికిన్
బొసగె; గులాబిబుగ్గలకు బోడిమి హెచ్చె; అలంక్రియక్రియా
వ్యసనమునందు జిక్కి మగవారిసమక్షము గాంతచేసితిన్
గుసగుసముచ్చటల్ వినుటకున్; మనసయ్యె రహస్య మేటికిన్.

(స్వప్నకథ. 1. ఆ. ప. 43.)

ఇది జాషువాగారిది వీరు నవ్యులనుమాట మనకందరకు వ్యక్తమే. వీరికి ఆంగ్లపాండిత్య మెంతయున్నదో మాకు తెలియదు; కాని యేదెట్లున్నను—ఆవాసన లేదనుటకు కాలమంగీ కరింపదు. ఈపద్యమున బుగ్గలను గులాబితో పోల్చి వ్రాసియున్నారు కవిగారు. ఇదే ఉప మానము;—

"Her well-made cheeks are lovely red and white."

(చూ వెనుక.)

ఇక్క డాంగ్లమున గోచరించుచున్నది. గులాబిపువ్వుయొక్కవర్ణము శ్వేతవర్ణమిశ్రమము. కాఁబట్టి ఇక్కడ సంబంధవైరుధ్యములేదు. అయితే జాషువాగారు దీనిని సమీక్షించి ఆ పద్యమును వ్రాసియుందురా? అని ప్రశ్నింపవచ్చును. ఇది చూడవచ్చు. లేక మరొకటి చూడ వచ్చు. ఒకవేళ ఏదియు జూడక స్వయముగనే ఊహించివ్రాయవచ్చు. కాని విమర్శకులకు కాలపాత్రధర్మముల ననుసరించి అది పాశ్చాత్యకవితాగతమని యోజింపవలసివచ్చుచున్నది. అదియునుంగాక ఈఉపమానము గీర్వాణాంధ్రకవితలలో గోచరింపదు. పూర్వకవులవిషయ మున ఈ అనుమానమునకు తావులేదు. కాఁబట్టి ప్రస్తుతము ప్రాచ్యపాశ్చాత్యకవితలలో దైవికముగ పరస్పరసాదృశ్యములుగల భావములు నేరవలయుననిన పూర్వులవే సముపాద్య ములు. పూర్వులకు ఆంగ్లభాషావాసనలేదు.



# అలరుబోఁడియా? లేక అలరుఁబోఁడియా?

## రచయిత: శ్రీ తంగిరాల వేంకటనారాయణశాస్త్రిగారు

చిన్నయసూరికృతబాలవ్యాకరణనామకలక్షణగ్రంథము నిప్పటిప్రతులందు "బహువ్రీహిని స్త్రీవాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకుఁ బోఁడియగు" అలరుఁబోఁడి, ననఁబోఁడి, పూఁబోఁడి, విరిఁబోఁడి." అనుముద్రణపాఠ మగపడుచున్నది. ఇటుఁ జిన్నయ సూరిగారిమతమున "పోఁడి" సాధువని కొందఱును, "బోఁడి" సాధువని కొందఱును వాదించుచున్నారు గాని నిజానిజములు నిర్ణయింపఁజాలకున్నారు. వీరివాదములసారాంశమును వివరించి, దానితో నాకుఁ దోఁచిన కొన్నియుక్తులను బొందుపఱిచి చిన్నయసూరిగారిమతమున"పోఁడి, బోఁడి'' ఈరెంటిలో నేది సాధువో నిర్ధారణసేయుటకుఁ బ్రయత్నించెదను.

ప్రయోగముల ననుసరించి, పండితజనమనోహరముగా నేదియేని కొంత ప్రకృతిప్రత్యయవిభాగాదిప్రక్రియరచించి భాషావాఙ్మయస్వరూపమంతయు సూక్ష్మముగాఁ దెలుపుటయే లాక్షణికులముఖ్యాశయము. దాననే "ప్రయోగశరణా వైయాకరణా" అనువాక్యము వ్యుత్పత్తిగలదియై యున్నది. అలరుబోఁడి, ననబోఁడి, విరిబోఁడి మొదలగుప్రయోగములు ప్రాచీనమునుండి నేఁటివఱకు విస్తరించిన కావ్యప్రపంచమందంతటను నిండియున్నవి. ఈప్రయోగములవిషయమై "యుపమానగర్భబహువ్రీహుల"ని కొందఱు, ఉపమానసమాసములని కొందఱుప్రాచీనలాక్షణికులు నుడివియున్నారు. సూరిగారీసమాసపదము లన్యపదార్థబోధకములగుట నహోబలపండితమతానుసారముగా వీనిని బహువ్రీహులుగా నెన్నెను. దాన నలరువంటిశరీరముగలస్త్రీ యనునర్థము సంభవించునటుల "బహువ్రీహిని స్త్రీ వాచ్యంబగుచో నుపమానంబుమీఁది మేనునకు బోఁడియగు" నని సూత్రించెను. సూరిగారిట బోఁడిపదమును నిరర్థకపదముగా భావించి, మేనునకు దీని నాదేశించిన నామేనునర్థము దీనియందుఁ బ్రతిఫలించునని యెంచిరి. అలరునకుఁ జిగురర్థముగానఁ జిగురువంటియొడలుగలస్త్రీ యనుట యుక్తము.

కొందఱు అలరుబోఁ డీత్యాదులందు, సార్థకమగు పోఁడిశబ్దము ప్రత్యక్షమై యుండ నిరర్థకమై, లోకగర్హితమైన"బోఁడి" పదమును సూరిగా రాదేశముగాఁ జెప్పిరనుట విశ్వాసనీయము గాఁజాలదు. ఈపోఁడిశబ్దమునకు శబ్దరత్నాకరమున సౌష్ఠవమపర్థమని చెప్పఁ

బడియున్నది. ఇట్టి సామీప్యసంబంధముగల పోఁడిపదమును బరిత్యజించి బోఁడితో సమాసమువిధించిరనుట సాహసోక్తి యనకతప్పదు. పోనీ! సూరిగారిపోఁడిపదమును మఱచియుందురని తలఁతమన్న ప్రకీర్ణకపరిచ్ఛేదమున "నడంగ్వాదులడాకుణకారంబగు" ననుసూత్రమున "పోఁడి" నుదాహరించిరిగాన నదియు నసమంజసము. మఱియు నీఁట లక్ష్యముగా సూచింపఁబడినపోఁడికి వ్యస్తమున ప్రయోగము మృగ్యము. అట్టిచో సూరిగారు దానికేల ణత్వము విధించిరి? సూక్ష్మదృష్టి నాలోచించిన నలరుబోఁడి మొదలగువానియందు సయితమీ ణత్వమువిధించి, యాధునికకావ్యములందుఁ గన్పట్టుచున్న ణత్వవిశిష్టప్రయోగములగు ననఁబోణి, పూఁబోణి, విరిఁబోణి మొదలగువానిసాధించుటకొఱకని వెల్లడియగుటలేదా! ఇట్టి రూపములు పోఁడితో సమాసము విధించిననేగదా సాధ్యములగును! కాన నిస్సంశయముగా "చిగురువంటియందముగలస్త్రీ" యని భావించి సూరిగారు పోఁడినే యాదేశించియుందు" రందురు.

కాని, బాగుగ విమర్శించిన నలరుబోఁడి మొదలగుసమాసములలో సూరిగారిచే నుద్దేశింపఁబడినది "బోఁడి" గాని "పోఁడి" గాదని నిర్ణయింపఁజాలియున్నది. ఆంధ్రలాక్షణికులందఱు ప్రాచీనలాక్షణికాశయానుసారముగనే లక్షణగ్రంథముల రచించియుండిరనుట స్పష్టము. బాలసరస్వతి, యాంధ్రశబ్దచింతామణి నన్నయకృతమని యెన్నియో వింతకల్పనలు కల్పించి వక్కాణింప, నప్పకవ్యహోబలపండితాదులందఱి నిజానిజములు పరిశీలింపక ప్రాచీనలాక్షణికుఁడగు నాతనివాక్కు వేదవాక్కని విశ్వసించి యావిధముగనే తమగ్రంథములందు లిఖించియుండిరిగదా! ప్రాచీనాంధ్రలాక్షణికులందఱు సంస్కృతవ్యాకరణమును బెక్కువిధములుగా నాంధ్రవ్యాకరణముల జొనిపియుండిరి. అట్లే చిన్నయసూరిగారును పాణినీయవ్యాకరణమాత్రజ్ఞుఁడయ్యుఁ బూర్వలాక్షణికుల ననుసరించి సంస్కృతవ్యాకరణమును దత్పరిభాషలను గొన్నికొన్ని ప్రదేశములఁ బ్రవేశపెట్టి ప్రక్రియ నడిపించిరి. దానికొకయుదాహరణ మీక్రిందఁ జూపుచున్నాఁడను.

"టివర్ణంబు పరంబగునపుడు క్రిందుమీఁదు ముందు పువర్ణంబుల కత్వంబగు" ననుసూత్రమున "అలోఽన్త్యస్య" అనుపాణినీయపరిభాషాసూత్రము నాధారముగాఁ జేసికొనియే "క్రిందటికి, మీఁదటికి, ముందటికి, అప్పటికి" అనురూపములను సూరిగారు సాధించిరి.

అట్లే యీయలరుబోఁడి మొదలగురూపముల సంస్కృతవ్యాకరణము నాదర్శముగాఁ జేసికొనియే సమాసమును విధించిరి. "అలరువంటి మేనుగల" దనునలౌకికవిగ్రహవాక్యమును

నిల్పి, సార్థకపదమగు మేను స్థానమున నిరర్థకపదమగు బోఁడి నాదేశముగావిధించిరి. సంస్కృత వ్యాకరణమున "విగ్ర" అనురూపము సాధించుటకై "విగతానాసికాయస్యస" అను నలౌకిక విగ్రహవాక్యమున నున్న నాసికాశబ్దమునకు "వేర్గోవక్తవ్య" అనువార్తికమున "గ్ర" అనున దాదేశింపఁబడియున్నది. విగ్రశబ్దమునకుఁ దెనుఁగున ముక్కిడి (ముక్కు లేనివాఁడు) యని యర్థము. తదర్థసంపాదనకై సంస్కృతవైయాకరణు లెట్టి ప్రక్రియ ప్రవర్తింపఁజేసిరో యట్లే సూరిగారును సార్థకపదస్థానమున నిస్సారమగు "బోఁడి" పదము నాదేశించి రూప సాధనప్రక్రియ నడపిరనుట సత్యదూరము కాదు.

"బోఁడి" పదము నాదేశించిన విరిబోఁణి, ననబోఁణి, పూఁబోఁణి మొదలగురూపములు సాధింపఁబడవనుట నిక్కము. అయినను సూరిగారి కీరూపములు సాధింపవలసిన యగత్యము లేదు. వారు ప్రాచీనభాషకుమాత్రమే లక్షణము వ్రాయఁబూనుకొనిరిగాని నేటివఱకు విస్తరించిన కావ్యప్రపంచమున కంతకును వ్రాయుట వారియుద్దేశము కాదు. అట్టి ణకారఘటిత ప్రయోగములు ప్రాచీనకావ్యములందు మృగ్యములు మఱియు "పోఁడి"కి వ్యస్తమునఁ బ్రయోగములు లేవని కొందఱు తలంతురుగాని యట్టి ప్రయోగము లున్నట్లు శబ్దరత్నాకరమునుండి తెలియుచున్నది

పోఁడి = ఒప్పు. దేశ్య వి.

"చచ్చియుం బోఁడి దొరగకున్న వాఁడు" (భార. "స్త్రీపర్వము. 2 ఆశ్వా.)

పోఁడి = ఒప్పిదము. దేశ్య వి. ణ.

"నిష్ఠమెయిఁ భవదగ్నిహోత్రముల్ పోఁడిగ వేల్వఁగాఁబడియె" (ఆది. 3 ఆశ్వా.)

ఇట్టి వ్యస్తప్రయోగముల నున్నవానికి ణత్వము ప్రాప్తించినను బ్రాప్తింపవచ్చు నను నభిప్రాయమున "నడంగ్వాదులదాఁకు ణకారంబగు" ననుసూత్రమున "పోఁడి"ఁని లక్ష్యముగా సూచించియుందురు. సౌష్ఠవార్థబోధకమగు 'పోఁడి' నాదేశముగా విధించిన నాసమాసము 'చిగురువంటియందముగలద' ను నర్థమిచ్చును. ఇది ప్రాచీనసంప్రదాయమునకు విరుద్ధము. ప్రాచీనకవులు చిగురు మొదలగువాని నుపమానములుగా నెన్నినపుడు వానియందలి మార్దవాదిగుణముల గ్రహింతురు. వాచ్యముగా వెల్లడింతురు. దాన వానిసౌష్ఠవము వ్యంగ్యగ్రాహ్యము. 'లతాతన్వీ' మొదలగుసిద్ధసమాసములందు 'లతా' మొదలగు నుపమానవాచకములు ధర్మనిష్ఠతనుత్వాదివిషయముననే యుపమానము లగుచున్నవి. ప్రాచీనకావ్యములకు లక్షణము వ్రాసిన సూరిగారు ప్రాచీనకవులమర్యాద నతిక్రమింపరనుటలో నించుకంతయు సందియము లేదు. దీన సూరిగారికి 'బోఁడి' నాదేశించుటయే సమ్మతమయినటుల నూహింప

నవకాశముగల్గుచున్నది. ప్రౌఢవ్యాకర్త దీనికి వ్యతిరిక్తముగా "అలరుఁబోఁ"డీత్యాదు లుప మానపూర్వపదకర్మధారయ"లని సూత్రించి "ఇటఁ బోఁడి పరంబగుచో నెల్లెడలనుమ్మగు. ఆదిపదంబుచే తియ్యఁబోఁడి, ననఁబోఁడి, విరిఁబోఁడి, ఇగురుఁబోఁడి, చిగురుఁబోఁడి, తలిరుఁ బోఁడి,పువ్వుఁబోఁడి, పూవుఁబోఁడి, పూఁబోఁడి, యిత్యాదులు గ్రాహ్యంబులు. (అలరు+పోఁడి) దీనికిఁ బువ్వువలె మనోజ్ఞురాలైనదని యర్థము." అని వివరించెను. పాశ్చాత్యసంసర్గమున నాధునికకవులనేకులు పైతియ్య మొదలగువానిని సౌష్ఠవమువిషయమై యుపమానవాచక ములుగ వాచ్యముగను వర్ణించియుండిరి. ప్రాచీనార్వాచీనకావ్యముల కనుశాసనమువ్రాసిన ప్రౌఢవ్యాకర్త యీవిధముగ నేగెననుట సమంజసము.

సూరిగారికి 'పోఁడి' నాదేశించి సమాసము విధించుటయే యభిమతమేని కర్మధార యాంతర్భూతమగు నుపమానకర్మధారయగ నిరూపించియుందురుగాని విలక్షణమైన యీ నూతనమార్గము ద్రొక్కి బహువ్రీహిగఁ బరిగణింపరు మేనుస్థానీయముగా 'పోఁడి' నాదే శించి సౌష్ఠవార్థమునే నిలఁబెట్టి బహువ్రీహిగ నిరూపించుట యనుడొంకతిరుగుడు ప్రక్రియ నాశ్రయింపక ప్రథమముననే పోఁడితో సమాసము విధించియుందురు. సుగమమై, గమ్య స్థానమునకు శీఘ్రముగాఁ జేర్చుత్రోవను విడిచి కంటకావృతమై సుదీర్ఘమైన మార్గమున నేగుట కెట్టివాఁడైన సాహసించునా? కనుక సూరిగారికి 'పోఁడి' నాదేశించుట యెంత మాత్రము నిష్టముకాదు.

ఇది యిట్లుండ విమర్శకులు కొందఱు "చిగురుఁబోఁడి మితోదరాత్త" యను మొద లగుద్వ్యర్థికావ్యప్రయోగములు పోఁడి యనునదే, యీసమాసములం దుత్తరపదమని స్పష్టపఱచుచుండుటయు, 'పోఁడి' యనున దాదేశముగాదన్న నడంగ్వాదులలో 'బోఁడి' శబ్దములేమి ణకారఘటితరూపములు సిద్ధింపకుండుటేగాక ముండితమను నర్థావ్యాధకమగు పదము నాదేశించెనువాదము తటస్థించుటయు, నను మొదలగువిషయములఁ బరిశీలింప మేనునకు 'పోఁడి' నాదేశించుటే గ్రంథకర్త్రసమ్మతమనియు, మేను స్థానీయమగు నాపోఁడికి శరీరమనునర్థము సిద్ధింపఁజేసి 'చిగురువంటిశరీరముగలది' యనునర్థము గ్రాహ్యమనియును, బట్టివర్ణకము పరమగునపుడు నుగాగమము విధించుట మఱచినట్లే పోఁడివర్ణకము పరమగు నపుడును గ్రంథకర్త నుగ్విధాన మొనర్చుట మఱచెననియును" జెప్పుచున్నారు.

ద్వ్యర్థికావ్యములలో నెక్కడనో క్వాచిత్కముగ నర్థద్వయసంపాదనకై చేసిన ప్రయోగముల ననుసరించి యీమతము బాలవ్యాకర్త్రసమ్మతమై యుండునని నిరూపింప

వీలులేదు. ఈద్వ్యర్థికావ్యములందు నచ్చతెనుఁగు ప్రబంధములందు నెన్నియో బాల వ్యాకరణలక్షణములకు విరుద్ధములగు ప్రయోగములున్నవి.

"అచ్చెరువుగఁ బూని యప్ప్రమదశీర్ణమహాయతి యయ్యె నెంతయున్."

(హరిశ్చంద్ర నలో. 1 ఆశ్వా. 30 ప)

"మానసాధ్వులమిన్నమహనీయభక్తి న, క్కృత్రకు లసితప్రకాశుఁ బ్రాణ"

(హరిశ్చంద్ర నలో. 3 ఆశ్వా 26. ప.)

తే. "వఱలు నచ్యుతు సఖ్యాతివర్ణితాతు, లప్ప్రదీప్తి నిట్లలరునీవిప్ప్రభావ మెందు——"

(రాఘవపాండ. 2 ఆశ్వా. 91 ప).

పై వానిలో మొదటిపద్యమున "ఆ+ప్రమద" అని యొకపక్షమునను "న+ప్రమద" అని మఱియొకపక్షమునను గ్రహింపవలెను. అట్టిచో "త్రికంబుమీఁది యసంయుక్త హల్లునకు ద్విత్వంబు బహుళంబుగానగు" ననుసూత్రమునకు విరుద్ధముగా సంయుక్త హల్లునకు ద్విత్వమేర్పడి "అప్ప్రమద" అని సిద్ధించినదిగదా! ఇట్లే రెండుమూఁడుదాహరణములందును (ఆ+క్షత్రకుల=అక్ష్కత్రకుల) (ఈ+ప్రభావ = ఇప్ప్రభావ) సంయుక్తాక్షర ద్విత్వములు బాలవ్యాకరణవిరుద్ధములు. అంతియకాక,

"నేలయుం దివియును వ్రక్కలింతుఁ గద దేవరయానతి యింతగల్గినన్"

(అచ్చతెనుఁగురామా. కిష్కింధా.)

అనుపద్యమున "దివి" అనునది తత్సమపరిచ్ఛేదమున 'ద్యువాశ్ఛబ్దంబులు దివివాది యగు' నను నిపతితసూత్రమునకు విరుద్ధముగాఁ దద్భవమై యెన్నఁబడియున్నది. కాన ద్వ్యర్థి కావ్యప్రయోగముల ననుసరించియు, నచ్చతెనుఁగుప్రబంధముల ప్రయోగముల ననుసరించియు సాధుత్వము, గ్రంథకర్తృనాశయము వివరింపఁజనదు. ణకారఘటితరూపములు సాధించుట సూరిగారి కభిమతముగాదని ముందే నిరూపింపఁబడినది. కాన దానిని వేఱుగా ఖండింపఁ బనిలేదు. హరిశ్చంద్రనలోపాఖ్యానపీఠికాకారులగు బ్రహ్మశ్రీ వఝ్ఝల చినసీతారామస్వామిశాస్త్రిగారు సూరిగారిరచనవలన 'అలరుబోణి' మున్నగురూపములు సిద్ధింపఁజాల వను నాశయమున నీటీఱుగా వ్రాసిరి.

"ఇట్టిచిక్కును గనిపెట్టియే కావలయు నిటీవలి మహానుభావులు పయిసూత్రము నందు "మేనునకుబోఁడి" అనుచో "మేనునకుఁబోఁడి" యని దిద్ది ముద్రించిరి. అద్దానికిసరిగ సూరిగారిచ్చిన యుదాహరణములలో లేనియరసున్నలనుసైత మాయాస్థలములయందు

నిలిపివేసిరి; కాని యట్లు దిద్దినను సూరిగారిరచనవలన నలరుబోణి మున్నగురూపములు సిద్ధింపఁజాలవని వీరు గ్రహించిరో లేదో తెలియకున్నది."

మఱియు బాలవ్యాకరణసర్వస్వపేటిక బోఁడి నాదేశించిన నర్థావ్యాఖ్యార్థకపద మాదేశించె ననువాదము తటస్థించునని తలఁచి గ్రంథకర్త పోఁడినే యాదేశించియుండుననియూహించెను. కాని నిరర్థకపదముగా దాని గ్రహించునపుడు దాని యర్థావ్యాఖ్యార్థముతో గ్రంథకర్తకుఁ బనిలేదు. సూరిగారర్థావ్యాఖ్యార్థబోధకమగుపదము నాదేశించెననువాదము తటస్థించునని భీతిఁజెందువారైన "యువతివిటీరజస్వలలు గుబ్బెత మిండత ముట్టుతలు నాఁబడుదు" రనుసూత్రమే సూత్రింపరు. అలరుబోఁడి మొదలగు నీసమాసములవిషయమై యెచ్చటను గ్రంథకర్త నుగాగమమును విధించియుండలేదు. పోఁడితో సమాసము విధించుచే గ్రంథకర్త కభిమతమైన వేఱుగ నుగ్విధానము నాదరించియుండును. లేనిచో నాపక్షమున నలరుఁబోఁడి మున్నగురూపములు సిద్ధించుటకు "సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళములు పరములగునపుడు నుగాగమంబగు" ననుసూత్రముచే నవకాశమున్నను నుదంతేతరములగు నన, విరి మున్నగువాని కీకార్యము సంభవింపనందున ననఁబోఁడి, విరిఁబోఁడి మొదలగురూపములు సిద్ధింపవు. పైపక్షమువారు సూరిగారు పట్టి పరమగునపుడు నుగాగమము విధించుట మఱచినటులనే పోఁడి పరమగునపుడును నుగ్విధానము మఱచియుందు రందురుగాని, ప్రమాదవశమున నెక్కడనో మఱచినంతమాత్రమున నెల్లయెడలను మఱచిరనుట యుక్తిదూరప్రసంగము. వేఱుగ నుగ్విధాన మనావశ్యకమగుట నిక్కముగ బోఁడినే యాదేశించియుందురు. తీయంబోఁడి మున్నగురూపము లాధునికప్రయోగములగుట సూరిగారు వాని నాదరింపలేదు. అలరు మున్నగు నుదంతములకు బోఁడి పరముగా "సమాసంబుల నుదంతంబులగు స్త్రీసమంబులకుం బుంపులకుం బరుషసరళములు పరములగునపుడు నుగాగమంబగు" ననుసూత్రముచే నుగాగమంబును, నానుగాగమంబునకు "వర్గయుక్సరళములు పరంబులగునపు డాకానొకచో ద్రుతమునకుఁ బూర్ణబిందువును గానంబడియెడి" ననుసూత్రమున బిందువును నేర్పడి యలరుంబోఁడి మున్నగురూపములు బాలవ్యాకరణము ననుసరించి సిద్ధింపఁబడుచునే యున్నవి.

ఇంతియకాక సూరికృతసూత్రాంధ్రవ్యాకరణమందు సయితము సూరిగారికి బోఁడి నాదేశించుటయే సమ్మతమయినటుల స్పష్టముగాఁ దెలియుచున్నది.

సూ- "ఉపమానం మేసునాస్త్రియాం; ఉపమానాన్మేనోర్బోడిస్స్యాత్."

మఱియు సూరిగారు జీవించియుండఁగ 1858 వ సం॥ న ముద్రితమైన బాలవ్యాకరణప్రతులందు "అలరుబోఁడి, ననబోఁడి, విరిబోఁడి" అని ఖండబిందురహితముగఁ బాఠమగపడుచున్నది. ప్రౌఢవ్యాకర్త పోఁడితో సమాసము విధించి శాసించినతఱువాతఁ దత్సంపర్కమున పోడిగా భ్రమపడి ముద్రాపకులు ఖండబిందువును దఱువాతిప్రతులందుఁ జేర్చి పూర్వపాఠమును దారుమారుగావించిరి.

బాలవ్యాకరణసర్వస్వపేటికయందు "ఒకకాలపుబాలవ్యాకరణముద్రణము ననుసరించి 'బోఁడి' యనునదిగాని 'పోఁడి' యనునదిగాదను నొకవివాదవిషయము వెడలియున్నది." అనునంశము గన్పట్టుచున్నది. ఈమతమును చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు 1940వ సం॥ నవంబరు భారతిసంచికయందుఁ బ్రత్యాఖ్యానముచేయుచు వ్యాసము వ్రాసిరి. అందుఁ గొంత ప్రస్తుతమున కుపయుక్తమగుట నిటఁ బొందుపఱచెదను.

"ఇఁట వివరింపఁబడినట్లు వివాదవిషయముమాత్రము కాదు. సూరిగారు జీవించియుండఁగనే వెలువడిన ప్రథమముద్రణమునందు 'బోఁడి' యనునాదేశము తమకభిమతమని తెలుపుచు 'మేనునకుబోఁడి' యనుచోటకుతఱువాత నర్ధబిందువులేకుండఁగను సూరిగారే వెలువరిఁచియున్నారు. ముద్రాపకులప్రమాదమున్నను నొక్కొకతావున నుండవచ్చునుగాని యొకేసూత్రమున నాలుగుతావులం దుండుట యసంభవము. సూరిగారిమతమునలేని యర్ధబిందువులఁ దఱువాతిముద్రాపకులు చేర్చియున్నారనుటయే సమంజసము. ఇట్టిసంశయములఁ దీర్చికొందుఱనియే "ఈవ్యాకరణంబున మూలంబయిన కృతినిబోఁగనదగున్" అనినారు. అఁట "ఉపమానాన్మేనోర్బోడిస్స్యా"త్తని యున్నది.

హరికారికలందును శబ్దలక్షణసంగ్రహమందును బోఁడియే యాదేశింపఁబడియున్నది. హరికారికలు—"బహువ్రీహౌ స్త్రియామర్థే మేనోర్బోడిస్తులోపరి."

శబ్దలక్షణసంగ్రహము—"బహువ్రీహిని స్త్ర్యర్థమునం దుపమానముమీఁది మేనునకు బోడియగు."

సూరిగారు ప్రాచీనాంధ్రలాక్షణికులుబోలెఁ బాణినీయవ్యాకరణము నెంతయు నాదరించినవారౌట, విగ్రలిఖ్య ప్రభృతిరూపముల సంస్కృతవైయాకరణులట్లు "అలరుబోఁడి మున్నగుసమాసముల సాధించిరనుట సమంజసమగుటచేతను, "బోఁడి"నాదేశింపనిచోఁ బ్రాచీనప్రయోగములుగాని ణకారఘటితరూపములును, సూరిగారిప్రణాళికకు విరుద్ధముగా సాధువులు గావలసివచ్చుటయుఁ, బ్రాచీనకవిసంప్రదాయముగాని 'చిగురువంటియందముగలస్త్రీ' అనునర్థము సిద్ధింపఁజాలియుండుటయు; వేఱుగ నుక్కువిధింపనందున విరిఁబోఁడి

మున్నగురూపములు సిద్ధింపకుండుటయు, మేనున కాదేశింపక ప్రౌఢవ్యాకర్తవలె సూక్ష్మప్రక్రియయగు నుపమానపూర్వపదకర్మధారగనే యెన్నుదురనుట తగియుండుటయు, సూరిగారు పోఁడి నాదేశింప నిచ్ఛగింపరని తలపనగుటచేతను, సూరిగారు జీవించియుండఁగా ముద్రితమైన బాలవ్యాకరణప్రతులందు ఖండబిందురహితముగఁ గన్పట్టుటచేతను, సూరిగారు తమసూత్రాంధ్రవ్యాకరణమందు ''ఉపమానాన్మేనోర్బోడిస్స్యాత్తని బోఁడినే యాదేశించియుండుటచేతను, బోఁడి నాదేశించుటయే గ్రంథకర్తృసమ్మతము, నిర్దుష్టము, రమణీయమునైయున్నది.

---

డాక్టర్ సర్: యస్. రాధాక్రిష్ణన్‌గారు, కే. టి, పి. ఎచ్. డీ., కాశీ హిందూవిశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఆక్స్‌ఫర్డువిశ్వవిద్యాలయ ప్రాచ్యమత నీతివిద్యల స్పాల్డింగ్ పండితులు, "గిరిజ," ఎడ్వర్డుఎలియట్ రోడు, మైలాపూరు, మదరాసు:—

శ్రీత్రిలిఙ్గరజతోత్సవసందర్భమున ప్రకటితమగుచుండు ఉత్సవసంపుటితో సంబంధముకలిగినందుకు సంతోషించుచున్నాను. తెలుగు, సంస్కృత వాఙ్మయముల పరముగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును వారివ్యాపారసంస్థయు చేసిన అమూల్యమైనసేవకు వారిని అభినందించుచున్నాను. తాను ప్రసిద్ధపండితుడుగానుండి సుమారు 80 ఏండ్ల క్రిందట శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు ప్రచురణకర్తృత్తినవలంబించుటయందు వారివివేకము వ్యక్తమగుచున్నది. దినదినము పెరుగుచుండిన చదువరులకొరకు తెనుగు సంస్కృతములలోని ఉత్తమగ్రంథములను సులభముగాదొరకునట్లు ప్రకటించుట అత్యావశ్యకమని వారు గ్రహించిరి.

ఈవిషయమునందు వారు నిజముగా దక్షిణఇండియాలో మార్గదర్శకులు. ఈసంస్థకు ప్రస్తుతము యజమానులుగనుండు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తండ్రిసాంప్రదాయములను పూర్తిగానడుపుకొనివచ్చినారు. తమకుగల నిర్మాణోత్సాహమును కల్పుగోలుతనమును పూర్ణముగా వినియోగించి పనిచేసినారు. మంచి పలుకుబడిగల త్రిలిఙ్గపత్రికను స్థాపించి ప్రకటించుచున్నారు. ఆతండ్రి ఈకుమారుడు వీరిరువురికిని ప్రచురణకార్యము వృత్తి వ్యాపారము అనుటకంటే మంచి తెనుగు, సంస్కృతగ్రంథములనుసంరక్షించి ప్రజలఉపయోగార్థ మొదవించు నుద్యమముగా పరిణమించినదనదగియున్నది. శ్రీశాస్త్రులవారు ఆంధ్రులకృతజ్ఞతకు పాత్రులగుట ఉచితము, న్యాయము. ఈసంపుటి ఆకృతజ్ఞతకు నొక్కస్ఫుటాంకము మాత్రము. శ్రీశాస్త్రులవారికిని వారిసంస్థకును విజయైశ్వర్యంబులగుగాక!

# ఆంధ్రము—ప్రాచ్ఛిన్న పార్యయుగము

విద్వాన్ కే. వి. సుబ్బరాఘవకవిగారు,

టీచరు, బాబురాజేంద్రప్రసాదవీథి, మాంబళము, మద్రాసు.

తెలుఁగు, తెనుఁగు, ఆంధ్రము అనునవి పర్యాయపదములనువిషయము ఆంధ్రుల కందఱకుఁ దెల్లముగఁ దెలిసినదియే. ఐతరేయబ్రాహ్మణమునందును, స్కాందపురాణమునందును, భారతారణ్యసభాపర్వములలోను, రామాయణము కిష్కింధాకాండమునందు ఆంధ్రశబ్దము దేశపరముగను జాతిపరముగను వాడఁబడియున్నది. భాగవతము నవమ స్కంధములో నాంధ్రుఁ డనురాజువలన నీపేరు గలిగినదని యున్నది. దండకారణ్యసమస్థితమైన యాంధ్రదేశమునందు నివసించుటచే మన మాంధ్రులమైతిమని దాక్షిణాత్యులగు రామానుజులవారయభిప్రాయము ఆంధ్రదేశము కృష్ణాగోదావరీనదుల మధ్యప్రదేశమని కొందఱు చెప్పుదురు. దాక్షారామము, శ్రీశైలము, కాళేశ్వరము అను మూఁడు క్షేత్రములయందలి త్రిలింగముల మధ్యప్రదేశము త్రిలింగదేశము ఆంధ్రరాష్ట్రమని మఱికొందఱయభిప్రాయము. అంధ్రదేశమునందు వసియించి యాంధ్రులై పోయినవారిభాష యాంధ్రమైనదని యొకవిధము. ఈశబ్దోత్పత్తి యెట్టిదో తెలియఁగలందులకు నిదర్శనములు లేవు

మహాంధకారజీవితమునందే భాష పుట్టి వృద్ధియైనది. సాధారణముగా భాష దేశము ననుసరించియే యుండును. ప్రపంచమున ననేకభాష లనేకభాగములయందు పుట్టి యాయా యినామములం జెందుచుండుట మనకుఁ దెలిసినదియే. మనుష్యులు క్రమముగ వృద్ధిచెందు కొలఁది వెవ్వేఱుదేశముల నాక్రమించుకొని వేఱుపడి జీవించుటచే ప్రత్యేకభాష లేర్పడి యుండుననుటలోను సందియముండదు. భాష మొదట నొక్కటిగానుండినను వెక్కులైనను ఆయాప్రదేశములయందుండువారు వారివారిప్రదేశములయందలి శీతోష్ణస్థితులు, ఆహార విహారములు, వివిధములుగ నుండుటచే వారిధ్వనులయందు భేదములేర్పడి వింతభాషలు గలుగుటకు కారణమగుచున్నది. అన్నిభాషలవలెనే మనయాంధ్రభాష గూడ పుట్టియుండవచ్చును. అయినను నాంగ్లేయులు వారిభాష యాకసమునుండి యూడిపడినదని నమ్ముచున్నారు. ఇదియ సత్యమో చూడుడు.

**"In former times, as it seemed to be impossible to account for language, a piece of human workmanship, it was readily admitted that it**

was of divine workmanship, that it really had tumbled down from the sky in some way or other, and that, curiously enough, man alone of all animals then living upon earth had been able to pick it up." pp. 3. Science of Language by Max Muller, 1st Lecture.

అరవభాషకూడ నిట్లే పుట్టెనని తమిళుల నమ్మకము. దానికి నిదర్శనముగా నొకవెఱ్ఱి కథ వినుఁడు.

"Agasthiar—Many are the legends associated with the name of our renowned ascetic sage. Three of them stand foremost that relate to the supposed origin and diffusion of Tamil language and literature. The first refers to Agasthiar's collision with the members of the Sanskrit College of Benares and in his prayer to Cundaswamy to teach him a language, in some respects, better and sweeter than the sacred Sanskrit. To indicate that his prayer was granted, the house, where the sage was, was all on a sudden, all perfume, and the Swamy ordered him to search a certain corner for it. Agasthiar hurried to the spot, opened a pack in the nook, discovered, to his surprise, a heap of cadjan volumes, and fell out exclaiming Tamil! Tamil! (Sweet, sweet). Afterwards, he took lessons from the Swamy and taught the same in the south as Tamil Language." Tamil Literature pp 11.

ఇట్టి కథలు మనయాంధ్రమునుగూర్చియుఁ గలవు. ఎట్లయినను భాష వాడుకలోనికి వచ్చినతరువాత వాఙ్మయ మారంభమగును. పిమ్మట బుద్ధిమంతులు పరభాషలఁజూచియో, యగత్యము ననుసరించియో లిపి కనుఁగొని తమభాషను, భాషయందలివాఙ్మయమును వ్రాయుట కారంభింతురు.

మానవుఁడు మొట్టమొదట నెండ, వాన, చలి, క్రూరమృగములవలనిభయము మున్నగువానిని సాధనాంతరములచేఁ జక్కఁబెట్టుకొనెను. కాని యుఱుములు, మెఱుములు, వానలు, అగ్ని, సూర్యుఁడు, చంద్రుఁడు మొదలగునవి మానవునియూహాకు దూరములగుచుండెను. వాన పంటలుపండుటకుఁ గోరినప్పుడు కురువవలయును, అగ్ని మండవలయును; సూర్యుఁడు వెలుఁగునియ్యవలయును. అందువలన మానవునిజీవితము పంచభూతములమీఁదను సూర్యచంద్రులమీఁదను నాధారపడియున్నదని తెలిసెను. తెలియనిసంగతులకు దివ్యత్వ మారోపించుట మానవునిస్వభావముగాన నెవ్వరో యుండి యుఱుములు, మెఱుములు, సూర్యచంద్రుల, నగ్నిని గలుగఁజేయుచున్నారని మానవుఁడు

గ్రహించెను. ఆదేవత శాంతించుటకయి ప్రార్థించెను; భక్తితో నర్చనలొనరించెను; బలు లిచ్చెను; తాను తినునట్లు ఈభూతములు మఱుఁగువడియుండి తానర్పించుబలుల గ్రహించు నని తలంచెను. అందులకయి యాతఁ డొనరించిన కర్మలు, ప్రార్థనలు వేదములయ్యెను. ఈ క్రింది క్లేటఁగారి వ్రాఁత చూడుఁడు.

"To know how they prayed and built their earliest altar-fires and offered sacrifice with song is to know how the forefathers of Hindu and Greek and Briton sought divine grace and divine protection. Through them (Vedic hymns), the hopes and fears of the singer and his hearers ring in our ears. In them we come face to face with the joys and sorrows, the war and peace, the funerals and festivals of forty centuries ago."

pp. 19 The Rigveda and Vedic Religion by A. C. Clayton.

మానవుఁడు మొదటినుండియు సుఖదుఃఖములు, భయాభయములు, శీతోష్ణములు, కామక్రోధమోహాదులకుఁ జిక్కువలసివచ్చినది. తత్తదుచితరసములఁ గురిపించువాక్యములఁ బలికెను. దీనినిఁ గావ్య మొనరించుటయే వాఙ్మయమగును. ఆస్థితిలోఁ బుట్టినవే తొలి మాటలు. వానికి దివ్యత్వ మారోపించి యపౌరుషేయము లనిరి. కాకున్న నట్టిస్థితిలో నెవ్వరు వ్రాసిరని చెప్పవచ్చును! వేదములకంటెఁ బ్రాచీనగ్రంథములు దొఱకువఱకు వేదము లను పౌరుషేయములని ఋజువుపఱచుట కడుదుర్లభము.

ఏభాషకును నాదికావ్యమని యొకటి యుండదు. మానవుఁ డాయాయికాలము లందలి తనకుఁ దోఁచువ్యక్తులంబట్టి చేయుకొనురాగములే యాదికావ్య మనవచ్చును. అతఁడు పాడుసంగీతమునందే యానందమున్నది; ఆవేశమున్నది; రసమున్నది. ఇట్లే నన్నయ భట్టారకునకు పూర్వము వాఙ్మయముండెను. అది యంతపరిశుద్ధమైనది కాకపోవచ్చును. అంతమాత్రమున నయ్యది కావ్యత్వమున కనర్హమనుట యసమంజసము. అందుఁ గళయు న్నది. రసము వెల్లివిఱియుచున్నది. అప్పటికి కేవలము ద్విపదకావ్యములుగనో, రగడలుగనో, పాటలుగనో యుండియుండవచ్చును. "కాళ్లాగజ్జి—కంకాళమ్మా!" అనుబాలురయాటలు, "చందమామా రావే-జాబిల్లిరావే, కొండమీఁద వెండిగిన్నె-కొండెక్కిపోవే", "పిడికెడు బియ్యం, పిల్లంగోయ్-పిల్లల్లారా రండట్టోయ్," మొదలగువానిలో కవిత్వాంకురము లున్నవి గదా! వేదములవలె నీపాటలు నెన్ని వేలసంవత్సరములనుండి వాడుకలోనికి వచ్చినవో తెలియదు. భక్తిపాటలు, కుచ్చెలపాట, ఊడుపుపాటలు స్త్రీలలోఁ బురుషులలో నోటి విద్యగా వ్యాప్తినొందుచున్నవిగదా! అందు బ్రకృతి పరిశీలనమున్నది. ఆవేశమున్నది. కళ

యున్నది; ఆనందమున్నది; రసమున్నది, జంగముపాటలు, లంకాయాగము, వీరగీతములు, బొబ్బిలిపాట మొదలగునవి జంగములచేతను, దాసరులచేతను గథానుసారముగ విన వచ్చును. వారికి లిపి తెలియకుండినను వారు ధారాళముగా జ్ఞప్తియందుంచుకొందురు. కాన లిపి లేనప్పుడు గూడ వాఙ్మయ ముండియుండవచ్చును.

"Professor Macdonell points out sacred learning in India was for very many centuries, indeed, until modern times quite independent of writing." pp. 42. Clayton.

కావున భాష నొకఁడు సృజించెనని కాని, వాఙ్మయ మొకఁ డారంభించెననికాని నమ్ముటవెఱ్ఱితనము. వృక్షములు పెరిగి యడవియైనట్లు మాటలుపెరిగి భాషయగును. ఆభాష యందే వన్యఫలములవలె వాఙ్మయ ముదయించును. దానిని సంస్కరించి వ్యాకరణబద్ధ మొనరించినచో శిష్టవాఙ్మయ మారంభమగును. మనయాంధ్రమున కట్టివ్యాకరణములు నన్నయభట్టారకునకుఁబూర్వ మెన్నియోసంవత్సరములకుముందే రావణుఁడు, కాణ్వుఁడు, హేమచంద్రుఁడు, పుష్పదంతుఁడు మొదలగువారు వ్రాసియుంచినట్లు అథర్వణాదులుచెప్పిరి. ఈక్రిందినిదర్శనములం జూడుఁడు:—

"సమంతభద్రైరపి పూర్వపాదైః కలంకముక్తై రకలంకదేవైః,
యదుక్తమప్రాకృతమర్థసారం, తత్ప్రాకృతంచ శ్రుతసాగరేణ.
శ్రీపూజ్యపాదసూరిర్విద్యానందసమంత భద్రగురుః,
శ్రీమదకలంకదేవో జినదేవో మంగళం దిశతు."

(శ్రుతసాగరుఁడు- ఔదార్యచింతామణి.)

శ్రీపూజ్యపాదమకలంకసమంతభద్ర శ్రీకుందకుందజిన చంద్రవిశాఖసంజ్ఞా,
శ్రీమాఘనంది శివకోటి శివాయనాఖ్యాః విద్యాదనందిగురవశ్శతమీ దిశంతు.

(శ్రీపరవస్తు రంగాచార్యులవిశాఖపట్టణార్ష గ్రంథాలయమునందు.)

ప్రమాణమకలంకస్య పూజ్యపాదస్య శాసనమ్,
ద్విసంధాన కవేఃకావ్యం రత్నత్రయ మిదం స్మృతమ్.

(జనశ్రుతము, అథర్వణకారికావళి.)

కాని శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగా రీయకలంకభట్టును కళంకరహితమైన యొకా నొకపండితుఁడనియు పూజ్యపాదశబ్దమునకు గురువనియు నర్థముచేసి పదునేడవశతాబ్దము

నకు నెట్టివేసిరి. పూజ్యపాదుఁడు అయిదవశతాబ్దమునందును, అకలంకుఁడు ఎనిమిదవశతాబ్దమునందును నుండిరనుటకు పెక్కునిదర్శనములు గలవు.

Akalanka, a Jain teacher from Sravana Belagola, who had been educated at the Baudha College of Ponatanga (near Tiruvathur, south of Kanchi), disputed in the year 788 A. D. with the Buddhists at Kanchi in the presence of Buddhist king of the Pallavas, Hemasitala 265 Sewell's Antiquities Vol. II.

Pujyapada, also called Devanandi, belongs to the end of the 5th century as he appears to have been preceptor to the Ganga King and author Durvineeta, who ruled from Talkad 482 to 522 A. D.

He was a Jaina muni or anchorite, who practised yoga and was believed to have acquired the extraordinary psychic powers, which yogis claim. He is said to have visited Behar. He wrote a Jaina Philosophy; but his fame rests on his grammatical works. He not only wrote a commentary on Panini called "Sabdavatara", but he composed a Sanskrit grammar of his own, entitled Jainendra which obtained great repute. E. P. Rice-Kanarese Literature.

శ్రీపంతులుగారు పది, పదునొకండుశతాబ్దములలో నుండుటకు వీలున్న యథర్వణుని పదునేడవశతాబ్దములో నుంచుట యధర్మమని తోఁచుచున్నది.

మండ లక్ష్మీనృసింహకవి తనయాంధ్రకౌముదిలో కొందఱఁ బ్రాచీనాంధ్రకర్తలం బేర్కొనెను.

"అథర్వణాని కాణ్వాని బార్హస్పత్యాని సంవిదన్,
కౌముదీమాన్ధ్రశబ్దానాం సూత్రాణి చ కరోమ్యహమ్. (ఆన్ధ్రకౌముది.)

త్రిలింగశబ్దానుశాసనమున నిట్లున్నది.

"బార్హస్పత్యాని సర్వాణి కాణ్వం వ్యాకరణం విదన్,
కరోమ్యాథర్వణం శబ్దం సర్వలక్షణలక్షితమ్."

అధోక్షజుఁ డనువ్యాకర్తకూడఁ గొందఱుపురాతనులఁ బేర్కొనియె.

"వాక్పతిం పుష్పదంతంచ కాణ్వం సోమమథర్వణం,
హేమచంద్రం నమస్కృత్య వక్ష్యేఽధోక్షజఫక్కికామ్."
(అధోక్షజఫక్కికలు.)

ఇందఱు గొప్పపండితులు వేఱువేఱుకాలములయందుఁ బాపభీతిగలదినములలో దైవము, ఇహము, పరము కలదనునమ్మిక కలకాలములో అసత్యము మహాదోషమనియు, కర్మకుఁ దగినశిక్ష యున్నదని తెలిసియు సిన్ని గ్రంథకర్తలపేర్లను కల్పించినయెడల వారికేమి లాభమో తెలియలేదు? వారట్లు అసత్యములాడరు. చరిత్రజ్ఞానములేక పైవారందఱు బ్రహ్మతోఁ దుల్యులని పొగడిరని చెప్పుట సమంజసమగునా? వారిపేర్లను పూర్వ మెవ్వరో వ్రాయ దానినిఁ బ్రతిధ్వనించిరని చెప్పుటయు సాహసమే. వారు వ్రాసిన ప్రాకృతవ్యాకరణములు కానవచ్చుచున్నవిగాని యాంధ్రవ్యాకరణములు దొఱకుటలేదు. కాణ్వ పుష్పదంతులు ఆంధ్రవ్యాకరణములనే వ్రాసిరని చెప్పవచ్చును. కారణమేమనగా వారు వ్రాసిన యాపవిభక్తికసూత్రములు సంస్కృతమున లేవు. ఆంధ్రమునఁగలవు. చూడుఁడు.

"అథాపశాబ్దికాద్యాదిప్రసంగః."

కాణ్వః. సర్వపదవ్యాపిన్యాః ఔప శాబ్దికాద్యావృత్తేః కిం వా లక్షణం తు సంఘృష్టి. శబ్దార్థస్య కేవలాంధ్రే "తిరుగు" ఇతి తద్ధర్మక్రియాయా శ్శిలావాచక "కలి" శబ్దే పరేసతి— తిరుగలి ఇతిస్థితే, తత్ర కవర్ణలోపాత్తిరుగలీతి కేన సూత్రేణ జాతమ్.

"ఏతల్లక్షణం జ్ఞేయం" తత్ర,

హేమచంద్రః. టస్యోపశాబ్దికాద్యాం ద్విత్వమాదేః.

వృత్తిః. ఔపశాబ్దికాద్యాం వృత్తిః శబ్దాద్యక్షరాట్టస్య ద్విత్వం భవతి. యథా పట్టపగలు, నట్టనడుమ, చిట్టచిగు రిత్యాది.

సూత్రః. ప్రతిషేధార్థే.

వృత్తిః. ప్రతిషేధార్థే గివర్ణాదేశః—రాముఁడు గీముఁడు, విభీషణుఁడు గిభీషణుఁడు ఇత్యాది.

*  *  *  *  *  *  *  *  *

సూత్రః. తుచ్ఛార్థే దుజో, లుగా మంత్రణే.

వృత్తిః. తుచ్ఛార్థే విద్యమాన "గాడు" శబ్ద డువర్ణకస్య ఆమంత్రణే సంబుద్ధి లుక్స్యాత్.

ఉ. ఓ శేషిగా, ఓరి కుప్పిగా, ఓరి ఉపాధ్యాయిగా.(గద్య—ఇత్యధోక్షజవిరచితాయాం భక్తికాయా మాపశాబ్దికాద్యాది ప్రసంగోనామ షష్ఠః)

ఇట్లు తెలుఁగువ్యాకరణములు, సూత్రములు, వృత్తులు కనఁబడుచుండ నివి కల్పింపఁబడినవనుటకంటె నన్యాయము లేదు. ఎలకూచి బాలసరస్వతి షడ్భాషావివరణము, అథో ఙుజభక్కికలలో బృహస్పతిశారదాదర్పణము, కాణ్వునివ్యాకరణము, పుష్పదంతుని సాహిత్యకౌముది, (పుష్పదంతః సాహిత్యకౌముద్యాం) మొదలగు గ్రంథములవిషయములను పరిశోధించినఁ దెలియఁగలదు.

ఆంధ్రమున క్రీ. శ. 6 వ శతాబ్దమునుండియు వాఙ్మయమున్నట్లు నిదర్శనములున్నవి. పదవశతాబ్దమునుండి ఆంధ్రవాఙ్మయము కనఁబడుచున్నది యుగక్రమమున నెట్లు ఈయాంధ్రభాష భూలోకమునకువచ్చె నను విషయములకు నీక్రిందిశ్లోకములం జూడుఁడు.

శ్లో. "కలాయుగే త్రిశతవత్సరాంతే యథావిధి,
స్వశిష్యం ద్రమిళం శాంతమగస్త్యో భగవానృషిః.
కృపాబలాత్సుసంవీక్ష్య చాక్షుషీదీక్షయా పునః,
మాతృకాయాః పంచదశశాఖామూలమనుం క్రమాత్.
తస్మై ప్రోవాచ విధివద్భాషామాలారహస్యకం,
మాతృకానుగ్రహాచ్చైవ స్వగురోశ్చ కృపాబలాత్.
"భాషాచా ర్యత్వమాసాద్య ద్రామిళస్సుసమాహితః,
గుర్వాజ్ఞా శిరసాధృత్వా లోకానుగ్రహకాంక్షయా.
చతుర్దశోత్తరసప్తశతయుక్త సహస్రకాః,
భూతలే స్థాపయామాస భాషాభేదాన్యథావిధి.
తేషాం నామాని వక్ష్యామి ద్రమిళోక్తాన్యథాక్రమం,
హైబ్రశ్య మారభిణం, గ్రైక్యం, సంజ, రంజ, మతఃపరమ్.
ద్రామిళంతు, తతఃప్రోక్త, మాంధ్ర, మాంధ్రేయణం, తథా,
పారశీకం, మహారాష్ట్రం, కరిణాట మతఃపరమ్."

ఆద్రామిళఋషి వేయినేడువందలు పదునాలుగువిధములగు భాషలనేర్పఱచి, హీబ్రుభాష, అరబ్బీ, గ్రీకు, సంజార్, రంజాక్, ద్రామిళభాష, ఆంధ్రభాష, ఆంధ్రేయణము, పారసీకము, కరిణాట లేక కర్ణాటకభాష అని వానికన్నింటికి నామకరణముచేసి తనశిష్యులకొప్పగించెను.

ఈయాంధ్రభాష యుగయుగములయందు నెట్లు ఎన్నివిభాగములుగా నెవరిచే స్థాపింపఁబడినదని తెలిసికొనుట కీక్రిందిశ్లోకములం జూడుఁడు.

శ్లో. "యుగభేదాదాంధ్రభాషాచార్యభేదః ప్రకీర్త్యతే,
కృతే సుధాయనః ప్రోక్తస్త్రేతాయాం శుకనాభకః.
దివోదాసశ్చ శల్యాతిరింద్రమిత్ర స్తథైవచ,
భాషాచార్యా ద్వాపరే స్యుస్తిష్యేభూన్నందివర్ధనః.
తతో దేవళరాయశ్చ తస్య శిష్యోనియోగికః,
ఏతే క్రమాదాంధ్రభాషాచార్యాస్సప్త ప్రకీర్తితాః.
అథాంధ్రభాషానామాని యుగభేదాత్ప్రచక్షతే,
ఆంధ్ర, మాంధ్రేయణం చైవ, మల్లకో, గుహాక స్తథా.
కోసలో, ద్రామిళశ్చైవ, క్రౌంచో, హేరంభక స్తథా,
గుహ్యకో, పిశకశ్చైవ, కాళింగో, రౌద్రమేవచ.
ఏతా ద్వాదశభాషా స్యుర్యుగభేదాద్యథాక్రమమ్."

కృతయుగమునందు నాంధ్రభాషాచార్యులు సుధాయనుఁడు, త్రేతాయుగమునందు శుకనాభుఁడు, ద్వాపరయుగమునందు దివోదాస, శల్యాతి, ఇంద్రమిత్రులు, కలియుగమునందు నందివర్ధనుఁడు, దేవళరాయుఁడు. ద్వాదశవిధములైన యాంధ్రములు.

| | |
|---|---|
| ౧. ఆంధ్రము. | ౭. ద్రమిళాంధ్రము. |
| ౨. ఆంధ్రేయణము. | ౮. గుహాకాంధ్రము. |
| ౩. కోసలాంధ్రము. | ౯. రౌద్రకాంధ్రము. |
| ౪. హేరంభకాంధ్రము. | ౧౦. గుహ్యకాంధ్రము. |
| ౫. కళింగాంధ్రము. | ౧౧ క్రౌంచకాంధ్రము. |
| ౬. మల్లకాంధ్రము. | ౧౨. పిశకాంధ్రము. |

ఆంధ్ర మాంధ్రేయణమనుభాషలు కృతయుగమున నాలవపాదమునందు సుధాయనుఁడనుమహర్షి చేతను, మల్లకాంధ్రము, గుహ్యకాంధ్రము, కోసలాంధ్రము అను నీమూఁడును త్రేతాయుగమున నాలవపాదమున నయోధ్యాధిపతియగు సత్యవ్రతుఁడనురాజుయొక్క యాజ్ఞచే శుకనాభుఁ డనుమహర్షి చేతను, ద్రామిళాంధ్రము, క్రౌంచకాంధ్రము, హేరంభకాంధ్రము, గుహాకాంధ్రము, పిశకాంధ్రము అను నీయైదుభాషలును ద్వాపరయుగమున రెండవపాదమున హరిశ్చంద్రునియాజ్ఞచే దివోదాస, ఇంద్రమిత్ర, శల్యాతి అనువారిచేతను, కలియుగమున ప్రథమపాదమున శాతకర్ణియనురాజు ననుమతిచే కాళింగాంధ్రము,

రౌద్రాంధ్రము అను రెండుభాషలును నందివర్ధనదేవళరాయులచే స్థాపింపఁబడినవని భాషాధికరణము వక్కాణించుచున్నది.

కలియుగమున రెండుభాషలు స్థాపింపఁబడినవని తెలియుచున్నది. అవి యెచ్చట నెవరిచే స్థాపింపఁబడినవనఁగా,

శ్లో. "తిష్యే ద్వావితి యదుక్తం తచ్ఛృణుష్వ సమాహితః,
కృష్ణాగోదావరీమధ్యదేశే పాపవివర్జితే.
దివ్యే గోకుల్యపార్శ్వస్థభార్గవక్షేత్రసన్నిభా,
గోదావర్యాశ్శోత్తరస్థ తటగంగాముఖే స్థితామ్.
యాం పురీం శాసతి విభుశ్శాతకర్ణిర్మహాయశాః,
తస్యాం మాహేంద్రపుర్యాం తు విష్ణువర్ధనపుత్రకః.
సర్వశాస్త్రవినీతజ్ఞో వేదవేదాంగపారగః,
సర్వభాషారహస్యజ్ఞ శ్శాంతోదాంత స్సమాహితమ్.
శాతకర్ణేర్మహారాజ్ఞ స్సభాధ్యక్షః సుబుద్ధిమాన్,
నందివర్ధననామాభూత్తస్య శిష్యో నియోగికః.
ఆంధ్రభాషారహస్యజ్ఞో నామ్నా దేవళరాయకః,
తావుభావాస్థానసభాప్రదీపావితి వర్ణితౌ.
రాజాజ్ఞాం శిరసా ధృత్వా తావుభౌ పండితోత్తమౌ,
కలౌ యుగేఽష్టపంచాశతోత్తరత్రిశతవత్సరే.
కళింగాంధ్రం చ రౌద్రాంధ్రం స్థాపయామాసతుస్స్వయం. ఇత్యాది.

చంద్రవంశజుఁడైన శాతకర్ణిమహారాజు కృష్ణాగోదావరీ మధ్యభాగమునందు మహేంద్రపురి యనుపట్టణమునఁ బాలించుచుండెను. ఈపట్టణమున విష్ణువర్ధనుఁ డను బ్రాహ్మణుఁ డుండెను. అతనికుమారుఁడు నందివర్ధనుఁడు. ఇతఁడు సర్వశాస్త్రవిశారదుఁడై వేదవేదాంగపారగుఁడై యుండెను. ఇతనికి నాంధ్రభాషారసజ్ఞుఁడైన నియోగిబ్రాహ్మణుఁడు దేవళరాయుఁ డనువాఁడు శిష్యుఁడై యుండెను. ఆంధ్రభాషాపండితుఁడైన యీదేవళ రాయుని శాతకర్ణిమహారాజు తనయాస్థానపండితునిగా నుంచుకొనెను. ఆరాజు నందివర్ధన దేవళరాయులను జూచి "పండితవర్యులారా! పూర్వము వ్రాయఁబడిన యాంధ్రగ్రంథము లన్నియు నశించినవి. నేనాంధ్రుఁడనైయుండి యాంధ్రకవిత్వవిశారదులైన మీరు గలిగి యుండగా నాంధ్రగ్రంథములు వ్రాసి, మరల నాంధ్రమును స్థాపించవలయునని కోరితిని."

అని చెప్పఁగా వారిరువురు కళింగాంధ్ర, రౌద్రాంధ్రములను కృష్ణాగోదావరీనదులమధ్య స్థాపించిరి.

విశ్వేశ్వరభట్టాచార్యులనువారు భాషాముకురమనునాంధ్రగ్రంథమునం దిట్లు వ్రాసి యున్నారు. వ్రాఁతవడ్డమాటలు చూడుఁడు—

సీ. ఖేచరకిరణాగ్ని దగ్గిబోదరముచే సత్యభాగుడియిండ్లభాస ముదర
అగ్నిమిత్రు డంధకతఝుడంగెడుమ్మిలో కడిజ్ఝి భాస్కరుం మనన మొంది
బొరవిన జెరణినిం గడగుడి గెరగించి గడగ నోచి భాబిందు లడగ దొడగె
అడుగ నాభామణి నవభవకర మొంద్రు
త్సలరించి వరుణకరగాగర్భ బవిడె
గ్రుడువించు ఝమ్ములగరిమమనడై
దిఙ్ముఖములరలించు భోగరిండ్లభాస మొరెయ
భాస ముబ్బరించె వానికంశుగురుఁడు.

దీని తెలివిడి. అగ్నిమిత్రునకు నెండమావులచే నంధత్వము ప్రాపింపఁగా నాతఁడు సూర్యునిం గూర్చి స్తోత్రముచేసెను. సూర్యుఁడు వానికి నొకభాష యుపదేశించెను. ఆభాషాప్రభావము చేతను, సూర్యునియనుగ్రముచేతను నాతనికి మునుపటివలెనే కన్నులు వచ్చెను.

"భాగురుభాషా బ్రొమ్ము నభాగుడి బ్రొమ్మిండ్లబిందుల్భాసము నందేఁ
భాబుప్పభాషవానాంధమ్ముఁ రాతియ్యగ నది నాంధ్రము నంచు బరువడి నందెన్."

అగ్నిమిత్రున కంధత్వమును బోఁగొట్టినందువలన నాభాషకు నాంధ్రభాష యనుపేరు గలిగినది.

చక్రాయణీ యనువారు భాషాకల్పచంద్రికా యనుగ్రంథమునందు ఆంధ్రభాషను గుఱించి యిట్లు వ్రాఁతవడ్డపోకడలఁ దెల్పియున్నారు.

ప. జలమండబండిలో నీశ్వరగరిమచే పంచద్రొమ్ములనాంధ్రబుడికముగుచి
భాగురాంశులబొరగు భూలోకశృణిలలో మూలనరకుసరము లొసర డించి
వేదవేదాంతభావార్థబ్రహ్మలను నాంధ్రభాషఫలములను భూసురలు లెంక
ఆదిత్యముగరణిఁ నాంధ్రత్వముగడినా నగ్నిమిత్రు నగ్నికుహరుచేత.
భాగుండ్లగ్రద్ధి లోభూర్గురుచుండునా గుర్జావ్విజలలహారిగరిమబొరగు

భాగీంద్రక్రద్ధిని మొరెయ జృమ్మిదరించు సర్వజరణి శాప మణగ దెంప
కోడగ మర్యాద దిఙ్ముఖముల నొరంగ పుడమి నాంధ్రభాష బొవ్వి పరగడించె.

**Pandit T. Subbaraya Sastry, Bangalore.** భాతికకళానిధి **1-2 Vols.**

లోకమునందు నైదుశాఖలుగల యాంధ్రభాష యీశ్వరాజ్ఞచేఁ బుట్టి సంస్కృతమున లేనిదియుఁ బ్రకాశించి యగ్నిమిత్రునివాక్కునుండి వెలువడి గంగాప్రవాహమువలె వ్యాప్తింజెందగా దానిని ననుసరించి జనులు సమస్తపాపముల నశింపఁజేయుదురు. ఇందలి పదములుగాని యర్థముగాని మనకుఁ బరిచయము లేదు. కాని యిది సీసపద్యము. పూర్వము చాలకాలమునుండి సీసపద్యములు వాడుకలో నుండియున్నట్లు ఈనిదర్శనచేఁ దెలియు చున్నది.

శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు నీతిశాస్త్రముక్తావళీపీఠికలో నొకశాసనమును ప్రకటించి, వా రాశాసనము ప్రాచీనలేఖ్యములలో నున్నదనియు. నందాదికవి యొకఁ డుండెననియు, నాతఁడు కొన్ని గ్రంథము లెవ్వియో వ్రాసెననియుఁ జెప్పిరి. దీనినిఁ గూడ వీరేశలింగముపంతులుగారు ఆధారరహితమనియు విశ్వాసార్హముకాదనియు వ్రోసి వేసిరి.

ఇన్ని లక్షణగ్రంథములుండి జీర్ణింపఁగా వాని నన్నింటిని నన్నయకుఁ బూర్వపు గ్రంథములని చెప్పుటకుఁ దగిన కొన్ని పద్యములను జూడుఁడు.

మధ్యాక్కర.—

"స్వస్తి శ్రీనృపాంకుశాత్యంతవత్సలసత్యత్రిణేత్ర
విస్తరశ్రీయుద్ధమల్లుం డనవద్యవిఖ్యాతకీర్తి
ప్రస్తుతరాజాశ్రయుండు త్రిభువనభరణుండు సకల
వస్తుసమేతుండు రాజసల్కి భూవల్లభుం డర్థి
పరగంగ బెజవాడ కొమరుసామికి భక్తుండై గుడియు
నిరుపమమతి నృపధాముఁ డెత్తిచ్చె నెగి దీర్చె మఠము
గొరగాల్గాకొరులిందు విడిసి బృందంబు గొనియుండువారు
పరిగాక యబ్బార నాసి వచ్చినపాపంబు గొంద్రు.
వెలయంగ నియ్యొట్టు దస్సి మలినసురై విడిసినబ్రోల
గలతానపతులును రాజు పట్టముగట్టినపతియు

నలరసుంబయ్యార్వరల వెల్వరించిన నశ్వమేధంబు
ఫల ముపేక్షించి నాలింగబడసినపాపంబు దమకు. 3
జనసుత చేబ్రోలనుండి బెజవాడ జాత్రకు వచ్చి
త్రిణమనసుతుఁ డొండుచోట మెచ్చక తివిరి యిన్నెలత
యనఘుండు చేకొని యందు ప్రత్యక్షమై యున్న నచ్చ
గని మల్లు డెత్తించె గుడియును కార్తికేయునకు. ౪

* * * * * * *

రమణతో బెజవాడ కెల్లబెడగును రక్షయుంగాను
తమతాత మల్లపరాజు వేర్వేలు దాను గట్టించెఁ
గ్రమమున దానిక కలశమిడ్డట్టుగా మొగమాడు
వమరంగ శ్రీయుద్ధమల్లుఁ డెత్తించె నమితతేజుండు. ౫

ఈశాసనము బెజవాడలో మల్లేశ్వరస్వామియాలయములో నున్నది. ఇవియన్నియు మధ్యాక్కరలు. ఇది క్రీ. శ. 890 ప్రాంతమునఁ బుట్టినది. నన్నయ యీయక్కరలను వాడియున్నాఁడు. దీక్షాసిశాసనమున నుండెడిసీసములంబోలికలే నన్నయసీసములు చూఁడుడు.

సీ. శ్రీశకునేండులు భూపతిపై శైలనందాబ్ధభవసంఖంబు నొంద వేంగి
దేశంబు గిమిడియగోసలగిద్రిసింగి దేశంబు మఱి యొడ్డదేశ మనఁగ
జనిన భూపాలుర నని నొచ్చె చలమర్తి గండఁడై నెగడినమండలికుఁడు
భూసురవంశుండు వాసవనిభభోగి, బణపతి సౌజన్యగుణయుతుండు
దీక్షాసి భగవతిదేవి దేవాలయమున ముందటం గడు ఘనతరముగ
మండప మెత్తించె భండనవిజయుండు గండగోపాలుం డఖండవర్తి
దీవియవెట్టి నద్దేవికి నన్లైలం దనమనోవల్లభి వనజనేత్రి
దీవియవెట్టెఁ బద్మావతియును నాక్షోణీనశశులు గలయంతకును ముదమున
ఆ. గగనభూమి చంద్రఖరకరోదకశిఖ, మారుతాత్మమూర్తి మహిమమదన
యిష్టపూర్తిఫలము లెల్లకాలంబును, మెచ్చుతోడఁ దమకు నిచ్చుచుండ.

(Epigraphica Indica, Vol. P 316, 317.)

ఈశాసనము క్రీ. శ. 1075 లోఁ బుట్టినదిగాన క్రీ. శ. 1056 లో నున్న నన్నయకు సమకాలమున నుండెననవచ్చును. ఈ రెండుశాసనములే కాక యనేకప్రాచీనశాసనములు పద్యోపేతములున్నవి, గణకవిజయాదిత్యునికాలమునఁ బాండురంగవిభుఁడు నెల్లూరు

మండలమున వేయించినశాసనము లున్నవి. చోడుఁ డగుపుణ్యకుమారుడు క్రీ. శ. 750 లో నున్నట్లు చరిత్రకారుల యభిప్రాయములు. ఈతనిశాసనము లాంధ్రపద్యోపేతములై యున్నవి. (Refer to Epigraphica Indica Vol VI. P. 123 note Sasanam No 384, of 1904; Nos. 405, 406, 408 of 1904; 398 of 1904 తుముకూరుశాసనములు Epigraphica Carnatica P. 349

నెల్లూరిశాసనసంపుటములలోఁ బ్రాచీనాంధ్రలిపిలో క్రీ. శ. 6-9 శతాబ్దములయందలి శాసనములు తెలుఁగుసంకలితములు. ఇవియన్నియు యుద్ధమల్లునిశాసనమును లిపియందే కాక, కొన్ని శపథములు, పదములు, శాసనపద్ధతులు మొదలగు వానియందును మిక్కిలి పోలియున్నవి. యుద్ధమల్లునిశాసనమునుబోలిన మఱియొకశాసన మున్నది. దానిలోని త్రిభువనాంకుశ బిరుదము రెండవవిజయాదిత్యున కున్నది. ఈశాసనము నెల్లూరుమండలము అద్దంకిలో నున్నది. మంజరీద్విపదను బోలియున్న శాసనభాగమును జూడుఁడు.

"ద్వి. పట్టంబుగట్టిన ప్రథమంబు నేఁడు,బలరవం బొప్పఁగఁ బైలేచి సేన
పట్టంబు గట్టించి ప్రభు బంటరయిన, భండనసమయుక్తపదువంశబోయ."

ఈశాసనములన్నియుఁ బునర్విమర్శనము చేయఁబడినయెడల ఆఱవశతాబ్దమునుండి ఆంధ్రవాఙ్మయమున్నదని స్పష్టముగఁ జెప్పవచ్చును.

నన్నెచోడుఁడు, సుమతిశతకకర్త (జైనముని) వేములవాడ భీమకవి మున్నగువారు నన్నయకు పూర్వులనిపరులని వాదోపవాదములున్నవి. కావున నన్నయకుఁ బూర్వమున ననేకయుగములనుండియో, బ్రాహ్మణకాలమునుండియో ఆంధ్రభాషలో లక్ష్యలక్షణ గ్రంథము లున్నట్లును, శాసనాదులవలనఁ బద్యరచనమున్నట్లును దెలియుచున్నది. కొన్ని గ్రంథములు పూర్తిగా నశించినవి. దానికి నన్నయభట్టు, ఆతనిభారతములే కారణములు.

నన్నయభట్టే తనకాలములోఁ గొందఱుకవు లున్నట్లు చెప్పుచున్నాఁడు.

"అఖిలజలధివేలావలయితంబయి వసుమతీవనితావేలావలయింబయిన వేఁగిదేశంబునకు నాయకరత్నంబునుంబోని రాజమహేంద్రపురంబున......సుఖంబు లనుభవించుచు సకలభువనలక్ష్మీనివాసంబయిన రమ్యహర్మ్యతలంబున మంత్రి, పురోహిత, సేనాపతి, దండనాయక, దౌవారిక, మహాప్రధానానంతసామంతవిలాసినీపరివృతుండై యపారశబ్దశాస్త్ర పారంగతులైన వైయాకరణులును, భారతరామాయణాద్యనేకపురాణప్రవీణులైన పౌరాణికులును, మృదుమధురరసభావభాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవులును... నాదిగాఁగలుగువిద్వజ్జనంబులు పరివేష్టించి కొలువ విద్యావిలాసగోష్ఠి సుఖోపవిష్టుండై

యిష్టకథావినోదంబులనుండి......" ఈమృదుమధుర రసభావభాసురనవార్థవచనరచనావిశారదులైన మహాకవులు సాధారణముగా సంస్కృతకర్ణాటభాషావేత్తలని చెప్పవచ్చునుగాని

"ఉ. సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకవితార్థయుక్తిలో
నారసి మేలునా నితరులక్షరరమ్యతనాదరింప"

అనుపద్యపాదమును గమనించిచూడఁగా వారు ఆంధ్రకవులనియే పొడగట్టుచున్నది. అట్లు కానియెడల వారెట్లు ఆంధ్రభారతకవిత్వము నరయుట, ఆదరించుట, మేలని మెచ్చుకొనుట జరుగుచున్నది. బెంగాలీభాషాపండితుఁడు తెలుగు కవిత్వమునందలి మంచిచెడ్డల నిర్ణయింప నగునా? రాజరాజనరేంద్రుఁ డేలినది తెలుఁగుదేశము. ఆతనియాస్థానకవులు తెలుఁగురాని వారుగా నుండరు గదా? అప్పటివారందఱు తెలుఁగుకవులని తేలుచున్నది. కాని వారు వ్రాసిన కావ్యములు కానరావు.

వాఙ్మయధురంధరుఁడును, తనకిష్టుఁడైన నారాయణభట్టునకు నన్నభట్టు నభిమతము ప్రకారమే రాజరాజనరేంద్రుఁడు నందంపూడి యగ్రహారమును దానముగా నిచ్చెను. ఆశాసనమున నారాయణభట్టు "యః సంస్కృతకర్ణాటప్రాకృతపైశాచికాంధ్రభాషాసుకవి రాజశేఖరః" అని వర్ణింపబడియున్నాఁడు. అట్లుకానిచో నన్నయకు భారతరచనమునందు నారాయణునట్లు సాహాయ్యమొనర్చుట యెట్లు పొసగును. ఇతఁ డకలంకశంకనామాత్యునకును సామెకాంబకును పుత్రుఁడు. ఇతఁడు వ్రాసినకావ్యము లెవ్వియుఁ గానరావు.

"పూర్వకాలమున ద్విపదకావ్యములు, రగడలు చాల వాడుకలోనుండెననియు, నన్నయాదిమహాకవుల ప్రౌఢకావ్యములు జనించినతోడనే యవి క్షీణించెననియు నేను దలఁచుచున్నాను" మా. రామకృష్ణకవి.

త్రిపురాంతకోదాహరణపీఠిక అథర్వణుఁ డను కవి నన్నయకాలమునం దుండెను. అతఁడును భారతమును విరచించెను. అథర్వణుఁడు జైనుఁడనియు, రాజదర్శనముకాక పోయినందున నిస్పృహుఁడయ్యె నందురు. భీమన రాఘవపాండవీయమునుగూడ నన్నయ యడంచెనని వదంతి. శ్రీనాథుని "వచియింతు వేములవాడ భీమునిభంగి" అనువాక్యముచే భీమకవి నన్నయకుఁ బూర్వుఁడని తెలియుచున్నది.

కావున నన్నయకుఁ బూర్వముకూడ వాఙ్మయముండెడిదని నామనవి.



# మాతృభాష

శృంగేరిశ్రీవిరూపాక్ష శ్రీవిద్యాశంకపదమాఽఽవేశ ప్రకాశితజగద్గురు
**శ్రీకల్యాణానందభారతీమహాంతాచార్యస్వాములవారు,**
శ్రీసదనము, గుంటూరు.

కామేశ్వరీం పరామీడే కాదిహాదిస్వరూపిణీమ్,
మాతృకావర్ణలిప్తాంగీం మహాశ్రీచక్రమధ్యగామ్.

ఆర్యావర్తమని యనాదిగఁ బ్రసిద్ధిఁగాంచుచున్న యీభారతవర్షమున నైరోపాదేశముతోడి సంబంధము గల్గినదాదిగా ననఁగా సుమారు రెండుమూఁడువందల సంవత్సరముల నుండి యైరోపాదేశీయు లాత్మస్తుతిని బ్రధానముగాఁ జేసికొనుచుఁ దమయౌన్నత్యమును భారతీయులపైఁ బ్రకటింపఁ బలువిధములగు సమస్యలను లేవఁదీయుచు నవ్వానిసిద్ధాంతము దమయౌన్నత్యమునే ప్రకటించుచున్నదను దంభముతోఁ బలువిధములగు గ్రంథములఁ జిత్రించి వెదఁజల్లినారు. అట్టి సమస్యలలో మాతృభాషాసమస్య యగ్రగణ్యము. ఈసమస్య యందు సత్యము మఱుగుపడఁ బలువిధములగు కువాదములు నేటికిఁ బ్రబలియున్నవి. అట్టి కువాదములనుండి యథార్థమును లోకమునకు వెల్లడిచేయఁదలంపున నీవ్యాసము ప్రవర్తించుచున్నది.

మాతృభాష నన్వేషించుటకుముందు భాషలతత్త్వ మొకింత దెలిసికొనవలయును. భాషలు ప్రకృతులనియుఁ బ్రకృతివికృతులనియు వికృతులనియు ముత్తెఱఁగులఁ బరఁగుచుండును. అందుఁ బ్రకృతియన మాతృభాషయే. వికృతులనఁ బ్రకృతమున వ్యవహారమునఁ దెలియవచ్చెడి భాషావిశేషములు. ప్రకృతివికృతులనఁగాఁ బ్రకృతమున వ్యవహారమునఁ దెలియవచ్చెడి భాషలపరిణామమునకుఁ గారణభూతములును బ్రకృతివలనఁ బలువిధములగు కారణములచేఁ బుట్టి కొంతకాలము పుష్కలవ్యవహారమును గని తమవికృతులు ప్రబలఁగా మృతప్రాయములుగ నలరారుభాషావిశేషములు.

ఇట్లీ మూఁడువిధముల నలరారు భాషావైచిత్ర్య మొకింత పరిశీలించినచో మాతృభాషాసమస్య సుకరమగును. చతుస్సాగరపరివేష్టితంబగు నీభూమండలమునఁ దెలియవచ్చెడి భాషలనన్నింటి నొక్కపెట్టున గమనించుట దుర్ఘటము. అట్లు గమనింప యత్నించుట

తత్త్వాన్వేషణమునకు బాధకము. కావున నేకదేశవిషయమును ముస్ముందుఁ జర్చించి యిద్దాని వలన నలవడు న్యాయముల సరసతచేఁ బ్రాపంచికవైచిత్ర్యమునందలితత్త్వమును గుర్తెఱుఁగుట సుగమము. కావునఁ బ్రథమమున నీయార్యావర్తమునందలి భాషలసరణిని విచారించి తత్త్వము నరయుదము.

ఆర్యావర్తమున సృష్ట్యాదినుండి నేఁటివఱకు వేదములపౌరుషేయములు నిత్యములు స్వతఃప్రమాణములు ననుగౌరవముతో నెన్నఁబడుచుండుట యెల్లరకుఁ దెలిసిన విషయమే. ఆధునికులన్నను వేదైకదేశమగుఋగ్వేదముకంటెఁ బ్రాచీనగ్రంథములు ప్రపంచమునఁ దెలియఁబడవుగావున ఋగ్వేదమే యతిప్రాచీనమైనదనియు సర్వవిధముల నంగీకరించినారు. కావున ఋగ్వేదభాష పరమప్రాచీనమనియు నద్దానికిఁ బూర్వ మొకభాషయున్నట్లింతమాత్రము దెలియఁబడదనియు దానంజేసి ఋగ్వేదభాషయే యాదిభాషయు మాతృభాషయు ననిచెప్పుట కించుకేనియు సందియములేదు. దేశాంతరులబుద్ధివృత్తు లెట్లున్నను నార్యావర్తమున నాదిభాషయు మాతృభాషయు వైదికభాషయే. ఇఁక నార్యావర్తమున నేఁటివఱకుఁ దెలియవచ్చెడి భాషాంతరముల కన్నింటికి ననఁగాఁ బ్రకృతివికృతులకును వికృతులకునుగూడ వైదికభాషయే ప్రకృతి. అనఁగా మాతృభాష. ఇఁక నార్యావర్తమునఁ దెలియవచ్చెడి వికృతులన్నను పలువిధములుగఁ దెలియవచ్చుచున్నను స్వభావముచే వాని నన్నింటిని నుత్తరదక్షిణభేదముచే ద్వివిధములుగ విభజింపనొప్పును. ఉత్తరవికృతులకు నాదర్శములు హిందీ, బంగాళము, మరాటి అనుభాషలు. దక్షిణవికృతులకు నాదర్శములు తెలుఁగు, అరవము, కన్నడము, మళయాళ మనుభాషలుగ నెన్నఁబడుచున్నవి. ఆర్యావర్తమునఁ బ్రకృతివికృతులుగఁ దెలియవచ్చెడిభాషలలో నగ్రగణ్యములు శౌరసేని, మాగధి, పైశాచిమున్నగుప్రాకృతభాషలు.

ఆర్యావర్తమునఁ దెలియవచ్చెడిప్రకృతి, ప్రకృతివికృతి, వికృతియనుభాషావిభాగమునకుఁ దెలియవచ్చెడి కారణములలో నాయాయిభాషలకుఁ బ్రధానముగాఁ దెలియవచ్చెడి వర్ణసమామ్నాయములభేద మగ్రగణ్యమగుచున్నది. అయ్యదెట్లనిన నిటుఁ జెప్పఁబడుచున్నది.

## వైదికభాషావర్ణసమామ్నాయము

వైదికభాషావర్ణసమామ్నాయవిశేషమును వర్ణించుట సామాన్యవిషయముగాదు. ఏలయనఁగా నయ్యది కృత్రిమముగాక స్వతస్సిద్ధమును నిత్యము నగుచుఁ బలువిధములగు

విశేషములతో నొప్పుచున్నది. వైదికభాషయొక్క వర్ణసమామ్నాయమునకు 'విద్య' యనియు, 'మాతృక'యనియు సంప్రదాయవ్యవహారము గలదు. ఇట్టి వర్ణసమామ్నాయము ప్రయోజనముతోఁగూడిన నాల్గువిధములగు వ్యవహారము నొందుచున్నది. అట్టి నాల్గువిధములగు నీవర్ణన మామ్నాయభేదములకు 'భూమవిద్య, కాదివిద్య, హాదివిద్య, సంఖ్యావిద్య యని యన్వర్థంబులగునామంబులు గలవు. అందు భూమవిద్యాస్వరూపము "బిందువిసర్గావచ్ కచటతపయశాస్తు భూమా" యని స్మరింపఁబడుచున్నది. అనఁగా:— "బిందువు (ం) విసర్గము (ః) అ, ఇ, ఉ, ఋ, ఌ, ఏ, ఓ, ఐ, ఔ—క ఖ గ ఘ ఙ—చ ఛ జ ఝ ఞ—ట ఠ డ ఢ ణ—త థ ద ధ న—ప ఫ బ భ మ—య ర ల వ—శ ష స హ క్ష" యను నలువదియైదువర్ణములతోఁగూడిన వర్ణసమామ్నాయము.

ఇఁకఁ గాదివిద్యాస్వరూపమన్ననో "కాదివిద్యాహ్యాక్షమాలికా" యని స్మరింపఁబడుచున్నది. అనఁగా అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఋ, ౠ, ఌ, ౡ, ఏ, ఐ, ఓ, ఔ, ం, ః, క ఖ గ ఘ ఙ, చ ఛ జ ఝ ఞ, ట ఠ డ ఢ ణ, త థ ద ధ న, ప ఫ బ భ మ, య, ర, ల, వ, శ, ష, స, హ, ళ, క్ష యనువర్ణములు

హాదివిద్యయు "నాదస్తు హాదివిద్యా"యని స్మరింపఁబడుచున్నది. అనఁగా నీశ్వర డమరుకనాదమునుండి బయల్వెడలి పాణినీయమునకు మూలభూతములగు చతుర్దశసూత్రరూపముగ నలరారుచున్నది. అందు, అ ఇ ఉ, ఋ ఌ, ఏ ఓ, ఐ ఔ, హ య వ ర, ల, ఞ మ ఙ ణ న, ఝ భ, ఘ ఢ ధ, జ బ గ డ ద, ఖ ఫ ఛ ఠ థ చ ట త, క ప, శ ష స, హ యనువర్ణములు వెలయుచున్నవి.

సంఖ్యావిద్యయన్ననో "అకటా దినవపాదిపంచ, యాద్యష్ట సంకేతరూపాసంఖ్యా" యని స్మరింపఁబడుచున్నది. అనఁగా నీసంఖ్యావిద్యయందు, అ. ఇ. ఉ ఋ ఌ ఏ ఐ ఓ ఔ. క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ. ట ఠ డ ఢ ణ త థ ద ధ. ప ఫ బ భ మ. య ర ల వ శ ష స హ. యనువర్ణము లొప్పుచున్నవి.

ఇట్లీవర్ణసమామ్నాయములు ప్రయోజనము ననుసరించి విచిత్రముగ నలరారుచున్నను వైదికభాషావర్ణములకు నియతమగుసంఖ్య నలువదియైదు మాత్రమే. ఇట్టి నలువదియైదువర్ణములును నియతములగు నలువదియైదుస్వరములను బ్రదర్శించుచున్నవి.

ఇఁకఁ బ్రకృతివికృతులలో నగ్రగణ్యమగు ప్రాకృతభాషకు, అ ఆ ఇ ఈ ఉ ఊ ఏ ఓ అం అః. క ఖ గ ఘ చ ఛ జ ఝ ట ఠ డ ఢ ణ త థ ద ధ న, ప ఫ బ భ మ, య ర ల వ స హ ళ. యనువర్ణము లొప్పుచున్నవి.

వికృతులలో నాదర్శములగునరవము తెలుఁగును రెండింటిలో నరవమునకు—అఆ ఇఈఉఊఎఏఐఒఓఔ, కఖగఘఙచఛజఝఞటఠడఢణతథదధనపఫబభమ, యరఱల వళళ యనువర్ణములు గలవు.

ఇక్లే తెలుఁగుభాషకు—అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం. కగచచే జజేటడణ తదన పబమ యరలవసహళ యను ముప్పదియాఱువర్ణము లొప్పు చున్నవి. ప్రకృతమున వ్యవహారమును గనుచున్న తెలుఁగుభాషకు నేఁబదియైదక్షరములు పరిగణింపఁబడుచున్నను నయ్యది తత్సమపదముల కలియకచేఁ గల్గినయాధిక్యముగాని స్వత స్సిద్ధ మెంతమాత్రముగాదు గదా!

ప్రకృతివికృతులయొక్కయుఁ గేవలవికృతులయొక్కయు సరణిఁ జూచిన నీభాషల యందలి శబ్దములన్నియుఁ బ్రకృతిభాషయందలి శబ్దములందుఁ గల్గిన వర్ణలోపవర్ణాగమ వర్ణవ్యత్యయములచేఁ గల్గినట్లు సుస్పష్టము. ఇయ్యదియ మూఁడువిధములగుభాషలయొక్క విమర్శనమువలనఁ గల్గిననాయ్యయము.

ఈన్యాయము నొకింత చేకొని దేశాంతరమందలి భాషల నొకింత పరికింతము.

ఐరోపాఖండమునందలి వికృతిభాషలలో నగ్రగణ్య మాంగ్లభాష. ఈభాషకు వర్ణములు—

**A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z** అని వెలయుచున్నవి. ఈవర్ణసమామ్నాయమునకు 'ఆల్ఫబెట్' **Alphabet** అనిపేరు. ఈభాషకు నిదానము లాటిన్ **Latin** భాష. 'లాటిన్‌భాషకు, **A B C D E F Z H I K L M N O P Q R S T V X** అను నిరువది యొకయక్షరములు గలవు. 'లాటిన్' భాషతోఁ దుల్యమగునదియు 'లాటిన్' భాష కాదర్శము నగు 'గ్రీక్' **Greek** భాషగూడ నైరోపా ఖండమునఁ బ్రాచీనభాషగఁ బరిగణింపఁబడుచున్నది. 'గ్రీక్' భాషకు 'లాటిన్' భాషయందుఁ దెలియవచ్చెడి యిరువదియొకయక్షరములేగాక మఱి మూఁడువర్ణము లధికముగఁ దెలియ వచ్చుచున్నవి. ఈ 'గ్రీక్' 'లాటిన్' భాషలు రెండును నైరోపాఖండమునఁ బ్రాచీనభాష లగుచు సోదరన్యాయముతో నొప్పుచున్నట్లు దలంపఁబడుచున్నవి. అయిరోపాఖండము నందలి 'గ్రీక్ లాటిన్'భాష లార్యావర్తమునందలి ప్రకృతివికృతిభాషలట్లు వ్యవహారశూన్య ములై యుండుటంజేసి యవ్వానిని పాశ్చాత్యులు మృతభాషలుగఁ బరిగణించుచున్నారు. ఇంతియకాదు. ఈరెండుభాషలును సంస్కృతభాషతో ననఁగా వైదికభాషతో సోదరన్యాయ మును గల్గియున్నవనియు సంస్కృతభాషగూడ 'గ్రీక్‌లాటిన్' భాషలవలె మృతప్రాయ

మనియుఁ గొన్ని వాదాభాసములను వీరు ప్రవర్తింపఁజేసియున్నారు. ఏతద్వాదాభాసముల నొకింత విమర్శింతము——

'గ్రీక్ లాటిన్' మున్నగుభాషలతో సంస్కృతభాషకు సోదరన్యాయమును గల్పించువార లాయాయిభాషలయందు దృష్టాంతముగఁ బ్రదర్శించుశబ్దములపట్టిక నొకింత దిగువఁ బొందుపఱచుచున్నాము.

| Sanskrit | Zend | Persian | Greek | Latin | Low German |
|---|---|---|---|---|---|
| 1 Pitar | Paitar | Pader | Pater | Pater | Fader |
| 2 Matar | Matar | Mader | Meter | Mater | Moder |
| 3 Duhitar | Dughdhar | Dokhter | Thugater | × | Tochter |
| 4 Brater | Bratar | Brader | Fratra | Frater | Bruder |
| 5 Devas | Daevas | Diw | Theos | Deus | Oge |

ప్రకృతమున నీపట్టికయందుఁ గనఁబఱుపఁబడినపదము లాంగ్లాక్షరములతో ననఁగా 'లాటిన్ అక్షరములతో వ్రాయఁబడియున్నవి. 'లాటిన్' భాషకు వర్ణము లిరువదియొకటి, ఇంగ్లీషుభాష కిరువదియాఱు, జర్మన్‌భాషకు నిరువదిరెండు, గ్రీక్‌భాషకు నిరువదినాల్గును గలవు. 'పెరిషియన్' భాషకు ముప్పదియొకయక్షరములు గలవు.

ఈభాషలలోనియక్షరములు నియతస్వరముల నెంతమాత్రము ప్రదర్శింపక నియత స్వరములనుబోధించుటకు లిపియందు రెండక్షరములనైన నపేక్షించుచుండును. సంస్కృత భాషకన్నను వర్ణములు నలువదిరెండు. ఇందు వర్ణముల నియతస్వరము లిపియం దొకేయక్షరముచే బోధింపఁబడుచున్నది. ఒకసంస్కృతమునం దేగాదు; ఆర్యావర్తమునందలి సమస్త భాషలయందుఁగూడ నిట్లే వర్ణముల నియతస్వరము లిపియం దొకేయక్షరముచే బోధింపఁ బడుచున్నది. ఆర్యావర్తమునందలి వర్ణసమామ్నాయమునకు దేశాంతరములందలి వర్ణ సమామ్నాయమునకును బ్రధానతమంబగు భేద మిదియే. సంస్కృతమునందుఁ దెలియఁబడు కాదిపాంతవర్గముల ద్వితీయచతుర్థవర్ణములగు ఖఘ, ఛఝ, ఠఢ, థధ, ఫభ, వర్ణము లెట్లు తెలుఁగు మున్నగుభాషలయందుఁ గానఁబడవో యట్లే దేశాంతరభాషలందుఁగూడఁ గన్పట్టవు. ఈద్వితీయచతుర్థవర్ణములఁ బ్రదర్శించుటకు దేశాంతరములందు సాధనముగూడఁ గానరాదు. వేయేల! ఆయాయిభాషల వ్యవహరించువా రీసంస్కృతభాషను నియతమగు స్వరముతో నుచ్చరించుటకు సర్వవిధముల నసమర్థులు. కావున సంస్కృతభాషాపదములను భాషాంతరవర్ణములతోఁ జిత్రించుట నియతమగుశబ్దజ్ఞానమునకు దూరమగును. అద్దానిచేఁ

దత్త్వమునకుఁ గొఱఁత గల్గును. భాషాంతరములందలి పదములను సంస్కృతభాషయందలి వర్ణములచే సుకరముగ వ్రాయనగును. అపుడు తత్త్వమునకుఁ గొఱఁత యేమియు లేదు. పైపట్టికయందుఁ బ్రదర్శింపఁబడినపదములను సంస్కృతభాషయందలి వర్ణములచే వ్రాసిన నీపదములపొందిక యిత్తెఱఁగునఁ దెలియవచ్చుచున్నది—

| సంస్కృతము | జెండ్ | పెర్షియన్ | గ్రీక్ | లాటిన్ | లోజర్మన్ |
|---|---|---|---|---|---|
| 1 పిటర్ | పైటర్ | పేడర్ | పేటర్ | పేటర్ | ఫాడర్ |
| 2 మాటర్ | మాటర్ | మాడర్ | మేటర్ | మాటర్ | మోడర్ |
| 3 డుహిటర్ | డుఘ్ధర్ | డోఖ్టర్ | తుగెటర్ | × | టోక్టర్ |
| 4 బ్రాటర్ | బ్రాటర్ | బ్రాడర్ | ఫ్రాట్రా | ఫ్రాటర్ | బ్రుడర్ |
| 5 డేవాస్ | డేవాస్ | డివ్ | తియోస్ | డియస్ | ఓగ్ |

ఇట భాషాంతరపదముల స్వరూప మెట్లున్నను సంస్కృతపదముల స్వరూపము మాత్రము తద్భాషాకోవిదులకు హాస్యాస్పదముగ నుండుననుట కెంతమాత్రము సందేహము లేదుగదా! సంస్కృతభాషాపదముల నిట్లే చిత్రించి భాషాసామరస్యమును విచారించినచో సంస్కృతభాష పైనుదాహరింపఁబడిన భాషలతోడనేగాక ప్రపంచమునఁ దెలియవచ్చెడి కోదుభాషలన్నింటితోఁగూడ సోదరభావమును బొందియున్నదనుట కెంతమాత్రము సందేహముండదుగదా ! ఆహా ! ఏమి యీభాషాతత్త్వవిమర్శనాజ్ఞానము !!

ఇట సంస్కృతపదములుగాఁ జిత్రింపఁబడినపదములు సంస్కృతపదములని యెంత తెలివితక్కువవాఁడు కూడ విశ్వసింపఁడు. ఈపదములు సంస్కృతపదముల నుచ్చరింపలేక యొద్దియో యొకతీరున నోటికివచ్చిన ట్లుచ్చరించి చేతికివచ్చినట్లు చిత్రించినపదములేగాని వేఱుగాదు. ఇట్లుచ్చరింపఁబడినట్టియు వ్రాయఁబడినట్టియుఁ బదములకు మ్లేచ్ఛపదములని పేరు. ఇట్టి మ్లేచ్ఛపదములకు నిదానమగు ప్రకృతిపదము లిత్తెరంగునఁ
బరఁగుచున్నవిగదా!

"1 పితా 2 మాతా 3 దుహితా 4 భ్రాతా 5 దేవాః"

ఇఁకఁ బ్రకృతమేమన 'పితా, మాతా, దుహితా, భ్రాతా, దేవా" యనుపదముల నుండి క్రమముగావచ్చిన మ్లేచ్ఛములగు 1 పిటర్ 2 మాటర్ 3 డుహిటర్ 4 బ్రాటర్ 5 డేవాస్ "అనుపదములతో సోదరన్యాయమున నున్నట్లు చెప్పఁబడినవిగాని పైప్రకృతులగు 'పితా' మొదలగుశబ్దములతో సోదరన్యాయమును గనియున్నట్లుచెప్పఁబడ లేదుగదా!

కావున వాస్తవమగుసంస్కృతపదములును సంస్కృతభాషయును నీమ్లేచ్ఛపదములకు సర్వవిధముల మాతృభావమునే గల్గియున్నట్లు సువ్యక్తమగుచున్నది. సంస్కృతభాష యార్యావర్తమునందలి భాషలన్నిటికి మాతృభాష యనువిషయ మెల్లరు నేకగ్రీవముగ నంగీకరించినవిషయమే గదా! ప్రకృతమునఁ బాశ్చాత్యదేశమునఁగల భాషలకు మాతృభాషగఁ దలంపఁబడు 'జండ్, పెర్షియన్, గ్రీక్, లాటిన్ లోజర్మన్' భాషలకుఁగూడ నీసంస్కృతభాష మాతృభాషయే యని యప్రతిహతముగఁ బ్రదర్శింపఁబడియె ఈక్రమమున విచారించినచో సంస్కృత భాష చతుస్సాగరపరివేష్టితమగు నీభూమండలమునఁ దెలియవచ్చెడి భాషలన్నిటికిని మాతృభాషయేయని ప్రాజ్ఞులు సుకరముగ గ్రహింపఁగలరు. సంస్కృతభాషామతల్లికయతిశయమును బ్రదర్శింపఁ బెక్కులు విశేషములు గలవు. గ్రంథవిస్తరభీతిచే నవ్వానినుండి విరమించి ప్రధానవిషయప్రదర్శనమాత్రముచే నీవ్యాసమును సంపూర్ణముగావించుచున్నారము. ఇతి నారాయణస్మృతిః.



సర్: కే. వి. రెడ్డినాయుడుగారు, వైస్‌చాన్సలరు, అణ్ణామలైయూనివర్సటీ, అణ్ణామలై నగరము:—

తాము పంపినలేఖ అందినది. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సన్మానపత్రము సమర్పింపనెంచి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ అనుసంస్థ తెలుగువాఙ్మయప్రచురణవిషయమున చేసినసేవగా మీరు వర్ణించిన అన్నిసంగతులును నేనువర్ణించినవిగా అంగీకరింపుడు. వారు చాల మంచిపనిచేసినారు. ఆపనికి తెలుగుదేశము కృతజ్ఞతచూపవలసినదేను.

# వెంకయచోడునిదొంగలసానిశాసనము

## ఆంధ్రలిపివాఙ్మయవిశేషములు.

శ్రీముట్లూరు వేంకటరామయ్యగారు, ఎం. ఏ.

[భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆంధ్రభాషాభివృద్ధికి నొనరించినసేవకు ఆంధ్రలోకమెల్ల కృతజ్ఞతాబద్ధతఁ జెందియున్నది. దాదాపు శతాబ్దముక్రిందట వీరిపెత్తండ్రి శ్రీవావిళ్లఅనంతనారాయణశాస్త్రులు వీరితండ్రి వావిళ్ల రామస్వామిశాస్త్రులు ప్రారంభించిన వాఙ్మయసేవను వీరుకొనసాగించుట ప్రశంసనీయము. ఆర్థికవ్యాపారచింత యటుండ ముఖ్యముగా నాంధ్రవాఙ్మయసేవాదీక్షతోనే శ్రీశాస్త్రులవారు పెక్కుసంస్కృతాంధ్రద్రవిడగ్రంథముల నచ్చొత్తించి వాటిని దేశమందల్లెడలను వ్యాపింపఁజేసి, ఏతత్కార్యమున పండితులను సుకవులనుపోషించియు ప్రోత్సహించియు 'భాషోద్ధారక' యనుకృతార్థబిరుదును కైకొనిరి. వారలకు కృతజ్ఞతాసూచకముగ నొక 'రజతోత్సవసంపుటము'ను బహుమతినిచ్చుటకు తోడ్పడ ఏతత్కార్యదర్శిచే కోరబడినవాఁడనై, శ్రీయుత వావిళ్లవారు మాచిరకాలకుటుంబస్నేహితులును మాశ్రేయోభిలాషులు అగుటంజేసి వారిగౌరవార్థమై వారిపరిశ్రమకనుగుణంబైన ఆంధ్రవాఙ్మయసంబంధమగు నీవ్యాసమును సంతోషపూర్వకముగా వ్రాయఁదొడంగుచున్నాను.]

ఈక్రిందపరిష్కృత మగుశాసనము నేను 1937-వ సం॥న ఆంధ్రభాషోత్పత్తిస్థానమనఁదగురాయలసీమయందు ప్రాచీనతెలుగుశాసనాన్వేషణ మొనరించునప్పుడు, సిద్ధవటంతాలూకాలో దొంగలసాని యనునొకకనమ ప్రదేశమున పినాకినీబాహుదాసంగమ స్థలమునకు కొంతపశ్చిమోత్తరమున లభించినది. దీనితోపాటు కడపజిల్లాలోనే యితరప్రదేశములలో లభించిన కొన్ని క్రీ. శ. 6, 7-వ శతాబ్దమునాటి తెలుఁగుశాసనములు నాచే మరియొకస్థలమందు పరిష్కరింపఁబడుచున్నవి.

ఈశాసనము కర్నల్ కాలిన్ మెకంజీగారిగుమాస్తాలయం దొకరిచే 125 సంవత్సరముల క్రితము పరిశీలింపఁబడి, శాసనలిపి దురవగాహ్యమగుటంజేసి చదువనలవిగాక వారిచే యథామాతృకమగు నొకచేతిప్రతి (eye-copy) మాత్రము తయారుచేయఁబడి వారిరిపోర్టు (మదరాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము. 15-4-23. P. 159)నందు కానవచ్చుచున్నది. ఆప్రతిని నేను పరిశీలించినప్పుడు శాసనవిషయను కొంతవఱకు గ్రాహ్యమగుడు, అది దేశవాఙ్మయచరిత్రల కెక్కువ సహకారియగునని తలచి శాసనస్థలమునకుపోయి దానియొక్క ప్రతిబింబములను లభ్యపఱచుకొంటిని.

## వెంకయచోడుని దొంగలసానిశాసనము

(ప్రతిబింబములు.)



## లి పి : భా ష

ఒకవ్యాసగీతముందప్ప శాసనభాష తెలుఁగు: గద్యపద్యాత్మకము. ఒకమహాక్కర పద్యముకాబోలు రెండుపాదములుమాత్రము శాసనమధ్యభాగమున రాతికి మొదటివైపు నందు పొందుపఱుపఁబడియున్నది. అందు గద్యభాగమునందు చెప్పఁబడినదాత ప్రస్తుతింపఁ బడియున్నాఁడు. కాని పద్యముయొక్క కడపటిపాదము అంత్యభాగమున మాసిపోయినది.

శాసనలిపి క్రీ. శ. 10 వ శతాబ్దఅంత్యకాలమునాటి తెలుఁగు-కన్నడలిపి. శాసనాక్షరములు శ్రద్ధతో చక్కగా సుత్కీర్ణముచేయఁబడక సొంపుదప్పియున్నవి. శాసనమునందు వర్ణక్రమాద్యక్షరగుణిత (Orthographical) విశేషములు కొన్ని గలవు. అవి శాసనకాలమునకు తగురీతినున్నవి. 'ద, డ', లకు అంతవ్యత్యాసముఁ గానరాదు ఇ, ఈ ల భేదము పాటింపబడలేదు. చూ. పం_క్తి. 31-2 ఇ_స్తనంబు (ఒప్పు: ఈస్థానంబు); పం_క్తి. 32 ఇసాన (ఒప్పు: ఈశాన). ఒక్కటవర్గమునందలి హల్వర్ణములకుదప్ప తక్కినవర్గాక్షరములకు సరియగువర్గానునాసికములు ప్రయోగించుటకుబదులుగా పూర్ణానుస్వారమే యుపయోగింపఁ బడియున్నది. ఇయ్యది శాసనముయొక్క ప్రాచీనతను కొంతమాత్రము తొలగించి ఆధునికత్వమును సూచించుచున్నదనిచెప్పవచ్చును.

వలపల(వెలుపలి) గిలకతోఁగూడిన (అనఁగా రేఫయు_క్తమగు) హల్వర్ణములు ద్విత్వమును జెందియున్నవి.

సంస్కృతమిశ్రమగుపదములువ్రాయుటయందు తప్పులు కనబడుచున్నవి. చూ: పం. 3 ప్రముకాకిల (ఒప్పు. ప్రముఖాకిల); పం_క్తి. 8. ప్రవర్దమాన, (ఒప్పు: ప్రవర్ధమాన); పం_క్తి 28. శ్రీపబ్బతంబు (ఒప్పు: శ్రీపవ్వతంబు); పం_క్తి. 31-2 ఇ_స్తనంబు (ఒప్పు: ఈస్థానంబు); పం_క్తి. 32-3 ఇసానశివులు (ఈశానశివులు); పం_క్తి. 33 'బహుభివ్వసుదా (ఒప్పు: బహుభివ్వసుధా); పం_క్తి. 34 'బహుభిచ్చానుపాలితా; (ఒప్పు: బహుభిశ్శాను పాలితా;) ఏతద్విషయము శాసనోత్కీర్ణునియజాగ్రతనో, అజ్ఞానమో లేక యాకాలపుపద్ధతినో సూచింపవచ్చును.

## శా స న వి ష య ము.

సూర్యవంశజుఁడును, కరికాలాన్వయుఁడును, తెంకణాదిత్య, కొమరురభీమ ఇత్యాది బిరుదాంకితుఁడును, అగు శ్రీవెంకయచోడ్డమహారాజు తన 41 వ పరిపాలనాసంవత్సరమున, కుఱువభటారియనుదేవతకు చైత్రశుక్లఅష్టమి (చిట్టదిపెంపునందష్టమి) ఆదివారమునాఁడు

కొంత నేలదానమిచ్చెనని, శాసనము తెలియజేయుచున్నది. ఈభటారి దేవస్థానము ఈశానశివుల యధీనమునందుండినట్లు శాసనమువలన తెలియుచున్నది. దానమివ్వఁబడిననేల, నిరూపించియున్న యవధులంబట్టి, ఆకనమ ప్రాంతమునందే శాసనశిలపడియుండుస్థలమే యగుచున్నది. ఆయవధులేమన, రెండుతేవులు తూర్పుదక్షిణమునను (అనఁగా తూర్పునందు చెయ్యేటితేవు, దక్షిణమునందు పెన్నతేవు) పడమటకొండయు, ఉత్తరమున కుఱువడొంకలోపలినేల.

## శా స న వి ష య చ ర్చ.

1. చరిత్రాంశములు:—శాసనోదాహృతుఁడగు వెంకయచోడ్డమహారాజు కరికాలవంశజులగు ఆంధ్రచోళులలోనివాఁడనుటకు సందియములేదు. కాని తెలుఁగుచోళులలో పెక్కుశాఖలుండుటచే నీరాజు యేశాఖకుఁజెందినవాఁడని నిరూపింపవలసియున్నది. శాసనములో తెలుఁగుచోళులయొక్క వంశానుక్రమాగత 'చరణసరోరుహ' ఇత్యాదిప్రశస్తిఁదప్ప రాజుయొక్కపూర్వీకులను గుఱించి యేమియుచెప్పఁబడలేదు. ఇంతవఱకు మనకుతెలిసిన తెలుఁగుచోళులలో ప్రథమముగా నీవెంకయచోడ్డమహారాజే నీప్రశస్తినియవలంబించియున్నట్లు తెలియవచ్చెడిని. ప్రశస్తియందుచెప్పఁబడిన కొన్నిఅంశములు వెంకయచోడ్డమహారాజుయొక్క పూర్వీకులగుకొందఱు కడపచోళుల "అరిదుర్ధరవరభుజాసిభాసురప్రచణ్డప్రద్యోతదినకరకులనందన కావేరీనాథ కాశ్యపగోత్ర కరికాలాన్వయ ఒఱయూరిపురపరమేశ్వర" యనుప్రశస్తి యందుఁ గానవచ్చుచున్నవి. ఈప్రశస్తిసుమారు క్రీ. శ. 925-50 ప్రాంతమునందునేలిన చోడ్డమహారాజనామధేయుఁడగు రేనాటిచోళరాజు అవలంబించినట్లు అతనిశాసనములవలన తెలియుచున్నది. ఈరాజుశాసనములు అనంతపురంజిల్లా (A. R. E. 792 of 1917) కడపజిల్లా (406 of 1904; 408 of 1904, 405 of 1904; 466 of 1906; 517 of 1906; 104 of 1930; 352 of 1905)మఱియును, ఈచోడ్డమహారాజునకు పూర్వీకుఁడును, 9 వ శతాబ్దములో నేలినవాఁడగుమానచోడ్డమహారాజునకును ఈప్రశస్తియున్నట్లు కమలాపురంతాలూకా ఇందుకూరులోనున్న శాసనమువలన తెలియుచున్నది. (ఈశాసనపుసకలు మెకంజీరిపోర్టులలోను, స్థానికచరిత్రవాల్యూం 10, పు. 155లో కాననగును.) కాని 'చరణసరోరుహ' ప్రశస్తియందు నూతనవిషయమొకటికలదు. అదేమన, కరికాలచోడుఁడు కావేరీనదికి వెల్లువ లణగించుటకై ఆనకట్టలుపోయునప్పుడు త్రిలోచనుఁడు మొదలుగాఁగలరాజులు ఇతనిపాదాక్రాంతులై సేవించుచు తోడ్పడిరి యనునది. కరికాలుఁడు కావేరీతీరమునకు ఆనకట్టలు కట్టినన్నవిషయము క్రీ.శ. 625 వ ప్రాంతమున నేలినపుణ్యకుమారచోడ్డమహారాజుయొక్క మాలేపాడు తామ్రశాసనమునకలదు. కాని త్రిలోచనుఁడు మొదలుగాఁగలరాజు

లీకార్యమునతోడ్పడిరన్న విషయము నూతనముగా ప్రథమముననీ 'చరణసరోరుహ' వక్కాణ యందే కానఁబడుచున్నది. ఈత్రిలోచనుఁ డనురాజే కాంచీపురవరాధీశ్వరుఁడగు త్రిలోచనపల్లవుఁడుగ కొన్ని అర్వాచీనశాసనములందు పేర్కొనఁబడుచున్నాఁడు. కాని ఏతన్నామధారియగు పల్లవరాజు పల్లవవంశవృక్షమందలి యేశాఖయందునుం గానరాకుండుటం బట్టి ఈరాజు వాస్తవముగా జీవించియుండెననుటకు సంశయముకలుగుచున్నది. శ్రీ మల్లంపల్లిసోమశేఖరశర్మగారు (J. O. R. Vol. X. pp. 32-41) ఈవిషయమునుబాగుగాచర్చించి ఈత్రిలోచనపల్లవుడు కాంచీపురాధివసతుఁడును, త్రైరాజ్యపల్లవరాజ్యాధిపతియు నగు నిర్ణయింపవీలుకాని ఎవఁడో అనిశ్చితుఁడగు నొకపల్లవరాజై యుండవలయునని అభిప్రాయపడియున్నారు. ఏతత్సందర్భమున శర్మగారు కొన్నివిషయములు విశదీకరించిరి. మాలేపాడుశాసనమునందు కరికాలుఁడుచేసిన పెక్కుఅతిశయకార్యములలో కావేరీతీరమున ఆనకట్టలు కట్టించెననుట, త్రైరాజ్యస్థితిని ఆత్మసాత్కృతముగావించుకొనెననుట అగు నీరెండు ప్రత్యేకకార్యములు కొంతకాలమునకుపిమ్మట క్రమక్రమముగా పురాణరీతి పెచ్చుపెరిగి పరస్పరమిశ్రితఁజెంది యొకకథరూపముగఁజెంది 'స్వస్తిచరణసరోరుహ' ఇత్యాదివక్కాణయందు ఇముడ్పబడెననియు, త్రిలోచనుఁడు అనునామవాచకము ఒకవిశేషణయుక్తపదమనియు, నయ్యది త్రైరాజ్యమనెడి మూఁడుముఖ్యవిభాగములుకలిగిన పల్లవరాజ్యమును మూఁడుకన్నులుగావహించిన పల్లవరాజులయొక్క వర్ణనాఖ్యయనియు శర్మగారు అభిప్రాయపడియున్నారు. వారియభిప్రాయమే సమంజసమని తోచుచున్నది.

తెలుగుదేశమందు, ముఖ్యముగా రాయలసీమ నెల్లూరు గుంటూరుసీమలయందు ఆంధ్రచోళులు, 6-వ శతాబ్దము మొదలు 15-వ శతాబ్దమువఱకు ప్రబలి ప్రత్యేకశాఖలుగా వర్ధిల్లి పెంపెక్కిరి. వీరివంశశాఖలలో వెంకయయనునామము ఈ క్రిందిశాసనములందుఁ గానవచ్చుచున్నవి.

1. పాకనాటిరాజ్యమున, ప్రస్తుతము ఒంగోలుతాలూకా నన్నూరుగ్రామమునందలి (నెల్లూరిజిల్లాశాసనములు. సంపుటము3. ఒంగోలు 92.) యొకశాసనమునందు రాజమహేంద్రపౌత్రపిచోడమహారాజు క్రీ. శ. 1038-9 ఆయూరి హూంకారదేవికి దానమిచ్చుసందర్భమున తనవంశవృక్షమిట్లు వర్ణించియున్నాడు:—




2. పాకనాటిలోనిదేయగు ప్రస్తుతము నెల్లూరుజిల్లా దరిశితాలూకా మన్నేపల్లి గ్రామము నందుండు నొకశాసనమునందు (నెల్లూరుజిల్లాశాసనములు; సంపుటము 1. దరిశి. 48, 49.) బల్లిభూపాలుడనురాజు క్రీ. శ. 1145-6 సంవత్సరమునను, క్రీ. శ. 1166-7 సంవత్సరమునను మన్నేపల్లిమల్లీశ్వరమహాదేవరకును, చోడేశ్వరమహాదేవరకును భూదానమిచ్చునపుడు తనవంశావళి నీక్రిందివిధమున నిచ్చుచున్నాడు:—




3. కమ్మనాటిలోని బొప్పూడియను గ్రామమునందలి యొకశాసనమున A. R. E. 205 of 1899: S. I. I. VI No. 651) క్రీ. శ. 1157 నందు నన్నిచోడుఁడనురాజు కొట్యదొన (కొణిదెన) రాజధానియందు నేలుచు తనవంశవృక్షము నీక్రిందివిధమున వర్ణించుచున్నాఁడు. శాసనశిల పగిలిపోయినదగుటచే వంశవృక్షము సమగ్రముగా లభింపలేదు.

జటచోడుఁడు, (అయోధ్యాధిపతి, ద్రావిడపంచకమునుజయించి ఒఱియూరునుండిపాలించెను)

|

(కొమారుఁడు)

కరికాలుఁడు I

(కావేరీనది కానకట్టలుకట్టెను, కంచి రాజధానిగానేలెను.)

⋮

మహిమానచోడ

| (కొమారులు)

కరికాలుఁడు II — దశవర్మ — తొండమానుఁడు

(పాకరాష్ట్రమునుజయించి పొత్తపిరాజధానినుండి యేలెను.)

| (కొమారుఁడు)

వేంక

(శంకరకింకరుఁడు)

| (కొమారులు)

త్యాగివోత — బల్లి

(...సాహస్రంపాకనాడును ఏలెను.)

⋮ (శాసనముపగిలిపోయినది.)

కామచోడ

⋮

[త్రిభువనమల్లుఁడు.] భా. 1. శ్రీమాచమ

2. త్రిభువనమహాదేవి

| కొమారులు(మొదటిభార్యకో రెండవభార్యకో తెలియలేదు.)

(శాసనదాత) నన్నిచోడ క్రీ. శ. 1157. — కన్నరదేవచోడ — చోడదేవ

పై శాసనములందుగాక, మఱొక వెంకణచోళుఁడను రాజు క్రీ.శ. 1134 సంవత్సరమున కర్నూలుజిల్లా నంద్యాలయందు చాళుక్యరాజగు భూలోకమల్లునిసామంతుఁడుగ పరిపాలించుచుండినట్లు నొకశాసనము(ARE 673 of 1917:S. I. I. IX. Pt I. No. 231) వలన తెలియుచున్నది. పైనపేర్కొనఁబడిన వెంకయచోళనామధేయులగు అయిదుగురు పురుషులలో దొంగలసాని శాసనకర్తయగు వేంకయచోడమహారాజు నొకఁడుగానుండగలఁడో యని యోచించిన నన్నూరుశాసనకర్తయగు రాజమహేంద్రపొత్తపిచోఁడుని వంశమునందు కూటస్థుఁడుగ పేర్కొనఁబడిన చాగి(త్యాగి) వెంకవకావచ్చుననుతలంపు కలుఁగుచున్నది. దొంగలసాని శాసనకర్త క్రీ. శ. పదియవ శతాబ్దమువాఁడగుటఁజేసి, క్రీ. శ. 1088-9 లో నేలిన రాజమహేంద్రపొత్తపిచోడునికి నాలుగుపురుషాంతరములు అనఁగా 100 సంవత్సరముల ముందటివాఁడగు చాగివెంకనయు దొంగలసానిశాసనకర్తయు నొక్కరేయను సిద్ధాంతీకరణము సమంజసముగతోఁచుచున్నది. ఈచాగివెంకనయే బొప్పూడిగ్రామశాసనమునందు త్యాగివోత, బల్లిరాజులకు తండ్రియగు శంకరకింకరుఁడని వర్ణింపబడినవెంకరాజు కావచ్చును. చాగి లేక త్యాగియనుబిరుదము తండ్రినుండి, కొమారునకు కలిగియుండనోపును. మఱియు చాగివెంకనకును శంకరకింకరుఁడగు వెంకరాజునకును బల్లిరాజనుకొమారుఁడుండుటంబట్టి వీరిద్దఱు నొక్కరేయనిచెప్ప నవకాశముకలుఁగుచున్నది. మఱియు మన్నేపల్లిశాసనోదాహృతమగు వంశావళికిని తదితరములైన నన్నూరు, బొప్పూడిశాసనములందు వర్ణింపఁబడిన వంశావళులకును సంబంధముకలుఁగజేయనగునని తోఁచుచున్నది. నన్నూరుశాసనవంశావళియందును మన్నేపల్లిశాసనవంశావళియందు రెండింటిలోను దాదాపు నొకకాలముననే అనఁగా 11-వ శతాబ్దమధ్యభాగమున పరిపాలించిన నన్నిచోడరాజొకఁడు చెప్పఁబడియున్నాఁడు. వీరిద్దఱు నొక్కరేయనుట కేయాక్షేపణయు లేదు గావున, ఈనన్నిచోఁడునకు వెంకభూపాలకుఁడు, రాజమహేంద్రపోతపిచోడుఁడు అనునిద్దఱుకొమారులున్నట్లు తెల్లమగుచున్నది. కాబట్టి పైనవివరింపఁబడిన మూఁడువంశావళులకును సంబంధమేర్పడియుండుటచే వానిని సంకలితముజేసిన నీక్రిందివంశవృక్షమేర్పడుచున్నది.




క్రీ. శ. 1142, 1148 (ARE 179 of 1899: S. I. I. Vol. VI No. 624; ARE 168 of 1899: S. I. I. VI No. 610;) ప్రాంతమునందు కొణిదెన రాజధానిగాపరిపాలించిన తెంకణాదిత్యబిరుదాంకితుఁడును కామచోడక్షత్రియా దేవులకొమారుఁడును నగు త్రిభువనమల్లదేవ

చోడమహారాజు మన్నేపల్లి శాసనకర్తయగు బల్లిచోడరాజును నొక్కఁడేయగుదురేమో యనుసంశయము కలుగుచున్నది. కాని 'బల్లి'యనునామమునకును 'త్రిభువనమల్ల'యను పేరునకును నామసామ్యమే లేకుండుటఁజేసి వారిద్దఱొక్కరేయని రూఢిగాఁజెప్ప సాధ్యము కాకున్నది.

వాఙ్మయవిశేషములు:—

శ్రీ వెంకయచోడ్డమహారాజునకు తెంకణాదిత్య, కొమరురభీమ, పుసిఇల్లదాష్ట యను బిరుదములు కలవు. వీనిలో తెంకణాదిత్య యనుబిరుదము ఆంధ్రవాఙ్మయపరిశోధకులకు చిరపరిచితమే. ఇది కుమారసంభవకర్తయగు నన్నిచోడునకు కలదు. ఈ తెంకణాదిత్యబిరుదముతోపాటు నతనికి ఒఱయూరు పురవరాధీశ్వరుఁడను బిరుదము కలదు. ఈ రెండును పైనవివరింపఁబడిన వెంకయచోడ్డవంశములోని కొందఱు రాజులకును కూడ కలవు. తెంకణాదిత్య యనుబిరుదమున కర్థమునుగుఱించి పలువురు పలుతెఱంగులు అభిప్రాయపడుచున్నారు. 'తెంకణమునకు సూర్యునివంటివాఁడు' యనునర్థము బిరుదమునుండి తీసినయెడల 'తెంకణ' యనుమాట యొకదేశవిభాగముయొక్క నామధేయమగుననుయూహ పొడముచున్నది. నిజముగనే రాయలసీమయందలి కొన్నిశాసనములందు ఇయ్యది యొకదేశవిభాగనామధేయముగనే పేర్కొనఁబడి యున్నది. గుత్తితాలూకా తాడిపత్రి రామేశ్వరస్వామిగుడియందలి శా. శక. 1130 కాళయుక్తిసంవత్సరపు కలుకడపురవరాధీశ్వరుఁడగు నుదయాదిత్యదేవుని శాసనమునందు (దక్షిణహిందూదేశశాసనములు సంపు. IV, నెంబరు 793. ఈశాసనమును నాదృష్టిగోచరమునకుఁదెచ్చిన శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారియెడ కృతజ్ఞుఁడను.) తాడిపత్రి ఆంధ్రదేశమునందలి తెంకణాధారిణియం దొకదేశవిభాగమగు పెన్నపరినాఁడులోని ముఖ్యగ్రామమని వర్ణింపఁబడియున్నది. ఈతెంకణయనుదేశవిభాగములోనే ప్రస్తుత కమలాపురంతాలూకా వల్లూరు గ్రామ మొకముఖ్యపట్టణముగనుండెనని పుష్పగిరియందలి నిడుగల్లుచోళవంశీయుఁడగు త్రైలోక్యమల్ల మల్లిదేవమహారాజుశాసనమువలన తెలియుచున్నది. (మెకంజీరిపోర్టులు 15-3-51 కడపకైఫియత్తు. పుట. 5; 15-3-53 పుట. 15.9)

ఈనిదర్శనములంబట్టి తెంకణరాష్ట్రము ప్రస్తుతపుఅనంతపురం, కడపజిల్లాలప్రదేశమని తెలియుచున్నది. ఈప్రదేశమునందే తెలుగుచోళులు ప్రప్రథమమున పరిపాలించినవారగుటచే వారల కీబిరుదముపొసఁగి వంశపారంపర్యముగా నవలంబింపఁబడుచుండెను. నిడుగల్లు

చోళులు, పాకనాటిచోళులు నంద్యాలచోళులు ఈతెంకణదేశమునుండియే వలసపోయిన వారగుటచే ఇతరప్రదేశముల ప్రత్యేకరాజ్యముల నేర్పఱచుకొన్నను తెంకణాదిత్యబిరుద మునువహించి తమయొక్క ఆదిమస్థానముతో సంబంధమును సూచించుచున్నారు. ఇటులనే ఒఱయూరు పురాధీశ్వర యనుబిరుదమునువహించి తెలుఁగుచోళులు కావేరీతీరమందలి యొఱయూరు రాజధానిగానేలిన తమపూర్వీకులతోడిసంబంధమును తెలియపఱచుచున్నారు. ఈబిరుదము మనకు తెలిసినంతవఱకు క్రీ.శ. 10 వ శతాబ్దమునందే తెలుగుచోళులచే ప్రథమముగా వహింపఁబడుటచేతను, కావేరీతీరమందు ఒఱయూరురాజధానిగానేలిన చోళులు క్రీ.శ. 2-3వ శతాబ్ధమునకు జెందినవారగుటచే నీబిరుదము చారిత్రకవిషయముగా నంత యుపయోగకారి కాఁజాలదు. కాబట్టి కుమారసంభవకర్తయగు నన్నిచోడుఁ డేశాఖలోని వాఁడో లేక యేకాలమువాఁడో నిర్ధారణచేయుటకు పైబిరుదములు ఎక్కువ తోడ్పడఁ జాలవు

వెంకయచోడ్డమహారాజు రెండవబిరుదమగు 'కొమరురభీముఁడు' యనుదానిని నీతిశాస్త్రముక్తావళిరచించిన సూర్యవంశజుఁడగు బద్దెనచోళుఁడువహించినట్లు ఆగ్రంథమందలి కొన్నిపద్యములమకుటమువలనఁ దెలియుచున్నది. కాని కేవలము బిరుదముయొక్క ఏకత్వముచేతనే వీరలిద్దఱొక్కరగుదురని చెప్పఁజాలము. 'కొమరురభీమా' యనుబిరుదమున కర్థమేమో రూఢగాఁజెప్పవీలులేకున్నది. ఇకమూడవబిరుదమగు 'పుసిఇల్లదాష్ట' నుగుఱించి విచారింతము. ఇది కన్నడభాషాపదమైనను ఈ తెలుఁగుశాసనమందు నొక పద్యమునం దిమిడ్చఁబడుట తెలుఁగు పద్యవాఙ్మయమున కొక నూతనవిధానమును తెలుపుచున్నది. తెలుఁగుకవిత్వమున అన్యభాషాపదములనుపయోగించుట తెలుగుకవితారీతికి భంగము కలుఁగునా యనువివాదాంశమును ఈశాసనమునందలిపద్యము నిర్వివాదముగ నిశ్చయపఱచుచున్నది. అన్యభాషాపదముల నుపయోగించుట తెలుఁగుకవిత్వమునకు లోటుకలుఁగదని ఏతన్నిదర్శనముచే సిద్ధాంతీకరింపఁబడుచున్నది. ఈకవిత్వమార్గమునే కుమారసంభవమునందు నన్నిచోడుఁడవలంబించి తనకవిత్వమున కొకవన్నెకలుఁగజేసి రసవంతముగజేసెను. ఈకవితాఫక్కియే దేశికవిత్వమని నన్నిచోఁడుడువర్ణించెనని తోచుచున్నది. ఏదేశమందు కావ్యరచయితనుండునో యాదేశమునందు వాడుకలోనున్న పదజాలమును ఏభాషకుజెందియున్నను (అనఁగా Words in colloquial usage to whichever language they belong) రసోచితముగ కావ్యమునం దుపయోగించుట దేశికవిత్వమని యెరుఁగనగును. విన్నకోటపెద్దన కావ్యాలంకారచూడామణియందు, "క. శ్రేయములై బహుదేశానేయములై, చక్కఁదన

ము నెఱదనములునై, యాయానెలవులఁ జెవులకుఁ దీయములగుపలుకులెల్ల దేశ్యము లర యఁగా." యని వర్ణించిన దేశ్యలక్షణము పైయూహ కనుగుణముగ నున్నది. 'సూయాణము' మొదలగు కన్నడపదములు నన్నిచోడుఁ డుపయోగించుట యాతనిదేశికవిత్వరచనయని యెఱుఁగనగును కందుకూరివీరేశలింగంపంతులుగారు 'నన్నిచోడునికవిత్వ మన్యభాషాపద దూషితము కానియెడల నుత్తమమయినదే' యనిచెప్పినదిపొరబాటు. ఏలయన, తానుదేశి కవితారీతి నవలంబించెదనని నుడివిన నన్నిచోడుఁడు తనకావ్యమందు అన్యభాషాపద ప్రయోగముచేయక యెట్లుండును. దేశికవితయొక్కస్వరూప మిట్లున్నప్పుడు, యయ్యది సత్కవనరీతులలో నొక్కటిగ గణింతుమేని నన్నిచోడుఁడీకవనరీతినవలంబించుటవలన నతఁ డుత్తమకవి కాఁజాలఁడనిచెప్పుట యనుచితము. మనశాసనమందలిపద్యము దేశికవితాపద్ధతి నున్నదని చెప్పవచ్చును.

ఇక 'పుసిఇల్లదాష్ట' యనుపదమున కర్థమువిచారింతము. దీనికి 'మోసము (పుసి) లేని, తాలిమి లేకనైరణ' కలవాఁడని యర్థము అగుచున్నది. అనఁగా, ఎల్లప్పుడును నొకే రీతిగా తాలిమిగలవాఁడనియును ఆగుణముచే నతఁ డేసందర్భముననైనను విడువఁబడని వాఁడును అనఁదగును. పురుషున కీతాల్మియేయలంకారభూతమని నీతిశాస్త్రముక్తావళి యందలి పద్యమున తెలియనగును.

చ. ధరణిపుఁడాజ్ఞచే శుభముదైవముచేతఁ దపంబుశాంతిచే
సురతముప్రౌఢిచేఁ బలుకుసూనృతుచేఁ గులమాత్మవేదిచేఁ
బురులుపకారిచేఁ గవితపూజ్యతచే సతిసాధుశక్తిచేఁ
బురుషుఁడుతాల్మిచే మహిమపుణ్యముచే వెలయుఁగా యశోనిధీ.

(నీతిశాస్త్రముక్తావళిః-శ్రీమానవల్లి రామకృష్ణకవి ప్రచురితము. పుట. 22).

శాసనములోని పద్యభాగ మీక్రిందివిధమున గణవిభజనచేసి మహాక్షరవిధమున వ్రాయనగును శాసనపంక్తులు. 19.23:—

సూ ఇంద్ర ఇంద్ర ఇంద్ర ఇంద్ర ఇంద్ర చంద్ర
శ్రీ॥ వెంక యాచోష్ఠ మహారజు తెంకణా దిత్యుఁడు కొమరుర భీముణ్డు(భిముఁడు)పుసి
సూ ఇంద్ర ఇంద్ర ఇంద్ర ఇంద్ర ఇంద్ర చంద్ర
ఇల్ల దాష్టనీ ధర్మమా చం(చెం)ద్రార్క తారకం బునువార్ధి లుచునుణ్డు

ఇందు ప్రాచీనశాసనలిఖితపద్యములలోని యలవాటుననుసరించి, మొదటిపాదమందలి కదపటిఇంద్రగణాక్షరములలో భి, ము, అక్షరములు హ్రస్వాక్షరములుగా గణించబడి నవి. ఇ, ఈ ల భేదము శాసనకాలమునందు పాటింపఁబడలేదుకావున భిహ్రస్వముగనే భావించఁబడినది. 'ము' అక్షరముతర్వాతిది సంయుక్తాక్షరమైనప్పటికిని యందలి 'ఱ' కారము పూర్ణానుస్వారముగనుచ్చరించి యర్ధానుస్వారరీతితేల్చి పలుకఁబడినది ఇటువలెనే కీ. శే. జయంతి రామయ్యపంతులుగారు ప్రకటించినశాసనపద్యమంజరియందలి కొన్నిపద్యముల యందు హ్రస్వముమీఁది పూర్ణానుస్వార మర్ధానుస్వారరీతి తేల్చిపలుకఁబడియున్నది. (చూ శాసనపద్యమంజరి. పీఠిక. iv.) కాని పైపద్యము మహాక్కర యని చెప్పుటకు కొన్ని చిక్కు లున్నవి. ముఖ్యముగా ప్రాసకుదరడములేదు. రెండవది, యతిస్థానము అయిదవగణప్రథ మాక్షరము మీఁదలేక మధ్యాక్కరరీతి నాలవగణ ప్రథమాక్షరముపై నున్నది. కాబట్టి శాసనకవి యెవఁడో నతఁడు మహాక్కరపద్యము వ్రాయఁబూని ప్రథమపాదమును వ్రాసి తర్వాతప్రాస, యతినియమములు పాటింపక గణరీత్యా రెండవపాదమును వ్రాసి తనకవిత్వ మును విరమించుకొనినట్లు చెప్పవలసియున్నది. కాని, ఇదమిత్థమని చెప్పవీలులేకున్నది.

## శా స న మూ ల ము.

(నేనుతీసినప్రతిబింబములనుండి)

### మొ ద టి ప్ర క్క.

పంక్తులు:—

| | |
|---|---|
| 1. స్వస్తిచర[ణసరోరు | 2. హ]విహితవి[లోచనత్రి] |
| 3. లోచనప్రముకాకిల[ప్రి] | 4. థివీశ్వరకారితకావేరీ[తీ] |
| 5. ర కరికాలకుల రత్నప్రదీపా | 6. హితాంకుశ శ్రీవెంకయాచోళ్ల |
| 7. మహారాజుల పట్టం[బు]గట్టిన | 8. ప్రవర్ద్ధమాన విజయరాజ్యసం |
| 9. వత్సరంబు శ్న శ్వాద్యదియొకొ | 10. టియగునేణ్టి చిట్టదివెం |
| 11. పునందష్టమియు ఆదిత్య | 12. వరంబునాణ్డు కుఱువ |
| 13. భటరికి రెణ్డుతేవులు | 14. పొలగరుసుగాను |
| 15. పడుమటంగొణ్డ[యు]గ | 16. రుసుగాను ఉత్తరంబుననే[ల] |
| 17. కు గుఱువడొంకలోపలి నే | 18. ల యెల్ల సర్వ్వపరిహారువు ఇచ్చె |

19. శ్రీ[॥*]వెంకయాచొష్టమహా 20. రజు తెంకణాదిత్యుణ్డుకొమరు
21. రభీముణ్డుపుసిఇల్ల దాష్ట 22. సీధర్మ మాచంద్రార్క తారకంబును
23. వా[ర్ద్ధి]లుచుసుణ్డు] [॥*]

రెండవ వైపు.

24. ................ 25. ................
26. వాణ్డు............. 27. వాణ్డు బరన[సి]...క్షి
28. నవాణ్డు శ్రీపర్బతంబు[న] 29. ంగల లింగంబులనక్షి[సి]
30 [న]వాణ్డు. [వురముర్కు] 31. న్నసుగలణ్డుఇ_స్త
32. నంబుగలవారు ఇసా 33. నళివులు బహుభిర్వ్య[సు]
34. దాదత్తా బహుభిర్భానుపా 35. లితా తేన అస్య అస్య
36. అ[దాభూమి]తస్య త 37. స్య తదాఫలం॥



సర్: టి. విజయరాఘవాచారిగారు, కే. టి., దివాన్, మీవారుసంస్థానము, ఉదయపూరు రాజపుత్రస్థానము:—

నాపురాతనమిత్రులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పత్రికాప్రచారకులుగాచేసినసేవను ఉచితరీతినికొనియాడుటకు తగినపర్పాట్లుచేయుచున్నారని విని సంతసించితిని. సంస్కృతములోనిఉత్తమగ్రంథములను అధికారముతో ప్రకటించుటకు ఉపక్రమించినవారితండ్రిగారికార్యక్రమమును పితృభక్తితో వారు నిర్వహించినారు. ఇందులకుగాను మద్రాసురాష్ట్రము వారికెంతయుఋణపడి ఉన్నది. వారితండ్రిగారికార్యమును వారుసాగించినారన్నమాత్రము చెప్పినచాలదు. దాని వీరు ఉద్దండముగ అభివృద్ధిచేసినారు. తండ్రికుమారులమధ్యను విజ్ఞానోపాసనయందు పాతికళతాబ్దము గడచిపోయినది. నామాతృరాష్ట్రప్రజలు మహాత్వసంపన్నులైన ఈఇద్దరిపేర్లను సర్వకాలము జ్ఞాపకముంచుదురుగాక అని కోరుచున్నాను.

# ఆంధ్ర తమిళ ఛందస్సాదృశ్యములు.

శ్రీ విద్వాన్ వంగీపురము కృష్ణమాచార్యులుగారు, బీ. ఓ. యల్.

ఆంధ్రాధ్యాపకులు, పచ్చయప్పపాఠశాల, చెన్నపురి.

అనేకు లిదివఱకు నాంధ్రము, తమిళము, కన్నడము, మలయాళము మొదలగు భాషలు ద్రావిడభాషాకుటుంబమునకుఁ జేరినట్లును, సంస్కృతము, గ్రీకు, రోమన్, మొదలగునవి ఇండోయూరోపియన్ భాషాకుటుంబమునకుఁ జేరినట్లును వ్యాకరణాదిశాస్త్రసహాయములవలనను, యుక్తివాదములవలనను ఋజువుపఱచిరి. దీనికి మొదట దారితీసినవారు డాక్టర్ కాల్డ్వెల్ పండితుఁడని యందరికిఁ దెలిసినవిషయమే. ఆవెనుక పెక్కు రటనట తమతమ భిన్నాభిప్రాయముల సూచించినను మొత్తమున ద్రావిడభాషాకుటుంబమునకుఁ బ్రత్యేకవ్యక్తిత్వము కలదనియు, నిండోయూరోపియన్ భాషాకుటుంబమునకుఁ జేరిన సంస్కృతమునకును ద్రావిడభాషలకును సంబంధము లేదని వానిపరస్పరశబ్దవ్యాకరణాదిసాదృశ్యములఁ జూపి నిరూపించిరి. ఇట్లయ్యు నింకఁ గొందఱు సంస్కృతమునకు నాంధ్రమునకును నెక్కువ సంబంధ మున్నదనియు సంస్కృతమునుండియే తెనుఁగు పుట్టినదనియుఁ దక్కిన భాషలు ద్రావిడభాషాకుటుంబమునకుఁ జెందినను దెనుఁగు మాత్ర మాకుటుంబమునకుఁ జేరదని వాదించుచున్నారు. అట్టివాదనలతో నాకుఁ బనిలేదు. ఆంధ్రము ద్రావిడభాషాకుటుంబమునకుఁ జేరినదనునభిప్రాయముతో తమిళాంధ్రమునకుగల పరస్పరసాదృశ్యములు మఱికొన్ని చూపుటయే నాకుఁగల ముఖ్యోద్దేశము.

డాక్టర్ కాల్డ్వెల్, ప్రొఫెసర్ శేషగిరిఅయ్యరుగారు, ఎం.ఏ., శ్రీయుతులు కోరాడ రామకృష్ణయ్యపంతులు, ఎం. ఏ, మొదలగు ద్రావిడభాషాతత్త్వజ్ఞులు తడవని తమిళాంధ్రఛందశ్శాస్త్రములఁ గలసాదృశ్యములఁ గొన్ని యిందుఁ బొందుపఱచుచున్నాను.

క. నాలుగుపాదంబులచే, నాలుగుప్రావళ్లి గూడినం బద్యము ప
ద్యాళియు నిరుదెఱఁగై చను, నోలిని వృత్తములు జాతు లొనరం గృతులన్.

క. కమనీయవృత్తములు గణ, సమకనిబద్ధములు శేషజాతులు మాత్రా
సమకనిబద్ధములగు నొక్కమాత్ర లఘువై ద్విమాత్రకము గురు వయ్యెన్.

(కవిజనాశ్రయము.)

పైపద్యముల ననుసరించి యాంధ్రమున పద్యరచన కీక్రింది నియమము లుండవలయునని యేర్పడుచున్నది.

1. మాత్ర—గురులఘువులు.
2. గణములు
3. పాదములు
4. వృత్తములు-ఇవి ప్రధానభాగములు.
5. యతులు } ఇవి వృత్తముల ననుసరించిన భాగములు.
6. ప్రాసములు. }

తమిళమునను నిట్టి నియమమే కలదని యీక్రింది వాక్యమున విశదమగుచున్నది.

శెయ్యుళియల్ ట్రర్కణ్ ఇన్తియమైయాదు వేణ్డప్పడు ఎళుత్తు, అశై, శీర్, తళై, అడి, తొడై, ఎన్నుం ఉఱుప్పినిలక్కణం కూఱుదలాల్ ఇవ్వియల్ ఉఱుప్పియల్ ఎన్నుం పెయర్ త్తాయిర్ట్రు.

పద్యరచనకుఁ గడఁగువారు

1 ఎళుత్తు—గురులఘ్వక్షరములగూర్చినవిషయములు
2. అశై—మాత్రాసంయోగములు
3. శీర్—గణములు
4. తళై—గణబంధము.
5. అడి—అడుగు (లేక) పాదము.
6. తొడై—అంత్యప్రాసాదికములకూర్పు—ముఖ్యభాగములు
7. మోనై—యతి } వృత్తముల ననుసరించిన భాగములు.
8. ఎదుగై-ప్రాసము }

గమనింపవలయునని యర్థము.

ఇందు తమిళములోని 1, 2 భాగములు తెలుఁగులోని భాగము 1 యందలివిషయములను వివరించును.



రెండు భాషలయందును మాత్ర (చిటుకవ్రేయునంత కాలము) సమమే. రెంటి యందును గురులఘుభేదములు సమానమే. ఒక్కమాత్ర లఘువు. రెండుమాత్రలు గురువు. అశై=(మాత్రా)! గురులఘువులసంయోగము తెలుఁగునకన్న కొంతభేదముగఁ గన్పట్టు చున్నది. అశైయనువిషయ మాంగ్లమున Syllable అనుదానికి సరిపోవుచున్నది. ఇందు రెండు భాగములు గలవు. 1 నేరశై Single syllable. 2 నిరైయశై Double syllable నేరశై వివరణము. కుట్రెఴుత్తు (లఘువు.) తనిగాను; హల్లుతో కలిసియు నిందు వ్యవహ రింపఁబడును.

ఉదా. అ. అమ్.

నెట్రెఴుత్తు (గురువు) తనిగాను హల్లుతో కలిసియు వ్యవహరింపఁబడును.

ఉదాహరణము. ఆ—ఆమ్.

నేరశై Single syllable. మొదటి (కుట్రెఴుత్తు) ది లఘువు రెండవది నెట్రెఴుత్తు (గురువు) తనిగాను వానితో హల్లు కలిసియు వ్యవహారింపఁబడును.

1. రెండు లఘువులు (కుట్రెఴుత్తు) తనిగాను వానితో హల్లు కలిసియు వ్యవహ రింపఁబడును.

2. ఉదా. అడా—అడాం. 1. అడ—అడం.

ఈవిషయమున తెలుఁగు రెండక్షరములగణములు వీనితో సరిపోవుచున్నవి. కాని యిందు తెలుఁగుసాంప్రదాయకులు సాంస్కృతికవిభాగములు సులభముగ నుండుటచే నామార్గ మవలంబించినట్లు తోఁచుచున్నది.. అశైయని విభాగము ద్రావిడసాంప్రదాయ ముగ గన్పడుచున్నది.

3. శీర్—అనువిభాగము తెనుఁగునందలి 2 గణములను విభాగమునకు సరిపోవు చున్నది.

తెలుఁగున మూడక్షరగణములు సాంస్కృతికసాంప్రదాయానుసారము గ్రహింపఁ బడినవికాని యన్యము గాదు. ఏలన నాంధ్రమునందలి సమవృత్తములన్నియు సంస్కృతసమ వృత్తములేకాని యన్యముగాదు. కావున వానికిఁ దగినట్లు గణనియమము లేకున్న నావృత్త ములు వ్రాయనలవిగాదు. ఉపగణముల సమవృత్తముల నుపయోగింప వీలగునా?

ఇఁక నుపగణములు తమిళమునందలి శీర్ (గణము)లకు సరిపోవుచున్నవి.

తమిళమున:—ఓర్ శీరు కోరశై యో యిరెండశై యో, మూన్రశై యో, నాన్గశై యో వరుం. అని యుండుటచేత నొక్కొక్క గణమునందును ఒకటిమొదలు నాలుగువఱకు అశై Syllable ఉండవచ్చునని భావము. ఇవి తెనుఁగునందలి ఇంద్రచంద్రగణములతో సరి యగును. కావున తెనుఁగునందలి యుపగణములే దాని ప్రత్యేకవ్యక్తిత్వమును జాటుచున్నవి. అవి యఱవభాషాగణములకును సరిపోవుచుండుటచే నివి ద్రావిడభాషాకుటుంబమునకుఁ జేరినవని యూహింపవచ్చును.

| | 1 | 2 | 3 | 4 |
|---|---|---|---|---|
| | । ∪ । । । | ∪ । । ∪ | ∪ ∪ । | ∪ ∪ |
| ఉదా:— | పి రి స్థు వ రు | కో కి ల మే | పా తా ళ | రా యఁ. |

ఈపాదమున 4 గణము లున్నవి. (పన్దనన్దాది.) ఇందలి యొక్కొక్క గణము నాంధ్ర భాషాగణములకుఁ బోల్చి చూతము.

1 జలల.<br>2 భగురు. } చంద్రగణము.

3 తగణము. } ఇంద్రగణము.

4 గ గ.

౪. తళై—శీరోడు శీర్ శేర్దల్ తళై (లేక)బంధనం ఎన్బర్. గణములలో గణముల కలుపుట తళై (బంధము) అని భావము.

౫. అడి=అడుగు, పాదము.

పై 4 ను 5 ను కలిసి తెలుఁగున పాదము 3 విభాగముగ గ్రహింపవచ్చును.

౬. తొడై—అందములకూర్పు (ద్విత్రిప్రాసాదులు నంత్యప్రాసాదులు, ముక్తపద గ్రస్తాదులు నిందూహ్యములు.)

౭. మోనై—దీనిని తెనుఁగున యతి యందుము. తెనుఁగునకుఁ బలెఁ దమిళమున కును యతిమైత్రి పొసఁగియుండు టాశ్చర్యము. ఈభాషలన్నియు ద్రావిడభాషాకుటుంబ మునకుఁ జేరినవనుట కింతకన్న వేరునిరూపణ మక్కఱలేదనవచ్చును. చూడుఁడు.—

౮. అ ఆ ఐ ఔ లకు మఱి, ఇ ఈ లు ఋకారసహిత మె ఏ లకు నౌ
ఉ ఊ లుత్తమలో నొడఁబడి ఒ ఓ లకు వళ్లగున్న యోన్నతచరితా.

(భీమకవి-కవిజనాశ్రయము.)

యతిమైత్రి:—'అ ఆ' లు 'ఐ ఔ' లకు మిత్రములు.
'ఇ ఈ ఋ ౠ, ఎ ఏ' లు పరస్పరమిత్రములు
'ఉ ఊ' లును 'ఒ ఓ' లును నొకటి కొకటి మిత్రములు.

అద్వయంబునకు వక్రతమద్వయంబు, నిద్వయంబునకు ఋయుగంబు నెద్వయంబు నుద్వయంబునకు నంత్యవక్రద్వయంబుఁ, జెల్లు స్వరమైత్రి వళులన శేషశయన. అప్పకవి.

అగరమోడాగారం ఐకారం ఔగార్
ఇగరమో డీగారం ఎ, ఏ—ఉగర
మోడూగారం ఒ ఓ. ఞ న, మవ తచ్చగం
ఆగాద అల్ల అణు.
అ, ఆ, ఐ, ఔ లు—మిత్రములు.
ఇ, ఈ, ఎ, ఏ లు—మిత్రములు
ఉ, ఊ, ఒ, ఓ— „

(స్వరమైత్రి) తెలుఁగును దమిళమును (ఋ, ౠ) తప్ప సరిపోవును. ఋ ౠ లచ్చ తెనుఁగు గాదని యెల్లరకు విదితమే.

ఇక్లే వ్యంజనవిరతులును గొలఁది భేదములతో నాంధ్రవ్యంజనవిరతులకు సరిపోవు చున్నవి.

ఆంధ్రపద్యములవిరతు లందఱకుఁ దెలిసియుండుట నిటఁ దమిళపద్యముల విరతులు మాత్రమే కొన్ని యుదాహరించుచున్నాను.

అన్నంపోయ్కన్నియరుకణైయ—నన్నుదలుం (నలవెణ్బా)
(అరుకణై అని పదవిభాగము.)

ఒరువమినియవై యొల్లుం వడైయార్ (నాలడియార్).
ఇనమగలుమరుగర్ మడ మిశైయిలిడు కననఱమదుర్రై ఇశైయిలిడు అనిపదవిభాగము.
ఈదలఱన్దీవినై విట్టీట్టల్ పొరుళెజ్ఞానఱుఱా కాద లిరువర్. (ఔవైయార్ పాడల్.)
ఎల్లే ఇళంగిళియే ఇన్నమురంగుదియో. (తిరుప్పావై.)
వేణ్డామైయన్న విழుచ్చెల్వ మీణ్డిల్లై. (తిరుక్కుఱళ్.)
మార్గழిత్తింగళ్ మదినిరైన్దనన్నాళాల్. (తిరుప్పావై.)
కుత్తివిళక్కెఱియ కోట్టుకాల్ కట్టిలిన్మేల్. (తిరుప్పావై.)
తామ్పఱ్ఱఱ్తుళశిల తవనమాడమే. (చూడామణి.)

తొ్ల్ళితుణైయాల్ త్తుయర్ తీర్గ-తొ్ళ్లి. (పొయ్గైవాళ్వా.)

నీయమా వోర్ తియా నైరుమా రీశనా. (రామాయణమ్.)

పొ్ళినైద్రుగా తలిట్-పొరున్దినారవర్. (కంబరామాయణము, శూర్పణఖపటలము.)

కూడట్ కావర్ణ-కూఱుమినీ రెనక్క. (శిలప్పధికారము, పురంజేరియిఱుత్తకాదై.)

తవత్తిఱమ్ పూణ్డు తరుమమ్కేట్టు ప్పవత్తిర. (మణిమేగలై, పదికం.)

పూశీణ శాన్దిణ నెంజమే పునయుంకణ్ణి. (నమ్మాళ్వార్.)

వైయగ తగళియా వార్కడలే నెయ్యాగ. (పొయ్గైయాళ్వార్.)

అన్బే తగళియా-ఆర్వమే నెయ్యాగ. (పూదత్తాళ్వార్.)

తాయే తందైయెన్ఱుమ్-తారమే కిళైమక్కళెన్ఱుమ్. (తిరుమంగైయాళ్వార్.)

మరామోన్మైయ-మైవరైఉలగముం, (తొల్కాప్పియం.)

వ్యంజనయతిమైత్రియు నాంధ్రమునందువలె స్వరమైత్రి కలిసియేయుండు నియమము పాటింపఁబడుచున్నది.

ఇటీవల కొందఱాధునికాంధ్రకవులు యతిప్రాసనియమము లాంధ్రసరస్వతికి శృంఖలా బంధములనియు సంస్కృతమునందువలె నవి లేక యేల యుండరాదని క్రొత్తవాదమును లేవదీసిరి. ఈవాద మెట్లున్నను ఈనియమము తెలుఁగునందువలె ద్రావిడభాషాకుటుంబ మునకుఁ జేరిన తమిళమునందును ఉండుటచేత నిది నిర్బంధము గాదనియు నీనియమము లీభాషల ప్రత్యేకవ్యక్తిత్వమును జాటుచున్నవనియు నివి తిరస్కరింపదగినవిషయము గాద నియు నామనవి. అట్లు కాదు కూడదని తిరస్కరించిన భాషావ్యక్తిత్వమును దిరస్కరించు టయే యగును.

యతులు తెనుఁగునఁ బెక్కువిభాగములుగ నున్నట్లు తమిళమునందును గలవు.

వ్యాసము పెఱుగు ననుభీతిచే విడువఁబడినవి. 'ఆద్యోవళిః' యనిన నన్నయభట్టు గారిసూత్రము దమిళమున మోనై యనువిషయమునకు పెక్కువిధముల సరిపోవుచున్నది.

౮. ఎదుగై ప్రాసము

ద్వితీయో ప్రాసః (ఆంధ్రశబ్దచింతామణి.)

పాట్టిల్ అడితోరు (ప్రతిపాదమున)ఇరణ్డావదెళ్ళుత్తు ఎదుగై (యాపరుంగలక్కారికై)

పై రెండు సూత్రములకు భావము,ప్రతిపాదమునను రెండవయక్కరము ప్రాసమని.

తెనుఁగునం దెట్లో యట్లే యఱవముననుఁ బెక్కుభేదములు సూచింపఁబడినవి. అవి యంతయు నిందు నిర్వచించి పాఠకులమనస్సు నొప్పింపఁ బూనుకొనను. ఒకటిరెండు సాదృశ్యోదాహరణములు మాత్రము సూపి నావ్యాసము ముగించెద.

వట్కలయర్ వార్శడయర్ మార్బినణినూలర్
విల్కలయర్ వేదమురైనావర్ననిమెయ్యర్
ఉట్కలయర్ ఉన్నయర్ తువట్టనయమున్నార్
శొట్కలయనత్తొలైవిల్తూణిగళ్ శుమన్దార్. (కంబరామాయణము,అరణ్యకాం.)
ట్క ప్రాసము.
ఇన్దిరశిఅప్పూచ్చెయ్ వోకామున్నర్
వన్దుతోన్ఱియవానవర్ పెరున్దగై (మణిమేగలై. 13. కాదై)
ముడికెళ్ళువేన్దర్ మూవర్కుమురియ
దడిగణీరేయరుళిగన్ఱార్కు (శిలప్పదిగార పదికం.)
ఉళ్లుత్తై యువమం ఏనైయువమమెన తళ్లాదాగుం తిణైయుణర్ వగమే
(తొల్కాప్పియం, అగత్తిణైయియల్.)

ప్రాసయతులసాదృశ్యము గూడ తెలుఁగున యట్లు తమిళమునను మిక్కిలిగాఁ గానవచ్చుచున్నది. అందుల కీక్రిందియుదాహరణముల నరయునది.

మాజ్ఞర్తకాతియు మోజిరుమ్ పరప్పి. (శిలప్పధికారం ఊర్ కాణ్ కాదై.)
వటకోల్ వేన్ద నరుళిలకా కొల్లో. (మణిమేఖలై.)
శకటరేఫ లఘురేఫములమైత్రియుఁ దమిళమునఁ గలదు.
మఱత్తిఱో మఱైగళిన్ వరంపుగన్డనీ. (కంబరామాయణము, అయోధ్యాకాం.)
ఇవ్వాళవిట్ చెల్లుంగో లివ్వాళవిట్ కాణుంగో. (నళవెణ్బా.)

ఇట్టియుదాహరణములు తొల్కాప్పియమందు నెన్నియో కలవు. ప్రాసపూర్వాక్షర నియమమున గూడ నీరెండుభాషలు సామ్యత బూనియున్నవి.

పైవిషయములనెల్ల నింకను నెక్కువ పరిశోధించి విమర్శింపవచ్చును. నాశక్తికొలఁది యిందు సామ్యములనే చూపినాఁడ. వృత్తసామ్యములఁ దెలుపనందులకు పాఠకులు క్షమింతురుగాక.

ఇట్లే తక్కిన ద్రావిడభాషలకును ఛందస్సామ్యములు గలవని నాయూహ. అట్లుండిన తమిళాంధ్రాదిద్రావిడభాషలన్నియు నొక్కకుటుంబమునకుఁ జేరినవని తేలుచున్నది.

# వాత్స్యాయనుడు—కామసూత్రములు.

శ్రీ భావరాజు వేంకటకృష్ణారావుగారు, యం. ఏ., బి. యల్., రాజమహేంద్రవరము.

వాత్స్యాయనుని కామసూత్రములవే రుచ్చరించినపుడు సాధారణముగా నీకాలపు నాగరికులు ఒకవిధమైన జుగుప్సను ప్రకటింతురు. అందులకు వారియజ్ఞానమే కారణము. నిజమునకు కామసూత్రములను వారు చదివియుండరు; మీదుమిక్కిలి ఆగ్రంథమును గూడ జూచియుండరు. విద్వాంసులు ఇపుడిపుడు కామసూత్రములు ఉద్గ్రంథమని దానిప్రాశస్త్యమును గ్రహింపగలుగుచున్నారు. ప్రాచీనకాలమునాటి భరతఖండముయొక్క సాంఘికస్థితిని యాగ్రంథమువలన దెలియగలదని గ్రహింపగలుగుచున్నారు. వాత్స్యాయనునిగ్రంథములనింకను తరచి శాస్త్రమనుప్రమాణబుద్ధితో విమర్శతో సంస్కృతసాహిత్యముతో సమన్వయించి పఠించిననాడు దానిప్రాశస్త్యము ఇంకను వెల్లడి కాగలదు. పాఠకులకు తన్మూలమున విశేషమైన విజ్ఞానము అలవడగలదు. ఒకనాడు-కొన్ని శతాబ్దములకాలము-ఈభరతఖండమున శ్రియముతో ఐశ్వర్యముతో స్వాతంత్ర్యముతో ప్రజలు సుఖజీవనమును గడపిరి. చిరస్మరణీయములైన యాశతాబ్దములందు భారతీయులు ఎట్లు జీవయాత్ర గడపుచుండిరో, వారిసంఘము ఎట్లుండెనో, అందు జాయాపతియొక్క గృహము జీవనము ఎట్లు శోభనమున ముడివడుచుండెనో కామసూత్రములవలన ఎఱుకపడగలదు. నాగరికుడైన జనుడు నివసించు గృహము, తన్నిర్మాణపద్ధతి, అంతర్బాహ్యగృహములు, అందందు అంతర్భాగాదులయందుంచవలసిన ఉపకరణములు,అలంకారములు, వాటివిన్యాసములు, జాయాపతియొక్క నిత్యజీవనము, భోజనమజ్జనశయనాదివిషయములు, భోజనానంతరకృత్యములు, సుఖసంకథావినోదములు, క్రీడలు, గోష్ఠీప్రసంగములు, సంగీతకములు, పర్వదినములు, తిరునాళ్లు, అందు జరుగుకృత్యములు, సభలు, సమాజములు,సమావేశములు, నాటకాది వినోదప్రదర్శనములు, ఉద్యానక్రీడలు, జలక్రీడలు, దేశీయోత్సవములు, యక్షరాత్రి మున్నగు ఉత్సవాదులు, ఉపభోగములు, జానపదుల జీవనములు మున్నగువిషయము లనేకములను కామశాస్త్రము తెలుపుచున్నది. నాగరికుడైన జనుడు పరిణయమాడవలసినవిధానము, పరిణయార్హమగు కన్యలక్షణములు, యథావిధిగ పాణిగ్రహణము చేసుకొన్న భర్తవిషయమున భార్యయు, భార్యపట్ల భర్తయు మెలగవలసినరీతులు, ఒండొరులు తమతమ సుఖానందమయ జీవనము కొరకు అనురాగవర్ధనముకొరకు వర్జింపవలసిన అవగుణములు,అనుసరింపవలసిన గుణములు,

గృహము భోగనిధానమై లక్ష్మీనివాసమై శోభనముతో వెలుగొందుచుండుటకై అనురాగవతియు,అనుకూలవతియు నగుస్త్రీ భార్యయై యిల్లాలై,యజమానురాలునై నడచుకొను నియమములు, ఆమె సమకూర్చవలసిన గృహోపకరణములు, అన్ని విధముల భర్త కనుకూలముగ నుండవలసిన వర్తనలు ఇత్యాదులు కామసూత్రములందు మిక్కిలిగా విస్తరింపబడియున్నవి. మరియు, యువకులు ఎటులుగా ప్రవర్తించుచుండుటలు, వారివారి ధూర్తవ్యాపారములు, విలాసములు, స్వైరవిహారములు, దుష్టప్రవర్తనములు గూడ నందు వివరింపబడినవి. రాజాంతఃపురములందు, అగమ్యములయినతావులందు స్త్రీపురుషులు కాముకులై చరించుపద్ధతులు, వారివారికృత్యములు అందందు వర్ణింపబడినవి. వేశ్యలు, వేశ్యామందిరములు, వారి ఆటలు వినోదములు, సంప్రయోగములు, వేశ్యలు, వేశ్యలుగానివారు కూడ నేర్వవలసిన నాగరిక విద్యలు, కళలు, ఇత్యాది మనోజ్ఞములయిన వృత్తాంతము లందు తెలుపబడినవి. ఈభరత ఖండభాగములయిన ఆయాదేశములందు భిన్నజాతులవారు, రాజవంశములు వర్తించు తెఱగులు, వారిఆచారములు, సంప్రదాయములు వర్ణింపబడినవి. వేశ్యాజనము నేడున్న రీతిగా అసహ్యము కలిగింపక, చతుష్షష్టికళావేత్తలై, విదుషీరత్నములై ఎట్లుండిరో, వారితోడి సహచర్యము, స్నేహము, గోష్ఠిత్యాదులు ఎట్లు నాగరికులు అభిలషించుచుండిరో వివరింపబడియున్నవి. వేయేల, ప్రాచీనార్యులసంఘము వర్ధిల్లియుండిన 'స్థితినంతయు నొక్కసారిగా మనోవీథియెదుట ఈశాస్త్రము చిత్రము రచించి చూపినరీతిని ప్రదర్శించుచున్నది. ఈకామసూత్రములందు జనుడు జ్ఞేయములగు సర్వవిషయములను దెలుపుచు, దూష్యములును నింద్యములగువాటిని గూడ వివరించి చివరకు "నశాస్త్రమస్తీత్యేతావత్ప్రయోగే కారణం భవేత్, శాస్త్రార్థా వ్యాపినో విద్యాత్ప్రయోగాంస్త్వే దేశికాన్." అట్టివాటిని ప్రయోగింపరాదని సూచించినాడు.

ఇట్టి యుత్కృష్టమైనగ్రంథమును పరిశీలించి యది యేకాలమున రచియింపబడినదో, వాత్స్యాయనునికి బూర్వము కామశాస్త్రము ఎట్లుండెనో, అది యెంతవఱకు శాస్త్రమర్యాదనుపొంది వర్ధిల్లియుండెనో, సంస్కృతభాషలో వాఙ్మయములో వాత్స్యాయనునిగ్రంథమునకుగల్గ దగినస్థాన మెట్టిదో, వాత్స్యాయను డేదేశమువాడో యను వివిధవిషయములను విశదీకరించుట యీవ్యాసరచనోద్దేశములు. వాత్స్యాయనకామసూత్రములు జర్మను, ఫరాసుభాషలలోనికిని, హిందీ, బంగాలీ, ఆంధ్రభాషలలోనికి అనువదింపబడియున్నది. సంస్కృతములో నీగ్రంథము ముమ్మారు ప్రకటింపబడినది. వాటి అన్నిటిలో శ్రీదామోదరలాలు గోస్వామిపండితునిచే పరిష్కరింపబడి చౌకాంబా సంస్కృతగ్రంథములయం

దీగ్రంథము కాశీలో ప్రకటింపబడినది. రెండవది జయపురవాస్తవ్యుడగు శ్రీదుర్గాప్రసాద పండితునిచే పరిష్కరింపబడి ప్రకటింపబడినపాఠము. ఈరెండును యశోధనుడు 'జయమంగల' మనువ్యాఖ్యను చేర్చి ప్రకటింపబడినవి. మూడవది మహేశ్చంద్రపాల్ పండితునిచే సంస్కృతమూలసూత్రములును, జయమంగలవ్యాఖ్యయు చేర్చి వంగభాషానువాదముతో కలిపి వంగభాషయందు ప్రకటింపబడినది. ఆంధ్రులయదృష్టవశమున నీమహాగ్రంథము సంపూర్ణమైన తెలుగుటీకతో కావ్యతీర్థ పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిచే ఆంధ్రలిపియందు బ్రకటితమైనది.*యశోధరుని జయమంగల యేకాలమున రచియింపబడినదో నిశ్చయముగా తెలియదు. క్రీ. శ. ౬ వ శతాబ్దమునకు తరువాతను, పదియవశతాబ్దమునకు బూర్వము ఎప్పుడో రచియింపబడినట్లుమాత్రము స్థూలదృష్టితో వచింపవచ్చును. ఒకవిధముగా జయమంగలవ్యాఖ్య, 7, 8 శతాబ్దములనడుమ రచియింపబడియుండునని విశ్వసింపవచ్చును. కామశాస్త్రమునకు శాస్త్రగౌరవమును వ్యాప్తియు శంకరాచార్యులనాటికి విశేషముగా ప్రాప్తించియుండెను గావున, శంకరులతరువాతనో వారికాలముననో జయమంగల రచింపబడియుండవచ్చును.

వాత్స్యాయనుడు ప్రాచీనుల నెంతవఱకు అనుకరించె ననువిషయము తొలుతొలుత విమర్శింపదగినది. తనగ్రంథరచనకు ప్రాచీనులమతము ఆధారమనియు, వారు చనినత్రోవనే తాను అనుసరించువాడనియు దెలుపుటకు, వాత్స్యాయనుడు ప్రాచీనసూత్రవాఙ్మయమునుండి తనశాస్త్రమునకు గావలసినవిషయముల సంగ్రహించుకొనినాడు. అందు కామశాస్త్రవిషయములనేగాక తత్సంబంధములయిన ధర్మార్థవిషయములను గూడ ప్రాచీనులనుండియే సంతరించినాడు. కామశాస్త్రవిషయములను చర్చచేయునపుడే ప్రాచీనులను, వారిమతములను పేరుపేరు వరుసగా ఉదాహరించియున్నాడు; అన్యవిషయములను సంగ్రహించి తెలుపు సందర్భములందు ప్రాచీనుల నెవ్వరిని ఆతడు స్మరింపలేదు కామశాస్త్రవిషయమునే సూత్రములుగా రచించుచున్నాడు కావున, ఆత డన్యులను పేర్కొనియుండకపోవుటకు కారణముగావచ్చును. ఆత డెవ్వరి ధర్మార్థశాస్త్రగ్రంథములనుండి తనకు గావలసిన విషయములను గైకొనెనో యని విమర్శించినపుడు, ఎంతవర కీతడు ప్రాచీనుల మతము ననుసరించినవాడో యన్నవిషయముమాత్రమేగాక, యది యాతనికాలనిర్ణయమునకుగూడ సహకారియగును. కావున అట్టివాటిని యిచ్చట ఉదాహరింతును.

---

* నే నీవ్యాసమున ఆంధ్రులకు అందరకును అందుబాటులోనున్న శ్రీపంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు ప్రకటించిన వాత్స్యాయన కామసూత్రములనుండియే అన్నిఉదాహరణములను ఇచ్చితిని.

కన్యాసంప్రయుక్తాధికరణమున వరణవిధానాధ్యాయమును వివరించుచు వాత్స్యాయను డీరీతిగా సూత్రరచన చేసినాడు.

"సుప్తాం రుదంతీం నిష్క్రాంతాం వరణే పరివర్జయేత్, అప్రశస్తనామధేయాం చగుప్తాం, దత్తాం, ఘోనాం, పృషతా, మృషభాం, వినతాం, వికటాం; విముండాం, శుచి దూషితాం, సాంకరికీం, రాకాం, ఫలినీం, మిత్రాం, స్వనుజాం, వర్షకరించ వర్జయేత్, నక్షత్రాఖ్యాం, నదీనామ్నీం, వృక్షనామ్నీంచ గర్హితాం, లకారరేఫోపాంత్యాం చ వరణే పరివర్జయేత్." సూ. ౬౫౯-౬౫౮.

ఆపస్తంబునివాక్యములతో ప్రారంభించినాడు.

"సంగతయోస్త్రిరాత్రమధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జమాహారస్తథా, సప్తాహం, సతూర్యం మంగళస్నానం, ప్రసాధనం, సహాభోజనంచ, ప్రేక్షాసంబంధినాంచ పూజన మితి సార్వవర్ణికమ్" (సూ. ౭౧౨.)

ఆపస్తంబుడు యీభావమును (పటలము 3. ఖండము ౮. సూ. ౮) "త్రిరాత్ర ముభయోరధశ్శయ్యా బ్రహ్మచర్యం క్షారలవణవర్జనం చ" అని సూత్రీకరించినాడు.

ఆపస్తంబుని గృహ్యసూత్రములనుండి యేరీతిగా, తన కుపయుక్తములైనవాటిని సంగ్రహించెనో ఆవిధముగనే ఆతని ధర్మసూత్రములనుండి గూడ వాత్స్యాయను డుదాహరించినాడు. ధర్మసాధనమునందు ఆ ఆపస్తంబవాత్స్యాయను లిర్వురిదిని యొక్కటే మతము. పరికింపుడు. ధర్మమును తెలుసుకొనుటకు వాత్స్యాయనుడు (సూ. ౯౪) "తం శ్రుతే ధర్మజ్ఞసమవాయాచ్చ ప్రతిపద్యేత" అని శాసించుచున్నాడు. ధర్మము రెండువిధములనియు, ఒకటి లౌకికమనియు, రెండవది అలౌకికమనియు, మొదటిది యీలోకమునకు సంబంధించినదనియు, రెండవది పరలోకమునకు సంబంధించినదనియు, ప్రవృత్తిరూపమగు ధర్మశాస్త్రమును దానినెఱిగిన పెద్దలసమక్షమునుండి తెలుసుకొనవలయు ననియు ధర్మము యొక్క నిజస్వరూపమును దెలుసుకొనుటకు అందలిభేదములను నిశ్చయించుటకును వేదమును, తత్సంప్రదాయమును తెలిసినపెద్దలే అర్హులనియు, అట్టివారితో సాంగత్యము చేసి వారివలన ఆధర్మరహస్యములను గ్రహింపవలయుననియు వాత్స్యాయనుని భావము. ఇట్లే

"అథాతః సామయాచారికాన్ధర్మాన్ వ్యాఖ్యాస్యామః,
ధర్మజ్ఞ సమయః ప్రమాణమ్ వేదాశ్చ."

అని ఆపస్తంబుని ధర్మసూత్రము.

ధర్మశాస్త్రము నభ్యసించి, అందలి భేదములను ధర్మరహస్యములను ఎట్లు గ్రహింప వలెనో ఆరీతిగనే కామశాస్త్రము నభ్యసించి అందలి రహస్యముల నెఱుగవలయునని వాత్స్యాయనునిమతము. కావుననే అతడు "తం కామసూత్రాన్నాగరకజనసమవాయాచ్చ ప్రతిపద్యేత" (సూ. ౧౦౦) అని నిరూపించినాడు. ఆపస్తంబుడు కూడ వాత్స్యాయనుని వలెనె కామశాస్త్రము నాగరికులయిన సామాజికులవలన గ్రహింపదగినదని అభిప్రాయము కల్లవాడు.

ఆపస్తంబుని ధర్మగృహ్యసూత్రములనెట్టి కొన్ని విషయములను సంగ్రహించినవిధ మున వాత్స్యాయనుడు స్మృతులనుండి గూడ కొన్ని అంశములను గ్రహించి, తెలుపు చున్నాడు. చూడుడు. సరిగా యీవాక్యములే ఆపస్తంబగృహ్యసూత్రమునందును గాన వచ్చుచున్నది. ఆపస్తంబునిశాసన మిట్లున్నది.

"వివాహాశ్చ:—సుప్తాగ్ం రుదతీం నిష్క్రాన్తాం వరణే పరివర్జయేత్. దత్తాం గుప్తాం ద్యోతా మృషభాం శరభాం వినతాం వికటాం ముణ్డాం మణ్డూషికాగ్ం సాం కారికాం రాతాం పాలీం మిత్రాగ్ం స్వనుజాం వర్షకారించ వర్జయేత్. నక్షత్రనామా నదీనామా వృక్షనామాశ్చ గర్హితాః సర్వాశ్చరే ఫలకారోపాంతావరణే పరివర్జయేత్."
(పటలము ౧. ఖండము 3 )

అటుతరువాతివిషయమునందు గూడ వాత్స్యాయనుడు ఆపస్తంబునివాక్యములనే సంగ్రహించెను. ఏకన్యను చూడగనే మనస్సునకు కన్నులకుగూడ ప్రీతి కలుగునో అట్టి కన్యకయే వరింపదగినదని తెలుపుచు వాత్స్యాయనుడు

"యస్యాం మనశ్చక్షుషోర్నిబంధస్తస్యామృద్ధిర్నేతరామిత్యేకే,
తస్మాత్ప్రదానసమయే కన్యా మువారవేషాం స్థాపయేయురపరాహిణికంచ. (సూ.౬౯౯.)

ఈపట్టున ఆపస్తంబగృహ్యసూత్రమునందు (పటలము ౧. ఖండము 3. చివరను) "యస్యాం మనశ్చక్షుషోర్నిబంధస్తస్యామృద్ధిర్నేతరదాద్రియేతేత్యేకే" అని యున్నది.

ఈరీతిగనే వాత్స్యాయనుడు కన్యావిస్రంభణాధ్యాయమునందు వివాహానంతరము జరుగు త్రిరాత్రదీక్షాదివిషయములను దెలుపుచు సాంప్రయోగాధికరణమున ఔపరిష్టకా ధ్యాయమునందొక అసభ్యమైనవిషయమునుగూర్చి వివరించుచు, శుచిత్వ అశుచిత్వములను విధించుస్మృతులు మున్నగునవి బోధించువచనములబట్టి నాయకుడు ప్రవర్తింపనగునని భావ మును దెలుపుచు "తస్మాదాసాం స్మృతి తఏవ శౌచమన్వేష్టవ్యమ్" అని౬౧౭వ సూత్రమును

వచించినాడు. స్మృతులందున్న "వత్సః ప్రస్నవణే మేధ్యః శ్వా మృగగ్రహణేశుచిః, శకునిః ఫలపాతే తు స్త్రీముఖం రతిసంగమే" అనుశ్లోకము వాత్స్యాయనునకు పైసూత్రమును రచించుచు 'స్మృతిత ఏవ' అని అన్నప్పుడు మనస్సులో నుండియుండవచ్చును. వాత్స్యాయను డీపట్టు స్మృతికర్తలలో ఎవ్వరిని పేర్కొనపోయినను, గ్రంథమునుండి పైననుదాహరించినవిషయమును గైకొనినాడాయనునది తెలుసుకొనుట కష్టసాధ్యముగాదు. వాసిష్ఠధర్మ సూత్రమునందును,బౌధాయనధర్మసూత్రమునందునుగూడ పైశ్లోకభావమే కన్పడుచున్నది [1]

స్వల్పపాఠభేదముతో నీభావమే విష్ణుస్మృతియందును మానవధర్మశాస్త్రమందును గూడ కానవచ్చుచున్నది. [2]శుచిత్వవిషయము అనేకగ్రంథములందు ఇంచుమించుగా ఒకేవిధముగా నుండుట చూడ నీధర్మరహస్యమును తొలుత ఎల్లరకును దెలిపిన ధర్మశాస్త్రజ్ఞు డొకడుండవలయునని ఊహ జనించుచున్నది. ఆధర్మజ్ఞు డెవడో యిపుడు మనము తెలుసుకొననక్కర లేదుకాని పరంపరగా వచ్చినదానిని స్మృతులలోనుండి బోధాయన-వసిష్ఠ-విష్ణు-మానవధర్మశాస్త్రములలో నిరూపింపబడినదానిని వాత్స్యాయనుడు తనమతముగా నంగీకరించినట్లు నిర్ణయింపవచ్చును.

ఇట్లే వివాహవిషయమును గూడ వాత్స్యాయనుడు పూర్వుల ననుసరించినాడు. కన్యాసంప్రయుక్తాధికరణమునందు వివాహయోగాధ్యాయమున బ్రాహ్మ-అసుర-ప్రాజాపత్య-ఆర్ష-రాక్షస-పైశాచ-గాంధర్వేత్యాదివివాహరీతులను వివరించుచు బోధాయనునిమతమునే వాత్స్యాయను డనుసరించినాడు. అనురాగము గల్గినచోట, వివాహము జరుగుటకు ఆటంకములు పెక్కులున్నప్పుడు వాటినన్నింటిని ఆచారములను సంస్కారములను అన్నింటిని త్రోసిపుచ్చి గాంధర్వవిధిని కన్య పెండ్లియాడుట శ్రేయమని వాత్స్యాయనునిమతము. బోధాయనుడు వచించిన తెఱగున, వాత్స్యాయనుడు

"వ్యూఢానాం హి వివాహానామనురాగః ఫలంయతః.
మధ్యమోపి హి సద్యోగో గాంధర్వస్తేన పూజితః.

---

1 బోధాయనధర్మసూత్రమందు శ్రీనివాసాచార్యపరిష్కృతము మైసూరుముద్రణము పు. 57(౧-౫-౪౯) ఇట్లున్నది. "వత్సః ప్రస్నవనే మేధ్యః శకునిః ఫలశాతనే, స్త్రియశ్చ రతిసంసర్గే శ్వా మృగగ్రహణే శుచిః."

చ. వాసిష్ఠధర్మసూత్రము ౨౮ అధ్యాయము, 8 వ శ్లోకము.

2 మానవధర్మశాస్త్రమందు:—నిత్యమాస్యం శుచిస్త్రీణాం శకునిః ఫలపాతనే, ప్రస్రవే శుచిర్వత్సః శ్వామృగగ్రహణే శుచిః.

సుఖత్వాదబహుక్లేశాదపి చావరణాదిహ,
అనురాగాత్మకత్వాచ్చ గాంధర్వః ప్రవరో మతః." (సూ. ౧౮౭-౧౮౯)

బోధాయనుడు గూడ తనకు పూర్వులైనవారు కొందరు గాంధర్వవిధియే సర్వోత్కృష్టమైనదని ప్రశంసించినట్లు దెలుపుచున్నాడు. [1]ఈభావమే మహాభారతమునందును వెల్లడింపబడినది.[2] ఇంతవఱకు చూడ, వాత్స్యాయనుడు ఆపస్తంబుని గృహ్యసూత్రమునుండి అయిదుసూత్రములను సంగ్రహించినట్లు నిస్సంశయముగా నుడువవచ్చును. ఇట్లే బోధాయనుని ధర్మసూత్రమునుండి సూత్రవిషయములను గ్రహించినాడని నిస్సంశయముగా వచింపజాలము. ఏది ఎట్లయినను, ఈఆపస్తంబ బోధాయనులు, క్రీ. పూ. ౬౦౦ మొదలుకొని ౨౦౦ వఱకుగల నడిమికాలము వర్ధిల్లినవారని తెలియుచున్నది. కావున, వాత్స్యాయనుడు వారితరువాతికాలమువాడే కావలయుననుట స్పష్టము.

కౌటిల్యుని అర్థశాస్త్రమునుండి కొన్నివిషయములను వాక్యములను వాత్స్యాయనుడు సేకరించియుండుటబట్టి, కౌటిల్యుడే వాత్స్యాయనుడని కొందరివాదము. ఆవాదమును మొదట ప్రతిపాదించినవారు అర్థశాస్త్రమును పరిష్కరించిన ప్రకటించిన శ్యామశాస్త్రిగారు కౌటిల్యుని అర్థశాస్త్రమునందును, వాత్స్యాయనుని కామసూత్రములందును సమానముగా కన్పట్టు సూత్రములను అన్నింటిని, ఎత్తి ఒకచోట గూర్చి శ్యామశాస్త్రిగారొకచోట ప్రకటించినారు.[3]

కౌటిల్యుని అర్థశాస్త్రరచనాపద్ధతియు, వాత్స్యాయనుని కామసూత్రరచనావిధానమును ఒక్కరీతిగానుండుటబట్టి శ్యామశాస్త్రిగారీవాదమును దొడంగిరి. కాని శ్యామశాస్త్రిగారివాదము దుర్బలమైనది. విశ్వసనీయము కాజాలదు. కౌటిల్యుని అర్థశాస్త్రము క్రీ. పూ. ౩౦౦ నాటిది. ఇది ఎల్లరకును దెలిసినవిషయము. కౌటిల్యుడు చణకునిపుత్రుడు చాణక్యుడని నామాంతరముగలవాడు. వాత్స్యాయనుడు చణకుని పుత్రుడైనట్లుగాని, కౌటిల్యుడని నామాంతరముగలవాడనిగాని ప్రమాణములు కన్పట్టవు. కాని పైవాదమును బురస్కరించుకొని మరికొన్ని కారణములనుబట్టి కౌటిల్యుడే వాత్స్యాయనుడు, అతడే ధర్మశాస్త్రమునుగురించి అర్థశాస్త్రమును రచించినవిధమున 'న్యాయ' భాష్యమును రచించి

1 బోధాయనధర్మసూత్రము—మైసూరుముద్రణము. పుట. ౧౩౭. "గాంధర్వ మప్యేకే ప్రశంసంతి సర్వేషాం స్నేహానుగతత్వాత్."

2 ఆదిపర్వము—"వివాహానాం హి రంభోరు గాంధర్వః శ్రేష్ఠఉచ్యతే."

3 కౌటిల్యునిఅర్థశాస్త్రము-ఆంగ్లానువాదము—ఆర్. శ్యామశాస్త్రిగారి ఉపోద్ఘాతము. పుటలు. ౧౧,౧౨.

నాడని వాదము బయలుదేరెను. అభిధానచింతామణి అను నొకకోశగ్రంథమునం దుదాహృతమైన

"వాత్స్యాయనో మల్లనాగః కుటిల్చణకాత్మజః,
ద్రామిలః పక్షిలస్వామీ విష్ణుగుప్తోఙ్గులశ్చసః."

అనుశ్లోకము ఈశుష్కవాదమునకు ప్రమాణమయినది. ఈశ్లోకప్రామాణ్యము మీద శ్రీశ్చంద్రవసువిద్యార్ణవపండితుడు కౌటిల్యవాత్స్యాయను లొక్కరేగాని, భిన్నులు గారని విపరీతవాదమును సిద్ధాంతమొనర్చినాడు. [1]

వాత్స్యాయనునిగ్రంథాంతరమంతే కామసూత్రకారుడును, అర్థశాస్త్రకారుడు నొక్కరు కారని నిర్ణయించుట కాధారములు బలముగా కన్పడుచున్నవి. కన్యాసంప్రయుక్తాధికరణమునందు బాలోపక్రమాధ్యాయమున నాయకుడు తనయందు అనురాగము కలిగినకన్య వరించుటకును, ఆమె తనమాటలు వినుట కాసక్తత ప్రకటించునపుడు ఆమెను రంజింపచేయుటకు ఉపక్రమింపవలసిన విధానమును వాత్స్యాయనుడు సూచించినాడు. అందొకసందర్భమున,

"వర్ధమానానురాగాంచ ఆఖ్యానకే మనః కుర్వతీ,
మన్వర్థాభిః కథాభిశ్చిత్తహారిణీభిశ్చ రంజయేత్." (సూ. ౭౭౨)

అనియును; పారదారికాధికరణమునందు దూతీకర్మాధ్యాయమున, "శ్రుణ్వత్యాం చాహల్యావిమారకశాకుంతలాదీన్యన్యాన్యపి లౌకికానిచ కథయేత్తద్యుక్తాని" అనియు వాత్స్యాయనుడు వచించినాడు. వీటిలో అహల్యకథ మొదటిది. దానిని బుద్ధచరిత్రయందు అశ్వఘోషు డుదాహరించినాఁడు. [2] రెండవది అవిమారకునికథ. ఇది భాసునిచే నాటకముగా రచియింపబడినది. భాసుడు. క్రీ. పూ. మొదటిశతాబ్దమువాడని జాయస్వాలుపండితుడు నిర్ధారణచేసినాడు. [3] అది సరియైనకాలనిర్ణయమే కావచ్చును. భాసునికాలమునాటికే అవిమారకుని కథ లోకమునందు వ్యాపించియుండును. ఉదయనునికథవంటిదే, అవిమారకునికథయు కూడ కావున నిర్దిష్టముగా వాత్స్యాయనుడు, అవిమారకునికథను భాసునినాటకమునుండి గైకొనినాడనుటకు వీలులేదు ఇందుల కొకసాధకము కూడ కలదు. జయమంగలయందు యశోధ

---

1 మాడరన్ రివ్యూ (కలకత్తా) ౧౯౧౮, మార్చి సంపుటము పుట. ౨౭౪.

2 "కామం పరమితి జ్ఞాత్వా దేవోపి హి పురందరః,
గౌతమస్య మునేః పత్నీ మహల్యాం చకమే పురా". బుద్ధచరిత. ౪.—౭౨.

3 I. A. S. B. 1913. P. 265.

రుడు భాసుని అవిమారకములోకాని కొన్ని క్రొత్తవిషయములను దెలిపినాడు. [1]మూడవది శకుంతలకథ. వాత్స్యాయను డీకథను ఇంతకుముం దొకచోట కన్యాసంప్రయుక్తాధికరణమున వివాహయోగాధ్యాయమున ఉదాహరించియున్నాడు.[2] నాయకానాయికలు సమానజాతీయులుగా నున్నప్పుడు, నాయకుడు కన్యను, తనయం దనురక్తురాలిని జేసుకొనుటకై శకుంతలాదికన్యలు స్వబుద్ధిచేత దోషవిచారణచేసి వరులను వరించి సుఖపడిరని తానును అట్లే యొనర్పవచ్చుననియు వాత్స్యాయనుడు తెలుపుచున్నాడు. ఈశకుంతలకథను వాత్స్యాయనుడు కాళిదాసునుండి గ్రహించినాడనుటకు వీలులేదు. మహాభారత ఆదిపర్వమునం దరువదిఏనిమిదవఅధ్యాయమునందున్నది అదివఱకే అది చాలా ప్రసిద్ధికివచ్చినదిగా కనిపించును. అశ్వఘోషుడు దానిని బుద్ధచరితయం దుదాహరించినాడు. విశ్వామిత్రుడను మహాతపశ్శాలికి ఘృతాచి యనుఅప్సరసయందు అనురక్తుఁడై పదిసంవత్సరములు గడపి తపోభంగమునొందినాడని వ్రాసెను. [3]ఇందు మేనకకు ఘృతాచియని యున్నది. కట్ఠహారిజాతక కథ శకుంతలాదుష్యంతుల ఇతివృత్తమును తలపునకు దెచ్చుచున్నది. శతపథబ్రాహ్మణమునందు కూడ శకుంతలకథ కలదు. అనగా బ్రాహ్మణములు రచింపబడుకాలమునాటికే శకుంతలకథ లోకమునందు ప్రశస్తిచెందియున్నట్లు విదితము. శతపథబ్రాహ్మణమునందు శకుంతలనాడపిత అనుచోట జననమొందెననియు, దుష్యంతుని కామెయందు భరతుడు పుట్టెననియు, భరతునిబట్టి భరతవర్షమని పేరువచ్చినదనియు, భరతునిగూర్చినగాథలలో నున్నది. చూడుడు.

---

1 చూడుడు పుట ౧౩౭.

2 "యాశ్చాన్యా అపి సమానజాతీయాంకన్యాః శకుంతలాద్యాః స్వబుద్ధ్యా భర్తారం ప్రాప్య సంప్రయుక్తా మోదంతే స్మ తాశ్చాశ్యాః నిదర్శయేత్."

3 "విశ్వామిత్రో మహర్షిశ్చ విగాఢోపి మహత్తపాః,
దశవర్షాణ్యరణ్యస్థో ఘృతాచ్యాప్సరసాహృతః." బుద్ధచరిత. ౪—౨౦.

గాథ లనగా తెలుపవలసియున్నది. ఇవి బ్రాహ్మణములందును, అందును వైదికవాఙ్మయమునందును ఇవి తరచుగా ఉదాహరింపబడుచున్నవి. ఇవి ఋగ్వేదములోని మిక్కిలి ప్రాచీనభాగములని సంప్రదాయము తెలిసినవారి అభిప్రాయము. చాలవరకు గాథలు చారిత్రకవిషయములు గలవి. ప్రాచీనులగు మహాసత్త్వులయొక్క వీరకృత్యములను చేర్చి వ్రాయబడినపాట లీగాథలు. అట్టిగాథయే యొకటి భరతకులదీపకుడైన భరతునిగురించి రచియింపబడినది. పైన ఉదాహరింపబడినది. ఐతరేయబ్రాహ్మణమున ఋక్కులకును గాథలకును భేదము నిరూపింపబడినది. ఋక్కులు దేవతలను స్తోత్రముచేయునవి. గాథలు మహాసత్త్వసంపన్నులయినవారిని కీర్తించుపాటలుగానున్నవి. దేవతలను సంతోషపెట్టుటయందే తాత్పర్యముగల బ్రాహ్మణులు ఋక్కులను శ్రద్ధగా పఠించి భద్ర

"ఏతద్విష్ణోః క్రాన్తమ్ తేనహైతేన భరతో దౌఃషన్తిరీజేతేనేష్ట్వేమాం వ్యష్టిం వ్యాశనసే యేయం భరతానాం తదేతద్ గాథయాభిగీతమష్టాసప్తతిం భరతో దౌఃషన్తిర్య మునామను గఙ్గాయాం వృత్రఘ్నే౽ బధ్నా త్పఞ్చ పఞ్చాశతం హాయానితి అథతృతీయ యాశకుంతలానాడిపిత్యప్సరా భరతం దధే పరః సహస్రానిన్ద్రాయాశ్వాన్మేథ్యాన్య, ఆహా రద్విజిత్య పృథివీం సర్వామితి అథచతుర్థా మహాదద్య భరతస్య నపూర్వేనాపరేజనాః, దివం మర్త్య ఇవ బాహుభ్యాం నోదాయుః పఞ్చమానవాఇతి. ౧౩. ౫. ౪., ౧౧—౧౪.

దీనినిబట్టి చూడ శకుంతలకథ ప్రాచీనార్యులకాలమునాటిదని స్పష్టమగుచున్నది. బుద్ధఘోషుడొకడు మాత్రము శకుంతలతల్లి ఘృతాచి యని వచించినాడుగాని, ఆమెపేరు మేనక. ఆమె అప్సరసయనియు శుక్ల-కృష్ణయజుర్వేదములందు రెండింటియందును గలదు.* కావున పైనవ్రాసినదానినిబట్టి, వాత్స్యాయనుడును కౌటిల్యుడు నొక్కరు గారనియు, విశేషించి ఆతనితరువాతకాలమున జీవించియుండినవాడనియు తేటపడుచున్నది.

ఇంతవఱకు వాత్స్యాయనుడు ధర్మార్థశాస్త్రసంబంధములయిన విషయములను చర్చించునపుడు ఎంతవఱకు ఆతడు ప్రాచీనులమతములను సంగ్రహించినాడో నిరూపించితిమి. ఇక కామశాస్త్రవిషయములను సేకరించి కామసూత్రములను రచించుకొఱకు ప్రాచీనులపై నెంతవఱకు నాధారపడియుండినాడో నిరూపింప బ్రయత్నించెదను.

కామసూత్రము లనుమహాగ్రంథమును రచియింపబూని వాత్స్యాయనుడు దేవతానమస్కారపూర్వకముగ ధర్మార్థకామములకు నమస్కరించి కామశాస్త్రమును ప్రారంభించెను. అందు కామశాస్త్రావతరణము నీక్రిందివిధముగా వచించెను. ప్రజాపతి, తనప్రజాసృష్టిస్థితినిబంధముగా నుండుటకు త్రివర్గధర్మార్థకామము సాధనముకొఱకు ఒకలక్షసూత్రములు లేక అధ్యాయములుగల మహాగ్రంథమును రచించెను త్రివర్గములలో ధర్మార్థములను గురించి స్వాయంభువమనువును, బృహస్పతియు శాస్త్రములను రచించిరి. మూడవది కామమునుగూర్చి మహాదేవానుచరుడగు నందీశ్వరు డొకవేయి అధ్యాయములుగల గ్రంథమును సమకూర్చెను. నందీశ్వరుని కామశాస్త్రమును, ఉద్దాలకకుమారుడగు శ్వేతకేతువు-ఈతని

---

ముగా దాచిపెట్టుకున్నట్లు గాథలను అన్నింటిని కంఠస్థముచేసి పారంపర్యాయముగా నిలిచియుండునట్లు పాటుపడలేదు. అందువలన పెక్కువైదికగాథలు నశించిపోయెను. భరతునివంటి మహాతేజశ్శాలినిగూర్చిన గాథవంటివి కొన్ని అక్కడక్కడ వైదికవాఙ్మయమునందు కానవచ్చును.

* "మేనకాచ సహాజన్యా చాప్సరసౌ"...వాజసనేయిసంహితా ౧౫, ౧౬. ఇట్లే తైత్తిరీయసంహిత యందును మైత్రాయిణీసంహితయందును గూడ కలదు.

వాత్స్యాయనుడు ఔద్దాలకి అవి వ్యవహరించును—ఏనూరు అధ్యాయముల క్రింద సంక్షేపించెను. ఔద్దాలకి వ్రాసినగ్రంథమును, కొంతకాలమునకు సాధారణాధికరణము, సాంప్రయోగాధికరణము, కన్యాసంప్రయుక్తాధికరణము, భార్యాధికరణము, పారదారాధికరణము, వైశికాధికరణము, ఔపనిషదాధికరణము, అను ఏడు అధికరణములుగా విభజించి బభ్రువుకుమారుడును, పాంచాలదేశీయుడునగు బాభ్రవ్యుడు నూటయేబది అధ్యాయములకు సంక్షేపించి రచించెను. బాభ్రవ్యుని గ్రంథములో సారవదగు వైశికాధికరణమును, పాటలీపుత్రపుగణికాజనముయొక్క సంప్రార్థనమువలన దత్తకాచార్యు డొక ప్రత్యేకగ్రంథముగా వ్రాసెను. దత్తకుడు బాభ్రవ్యునిగ్రంథము నుండి విడదీసి వైశికాధికరణమును రచించినవిధముగా, ఆరీతిగా, చారాయణుడు సాధారణాధికరణమును, సువర్ణనాభుడు సాంప్రయోగాధికరణమును, ఘోటకముఖుడు కన్యాసంప్రయుక్తాధికరణమును, గోనర్దీయుడు భార్యాధికరణమును, గాణికాపుత్రుడు పారదారికాధికరణమును, కుచుమారుడు ఔపనిషదాధికరణమును విస్తరించి ప్రత్యేకగ్రంథములుగా రచించిరి. చివరకు బాభ్రవ్యునిగ్రంథము ఉత్సన్నప్రాయమగుట సంభవించెను. దత్తకచారాయణాదులగ్రంథములు ఏకదేశమాత్రములుగా నుండుటబట్టి అవి శాస్త్రమును సంపూర్ణముగా నభ్యసించుటకు వీలుగానివిగా నుండెను. అట్టి స్థితియందు సమగ్రముగానుండి పఠించుటకు వీలుగానుండగల గ్రంథముగా వాత్స్యాయనుడు కామసూత్రములను రచించెను. ఆసంగతి గ్రంథాంతమునందు, బాభ్రవ్యులు మొదలగువారిమతము ననుసరించిన సూత్రార్థములను శాస్త్రమట్లు గురువులయొద్ద పఠించి తెలుసుకొని స్వబుద్ధి కొలది తలచి, యథావిధిగా, ఈసూత్రములను రచించితినని వాత్స్యాయనుడు తెలిపినాడు: [1]కామసూత్రములలోని సాంప్రయోగాధికరణమును సంపూర్ణముగా బాభ్రవ్యుని గ్రంథమునుండియే వాత్స్యాయనుడు తీసుకొనెను.[2] ఇది అంతే కాదు. కామశాస్త్రరచనయందు తోడ్పడుటకు బాభ్రవ్యునిగ్రంథమును తనముంగిట నుంచుకొనియే కడంగినాడనుటకు వాత్స్యాయనుడు పెక్కుతావులందు బాభ్రవ్యునిమతమును స్మరించును.[3] కావున బాభ్రవ్యుడు వాత్స్యాయనునికంటె ప్రాచీనుడు గావలయును. మిక్కిలి ప్రాచీనుడని వచిం

1 సూ. ౧౬౯౬. పుట. ౭౨౭. "బాభ్రవీయాంశ్చ సూత్రార్థానాగమయ్య విమృశ్యచ, వాత్స్యాయనశ్చకారేదం కామసూత్రం యథావిధి."

2 సూ. ౬౭౯. పుట. ౩౦౪. ఫ. ఏవమేతాం చతుష్షష్టిః బాభ్రవ్యేణ ప్రకీర్తితామ్."

3 History of Sanskrit Literature; translated into English by J. Mann and T. Zachariae, Popular edition. pp. 10 and 34.

చుటకు ఆతనిగ్రంథము వాత్స్యాయనునికాలమునాటికి ఉత్పన్నప్రాయమైనదనుట సాధక మగుచున్నది. ఈబాభ్రవ్యుడు పాంచాలదేశీయుడని వాత్స్యాయనుడే వచించెను. ఈతడు గాక మరియొక బాభ్రవ్యుడు ఋక్ ప్రతిశాఖ్యయందు ఋగ్వేదమునకు క్రమపాఠమును సంతరించినవాడు, భాష్యకారుడగు ఉవటునిచే పేర్కొనబడినవాడు గలడు. బాభ్రవీయాదులయిన పాంచాలదేశీయులచే ఋగ్వేదక్రమపాఠము సంస్కరింపబడినదని వీబరు పండితుడు గూడ తెలుపుచున్నాడు.[1] ఋగ్వేదక్రమపాఠరచనసామ్యమునుబట్టి తత్ప్రణీతయగు బాభ్రవ్యుడును కామశాస్త్రసంధాతయగు పాంచాలబాభ్రవ్యుడును ఒక్కరే యగుదురా యని సంశయము కలుగును. కామసూత్రములందు సాంప్రయోగాధికరణమున రతివిశేషములు కళావిశేషములు, మొదలయినవి చతుష్షష్టి కలవని నిరూపించుచున్నాడు. ఒకచోట పాంచాలదేశీయులకు ప్రత్యేకముగ చతుష్షష్టికళలు కలవని వాత్స్యాయనుడు "పాంచాలికీ చ చతుష్షష్టిరపరా" సూ. ౧౫౬. వచించినాడు. ఇట్లే ఆలింగనవిచారావిచారాధ్యాయమునందును సురతాంగములగుసంప్రయోగములు చతుష్షష్టిః' అని సూత్రీకరించెను. ఋగ్వేదక్రమపాఠము పదిమండలములుగా విభజింపబడియున్నది. వాటికి 'దశశతయీ' అని పర్యాయనామము. ఒక్కొక్కదశశతయీఋక్కులు ఎనిమిది అష్టకములుగను, ఒక్కొక్క అష్టకము ఎనిమిదిఅధ్యాయములుగను, మొత్తము ౬౪ గ విభజింపబడినది. అందువలనగాఁబోలు దశశతయీఋక్కులకు 'చతుష్షష్టిః' అని సంజ్ఞ ఏర్పడినది. బహ్వృచశాఖాధ్యాయనులు-ఋగ్వేదులు-తొలుత పాంచాలదేశీయులు. వారికి ఋగ్వేదమువలెనే చతుష్షష్టిః అనునది పూజ్యపదము కానోపు. చతుష్షష్టిః అనునది వారికి ప్రీతికరమైన పదము ఋగ్వేదక్రమపాఠసంధాతయగు బాభ్రవ్యుడు కామశాస్త్రప్రణేతయు గూడ నగుచు తచ్ఛాస్త్రమును గూడ చతుష్షష్టిఃగా విభజించి రచించినాడా యని సంశయము కలుగును. బాభ్రవ్యునిమతము ననుసరించిన వాత్స్యాయనుడు ఋగ్వేదసామ్యమును దీసుకొని వచ్చినాడా యనునట్లు ఆలింగనవిచారాధ్యాయమున "ఋచాం దశశతయీనాంచ సంజ్ఞితత్వాదిహాఽపి తదర్థసంబంధాత్ పంచాలసంబంధాచ్చ బహ్వృచైరేషా పూజార్థం సంజ్ఞా ప్రవర్తితే త్యేకే" సూ. ౩౩౮.

అని సూత్రమును రచించి పైసంశయమును నివారించుచున్నాడు. పైన వ్రాసిన దానినిబట్టి ఋగ్వేదక్రమపాఠసంధాతయు, కామశాస్త్రప్రణేతయు నగు బాభ్రవ్యుడుఒక్కడే

[1] "సంప్రయోగాంగం చతుష్షష్టిరిత్యాచక్షతే చతుఃషష్టిప్రకరణత్వాత్, శాస్త్రమేవేదం చతుష్షష్టిరిత్యాచార్యవాదః" సూ. ౩౩౫—౩౩౬.

యని నిశ్చయముచేయ బూనునపుడు ఋగ్వేదక్రమపాఠమునాటికే కామశాస్త్రము గూడ సంతరింపబడెనా యనుసందేహము కలుగుచున్నది. కామశాస్త్రమును ఆగమమురీతిని పఠించిన పద్ధతిని అంత ప్రాచీనకాలమునందు అభ్యసించినట్లు ప్రమాణములు కన్పట్టవు. కాని త్రివర్గములలో జేరినదగుటచేత కామశాస్త్రమునకు శాస్త్రమర్యాదస్థితికలిగినట్లు అధర్వణవేదమును బట్టి నిర్ణయింపవచ్చును. కామోపాంగములగు స్త్రీవశీకరణాదులు, అందుల కుపయుక్తములయిన మంత్రములను, తంత్రములను, అధర్వణవేదసంఘాతలగు మహర్షులు రచియించినట్లు తెలియుచున్నది. ఏది ఎట్లయినను, ఈ ఉభయబాభ్రవ్య లొక్కరు గాకున్నను, అయినను కామశాస్త్రరచయితయగు భాభ్రవ్యుడు మిక్కిలి ప్రాచీనుడనుట నిక్కము.

ఇక కామశాస్త్రోపాధ్యాయుడగు బాభ్రవ్యునిగురించి విచారించవలసియున్నది. భరతఖండమున మిగిలిన ప్రాంతము లన్నిటికంటె పాంచాలమున కామశాస్త్రము ఎక్కువగా అభ్యసింపబడెను. ఇందులకు బాభ్రవ్యుడే ప్రమాణము అశ్వమేధయాగమునందు కొన్ని అసభ్యములైన క్రియలు గలవు. వాటిని ముందుగా పాంచాలదేశీయులే ప్రారంభించినట్లు వీబరు పండితుని అభిప్రాయము. [1]తృతీయాప్రకృతులను స్త్రీలను గూడ పురుషులుగా మార్చగల ప్రయోగశక్తికౌశలములు పాంచాలదేశీయుల కుండినట్లు మహాభారతములో శిఖండివృత్తాంతమునుపట్టి ద్యోతకమగుచున్నది. శిఖండి ద్రుపదరాజునకు జన్మించినతృతీయాకృతిగలపురుషుడు. ద్రుపదుడు పాంచాలమునకు పతి, ద్రౌపదికి పాంచాలియన్న పేరు గలదు. ఆమె అయిదుగురు భర్తలను పరిణయమాడెను. ఒక్కభార్య బహుభర్తలను పెండ్లియాడు ఆచారము పాంచాలమునందే కలదని యిందుమూలమున నిరూపింపవచ్చును పాండవులును కౌరవగణములోనివారే, కురుపాంచాలదేశములు కలిసియే యున్నవి. పాంచాలుర ఆచారములు కౌరవులకు చిరపరిచితములే గావున పాంచాలి ద్రౌపది ఏవురుభర్తలను పెండ్లియాడినవిధము కౌరవులకు ఏవగింపు కలిగింపలేదు. బాభ్రవ్య లుదాహరించిన పాంచాలదేశాచారములలో నొకదానిని "దృష్టపంచపురుషా నాఽగమ్యా కాచిద స్తీతిభాభ్రవీయాః" అని వాత్స్యాయను డుదాహరించినాడు. ఈబాభ్రవీయసూత్రమును తనమతముగా నంగీకరించినట్లును, ఈసూత్రనిర్మాణమునందు వాత్స్యాయనుని మనసులో ద్రౌపదివృత్తాంతము మెలగుచున్నట్లు జయమంగలవ్యాఖ్యబట్టి దెలియుచున్నది. [2] అగమ్యులగుస్త్రీలను నిర్ణయించుటలో బాభ్రవీయులమతమును వివరించినాడు. తొలుత తాను వివాహమాడినభర్తగాక అయిదుగురువఱకు పురుషులను భర్త

1 Weber's History of Sanskrit Literature, English Translation pp. 14—15.

2 కలకత్తా ముద్రణము ౫౩ వ అధ్యాయము.

లుగా స్వీకరించవచ్చును. అనగా ఆర్గురవరకు ఆమె భర్తలను స్వీకరించవచ్చును. అంతకంటె నెక్కువమందిని స్వీకరించినస్త్రీ అగమ్యురాలే యగును. అని భాభ్రవ్యుల అభిప్రాయము. ద్రౌపది అయిదుగురు భర్తలను మాత్రమే స్వీకరించెను గావున ఆమెవంటిస్త్రీ బాభ్రవీయుల మతమున గమ్యురాలే యగును.

ఇక బాభ్రవ్యునికి పూర్వులు కొందరిని వాత్స్యాయనుడు పేర్కొనుచున్నాడు- ప్రజాపతి, నందీశ్వరుడు, శ్వేతకేతువు. మొదటియిరువురును రచియించినగ్రంథములు లభింపవు. వాటిని చూచినట్లు గూడ వాత్స్యాయనుడు తెలుపుట లేదు. కాని ప్రజాపతి ధర్మార్థములకువలె కామమునకు శాస్త్రము రచించినాడని మహాభారత శాంతిపర్వమున గలదు.[1] ఒక ఔద్దాలకి మహాభారత ఆదిపర్వమునందు పేర్కొనబడినాడు. కామవిషయమున, మనుష్యులు తిర్యగ్యోనులవలె సంచరించుచుండ ఔద్దాలకి మనుష్యులకు కొన్ని నిబంధనలు చేసెనని ఆకథ తెలుపుచున్నది. ఈకథనుబట్టి ఔద్దాలకి మనుష్యసంఘమున స్త్రీపురుషులకు వైవాహికసంస్కారము లేనికాలముననుండిన ట్లూహింపవచ్చును ఇంతప్రాచీనుడగు ఔద్దాలకియు, కామశాస్త్రసంధాతయు నొక్కరే యగుదురా యన్నప్రశ్న జనింపవచ్చును. కారనుటకు ఆధారములు లేవు. అగుననుట అసంబద్ధియు కానేరదు. ఔద్దాలకిమతమును వాత్స్యాయనుడు ముమ్మారుదాహరించినాడు.[2] ఇంతమాత్రమునకే ఔద్దాలకి సంతరించిన కామశాస్త్రమును వాత్స్యాయనుడు చూచియుండె ననుటకు వీలులేదు. ఔద్దాలకి బాభ్రవ్యునిగ్రంథమందు ఉదాహృతమయియుండుటబట్టి, ఔద్దాలకితో తాను ప్రత్యేకముగా ఏకీభవించినవిషయములను మాత్రమే వాత్స్యాయనుడు ఉదాహరించియుండవచ్చును.

బాభ్రవ్యునియనంతరము వచ్చిన దత్తకాదులగురించి కొంచెము పరిశీలింతము. దత్తకునిగ్రంథమునుండి వాత్స్యాయనుడు పెక్కుతావులందు సూత్రవాక్యములనెత్తి, వాటిని సంక్షేపించి తనసూత్రములంధు జొప్పించి యున్నాడు. దత్తకుని వైశికాధికరణము జయమంగలవ్యాఖ్యనాడు కూడ నుండినట్లు జయమంగలలోని వాక్యములే చాటుచున్నవి.

---

1 కలకత్తా ముద్రణము ౧౨౨ వ అధ్యాయము.

2 "కథమేతదుపలభ్యేత ఇతి చేత్, పురుషో హి రతిమధిగమ్య స్వేచ్ఛయా విరమతి, న స్త్రియమపేక్షతే, న త్వేవం స్త్రీత్యౌద్దాలకిః." (సూ. 281)

"సాసంస్తుతా దృష్టాకారయోర్దత్తమస్తీత్యౌద్దాలకిః" (సూ.)

"ఇత్యౌద్దాలకే ర్భయతో యోగః" (సూ)

వాత్స్యాయనుడు దత్తకుని సూత్రభావమును మాత్రము తెలిపియుండగా జయమంగల దత్తకునిసూత్రమును ఉదాహరించుచున్నది. [1]

మిగిలిన అయిదుగురిలో గోనర్దీయుని మల్లినాథుడు తనకుమారసంభవములో ఎనిమిదవసర్గలోని ౯౩ శ్లోకము పై వ్యాఖ్యయందును రఘువంశములో ౧౯ వ సర్గలోని ౨౯, ౩౦ శ్లోకములపై వ్యాఖ్యయందును పేర్కొనియున్నాడు. రాజశేఖరుడు కావ్యమీమాంసయందు 'రీతినిర్ణయ'మను అలంకారగ్రంథమును రచించిన యొకసువర్ణనాభుని తెలిపియున్నాడు. మరియు నందే కుచుమారుడు ఔపనిషదికాధికరణమునుగూర్చి వ్రాసినాడని గూడ తెలిపినాడు. వాత్స్యాయను డుదాహరించిన కుచుమారుడును, రాజశేఖరు డుదాహరించిన కుచుమారుడు నొక్కరే గావచ్చును. కుచుమారతంత్ర మనునొకగ్రంథము గలదు. తద్రచయిత యగుకుచుమారుడును ఔపనిషదికాధికరణమునుగూర్చి వ్రాసిన కుచుమారుడు నొక్కరే యగుదురో కాదో ప్రస్తుతము తెలియుటలేదు అర్థశాస్త్రమున పంచాధికరణమునం దొకదీర్ఘచారాయణుని, ఘోటకముఖుని ఇర్వురను కౌటిల్యుడు పేర్కొనుచున్నాడు. వీరిరువురును వాత్స్యాయనునిచే నుదాహృతులయిన చారాయణఘోటకముఖులే యని జాకోబిపండితుని యభిప్రాయము. ఈనిర్ణయమును అంగీకరించినపుడు చారాయణఘోటకముఖులు, క్రీ. పూ॥ ౫-వ శతాబ్దమునా డుండియుందురని విశ్వసింపవచ్చును. బాభ్రవ్య, దత్తకులు వీరికన్నను పూర్వులుకాబట్టి క్రీ. పూ. ౬ వ శతాబ్దమునం దుండిరనుట స్పష్టము. పాటలీపుత్రనగరనిర్మాణమే క్రీ. పూ. ౫ వ శతాబ్దమునందు జరిగియుండెను గావున దత్తకాచార్యుడును ఆకాలపువాడే యగునుకాని తత్పూర్వుడు కాజాలడు. గోణికాపుత్రు డొకడు పతంజలిభాష్యమునందు వినవచ్చుచున్నాడు. (౧-౪-౫౧) ఇతడు ప్రాచీనవైయ్యాకరుణులలో నొకడు. కావున వాత్స్యాయనుడు తెలిపిన గోణికాపుత్రు డతడు కావచ్చును. పతంజలికి గోనర్దీయుడని మరియొకపేరు గలదు గోనర్దీయుడే పతంజలి యని నిశ్చయించుటకు సాధనములు చాలవు.

ఇంతవఱకు వాత్స్యాయనుడు పేర్కొనిన ప్రాచీనులగురించి తఱచినారము. తత్ఫలితముగ వాత్స్యాయనుడు రచియించుటకుముందు పలువురు కామశాస్త్రమునుగురించి గ్రంథములు రచియించినట్లు రూఢిగా తెలియుచున్నది. కాని యింతవఱకు తెలిపినవిషయములనుబట్టి వాత్స్యాయనునికాలము నిర్ణీతము కాలేదు. అతని తరువాత వచ్చినవారు కామసూత్ర

1 "శాబ్దసంఘుతో విశిష్టగ్రహణమితి" దత్తకసూత్రమస్పష్టార్థం మాత్రాంతరమాహ ప్రతిగణికా జామితి.

ములను తమగ్రంథములం దుదాహరించినవారు గలరు. వారిగ్రంథములను పరిశీలించినపుడు కాలనిర్ణయమునకు కొంత సాధనము లభింపవచ్చును.

కాళిదాసురఘువంశము ౧౯-వ సర్గయందు అగ్నివర్ణుని రతిలౌల్యమును విషయలంపటత్వమును వర్ణించినసందర్భములో ౧౬-వ శ్లోకమును [1]చదివినపుడు వైశికాధికరణములోని విశీర్ణప్రతిసంధానాధ్యాయమును అందలి పారిభాషికపదములు మనకు స్ఫురణకు వచ్చును. 'సంధేయ' శబ్దమును గూడ కాళిదాసుపయోగించినాడు మరియు విరక్తిప్రతిపత్తివిషయమున గూడ (సూ. ౧౪౩౧, [2] అనగా నాయకుడు అనేక కారణములవలన (వేశ్యా) నాయికయందు విరక్తుడైనపుడు ఆమె యనుసరింపవలసినవిధానమునందు వాత్స్యాయనుడు వచించినదానినే కాళిదాసు డనువదించెను. వాత్స్యాయనుడు.

"మిత్రకార్యమపదిశ్యాఽన్యత్ర శేతే,
పూర్వసంసృష్టాయాశ్చ పరిజనేన మిథః కథయతి. (సూ. ౧౪౨౮.)

అని నాయకు డుపచరింపవలసినవిధానము దెలుపుచున్నాడు. కాళిదాసు అగ్నివర్ణుని వర్ణించుచు నీసూత్రవాక్యములనే తనశ్లోకమునం దిమిడ్చినాడు చూడుడు: (౩౧-వ శ్లోకము.)

మిత్రకృత్యమపదిశ్య పార్శ్వతః ప్రస్థితం తమనవస్థితం ప్రియాః,
విద్మహే శఠపలాయనచ్ఛలాన్యంజసేతి రురుధుః కచగ్రహైః.

ఇంతకంటె రమ్యమైనవిషయమును కాళిదాసు వాత్స్యాయనుని అనువదించినాడనుటకు, మల్లినాథుడు రఘువంశవ్యాఖ్యయందు, తెలిపినాడు. ఇందుమతీపాణిగ్రహణమువేళ అజునిపాణిసమాగమమయినపుడు వధువునకు పులకలు జనించినసందర్భమునందు

"ఆసీద్వరః కంటకితప్రకోష్ఠః స్విన్నాంగులిః సంవవృతే కుమారీ,
వృత్తిస్తయోః పాణిసమాగమేన సమం విభక్తేవ మనోభవస్య.

అని కాళిదాసు రచించినాడు. మల్లినాథు డీశ్లోకముపై వ్యాఖ్యానముచేయుచు, కామసూత్రములనుండి 'కన్యాతు ప్రథమసంగమే ప్రథమసమాగమే స్విన్నాంగులిః స్విన్నముఖీచ భవతి పురుషస్తు రోమాఞ్చితో భవతి, ఏభిరనయోర్భావం పరీక్షేత.'

---

1 "తస్యాపరాధపరిశంకితయోః(?), కామ్యవస్తుషు నవేషు నంగినః వల్లభాభిరుపసృత్య చక్రిరే, సామిభుక్తవిషయాః సమాగమాః." ఇత్యాది.

2 వికపసర్గ ౨౦ వ శ్లోకము.

అని అందులకు ప్రమాణముగా నుదాహరించినాడు. [1]కాని యిందులకు విరుద్ధముగా కుమారసంభవమునందు ఉమాపాణిగ్రహణమును ఏడవసర్గ 22 వ శ్లోకము హరుని హస్త సమాగమమువేళ హరునికి లేజెమటలును, ఉమకు బులకలును పొడమెనని కాళిదాసు వర్ణించినాడు. [2]కాళిదాసునకు రఘువంశరచనాకాలమునాటికి జ్ఞాపకమున్న కామసూత్రము. కుమారసంభవరచనాకాలమునాటికి స్మృతిదాటిపోయినదని దీనికి కారణముగా నూహింప నగును. ఏమయినను కామసూత్రములను కాళిదాసు పఠించినాడనుట స్పష్టము. ఇందులకు తార్కాణముగ పీటర్సనుపండితు డొక ఉదాహరణము నిచ్చియున్నాడు. అభిజ్ఞానశాకుంత లమున నాల్గవయంకమున కణ్వుడు శకుంతలను భర్తగృహమునకు బంపుసందర్భమున హితోపదేశము చేయుచున్నాడు.

"శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తం సపత్నీజనే,
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపంగమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనేభాగేష్వనుత్సేకినీ,
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః.

ఈశ్లోకము ఆనాటకములో మిక్కిలి ప్రశస్తమైనదనుట ఎల్లరు నెరిగినవిషయము. ఇందలియుపదేశములలో మొదటిది మూడవది నాల్గవది కామసూత్రములలో నున్నవి ఉన్నట్లుగా వచ్చిపడినవి.[3] మరియు పై శ్లోకములోని రెండవపాదములోని భావము కూడ వాత్స్యాయనసూత్రములలోనిదే. [4]వేయేల కాళిదాసు ఒక ఏకచారిణీవృత్తము, ఒక్క జ్యేష్ఠావృత్తమును మాత్రమేగాక కామసూత్రములను సాంగముగా చదివినవాడనుటకు అందుండి తనకు కావలసినసామగ్రి సంగ్రహించినా డనుటకును శాకుంతలమునుండి మరియొక ఉదాహరణమును గూడ జూపవచ్చును. దుష్యంతుడు శకుంతలయం దనురక్తుడై, ఆమెతో సంభాషించుటకు సమీపించినసందర్భమున ఆసన్నివేశమును కల్పించుటకు గావలసిన సాధనముల నన్నింటిని కాళిదాసు కన్యావిస్రంభణాధ్యాయమునుండి సంపూర్ణముగా

---

1 ఈసూత్రము ఇంచుక పాఠభేదముతో అచ్చుప్రతియం దీవిధముగా గలదు. "స్విన్నకరచరణాంగులిః స్విన్నముఖీ చ భవతి".

2 "రోమోద్గమః ప్రాదురభూదుమాయాః, స్విన్నాంగులిః పుంగవకేతురాసీత్."

3 "శ్వశ్రూశ్వశురపరిచర్యా తత్పారతంత్ర్యమనుత్తరవాదితా పరిమితా ప్రచణ్డాలాపకరణమను చ్చైర్హాసః......పరిజనే దాక్షిణ్యమ్, ఇత్యాదులు. సూ. ౯-౨౮—౯-౩౦.

4 "నాయకాపచారేషు కించిత్కలుషితా నాత్యర్థం నిర్వదేత్ సాధిక్షేపవచనం మిత్రజనమధ్యస్థం ఏకాకినం వాప్యుపాలభేత; న చ మూలకారి కాస్యాత్." సూ. ౯౦౩—౯౦౮.

గ్రహించినట్లు కనబడును. వాత్స్యాయనునిసూత్రములందు 'ఆలాపయోజనవిధాన' మీరీతిగా చెప్పబడినది.

"సర్వా ఏవహి కన్యాః పురుషేణ ప్రయుజ్యమానం వచనం విషహంతే న తు లఘుమిశ్రామపి వాచం వదంతీతి ఘోటకముఖః". సూ. ౭౯.

"సంస్తుతా చేత్సఖీమనుకూలాముభయతోఽపి విస్రబ్ధాం, తామంతరా కృత్వా కథాం యోజయేత్."

"తస్మిన్నధోముఖీ విహసేత్."

"తాం చాతివాదినీమధిక్షిపేద్వివదేత చ".

"సాతు పరిహాసార్థం ఇదమనయోక్తమితి చానుక్తమపి బ్రూయాత్."

"తత్ర తామపనుద్య ప్రతివచనార్థమభ్యర్థ్యమానాం తూష్ణీమాసీత."

"నిర్బధ్యమానా తు నాహమేవం బ్రవీమీత్యవ్యక్తాక్షరమనవసితార్థం వచనం బ్రూయాత్."

"నాయకంచ విహసంతీ కదాచిత్కటాక్షైః ప్రేక్షేతేత్యాలాపయోజనమ్."

సూ. ౭౩౨—౭౩౮.

పైన వచించినదానినిబట్టి వాత్స్యాయనుడు నిస్సంశయముగా కాళిదాసునకు బూర్వుడగుచున్నాడు. కాళిదాసు క్రీ. శ. అయిదవశతాబ్దమధ్యకాలముననున్నవాడనుట కొకబలవంతమైన ప్రమాణము రఘువంశమునందున్నది. చతుర్థసర్గలోని ౬౬-౬౭ శ్లోకమునుబట్టి యీ విషయము నిర్ణయింపవచ్చును[1] రఘువు శత్రుగర్వాపహారముచేయుటకు సంభ్రమముతో నుత్తరదిశకు బోయెను. అచ్చటాతనివిజయములను వర్ణించుసందర్భమున వంక్షుతీరమందు నివసించుచుండినహూణులను కాళిదాసు పేర్కొనుచున్నాడు. వంక్షు, లేక వక్షునది నేడు ఆక్ససు అని బరగుచున్నది. ఈనది ప్రవహించుదేశమునకు బాక్ట్రియా అని యీకాలపు పేరు. పూర్వము ఈదేశమునకు బాహ్లీకమని వ్యవహారము. హూణులు విజృంభించి పార

1 వినీతాధ్వశ్రమాస్తస్య వంక్షుతీరవిచేష్టనైః,......౬౭. తత్రహూణావరోధానాం భర్తృషు వ్యక్తవిక్రమం, కపోలపాటలాదేశి బభూవ రఘుచేష్టితమ్. ౬౮. పెక్కురఘువంశప్రతులందు వక్షులేక వంక్షు తీర అనుటకుబదులు సింధుతీర అని యున్నది. ఇట్లుండుటకు మల్లినాథుడు కారకుడు. ఆతనికి ఇక్షుశబ్దము బోధపడి యుండదు. ఆతనికి వేయేండ్లక్రిందటినాటిసంగతులు తెలిసియుండవు. వక్షునదిపే రాతడు వినియుండడు. అందు వలన వక్షు లేక వంక్షు అనుదానిని సింధుక్రింద మార్చియుండును. రఘువు కౌబేరదిశకు బోవునపుడు దక్షిణముననున్న సింధునదీతీరమును జొచ్చుననుట అసంగతము.

సీశమును జొచ్చి, సింధునదీతీరమువరకు వ్యాపించునప్పటికి ౬-వ శతాబ్దము ప్రారంభ మయ్యెను. హూణులింకను ఇంకునదీతీరమున నున్నకాలమందే కాళిదాసు రఘువంశ మును రచియించియుండును. కావున ఆతనికాలము క్రీ. శ. ౫-వ శతాబ్దపు నడిమికాలమని నిర్ణయించితిమి.

ఇంచుమించుగా కాళిదాసునకు సమకాలికుడగు సుబంధుని వాసవదత్తయందు వాత్స్యాయనునికామసూత్రప్రశంస కలదు. ఆతడు వింధ్యపర్వతము అందలి గజసమూహ ములను, సాంద్రములై మనోహరమగు సుగంధపరిమళములతో నిండియున్న మహారణ్య ములను వాత్స్యాయనునితోడను, రంజకములగు అనేకవినోద ఉపభోగములను వర్ణించు విషయములతో విరాజిల్లు ఆతని కామసూత్రములతోడను పోల్చెను. [1] సుబంధు చంద్ర గుప్తవిక్రమాదిత్యునికాలమందున్నవాడు గావున క్రీ. శ॥ ౪౦౦ ప్రాంతమునాటివాడుగా కన్పడుచున్నాడు.[2] సుబంధుకాళిదాసులకాలమునుబట్టి, వాత్స్యాయనుడు అంతకు బూర్వుడు; అనగా క్రీ. శ॥ ౪౦౦ నకు పూర్వుడు కావలయుననుట స్పష్టము.

వాత్స్యాయనునకు మల్లనాగుడని నిజనామము వాత్స్యాయను డనునది గోత్ర నామము.[3] రెండవనామమున నాతడు లోకమున బ్రసిద్ధుడయ్యెను. వాత్స్యాయనునిపేరు మల్లనాగుడని కోశకారులనేకులు వచించిరి. జయమంగలయందు యశోధరు డీవిషయమును విశదపరచినాడు.[4] కొన్ని పంచతంత్రపాఠములందు వాత్స్యాయనుడు, ఆతనికామసూత్ర ములు నుదాహరింపబడినవి. ఇది ఆతనికాలనిర్ణయమునకు సాధనమగువిషయము.

పంచతంత్రమున కొకవిధముగా ప్రాచీనపాఠ్యమనదగిన తంత్రాఖ్యవ్యాఖ్యాయిక యందు వాత్స్యాయనునిపేరు కానరాదు. కాని యందు ధర్మార్థములతోపాటు కామశాస్త్ర ముకూడ ఎఱిగియుండవలసినదని సూచింపబడియున్నది[5] తంత్రాఖ్యవ్యాఖ్యాయిక క్రీ. శ॥

---

1 వాసవదత్తా.

2 మహామహోపాధ్యాయ హరప్రసాదశాస్త్రిగారు రచించినవ్యాసమును చూడుడు. (J A S B, 1905, పుట 253)

3 అశ్వలాయనగృహ్యసూత్రమునందు వాత్స్యాయనుని వత్సగోత్రమున రెండుశాఖలు ఉదాహరింప బడినవి. (Bibliotheca Indica XIII. 10-6-7 పుట 875.)

4 "వాత్స్యాయన ఇతి స్వగోత్రనిమిత్తా సమాఖ్యా మల్లనాగ ఇతిచ సాంస్కారికీ" "ఆచార్యమల్లనాగః పూర్వాచార్యమతానుసారేణ శాస్త్రమిదం ప్రణీతవాన్."

5 "తతో ధర్మార్థకామశాస్త్రాని జ్ఞేయాని" అని Harward Oriental Series. Vol. XIV. వారి పంచతంత్రము పుట 1. హర్టెల్ (Hertel) పండితునిచే పరిష్కృతము.

౩౦౦ సంవత్సరములప్రాంతమున రచియింపబడినట్లు పండితులయభిప్రాయము.[1] అనగా తంత్రాఖ్యవ్యాఖ్యనాటికి క్రీ. శ. ౩౦౦ నాటికి ధర్మార్థములకువలె కామశాస్త్రమునకు కూడ శాస్త్రమర్యాద ప్రాప్తించెననియు, త్రివర్గసాధనమునకు కామశాస్త్రజ్ఞానము కూడ నావశ్యకమనియు స్పష్టమగుచున్నది. ఈగౌరవసిద్ధి క్రీ. పూ. ౩౦౦ నాటికి అనగా కౌటిల్యుని అర్థశాస్త్రరచనాకాలమునాటికి కామశాస్త్రమునకు లేదు. కావున అర్థశాస్త్ర—తంత్రాఖ్యవ్యాఖ్యరచనాకాలములనడుమ నెప్పుడో కామశాస్త్రము రచియింపబడియుండె ననుట నిశ్చయము[2]

కౌటిల్యుని యనంతరమే వాత్స్యాయనవిరచిత కామసూత్రములకు లోకమున బ్రసిద్ధి కలిగినది. వాత్స్యాయనుడు కామశాస్త్రమునకు, తన కామసూత్రములద్వారా నూత్నమర్యాద కలిగించినాడనుట విదితము. ఆతడు ఉత్సన్నప్రాయమైన కామశాస్త్రమును తాను శాస్త్రముగా సంతరించితినని చెప్పుకొనెను. కామసూత్రరచన కౌటిల్యునియనంతరము చిరకాలమునకు జరిగియుండనోపు. కాని తంత్రాఖ్యవ్యాఖ్యనాటికి క్రీ. శ॥ 300 నాటికి కామసూత్రములు లోకప్రసిద్ధములగుటబట్టి వాటిని మనసునందుంచుకొని పంచతంత్రకారుడు కామశాస్త్రము కూడ జ్ఞేయమని వక్కాణించినాడు. కావున వాత్స్యాయనుడు కామశాస్త్రమును ఇంతవఱకు విశదీకరించినదానినిబట్టి క్రీ. శ॥ 300 సంవత్సరమునకు బూర్వము రచించియుండునని నిశ్చయింపవచ్చును.

కాని యింతకంటె నెక్కువ నిశ్చితముగా వాత్స్యాయనునికాలమును నిర్ణయించుటకు బ్రయత్నించెదముగాక. అందులకు గావలసినసాధనములు కామసూత్రములయందే కనబడుచున్నవి. అందు మొదటిది: వాత్స్యాయనుడు కుంతలశాతకర్ణిశాతవాహనునిగురించి తెలిపినవిషయము. [3].

---

1 పూర్వోదాహృతమయిన పంచతంత్రమునకు లాన్మనుపండితుడు రచించిన అవతారిక—పుట X.

2 కౌటిలీయ అర్థశాస్త్రము శ్యామశాస్త్రిగారిచే పరిష్కృతము.—మైసూరుముద్రణము పుట. ౧౦. "పురాణమితివృత్తమాఖ్యాయికోదాహరణం ధర్మశాస్త్రమర్థశాస్త్రం చేతీతిహాసః."

3 ఈవృత్తాంతమును దొలుత చూపినది సర్: రామకృష్ణగోపాల భాండర్కరుపండితుడు. (చూడుడు Early History of Deccan. పుట ౩౧.) కర్తర్యా అన్నపదమున కాయన సరిగానర్థము చెప్పలేదు. కత్తెరతో పొడిచి చంపె నన్నభావమును దెలిపినారు. అది సరియైనదికాదు. కర్తరీ అనునది ఒకవిధమైన ప్రహారణము. కామమున చరించునాయకుడు ప్రయోగించు ఒకరీతి ప్రహారణయోగము. అది కామసూత్రమునందు కర్తరీ ద్వివిధా; భద్రకర్తరీ, శల్లకర్తరీ అని జయమంగలయందు గలదు. ఈద్వివిధములయిన కర్తరీప్రహారణయోగములు చతిప్రేక్షతో శిరసుపై ప్రయోగింపదగినవి. ఇవి చాలా క్రూరముగ నుండును. ఈకాలమునజరగు సీమంతవిధానము

"కర్తర్యా కుంతలః శాతకర్ణిః సాతవాహనో
మహాదేవీం మలయవతీం జఘాన."  సూ.

అని కుంతలశాతకర్ణి కామాతురుడై శిరసుపై కర్తరీప్రహారణయోగమును ఆచరించి, పట్టపుదేవియైన మలయవతిని జంపినాడని వాత్స్యాయనుడు దెలిపెను. పురాణములందు పేర్కొనబడిన ఆంధ్రశాతవాహనచక్రవర్తులలో కుంతల శాతకర్ణి పదమూడవవాడు.[1] ఈతనికి కుంతలస్వాతి, లేక స్వాతికర్ణ అని నామాంతరములు గలవు. ఈతడు క్రీస్తుశకారంభకాలమున నుండెనని పండితులు నిర్ధారణ జేసిరి.[2] కావున వాత్స్యాయను డితని తరువాతికాలమువాడు కావలయును.

వాత్స్యాయనుడు పెక్కుతావులందు ఆభీరులను ఆంధ్రులను పేర్కొనుచున్నాడు. ఈసందర్భము కూడ కామసూత్రములకాలమును నిర్ణయించుటకు వీలుకలుగజేయుచున్నది. ఆభీరరాజునుగురించి యొకచోట వాత్స్యాయనుడు.[3]

"ఆభీరం హి కొట్టరాజం పరభవనగతం
భ్రాతృప్రయుక్తో రజకో జఘాన"  సూ. ౧౨౪౪.

అని తెలిపెను.[4]

ఇట్లే మరియొక ఆభీరస్త్రీగురించి

"క్షత్రియసంజ్ఞకై రంతఃపురరక్షిభిరే
వార్థం సాధయంత్యాభీరకాణాం."  (సూ. ౧౩౭౫.)

అని గర్హ్యమైనవారిప్రవర్తనను దెలిపెను.

---

ఈకర్తరీప్రహారణమునుండి యేర్పడినదేమో ఆరయవలసియున్నది. కీలామురసి, కర్తరీం శిరసి, విద్ధాం కపోలయో, స్పందంశికాం స్తనయోః, పార్శ్వయోశ్చేతి పూర్వైస్సహ ప్రహారణమష్టావిధానీతి దాక్షిణాత్యానాం, తద్యువతీనాం మురసి కీలానిచ తత్కృతాని దృశ్యంతే, దేశసాత్మ్యమే తత్. సూ. ౫౪౪.

1 Pargiter: Dynasties of the Kali Age. పుటలు ౩౮-౪౦.

2 GBORS, Vol. III, పుటలు ౪౪౧,౪౪౨.

3 దీనితరువాతి సూత్రమునందు కాశిరాజగు జయత్సేనునిగురించి తెలుపుచున్నాడు. ఇతడెవరో చరిత్రకు బొత్తిగా తెలియనివాడు.

4 ఆభీరకొట్టరాజా వసుమిత్రుడను శ్రేష్ఠియొక్క భార్యను సంగమించుటకై ఆతనియింటికి ప్రచ్ఛన్నవేషముతో బోయెను. ఆతని యెట్టయిన జంపి, యాతనిరాజ్య మపహరింపదలచిన యాతనిసోదరుడు శ్రేష్ఠిభవనమున నందోకరజకుని రాజాగమనము కెఱిగియుండి యంతకుముందే ప్రవేశపెట్టి చంపించెను.

నాసికగుహాలం దొకచోట క్రీ. శ॥ మూడవశతాబ్దమునాటిది, ఆభీరశివదత్తుని కుమారుడైన ఈశ్వరసేనుని శిలాశాసనము కలదు. [1] ఇతడేలినరాజ్యము గూర్జర, సౌరాష్ట్ర, అపరావంతి దేశములందు వ్యాపించియుండెను. ఇతనివంశములోనివాడు మహాక్షత్రప ఈశ్వరదత్తుడు. ఇతనినాణెములపైనున్న సంవత్సరసంఖ్యలనుబట్టి పండితులు, ఇతడు క్రీ. శ॥ ౨౩౬-౨౩౯ సంవత్సరములందు రాజ్యమును పాలించెనని నిర్ణయించిరి. [2] ఈశ్వరదత్తుని యనంతర మొకశతాబ్దమునకు సముద్రగుప్తు డాభీరులను ఎదుర్కొని బరిమార్చెను. [3] కావున ఆభీరరాజ్యము, ఆభీరరాజవంశములును క్రీ. శ॥ ౨, ౩ శతాబ్దములనడుమ వర్ధిల్లినట్లు ఎంచవచ్చును.

అంధ్రులను గూడ వాత్స్యాయను డుదాహరించెను కాని ఆతడు పేర్కొనిన అంధ్రులు రాజశాతవాహనవంశజులగు చక్రవర్తులుగారు, దక్షిణాపథేశ్వరులును గారు. వారు స్థానికములైపోయిన చిన్నరాజ్యమునేలిన అంధ్రరాజులు—అంధ్రులవంటివారినే అపరాంతకులను, వాత్సగుల్మకులను, వైదర్భకులను, స్త్రీరాజ్య, గౌడరాజ్య వంగాంగకళింగ సౌరాష్ట్రకరాజులను, ప్రాచ్యులను పెక్కుమందిని వాత్స్యాయనుడు పేర్కొని వారి యాచారములను దెలిపినాడు. అంధ్ర-శాతవాహనరాజవంశ మంతరించినతరువాత దక్షిణాపథమంతయు చిన్నచిన్న స్థానికరాజ్యములక్రింద విడిపోయెనని పురాణములు వాకొనుచున్నవి. [4] అది క్రీ. శ॥ ౨౦౦ నాటికే జరిగెను. మహారాష్ట్ర-కుంతలమందు చుటుశాతకర్ణి బిరుదుధరించిన అంధ్రభృత్యులు, అంధ్రదేశమున శ్రీపర్వతీయులని బరగిన ఇక్ష్వాకులు, కొంకణమున కుత్తరభాగమున ఆభీరులు, ఇంకను గార్దభినులు, శకరాజులు రాజ్యముసేయ నారంభించిరి. వీరినందరిని ఇంచుమించుగా వాత్స్యాయను డుదాహరించుటచేసి అత

---

1 **Archaeological Survey of India, IV** సం. పుట. ౧౦౩. ఘూర్జరులనుగురించి దేవదత్త రామకృష్ణభాండార్కరు వ్రాసినది **J. B. B. A. S.** సం. **XXXI,** పుట. ౪౩౦) కూడ చూడుడు.

2 **The Western Kshatrapas** అను పండిత భగవాన్‌లాలు ఇంద్రాజీవ్యాసమును చూచునది. (**JRAS.,** 1890, పుట. ౬౫౭ ఆదిగా) ఈసందర్భముననే రాప్సనుపండితుని **Catalogue of the Coins of the Andhra Dynasty etc.** పుట **XXXIII.** ఆదిగా చూచునది.

3 ఫ్లీటు పండితుడు ప్రకటించిన గుప్తరాజులశాసనములు పుట. ౮.

4 పార్గిటరు పండితుడు తన **Dynasties of the Kali Age** అనుగ్రంథమునందు (పుట. ౪౫.) మత్స్యవాయుల-బ్రహ్మాండ-విష్ణుపురాణములనుండి పాఠములనెత్తి ఒక్కచోట ప్రచురించినాడు. సమన్వయమున పాఠమునందు "అంధ్రానాం సంస్థితే రాజ్యే తేషాం భృత్యాన్వయా నృపాః, సప్తైవాంధ్రా భవిష్యంతిదశాభీరాస్తథా నృపాః. సప్తగర్దభిన పంచాపిశకాపంచాష్టాదశైవతు." అని గలదు.

డించుమించుగా క్రీ. శ. ౨౩౦ ప్రాంతమున జీవించియుండిన ట్లూహింపదగును. ఈనిర్ణయ ముతో దేనికి వైరుధ్యము లేదు.

వాత్స్యాయను డేప్రాంతపువాడు? 'అతని నివాసమెద్ది? ఈప్రశ్నల కుత్తరము సులభముగాదు. చాలమం దతడు పాటలీపుత్రనగరవాస్తవ్యుడని వాదించెదరు. కాని ఆయూహకు ఆధారము లేదు. అది సమంజసమును గాదు. జయమంగల యీతప్పు అభిప్రాయమునకు గారణము. వాత్స్యాయను డెచ్చటను తనగ్రంథమునందు తాను పాటలీపుత్రవాసినని చెప్పుకొనలేదు. ఒకచోట 'పాటలీపుత్రక్యః' [1]అని యుండగా జయమంగలయందు 'నాగరకాః' [2]అనియు మరియొకచోట'నాగరిక్యః'అనియుండగా 'పాటలీపుత్రకాః' అనియు యశోధరుడు వ్యాఖ్యానముచేసినాడు. అట్లు రెండుపదములును ఒకపట్టణమునకే చెందియుండునని భ్రమచొప్పున వ్రాసినదానిని తరువాతివారు విశ్వసింపసాగిరి. తానే ఆధారమును పురస్కరించుకొని పాటలీపుత్రము నగరమని నిర్ధారణచేసినాడో యశోధరుడు తెలిపియుండలేదు. యశోధరునికి భరతఖండభూగోళపరిజ్ఞానము అంతగా లేదు. యశోధరుడు 'గౌడులను' కామరూపప్రాంతమున నివసించుప్రాచ్యులని వివరించినాడు. [3] ఇట్లే వంగదేశము, లోహిత్యాబ్రహ్మపుత్రానదికి తూర్పుననున్నదని తెలిపినాడు. [4] కళింగము గౌడదేశమునకు దక్షిణముననున్నదనియు, అంగదేశము మహానదికి దూర్పుగానున్నదనియు గూడ వచించినాడు. [5] ఇట్టి విరుద్ధవిషయములను వ్రాసినయశోధరుడు నగరము పాటలీపుత్రమును ఒక్కటియే యని వ్రాయుటయం దాశ్చర్యము లేదు. వాత్స్యాయనుడు దత్తకునిప్రసంగముచేసినపుడు పాటలీపుత్రమని స్పష్టముగా చెప్పినాడు. అతని కామసూత్రములం దెచ్చటను గూడ నగరపాటలీపుత్రము లొక్కటియేయని సూచించుధ్వని గూడ లేదు. విశేషించి రెండుభిన్నపట్టణములని గలదు. అవి రెండును ఒక్కపట్టణమునకే పర్యాయపదములగుచో ఒకసారి 'నాగరికానాం' మరియొకచోట 'పాటలీపుత్రకానాం' అనియు నుదాహరింప బనియుండదు కదా!

వాత్స్యాయనుడు భరతఖండభూగోళమును సమగ్రముగా నెఱిగినవాడుగా గన్పట్టుచున్నాడు. మరియు నాతనికి భరతఖండముయొక్క పశ్చిమభాగమును, దక్షిణాపథమును

1 తథావిధా ఏవ రహసి ప్రకాశంతే నాగరిక్యః సూ.

2 నతు స్వయమాపరిష్టకమాచరంతి నాగరకాః. సూ. వీటిపై వ్యాఖ్య చూడుడు పుట.

3 "గౌడాః కామరూపకాః ప్రాచ్యవిశేషాః" సూ.

4 "కలింగా గౌడవిషయాద్దక్షిణేన" సూ.

5 వంగా లోహిత్యాత్ పూర్వేణ అంగామహానద్యాః పూర్వేణ. సూ.

సమగ్రముగా దెలిసినట్లున్నది. అతడు వరుసగా సింధు, అవంతి, మాలవ, అపరాంతలాట, సౌరాష్ట్ర, మహారాష్ట్ర, విదర్భవనవాసకదేశములను పేర్కొనినాడు. దక్షిణాపథమున ఆభీరులను వాత్సగుల్మకులను, వైదర్భకులను, అంధ్రులను తఱచుగా పేర్కొనినాడు. దక్షిణదేశీయులను దక్షిణాత్యులని వ్యవహరించినాడు. ఒకచోట ఒకచోళరాజునుగూర్చి తెలిపినాడు. కాని యీచోళరాజేప్రాంతమువాడో తెలుపలేదు. రాజపుత్రస్థానము మొదలుకొని మగధపర్యంతముకలదేశములలో నొక్కదానిని గూడ నతడుదాహరింపడు. అతడు తెలిపిన మధ్యదేశము దేనికి సరిపోవునో తెలియరాదు. ఉత్తరపాంచాలరాజధానియగు అహిచ్ఛత్రమును అయోధ్యాముఖ్యపట్టణము సాకేతమును మాత్రము స్మరించినాడు. ఇందులకు రెండుకారణము లుండవచ్చును. వాత్స్యాయనునికి ఉత్తరాపథమునుగురించి దక్షిణాపథమునుగూర్చి తెలిసినంతగా తెలియకపోవచ్చును. కాదేని ఆతనినాడు ఉత్తరాపథము ఇంకను బ్రసిద్ధికిరానికతన పేర్కొనదగినరాజ్యము లాతనికి కన్పడకపోవచ్చును.

ఏదిఎట్లున్నను ఆతఁడు పశ్చిమహిందూదేశవాస్తవ్యుడనియు, ఆభీర, అంధ్రవైదర్భక రాజ్యములను బాగుగా నెరిగినవాడనియు నిస్సందేహముగ వచింపవచ్చును ఆతడు అంధ్రదేశమును, అంధ్రదేశీయుల నెరిగినవాడనుటకు ఆపస్తంబసూత్రముతో నాతనికిగల పరిచయము చాటుచున్నది. ఆపస్తంబు డాంధ్రుడని బూలరుపండితుని వాదము కదా!

ఇకముందు 'నాగరిక్యః, నాగరకాః' అన్నమాటలనుగూర్చి యించుక విచారింతము. ఆపేరులు రెండును ఒకయూరికి సంబంధించినవని యశోధరుఁడు కూడ నంగీకరించుచున్నాడు. ఆయూరియందు స్త్రీపురుషులకు సమానముగా వర్తించుపదములనుట సందియములేదు. సందర్భానుసారముగ నామాట లాయర్థమునే యిచ్చుచున్నవి. ఎందునుగూడ, ఆపదము జానపదములు, లేక గ్రామములలో నివసించెడిజనులుగా, భిన్నులయిన నగరవాసులన్న యర్థములో వాత్స్యాయను డుపయోగించి యుండలేదు. రాష్ట్రప్రజలు, జనులు మున్నగు వారితో సమానముగ 'నాగరిక్యః, నాగరకాః' అని ప్రశంసచేసినాడు. "అంధ్ర్యః, మహారాష్ట్రిక్యః, నాగరిక్యః, ద్రవిడ్యః, వనవాసిక్యః" అనుపేరులతో సమానముగా వాడినాడు. అట్లే, "అహిచ్ఛత్రకాః, సాకేతాః, నాగరకాః" అని కూడ ఉపయోగించినాడు. మొదటి

1 యశోధరుడు వత్సగుల్మకులను సోదరులు, క్షత్రియరాజకుమారులు దక్షిణాపథమునం దుండిరని తెలుపుచున్నాడు. వారు నివసించి పాలించిన స్థలమునకు వత్సగుల్మకమని పేరువచ్చెనట. "దక్షిణాపథే సోదర్యౌ రాజపుత్త్రౌ వత్సగుల్మౌ తాభ్యా మధ్యాసితో దేశో వత్సగుల్మక ఇతి ప్రతీతః" అని వ్యాఖ్య. వత్సదేశము బస్తరుగావచ్చును. విదర్భ అంధ్రమండలమును చేరియున్నదని వరాహమిహిరాచార్యు డనెను. "కౌలికవిదర్భవత్సాంధ్ర చేదికాః" అని సూత్రము. కాని ఆతనికి పిమ్మట అయిదువందలసంవత్సరముల తరువాత జీవించిన రాజశేఖరుడు కావ్యమీమాంసయందు (పుట. ౧౦) వత్సగుల్మకవిదర్భయం దొకనగరమని, "తత్రాస్తివిదర్భేషువత్సగుల్మం నామ నగరమ్" అని వ్రాసినాడు.

వరుసలో రాష్ట్రప్రజలక్రిందను, రెండవవరుసలో ఒకపట్టణవాస్తవ్యులక్రిందను సూచించుటకు వాత్స్యాయను డారీతిగా ఆపదముల నుపయోగించిన ట్లగపడును. కావున 'నగర' మనునది ఒకపట్టణమునకు పేరుగావలయునని తోచుచున్నది. ఇది ఎచ్చట నుండెనా యని ప్రశ్న చేసినపుడు, వాత్స్యాయనునికి సమగ్రముగా తెలిసిన భరతఖండభాగము పశ్చిమ ప్రాంతమని నిరూపించితిమి గావున నది పశ్చిమభాగమునందే యుండగలదని ఊహింపవచ్చును. రాజపుత్రస్థానమునందు శిథిలావస్థయందున్న స్థలమొకటి పూర్వము నగరముగా వ్యవహారింపబడినట్లు తెలియుచున్నది.[1] అది జయపూరునకు ౨౫ మైళ్లదూరమున నున్నది. అచ్చటి శిథిలములు నాలుగుచతురపుమైళ్లు వ్యాపించియున్నవి. అచ్చట ముద్రలు నొక్కబడిన ప్రాచీననాణెములు 'జయమాలవాన' అని బ్రాహ్మీలిపియందు లేఖ్యముగలవి లభించెను.[2] చితోరునకు సమీపముగా పదిమైళ్ల దూరమున నాగరి లేక తంబవతీ నగరీయను నొక ప్రాచీనస్థలము కలదు.[3] ఈరెండును వాత్స్యాయను డుదాహరించిన 'నగర'మునకు సరిపోవగలవుగాని, మొదటిదే వాత్స్యాయనుని నగరమని నిశ్చయింపవచ్చును పాణిన్యాచార్యులకాలమున నగరము మంచిదశ ననుభవించుచుండెను. ఆతడు కత్ర్యాదిగణమునందు నగరమును కూడ చేర్చినాడు. కాశికావివరణవృత్తియందు గణకత్ర్యాదియందు నగర ముదాహరింపబడినది.[4] ఈసందర్భములను బరిశీలించి చూడ, నగరము ఒక గణరాజ్యమని కన్పట్టుచున్నది. 'నగర' పట్టణమునుబట్టి అచ్చటివాస్తవ్యు లుపయోగించినలిపి నాగరలిపి మనకు సంక్రమించినది. నగరనివాసులయిన బ్రాహ్మణులు సంతతివారు, నాగరబ్రాహ్మణులని ఉత్తరదేశమునందున్నారు. కావున నగరమనుపేరుతో ఒకమహాపట్టణ ముండెనని నిశ్చయింపవచ్చును. వాత్స్యాయను డీనగరవాస్తవ్యుడు గావచ్చును. ఆతడు ఒక స్వతంత్ర గణరాజ్యమునకుజెందిన 'నగర' వాస్తవ్యుడగుటచే, నిర్భయముగా ఇతరరాజవంశములందును, ఇతరభూములందును వ్యవహారమందున్న దురాచారములను ఖండింప కలిగినాడు. 'నాగరికసమవాయ' మని తననగరప్రశస్తిని ఉగ్గడించుకొన్నాడు. ఆతనికి ధన్యవాదము.



1 Cunninghams' Report of the Archaeological Survey of India Vol. IV. 161—2.

2 ఈనాణెములనుగురించి వివరములు కన్నింగ్‌హాముగారి నివేదికయందు కలదు, చూడుడు. Archaeological Survey of India Vol. XIV. పుట. ౧౪౦.

3 కత్ర్యాదిభ్యో ఢకఞ. Panin IV 2. 95.

4 కత్ర్యాదిషు తు సంజ్ఞాశబ్దేన సాహచర్యాత్ సంజ్ఞానగరం పఠ్యతి కస్మిన్ నాగరేయకమితి ప్రత్యుదాహర్థమ్. IV. 1. 138.

# ఆంధ్ర నాటకరంగము

## శ్రీ ఉత్పల వేంకటఅప్పలాచార్యులుగారు.

లోకవ్యవహారమున కళలు అనంతములుగా కనబడినప్పటికిని వానిలో ముఖ్యముగా జనుల కుపకరించునవి అఱువదినాల్గుకళలని మనప్రాచీనులు పరిగణించిరి. ఈ అఱువదినాల్గు కళలలో జేరినవే కవిత్వము, గానము, అభినయము, శిల్పము, చిత్రలేఖనము అను అయిదును. వీనిని లలితకళలని అందురు. అనగా మనోజ్ఞములైనకళలని అర్థము. మనము శ్రావ్యమైన పాటను విన్నప్పుడుగాని కన్నులపండువగుదృశ్యమును చూచినప్పుడుగాని ఎంతఆనందమును పొందుదుము! అందుచేత లలితకళలపరమార్థము ఆనందమని తేలును. ఈ ఐదుకళలు ప్రత్యేకకళలుగా గోచరమైనప్పటికిన్ని, ఒక్కొక్కటి ప్రత్యేకించి ఆనందజనకమైనప్పటికిన్ని, ఒక్కొక్కటి ప్రత్యేకప్రతిభాసౌష్ఠవము గలిగి భావప్రాధాన్యమైనప్పటికిన్ని, ఇవి అన్నియు ఒకేకోవకు చెందినవగుటవలన ఏకగర్భజనితులగు సోదరీసోదరులవలెనో, చెలిమికత్తెలవలెనో అన్యోన్యాశ్రయములై పరస్పరసాహచర్యము చేసికొనును. కవిత్వముచేత గానము, గానముచేత కవిత్వము పరస్పరము సంస్కారము పొందుచు ఈరెండును అభినయమును ఆశ్రయించినప్పుడు ఆ అభినయము మెఱుగుపెట్టబడి మేళవింపబడి ప్రస్ఫుటమైన భావ ప్రదర్శనమునకు, రసస్థాయికి అవకాశమిచ్చును. ఇట్టి అభినయమునే నాట్యము అందుము. అర్థాత్తు సుఖదుఃఖసమన్వితమగు లోకస్వభావమును ఆంగికాదులగు అభినయాదులచే వ్యక్తపఱచుట నాట్యమనబడును. మఱియు శృంగారాదిరసముల కాశ్రయులైన నాయకులఢునికిని అనుకరించుటనైతేము నాట్యమనిపించుకొనును. నాట్యకళాసృష్టికర్త యనబడు భరతాచార్యులవారు నాట్యశబ్దార్థమును ముక్తసరిగా "నానాభావోపసంపన్నం, నానావస్థాంతరాత్మకం, లోకవృత్తానుకరణం, నాట్యమేతన్మయా కృతమ్. యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః, సోఽఙ్గాదభినయైర్యుక్తో నాట్యమిత్యభిధీయతే." "అనగా వివిధములైనభావములతోడను, అవస్థలతోడను గూడుకొని లోకవ్యాపారానుకరణమైనది నాట్య మనబడును. మఱియు సుఖదుఃఖసమన్వితమైన లోకస్వభావము ఆంగికాద్యభినయములతో గూడియున్నదియు నాట్య మనిపించుకొనును" అని అనెను. ఈనాట్యశాస్త్రము అతిప్రాచీన మైనదనియు, దేవతలప్రార్థనానుసారముగా చతుర్ముఖుడు నాలుగువేదములసారమగు నాట్య వేదమును దేవతలకు ప్రసాదించినాడనియు, ఆదేవతలమూలకముగా ప్రాచీనమహర్షులకు

సంక్రమించిందనియు, ఆమహర్షు లీవేదము 'ధర్మ్యం, బుద్ధివర్ధనం, ఉపదేశజనకం, వినోద కరణం' అని విశ్వసించి లోకమునకు ఉపదేశించినారనియు మనకు ప్రామాణికవాక్యము లున్నవి. భరతాచార్యులకు పూర్వమే యీశాస్త్రం ప్రచారములో నుండినను రానురాను కాలచక్రభ్రమణములో బడి కొంత మాలిన్యమును పొందినది. భరతాచార్యులవారు అది పరికించి అందలికుళ్లను ఎత్తిపారవేసి నూతనచైతన్యమును బుట్టించి, కట్టుదిట్టములుచేసి నాట్యకళోద్ధరణముగావించెను. ఈకారణమునుబట్టి భరతాచార్యులవారిని ఒకవిధమున 'నాట్యకళాబ్రహ్మ' అని అనుట కలదు.

మనోగతాభిప్రాయములను వ్యక్తపఱచుటకు భాష యెట్లు సాధనముగా ఉపకరించుచున్నదో అభినయముగూడ అట్లే ఉపకరించుచున్నది. భావనాశక్తిగలకవిలో భాష కావ్యపరిణామాన్ని పొందును. భావనాశక్తిగలనటునిలో అభినయం నాట్యపరిణామాన్ని పొందును మనము భాషను మాట్లాడునప్పుడు తెలుసుకోనకయె అభినయము చేయుదుము. ఆంగికాదులు చలించకుండ బిఱ్ఱబిగుసుకొని మాట్లాడుట సాధ్యమవునా? కాదు. కాబట్టి భాషకు అభినయమునకు అవినాభావసంబంధ మేర్పడియుండుట రూఢము. ఈభాషే కావ్యము. ఈ అభినయమే నాట్యము. కావ్యనాట్యకళాసమ్మేళనమే నాటకము. అనగా నాటకమున లలితకళలన్నియు పాల్గొపంచుకొని మేళగింపు పొందుటచేత నాటకమును లలితకళాప్రదర్శనమనిగూడ చెప్పవచ్చును. ఒక్కొక్కకళయే ఆనందదాయకమైనప్పుడు ఐదుకళల సమ్మేళన మెంత ఆనందదాయకమై యుండునో వేఱే చెప్పనక్కరలేదు గదా!

కావుననే మనప్రాచీనకవులు 'కావ్యేషు నాటకం రమ్యం' అని,'నాటకాంతం కవిత్వం' అని, 'నాటకాంతం హి సాహిత్యం' అని పరిపరివిధముల నాటకప్రాశస్త్యమును ఉద్ఘోషించిరి. నాటకములను దృశ్యకావ్యములని, రూపకములనిగూడా అందురు. రసాత్మకములై, ఆపాతమధురములై ప్రత్యక్షానందమునిచ్చునవికాబట్టి శ్రవ్యకావ్యాలకంటె దృశ్యకావ్యాలే సర్వవిధముల ఉత్తమోత్తమములైనవనియు, వినోదదాయకములనియు, విజ్ఞానప్రబోధకములనియు మనపూర్వపుమహాకవులు ఘంటాపథముగా జెప్పిరి.

మన పూర్వపుకవులు సంస్కృతమున అనేకనాటకాలు వ్రాసి నాటకకళను చరితార్థం జేసిరనుట నిర్వివాదాంశము. వారిలో ముఖ్యముగా భాసుడు, కాళిదాసు, శూద్రకుడు, భవభూతి మున్నగువా రగ్రగణ్యులు వీరిరచితములగు ప్రతిమానాటకము, శాకుంతలము, మృచ్ఛకటిక, ఉత్తరరామచరిత్ర యిత్యాదులు నాటకకళను మూర్తీభవింపచేసికొని సార్వకాలికులకును ఆదర్శప్రాయములై సుస్థిరముగా నిలిచిఉన్నవి.

ఆంధ్రనాటకరంగము.

సంస్కృతవాఙ్మయసాగరాన్ని సర్వతో ముఖాలా మథించిన మనప్రాచీనాంధ్రకవి శేఖరులదృష్టి నాటకాలపై ప్రసరించకపోవుట దురూహ్యం. సంస్కృతకావ్యేక్షుఖండాలను గానుగలో త్రిప్పి, పిప్పినిపారవేసి ఆచెఱకురసాన్ని కడుపారద్రావిన మహారసికవరేణ్యులగు ఆంధ్రకవిబ్రహ్మలకు నాటకరచన ఒకకష్టమా? చెఱకుపానకమును త్రాగినవానికి 'బెల్లం' వెగటైనట్లు, కడుపునిండినవానికి గారెలు కసరైనట్లు ప్రబంధరచనామృతపానమత్తచిత్తులై యుండినకవివర్యులకు నాటకములపై వెగటుదోచి ఉండవచ్చు. కారణం 'ఇదమిత్థం' అని రూఢిగా మనము చెప్పలేముగాని ఆమహామహులు నాటకరచనకు పూనుకొనకపోవుట మన దౌర్భాగ్యమని అనవలసివచ్చును. కాబట్టి మన ప్రాచీనాంధ్రకవివర్యులకాలంలో సంస్కృత నాటకాలుతప్ప ఆంధ్రనాటకాలు లేవనుట సాహసంకాదు. అప్పటికి నాటకాలస్థానే కేవలం పామరజనరంజకాలుగావుండే వీథిభాగవతాలు, యక్షగానాలు, జంగంకథలు, తోలుబొమ్మ లాటలు యిత్యాదులు ఉండెడివి. వాటిలో నాట్యం, సంగీతం కొంత ఉండినప్పటికిన్నీ ఆకళలు నిర్జీవప్రాయంగా ఉండి పండితజనరంజకములుగాక, శాస్త్రీయమర్యాదలు లేక రసాభాసాలుగా ఉండేవి.

ఇట్టి పరిస్థితులలో, సుమారు ఒకశతాబ్దానికిలోపుగానే ఏ అఱవై, డెబ్బై సంవత్సరాలకుపూర్వము పార్సీకంపెనీవాండ్లు మనదేశంలో పర్యటననాటకప్రదర్శనాలు చేయుచు వచ్చిరి. ఈప్రదర్శనాలు చూచినమాత్రముననే (అంతకుముందు వీథిభాగవతాలు, యక్షగానాలు యిత్యాదులుమాత్రమేచూచి విసుగెత్తి ఉండుటచేత) మనవారికండ్లు నూతనవికాసాన్ని పొందినవి. పార్సీవారినాటకాలు వీథిభాగవతాలఫక్కీలోగాకుండా పార్సీమెట్లతో పాటలు, చిత్రవర్ణపుతెరలు, రంగవస్తుపరికరాలు, నటకులవిలువగలదుస్తులు, తబలా హార్మోని యపువాద్యాలు యివన్నీ ఒకనూతనసౌందర్యాన్ని పుట్టించి, మనవారిహృదయాలను తేకెత్తించి, ఆనందపరవశులనుజేసినవి. పార్సీకంపెనీవాండ్లు దేశమంతటను పర్యటనంచేయు ప్రదర్శనాలనుజూపించుచు జనులను తన్మయులుగాజేయుచు ఎంతోడబ్బును దోచుకొనిపోవు చుండిరి. అప్పుడు మనవారిలో ఒకనూతనసంచలనం బయలుదేరెను. పార్సీవారివలెనే తాము గూడ నాటకప్రదర్శనాలను జేయవలెనని యనుకొనిరి. సంపన్నులుగా నాట్యకళాపిపాసకులు అక్కడక్కడ చిన్ననాటకకంపెనీలు ప్రారంభించిరి. అప్పటిలో ప్రదర్శనార్హములైననాటకాలు లేకపోవుటచేత సుప్రసిద్ధకవులచేత తెనుగునాటకాలు వ్రాయించుకొనసాగిరి. క్రమముగా నటకులనుగూడా కొందరిని తరిఫీదుచేయుచు నాటకాలను ఆడుతూవచ్చిరి. నటకులలో ఎవరో కొందరుతప్ప మిగతవారు ప్రతిఫలాన్ని అపేక్షింప

కయే ప్రదర్శనాల్లో నటిస్తూవచ్చిరి. దినదినాభివృద్ధిగా నాటకసమాజాలు ఏర్పడుతూ వచ్చెను. వీటిలో సురభికంపెనీవారు దేశమంతయు ప్రఖ్యాతిపొందిరి. ఇంకను రాజమండ్రిలోని చింతామణినాటకసమాజం, బళ్లారిలోని ధర్మవరం కృష్ణమాచార్యులుగారి కంపెనీ చాలా ప్రసిద్ధికెక్కినవి. చింతామణి సమాజంవారు తమకుకావలసిననాటకాలను సుప్రసిద్ధకవివర్యులును, ఆంధ్రాస్కాటు అని పేరుబడసిన శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారిచేత వ్రాయించుకొనుచు వాటిని ప్రదర్శింపసాగిరి. ఆంధ్రనాటకపితామహ బిరుదాంచితులగు ధర్మవరం కృష్ణమాచార్యులుగారు తమనాటకసమాజానికే ఎన్నో నాటకాలు రచియించి, తానుగూడా వాటిలో నటించిరి. కందుకూరి వీరేశలింగంగారి శాకుంతలం సంస్కృతానువాదమైనప్పటికి నాటకరంగంలో ప్రసిద్ధిబొందిఉండేవి. ఈనాటకాల్లో ఉండువిశేషమేమన పార్సీమెట్లతో పాటలు, ఎక్కువపద్యాలు ఉండేవి. మఱియు నటులకు వెల్వెట్ దుస్తులు, మనోహరములగు ప్రకృతిదృశ్యములు, తీగెపనులు ఉండుటచేత నాటకప్రదర్శనాలు రామణీయకములై ఆకర్షణీయములై ఉండేవి. ఆర్థికంగాకూడా విజయవంతంగా ఉండేవి. నటకులు పద్యాలు, పాటలు, శ్రావ్యంగా పాడుటచేతను, వాచికాంగికాహార్యాది అభినయములందు నైపుణ్యమును జూపుటచేతను ప్రజలు విస్తారంగా ప్రదర్శనాలను జూచి ఆనందాన్ని పొందుతూ ఉండేవారు. ఇది ఆంధ్రనాటకరంగంలోని ప్రథమదశగా మనం భావించవచ్చు. ఈదశలో మొత్తంమీద నటకులైతేనేమి, నాటకసామాజికాదిష్ఠాతలైతేనేమి, తమవిధ్యుక్తధర్మాలను నెఱవేర్చుకొనుచు ధనాశాపిశాచావహితులుగాక నాటకకళాభ్యుదయానికి చేతులుగలుపుకొని పనిచేసిరనుట అతిశయోక్తిగాదు.

ఇక ఆంధ్రనాటకరంగపు రెండవదశను విచారించినచో సుమారు 10 సంవత్సరాలని అంచనావేయవచ్చు. అనగా 1920 లగాయతు 1930 వఱకు ఈదశలో నాటకరంగనిర్మాణంలో గుణప్రాధాన్యమైనమార్పు ఏర్పడింది. నటకులఅభినయాది కౌశలమును చర్చించి వారివారి ప్రత్యేకవిశిష్టతలను నిర్ణయించింది ఈదశయే. అంతకుముందు ఏర్పడియున్న నాటకసమాజాలు జేగీయమానంగా పనిచేయుచుండెడివి. వాటిలో ప్రసిద్ధికెక్కినవి ఏలూరులోని సీతారామాంజనేయసమాజం, బెజవాడలోని మైలవరంకంపెనీ, తెనాలిలోని రామవిలాససభ. ప్రజలు యీసమాజాలయొక్క విశిష్టత్వాన్నిబట్టియే ఆదరింపసాగిరి. సమాజాలవారు పౌరాణికనాటకాలేగాక కొంతవఱకు చారిత్రక, సాంఘికనాటకాలుగూడ ప్రదర్శించుచుండిరి. కాని పౌరాణికనాటకాలకే యెక్కువ విలువవుండేది. శాకుంతల

నాటకంలో యడవల్లి సూర్యనారాయణగారి దుష్యంతపాత్రను, సావిత్రీనాటకంలో ఉప్పులూరి సంజీవరావుగారిసావిత్రీపాత్రను; కృష్ణతులాభారంలో రోషనారలో స్థానం నరసింహారావుగారి సత్యభామారోషనారపాత్రలను జూచి ప్రజలు తన్మయులై ఆనంద బాష్పములు విడిచేవారు ఇట్లే మఱికొందఱు నటకులు ఉచితపాత్రలను ధరించి ప్రేక్షకుల నానందడోలికలలో ఊపుచూవచ్చేవారు. క్రమేణ నాటకములవిలువకంటె నటకుల ప్రతిభయే గణ్యతలోకి రాసాగెను. చివరకు నాటకమేదైనా, రంగపరికరాలు ఎట్లున్నా, పాత్రధారణలెట్లున్నా నాటకప్రదర్శనయొక్క ఔచిత్యమెట్లున్నా ప్రేక్షకులు లెక్కచేయక ప్రసిద్ధనటకుడు ప్రదర్శనంలో పాల్గొనివుండుటయే ప్రధానంగా భావించిరి. ప్రఖ్యాత నటకులకీర్తి మూలమూలల వ్యాపించియుండుటచేత ఆయడవల్లో, సంజీవరావో, స్థానమో, మఱొకరో నటించెదరనగనే జనం ఇసుకవేసినరాలకుండా పల్లెటూళ్లనుండి చద్దిమూటలతో, చంటిబిడ్డలతో మగఆడఅందఱూ ఎగబడుతూవచ్చేవారు. బెజవాడలో సావిత్రీ నాటకం వేసెదరనగనే ఒంగోలు, నెల్లూరుప్రాంతాలనుండి రైలుచార్జీలు, భత్యఖర్చులుపెట్టుకొని పోయేవారికి లెఖలేదు. నటకులకౌశలానికితోడు నాటకరంగంగూడా మునుపటికంటె చక్కనిసెట్టింగులు మనోహరములైనసీనులు, వివిధములైనదీపములు మున్నగువాటిచే ఎంతోసొంపుగా నుండెడిది. కాని విఖ్యాతనటకుడు రంగంమీదికిరాగానే ఒన్సుమోరులతోనూ, కరతాళధ్వనులతోనూ, బహూకృతవాక్యములతోనూ, ఆతనిని ప్రేక్షకులు సమ్మానించుచు కర్పూరహారతులిచ్చుచువచ్చిరి. సన్మానింపబడేనటకులలో కొందఱు తమ అసామాన్యనాట్యకళావైదుష్యమును, సర్వజ్ఞత్వమును మఱింత ప్రకటించుకొనుచు ప్రతిష్ఠింపజేసికొనుచుండెడివారు, సామాన్యులగు సహాయనటకులు ఈనటశేఖరులకు ఉచితరీతిగా తోడ్పడుతూ ఔచిత్యంచెడకుండా పోషించుకొనుచుండిరి. నటశేఖరులు తమ సర్వజ్ఞత్వప్రకటనలో కించిల్లోపాలకు పాత్రులైనా, నటకులు అందఱు సామాజికసభ్యులుగా వుండుటచేతను, ఏకగోష్ఠిగా క్రమశిక్షణం పొందుటచేతను, ఒద్దికలు (Rehearsals) ముందుగా జరుపుకొనియుండుటచేతను, నటకులవేషధారణ, దుస్తులు, సంగీతం, అభినయం, రంగపరికరాలు ఉచితరీతిగా ఉండుటచేతను, నటకులందఱు సామాజికాధ్యక్షుల హద్దుఆజ్ఞలకు బద్ధులై యుండుటచేతను, సామాజికాధ్యక్షులుగాని, నటకులుగాని ద్రవ్యార్జనాయత్తచిత్తులుగాక నాట్యకళారాధకులై నాట్యకళాపోషకులై యుండుటచేతను నాటకప్రదర్శనములు రసాత్మకములై ప్రేక్షకుల కానందదాయకములై యుండెడివి. నటులలో 'ఎక్కువమంది నెలవేతనములుగొనుచు నాట్యకళారాధనతత్పరులై తమతమ

సమాజములకును, సామాజికాధిష్ఠాతలకును కీర్తిప్రతిష్ఠలను తెచ్చుచుండెడివారు. మొత్తం మీద ఈదశలో నాటకప్రదర్శనాలు సర్వవిధాలా ఉత్తమోత్తమాలుగా వుండుటచేత ఇది నాటకరంగజీవితంలో స్వర్ణదశ అని అనిపించుకొనును. ఈదశలో ఆంధ్రనాటకరంగ రాజ్యలక్ష్మి సర్వాభరణభూషితయై, సర్వాలంకారశోభితయై ఘల్లుఘల్లుమనే కాలిఅందియలతో, మొలనూలుఘంటలతో ఆంధ్రావనియందు నాట్యంచేసి, తనప్రియపుత్రుల నీరాజనములను జోహారులను అందుకొన్నదనుటలో అతిశయోక్తిలేదు.

బీజాంకురితమై, దినదినప్రవర్ధమానమై, కోరకితమై పుష్పించెడునాట్యవల్లరికి ఈ స్వర్ణదశాంతములో చీడపురుగులుపట్టినవా అనేసంశయాలు గాన్పించినవి. ఈసమయంలోనే కిన్నెరవంటిగాత్రంతో కపిలవాయి రామనాథశాస్త్రిగారు నాటకరంగంలోకి ప్రవేశించిరి. వీరిలో అభినయాదినాట్యకళావైలక్షణ్యములు అంతగా గోచరింపకపోయినను వీరిశారీరంలో రవలుబల్కుతూవుండేవి. రంగస్థలంలో ఏపాటో, పద్యమో పాడి ప్రేక్షకులను 'హాయి, హాయి' అనిపించి ముగ్ధులనుజేసెడువాడు. వీరి శ్రావ్యమైనపాటలకు పద్యాలకు తన్మయులై గ్రాంఫోనుకంపెనీవారు ఎగబడి రికార్డుచేసికొనిరి. మూలమూలల శాస్త్రిగారిపాటలు వినబడుచు ఉండేవి. వీరియొక్క గ్రాంఫోనుయశస్సు మిన్నుముట్టింది. స్టేజీమీదికివచ్చినతోడనే ప్రజలకు వీరిపాటలను, పద్యాలను వినవలెననెడుకుతూహలం పెరిగిపోవుచుండెను. తుదకు ప్రదర్శించెడునాటకానికి సంబంధించినను సంబంధించకపోయినను రికార్డు యిచ్చినవన్నీ వీరిచేత ఏకరువుపెట్టించి ఆనందాన్ని పొందవలెననేపిపాస ప్రేక్షకులలో నాటుకొని పోయింది. శాస్త్రిగారును వచ్చినజనాన్ని యేదోవిధంగా తృప్తిపఱచకతప్పేదికాదు. ప్రేక్షకులకు ప్రదర్శించేనాటకం ఎవరిది? పాత్రౌచిత్యం ఎట్టిది? ప్రదర్శనలోని లోటుపాటు లేవి? అనేగొడవ అక్కరలేకుండాపోయెను. 'రామనాథశాస్త్రిగారు నటిస్తారు' అనుటతోడనే జనం విఱుగద్రొక్కుకొనివచ్చి, హాలులో క్రిక్కిరిసిపోయెడిది. కమ్మగా వారుపాడేవి విని ధన్యులైనామని చేతులుదుడుపుకొని పోతూఉండేవారు. ఇక్కడ రామనాథశాస్త్రి గారిని విమర్శించుట ప్రసక్తిగాకపోయినను వీరిరంగప్రవేశమే రంగంలో సంగీతానికి అగ్రతాంబూలం ఇప్పించిందని చెప్పవచ్చు. వీరిని అనుకరించుచు కొందఱునటకులు పద్యాలను విఱిచి విఱిచి పాడుట యెక్కువగా రాగాలాపనాదులుచేయుట ఆరంభించిరి. క్రమంగా నాటకరంగంలో ఇటుకర్ణాటకసంగీతం అటుహిందూస్తానీసంగీతంగాక కలగాపులగంవలె ఒకవిధమైన మిశ్రసంగీతం దిగుమతి అయినది ఇంచుమించుగా ఈసంగీతమే ఆంధ్రదేశమంతటను భగవంతునివలె సర్వవ్యాపకత్వమునుపొంది సంగీత మనిపించుకొనుచున్నది. నాటక

రచనగూడా దినదినప్రవర్ధమానమవుచు కొంతకవిత్వలక్షణం దెలిసినవాడల్లను నాటకకర్త అయ్యెను. లేనిచో చిత్రజల్లులు, ఊకదంపుళ్లువంటి రైలునాటకాలు వందలకొలదిగా ఎట్లు మనకు గోచరమవును? 'నాటకాంతం కవిత్వం' పోయి 'నాటకాద్యం కవిత్వం' అయినది — నాటకరంగంలో సంగీతము ప్రాధాన్యముగా నుండుటచేత ప్రజలు విశేషముగానే వచ్చు చుండిరి. ద్రవ్యంగూడా బాగానే వసూలుఅవుతూవుండేది. కాని నాట్యకళను సంగీతానికే బలియిచ్చినట్లైంది. చిన్నచిన్న నాటకసమాజాలవారు గానవిశారదులగు నటకులపై వ్యామోహమును ఆపుకొనలేక ప్రదర్శనసమయములలో నటించుటకు వారిని ఆహ్వానించుచుండిరి. ఇట్లే ప్రతిసమాజాలవారున్నూ ప్రఖ్యాతనటకుని ప్రదర్శనసమయమునకు ఆహ్వానించేపద్ధతి అల్లుకొనిపోవుచువచ్చెను. క్రమముగా సమాజములకు జెందిననటకులు మెల్లగా సమాజాల నుండి జారుకొనుచుండిరి. సమాజాలు కొంతకాలమునకు నామమాత్రావశిష్టములై నేతి బీరకాయలైనవి. నటకునియశస్సునుబట్టి జనంపర్లపడేదేకాని, క్రొత్తగావచ్చిన నటకశిరోమణికి, సమాజాలలోని సామాన్యనటకులకు ముందు ఒద్దికలు లేకపోవుటచేత వీరికి వారికి పొత్తు కుదురక నాటకం రసాభాసమగుచునే ఉండేది. కాని అమాయికులగుప్రేక్షకులు ప్రఖ్యాతనటకుని శ్రావ్యకంఠధ్వనిలో లీనమైపోవుచుండెడివారు గాబట్టి నాటకమందలి లోపాలను గ్రహింపలేకపోయేవారు. విమర్శనాబుద్ధిగలవారు మాత్రం రంగసంగీతంలో నాటకలోపాలన్నీ దాగుడుమూతలాడుచు ఉన్నవని గ్రహించుచువచ్చిరి. నాట్యకళా దృష్టితో చూచెడువారికి నటకులఅభినయాదులు తీర్థానికి తీర్థం ప్రసాదానికి ప్రసాదంగానే ఉండెడివి. నటకులను ప్రదర్శనాలకు గుత్తకుతీసుకొనుపద్ధతి అంటువ్యాధివలె వ్యాపించినది. సమాజం అని పేరుపెట్టుకొన్నవారందఱును ఈపంథానే త్రొక్కుతూవచ్చిరి. ఆహ్వానం అందగానే నటశేఖరులు వెళ్లి పాల్గొంటూవచ్చిరి. ఆంధ్రనాటకరంగసామ్రాట్ అనబడు బళ్లారి రాఘవాచార్యులవారే అనేకనాటకాల్లో, సమాజాలతరఫున పాల్గొంటూ వచ్చిరి. కొందరు నటకావతంసులు ఒకేరాత్రి రెండుచోట్ల వేత్వేఱునాటకాల్లో నటించిన ఘట్టాలూ ఉన్నవి. క్రమంగా నటకులులేనిసమాజాలుగా పరిణమించెను. అందుచేత నాటకప్రదర్శనానికి భటునిపాత్రమొదలు రాజవేషమువఱకు నటకులను వెదుక్కొనవలసి వచ్చెడిది. అందరిని గుత్తకుతీసికొనిననేగాని ప్రదర్శనంజేయుటకు వీలుపడేదిగాదు. ఈ గుత్తకుతీసికొనేపద్ధతివలననే నాట్యరంగానికి అధోగతిపట్టినది. నాట్యకళ కళావిహీనమై పోయినది. ఈగుత్తపద్ధతిలో నాటకమునకు కావలసినపాత్రలందఱు ఒక్కొక్కప్పుడు దొరికేవారుగారు. అందుచేత కొందఱిపాత్రలను లోపింపిచేయుటయు ఆమూలమున కొన్ని

సంభాషణలు లుప్తపఱచుటయు జరుగుచుండెడిది. ఈదెబ్బతో నాటకకళ అగాధంలోపడినది. ఆత్మహత్యకు ఆయత్తపఱచుకున్నది.

ఈవిషమపరిస్థితులలోనే కంట్రాక్టర్లనుపేరుతో ఒకజట్టు బయలుదేరిరి. వీరు నాటకరంగాన్ని చేపట్టుటచే ఆంధ్రనాటకరంగముయొక్క మూడవదశ కంట్రాక్టర్లదని చెప్పవచ్చును. వీరి ఆశయము, ఆదర్శము ద్రవ్యంమాత్రమే. కాబట్టి నాటక ప్రదర్శనాలను ద్రవ్యోపార్జనకు వ్యాపారసాధనంగా వినియోగించుకొనిరి. దీపముఉండగనే చక్కబెట్టుకొనవలెననేపద్ధతిలో ద్రవ్యోపార్జనమే పరమావధియని నిశ్చయించుకున్నారు. పేరుగలనటకులనుదూర్చి నాటకాలుఆడినచో జనం ఎగబడుదురనియనుకున్నారు. పిమ్మట బ్రహ్మాండముగా ఫలానివారు నటింతురని ప్రకటనలు ఆరంభించేవారు. జనం విఱుగద్రొక్కుకొనుచు వచ్చెడిదికాని వీరు తుడుందగ్గఱనుండి దేవతార్చనవఱకు అన్నీ గుత్తకేతీసికొనవలసియున్నది. చచ్చీచావనిసమాజాలకు తుక్కుసీనులైనా ఉండేవి. వీరికి అవియునులేవు. ఏసావడో, ఏవడ్లమిషనుకొట్టో బాడుగకుదీసికొని, నాలుగు తెరలు ఎక్కడనైనను దేబిరించెడువారు. నటకులు ఇక సరేగదా. ప్రదర్శనం తయారు. ఈనటకులలో ఒకడు బళ్లారినుండి, మఱిఒకడు తెనాలినుండి, ఇంకొకడు విశాఖపట్టణంనుండి వచ్చేవారుగాబట్టి ఒకరొకరికి వేషధారణంలోగాని, అభినయంలోగాని, సంభాషణలోగాని ఎట్టి సామరస్యమైననులేక అధ్వాన్నంగా ఉండేది. ఏవో కమ్మని నాలుగుపద్యాలు, పాటలు ఊపిరాడకుండునట్లు స్టేజిమీదినుండి కుమ్మరించుసరికి ప్రేక్షకులు తన్మయులైపోయేవారు. కేవలం పాటకచ్చేరీలుగాకపోయినను ఒకవిధముగా స్టేజిసంగీతమునకు ఆ అకారపు అసహ్యపుదొర్లుడు పల్టీరాగాలాపనలకు ప్రజలు ముగ్ధులైపోవుచుండిరి. కొందఱు కంట్రాక్టర్లు జనాకర్షణమునకు అసత్యపుప్రకటనలుచేయుచు జనమునుమోసగించుచుండేవారు. కంట్రాక్టర్లకు నటులకుమధ్య డబ్బుదగ్గర పేచీలువచ్చెడివి; ఈతగాదాలు కొన్నికొన్నిసందర్భములలో ప్రేక్షకులే పరిష్కరించేపరిస్థితికి రావడంగూడా వచ్చెడివి. నటులలోగూడా గొందఱు ఇదేసమయమని ఒప్పుకున్న మొత్తమునకంటె తెరయెత్తుసమయమునకు ఎక్కువడబ్బుగోరుటయు విధిలేక నాటకం ఆభాసమవునని కంట్రాక్టర్లు ఒప్పుకొనుట తటస్థించెడిది. కంట్రాక్టర్లదృష్టిఅంతయు టిక్కెట్లవసూళ్లమీదనేవుండెడిది నటకులుగూడ నాలుగురాళ్లు చేతిలోవేసుకొనిపోవుటయే తమకర్తవ్యమని యెంచి, ప్రదర్శనములో కొన్నికొన్ని రంగాలు సంభాషణాదులు దిగమ్రింగుతూవుండేవారు. కంట్రాక్టర్లు ప్రదర్శనాలు ముగియగానే అంతర్ధానాన్ని పొందుతూవుండేవారు. ప్రేక్షకులలో గొందఱు ప్రదర్శించెడు నాటకపుప్రతిని చేతిలోబెట్టుకొని అన్నిరంగాలు సక్రమముగా జూపుతున్నారా యని సరిచూచు

కొనుచు, వారు వదలిపెట్టినప్పుడు సంజాయిషీకోరుచు బలవంతమాఘస్నానం చేయించుచు వచ్చిరి. తలవెండ్రుకలన్ని లోపాలతో నాటకరంగం ఈవిధంగా ఖూనీచేయబడినది. ఇట్టి హీనపరిస్థితులలో నాటకరంగం ఎంతకాలం సజీవంగా ఉండగలదు ?

అగ్నికి వాయువు సహాయమైందన్నట్లు నాటకకళాదీపము మిణుకుమిణుకుమని ఆరిపోవుటకు సిద్ధంగా ఉన్నప్పుడు టాకీసినీమాల ప్రచండవాయువు ఒకవిసరుకొట్టింది. 'సినీమాలు వచ్చి నాటకాలను నాశనంజేసినవి' అని అందురుకాని, 'క్రొత్త ఒకవింత పాత ఒకరోత' అన్నట్లు సినీమాలవ్యామోహంలోబడి నాటకకళను పుట్టికి స్వర్గానికి గాకుండా జేసినది మనమే అని ఒప్పుకోకతప్పదు. వేలకువేలు ఫిలింకంపెనీలకు ధారపోసే ఆంధ్రమహానీయు లున్నారుగాని నాటకభిక్షువుకు చారెడుబియ్యంపెట్టేదాత కనుపించడు. కాల ప్రభావమా? వేలంవెర్రా! దేశదౌర్భాగ్యమా! ఏదో అనిర్వాచ్యం! వాస్తవంలో సినీమా కళకంటె నాట్యకళే ఉత్తమమైనది. ఈరెండున్నూ ఒకటొకటిపరస్పరంగా ద్వేషంలేకుండా అన్నదమ్ములవలె చెలిమికత్తెలవలె చెట్టాపట్టాలుపట్టుకొని వృద్ధిపొందవచ్చు.సినీమాలనుత్రోసి రాజని అనవక్కఅలేదు:—సినీమాల నెంత ఆదరాతిశయములతో జూచుచున్నామో అంతటి ఆదరమును నైతము నాట్యకళపై జూపిన జాలును. ఇప్పుడు మనం ఒకదాన్ని శిరస్సుపై కెక్కించుకొని, రెండవదాన్ని నేలబెట్టి కాలరాస్తున్నాము. నాటకములో సజీవులైననటకులు నటింతురు. సినీమా ఆనటకులప్రతిబింబాలను జూపించును. నాటకంలో స్వభావసిద్ధమైన శ్రావ్యకంఠము, విలక్షణమైన హావభావప్రకటన ప్రస్ఫుటంగా జూతుము. సినీమాలో యంత్రప్రభావముచే వికృతిపొందినకంఠధ్వని, ప్రతిబింబవత్ గా గోచరించే అభినయాదులు చూచెదము. అందుచేత ఉన్నదున్నట్టు స్వాభికతత్వాన్ని సినీమాలోకంటె నాటకంలోనే బాగా చూడగలుగుదుము, గ్రహింపగలుగుదుముగూడాను. కాబట్టి సర్వ విధాలా సినీమాకళకంటె నాటకకళ పైచెయ్యి అని చెప్పుట కెంతమాత్రం సందేహంలేదు.

అతిప్రాచీనమైనదిన్నీ, ఆర్షసాంప్రదాయకమైనదిన్నీ, వినోదదాయకమైనదిన్నీ, విజ్ఞానబోధకమైనదిన్నీ అయిన పావననాట్యకళను పునరుద్ధరించుట మనవిధ్యుక్తధర్మమై యున్నది. ఇందుకుగాను ఆంధ్రులమగుమనము, ఆంధ్రరాష్ట్రముకొఱకు గగ్గోలుపెట్టు మనము, సర్వత్ర ఆంధ్రత్వాన్ని ప్రతిష్ఠింపజేయవలెనని సంకల్పించుకున్న మనము ఆంధ్రనాటకరంగం చీకటి కోనలో పాతాళలోకంలో అగాధసాగరంలో,బడబానలంలో పడిపోవుచుండుటను సహింపగలమా? నడుములుబిగించి చేతులుకలుపుకొని పనిచేసేయెడల ఒకనాడు మహోజ్జ్వల

స్థానాన్ని పొందిన మనరంగం తిరిగి సుప్రతిష్ఠితం అగుటకు సంశయంలేదు. తుదకు సినీమా ప్రతిష్ఠకు పైపెచ్చుగా తేలేకపోయినను దానికి సమానప్రతిపత్తికైనను నాటకాన్ని తేగలుగుతాము. ఇందువిషయమై ముఖ్యంగా మనము గమనించవలసిన అంశాలు కొన్ని ఉన్నవి.

**నాటకరచన:—** మనకు తెనుగునాటకవాఙ్మయం అపారంగా ఉన్నప్పటికిని, బుద్బుదప్రాయములై, కళావిహీనములై, నీరసములై, ప్రదర్శనానర్హములై యున్ననాటకాల సంఖ్యయే విస్తారముగా ఉన్నది. ఇక పేర్కొనదగిననాటకాలు వ్రేళ్లమీదనే ఉన్నవి. ఇవి ఎక్కువగా పౌరాణికాలై యున్నవి. ఇది పౌరాణికయుగముగాదు. "నావిష్ణుః పృథివీపతిః" అనేసిద్ధాంతాన్ని నమ్ముకొని కూర్చుండేరోజు లివిగావు. ప్రజలలో స్వాతంత్ర్యేచ్ఛ, సామ్యవాదం ప్రబలినది. పాశ్చాత్యదేశాలు ఏవిధంగా నడచుచున్నవో ఆదోవలోనే మనముగూడ పోవుచున్నాము. దైనందినంగా మతసాంఘికనైతికరాజకీయాదులలో పరిభ్రమణము గలుగుచున్నది. ఇట్టి పరిస్థితులలో ఆంధ్రులఉదారాతిశయాలను, ఉన్నతభావాలను పెంపొందించే నాటకాలు తయారుకావలయును, కాలిచల్లారిన ఆంధ్రులపౌరుషప్రతాపాగ్నులను రాజేసి, దివ్యవెలుగును నలుదెసలప్రసరింపజేయగల ఉత్తేజకరములగునాటకాలు ఆవశ్యకములు. ప్రాక్పశ్చిమవిజ్ఞానముల మేళవింపుచే భవిష్యదాంధ్రఅభ్యుదయానికి ఒరవడి పెట్టగలనాటకాలు అవసరము. కావున సంస్కృతాంగ్లభాషాకోవిదులును, నాట్యకళానిపుణులును, బహుగ్రంథపరిచయులునగు రసికకవివర్యులచే చక్కనినాటకాలు వ్రాయించి ప్రచురించవలసియున్నది. నటకుడు ఎంతటిప్రతిభాశాలిఅయినను నాటకరచనభాగుండనిచో ఆనాటకము రసావిహీనమైపోగలదు.

**నటకులు:—**చక్కనినాటకరచనములతోపాటు చక్కనినటులుగూడ తయారుకావలయును. మనదేశములో నటకులకు కొరతలేదు. వీరికి కొంతక్రమశిక్షణమున్నచో చక్కనినటకులుగా తయారగుటలో సందేహ ముండదు. నటకుడైనవాడు నాటకముయొక్క అంతరార్థమును గ్రహించి దానిని ప్రేక్షకులకు చక్షుఃశ్రోత్రపేయముగా నటించవలెను. నాటకకర్తయొక్క పాత్రపోషణను వెలిబుచ్చుటయె నటకుని కర్తవ్యము. నాటకమునకు ప్రాణము నటనయే అయియుండుటచేత నటకుడు సర్వవిధముల విజ్ఞానవంతుడు, సూక్ష్మగ్రాహి, భావప్రకటనాదక్షుడై యుండుటముఖ్యము. నాటకము, నటకులు ఏర్పడినతర్వాత రంగస్థలము ఏర్పఱచుకొనుట ముఖ్యము. ఇంతపెద్ద ఆంధ్రదేశములో ఒకయాదర్శమైనరంగస్థలములేదని చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. భరతాచార్యులు రంగస్థలనిర్మాణాన్ని, పరికరాలనుగురించి

ఎంతో గ్రంథముల్వ్రాసిరి. వారు చెప్పనివిషయములేదు. దానినిబట్టి పూర్వకాలములో నాట్య కళ ఎంతతేజేగియమానముగా వెలుగుతూవుండేదో మనము ఊహింపవచ్చు. ఇప్పుడు మనకు రంగస్థలమనునది లేకపోవుటయేగాక ఉన్న నాటకశాలలుగూడా సినీమాహాలులైనవి. నట కులు సినీమాచుక్కలుగామారిరి. మనలో ద్రవ్యవంతులు లేకపోలేదు. దానకర్ణులు లేక పోలేదు. రంగనిర్మాణానికి ఎవరైననుపూనుకొన్నారా? నాట్యకళాభిమానము లేకపోవుటయె కారణము. ఆంధ్రయూనివర్సిటీవారైనను ఒకనాటకరంగనిర్మాణానికిపూనుకొనియుండవచ్చు. కాని వారికిన్నీ, నాట్యకళపై శీతకన్నుగానే ఉన్నట్లున్నది. ఇప్పటికైనను వేలకువేలు ఫిలుములకు ధారపోసే ప్రభువులు నష్టములో ఇది ఒకనష్టమని భావించి పదిమంది పదిపిడికిళ్లు పారవేసినచో రంగనిర్మాణ మగుటకు సంశయములేదు.

**దర్శకులు:**—సినీమాలకువలెనే నాటకాలకు దర్శకులని ఉండుట శ్రేయస్కరము. దర్శకుడే నాటకమును నడిపించవలెను. వేషధారణ, సీనులు, రంగమునందలి దీపములు, సంగీతము, జంత్రవాద్యాలు ఇవన్నియు ఉచితరీతిగా అమర్చబడిఉన్నవా అని పరిశీలించ వలెను. శ్రుతి, మృదంగము, హార్మోనియము, లేక జంత్రవాద్యాలు సమయానుకూలముగా నటకులకుపకరించుచున్నవా? నాటకము రక్తికట్టినదా అనేవిషయాలను గమనింపవలెను. ఇందుకు దర్శకుడు అవసరము. నాటకవర్గమంతయు ఈదర్శకుని ఆజ్ఞానువర్తియైయుండుట ఆవశ్యకము. లేనిచో నటకులు స్వేచ్ఛానువర్తనులై విచ్చలవిడిగా ప్రవర్తింతురు. నాటకం తుదకు ఆభాసము కావచ్చు. కావున దర్శకుడనుపేరునగాని మఱియొకపేరునగాని పాలకుడు ఒకడుండి తీరవలెను.

**ప్రదర్శనములు:**—నాటకప్రదర్శనకాలము మూడుగంటలకుపైగా ఉండకూడదు. ప్రదర్శనానుకూలమునుపురస్కరించుకొనే నాటకాలు రచింపబడవలెనేగాని కవిత్వానికొఱకు నాటకాలురచింపబడుట అజాగళస్తనంవంటిదగును. మఱియు నాటకప్రదర్శనానికి ప్రస్తుతం పెట్టే టిక్కెట్లరేట్లు మధ్యరకం జనమునకుగూడా అందుబాటులోలేవు. గ్యాలరీయే0-12-0కు తక్కువలేదు. 0-12-0 తగలెట్టిప్రయోజనంలేదు. ఏమి వినిపించదు. పోతే రు1-8-0, 2-0-0 తరగతులకు పోవలసియుండును. సినీమాలో చూడండి 0 4-0 డబ్బులమొదలుకొని కొన్ని చోట్లలో 0-1-0 లగాయతు టిక్కట్లు కొనుక్కొని యిప్పటి ఆభాసనాటకవినోదముకంటె, సాటిలేని ఆనందాన్ని సినీమాలో పొందుదురు. కాబట్టి నాటకాలను పాపులరైజు Popularize చేయాలనిన టిక్కెట్లరేట్లను తగ్గించి కూలినాలీ జనంలగాయతు సంపన్నకోటి

వరకు ప్రతివారికిన్నీ అవకాశముగలుగజేయుట. రంగములో పచ్చిబూతుపదాలు ఆలింగన చుంబనాదులు, శృంగారమనే పేరుతో జూపుచున్నారు. వీటిని త్యాజ్యం చేయవలెను.

**నాట్యకళాప్రచారము:**—నాట్యకళాబీజమును ప్రతివారిలోను నాటి దానిని పోషింపవలెననిన నాట్యకళాగ్రంథాలు, నాట్యకళాపత్రికలు విరివిగా బయలుదేరవలయును. ఆంధ్రయూనివర్సిటీవారున్నూ నాట్యకళోద్ధరణకు కంకణముగట్టుకొని పనిచేసినయెడల కొల్దికాలములోనే ఆంధ్రనాటకరంగము మహోన్నతస్థానాన్ని పొందగలుగుతుంది. నాట్యకళాశాలను ఒకదానినిర్మించి, అర్హతగలయువతీయువకులకు సాహిత్యము, సంగీతము, అభినయము, నృత్యము మున్నగునవి కరపినయెడల అచిరకాలంలోనే ఉత్తమోత్తములైననటకులను జూడగలుగుదుము. ఇంకనునాట్యకళకు సంబంధించినవ్యాసాలు, విమర్శలు పత్రికలలో అప్పుడప్పుడు ప్రచురింపబడుచుండవలెను. ఇప్పుడు సినీమాకళకు ఎన్నిపత్రికలు బయలుదేరినవో చూడుడు. ఇప్పుడు ప్రపంచమంతయు సినీమామయమై ఉన్నది. ముందు ముందు ఏమిజరుగునో జ్యోతిషము చెప్పేవాడు లేడుగాని గుడ్డెద్దు చేనపడినట్టు, దోవలో రాళ్లు రప్పలను జూడకయే కట్టకట్టుకొని ప్రజలు ముందుకు పరుగులిడుచున్నారు. ఈపరుగు ఎక్కడ ఆగును? ఎంతకాలం ఈపరుగు? అనుప్రశ్నకు సమాధానము ఎవడు చెప్పగలడు? ప్రపంచస్థితిఅంతయు నదీప్రవాహంలాగా ఏవంకకుతిరిగితే ఆవంకనబడి మిట్ట, పల్లం, చెట్టు, గుట్ట అనేవివక్షతలేకయే పోవుచున్నది. నాట్యకళోద్ధరణమునకు ఏరెండు మూడుపత్రికలున్నను చాలు. ఇప్పుడు ఒకపత్రిక ఉన్నదందురు. అదియు బాలారిష్టాలతో కొనఊపిరి పెట్టుకొని ఉన్నది.

కావున ఆంధ్రమహాశయులందఱు ప్రకృతము మననాటకరంగ మున్న దౌర్భాగ్యస్థితిని తలపెట్టి, దీనిని పునరుద్ధరించుట తమవిధ్యుక్తధర్మమని భావింపవలెనని ప్రార్థన. మనప్రాచీనులచే ఆదరింపబడి ఒకనాడు దేదీప్యమానముగా వెలిగిన నాట్యకళాజ్యోతి యిప్పుడు పూర్తిగా ఆరిపోవుటకుముందే మనము త్రికరణశుద్ధిగా కృషిచేయునెడల ఆజ్యోతి పునః ప్రకాశవంతమై నూత్నకాంతులవెదజల్లగలదు. ఆదివ్యతేజస్సులో ఆంధ్రావని తనభవిష్యజ్జీవితమును నిర్మించుకొని యందు వెన్నెలవిహారము చేసికొనగలదు.



# టాకీలూ — నాటకాలూ

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.

మన ఆంధ్రదేశంలో టాకీప్రదర్శనాలు బాగా హెచ్చాయి.

అవి, ఆబాలగోపాలమూ అశేషజనాన్నీ ఆకర్షించేస్తున్నాయి.

స్త్రీలకూ పురుషులకూ కూడా టాకీప్రదర్శనాలకు వెళ్లడం, అనివార్యమైన వొక గృహకృత్యం అయిపోయింది.

అయితే, వీటివల్ల చెప్పుకోతగ్గ మేలు ఒకటయినా కలిగినట్టు నాకు కనపడ్డం లేదు.

ఇక ముందుముందు కలుగుతుం దేమో సూచనలు కూడా లేవు.

కాని వీటివల్ల మన కొక గొప్ప నష్టం మాత్రం కలిగింది.

అది మన నాటకప్రదర్శనాలు పూర్తిగా పడిపోవడం.

నిజానికి, కొత్తగా వచ్చింది బాగా హెచ్చిపోయినప్పుడు, సజాతీయమై, అంతకు ముందే వున్నది, కొంతకు కొంతయినా తగ్గిపోవడం వింతా కాదు, అక్రమమూ కాదు.

అయితే, మన నాటకప్రదర్శనాల విషయమై మాత్రం యీసూత్రం పట్టలేదు.

టాకీప్రదర్శనాలవల్ల మన నాటకప్రదర్శనాలు పూర్తిగా నిలిచేపోయాయి.

అసలు, మనదేశంలో, నాటకప్రదర్శనాల విషయంలోనే మొదణ్ణుంచీ వొక చెడ్డ సంప్రదాయం కనపడుతోంది.

గొప్ప పండితులూ కవులూ అయి వుండిన మనపూర్వులు, తెనుగులో నాటకాలు రచించకపోవడం అలా వుండగా—తతిమ్మా అన్నిరకాల గ్రంథాలూ సంస్కృతంనుంచి అనువదించి, నాటకాలు మాత్రం అనువదించకపోవడమున్నూ అలా వుండగా—సామాన్య కవులు రాసిన యక్షగానాలు కూడా నిరసనగా చూశారు.

వాటిని ప్రదర్శించే కళారాధకులకు, మనసంఘం "భాగోతపాళ్లు" అని నీచముద్ర వేసింది.

నటులను పంక్తిబాహ్యులే అనేసింది.

ఇలాగ శతాబ్దులకు శతాబ్దులు గడిచిపోయాయి.

ఈదీర్ఘకాలంలో, మన రాజకీయాలు ఎన్నో పల్టీలు కొట్టాయి.

చివరికి, మనకి, ఇంగ్లీషువాఙ్మయంతో బలమైన పరిచయం ఏర్పడింది.

మనవాళ్లకి, మన విజ్ఞానం కంటే, ఆపాశ్చాత్యవిజ్ఞానమే చాలా అగత్యం అయి పోయింది.

ఆవిజ్ఞానం, ఆవిధంగా వొంటబట్టి మనలో అనేకరకా లయిన మార్పులు తెచ్చి పెట్టింది.

ఆమార్పులలో వొకటి నాటకరచనా, మరొకటి నాటకప్రదర్శనమూనూ.

దీంతో, గీర్వాణంనుంచీ, యింగ్లీషునుంచీ అనువదించబడ్డవే కాక—స్వతంత్రంగా రచించబడ్డవి కూడా మనభాషలో ఎన్నో నాటకాలు వెలిశాయి.

నాటకపఠనం బలిసింది.

నాటకాలు చూడా లనే అపేక్ష పొటమరించింది.

అగ్రవర్ణాల యువకులు ప్రదర్శనాలకున్నూ పూనుకున్నారు.

అయితే, యిక్కడ వొక చిత్రం.

ఆమొదటి రోజుల్లో, నాటకరచన యేవిధంగానూ నిరసించబడలేదు.

మహా మహా పండితులే అందుకు పూనుకున్నారు.

వాటిని ప్రదర్శించే యువకులు మాత్రం నీచంగా చూడబడేవారు

ఆనాటకాలు రాసినవారున్నూ ఆయువకులను అలాగే చూసేవారు.

నా చిన్నతనంలో, నేనొకమాటు వేషం వేసినందుకు, మాయింటోనూ, మా వూళ్లోనూ కూడా చాలా గందరగోళం జరిగింది.

అలాంటిది పోయి, తరవాత్తరవాత, నాటకంలో వేషం వెయ్యడం చెడ్డపని కాదన్న భావం దేశం అంతటా బలపడింది.

మరికొన్నాళ్లకి, నటన వొక గొప్ప కళ అనీ, నటులు గౌరవార్హు లనీ స్థిరపడింది

నాటకప్రదర్శనాలు హెచ్చిపోయాయి.

కులస్త్రీలున్నూ నాటకప్రదర్శనాలలో పాలు పుచ్చుకునే రోజులు వచ్చేశాయి.

నటన ద్రవ్యార్జనకు సాధనం కూడా అయింది.

కాని, హఠాత్తుగా టాకీప్రదర్శనాలు ప్రబలి నాటకప్రదర్శనాలు మూలపడిపోయాయి

మూకీల రోజుల్లో యీదురవస్థ పట్టలేదు.

ఇవాళ, నాటకప్రదర్శనం అంటే అమెచూర్లకూ భయమే.

కంట్రాక్టర్లకూ భయమే.

దీనికి సాయం, రంగస్థలాలూ కరువయిపోయాయి, కిరాయినటులున్నూ దొరకడం లేదు.

ఎంచేతా ?

కారణం యేమిటి ?

లోపం యెక్కడుందీ ?

నాటకరచననుగురించీ నాటకప్రదర్శనాలను గురించీ కూడా సర్వతోముఖంగా జాగ్రత్తపడడానికి పదేళ్ల కిందటే ఆంధ్రనాటక కళాపరిషత్తేర్పడినా—ప్రతీసంవత్సరమూ, అది, తనకి చేత నయినంతా అడావుడి చేస్తూనే వుండినా యీదురవస్థ యెందుకు పట్టిందీ ?

పట్టినా యెందుకు దుర్భర మయిపోయిందీ ?

చాలా గడ్డువిషయం యిది.

అంటే, కారణం యేమిటో తెలవదని కాదు.

లోపం యెక్కడుందో గుర్తుదొరక దనీ కాదు.

ఇక వున్నదల్లా యేమిటంటే ?

ఆకారణం శాశ్వతబ్రహ్మకల్పంగా వుండిపోయేదే.

ఆలోపమున్నూ యింతట్లో సవరణ అయేది కాదు.

కాగా, నాటకప్రదర్శనాలు, ఇంతలో మళ్లీ పురికొంటా యని చెప్పడానికి వీలులేదు.

ఈవిషయం స్పష్టం కావడాని కొక్క నిదర్శనం చూపిస్తాను.

అనగా అనగా వొక చిత్రకారుడు.

అతను చాలా గొప్పవాడు.

అత నొక చిత్రం తయారుచేశాడు

అది అద్వితీయంగా వుంది.

ఒక సంపన్నుఁడు, ఆచిత్రకారుణ్ణి సత్కరించి, ఆచిత్రం తన యింటో అలంకరించుకున్నాడు.

ఆయింటికి చక్కని శోభ వచ్చింది.

అది చూసి మరొక సంపన్నుడు ముచ్చటపడ్డాడు.

వెంటనే చిత్రకారుడు మళ్లీ ఆచిత్రమే తయారుచేశాడు.

రెండో సంపన్నుడున్నూ చిత్రకారుణ్ణి సత్కరించి ఆరెండో చిత్రం తన యింటో అలంకరించుకున్నాడు.

అతని యింటికిన్నీ మంచి శోభ వచ్చింది.

సంపన్ను లిద్దరూ తమ చిత్రం బాగుం దంటే, తమ చిత్రంలో కొత్తదనం వుందంటే- ఇలాగ గర్వపడసాగారు.

దీనికి కారణం యేమిటో అని రసికులు రెండు చిత్రాలూ పరిశీలించి సారస్యాలు తీశారు.

ఈపరిశీలనతో, ఆచిత్రాలలో, స్ఫుట మైన భేదా లున్నా యని వెల్లడి అయింది.

ఆభేదాలు, ఎక్కడి కక్కడే సౌందర్యపోషకా లయి వుండడమున్నూ తెలిసిపోయింది.

అంచేత, దేనికదే అద్వితీయమై ఆసంపన్ను లకు సంతృప్తి కలిగించాయి.

జరిగిం దేమి టంటే?

రెండు చిత్రాలూ తయారుచేసిన మనిషి వొకడే.

రెండు చిత్రాలకూ భావనా వొకటే.

కాని, రెండోది తయారుచేసినప్పుడు చిత్రకారుడి మానసికావస్థ కొంచెం మారింది.

దాంతో తూలిక మరో విధంగా లాస్యం చేసింది.

దానివల్ల రంగుల కలయికలో వైలక్షణ్యం యేర్పడింది.

వెంటనే ఆభావన మరో అడుగు ముందుకి వేసిన ట్టయింది.

కళ స్వభావమే యిది.

ఏకళాకుశలుడూ కూడా, ఎంతోకొంత భేదం లేకుండా ఒకటే భావనకు రెండు రూపాలు కల్పించలేడు.

ఇక, దీనికి, రెండో వైపు చూపిస్తాను.

అనగా అనగా వొకవర్తకుడు.

నుంచున్న పాళంగా లక్షలు పెట్టుబడి పెట్టగల డతను.

చక్కని వస్తువు చూస్తే అతని కళ్లూ మెరుస్తాయి.

మధుర మైన భావం వింటే అతని మనస్సూ గుబగుబలాడిపోతుంది.

అయితే, ఆచక్కదనమూ, ఆమాధుర్యమూ హృద్గతాలు కాకపూర్వమే అతని బుద్ధి "ఇవి బజార్లో పెడితే రెట్టికి రెట్టి లాభం వస్తుంది." అనేస్తుంది.

దీంతో అతని తెలివి అంతా తక్కువ యివ్వడం, అదేనా కొసిరి కొసిరి యివ్వడం, యెక్కువ లాగడం—ఇలాగ వాణిజ్యసూత్రాల పరామర్శకి పూనుకుంటుంది.

చిత్రపటాల వర్తకంలో భారీగా లాభం వచ్చేటట్టు కనపడిం దతనికి.

చిత్రకారుడు తయారుచేసిన వొక చిత్రం అపూర్వంగా వుందని అతని చెవిలో నున్నూ పడింది.

వెంటనే అతనా చిత్రం కొనేశాడు.

కొనడం అంటే బేరమే కదా ?

బేరం అనేటప్పటికి చిత్రకారుడి గుండె పగిలిపోయింది.

వర్తకుడు తన చిత్రం యెందుకు కొంటున్నాడో ఆసంగతి గుర్తుకి వచ్చాటప్పటికి, అతను, కుంగిన్నీ పోయాడు.

కాని అతనూ సంసారే.

జీవయాత్ర సాగించుకోవా లంటే అతనికీ డబ్బు కావాలి.

భావం గ్రహించి, చాతుర్యం గుర్తించి, ఆనందించగలవాడు దరిద్రు డయి— అయినా అతను కోరితే కడుపు మాడ్చుకుని అయినా అత నాచిత్రం వూరికే యిచ్చెయ్యగలడు.

కాని వర్తకుడు తన కోసం కాదు ఆచిత్రం కొంటున్నది.

అంచేత, ఆచిత్రకారుడు, ఆవర్తకుడితో నలుగుళ్లు పడిపడి, విసిగివిసిగి, చివరికి, సగం చచ్చి డబ్బుకోసం చెయ్యిచాపి, వొక కంట దుఃఖిస్తూ చిత్రం ఆవర్తకుడి చేతి కందించాడు.

వెంటనే వర్తకుడు ఆచిత్రం అచ్చువేయించి, లక్షల ప్రతులు తీయించి, దేశం అంతటా—బజార్లన్నీ—నింపేశాడు.

చిల్లరవర్తకులు ఒక్కొక్క ప్రతి రెండణాల చొప్పున అమ్మారు.

అచ్చుపడ్డ చిత్రం చూసి, అందులో తన చెయ్యి మరుగుపడిపోవడం గుర్తించి చిత్రకారుడు నిర్విణ్ణు డయిపోయాడు.

కాని జనం విరగబడి కొనేసింది.

ఆకొనడంలో నయినా,—కొనేవారిలో నయినా కళాభినిరతి కనపడలేదు చిత్రకారుడికి.

"చాకగానే వస్తోంది" అనీ, "తమాషాగా వుంది" అనీ, "అందరూ కొంటున్నారు" అనీ—కొనేవాళ్ల యిలాంటి మాటలతో అతని చెవులు చిల్లులుపడిపోయాయి.

అయినా, కొద్దిరోజుల్లోనే, ఆపటం బీదల గుడిసెల్లోనూ, సాధారణుల యిళ్లల్లోనూ, సంపన్నుల సౌధాల్లోనూ వెలిసింది.

కొన్నప్పుడు ఎవడిమట్టుకి వాడే అది గొప్ప చిత్రం అని మురిశాడు.

వానివల్ల తన యింటికి అపార మైన వెలుగు వచ్చిం దనిన్నీ పొంగిపోయాడు.

కాని నెల అయినా తిరక్కుండానే, ఎక్కడ చూసినా అదే వుండడం—ఎన్ని చూసినా వొక్కలాగే వుండడం—దీంతో అందరికీ దానిమీద మోజు తగ్గిపోయింది.

సాధారణంగా, ఎప్పుడో వొకప్పుడు—ఎవరో వొకరి కన్ను పడుతూనే వుంటుంది; కాని చూపు మాత్రం దానిమీద నిలవడం మానేసింది.

క్రమంగా దాని వూసే యెవరికీ అక్కర్లేకపోయింది.

పరిశ్రమ స్వభావమే యిది.

పరిశ్రమ ప్రయోజనం తాత్కాలికం కాని సార్వకాలికం కాదు.

కళావలయంలోనుంచి జారిపోయి, పారిశ్రామికకేంద్రంలో పడిపోతే దేని కయినా యిదే గతి.

చెప్పవచ్చిం దేమిటంటే ?

నాటకప్రదర్శనం అంటే కళారాధన.

టాకీప్రదర్శనం అంటే డబ్బు నొల్లుకోవడం.

అక్కడ హృదయం లేకపోతే లాభం లేదు.

ఇక్కడ హృదయం వుంటే లాభం లేదు.

అంటే ?

నాటకప్రదర్శనం వేరూ, టాకీప్రదర్శనం వేరూనూ.

నాటకప్రదర్శనాలవల్ల టాకీప్రదర్శనాలకు జీవమూ రాదు.

టాకీప్రదర్శనాలవల్ల నాటకప్రదర్శనాలకు దెబ్బా తగలదు.

కాని, విచిత్రం.

మన తెనుగు దేశంలో టాకీప్రదర్శనాలవల్లనే నాటకప్రదర్శనాలు పడిపోయాయి.

మరో కారణంవల్ల కాదు.

ఏం?

ఈవ్యతిక్రమం యెందుకు వచ్చింది ?

ఇప్పుడు తేల్చుకోవలసిం దిదీ.

మన భాషలో వాఙ్మయం లేదనేవా రున్నారు.

వారి వాదసరణి నాకు తెలుసు; కాని అది సహేతుకం కాదు.

నేనది అంగీకరించలేను.

మనలో ఆదినుంచీ గ్రంథకర్త లుండినారు.

ఇప్పుడూ వున్నారు.

అప్పటివారూ వాఙ్మయసృష్టి చేశారు.

ఇప్పటివారూ వాఙ్మయసృష్టి చేస్తున్నారు.

అయితే, దానికి సర్వాంగీణత లేకపోయింది.

దీనికి సర్వాంగీణత యేర్పడుతోంది; కాని చైతన్యం పుట్టలేదు.

అంచేత, అది, జాతిలో రసికత చచ్చిపోడానికి హేతు వయింది.

ఇది మళ్లీ రసికత అంకురింపచెయ్యడానికి చాలలేక పోతోంది. నిజానికి, లలితకళ లంటే అభిగతి వుంటేనే కదా జాతికి సభ్యత?

లలితకళ లన్నిటికీ కవిత్వమే కదా తలమానికం?

కవిత్వానికి నాటకమే కదా పరమావధి?

అలాంటి నాటకం వొక్కటయినా లేదుకదా మన జాతికి రసికత అంటే యేమిటీ?

అయితే, మనపూర్వులు, మనభాషలో నాటకరచన చెయ్యలేదు; కాని (గీర్వాణ) నాటకాలు చదివారు.

అంచేత వారి జీవితాలు రసబంధురాలుగానే వెళ్లిపోయాయి.

కాని తరవాత్తరవాతివారికి ఆచదువు కూడా లేకపోయింది.

సమకాలికుల గ్రంథాలకు మెప్పు ఉండకపోవచ్చు; కాని పఠనం మాత్రం యెక్కువగానే వుంటుంది.

అది మనవాళ్లలో మరీ యెక్కువేమో?

కనకనే యెక్కడికక్కడే—యెప్పటి కప్పుడే పిల్లవసుచరిత్ర ల్లాంటివి బయలు దేరడం.

దీనికి సాయం, భారతరచన తరవాత, మనలో కవిత్వం కంటే పాండిత్యమే యెక్కువ అన్న భావం పుట్టిపోయింది.

దీనికి, శ్రీనాథుడు, నైషధం మాత్రమే ఆంధ్రీకరించి వూరుకోడం కంటే మరేమి నిదర్శనం కావాలి?

శ్రీనాథుడు కాకపోతే మరొక డయినా రఘువంశం మేఘసందేశం మొదలయినవి ఆంధ్రీకరించివుండనప్పు డిది కాదనడం యెలాగా?

ఇలాగ, నాటకరచన పెట్టుకోకపోవడంవల్ల, మన పూర్వకవులకు, మానవస్వభావం చిత్రించవలసిన అగత్యం తప్పిపోయింది.

క్రమంగా ఆశక్తి చచ్చిపోయింది.

ప్రబంధరచనే ప్రధానం కావడంవల్ల వర్ణనలు ముదిరాయి.

అందులోనూ పాండిత్యమే గొప్ప అనే భావం యేర్పడడంవల్ల, పాండిత్యం అనేది భాషకే—ఛందోవ్యాకరణాలకు మాత్రమే సంబంధించింది కావడంవల్ల మనకవులకు, చివరికి ఉద్గమనం పోయి అధఃపతనం సంభవించింది.

అంబరవిహారం పోయి నేలమీద మొగ్గలువెయ్యడం పరిపాటి అయిపోయింది.

చివరికి?

మనలో పారిషదు లనే వొక తెగ యేర్పడకుండా పోయింది.

ఎంతసేపూ చదవడం—లేకపోతే చదవగా వినడం—అదీ కాకపోతే చెప్పగా వినడం—ఇంతే మిగిలింది.

సంస్కర్తల అనుగ్రహంవల్ల బోగంమేళా లంటే కృత్రిమ మైన ఏవగింపు కలిగి శృంగారాభినయం కూడా చచ్చిపోయే అవస్థ తటస్థించింది.

"అయితే, బొమ్మలాటలు లేవూ? గొల్ల, భామకలాపాలులేవూ? యక్షగానాలు లేవూ? వాటికి పారిషదులు తక్కువయినారా" అన్న ప్రశ్న రావచ్చు

బాగానే వుంది.

లేకేమీ?

అలాంటి వొక్కొక్క ఆట వూరంతా విరగబడి చూడడం నేనెరగనూ?

ఇప్పుడు టాకీప్రదర్శనాలకు మాత్రం వేలకొద్దీ జనం విరగబడ్డం లేదూ?

మరి నాటకప్రదర్శనా లెందుకు సన్నగిల్లిపోయాయి?

అదే కారణం.

మనలో పారిషదులు లేరు.

రసభావవిదు లైన పారిషదులు లేరు.

ఉన్నా రనుకున్న వారు పారిషదు లనడాని కర్హులు కారు.

ఏమంటే?

ఏమీ లేనిరోజుల్లో వారు బొమ్మలాటలూ, గొల్లభామకలాపాలూ, యక్షగానాలూ చూశారు.

తరవాత చిల్లరనాటకాలు వచ్చాయి.

అవీ చూశారు.

టాకీలు వచ్చాయి.

అవే చూస్తున్నారు.

ముందుముందు మరేమయినా రావచ్చు.

అప్పు డవే చూస్తారు.

రావూ?

మానేస్తారు.

రాలేదని వారికి చెంగ వుండదు.

దర్జాగా వెళ్లి ఉన్నవే కులాసాగా చూస్తారు వారు.

కొత్తవి వస్తేనే పాతవి రోత వారికి.

అలాంటివారికీ, రసమహితాలైన నాటకాలకూ యెక్కడి కెక్కడికీ సంబంధం?

ఎవరిని చూసుకుని నటులిక నాటకప్రదర్శనాలు చేస్తారూ?

సమర్థులైన నటులు గొప్ప నాటకా లాడాలంటే, అమాంబాపతులకూ, అధమం, అయిదువందల రూపాయ లయినా వసూలయితే గాని సాధ్యం కాదు.

సాధ్యమైనంతవరకూ ఆటాకీప్రేక్షకులు రాకుండా వుండడానికీ, అంతంత మొత్తాలు వసూలు కావడానికీ, మూడు రూపాయలకు తగ్గకుండానూ, పది రూపాయలకు హెచ్చకుండానూ టిక్కట్టురేట్లు ఏర్పరచవలసి వుంటుంది.

అలా యేర్పరిస్తే, రాజమహేంద్రవరం, కాకినాడ, ఏలూరు, గుంటూరివంటి చోట్ల కాదు. మద్రాసులో నయినా నాటకప్రదర్శనం జరుగుతుందా?

అంటే రసానుభవంకోరి అంతంత డబ్బు ఖర్చు పెట్టగల రసలుబ్ధులు మనలో యెందరున్నారు?

లేనప్పుడు మన నాటకప్రదర్శనాలు పడిపోక యేమవుతాయీ?

సత్యం గుర్తించకుండా, కులాసా మనుష్యులతో కాలక్షేపం చేసుకుంటూ వున్న టాకీప్రదర్శనాలను నిందిస్తే యేమి లాభమూ?

రసలుబ్ధులైన పారిషదులు లేక రాఘవాచార్యులుగారూ, స్థానం నరసింహారావుగారూ, ఒక్కొక్క ప్రదర్శనంలో యెంతెంత చిత్తక్షోభ అనుభవిస్తున్నారో యెవరు గుర్తించారూ?

మొన్న మొన్నటి కాకినాడ సమావేశం వంటి, ఎన్ని సమావేశాలు జరుపుకుంటే మాత్రం, ఆంధ్రనాటకకళాపరిషత్తు యీపరిస్థితులు సరిదిద్దగలదూ?

# ఆంధ్ర నాటకకళా పరిషత్తు

శ్రీ కురుగంటి సీతారామయ్యగారు, ఎం. ఏ., ఉస్మానియాకాలేజి, హైదరాబాదు.

(నేను వ్రాసిన "నవ్యాంధ్రసాహిత్యవీథులు" అనే గ్రంథంలోనించీ ఉద్ధృతం.—కు. సీ.)

వెనక (1930 కి) కొన్ని సంవత్సరాలుగా నాటకకళకు కొంచెం దోహదం కలిగిందని చెప్పాను. మన సాహిత్యప్రముఖులు చాలామంది నాటకకళనుగూర్చీ, దాన్ని అభివృద్ధిచేసే మార్గాలనుగూర్చీ, అభిప్రాయాలు మార్చుకోటానికీ, అవసరమైన కొన్నివిషయాలను నిర్ధారణచేసుకోడానికీ, సంఘమొకటి అవసరమని తలచి ఒక నాటకకళాపరిషత్తును స్థాపించారు. ఇందులో చాలాజోక్యంకలగచేసుకున్న వాళ్ళలో వనారస గోవిందరావుగారు, రాఘవాచార్యులుగారు, మొదలైనవాళ్ళు ముఖ్యులు. సురభికంపెనీవారి సహాయం చాలా ఎన్నదగింది. ఒకఆదర్శనాటకశాల నిర్మించాలనీ, ఆదర్శనాటకాలు తయారు చేయించాలనీ, వాటిని ఆదర్శకంగా నటించాలనీ, యువతీయువకులకు నాటకాభినయంలో తర్ఫీతునియ్యాలనీ, మొదలైన ఉన్నతాశయా లుండేవీసంస్థకు. అన్నిటికంటె ముందు సంసారులైన స్త్రీలు నాట్యరంగ మెక్కడమనే సమస్య యీసంస్థ నాకర్షించింది. యువకులసంగ తట్లావుండగా విశ్వదాతవంటివారుకూడా ప్రవేశించాలనే అభిప్రాయ మిచ్చారు. ఈవిషయమై పత్రికల్లో వాదోపవాదాలు జరిగినై. చాలా గొప్పవ్యక్తులు పాల్గొన్నారు. సంసారులైన పురుషుల్లో యీసమస్య చాలా కలవరం కలగజేసింది. ఈవిషయంలో కొలదిమంది స్త్రీలు కొంచె ముత్సాహం చూపారు! మొత్తంమీద సిగ్గో జుగుప్సో స్త్రీల నధికసంఖ్యాకుల నీవిషయానికి విముఖుల్ని చేసింది. 1929 లో తెనాలిలో జరిగిన ప్రథమపరిషత్సభకు కీ॥ శే॥ ఆచంట వెంకట్రాయసాంఖ్యాయనశర్మగా రధ్యక్షత వహించారు. ఆకాలంలో అక్కడికి నాటకప్రదర్శనంకోసం వచ్చిన సురభికంపెనీవారి హాలు సభాభవన మైంది. అప్పుడు నేను కూడా యథాశక్తిగా దానిలో పాల్గొన్నాను. విశ్వదాతగారు వచ్చి యీస్త్రీరంగప్రవేశాన్నిగూర్చి గంభీరోపన్యాస మిచ్చారు. ఈవిధంగా ఆసమావేశం చాలా ఉత్సాహంతో వెళ్ళిపోయింది. క్రమంగా ప్రథమోత్సాహం తగ్గింది. ఇప్పుడు కొన్ని సమావేశాలనించీ చావలేకా, బ్రతకలేకా, జీవించున్న దీసంస్థ! మొత్తంమీద అప్పుడప్పుడూ కలవడం, కొంత "తండులధ్వంసం", "వాగ్విరేచనం" జరగడం, కొన్ని నాటకాలను ప్రదర్శించడం, ఎవళ్ళగ్రామం వాళ్ళు వెళ్ళడం. ఇదీ యిటీవల జరుగుతున్న పద్ధతి. నెల్లూరు పరిషదధ్య

తులు రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారి ఉదాత్తోపన్యాసం శ్రోతలైన నటశేఖరులకు చాలా విసుగు కలిగించింది. అభిమానుల కళాభిజ్ఞత అట్లా వుందన్నమాట! అధ్యక్షులను ఉపపాదించినవారికి వారిపేరు జ్ఞాపకంచెయ్యాల్సొచ్చింది!

సినిమా వచ్చి నాటకకళకు దెబ్బ తగిలింది! వేషాలు వేయతగిన స్త్రీలంతా సినీమా నటీత్వంలో వుంటంవల్ల, సమర్థులైన పురుషులుకూడా సినీమారంగాన్నే ఆశ్రయించాలసొచ్చింది. నాటకానికి కావలసిన మూలసూత్రాలు సినిమాకు కావలసినవాటికంటె భిన్నాలు. ఒక్క ఉదాహరణ మిస్తాను. నాటకంలో సభ్యులను చూస్తూ నటించాలె! స్వప్రతిభ ఉపయోగించాలె! ఒక్కొక్కప్పుడు సభాదర్శనం ఉత్సాహజనకంగానో మరోవిధంగానో ఉండచ్చు! కాని సినిమాలో నటుడి ప్రత్యేకప్రతిభ కెక్కువగా చోటు లేదు. డైరక్టరుంటాడుసర్వజ్ఞుడు! వాడు నటించమన్నట్టు నటించాలె! వాడు మాట్లాడమన్నట్టు మాట్లాడాలె! ఎదురుగా సభంటూ ఉండదు! ఎదట చూచేవాళ్లు లేకుండా నవ్వాలె! యేడవాలె! ఇది చాలా అస్వాభావికం! సన్నివేశమూ, వాతావరణమూ లేకుండా నటించడం! అసలు నటనమే అనుకరణం! ఇది అంతకంటె యింకా అధ్వాన్నం! సభాసదు లంటూవుండి నటనాని కానందమో, మరోటో చూపిస్తూంటే నటుడితెలివి ఉపయోగించటానికి వీలుంటుంది! ఇక్కడో సర్వజ్ఞుడైన డైరెక్టరు సర్వసభాసదస్థానంలో వుంటాడు! ఎంతభేదమో చూడండి! ఎల్లప్పుడూ గూడవల్లి, వైవీలవంటి డైరెక్టర్లు దొరుకుతారా! అందుచేతే మన తెనుగుఫిల్ముల గతి యిట్లా వుంది! సినిమాకళలోనే ఉన్నలోప మిది! ఫిల్ము తీసింతర్వాత యిక అది మారడమంటూ లేదుగా! గ్రామఫోనుపాటకూ అసలుపాటకూ ఉన్న భేదం వంటిదీ, ఫోటోగ్రాఫుకూ చిత్రకళకూ ఉన్న భేదంవంటిదీ యిక్కడకూడా ఉంది! అంటే "క్షణక్షణ" నవ్యత కొరవడుతున్న దన్నమాట! అనగా రసం కొరవడుతున్న దన్నమాట! నాటకంలో నటుడి వ్యక్తిత్వానికి అవకాశ ముంటుందికాబట్టి పునఃప్రదర్శనేచ్ఛ వుంటుంది! సమర్థుడైన నటుడి నటనం కూడా యెప్పటికప్పుడు అతని విజ్ఞానంకొద్దీ నూతనత్వం పొందటాని కవకాశం వుంటుంది! ఇక్కడే రెంటికి అసలులో భేదమున్నది!

"మ్యూజియంలో చూశే చచ్చిన జంతువుల శవాల వంటిది." సినిమాచిత్రమని వక విమర్శకు డన్నాడు. కాని అంత క్రూరంగా చెప్పడం న్యాయంకాదని నా అభిప్రాయం. గ్రామొఫోనులు మూలబడ్డట్టు కొన్నాళ్లకు సినీమాలు కూడా మూలబడచ్చు! కాని నాటకం యెప్పటికీ చిరస్థాయిగా ఉంటుంది.

రగా

సినిమా ప్రచారకులు మాత్రం సామాన్యప్రజాచిత్తవృత్తిని చాలా బాగా గ్రహించారు. ఔచితి సహృదయుడికేగాని సామాన్యప్రేక్షకుడికి కాదని గట్టిగా విశ్వసించారు. ఏసన్ని వేశాలు పెడితే వాళ్లు నిండుతారో పరిశోధన చేశారు! తుదకు కొన్ని రంగాలూ, కొంత సంగీతమూ, కొన్ని స్త్రీపురుషసమావేశాలూ, కొంత స్పర్శచుంబనాదికమూ, కొంత విలక్షణనేపథ్యమూ, కొంత నాట్యమూ, కొంతహాస్యమూ, మొదలైన వుంటే తప్పక ఫిల్ముకు వసూళ్లు బాగా జరుగుతాయని యిప్పుడు మార్కెటులో వున్నఫిల్ములే తార్కాణాలు. ఇందులోవన్నీ ప్రతిఫిల్ములోనూ వుంటాయి! పగలల్లా పనిపాటలు చేసి కొంతకాలం ఆనందించటానికి వచ్చే సినిమాసామాజికుడికి కళ కావాలా ఔచితి కావాలా? ఇటువంటి దాన్నే మాబ్ టేస్టంటారు! ఇందులో కళ యేముంది? సూచ్యానికీ, దర్శనీయానికీ యెట్టి భేదమూ లేదు! ప్రతివిషయమూ దర్శనీయమే! కర్మంజాలక చావు చూపాలకొస్తే పీనుగను వాకిట్లో కూచోబెట్టి నీళ్లుపొయ్యడం దగ్గిర్నించీ, కాట్లో దహనంచేశి యింటి కొచ్చిందాకా యేడ్పులూ పెడబొబ్బలూ సహా చూపాలశిందే! ఇది కొంచెం అతిశయోక్తిగా వుండచ్చు! ఈపరిస్థితులు మారి నాటకకళకు గౌరవ మెప్పుడొస్తుందో తెలియదు. సంసారస్త్రీలు నాటకరంగా న్నెక్కడ మనేసమస్య యెక్కడా వినపడడం లేదు. వివాహితలు చాలా కొద్దిమం దున్నారు నాటకరంగం మీద. ఈసమస్యలో కళ, నీతి, రెండూ కలిశి ఉన్నై! ఈ విషయాన్నిగూర్చి రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు తమ "నాటకోపన్యాసాల"ల్లో చాలా సమంజసంగా చర్చించారు. ఇక సినీమాసారస్వతాన్నిగూర్చి యెంత తక్కువ చెబితే అంత మంచిది. నటనంలో సూచ్యమే లేకపోతే సారస్వతంలో ధ్వనివ్యంగ్యా లెట్లా ఉంటాయి! ఇప్పుడు సినిమాకు సంబంధించింది సారస్వతంకాదు! చాలామట్టుకు చెత్త! దీన్నే పొగుచేస్తున్నారు మాలక్ష్మీకాంతమన్న గారూ మొదలైనవారు. క్వాచిత్కంగా సాహిత్యమని పిలవబడేది కూడా ఉండచ్చు. నవ్వుల్లో కూడా యీపిచ్చి వ్యాప్తమైంది. త్రిపురారిభొట్లవంటి శీలవంతుడే సహృదయుడే దీనికి సుముఖుడై వున్నాడు! సంగీతాన్ని తీశేస్తే భావప్రధానమైన పద్యంగాని పాటగాని చాలా అల్పంగా ఉందని చెప్పడం సత్యకథనమే! ఉత్తరదేశసంగీత మొచ్చి తెనుగుసినీమారంగాన్ని ముట్టడేశింది. ఆపాడేది యేభాషో తెలుసుకోడానికి వీల్లేకుండా వుంది. సంగీతంలో మాటలు మునిగిపోతున్నై! భావప్రకటనాని కొక్క ఉదాహరణం! హాసం చూడండి! పక్కలు బుజాలదాకా కదులుతై. పండ్లు కనపడతై! కంఠంలోనించీ లయతోకూడిన "హ,హ,హ,"శబ్ద మొస్తుంది! కాని యెట్టి అనురూపభావం ముఖంలో కనపడదు. ఆనవ్వు తెచ్చిపెట్టుకున్నట్టు కనపడుతుంది. ఔచితిని బట్టి చూస్తే ఆహాసం అస్థానం! ఇది భావప్రకటనకు మచ్చు!

మాబ్ మెంటాలిటీనిగూర్చి కొడవటిగంటి ఈవిధంగా అన్నాడు. (ఆంధ్రపత్రిక. 20.9.40)

"మాబ్ ఓస్టు! అది కావాలె!"
ప్రతీనటుడూ ఆమాటే అన్నాడు.
కవీ ఆమాటే అన్నాడు......
మ్యూజిక్ డైరెక్టరూ......
పెట్టుబడిదార్లూ......
ఆర్టిస్టూ......
క్లాప్ బాయ్......"

కొందఱు ఫిల్ములుమూలంగా సంస్కారం జరుగుతుందని చాలా పట్టుదలతో చెప్పేవాళ్లున్నారు. "మాలపిల్లా"దు లెంతసంస్కారం చేశాయో మనకు తెలుసు. నాటకరంగమే చెయ్యకపోతే సినిమాకళవల్ల అదిజరుగుతుందనటమంత పొరబాటు లేదు. తాత్కాలిక వినోదపరిణామంకల దీకళ. "ఫిల్ముల మూలంగా సంస్కారం జరగగలదని నే ననుకోను" అన్నాడు "నిత్యానందగారు" (27-12-40 తేది ఆంధ్రపత్రిక) కవికీ, డైరెక్టరుకూ, పాటకుడికీ, నటుడికీ, ద్రవ్యార్జనమే ఆశయమైనప్పుడు యిక కళోపాసనకూ, సంస్కారానికీ తావేదీ? డాక్టరు కజిన్సుగా రిట్లా అన్నాడు.

"టాకీయంత్రములమూలమున మానవకంఠస్వరమును విపరీతముగా అతిశయింపజేసి పెద్దగా వినిపింపజేయుటవల్ల, సహజకంఠస్వరములోని మార్దవమున్నూ హెచ్చుతగ్గుల వాదుగులున్నూ అంతర్ధానమైనవి. నాట్యాభినయములో అర్థసంభరితమై అవయవవిన్యాసములు సందర్భశుద్ధిగా చూపబడును. కాని టాకీలలో కొన్ని విన్యాసములను మాత్రమే చూపగల్గుచున్నారు. ఏదో ఒక్కవిన్యాసమునే ఒక్కొక్క సందర్భములో ప్రధానముగా పెద్ద బొమ్మగాచేసి చూపుచున్నారు.......ఇటువంటి యంత్రచమత్కారప్రభావములవల్ల మానవుల కుండు సహజరసగ్రహణశక్తికూడ నశించి, సహజభావప్రకటనసామర్థ్యముకూడ జనులకు నశింపగలదు. (ఆంధ్రపత్రిక. 25-10 40)

ఇట్లా సినీమాకళ వున్నరోజుల్లో నాటకకళాపరిషత్తును పునరుద్ధరిస్తా మంటే ప్రోత్సాహ మెట్లా కలుగుతుంది? ఆంధ్రపత్రికలో "రాజు" యిట్లా వాపోయాడు. "ఆదర్శ నాట్యమండలినిర్మాణం, ఆధునికనాటకరచనాప్రయత్నం, ఉత్తమనాట్యశిక్షణాలయం" యీ

మొదలైన పరిషత్తులాశయాలు యీడేరలేదు. కొంతకాలం నడిచి పరిషత్పత్రిక కూడా మధ్యనే నిల్చిపోయింది...క్షీణిస్తూవున్న నాటకరంగాన్ని టాకీలువచ్చి వక్క తన్ను తన్నాయి. అంతటితో ఆంధ్రనాటకరంగానికి వెన్నెముక విరిగిన ట్లైంది...టాకీలు మన దేశానికి కొత్తగావచ్చిన విజ్ఞానసాధనా లవడంచేత, మొదటి రోజుల్లో ప్రజలమీద మచ్చు మందు చల్ల గలిగాయి. ఇప్పుడిప్పుడే ప్రజలు మైకంనించీ తేలుకుంటున్నారు” ఈన యిట్లా అన్నాడుగాని నాకుమాత్రం ఆసూచన లేమీ కనపడడం లేదు. నిజంగా కళాదృష్టితో తీసినవాటికంటె యితరాలే ప్రజల నాకర్షిస్తున్నై. ఇటీవల 15-10-40 తేదీన మద్రాసులో కె. లక్ష్మయ్యగారి సంపాదకత్వంకింద మళ్లీ “నాట్యకళ” సాగిందని విని చాలా సంతోషించాము. బెజవాడ రామచంద్రా రెడ్డిగారివంటి లక్ష్మీపుత్త్రులు తమఅసహాజౌదార్యాన్ని పూనితేనేగాని యీఉద్యమం అవిచ్ఛిన్నంగా సాగదని నాఆశయం. సంపాదకులూ, వ్రాయసగాండ్లూ చాలామంది దొరుకుతారు. కాని “తండులాలు” సమకూర్చే లక్ష్మీపుత్త్రు లవసరం. సి. ఆర్. రెడ్డిప్రభృతులు సందేశాలను పంపారనడంవల్ల యెట్టిప్రయోజనమూ లేదు. తుదకు పత్రిక ఊరికే పంపాలశిందే కాని కొనరు కూడాను యిటువంటి పెద్దలు! పునరుద్ధరించిందాన్ని అంతరించకుండా చేయటం సాహిత్యసేవకుల ఆశయం.

సినిమాకళాపరిషత్తు స్థాపనైంది. అందులోవాళ్లే నాట్యకళాపోషకులూను. అక్కడి నటీనటులే నాట్యరంగంలోకి రావలసినవాళ్లూను. సినిమాకళవల్ల ద్రవ్యం పుష్కలంగా లభిస్తున్నది అందరికీ! ఇక నాట్యరంగంమీదికి దృష్టితిప్పమంటే తిరుగుతుందా? కాబట్టి యీటాకీయుగంలో నాటకకళోద్యమం యెదురీతవంటిది! సినీమాకళనూ, నాట్యకళనూ, సమ్మేళనంచేసి వక నూతనకళను (పేరేంపెట్టినట్టులేదు) సృష్టించట మవసరమని మామిత్త్రుడు నీలంరాజు శేషయ్య అన్నాడు. అన్నిమార్గాలలోనూ, నూతనత్వం కావాలనే మాశేషయ్య వంటి యువకులు చేయవలసినపని యిది! ఈప్రయత్నమే సాఫల్యం పొందితే అటు అభివృద్ధైనా కావచ్చు, నాటకకళయొక్క సంపూర్ణనాశనమైనా కావచ్చు! నాశనం పునర్జన్మకు హేతువు! కాబట్టి దుఃఖించ నవసరంలేదు.



# వార్తాపత్రికలు-పత్రికలు

## వ్యాసకర్త: శ్రీమల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ

ఈకాలమున వార్తాపత్రికల - పత్రికలప్రాముఖ్యము చాల హెచ్చినది. గత పదిసంవత్సరములనాటికంటె యీనాడు వార్తాపత్రికల - పత్రికలసంఖ్య చాల హెచ్చినది. వంగ, మున్నగు దేశభాషాపత్రికలంత హెచ్చుసంఖ్యగ మనతెనుగుభాషలో పత్రికలులేవని అంగీకరింపకతప్పదు. అయిననూ పదిఏండ్లపై కాలమునాటికంటె నేడు తెలుగుభాషలో వివిధరకములయినపత్రికలు బయల్వెడలి భాషాప్రచారము, వార్తాప్రచారము, సారస్వతాదిప్రచారములు సాగించుచున్నవి. పత్రికలన్నియు ఒకేపంథాలో అనుకరణముగ నడచుటవల్ల ప్రతిపత్రికయు ఆర్థికముగ బాధపడుచున్నది. పత్రికలు వర్గములుగ విభజించుకొని నడువవలెను. వార్తాప్రచారములకు కొన్ని—భాషాప్రచారమునకు కొన్ని, రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వ్యాపార, మత ప్రచారములకు కొన్ని - సినిమా, నాట్యకళ, సంగీతము, బాంకింగు, భీమా, సహకార, గ్రంథాలయోద్యమ, రాష్ట్రోద్యమ, అంతర్జాతీయప్రచారము మున్నగు వాటికి కొన్ని యిట్లు వేర్వేరుగ పత్రికలు నడచుచో ఆయావిషయములం దభిమానముగలిగినవారలు ఆయాపత్రికలు తెప్పించుకొని చదివి ఆనందించుటకు వారికభిమానమగువిషయముపై బుద్ధి కేంద్రీకరించుటకు వీలుండును. అట్లు వర్గములుగ పత్రికలు నడచిననాడే ఆయాపత్రికలు ప్రాముఖ్యమువహించి ఆర్థికముగ ప్రజల అభిమానులసహాయము పొంది చిరకాలము నడువగలవు. అట్లుకాక అందరు అనుకరణముగ ఒకేమార్గమున పత్రికలు నడిపింపబూనుటచేతనే అనేకపత్రికలు పుట్టినవెంటనే గిట్టుచున్నవి. మాసపత్రికయైనచో తొలిసంచికలోను, పక్షపత్రికయైనచో రెండవసంచికతోను, వారపత్రికయైనచో మూడుసంచికలతోను ఆగిపోవుచున్నవిషయ మందరెరింగినదే కదా.

పత్రికను ప్రతివారు స్థాపించుటకు పూనుకొనుట తగినపని కాదని అనుభవపరిస్థితులనుబట్టి తేలుచున్నది. తగిన ఆర్థికసంపత్తిని సమకూర్చుకొనకనే (కనీస మొకవత్సరమునకైనను) వెఱ్ఱి ఆవేశములతో పత్రికలను స్థాపించరాదు. పత్రికను స్వయముగ నిర్వహించుటకు తగినభాషాసామగ్రిని కూడ అలవరచుకొనినవాడే తగిన ఆర్థికసంపత్తితో పత్రికను స్థాపించదగునుగాని నేనూ పత్రికాధిపతినని సంపాదకుడనని అనుపించుకోవలెననేదృష్టితో పత్రికలు స్థాపించుట కూడదు.

త్రి లిఙ్గరజతోత్సవము

విషయపరిజ్ఞానము, విమర్శనాశక్తి, మంచికూర్పు, చక్కనిభాషాశైలి, చలించని అభిప్రాయములు పత్రికాసంపాదకునకుండదగిన ముఖ్యయోగ్యతలు. తమ కనుకూలమైన వార్తలను, వ్యాసములనే ప్రకటించి తమబుద్ధికి వ్యతిరేకమైనవి మంచివైనను ప్రకటించని సంపాదకు లెందరో గలరు. ఇది సత్పత్రికాధిపతునిలక్షణము కాదు. పత్రికాధిపతి ప్రజలనాకర్షించువాడుగ నుండవలెను. ప్రజలను తనవైపుకు త్రిప్పుకోగలిగినంతటి శక్తిగలవాడుగా గూడ నుండవలెను. కొందరివ్యక్తులబొమ్మలను ప్రకటించి వారిని పొగడి ధనమార్జించుటకే కొన్ని పత్రికలు పనిచేయుచున్నవి. ఈపద్ధతి చాల విమర్శనీయము.

విదేశములలో పత్రికాధిపతులు సంపాదకులు విలేఖరులు ఉన్నతస్థానము కల్గియున్నారు. ఒకవ్యక్తి చెప్పినమాటకంటె ఒకపత్రిక చెప్పినమాటకు చాల విలువ కలదు. కారణ మేమి? పత్రికాభిప్రాయమనగా విషయపరిజ్ఞానానుభవము కలిగినవకవ్యక్తి పత్రికద్వారా తనసందేశమును ప్రజలలో కేంద్రీకరించుచున్నాడన్న మాట. అందుచేతనే ప్రభుత్వదృష్టిలో పత్రికలు ముందు కనుబడుచుండును. పత్రికయొక్క గౌరవము, దానిచదువరులసంఖ్యమీద, దానిచందాదారులసంఖ్యమీద—ఈరెంటికంటె సంపాదకుని లేఖనీమాధుర్యముమీద ఆధారపడియున్నది. ప్రజల నాకర్షించిన పత్రికాసంపాదకీయనుకొఱకు ప్రజలు నాయకులు ప్రభుత్వము ఎదురుచూచుచుందురు. మనదేశప్రజలు రాజకీయచైతన్యఫలితముగనే పత్రికలు చదువుట కలవాటుపడినారని అంగీకరింపవలెను. కాలక్రమేణ యీనాటికి పల్లెలలో పత్రికాపఠనమునం దభిరుచి పెరిగినది. పత్రికలు కొని ఆసాంతము చదివెడువారు నేడు చాల మంది పల్లెలలో గలరు.

నేడాంధ్రావనిలో వ్యాసకర్తలసంఖ్య కూడ చాల హెచ్చినది. ఇరువదేండ్లనాడు ఆంధ్రమున వ్యాసములు వ్రాయగలిగినవారు చాల తక్కువమంది యనుటతిశయోక్తికాదు. ఈనాడు వ్యాసకర్తలసంఖ్య లెఖ్ఖకు మిక్కిలిగ పెరిగినది ఈయభివృద్ధియంతయు వార్తాపత్రికల పఠనమూలముగా పెరిగిన విజ్ఞానవ్యాప్తిఫలితసంఖ్యయేగాని విశ్వకళాపరిషత్తులచదువులవల్లగాని, హైస్కూళ్లలో చదువు చదువులవల్లగాని కల్గినదికాదని యెలుగెత్తి చెప్పవచ్చును. ప్రజలలో విజ్ఞానవ్యాప్తి-రాజకీయచైతన్యము కల్గించుట కీనాడు పత్రికలు చేయుచున్నంత సహాయము యేదియు చేయుటలేదు. పోనుపోను పత్రికలస్థానము ఉన్నతస్థానమునకు పోవుచున్నది. కొన్నిపత్రికలను చూచిన ప్రభుత్వములకు కూడ భయమే—కారణ మాతనిలేఖనిలోగల భావప్రభావమేగాని వేరుగాదుకనుకనే పత్రికలను ప్రభుత్వము ఒక కంట చూచుచునే యుండును. పాశ్చాత్యదేశములలో పత్రికారచన వృద్ధియై, వృత్తులలో

గౌరవస్థానము పత్రికారచయితలకు కల్గినది. ఆదేశములలో పత్రికలవారు వ్యాసకర్తలకు, రచయితలకు మంచివేతనములిచ్చి పోషించి గౌరవించుచున్నారు. అయితే అచ్చట పత్రికలు లక్షలచందాదార్లతో ధనమార్జించుచున్నవి. మనదేశమున పత్రికలకే తగినపోషణ చాల తక్కువగనున్నది. అట్టిస్థితిలో విలేఖరులనేమి పోషించుదురని చెప్పవచ్చును. కష్టపడి తన బుద్ధిని ఒకవిషయముపై కేంద్రీకరింపజేసి వ్రాసినవారికి ఉడతాభక్తిగనైనను పత్రికలవారు సన్మానించుట సమంజసము. సన్మానించుటమాట యటుంచి ఒకరివ్యాసమును ప్రకటించుకొని ఆవ్యాసకర్తకు అసంచికనైననూ పంపని పత్రికాధిపతులు లెఖ్ఖలో నున్నారు. ఇయ్యది కడుం గడు శోచనీయము—పత్రికాసంపాదకులు విశాలబుద్ధి కలిగి వ్రాసినదానిలో యున్నవిలువను గుర్తించగల్గినవారుగా నుండవలెను. కొందరు పత్రికాధిపతులు పడికట్టురాళ్లవలె ఒక జాబితాదాఖలా పేర్లుగల వారిరచనలనే ప్రకటించి క్రొత్తవారికి తావీయరు. ఇంతకంటె దారుణము లేదు. పత్రికాధిపతి నూతనవ్యాసకర్తలను, లేఖకులను సృష్టించవలెను ఆయాఉద్యమములలో పనిచేయుచున్నవారిని, పరిశోధకులను, రచయితలను వెదకి ఈవిషయమును గురించి మీరు వ్యాసము వ్రాయవలెనని కోరవలెను. వారికి ప్రోత్సాహమీయవలెను. ఎల్ల కాలము ఒకేజాబితావారివ్యాసములనే ప్రకటింతుమని దలచుట తగనిపని. ఇప్పటి గొప్పవారందరు మొదట సామాన్యులేనని జ్ఞాపకముంచుకోదగును. యువజనులను,నవీనులను ప్రోత్సహించి, వారిభావములను కూడ ప్రజాబాహుళ్యమున జొప్పింప పత్రికాధిపతులు చేయవలసినముఖ్యకార్యములలో నొకటి.

పత్రిక లేపరిస్థితులలోను వ్యక్తులను విమర్శించరాదు. విమర్శించుటకు స్థానమీయరాదు. ఏపత్రికయు ఒకపక్షమువహింపరాదు. రెండుపక్షములకు తావిచ్చి తనయభిప్రాయము బాహాటముగ యిచ్చవచ్చినట్లు వ్రాసుకోవచ్చును. సద్విమర్శన యెప్పుడూ మంచిది. విమర్శనలో అనేకనూతనభావములు బయల్పడును.

వ్యాసకర్తలును విషయపరిశ్రమచేసిన వ్యాసములను వ్రాయుచుండవలెను. వ్యక్తులను ఏపరిస్థితులలోనూ విమర్శించరాదు. భాషాప్రాముఖ్యముకంటె విషయప్రాముఖ్యమే యీనాడు ముందు చూడబడుచున్నది. అట్లని భాషాప్రాముఖ్యము చూడకూడదని వలదని నాయభిప్రాయముకాదు. విషయప్రాముఖ్యమునుబట్టియే వ్యాసములను ప్రకటించవలెనని నా సూచన. భాషావిషయమున తెలుగుపత్రికలు చాల ముందంజవైచినవి. పత్రికలు ప్రజలందరి కొరకుగాని ఏవకవర్గమువారికి కాదు. సామాన్యప్రజల కర్థముగానిరచనలు పత్రికలో ప్రకటించరాదు. పత్రికలలోని ప్రతిభాగము ప్రతిమాట సామాన్యునికి కూడ అర్థముకావలెననే

దృష్టితోనే పత్రికలయధిపతులు వ్రాయవలెను. వ్యాసములు ప్రకటించవలెను. ఈపై తెలిపిన నాయభిప్రాయములు ఎవ్వరిని ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని విమర్శించుటకు వ్రాసినవి కావు. 1926 సం. నుంచి అనగా 15 సంవత్సరములనుంచి వివిధపత్రికలలో నే వ్రాయుచున్న వ్యాసముల అనుభవఫలితముగ, వివిధపత్రికాధిపతుల పరిచయఫలితముగ, నాయనుభవమునుబట్టి తెలిపినవేగాని వేరుకాదని మనవిచేయుచున్నాను. పత్రికలను కొనుటకు ఆంధ్రులు యింక బాగా అలవాటుపడలేదు. యీనాడు ప్రజలుచేయు దుబారా ఖర్చులలో పత్రికలుకొనుఖర్చులు ఎక్కువకాదు. మనపత్రికలను మనము కొని పోషించవలెననుజ్ఞానము ప్రతివారికి కలగవలెను. ముఖ్యముగ ఆంగ్లభాషాభ్యాసకులకు (ప్లీడర్లు టీచర్లు వగైరా) దేశభాషా పత్రికలయందు హేలనిరసనభావము క్షమింపరానిది. ప్రతిరాష్ట్రీయుడును ముందు తనమాతృభాషాపత్రికనుకొని తర్వాతనే తదితరభాషాపత్రికలను కొనవలెను. ఈరోజులలో పత్రికను నిర్వహించుట సామాన్యమైన పనిగాదు. అనేక పత్రికలు కూలిపోవుచున్నవి. 'త్రిలిఙ్గ' పత్రికను 25 సంవత్సరములనుండి జయప్రదముగ నిర్విఘ్నముగనడపుచున్నసంపాదకులు యజమానులునగు భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు కడుస్తోత్రనీయులు. వారిభాషాసేవ, ప్రజాసేవ ప్రశంసార్హములు.'త్రిలిఙ్గ'తెనుగుపత్రికలలో ఉత్తమశ్రేణికిచెందిన వారపత్రిక. పండితులు 'త్రిలిఙ్గ' ను ప్రత్యేకముగ గౌరవింతురు. 25 సంవత్సరములనాడు ఏయభిప్రాయములతో త్రిలిఙ్గ వెలువడినదో ఆయభిప్రాయములతోనే యీనాటివరకు త్రిలిఙ్గ నడచుచున్నది. 'త్రిలిఙ్గ' పల్లెలకు హెచ్చు వెళ్లునని శ్రీశాస్త్రిగారొకప్పుడు చెప్పియున్నారు. త్రిలిఙ్గ ఆంధ్రదేశమునకు, ఆంధ్రభాషకు, హిందూమతవిజ్ఞానరక్షణకు, వైదికమతవ్యాప్తికి, భారతజాతీయత్వమునకు చేసినసేవ గణనీయము. 25 సంవత్సరములు త్రిలిఙ్గ జయప్రదముగ నడచి రజతోత్సవము జరుపుకొనుచున్న శుభసమయమున యీవ్యాసము వ్రాయ నవకాశము కల్గించిన నాచిరకాలమిత్రులు పూజ్యులునగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారినభినందించుచు శతవత్సరములు త్రిలిఙ్గ నడచి ప్రజాసేవ, దేశసేవ, భాషాసేవ యొనర్చునట్లు శ్రీకృష్ణభగవాను డనుగ్రహించుగాకఅని కోరుచు విరమించుచున్నాను.



# రేడియో కబుర్లు

శ్రీ భమిడిపాటి కామేశ్వరరావుగారు, బి. యే., యల్. టి., రాజమహేంద్రవరము.

నాదప్రసరణానికి భూ-జల-వాయ్వాకాశాలు తోడవుతాయి. ముఖ్యంగా మానవులుండేది గాలిలోనే గనక వాయువు నాదవాహకంగా ఉంటుందనేమాట మానవులు గమనిస్తూండేవిషయమే. పోనీ వాయువేగం వేరూ, వాయువులో నాదవేగం వేరూ అయినా, జనించిన ఒక నాదతరంగాన్ని వాయువు తనప్రకంపనశక్తివల్ల మోసెయ్యగలదనేమాట రూఢి. అది అట్లా మోసెయ్యకలదేగాని, విశేషదూరం గడవకుండానే నాదంయొక్క పటుత్వం క్షీణించి క్షీణించి త్వరలో ఆనాదమే అంతరించిపోతుంది. (నాదానికి అల్లా క్షీణించేలక్షణమే గనక లేకపోతే భూగోళం ఎల్లప్పుడూ గందరగోళంగా ఉండవలిసొచ్చేది గనక మనం విచారపడనక్కర్లేదు!) ఒకవేళ; అల్లా అంతరించకుండా నిలవగల సామర్థ్యం నాదానికి ప్రసాదించాం అనుకోండి, అనుకున్నా, భూమికి సగంచుట్టు తిరిగిరావడానికి నాదానికి ఒక పూటా అందుపైన నాలుగుగంటలూ కూడా ఇంకా చాలనేచాలదు. భూగోళంమీద ఉండే ఏయిద్దరిమనుష్యులకైనా మిక్కిలి ఎక్కువదూరం (భూమియొక్క అర్ధపరిధి గనక) పదమూడువేలమైళ్లు మించదు. అటువంటి యిద్దరిలో ఒకడు మాట్లాడితే రెండోవాడికి వినపడడం నాదబలానికి అతీతం గనక అసంభవంఅని మానవులు నమ్మేవారు. కాని, మానవులవిజ్ఞానమూ, ఆలోచనా, కార్యాచరణా, జీవితావసరాలూ పెరిగినకొద్దీ, ఎవరో ఒకజ్ఞాని మరోపన్లోఉండి ఒక విద్యుద్దీపప్రయోగంలో గావించిన ఊహానుమానబీజంవల్ల 'రేడియో' అనేసంస్థ ఆవిర్భవించినమీదట, అసంభవం అని లోగడ అనుకున్నపని, సంభవంఅయినా పూటకాలంలోకుడా కాదనుకున్నపని, సెకనుయొక్క ఒక వీసభాగంలో జరిగిపోతూండడం విశేషనాగరికత లేనివాళ్లకి కూడా పరిపాటి అయినసంగతి. అనగా రేడియో వచ్చి, వాయుదేవుడు వేగవిషయంలో ఎంతపేరుపడ్డప్పటికీ ఆ "మంద" పవనంగార్ని నాదవాహక్రియలోంచి కొన్నిసందర్భాల్లో తొలగించి, ఆపని తనుచేసి, దూరాన్ని జయించేసి, దూరశ్రవణం సుసాధ్యం చేసింది. ఇక, ప్రేషకస్థానంలో నాదోచ్చారణ చెయ్యగానే ఉద్భవించే నాదతరంగం, దాన్ని అనుసరించి సూక్ష్మాతిసూక్ష్మాలతో శబ్దగ్రాహిలో బయల్దేరే విద్యుత్తరంగం, దాన్నిబట్టి ఉండే ప్రవర్ధకతరంగం, అది పరివర్తనకోశంలో పడ్డమీదట పుట్టే క్రమణికతరంగం, తద్వారా ప్రకంపనతరంగం, సాధారణసాతత్యంలోంచి

మహాసాతత్యంపొందిన ప్రవాహకతరంగం, దాన్నించి కాంతవిద్యుత్తరంగం, తత్ప్రసరణం, పైక్రియలన్నీ విలోమంగా నడవడానికి ఏర్పాట్లుచేసుగుని గ్రాహకాన్ని అదే స్మృతిలో మేళగించి జనంకూచున్న ప్రతిష్ఠలంలోనూ అసలునాదం యథారీతిగా సిద్ధించి సెకనుయొక్క వీసభాగంకంటె తక్కువలో వినపడడం—అనేటటువంటితికమకలు 'రేడియో' అనేది తన నిత్యకృత్యంలో పడేపాట్లు! అన్నట్టు ప్రేక్షకస్థానంలో ఉండే నాదచోదకులు కూడా అటువంటిపాట్లు పడతారు. తక్కినవాళ్లు ఫలితం వినడానికి చెవికోసుగుంటారుగాని, అటువంటి వాటిని చెవినిపెట్టరు.

'రేడియో' లో విశేషాలు ఏమిటంటే వినపడేదూరంపొడూగునా శాస్త్రీగేనా లేకపోడం ఒకటీనూ, నాదం భూమి అంతటా సెకనుయొక్కభాగంలోనే చుట్టబెట్టి వినిపించడమూనూ! ఇతరగ్రహాలదగ్గిరికి భూమినాదం ఈయంత్రంవల్ల వినిపించదని చెబుతారు. వెళ్లి తిరిగొచ్చినవాళ్లు చెప్పేవరకూ అది ఒప్పుగున్నా తప్పులేదు. మనిషియొక్క దేశాభిమానం భూగోళాభిమానంగా మారడానికి అవకాశాలు రేడియోలో ఉన్నాయి. పరభాషలు వినేటప్పుడు అవి కూతలులా ఉన్నాయనీ పరగానాలు వినేటప్పుడు అవి ఒకటోరకం ఏడుపులులా ఉన్నాయనీ జనం అనవసరనిరసనం చెయ్యడంపోయి, ఆయానాదాలు వాళ్లవాళ్లకి శ్రావణయోగ్యంగాఉండే కవిత్వగానాలుగావును అని సరిపుచ్చుకోగలగడమే గొప్పసహనశక్తి గనక అది రేడియోవల్ల అభివృద్ధి అవుతుందని చెప్పవచ్చు. భాషేకాక, గానమేకాక, ఇతరనాదలేశ సముదాయం కూడా హృదయాన్ని ఆకర్షించి అర్థదాయకం కూడా కావచ్చునని రేడియోలో తెలుస్తుంది చదవడంలోనూ వ్రాయడంలోనూ అవసరం అయే శ్రమగాని, శ్రద్ధగాని దీక్షగాని లేకుండానే—ఆమాటకొస్తే, అసలు చదవడం వ్రాయడం తెలియవలసిన అవసరం లేకుండానే, ఏకకాలమందే అనేకమానవుల్ని జ్ఞానవంతుల్నిగా చెయ్యడానికి రేడియోకి సామర్థ్యం ఉంది. శారీరిక మానసిక ఆత్మికసందర్భాల్లో మానవజాతికి అవసరం, అనుగుణం, అనుకూలం, ఆనందంగల ఏవిషయం అయినా సరే అరటిపండు ఒలిచినట్టు వినిపించగల ప్రజ్ఞ రేడియోదే. రేడియో నిమిత్తం అయే సొమ్ము ఖర్చూ కాలవ్యయమూ గమనించి అందుకు తగ్గట్టుగా ఎంతమంది పామరజనం అజ్ఞాననిద్రలోంచి మేల్కొల్పబడ్డారూ, వాళ్లవిజ్ఞానపుమట్టం ఎన్నిఅంగుళాలు పైకి ఎగిరిందీ, అనే లెఖలు ఎప్పటికప్పుడు తేల్చడానికి వీలైనరకంవి కావు. అసలు పామరజనం రేడియోలాభం పూర్తిగా పొందగలరా అనేదే మీమాంస. ఎందులోనైనా సరే గొప్పవాడొచ్చి మాట ఆడినా, గానశాస్త్రి వచ్చి పట్టుపట్టినా, రొదచేసినా, జనం వినడానికి గ్రాహకపు

పెట్టెలున్నచోట్లకి ఎగడతారు. రేడియోలో మాట్లాడింతరవాతగాని, పాడింతరవాత గాని గొప్పవాళ్లైన వ్యక్తులుకూడా వెతికితే విధిగా దొరికితీరతారు. మధ్యరంగం వాళ్లకి రేడియోవినడం మంచివ్యసనం. నస్యం, కాఫీ-పీల్చడపువ్యసనంలాగే, టాకీ చూడడపు (తెలుగుదైతేవినడపు) వ్యసనంలాగే, వార్తాపత్రికలు చదవడపు (డబ్బుఖర్చు తనదికాకుండా ఉండేషరతుకి) వ్యసనంలాగే, ఈవ్యసనమూనూ! అందుకని ప్రేషకభవనంలో గంటలప్రకారం—కాదు! సెకనులప్రకారం—కొందరు పనిచెయ్యాలి, అల్లానే లక్షలాదిజనం, ఇతరపని (అగ్నిహోత్రాలు చెయడంవంటివితప్ప) మానుకుని గ్రాహకయంత్రాలచుట్టూ మూగాలి. రేడియోవినడం మంచినిషా అనికూడా కొందరుఅంటారు. కొన్ని ఇతరనిషాలలో పడిఉంటూండే సమయాల్లో ఎవరైనా తనదుఃఖాలు హాయిగా మరిచిపోగలగడమేకాకుండా తనయిష్టంలేకుండా తననే మరిచిపోవాలి, కాని, ఇందులో అంతమట్టుకురాదు. ఎటొచ్చీ, విని విని విని ఏమివిన్నావు అని ఎవరేనా అడిగినప్పుడు, అన్నీ కొట్టుకుపోయాయి ఫలితం సున్న అనిగాని, ఓదాన్ని ఓదాంతో కొట్టెయ్యగా ఒఖ్ఖటే ఫలితం, అది నేనే అనిగాని చెప్పుకోడానికి చాలా అవకాశంఉంది. జనానికి ఆదిలో శబ్దమే ప్రమాణం, మధ్యకాలంలో గ్రంథప్రమాణం కావలిసొచ్చింది, కాని మళ్లీ ఇప్పుడు శబ్దప్రమాణంలో పడేటట్టు కనిపిస్తారు. రేడియో అనేది పత్రికలపాలిట ఇటీవలపుట్టిన దుడుకుసవితి. అయినా "చేత" అనగలపత్రికలుకూడా "వాత" అనగల రేడియోదగ్గిర నోరెత్తలేవు. కనబడి వినబడే నాటకలోకంయొక్క వినబడే సగం చెక్కనీ రేడియో స్వాధీనపరుచుకుంది. రాబోయే టెలివిజన్, ఆతక్కిన కనబడేసగంచెక్కనీ దఖలు పరుచుకోబోతోంది. చెలరేగుతూన్నటాకీ యావత్తునాటకాన్నీ బొమ్మకట్టిమింగేసేయత్నంలో ఉండనేఉంది రేడియో వినిపిస్తూ పనిచెయిస్తే కూలివాళ్లు ఎక్కువపని చెయ్యగలుగుతున్నారని తెలుస్తుంది.

రేడియోసెట్టు వీపుమీదపెట్టి ఆవుల్ని పాలుపితికితే మామూలుకంటె ఎక్కువగా పాలిస్తున్నాయని కనిపెట్టారు. అట్లాకాక, మామూలులో తన్నేరకంవి ఇటువంటప్పుడు ముందుకుమ్మేసి ఆవెనక తన్నేసినా ఉభయత్రాకుడా రేడియోసెట్టుకి ప్రమాదం ఉండదని రూఢిగా చెబుతున్నారు.

రేడియోశక్తి బలాన్నిబట్టి చెట్లనికోరినసైజులో పెంచుతున్నారు.

రేడియోవల్ల కుదర్చగలరోగాలకంటె వచ్చేరోగాలు చాలాతక్కువే అనేసంగతి పరిశోధనవల్ల తేల్చారు.

ఒకవ్యక్తి ఏదోయంత్రంకేసిచూస్తూ, కనిపించని జనశతాల్నిగురించి, వారిమెప్పూ వగైరాలు తనకు అందే చిక్కులేకుండా, హృదయంవిప్పి, హృదయంగమంగా నాదం చెయ్యడం ఒక గొప్పకళ అని ఒకమహావాదంలో ఒకపార్టీ దెబ్బలాడగా, అది కళకాదు కేవల ద్రుతప్రకృతికమే అని ఇంకోపార్టీ ప్రతిఘటించారు.

జనంఎదట ప్రత్యక్షంగా నిలబడి నెగ్గలేనివ్యక్తికూడా రేడియోలోంచి ఉపన్యాస వాచికంగాని గానంగాని చేసేటప్పుడు వినేజనం తమ ఇష్టాయిష్టాల్నిబట్టి గోలచేసినా గొల్లుమన్నా, తనుమాత్రం మానక్కర్లేదు, సంయించకపోతే జనమే మానుకోవాలి.

ఒకళ్లని వారిపక్కింటివాళ్లు తిట్టేటప్పుడు, ఈకాలంలో ఆఒకళ్లు మళ్లీ తిట్టక్కర్లేదు. తమరి రేడియోసెట్టువిప్పి ఆక్షణంలోవారికే పరదేశపు బ్యాండులాంటిదిపెట్టేసి తప్పొగుంటే సరి, అవతల వాళ్లతిట్లు తక్కున కట్టిపోతాయి.

ఒకవేళ పక్కింటివాళ్లు కోపధారిబాపతై, వీళ్లు విరామంలేకుండా రేడియో వెయ్య డమువల్ల తమరు కోపంలో మరీ రెచ్చిపోయి, వీళ్లని సరసంచాలించండనికోరారా, వీళ్లు గంటకి రూపాయిలాంటి రేటు మాట్లాడుకుని, ఇచ్చిన డబ్బునిబట్టి ఎన్నిగంటలో లెఖ్ఖ వేయించి అంతసేపూ ఆపడానికి తెగించవచ్చు.

రేడియోనాటకాల్లో నటులు కాగితాలకేసిచూస్తూ నాటకాన్ని పెదవుల్తో గిరవ టేయ్యడానికి వీలుంది. మామూలుగా జీవించేనటులు వచ్చినముక్కలు ఎల్లాచెప్పాలీ అని బాధపడితే రేడియోనటులు ఏమి ముక్కలాచెప్పడం అని ఆడేటప్పుడే కళ్లతో తడుముకో వలిసిన అవసరాలుకలగచ్చు.

రేడియోపత్రకార్యక్రమం తెలుగులో అచ్చుకొట్టగా అది ఆంధ్రులికి అవసరంలేక పోయింది గనక, ఇతరభాషలవాళ్లకి మూడునాలుగేసిరేడియోస్టేషన్లు పడ్డతరవాత, ఏకంగా మహాంధ్రారేడియోస్టేషన్ పురమాయిస్తారు అని గ్రహించుకుని, అది తీరా కట్టొచ్చేసరికి, ఏ ఊళ్లోనూ లేక ఏ ఊరుసమీపంలోనూ అని యథాప్రకారం మళ్లి దెబ్బలాటరావచ్చును గనక, ఆపనిమీద ఇప్పణ్ణించీ ఆంధ్రులంతా నడుంకట్టి నిద్రపోతారని వినపడుతుంది.

రేడియోపాలకులకి జనందగ్గిర్నించి వెళ్లే ఉత్తరాలసంఖ్యనిబట్టి రేడియోలో మాటకి గాని పాటకిగాని ఆహ్వానపునరాహ్వానాలు ఉండవచ్చునని అంటారు. ఒక్కొక్కపాటో మాటో అయింతరవాత, దాన్ని జనం ఎల్లాభరించినా, అది అద్భుతంగా ఉండేసినట్టు పైవారికి ఉత్తరాలు కురవాలిట, కురుస్తూంటాయి. అసలు అవి వేర్వేరుగాఉన్నా ఫరవా

లేదు. ఉంటూండవు. వేర్వేరు ఊళ్లనించివెళ్లినా మతలబుఒకటే అవడం చిత్రం. ఒక్కొక్కప్పుడు ఆడుత్తరాలురాసేవాళ్లు అందరూ ఒకేరీతిగా పొరపాటుపడతారో గ్రహపాటో, దిక్కుమాలికర్మం, ఆ అసలుగాయకుడుగాని "మాటకుడు" గాని వీళ్లేక నియమించిన ప్రకారంవెళ్లి పాటగాని మాటగాని ఆడిఉండకపోయినా, ఆజరగని కార్యక్రమం అద్భుతంగా జరిగిపోగా తమరు వినేశాం అని ఉత్తరాలు దిమ్మరిస్తూంటారు. ఉత్తరాలవల్ల ఏం నిర్ణయం అవుతుందయ్యా అంటే లిఖితసాక్ష్యంగదా! శబ్దం చేసేరేడియోకి శబ్దసాక్ష్యం పనికిరాకపోడంలో ఆశ్చర్యంలేదు.

రేడియోస్టేషన్ పాలకులచర్య, వాళ్లపుణ్యంవొప్పున, మహానిరంకుశం! అనగా మరేంలేదు, వాళ్లే అనాలి, జనం వినాలి. కుయికంయి మనకూడదు, అనలేరు. మొరలు వినిపించవ్, రచనలు పత్రికలకి పంపితే, వారికీ వారికీ ఏవేనా పేచీలురావచ్చు. చూడండీ, అంచేత అరచనల్లో కొన్నికొన్ని వాక్యాల దగ్గిరికొచ్చేసరికి సిరా మంచిరకంది కాకపోడంవల్ల ఆవాక్యాలు కాగితానికి అంటుకోవు. కాని నిరంకుశత్వానికీ కాలం ఉంది. "హార్ హిట్లర్"ని మొట్టికాయవేసే పైవాడు "హిజ్ హిట్లరు" ఉండితీరతాడు-అని మాడాక్టర్ ప్రెసిడెంటు ఒకసారి "డిన్నర్" మధ్యలో సెలవిచ్చారు. అమెరికాలోని ఎలెక్ట్రిక్ ఇంజనీరు—డాక్టర్ సీల్ మోరే హాప్కిన్స్ అనే ఆయన ఒకచిన్నయంత్రం కనిపెట్టాడట. అది త్వరలోనే అమ్మకానికి వస్తుందిట. అది ప్రతీరేడియోసెట్టుకీ పెట్టవచ్చుట. దాల్లో ఎవరు మాట్లాడినా తక్షణం ఆమాట ఛేష్ అన్నారే ఛీఫ్ అన్నా సరే రేడియో చోదకస్థానంలో వినిపిస్తుందిట. అప్పుడు అన్నిగ్రాహకరేడియోలవాళ్లూకూడా తమ ఆనందవిచారాలు ఒకేసారి వెలిబుచ్చి రాట్టాయినా ప్రేషకరేడియోస్టేషన్లో పనిచెయ్యడంగాని, దానికి సమీపంలో ఉండడంగాని, కొంచెం ఇబ్బందిగానే ఉండవచ్చుట. కాని ఒక మంచిలాభం ఉంటుందన్నారు. రేడియోసెట్లు ఎంతమందికొన్నారో అంతమందీ గనక మెచ్చడమో తిట్టడమో కానిచ్చేసరికి, సెట్లు ఎన్నీ అనేలెక్క, జనాభా లెక్ఖకంటే ఖంజాయింపుగానూ త్వరగానూ తెలిసిపోవచ్చుట!

రాత్రివేళ కొన్ని రేడియోసెట్లలోంచి వచ్చేమాటలు కంపుకొడుతున్నాయని అంటారుగాని, మనం ఈకాలంలో అల్లాంటిమాటలు నమ్మకూడదు.

వినేజనం తమకుతెలియంది గంటసేపు భరించగలరుగాని తెలిసేది పావుగంట భరించలేరు. సంగీతంలో మాటలకి అర్థాలు స్ఫురించకపోయినా తెలిసినట్టు అనుకోవాలి, రాగాలకి అర్థాలు అడగకూడదు. ఇక, పదరచనలో మాటలకి అర్థాలు తెలియాలి, లేకపోతే ఉచ్చారణే అడ్డిపోతుంది. అర్థజోక్యంలేని రచనల్లో ఆనందం అనుక్షణం కలిగించవచ్చుగాని,

## త్రిలిఙ్గరజతోత్సవము

తెలిసేమాటల్లో అనేకులకి ఒకడు చెయ్యగలమహోపదేశం ఈరోజుల్లో రోజూ ఎక్కణ్ణించి వస్తుంది కొత్తదీ! అందుకని, రేడియోకవిత్వంవిలవ రేడియోగానం విలవలో దశాంశం కూడా ఉండదు.

జేబులోకి సరిపోయే రేడియోసెట్లు పాతికేసిరూపాయలకి వస్తాయని చెప్పుగుంటూండడంవల్ల, సగంరేట్లు అయింతరవాత సినీమాకి వెళ్లినట్టు, అప్పుడు మనంకూడా ఓసెట్టు కొనుక్కోలేక పోతామా అని అస్మదాదులు లోపలలోపల కుట్రలు పనుతున్నారు.

జేబురేడియో అయింతరవాత చెవలరేడియో బయల్దేరుతుందని ఇంకా మరికొందరు చెవులు నిక్కపొడుచుగుని ఉన్నారు. వాళ్లు యనుకునేసెట్టు అయిదురూపాయిలే. చివరకి ఎల్లానూ వినవలిసింది చెవేగనక, ఆసెట్టు చెవికే తగిలించెయ్యచ్చు, కుండనాలూ తమ్మెట్లూ లాగ! ఒకచెవికే అయితే అసహ్యంగా ఉండవచ్చు గనక, రెండుచెవలకీ—ఒకటి స్వదేశ వార్తలకీ రెండోది విదేశకార్యక్రమాలకీ అని పెట్టుగుంటే బాగుంటుందని చెబుతున్నారు. ఒకవేళ, వాటిబరువువల్ల చెవులు దీర్ఘంఅయినా ప్రస్తుతం పూర్ణకర్ణాభరణాలు ధరించేవాళ్ల చెవలకంటే ఎక్కువ దీర్ఘంకావనిన్నీ, అసలు దీర్ఘశ్రవత్వం క్రమేపీ వృద్ధశ్రవత్వంలోపడి మిక్కిలి వైభవంగా ఉండబోతుందనిన్నీ కొందరు అభయం ఇస్తున్నారు.

ఒకవేళ, టెలివిజ్షకకూడా ఈలోపులోనే ప్రచారంలోకివస్తే తక్షణమే—అనగా ఇంటిటెలివిజ్షకసెట్టూ, జేబుటెలివిజ్షకసెట్టూ, కంటిటెలివిజ్షఅసెట్టూ, అంటూకూచుని కాలం పాడుచేసి పారెయ్యకుండా, మొదట్లోనే కళ్లసెట్టు ప్రచారంలోకితెచ్చేస్తారని చాలా నమ్మకంగా అంటున్నారు. ఇదివరకే మామూలు కళ్లజోడు ధరిస్తూన్నవాళ్లవిషయంలో అర్ధచంద్రాకారంలో అద్దాలు కేటాయించి, పైఅర్ధాలలోంచి చూసినప్పుడు ప్రత్యక్షరూపాలూ అడుగుఅర్ధాలలోంచిచూస్తే, అవి టెలివిజ్షన్‌సెట్టువి గనక, పరోక్షరూపాలూ ఏకముహూర్తంలో కనిపించేటట్టు చేస్తారనిన్నీ, అప్పుడు ప్రత్యక్షపరోక్షాలుగాని, లేకపోతే పోనీ సగుణనిర్గుణబ్రహ్మాల్నిగాని ప్రతీదుర్గుణబ్రహ్మా చూడవచ్చుననిన్నీ, పైన వాశిష్టంఅనిన్నీ, తెలుస్తుంది.



# “శారద్వతుని చెన్నపురియాత్ర”

## అను చెన్నపురి సౌభాగ్యము.

విద్వాన్ శ్రీమంకాల శ్రీపతిశాస్త్రిగారు,
సీనియర్ తెలుగుపండితులు, సర్: ముత్తయ్యశెట్టి హైస్కూలు, మదరాసు.

---

### చెన్నపురి.

భరతఖండమునందలి చెన్నరాజధానికి ముఖ్యపట్టణము చెన్నపురి. ఈచెన్నపురికే చెన్నపట్టణము, మద్రపురి, మెడ్రాసు, మదరాసు అనిపేర్లు. పూర్వ మొకతెలుఁగురాజుండెను. ఆయనపేరు చెన్నప్పనాయుఁడు. అతఁడే దీనిని ఇంగ్లీషువారికి విక్రయించెను. అందువలన దీనికి చెన్నప్పపట్టణ మనుపేరు గలిగెను. కాలక్రమమున చెన్నప్పపట్టణము చెన్నపట్టణ మయ్యెను.

“వైభవమున చెన్నపురి పురందరపురిని, అలకాపురిని మించినది. అందలిసౌధములు గగనము నంటుచుండును. ప్రపంచమునందలి వివిధదేశములనుండి యరుదెంచినమానవులు వివిధములగువారివేషభాషలు సుందరాంగులగునిందువదనలు - సర్వవస్తుసముదయములను విక్రయించు వివిధవిపణివీధులు - వివిధములగుకర్మాగారములు- కార్యాలయములు - కళాశాలలు-రాజకీయమందిరములు-శృంగారవనములు మున్నగునవిగలిగి చెన్నపురి దర్శనీయమై యుండు” నని జనులు పొగడుచుండగా వినుచుందును. అంత మద్రపురదర్శనాభిలాష నామనంబున నంకురించెను.

### నేను.

నే నొకపల్లెటూరివాఁడను. నన్ను శారద్వతుఁ డందురు. నేను నివసించుగ్రామము కాంచీమండలంబునందున్నది. కాంచీపురము మోక్షదాయకము లగుపుణ్యక్షేత్రములలో నొకటి. కాంచీపురమునే “కంచి” అని సామాన్యముగా వ్యవహరింతురు. కంచినుండి మదరాసునకు రైలుమార్గము కలదు. చెన్నపురీ దర్శనలాలసమానసుఁడైననేను కంచిరైల్వేస్టేషనుకేగి టిక్కట్టుకొని రైలెక్కితిని. బండికదలెను. పెక్కుస్టేషనులను క్రమముగాఁ గడచి రైలుబండి తాంబరముస్టేషను చేరెను.

## తాంబరం.

పూర్వము తాంబర మొకచిన్న గ్రామమై యుండెను. ప్రస్తుతము రైల్వేస్టేషనుండు చోటు అప్పుడు మహారణ్యము. ఆమహారణ్య మిప్పు డెట్లు మాయమయ్యెనో చెప్పఁజాలను. క్రైస్తవకళాశాలభవనములు, రైల్వేభవనములు, వరుసలువరుసలుగా నుండువీథులు, ఎచ్చోటచూచినను ఎలక్ట్రిక్ దీపములు, లెక్కకుమిక్కిలిరై యిటునటు సంచరించుచుండు జనులు మున్నగునవిగలిగి తాంబరం ఒకపట్టణమై వెలయుచున్నది. తాంబరంరైల్వేస్టేషను కూడ మిక్కిలిగొప్పది.

## ఎలెక్ట్రిక్ రైలు.

తాంబరంనుండి మదరాసునకు ఎలెక్ట్రిక్ బండి. అది చూచుట కెంతయు వింతరై యుండెను. ఎక్కిరొక్కకముందే ఎలెక్ట్రిక్ రైలుబండి కదలి పరుగిడసాగెను ఆవేగము వాయువేగ మనోవేగముల నతిక్రమించియుండెను. "మేడిపండుచూడ మేలిమిరైయుండు, పొట్టవిప్పిచూడపురుగులుండు." అన్నట్లు ఎలెక్ట్రిక్ బండిసౌందర్యము వెలుపలును వేగము నందునుమాత్రమే! నేనెక్కినది మూఁడవతరగతిబండి. అందలిబల్లలు మిక్కిలి చిన్నవి. కంపార్టుమెట్లు మిక్కిలి యిఱుకు. స్థూలకాయుఁడైయున్నచో నలుగురు కూర్చుండుటకై యేర్పడి యుండు కంపార్టుమెంటు ఒకనికిఁజాలదు చెన్నపురిసమీపింపను సమీపింపను ఎలెక్ట్రిక్ బండిలో జనసమ్మర్ద మధికమై చోటుచాలకపోవుచుండెను. కఱివాళ్లు-గంజిదుత్తలు-చీపురు కట్టలు—మూటలనడుమ గుప్తముగావించి, కట్టబడినకుక్కుటములయారవములు—కల్లు త్రాగినవారికలవరింతలు—బీడీలను, సిగరెట్లను, పొగాకు చుట్టలను, కాల్చిపీల్చుటవలన వెలువడి బండినిండియుండు ధూమమేఘములు—వక్కాకుపొగాకులనునమలుచు, జొల్లు కార్చుకొనుచు, నెక్కడపడితే నక్కడ వ్యవస్థలేక ఉమ్మివేయుచుండుట, మైలకాళ్లను, చెప్పు కాళ్లను, బూడ్సుకాళ్లను, మర్యాదలేక బుద్ధిలేక యెత్తి యెదుటిబెంచీమీఁదను, ఎదుటి బెంచిమీఁద నుండుజనులమీఁదను బెట్టి యశుభ్రపఱచునవీనవిద్యాధికులు, పండితంమన్యులు, విటులు—పామరజనులయొక్క శిశువులమలమూత్రములు—కుంటి, గ్రుడ్డి, కుష్ఠ రోగి మున్నగుబిచ్చగాండ్రయుపద్రవములు— వారివెడగుపాటలు—మాటలు—బండి కదలునపుడును, నిలుచునపుడును క్రిక్కిరిసియుండుజనులు వ్యవస్థలేక యొకరిమీఁదనొకరు పడి వాసించుటలు-రైల్వేగాంగ్ జనులు, తమదేహమునుండి చెమటకంపుకొట్టుచుండ గునపము, పాఱ మున్నగువానితో నరుదెంచి ప్యాసంజరులమీఁద దయాదాక్షిణ్యములులేక వానిని

పడవైచి తమవల్లనే రైలునడచుచున్నట్లు గర్వించి పరస్పరము పలికికొనుచుండు తెలివితక్కువ మాటలు—వానివలనఁగలుగుచున్న యుపద్రవములు—మున్నగునవిగలిసి మూర్తీభవించిన నరకలోకమో యన నమూఁడవతరగతి యెలక్ట్రిక్ బండి వెలయుచుండె. "దరిద్రుడు తల గడుగఁబోయిన వడగండ్లవాన వెంటనే వచ్చె" అన్నట్లు అప్పు డెక్కడనుండియో వచ్చి కుంభవర్షము కురియ నారంభించెను. అంత తలుపులన్నిటిని "డబడబ" మనుచప్పుడుతో మూసివైచిరి. బండిలోపల గాఢాంధకారము! అది పగటివేళ గనుక బండిలో దీపములు లేవు. జేబిలోనివస్తువులను దొంగిలించువారి కయ్యది మంచితరుణమై యుండెను తలుపులనుమూసియు లాభములేదు. బండియందలి బెంచీలును ప్యాసంజరులును తడిసిపోవక తప్పినది కాదు. బండి మాంబలంస్టేషనుచేరెను. వాన నిలచెను. మాంబలంస్టేషన్ ప్లాట్ ఫారంమీఁద తమిళఅయ్యర్లు అయ్యంగార్లు క్రిక్కిరిసియుండిరి. వారందరు బండిలోనికివచ్చిరి. వారి యాలుబిడ్డలముచ్చటలు, ఆఫీసుముచ్చట్లు అంతయు బండిలోపలనే! బ్రిటిషుగవర్నమెంటు కాదుకాదు మదరాసుగవర్నమెంటుఅంతయు వీరిమీఁదనే యాధారపడియున్నట్లు భావించి వీరు పరస్పరము కేకలువేయుటచూడ ప్రపంచజ్ఞానముగల యెట్టివారికి నేవగింత కలుగక పోదు. అనంతరము రైలు క్రమముగా నన్నిస్టేషనులుదాటి పార్కుస్టేషనుకరుదెంచెను

## పా రు క్ స్టే ష ను.

పార్కుస్టేషను మదరాసులోనే యున్నది. బండినిలిచెను. తఱచుగా నందఱు నిచటనే దిగిరి. నేనుసహిత మిచటనే దిగవలసియుండెను. అందఱితోపాటు నేనును దిగితిని. "ఓవరుబ్రిడ్జి" నెక్కియే స్టేషనుదాటవలయును గనుక నందఱితోఁబాటు నేను ఓవర్ బ్రిడ్జెక్కితి. అచట నొకటిక్కట్టుకలెక్టరుండెను. ఘనవంతులనియో, ధనవంతులనియో, విద్యావంతులనియో నాగరికులనియో, మఱియేకారణముచేతనో టిక్కట్టుకలెక్టరు టోపీలు ధరించిననల్లదొరలను అమూల్యవస్త్రాభరణాలంకృతులైన యువతీయువకులనుమాత్రము టిక్కట్టడుగుట మానివైచెను. హుటాహుటినడకలతో వారు టిక్కట్టివ్వకయే పోవుచుండ నేనును వారినివెంబడించితినిగాని యింతలో టిక్కట్టుకలెక్టర్ హుంకరించి నాయొద్దనున్న టిక్కట్టును లాగుకొని జాగ్రత్త అని హెచ్చరించెను. నన్నుమాత్రమేగాక గ్రామ్యజనులనందరిమీఁదనుగూడ నక్లేయధికారము చెలాయించి యాతఁడు టిక్కట్లను బుచ్చుకొనుచుండెను. ఇట్లు నాయెలక్ట్రిక్ బండిప్రయాణము ముగిసెను. పార్కుస్టేషనునుండి నిర్గమించి చెన్నపురివీథిలో ప్రవేశించితి.

## రా జ మా ర్గ ము.

పార్కు స్టేషను కుత్తరదిగ్భాగమున దూర్పుపడమరల వ్యాపించియుండు గొప్పరాజమార్గము గలదు. అది మిక్కిలి విశాలమైనది. కార్పొరేషనుమందిరము, విక్టోరియాపురమందిరము, మూర్ మార్కెట్ మందిరము, సెంట్రల్ స్టేషను మందిరము, రైలువారికార్యాలయములు, జనరల్ హాస్పిటల్ మందిరములునుగలిగి యారోడ్డు మిక్కిలి గంభీరముగానుండెను. ట్రాంబండ్లు, మోటారుబండ్లు, లారీలు, బస్సులు, మోటారుసైకిళ్లు, సాదాసైకిళ్లు, జట్కాబండ్లు, ఎడ్లబండ్లు విధివిరామములులేక యిటునటు పరుగిడుచుండినవి. అది మధ్యాహ్నము. సుమారు పదకొండుగంటలుండును. ఒకవైపు ఆకలిబాధ. ఏమిచేయుటకుతోచక యొకచెట్టునీడనునిలిచి రోడ్డువైపు చూచుచుంటిని. వివిధములైనబండ్లు ఇటునటుపరుగిడుచున్నవి జనులు గుంపులుగుంపులుగా నిచ్ఛకువచ్చినట్లు విహరించుచున్నారు. పాదచారిణులై యేగుచున్నయువతుల నొరసికొని విటశిఖామణులు సంతసించుచున్నారు. ఇదంతయుఁ జూచుచు నిలుచున్న నామీఁద నెక్కడనుండియోవచ్చి వానకురిసినట్లును - పన్నీరు చిలకరించినట్లును, బురదనీటిచుక్కలుపడినవి. నాబట్టలన్నియు నెఱ్ఱిమట్టినీటిమచ్చలు! అప్పుడందఱు నన్నుఁజూచి నవ్విరి. రోడ్డు తడిసియుండెను. అక్కడక్కడ బురదనీరు చిన్నచిన్న పల్లములయందు నిలిచియుండెను. వానిపైఁబరుగిడినమోటారు ఆబురదనీటిని నాపై నెగఁజిమ్ముటయే యిందులకుఁగారణము. సమీపమునందే రాజాసర్ రామస్వామి మొదలియారు గారిదివ్యసత్రముండెను. స్నానమాచరించి భుజించివత్తమనుచు నచటి కేగుచుండ మార్గమునందలి సోడా వక్కాకుదుకాణములందలి మహనీయులో-అచట బేరమాడుచున్న పుణ్యాత్ములో - చెప్పఁజాలనుగాని ఎవరో నామీఁదనుమిసిరి. ఎక్కడనుండియో ఒకసగముకాలిపోయినబీడి నాబట్టపైబడి వస్త్రమునం దించుక కాలిపోయెను. వెంటనే ఆర్పివైచితిని. ఇట్లు నావస్త్రములు ఎఱ్ఱిమట్టిబురదచేతను, వక్కాకుఉమ్మిచేతను బీడినిప్పుచేతను పరిభవింపఁబడెను. అంత సత్రముతోటలోఁ బ్రవేశించితి. నానాదిగంతాగతజనులచే ఆతోటయు, సత్రము యొక్కవేదికయు నలంకరింపఁబడియుండెను. స్నానముచేయవలయునని నేనడుగగా నొకఁడు నన్ను నూతియొద్దకుఁ బిలుచుకొనిపోయి రెండుకానులుపుచ్చుకొని నన్నుఁగూర్చుండఁబెట్టి ఆఱుబిందెలనీరు నూతినుండితోడి నన్నభిషేకించెను. ఇట్లు నాస్నానముముగిసెను. వస్త్రములను ఎండఁగట్టి ధరించుకొని సత్రమునందలి అన్నశాలకేగి నాలుగణాలిచ్చి భుజించి లేచి అరుగుపై నించుక విశ్రమించితి. పగలు 12½గంటలు. నావలె సత్రమున కరుదెంచినప్రజలలోఁ గొందఱు పీపిల్సుపార్కులోని మృగశాలను జూచుటకుఁబోవుచుండిరి. నేను వారిని వెంబడించితిని. పీపిల్సుపార్కు ఒకగొప్ప యుద్యానవనము. నేత్రానందకరమైన లతలు పుష్ప

ములు వృక్షములు గలిగి యయ్యది రమణీయమైయుండెను. గాలి వెలుతురు కరవైయున్న యిండ్లలో నివసించెడినాగరికుల కాయారామము మహోపకారియనక తప్పదు. ఈతోటలోఁ బడి యుత్తరాభిముఖుఁడనై యొకమైలుదూరము నడిచి ఒకఅణా ప్రవేశరుసుము చెల్లించి జంతుశాలం బ్రవేశించితి.

## జంతుశాల

అది యొక గొప్పయావరణము. సింహములు, ఏనుఁగులు, పులులు, చిఱుతలు, సివంగులు, అడవిగుఱ్ఱములు, వానరములు, ఒంటెలు, తోఁడేళ్లు, నక్కలు, చెవులపిల్లులు, భల్లూకములు, దుప్పులు మున్నగు భూచరమృగములును—వింతవింత పక్షులు, పంచవర్ణపు చిలుకలు, రాజహంసలు, మున్నగుపక్షులును, మొసళ్లు, నీటియేనుఁగలు, తాఁబేళ్లు మున్నగుజలచర ప్రాణులును,వానివానికనురూపమగుస్థలములయం దుంపఁబడియున్నవి. సర్వేశ్వరునిసృష్టిరచనానైపుణ్యము నిచట గనుంగొనవచ్చును. సింహశార్దూలాదిదుష్టమృగములు దృఢతమములగుపంజరంబులందు బంధింపఁబడియున్నవి అందువలన నేశంకయులేక వాటినిఁ జూచుట కనుకూలమైయున్నది. మధ్యాహ్నము 2½ గంటలు. మృగశాలనుదర్శించి యయ్యెను. అంతనచటనుండి బయలుదేరి మూర్మార్కెట్టున కరుదెంచితి.

## మూర్మార్కెట్టు.

మూర్మార్కెట్టు ఒకచక్కనిభవనము. చీనావస్తుదుకాణములును,స్వదేశవిదేశశాకములను విక్రయించుదుకాణములును, మాంసము, కోళ్లు, బాతులు, నానావిధములైనపిట్టలు మున్నగువానిని విక్రయించుదుకాణములును, మూర్మార్కెట్టునందు వరుసలువరుసలుగానుండెను. ఇచటివర్తకులు పల్లెటూరివారి నేమరించుటలో మిక్కిలి సమర్థులు. ఒకఅణాఖరీదుగలవస్తువుధరను నాలుగుఅణాలనిచెప్పుట వీరిసంప్రదాయము.

## బయలులో ఉపన్యాసములు.

మూర్మార్కెట్టున కుత్తరదిగ్భాగమున నొకమైదానము కలదు. అందొకచో జనులు గుంపుగానుండిరి. ఏమిచెపుమా అని వెళ్లిచూతుగా నాగుంపునడుమ నొకఁడు "దేవాలయములలో బలియిచ్చుట మిక్కిలి పాపము. ఈదురాచారమును మానవలయును. సమస్త ప్రాణులయెడ కనికరముగలిగి మెలగవలయును" అని యుపన్యసించుచుండెను. "అయ్యా స్లాటరుహౌస్‌దగ్గరకువెళ్లి ప్రతిదినమును వేలకొలది మేకలను ఆవులను జంపుచుండు కటికు

మొఱకులకును మాంసమును విక్రయించుకసాయివారికిని, మాంసమును భుజించుపుణ్యాత్ములకును ఉపదేశింపరాదా?" అని యామూకలోనియొకరు ప్రశ్నించిరి.

"స్లాటర్ హౌస్ దగ్గరకు వెళ్లి యుపన్యసించితే మేకలను నఱుకుకత్తులతో మమ్మే నఱుకి వైతురు. కాఁబట్టి మేమచటికి వెళ్లము. మాంసమును భుజించువారియెడ మా యాటలు సాగవు. మీఁదుమిక్కిలి మాంసమునుభుజించుట పాపముకానేరదు. జంతువులను దేవాలయములలో బలియొసంగుటమాత్రము గొప్పపాపకార్యము. దేవాలయమునకు బలియిచ్చుటకై వచ్చుజనులు శాంతచిత్తులుగనుక వారు సులభముగా మాకు వశ్యులగుచుందురు. కాఁబట్టి మాయైతక్కులన్నియు దేవాలయమునకు బలియిచ్చువారియొద్దమాత్రమేగాని యితరుల యెడ చెల్లవు". అని యాతఁడు తనయుపన్యాసమును ముగించెను.

## జ న ర లు ఆ స్ప త్రి రో డ్డు.

ఉపన్యాసమును ముగించగానే యచ్చోటబాసి జనరల్ఆస్పత్రిరోడ్డును బ్రవేశించి తూర్పుముఖముగా నడిచితి. ఆజనసమ్మర్దము, ఆబండ్లు, ఆబిచ్చకాండ్రు, ఆగడిబిడి మున్నగునవి చూడఁగా నేదియో యొక సుప్రసిద్ధపుణ్యక్షేత్రమున జరుగుమహోత్సవమున కరుదెంచిన జనులమూకసహిత మంతయధికమై యుండదని తోచకమానదు.

## వా ర ప్ర ద ర్శ న ము లు.

"జంతువారము, విద్యావారము, ఆరోగ్యవారము, శిశువారము, కుష్ఠరోగవారము జండాలు కొనండి. హుండీలకు డబ్బు చెల్లించండి" అని కేకలువేయుచుఁ గొందఱు ఖద్దరు టోపీలు ధరించినవారు నాయెదుట వచ్చుచు అమాయికజనులను వేధించుచునుండిరి. ఆదివారము, సోమవారము, మంగళవారము, బుధవారము, గురువారము, శుక్రవారము, శనివారము అనువారములుదక్క నేనేవారము నెఱుంగను. విద్యావారము జంతువారము మున్నగుశబ్దములు నాచెవినోకగానే నాకు మిక్కిలి యాశ్చర్యము గలిగెను అదియేమని నేను ప్రశ్నించగా నాకు ముందు నడచుచున్న యొకవిద్యావయోవృద్ధశిఖామణి యిట్లనెను.

అయ్యా! చెన్నపురిలో డబ్బుసంపాదించుట కనేకమార్గములు కలవు. జంతువులను కనికరించుటకు హుండీడబ్బులేల? కుష్ఠరోగనివారణసేవయట. అన్నియు సేవలే. సేవ సేవ యనిహుండిధనమార్జించి తమపొట్ట నిండించుకొనుటకంటె నధికముగా వీరుచేసినమహోపకారము సున్న. ప్రతిబస్సుస్టాండునొద్ద ఇద్దరు లేక ముగ్గురు కుష్ఠరోగులు నిలిచి పైఁబడి బిచ్చము

డుగుచున్నారు. బస్సెక్కునపుడు కుష్ఠరోగిని స్పృశింపక బండెక్కు భాగ్యము మద్రపురివాసులకు లేదు. రోడ్డున కిరుప్రక్కల బారులుతీరికూర్చుండి కొందఱుకుష్ఠరోగులు బిచ్చమడుగుచున్నారు. వీరిమూలమున చెన్నపురిలో వీథులవెంబడినడచిపోవుటసహితము కష్టమయ్యెను. మఱికొందఱుకుష్ఠరోగులు బట్టలచే తమశరీరమును గప్పుకొని జనులనడుమనే సంచరించుచు ఫలములను బిస్కట్లను విక్రయించుచున్నారు. అమాయికజనులు వాటినిఁ గొని తినుచున్నారు. ఇట్లీకుష్ఠరోగము మదరాసునందు దినదినాభివృద్ధియగుచున్నది. ఈవిషయమును గమనించువారే లేరు. మునిసిపాలిటి డబ్బులు వసూలుచేయుటలోమాత్రము తక్కువ లేదు. అని పలికి యాతఁడు తనదారినిఁ బోయెను. ఇదంతయు వినగానే చెన్నపురిని మ్రింగివేయునంతటి కోపము నాకు గలిగెను. కాని యది జరుగునా? తక్కిన ప్రదేశములను జూడవలయు నను తలంపుతో ముందు నడచితిని.

## గొల్లవాండ్రు.

నాయెదుట కొందఱు గొల్లవాండ్రు నాలుగైదావులను పది బఱ్ఱెలను తోలుకొని వచ్చుచుండిరి. వారందఱు పాలువిక్రయించువారు. ఇండ్లకడకు ఆవులను బఱ్ఱెలను తోలుకొనిపోయి యింటివారియెదుటనే పాలుపిండి యిచ్చి తన్మూలమున లభించుధనమువలన వారు జీవింతురు. ఒక్కొక్కనిచేతిలో నొకపాత్రయు, నోటిలో బీడీయు, భుజముమీఁద నొకదూడయుఁగూడ నుండినవి. ఆదూడలు ప్రాణముకలవి కావు. పాలంతయు పిండి విక్రయింపఁగా తల్లిపా లెఱుంగనిదూడలు మరణించినవి. వానిచర్మముల నొలిచి వాటిలో నెండుగడ్డినిఁ గ్రుక్కి దూడలయాకారముగావించి యాదూడలను వానితల్లులయెదుట నిలిపి వంచనచే పాలుపితికిజీవించువారు ఆగొల్లలు! ఇట్టి గోశిశుహత్యకు రోయని పాపాత్ము లేయకార్యము చేయరు? ఆవులను బఱ్ఱెలను వారు జనులమీఁదనే తోలుకొనివచ్చుచుండిరి. స్త్రీపురుషులు బాలబాలికలును భయపడి వానిబారినుండి తొలఁగిపోవుచుండిరి. వారినిఁ జూచి యాగొల్లలు చప్పట్లు చఱచి నవ్వి పరిహసించిరి. "పిల్లికి చెర్లాటము ఎలుకకుఁ బ్రాణసంకట" మన్నట్లు జనులు భయపడి పాఱుచుండుట దుర్మార్గులగుగొల్లలకు వేడుకయై యుండెను. అది సహించనినేను "ఓరి గోపాలురా! ఇది యక్రమము. ఇట్టిదుష్కార్యము మీకుతగదు" అని యనుచుండఁగా నామీఁదికే యొకవాఁడికొమ్ములుగలయావు పరుగిడి వచ్చెను. కాఁబట్టి నేనే భయపడి పాఱవలసినవేళ వచ్చినది. కాందిశీకుడనైన నన్నుఁజూచి యాగొల్లలు పకపక నవ్విరి. దండతాడితభుజంగమువలె రోజుచు నిలుచున్న నన్నుఁ జూచి యొకపాంథుఁడు

'స్వామి! ఇదియే చెన్నపురిగొల్లలసంప్రదాయము. దేవుఁడే వీరిని విచారించవలయును. మీరు వెళ్లుఁడు" అని పలికెను.

## మో టా రు ప్ర మా ద ము.

నాకేల యీగొడవ? అని నిశ్చయించి ముందునకు నాలుగడుగులు పెట్టీపెట్టకముందే రువ్వుమని యొకమోటారుకారు నామీఁదికే పరుగిడివచ్చెను. "అమ్మయ్యో! చచ్చితి చచ్చితి" వని భయకంపితహృదయుఁడనై నేలమీఁదఁబడి మూర్ఛిల్లితి. నాయాయు వింకను ముగింప లేదుగనుక మోటారుకారు నన్నానుకొని కీచుమని శబ్దించి నిలిచిపోయెను. వెంటనే బండి నుండి దిగి డ్రైవరును మోటారుయజమానుఁడైన టోపిధరించిన నల్లదొరయు నన్ను లాగి రోడ్డుప్రక్కకుఁబడవైచిరి. కొట్టిరి. తిట్టిరి. అనేకవిధములుగా బాధించిరి. ఇంతలో గుంపుచేరెను. వీఁడు పల్లెటూరివాఁడు. "ఓరిమూఢుఁడా! బండియెదుట నేలవచ్చితి" వని యందఱును నన్నే తిట్టసాగిరి. తప్పంతయు నాదేనట! జనులమీఁదికి వేగముగా బండిని తరుముకొనివచ్చి వారిని భయపెట్టి వారిపై బండినెక్కించి జనులను జంపుట నిర్దోషమఁట! మహానగరధర్మ మిప్పుడే నాకుఁ దెలియవచ్చెను.

## రో డ్డు అం చు.

అంత నేనచటనుండి కదలి మిక్కిలి జాగ్రత్తగా రోడ్డుఅంచుననే నడిచి చైనాబజారున కేఁగఁదొడంగితిని. జ్యోతిషముచెప్పువారు, పక్షిశాస్త్రముచెప్పువారు, వెఱ్ఱివికారచేష్టలను, వెడగునాట్యములను గావించుచు, పాటలుపాడువారు,వివిధరోగములచేమూల్గుచు వికలాంగ ములను గనపఱచువారును రోడ్డంచువేదికలపైనుండి తమతమవృత్తి కనురూపంబగుధనము సంపాదించుకొనుచుండిరి. ఇట్టివేదికపై నడచి నడచి "యీవినుంగు బజారు" ప్రవేశించితి.

## ఈ వి ను ం గు బ జా రు.

ఇది యొక గొప్ప బజారు అయినను పశ్చిమశ్రేణియందుమాత్రమే అంగళ్లు వరుసగా నున్నవి. తగరపుసామానులు, కఱ్ఱసామానులు, పింగాణిసామానులు, గాజుసామానులు, ఖట్టులు, చాపలు, దారములు మున్నగునవి విక్రయించుదుకాణము లనేకము లిచట గలవు. తూర్పుశ్రేణిలో ఆరామకుడ్యముదక్క మఱేదియు కానరాదు. ఈవినింగుబజారును గడచి "కాటన్ బజారు" ప్రవేశించితి.

## రాటక్ బజారు.

ఇది యీవినింగుబజారుకన్న గంభీరముగానున్నది. ఇచట సహితము పశ్చిమశ్రేణియందు మాత్రమే దుకాణములు గలవు. గడియారములు, గాజుసామానులు, వస్త్రములు, ఫొటోకలములు, పట్టువస్త్రములు, పేములసామానులు, కురిచీలు, బల్లలు, బీరువలు మున్నగుకలపసామానులు విక్రయించునంగళ్లు లెక్కకు మిక్కిలియై యిచట నున్నవి.

## వేదికలలో కుటుంబములు.

రాటక్‌బజారులో రోడ్డుబడ్డుననున్న వేదికలపై ననేకకుటుంబములవారు చెట్లక్రింద నివసించుచుండుటను జూచితిని. వీరు దుకాణములలో కూలిపనిచేసి జీవించుజనులు. వీరిస్థితి మిక్కిలి దయనీయమైయుండెను. కొందఱు మంటలుపెట్టి వంటలుచేయుచుండిరి. "కూలి డబ్బంతయు వెచ్చించి తెగద్రాగి యింటికివస్తే కూడెట్లు దొరుకును." అని కొందరుస్త్రీలు తమతమ మనోనాయకులను నిందించుచుండిరి. ఒకరియింట బెండ్లిజరుగుచుండెను. నూతనవధూవరులను చాపపైఁ గూర్చుండఁబెట్టి వారికి యువతులిద్దరు హారతియెత్తుచుండిరి. మఱియొక యింటికి అప్పుడే అల్లుఁడువచ్చెను.పాపము! అత్తగారికి చాపదొరకలేదు. అటునిటుచూచెను. పెంటప్రోగుమీద నొకముతకకాగితముండుటఁ జూచి దాని తెచ్చి యల్లునకుఁ జాపగా వించెను. అం దల్లుఁడుగూర్చుండెను. కూఁతురు నల్లుఁడును పరస్పర దర్శన మందహాసాదులచే సంతసించుచుండిరి. వారియానందముచేఁ బరవశయైనయత్తగారు వంటచేయ ప్రారంభించెను. ఎదుటి యంగడివాఁడొకషావుకారు. ప్రాయికముగా బొంబాయివాఁడై యుండవచ్చును. ఎక్కడనుండియో ఒకబిందెడునీళ్లు తెచ్చి వారిపై క్రుమ్మరించి "ఛీ! ఛీ! లేచి పొండు, పోకున్న చెప్పుదెబ్బలు." అని గద్దించెను. పాపము! ఆయల్లుఁడు, కూఁతురు, అత్తగారు ముువ్వురును గలసి చేయునది లేక మఱుమాటాడక తమకుండలను, చట్లను, పొయ్యిని మోసికొని యాచోటు వదలి యెటకోపోయిరి. ఆహా! పరమేశ్వరునిమహిమ యిట్లుండునా? పంచేంద్రియసమాయుక్తులైనమానవులలో నిట్టితారతమ్యమా? అని యూహించుకొనుచునే నాస్థలముదాటి చైనాబజారు జేరితి.

## చైనాబజారు.

సాయంసమయము. $4\frac{1}{2}$ గంటలు. చైనాబజారునందంతట గొప్పగొప్పమందిరములు, అంగళ్లమయము. జనసమ్మర్దము. బండ్లగడిబిడి. పచ్చయప్పకళాశాలమందిరము- ఓయ్. యం.

సి. ఏ., మందిరము - క్రైస్తవకళాశాలవారిమందిరములు - ప్రధానన్యాయస్థానమందిరము-న్యాయకళాశాలమందిరము-పండ్లమార్కెట్టు-టెలిఫోనువసాసు మున్నగునవి చైనాబజారులోని దర్శనీయములగుసౌధములు. పచ్చయప్పకళాశాలయొద్దనుండి ప్రధానన్యాయస్థానమందిరమువరకు వీథిలో సంచరించుచున్న జనుల నడుమ నిలిచి కొందఱుజనులు వివిధములైనవస్తువులను విక్రయించుచుండిరి. అవి పండ్లు, బట్టలు, వాసనద్రవ్యములు, గాజుసామానులు, చైనాసామానులు, బెత్తములు, బొమ్మలు మొదలగునవి. కొందఱుజను లీవస్తువులను కొనుటకు బేరములాడుచుండిరి. ఏపనిలేకున్నను మిక్కిలి గొప్పగొప్పకార్యము లున్నవారివలె నటించువిటు లిటునటు పర్యటనముగావించుచుండిరి. ధూర్తులు జనులేమరియుండు సమయమును గుర్తించి వారిచొక్కాజేబులలోని సొమ్ము నెమ్మదిగా నపహరించుకొనిపోవుచుండిరి. ఉన్నట్లుండి బట్టలు మున్నగువానిని భుజములపై వేసికొని విక్రయించుచుండినవారు తుఱ్ఱుమని ప్రక్కవీథిలోనికిఁ బాఱిపోయిరి. తిరిగిచూడగ నొకరాజకీయభటుఁడు వీథులలో నిలిచి విక్రయించువారిని బెత్తముతో కొట్టి నివారించుచు వచ్చుచుండెను. అతనివెన్నంటి యొక్కసార్జెంటు అశ్వారూఢుఁడై వచ్చుచుండెను. ఆవిక్రేతలందఱు పారిపోయినందుల కియ్యదియే కారణమైయుండునని నిశ్చయించితి. అంత నచటనుండి యింకను తూర్పుముఖాభిముఖుఁడనై యేగితి. అక్కడ పుస్తకములనువిక్రయించుదుకాణములు కొన్ని వరుసగానుండెను. పాఠశాలల కుపయోగించుపుస్తకములను మాత్రమే వారు విక్రయించుచుండిరి. సంస్కృతాంధ్రగ్రంథము లందు మందునకైనఁ గానరావయ్యె. ఇట్లు చూచుచు నేగుచున్న నాకొకసౌధముపై పెద్దతెలుగక్షరములుగల యొకబోర్డు కనఁబడెను. అందు "వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్, సంస్కృతాంధ్రగ్రంథములు విక్రయింపబడును" అని లిఖయింపఁబడియుండెను. దానింజూడఁగానే నాకపరిమితానందము గలిగెను. వెంటనే మెట్లెక్కి

## వా వి ళ్ల గ్రం థా ల య ము.

మేడమీఁదికేగి వావిళ్లపుస్తకాలయమును దర్శించితి. ఆహా! మూర్తీభవించిన సంస్కృతాంధ్రవాణీమణి యిట మసిముసినవ్వులతో చిందులుద్రొక్కుచున్నది. ఇతిహాసగ్రంథములు, జ్యోతిషగ్రంథములు, పురాణగ్రంథములు, వైదికగ్రంథములు, వేదాంతగ్రంథములు, ధర్మశాస్త్రగ్రంథములు, కావ్యములు, నాటకములు, నిఘంటువులు, తర్కవ్యాకరణాలంకారగ్రంథములు, స్తోత్రగ్రంథములు మున్నగు వివిధసంస్కృతగ్రంథములును—పద్యకావ్యములు, వచనకావ్యములు, నవలలు, నాటకములు, శతకములు, పాఠశాలలకును, కళాశాల

లకు నుపయోగించుపుస్తకములు మున్నగువివిధాంధ్రగ్రంథములు లెక్కకుమిక్కిలిగా యిట నలరారుచున్నవి. ముద్దులుగులుకుముద్రణము చక్కనిబైండింగుపుస్తకములమీది స్వర్ణాక్షరములును గలవావిళ్లగ్రంథములు నేత్రానందకరములై సురూపసుగుణశోభావిశేషాలంకృతలగు సుందరీమణులవలె చదువరులను నాకర్షించుచున్నవి. సంస్కృతాంధ్రగ్రంథరత్నముల కియ్యదియే రత్నాకరము. నేననేకపర్యాయము లాంధ్రదేశమందంతట సంచరించియున్నాను. ఆంధ్రదేశము గొప్పదేశము. ఆంధ్రులు సర్వైశ్వర్యసంపన్నులు. కాని యాంధ్రదేశమునం దెక్కడ జూచినను వావిళ్లపుస్తకములే నేత్రానందకరములై కనబడుచున్నవి. వావిళ్లవారి గ్రంథములకంటె శ్రేష్ఠతరగ్రంథములనుగాని వావిళ్లవారిగ్రంథముల కెనయగుగ్రంథములనుగాని ముద్రించి ప్రకటించుచు నాంధ్రవాఙ్మయమును సమృద్ధిమంతముం గావింపగల మహనీయులు మాత్ర మాంధ్రదేశమునందు నాకెచ్చోటను గానబడలేదు. "చెన్నపురిలో ముద్రింపఁబడుపుస్తకములలో తప్పు లధికము" అని వట్టి ప్రగల్భములు పలికికొను పండితంమన్యులు వావిళ్లవారిగ్రంథములకన్న మిన్నయనందగు పొత్తములను ముద్రించి ప్రకటించిరా? వావిళ్లవారిముద్రాలయమును వారిగ్రంథాలయమును నద్వితీయములై యాచంద్రతారార్కములై దినదినప్రవర్ధమానములగుచుండుఁగాక. గ్రంథాలయదర్శనము ముగిసెను.

## కఫే.

అనంతరము నేను సౌధసోపానములుదిగి వీథి కరుదెంచి మరియు తూర్పుదిశాభిముఖుఁడనై యేగితి. అచట శంకర్ కఫే,మాడర్ను కఫే,రామకృష్ణ లంచ్ హోమ్ మున్నగు చిత్రాహారశాలలు వరుసగానున్నవి. ప్రతిచిత్రాహారశాలలోను రేడియోపాటలు వినబడుచున్నవి. పళ్లెములను గడుగు గణగణమనుశబ్దములు భూనభోంతరాళముల వ్యాపించుచున్నవి. మెక్కుటకు లోపలికేగువారును, మెక్కి వక్కలు నమలుచు లోపలినుండి వెలువడివచ్చువారును గలిగి చిత్రాహారమందిరప్రవేశద్వారములు పుణ్యదినములయందును మహోత్సవదినములయందును జనసమ్మర్దముచే నిండియుండు దేవాలయగోపురద్వారముల ననుకరించుచున్నవి. సంగీతము,జనసమ్మర్దము ఘ్రాణేంద్రియములనాకర్షించు చిత్రాహారవిశేషముల సుగంధములు, కస్తూరికాఘనసారాదిసుగంధద్రవ్యమిళితతాంబూలములును నన్నాకర్షించినవి. నేనొకకఫే మందిరద్వారసమీపమున నిలచి వేడుక చూచుచుంటిని. అట్టిమహామందిరము నదివఱకు నేనెన్నఁడును జూచి యెఱుంగను. ఆకఫేద్వారముకడ వీథిలో మోటారుబండ్లు వరుసలువరుసలుగా నిలిచియుండినవి. కార్లలోపల దివ్యాంబరాభరణాలంకృతలగుసుందరీమణులు కూర్చుండి చైనాప్లేట్లలో పూరీ పుర్లకిళంగు, బోండా, సాంబారు, బజ్జి, పకోడ,

దోసె మున్నగు చిత్రాహారములను స్పూనులతో నెత్తి నోటఁ బెట్టుకొని భుజించుచు—చైనా కప్పులలోని కాఫీ, టీ, క్రష్ మున్నగు పానీయములను ద్రావుచుండిరి. ప్రతి మోటారు కారును జుట్టి కుంటి, గ్రుడ్డి, కుష్ఠరోగి, గూని మున్నగు బిచ్చకాండ్రు అమ్మా! అమ్మా యని చేతులు చాచి బిచ్చమిమ్మని బ్రతిమాలుచుండిరి. విటులు బీడీలు, సిగరెట్లు, చుట్టలు కాల్చి ధూమమును పీల్చి విడుచుచు నెదుట నిలిచి కార్లలోని సీమంతినీలలామల సుందరవదనారవింద సౌందర్యములను దిలకించుచుండిరి. కఫే మందిరమునుండి బాలభటులు ఇటునటు పరుగిడుచు కోరిన యాహారపదార్థములను కార్లలోని యువతీమణుల కందిచ్చుచు వారిచ్చు సొమ్మును కఫే యజమానునకుఁ గొనిపోయి యిచ్చుచుండిరి. ఆవీథి నడుమ—ఆకుష్ఠరోగుల నడుమ-ఆబిచ్చకాండ్ర నడుమ—ఆధూర్తవిటుల నడుమ—ఆచిత్రాహారము లాయువతుల కుత్తుకలను దాటి యొట్లుదరమున కేగెనో నాకాశ్చర్యము కలిగెను. కార్లలోని యువతులు కానిర్తైన బిచ్చకాండ్ర కిచ్చినవారు కారు మరియు వారందరు భారతనారీమణులై యుండియు నింగ్లీషుభాషలోనే పరస్పరము సంభాషించుకొనుచుండిరి. వీథిలోని జనులలో నధిక సంఖ్యాకుల నేత్రము లీయువతుల వంకనే వ్యాపింపఁ దొడంగెను. సుందరాంగులగు సుందరీమణుల సుందరవదనారవిందము లెవరి నాకర్షింపవు? సౌందర్యముఁ వారికి పెట్టనిసొమ్మై యుండెను. అందరి హస్తములలో చేతిగడియారములును, అందరి కాళ్లలో బూడ్సులుండుటచే వారందఱు నింగ్లీషుభాషలో నారితేరినవారని నేను నిశ్చయించితి. చిత్రాహారములను ముగించి యొక్కొక్కబండిగా నేగుచుండెను. వెంటనే యాస్థలము నింకొకబండి యాక్రమించుకొనుచుండెను. అంత నాదృష్టి నేలమీఁద వ్యాపించెను. కాల్చి పొగపీల్చి పారవైవఁబడియున్న బీడీలయొక్కయు, సిగరెట్లయొక్కయు పొగాకు చుట్టల యొక్కయు ముక్కలు, కాలిన అగ్గిపుల్లలు, రక్తమువలెను, పక్షిరెట్టలవలెను సర్వత్ర ఉమ్మి వేయఁబడియుండు వక్కాకుపొగాకుల యెంగిళ్లు, వానిదుర్గంధములు మున్నగువానిచే నాకఫే మందిరద్వారము మిక్కిలి రోఁతయైయుండెను. నాకాకలిబాధ యధికమయ్యెను. అందువలన కఫేమందిరములోఁ బ్రవేశించితిని. ఆహా! ఇది సౌధమా! లేక దేవవిమానమా? యని భ్రమ గొలుపుచున్న కఫేమందిరముయొక్క లోపలిభాగము నేత్రపర్వమై యుండెను. వందలకొలఁది చక్రాకారముగల మేజలు లోపలిభాగమం దమర్పఁబడియున్నవి. వాని నావరించి కుర్చీలపైఁ గూర్చుండి జనులు చిత్రవిచిత్రాహారములను మెక్కుచున్నారు. 'సర్వం విష్ణుమయం జగత్తు' న్నట్లు సమస్తవర్ణములవా రచటఁ గూర్చుండి సిగరెట్లు ద్రావుచు నిచ్చవచ్చిన యాహారములను సరసపల్లాపములు సలుపుచు తినుచున్నారు. పూరీలు-దోసెలు-ఉప్పిండి-పొంగలి—బోండాలు—

పకోడీలు—లడ్డు—జిలేబి—రసగుల్లా—గులోబ్జాని—బాదంహల్వా-బెనారస్‌హల్వా-బొంబాయిహల్వా—కిచ్చడి—సేమియాపాయసము—సేమియాబ్రింజి—మిక్చరుమున్నగునవి యిచటిభక్ష్యములు షర్బత్తులు—బాదాంకీరు—క్రష్, కలర్ మున్నగునవి యిచటి పానీయములు. ఇవియన్నియు నచట నొకరమణీయమైన మంజూషయందు వరుసగా నుంచఁబడియున్నవి. నవరాత్రిబొమ్మలకొలువువలె నామంజూష నేత్రపర్వమై యొప్పుచున్నది. చిత్రాహారశాలలో లోపలిభాగమంతయు సాంబ్రాణిధూపవాసనయు బీడీసిగరెట్లధూపవాసనయు అతిథులు మెక్కుచుండుటవలన రేగినవంటకములవాసనయుఁ గలసి గమ్మని యొకనూతనవాసనం గలిగించి ఘ్రాణనాడులచైతన్యము నణచివేయుచుండెను. తినీతినక ముందే పళ్లెములను స్పూనులను మలయాళినాయరులు లాగికొని చేతిలోని యొకమైల యెంగిలిబట్టతో మేజాల నెప్పటికప్పుడు తుడిచివేయుచున్నారు మఱి కొంచెము లోపలికేగుచుండగా నచట పళ్లెములను పంచపాత్రములను గడుగుచుండిరి. వీరు కడుగుట యేడిసినట్టే యున్నది. ఒకపెద్దపీపాయినిండుగ నీరుండెను. ఆనీళ్లలోనే అన్నిపళ్లెములను పంచపాత్రలను ముంచి ముంచి యానాయర్లు తీసుకవచ్చి పెట్టుచుండిరి. ఇదియే వార కడుగులాట. కడుగఁబడినపళ్లెములలో పూర్వము తిన్నవానియుచ్ఛిష్టము లంటుకొనియున్నవి. అంతేకాదు. ఒక్కొక్కప్పుడు కడుగఁబడినపాత్రములు లేకయున్నచో ఆహారములను పంచిపెట్టు అంబిఅయ్యర్లే మేజాలమీఁదిప్లేట్లను టమ్లర్లను గొనివచ్చి కడుగకయే భోజ్యములను పానీయములను వానిలోనుంచి తీసుకపోయి తినువారి కిచ్చుచున్నారు. నిర్వికారచేతస్కులై నాగరికులు వాటిని తినుచున్నారు. ఆవిధముగాఁ దినువారిలో ననేకులు నోటిపుండ్లుగలవారు అట్టిపుండ్లుగలవారియెంగిళ్లన్నియు నితరులకు బహుసులభముగా వ్యాపించుట కిట్టి చిత్రాహారశాలలు పుట్టినిండ్లైయున్నవి. ఛీ! ఛీ! యిట్టియెంగిళ్లను దిని ప్రాణములను సంరక్షించుకొనుటకన్న నుపవాసము మేలని నిశ్చయించి వీథికరుదెంచి బీచిరోడ్డున కేగితి.

## ఉ త్త ర స ము ద్ర తీ ర వీ థి.

అది యొక విశాలమైన గొప్పరోడ్డు. వాయువేగ మనోవేగములతో ట్రాములును మోటారులును నావీథిలో నిటునటు పరుగిడుచున్నవి. ఆకసమునంటుచున్న సౌధరాజములు పశ్చిమశ్రేణియందు వరుసగానున్నవి. ప్యారీకంపెనివారిదివ్యభవనము, నేషనల్‌బ్యాంకు మందిరము, ఇంపీరియల్‌బ్యాంకుమందిరము, జనరల్‌పోస్టాఫీసు మందిరము, బెస్టుకంపెని, మెర్కంటయల్‌బ్యాంకు ఇండియన్‌బ్యాంకుమందిరరాజములు మున్నగునవి వానిలో సుప్ర

సిద్ధములు. వీనింజూచుచు నుత్తరముఖాభిముఖుఁడనై రాయపురమువఱ కేగితి. అచట దర్శనీయము లెవ్వియు లేవు. కావున నటనుండి మరలి యేగినదారినరుదెంచుచు దక్షిణదిశాభిముఖుఁడనై నడచుచుంటిని. తూర్పుశ్రేణిలో నౌకాశయము, బీచి రైలుస్టేషనుదక్క మతేదియుఁ గానరాదు. నౌకాశయములోపలికేగుట నావంటివానికి సుసాధ్యముకాదు. ధూమనావల యుపరిభాగములు మాత్రము నేత్రములకు గోచరములగుచున్నవి. సామానుల నెగుమతిదిగుమతులు చేయునపుడు కలుగుచున్న ధణధణ గణగణ పెళపెళ డబడబ మను శబ్దములుమాత్రమే వినఁబడుచున్నవి. ప్యారికార్నరుకు మరల నరుదెంచితి. అక్కడనుండి యింకను దక్షిణముగా నడచి యేగుచుంటి.

## ద క్షి ణ స ము ద్ర తీ ర వీ థి.

ఈబాటకు సుమారు అరమైలుదూరమున సముద్రము కనబడుచున్నది తద్ఘోషము వినబడుచున్నది. దవ్వున సముద్రమునఁబోవుచున్న పొగయోడలు కూడ కనఁబడుచున్నవి. ఆహా! ఇటు నగరసౌభాగ్యము! అటు రత్నాకరమాహాత్మ్యము! అట్లు పోయిపోయి యింగ్లీషువారిఫోర్టుసెయింటుజార్జికోటను—ఇనుపవంతెనదాఁటగానే సముద్రతీరమున కాభరణమైవెలయుచున్న మదరాసువిశ్వవిద్యాలయభవనములను— ప్రభుత్వమువారివివిధ కార్యాలయభవనములను—రాజకీయకళాశాలను—దర్శించుచు, మెల్లఁగా నడచుచుంటి సాయంతనము 6 గంటలు. నగరజనులందఱు తండోపతండములై సముద్రపుగాలికై యరుదెంచి తీరమున విహరించుచున్నారు. విటీవిటులు, కాలేజిగరల్సు కాలేజిబాయ్సుమొదలగు వారిస్వేచ్ఛావిహారములను వర్ణింప నాదిశేషుఁడు నసమర్థుఁడు. అంత నేను తిరువల్లిక్కేణి కేగి శ్రీపార్థసారథిస్వామి దేవాలయమును, మైలాపూరునకేగి శ్రీకపాలీశ్వరస్వామి దేవాలయమును దర్శించి యటనుండి ట్రామెక్కి రైలునకు వచ్చుచుంటి. అయ్యది మౌంటురోడ్డు మార్గముగా వచ్చుచుండెను.

## మౌ ం టు రో డ్డు.

ఇది పెద్దరాచబాట. ఇరువైపులు గొప్పగొప్పమందిరములును వానిలో గొప్పగొప్ప దుకాణములు నున్నవి. మదరాసువార్తాపత్రికలకార్యాలయములన్నియు నిచటనే కలవు. గవర్నరుగారిభవనము నిక్కడనేయున్నది. క్రమముగా ట్రాము సెంట్రలుస్టేషను జేరెను. అయ్యది దక్షిణ మహారాష్ట్ర యినుపదారికంపెనివారిది. వారిదివ్యభవనములను జూచుచు మరల వావిళ్లవారిగ్రంథాలయమునకేగి త్రిలిఙ్గపత్రికను, ఆనిసరస్వతీనిలయమునుండి

నాకావశ్యకములైన సంస్కృతాంధ్రగ్రంథరత్నములను గొంటిని. 7 గంటలయ్యెను. నగర దర్శనము చాలుననిపించెను. ట్రామెక్కి ఎగ్మూరుస్టేషనుకేగి రైలెక్కి యర్ధరాత్రివేళ స్వగ్రామముం జేరి శయనించితి. సూర్యోదయమయ్యెను. చెన్నపురికేగివచ్చిన నన్నుం జూచుట కనేకులు వచ్చి "మదరాసు బాగున్నదా? మనగ్రామము బాగున్నదా?" అని ప్రశ్నించిరి. అట్టిప్రశ్నలడుగునపుడెల్ల నీక్రిందిశ్లోకమును నేను జెప్పుచుంటిని. "అభ్యక్తమివ స్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధ ఇవ సుప్తం, బద్ధమివ స్వైరగతిర్జనమిహా సుఖసంగిన మవైమి."



సర్: వి. టి. క్రిష్ణమాచారిగారు, కే. టి., బరోడాసంస్థానము దివాన్, బరోడా:—

ప్రాచ్యవాఙ్మయజీవితమునకై శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు చేసినసేవను ఉగ్గడించుటకై ఉత్సవసంపుటి ప్రకటింపనున్నట్లు తెలిసి సంతోషమైనది. సంస్కృత మహాభారతము (18 సంపుటములతో. సహా) సంస్కృతము, తెలుగు, అరవములలో వారుప్రచురించినసాధికారప్రకటనములు సుమారు ఒకతరముకాలముగా ఈవిష యమునందు వారుచేసినప్రేమపూర్వకకృషికి నిదర్శనసంకేతములుగా నిలిచినవి. ఇంతేకాక శ్రీశాస్త్రులవారు దేశమునకు వైజ్ఞానికముగాను, ఆర్థికముగాను, ఉపకార మొనర్పగల అన్నియుద్యమములలోనుపాల్గొని తమధర్మమును నెరవేర్చినారు. కావున ఇటువంటితరుణమున మనమువారికిపడినఅప్పును స్మరించుకొనుట లెస్స.

సర్: ఆర్. కే. షణ్ముఖముశెట్టిగారు, కొచ్చిసంస్థానదివాన్, కే. సి. ఐ. ఈ., ఎర్ణాకులము:—

నామిత్రుడు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిపత్రిక సారస్వతసేవను కొనియాడుటకు రజతోత్సవముజరుగనున్నదని విని సంతసించుచున్నాను. వారి సారస్వతసేవనుగురించి అభిప్రాయమునుచెప్పుటకు నేనుతగియుండలేదు కాని, అనేక సంవత్సరములుగ శ్రీశాస్త్రులవారు మద్రాసునచేయుచుండు ప్రజాహితజీవితమును గుఱించి నామెప్పుదలను తెలుపుటకు అవకాశమబ్బినందులకు సంతోషించుచున్నాను. మదరాసుకార్పరేషనులోను పచ్చయప్పధర్మములవంటి అనేకప్రజాహితసంస్థల లోను వారుచేసినసేవ అందరును యెరుంగుదురు. శ్రీశాస్త్రులవారిజీవితరహస్యము అతనిస్నేహపాత్రగుణగణము. రాజకీయవిభేదములు యెన్నియుండినప్పటికిని అన్ని పార్టీలయందును ఆయనకు అనేకులుమిత్రులున్నారు. వారికి ఆయనయందు అను రాగమును ఆయనయెడల గొప్పగౌరవమును కలవు.

# మనపలుకుతల్లిని గద్దెయెక్కించుట—ఎట్లు?

## శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు

మనము స్వరాజ్యము కావలెనని కోరుచున్నాము. ఆంధ్రరాష్ట్రము కావలెనని కోరుచున్నాము. మనపలుకుతల్లిని గద్దెయెక్కింపవలెనని కోరుచున్నాము. ఈకోరికలు నెఱవేలుటకు కాంగ్రెస్సుపెద్దఱికమున పనిచేయుచున్నాము; సంపూర్ణస్వాతంత్ర్యము కావలెననుచున్నాము. కాని, ఏండ్లతరబడి ఎంత ప్రయత్నించినను ఇంతవఱకును మనప్రయత్నము సరిగా ఫలింపలేదు. కాంగ్రెస్సుపక్షమున పనిచేసి, అడ్డమగుపాట్లను పడి, లాటీదెబ్బలుతిని, జెయిళ్లపాలై, కొందఱు తమజీవితములను, తమసర్వస్వమును ధారపోసిరి; మఱికొందఱు ప్రాణములుకూడ సమర్పించిరి. ఇన్నిపాట్లు పడఁగాపడఁగా, మనకుకలిగినఫలమేమి? ఏదోఅఱగొఱ రాష్ట్రస్వపరిపాలనము అబ్బినది, ఏలాగుననో! అదియు కొంతకాలము కొన్నిరాష్ట్రములలో జరగి, మున్నాళ్లముచ్చటై, యుద్ధకారణమున ఎగిరిపోయినది మరల అదిఅయినను వచ్చునో! రాదో! అపుడు గద్దెలెక్కిన శాసనసభాధ్యక్షులు, మంత్రులు మొదలగుపెద్దలును, తక్కిన కాంగ్రెసువారును ఇపుడు వెనుకటివలెనే జెయిళ్లకు మరల వెళ్లినారు; వెళ్లుచున్నారు; మిగిలినవారు ఇంకను వెళ్లెదరు.

అయిన, కాంగ్రెసువారుగాని, వారితోపాటు మఱికొందఱు దేశాభిమానులుగాని జెయిళ్లకు వెళ్లుటవలననే సంపూర్ణస్వాతంత్ర్యము తెచ్చుస్వరాజ్యము మనకు వచ్చునా? దానితో ఆంధ్రరాష్ట్రమువచ్చునా? దానితో నాటితల్లితోపాటు పలుకుతల్లియు గద్దెయెక్కునా? నాటితల్లి గద్దెయెక్కుచో పలుకుతల్లియు గద్దెయెక్కును. కాని, నాటితల్లి గద్దెయెక్కుటకు కాంగ్రెసువారు కోరు స్వరాజ్యము రానలె. అయిన, అక్కడనే ఉన్నది అడ్డు అంతయును. ఏమి ఆ అడ్డు? అందురా? వినుఁడు:—

కాంగ్రెసువారును, తక్కినవారును, జెయిళ్లు నింపుదు రనుకొందము; మనవారిని, జెయిళ్లలోపెట్టలేక బ్రిటిషుభారతనమువారు రాజీకివచ్చెదరనుకొందము; యుద్ధానంతరము స్వరాజ్య మిచ్చెదమందు రనుకొందము. కాని, అంతటితో స్వరాజ్యము మనకు వచ్చుట నిశ్చయమా? కాదు. అందులకు బ్రిటిషువారు యుద్ధములోజయముపొందవలె; అందులకు వారిఅదృష్టము బాగుగా ఉండవలె. వారి అదృష్టము బాగుగానే ఉండి వారు జయము

పొందుదురనుకొందము; అప్పటికి మాత్రము మనకు స్వరాజ్యము వచ్చుట నిశ్చయమా? వెనుకటి అనుభవమునుబట్టి నిశ్చయమని ఎవరు చెప్పఁగలరు? పూర్వము యూరపుమహాయుద్ధములో బ్రిటిషువారికి జయముకలిగినపిమ్మట వచ్చుననుకొన్న స్వరాజ్యమునకు మాఱు రౌలటుచట్టము వచ్చినది. ఇఁకముందు జయలక్ష్మి బ్రిటిషువారిని వరించినపుడు మఱి యే చట్టమువచ్చునో! ఎంతమంది మరల జెయిళ్లకు వెళ్లవలసియుండునో! ఆఁ; అది ఏమిమాట? ఎప్పుడును వారు అటులే చేయుదురా? తప్పక స్వరాజ్యము మనకిచ్చెదరని మనవారు కొంద అనవచ్చును. పోనిండు; దానికిని ఒప్పుకొందము. అయినను, అంతటితో మాత్రము స్వరాజ్యమువచ్చునా? రాదే! దానికి కావలసిన కలసికట్టుతనము, మనలో మనకు—కాంగ్రెసు వారికి, ముస్లిమ్‌లీగువారికి, హిందూమహాసభవారికి, తక్కినహరిజనులు మొదలగుచిన్న సంఘములవారికి—లేదే! ఆకలసికట్టుతనము మనకు కుదిరినపుడు గదా స్వరాజ్యము వచ్చుట! అది లేనపుడు బ్రిటిషుప్రభుత్వమువారివజ్రకవచము—మనఐకమత్యలోపము—ఉండనే ఉన్నది. వారు మనతో 'మీదే లోటు' అందురు. ఈలోటు తీఱుట ఎప్పుడు? మనకు స్వరాజ్యమువచ్చుట ఎప్పుడు? ఎవరు చెప్పఁగలరు? ఎప్పుడో మనదేశమున ఏగొడ్రాలికో కొడుకు పుట్టి-పెరిగి-మహావీరుఁడై, తనవంటి బంటులదండును కూర్చుకొని, ఎండమావులనీళ్లలో క్రుంకులిడి, నింగితమ్ములు తాల్చి కుందేటికొమ్మువిండ్లు చేపట్టి, స్వాతంత్ర్యసమరమున జయలక్ష్మిని చేకొనినపుడు మనకు స్వరాజ్యము రావచ్చును—అనఁగా ఇప్పటి ఉనికిలోనే ఉన్న యెడల మనకు స్వరాజ్యము ఎప్పటికిని రాదు—అనుట నిశ్చయము.

అయిన, స్వరాజ్యమువచ్చుటకు మనకు మఱియేవెరవును లేదా? అనిన, దైవికముగా చేకూరవలసియున్నచో ఒకటి కానవచ్చుచున్నది. చీనాయుద్ధములో ఇపుడు జపానువారు పెక్కుకారణములవలన వెనుకాడుచున్నారు. ఇఁకముందు కూడ వారటులే చేయవలసియుండునట్లు తోఁచుచున్నది. అటులగునెడల చీనావారు తమదేశమునంతయు త్వరలో స్వాధీనపఱచుకొని సంపూర్ణస్వరాజ్యము పొందవచ్చును; అపుడు వారు సర్వసమర్థులు కావచ్చును. ఇప్పటియుద్ధమునకుముందే రవీంద్రనాథఠాకూరుగారివలన చీనావారికిని మనకును పొత్తేర్పడినది; ఆపొత్తు కాంగ్రెసువారు ఇప్పటిచీనాయుద్ధప్రారంభమున చేతనగునంత వఱకుసాయపడి, పెంపొందించినారు; నెహ్రూపండితునిరాయబారమువలన అదిమఱింతబలపడినది. దానికి తార్కాణము మొన్నమొన్న చీనానుండి మనదేశమునకువచ్చిన మాఱురాయబారమే. దీనిలో—చీనాయిండియాలపొత్తులో— లోకశాంతివిత్తనము కలదని తోఁచుచున్నది. ఇది దైవబలమున మొలకెత్తి-పెరిఁగి-పెద్దదగునపుడు, స్వాతంత్ర్యసౌరభము భూ

మండలంబెల్ల నిండవచ్చు; అపుడు ముస్ముందు అది మనకు అబ్బవచ్చు; అందువలన, మనకును చీనాతోపాటు సంపూర్ణస్వరాజ్యము రావచ్చు; ఆంధ్రరాష్ట్రము రావచ్చు; మననాటితల్లి గద్దెయెక్కవచ్చు; అపుడు మనము మనపలుకుతల్లినికూడ గద్దెయెక్కింపవచ్చు. కాని, ఈతల పోఁతలతీరు మింటిమీఁద మేడకట్టుట కాదా? అనిన, జరుగునంతవఱకును అంతే అని ఒప్పుకొనక తప్పదు మఱియు, ఇందు మఱొకలోటుకలదు; ఫలము పౌరుషముమీఁద హెచ్చుగాఁగాక, దైవముమీఁద హెచ్చుగా ఆధారపడియున్నది.

అయ్యో! అటులైన మనస్వరాజ్యాశ నిరాశయేనా? ఆంధ్రరాష్ట్రాశయు అంతేనా? కాదు; ఒకకట్టడకు మనము కట్టుపడుచో కాదు. పొంగుమాటలతో తనియుట మాని, జట్టీలకుతయారగుట మాని, పెత్తనపుమిత్తికి లోనగుట మాని, పేరువెఱ్ఱికై పెనఁగులాడుట మాని, దేవుఁడు లేఁడు—అని యింగ్లీషుచదువుకొనిన మనవారిలో కొందఱు నేర్చుకొనిన తెలివితక్కువతలంపువంటి తలంపులుమాని, ఒడలువంచి, తోడివారికి తెలివితేటలుకలిగించి, వారిమేలే మనమేలనియెంచి, మనలో తెలివిగలవారమనుకొనువారు తామునాటికొలువరుల మనితలంచి, ఊళ్లలో నివసించి, ఏఊరికాఊరు పైతోడ్పాటుతోపనిలేక తనకుకావలసినవెల్ల ఇంచుమించుగా తానేసమకూర్చుకొనుఉనికిలోనికి తెచ్చుటకుప్రయత్నించి, ఊరిదొరతనము-గ్రామస్వరాజ్యము—మునుపటివలెనే మరల నెలకొల్పఁగలుగునెడల, మనకు ఆఊరిదొరతనపుబలిమిచే ఆంధ్రరాష్ట్రము—నాటిదొరతనము—తప్పక వచ్చును. ఇఁక, స్వరాజ్యమా? ఇపుడు నాటిదొరతనము లేనినాడులవారు కూడ ఊరిదొరతనమునుబట్టి నాటిదొరతనము తెచ్చుకొని—నాటిదొరతనములన్నియు కలసికట్టుతనముతో పట్టుపట్టి ప్రయత్నించునేని, స్వరాజ్యమును రావచ్చును.

నిజమునకు ఊరిదొరతనముచేకూరినపుడు మనము స్వరాజ్యమునుగూర్చి తాపత్రయ పడవలసినపనియే ఉండదు. మునుపు ఏవూరివారు ఆఊరిని తామే ఏలుకొనినపుడు, మొత్తముమీఁద దేశమును ఎవరేలినను— అతఁడు రాజుకానిండు, చక్రవర్తికానిండు,— వానికి అప్పటియేర్పాటునుబట్టి, ఏఁడాదికి ఒకసారి ఎంతో కొంతసొమ్ముచెల్లించుటతప్ప అంతకంటె మఱొకపొత్తు వానితో లేక, తమవూరిపెద్దలపెద్దఱికమున కడుపులోచల్ల కదలక సుఖించుచుండెడివారు. బ్రిటిషువారు మనదేశమునకు వచ్చి-తమప్రభుత్వమును స్థిరపఱుచుకొని, ఊరిదొరతనము ఊడఁగొట్టినంతవఱకును, మన ఊళ్లు ఏలోట్లునులేక, చదువులకేమి-సిరిసంపదలకేమి—పనిమెఱుఁగులకేమి—కలసికట్టుతనమునకేమి ఆటపట్టులై, ప్రోల్లనుప్రోచు తల్లులై తమకు తామే ప్రాపులై, పైనాడులకు పంటసరకులేకాక చేతినేర్పుతోఅమర్చిన మేలి

వలువలు మొదలగుసరకులుసైతము పంపి-వెండి బంగారులు కురిపించువేల్పుగిడ్డులై వేయి మాటలేల, నేలమీఁదిస్వర్గంబులై వెలయుచుండెడివి. అందు, అన్ని తెగలవారును తమతమ తెగలకు కాణాచిగావచ్చు పనులలో ఆఱితేఱి-నేరిమిచే పేరిమికాంచి-తమతమ తెగలను పెంపొందించుకొనుటయేకాక, తమతమనేరిమి కూరిమితోఁ చేర్చి, ఊరిపెంపుచే కూర్చి, అందువలన తమఊళ్లకుతామేదొరలై, హాయిగాబ్రతుకుచుండెడివారు. అన్ని తెగలనుండియు ఎన్నుకొనినపెద్దలు ఎవరికిని ఏకొఱంతయులేనితెఱంగున దొరతనము జరుపుచుండెడివారు. ఊరిదొరతనముసాగునపుడు అన్ని తెగలవారును తమతమపనులలో నీవా? నేనా? అనునట్టినేర్పు గడించి, అందఱునుహాయిగా మనఁజాలినఉనికిలోఉండుటయే ఊరితనము. అట్టి ఊరితనమే యిండియామేలితనపు మేడకు పుట్టకీటు. ఎట్టులైననేమి? ఆమేడ యిపుడు కూలిపోయినది. ఆపుట్టకీటుకూడ చెడిపోయినది. కాన, మనము మునుపటితీరుననే ఇప్పటికి తగునట్లు మఱింత గట్టిపుట్టకీటు వేయఁగలుగునప్పుడుగాని—అనఁగా ఊరిదొరతనముచేఁగాని రానిఊరితనమును మరల గడింపఁగలుగునప్పుడుగాని—మనము మునుపటి మనపెద్దలవలె హాయిగా బ్రతుకఁగలుగుటకాని, ఇండియామేలితనమును పైకితేఁగలుగుటకాని మనదొరతనము—స్వరాజ్యము—మనముగడింపఁగలుగుటకాని కలలోనివార్త. కావున, ఊరితనమునకు మనము మొదటఉసురుఱపోయవలె; అందుకొఱకు తమఉసురులొసంగఁగలవారు—మగవారును, ఆఁడువారును—బయలుదేఱవలె; నడుములుకట్టి, బాములకుఓర్చి, మనకోరిక నెఱవేఱువఱకును పట్టుపట్టి, పాటుపడవలె. అప్పుడే ఇప్పుడు మేలుబంతిగా ఉండఁగలఊరితనము మనకుఁ అబ్బ గలదు. అప్పుడే మననాటిదొరతనము—ఆంధ్రరాష్ట్రప్రభుత్వము—మనకు అబ్బఁగలదు. అప్పుడే మనయిండియాదొరతనము—సంపూర్ణస్వరాజ్యము—నేలనాలుగువైపులనున్న నాడులకెల్లను కూడ ఒజ్జబంతియై, వానికెల్ల మేలుసమకూర్చునదై ఎక్కడఁగాని తమమేలే తాముచూచుకొనుపేరాసతో పెఱవారితో పోరులకుకాలుత్రవ్వుచు తామును వారును చెడుకీడునకు లోనుగాక-ఏనాటివారైనను, ఏతెగవారైనను మందియెల్లరును ఎల్లనిబిడ్డలే-తోఁబుట్టువులే-ఒండొరులమంచికి పాటుపడవలసినవారే—అనునట్టి యెఱుక ఎల్లరకు కలిగింపఁగలదై, తొంటివలె ఇండియా నాడులకెల్లకన్నా కనిపింపఁజాలినదై, మనకు తప్పక అబ్బఁగలదు. మనకేకాక నేలమీఁది మందికందఱకును ఇంతింతనరాని మేలు చేకూర్పఁజాలు మనదొరతనముకొఱకు, దానికి కూఁకటివేరగుఊరితనముకొఱకు, మనము చేయరానిది ఏమి? మనబలిమి, మనకలిమి, మనతెలివి—ఇదిఅది అననేల?—మనకున్నదంతయు జంకుగొంకులులేక బలిచేయవలసినదే. అప్పుడే ఊరితనమునకు గట్టిపుట్టకీటుపడును. అప్పుడే

వేఱుతనములో సాటితనమే కాక, ఒంటితనమును తేటపడును; అప్పుడే మందిలో ఏబొందిలో నేని వెలుఁగువెలుంగు అంతటనునిండియుండు మేటివెలుంగేఅని ఎఱుకపడును, అప్పుడే అంద ఱును తమకుతోడివారితోడి సరిసాటితనమును గుర్తింపఁగలుగుదురు; అప్పుడే ఏనాటివారికి ఆనాట అఱిగొఱికాని దొరతనముచేకూరఁగలదు; అప్పుడే అందఱును మేలిహాయి మున్నీటి కెరటపుటుయ్యాలలలో తేలియాడఁగలరు. అప్పుడే ఆయానాడులవారు తమపలుకుతల్లిని గద్దెయెక్కింపఁగలరు; ఆమెచే తనబిడ్డలకు ఎఱుకవెదచల్లింపఁగలరు; అప్పుడే నెమ్మదినెమ్మి కులుకుచు పురివిప్పుకొని, నేలపై మూలమూలలను కన్నువిందుగా-డెందపువిందుగా, హాయి కన్నె మబ్బులను కనుఁగొనుచు ఆడఁగలదు. అంతకంటె ఎవరుగాని కోరఁదగినది మఱేమి కలదు?

కావున, మనపలుకుతల్లిని గద్దెయెక్కించి-అందువలన మొదట మననాటివారికిని, పిదప పెఱనాడులవారికినికూడ ఎఱుకచేకూర్చి-దానివలన తామునువారును హాయిగా మనఁ దలఁచువారును, అటులే ఆంధ్రరాష్ట్రమును-స్వరాజ్యమునుగడించి-సంపూర్ణస్వాతంత్ర్యము సంపాదించి-మేలొందనెంచువారును, మొట్టమొదట పైని తెలిపిన తెఱంగున ఊరిదొరతనము సమకూర్చుటకు నిర్ణయించుకొందురుగాక! ఈతీరునచ్చిన మన తెనుఁగువారు-ఆయాజిల్లాలలో పట్టణములలోఉన్నవారైనను పల్లెలలోఉన్నవారైనను తమనిర్ణయమును వెల్లడించి, వీలగు నంతవఱకు ఒండొరులతో మాటలాడుకొని, వెరవులు చూచుకొని, పాటుపడెదరుగాక!! ఊరిదొరతనపువెరవుతో నాటితల్లితోపాటు మన పలుకుతల్లినికూడ గద్దెయెక్కించెదరుగాక!!!



శ్రీరాజమంత్రిప్రవీణ ఎన్. మాధవరావుగారు, బి.ఏ., బి.ఎల్., మైసూరు గవర్నమెంటు మొదటిమెంబరు, బెంగుళూరు:—

వారపత్రిక త్రిలిఙ్గకు 25 ఏండ్లు నిండినవనియు త్వరలో రజతోత్సవము జరుగుననియువినుటకు సంతసించితిని. తెనుగువాఙ్మయమును అనేకవిధముల అభి వృద్ధిచేయుటకుతోడ్పడియుండు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆంధ్రదేశ మున త్రిలిఙ్గపత్రికకు జనరంజకత్వమునుసంపాదించి విజయముపొందినందులకు అభి నందింపతగియున్నారు.

# తెలుగువారి కర్తవ్యము

**శ్రీ నల్లాన్ చక్రవర్తి నరసింహాచార్యగారు, బి. ఏ., యల్. యల్. బి.,**

ఆడ్వొకేటు, బొంబాయి.

ఏజాతీయుల ముఖ్యాభివృద్ధికై త్రిలిఙ్గపత్రికారాజము విరాజిల్లుచున్నదో దాని అనేకసంవత్సరములు నిర్విఘ్నముగా కొనసాగించి తెలుగుభాషీయులు దేశమున నెచట నున్నను వారికృతజ్ఞతకు శ్రీభాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పాత్రులైరి. అందువల్ల ఏజాతీయులది తెలుగుభాష యో, అనేకసంవత్సరములనుంచి ఎవ్వరిభాషామతల్లి ఆజాతీయులద్వారా వివిధఆంధ్రేతరప్రాంతముల ప్రాకి వివిధకుసుమఫలాన్వితమై యొప్పారు చున్నదో వారిముఖ్యకర్తవ్యమును సూచింపనెంచితిని.

ఆంధ్రులనక తెలుగువారని వ్రాయుటకు కారణమడుగవచ్చును. అనేకశతాబ్దముల నుంచి వివిధప్రాంతములలోను, వివిధజాతీయులలోను తెలుగుపదమే వాడుకలో నుంటు న్నది. తెలుంగుబ్రాహ్మణు లనువారు వైదికవృత్తిలో మహారాష్ట్రగుజరాతుదేశములలో స్వచ్ఛబ్రాహ్మణులుగా పరిగణింపబడుచున్నారు. మహారాష్ట్రులు, గుజరాతీలు, కన్నడులు, బంగాళీలన్నట్లు వాడుకగా తెలుగువారనే ఉంటున్నది. ఆంధ్రులని వాడుకలో లేదు. దేశ భాషలలో మూడవభాషాధిక్యత ఇతరులు గుర్తింపకపోలేదు. సామాన్యులగు తెలుగు ప్రజలలో తెలుగుపదమే వాడుకలో నున్నది. అందువల్ల తెలుగువారమనియే మధ్యపర గణాలలోను, మహారాష్ట్రదేశమందును, గుజరాతుదేశమందును చెప్పుకొనుచుందురు. వారినిగూర్చి కూడ ఇతరులు 'మహారాష్ట్రులన్నట్లు' తెలుగువారని గౌరవముగా వ్యవహ రింతురు.

ఈప్రజలు దేశమంతటను వ్యాపించి, వారు నివసించుప్రదేశములలో ప్రసిద్ధిచెంది, తెలుగుజాతికీర్తికి కారణులగుచున్నారనుటలో సందియము లేదు. తెలుగుదేశమున కవతల నున్న తెలుగుప్రజలు పరిస్థితులవల్ల ఆయాదేశాచారముల నలవరచుకొనుచు, ఆయాదేశీ యులతో నేకీభవించి, వారిప్రత్యేకతను గమనించి పెంపొందించుకొనుపద్ధతిని మెలగక, స్థానికప్రజలలో చాలాభాగము లీనమగుచున్నారు. ఇట్టిపరిస్థితులు అనేకసంవత్సరములుగ ఉండెను. ఇందువల్ల, వారిసాధారణజీవనమున కాటంకములేక, స్థానికప్రజలతో నపరిమిత

మైత్రి పెంపొంది, స్థానిక ప్రజలలో నొకతెగగా ఏర్పడియున్నారు. నేను బొంబాయిలో మొదట తెలుగువారిని గుర్తింపనేరక యుంటిని. వా రంతమార్పు జెందియుండిరి తెలుగుతో మాట్లాడినను తెలుగున జబాబిచ్చుటకు తెలుగుతో మాటాడ గలిగినను జంకుచుండిరి. కాని గృహములలో వారు, స్త్రీలు, పిల్లలు సహితము తెలుగులోనే ఏదోవిధముగా మాట్లాడుచుండుట నాకాశ్చర్యము కలిగించెను. వారు నాతో తెలుగున మాట్లాడుటకు పొందిన సంకోచము చాలాకాలమునకు గాని పోలేదు. అదికూడ నేను వారలవలె తెలుగు మాట్లాడ నేర్చి వారితో భాషింపగా తగ్గినట్లు కన్పించినది. తెలుగుభాషపట్ల వారు హృదయమున ననేకసంవత్సరములనుంచి కాపాడిన గౌరవము నాకు కన్నులకు గట్టినట్లుండెను. ఇట్టిస్థితిగతులే ఇతర ప్రదేశములందును కన్పించును. ఇదివరలో చేసిన ఆంధ్రోద్యమప్రచారము వివిధతెలుగుజాతీయుల నంటలేదని ముఖ్యముగా వక్కాణింపగలను. ఆంధ్రోద్యమము ఆంధ్రులలో నన్నిప్రదేశములందును రాణింప ప్రయత్నములు సరిగా జరుగలేదని చెప్పక తప్పదు. ఆంధ్రదేశమున కావలిప్రదేశములలోనున్న తెలుగుప్రజలలో ప్రబోధమెంతమాత్రము జరుగలేదని చెప్పవచ్చును. లక్షలకొలది తెలుగుప్రజలు ఆంధ్రోద్యమమేమో ఎరుగనివారై యుండిరనుటలో అతిశయోక్తి లేదు. ఎరిగినవారైనను, అది తమకు సంబంధించిన ఉద్యమముగా తలపలేదు. దానికారణము అది వారిప్రత్యేకపరిస్థితులను గమనింపకపోవుటయే యని నాకు తోచినది. దుకాణములోనున్న తయారుఅంగీని స్వీకరింపమనినచో సంకోచపడని ప్రజలుండరు. అటులనే వారివారిప్రత్యేకస్థితిగతులను చూడక ఆంధ్రోద్యమమును స్వీకరింపమన్నపుడు వారు తమకొలతకు, పరిమాణతకు, ఉపయోగమునకు సరిపడని తయారుఅంగీని తలపెట్టినట్లు, తలపెట్టక ఊరకుండిరని చెప్ప సాహసించుచున్నాను. "మాఅంగీ మాకు తగినట్లు మాదర్జీయే తయారుచేయును గాన, మీఅంగీని అవతలపెట్టుడ"ని వారన్నను తప్పుగా కన్పింపదు గదా! దీనికి అనేకలక్షల వివిధప్రాంతీయతెలుగువారిని మండలించిన కార్యముండదు. ఆంధ్రోద్యమక్షీణతకు, వీరందరును అందు పాల్గొనుఅవకాశము లేనందువల్లనని చెప్పవచ్చును. "వచ్చినయెడల రావద్దంటిమా, వారందరు రాకున్న మాతప్పేమని" ఆంధ్రోద్యమప్రచారకులు వాదింపవచ్చును. కాని ఆప్రచారకులుగాని, వాదులుగాని, వారిస్థితిగతులు గమనించి వారికాఉద్యమము ఎటులనువర్తించునో ఆలోచించిరా? ప్రత్యేకపరిస్థితులు, దేశవాడుకలు గమనింపక ప్రచారముచేయు ఉద్యమము, సంస్థలు, ఎంతకాలము నిల్చును? అందువల్లనే సంస్థలు స్థాపించి ప్రజాప్రబోధము చేయుటకన్న, ప్రజాపరిస్థితులు గమనించి, సంస్థలు స్థాపించినయెడల

ప్రజాభివృద్ధికెంత తోడ్పడును? ఈవిషయమును గ్రహింపనందువల్లనే వివిధప్రాంతముల స్థాపింపబడిన ఆంధ్రసంస్థలు నామమాత్రావశిష్టముగానుండి ఉపయోగరహితమై, పేరుతో మాత్రము నిలచుచున్నవి. ఈసంస్థలు నడుపువారికి ఎంతమంది తెలుగువారికి తెలుగుభాష గరపిరి? ఎంతమంది తెలుగువారికి ఆర్థికసంస్థల నేర్పరచిరి? ఎన్ని తెలుగు ప్రాథమిక పాఠశాలలు నెలకొల్పిరి? ఎన్ని తెలుగుపుస్తకభాండాగారములు స్థాపించిరి? మున్నగు ప్రశ్నలడిగి వారి ప్రత్యుత్తరముల గమనింపుడు.

తెలుగువారి ప్రత్యేకతకు యోగ్యతకు మూలమైన తెలుగుభాషా ప్రచారము చేసి తెలుగువారమన్న గర్వము సార్థకపరచని ఆంధ్రసంస్థలవల్ల నేమియుపయోగము? అదిగాక లక్షలకొలదిగానుండి సామాన్యజీవనము చేయుచు విద్యాగంధమన్ననేమో ఎరుగక ఆర్థికముగా వెనుకబడియున్న తెలుగువారిలో జాతీయసంఘజీవనాదర్శముల పెంపొందించుటకు వారిపరిస్థితులు గమనించి, ఆర్థికముగను, సాంఘికముగను తలెత్తుకు తిరుగు సౌకర్యములు కలిగింపవలయును. అటుతరువాత ఈపునాదిపై ఏసౌధమునైనను నిర్మింపవచ్చును. ఈస్థితిగతులు గమనించియే ఇప్పటికి బొంబాయిలో 'తెలుగుసేవాసంఘము' స్థాపింపబడినది. నేనును నాప్రియమిత్రులగు శ్రీ యస్. యల్. శీలంగారు, శ్రీభైరవరసు హనుమంతరావు గారు, డి. సుబ్బారావుగారును, ఏకాభిప్రాయులమై ఈసంఘమును నెలకొల్పగలిగితిమి. ముందు, పరిస్థితులన్నియు కన్నార చూచి తదనుగుణముగా ఈసంఘాదర్శములను నడవడిని ఏర్పరచుకొనుచున్నాము. ఆంధ్రోద్యమాభిలాషులు మాసంఘకార్యక్రమము ఆంధ్రోద్యమమున కెంతమాత్రము విరుద్ధమని తలంప నవకాశము లేదు. మాముఖ్యోద్దేశ్యము ఎచ్చటనున్నను తెలుగుజాతీయులనందరను ఏకీభవింపజేయుటయే. ఇందుకు తెలుగుసేవాసంఘము సరియగుపునాది వేయుచున్నది తెలుగుమనుష్యుడెచట నున్నను, అతడు రాష్ట్రీయుడు కావలయును. వారిలో ఎన్నికులములున్నను, తెలుగుభాషామూలకముగా వారందరు ఏకమగుట తెలుగుసేవాసంఘపు ముఖ్యకర్తవ్యమని మనవిచేయుచున్నాను. దేశమునందుగల అందరు తెలుగువారును ఈఉద్దేశ్యమును గమనించి ప్రయత్నములు సల్పినయెడల తెలుగువారందరు ఒక్క అఖండజాతిగా నేర్పడి, వారిసహజబలమును సాంఘికముగాను, ఆర్థికముగాను రాజకీయముగాను ప్రదర్శింపగలరు.

ఎంతమంది జీవనోపాధికై పరరాష్ట్రముల నివసించి తెలుగుజాతీయధర్మము గుర్తెరుగక యున్నారో మన ఆంధ్రసోదరులు గుర్తెరిగినట్లు తలప అవకాశము లేదు. ఆంధ్రులైనను

పరరాష్ట్రముల నుద్యోగరీత్యా స్థిరపడినపుడు సామాన్యముగా అంతకు ముందు స్థిరనివాసులైనట్టియు, విద్యాఆర్థికవిషయములలో వెనుకబడిన తెలుగుసోదరుల కష్టసుఖముల గుర్తెరుగుట ధర్మము. నాకును నామిత్రులకును ఇట్టి తెలుగుసోదరుల పురోభివృద్ధియే ఆంధ్రోద్యమమునకు సరియగుసోపానమను భావము కలిగినది. వివిధరాష్ట్రములలోనున్న తెలుగుసోదరులు తమంతట తామే తెలుగుభాషీయులమను సహజగర్వముతో భాషను సరిగా అభ్యసించి నిరక్షరాస్యత తొలగించి, తెలుగుసంఘమును ఆర్థికముగాను రాజకీయముగను పైకి వచ్చునట్లు తెలుగుసేవాసంఘమువంటిసంస్థల స్థాపించి కృషిసల్పు టత్యంతావసరము. ఇట్లు వివిధప్రాంతములనున్న తెలుగువారు తమజాతీయాభివృద్ధికై పాటుబడినయెడల ఇప్పటి కొరంత తీరగలదు. ఆంధ్రోద్యమము, ఆంధ్రేతరప్రాంతములలో నిశ్చయముగా జరుగు అవకాశములెన్నియో గలవని నానమ్మకము. సరియగుపద్ధతిని భాషాపతాకముక్రింద నిలచినయెడల, తెలుగువారందరు, కులమతభేదములు పాటింపక, ఒక్కజాతిగా నిలతురని నిశ్చయముగా చెప్పగలను. లక్షలకొలదిప్రజలు ఇతరరాష్ట్రములలో నిట్లు నిలచినయెడల, వారి సౌభాగ్యమునకేమి లోపముండును? ఇతరరాష్ట్రములలో కొన్నికొన్నివృత్తులు తెలుగువారివశమై యున్నవి. బొంబాయిరాజధాని వివిధప్రాంతములలోని తెలుగువారు విశేషించి నేతపనులలో బహునేర్పరులని ప్రసిద్ధి జెందియున్నారు. గృహనిర్మాణమునందును విశేషప్రజ్ఞావంతులని కీర్తి గడించిరి. వీరందరు కూడివచ్చినయెడల, వారిశక్తి ఎన్నిమడుంగులగునో ఊహించుకోవచ్చును. ఎవ్వరును వారిదారి నరికట్టజాలరు. జనసంఖ్యను పట్టి చూచినను, వృత్తిప్రాముఖ్యతనుబట్టి చూచినను, తెలుగుప్రజ లితరరాష్ట్రముల నిప్పటికే ముఖ్యస్థాన మాక్రమించి యున్నారు. వారు స్థిరపడిన ఆయారాష్ట్రములందేగాక, వారిప్రాముఖ్యత, ఆంధ్రదేశమునకు గూడ ముందుముందు గోచరింపగలదు. ఆంధ్రోద్యమము ఎప్పటికైన విస్తరించి ఆంధ్రులఆశయములు కొనసాగవలయునన్న, వివిధరాష్ట్రములలోనున్న తెలుగువారిని కూడగట్టుకొననిది సాధ్యపడదు. అట్లు బ్రిటీషుఇండియారాష్ట్రములలోని ఆంధ్రులందరు ఏకీభవించినయెడల ఆంధ్రరాష్ట్రనిర్మాణమొక అసాధ్యపుపనిగా నెంచనవసరము లేదు. ఆంధ్రరాష్ట్ర మొకరిచేతి దానముగా నెంచువరకు ముక్తిలేదని నాదృఢాభిప్రాయము. అది తెలుగువారిచేతిలోనే యున్నది. దానికొరకు తెలుగుజాత్యౌన్నత్యమును పైవిధమున సూచించినట్లు నిలబెట్టుట ముఖ్యావసరముగా గన్పించుచున్నది. రానురాను, స్వదేశసంస్థానములలోగల తెలుగువారిని గూడ, కూడగట్టుకొనుట ముఖ్యావసరము. ఇట్లొనర్చినయెడల, దేశభాషలలో మూడవస్థానమలంకరించిన తెలుగుభాషవలెనే, తెలుగు జాతీయులుకూడ మూడవస్థానము నాక్రమించుట కేమి సంశయము!

## తెలుగువారికర్తవ్యము.

తెలుగువారు తమజాతిప్రజ లభివృద్ధినొందవలయుననే దృఢసంకల్పము గలవారైన యెడల, ఏవిషయమునను ఇతరులపై నాధారపడవలసినవారు కారు. ఉన్నస్వశక్తిని సరిగా ఉపయోగించనపుడు పరులకు దోసిలొగ్గుట, పరులకన్న తక్కువవారమని సరిపెట్టుకుని, ఇతర రాష్ట్రనాయకులే తమముక్తికాధారులని భావించుట మున్నగు అనర్థకసాంప్రదాయములకు దావొసంగుట యగుచున్నది. అందువల్ల, బొంబాయిరాజధానిలోని తెలుగువారు, మధ్య పరగణాలలోని తెలుగువారు, అరవకన్నడదేశపు తెలుగువారు, రంగూన్, బెంగాలురాష్ట్రపు తెలుగువారు, అందరును ముఖ్యముగా ఇప్పుడు బొంబాయిలో స్థాపింపబడిన తెలుగు సేవాసంఘపురీతిగా సంఘములు విరివిగా నెలకొల్పి విద్యాభివృద్ధి, భాషాభివృద్ధి, సాంఘిక, ఆర్థికాభివృద్ధి అచ్చటచ్చటిస్థానికప్రజలయొక్కయు అధికారులయొక్కయు సహాయమువల్ల కొనసాగించుట కర్తవ్యమని మనవిచేయుచున్నాను. అటులనే స్వదేశిసంస్థానములందలి తెలుగు వారు, ఖండాంతరవాసులగు తెలుగువారుకూడ నెరవేర్చుట ధర్మము. ఉచితముగా న్యాయ సహాయము చేయుటకు, వైద్యసహాయము చేయుటకు, సంస్థలు నెలకొల్పినయెడల సామాన్య ప్రజావిశ్వాసగౌరవములకు తావుండును. అటుతరువాత ఉచితపాఠశాలలు, పుస్తకభాండా గారములు స్థాపింపవలయును. నిరక్షరాస్యత పారదోలవలయును. తెలుగుభాషాగౌరవము నిలబెట్టి పోషింపవలయును. "నేను తెలుగుజాతీయుడ" ననుగర్వము ప్రతితెలుగువ్యక్తి యందును కలుగుట ముఖ్యావసరము. తెలుగువాడనని చెప్పుకొనుటకు ఎవ్వరును సంకోచ పడనవసరము కలనైనను కన్పింపరాదు. ఇట్టి పరిస్థితులేర్పడినయెడల ఆంధ్రోద్యమమునకు లక్షలకొలది ప్రజలసహాయసంపత్తి లభింపగలదు. ఆంధ్రులఆశయములు కొనసాగి భారత దేశమున ఆంధ్రులు ప్రాముఖ్యస్థాన మాక్రమింపగలరనుట కెంతమాత్రమును సంది యము లేదు.

ఈసందర్భమున తెలుగుజాతీయులందరు శ్రీభాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు తమ ప్రచురణలమూలమునను అమూల్యమగు త్రిలిఙ్గపత్రికామూలమునను చేయు సేవ గుర్తెరుంగుట ధర్మము. ఆపత్రిక ఇన్నిసంవత్సరములనుంచియు చేయుచున్న సేవ ఫలో న్ముఖమునకు వచ్చుచున్నదనుటకు సందియము లేదు. దీనికి గర్వింపని ఆంధ్రులుండరనుట నిశ్చయము. మన తెలుగుజాతివారు దేశాంతరమున నున్నను స్వదేశమున నున్నను వారి కర్థదుకాటుగా ప్రచురణములు, పత్రిక నడపి, అందరిలో జాతీయధర్మాదర్శముల నాటు చున్నారు. అందువల్ల ఆంధ్రోద్యమమునకు శాశ్వతమైన పునాది ఏర్పడుచున్నది. ఈపుని రాజకీయోద్యమకళేవరమువల్ల మనప్రజలు కానరిరోజులలో శ్రీభాషోద్ధారకునివల్ల నిరు

త్స్వాహాపరిస్థితులలో గూడ నెరవేర్పబడినదని నానిశ్చయనమ్మకము. ఒకప్పుడు రాజభాషగా ప్రసిద్ధికెందిన తెలుగుభాషకుక్షీణత సంప్రాప్తించిన రోజులలో శ్రీ కీ. శే. వావిళ్ల రామ స్వామిశాస్త్రిగారు దానిని పునరుద్ధరింప బద్ధకంకణులై సజీవముగా నొనర్ప సమకట్టిరి. వారి ఉద్యమము శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు ఫలవంతము గావించిరి. వారు గుర్తెరింగినట్లే భాషా పోషణ, అక్షరాస్యత తెలుగువారిపురోభివృద్ధికి మూలమని అందరు భావింపనిది తెలుగు వారిభావిస్థితి గాంధాంధకారబంధురమగునని భావించుట ముఖ్యము. అందుకందరును గాఢముగా పూనుకుని వారిఅమూల్యాశయముల సార్థకపరచెదరని నమ్ముచున్నాను.



**రావుబహదరు శ్రీ డీ. మహంతి మహాశయా, జయపురము దివాను, విశాఖపట్టణము:—**

తనకే తెలియకచేసినప్రజాసేవ అనుమాటలు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారిజీవితములో వారుతీర్చినకార్యక్రమమునువర్ణించునని నావిశ్వాసము. సామర్థ్యముఉండియు తన్నుతామరచుగుణముండుట చాలఅరుదు. ఇట్టిగుణమే శ్రీ శాస్త్రులవారిని అందరికినిమిత్రునిగావించినది. మొత్తముమీద ఆంధ్రదేశమునకును ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయమునకును ఆయనచేసినసేవ ఎల్లకాలము ఆంధ్రప్రజా హితజీవునికి ఒక్కొక్కనికిని నిదర్శనముగ నుండగలదు. వారి 'త్రిలిఙ్గ' ఆంధ్రులలో ఏకత్వమునుపురికొల్పినది. ఈకోస్తాలోనితెనుగుప్రాంతములలో సాంఘికఆర్థిక అభిప్రాయములను ఉన్నతిపరచినది. తెనుగువారపత్రిక త్రిలిఙ్గరజతోత్సవమున నేను హృదయపూర్వకముగ పాల్గొనుచున్నాను. ఆత్మసమర్పణచేసిన దేశసేవకునకు కలుగవలసినశుభములన్నియు వారికిఅగుగాక!

**శ్రీ దివాన్ బహదర్ ఆర్. సుబ్బయ్యనాయుడుగారు, కూచ్బిహారు సంస్థానదివాన్, కూచ్బిహారు—**

నేను బహుకాలముగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని ఎరుగుదును. ఆయన చాలదివ్యమైనమనిషి. ప్రేమాస్పదుడు. ప్రజలమేలునకై ఎప్పుడును ఏదో ఒకటిచేయ చింతించువాడు.

# ఆంధ్రరాష్ట్రము

విద్వాన్ శ్రీ మంకాల శ్రీపతిశాస్త్రిగారు,
తెలుగుపండితులు, సర్: ముత్తయ్యశెట్టిహైస్కూలు, మదరాసు.

"పరోపదేశే పాండిత్యం సర్వేషాం సుకరం నృణాం,
ధర్మే స్వీయమనుష్ఠానం కస్యచిత్తు మహాత్మనః."

ఆంధ్రరాష్ట్రనిర్మాణమున కాంధ్రభాషాభివృద్ధి ప్రథమసోపానము అయ్యది యాంధ్ర మహాజనులస్వాధీనమునందే యున్నది. ఉదారులును స్వార్థత్యాగపరాయణులును గాఢ దేశాభిమానులునగు నాంధ్రదేశీయనాయకులనేకులు భరతఖండ స్వాతంత్ర్యసంపాదనకై నిరంతరకృషి సలుపుచున్నారు. కారాగారముల కరుగుచున్నారు. పలుబాములఁ బడు చున్నారు. వారిదివ్యదృష్టియంతయు యావద్భారతవర్ష దాస్యవిమోచనముమీఁదనే వ్యాపించియున్నది. తన్మూలమున వారు ప్రత్యేకాంధ్రరాష్ట్రసమస్యను మఱచిరి. "ఇంటగెలిచి రచ్చగెలువు"మనుసూక్తి నెఱుంగరైరి. కొందఱాందోళనముసలిపిరి. కాని వారు వర్కింగు కమిటివారిచేతిలోని కీలుబొమ్మలుగనుక తత్తర్జనభర్జనాదులకులోఁగి మఱి నోరుమెదల్పరైరి. "హిందూరాష్ట్రసమస్య హిందీభాషాసమస్య ప్రథమకర్తవ్యములు. ఆంధ్రరాష్ట్రసమస్యల కిది యదనుకాదు. అయ్యది యాంధ్రులపని కాదు. వర్కింగుకమిటీవారిది. భారతదేశ దాస్యవిమోచనానంతరము ప్రత్యేకాంధ్రరాష్ట్రసమస్యనుగూర్చి యాలోచింపఁబడును" అని వర్కింగుకమిటీలోని పుణ్యభూమిజనులు వక్కాణించిరి. సరదారు 'సరే' ననెను. పండి తుఁడు పాడెను. 'మాబాగున్న' దని మహాత్ముఁడు సంతసించెను. శాంతి నెలకొనెను. ఇంతలో సరిహద్దుప్రశ్న తలచూపెను. "చెన్నప్పనాయుఁడిచ్చెనుగనుక చెన్నపురి యాంధ్రులది. చెన్నపురివఱ కాంధ్రరాష్ట్రము" అని యాంధ్రులనిరి తత్క్షణమే "వడవేం గడం (తిరుపతి) నెల్లూరుసరిహద్దుగాఁ దమిళరాష్ట్రము" అని ఇతరులది తమదిగాభావించు నుదారులగుతమిళనాయకులు చండప్రచండముగా వాదించిరి. "సత్యము సత్యము" అని సత్యమూర్తిగారు తలయూపుచు, "ఆంధ్రులకు మదరాసులో నేమిపని? ఇటసుండువారం దఱు నరవలు. చెన్నపురి తమిళులదే" ననిపలికి తమసానుభూతిని లోకమునకు వెల్లడించిరి. "రాజాజీరాజ్యం రామరాజ్య" మనుఘోషము భూనభోంతరాళంబులు బూరటిల్లెను. "ఏల తగవులాట? ఆంధ్రరాష్ట్రమునకును తమిళరాష్ట్రమునకు మదరాసునగరమొక్కటియే

కేంద్రమై వెలయుఁగాక! ఉభయరాష్ట్రకర్తవ్యములు ప్రత్యేకరాజకీయవర్గము వారిచే నిర్వహింపఁబడునుగాక! ఉభయరాష్ట్రముల కొకగవర్నరు చాలును. ప్రజాప్రతినిధిత్వసభలు వేర్వేఱుగానుండనగు" నని యొర్నికినుప్రభువుగారు సూచించిరి. ఆసూచన యరణ్యరోదన మయ్యెను. ఇంతలో "నాన్నగారూ! పప్పులీయనిచో ఒడికేఁగ" మని బాలురేడ్చు పాఠశాలను ధ్యజించినట్లు కాంగ్రెసురాష్ట్రపరిపాలకవర్గము కేంద్రప్రభుత్వము నందనిమ్రాఁకుల పండ్లనడిగి తమతమపదవులకు స్వస్తిచెప్పిరి. నేటికారాగృహప్రవేశము లన్నియు యావద్భారతవర్షసమస్యకేకాని ఆంధ్రరాష్ట్రసమస్యకై కాదనుట సువిదితమయ్యెనుగదా!

ఆసేతుహిమాచలసమస్యకన్న ఆంధ్రరాష్ట్రసమస్య సులభతరము. ఇంటగెలిచిగదా రచ్చగెలువవలయు! ఎద్దుపుండు కాకికి ముద్దా! ఆంధ్రరాష్ట్రవిచార మాంధ్రులదేకాని యనాంధ్రుల కేమిపట్టినది? ఈతత్వమెఱింగియుండియుఁ గొందఱాంధ్రనాయకులు హిందీనాయకులవెంబడిని మఱికొంద ఱితరులవెంబడినిఁ దాళములుచఱచుచు స్వాభిమానమును గోల్పోయి తదనువర్తులై యుండుట శోచనీయముగదా! ఆంధ్రులయభ్యుదయపరంపరాభివృద్ధికి, ఆంధ్రులవాణిజ్యాభివృద్ధికి, ఆంధ్రులకార్మికవృత్తులయభివృద్ధికి, ఆంధ్రదేశవ్యవసాయాభివృద్ధికిఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రసంపాదనము ప్రథమకర్తవ్యము. "ఆంధ్రభాషను జదువుట వ్యర్థము. హిందీ చదివినఁ జాలును" అని నేడు బడిపిల్లలు తరగతులలో నాంధ్రోపాధ్యాయుల నాక్షేపించునంతటిదుర్దశ కాంగ్రెసువర్గమువా రధికారపదవుల నలంకరించినతరువాతనే సంభవించెను అటు పుణ్యభూమిజనులు నిటు తమిళులు నాంధ్రదేశమును దమతమ రాష్ట్రములలోఁ గలుపుకొనుటకుయత్నించుచుండ నమాయికుఁడవగునాంధ్రుఁడా! ఇంకను నీవు మేల్కొనవేల? కాంగ్రెసులో నాంధ్రులపలుకుబడి యంతరించెను. ఆంధ్రరాష్ట్రసమస్య యడుగంటెను. అల్లదిగో మఱియొక మాయాదేవి ప్రత్యక్షమై "ఆంధ్రదేశము హైదరాబాదునవాబుపరగణాలోఁ జేరాలి" అని గానముచేయుచున్నది! వహవ్వా! విఘ్నేశ్వరుని పెండ్లికి వేయివిఘ్నములా? లేక యిది గోరుచుట్టుమీఁద రోఁకటిపోటా?

మఱియొకలోపము మనలోనున్నది. అదేమన నొకమండలమువారు మండలాంతరాంధ్రులను దూషించుట. అందు ముఖ్యముగా మదరాసుకురాగానే "ఒరేయ్; పూడిసిం ద్రోయ్" అని యిచ్చటి తెలుఁగువారినిఁ జూడఁగానే పరిహసించుట. ఇట్టిదురభ్యాసములను మనము మానుకోవలయును. సరిహద్దుభూములలో నివసించువా రాచ్ఛికాంధ్రము నెన్నఁడును భాషింపఁజాలరు. ఈయవస్థ మదరాసుతెలుఁగువారికిమాత్రము పట్టినదికాదు. గంజాం జిల్లా వారికి, బళ్లారి అనంతపూరుజిల్లాలవారికి, గుంటూరుకర్నూలుజిల్లాలవారికి సహితము

సుస్థిరముగా నెలకొనియుండునదే. కావున పరస్పరదూషణములను బొఱదోలుడు. గుణగ్రాహులరు కండు. బాలవ్యాకరణ ప్రౌఢవ్యాకరణ శబ్దరత్నాకరాది తెలుఁగువాఙ్మయ రత్నములు మదరాసుతెలుఁగువారివి. వానినిఁ బరిహరింపఁగలరా? ప్రత్యేకాంధ్రరాష్ట్రము వలదనునొకకక్ష బయలుదేఱినందుల కాంధ్రుల తిరస్కారభావమే కారణము కాని అన్యముకాదు. ఇట్లెన్నియాందోళనములైనఁ బుట్టునుగాక! రట్టొనరించునుగాక! గిట్టునుగాక! అదిగో ఆత్రిలిఙ్గవాణిని సందర్శింపుఁడు! ఆపవిత్రస్వతంత్రవాగ్దేవి నారాధింపుఁడు! ఆసరస్వతీహితవచనముల నాలింపుఁడు! ఆత్మబుద్ధి సుఖమనుచున్నది. పరబుద్ధి వినాశకరమనుచున్నది. పరులవచనము నాలకింపఁగానే స్వబుద్ధినిఁ గోల్పోదు. వినినంతనే వేగపడదు. కనికల్లనిజముల నెఱుంగును. త్రిలిఙ్గసూక్తులు సూత్రప్రాయములు. కంచుమ్రోగునట్లు కనకంబు మ్రోగునా? నిష్పక్షపాతముగా, నిర్భయముగా స్వాభిప్రాయములను బ్రకటించును. పట్టిప్రగల్భవాక్యము లాపత్త్రికారత్నమునకు గిట్టవు. ఎన్ని యవాంతరము లెన్ని యలజడులు వచ్చుచుఁ బోవుచునున్నను త్రిలిఙ్గ యచంచలయై స్వధర్మము నాచరించుచున్నది. పాతికయేడులు భాషాసేవ, సంఘసేవ, దేశసేవ జయప్రదముగా నిర్వర్తించినది. నేడు రజతోత్సవమును మహావైభవముతోఁ జేయించుకొనుచున్నది. ఆంధ్రరాష్ట్రమునకై—ప్రత్యేకాంధ్రరాష్ట్రసంపాదనమునకై—త్రిలిఙ్గచేసిన చేయుచున్న నిరంతరకృషి అద్వితీయము. ఇట్టి మహత్కార్యనిర్వహణములచే నీత్రిలిఙ్గవాణి స్వర్ణోత్సవ రత్నోత్సవములను సహితము చేయించుకొనుచు పత్రికలసిగదండయై యాచంద్రార్కము వెలయుచుండునుగాక.

త్రిలిఙ్గపత్రికాసంపాదకులగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు అమూల్యసంస్కృతాంధ్రగ్రంథరత్నములను ముద్రించి ప్రకటించి ఆంధ్రలోకమునకు మహోపకారమొనరించిరి. నేడాంధ్రవాఙ్మయ మెవరిసొమ్మనిన శ్రీశాస్త్రులవారిదేయనిన అతిశయోక్తి కానేరదు. సర్వాంగసుందరంబులగు సంస్కృతాంధ్రగ్రంథరత్నములను బఠించి యానందించు భాగ్యము నేడు శ్రీశాస్త్రులవారివల్లనే తెలుఁగువారికి లభించినది. వేయేల? ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణమునకుఁ బ్రథమసోపానమును శ్రీశాస్త్రులవారు సుదృఢముగాఁగట్టియున్నారు. దాని నాధారముంగావించుకొని యాంధ్రలోకము ప్రత్యేకాంధ్రరాష్ట్రమును సంపాదించుకొనునుగాక! ఆంధ్రత్వమునుసంరక్షించుకొనునుగాక! శ్రీశాస్త్రిగారు దీర్ఘాయువులై నింకను నిట్టిసేవలచే నాంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక! శ్రీత్రిలిఙ్గమాతకు జై.

# నియమములు—తదనుసరణము

**కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు,**

ప్రధానాంధ్రపండితులు, మునిసిపలుహైస్కూలు, కడప.

శ్రీమదనంతకల్యాణగుణమహిమావిరాజితుఁడగు పరమేశ్వరుని లీల లద్భుతములు. వాని నెఱుంగువారును, నిదమిత్థమ్మని నిర్ణయించి వచించువారును లేరు లేరనియే ముమ్మాటికిఁ జెప్పవచ్చును. జీవరాసుల సృజించి వాని వానికిఁ దగువృత్తిని గల్పించి పెంచి జగదుపకృతిం గావించి తత్తత్కాలపరిణామమున లయింపఁజేయు నాజగత్సూత్రధారిమహిమకు ధన్యవాదములఁ గావించుటయే తత్సృష్ట్యంతర్వర్తులగు వ్యక్తులకెల్ల నాచరణీయమగుఁగాని వేఱు కలదా?

ప్రాపంచికములగు సౌఖ్యములందు మునిఁగి భగవంతునియందుఁ బ్రామాణ్యబుద్ధిని గోల్పోయి తనకుఁ బైభాగమున నున్నదియే యాకాశమనియుఁ దనముక్కునకుఁ జక్కఁగ నున్నయదియే గుఱియనియుఁ దావసించునదియే స్వర్గలోకమనియుఁ, దనమాటయే వేద వాక్యమనియుఁ, దనకు వ్యతిరిక్తముగఁ బల్కుచు నాచరించువారే పాపులనియుఁ దలంచు వ్యక్తి జగత్సూత్రధారిమహిమ నెఱుంగఁగలదే! అట్టివ్యక్తి మాయామోహితమని మానవ కోటి యెఱుంగనగు.

భగవానుఁడు తన యపరిమేయశక్తిచే లోకంబున వెలయించిన సకలవస్తువులును బ్రయోజనకారులేగాని నిరుపయోగమయిన దొక్కటియుఁ గాఁజాలదు. సంస్కారభేదముచే లోపముచేఁ దత్తత్త్వము నెఱుంగఁజాలక వానినన్నింటిని నిష్ప్రయోజనములని తలంచుట స్వభావము.

"అమంత్రమక్షరం నాస్తి నాస్తి బీజమనౌషధం,
అయోగ్యః పురుషో నాస్తి యోజకస్తత్ర దుర్లభః"

మంత్రమున కుపయోగింపనియక్షరములేదు, ఔషధముగాని విత్తనములేదు, యోగ్యుఁడు కాని పురుషుఁడు లేఁడు. యోజకుఁడు—కూర్చువాఁ డొకండె కొదువగాని—అన్నయట్లు సర్వము సంపూర్ణమే. పూర్ణమునుండి పూర్ణమే కలుగును...పూర్ణమే మిగులుచున్నది. అన్నశ్రుతివాక్యార్థహితముగ సకలము తద్వ్యతిరిక్తము లేదు. అజ్ఞానముచే నిదిలేదు, ఇది

కాదు, ఇది నాది. అది నీది, అది మఱియొకటి యనునూహలు పుట్టుచున్నవి. ఈయహంకార ముననే వాదోపవాదములు ప్రబలుచున్నవి. నిక్కము పరికింపఁగా సకలంబు నొకటియేకాని వేఱుకాదు.

పరిపూర్ణుఁడగు పరంధాముఁడు నియంత. సకలమును నడిపించువాఁడు. నిబంధించు వాఁడు. పంచభూతములచే దేహముల సృజించి పాంచభౌతికము కాయమనుట కుదాహర ణము చూపియున్నాఁడు. ప్రకృతి మహదహంకారాది పంచవింశతితత్త్వసంయుత మగు ప్రపంచము భగవత్ప్రతిపాదితము. తదనంతశక్తి ప్రపూర్ణము. నియమబద్ధము. పరస్పర సంబంధసంయుతము. ఒక్కొక్కదానిబంధము తొలఁగుచు రాఁగా రాఁగాఁ దుదకు మిగులు నది పూర్ణము. అదియే యవ్యక్తము - అద్వైతము.

ఇందు జగత్తు మిథ్య. సత్యము పరమాత్మ. దాని కాకారము భావింపఁజాలము. గుణరూపనామకల్పనము మోహకల్పితమే. అది యజ్ఞానజన్యమే కాని వేఱుకాదు. అట్టి పర మాత్మ పరబ్రహ్మమునకు నామరూపగుణనియమములను గల్పించుట యెుక్కచో నునికి నిర్ణ యించుట తగనిపని. అట్లుచేయుటతో సమస్తవస్త్వంతర్యామిత్వమును వ్యాపకత్వమును బోఁగొట్టుటయగు. దానఁ బరిపూర్ణత్వము నశించు. ఇట్టి యూహలు మాయాసంజనితములే కాని వేఱుకాదు.

నియమనములందు దొరకకయుండునది యాభగవత్తత్త్వముగాని మఱియొకటి లేదు. దాని నుదాహృతిగాఁ దీసికొని తత్సృష్టమగు వస్తుసముదాయములకు నియమములఁ దొలఁ గింపఁబూనరాదు. నియామకుఁడగుట భగవంతునకు స్వాతంత్ర్యము గలదు. తన్నియ మితములగుట భగవంతునిచే సృష్టింపఁబడిన యీప్రపంచమునఁ గలసమస్తము, నియమ బద్ధములని మనము సంపూర్ణముగ నమ్మవలయు—గొఱ్ఱెలకాఁపరి గొఱ్ఱెలమందకు నియంత. అతనియాజ్ఞలో నామంద మెలఁగుచుండవలయునుగాని యతనిని నియమించువాఁడు మఱి యొకఁడు లేఁడు. దాన స్వాతంత్ర్య మాతనికిఁ గలదని నిశ్చయింపవలయును. ఇచ్ఛాధీన ముగా వానిని నడుపఁగలఁడు. నిలుపఁగలఁడు. వదలఁగలఁడు. కాని యవి తదాజ్ఞానువర్త నములయి యనుక్షణము తదిచ్ఛాధీనము లయియుండుటను గనుచునే యున్నాము. ఒక వేళఁ దననియమము నతిక్రమించి స్వేచ్ఛ నవలంబించుచో వానిని దర్జనభర్జనాద్యుపాయ ముల నంకెకుఁ జేర్చి తద్రక్షణమున నప్రమత్తుఁడగుచు నియంత యుండుట యనుభవ సిద్ధాంతమే. మోహాధీనత నాయాయివస్తువులకు భ్రాంతియుఁ, బారవశ్యమునఁ గ్రమము

తప్పొటయుఁ దటస్థించుచున్నదనియు, నట్టి యక్రమాదులు నియంతృచోదకత్వమున మాన్పఁ బడుచున్నవనియు నెఱుంగుట బుద్ధిమల్లక్షణము.

పిపీలికాదిబ్రహ్మాపర్యంతము నియమబద్ధమనుట తప్పక యంగీకరింపవలయు. రూప ములుగాని నామములుగాని గుణములుగాని నియమముల నతిక్రమింపకయే వర్తించు చుండునుగాని యనర్థకముగ లేవనవలయును. చూడుఁడు.

సదాగతి. వాయువు. ఎల్లప్పుడు గమనముగలది. ఇట్లు జడములగు నవియే కాదు. ఎల్లవస్తువులును వానివానినామము లాయాకార్యగుణములచేఁ గూడినవేగాని వేఱుకాదు. నాలుగుప్రక్కలగోడలుగల్గి ద్వారయుక్తమయినదే గృహము గడ్డి మొదలగువానిచేఁ గప్పఁబడి యావరణయుక్తమగునదియే గుడిసె లేక పాక యనంబడును. అత్యున్నతమయి పైపైయంతస్థులు గలదియే సౌధము. చంద్రమండలస్పర్శ గావించునదియా యనునట్లుగ నత్యున్నతమైన శిరోగృహమే చంద్రశాల. భూమ్యంతర్భాగముననుండి యించుకయైన సవ్వడి బయటికిఁ బ్రసరింపఁజేయక సకలరాజకార్యముల యోజనమునకు ననువగునదియే భూగృహము. రెండు అట్టలుగలిగి సూత్రములచే గ్రథితమయినదియే పుస్తకము. విద్యా బోధ కనువయి సక్రమముగ శాస్త్రములఛాత్రులచేఁ బఠింపఁజేయఁబడుచున్నప్రదేశమే పాఠశాల. మార్గస్థులగువారు బడలిక లడఁగఁ బానీయములకుఁ దగిన వసతిగలిగి యున్న పందిలియే చలిపందిరి. ఆహారనిద్రాభయాదులచేత నొకేవృత్తిగలిగియుండియు జ్ఞానహీనత్వ ముచే మనుజులకు లోఁబడి నాలుగుపాదములుగలిగి కార్యనిర్వాహణమును సంజ్ఞలచే నెఱ వేర్చుచుండునదియే పశువు. సమస్తజీవకోటికిని బ్రాణాధారకమై ఫలపాకాంతముగాఁ గనంబడునట్టివస్తువే యోషధి. పుష్పములు లేక యెల్లకాలమును ఛాయాదులచే లోకోప కారకమై సమస్తజీవకోటి కాధారభూతముగా నుండునదియే వనస్పతి. చేలయందు మృగా ద్యుపద్రవమును వారించుచు సదా ప్రకృతియందలి మాధుర్యమును గ్రోలుచు నానందిం చుచుఁ గాపరిగానుండునదియే శాలిపాలిక. ఎన్నిమృక్కడిమృగములున్నను లెక్కగొనక హస్తిమస్తమస్తిష్కమును నాస్వాదించుచు నానందించునదియే మృగేంద్రము. గురుజన శిక్షనుబొంది తత్కృపామృతముఁ గ్రోలుచు విద్య నభ్యసించువాఁడే శిష్యుఁడు. తనసాన్ని ధ్యమును జేరి తలిదండ్రులను నివాసమునువదలి పరస్థలావాసమునఁగల కష్టసుఖముల లెక్కింపక శుశ్రూషగావించుచుఁ దదేకనిష్ఠవిద్యల నభ్యసింప మత్సరగ్రస్తుఁడుగాక యంతే వాసి జనహితాభిలాషియై తత్పురోభివృద్ధిఁ బెంపఁగలవిద్యల నభ్యసించుట కుత్సాహముఁ గల్పించుచు బోధించువాఁడే గురుఁడు. స్వరయుక్తమై శిక్షాదినిబద్ధమై భగవదుచ్చరితమైన

వాఙ్మాలమే వేదము. వేదములందలి గూఢార్థముల వేర్వేఱుగ నుదాహృతియుతములుగ నెల్లరకు సుగమములుగ సర్గప్రతిసర్గవంశమన్వంతరవంశానుచరితాఖ్యపంచలక్షణములచే నొప్పుచు సమాజశిక్షకుఁ బాత్రములయినవే పురాణములు. వేదార్థోపబృంహితమై యనేక గాథాలంకృతమై పురావృత్తబోధకమయినదే యితిహాసము. ఛందోలంకారరీతి గుణాదుల నింపై శ్రవణమాత్రమున మనోహరమై భావోపేతమై నీతిశిక్షకమై కవికృతమై యొప్పునదియే కావ్యము. తన వాక్చాతుర్యమున నీతిశిక్షయం దద్వితీయమహిమకలిగి నందిని పందిగను, పందిని నందిగను శ్రోతలు పఠకులు మున్నగువారిభావమున నచ్చునట్లు వ్యాకరణాదినియమబద్ధముగఁ బ్రబంధములు వ్రాయువాఁడే కవి. పాదనియమముగల్గి భావోపేతమై యతిప్రాసలతోఁగూడి యలంకారసమలంకృతమయి చదువువారికి విందు చేయునదియే పద్యము. అక్షరగణనియమము లేక కర్తృకర్మక్రియాసమన్వితమై యర్థవంతమై యన్వయక్రమము గలిగినదియే వాక్యము; గద్యము. అర్థవంతము పదము. ఇట్లే యొక్కొక్కటియు నియమములతోఁ గూడుకొన్నవియేగాని నియమవిరహితమైన దేదియు లేదు. ఈ పద్ధతి నతిక్రమించి యొకానొకసాహసవంతుఁడు "రాముఁడు గోపాలుఁడు ఛత్రము భుజియింపంగ పెట్టె రాతిని భీముం।డవమతి పుస్తకమును కిటి।కీఁ,కోఁతిని పరుగులెత్తె బెకబెక వంకల్" అని పద్యముగాఁ జదివి యిదియును నాలుగుపాదములు గలది. దీనియందును బ్రతిపదమునకును భావముగలదు. పదములున్నవి. క్రియలుగలవు. అని వాదింపఁబూనినచో నామహామహునిఁ గాంచి యేమనవలయును. నమస్కారముగావించుటయే యుత్తములలక్షణము.

యోజింపఁగా నది పద్యమగునా? ఛందఃప్రముఖలక్షణములకుఁ జిక్కునదా? కాదు కాదు. స్వేచ్ఛాప్రవర్తితమగు నుద్ధతమగుపద్ధతియే యనవలయు. ఒకకోడినిదెచ్చి యిది కుందేలు అని గట్టిగాఁ బలుకుచువచ్చిన దానిఁద్రోసి రాజని తన్నామధేయమును నిర్ణయింపఁ బూనుకొని వాదించి వాదించి యుదాహరణముల వాక్రుచ్చి వాక్రుచ్చి, వాఁడొప్పుకొనక పోయినఁ దుదకు మూర్ఖుఁడని యొఱింగి నాయనా యిది కుందేలేయనవలసివచ్చుపగిది లోకమున నియమవిరుద్ధముగఁ బ్రవర్తించువారలకుఁ దగినసమాధానము లియ్యఁబూనుకొనుటయు నగునని తెలియవలయును.

స్వైరిణులవిధమున స్వాతంత్ర్యనిరతులు తమకుఁ బ్రపంచమునఁ బ్రతిష్ఠరావలయునని మంచివి చెడ్డవనియును, సన్మార్గము కుమార్గమనియు, దుర్మార్గ మున్నతపథమనియుఁ దమ లోపములఁ గప్పుటకై పాటుపడుట యలవాటు. తత్త్వముఁ దెలిసియు నియమసంయుతమయి పిపీలికాదిబ్రహ్మపర్యంతము వర్తించునట్టి యీప్రపంచమున సత్పద్ధతితో నెల్లవారల

## త్రిలిఙ్గరజతోత్సవము

శ్రుతిపథమునకు మననామధేయము రాఁజాలదుగదా! దుర్మార్గమునఁ ద్వరితముగ రావచ్చును గదా యని యసత్కార్యములను నియమాతిక్రమణముచేఁ గావించుచుండుట యెల్లరెఱింగినవిషయమే. రాజకీయవిషయములు, మతవిషయములు, సాంఘికవిషయములు, సారస్వతవిషయములు మున్నగుభాగముల స్వేచ్ఛాప్రవృత్తి నియమాతిక్రమణ మొనరించుచున్నారు. దానఁ బేరుగడించుచున్నారు.

"ఘటం భింద్యాత్పటం ఛింద్యాత్కుర్యాద్వా గార్దభస్వరం,
యేన కేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్."

అనురీతిగ మార్గమునఁ బోవువారిని బట్టుకొని గుడ్డలను జించువాఁడును నీళ్లకడవలను బగులఁగొట్టువాఁడును, అవ్యక్తముగఁ బిచ్చిపిచ్చియఱపుల నఱచువాఁడును ద్వరితముగ నాస్థలమున నెల్లవారలకును దెలియునట్లుగ ననాదిగఁ బెద్దలచే ననుష్ఠింపఁబడుచు నిర్బాధకముగఁ జిక్కనిప్రచారములోనుండు రాజకీయాదిసంస్థలకు వ్యవస్థకల్పించుటయే ముఖ్యోద్దేశముగ నియమములను నాశనముచేయఁబూనినఁ బేరు సంపాదింపవచ్చు నన్న యూహతోఁ గాలమును గడపువారిపుడు పెక్కు రగపడుచున్నవారు.

ఇట్లు ప్రత్యేకముగ నొక్కొక్కసంస్థనుగూర్చి నియమాతిక్రమణమును జెప్పఁబూనిన భారతముకంటె గొప్పగ్రంథమగును అయినను లోకవ్యవహారమున బాధకలిగింపని వాఙ్మయనియమముల నతిక్రమించుటనుగూర్చి యొకకొంచెము చదువరులకుఁ బరిచయము గలిగింపఁబూనుట యధికప్రసంగముగా భావింపక యోపికమెయిఁ బఠింపుఁడు.

వాఙ్మయము ప్రపంచమున కాయువుపట్టు. పెక్కుభాషలుగల మన యీదేశమునఁ దక్కినభాషలగతి యటుండఁ మనతెలుఁగుభాషగతి యెవ్విధమున నానాఁటఁ బరిణమించుచున్నదో యోజించుట లగ్గు. ఆంగ్లము సంస్కృతము మున్నగుభాషలు వ్యాకరణాదివిరుద్ధముగఁ బ్రయోగించిన నపశబ్దమగును. దాన నవివేకి యనునామకరణము ప్రయోక్తకుఁ గలుగుచున్నది. తద్భయముననే నియమము నతిక్రమింపక యెల్లరును భాషకు భంగము గావింపఁ దలపెట్టనేరక యున్నారు. దేశభాషలలో ముఖ్యముగ మనతెలుఁగుభాష కీనియమాతిక్రమణదోషము సంపూర్ణముగాఁ బట్టుపడినది. వేదప్రామాణ్యముల నెఱింగియుఁ బ్రాచీనసంప్రదాయముల గురుముఖమున నభ్యసించియు విద్వాంసులలో నగ్రగణ్యులని ప్రసిద్ధిపడసినవారును, అదేమి గ్రహచారమోకాని నియమాతిక్రమణ మొనర్చి వ్రాతలలోను, వాదములలోను వ్యతిరేకప్రచారము సాగించుచుండుట శోచనీయమగు విషయమనుట యొప్పుకొనక తప్పదు.

[illegible]

ముద్రణాలయములు లేనికాలమునఁ బెద్దలు తాళపత్రములలో వ్రాయసగాండ్రచే వ్రాయించుటలోఁ గొన్నియపశబ్దములు దొరలుట తటస్థించుచు రాఁగాఁ దుదలో వ్రాత తప్పుల బెద్దలు మన్నించి సుశబ్దముల గ్రహింతురుగాక యనువిన్నపము గావించియుండుట తత్తద్గ్రంథములలోఁ బ్రత్యక్షముగఁ బ్రాచీనపుస్తకభాండాగారములందుఁ గాంచుచునే యున్నారము. అట్టివానిని జూచియుఁ జూడనియట్లు నటించుచు విస్సన్న చెప్పినదే వేదమని కాఁబట్టినకుందేటికి మూఁడేకాళ్లనుచుఁ బట్టుపట్టి యావ్రాఁతలే నిక్కమగు వ్రాఁతలనియు, వ్యాకరణములు బంధకములనియు, యతిప్రాసలు భావగజంబుల కంకుశప్రాయంబులనియు నిరసించుచు, సమాసములు దోసములచే నిండినవనియు గీర్వాణపదములమధ్యమునఁ దెనుఁగుపదములను దెనుఁగుపదములమధ్యమున సంస్కృతపదములను బిగించి (సర్వతేలువిష నివారిణి, పిచ్చికుక్కక్షతనొప్పివినాశని) కడుంగడు నీచస్థితికి దీసికొనివచ్చుచు, భాషలను బోషించుచున్నా మనుప్రతిష్ఠల గడించుచున్నారు. ఒక్కొక్కసమయమున సభావేదికలపై కెక్కి పూర్వముకంటెఁ దెలుఁగుభాష ప్రవృద్ధినొందినదని యనేకసహస్రగ్రంథనామములను గవులను, బోషకులను జేర్కొనుచున్నారు. యోజింపఁగా నిది వాపువంటిదే యగును గాని బలుపువంటిదిగాదు. కుక్కగొడుగు (పుట్టకొక్కు) లెన్ని పుట్టుటలేదు? మొదట జూచుటకు రమణీయములుగ నుండుటలేదా? ఎంతకాల మవి నిలువఁగలిగినవి? ఆనందమును గూర్పఁగల్గినవి? తర్వాత దృష్టి కవి యెట్టవిగాఁ బరిగణింపఁబడఁగల్గినవి? ఇదియే యిప్పుడును మఘలోఁబుట్టి పుబ్బలో గిట్టుచుండు గ్రంథబాహుళ్యము భాషాభివృద్ధియనుట సమంజసము.

"నిక్కమైన యొక్కనీల మొక్కటిచాలు, తళుకుబెళుకురాలు తట్టెడేల" యను వేమనసూక్తిరీతి నీగ్రంథములు మాసపత్రికలు మున్నగునవి యున్ననేమి నశించిననేమి? యంగళ్లలోఁ బొట్లముల కుపయోగించుటకే యగుచున్నవిగాని భాషాసేవ లోకసంసేవ విజ్ఞానసాధకత వీనియందులేదని నిరాఘాటముగఁ జెప్పవచ్చును. కులమున మర్యాద నతిక్రమించినవానిని గులభ్రష్టుఁడన్నట్లు నియమభ్రష్టత యిట్టిగ్రంథజాలమునకును బట్టుచున్నది. యతులు-సన్న్యాసులే, ప్రాసములు-ఆయుధవిశేషములే-యనునర్థము చెప్పువారికి నమస్కారముగావించుటయే లగ్గు. అట్టివారు తారువ్రాయువానిని నియమానుసారముగ రచింపఁబడిన పద్యములనామము లుంచుటకంటెఁ గ్రొంగ్రొత్తనామము లుంచి యేదో యొక్కఫక్కి యని చెప్పుట బాగు. ఉపన్యాసములలోను దమయాచారవ్యవహారములలోను దమకు సరియగువాని కుదాహరణములుగ ధర్మశాస్త్రవచనములను జూపి యాధర్మశాస్త్రములో నుండు తక్కినభాగములవచనములకు విరుద్ధముగ నడచుకొనుచు నాక్షేపించినచో శక్తి

కొలఁది యని ప్రతివచనములను బలుకుచు సమర్థించుధీరులంబోలి నియమాతిక్రమణముఁ గావించి స్వేచ్ఛాచారులగు నూత్నసంస్కర్తలును దగియున్నారనుటయే సమాధానమునకు మార్గము.

భావకవిత్వము, నవ్యసాహిత్యము మున్నగు నూత్ననామములచేఁ గొన్నిసంస్థల నెలకొల్పి యందుఁ బ్రాచీనసంప్రదాయములను వలసినవానిఁ ద్రోసిపుచ్చి క్రొత్తపద్ధతి నడిపించుచు వారియాదృతిఁబడయు నాశ్రితులను, దదాశ్రితులను బెడమార్గములకుఁ ద్రిప్పి పేరెన్నికగన్న మన త్రిలిఙ్గభాషకు ముప్పుదెచ్చి నిర్మూలముఁ గావించువారలు రాజరాజేంద్రనృపతి మున్నగువారి పోషణమున నిర్బాధకముగఁ బొగడ్తగనినవిధము నొక్కపర్యాయము హృదయమున సంస్మరించి నిబంధనలను బాటించుచుఁ జక్కనిమార్గమున భాషామతల్లిని నడిపించి తక్కుంగల దేశభాషాజనయిత్రులతోఁబాటు మెలంగఁ జేయుదురుగాక!

నాకేం, వస్తోంది, చూచాం, విశ్వం, వచ్చావ్, మాకి, కావాలి మున్నగునపశబ్దములను వాడినమాత్రాన భాషాసంస్కర్తలు కాఁజాలరు. నాకేమి, వచ్చుచున్నది, చూచినాము, విశ్వము, వచ్చినావు, మాకు, కావలెను, మున్నగుపదములు వాడినమాత్రమున లోటు రాఁబోదు. భాషాద్రోహకులు కాఁజాలరు. భావసౌష్ఠవము చెడఁగొట్టలేరు. అర్థముల వివరించిచెప్పఁదగినట్టి కఠినపదములు పామరులకు గ్రాహ్యము కానిపదములు వాడిన పాపమునఁబోదు. నిర్దుష్టములగుపదములను వాక్యములను వ్రాసినంతనే గొప్పతనమునకు లోటు సంపాదింపరు.

ఎన్నివిధముల నాలోచన మొనర్చినను, బూర్వులు మనకంటెఁ దెలివిగలవారగుదురు. కాని మనకాలమున నట్టివారు లేరనియే యేవిషయముననైనను నంగీకరింపవలయు. ఏశాస్త్రముననైనను వారుపెట్టినదే మనకు భిక్ష. ఎన్నివ్యాకరణములు, ఎన్నిఛందశ్శాస్త్రములు, ఎంతటిచర్చలు చేసిచేసి నిగ్గుదేల్చి మనకుఁ బక్వముగావించి చక్కఁగాఁ గాపాడుకొనుచు రసాస్వాదనము చేయుఁడనఁగా మనము తత్కృషియంతయును బిచ్చిక్రిందఁదేల్చి యనుభవమునకుఁ దీసికొనలేక పైపెచ్చు వారిని జెడఁదిట్టుటకుఁ బూనుకొనుట ద్రోహమేకాని మతేమయిననున్నదా?

మాకు స్వాతంత్ర్యముకావలయునని నడుములుగట్టుటేకాని మనకుఁగల సర్వనియమములు మంటఁగలిపిన నెక్కడనుండి రాఁగలదు? యోచింపుఁడు. ఎవ్విధయయిన సాంకర్య

ములుకల్గిన వానిని జక్కఁదిద్దుట యటుంచి మఱింతపాడుచేయఁబూనిన మూలచ్ఛేదమేగాని మఱేమిలాభము కల్గును? సుఖము నాశించి సగమాయె నన్నట్టు లీనియమాదుల ననుసరించుట కష్టము, సులభముగ నిష్టార్థసిద్ధిఁబడయుట మంచిదని 'యెవరికివారే యమునాతీరే' యనినచో నాత్మద్రోహమునకుఁ బూనుటయే యగుఁగాని వేఱుకాఁజాలదు. 'కష్టీ ఫలీ' యన్నట్టులు న్యాయార్జితమగునది సుఖమిచ్చునుగాని, మోసగించితెచ్చిన దెన్నండును సుఖము నొసఁగఁగలదా? శాస్త్రోక్తముగ నాచరించినకార్యములే సత్ఫలదంబులగుంగాని శాస్త్రవిరుద్ధముగ నాచరించినపను లసత్ఫలము లిచ్చునని వేఱుగ నెఱింగింపవలయునా? దొంగకు శిక్షయబ్బునా? పరోపకారనిరతునకు శిక్షవిధింపఁబడునా? యోచింపుఁడు.

'శాస్త్ర మపౌరుషమాద్యం ప్రాయికనిత్యప్రయోగలక్ష్మైతత్, దృశ్యమతిస్థవిరం యద్జ్ఞాత్వా శబ్దః ప్రయుక్త ఆర్షసమః' అను నన్నయసూక్తిని మఱవకుఁడు.

"సంస్కారార్థో నియమః" ఏకశ్శబ్దస్సమ్యగ్జ్ఞాతశ్చేత్స్వర్గే లోకే కామధుగ్భతి—అపశబ్దాన్ ప్రయుంజానో రౌరవం నరకం వ్రజేత్—అనునవి మంత్రములుగా భావింపుఁడు—జపింపుఁడు—ఫలమునందుఁడు.

నియమములకు లోఁబడి యోగులు ఫలమునందుచున్నారు. రాజులు రాజ్యములను సుఖముగాఁ బాలించుచున్నారు. కాలచక్రము సక్రమముగ నియమానుసారముగఁ దిరుగుచున్నది. ఋతువులు తమఫలము నొసఁగుచున్నవి. వృక్షము లదనుదప్పక ఫలించుచున్నవి. సముద్రము వేలాతిక్రమణము గావింపదు. పశువులు నియమబద్ధములై యొకచోఁ గూడుచున్నవి. సూర్యచంద్రులు నియమముఁదప్పక కాలముఁ దెలుపుచున్నవారు నక్షత్రములు గ్రహములు తమవృత్తముల సంచరించుచున్నవి తుదకుఁ గుక్కుటములు బీదలకు గడియారములై కాలమును నియమయుతముగఁ జాటుచున్నవి. నియమప్రకారము మనము చేరకపోయినచో ధూమశకటముకూడఁ బర్వెత్తుచున్నది, ఆగుటలేదు. గాలిపడగయు సూత్రబద్ధమై చక్కఁగ నాకాశమున నెగురుచున్నది ఆసూత్రమే తెగిన విచ్చలవిడిపోయి రూపుచెడి నాశనమగుచు నందుబాటు తప్పుట యనుభవవిరుద్ధమా? మనయింట మిగుల వాత్సల్యమునఁ బెంపఁబడుచుండుబిడ్డఁడును, మననియమముల నతిక్రమించినఁ గోపించి దండింతుమే. మనమేల పెద్దలుచూపిన సత్పథము నతిక్రమింపవలయునో. వారియాత్మ లెంతటిపరితాపమును బొందునో యోచింపుఁడు. గ్రంథము పెరిగినది.

మహాశయులారా! చక్కనివిజ్ఞానమున నార్షసంప్రదాయముల యోజించి యొక్క భాషావిషయముననేగాక యన్నివిషయములయందును మనము నియమానుసారముగ నడువ దీక్షఁబూని మనకంటె బిన్నలను నడిపింపఁబూనుచు, సుస్మార్గగాములను బోధించి మనకీర్తిని దిక్కుల వెలయింపఁబూనుకొనుఁడు. తండ్రి బావిని త్రవ్వింపఁగాఁ గుమారుఁడు పూడ్చివేసి పుణ్యమునుగట్టుకొనె నన్నట్లు చేయకుఁడు. తోడిభాషాసోదరీమణులతోఁబాటు మనత్రిలిఙ్గభాషాసతీమణినిగూడ లోటుపాటులులేనిమార్గమున నియమయుక్తముగ నడిపించి యానందము నాపాదింపుఁడని మరలఁ బ్రార్థించువాఁడ.

నిజమును లిఖించిన నాకలమును క్షమింపుడు.

---

**శ్రీ. పి. చెంచయ్యగారు, ఎమ్. ఎల్., పుదుకోట చీఫ్ జడ్జి, ఎగ్మూరు, మదరాసు:—**

వావిళ్లసంస్థ కొంచెమించుమించుగ ముప్పాతికశతాబ్దముగ ఆంధ్రవిద్యార్థులకును పండితులకును చాలపరిచితమైనపేరు జాతీయాత్మనూతనప్రకాశమును పొందుటకుముందు ప్రాచీనవాఙ్మయామృతమును జుర్రవలసియుండును. అట్టిస్థితిలో పండితులకంటె నెక్కువగా ప్రచురణసంస్థలమీదనే తెనుగువారి నూతనచైతన్యమాధారపడియుండినది. నాటిదినము సరియైనశుభముహూర్తమున ఆవశ్యకమునుతీర్ప శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు రంగముపై గన్పించిరి. తెనుగువాఙ్మయము యొక్కవిచిత్రప్రతిభను ప్రతిఆంధ్రుని హస్తగతముచేయుటకు శ్రీ వావిళ్లవారు చేసినసేవనుగురించి నేటితరము తెనుగువారందరును కృతజ్ఞులుగానుండుట న్యాయమే. వావిళ్లప్రచురణకర్తలు సాహసోద్రిక్తులు, మార్గదర్శకులు, తెనుగుసారస్వతములోని ప్రౌఢరచనలను ప్రచురించుటయేగాక వారు సంస్కృతములోని ఉత్తమకృతులను భాషాంతరీకరించిరి. ఆంధ్రులలోని నూతనసారస్వతవికాసము వీరు సాగించివచ్చినసేవకు అనల్పముగా ఋణపడినది. తాము పండితులగుటేకాక పండితమండలినిచేర్చుకొని వారిపాండిత్యమును ప్రతిభను సారస్వతప్రయోజనమునకు వినియోగించుటయందు వీరు ప్రత్యేకకృషిచేసిరి. క్రొత్తగావర్పడినపరిస్థితులు ప్రాతపండితునికి ఉరిత్రాళ్లవంటివి. శ్రీ వావిళ్లవారిసంస్థ వారికిఊపిరిపోయకున్న ఆజాతి ఎప్పుడోనశించియుండును. ప్రాతఫక్కిపండితులను విశ్వవిద్యాలయములు భరించుకొనలేవుకాబట్టి వావిళ్లబోటిసంస్థలువారికిజీవగఱ్ఱలు. రానుండు నవీనాంధ్రస్వరూపనిర్మాణమున నీ త్రిలిఙ్గకృషియు భాగస్వామి. వావిళ్లవంశమువారు చిరస్థాయిగచేసినసేవనుగ్గడించి ఈతరుణమునవారినభినందింపగలుగుట సంతోషప్రదము.

# గు ణ వి శే ష ము.

విద్వాన్: శ్రీ త్యాడీ వేంకటశాస్త్రిగారు, శ్రీసారస్వతపరిషత్తు, మాడుగుల.

శ్రౌతస్మార్తాద్యత్యుత్తమవిధివిధాన ప్రధానప్రవర్తిత సర్వసద్గుణాకరనరమాత్రుం డును స్వవశీకృతదైవమహిమాన్వితుం డగునేడఁ గేవల దేవాంశజుఁడు సుగుణనికరపరి పూర్ణుండు స్వప్రవర్తనపవిత్రీభూతమిత్రప్రముఖసముదయుండు నత్యాసన్నదయామయజగ న్నిఖిలాధినాథుండు నాశాదశాంతరావకాశపరిపూరితసద్యశోవిశాలుండు స్వకీయకువలయ ప్రియాన్వయమణిప్రదీపుఁడు దేవఋష్యాదిసర్వాదరణీయావతారపూరుషోపమాన మహి మాసమన్వితుండు నైజపదప్రకాశితక్షితిపత్యనేకమకుట ఘుటితనవరవనివహుండు నెంతటి మహిమాసమోపేతుండగునో వ్రాయ నలవియా?

అట్టి యుధిష్ఠిరుండు జగదేకప్రసిద్ధప్రభూతబలవిశేషము స్వకీయానూనావక్ర విక్రమప్రవంచితదిగంతరశాత్రవగోత్రము సద్గుణస్తోమమండనాఖండమండితము భీమార్జున నకులసహదేవానుకూలైకమత్యప్రసిద్ధానుజచతుష్కమ్ముం గల్గియు విశేషించి మనోహరా కారవర్ణప్రశస్తలతాంతము సౌరభప్రవర్ధితసుషమాభిభూషితం బగుభాతి సహోదరా వృతాత్మోపమానార్హమహిమ యత్యంతామలత్రయీభూతహుతాశనసముద్భవజ్వాలావళీ ప్రజ్వలిత వైశ్వానరసంజాత సౌందర్యసౌకుమార్యాద్యశ్లాఖలసులక్షణలక్షితతన్వీవతంస వినయవివేకాదిప్రధానసుశీలపరిశుద్ధ స్వాధీనస్వాంతదైవ సన్నిభస్థిరీభూతప్రాణేశ్వరసర్వ శుశ్రూషాపరాయణయు నగు ద్రుపదభూధవాత్మజాత నిరంతరోచితప్రవర్తనాభివర్ధితజీవి తేశ్వరతుల్యానురాగాద్యుపేతసత్కళత్రమ్ముం గలుగ ననంత సంతోషమహద్రాజ్యాద్యనుప మాన సుఖోపాధ్యార్జితవైహాయసానంతాంతరాళసమాక్రాంత శాశ్వతసద్యశోవిరాజమా నుండైన యామహాత్ముని

"ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీన్దోః కిరణేష్వివాఙ్కః"

అను ధర్మానుసారము తాదృశామేయసుగుణగణంబున లోపింపంజాలని యొక్క ద్యూతక్రీడాపరాయణత్వదుర్వ్యసనవిశేషం బాత్మీయమహిమావశంబున సుస్థిరామోఘ రాజ్యభాగము నఖండాఖండలసాదృశ్యసమస్తభోగ్యభాగ్యవైభవము నైన సర్వస్వమును బ్రాణమానాధికార్థాంగిభ్రాతృసమన్వితముగఁ బరాజితు నొనర్పఁ దద్యాఖిత్రసింహాపంచక

సన్నిధానంబున నామహనీయాక్షీణలోచనవీక్షణావళి కృపణధనసామ్యంబు నొందుచుండ మహాత్సభాంతరవైరిదుర్యోధనదుశ్శాసనప్రబోధిత ప్రవర్ధితదోషదూషిత దుశ్శాసనాధమకరాకర్షితరాజసూయాధ్వరావభృథస్నానపావనప్రవర్ధమానశిరోజ రజస్వలానియమవిగతకంచుకైకవస్త్రసత్పరిషదాగమనానర్హ మహన్నిర్నిరోధదుష్కాగ్రాక్రమితసర్వస్వాతంత్ర్యయు నైన యామహాసతీలలామవస్త్రవిచ్ఛేదనరూపకదుర్భరావమానితయయ్యు మహాసాధ్వీవతంసాతిమాత్రవిశేషవశీభూతపరమేశ్వరకృపాపరిరక్షితాత్మీయ సమ్మానయై తాదృశస్వీయమహిమాప్రకాశిత సంతోషితభర్తృపంచకోత్తమయు నత్యంతప్రశంసాప్రశస్తచేతఃపయోజయు నయ్యెను.

సర్వోత్తమగుణమణిమీనాకరుండయ్యుఁ దాదృశానూనావమానమహార్ణవోత్తుంగాభంగరంగత్తరంగసముదయమగ్నోత్తమాంగసమాక్రమణకార్యోచిత ధర్మబలపరిహీనుండై విధివశంబున సంప్రాప్తవిశ్వంభరారాజ్యాది సర్వస్వుండగు నాధర్మరాజాగ్రణి సహజవిజ్ఞానధనధురంధరత్వప్రభాపటలచటులతాన్యదుర్నిరీక్ష్యుండై యంతలో నపరిమితాజ్ఞాననిబిడతమోధూసరితాంతశ్చక్షురీక్షితవ్యాప్తిభావుండై పునర్దురోదరఖేలాకాంక్షితుండై కళత్రానుజాన్వితముగఁ ద్రయోదశసమావధ్యుపభోగ్యార్హమహద్గహనాజ్ఞాతవాసక్లేశదశావంచితుండు గావలసివచ్చెను.

అంతటి దేవాంశజత్వాద్యాత్మీయమహిమాన్వితుండయ్యు నాధర్మజుం డొండు సామాన్యద్యూతవ్యసనదోషదూషితుం డగురీతి ననంతాధమగుణగణాకీర్ణుండయ్యు నెవ్వండే నొండు సద్గుణమణిప్రభాప్రకాశితుండు నగుననుట యుచితేతరము గానేరదు.

మఱియు నిట్టి దుర్ణయద్యూతవ్యసనాపజితుండగు నైషధునివంటి చక్రవర్తియు నిజనివాసము నెడఁబాసి వనగతుండగు ప్రారంభదినములలో దుర్భరక్షుత్పిపాసోపహతచేతస్కుండై యట్టి విపద్దశయందును బ్రజానిరాదరణమునకే యర్హుండైనటు లుద్గ్రంథము లుద్ఘోషింప నిఁక సామాన్యు లట్టిదుర్దశాపీడితులగునెడల నావ్యక్తిగతదుస్సహదుర్దశానిర్ణయ మొనర్ప నెంతటివానికైన ననువగునా?



# ఆర్య విజ్ఞానము

ఉపన్యాసకేసరి శ్రీపుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు,
ముంగండ అగ్రహారము, అంబాజీపేటపోస్టు, తూర్పుగోదావరిజిల్లా.

శ్లో. వావిళ్ల వంశ వారిధివిధు రామస్వామిశాస్త్రి బుధతిలకః,
ఆదిసరస్వత్యధిపస్సారస్వతరత్నకోశదోవ్యలసత్. ౧
సూనుస్తత్సుకృతావలీపరిణతిశ్శ్రీ వేంకటేశాభిధో
భాషోద్ధారకభూతిభాగతిమతిర్ధర్త్రైకసేవారతః,
శ్రీవాణీధరణీపతిస్సుగుణభూర్మాన్యాత్మవృత్తావళి,
స్త్రైలింగాభరణం ద్విపత్రనయకార్యార్థేషు రారాజతే. ౨

శ్రీమదాంధ్రవిజ్ఞ మహోదయులారా!

ఈదృశ్యప్రపంచమునందలి ప్రాణికోటి యభీష్టార్థములనొందుటకు ననిష్టముల నివారింపజేసికొనుటకును జ్ఞానమే సాధనమనుట నిర్వివాదము. ప్రారబ్ధకర్మఫలానుభూతిమాత్రపర్యాప్తజన్ములగు పశుపక్ష్యాదులకుగూడ శ్రీభగవదనుగృహీతసరణుల నాహారనిద్రానిధువనాదిసుఖముల నార్జించుటకును శక్యమైనంతవర కాగామివర్తమానదుఃఖముల నివర్తింపజేసికొనుటకు నొకవిధమగుజ్ఞానమే సాధనమగుచున్నది. యత్నస్వాతంత్ర్యములేని తరుగుల్మలతాదిస్థావరజీవులలోగూడ నిష్టానిష్టజ్ఞానమును దానివలని సుఖదుఃఖానుభవమునుగలదని మన్వాదు లుద్ఘోషించుచున్నారు. ఇట్టితరి నిఖిలవ్యాపారనిర్వహణస్వతంత్రులగుమానవులకు నైహికాముష్మికనిఖిలసుఖార్జనమునను నిఖిలదుఃఖనివర్తనమునను వానికన్న విశిష్టజ్ఞానమగువిజ్ఞానమే శరణ్యము విజ్ఞానవిహీనుడగుమానవుడు భగవద్దత్తవిఘాతుకుడగుటచే పశుపక్ష్యాదులకన్న నధమాధముడుగా గణ్యుడగుచున్నాడు. వానికి విజ్ఞానాధికారము నొసంగక ప్రారబ్ధకర్మఫలమాత్రానుభావకశరీరాదులనే భగవంతు డొసంగినందున నవియట దోషులుకావు. కనుకనే వాని కాయాశరీరములు పతితములగుటతోడనే పైతరగతులశరీరములనే యిచ్చుచున్నాడు కాని క్రిందితరగతులశరీరముల నీశ్వరు డొసంగుట లేదు. మానవులకు విజ్ఞానాధికారమునుగూడ నొసంగుటచే దాని నార్జించక స్వాధికారమును దుర్వినియోగ మొనర్చుటచే క్రిందితరగతులశరీరముల నొసంగుచు వీరి నీశ్వరుడు శిక్షించుచున్నాడు. "విజ్ఞానం శిల్పశాస్త్రయోః" అనునమరుని నిర్వచనమునుబట్టి శాస్త్ర

జ్ఞానమును శిల్పజ్ఞాన మనగా కార్యకరణనైపుణ్యజ్ఞానమును విజ్ఞానపదవాచ్యములుగా దేలుచున్నది. ఇందు మొదటిది సద్గురుసన్నిధిని సంప్రదాయపూర్వకాధ్యయనమువలనను, రెండవది యట్టివ్యాపారాభ్యాసమువలనను ఘటించును. ఇట రెండవది గురువంశపరంపరలోనే యొకవ్యక్తికైనను శాస్త్రజ్ఞానమువలననే జనించవలసినదగుట బూర్వాపేక్షకలదిగ్నై యుండును. కనుక నిది పరతంత్రమును శాస్త్రజ్ఞానము స్వతంత్రమునై యున్నవి. పరతంత్ర విజ్ఞానార్జనముకన్న స్వతంత్రవిజ్ఞానార్జనము శ్రేయస్కరమని వేరుగ జెప్పనక్కరలేదు. శాస్త్రమనగా శిక్షించువాక్యసముదాయముకలగ్రంథము-దానిచే శిక్షించబడువారు మానవులు శిక్షించువారలాయాగ్రంథకర్తలనుట స్థూలోక్తి—శిక్షణాధికారము వారికే యేల మాకేల గాదనువారి కీశ్వరుడే శిక్షకుడనుట సూక్ష్మోక్తి—పరమాత్మయే యనుట యతి సూక్ష్మోక్తి యగును. ఆర్యమతమున దిర్యగ్జంతువులను స్థావరములను విడిచి తదితరచేతనరాశినంతను శిక్షించుశాస్త్రములు తొలివి వేదములు. ఇయ్యవి ప్రపంచసృష్టితోబాటు సృష్ట్యాదిని బరమాత్మనుండి బయల్వెడలి సృష్టికర్తయగు జతుర్ముఖబ్రహ్మముఖములనుండి వేదము లావిర్భవించినవియనియు వీనిని రచించినవా రెవరును లేరనియు రాద్ధాంతము. అయ్యవి యనంతములై చర్మచక్షుష్కులకు దురవగాహములుగా నుండుటంబట్టి యర్వాచీనులకు సుఖబోధార్థమై మునులు తపోబలంబున నావేదముల దివ్యజ్ఞానమున దర్శించి వానిలోని వివిధాంశములను వివిధశాస్త్రగ్రంథరూపమున వెల్లడించిరనియు నందుచే వానికి స్మృతులని పేరువచ్చినదనియు నియ్యవి వేదమూలకములగుటచే శాస్త్రములుగా వానియాధారముంబట్టి పేర్కొనబడుచున్నవి. వీనిమూలమున శిక్షించువా రీమునులైరి— అట్టి శిక్షకములగువేదముల నీశ్వరుడే రచియించెనని కొందరిమతము. వేదములనుగూడ మునులే రచియించిరని యాధునికులవిపరీతవాదము. శబ్దబ్రహ్మాత్మకమగు వేదరాశి యంతయును మహాప్రళయమున జీవులతోబాటు పరమాత్మయందే లీనమగుచు బునస్సృష్ట్యారంభమున సృష్టికర్తయగు బ్రహ్మయొక్క చతుర్ముఖములనుండియు నిశ్వాసద్వారమున జతూరూపమున బయల్వెడలి వినబడునదగుటచే శ్రుతియనునామముం బడసి విఖ్యాతమై విశ్వవిజ్ఞాననిలయమై తనరారుచున్నదియని సనాతనార్యసిద్ధాంతము. సృజ్యమానజగత్తునకు వలయు నిఖలవస్తుసామగ్రిని భిన్నభిన్నముగ దత్తదనుకూలముగ నెట్లు కల్పించి యొసంగెనో ప్రాపంచికవ్యవహారసిద్ధికిని స్వస్వాభిప్రాయముల నితరుల కెరుకబరచుటకు నాయాజాతులవారి కనుకూలములగు వివిధభాషల నొసంగెనో యట్టులే యభీష్టార్జనానిష్టనివర్తనముల కుపయోగించు వివిధవిజ్ఞానములను వేదరాశిరూపమున సర్వ

శక్తిసమధిష్ఠానమగు నాపరమాత్మ యనుగ్రహించెననుట విపరీతవాసనలులేనివారికి సరిపోవును. ఇట్టి వేదరాశినుండియే వివిధశాస్త్రములును రచియించబడినవి. ఈవిజ్ఞాననిధులగు వేదశాస్త్రములలో దెలియజేయబడనియంశ మొక్కటియు గానరాదు. ధర్మార్థకామమోక్షరూపచతుర్విధపురుషార్థములలో నొక్కొక్కదానింగూర్చి యిష్టానిష్టముల యనంతభేదముల ననుసరించి యైహికాముష్మికఫలోపార్జనోపాయముల ననంతములుగ జీవరాశికంతకును సమగ్రముగ నీవేదరత్నరాశిలో విజ్ఞానరత్నముల ననంతములుగ నున్నయవి. ఏయొకవ్యక్తియు నీరత్నముల నన్నిటిని బుద్ధిజాలమునబట్టి సేకరించ శక్యముకానందున నాయపారవేదరత్నాకరముయొక్క పారము నెంతటితపస్వినైన గనుంగొనుట శక్యముకానందునను బహుళమహర్షులు యత్నించి తపోబలంబున గనుంగొనినవానిని తమతమగ్రంథపేటికయందు బొందుపరచిరి. వారిలో నెవరి కేరత్నములయం దపేక్షయుదయించినదో వారా పేటికలలోని రత్నములను సేకరించి యుపయోగించికొనుచు లోకోపకారమునకై యార్షభాషలోనున్న యారత్నపేటికలను విడదీయుటలోను ఆయారత్నముల నుపయోగించుటలోను బడినశ్రమ నెరింగి యర్వాచీను లట్టిశ్రమకు సహించలేరనుదృష్టితో వానికి వ్యాఖ్యలను వ్రాసియు సులభగీర్వాణభాషలో వేరుగ్రంథములను రచించియు వానిని లోకమునకు విద్వాన్మాన్యమహోదయులు వెదజల్లిరి. ఇందునను మనయార్యులు ధర్మమోక్షప్రధానులగుటవలన గాబోలును ధర్మమోక్షమార్గములను నిరూపించునట్టియు వానికత్యంతోపకారకములైనట్టియు శాస్త్రములలోనే యతివిస్తృతగ్రంథములను రచియించియిట వెదజల్లిరి. వైదేశికు లీదేశమున కేతెంచినదిమొదలు వారి కీధర్మమోక్షములతో నెక్కువసంబంధము లేనికతమున నర్థకామసాధకశాస్త్రముల నిటనుండి ధనబలమునను బిమ్మట ప్రభుత్వబలమునను వేరుమార్గములను సంగ్రహించి తీసికొనివెడలిరి. అందువలన యంత్రశాస్త్రరసాయనశాస్త్రాథర్వణాయుర్వేదాది వివిధశాస్త్రములలోనున్న మంచి గ్రంథముల నన్నిటిని సేకరించి సంస్కృతభాష నభ్యసించి విస్తారధనవ్యయముతోను మేధావ్యయముతోను పట్టుదలతోను వాని నుపయోగమునకు దీసికొనిరాగలిగిరి. మనవారు క్రముగా దేశీయప్రభుత్వములు గతించి వైదేశికప్రభుత్వము లేర్పడుటతో నర్థశాస్త్రాదుల వంకజూడక గొంతకాలమువరకు ధర్మమోక్షశాస్త్రములలోనే కృషిచేయుచు నిపుడు కలిప్రభుత్వ మైదువేలతో నేర్పడుటవలన సంస్కృతభాషనే మృతభాషనుగా మృతబుద్ధులై నిరసించ మొదలిడిరి. వైదేశికులు క్రమక్రమముగా దమచే సంగ్రహించబడిన గ్రంథరత్నములను సానబట్టి వానిప్రభలచే వివిధయంత్రాదులను నిర్మించికొని లోకోత్తరార్థకామ

ముల నార్జించుచున్నారు. వారు వీనిని స్వభాషలలోనికి బరివర్తించికొని యతిరహస్య గ్రంథములనుగాక దక్కంగలవానిని ముద్రించి వెల్లడించినారు. మనవారు వానింజూచియు వారియంత్రనిర్మాణాదికములం జూచియు నిపుడు నివ్వెరబడుచున్నారు. పైగా మనమహర్షులను మనవిద్యలను బ్రువ్వదిట్టుచున్నారు. కాని కౌటిల్యార్థశాస్త్రము వెలువడుటతోడనే విషవాయునిర్మాణాదిక మందులోనేకలదని కొంత యావిసురు తగ్గినటులనే యీమధ్య నాంధ్రపత్రికలో వెల్లడించబడిన విమాననిర్మాణాద్యంశములను నిరూపించు కాశ్యపశిల్పాది గ్రంథములు బయల్వెడలిన వసునంశముం దిలకించి యిపుడు తిట్టుటమానిరనికొందుము. ఐననేమి. పరభాషావిద్యలవలన బ్రాచీనమహారాజు లొసంగిన మడిమాన్యములు మటుమాయములై పొట్టకూటికిగా నెన్ని చెట్టకార్యముల నాచరించుచున్నను బెట్టువోవుటయే ఫలమై బిట్టుమొగములతో బొట్టలనింపలేక నాకసమువంక జూచుచు బ్రతుకుదెరవుగానక నల్లాడుచున్నను వేశ్యాలంపటవిటపురుషునిమాడ్కి దేహగేహములు భ్రష్టములైన నామహామోహమహోన్మాదమున దాని యింటిముంగిట నల్లాడుచు నిహాముత్రసుఖదూరుడై చరమదశనొందునపుడు మాత్రము స్వకృతకర్మస్మరణమున నార్యబీజవాసనావిశేషముతో స్వీయులయెడ నెంత జింతించినను బ్రయోజనములేక తుదకు స్వకర్మసూత్రానుసారము పరలోకప్రయాణముంజేయునో యట్టులే మనవా రిప్పటికైన జరమదశకు రానున్న స్వవిద్యలయెడల వివేకదివ్యౌషధమును సేవించి యామహామోహోన్మాదమునుండి విముక్తులై దృష్టినిడి ధర్మార్థకామమోక్షచతుష్టయసాధకశాస్త్రముల నభ్యసించి సకలసుఖముల నార్జించి యాత్మతేజస్సుతో నఖిలదేశాదర్శభూతస్వవిజ్ఞానరత్నప్రభలను వెదజల్లునట్టు లాయంతర్యామియగునీశ్వరుడు ప్రసాదించుగాతయనిమాత్రము కోరుచుంటిమి. కాని వైదేశికులార్జించిన విజ్ఞానములన్నియు నార్యవిజ్ఞానరత్నాకరమునుండియే సంగ్రహించబడినవని మాత్రము ముమ్మాటికి వక్కాణించగలము. ఇందులకుగా నామధ్య నాంధ్రవారపత్రికలోని జర్మనీ అమెరికా యింగ్లండు ఫ్రాన్సు మున్నగుదేశములలోనున్న ముద్రితాముద్రిత సంస్కృతగ్రంథముల లక్షలకొలది లెక్కలను గమనించినచో వారి కీసంస్కృతగ్రంథములన్నియు నెట్లు లభించినవో వారి కెంత వీనియం దాదరము కలదో వానింబట్టికాక వారు మనమునులవలె దపోబలంబున నీశ్వరానుగ్రహముచే నాయావిజ్ఞానరత్నకోశముల నార్జించి వైజ్ఞానికౌన్నత్యమును సాధించిరని రుజువుచేయుట కాధారము లేమైన కలవా యని విచారించిన జాలును.

ఎందరు దొరలు మనదేశమునకువచ్చి కాశ్యాదిస్థవిద్వాంసులవద్ద గీర్వాణభాష నభ్యసించి వెడలిరో యిప్పటికి నభ్యసించుచున్నారో తుద కిపుడు మారణాదియంత్రనిర్మాణమున బ్రసిద్ధిగన్న జర్మనీవారు మహావిద్యానిధియగు మన శ్రీదండిభట్ట విశ్వనాథశాస్త్రులువారి నే యుపాయముననో తమదేశమునకుదీసికొనిపోయి వారివలన నార్యవిజ్ఞానగ్రంథములబఠించి యుండిరనునంశము నెరుంగని ఆంధ్రులు లేరు కదా! తుదకు మన ధర్మమోక్షప్రతిపాదకాతిప్రాచీనార్షగ్రంథములు మనకు గావలసినచో జర్మనీని యెన్ని లభించునో వివేచించిన జాలును. అట్టులే నితరదేశములలోను గలవు కదా! కాని, విదేశములకేగి వారివద్ద నీవిజ్ఞానరత్నములను సేకరింప బ్రయత్నించుట మాత్రము విఫలమగును. లక్షలకొలది ద్రవ్యము నార్జింపజేయుచున్న అమృతాంజననిర్మాణము నానిర్మాత లెట్లు పరుల కెరింగించరో యట్టులే వైదేశికులు సామ్రాజ్యసాధకములగు రహస్యవిజ్ఞానముల నితరుల కుపదేశింతురా! అందునను నలుబదికోట్లజనాభాకలిగి వివిధసంపద్రత్నాకరమై స్వజాతీయులవశమునసున్న ఈభారతదేశమున నున్నవారి కెపుడైన వెల్లడింతురా? కనుక "సిద్ధమన్నం పరిత్యజ్య భిక్షామటతి దుర్మతిః" అనున్యాయమే ఇట మనకు లభించును. అస్త్రశస్త్రాది సర్వవిద్యలలోను సర్వాధికారముకల మన ఆర్యులకు వివేకమున్నచో నైహికాముష్మికసకలఫలసాధకాథర్వవేద మొక్కటి చాలదా స్వాభీష్టసంసిద్ధికి. ఐతే నట్టిగ్రంథములు విదేశములకేగకుండ నింకను మనకు గలవా యందురేమో. విదేశములకు వెడలినయంత్రనిర్మాణశాస్త్రదులుకాని స్వదేశముననే చదపురుగులపాలై భూగర్భమున లీనమైనవిగాక నింకను దేశమున గాశ్యపశిల్పాదులవలె నిలచియున్న అముద్రితగ్రంథముల ఆయాగ్రంథాలయములలో బండితులచేత బరిశోధింపజేసినచో వానిమూలమునను భారతదేశమున నాయా పండితవంశములలోని గృహస్థులయిండ్లలో నున్నవానిని బరిశోధింపజేసి ఆయామాతృకలకు బుత్రికల వ్రాయించినచో వానిమూలమునను ముఖ్యముగా సుమారొకవందసంవత్సరములనుండి చదపురుగులపాలుగాకుండ బహుధనవ్యయముతో బహుళశ్రమతో గ్రంథములను దేశమున సేకరించి ముద్రాయంత్రసాధనమున ముద్రింపబడి భద్రపరపబడిన వివిధశాస్త్రగ్రంథములను బరిశోధింపజేసినను హిమాలయాదికన్యాకుమార్యగ్రపరిమిత భారతదేశముననే ఆర్షవాణికి జన్మస్థానమగుటచే నెక్కు సద్గ్రంథమణిపేటిక లిప్పటికిని లభింపగలవనియు, వానిమూలమునను వైదికతాంత్రికలౌకికాది సకలకర్మసకలకలాకలాపసర్వాధికారముకల ఆర్యులు స్వవిజ్ఞానరత్నప్రభలచే గనుగొనబడిన వివిధక్రియాకలాపనిర్మాణమున నితరదేశీయులకు దీసిపోకుండుటయేగాక నితరసాధ్యముకాని యస్త్రవిద్యాసిద్ధిబల

మున వైదేశికులకన్న మిన్నలుకావచ్చుననికూడ నొక్కి చెప్పవచ్చును. వేదములుకాని వాని ననుసరించిన వివిధశాస్త్రములుకాని ఆర్యుల కందరకును సాముదాయికముగ స్వీయములే కాని పరకీయములు కావు. భాషాంతరదేశముననున్న భాషాంతరీయునకు వ్యవహారమునకై నివాసదేశభాష నేర్పరచికొనినను స్వభాష యెట్లు లభిమానాస్పదమగునో యెట్లు లది స్వీయయగునో అట్టులే ఆర్యులకు గీర్వాణభాషయు స్వీయయే నగును. కాని పర వ్యామోహము వీడి స్వీయవిద్యలయెడ దృష్టిప్రసరించుకాలము కూడ నతిత్వరితముననే రాగలదని మావిశ్వాసము. అట్టి సత్కాలమునకే నెదురుజూచుచు సర్వనాశము కాకుండ నిపుడే వానిపై దృష్టిబరుప దేశీయుల గోరుచున్నాము. అపుడు చేయికాలినపిమ్మట నాకుల బట్టుటవంటిదని మాత్రము హెచ్చరించుచున్నారము. ఇప్పటివర కట్టి వివిధవిజ్ఞానరత్న మంజూషలను ముద్రాయంత్రసహాయమున మెరుగువెట్టి విస్తరింపజేసిన ముద్రాశాలాధి కారుల కందరకును మనము కృతజ్ఞతను వెల్లడించుట మనధర్మము. అందునను మహారాజసంస్థానములుకాని కోటీశ్వరులుకాని అతివిరళముగాకల మనయాంధ్రదేశమున జదపురుగులపాలు కాకుండ నతిశ్రమతో బండితవంశములనుండి తాళపత్రగ్రంథము లను సేకరించి నాదిసరస్వతిని రక్షించుటకై ఆదిసరస్వతీనిలయ మనుముద్రాయంత్ర మును నెలకొల్పి యెనుబదియైదువత్సరములకు బూర్వమే దివ్యగ్రంథముల నన్నిటిని వివిధశాస్త్రములయందును విబుధజనాదరణీయములనుగ జేసి సుందర సుందరాక్షర ములతో నాంధ్రదేశీయుల కందరకును విశుద్ధవిజ్ఞాన రత్నపేటికలనుగా నందించిన బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులువారికి గృతజ్ఞులమగుట మనవిధి—అప్పటికి దేశ మున బండితవతంసు లిప్పటివలెగాక నతిబహుళముగ నుండెడివారు. అట్టిస్థితిలో స్వాభా వికముగ బండితులకు గోశసంరక్షణమును బ్రాణసంరక్షణమునుగ జూచుట తరుచుగ నుండును.—అందుచేతను "పుస్తకం వనితా విత్తం పరహస్తగతం గతమ్" అనున్యాయ మును బాగుగా నెరింగి పరహస్తగతముం జేయువారు కారు. అందున అప్రసిద్ధరహస్య గ్రంథములు అసలే లేదు. ఏశాస్త్రమున నెవరు కృషిసల్పిరో వారివద్ద నాశాస్త్రగ్రంథములే కాక నితరశాస్త్రగ్రంథములు కూడ శాస్త్రాంతరాపేక్షతో సంగ్రహింపబడియుండుట అల్పము. ఎవ్వరైన గష్టించి లిఖింపబడినవేకనుక నితరులకు దుర్లభములే-లేక నతికష్టసాధ్య ములే యైయుండెడివి. ఇప్పటికి అముద్రితగ్రంథము లాయావంశములలో బండితులున్నంత వర కట్టిదే-లేకున్నచో జదలపాలే-అందులకైన నొప్పెడివారుకాని ఇతరుల కీయుట కొప్ప కుండిరి. నమ్మించి అతికష్టముమీద గ్రహించినవారును వ్రాసికొని భద్రముగా దిరుగా

నిచ్చుటయు నట్టిదుర్లభమే. ఇట్టిస్థితిలో స్వతః మహావిద్వాంసులై తమవద్దనున్నవానిని మాత్రమేకాక చెక్కుగ్రంథముల నార్జించి ప్రకటించుట నెంత శ్రమజెందిరో విజ్ఞజనైక వేద్యము. వారిపాండిత్యవిశేషము సుపోద్ఘాతగ్రంథసారసంగ్రహావ్యాఖ్యానాదివిశేషములచే వెల్లడించి విజ్ఞలోకాదృతులైరి. వారు కీర్తిశేషులైనపిమ్మట "పుత్రాదిచ్ఛేత్పరాజయమ్" అనుసూక్తిని ధృవపరచుచు వారిపుణ్యరాశిపరిణామభూతులగు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు సకలసుగుణరత్నాకరులై చతుర్భాషాగ్రంథరత్నములనతివిస్తారముగ బ్రకటించుచు నాంధ్రదేశమున సాంప్రదాయికప్రాచ్యవిద్వత్పుంగవుల యతివిరలతను గాంచి పండితద్వారమున ఆంధ్రటీకల రచియింపజేయుచు ఆర్యవిజ్ఞానరత్నకోశముల నాబాలవృద్ధపండితస్త్రీణముగ నాంధ్రులహస్తముల నలంకరింపజేయుచున్నారు. అట్టులే ధార్మికులకు గవులకు విబుధులకు రాజనీతిజ్ఞులకు నాలంబభూతులై త్రిలిఙ్గ జనోద్ధారిణియగు త్రిలిఙ్గపత్రిక నిరువదియైదు వత్సరములనుండి సరిగా వెల్లడించుచు ధర్మములను భాషామర్మములను శాస్త్రమర్మములను రాజనీతిమర్మములను లోకవృత్తముల అతిహృదయంగమసరణిని దేశీయులకు బ్రకాశింపజేయుచున్నారు. అట్టులే హూణభాషామయపత్రికతో హూణవిద్యావిశారదులహృదయముల జూరగొనుచున్నారు. ఇట్టివారి నింతకాలమునకు ఆంధ్రులకనుదెరచిచూచి భాషోద్ధారకబిరుదము నర్పించి కొంతవరకు స్వకృతజ్ఞతను వెల్లడించి ఇపుడు సమ్మానించుచున్నారు. ఇప్పటికైన ఆంధ్రమహోదయులిట్కార్యమునకు బూనినందులకు మేము వారినభినందించుచున్నాము. విజ్ఞానమణిమంజూషలనొసంగి ఆంధ్రలోకము నుద్ధరించిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని ఆంధ్రోద్ధారకులనుగాగూడ మేమెంచుచు చిరాయురారోగ్యైశ్వర్యాదివివిధశుభాభ్యుదయోదర్కులగుచు నాంధ్రలోకచూడామణులై తనరారునట్టులాసర్వేశ్వరు నభ్యర్థించుచు వ్యాసవిస్తరభీతిని విరమించుచుంటిమి.



# నూతన విద్యావిధానము

**శ్రీ పారనంది జగన్నాథస్వామిగారు, ఎం. ఏ., ఎల్. టి.,**
రిటైర్డు ప్రిన్సిపాలు, రాజాస్ కాలేజీ, పర్లాకిమిడి.

తల్లి-పక్షి తన చంటిపిల్లలకు జీవనోపాయములను నేర్పేవరకు వాటిని తనవెంటా తన సంరక్షణక్రిందా త్రిప్పుకొంటూ, ఎగరడము, ఆహారము వెదుక్కొనడము, ప్రాణము కాపాడుకోవడము, శత్రువులను గెలవడము మొదలైన జీవనవ్యాపారములను నేర్పును. మృగజాలిలో ఈపద్ధతి ఇంతకంటె సుస్పష్టము. మానవసృష్ట్యాదినుండిన్నీ, అందులో ముఖ్యముగా నాగరికతాప్రారంభమునుండిన్నీ ఈనేర్పడము ఒకసంస్థగా మారడము సంభవించినది. కాబట్టే ప్రథమోపదేశకుడు తండ్రి. కుటుంబసంరక్షణ అతని కెట్లు బాధ్యత అయినదో, అట్లే, పిల్లలవిద్యకూడా అతని ధర్మమయినది. కాని కేవలశరీరసంరక్షణకంటె ఎక్కువవిలువైన ఆత్మధర్మములను సంపాదించుకొనడము అవసరమని తెలిసినకొలదీ, ఈవిద్యయొక్కపద్ధతులు మారడము ప్రారంభమైనది. ఆపరిస్థితులలో గురువు తండ్రే కాకుండా తండ్రికంటె ఎక్కువసామర్థ్యముగల మరొకడు ఆవశ్యకమయినాడు. విద్యాసంస్థలు అన్నిరకములు స్థాపితములై, ప్రత్యేకవిధానములు స్థిరములయినవి చిన్నచిన్న బడుల నుండి పెద్దపెద్ద విశ్వవిద్యాలయముల వరకున్నూ ఆకులపై చిత్రించిన పుస్తకములనుండి లక్షలకొలది ఒక్కమారు అచ్చుపడినగ్రంథప్రతులవరకున్నూ జరిగిన అభివృద్ధిఅంతటికి ఉత్తేజక కారణము మీదసూచించిన పరిణామమే.

చాలాచాలా మార్పులను పొందుతూ ఈవిద్యావిధానము ఆధ్యాత్మికపరిణామములో అంతర్భూతమైనది. మానవజీవితవ్యాపారములన్నీకూడా నాగరికతాభివృద్ధిలో కేవలముగా ఆధ్యాత్మికములైనవి. ప్రపంచమంతటిలోనూ మానవుడు అత్యధికస్థానము వహించుటకున్నూ, అన్నివస్తువులపై అధికారము చేయుటకున్నూ సహకారమైన తనబుద్ధికి ఉత్కృష్టపదవిని అతడు కల్పించినాడు. తనవ్యాపారము లన్నిటిలోనూకూడా ఆబుద్ధికే ఉన్నతస్థానమును ఆపాదించి, ఆబుద్ధికార్యములనుమాత్రమే అతడు ఆరాధించెను. అన్నిటివలెనే విద్యావిధానముకూడా కేవలబుద్ధికార్యముగ విజృంభించినది.

ఈబుద్ధి తర్కముగ వ్యవహరించినది. అనగా ప్రపంచమందు వ్యక్తమైయున్నవస్తువులను విశేషించి, వాటియందు ఇమిడియున్నసామ్యములను గ్రహించి సూత్రములను ప్రతిపాదించి ఏకీకరణముచేయుటకుగాను బుద్ధి ప్రవర్తించినది. ఈప్రయత్నములలోనే భావ

పదార్థములు ఉత్పన్నములైనవి. తెల్లదనము, మంచితనము, గంభీరత, జాతిత్వము అట్టిభావ పదార్థములు; వీటిని భావములనికూడా పిలవడము కలదు. ఇవి తర్కమువలన సిద్ధమైనవి గాని, ప్రపంచములో వస్తువులవలె ఉన్నవికావు. ఇవి బుద్ధికే గ్రాహ్యములు. వస్తువులనుండి వేరుపరచిన గుణములు ఇవి. గోవులు ఉన్నవిగాని, గో-జాతి అంటూ ప్రత్యేకముగా ఒకటి లేదు, ఏప్రత్యేకవ్యక్తికాకుండా కేవల గోజాతి ఎక్కడా ఉండదు. అట్లే శరీరములేకుండా ఉన్న ఆత్మ ఎక్కడాలేదు. కాని బుద్ధియొక్కమహిమవలన ఈపృథక్కృతభావములు కేవలవస్తువులకంటె ఎక్కువగా వాడుకలో విజృంభించి, రూపముదాల్చినవస్తువులకంటె ఎక్కువబలము గలవి అయినవి. ప్రపంచములో వస్తువులకు ఆపాదించబడేధర్మములు తథ్యము, స్థిరత, వ్యక్తిత్వము, పృథక్త్వము మొదలైనవి ఈభావపదార్థములకుకూడా సంక్రమించినవి. వాదప్రతివాదములలో వీటికిగలబలము కేవలవస్తువులకు లేకుండుట సంభవించినది.

ఇందువలన అనేకవిధానములలో అనర్థదాయకసంస్థలు దృఢపడినవి. ఆవిధానముల వలన చేకూరవలసినఫలము దొరకకపోయినా, ఈనష్టమునకు కారణముగా ఈ అనర్థమును పరిశోధకులు మొన్నటివరకూ కనిపెట్టలేదు. సుమారు నూరుసంవత్సరములక్రిందటనే కొందరు తత్వవాదులు పాశ్చాత్యదేశములలో ఈపృథక్కరణమువలన వచ్చిన తప్పును సూచించినా, ఆవాదము చక్కగా అన్నివిచారణలలోనికీ ప్రసరించలేదు. ప్రపంచమందున్న వస్తువులకు సంబంధించని సూత్రములను నిరాకరించవలెను అనేసిద్ధాంతము ప్రబలమై, ఈపృథక్కృతభావములు వస్తువులు కాకపోవడముచేత ఇప్పుడిప్పుడు ఆతప్పును ఒప్పుకొన్నా, అనేకసహస్రసంవత్సరములనుండి స్థిరమైయున్నసంస్థలలోమాత్రము మార్పులు సులువుగా రాజాలకున్నవి. మానవస్వభావము మార్పులకు ద్వేషి.

ఇట్టి పృథక్కృతములలో ఒకముఖ్యమైనది శరీర—ఆత్మలను విడదీసినసూత్రము. శరీరసంబంధములేని ఆత్మ అసంభవమైనా శరీరములేని ఆత్మనుకల్పించి వాదములలో పోషించి, స్వప్నగతమైన గగనకుసుమమును సంపాదించమని ధర్మగ్రంథములూ, ఆధ్యాత్మిక వాదప్రచారకులూ, విద్యాగురువులూ, సంస్థస్థాపకులూ ఏకకంఠముతో ఘోషించినారు. ఘోషిస్తున్నారుకూడా. మానవశరీరముకూడా పశుప్రాయమేకాని, మానవధర్మము పశుస్థితి నుండి దాటిపోవలసినది నిజమే. దానిని సాధించుటకుగాను కర్తవ్యమేది? ఈపశుసంబంధమైన శరీరమును ఆత్మనుండి విడదీసి, కేవల పృథక్పదార్థమువలె భావించి ఆత్మసంబంధమైనవే పురుషార్థములుగా నమ్మి, శరీరసంబంధమైనవాటిని నశింపజేయడమనిగదా అందరివాదము. సన్యాసమునకు అదేగదా మూలసూత్రము. ద్వంద్వములను దాటవలెననే అనాత్మనిరసన వాదమైన వేదాంతమనెడి ఆధ్యాత్మికతత్వమునకు అదేగదా పునాదు. శరీరసంబంధవాంఛలు అధమములు అనేపాశ్చాత్యధర్మప్రచారమునకు అదేగదా ప్రధానము.

ఈధర్మమతబోధనలను అనుసరించే అన్ని విద్యావిధానములూ తయారైనవి. ఆత్మను వృద్ధిచేయడమే విద్య. శరీరము ఆ ఆత్మవృద్ధికి సహకారి అయేటట్లుచేయడమే విద్య ఇట్టి విద్యాబోధనము గతించిన నాలుగువేలసంవత్సరములనుండీ జరుగుతున్నది. "సత్యం వద, అహింసా పరమో ధర్మః" అనెడు మహావాక్యములు ప్రపంచమున అంతటా వ్యాపించియున్నవి. కాని అందరికీ తెలిసినదే, ఈబోధనలన్నీ పుస్తకములలోనూ, పాఠశాలలలోనూ, ఉపన్యాసములలోనూ ప్రకాశిస్తూన్నవికాని, ప్రవృత్తిలోనూ, ఆచరణలోనూ లేనేలేవు. ఇన్నిశతాబ్దములనుండీ ఇంతమందిబోధకులు ఇన్ని మోస్తరులుగా ప్రచారముచేసినా, ఈ చిన్నతత్వములు ఒంటపట్టలేదు. బుద్ధితో వాటిని ఆమోదిస్తూ ఆచరణలో వాటిని తిరస్కరిస్తూ సామాన్యముగా అందరూ ప్రవర్తిస్తున్నారు. ఇందుకు కారణము మీదచర్చించిన పృథక్కరణము.

ఆధ్యాత్మికమని శ్లాఘించి శారీరకమని నిరసించడమువలన వచ్చినప్రమాదము ఇది. శారీరకవాంఛలు, పశుప్రాయచేష్టలు, అధమమనోరథములు, అనాగరకాభిలాషలు, అని పేరుపెట్టి ఖండించినవి అన్నీకూడా మానవహృదయములో అవినాభావసంబంధముగలవి. వాటిని నిరసించి తిరస్కరించి నశింపజేయ యత్నించి, రూపుమాపుజేయకల్పించిన విధానములుఅన్నీ నిష్ప్రయోజనములుకావలసినవే. మనుజునిమనోనిర్మాణములో ఇమిడియున్న పశువు తనను అణచివేయవలెనని ప్రయత్నించే ఆధ్యాత్మికవిధానములను అనగా నాగరికతను ధర్మమును నీతిని మొదలైనవాటినన్నిటినీ వశపరుచుకొనును. కాబట్టి ఇప్పుడు ఆచరణలో ఉన్న విద్యావిధానము పూర్తిగ మార్చివేయవలెను. ఆపశువును ఆత్మయజ్ఞావాంలిగా దహింపయత్నించే సంస్కారములను మానివేయవలెను. అడవిమృగమును, ఎంతక్రూరమైన దానినైనా, మచ్చికచేసుకోగలిగిన మానవబుద్ధి, తనలో ఉన్నపశుశక్తిని మచ్చికచేసుకొని త్రిప్పుకోనేరక ధర్మమనే బల్లెములతో చంప ప్రయత్నించి వీగిపోయినది.

నూతనవిద్యావిధానము ఈపశుశక్తిని ఉపయోగించేమార్గముల ప్రవర్తించవలెను. ఆపశుశక్తిస్వభావమును చక్కగా సానుభూతితో ద్వేషనిరసనము లేకుండా సమన్వయించుకొని, తన్నే గోవునుండి పాలుతీసుకొనురీతిని ఉపయోగించవలెను. ఇప్పుడు జరుగుతూఉన్న విద్యాసంస్కారములు చాలావరకు, (అన్నీ అనిచెప్పినా పొరపాటుకాదు) ఈమచ్చిక-ప్రయత్నముచేయలేదు ఆశక్తిని మొదట అంగీకరించి గ్రహించవలెను. ఇందుకు పాశ్చాత్యదేశములలో చర్చించబడుతూఉన్న మనఃశాస్త్రపరిశోధనలను నూతనసూత్రములను అవలంబించవలెను. అంతేకాని నామరూపభేదములను కల్పించినంతమాత్రాన ప్రయోజనముండదు.



# ఆయుర్వేదశిక్షణ

## ౧

**సహాజయుక్తస్వరూపానందులు పండిత హెచ్. సుబ్బరాయశాస్త్రిగారు, మదరాసు.**

ఆయుర్వేదశాస్త్రముయొక్క ప్రాచీనౌన్నత్యము, ఘనత, వ్యాపకమును గురించి నెందరో మహానుభావులు వ్రాసినారు. గ్రంథము లనేకములు రచించినారు. మహామహాసభలలో అనర్గళఝరీప్రవాహవేగముతో బాహాటముగ ఉపన్యాసపరంపరలతో అమృతవృష్టి కురిపించినారు.

ఈలాటి పునరోద్ధరణసంచలనము కీ. శే॥ ఆయుర్వేదమార్తాండ భిషఙ్మణి పండిత డి. గోపాలాచార్లవారు 1912-వసంవత్సరమునుండి ప్రారంభించినది మొదలుగ శ్రీవారు దివంగతులైనతరువాతకూడ 1930-వ సంవత్సరమువరకు హిందూదేశవివిధప్రాంత్యములందును జరిగెను. అప్పుడుజరిగిన కృషిఫలితముగ ముఖ్యరాజధానులగు కలకత్తా, డెల్లీ, బొంబాయి, అహమదాబాద్, నాగపూర్, మద్రాసు మున్నగుపట్టణములలో ఇంగ్లీషుప్రభుత్వమువారియొక్కయు, మునిసిపలు మున్నగుప్రజాధికారసంస్థలయొక్కయు, మార్వాడీ, గుజరాతీ వారిదాతృత్వముయొక్కయు ఆదరణచే కొన్నికళాశాలలు, చికిత్సాలయములు ఏర్పడి ఏదోఒకతీరుగ జరుగుచున్నవి. ఇదంతయునిజమే. మద్రాసుజాతీయప్రభుత్వమువారు ఏర్పరచిన ఉస్మాకమిటీరిపోర్టు (ఇంగ్లీషు) చదివిన ఈకాలపు ఆయుర్వేదమతావలంబకులందరు ఆయుర్వేదశిక్షణకై ఏప్రణాళిక నిర్మించి ఆచరణలోపెట్టిన నిజమైన అభివృద్ధికి మార్గమగునో తెలియగలరు.

1930-వ సంవత్సరమున అఖిలభారతవైద్యసమ్మేళనము మైసూరులో మహామహోపాధ్యాయ కవిరాజ శ్రీగణనాథసేన్, సరస్వతి, ఎం.ఏ., యల్.యం.యస్.,గారి అధ్యక్షతక్రింద జరిగినప్పుడు అఖిలభారతదేశమున ఆయుర్వేదవ్యాప్తి నెటుల జరుగుచున్నదియు తత్ఫలితముగ ఇండియాగవర్నమెంటువారును, సంస్థానాధిపతులును, మహాగొప్పఉదారశ్రీమంతులును ఆయుర్వేదవైద్యచికిత్సాలయములుపెట్టియు కళాశాలలు నెలకొల్పియు క్రమక్రమముగ నెటులపోషించుచున్నది వివరించిరి.

ఆసందర్భములో చరక-సుశ్రుత-ఆత్రేయ-భేడాది విరచితసంహితలన్నియు మనకు ఉన్నది ఉన్నట్లు లభించకపోవుటయు, వారితరువాత గ్రంథకర్తలపొరబాట్లచే నెన్నియో విలోప-లుప్త-పరకల్పనలు గ్రంథాదులయందు కనబడుటయు, ప్రస్తుతము మనకు లభించు గురుత్రయీ, అనగా చరక, సుశ్రుత, వాగ్భటాదులు ప్రత్యక్షభౌతికశాస్త్రపరీక్షలకు కొన్నిసందర్భములలో విరుద్ధముగాను, అపహాస్యముగాను కనపడుటయు యీలాటిగ్రంథములను చక్కగ పరిష్కరించినగాని ఆయుర్వేదము కళంకరహితము గానేరదని తమ విచారము వెలిబుచ్చిరి. అంతటితో ఊరకున్న బాగుండెడిది. కాని, పాశ్చాత్యవిద్యావాసనాబలీయముచే "చరకాత్రేయసుశ్రుతాదులు మనవలెనే మనుష్యులేగాని త్రికాలజ్ఞులని చెప్పుట తప్పు. ఆసర్వేశ్వరు డొక్కడే త్రికాలజ్ఞుడు. ఈశ్వరాంశపొందిన ఎంతటిమహానుభావుడైనను సత్యసంధుడు గానోపునుకాని త్రికాలజ్ఞుడు కాడు." అనుభావము వెలిబెట్టిరి.

మైసూరులోజరిగిన 1930వ సం॥ అఖలభారతపరిషత్తుకు హిందూస్థానము, బొంబాయి మున్నగు వివిధప్రాంత్యములనుండి ఎందరో శిష్టాచారవైద్యులు వచ్చియుండిరి. మహర్షిప్రోక్తవైద్యశాస్త్రముపై మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్‌గారు పడవైచిన పాశుపతాస్త్రము, సనాతనవైద్యావలంబకులగుండెలు ఘల్లుమనజేసినది.

1 "జాగా జాగా పండిత జాగా
వేదశాస్త్ర దేతిలదగాహో, వేదశాస్త్ర దేతిలదగా
క్షమాకరా క్షమాకరా జడభూతాకృతి ఈశ్వర రాహో
పంచభూతాకృతి ఈశ్వరరాహో."

అని సద్గురుమార్తాండమాణిక్యప్రభువుగారు పాడినప్పుడు హాయిగా చెట్టు నాశ్రయించుకొని జీవించుచున్న జీవపక్షులన్నియు ఫిరంగిగుండుశబ్దింపగనే ఎటుల

2 "జీవపక్షిగారోథా ఫిరతాసబథామ్
ఫిరఫిరజనమకోథాయామిరు ఆత్మారామ్."

1 అర్థము.—ఓపండితులారా! మేల్కొనుడు. వేదములు, శాస్త్రములు భేదాభేదములు కలుగజేసి నిమిత్త ఉపాదానశాస్త్రము మున్నగుపనములలో మోసపుచ్చుచున్నది. క్షమింపుడు. క్షమింపుడు. జడము భూతాకృతులన్నియు ఈశ్వరుడే సుమా! పంచభూతాకృతులన్నియు ఈశ్వరుడే.

2 జీవపక్షులన్నియు సొగిరి అన్నిథామములు అనగా క్షేత్రములు తిరుగుచున్నవి. తిరిగి తిరిగి అవి ఆత్మారాముని మరచి (విడచి) మరల మరల పుట్టుచున్నవి.

అరచి కిరచి మూలకొక్కటి పరుగిడెనో అటులనే, మహామహోపాధ్యాయవాచస్పతివచనములు ఖరీభాంకారగర్జనకు గుండెలదిరి, చల్లాచదరై ఎవరిదోవ వారు వెళ్లిపోయిరి.

వేదద్రష్టలగు మహర్షులనిందాపవాదబాణముల నెదుర్కొనుటకు అఖిలభారత వైద్యసమ్మేళనములోని శిష్టాచారులు బొంబాయి, పూనా, నాగపురము, నాసిక మున్నగు ప్రాంత్యములోనివారు అప్పటినుండి సుమారు 4,5 ఏండ్లు కృషిచేసి, వేదములను, శాస్త్రములను పెకలించిరి.

షడ్దర్శనములను జల్లడపట్టి శుభ్రముగా కడిగి శోధించివేసిరి. వాతపిత్తశ్లేష్మాదులను త్రిదోషతత్త్వసిద్ధాంతము, పంచమహాభూతతత్త్వసిద్ధాంతము వేదాంగములగుషడ్దర్శనముల యొక్క పూర్ణజ్ఞానసాధనసంపత్తితో గ్రహించినగాని, ఆయుర్వేదశాస్త్ర మడుగంటి స్వరూప నాశనమగునని తీర్మానించుకొనిరి. "పంచమహాభూతత్రిదోషచర్చాసమితులు, పరిషత్తు లనేకము స్థాపించి, పాశ్చాత్యభౌతికశాస్త్రవ్యామోహముచే శ్రీయుత గణనాథసేన్ మున్నగు ప్రభృతులకు వీటివిషయమై కలిగిన మతివిభ్రమము తొలగింప పూనా, జనస్థానము (నాసిక) అహమద్‌నగర్, పనవేల్ మున్నగు బొంబాయి, నాగపూర్ ప్రాంతీయదిగ్దంతపండితులు, అమోఘమైనకృషి సలిపి, 1935-వ సం॥లో శ్రీకాశీయందు మహాసభ జరిపి దానికి మహామహోపాధ్యాయ కవిరాజ గణనాథసేన్ వాచస్పతి, సరస్వతినే అగ్రాసనాధిపతిగచేసి యీ క్రిందితీర్మానము లంగీకరించునట్లు చేసిరి. ఈతీర్మానము లంగీకరించునట్లు గణనాథసేన్ గారు తమదస్కత్తుపెట్టి ధృవపరచిరి. ఆహా! ఎంతటి అమోఘాస్త్రము యీమహాపరిషత్ ప్రయోగించినదోచూడుడు. పరకల్పన, విజాతీయమతసిద్ధాంతము లవలంబించి, ఆయుర్వేదమును పాశ్చాత్యవైద్యముతో మేళవింపజూచిన శ్రీగణనాథసేన్ ప్రభృతుల పాశుపతాస్త్రముపై జయముగాంచిన అమోఘాస్త్రమే హిందూవైద్యమును అజేయముగ జేసినది. జయీభవ. విజయీభవ.

## తీర్మానములు

శ్రీకాశీపంచమహాభూతత్రిదోషచర్చాపరిషద్.

నిరీక్షకాణాం సభాపతేశ్చ నిర్ణయః.

1. సర్వాయుర్వేదకార్యమూలభూతత్వాత్ త్రిదోషజ్ఞానం సప్రయోజనం.

2. వాతాదీనాం ధాతుత్వం, దోషత్వం, మలత్వం చ అవస్థావిశేషేణాభివ్యజ్యతే. తచ్చ పరస్పరావిరుద్ధం.

3-4. సర్వప్రాకృతకర్మసు, సకర్తృత్వనియామకత్వే సతి స్వాతంత్ర్యేణ దూషణశీలత్వం తచ్చ వాతాదిషు త్రిష్వేవ నాన్యత్ర. తస్మాత్ త్రయ ఏవ దోషాః.

5. శక్తేర్ద్రవ్యాధిష్ఠితత్వేన స్వతంత్రావస్థిత్యభావాత్, వాతాదీనాం న శక్తిత్వం కింతు ద్రవ్యత్వం ఏవ.

6. పిత్తకఫయోరవస్థాభేదేన స్థూలత్వం (చక్షురింద్రియగ్రాహ్యత్వం) వాయోస్తు పిత్తకఫాపేక్షయా సూక్ష్మత్వం (చక్షురింద్రియాగ్రాహ్యత్వం) అవ్యక్తో వ్యక్తకర్మా చ ఇత్యభిధానాత్. ఉపాధినిష్ఠస్య తు వాయోర్బహిరింద్రియగ్రాహ్యత్వమపి నీలం నభ ఇతివత్.

7. అదృష్టోపగృహీతాని, పంచమహాభూతాన్యేవ వాతాదీనాముపాదానాని, తదుత్పత్తి క్రమస్తు చరకే శరీరస్థానే ౪ అధ్యాయే నిర్దిష్టః యథా—"తత్ర పూర్వం చేతనాధాతుః సత్వకరణో గుణగ్రహణాయ ప్రవర్తతే......స, గుణోపాదానకాలే అంతరిక్షం పూర్వతరమన్యేభ్యో, గుణేభ్య ఉపాదత్తే ప్రలయాత్యయే, సిసృక్షుః భూతాన్యక్షరభూతో ఆత్మా సత్వోపాదానః పూర్వతరమాకాశం సృజతి; తతః క్రమేణ అవ్యక్తాన్ ధాతూన్ వాయ్వాదికాంశ్చతురః; తథా దేహగ్రహణేఽపి ప్రవర్తమానః పూర్వతరమాకాశమేవోపాదత్తే; తతఃక్రమేణ వ్యక్తతరగుణాన్, ధాతూన్, వాయ్వాదికాంశ్చతురః; సర్వమపి తు ఖల్వేతద్ గుణోపాదానమణునా కాలేన భవతి.

8. వాతాదీనాం స్వరూపం (తన్మాత్రవిషయకధీవిషయః) చరకోక్తం వాయోః "రౌక్ష్యం, లాఘవం, వైశద్యం, శైత్యం, గతిః అమూర్తిత్వం చేతి" వాయోరాత్మరూపాణి, పిత్తస్య "ఔష్ణ్యం, తైక్ష్ణ్యం, లాఘవం, అనతిస్నేహో వర్ణశ్చ, శుక్లారుణవర్జో గంధశ్చ, విస్రోరసౌచ, కటుకామ్లౌ పిత్తస్యాత్మరూపాణి" శ్లేష్మణస్తు "స్నేహశైత్యశౌక్ల్యగౌరవమాధుర్యమాత్స్న్యాని శ్లేష్మణఆత్మరూపాణి" భవంతి. గుణాః కర్మాణి చ గ్రంథోక్తాన్యేవ.

9 వాతాదీనాం ప్రత్యేకం పంచవిధత్వం వాస్తవికం; తచ్చ స్థానకార్యభేదోత్పన్నం; కార్యస్వరూపభేదస్తు తన్నిబంధన ఏవ.

10. రోగాన్ ప్రతి సదూష్యానాం వాతాదీనాం సమవాయికారణత్వం, సూక్ష్మరూపాణాం తు నిమిత్తకారణత్వం, రోగవిశేషాన్ ప్రతి కీటాదీనాం తు, నిమిత్తకారణత్వం, దోషదూష్యసమ్మూర్ఛనాయాశ్చ అసమవాయికారణత్వం.

1. శ్రీగణనాథసేన శర్మా   2. శ్రీడి. శ్రీనివాసమూర్తి
3. శ్రీసత్యనారాయణశాస్త్రి-వైద్య   4. శ్రీదేవనాయకాచార్య
5. శ్రీమధుసూదనవిద్యావాచస్పతి జయపురం   6. శ్రీబాలకృష్ణఉమరజీపాఠక
7. శ్రీలక్ష్మీరామస్వామి   8. శ్రీరాజేశ్వరశాస్త్రి, ద్రావిడ.

ఈసంతకముచేసినమహాశయులలో ముగ్గురు, నలుగురు మాత్రము వైద్యులు, మిగిలినవారు భాషాశాస్త్రపండితు లనందగును. మహామహాఉద్దండపండితసమావేశములో, మహర్షులమీదను, ప్రాచీనవైద్యగ్రంథములమీదను ఎదురుతిరిగి మహాపతివ్రతలనఁబడు సీతా, సావిత్రీ, అనుసూయా మున్నగుమాతలను హిట్లరు, మసోలిని, స్టాలిన్ రాజ్యములోనుండు మహామేధాసంపన్నుల కిచ్చి వివాహముచేసినకాని భారతదేశము ప్రాచీనౌన్నత్యము పడయనేరదని సిద్ధాంతీకరించి, ఆసిద్ధాంతములను ఆచరణలో గ్రంథస్థముగాబెట్టి కృషిసల్పుచుండిన మహామహోపాధ్యాయ కవిరాజగణనాథసేన్ వాచస్పతి, సరస్వతి ఎం. ఏ., యల్. యం. యస్., గారిని "గుప్త" అనుబిరుదావళినుండి "శర్మ" బిరుదావళికి మార్చి బ్రాహ్మణత్వము ప్రసాదించినదేకాక, శ్రీగణనాథసేన్‌శర్మగారు యికనుండి ఆదారిలో వెడలకుండునట్లు సంతకముచే బంధించి బలవంత మాఘస్నానముచేయించి ఆయుర్వేదమునకు అఖండ విజయపతాకము సాధించిరి. ఝూలోపూర్ణానంద !!!

౨

శ్లో. వాచా సజ్జనసంగతౌ పరగుణే ప్రీతిర్గురౌ నమ్రతా
విద్యాయాం వ్యసనం స్వయోషితి రతిర్లోకాపవాదాద్భయం,
భక్తిశ్శూలిని శక్తిరాత్మదమనే సంసర్గముక్తిః ఖలైః
ఏతే యత్ర వసంతి నిర్మలగుణాస్తేభ్యో మహద్భ్యో నమః.   భర్తృహరిః.

అర్థము:—మంచివాళ్లస్నేహమున్నూ, పరులగుణములయందు ప్రీతియును, గురువుగారియెడ వినయమున్నూ, ఎప్పుడుకూడా విద్యావ్యసనమున్నూ (అనగా నింకా నెక్కువ విద్యసంపాదింపలేదుకదా అనుచింత) శివునియందు భక్తియు, తనమనస్సును శిక్షించుకోవడమందే శక్తియున్నూ, దుర్మార్గులతో సహవాస మొనర్పకుండుటయున్నూ, మొత్తము ఈగుణము లెవరియందు కలవో వారికి నమస్కరించుచున్నాను.

ఈపై శ్లోకార్థము లక్ష్యమందుంచుకొని ఆయుర్వేదశిక్షణ ఏలీయగ నొసంగిన పునరోద్ధరణకాగలదనువిషయము చర్చించుదము.

త్రిలిఙ్గరజతోత్సవము

ప్రప్రథమములో స్వకీయవిషయ మొక్కటి చెప్పవలసియున్నది. 1941 సం. జనవరి 13, 14, 15 తేదీలలో ఇదివరకు త్రిదోషపంచమహాభూతపరిషత్ లో ప్రముఖులైనవారు డాక్టర్. తపస్వి. పరంజపి అనుమహాశయుడు, కడచిననెల మధురలో జరిగిన హిందూమహాసభ కార్యక్రమములో బాల్గొని తిరిగి వాపసుపోవుసందర్భమున, మద్రాసు వచ్చియుండి త్రిదోషపరిషద్ సిద్ధాంతము యిచటగలవైద్యోత్తములలో వ్యాపింప కృషిసాగించిరి. డాక్టర్ ఆచంట లక్ష్మీపతి, భిషగ్రత్న, బి. ఏ., యం. బి. సి. యం., గారు, డాక్టర్ మాధవమీనన్, కాప్టన్ జి. శ్రీనివాసమూర్తి, డాక్టర్ నటేశశాస్త్రి, వైద్య డాక్టర్ దొరస్వామి అయ్యంగారు మున్నగు ఉద్దండఆయుర్వేదవిద్వాంసుల దర్శించి "త్రిదోషములు ద్రవ్యములేకాని శక్తులుకావు" అనుసిద్ధాంతము ఆమోదింపచేసి, డాక్టర్ తపస్వి బాబాసాహెబు పరంజపైగారి మూలకము నాగపూరు బీరారుప్రాంత్యములో నున్న ."పన్వేల్" గ్రామములో ఈ త్రిదోషపంచమహాభూతసిద్ధాంతవ్యాపనకై స్థాపింపబడిన "స్టడీ సర్ కిల్" (పఠనసంఘము) లో మెంబర్లుగా జేసియుండిరి. ఈసందర్భమున శ్రీపరంజపైగారిని దర్శించుటకు నేనుకూడా పోవలసివచ్చెను.

సుమారు రెండున్నరదినము కొంతకాలము డాక్టర్ లక్ష్మీపతిగారి ఇంటను మిగతకాలము వారివిడిదియింటను నాకును వారికిని ముఖాముఖ ఇష్టాగోష్ఠిజరిగినది. శ్రీపరంజపైగారు శ్రీతిలకుమహాశయునితో మనహైందవకళలు, జాతీయతనిలవబెట్టుటకై కృషిసాగించి, భార్యాబిడ్డలున్నను జాతీయతకై సర్వసంగపరిత్యాగులై అష్టకష్టము లనుభవించినత్యాగమూర్తి. తపోధనులు. ప్రస్తుతము వీరికి 75 ఏండ్లు ఉండవచ్చును. అయినను ఆచిన్ననాటి పరాక్రమము, ఉత్సాహము, త్యాగదీక్ష ఏమాత్రము మొక్కబోక శివాజీ ఛత్రపతి యోధాగ్రణి దేశభక్తిలక్షణము లనేకములు వీరిలో మూర్తీభవించి నేటికిని చిదానందమూర్తిని స్మరింపజేయుచున్నది. సరియే కదా!

శ్రీపరంజపైగారు:—ఆయుర్వేదము సమగ్రమైనశాస్త్రమా? అసమగ్రమా?

నాఉత్తరము—ఆయుర్వేద మామ్నాయముగ అన్వయించుచో సమగ్రమే. నదులకు అన్వయించుచో అసమగ్రమే.

"కలితీర్థ అమంగళకరితా సాగరీ
మిసళతీ శబ్దబహుభాషా వైఖరీ
జగబ్రహ్మ బ్రహ్మ జగవేషాహో ధరీ
మృగజలీ రూపమార్తాండరూపాంతరీ
అద్వైతబోధు అశ్మీహా చిహోఅముచాదంథా

కలూహా

/

హేసత్యాసత్య తూ జాణసి పరంజపి ఆర్యా.
శ్రుతిధర్మరక్షుణి సకలమతాతే వందా తేవందా
సర్వాంతరి ఆత్మానకో కుణాచీ నిందా." శ్రుతిధర్మ.

అర్థము.—ఎన్ని అపరిశుద్ధజలవాహినులు సముద్రములో కలియునో కదా! అయినను సముద్రమును అపరిశుద్ధమందుమా? అటులనే అనేకభాషలు వైఖరి యనుశబ్దార్ణవములో కలిసిపోవును. శబ్దార్ణవము చెడునా! (అటులనే వైద్యమతము లెన్నియో ఆయుర్వేదామ్నాయములో కలియును. వైద్యమహోదధి కేదియేని లోటువాటిల్లునా?) 'జగత్తే బ్రహ్మము, బ్రహ్మమే జగత్తు' అని అద్వైతముయొక్క ఢంకా శబ్దము వినలేదా! చిన్మార్తాండప్రకాశములో యివన్నియు ఎండమావులు సుమా?

నేను అద్వైతమే బోధింతును. ఇదే నావృత్తి. ఓపరంజపి ఆర్యా! దీనిసత్యాసత్యములు తెలియుమా!

పరంజపైగారు:—అయినచో వాత-పిత్త-శ్లేష్మము లనుత్రిధాతువులు రస-రక్త-మాంస-మేధ-అస్థి-మజ్జా-శుక్రము లనబడు దోషములును, మలములున్నూ పంచమహాభూతములున్నూ ద్రవ్యములా? శక్తులా?

ఉత్తరము:— శరీర హేపంచభూతాచే బనలే
కాలస్వభావకర్మే రచిలే
స్వస్వరూపి మాయిక హేనటలే
సాక్షిపణే అహ్మీ పాహూ—యాజగి
అఖండముక్తచిరాహూ యాజగి,
అఖండఅహ్మీతుహ్మీ రాహూ. గురువచనా.

అర్థము.—ఈశరీరము పంచభూతములతో చేయబడినది. కాలము, స్వభావము కర్మచేత రచింపబడినది. నాయొక్క స్వస్వరూపమే మాయచేత యీరీతిగ నటించుచున్నది. కేవల సాక్షిరూపముగ యీజగత్తును చూచుచున్నాను. నేను, నీవు యీసత్యము తెలిసి అఖండముక్తస్వరూపములుగా నుండవలసినది. ఇదియే గురువచనము.

పరంజపైగారు:—అయిన మీరు చెప్పునదంతయు శక్తులకే అన్వయించును. త్రిదోషాదులు, పంచమహాభూతములు, ద్రవ్యములు Matter గాదు శక్తులనియేనా మీఅభిప్రాయము.

ఉత్తరము:—"శక్తిసనేజరిబ్రహ్మీ, తరితే బ్రహ్మానహ్వాజడధర్మీ"

అర్థము.—శక్తికిని, శక్తిమంతమైనవస్తువునకు భేదములేదు. ఆవస్తువు ఒక్కటే బ్రహ్మము.

శక్తియనునది శక్తిమంతమైన బ్రహ్మకాకున్న మరేమి? అటులైనప్పుడు జడధర్మము లన్నియు శక్తులే జడధర్మములు ఈ బ్రహ్మ కాకున్న మరేమి?

పరంజప్యెగారు:—ఇదుగో చూడుడు. ఈముఖ్యసిద్ధాంతము శ్రీ కాశీపండితమహాసభలో అంగీకరించినారు. రోగములపట్ల దూషింపబడినవాతాదులు సమవాయికారణం దోషదూష్యసమ్మూర్ఛనాదులు—అసమవాయికారణం సూక్ష్మరూపాణాంతు—నిమిత్తకారణం. రోగవిశేషములపట్ల కీటాదిసంసర్గములు—నిమిత్తకారణం. దీనికేమిచెప్పెదరు?

ఉత్తరము—

"చిదాకాశ అప్హితాత్మా । దర్పణి అణుదిసె మాయికమహిమా
ఉపాధిగుణావలంబీ । బింబస్థిరచంచలప్రతిబింబీ
నిమిత్తపరిణామీ జగచిత్ర । ఆత్మా మాయదావిస్వాతంత్ర
ఇంద్రియసుఖసంపత్తీ । ప్రకటే అస్తి భాతి అణిప్రీతి
వృత్తీజగిస్ఫురలీబామనిస్ఫురలీ । స్ఫురలీ (జేధే) తేథేమురలీ. వృత్తీజగి

అర్థము. చిదాకాశములోనున్న ఆత్మను నేను. మాయా అనునది అనేకఛిద్రములుగా పగిలిన అద్దమనుకొనుడు. అందులో నారూపము అనేకముఖములుగా అనేకవంకరలుగా కానిపించును. నాబింబము స్థిరమైనది. ప్రతిబింబము చంచలమైనది. అసత్యము ఉపాధియొక్కగుణములును అనుకరించుచున్నది నాబింబము. ఈచిత్రమైనజగత్తు నిమిత్తపరిణామమైనది. ఆత్మ (నేను) మాయావరణములో నున్నాను. జగత్తులో మనోవృత్తి ప్రకాశించుచున్నది. సముద్రములో తరంగము లెటులనో అటుల చూడుడు. ఎక్కడెక్కడ వృత్తితరంగములు ప్రకాశించుచున్నదో అక్కడక్కడనే సముద్రములోనే (ఆత్మలోనే) లయమగుచున్నది.

పరంజప్యెగారు—అయితే మీభావములో ద్రవ్యములు జడము అనుపదార్థమే లేదనియా?

ఉత్తరము:—ఆహేతి అస్తి బ్రహ్మ, భాసతే తే భాతి బ్రహ్మ విషయీసుఖ తే ప్రియబ్రహ్మ హే అస్తి భాతి ప్రియబ్రహ్మ । నామరూపమిథ్యాభ్యాసూలే.

అర్థము. ఏది ఉన్నదో దానికి అస్తి బ్రహ్మ యనిపేరు. ఏది ప్రకాశించునో దానికి భాతి బ్రహ్మ యనిపేరు. ఏది విషయసుఖమునిచ్చునో దానికి ప్రియబ్రహ్మ మనిపేరు. ఇదే అస్తి, భాతి, ప్రియబ్రహ్మ అనగా సత్, చిత్, ఆనందస్వరూపము. నామరూపము లన్నియు అసత్యములే "నామరూపకల్పిత ఆహే వా! అనుభవసర్వజగాఆహే" నామరూపములు అజ్ఞానకల్పితములు. ఈఅనుభవము అన్నిటిలో కానిపించును.

పరంజప్యెగారు:—పంచమహాభూతములు శక్తులా? ద్రవ్యములా?

ఉ.—"హేపంచభూతమిపంచముఖిశివరాణా
మనప్రవాహాచేతవీపరినధరీఅభిమాన"

అర్థము. ఈపంచమహాభూతములు శివునియొక్క అయిదుముఖములు. ఇవి లేనివస్తువేలేదు. మనసు అనేవస్తువు చేరినప్పుడు "నేను" అనే అహంవృత్తి ఏర్పడును. ఈ "నేను" ఎవడు.

నరనారీజగతో ణాహే?=జగత్తులోని స్త్రీపురుషు లెవరు?

తరి అస్తి భాతి అణిప్రియ ఆహే?=అస్తి, భాతి, ప్రియ-సత్ చిత్ ఆనందరూపము అనగా బ్రహ్మము.

నేను బ్రహ్మను-అని ఎటుల తెలుసుకోగలను?

ఉత్తరము.—"జన్మమృత్యుభ్రమ ఉధలీతో
సచ్చిదానంద అహ్మీహోతో"

అర్థము. జన్మమృత్యు, మాయ యీభ్రమ విడచినతక్షణం సచ్చిదానందస్వరూపు డగుదును

పరంజప్యెగారు.—మీరు ప్రతిమాటకు వేదాంతవాక్యములే చెప్పుచున్నారు? వైద్యవిషయముల సిద్ధాంతమునకు మీమాటలు సందర్భపడవు.

ఉత్తరము.—ఆయుర్వేదశాస్త్రము షడ్దర్శనములమూలకముగాక వేరొక్కవిధముగా అభ్యసింపరాదని బోధించుటకు మీరు కంకణం కట్టుకొని కృషిచేయుచున్నారు. వేదాంతశాస్త్రము షడ్దర్శనములలో నొక్కటికాదా? తర్కము, న్యాయము, మీమాంసము, వ్యాకరణము యిత్యాదులు చదువుకొన్నమాత్రమున సత్య మిదియని బోధపడగలదా? మాయావాదము, పరిణామవాదము, బింబప్రతిబింబవాదము, దృష్టిసృష్టివాదము, ఖ్యాతివాదము.

ఈవాదములన్నియు ఎన్నదేని అందరును అంగీకరించిరా? మొట్టమొదట నంబరు 1 సంపాదించి దానిప్రక్క ఎన్నిసున్నలుబెట్టినను అసంఖ్యకు విలువ ఎక్కును. ఈశాస్త్రచర్చల కంతులేదు. దుర్వాదములవల్ల లాభములేదు. సౌఖ్యములేదు. కాబట్టి ప్రథమములో మనభారతగర్భవాసులకు ఆత్మవిద్యాభ్యాసముచేయించినకాని నంబరు 1.వ మార్కు రాదు. తరువాత అన్నిశాస్త్రములు కరతలామలకములగును.

# ధ్వజములు

శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు, బి. ఏ., బి. ఎల్., వకీలు, నెల్లూరు.

పూర్వకాలమున యుద్ధవీరులు వేరువేరుధ్వజముల నుంచుకొనినటుల భారతరామాయణాదులవలన తెలియఁగలదు. రామలక్ష్మణులధ్వజచిహ్నము లెవ్వియో రామాయణమున కానరాదుగాని భరతుఁడు కోవిదారధ్వజుఁ డయినటుల అయోధ్యాకాండలోని 96 సర్గయందలి 200 శ్లోకమువలన తెలియుచున్నది. "ఆవాం హంతుం సమభ్యేతి కైకేయ్యా భరతస్సుత. ......విరాజత్యుద్గతస్కంధః కోవిదారధ్వజో రథే." రామలక్ష్మణులు రాజ్యసంపదను త్యజించి యరణ్యావాసులయియున్నందున వారు స్వస్వధ్వజముల ధరింప నవసరములేకపోయిన దనుసమర్థకము చెల్లదగును.

రావణునిధ్వజము మనుష్యశీర్షము యుద్ధ 101-14 ఇంద్రజిత్తు మృగరాజధ్వజుడు యుద్ధ 59-15 అతికాయుడు రాహుధ్వజుడు యుద్ధ 71-17 ఇత్యాదులు రామాయణమున గలవు.

భారతవీరులధ్వజము లనేకములు మహాభారతమునఁ జెప్పఁబడియున్నవి.

శ్రీకృష్ణుడు - గరుడధ్వజుడు, ధర్మరాజు - చంద్రుడు, భీముడు - సింహము, అర్జునుడు - కపి (హనుమత్కేతనుడు), నకులుడు - శరభము, సహదేవుడు - ఏనుఁగు, ద్రోణపర్వము 1—307 చూడుము భీష్ముడు - తాళధ్వజుడు, ద్రోణాచార్యుడు - యజ్ఞవేది, దుర్యోధనుడు - ఉరగము, కర్ణుడు - ఏనుగు ఇత్యాదులు గలవు.

ఇట్టిధ్వజముల జెప్పుకొనుటలో ఆయాయాకారములు ధ్వజపటములపై చిత్రింపబడియో లేక చిత్రవర్ణములుగల గుడ్డలతో కూర్పబడియో యుండునని యూహింపనగును. అట్లుగాక సింహధ్వజుడు ప్రత్యక్షమగుసింహమును వారణధ్వజుడు ప్రత్యక్షమగువారణమును ఓక్కొములపై బెట్టుకొని యుందురనుకొనుట భావనావైపరీత్యముగ నుండును. మిగిలినవానిస్థితి యెటులుండినను కర్ణార్జునులధ్వజములవిషయమున కొంత విసంవాదమున కవకాశ మున్నటుల తోచుచున్నది. అర్జునుని హనుమంతుడును, కర్ణుని ఏనుఁగుయు, చిత్రార్పితస్వరూపములా లేక సచేతనములా? ఈసందేహమున కాధారమగుసోమయాజిరచన యిటులున్నది:—

సీ. కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహాబలు లిద్దఱును దపోబలమువలనఁ
గన్నవియై బుద్ధిగల్గి శోభిల్లు నుర్వీశ యప్పుడు కపి యెరఁగి హస్తి
కక్ష్యపై నడరినఁ గయ్యమా రెంటికిఁ గలిగె నందాహస్తికక్ష్య దెరలె

కపిహస్తుల రెంటికిని కయ్యమయినదని యర్థము కాగలదు.

ఈఘట్టమునకు సరియగు వైయాసిక మిటులున్నది:—

కపిశ్రేష్ఠస్తు పార్థస్య వ్యాదితాస్యో౽భయంకరః,
భీషయన్నేవ దంష్ట్రాభిర్దుర్నిరీక్ష్యో రవిర్యథా.
యుద్ధాభిలాషకో భూత్వా ధ్వజో గాండివధన్వనః,
కర్ణధ్వజముపాతిష్ఠత్ స్వస్థానాద్వేగవాన్ కపిః.
ఉత్పద్యతు మహావేగః కక్ష్యాయామభ్యహనత్కపిః,
నఖైశ్చ దశనైశ్చైవ గరుడః పన్నగం యథా.
స కింకిణీకాభరణా కాలపాశోపమాయసీ,
అభ్యద్రవత్సుసంక్రుద్ధా నాగకక్షాథ తం కపిమ్.
తయోర్ఘోరతమే యుద్ధే ద్వైరథేద్యూత ఆహితే,
ప్రకుర్వీత ధ్వజౌ యుద్ధం....... (కర్ణపర్వ. 87.88. కలకత్తాప్రతి.)

ఉదాహృతసంస్కృతమూలవాక్యములనుబట్టి ఈధ్వజయుద్ధము రూపకోత్ప్రేక్షగ నుండవచ్చునని తోపగలదు. అయినను తిక్కనవాక్యములవలన గలిగినసందేహము పూర్తిగ వీడుటలేదు.—"కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహాబలులిద్దఱును దపోబలము"ను పొందినటుల చెప్పబడియున్నది. "తపోబల" శబ్దముగాని తత్పర్యాయపదముగాని సంస్కృతభారతమున లేదుగాని ఆయధ్యాయపు 87-వ శ్లోకమున "తయోర్ధ్వజౌ వీతమలౌ" యను విశేషణ మున్నది. వీతమల తపోబలములకు అంగాంగిభావమో కార్యకారణభావమో సాధించి ఈరెండుధ్వజములయెడలను యెద్దియో నొక యమానుషవిధానము జరిగిన ట్లూహింపదగియున్నది.

ఈధ్వజయుద్ధము కేవలరూపకమా? లేక ప్రత్యక్షముగ జరిగిన దనుకొనవచ్చునా? ఇట్టి అపూర్వవిశేష మిచటనేగాక మరియొకచోటను కనుపడుచున్నది. ద్రోణపర్వమున 3-35 వానరరావంబు నింగిముట్టినటుల జెప్పబడియున్నది. ఈవానరరావము పార్థధ్వజమున నుండియే బయలువెడలినటులున్నది.

"దేవదత్తరవంబుతోఁ దీవ్రపాంచ
జన్యనినదంబు భూరినిస్వనయుతముగ
నిగుడువానరరావంబు నింగిముట్టె."

ఈవాక్యమునకు మూలము (కలకత్తాప్రతి) ద్రోణపర్వము. అ. 88 శ్లో. 26 లో నున్నది.

"తతః కపిర్మహానాదం సహ భూతైర్ధ్వజాలయైః,
అకరోద్వ్యాదితాస్యశ్చ భీషయన్ తవ సైనికాన్."

ఇదియు నుత్ప్రేక్షతో కలిసినరూపకముగనే యుండునా? అట్లగునెడల కపికి సహాయ
ముగ వ్యాసుడు ధ్వజాలయములను భూతముల నేల చెప్పవలసియుండినదియో తిక్కన
సోమయాజి భూతసహాయమును చెప్పలేదు. అర్జునునిధ్వజమున భూతములు పిశాచములు
గూడ నున్నవనుటకు విరాటపర్వమున 4-201 చూడుడు. సంస్కృతభారతమునందు విరాట
అ. 48-19-21 చూడుడు.

ఇట్టి యుల్లేఖలవలన నీయర్జునధ్వజముపై నుండినది కేవల కపిరూపమా లేక ప్రాణ
ప్రతిష్ఠాదులంబొంది జవసత్త్వములుగల యర్చామూర్తిసామ్యమగువస్తువా?

ఇంకొకవిశేషమునుగూడ ప్రస్తావింపవలసియున్నది. అర్జునునికి శ్రీకృష్ణుడు గీతోప
దేశము చేసినవిషయము నేరికయిన సందియమున్న, కపిధ్వజముపై వెలసియున్న హను
మంతుని సాక్ష్యముగూడ కలదని యొకపక్షమున్నది. ఇందు కుపబృంహణముగ హను
మంతుడు గీతాధ్యాయమున శ్లోకభాష్యమును వ్రాసినట్లును యొకగ్రంథమును జూపుదురు.
అయితే ఈభాష్యము పైశాచిభాషలో వ్రాసెనట. హనుమంతుడు గొప్పసంస్కృతపండి
తుడు. సీతాదేవి నీతడు సందర్శించినపుడు ఆమెతో సంస్కృతమున మాట్లాడదలచినట్లు
సుందరకాండయందున్నది:—

"యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతాం." (సుందర. 30-17)

మరియు "నూనం వ్యాకరణం కృత్స్నం అనేన బహుధా శ్రుతం" అని శ్రీరాముని శ్లాఘా
వచనమును గలదు. (కిష్కింధ 3-29) ఇట్లు భాషావైదుష్యసంపదచే నొప్పారినహను
మంతుడు భగవద్గీతకు సాక్షియై భాష్యకర్తయునై యుండనోపునుగాని యర్జునుని
టెక్కెముమీద నున్నపుడును వాక్పాణ్యాదీంద్రియావ్యాపారము గలిగియుండినగాని
ఉదాహృతకర్ణద్రోణపర్వోల్లేఖము సమర్థింప నలవియగునా?

ఇట్టి దృష్టాంతముల ననుభవసాధ్యములుగను వస్తుతత్త్వశాస్త్రసమ్మతములుగను
సమన్వయము చేయనగునా? లేక వేదతుల్యమగుభారతప్రామాణ్యమును భక్తితో నంగీక
రించి విశ్వసింపవలయునా?

ఈచిన్నవ్యాసమున నుదాహరింపబడిన తెలుగుభారతవాక్యములు శ్రీవావిళ్ల వారి
చక్కని ప్రతినుండి గ్రహింపబడినవి.



# మతవాహిని

శ్రీ ఆచార్య ప్రతాపగిరి రామమూర్తిగారు, బొంబాయి.

భారతస్థలి మతవాహినికి పుట్టినిల్లు. ఇతరదేశములం దితరమతము లనేకము లుండవచ్చును. కాని మతసర్వస్వమును హైందవవాహినియందే అంతర్భూతమో అంతర్నిహితమో కాకుండుటకు వీలులేదు. అందుచే హైందవమతవిచారము సర్వమతవిచారమే యని నిశ్శంకముగ చెప్పవచ్చును.

ప్రపంచమున పురాతనమతములలో హైందవమతమే—వైదికమతమే—బహుపురాతనము. ఇట్టి వృద్ధమతమునకు ఒకవిధముగ పుత్రికయే అనదగినమతము జొరస్థరీయమతము. తదుపరి యూధమతము. ఈమతత్రయము అనేకమతసహస్రములకు పుట్టినిల్లయినమాట వాస్తవము. అందు ముఖ్యముగా హైందవమతమని పిలువబడు వైదికమతమునుండియే బహుమతము లుద్భవించినవి. ఈహైందవమతము ఆర్యద్రవిడమతసంకులము. హైందవమతసిద్ధాంతమైన ఉపనిషత్సిద్ధాంతము వేదాంతపరిభాషితమైనది. ఈవేదాంతము మతమాత్రమేగాక అనుభవసిద్ధాంతమేనని నేటిమతాధికుల అభిప్రాయము. భారతస్థలి ఆచరణయందున్న బహుమతములకు యీవేదాంతమే పునాది ఇట్టి వేదాంతమాతృకాసంతానమైన వివిధమతములు పరస్పరవైరుధ్యములుగావు సరిగదా. సన్నిహితములనికూడ చెప్పవచ్చును. బుద్ధోద్బుద్ధమైన బౌద్ధజైనసాంప్రదాయములుకూడ వేదాంతవైరుధ్యములుకావు.

జొరాస్థిరీయమతముకూడ ఋగ్వేదసాంప్రదాయయుక్తమేనని వైదికసాంప్రదేయమేనని నిర్ణయించుట కాధారము లనేకములున్నవి. అందలి నైతికసాంప్రదాయములన్నియో కొన్నియో యూధమతముకూడ సంగ్రహించినదని చెప్పవచ్చును. ఈయూధమతసాంప్రదాయములే మహమ్మదీయమతము చాలవరకు స్వీకరించినది. హైందవజొరస్థరీయయూధత్రిపుటిసంగ్రహీతమైన వివిధభావములు క్రైస్తవమతము చాలవరకు జీర్ణించుకొన్నది.

కావున ద్వైతాద్వైతవిశిష్టాద్వైతసిద్ధాంతములే పర్యవసానమునకు ప్రపంచమందున్న ఆస్తికమతములన్నిటికిని మాతృకలని చెప్పకతప్పదు. మొత్తముపై మతషట్కము మాత్రమే వ్యావహారికమున హైందవఆమోదితమైనది.

నాస్తికమతములకు నైతికప్రవృత్తియందు ఆస్తిక్యము మెండు. హైందవమతముచే జీర్ణించుకొనబడిన నైతికధర్మములు చాలవరకు నాస్తికధర్మములే. పర్యవసానమునకు సిద్ధాంతములయందుతప్ప ఆచారవ్యవహారములయందుగాని ఆహారవిహారములయందుగాని ఆచరణాచరణీయములయందుగాని ఆస్తికనాస్తికభేద మావంతయు లేదు. పైగా ఈ ఆస్తికనాస్తికులకు పరస్పరకలహము యెన్నడును లేదు. ఇక షణ్మతములలో అప్పటప్పట పరస్పరవైరుధ్యభావము ఉత్పన్నమగుటకు హేతువు దురహంకారులైన వ్యక్తులు మాత్రమేగాని సంఘములుకావు. అందుచే హైందవులకు సంబంధించినంతవరకు భారతమున మతసమస్యయే లేదు.

ఇక కారణాంతరములచే యీదేశమున స్థిరస్థాయులై కొన్నిశతాబ్దములనుండి కాలక్షేపముచేయుచున్న మహమ్మదీయ, క్రైస్తవ, యూధ, జొరస్థరేనియనులలో. యూధులును, జొరస్థరేనియనులు బహుస్వల్పసంఖ్యాకులు. వారినిగూర్చి క్లిష్టసమస్య యేమియును లేదు. ఇక క్రైస్తవులు విదేశీయులుతప్ప స్వదేశీయులు చాలమట్టుకు పూర్వాచారపరాయణులే. ఇక మహమ్మదీయులు. వీరును చాలవరకు దేశజులే, దేశీయులే. వీరును ఆధ్యాత్మికసాంప్రదాయములయెడ హైందవులతో అవినాభావులే. అంతకుమించి కబీరువంటిరామభక్తుడును, రామదాసువంటి మహమ్మదీయ శిష్యులునూ ఈపరస్పరాభేదమునకు ప్రబలనిదర్శనములు! నేటికిని దరగాలను సుఫీఫకీరులను సేవించు హైందవఅగ్రజాతులునూ పుణ్యస్థానములనూ యోగులనూ సేవించుమహమ్మదీయులు అసంఖ్యాకులనుట కాశ్చర్యపడవలెనా! ఉభయకక్షులందును ప్రాజ్ఞులగువారికి పరస్పరగౌరవము, సహనము చిరప్రవర్థితమైనదిగాని నిన్ననో నేడో వచ్చినదికాదు. ఇట్టిపరిస్థితులలో హైందవమహమ్మదీయసమస్య అన్యమేమైనకావచ్చునో యేమోకాని మతసమస్యమాత్రము కాదు.

కనుక హైందవప్రపంచమున మతసమస్య యేమహానుభావులమనోవీథియందో, స్వార్థపరచక్రవర్తుల కుతంత్రములయందో కల్పితముగాని యాథార్థ్యముకాదు. జాతికంతకును, హైందవస్థజాతికంతకును, ఉన్నది ఆర్థికసమస్యకాని మతసమస్యకాదు. ఇట్టి ఆర్థికసమస్యను పరిష్కరించుటకు ఆర్థికసహాయమే అవసరముకాని ఆర్థికాభివృద్ధియే అగత్యముకాని మతసమాధానప్రబోధముకాదు. స్వార్థపరులైనపరులు కోశాధికారులై కోశసమార్జనాభారవహులు పరమదరిద్రనికృష్టావస్థలందేలు దేశస్థులైనప్పుడు మతసమస్యలో మారెమ్మసమస్యలో మనల నెదుర్కొనుటలో నాశ్చర్యములేదు. కాసునకు గడ్డికరువవలసినకాలమున కడుపుమంటచే తహతహలాడుప్రజాకోటులచే నిండినదేశమున పరాయత్తమైన సర్వాధికార

భూయిష్ఠమైన రాజ్యమున పరస్పరవైషమ్యములకు పాదుకాపట్టాభిషేకములకు పరిపంథినాయకాప్రముఖప్రసృష్టికి సావకాశము లెన్నియుండునో, యెట్లుండునో బుద్ధిమంతులు గ్రహింపలేకపోరు.

మనస్సుగలపశువునకు మత మగత్యము. దేహపోషణ కాహారమెట్టిదో బుద్ధిసౌభాగ్యమునకు మనశ్శాంతికి మతమట్టిది. ఆత్మార్పణ మొనర్పని కేవల బాహ్యమతావలంబనము అంతశ్శాంతికి నిరుపయోగము. కావున మతము హృదయస్థము. హృదయము వ్యక్తిస్థము. అందుచే బాహ్యాచారభూయిష్ఠమైన సంఘానుష్ఠితమైన మతధర్మము మతాభాసమేగాని మతముకాకపోవుటచే వివిధమతస్థులకు ఆచారసమస్యయేగాని మతసమస్యలేదు. హైందవజాతికి ప్రాధాన్యమైనమతావలంబనము నిగూఢమైన స్వీయరహస్యమేగాని బాహ్యాచారమాత్రముకాదు.

బోధ్ధలగువారు ధీమంతులును శీలవంతులునుకాకుండినచో సంఘవిప్లవహేతువగును. ఇట్టి విప్లవప్రోత్సాహకులు సంఘసేవకులుగాని మతాదరులుగాని ఈశ్వరోద్దిష్టులుగాని కానేరరు. అందుచే యిప్పటికే దేశీయులెల్లరు సవ్యమార్గము గ్రహించి స్వార్థాఅనర్థముల నెరింగి మతప్రలాపములను విడిచిపెట్టి ప్రవర్తింతురుగాక యని కోరుచు యింతతో విరమించుకొనుచున్నాను.



**శ్రీ రావుబహాదర్ వి. సంబంధము మొదలియారు, పమ్మాలులాడ్జి, జార్జిటౌన్, మదరాసు:—**

శ్రీ త్రిలిఙ్గపత్రికరజతోత్సవము త్వరలో జరుగనున్నదని విని సంతసించుచున్నాను. ఆపత్రికకు సంపాదకులు సమర్థులు దక్షులుఅయిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరులశాస్త్రులవారిని గడచిన 25 ఏండ్లుగా వారుచేసినపనిని అభినందించుచున్నాను. వారితెనుగుపత్రికయేకాక, ఫెడరేటెడ్ ఇండియా అనుఇంగ్లీషుపత్రికనుకూడ ప్రకటించుచున్నారు. వీనియందు ప్రశంసకువచ్చినవిషయములనుగురించి వారిచ్చిన నిష్పాక్షికఅభిప్రాయములు నాకునచ్చినవి. నేను తమిళుడను. కాబట్టి వారు తమిళ ప్రచురణములకుచేసిన సహాయము నుగ్గడించుచున్నాను. ఈశ్వరుడు శ్రీశాస్త్రుల వారికి చిరాయురైశ్వర్యములను ప్రసాదించునుగాక! వీరు త్రిలిఙ్గపత్రిక స్వర్ణోత్సవముకూడ తిలకింతురుగాక!

# భారతదేశ సంపద

**శ్రీ వేదురుమూడి వేంకటకృష్ణరావుగారు, బి. ఏ., మదరాసు.**

వ్యక్తులకువలెనే మానవజాతులకుఁగూడ నొక్కొకగుణసముదాయమును ప్రత్యేక స్వభావముగ భగవంతుఁ డనుగ్రహించియున్నాడు. ఆంగ్లజాతికి లోకజ్ఞానము, కార్యపరత, ధైర్యసాహసములు, స్వజాతీయాభిమానము, సహిష్ణుతయును ఉగ్గుపాలతో అలవడినసుగుణములు. ఇక్లేపరాసుదేశీయులకు లలితకళలయందు ప్రతిభ, రణరంగమందు శత్రువునకు వెన్నుఁజూపని అప్రతిమానశౌర్యము, విశ్వమానవసౌభ్రాతృత్వమును నైసర్గికగుణభూషణములు. ఇఁక జర్మనులన్ననో నిరాడంబరజీవనమునకును, నిర్మాణకౌశలమునకును, దృఢసంకల్పమునకును, కుశాగ్రబుద్ధికిని, పాలకాధీనచిత్తవృత్తికినిఁ బెట్టినదిపేరు. మొత్తముమీఁద పాశ్చాత్యులదృష్టి లౌకికము.

లోకోద్ధారకులలో మహోన్నతస్థానమలంకరించు దివ్యప్రేమమూర్తి, జీససుప్రభుని పరాకాష్ఠవారిమానసికాకాశమున మెఱపువలె మెఱసి అంతర్ధానమయ్యెనేకాని, శాశ్వతతేజమును కలిగింపలేకపోయెను. విషయసుఖమే ప్రధానముగా నెంచి, బహిర్ముఖిని లక్ష్యముగాఁగొని, నిరంతరమింద్రియభోగములకై కృషిసలుపుచిత్తమునుండి ప్రాణపోషకములగు శాంతి, కరుణరసముల నపేక్షించుట, పనికిమాలినచవిటిపఱ్ఱలో మేలగుధాన్యసస్యములకై వెదకుటవంటివి. అనిత్యమును నిత్యముగను, అంధకారమును వెలుగుగను, దుఃఖమును సుఖముగను భావించుటకంటె నెక్కువప్రమాదకరమైన దుస్థితి మానవబుద్ధికి కలుగనేరదు. ఒకసారి యిట్టిభ్రాంతికి లోనైనబుద్ధి, అసూయ, కామ, క్రోధాదిదుర్గుణకలుషితమగుటకు ఎంతకాలమోపట్టదు. ప్రపంచమహాయుద్ధములన్నియు ఈదుర్గుణఫలితములుకావా?

అయినను దారుణయుద్ధములు, జాడ్యములు మొదలగునరిష్టములెల్ల నిర్హేతుకదయామయి, జగజ్జననియు నగుపరశక్తి మానవజాతికి చేయుచికిత్సలు, విషపదార్థములగురస, గంధకాదులదుష్టస్వభావమును బోఁగొట్టుటకు వైద్యులు పెట్టుపుటములవంటివి. పుటము పెట్టినను దుర్జనుఁడు మారడని సామాన్యలోకోక్తి. ఇది సాధారణమనుష్యులనిరాశను సూచించునేకాని, నిజముకాదు; ఒకపుటముతో మారకపోయిన నూరుపుటములైనను పెట్టఁబడి దుర్జనుడు తప్పక సజ్జనుడుగా మార్చబడును. శ్రీపరమేశ్వరీదయామహిమకు సాధ్యము

కానిదేది? వాల్మీకివంటిదారిదోపిడిదొంగ, నిరక్షరకుక్షి క్రూరాత్ముఁడు కవికోకిలమై, ముని లోకభూషణమై, అజ్ఞానాంధకారసాగరమున దారికానక ప్రాకులాడుజీవకోటికి తారకజ్యోతియై ప్రకాశింపఁడా? పురాణయుగమునకుఁబోనేల? చారిత్రకకాలీకులగు తులసీదాసు మున్నగుసాధుపుంగవు లెందఱులేరు? ఆంధ్రదేశభాగ్యరాశియైన వేమనయోగీంద్రుని జీవిత రహస్యమేమి? ఇంతవర కెందుకు? మొన్న మొన్నటి సుజ్ఞానరత్నఖనియని చెప్పఁదగిన శ్రీమదద్భుతానందస్వామివిషయ మొక్కటియే యిందుకు మారులేనిఋజువు కాదా?

శ్రీరామకృష్ణపరమహంసకడకుఁ బోవునప్పటికి ఈమహనీయునకు ఎనిమిదేండ్లమాత్రమే వయస్సు. అక్షరజ్ఞానమైనను లేదు. కనీసము వంగభాషను చదువుట, వ్రాయుటనైన నితఁడు నేర్చియుండుట మంచిదియని తలఁచి, పరమహంస యీయనకు వంగభాషావర్ణక్రమమును బోధింపయత్నించెను. కాని యీబాలుడు మూడు నాలుగునాళ్లకుగూడ నొకయక్షరమునైన సరిగవ్రాయఁజాలకుండెను. ఇంతతో నీతని అక్షరాభ్యాసమును, విద్యయు ముగిసినవి. అయిననేమి? ప్రత్యక్షసర్వజ్ఞుఁడగుగురుదేవుని అవ్యాజదయామృత మీధన్యజీవిబుద్ధిపై వర్షింప నారంభించెను. ఫలితము, గడ్డిపోచకూడ మొలవని యిసుకయెడారి సర్వజనమనోరంజకమైన నందనోద్యానవనమయ్యెను. ఏభాషాజ్ఞానముగాని లవలేశమైనను లేని ఈవిద్యావిహీనుఁడు, తనచెంత నెవ్వరైన భారత, భాగవత, రామయణాదిపురాణములను గాని, భగవద్గీతనుగాని, ఉపనిషత్తులనుగాని చదువుచుండినయెడల, ఆయాగ్రంథములందలిసారమును, సుప్రసిద్ధభాష్యకారుల వ్యాఖ్యానవిశేషములతోఁగూడ అనర్గళమగు మృదుమధురవాక్ప్రవాహమున వెలువరించును. ఈచిత్రమునుజూచి, పూజ్యపాదులగు శ్రీవివేకానందస్వాములవా రీయనకు 'అద్భుతానంద' యని పేరుపెట్టి తనగురుభగవానుని మహిమాతిశయమునకు ఈ'లాటు' ప్రబలనిదర్శనమని సెలవిచ్చియున్నారు.

ఇట్టివిజ్ఞానమే భారతదేశశాశ్వతసంపద. నేటి అర్థశాస్త్రవేత్తలు వెండి, బంగారులే సంపదయందురు. భూగర్భమున నడగియున్న యీలోహములు భూకంపము మొదలగు నని వార్యకారణములవలన తారుమారై మానవులకు దొరుకకపోవచ్చును. ఒకవేళ దొరికినను మితిమీరి యొక్కరివశమైనచో, నెన్నియో అనర్థములకు గారణముకావచ్చును. భారతదేశ మేనాడో పరధనాపేక్షను, పరరాజ్యకాంక్షను విడనాడి, విజ్ఞానసంపద కాలవాలమై, తన్నాశ్రయించినమానవులనెల్ల, వర్ణమతభేదములఁబాటింపక స్వకీయసంతతినివలెనే పోషించుచున్నది. ఇందేజాతియైనను ఈవిశ్వమాతృప్రేమాదర్శమునకు భంగకరముగ దురహంకారప్రేరితమై సర్వాధికారమునకును, స్వలాభమునకును దలపెట్టినదా, నేడో రేపో దాని

కాయుపుమాడుట నిశ్చయము.. వివిధజాతులవారు పరస్పరవైషమ్యములను మాని శాంతి సుఖములతో జీవించుటకు మాతృప్రేమమయమైన యీవిజ్ఞానము తప్ప వేఱే శరణము లేదు. ప్రపంచశాంతిప్రతిష్ఠాపనామహోత్సవమునకు పావనభారతదేశమే కళ్యాణమంటపము కాఁగలదు. ఇది దైవసంకల్పముగఁ దోఁచును. ఖండాంతరములందు భారతవిజ్ఞానామృతజ్యోతిని బ్రసరింపఁజేయుటే, నేటిశ్రీరామకృష్ణావతారప్రయోజనము. దీనికొఱకె కొంద ఱోమహాత్ములు తమజీవితములను ధారవోయుచున్నారు. ఇట్టివిజ్ఞానధనమును తమకు అందుబాటులోనుంచిన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు ఆంధ్రులకు చిరస్మరణీయులు. పితృవాక్యపరిపాలనానిరతులై, ధర్మవర్తనులై తండ్రిగారియుద్యమమును జయప్రదముగా నిర్వహించుచున్న శ్రీవావిళ్ల వేంకటేశ్వర్లుగారికి పరమేశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యముల నొసంగును గాక!

**శ్రీ రావుబహదర్ ఎమ్. వేంకటరామయ్యగారు, రిటైర్డుజిల్లాజడ్జి, త్యాగరాయనగర్, మదరాసు:—**

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులగారినిగురించి తగినప్రశంసజరుపుట త్రిలిఙ్గరజతోత్సవమునకు నాందివంటిది. శ్రీశాస్త్రులవారు ఆంధ్రదేశసేవ చేయుట అందు ఉపయోగించినఉపకరణములందు త్రిలిఙ్గపత్రిక ఒకటి. తెనుగులోని రమణీయమైన సారస్వతమును ఆనందప్రదమైనసంస్కృతమునకు దివ్యవాఙ్మయమును తెనుగు భాషాపుత్రులకు ఇంతసుళువుగాదొరకుటకాని అర్థమగుటకాని వారిమూలకముగా కాక ఇంకొకరీతిని జరిగియుండజాలదు. అతడు ముద్రించిననిరాక్షేపణీయములైన గ్రంథములకొన్నిటికి ఆక్షేపణకలిగినప్పుడు వారికికొంతబాధకలిగినదనుకొందును. కాని వారికార్యమునందలి ధర్మముచేతనే వారు వాటినియెదుర్కొనఁగలిగినారు.

వీరిని నేను చాలకాలముగ నెఱుగుదును. వీరిపై నాకొకఆక్షేపణమాత్రమున్నది. వీరినమ్రత మితిమీరినది. వీరియౌదాసీన్యమునశింపరానిది. ఇటువంటివాడుమద్రాసుప్రజాహితజీవనమున మాణిక్యముగా నుండదగినవాడు. మునిసిపలుపరిపాలనయందు అనుభవముకలిగి సాత్త్వికమైనను అభివృద్ధికరమగుఅభిప్రాయములు కలవాడై త్రిలిఙ్గ, ఫెడరేటడ్ ఇండియాపత్రికలయజమానియైన శ్రీశాస్త్రులుగారు ప్రజాప్రబోధమొనర్చి ప్రజాభిప్రాయమునుదీర్చుటయందు చాలాపనిచేసినారు. గణనీయమైనవారికృషిప్రయత్నములు ఇతోధికముగా ఫలమొందుగాక! అని కోరుచున్నాను.

# హిందూమత ప్రమాణములు

**శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.,**

ప్రిన్సిపాలు, సంస్కృతకాలేజీ, కొవ్వూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

హిందూశబ్దము మతపరముగ మొట్టమొదట వాడబడినపుడు దాని కేయర్థముండెనో యాయర్థముననే అది ఈవ్యాసములో ప్రయోగింపబడినది. ఆమతమునే చారిత్రకులు "బ్రాహ్మణమత" మని వ్యవహరించిరి. ఇది అత్యంతము ప్రమాణనిబద్ధమైనది.

ఈమతమునకు పునాది వేదము. "వేదోఽఖిలో ధర్మమూలం" సమస్తవేదము ధర్మమునకు మూలము అని మనుస్మృతి 2-6 చెప్పుచున్నది. వేద మనంతమగుటచేతను 'అనంతా వై వేదాః' అని వేదమే చెప్పుచున్నది కదా! ప్రస్తుతము నిలచియున్న ఋగ్యజుస్సామాథర్వశాఖలమంత్రబ్రాహ్మణారణ్యకోపనిషత్తులు పరిమితములగుటచేతను, నేటి వేదములలోని ధర్మములను తెలిసికొనిన చాలదు. లుప్తమైన వేదములోని ధర్మములనుగూడ తెలిసికొనవలెను.

లుప్తమైనవేదములోని ధర్మములను మనకు తెలుపునవియే స్మృతులు. వానిని మహర్షులు రచించిరి. ఆయావేదభాగములు లుప్తములై పోవుచు—పఠనపాఠములనుండి తప్పిపోవుచు—నుండినకాలములో దూరదృష్టిగలమహర్షులు మానవులయందు తమకుగలఅవ్యాజకరుణచే నావేదభాగములలోని ముఖ్యవిషయములను తీసి తమస్వంతమాటలలో వానిని తేటతెల్లముగను సంగ్రహముగను రచించి వాని తమశిష్యులకు బోధించి వైదికధర్మములను లోకములో నిలబెట్టిరి. ఈమహర్షులు కేవలము లుప్తములై పోవుచున్న వేదములలోని ధర్మములనే చెప్పలేదు. ప్రచారములోనున్న వేదభాగములోని ముఖ్యధర్మములను గూడ తమగ్రంథములలో వ్రాసియున్నారు. కొందరు వేదముల అధ్యయనము చేయలేక పోవచ్చుననియు అధ్యయనముచేసియు అందలిధర్మరహస్యముల నెఱుగలేకపోవచ్చుననియు వారిట్లుచేసిరి. అంతియే కాదు; ఒకేవేదములోని ఒకశాఖకు చెందినవా రావేదములోని మరొకశాఖ నధ్యయనము చేయకూడదనునిషేధము మనశాస్త్రములలో నుండుటచే నొక వేదములోని ఒకశాఖవారికి నావేదములోని మరొకశాఖయందలి ధర్మములుబోధపడుటకై కూడ ఋషులీధర్మగ్రంథములను రచించిరి. ప్రధానముగ దీనిప్రయోజనము లుప్తములైన వేదభాగములలోని ధర్మములను లోకమున కందజేయుటయే. వేదములకు వ్యతిరిక్తముగ

మాత్రము వీరు తమ గ్రంథములలో నేమియు చెప్ప దలంపలేదు. వీరేమాటను జెప్పినను వేదమును దృష్టిలో నిడికొనియే చెప్పిరి. ఇట్లు వేదమును స్మరించుచు చెప్పినగ్రంథములు గనుకనే వీనికి "స్మృతులు" అని పేరు వచ్చినది. "శ్రుతిం పశ్యన్తి మునయః స్మరన్తి చ తథా స్మృతిం" మునులు వేదమును చూతురు. అట్లే స్మృతిని స్మరించుచున్నారు.

అని స్మృతికారులే చెప్పిరి. నేటికిని ఈగ్రంథములకు నిలచియున్న స్మృతి అను నామమే దీనిసత్యమును మనకు తెల్పుచున్నది. కావున నొకధర్మము స్మృతిలో గన్పట్టు చున్నచో దానికి ప్రస్తుతవేదములో నాధారము గన్పట్టకపోయినను లుప్తమైన వేదభాగ ములో నాధారముండునని మనమూహించుకొనవలెను. శ్రుతియొక్కయడుగుజాడలలోనే స్మృతి నడచుచుండును. ఈయంశమును కాళిదాసు తనరఘువంశములో నుదాహరణముగ దీసి సుదక్షిణాదేవి నందినీధేనువుయొక్క అడుగుజాడలలో పోవుచు దానిని శ్రుత్యర్థ మును స్మృతి యనుసరించిన ట్లనుసరించెనని వ్రాసినాడు.

"మార్గం మనుష్యేశ్వరధర్మపత్నీ శ్రుతేరివార్థం స్మృతిరన్వగచ్ఛత్."

ఈవిధముగ బయలుదేరినగ్రంథములే గౌతమధర్మసూత్రములు, వసిష్ఠధర్మసూత్ర ములు, ఆపస్తంబధర్మసూత్రములు, మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, పరాశరస్మృతి మున్న గునవి. వేదమునకు పిమ్మట వేదమంత్రప్రమాణగ్రంథములీస్మృతులు. తత్కర్తలు వేద విదులై పూర్ణముగా వేదోక్తమైనజీవితము నడపుకొనుచు బ్రహ్మసాక్షాత్కారమునొందిన వారనునదియే ముఖ్యవిషయము. బుద్ధిచేతను ఆచరణముచేతను వేదము నెఱిగినవారగుట చేత వీరిగ్రంథములు వేదమునకు పిమ్మట ప్రమాణములని చెప్పబడినది. వీరిమాటలేగాక వీరిచేష్టలు గూడ మన కనుసరణీయములే. "తద్విదాంచ స్మృతిశీలే" అని గౌతమధర్మ సూత్రము నుడువుచున్నది.

ఈస్మృతికర్త లెంతమహాజ్ఞానులైనను మానవులే కావున వారివాక్యము సాక్షాదీశ్వర వాక్యమైన వేదముతో సమప్రమాణము కాజాలదు. ఈయంశమును స్మృతికర్తలే మనకు చెప్పియున్నారు. వీరహంకారమమకారరహితులైన మహాజ్ఞానులు కావుననే ఈవిధముగ వేదఘనతను తమన్యూనతను చెప్పుకొనిరి. అంతియే కాదు. ఒకఋషి చెప్పినయంశమునకు మరొకఋషి చెప్పినది భిన్నముగనున్నచో నట్టిపట్ల తనమాటనే నమ్మవలెనని యేఋషియు చెప్పుటలేదు. అట్లు భిన్నములైనవానిలో దేనినైన ననుసరింపవచ్చునని యే స్మృతులు చెప్పు చున్నవి. "ఇద్దరు ఋషులుచెప్పినది భిన్నముగనున్నదికావుననే నిందెవ్వరి ననుసరింపను" అని

చెప్పుట తుచ్ఛమనియే స్మృతులు కంఠోక్తిగ చెప్పుచున్నవి. మహర్షులు తుల్యబలురు. ఒకే స్మృతి రెండుమార్గములు సూచించుచో అందేదో నొకటి యెట్లనుసరింపదగినదో అట్లే రెండు భిన్న స్మృతులలో రెండుమార్గములు సూచింపబడుచో నందేదైన ననుసరింప దగినదే. దీనినే ఋషులు "తుల్యబలవిరోధే వికల్పః" (గౌ. ధ. సూ. 1-4) అని స్పష్టపరచియున్నారు.

అట్టి వికల్పములు గలస్థలములలోగూడ మనము కేవలము స్వాతంత్ర్యము వహింప నక్కరలేదనియు అందేపక్షము మనకులగోత్రములలో మనపెద్దలచే నాచరింపబడుచున్నదో దానినే మన మనుసరింపవలెననియు సంప్రదాయజ్ఞులు నుడువుదురు. ఒకస్మృతి యొకవిధము గను మరొకస్మృతి మరొకవిధముగను చెప్పుచుండుటచే స్మృతుల కన్నిటికిని సున్నచుట్ట వలెననునాధునికవాదము సర్వస్మృతిగర్హితము. స్మృతులన్నియు ప్రమాణములే యైనను మనుస్మృతి లోకముచేతను స్మృతికర్తలచేతను పురాణేతిహాసప్రణేతలచేతను విశేషగౌర వమును పొందినది. ఇందులకు రెండుకారణములు గలవు. 1. ఇంత సమగ్రముగ ధర్మమును వివరించుస్మృతి మరొకటిలేదు. 2. వేదార్థము నింతచక్కగా వివరించినస్మృతి మరొకటిలేదు. ఈ రెండవకారణముచేతనే మనుస్మృతికి ప్రాధాన్యమని బృహస్పతిస్మృతి నుడువుచున్నది.

"వేదార్థోపనిబంధృత్వాత్ప్రాధాన్యం తు మనోః స్మృతా."

సామాన్యముగా మనుస్మృతియే సర్వోత్తమమైనను కలియుగములోని విశేషధర్మ ములను చెప్పునది పరాశరస్మృతి అగుటచే దానికి కలియుగములో ఆవిధమైన ప్రాము ఖ్యము వచ్చినది. కలియుగ ప్రత్యేకధర్మములలో తప్ప మిగిలినవిషయములలో మనుస్మృతి కగ్రస్థానము నిలచియేయున్నది. కృతత్రేతాద్వాపరకలియుగములలోని ప్రత్యేకధర్మములను తెల్పుటలో నెన్నదగినవి క్రమముగ మను, గౌతమ, శంఖలిఖిత, పరాశరస్మృతులని పరాశర స్మృతి చెప్పుచున్నది.

"కృతేతు మానవాః ప్రోక్తాః త్రేతాయాం గౌతమాః స్మృతాః,
ద్వాపరే శంఖలిఖితా కలౌ పారాశరీ స్మృతిః"

ఒక్కవిషయమును జ్ఞప్తియం దుంచుకొనవలెను. పరాశరుడు కలియుగమునకై ధర్మ శాస్త్రమును రచించినాడన అతడు వైదికధర్మమును మార్చినాడని కాదు. పూర్వయుగము లలో నధర్మమైనదానిని దేనిని అతడు ధర్మమనలేదు. పూర్వధర్మమునే ప్రజ లాచరించువిధ మును చూపుటకై కొన్నికట్టుబాట్లుచేసినాడు. ఏస్మృతికర్తయుకూడ ధర్మమునుమార్చుటకు పూనలేదు. అట్లు పూనువానికి స్మృతిచేయు అధికారమే పోవును. బుద్ధిచేతను ఆచరణము

చేతను వేదధర్మమును తెలిసికొనినవాడే స్మృతికర్త యగుట కర్హుడని పైనచూచితిమిగదా. మరియు మన్వాదిస్మృతులుగూడ వేదార్థబోధకములే అని కూడ చూచియుంటిమి గదా. కావున వేదములు, మనుస్మృతి, పరాశరస్మృతి, గౌతమసూత్రములు మున్నగు సమస్తధర్మ గ్రంథములను పూర్తిగ ననుసరించుచున్నవాడు మాత్రమే స్మృతికర్త కాగలడు. పరాశరాదులందరు నట్టి శ్రుతిస్మృత్యుక్తజీవితమును గడపినవారే కాని తద్విరుద్ధముగ నడచుచు తమకు తోచినధర్మములను చెప్పినవారు కారు.

అతీంద్రియవిషయద్రష్టలైన మహర్షులు పైన తెల్పబడిన ధర్మశాస్త్రగ్రంథములనేకాక ఇతరములను గూడ రచించియున్నారు. సాధారణముగ స్మృతిశబ్దము ధర్మశాస్త్రములకే చెల్లుచున్నను మహర్షులు వ్రాసినగ్రంథముల నన్నిటినిగూడ స్మృతులని వ్యవహరించుట కలదు. ఋషులచే రచింపబడిన ఈగ్రంథము లెవ్వియనః శ్రౌతసూత్రములు, గృహ్యసూత్రములు, తంత్రగ్రంథములు, మంత్రశాస్త్రగ్రంథములు, ఆగమములు, ఇతిహాసములు, పురాణములు మున్నగునవి. శ్రుతిస్మృతులలో సూచింపబడిన సోమయాగాదిక్రతువులు. దర్శపూర్ణమాసేష్టులు మున్నగువానివిధానమును తెల్పునవి శ్రౌతగ్రంథములు శ్రుతిస్మృతి సూచితములైన జాతకర్మనామకరణాదికర్మకాండవిధానమును తెల్పునవి గృహ్యసూత్రములు. సులభమైనమార్గములో దేవతలను మెప్పించి వారివలన ఐహికాముష్మికలాభములను మోక్షమును గూడ బొందుటకు గలవిధానమును వివరించునవి మంత్రతంత్రగ్రంథములు. దేవాలయనిర్మాణనిర్వహణవిధానములను తెల్పునవి ఆగమములు. సృష్టిక్రమమును ఈశ్వరమహిమను ప్రధానముగ తెల్పునవి పురాణములు. స్మృతులలో నాదేశింపబడిన ధర్మములు మానవునిజీవితములో నెట్లనుసరింపబడవలెనో భిన్నధర్మములకు సంఘర్షణ కల్గినపుడు మానవు డెట్లు ప్రవర్తింపవలెనో అనునంశములను విపులముగ దెల్పుచు ధర్మమునం దాసక్తియు అధర్మమునందు ద్వేషమును పాఠకునకు గల్గించువిధమున రచింపబడినవి ఇతిహాసపురాణములు.

హిందూమత మింతవఱకు నీవిధముగ నిలువగల్గుటకును ఇకముందుగూడ నశింపదని ఆశించుటకును కారణములైనవి ఇతిహాసపురాణములు. వైదికధర్మముపట్ల మానవుని బుద్ధిని బలాత్కారముగ త్రిప్పి దానియందు మానవుడు ప్రవర్తించునట్లు వానిని నడపునట్టి కొరడాలవంటిగ్రంథములు ఇతిహాసపురాణములు.

ప్రపంచములోని క్రైస్తవమహమ్మదీయాదిమతములన్నియు సత్కర్మలనే ఆదేశించుచున్నవి కాని దుష్కర్మల నాదేశించుట లేదు. మతములన్నియు సత్యము పల్కవలెననియు,

వ్యభిచారముకూడదనియు నుడువుచున్నవి అట్లయినను సత్యసంధత, భక్తి, పాతివ్రత్యము మున్నగునుత్కృష్టధర్మములు హిందు దేశములో నున్నంత హెచ్చుగ ప్రపంచములో మరెచ్చటను లేవు. నేటికి 1500 సంవత్సరముల క్రిందట మనదేశమునకువచ్చిన ఫాహియాన్ అను ఒకచైనాదేశీయు డిట్లు వ్రాసియున్నాడు "హిందువులెల్లరు సత్యసంధులగుటచే వారిగృహముల కెన్నడును తాళము లక్కరలేదు. ఋణాదికములకు పత్రములు గూడ వారికక్కరలేదు." అరియన్ అను నొకగ్రీసుదేశస్థుడు "హిందువు డెన్నడు నసత్యమాడినట్లు లేదు" అని వ్రాసియున్నాడు. మనదేశపువర్తకులతో పూర్వకాలమున వ్యవహారముచేసిన విదేశవర్తకులు "హిందుదేశములో వర్తకులు గూడ అసత్యమాడ" రని యాశ్చర్యముతో నుడివినారు. ఈవాక్యములలో కొంత అతిశయోక్తి యుండవచ్చునుగాని జాతిమొత్తముపైన భారతీయు లెంత సత్యసంధులో దీనివలన తెలియగలదు. మతములన్నియు సత్యసంధతనే బోధించుచున్నను నొకహిందుమతస్థులే హెచ్చుగ సత్యసంధులగుటకు కారణము మనమతములోనున్న ఇతిహాసపురాణములవంటిగ్రంథములు ఆమతములవారికి లేకుండుటయే యని చెప్పవలెను.

మానవు నసత్యమునుండి తప్పించుటకు హరిశ్చంద్రునికథ ఒక్కటియే చాలును. గాంధీమహాత్మునిజీవితమువలన నీయంశము వ్యక్తము కాగలదు. గాంధీగారిసత్యసంధతకు పునాదివైచినది హరిశ్చంద్రకథయని వారిస్వీయచరిత్రవలననే తెలియుచున్నది. బాల్యములో మహాత్ము డొకనాడు హరిశ్చంద్రనాటకమును జూచినాడు. మరునాడాతడు తాను గూడ హరిశ్చంద్రునివలె సత్యవ్రతము నేలపూనరాదని తలచి హరిశ్చంద్రునివంటి మహారాజే ఘోరమైనబాధలను సత్యసంరక్షణమునకై పూనగల్గినపుడు తనకు సత్యాచరణ మసాధ్యము కాదని నిశ్చయించి నాటినుండియు సత్యవ్రతము నారంభించినాడు. గాంధీమహాత్మునివలె నింక నెన్ని వేలమందిని మన ఇతిహాసపురాణములు మార్చినవో చెప్పలేము.

ప్రహ్లాదచరిత్రను చదివినపిమ్మట మహాభక్తులుగ మారినవా రెందరు లేరు? మానవునిచిత్తవృత్తిని మార్చుటలో గారడివానివలె పనిచేయగలది ప్రహ్లాదచరిత్ర. నేటికిని మనదేశములో నితరదేశములన్నిటిలోను గలపి కన్పట్టనంతమంది మహాభక్తులు, విరాగులు, సాధువులు, సన్యాసులు గన్పట్టుటకు కారణ మిట్టిపురాణగాథలే యనుటలో నతిశయోక్తి లేదు.

నేటి భారతీయస్త్రీలకు గల పాతివ్రత్యము ప్రపంచములో నేజాతిస్త్రీలకును లేదని యెల్లరు నంగీకరించుచున్నారు. పాతివ్రత్య మనునుత్కృష్టధర్మమును లోకములో నింత

దృఢముగ నిలబెట్టినవి ఇతిహాసపురాణములే. సీతాసావిత్రీదమయంత్యాదిసతీమతల్లుల పవిత్రనామమును స్మరించి వారిచరిత్రలను నిత్యము పురాణరూపముననను నాటకహరికథాది రూపముననను వినుచుండుటచేతనే మనసతీమతల్లులు లోకమున కాదర్శప్రాయమగువిధమున తమశీలమును నడపుకొనుచున్నారు. ప్రతిస్త్రీయొక్క హృదయసీమయందును రాజ్యము చేయుచు నామెచిత్తవృత్తులను నడపించునది సీత. ప్రతిస్త్రీకిని కష్టాంధకారములో నాశా జ్యోతిని కన్పఱచువారు సావిత్రి, చంద్రమతి మున్నగుపావననారీమణులు.

హిందూధర్మరక్షణవిషయమున ఇతిహాసపురాణములప్రభావ మింతింతయని చెప్ప జాలము. విధినిషేధరూపమున నెన్నెన్నిధర్మములు స్మృతులలో బోధింపబడగలవు? కొన్ని ప్రత్యేకక్లిష్టపరిస్థితులలో కొన్ని ధర్మసూక్ష్మసందేహములు పొడసూపుచుండును. ఆధర్మ సూక్ష్మములు మానవునిజీవితము నుదాహరణముగ తీసికొని కథారూపమున ప్రదర్శించి నపుడే బోధపడగలవు. అట్టి ధర్మసందేహములను ప్రదర్శించుటకును, తీర్చుటకును ఇతిహాస పురాణములే తగినవి కాని ధర్మశాస్త్రగ్రంథములలో వానికన్నిటికిని తావుండదు. శ్రుతి స్మృతులలో నున్నసమస్తముఖ్యధర్మములును ఇతిహాసపురాణములలో లభింపగలవనుటలో నతిశయోక్తి లేదు. "ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్," అను వసిష్ఠస్మృతి వాక్యము దీనినే వెల్లడించును.

అందునను సమస్తధర్మరత్నములకును మహాభారతము సముద్రము. వేదమును చదు వుట కర్హతలేనిస్త్రీలు, శూద్రులు, సంస్కారరహితులైన ద్విజకులోత్పన్నులు వేదముల లోనిధర్మములను తెలిసికొనగల్గుటకై వ్యాసమహాముని ఈగ్రంథమును రచించినట్లు భాగ వతములోని యీక్రిందిశ్లోకములో చెప్పబడినది.

"స్త్రీశూద్రద్విజబంధూనాం త్రయీ న శ్రుతిగోచరా,
ఇతి భారతమాఖ్యానం కృపయా మునినాకృతమ్."

ధర్మ మపారము. మన కిపుడు లభించు శ్రుతిస్మృతీతిహాసపురాణవాఙ్మయ మపరి మితము. కావున శ్రుతిస్మృత్యాదులవలన కొన్నిధర్మములను తెలిసికొనుటకు వీలులే కుండుట సహజము. మహర్షులు వ్రాసిన ధర్మగ్రంథములు కొన్ని నశించియుండును. మరియు మహర్షులు కొన్నిధర్మములను గ్రంథస్థముచేయక స్వీయాచరణపూర్వకముగ పుత్రశిష్యా దుల కందచేసియుండిరి. ఆధర్మములే నేటికిని శిష్టాచారరూపమున గన్పట్టుచున్నవి. ఇవియు ప్రమాణములే. వేదశాస్త్రోక్తజీవితమును గడపుచు నిష్కాములై సంచరించు మహాపురుషుల నుండి సదాచారము గ్రాహ్యము.

కొన్ని దేశములలోను కొన్ని జాతులలోను, కొన్ని కులములలోను కొన్ని ఆచారము లుండును. ఆయాచారములు శ్రుతిస్మృతులకు విరుద్ధముగానిచో అవియు నాదేశ జాతికులములవారికి ప్రమాణములే యని గ్రహింపనగును. "దేశజాతికులధర్మాశ్చామ్నాయై రవిరుద్ధాః ప్రమాణం" అను గౌతమసూత్రము 11-20 ఈయంశమునే తెల్పుచున్నది.

ఇట్లు హిందూమతమునకు వేదము పరమప్రమాణము; వేదమునకు పిమ్మట స్మృతులు ప్రమాణము; అట్లే స్మృతిసమములైన శ్రౌతసూత్ర, గృహ్యసూత్రాదులు, ఇతిహాసపురాణములు ప్రమాణము; పిమ్మట సదాచారము ప్రమాణము. పైఅంశములను జూడ మానవున కేమియు ధర్మనిర్ణయస్వాతంత్ర్యము లేదని తెలియగలదు. శ్రుతిస్మృతిసదాచారము లేవిషయమై యేమియు చెప్పుటలేదో ఆవిషయములలో మాత్రమే మానవుడు తన ఇచ్ఛవచ్చినట్లు సంచరింపదగును. అట్టిపట్ల తనకు మనస్తుష్టి కల్గువిధమున ప్రవర్తింపక వ్యర్థముగ శ్రమకల్గునట్లు ప్రవర్తించుచో అది అధర్మమే యగును. వృథాక్లేశము తమోలక్షణమని భగవద్గీతాదిగ్రంథములు చెప్పుచున్నవి. అట్లే శ్రుతిస్మృతిసదాచారములు వికల్పమును వదలినపట్ల మానవుడు తన కేపక్షము నాచరించుట సుఖముగా నుండునో ఆపక్షమునే తీసికొనవలెను. కానిచో నదియు తమోగుణమగుటచే ఆత్మతుష్టియు ధర్మలక్షణముగ చెప్పబడినది. ప్రమాణముల ఈక్రమము మనుస్మృతిలో నిట్లు చెప్పబడినది.

"వేదః స్మృతిస్సదాచారః స్వస్యచ ప్రియమాత్మనః,
ఏతచ్చతుర్విధం ప్రాహుః సాక్షాద్ధర్మస్య లక్షణమ్" (2-13)

పండితులందరు ఒకపరిషత్తుగ నేర్పడి నేటికాలమున కవసరమగు మార్పులను ధర్మములో గావింపవలెననియు అట్టిపరిషత్తులు పూర్వము కూడ నుండినట్లు మన్వాదిస్మృతుల వలననే తెలియుచున్నదనియు నేటివారు కొందరు చెప్పుచున్నారు. ఇది భ్రాంతిమూలకము. మనువు శిష్టపరిషత్తులను పేర్కొనినమాట వాస్తవమేకాని ఆశిష్టపరిషత్తునకు ధర్మములో మార్పుచేయుట కధికారములేదని మనువే చెప్పుచున్నాడు. మనువు ధర్మములను చెప్పి గ్రంథాంతమందు తాను చెప్పినవికాక ఇంకను ధర్మములుగలవనియు, తాను పూర్ణముగ అన్నిధర్మములను చెప్పినట్లు భావించి యెవ్వరును మనుస్మృతిలో చెప్పబడనిపట్ల స్వేచ్ఛగ ప్రవర్తింపవచ్చునని తలంపరాదనియు, ఇతరధర్మములను వేదశాస్త్రవిదులై నిష్ఠాయుక్తులైన పండితుల నడిగి తెలిసికొనవలెననియు చెప్పినాడు. అట్టి చెప్పబడనిధర్మములను తెలిసికొనుటకే శిష్టపరిషత్తు లుపకరించునుగాని ధర్మమును మార్చుటకుకాదని ఈక్రింది శ్లోకము వలన తెలియగలదు.

"అనామ్నాతేషు ధర్మేషు కథంస్యాదితిచేద్భవేత్,
యం శిష్టాబ్రాహ్మణా బ్రూయు స్సధర్మస్స్యాదశంకితః." మను. 12-108.

ఇచట "అనామ్నాతేషుధర్మేషు" అనుపదములకు "చెప్పబడనిధర్మములలో" అని యర్థము. వేదశాస్త్రములలో చెప్పబడినధర్మములను మార్చుట కెవ్వరికి నధికారములేదు. ఇదియే ధర్మముయొక్క కట్టుబాటు. ఇట్టి నియమములేని విశృంఖలవృత్తి అధర్మమని సమస్తహిందూధర్మగ్రంథసాగరమును మథింపగ దేలినసారామృతము.

---

**శ్రీ రావుబహదర్ యన్. చంద్రశేఖరయ్యరు, జిల్లాజడ్జి, సేలం:—**

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ ముఖ్యముగా తెనుగువాఙ్మయమునకు జేసినసేవ ఇటీవలదక్షిణఇండియాచరిత్రలో అప్రతిమానము. వారు సంస్కృతమును వ్యాప్తినొందించుటకై చేసినప్రయత్నమును అట్టిదే. అందరికి అందుబాటులో నుండునట్టిధరలకు వారు అపూర్వమైనవివిధగ్రంథములను సులలితములైనవ్యాఖ్యానములను దివ్యమైనభాషాంతరీకరణములను ప్రజలకుఅందజేసినారు. ప్రాచీనకాలపుప్రసిద్ధకవులనుమాత్రమే వీరుఅభిమానించిరని అనుకోవలదు; మంచివచనము కవిత వ్రాయగలవారిని చక్కని పరిశోధనపాండిత్యముగలవిమర్శకులను అనేకుల వీరు తమహృదయమునకునచ్చిన సారస్వతసేవచేయుటలో చక్కగా ప్రోత్సహించినారు. ఇటీవల విలువగలవియు ముఖ్యమైనవియునైన తెనుగుప్రచురణములలో నూటికి యెనుబదివంతులు ఈసంస్థవారు ప్రకటించిరనిన అతిశయోక్తికాదు. పవిత్రమైనమంత్రములు ప్రార్థనములు నామావళులు చిన్నచిన్నపుస్తకములుగ వీరువేసినవి దక్షిణఇండియాలో రమారమి ప్రతిఇంటిలోను ఉన్నవనవచ్చును. ఈసంస్థకు ప్రస్తుతము యజమానిగానుండునట్టి శ్రీవావిళ్ల వేంకటేశ్వరులుగారు చాలాసమర్థుడు, నిర్మాణకర్మపరుడు. వివేచనాయుతమగుపాండిత్యమును నిశితమగు వ్యాపారప్రతిభయుచేరి ఇతనిని తెలుగుసారస్వతప్రపంచమున ఉన్నతపీఠమునందు ఉంచినవి. ఇతనికి రాజకీయములందును అభినివేశముకలదు. త్రిలిఙ్గ అనుతెనుగు వారపత్రికను, ఫెడరేటెడ్ఇండియాయను ఇంగ్లీషుపత్రికను వీరుబహుకాలముగ ప్రచురించుచున్నారు. వీరిరాజకీయములతో నాకుసంబంధములేదు. తెలుగుసంస్కృత వాఙ్మయములయెడల వీరికిగలఅభిమానాదరణములకు అందుచేత వీరుశ్రద్ధగ నెడతెగకుండ దేశమున వానివ్యాప్తికై చేయుచుండుకృషికి వీరియందు నాకునెక్కువ గౌరవము గలదు. వీరుచేయునట్టిసత్కార్యాచరణముసాగుటకు వీరికి చిరాయువు అగుగాక! కడచిననాళులకంటె ముందునాళులలో వీరిసంస్థ తరతమరీతిని వర్ధిల్లుగాక!

# పుణ్యకవ్రతము

(శంకరుఁడు గౌరీదేవికిఁ బుణ్యకవ్రతంబునుగూర్చి చెప్పుట.)

శ్రీ బ్రహ్మవైవర్తమహాపురాణము-గణేశఖండము-ప్రథమాశ్వాసము.

శ్రీ ధోమా వేంకటస్వామిగుప్తగారు,
శతావధాని, ఆంధ్రపండితులు, క్రైస్తవకళాశాలహైస్కూలు, మదరాసు.

శా. గౌరీ! నీకు శుభంబు గావుతను వక్కాణింతు నా పల్కు వి
స్తారానందముతో వినంగదె! జగద్వ్యాప్తింబునం దెల్ల పా
పారంభంబులు పాయ ముక్తిని ఫలంబందున్ సమస్తాభివాం
ఛారీతుల్ ఫల మానుపాయ మొకఁడున్ వాక్రుత్తు నీ కిమ్మెయిన్.

మ. హరి నారాధన సల్పి పుణ్యక మనన్ హర్షోందు సర్వాతిగ
స్ఫురణం బొల్చు వ్రతంబుసేయు మది సంపూర్ణోరుమాంగళ్యదం
బురుదోషాపహ మిష్టదం బొక సమగ్రోద్యన్మతిం జేయు మే
త్తెర నే విఘ్నము వచ్చినన్ గణన కేతేకుండఁ జేయందగున్.

మ. తొలుతం గొన్ని కఠోరకష్టదశలం దోతేరఁగాఁ జేసినన్
బలబుద్ధిన్ ముగియించువారి కఖిలప్రాంచన్మహాభీష్టంబు లె
ల్ల లలిం గూర్చి ముదంబు సంపదను బుత్త్రవ్రాతముం గూర్చుఁ జే
రెలమిం బున్నెము నీవ్రతం బొసఁగునో యేణాక్షి! నిక్కంబుగన్.

మ. నదులం గంగయు వేల్పులందు హరియున్ గాంతాజనంబందు నీ
వుఁ దగన్ వైష్ణవులందు నేనును గులవ్యూహంబునన్ విప్రుఁ డిం
కఁ దిథిశ్రేణి రమేశవాసరము వీఁకన్ జెట్లలోఁ గల్పకం
బుదితశ్రీ గనునట్లుఁ బుణ్యకము తా నొప్పున్ వ్రతాళిన్ గడున్.

వ. మఱియును.

చ. సుమములఁ బారిజాతమును జొప్పడు వారములందు భానువా
రము నిశ మేటి తీర్థనికరంబునఁ బుష్కరమున్ బుతుప్రతా

నమున వసంతముఙ్ మఱియు నమ్మఁగఁదగ్గ పదార్థబృందమం
దు మనసుఁ బంధ్లఁ జాతమును దోరపు గారవ మొందు నింటిరో!!

చ. తెలఁగును మాసపంక్తి మృగశీర్షము ద్రవ్యములందు రత్నముఙ్
లలితధురూపులందు మదనప్రభుఁడుఙ్ రుచి గల్గునట్టి వా
రల నినుఁడుఙ్ సుదృక్సునికరంబులలో శతరూపయుఙ్ బురం
బుల నల కాశియుఙ్ సుఖముఁ బూన్పెడి వారలఁ జంద్రముండు సి
ద్ధులఁ గపిలుండు శాస్త్రములఁ దొల్పలుకుల్ కడు మించు నంగనా!!

ఉ. వానరులందు మారుతియు వర్షములఙ్ భరతాఖ్యవర్షముఙ్
జేనుగఁ గిరితిఙ్ భృశము సల్పెడు వస్తువులందుఁ గైతయుఙ్
మానుగఁ దీర్ఘపాళిలను మహ్యామరానన మింక వ్యాప్తి కెం
తే నగు వానిలోఁ జదలుఁ దీఱును మించెడి నంగనామణీ!!

ఉ. అంగములందుఁ గన్నుసుక మందఁగఁ జేసెడి వానిలోన న
మ్మంగళదేవతాపతిని మానసమం దనుకొంట వైభవా
భంగతలందు శ్రీవరుని భవ్యకథానక మింక స్పర్శలం
దుం గొమరుఙ్ మఱిం గొమిరెనుం గయి నంటుట మించుఁ బొల్తిరో!!

సీ. హింసకుల ఖలుండు వృజినంబులఙ్ మిథ్య వృజినాఢ్యలను బుంశ్చలియును మిం త్రు
పుణ్యంబులను బుతముఁ దపంబుల హరిసేవ తపస్స్వలనజుండు వహి గదింత్రు
గవ్యాల నేయి భక్ష్యసువస్తువుల సుధ పుణ్యాదంబుల నీరము రహి గాంచు
పంటలఙ్ వరి మేలివన్నె గల్గిన వానిలోన బంగారమ్ము జేనుగాంచు
గీ. శుద్ధులం దగ్ని యిష్టవస్తువులను బ్రియ,భాషణము పక్షులను ఖగస్వామి యేన్గు
లందు వెల్లేన్గు యోగులయందు స్కందుఁ,డు సురమునుల నారదుఁడును బసవహింత్రు

సీ. తెలివి గలట్టివారలలో గురుండు గంధర్వులలోనఁ జిత్రరథుఁ డెసఁగుఁ
గబ్బంబులఁ బురాణ ముబ్బు ప్రవాహంబు గల్గిన వానిలోఁ గడలి మించు
సుకవులయందును శుక్రుఁ డోర్పు గలట్టి వారిలో ధారుణి మీఱుఁ గరము
మేల్పదవుల ముక్తి మేల్భాగ్యముల విష్ణుభక్తి పావనులందు వైష్ణవుఁ డగు
గీ. అక్షరంబులలోఁ బ్రణవాక్షరంబు, మంత్రములయందు శ్రీవిష్ణుమంత్రముఁ జదు
వరులయందు సరస్వతి పరఁగ బీజ,ములను బ్రకృతియు మించును బొలఁతిమిన్న!

సీ. అలరు ఛందముల గాయత్త్రి యతులలోఁ గుబేరుండు సామంబు వేదములను
    బాములలోపల వాసుకి గిరుల నీ పిత హిమవంతుండు విభవ మిచ్చు
    వారిలో శ్రీయు గోవర్గంబున సురభి తృణముల గుశలుఁ బర్విడెడువస్తు
    తతి మనం బక్షరవితతిన(న్+అ)కారంబు నదరుయంత్రముల శ్రీహరి శిలయును
గీ. మేలుగోరువారలఁ దంత్రి మేల్మిఁ బసుల, విష్ణుపంజరంబును జంతువిసరమందు
    సింగమును జీవుల నరుఁడుఁ జెట్ట జబ్బులందు మందాగ్నియును మించు నబల! వింటె!

గీ. ఇంద్రియంబులలో మనం బెచ్చు బలములందు శక్తి శక్తియుతంబులందు రంహ
    మికను స్థూలంబులవిరాట్టుఁ బ్రకటసూక్ష్మములను బరమాణువునుమించుజలరుహాక్షి!

చ. దితిసుతులందునుం బలియు దేవతలందు మహేంద్రుఁడున్ సమం
    చితజనులందుఁ గాంచనకశిప్వసురాత్మజుఁడున్ మహాశుగ
    ప్రతతి విరించిబాణము నరవ్రజమందును రామచంద్రుఁడున్
    వితతధనుర్ధరావళిని వ్రేల్మిడి లక్ష్మణుఁ డెచ్చునం దగున్.

చ. వితతరథాంగపాళిఁ గడుఁ బెచ్చు సుదర్శన మట్ల పుణ్యకం
    బతులితసద్వ్రతంబు సకలార్చితుఁడున్ సకలప్రదుండు స
    ర్వతతుఁడు సర్వసారుఁ డయి రాజిలు కృష్ణుని సర్వబీజ మ
    ద్ధి తనరఁ బోలు నిందులను దేనను సందియ మొప్ప దెంతయున్.

శా. ముల్లోకంబులఁ బుణ్యకవ్రతమునం పూజ్యం బగున్ దీననే
    సల్లీలావతి! నీదు గర్భజలధిన్ సత్పుత్త్రరత్నంబుతా
    నెల్లన్ సన్నుతి సేయఁ దగ్గతఁడు జన్మించు న్నిజం బిద్ది స
    ర్వోల్లాసప్రదుఁడైన కృష్ణుఁడు సమర్చ్యం బీ వ్రతంబందునన్.

గీ. కృష్ణమంత్రంబు గొనియు శ్రీకృష్ణుఁ గొల్చు,వాఁడు వాడువారని ఫలప్రతతిభరత
    భువిని గని కోటిపురుషులఁ బొనర నుద్ధరించుకొని వికుంఠముఁ జేరు నిద్ది నిజము.

గీ. పరఁగ నదె కా కతఁడు కృష్ణపార్షదుఁ డయి, యందె మోదంబు సంతతంబనుభవించు
    భక్తుకతన భార్యామిత్రబంధువులకు,గూడ ముక్తి లభించును గోమలాంగి.

వ. కావున నిది యాలకింపు మని హరుండు వెండియు గౌరీదేవి కిట్లు వచియించెడిని.

మ. తగ శ్రీకృష్ణుఁడు దుర్లభంబయిన సన్మంత్రంబుఁ జేకొంచు సు
    స్థిరమౌ భక్తిని దజ్జపంబుఁ గర మర్థిం జేయు చొయ్యన్ వ్రతం

గౌరిమం దీనిని జేయు దీనఁ బితరుల్ ప్రోద్యన్ముదం బొప్పఁగా
వరసాయుజ్యపదంబు గాంత్రు గిరిజా! పద్మాయతాక్షీమణీ!

చ అని హరుఁ డా గిరీంద్రతనయం గడుఁ బావన మైన జాహ్నవీ
సువది తటంబుఁ జేర్చి యట సొం పెసలారఁగఁ గృష్ణమంత్ర మా
వనజదళాక్షికిం దెలిపి భవ్యము తత్కవచంబు దాని య
ర్చననియతిన్ స్తుతుల్ దెలిపెఁ జాల ముదంబు చెలంగ నెమ్మదిన్.

(ఇంతవఱకు శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణము. సం. గ్రం. శ్రీగణేశఖండము. 3-వ అధ్యాయము. ఈపయిన 4-వ అధ్యాయము.)

---

**శ్రీ ఏ. యస్. వి. అయ్యరు, యమ్. యే., ఐ. సి. ఎస్., ఎఫ్. ఆర్. ఎస్. ఎల్., బారట్లా, జిల్లాజడ్జి, నాగపట్టణము:—**

సంస్కృతము తెనుగు ప్రచురణకార్యమునందు ఉద్దండతమశక్తిగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులగారి పేరు ఇండియాఅంతటను ప్రసిద్ధమైనది. అతడు ప్రకటించిన నాగరిలిపిలోని మహాభారతదక్షిణపాఠమును ఆసేతుహిమాచలము సగౌరవముగ చదువుకొనుచున్నారు. తులసీదాసురామచరితమానసముయొక్కయు లోకమాన్య తిలకుగీతారహస్యముయొక్కయు అనువాదములు దీనితోసమముగా నిలువతగినవి. ఈఆంధ్రదేశభక్తులు ప్రచురణపరచినగొప్పప్రకటనలలో ఇవి ఒకకొన్ని మాత్రమే. నవలలు, కథలు, మరిఆధునికగ్రంథములు మొదలైనవానిమాటఅటుఉంచినను లెక్కలేనన్ని తెలుగుకావ్యములప్రచురణముచేతను,పురుషసూక్త శ్రీసూక్తములవంటిదివ్య మంత్రగ్రంథములనేకములప్రకటనముచేతను శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారుఇండియా దేశపుఫాయిల్ గాను, బ్లాకువెల్ గాను పరిగణింపదగియున్నారు. వీరు దినదినాభివృద్ధిచెందుదురుగాక! తనకుద్రవ్యలాభములేకున్నను మంచిపనిచేసినాడనుమంచిపేరు మంచివారిలో ప్రసాదింపకలిగినగ్రంథములు ప్రకటించి ఆంధ్రదేశములోను అంతకంటె విస్తారమైనఫెడరేటెడ్ ఇండియాలోను పూజ్యభావముపొందుదురుగాక!

# ధ్యాన పారమిత

శ్రీ ఓరుగంటి వేంకటేశ్వరశర్మగారు, బి. ఓ. యల్.

బుద్ధభగవానుఁడు తనయుపదేశములను ప్రచారముచేయుటకు భిక్షుసంఘమును స్థాపించెను. తజ్జీవితకాలమున మగధకోసలములందు బౌద్ధమతము చక్కఁగఁ బ్రసరించెను. తన్మహాపరినిర్వాణానంత మనతికాలముననే భగవానుఁడు స్థాపించిన భిక్షుసంఘమున భేదములు పొడసూపి యనేకవాదములు మొలకలెత్తినవి. వైశాలియందు జరిగిన మహాసంగీతి యందు భిక్షువులు రెండుపక్షములుగఁ జీలిరి.

1 స్థవిరవాదులు. 2 మహాసాంఘికులు.

మహాసాంఘికులు, బుద్ధభగవానుఁడు లోకోత్తరుఁడనియు, భవాస్రవమునుండి విముక్తుఁడనియు నుపదేశింపసాగిరి. వారు తథాగతుని ప్రతివాక్యమును గూఢార్థభరితమని విశ్వసించెదరు. బుద్ధదేవునికి నిద్ర, విశ్రాంతి యుండె అనావశ్యకమనియు, నిచ్ఛయుండిన నెంతకాలమేని జీవించియుండెడివారే యనియు నుడివెదరు.

మహాసాంఘికవాదమున ధర్మము ప్రధానము గాదు. బుద్ధమూర్తి, బుద్ధవ్యక్తి ప్రధానము. బుద్ధునిజీవితచరిత్రను పరిశీలించి, ఎన్ని జన్మములతపస్యచే, ఏసాధనవలన, శాక్యముని బుద్ధుఁడాయెనో, మహాసాంఘికులు కనిపట్టఁజాలిరి. ఈసాధనకే పారమితాసాధన యనియు, బోధిచర్యయనియుఁ బేర్లు. మహాయానవాదులు (మహాసాంఘికులు) ఈసాధన నవలంబించిరి.

మహాయానవాదులు తమనిర్వాణమునకై ప్రయత్నింపరు. వారిగంతవ్యము, ప్రాప్యము, 'బోధిసత్త్వ' పదవియే. బోధిసత్త్వశబ్దమునకు, 'తత్ర (బోధౌ) సత్వం అభిప్రాయో ఒస్యేతి బోధిసత్త్వః,' ఎవనికి బోధి లేక సమ్యగ్జ్ఞానప్రాప్తియందే గురియో యతఁడని యర్థము.

బోధిసత్త్వుఁడు బుద్ధత్వప్రాప్తిఁగల్గించుమార్గమున నారూఢుఁడు. సర్వజ్ఞుఁడగు నతనికి జీవలోకమంతయు దుఃఖప్రపీడితమనియు, స్వమోహపాశపరివేష్టితమనియుఁ జక్కఁగఁ దెలియును. అందుచేఁజేసి ప్రాణిసమూహముపై నతనియంతరంగమున కారుణ్యామృత ముప్పతిల్లును. భయము, దుఃఖము నాకుంబోలెనే యితరులకును సమానముగ నప్రియములు.

అట్టియెడ వారలను రక్షింపక, నన్ను నే రక్షించుకొన సమకట్టుటకు నాయందుగల విశేష మేమి? యని బోధిసత్త్వుఁ డాలోచించుకొనును.

> "యదా మమ పరేషాం చ భయం దుఃఖంచ న ప్రియం,
> తదాత్మనః కో విశేషో యత్తం రక్షామి నేతరమ్."

ఇట్లాలోచించి యతఁడు జీవోద్ధరణమునకై సత్యమార్గమున నారూఢుఁడై పారమితాసాధనకుఁ గడంగును.

పారమితాసాధ ననుగ్రహింపక యేరికిని బుద్ధత్వము ప్రాప్తింపదు. పారమిత యనిన 'పూర్ణత' యని యర్థము. పాలీరూపము 'పారమీ' యని బుద్ధత్వప్రాప్తికై యత్నించు బోధిసత్త్వుఁడు షట్పారమితల నవలంబించును.

షట్పారమితలయందు ప్రజ్ఞాపారమిత ముఖ్యతమము. ప్రజ్ఞలేనిచో పునర్భవము నశింపదు. ఇతరపారమిత లన్నియు ప్రజ్ఞాప్రాప్తికి నుద్దేశింపఁబడినవియే. ప్రధానము ప్రజ్ఞాపారమితయైనను నితరములను గ్రహించుటయు నావశ్యకమే. ప్రజ్ఞనుబొందుటకు 1 దానము మొదటికారణము. 2 రెండవది శీలము. 3 క్షాంతివలన దానశీలములు పాలింపఁబడును. దానాదిత్రయము, పుణ్యసంభారము, వీర్యము 4 (=కుశలోత్సాహము) లేక ప్రాప్తింపదు. ధ్యానము 5 (=చిత్తైకాగ్రత) లేక ప్రజ్ఞ 6 ప్రాదుర్భూతము కాదు. ఏలయన సమాహితచిత్తునకే యథాభూతమగు పరిజ్ఞానము కల్గును అందున ఆవరణములన్నియు క్షీణీభూతములగును.

కావ వీర్యలాభమునొంది సమాధికిఁ గడంగుము. చిత్తైకాగ్రతకు యత్నింపుము. వీర్యవంతుఁడైనను, విక్షిప్తచిత్తుఁడగుచోఁ గ్లేశములు చుట్టుముట్టుకొనును. కామాదులను విడనాడుటచేతను, జనసంపర్కమును వదలుటచేతనువిక్షేపముకలుగదు. నిస్సంగత్వమువలన నాలంబనమునఁ జిత్తమునెలకొనును. కానఁ బ్రపంచమునువదలి విక్షేపకారణములగు రాగద్వేషమోహాదుల విడనాడుము. మైత్రికి వశమైతివేని, లాభసత్కారయశోదికప్రలోభము నకుఁ బాల్పడితివేని, ప్రపంచమును వీడఁజాలవు. చిత్తైకాగ్రతచే, యథాభూతజ్ఞానమును బడయునతఁడే క్లేశాదిదుఃఖములను బోనడంప వలంతి యగును. ఇది తెలిసి, క్లేశములవిడువఁ గోరు, ముముక్షువునకుఁ దొట్టతొలి 'శమథము' ననఁగాఁ జిత్తైకాగ్రతను బడయుటకై యత్నింపఁదగును. యథాభూతతత్త్వజ్ఞానము గల సమాహితచిత్తునికి బాహ్యక్రియ లుండవు. శమము గల్మిఁ జిత్తచాంచల్య ముండదు.

లోకముపై నిరపేక్షభావ ముండిననే శమథము కల్గును. అనిత్యునికి నీకు అనిత్యములగు దారసుతాదికములపై మమత్వము తగదు. ఆత్మప్రియులగువారెల్లరు అనేకజన్మపర్యంతము మఱి కాన్పింపరని యెఱింగియు, వారిపైఁ బ్రేముడి నుంచుకొనుట పాడికాదు. అంతయు నెఱింగియుఁ జిత్తము, ప్రియజనసందర్శనములేమి వ్యాకులమగును; ఏ మొనర్చినను స్థిరపడదు. ప్రియదర్శన మబ్బినను చిత్తమునకుఁ బూర్ణముగఁ దృప్తి యొదఁగూడదు. అప్పుడును, దర్శనాభిలాష పూర్వవిధముననే బాధ కల్గించును. ప్రియసమాగమాభిలాషచే మోహము కల్గును. గుణదోషవిచారణ యుండదు. ఎల్లప్పుడును శోకసంతప్తుఁడ వగుదువు. ప్రేమాస్పదునిచింతచే, తల్లీనచిత్తతచే, అనుక్షణ మాయువు క్షీణించును. కుశలకర్మ మేదియు సంపాదింపఁజాలవు. ఎవనికై యాత్మాయుర్బలముల క్షీణింపఁజేసికొనుచున్నావో, యా మిత్త్రుఁడు నిత్యుఁడుకాఁడు. అతఁడు క్షణభంగురుఁ డనిత్యుఁడు. అతనికై దీర్ఘకాలావస్థాయి యగు శాశ్వతికధర్మము నేల పాడుచేసికొనెదవు. ఆతనిసమాగమముచే హితమును, సుఖమును గల్గునని నీవు తలంచితివేని, యది వట్టిభ్రమయని తెలియుము ఏలయన, నీప్రవర్తన మతని కనుకూలముగనున్న, నీవు దుర్గతికి పాల్పడెదవు. అనుకూలము గానిచో, నిన్నతఁడు ద్వేషింపఁగలఁడు. ఇట్లిరుమార్గముల నతనివలన నీకు సుఖముండదు. మఱి తాదృశసమాగమముచే లాభమేమున్నది? ఆతఁడు క్షణము మిత్త్రమును, మఱుక్షణము శత్త్రువును గానోపును. ప్రసన్నుఁడగుటకు బదు లతఁడు కుపితుఁడగును ఆతని నారాధించుట కడుంగడు దుష్కరము. హితముచెప్పినను నతఁడు కోపించును. పరుల నతఁడు హితమార్గమునుండి నివారించును. ఆతనిమాట నంగీకరింపకపోతివేని క్రుద్ధుఁడగును. ప్రపంచమున మూఢులెవ్వరి హితమునేని సాధింపఁగలరా? పరోత్కర్షమును వారు సహింపఁజాలరు. తముబోంట్లతో వారు వివదింతురు. తమదోషములఁ జెప్పిన ద్వేషించెదరు. తమకన్న నధములయెడ వారి కభిమానము మెండు. మూఢజనసంపర్కమున నాత్మోత్కర్షము, పరనింద, సంసారరతియు నాదిగాఁగలయకుశలములు తప్పక యబ్బును. ఇవి యన్నియుఁ బరసంగతి జన్యములని దృఢముగ నమ్ముము. ఇట్లు యోచించి నిస్సంగివై, యొంటరివై సుఖముండ నిచ్చగింపుము. మూర్ఖజనసాంగత్యము వలదు. దైవికముగ నొకప్పు డట్టిసంగతి ప్రాప్తించిననుఁ బ్రియోపచారముల నతనిని సేవించుచు నతనియెడల నుదాసీనభావము వహింపుము. తేఁటి పుష్పములవలన మధువులానునుగాని వానితోడఁ బరిచయము గలుగఁజేసికొనదు. అట్లే ధర్మార్థ ముపయోగి యగునంశము మూఢునియందున్నను దప్పక గ్రాహ్యమే యగును.

ఇవ్విధమునఁ బ్రియసంగతికి హేతువగుస్నేహములగును. మఱి లోకపరిత్యాగమున కుపరోధము నాపాదించు లాభాదితృష్ణల విడనాడఁ జనును. రతి నభిలషించుట విద్వ

జ్ఞునకుఁ దగదు. చిత్తమును రమింపఁజేయువస్తువులన్నియుఁ గడకు వేయిమడుంగులుగ దుఃఖకారణములై పరిణమించును. కోర్కెచే భయము కల్గును. కాన బుద్ధిమంతుఁ డెవ్వఁడును దేనిపైనేని మక్కువఁ గొనఁడు. లాభసంపదలఁ బడసినవా రెందఱో గలరు. కాని యాలాభాదికముంగొని వా రెటకేగిరో యెవ రెఱుంగుదురు? జగమున నిందించువారు కొందఱు, స్తుతించువారు మఱికొందఱు. అట్టియెడ స్తుతిశ్రవణమున సంతసింపనేల? నిందాశ్రవణమున దుఃఖింపనేల? నిఖిలసత్త్వములను బుద్ధుఁడే సంతసింపఁజేయఁజాలఁడే మఱి యజ్ఞులమాటకేమి? లోకచింతనుబూనుట నీకుఁ దగదు. లాభాస్పదములుకాని సత్త్వములను లోకులు పుణ్యరహితములని నిందింతురు. కాన నవి కష్టించియు, పిండదానాదికము నొందవు ఎవఁడేని లాభసత్కారములఁ బడసెనేని, యతఁ డెట్లో దాసపతిని వంచించి లాభము వడసెనని పరిహసించెదరు. ఎటుచూచినను నట్టివారిచిత్తమునకు శాంతి చేకుఱదు. అట్టివారు సహజముగ దుఃఖభాజను లయ్యెదరు. మఱి తాదృశసమాగమ మేల ప్రియమగును? మూఢుఁ డెరికిని మిత్త్రుఁడు కాఁడు. అతనిప్రేమ స్వార్థరహితము కాదు. స్వార్థమునాశ్రయించుప్రేమ యాత్మార్థమే కదా!

అరణ్యవాసము సాధకునికిఁ దగును. తదర్థమై జతనుపడుట శుభము. వృక్షములు నీచదృష్టితోడ దేనినిఁ జూడవు. వాని నారాధించుటకు విశేషప్రయత్న మేమియుఁ జేయ నక్కఱలేదు. వృక్షసహవాససుఖము నా కెప్పు డబ్బును? శూన్యదేవాలయమున వృక్షమూలముననో, గుహాంతరముననో సర్వనిరపేక్షుఁడనై, దృష్టి వెనుకకుమరల్పక, నే నెన్నఁడు వసింతునో! గృహము వీడి, పరిస్వామ్యములేని ప్రకృతివిశాలవనముల స్వచ్ఛందముగ నెన్నడు విహరింతును? మృణ్మయములను, భిక్షాపాత్రములనుగొని, శరీరమమత్వము విడనాడి నిర్భయముగ నెన్నడు గ్రుమ్మరుదును? నాచీవరములు చోరుల కుపయుక్తములగుట యెన్నడో? అట్టిచో నాకిఁక భయమేమి? నే నభయుఁడ నాయెదను.

శ్మశానమున కేగి, దుర్గంధపూరితమగు నాశరీరము నచటిమృతులయస్థిపంజరములతో నెన్నడు పోల్చుకొందును. పూతిగంధమగుట సృగాలములును దానిని సమీపింపవు. శరీరముతోడఁ బుట్టినవియయ్యును నెమ్ములు దునియలై వేఱగును. ఇఁకఁ బ్రియజనులమాట తడవనేల? భార్యాపుత్త్రులు సుఖదుఃఖముల సాయపడెదరుగాన వారిని సంతసింపఁజేయుట కర్తవ్యమని తలంచుట పొరయగును. ఎవ్వఁడును నెవ్వానిదుఃఖమును బంచుకొనఁడు. జీవి యొంటరియై జనించును. అట్లే మఱల గిట్టును. ఎల్లవారలు స్వకర్మముల ఫలమునే కుడిచెదరు. కాన, భార్యాపుత్త్రాదులు కష్టకాలమున సాయపడుదురనుమాట యభిమానమాత్రము

యగును. వారు కేవలము విఘ్నములనే కల్గింతురు. కాన ప్రియజనమువలన నెట్టిలాభము నుండదు.

పరమార్థదృష్టితోడఁ జూచిన నెవరెవ్వరికి సాయపడువారు? ఎవరెవరిసాంగత్యము చేయువారు? దారినడచువారంద ఱొకయెడఁగూడి మఱల వేర్వేఱగునటుల సంసారమార్గమున నడచునప్పు డొకచో జ్ఞాతిసగోత్రాదులతోడ నుండవలసివచ్చును. మరణ మాసన్నమగుడు వారు మఱి నీతోడరారు. అట్టిచో నిన్ను వదలి వారు నీకై విలపింపఁదొడంగుదురు. తత్పూర్వమే అరణ్యవాసము నీకుఁ దగును. ఎవనితోడను బరిచయమొండె విరోధమొండె తగదు. ప్రవ్రజితుఁడవు నీవు, నీవారికి మృతతుల్యుఁడవే. అరణ్యమున నీసగోత్రు లెవ్వరును నీతోడ నుండరు. తమతమ గోడులచే నీకేపీడనుగాని, విక్షేపము నేని గల్గింపరు. కాన నేకాంతమును శ్రేమింపుము. ఏకాంతవాసమున నాయాసమేని, క్లేశమేని యుండదు. అది కల్యాణము గలుగఁజేయును. సకలవిధవిక్షేపముల శమింపఁజేయును. ఇటుల జనసంగత్యాగముచే శరీరవివేకము లభించును. పిదపఁ జిత్తవివేకము పరమావశ్యకము. చిత్తమును సమాహిత మొనర్చుకొన జతనుపడుము. చిత్తసమాధానమునకుఁ గామవితర్కము ప్రతిరోధి. దానిని నివారింపవలయును. రూపాదివిషయసేవనముచే నిహపరలోకములు రెండును నశించును. ఇరుయెడల ననర్థము వాటిల్లును. ఎద్దానికై పాపాపకీర్తులను నీవు పాటింపవైతివో, దేనికై భయవశంవదుఁడవైతివో, యాయది యస్థిమాత్రమే యగును. అది యెవరియధికారమున నుండదు. కొలఁదికాలమునకుఁ బూర్వము, ఏయది లజ్జావనతమై సావగుంఠనమై యొప్పెడిదో, యాముఖమును నేడు గ్రద్దలు వ్యక్తపఱచుచున్నవి. పరుల చూడ్కులఁ బ్రసరింపనీయక యేవదనము నీవు రక్షించుచుంటివో, దానినే యిప్పుడు గ్రద్దలు మెసవుచున్నవి. ఇప్పు డుదాసీనుఁడవై యాముఖము నేల రక్షింపవు? కాకులు గ్రద్దలు చీకాకుపఱచిన యామాంసపుంజమును జూచి పరుగిడెదవేల? కాష్ఠము బలె నిశ్చలమగు నీయస్థిపంజరమును జూచి భయపడెదవేల? సమానములగు నాహారపానీయములవలననే పురీషశ్లేష్మములు రెండు నేర్పడినవి. అయినను వానియందు పురీషము నపవిత్రమని యెంచెదవు. కాని బింబోష్ఠి యధరామృతపానమున నీకాసక్తి యేల? అది శ్లేష్మపానమే యగును గదా! కామసుఖేచ్ఛువుల కపవిత్రమగు, కామినీకళేబరమునే రతి. అశుచిపై, నీకభిలాషయే లేనిచో స్నాయుబద్ధమగు నస్థిపంజరమును, మాంసపిండము నాలింగనము చేసికొనెదవేల? అమేధ్యపూర్ణమును, నిజశరీరమునే ప్రేమించుకొనరాదా? స్వభావముచే శరీరమే వికారము. ఇది యభిరతికిఁ దగినతావుకాదు. శరీరచర్మము నొలిచిన భయము

వాడమును. ఇదియే శరీరపుస్వభావము. ఇట్లు తెలిసియు దీనియందేల నీకభిరతి కల్గుచున్నది? శరీరాదు లమేధ్యమయములైనను జందనాది మైపూతల నలందుటచేఁ గమనీయము లగు నందువేని యదియు పొసఁగదు. సంస్కారముల నెన్నింటి నొనర్చినను శరీరస్వభావము మాఱదు. నగ్నమును, బీభత్సము, భయంకరమునగు శరీరమును గేశనఖాదిసంస్కారముచే, స్నానాభ్యంగానులేపనములచే సంస్కరించి మానవుఁడు తన్నుఁదా వంచించుకొనుచున్నాఁడు. స్వీయమరణమునకుఁ గారణ మాతఁ డెఱుంగఁడు గదా!

ధనములేక సుఖానుభవ మసంభవము. బాల్యావస్థయందు ధనార్జనమునకు శక్తి యుండదు. యౌవనము ధనోపార్జనమునఁ గడచును. జరయందో, దేనివలన నెట్టిప్రయోజనము నుండదు. కొందఱు, దినమంతయు సేవఁజేసి, యలసిసొలసి, సాయంతన మింటికేగెదరు. అట్లు వారు తమతమ యాయువును క్షీణింపఁజేసికొనుచున్నారు. అంతియకాని కామసుఖమును జవిచూచుచుండుట లేదు.

పరులకు సేవకుఁడయినవాఁడు స్వామికార్యనిర్వహణమున కితరదేశములకుఁ బోవలసి వచ్చుచో, పెక్కువత్సరములు తనభార్యాపుత్త్రాదులను గాంచఁడు. ఏసుఖము నర్థించి యితరుల కతఁ డూడిగము చేయనీయకొనెనో, యాసుఖ మతనిని జెందదుగదా. పరసేవచేఁ దన జీవితము నతఁడు వృథగఁ గడపుకొనును. కొందఱు భుక్తికై యుద్ధమునఁ బ్రవృత్తులగుదురు. అట జీవితమునకే మోసము. మానమునకై వారు దాస్యము నూనెదరు. అది విడంబనామాత్రమ యగును. కామాసక్తుఁ డీజన్మముననే వివిధదుఃఖముల ననుభవించును. సుఖము నర్థించి కార్యమునఁ బ్రవృత్తులైనను గడ కనర్థపరంపర కల్గును. ధనోపార్జనము, నార్జితధనరక్షణయుఁ గష్టమయములు. రక్షితధననాశమునఁ జిత్తమునకు క్షోభమును విషాదమును గల్గును. ఇట్లర్థము, అనర్థమునకుఁ గారణమగుచున్నది. ధనోపార్జనానిరతునికిఁ జిత్తైకాగ్రత యుండదు. భవదుఃఖవినిర్ముక్తుఁడగుట కతని కవకాశమే యుండదు. ఇట్లు కామాసక్తివలన నెంతయేని యనర్థము కలదు సుఖము కల్గునను మాటయే యుండదు. బండినీడ్చుచు కసవుమేయు పశువుదశయే ధనాసక్తునికిఁ గల్గుచున్నది. ఈపాటిసుఖము నాస్వాదింప, మనుజుఁడు దుర్లభమగు నాత్మసంపదను నాశమొనరించుకొనును మనుజుని మనస్సు కేవలము విపరీతము. ఏలయన నతఁడు నికృష్టమును, నరకగామియు నగు ననిత్య శరీరమునకు సుఖము సంపాదింప యత్నించును. తద్యత్నమున కోట్యంశమేని బుద్ధత్వమును బడయఁ బర్యాప్తము. అట్లయినను మందబుద్ధియగునాతఁడు బుద్ధత్వమున కుత్సహింపఁడు. కామాన్వేషి బోధిసత్త్వునికన్న నధికమగుదుఃఖమును సహించును. కామమునకు ఫలము

దుఃఖము. శస్త్రవిషాగ్న్యాదులు మరణమాత్రదుఃఖమును గల్గించును. కాని కామమో, దీర్ఘకాలికమగు తీవ్రనరకమునకుఁ గారణమగును. కామమును బరిత్యజించి చిత్తవివేకమున నభిరుచిపడయుము. కలహాయాసశూన్యములగు కాంతారణ్యభూముల విహరించి సుఖివగుము. సుఖపూర్వకముగ విహరించుచు, సత్త్వసుఖకల్పనోపాయములఁ జింతించుచు, వనమునందో, శూన్యాలయమునందో, వృక్షమూలమునందో, గుహాంతరమునందో, నిరపేక్షివై, యథేష్టావాస మొనర్చుటయే ధన్యత. గృహమును వీడిన స్వచ్ఛందవిహారి పడయుసంతోషసుఖ మింద్రునికైనను దుర్లభము. ఇట్లు కాయవివేకచిత్తవివేకముల గుణచింతనముచే సత్త్వము వితర్కముల శమింపఁజేసికొనవలయును. దానిచేఁ జిత్తము పరిశుద్ధమగుడు, బోధిచిత్తభావనము ప్రకర్షమునొందును.

ప్రాణికోటి కంతటికిని సుఖము సమానముగఁ బ్రియము ననుగ్రాహకమును. అట్లే దుఃఖము, సమానముగ బాధకము. కాన నన్ని జంతువులనుఁ దన్ను బలెఁ బాలింపవలయును. తనకు నితరులకును, సుఖము సమానముగఁ బ్రియమై, దుఃఖాదులు సమానముగ నప్రియములగునెడ, తనయం దేమివైశిష్ట్యమున్నదని తొల్త స్వీయసుఖమునకు యత్నింతునని బోధిసత్త్వుఁడు తలంపనగును. కరుణాపరవశతచే, జను లొరులదుఃఖములఁ దమదుఃఖములుగ భావించి వానిఁ బాప యత్నించెదరు. ఒక్కనిదుఃఖముచేఁ బెక్కండ్రదుఃఖము దూరమగుచో, ఆదుఃఖమును సహించుట దయార్ద్రహృదయున కొప్పును. పరోద్ధారమునకై నరకయంత్రణమ్మునైన, కృపాళువు సుఖముగనే భావింపవలయును. జీవయుద్ధారమే యాతని కనంతపరితోషము నొసంగఁగలదు. (హిందీమాతృకకు తెనుఁగు.)



# షడ్దర్శనములు

విద్యాభూషణ శ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు,
ప్రిన్సిపాలు, వేదసంస్కృతకళాశాల, నెల్లూరు.

శ్లో. సృష్టిస్థితిలయానాం యదర్ధనారీశ్వరాత్మకం,
కారణం కరుణావాసం కలయే తదభీష్టదమ్.

దర్శనము:—పురుషార్థములను వానిసాధనములను తెలియజేయునది. లేక సూక్ష్మాతి సూక్ష్మములగు సంస్కృతికారణాదుల తెలియజేయునది. దర్శనములు శాసించునవి కావున శాస్త్రము లనబడును. ఇయ్యవి నాస్తికదర్శనములు ఆస్తికదర్శనములు అని రెండువిధములు. వేదములయందు చెప్పబడినలోకములు లేవని, వేదములు ప్రమాణములు కావని దృఢ విశ్వాసముకలవారు నాస్తికులు. వేదోదితములగు లోకములు కలవని, వేదము లపౌరుషేయ ములని నమ్మువారు ఆస్తికులు.

శ్లో. "నాస్తి వేదోదితో లోకః ఇతి యేషాం మతిస్థిరా,
నాస్తికాస్తే, తథాఽస్తీతి మతిర్యేషాం త ఆస్తికాః."

చార్వాకులు, బౌద్ధులు, జైనులు అని నాస్తికుల మూడువిధముల విభజింపవచ్చును. చార్వాకులమతమున ప్రత్యక్షమే ప్రమాణము. మనఇంద్రియములకు గోచరములు కాని వానిని వారంగీకరింపరు. పృథివ్యప్తేజోవాయువులు నాలుగుతత్వములు. జడములగు దేహాదులకంటె వేరైన యాత్మ వారిమతమున లేకపోయినను సూర్యకిరణసంసర్గమువలన సూర్యకాంతమణియందు దాహశక్తివలె, వేడినీరుకాచిన తేనె వీనిసంయోగమువలన విషశక్తివలె, వక్కలు ఆకులు సున్నము వీనికలయికవలన ఎరుపుందనమువలె పృథివ్యాదిరూపములగు దేహేంద్రియములకలయికవలన చైతన్యశక్తి యేర్పడును.

శ్లో. "అత్ర చత్వారి భూతాని భూమివార్యనలానిలాః,
చతుర్భ్యః ఖలు భూతేభ్యః చైతన్యముపజాయతే."

అర్థకామములు రెండే పురుషార్థములు. అంగనాలింగనాదిజన్యమగుసుఖమే పురుషార్థము. కంటకాదులవలనగలుగుదుఃఖమే నరకము. ప్రత్యక్షముగా నగపడురాజే భగవంతుడు.

శ్లో. "అంగనాలింగనాజన్యసుఖస్యైవ పుమర్థతా,
కంటకాదివ్యథాజన్యం దుఃఖం నిరయ ఉచ్యతే.
లోకసిద్ధో భవేద్రాజా పరేశో నాపరస్స్మృతః."

బౌద్ధులు అస్థిరాత్మవాదులు. వారిలో సౌత్రాంతికులు, వైభాషికులు, మాధ్యమికులు, యోగాచార్యులు అని నాలుగు తెగలవారు కలరు

సౌత్రాంతికులు బాహ్యవస్తువులు లేవనువాదము నిరాధారము, దృశ్యమగు ప్రపంచ మున్నదందురు. వైభాషికులు బాహ్యవస్తువు లనుమేయము లందురు.

మాధ్యమికులు సర్వపదార్థములు క్షణికవిజ్ఞానరూపములని నుడివెదరు.

యోగాచార్యులు శూన్యవాదము చేయుదురు.

బుద్ధమునిచే నుపదేశింపబడిన యుపదేశములు ఏకరూపములైనను, శిష్యులు వారి వారిబుద్ధిభేదముల ననుసరించి వేరువేరుగ నర్థముల గ్రహించిరి అందున బౌద్ధమతమునం దవాంతరభేదము లుద్భవించినవి.

శ్లో. "దేశనా లోకనాథానాం సత్త్వాశయవశానుగాః,
భిద్యంతే బహుధా లోకే ఉపాయైర్బహుభిః పునః."

ప్రత్యక్షానుమానములు రెండే వీరిమతమున ప్రమాణములు. రాగాదివిషయవాసనలులేని శుద్ధవిజ్ఞానస్వరూపావగతియే మోక్షము అయ్యది క్షణికము.

**జైనులు:**—వీరిమతమున జీవాజీవములనుతత్త్వములు రెండు అంగుష్ఠమాత్రు డగు జీవుడు కర్మములచే పంజరమునందు శుకమువలె ప్రాణులహృదయమునందు బంధింపబడును. బద్ధుడగుజీవుడు కేశోల్లుంఛనతప్తశిలాధిరోహణాదులచే పంజరమునుండి వెలువడినచిలుక వలె సతతము ఊర్ధ్వగతు డగుచుండును. ఇదియే వీరిమతమున మోక్షము.

శ్లో. "పంజరస్థః శుకో యద్వత్ విముక్తో బంధనాద్వ్రజేత్,
త్వరితం తద్వదేవాత్మా విముక్తశ్చోర్ధ్వగో భవేత్."

**ఆస్తికదర్శనములు:**—తార్కికులు, సాంఖ్యులు, మీమాంసకులు, అని ఆస్తికులు మూడువిధములు. ఆరంభవాదము, పరిణామవాదము, వివర్తవాద మనుక్రమముగ వీ రంగీకరింతురు.

**తర్కదర్శనము:**—ఇయ్యది న్యాయము, వైశేషికము, అని రెండు తెరగులు. గౌతమమహర్షి న్యాయసూత్రముల రచించెను. నైయాయికమతమున ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము అని ప్రమాణములు నాలుగు.
గౌ. న్యా. సూ. "ప్రత్యక్షానుమానోపమానశబ్దాః ప్రమాణాని."

ఆత్మ, శరీరము, ఇంద్రియములు, అర్థములు, (ఇంద్రియములచే ననుభవింపదగు విషయములు) బుద్ధి, మనస్సు, ప్రవృత్తి, దోషములు, ప్రేత్యభావము, (మృతినొంది మరల పుట్టుట) ఫలము, దుఃఖము, అపవర్గము అని పండ్రెండు ప్రమేయములు. అన్నియు కలసి పదునారు పదార్థములు.

గౌ. న్యా. సూ. "ఆత్మశరీరేంద్రియార్థబుద్ధిమనఃప్రవృత్తిదోషప్రేత్యభావఫలదుఃఖాపవర్గాస్తు ప్రమేయమ్."

పదార్థతత్త్వావధారణమువలన కలుగు ఆత్యంతికదుఃఖనాశమే మోక్షము. వైశేషికతర్కమును కణాదమహర్షులు రచించిరి. వీరిమతమున ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, విశేష సమవాయా, ఽభావములను సప్తపదార్థముల నంగీకరించిరి. ప్రత్యక్షము, అనుమానము మాత్రము ప్రమాణములు. పరమాణువులు సర్వకారణములు. ఈశ్వరుడు నిమిత్తకారణము. ఒకపరమాణువునకంటె మరియొకపరమాణువు వేరనిచెప్పుటకై ప్రతిపరమాణువునందును విశేషమను నొకపదార్థమును వీరంగీకరింతురు. అందుచే వీరు వైశేషికు లనబడుదురు. నిమిత్తకారణుడగునీశ్వరుని ఇచ్ఛవలన పరమాణువు లొండొంటితో కలుసుకొనును. ఇట్లే కొన్నియవయవములకలయికచే క్రమముగ సర్వకార్యసృష్టి సంభవించును. పూర్వము లేని ఘటాదిపదార్థములు పరమాణువు, ద్వ్యణుకము, త్ర్యణుకము మున్నగువానికలయికవలన క్రొత్తగ నేర్పడునని యంగీకరించినందున వీరు అసత్కార్యవాదులు, ఆరంభవాదులు. న్యాయవైశేషికమతములు రెండును ఈశ్వరాస్తిత్వమును అంగీకరింపకతప్పదని హేతువాదముచే దృఢముగ నిరూపించినవి. 1 లోకమున ఘటమునకు ఉపాదానమగుమృత్తు (మట్టి) యొక్కజ్ఞానము, ఘటముచేయవలయు ననుతలంపు, ఘటమునుచేయుట అనువాని కాశ్రయమగు కుమ్మరివాడు ఘటనిర్మాణమునకు ఆవశ్యకమైనటుల ద్వ్యణుకాది (మొలకలు మున్నగు) ప్రపంచనిర్మాణమునకు ఉపాదానజ్ఞానము, ప్రపంచమును సృజింపవలెనను ఇచ్ఛ, సృజించుట, వీనికాశ్రయుడగు సర్వజ్ఞుని, ఈశ్వరుని అంగీకరించుట యావశ్యకము 2 పరమాణ్వాదులయందు సృష్ట్యాదికాలమున గలుగుచలనక్రియవలనకూడ ఈశ్వరాస్తిత్వ మంగీకర్తవ్యము. 3 ఖగోళములు క్రిందబడకయుండుటవలన కూడ వానిని ధరించు ఈశ్వ

రుడు కలడనియే నిశ్చయింపవలెను. 4 అనాదిఘటాదివ్యవహారమున నైతము సంకేతకర్త యగు ఈశ్వరునియస్తిత్వము లభ్యము. 5 ఆయుర్వేదము, భారతము మున్నగునవి పురుష నిర్మితములైనందున వేదములుగూడ వాక్యరూపమైనందున సర్వజ్ఞుడగు ఈశ్వరుని వేదకర్తగ యంగీకరించుట యావశ్యకము. 6 జ్ఞానమాత్రము కారణగుణపూర్వకమైనందున వేదముల వలన కలుగుజ్ఞానముకూడ వేదకర్తయగు ఈశ్వరునియస్తిత్వమును ధృవపరుచుచున్నది. 7 ద్వ్యణుకములయందున్న ద్విత్వసంఖ్య ద్విత్వసంఖ్యకు ప్రయోజకుడగు అపేక్షాబుద్ధిగల ఈశ్వరునియంగీకరింపనిచే సృష్ట్యాదియందు శరీరధారులగుజీవులు లేనందున సిద్ధింపదు.

శ్లో. "కార్యాయోజనధృత్యాదేః పదాత్ప్రత్యయతశ్శ్రుతేః,
వాక్యాత్సంఖ్యావిశేషాచ్చ సాధ్యో విశ్వవిదవ్యయః."
(ఉదయనాచార్యకృతకుసుమాంజలి.)

వీరిమతమున ఆత్మ, జీవేశ్వరభేదములచే ద్వివిధము. ప్రాణాదియుక్తముగాని జీవ తత్వమునకు జ్ఞానాశ్రయత్వము లభింపదు కావున వీరు జడాత్ములు. ముక్తికాలమున ఆత్మ జడము. జీవాత్మగుణములు బుద్ధ్యాదులు. జీవాత్మయందలి జ్ఞానేచ్ఛాకృతులు అనిత్యములు. పరమాత్మయందలి జ్ఞానేచ్ఛాకృతులు నిత్యములు. సాధర్మ్యవైధర్మ్యములచేనైన పదార్థ తత్వజ్ఞానమువలన లభించు ఆత్యంతికదుఃఖోచ్ఛేదమే మోక్షము.

**సాంఖ్యమతము:**—ఇయ్యది నిరీశ్వరసాంఖ్యము సేశ్వరసాంఖ్యము అని రెండువిధ ములు. నిరీశ్వరసాంఖ్యమునకు ప్రవర్తకులు కపిలమహర్షి. సాంఖ్యులనేకాత్ములు.

"అజామేకాం లోహితశుక్లకృష్ణాం"

అను శ్వేతాశ్వతరోపనిషత్తు ననుసరించి, ప్రకృతిసామ్యావస్థను వీడి, చేతనుడు అకర్త, అభోక్త, అసంసర్గి, అగుపురుషుని సన్నికర్షమువలన మహదాదిసర్వకార్యరూపముగ పరిణమించును. సాంఖ్యమతమున మూలప్రకృతి (సర్వకార్యములకు కారణము) మహత్తు, అహంకారము, పంచతన్మాత్రలు, పూర్వపూర్వమునకు క్రమముగ కార్యరూపములు ఉత్త రోత్తరములకు కారణరూపములు, అయినందున ఈ ఏడును ప్రకృతివికృతు లనబడును. పంచమహాభూతములు, పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములు, మనస్సు కలసి పదునారును కార్యములే కావున వికృతు లనబడును. పురుషుడు ప్రకృతివికృతుల (కారణ కార్యముల) కంటె భిన్నుడు.

శ్లో. "మూలప్రకృతిరవికృతిః మహదాద్యాః ప్రకృతివికృతయస్సప్త
షోడశకస్తు వికారో న ప్రకృతిర్న వికృతిః పురుషః."

ప్రకృతి, తత్కార్యములు ఇరువదినాలుగు, జడములు, పురుషతత్వ మొకటి చేత నము ఇరువదియైదుతత్వములను లెక్కించి చెప్పునదిగనుక సాంఖ్యతత్వ మనబడును. వీరి మతమున ప్రత్యక్షము, అనుమానము, శబ్దము ప్రమాణములు. గ్రుడ్డివాడును కుంటి వాడును కలసి ప్రయాణముచేసినటుల ప్రకృతిపురుషులకలయికవలన సృష్టి సంభవించును.

శ్లో. "పంగ్వంధవదుభయోరివ సంయోగ స్తత్కృతస్సర్గః."

వటబీజమున వటవృక్షమువలె మృత్తు (మట్టి) మున్నగువానియందు అభివ్యక్తి (ఉత్పత్తి) కంటె పూర్వము ఘటాదికార్యములు అనభివ్యక్తమై యుండును. ఉత్పత్తికంటె పూర్వము కారణరూపముగ నున్న కార్యమే పుట్టునని చెప్పుటచే వీరు సత్కార్యవాదులు. కారణము కార్యరూపముగ పరిణమించునని యంగీకరించుటచే పరిణామవాదులని చెప్ప బడుదురు. ప్రకృతిపురుషవిభాగజ్ఞానముచే పురుషునకు కైవల్యరూపమగుమోక్షము సంభ వించును. పురుషునకంటె వేరగునీశ్వరుని యంగీకరించకపోవుటచే వీరు నిరీశ్వరసాంఖ్యులని వ్యవహరింపబడుచున్నారు.

**యోగదర్శనము:**—ఇయ్యది పతంజలిముని ప్రణీతము. ఇందు సాంఖ్యసిద్ధాంతము సర్వము నంగీకృతము. కాపిలసాంఖ్యమున చేర్కొనబడని ఈశ్వరాస్తిత్వము లక్షణాదు లచే నిరూపింపబడినందున సేశ్వరసాంఖ్యమని వ్యవహరింపబడుచున్నది.

1. అవిద్య=అనిత్యములయందు నిత్యత్వాభిమానము, అపవిత్రములయందు పవిత్ర త్వాభిప్రాయము, దుఃఖములయందు సుఖత్వాభిమానము, అనాత్మయం దాత్మత్వాభి ప్రాయము.

2. అస్మితము=దృక్శక్తి (పురుషుడు) దర్శనశక్తి (బుద్ధి) ఈరెండింటియందును ఏక త్వాభిమానము

3. రాగము=సుఖతత్సాధనములయందు పేరాస.

4. ద్వేషము=దుఃఖతత్సాధనములందు క్రోధము.

5. అభినివేశము=పూర్వజన్మవాసనాబలమున విద్వాంసునకునైతము మరణమువలన సంభవించుభీతి.

ఈక్లేశము లైదును ధర్మాధర్మరూపములగు కర్మలకు కారణములు. ధర్మాధర్మములు, సుఖదుఃఖరూపఫలముల నొసంగును. విపాకము=ధర్మాధర్మముల ఫలరూపమగు జాతి (మనుష్యత్వాదికము) భోగములు=(అనుభవింపబడుపదార్థములు) అనుభవించుటకు సాధన

ములగునింద్రియములు, సుఖదుఃఖసాక్షాత్కారములు. ఆశయము=జ్ఞానాదివాసనలు. వీనితో నెల్లకాలములయందును సంబంధమునొందని సకలజగదుద్ధరణసమర్థుడును క్లేశాద్యాశ్రయుడును జీవులకన్న విలక్షణుడగుపురుషుడు ఈశ్వరుడు. అట్టి ఈశ్వరానుగ్రహమును బొందుటకు కృచ్ఛ్రచాంద్రాయణాదితపస్సుస్వాధ్యాయము ఈశ్వరప్రణిధానము అనుక్రియాయోగ మావశ్యకము.

1. ప. సూ. "క్లేశకర్మవిపాకాశయైరపరామృష్టః పురుషవిశేషః ఈశ్వరః"

2. ......"తపస్స్వాధ్యాయేశ్వరప్రణిధానాని క్రియాయోగః"

చిత్తవృత్తులను నిరోధించుటయే యోగము.

ప. సూ. "యోగశ్చిత్తవృత్తినిరోధః"

సకలచిత్తవృత్తులను నిరోధించినపుడు పురుషునకు స్వస్వరూపావస్థానము (ప్రకృతిపురుషజ్ఞానవిభాగపూర్వకముగ కర్తృత్వాభిమానమును వీడి చిద్రూపముగనుండుట) సంభవించును. ఇయ్యదియే పాతంజలాభిమతమగుముక్తి. ప్రత్యక్షము, అనుమానము, అగమము ప్రమాణములు. సాంఖ్యయోగముల రెండింటియందును పూర్వరూపమును వీడి మరియొక రూపమునుబొందుట (పరిణామము) అంగీకరించేబడుచున్నది. జీవునకు నానాత్వము, విభుత్వము ప్రకృతిసంబంధమువలననే కర్తృత్వము భాసించుట ప్రకృతిపురుషులకు భేదమును గ్రహింపకపోవుటచే భోక్తృత్వాదికము, మొదలగునవి పురుషునియందు వ్యవహరింపబడుచున్నవి. పారమార్థికముగా పురుషుడు నిర్గుణుడు, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావుడు అని వీరంగీకరింతురు.

**మీమాంసాదర్శనము:—** ఇయ్యది కర్మమీమాంస, (పూర్వమీమాంస) ఉపాసనామీమాంస, ఉత్తరమీమాంసయని మూడువిధములు. ద్వాదశాధ్యాయాత్మకమగు పూర్వమీమాంస జైమినిమునిప్రణీతము. ఇందు మూలభూతములగు జైమినిసూత్రములు ఏకరూపములైనను, భట్టసంప్రదాయము, ప్రభాకరసంప్రదాయము అనుసంప్రదాయభేదములచే మతద్వయము వ్యవహరింపబడుచున్నది. జీవునకు నిత్యత్వము, కర్తృత్వము సత్యమని యంగీకరింపబడుచున్నవి. జీవునిచే జేయబడుకర్మములే భోగమోక్షముల నొసంగును. పరమేశ్వరునిస్థానమున కర్మయే వ్యవహరింపబడుచున్నది. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి అనుఐదుప్రమాణములు ప్రాభాకరులచే అంగీకృతములు. అభావముతోకలసి ప్రత్యక్షాదుల నారుప్రమాణములను భాట్టు లంగీకరింతురు. మీమాంసక

మతమునను ఇంద్రాదిదేవతలు మంత్రరూపములే. వారికి ప్రత్యేకముగ దేహేంద్రియాదులు లేవు. లేదా పౌరుషేయత్వము, నిత్యత్వము ఇందు సిద్ధాంతముచేయబడినది. మహాప్రళయ మంగీకరింపబడదు. సంసారము, ప్రవాహనిత్యము. పంచభూతములు నిత్యములు. ప్రతియాత్మయందును వారివారికర్మముల ననుసరించి అదృష్టాపూర్వ మొందుండును. తదనుగుణముగ నాయాజీవులకు అధిష్ఠానములగుశరీరములును, అనుభవింపదగినపదార్థములునూ, విశ్వవ్యాపియగుశక్తిచే నేర్పడుచుండును. నిత్యసుఖప్రాప్తియే ముక్తి, ప్రాభాకరమతము ననుసరించి ద్రవ్య, గుణ, కర్మ, సామాన్య, శక్తి, సాదృశ్య, సమవాయ, సంఖ్యలు అను పదార్థము లెనిమిది. ద్రవ్యములు పృథివ్య-ప్తేజో-వా య్వాకాశ కాల-దిగాత్మ మనస్సులని తొమ్మిది.

మానవుడు తనభూముల నితరు లపహరించినపుడు తనవద్దనుండుప్రియమైన ధనమును సైతము వెచ్చించి న్యాయస్థానమునం దభియోగ మొనర్చి, అందు గెలుపొంది, భూములను స్వాధీనముచేసుకొని, మరల ప్రాణపదమైన ధనము నార్జించినటుల వేదప్రామాణ్యము నిరాకరించుమతములు వ్యాపించినకాలమున ఇష్టమైన ఈశ్వరాస్తిత్వమును వీడి, వేదప్రామాణ్యమును సాధించిన వైదికమతానుయాయులు వేదబోధితములగు ధర్మములతోగూడ నీశ్వరాస్తిత్వమును సైతము సులభముగ గ్రహింపగలరనుతలంపుతో జైమిని మహర్షి పరమేశ్వరునిస్థానమున కర్మను నెలకొల్పియుండవచ్చును.

శ్లో. "అభీష్టార్థవ్యయేనాపి జయతి క్షేత్రహారిణం,
లబ్ధే క్షేత్రే న దుష్ప్రాపః స్యాదర్థ ఇతి చింతయా."

**ఉపాసనామీమాంస:—** ఇయ్యది అంగిరోమునిప్రణీతము. అందు జీవతత్వము చిజ్జడగ్రంథ్యాత్మకము. అనాదిజీవునకు విభుత్వ కర్తృత్వ భోక్తృత్వములు సత్యములు గ్రంధివిమోక్షమే ముక్తి. జడగ్రంధిసంబంధమే సంసారము. జీవునకు జడసంబంధము వీడుట వలన ముక్తికలుగును. మాయాసంబంధమువలన ఈశ్వరునియందు కర్తృత్వము వ్యవహారింబడుచున్నది. మాయపరమేశ్వరుని శక్తిస్వరూపము. ఈశ్వరునికంటె భిన్నము. సృష్టికాలమున భేదభావమునంది అఘటనఘటనాసమర్థ యగుమాయ విచిత్రమగుజగమును సృజించుచున్నది. ఈవిషయమున భేదాభేదవాదము శాస్త్రకారుల కభిమతమగునట్లు తెలియుచున్నది. సృష్టికాలమునందు ఈశ్వరునకు, మాయకును భేదము. తదభావమునం దభేదము జీవనానాత్వము, జీవేశ్వరభేదము కల్పితములు. ముక్తి—సాలోక్య, సామీప్య, సాయుజ్య

సారూప్య భేదములచే నాల్గువిధములు. సృష్టిప్రళయము లంగీకరింపబడును. ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము, అర్థాపత్తి, అనుపలబ్ధి అని ప్రమాణము లారు.

**ఉత్తరమీమాంస:—** ఇయ్యది ద్వైతము, విశిష్టాద్వైతము, అద్వైతము అని మూడు తెరంగులు. ద్వైతమతమున పరమేశ్వరుడు స్వతంత్రుడు, హేయగుణవర్జితుడు, అనంతకళ్యాణగుణవిశిష్టుడు, నిఖిలఫలప్రదాత, సంసృతిబద్ధుడగుజీవుడు ఈశ్వరాధీనుడై, సుఖదుఃఖమిశ్రితములగు ఐహికాముష్మికఫలముల ననుభవించుచుండును. జీవులనేకులు వీరిలో పరస్పరము భేదము గలదు. అచేతనములు జడములు. ఇందును పరస్పరము భేదము గలదు. జీవులకు ఈశ్వరునకును, జడములకు జీవులకును పరస్పరభేదము గలదు. ఇట్టి భేద పంచకముతో గూడిన ప్రపంచము సత్యము (ప్రవాహమువలె నిత్యము.) అనాది.ఒకప్పుడును ప్రపంచమునకు నాశములేదు. ఎవ్వరు పరమేశ్వరుని చిహ్నభూతములగు శంఖచక్రాదులచే స్వశరీరములను చిహ్నితమొనర్చుకొని, తమపుత్రపౌత్రాదులకు భగవంతునినామమిడి ఎల్ల కాలములయందు భగవంతుని స్మరింపుచు, దశవిధములగు భజనముచేయుదురో, లేక వానిలో నొకదానినైన హృదయపూర్వకముగ నాచరించెదరో, అట్టివారు సంసారబంధ మును వీడి పరమేశ్వరుని సాన్నిధ్యమును బొంది దుఃఖరహితమగు నిత్యానందమును అనుభ వించెదరు. ఇయ్యదియే ముక్తి. ముక్తజీవులకు సైతము స్వతంత్రుడగు శ్రీమన్నారాయ ణుడే అధిపతి.లక్ష్మీనారాయణులు అక్షరులు. ఇతరులు క్షరులు. ద్వైతదర్శనప్రవర్తకులలో రామపాదసేవాధురంధరుడగు ఆంజనేయుడు ప్రథముడు, రెండవవాడు భీముడు, మూడవ వాడు శ్రీపూర్ణప్రజ్ఞపాదులని ప్రసిద్ధి.

శ్లో. ప్రథమస్తు హనూమాంశ్చ స్యాద్ద్వితీయో భీమ ఏవ చ,
పూర్ణప్రజ్ఞస్తృతీయశ్చ భగవత్కార్యసాధకః.

**విశిష్టాద్వైతము:—** భగవద్రామానుజదర్శనమున హేయగుణరహితుడు, అనంత కళ్యాణగుణవిశిష్టుడును అగువాసుదేవుడే పరమేశ్వరుడు, పరమకారుణికుడు, భక్తవత్స లుడు, పరమపురుషుడు నగు శ్రీమన్నారాయణుడు సకలజగత్తునకు ఉపాదానము. సకలజీవు లకు నియామకుడు, సకలజగత్కర్త. వాసుదేవతత్వము ప్రతిమాది (అర్చామూర్తి) రూప ముగను, రామకృష్ణాద్యవతార(విభవ)వాసుదేవసంకర్షణ ప్రద్యుమ్న అనిరుద్ధాది(వ్యూహ) రూపముగను సంపూర్ణషడ్గుణవిశిష్టమగు వాసుదేవాఖ్యపరబ్రహ్మ(సూక్ష్మ)రూపముగను, అంతర్యామిరూపముగను భక్తానుగ్రహార్థమై యొప్పుచుండును. అందు పూర్వపూర్వ మూర్తుల నుపాసనముజేసి, దురితమును నశింపజేసినకొలది, ఉత్తరోత్తరమూర్తుల నుపాసన

చేయుటకు అర్హత కలుగుచుండును. ఉపాసనము, అభిగమనము, ఉపాదానము, ఇజ్య, స్వాధ్యాయము, దేవతానుసంధానరూపమగు యోగము, ఈ యిదువిధములగు నుపాసనల నొనర్చి అంతర్యామి సాక్షాత్కారమునొందిన ఉపాసకునకు భక్తవత్సలు డగుపురుషోత్త ముడు పునరావృత్తిరహితము, నిరవధికానందరూపము, ఆత్మతత్వానుభవానుగుణము నగు పరమపదము నొసంగును. అట్టి మోక్షసాధనమగు ఉపాసన, చిత్తశుద్ధి, వైరాగ్యము లేనిది సంభవింపదు. కర్మకాండమునం దుపదేశింపబడిన కర్మజ్ఞానము కర్మానుష్ఠానము చిత్తశుద్ధి వైరాగ్యములమూలమున బ్రహ్మజ్ఞానమునకు కారణమగును. ఇయ్యది భక్తికి అంగభూతము. కర్మజ్ఞానకాండములు కార్యకారణభావమును పొందియుండుటచే వానికి సంబంధించిన పూర్వోత్తరమీమాంసములు ఏకశాస్త్రమనియే భగవద్రామానుజులవారిమతము. శ్రీ శంకరభగవత్పాదులకన్న ప్రాచీనులగు వృత్తికారులు సైతము పూర్వోత్తరమీమాంసలను ఏకశాస్త్రమనియే అంగీకరించిరి. చిచ్ఛబ్దవాచ్యుడగు జీవుడు పరమాత్మకంటె భిన్నుడు, నిత్యుడు. శరీరమునకు జననమరణములు గలవుగాని జీవునకు జననమరణాదులు లేవు. ఇతడే కర్మఫలభోక్త. ఈశ్వరోపాసనచే వీతరాగులై పరమపదమునొందిన జీవులకు సంసృతి బంధ ముండనేరదు. జీవు డణుపరిమాణముకలవాడు. అగ్నినుండి స్ఫులింగములు వెడలి నటుల పరమాత్మనుండి బయలువెడలి పరమాత్మకు శేషభూతులగుజీవులు నిత్యము, వ్యాప కము, అంతర్యామి యగుపరమాత్మచే వ్యాప్తులై యుందురు. దృశ్యమగు జడప్రపంచ మంతయు అచిచ్ఛబ్దవాచ్యము. జడరూపమగుజగత్తు అనుభవింపదగిన పదార్థరూపములు గను, అనుభవించుటకు వలయుపదార్థరూపముగను, అనుభవించుటకు వలయుశరీరరూప ముగను, మూడువిధములు.

> శ్లో. ఈశ్వరః చిదచిచ్చేతి పదార్థత్రితయం హరిః,
> ఈశ్వరః చిదితి ప్రోక్తో జీవః దృశ్యమచిత్పునః.

**అద్వైతము:—** అద్వైతమతమున జననమరణాదిరూపభావవికారములు లేక, సర్వ వ్యాపకము, అనాది, అనంతము, సత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావము అగు ఆత్మ యొక్క టియే. అదియే బ్రహ్మతత్వము. కార్యప్రపంచమంతయూ ఆత్మాశ్రితమగు అవిద్యాపరిణా మము (ఒకరూపమును వీడి మరియొకరూపమును స్వీకరించుట) ఈ అవిద్యయందు బౌద్ధులు వచించు తుచ్ఛత్వముగాని, ఇతరులు వచించు సత్యత్వముగాని, లేకపోవుటచే నియ్యది సదస ద్విలక్షణము; అనిర్వచనీయము.

బ్రహ్మతత్వము జగత్తునకు వివర్తోపాదానము. వివర్తమన అయ్యది కానిది అట్లు భాసించుట. పారమార్థికము, వ్యావహారికము, ప్రాతిభాసికము, అని సత్త మూడువిధములు. పారమార్థికసత్త బ్రహ్మతత్వమునందు మాత్ర ముండును. ఇది త్రికాలాబాధ్యము. (ఎల్లకాలములం దుండునది.) వ్యావహారికసత్త ఘటపటాదులయందు వ్యవహారకాలమునమాత్ర ముండునది ఇయ్యది బ్రహ్మజ్ఞాననివర్త్యము. ప్రాతిభాసికసత్త శుక్తిరజతాదులయందును, స్వాప్నికపదార్థములయందును, ఉండునది. ఇయ్యది బ్రహ్మజ్ఞానేతరనివర్త్యము, తుచ్ఛము, ఎల్లకాలములయందు లేనిది. గొడ్డురాలిబిడ్డ, ఆకాశపుష్పము మున్నగునవి. ప్రత్యక్ష, అనుమాన, ఉపమాన, శబ్ద, అర్థాపత్తి, అనుపలబ్ధి, అని ప్రమాణము లారు.

జీవేశ్వరులు, విశుద్ధచైతన్యము, జీవేశ్వరులభేదము, అవిద్య, అవిద్యకు శుద్ధచైతన్యమునకును, గలసంబంధము. ఈ ఆరును అనాదులు.

శ్లో. జీవ ఈశో విశుద్ధాచిత్ తథా జీవేశయోర్భిదా,
అవిద్యా తచ్చితోర్యోగః షడస్మాకమనాదయః.

అద్వైతమతమున సుఖదుఃఖాదులు నైయాయికమతమునందువలె ఆత్మధర్మములుగాక, అంతఃకరణధర్మములు. జ్ఞానసాధనము లగునింద్రియములు (ప్రమాణములు) జ్ఞేయములను (తెలుసుకొనబడుపదార్థములను) తమకంటె వేరైన ప్రమాత (తెలుసుకొనువాడు) లేనియెడల తెలుసుకొనుట సంభవింపనేరదు. కావున ప్రమాణప్రమేయములకన్న వేరైన ప్రమాతృచైతన్యమును అంగీకరింపవలయును. అట్టి ప్రమాతృచైతన్యము జాగ్రత్స్వప్నసుషుప్తులయందు వయోవిశేషములయందును, అనుగతమై, ఏకరూపముగ నుండుటచే నొక్కటియే ఘటాద్యుపాధిభేదముచే ఆకాశభేదము గన్పించినటుల ప్రతిశరీరమునందును ప్రమాతృచైతన్యము (జీవచైతన్యము) దేహాదిభేదము ననుసరించి లోకదృష్టిచే భిన్నభిన్నముగ గోచరించినను, ప్రమాతయగు నాత్మకు నానాత్వసాధకము లగుప్రమాణములు లేకపోవుటచేతనూ, "ఏకమేవాద్వితీయం" మున్నగు ఏకత్వబోధకప్రమాణములు బహుళముగ నుండుటచేతనూ, ఆత్మ యొక్కటియే. ఇట్టి ఆత్మైకత్వావగతియే మోక్షము. జననమరణాదిరూపబంధనివృత్తి ఆత్మసాక్షాత్కారము లేనిది లభింపదు.

నిత్య, శుద్ధ, బుద్ధ, ముక్తస్వభావమగు అద్వయాత్మ, దేహేంద్రియాద్యభేదము, దేహేంద్రియాదిసంబంధము, తనకు లేకపోయినను, అనాదిసిద్ధమగు మహదాదిసహవాసమున దేహేంద్రియాదులు తాననియూ, సుఖదుఃఖాదులు జననమరణాదులు తనవనియు,

దేహగతభేదము ఆత్మగతమనియూ, తలచి వ్యాధపుత్రన్యాయమున సంసృతిబద్ధు డగుచున్నాడు. ముముక్షువు (అద్వైతాత్మసాక్షాత్కారమున బంధనివృత్తినొందుటకు తీవ్రేచ్ఛ కలపురుషుడు) సోపానరూపముగ ప్రథమమున విహితకర్మలను నిష్కామముగ నాచరించి, చిత్తగతమగు కాలుష్యమును నశింపజేసి విశుద్ధచిత్తుడై, అవిచ్ఛిన్నతైలధారవలె సంతతము అనుస్యూతమగు ధ్యానయోగమున చిత్తమునందలి విక్షేపమును వీడి, స్థిరచిత్తుడై, ఔపనిషదమగుతత్త్వము గురుముఖమున శ్రవణముచేసి, బాల్యమునుండి వ్యాధులచే పోషింపబడి, "నేను బోయవాడ"నని తలచురాజపుత్రుడు తాను రాజపుత్రుడ నని యెరింగి సహజసిద్ధమగు రాజభావమునొంది విజిగీషువై సుఖితుడైనటుల శ్రుతిమూలమున ఆవరకాజ్ఞానమును ప్రవిలయముచేసి, ఆత్మైకత్వసాక్షాత్కారమునొంది, స్వస్వరూపాఖండానందాత్మకుడగును.

శ్లో. నీచానాం వసతౌ తదీయతనయైస్సార్ధం చిరం వర్ధితః
తజ్జాతీయమవైతి రాజతనయః స్వాత్మానమప్యంజసా,
సంవాదే మహదాదిభిః సహ వసన్ తద్వద్భవేత్పూరుషః
స్వాత్మానం సుఖదుఃఖజాలకలితం మిథ్యైవ ధిఙ్మన్యతే.

శ్లో. దాతా భోగపరః సమగ్రవిభవః యశ్శాసితా దుష్కృతాం
రాజా సత్వమసీతి రక్షితృముఖాత్ శ్రుత్వా యథా వత్సతు,
రాజీభూయ జయార్థమేవ యతతే తద్వత్పుమాన్ బోధితః
శ్రుత్వా తత్త్వమసీత్యపాస్యదురితం బ్రహ్మైవ సంపద్యతే.

ఉత్తరమీమాంసకు సంబంధించిన మతత్రయమున ఎయ్యది శ్రేష్ఠము అను సందేహమునకు ఈవచనము నివారకము కాగలదని నాతలంపు.

శ్లో. "దేహబుద్ధ్యాస్మి దాసస్తే జీవబుద్ధ్యా త్వదంశకః,
ఆత్మబుద్ధ్యా త్వమేవాహం ఇతి మే నిశ్చితా మతిః."



# సాంఖ్యదర్శనసారము

శ్రీ వేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు,

మహారాజావారి సంస్కృతకాలేజిపండితులు, విజయనగరము.

పరిణామవాదులగు సాంఖ్యులయొక్కమతము నిరూపింపబడును. పరిణామ మనగా విద్యమానమగు ద్రవ్యమే యవస్థాంతరమును పొందుటయే. విద్యమానమగు సువర్ణమునకు కుండలాదిరూపావస్థాంతర మెటులనో యటులనే మూలకారణమగు సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియే మహదహంకారాదిరూపమగు కార్యరూపముగా పరిణమించు నని సాంఖ్యవాదులసిద్ధాంతము. ఇట్టి పరిణామవాదము అనుభవసిద్ధమైనది యుండగా వివర్తవాదాదులు ఎటు లారంభించబడును.

పరిణామవాదులైన సాంఖ్యులయొక్క సిద్ధాంతమేదియో సంక్షేపముగా జెప్పెదము. సాంఖ్యులు నాలుగుపదార్థముల నంగీకరించిరి. అవియేవనగా:— 1. కేవలకారణము, 2. కేవల కార్యము, 3. కార్యకారణరూపము, 4. కార్యము కారణముకానిది వీటియందలి మొదటి దానిని సత్త్వరజస్తమోగుణాత్మకమగు మూలప్రకృతియని చెప్పెదరు. దీనికి వేరుకారణము లేదు. ఇదియే సర్వమునకు కారణము. రెండవది యేదనగా, పృథివ్యప్తేజోవాయ్వాకాశములు అయిదు. వాక్పాణిపాదపాయూపస్థలు అయిదు. త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములు అయిదు. మనస్సు ఒకటి. ఈపదహారును కేవలకార్యములే. మూడవది యేదనగా, ఒకటి బుద్ధి, రెండు అహంకారము, మూడు శబ్దతన్మాత్రము. నాలుగు స్పర్శతన్మాత్రము. అయిదు రూపతన్మాత్రము. ఆరు రసతన్మాత్రము. ఏడు గంధతన్మాత్రము. ఈయేడును కార్యరూపములును కారణరూపములును కాగలవు. ఇందు బుద్ధి మూలప్రకృతియొక్క మొదటివికృతి. ఈ మతమున కార్యమనగా వికారమనియు వికృతియనియు తలంచెదరు. కారణమనగా ప్రకృతి యని చెప్పెదరు. ప్రకృతియొక్క మొదటిపరిణామము బుద్ధి. దీనినే మహత్తత్త్వమని యందురు. అహంకారమునకు ప్రకృతి. అనగా కారణము. గాన బుద్ధి కార్యమూ కారణమూ గూడ యగును. ఇటులనే యహంకారాదులు గూడ కార్యరూపములు కారణరూపములు గూడ యగును. అహంకారము బుద్ధికి కార్యము. శబ్దకారణము, శబ్దతన్మాత్రము. అహంకారమునకు కార్యము. స్పర్శతన్మాత్రకు కారణమూ యగును. స్పర్శతన్మాత్రయు శబ్దకార్యము. రూపకారణమూయగును, రూపతన్మాత్రయు స్పర్శకార్యము. రసప్రకృతియు నగును. రసతన్మాత్రయు

గూడ రూపవికారము.గంధప్రకృతి యగును. గంధముగూడ రసకార్యము. భూతకారణము. గాన మహదాదు లొకదానికి కార్యము మరియొకదానికి కారణ మగుటంజేసి కార్యకారణ రూపమగును. పురుషు డొకదానికి కార్యముగాని మరొకదానికి కారణముగాని కానందున నాలగవతత్త్వము. ఈ యిరువదిరైదు తత్త్వములే సాంఖ్యమతసిద్ధములని తెలియబడుచున్నది. ఈసంగతి సాంఖ్యకారికలో జెప్పబడియున్నది. కార్యరూపముగా పరిణమించునది ప్రకృతియనబడును. మూలప్రకృతి యనగా ప్రధానము. ఈప్రధానము మరియొకదానికి పరిణామము గానందున మూలప్రకృతిశబ్దముచే వ్యవహరింపబడుచున్నది. దీనికిగూడ కారణాపేక్షయున్నచో యనవస్థాదోషము వచ్చును. గాన గత్యంతరము లేనందున బీజాంకురన్యాయము లమం దనవస్థ యున్ననుమూలప్రకృతికి కారణముండుటలో ప్రమాణము లేనందున యింతటితో విశ్రాంతిని యొప్పవలెను-వెనుక నుదహరించిన యిరువదిరైదుతత్త్వములు ప్రమేయములు-ప్రమాణముచేత ప్రమేయము సిద్ధించునుగాన యాప్రమేయసాధకప్రమాణములు యీమతమందు మూడుగాయున్నవి. యేవనః— 1. ప్రత్యక్షము, 2. అనుమానము,3.శబ్దము ఈమూడింటిచే సాంఖ్యప్రమేయసిద్ధి యగును. ఈసంగతి సాంఖ్యతత్త్వకౌముదిలో నాల్గవ కారికచే చెప్పబడినది. [శ్లో. దృష్టమనుమానమాప్తవచనమ్]

ప్రత్యక్షప్రమాణమనగా ఘటాదిరూపమగు విషయముతో సంయుక్తమగు చక్షురాదీంద్రియముతో కలిసిన మనస్సువలన గలుగువిషయాకారమగు. అనగా ఘటాకారమగు వృత్తియే ప్రత్యక్షప్రమాణము. ఈఘటాకారమగువృత్తి (జ్ఞానము) అక్కడనే యాత్మ ప్రతిఫలించును. ఆత్మ విభువగుటవలన (అంతటను యుండుటవలన) ఆవృత్తి గలుగుచోట గూడ యుండునుగాన ఆవృత్తియందు ఆత్మ ప్రతిబింబించును. ఆత్మ ప్రతిబింబముతో గూడుకున్న వృత్త్యవచ్ఛిన్నచైతన్యముచే ప్రత్యక్షప్రమ యందురు. ప్రమాణమునకు ఫలము ప్రమితి అనగా ప్రమ.

ఇట్లే అనుమానప్రమాణమనగా యెక్కడెక్కడ ధూమముగలదో యక్కడక్కడ వహ్నియున్నదనువ్యాప్తి స్మృతితో గూడుకున్నపర్వత మట్టిధూమము గలదియనుజ్ఞానము వలన గలుగువహ్నితో గలసినపర్వతమును గోచరించిన మనోవృత్తియే యనుమాన ప్రమాణము. ఈవృత్తియందుగూడ యాత్మప్రతిబింబించును. ఇట్టివృత్తి ప్రతిబింబావచ్ఛిన్న చైతన్యమునకే అనుమితి యనిపేరు. ఇటుల నీ ఆప్తవాక్యమువలన గలుగు రెండుపదార్థములయొక్క సంబంధమును గోచరించుమనోవృత్తిని శబ్దప్రమాణ మందురు. ఈవృత్తి ప్రతిబింబముతో గూడిన చైతన్యమునే శాబ్దబోధ యందురు. పరోక్షాపరోక్షవ్యావృత్తి

త్వరూప మగువృత్తిధర్మములు ప్రతిబింబరూపోపాధిని ద్వారముగాజేసుకొని చైతన్య ముందు భాసించును. ఈవిషయమును విజ్ఞానాచార్యులవారు యీదిగువ నుదహరించినశ్లోకలచే జెప్పెను.

శ్లో. ప్రమాతా చేతనశ్శుద్ధః ప్రమాణం వృత్తిరేవ చ,
ప్రమార్థాకారవృత్తీనాం చేతనే ప్రతిబింబనం.
ప్రతిబింబితవృత్తీనాం విషయో మేయ ఉచ్యతే,
వృత్తయస్సాక్షిభాస్యాస్స్యుః కరణస్యానపేక్షణాత్.
సాక్షాద్దర్శనరూపం చ సాక్షిత్వం సాంఖ్యసూత్రితమ్.

ఆత్మరూపమైన జ్ఞానము నిత్యమగుటవలన జ్ఞానము పుట్టును, నశించును, అనువ్యవహారము ప్రతిబింబరూపోపాధినిబట్టిగాన ఆత్మకు యెంతమాత్రము లేవని గ్రహింతురుగాక.

ఈచెప్పిన మూడుప్రమాణములచే యిరువదియైదు తత్త్వములు సాధించవలెను. మూలప్రకృతిపదముచే వ్యవహరించు ప్రధానసాధకము అనుమానమేగాని ప్రత్యక్షము గాదు. ఆయనుమానము 'సత్తువలన సత్తు బుట్టును' అనెడు కార్యకారణభావము నాధారముగా జేసుకొని ప్రవర్తించును. అట్టి కార్యకారణభావమును జెప్పవలసియున్నది. గాన దీనిని నిరూపించునిమిత్తము దీనికి విరుద్ధవాదములు జెప్పవలసి యున్నందున వాటియొక్క నిరూపణ మావశ్యకముగాన వాటిని జెప్పెదము.

1. అసత్తువలన సత్తు బుట్టునని సౌగతు లందురు.
2. సత్తువలన అసత్తు బుట్టునని నైయ్యాయికు లందురు.
3. కార్యజాతము సత్తుయొక్క వివర్తము పరమార్థసత్తుగాదని వేదాంతు లందురు.
4. సాంఖ్యులు సత్తువలన సత్తు బుట్టు నందురు.

ఈవిధముగ నాలుగువిప్రతిపత్తులు ప్రసరించును. ఇందు మొదటిపక్షము అసత్తువలన సత్తు బుట్టునన్నది అసత్తు యనగా అభావము గదా, దానికి స్వరూపములేదు. చెవలపిల్లి కొమ్మువంటిది. తుచ్ఛము. ఇట్టి తుచ్ఛమగుయభావమువలన ద్వితీయాదిక్షణములయందు ఘటాదిరూపసత్కార్యము బుట్టుననుట ప్రమాణవిరుద్ధము. గాన శశవిషాణతుల్యమగు యసత్తునకు కారణత్వ మెటుల జెప్పెదవు? కారణమనగా ఉపాదానము. కార్యము సత్తు. కారణమసత్తు యన్నచో సదసత్తులకు ఐక్యము లేనందున సద్రూపమగుకార్యములో అసత్తుకు కారణత్వము సంభవించదుగాన మొదటిపక్షము సరిగాదు.

2. ఇంక రెండవ పక్షమున కారణవ్యాపారముకంటె పూర్వమందు లేనికార్యము కారణవ్యాపారమువలన బుట్టుచున్నది గదా! సత్త్వమనగా నుండుట గదా! కారణవ్యాపారముకంటె పూర్వమందు కార్యము శశవిషాణతుల్యము. ఇట్టిదానికి కారణవ్యాపారానంతరమున సత్త్వ మెటులనో చెప్పవలెను. పూర్వ మసత్తు ప్రస్తుతము సత్తు. అని గదా నీయాశయము. నల్లరంగును పసుపురంగుగా జేయుట యెంతసాధ్యమో అట్లే అసత్తును సత్తుగా జేయుట గూడ యగును. పూర్వమందు అసత్త్వము, ప్రస్తుతము సత్త్వము యుండును. ఈసత్త్వాసత్త్వములు రెండును ధర్మములని గూడ యాశంకింపరాదు. కారణవ్యాపారముకంటె పూర్వమున ధర్మియే లేనిచో యీరెండును ధర్మములని చెప్పుట కుదురదుగాన పూర్వమందు గూడ కార్యమున్నదనియే చెప్పుట యుచితము. కారణవ్యాపారముకంటె పూర్వమందున్నచో ఉత్తరమందు కార్య మింద్రియగోచరమగునటుల పూర్వమున గూడ యేల ఇంద్రియగోచరము కాలేదని యాశంకించరాదు. కారణవ్యాపారముకంటె పూర్వమందు కారణమందు అనభివ్యక్తముగానుండి అనంతర మభివ్యక్తమగును. తిలలయం దనభివ్యక్తముగా నుండుతైలము గానుగులోవేసి ఆడినపిదప యెటుల అభివ్యక్తమగునో అట్లే ఆవులయందు అనభివ్యక్తముగానుండుక్షీరము పితికినపిదప యెటుల అభివ్యక్తమగునో అటులనే కార్యము కారణవ్యాపారముకంటె పూర్వము కార్యమందు కారణాత్మకముగానున్నందున పూర్వము అనభివ్యక్తముగాన ఇంద్రియగోచరము గాదు. కారణవ్యాపారానంతరమున అభివ్యక్తముగాన ఇంద్రియగ్రాహ్యము గావచ్చును. గాన కారణవ్యాపారోత్తరమందు కార్య మెటుల సత్తయో తత్పూర్వమున గూడ సత్తు యనెడుపక్షమే సమంజసము. లేనికార్యములో ఇది కారణమనుటలో యేదృష్టాంతము లేదు. మరియు కారణమువలన కార్యము బుట్టును. గాని యాకారణము కార్యసంబద్ధమా, లేక యసంబద్ధమా? మొదటిపక్షమున కారణవ్యాపారముకంటె పూర్వమందు గూడ కార్యము సిద్ధించినందున అది మాకభిమతవిషయమే. రెండవపక్షమున కార్యాసంబంధియగు కారణమువలననే కార్యము బుట్టుచున్నచో తంతువులవలన ఘటము, మృత్తువలన పటము, యీరీతిగా అన్నింటివల్లను అన్ని కార్యములు బుట్టవలసివచ్చును. ఈసంగతి నీసాంఖ్యాచార్యులవారు యీశ్లోకముచే చెప్పియున్నారు.

శ్లో. "అసత్త్వాన్నాస్తి సంబంధః కారణైః సత్త్వసంగిభిః,
అసంబద్ధస్య చోత్పత్తిమిచ్ఛతో న వ్యవస్థితిః." ఇతి.

కారణవ్యాపారముకంటె పూర్వమందు కార్యము లేనందున సద్రూపమైన కారణ

ముతో అసద్రూపమైన కార్యము సంబద్ధము గాదుగాన పూర్వముగూడ కార్యమున్నప్పుడే కార్యసంబద్ధమై కారణము కార్యమును బుట్టించునన్నపక్షము సరియగును. అట్లైనచో సత్కార్యవాదులమైన మాకభిమతమే. కార్యముతో నసంబద్ధమగు కారణమువలననే కార్యోత్పత్తి స్వీకరించినపక్షము సరి గాదు. ఏలననగా, ఘటమునకు మృత్తు కారణము, పటమునకు తంతువులు కారణము. మృత్తుకు పటసంబంధము లేదుగాన మృత్తువలన పటము పుట్టవలసివచ్చును. ఇటులనే తంతువులకు ఘటసంబంధము లేనందున తంతువులవలన ఘటము పుట్టవలసివచ్చును. ఇటులనే అన్నిటివలన అన్నియు పుట్టవలసివచ్చును. ఇదియే అనవస్థయని యందురు.

కార్యాసంబద్ధమైన కారణమువలన కార్యోత్పత్తిని స్వీకరించెదము. ఏకారణము యేకార్యముతో సమర్థమగుచున్నదో ఆకారణము కార్యసంబద్ధము గాకపోయినను ఆ కార్యమునే బుట్టించును. మృత్తువలన ఘటమే బుట్టునట్లున్నూ తంతువులవలన పటము బుట్టుచున్నట్లున్నూ అందరిచే చూడబడుటనుబట్టి మృత్తునందు ఘటోత్పాదనసామర్థ్యమున్నూ తంతువులకు పటోత్పాదనసామర్థ్యమున్నూ అనుమేయించెదము. మృత్తునందు పటోత్పాదన సామర్థ్యరూపమగుశక్తి లేనందున మృత్తువువలన పటము బుట్టనీ యనెడు యాశంకకును, ఇటుల నీతంతువులయందు ఘటోత్పాదనసామర్థ్యరూపమగు శక్తిలేనందున తంతువులవలన ఘటమున్నూ యేల బుట్టకూడదనుటకు వీలులేదుగాన కారణవ్యాపారముకంటె పూర్వమున కార్యము లేకపోయినను, కార్యజననసమర్థమగుశక్తినిబట్టి యనవస్థవారించునని యాశంకించ రాదు. తైలోత్పత్తికంటె పూర్వమందు తిలలయందున్న తైలోత్పాదకశక్తివలన గలుగు తైలోత్పత్తిని జూచి తిలలయందు తైలోత్పాదకశక్తిని యూహించి పూర్వమందు తైల రూపమగు కార్యాసంబద్ధమగు తిలలవలన తైలముబుట్టునని జెప్పుచుంటివిగదా! అది యట్లుండనిమ్ము. తిలలయందు యుండుకున్న తైలోత్పాదకసామర్థ్యరూపమగుశక్తిని యూహించితివిగదా! ఆశక్తి తైలోత్పత్తికంటె పూర్వము తైలరూపకార్యసంబద్ధమా? లేక అసంబద్ధమా? సంబద్ధమంటివా? పూర్వమునగూడ కార్యమున్నందున కారణవ్యాపారముకంటె పూర్వమందు లేనిదానికి ఉత్పత్తిని స్వీకరించు నీమతమునకు హాని గలుగును. సత్తువలన సత్తుబుట్టునన్న మాకభీష్టసిద్ధి యగును. రెండవపక్షమనగా తైలరూపకార్యాసంబద్ధమగుశక్తివల్లనే తైలరూపకార్యోత్పత్తిని స్వీకరించినచో వెనుకనుదహరించిన యనవస్థాదోషము వారించదుగదా! [గాన 'సతః సజ్జాయతే' యనుపక్షమునే యాశ్రయించుము.]

మరియొక హేతువుచే గూడ ఉత్పత్తికంటె పూర్వమందు కార్యముయొక్కస్థితి సంభవింపవచ్చును. ఏలనన, ఘటములో మృత్తువుయును, పటములో తంతువుయును, కారణము. ఈకార్యకారణరూపములగు ఘటమృత్తులు, పటతంతువులు వేరు గావు. అనగా ఒకటి యనియే మాయాశయము. ఏది దేని ధర్మమో అవి రెండును ఒకటియే. పటము తంతుధర్మము. ఘటము మృద్ధర్మము. అందువలన ఘటము, మృత్తువును ఒకటియే. ఇట్లే పటము తంతుధర్మము గావున పటము తంతురూపమే. ఏది దేనికంటె భిన్నమో అది దానిధర్మముగానేరదు. గుఱ్ఱము ఆవుకంటె వేరగునుగాన గుఱ్ఱముయొక్క ధర్మముగాదు. ఈవ్యతిరేక్యనుమానమువలన ధర్మధర్ముల నైక్యము సిద్ధించును. పటమనగా సంస్థానవిశేషముతో కూడుకున్నతంతువులేగాన తంతువులు యున్నచో పటరూపమగుకార్యము పూర్వము సిద్ధించును. ఓయీ; తంతుపటములు రెండును ఒకటియైనచో పటోత్పత్తికంటే పూర్వమున పటరూపమగుతంతువులు కప్పుకొనుటకు యేల యుపయోగింపబడుటలేదని యాశంకింపవలదు. పటతంతువులకు భేద మొంతమాత్రమును లేదు. సంస్థానవిశేషముతో గూడుకున్న తంతువులు ఆవిర్భూతపటభావమును బొంది అప్పుడు కప్పుకొనుట కుపయోగించును. ఆ సంస్థానవిశేషము పూర్వమందు తంతువులకు లేనందున పటభావము లేదుగాన పూర్వమున కేవలతంతువులే యున్నవి. గనుకనే ప్రావరణాద్యుపయోగి గాదు. లేనివస్తువునకు పుట్టుకయు, ఉన్నదానికి నాశమున్ను లేదు. అట్లైనచో 'పుట్టుచున్నది, నశించుచున్నది.' అను వ్యవహారమే లేకపోవలసివచ్చునే యని యాశంకింపరాదు. పుట్టినది యనగా లేనిది పుట్టునని యర్థముగాదు. మరేమన, ఉన్నదే యావిర్భవించినదని యర్థము. నాశ మనగా మతాంతరసిద్ధమగు నాశముగాదు. ఉన్నదానికే తిరోభావమని యర్థము ఇట్టి వ్యవహారము నీచే కల్పితమా? లేక లోకసిద్ధమా? లోకములో నున్నది. నేను స్వంతముగా కల్పించినదిగాదు. "ఎక్కడనున్నదో జెప్పుము." అని యంటివా, చెప్పెదను వినుము.

తాబేలుయొక్క యవయవము దానిశరీరములో యిముడ్చుకున్నప్పుడు తాబేలుయొక్కయవయవములు తిరోభావమును పొందుచున్నవనియూ, పైకివచ్చినప్పుడు "నిస్సరంతి, ఆవిర్భవంతి" యనియూ అందరు నాడుచున్నవిషయమే. అలాగుననే కారణమైనతంతువులనుండి పటము బుట్టుచున్నది ఆవిర్భవించుచున్నది, కారణమైనతంతువులలో ప్రవేశించునపుడు "తిరోభవతి, నశ్యతి" యనువ్యవహారము యుండును. దీనివలన తంతువులకంటె పటము వేరుకాదుగాన, కారణమున్నప్పుడు కార్యము గూడ యుండునుగాన అసత్కార్యవాదము యుక్తిసహము గాదు. లేనిదానికి బుట్టుకయు, ఉన్నదానికి నాశమూన్ను యుండదనుటలో భగవద్గీతావాక్యము గూడ ప్రమాణము—

శ్లో. "నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః" (గీ. అ. 2 శ్లో. 19)

లేనిదానికి ఉత్పత్తి లేదు, ఉన్నదానికి అభావము లేదని యీశ్లోకార్థము. ఏది సత్తుయో అది యెల్లకాలములయందును సత్తుయే, యేది యసత్తుయో అది యెల్లకాలముల యందునూ యసత్తు యని తాత్పర్యము.

ఈప్రత్యక్షసిద్ధమగు త్రిగుణాత్మకప్రపంచరూపకార్యముచే త్రిగుణాత్మకమైన సూక్ష్మరూపమగు ప్రధానము సిద్ధించును. ఇటుల నైయాయికాభిమతమగు అసత్కార్య నిరసనద్వారా కారణవ్యాపారముకంటె పూర్వమున గూడ కార్యముయొక్కస్థితి యీ గ్రంథముచే సాధింపబడ్డది.

శ్లో. "అసదకరణాదుపాదానగ్రహణాత్సర్వసంభవాభావాత్,
శక్తస్య శక్యకరణాత్కారణభావాచ్చ సత్కార్యమ్"

కార్యకారణవ్యాపారములకంటె పూర్వమందు గూడ కార్యము సద్రూపమే ఏలనన, "అసదకారణాత్" అసతః=అసద్రూపమునకు, అకారణాత్=కారణమనగా క్రియయని యర్థము. ఉత్పత్తిక్రియారూపము, ఉత్పత్తిరూపక్రియలేనందువలననూ, "ఉపాదానగ్రహణాత్" ఉపాదానమనగా కారణము, కారణము కార్యముతో సంబంధించినందువలననూ, శక్తస్య శక్యకారణాత్=కార్యముతో సంబంధించిన కార్యజననసమర్థమగుశక్తితో గూడు కున్నకారణము శక్యమైనకారణమును బుట్టించుటవలననూ, కారణభావాచ్చ=భావమనగా స్వరూపము కార్యము కారణస్వరూపమగుటనుబట్టి కారణవ్యాపారముకంటె పూర్వమందు గూడ కార్యము సత్తుయనియర్థము. ఇంతవరకు అసత్కార్యవాదులైన నైయాయికవైశేషి కులయొక్కమతము నిరసింపబడినది.

ఇటుపైన వివర్తవాదులైన వేదాంతులయొక్కమతము నిరసించబడును. వారిమతము యెట్టిదో చెప్పుదుమా? సద్రూపమగుబ్రహ్మయొక్క వివర్తము ప్రపంచమందురు. దీనికి అర్థ మేదిదో? విడనాడని పూర్వరూపముగల వస్తువయందు మరియొకరూపముగా భావించు టయే యని యర్థము. సువర్ణమునకు కుండలమున్నూ మృత్తునకు ఘటమున్నూ వివర్త మగును. కుండలముగా భాగించుసమయమున గూడ సువర్ణము పూర్వరూపమును విడనాడ కనే యున్నది. విడనాడని పూర్వరూపముగల సువర్ణమందు భాగించుకుండలము సువర్ణ మునకు వివర్తము. ఇటులనే మృత్తువుయొక్క వివర్తము ఘటము. ఇదియెటులనో సద్రూప మగు బ్రహ్మయందు భాసించుప్రపంచము బ్రహ్మయొక్క వివర్తము. ప్రపంచభానసమయ

మునగూడ బ్రహ్మకు మార్పులేదు: సద్రూపముగానే యుండును. కనుకనే బ్రహ్మావివర్తము ప్రపంచమని మాయావాదులందురు. వారు శుక్తియందు రజతముకువలె సద్రూపమగు బ్రహ్మయందు భ్రాంతియని చెప్పెదరు. అది సర్వథా అసంభావితము. సర్వానుభవవిరుద్ధము. శుక్తిరూప్యభ్రాంతిని దృష్టాంతముగా తీసుకొని బ్రహ్మయందు ప్రపంచభ్రాంతి స్వీకరించుచున్నారు దృష్టాంతదార్ష్టాంతికములకు చాలా వైలక్షణ్యము గలదు. ఆవైలక్షణ్య మేదియో చెప్పుమా? వినుము. రజతమనగా వెండి, అది చాలా తెల్లనిది. ముత్యపుచిప్ప గూడ కింద నలుపు, త్రికోణాకృతి పైన తెలుపుగలది. ఇవి రెండును తెలుపుగలవిగాన ఈశ్వేతరూపము వీట్లకు సమానధర్మము ఈసమానధర్మమునుబట్టి ముత్యపుచిప్పయందు వెండికి భ్రాంతి చెప్ప వచ్చును. ప్రకృతమున బ్రహ్మ సత్యము, రూపములేనిది, క్రియలేనిది. ప్రపంచము యసత్యము, రూపముగలది. ఇటులనే బ్రహ్మ చిద్రూపము, ప్రపంచము జడము. బ్రహ్మకు జగత్తునకు సాదృశ్యము లేనందున బ్రహ్మయందు జగత్తునకు భ్రాంతియన్నది మిక్కిలి యనుభవ విరుద్ధము.

ఈరీతిగా బౌద్ధనైయాయికులచేతను మాయావాదులగు అద్వైతవేదాంతులచేతను జూపించిన కార్యకారణభావమును నిరసించి, కారణవ్యాపారముకంటె పూర్వమున్న సద్రూపముగు కార్యమే అనంతరమున నావిర్భవించుచున్న సాంఖ్యాభిమతమగు కార్యకారణభావమును అనుసరించి, పూర్వమందు జెప్పిన యిరువదిఅయిదు తత్వములలో మొదటిదైన ప్రధానమును యనుమానప్రమాణముచే సాధించుచున్నాము. అనుమానప్రయోగము—"విమతం భావజాతం, సుఖదుఃఖమోహాత్మకకారణకం, సుఖదుఃఖమోహాన్వితత్వాత్." అనగా యేది దేనితో గూడుకొనునో అది తత్కారణకము. ఎట్లనగా కటకకుండలములు సువర్ణముతో గూడుకొనుటవలన సువర్ణము కారణముగలవియో, అట్లే యీప్రపంచము సుఖదుఃఖమోహములతో గూడుకున్నందున సుఖదుఃఖమోహములే కారణముగాగలది యను అనుమానముచేత ప్రపంచకారణమైన సుఖదుఃఖమోహరూపకారణము సిద్ధించును. అదియే ప్రధానము, మూలప్రకృతియు అనుభూయమానమగు ప్రపంచమునందు సుఖదుఃఖమోహాన్వితత్వరూపహేతుసిద్ధి అయినపిదప దానినిబట్టి నీవు ప్రధానమును సాధించవలెను గదా? అట్టి హేతువయే సిద్ధించనిచో నీకు ప్రధాన మెటుల సిద్ధించునని యాశంకించెదవా? దానిని చూపించుచున్నాను. ఎట్లనగా:—మైత్రునకు చాలామంది భార్యలు యున్నారు. వారిలో సత్యవతి యనునది ఒక భార్య. దానియందు మైత్రున కెక్కువప్రీతి గలదు. సత్యవతియందు యుండుకున్న, సత్వముద్రిక్తమై ఆవిడయందు యున్నసత్వము

వలన భర్తయందు సుఖము గలుగును. ఆమె భర్తకు సుఖరూపము. ఆమెయందుయుండు కున్న రజోగుణమువలన సవతులయందు దుఃఖముగలుగును. గనుకనే సవతులకు దుఃఖాత్మకము. ఆవిడ నిచ్ఛయించని చైత్రునియందు మోహము గలుగును. మోహమనగా ఔదాసీన్యము. అదియే తమస్సు. ఇటులనే ఒకవస్తువ ఒకనికి మోహమును గలుగజేయును. ఆవస్తువు లభించినందున దానిని బొందినవానికి సుఖోత్పాదకము. ఆవస్తువరసే లభించని వానికి దుఃఖమును గలుగజేయును. దానియం దుపేక్షాభావము గలవానికి మోహము గలుగును. మోహ మనగా ఉపేక్షాభావము, చిత్తవృత్తిరాహిత్యము. ఏవస్తువయందప ఏసుఖరూపముగలదో, అదియే సత్వము. ఏవస్తువయందు యేదుఃఖరూపము గలదో, అదిదే రజస్సు. ఏవస్తువయందు మోహాత్మతయుండునో, అదియే తమస్సు. కాన ప్రపంచములో యుండుకున్నవి అన్నియు వెనుకజెప్పిన ప్రత్యేకమున్నూ సుఖదుఃఖమోహరూపముగా గాన్పించుచున్నందున దీనికారణము గూడ అట్టిదే యని యూహించవలెను. అదియే త్రిగుణాత్మకమైన ప్రధాన మనబడును. శ్వేతాశ్వతరోపనిషత్తుయందు గూడ ప్రపంచకారణము త్రిగుణాత్మకమైన ప్రధానమని చెప్పబడియున్నది.

శ్రు. అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః,
అజో హ్యేకో జుషమాణోనుశేతే జహాత్యేనాం భుక్తభోగాదజోన్యః.

ఈవాక్యమందు యుండుకున్న 'న జాయత ఇత్యజా,' యనేవిగ్రహమువలన పుట్టుకలేని వస్తువనే పరిగ్రహించవలెనుగాని మరియొక రూఢ్యర్థమైన మేకను పరిగ్రహించరాదు. అట్లయినచో 'యోగాద్రూఢిర్బలీయసీ' యను నియమ మెట్లని యాశంకింపరాదు; రూఢ్యర్థమునకు పంకజాదిస్థలములయందు ప్రాధాన్యమున్నను యీవాక్యమాత్మప్రకరణమందు యుండుటవలన ప్రస్తుతమున రూఢ్యర్థమైనభాగమువలన ప్రయోజనము లేనందున అవయవార్థమునే గ్రహించవలెను. ఉత్పత్తిరహితమైన మూలప్రకృతియే అజాశబ్దమున కర్థము. అది నిత్యమగుటంజేసి పుట్టుకలేనిది, ఆమూలప్రకృతి ఒకటియే "లోహితశుక్లకృష్ణాం" యాకృతివాక్యమందు యుండుకున్న లోహిత శుక్లకృష్ణములవలె యెరుపు తెలుపు నలుపును బోధించునవిగావు. ఎరుపురంజకముగాన రజస్సుయు రంజకము. ఈరంజకత్వసామ్యముచే లోహితపదమునకు రజోగుణము యర్థము. తెలుపురంగుతోనున్న సూర్యుడెటుల ప్రకాశకుడో సత్వగుణముగూడ ప్రకాశముగాన, ప్రకాశకత్వసామ్యమునుబట్టి శుక్లపదము సత్వగుణార్థకము. నలుపురంగుగలమేఘ మెటుల సూర్యావరకమో, తమోగుణము గూడ యావరకముగాన యావరకత్వసామ్యముచే కృష్ణపదమునకు తమోగుణార్థకత్వము చెప్ప

దము. రజస్సత్వతమోగుణాత్మకమైనది యని యర్థము ఇట్టి త్రిగుణాత్మకమైన మూల ప్రకృతి త్రిగుణాత్మకమైన యనంతప్రపంచమును సృజించునది. ఏపురుషుడు యిట్టిప్రకృతి కార్యమగుబుద్ధిని, మనసును ఆత్మగా తెలుసుకొనునో వాడు బద్ధుడు, సంసారి. అనగా జనన మరణప్రవాహరూపసంసారము గలవాడగును. ప్రకృతి పురుషకాన్యతాజ్ఞానమువలన ముక్తుడైనవాడు యీప్రకృతిని, ప్రకృతికార్యమును విడుచునని దీనియర్థము. పూర్వా ర్ధముచే మూలప్రకృతియు, ఉత్తరార్థముచే పురుషనానాత్వమున్నూ చూపింపబడినది. ఈసాంఖ్యమతము శ్రుతిసమ్మతమని తెలుసుకొనవలెను. ఈమతమున పురుషులనేకమంది. వారం దరు చేతనస్వరూపులు. మూలప్రకృతి యచేతనమనియు, యీయచేతనమైన ప్రకృతియే ప్రపంచకారణమని యందురు. లోకములోయున్న యచేతనవస్తువులకు చేతనుడైన పురుషుని సహాయముననే ప్రవృత్తిగలుగుచున్నట్టు జూడబడుచున్నది. సారథియున్నపుడే యచేతనమైన రథము గమనమందు ప్రవర్తించుచున్నది. లేనిచో రథము నడచుటలేదు. కాన యీప్రకృతి గూడ యచేతనముగాన దీనికి ప్రవర్తకునిగా ఒకపురుషధౌరేయును స్వీకరించుట యావ శ్యకమని యనెదవుకాబోలు. అట్లవసరము లేదు. చేతనసహకారము లేని యచేతనములుగూడ ప్రవర్తించుచున్నట్లు, గానవచ్చుచున్నది. ఆవుయొక్కగర్భము నందుండుక్షీర మచేతనము గదా? ఆక్షీరము చేతనసహకారము లేక యెటుల వత్సయొక్కవృద్ధినిమిత్తము ప్రవర్తించు చున్నదో? యిటులనే యచేతనమైనజలము చేతనానధిష్ఠితమై లోకోపకారముకొరకు ప్రవర్తించుచున్నదో? అటులనే యచేతనమగు ప్రకృతిగూడ పురుషునియొక్కమోక్షము కొరకు ప్రవర్తించును. ఇందుకు ప్రమాణము సాంఖ్యకారికా—

శ్లో. "వత్సవివృద్ధినిమిత్తం క్షీరస్య యథాప్రవృత్తిరజ్ఞస్య,<br>
పురుషవిమోక్షనిమిత్తం తథా ప్రవృత్తిః ప్రధానస్య."

జడమైనక్షీరము చేతనసహకారము లేక వత్సయొక్కవృద్ధినిమిత్తము యెటుల ప్రవ ర్తించునో; అట్లే ప్రధానము గూడ చేతనసహకారము నపేక్షించక పురుషునిమోక్షము కొరకు ప్రవర్తించునని తాత్పర్యము.

అచేతనప్రవర్తకునిగా పురుషధౌరేయుడైన యీశ్వరుని స్వీకరించినమతము యుక్తి సహముగాదు. ఆయీశ్వరుడు కరుణచే ప్రవర్తకుడని యంటివా? కరుణ యనగా దుఃఖ మును పోగొట్టుసంకల్పము గదా! అట్టికరుణ గర్భస్రావమందేల యుండకూడదు? కాక, యీకరుణ సృష్టికి పూర్వమా? సృష్టియైనపిదపయా? మొదటిపక్షమున సృష్టికంటె పూర్వ

ముందు శరీరాదులే లేనందున పురుషునకు దుఃఖమే లేదు. కరుణతో పనియేమి? రెండవపక్షమున కరుణచే సృష్టియు సృష్టిచే కరుణయు యిట్టి యనవస్థాదోషము ప్రసక్తమగును. కాన, అచేతనమైన ప్రధానము, చేతనానధిష్ఠితమై ప్రధానపురుషసంయోగమువలన మహదాది రూపముగా పరిణమించునని చెప్పవలెను. మరియూ, సూదిగంటిరాయి అచేతనము వ్యాపారరహితమైనది. దానిసాన్నిధ్యముచే లోహమునకు వ్యాపారము గలుగుటవలె, నిర్వ్యాపారియగు పురుషునిసాన్నిధ్యముచే ప్రధానమునకు గూడ వ్యాపార ముండ వచ్చును. మరియొకటి, ప్రకృతి భోగ్యమైనవస్తువ. తననుయనుభవించునిమిత్తము పురుషుని నపేక్షించును. పురుషుడు కూడా ప్రకృతికార్యమైనబుద్ధి తానే యనుకొని బుద్ధియందుండు కున్న ఆధ్యాత్మికాధిదైవికాధిభౌతికములైన దుఃఖత్రయనివృత్తిరూపమగు మోక్షము యపేక్షించును. ఇట్టికైవల్యము ప్రకృతిపురుషాన్యథాఖ్యాతివలన గలుగును. ప్రకృతి లేనిచో, యీజ్ఞానమే సంభవించదు. తనమోక్షముకొరకు ప్రకృతిని యపేక్షించును.

కుంటివాడొకడు, గుడ్డివాడొకడు. వీరిద్దరున్నూ విజయనగరము చేరుకుందా మనే యుద్దేశముచే ఒకరస్తాలో ప్రవేశించిరి. వీరిద్దరు మొట్టలుపెట్టగా విజయనగరమువచ్చు చున్న కొంతమంది వీళ్లను తీసుకొని కొంతవరకు వచ్చిరి. పిమ్మట వీళ్లిద్దరున్నూ వాళ్లతో నడచుట కసమర్థులగుటవలన మరికొందరు వీరిరువరిని విడిచి తొందరగా వెళ్లిరి. పిదప దారిలో యుండుకున్నముళ్లు తగులుకుండుటచే మెల్లిగావస్తూ యిరువురున్నూ దైవవశమున కలిసిరి. విజయనగర మెట్లుగా వెళ్లడమని ఆలోచించి, వారిద్దరు యీప్రకారము సంకల్పించుకొనిరి. కుంటివాడ నగుటచే నేను తొందరగా నడవలేను. కళ్లులేనందున నీకు మార్గమెట్లు కనిపించును. ప్రత్యేకించి వెళ్లుట నీకు నాకునుకూడ సంభవించదు. కాన నన్ను నీభుజములమీద కూర్చునిపెట్టుకుని నేను చూపించినమార్గమున నీవు నడుస్తే, నీవు నేనున్నూ ఆదివారంరోజునకు విజయనగరం చేరెదమని కుంటివాడు చెప్పెను. వాడుచెప్పినదానిని గుడ్డివా డంగీకరించి, గుడ్డివాడు తనభుజములమీద కుంటివానిని గూర్చుండబెట్టుకొనెను. పిమ్మట కుంటివాడు చూపించుమార్గము ననుసరించి గుడ్డివాడు నడువగా పరస్పరసహాయము వలన వారిరువురు యెటుల ప్రాప్యస్థానమును పొందినారో, అటులనె దార్ష్టాంతికమందు పురుషునకు క్రియలేనందున వీడుపంగు. ప్రధాన మచేతనమగుటంజేసి అంధునివంటిది. పురుషుడు ప్రకృతికార్యమైనబుద్ధి తాదాత్మ్యాభిమానియై బుద్ధియందున్నదుఃఖమును తనయం దారోపించుకొని, పీడానివృత్తిని యపేక్షించి (అనగా మోక్షము నపేక్షించి) దానికి సాధనమగు జ్ఞానమును సంపాదించును. అజ్ఞానము, ప్రకృతి తనకంటె వేరు, తాను ప్రకృతి

కంటె వేరు యనునది యగును. ఇట్టిజ్ఞానము ప్రకృతిలేనిచో కలుగదుగాన, మోక్షము కొరకు పురుషుడు ప్రకృతిని యపేక్షించును. ప్రకృతియు తా నచేతనయగుటచే సృష్టిలో యసమర్థమగుటం జేసి, చేతనుడైన పురుషుని యపేక్షగలదై యున్నది. ఈవిషయము సాంఖ్యకారికలో జెప్పబడియున్నది.

శ్లో. "పురుషస్య దర్శనార్థం కైవల్యార్థం తథా ప్రధానస్య,
పంగ్వంధవదుభయోరపి సంయోగ స్తత్కృతస్సర్గః."

కుంటివాడు గుడ్డివానివలె ప్రకృతి పురుషుడిని, పురుషుడు ప్రకృతినియు అపేక్షించును. అచేతనమైన ప్రకృతి తనకు భోగ్యసిద్ధికొరకు పురుషుని యపేక్షించును. పురుషుడు బుద్ధి తాదాత్మ్యాభిమానముచే బుద్ధికృతమైన తాపత్రయనివృత్తిరూపమగు మోక్షముకొరకు ప్రకృతిని యపేక్షించును. కాన వీరిరువురికి సంయోగము గలుగును. మహదాదిసృష్టి లేనిది ప్రధానమునకు భోగ్యతయు, పురుషునకు కైవల్యమును సిద్ధించదు, గాన అందుకొరకు మహదాదిసృష్టిని యంగీకరించవలెనని శ్లోకతాత్పర్యము.

పురుషునియొక్క కైవల్యనిమిత్తము ప్రప్రధానమునకు ప్రవృత్తి యుండవచ్చును; కాని పురుషునివిషయమై అప్రధాన మెటుల నివర్తించుననగా! వ్యభిచారాదిదోషములతో గూడుకున్న భార్య దానిదోషమును గనిపెట్టిన భర్తనుగూర్చి యెటుల నివర్తించునో; నాట్యముజేయుస్త్రీ రంగస్థలమందు యుండుకున్న సభ్యులకు తననృత్యమును జూపి రంగస్థల మందుయుండుకున్న జనులను యెటుల విడుచునో, అటులనే ప్రకృతిగూడ మహదాదిపరి ణామరూపముగాను, శబ్దాదివిషయరూపముగను తనస్వరూపమును పురుషునికిజూపి నివర్తించును. ఇందులకు ప్రమాణము సాంఖ్యకారికా—

"శ్లో. రంగస్య దర్శయిత్వా నివర్తతే నర్తకీ యథా నృత్యాత్,
పురుషస్య తథాత్మానం ప్రకాశ్య నివర్తతే ప్రకృతిః."

నిరీశ్వరసాంఖ్యప్రవర్తకుడైన కపిలాచార్యులవారిమతానుసారము యీగ్రంథము వ్రాయబడినది. ఇందలి పొరపాట్లను చదువరులు కనిపెట్టి నాకు తెలియపరచినచో, నాబుద్ధ్యనుసారముగా దిద్దుకుందును.

# ఆధ్యాత్మిక శక్తి

విద్యాశేఖర శ్రీ ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిగారు, ఒంగోలు.

ఉత్తమమగుమానవజన్మము సాఫల్యము గావించుటకు ఆధ్యాత్మికజ్ఞాన మావశ్యకము. భవబంధమోక్షకరియగు నీజ్ఞానములేనినాఁడు, కేవలవిషయపరాయణుఁడై, సుఖదుఃఖముల ననుభవించుచు, జననమరణరూపసంసారచక్రమున పరిభ్రమించుచుండు. యుక్తాయుక్తవివేచనముఁ గలిగించు ధర్మజ్ఞానములు లేనినాఁడు, పశువులకును, మానవులకును గలభేదమేమి? దేహి ప్రాక్తనజన్మకర్మానుగుణ్యముగ సుఖదుఃఖముల ననుభవించి యనుభవించి విసుగుగలిగి శాంతినొందుటయే పరమసుఖమగు కైవల్యమనఁబడు. ఇట్టి కైవల్యమును బడయుటకై ప్రాచీనరాజర్షులును, ఆధునికవిజ్ఞానసంపన్నులును, వినశ్వరములగుగృహక్షేత్రధనదారాదులను, రాజ్యభోగములనువిడిచి దివ్యాశ్రమములందు, జ్ఞానసంపన్నుల అనుగ్రహమువడసి తపంబు సలిపి యోగాభ్యాసముచే, సమ్యగ్జ్ఞాననిష్ఠారూపమగు పరమశాంతి యనుమోక్షము నొందుచున్నారు. ఐశ్వర్య మెంతయున్నను, భోగము లెన్నియనుభవించినను, ఉత్తమాధికారపదవు లెన్నిబడసినను మనశ్శాంతినిఁ గలిగింపనిచో నవియన్నియు బాధాకరములగును. జీవించియున్నప్పుడే, కామక్రోధాదులను జయించి విషయపీడితుఁడుగాక నిర్లిప్తుఁడయి ఆత్మీయానందమగు పరమశాంతినిఁ బడసినవాఁడే ధీరుఁడును, ధన్యుఁడు నగును. ఇట్టి పరమశాంతి ఆధ్యాత్మికశక్తివలనఁ బడయ నగును.

2. అట్టి ఆధ్యాత్మికశక్తి తపశ్చరణమువలన జనించి, అంతర్ముఖమయ్యెనేని బ్రహ్మానందరూపమగు అమృతత్వము నొసంగును. బహిర్ముఖమయ్యెనేని, వివిధప్రజ్ఞలతోఁ గూడి ప్రతిభాశక్తియై కవిత్వమును, గానమును, ఇతరలలితకళలను లోకానందకరముగ జనింపఁజేసి, యపారధనమును కీర్తిని భోగంబుల నొసంగును. ఆధ్యాత్మికశక్తియే ప్రజ్ఞారూపముగనుండి మంత్రిత్వపదవిచేతను, పరార్థన్యాయవాదివృత్తిచేతను, భైషజ్యచికిత్సావృత్తిచేతను వాణిజ్యవృత్తిచేతను, పత్రికాసంపాదకత్వము; గ్రంథకర్తృత్వము లోనగువానిచే, నపరిమితధనంబును, ఐహికసుఖభోగంబులను, కీర్తిని గలిగించును. ఆధునిక (సినిమా) ప్రదర్శనమందు నటీనటులు గనఁబఱచు అభినయము, నాట్యము, గానమాధుర్యము, దివ్యకాంతి

వస్తుచిత్రప్రదర్శనము లోనగునవి ఆధ్యాత్మికశక్తిరూపప్రజ్ఞాబలంబుచేత ననియే గ్రహింపఁ దగును.

3. విద్యుచ్ఛక్తి Electric Power వెలుగునకు, వీవనకు, పాకమునకు, చికిత్సలకు, దూరస్థవార్తాసందేశములకు, (ప్రేషణకు) ఛాయాచిత్రములు లోనగువాని కుపయోగించి నట్లు, ఆధ్యాత్మికశక్తియు, పైఁజెప్పఁబడిన యెల్లవిషయములకు నాధారమగును.

ఈఆధ్యాత్మికశక్తి, తపోఽనుష్ఠానమువలన నభివృద్ధిఁజెందును. ఎట్లనగా? విద్యుచ్ఛక్తిని, జలప్రపాతములనుండియు, Dynamic యంత్రములనుండియు నుద్భవింపఁజేసినట్లు, ఇంద్రియనిగ్రహముతోఁగూడిన చిత్తైకాగ్రత Concentration of mind రూపంబగు తపస్సుచే నభివృద్ధిఁజెందుచుండు.

4. "శ్లో. మనసశ్చేంద్రియాణాం చ ఏకాగ్రం పరమం తపః" అని మనువును నిర్వచించినాఁడు. ఏవిషయమును చిత్తైకాగ్రతచే, దీక్షఁగలిగి భావింతుమో ఆవిషయకమగుసిద్ధి గలుగును. సిద్ధికి బూర్వము పలుతెఱఁగులగువిఘ్నములు వాటిల్లుచున్నను, వివిధశోధనలు గలుగుచున్నను, నిరుత్సాహము జెందక దీక్షతో నాకార్యమును ఉత్తములగుధీరులు సాధించుచుందురు. ఇప్పుడు కన్పించుచుండు, దివ్యగృహప్రాసాదక్షేత్రయంత్రవాహనాశ్వాంబరమణిరత్నస్వర్ణాభరణ పుత్త్రపుత్త్రికాకళత్రపరిచారికావర్గవివిధవస్తుసముదాయంబును ఉత్తమాధికారపదవులును, రాజసన్మానబిరుదంబులును అత్యధికతపఃఫలితంబులని పెద్దలు నుడివియున్నవారు. తపంబున కసాధ్యమగువిషయ మొక్కటియును లేదనియు, ఎద్దానినేని తపంబుచే సాధింపఁదగుననియు, మహర్షులు కనిపెట్టి లోకంబున కాదర్శభూతులయిరి. వినశ్వరంబు లగువిషయములఁగూర్చి తపంబుసలిపిన నవి లభించి, భోగంబులిచ్చి యంతరించుననియు, దానివలన తపంబు వ్యర్థమగుననియుఁ దలఁచి, యవ్యయంబును, అనంతంబును, నిరతిశయసుఖదంబును, అమృతత్వమునొసంగు సచ్చిదానందతత్త్వమునకై ఆధ్యాత్మికశక్తి రూపంబగుతపంబు నుపయోగింతురు. ఆధ్యాత్మికశక్తివలన శారీరకారోగ్యంబును, మనస్సౌఖ్యము, చిత్తప్రసన్నత, ఆత్మీయానందము, ధారావాహికబుద్ధి, అంతర్విజ్ఞానము, **Intuition** యోగసిద్ధియు, లోనగునవి కలుగును.

5. ఇట్టి ఆధ్యాత్మికశక్తి ఎట్లు ఉత్పన్నమగునన? సాత్త్వికాహారము, ఇంద్రియనిగ్రహము; బ్రహ్మచర్యము, బ్రహ్మోపాసన; దేవతారాధన, గురుశుశ్రూష, ప్రాణాయామాదుల వలనఁ గలుగును. ఉపవాసము, సాత్త్వికాహారము, తపశ్చరణమువలన ఇంద్రియమాలిన్యము తొలఁగి, అంతఃకరణశుద్ధి కలుగును. ఉత్తేజితమగునంతఃకరణమున ఆధ్యాత్మికశక్తి

చక్కఁగఁ బ్రసరించును. ఆర్థికపరిస్థితులు చక్కఁగ లేక వృత్తిదైన్యముగలిగి, సంతోషోత్సాహములు జనింపక, జనసామాన్యమునకు ఆధ్యాత్మికశక్తికలుగకుండుటకుఁ గారణమగుచున్న ది-చిద్రూపిణియు, ఉపాసితయు నగుసౌభాగ్యదేవత దివిజులకు అమృతానందములను, భువిజులకు హిరణ్మయియై, అన్నమును, భోగముల నొసంగును. సౌభాగ్యదేవతానుగ్రహమ్మున ఆధ్యాత్మికశక్తి కలుగును. అధోముఖప్రసరణముగల ఇంద్రియవృత్తులను, పశుధర్మమునుండి మరలించి, మానవధర్మమునఁ బ్రవర్తింపఁజేయవలయు. మనోనిగ్రహపద్ధతి మద్విరచిత "మనస్తత్త్వశాస్త్రము"న సాకల్యముగ వివరింపఁబడినది కావున నటఁజూడఁదగును.

6. ఆధ్యాత్మికశక్తిఁబడయుటకు, ఆధ్యాత్మికగ్రంథపఠనము, శ్రవణము, గురుశుశ్రూష లోనగునవి యావశ్యకములు. ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీతలు అను ప్రస్థానత్రయము వేదాంతశాస్త్రపఠనమునకు ప్రధానములు.

ఇట్టి ప్రస్థానత్రయము శాంకరభాష్యవ్యాఖ్యానములు, ఆంధ్రానువాదములతోడ వ్యయప్రయాసముల గణింపక చక్కనికాగితములమీద రమణీయాక్షరములతో బాగుగ ముద్రింపించి, జిజ్ఞాసుపాఠకమహాశయపండితలోకమునకు మహోపకారముగావించిన బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారిపుత్త్రులగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు, మిగుల సంస్తవనీయులు. పైనిఁజెప్పఁబడినవియేగాక, అముద్రితానేకశ్రుతిస్మృతీతిహాసపురాణకావ్యనాటకాలంకారాదిగ్రంథములను, వైద్యజ్యోతిషయోగమంత్రధర్మశాస్త్రాదిగ్రంథములను, సంస్కృతాంధ్రవ్యాఖ్యానానువాదములతోడ రచియింపఁజేసి, చక్కఁగా ముద్రింపించి, భాషాయోషామణికి దివ్యభూషణములుగ నలంకరించిన శ్రీశాస్త్రులగారి భాషాసేవ నిఖలజనసంస్తవనీయమై ఆంధ్రావని ఆచంద్రార్కస్థాయిగ, కీర్తితోడ వెలయుఁగావుత!

7. నీతిధర్మమతభాషారాజకీయవిషయములను దెలుపు "త్రిలిఙ్గ" పత్త్రికారత్నమును స్థాపించి, ప్రతివారమును వెలువరించుచు, సనాతనధర్మావలంబుల కాశ్రయముగను, విద్వత్కవిపండితోత్తముల శ్లాఘాపాత్రముగను గావించి, స్వధర్మకార్యనిర్వహణదీక్షాదక్షులగు శ్రీశాస్త్రులవారు నిరుపమాన దేశభాషాసేవఁ గావించినందులకు కృతజ్ఞతాబద్ధులై ఆంధ్రదేశీయులు "భాషోద్ధారక" బిరుదసన్మానముఁ గావించి చరితార్థులయిరి. వదాన్యులగు శ్రీశాస్త్రులువారు విద్వత్కవిపండితోత్తములను సత్కరించి వారిరచనానువాదములను ముద్రింపించి ప్రకాశింపఁజేసిరి. ఆంధ్రదేశములోని గ్రంథాలయంబుల కెన్నింటికో వారి

గ్రంథములను దానముచేసిరి. వారి నిరుపమాన ప్రజ్ఞాకౌశలము, ధర్మనిర్వాహణము, కార్యదీక్ష, భాషాసేవయు నెంతేని ప్రశంసనీయములు. ఇవియన్నియు, ఆధ్యాత్మికశక్తివలననే కలిగినవని వ్యాసముయొక్క ఫలితార్థము. నిరుపమానగీర్వాణాంధ్రదేశభాషాసేవఁ గావించినట్టియు, ఇంక ననేకాపూర్వగ్రంథములను, నిఘంటువులను, కోశములను నిర్మింపఁదలఁచినట్టియు శ్రీశాస్త్రులువారికి శ్రీపరమేశ్వరుండు దీర్ఘాయురారోగ్యైశ్వర్యంబులును అనంతశక్తియు నొసంగి ప్రోచుఁగాత యని ప్రార్థించుచు నింతట విరమించుచున్నాఁడను.

శ్లో. వావిళ్లాన్వయదుగ్ధవార్ధిహిమరుగ్భాస్వత్కళానాంనిధిః
రామస్వామిసుధీంద్రపుణ్యతనయః శ్రీవేంకటేశస్సుధీః,
గీర్వాణాంధ్రసమస్తగ్రంథవిలసన్ముద్రాపణఖ్యాపనాత్
భాషోద్ధారకమాప్య దివ్యబిరుదం జీయాచ్చిరం భూతలే.

---

శ్రీ దివాన్‌బహదర్ పి. సీతారామయ్యగారు, రిటైర్డు మదరాసు గవర్న్మెంటు సెక్రటరి, త్యాగరాయనగరు, మదరాసు:—

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు కార్యవ్యాపకముగలపెద్దలు. సంస్కృతము తెనుగుగ్రంథములప్రచురణకర్తగా నాకాతనియందు నెక్కువమక్కువ. అతడు అఖండపండితకుటుంబమునకుచెందినవాడు. ప్రసిద్ధపండితులును ఈకోస్తాలో తెలుగుసంస్కృతగ్రంథములు ఆదినిప్రకటించి కీర్తినిగడించినవారునయినతండ్రి శ్రీ రామస్వామిశాస్త్రులవారివలెనే శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారును శ్రద్ధతో వంశసాంప్రదాయమును నిర్వహించినారు. ప్రాచీనవిజ్ఞానమును వెదచల్లుటలో నిరాడంబరముగ నిర్వహించు కార్యక్రమమునకు తప్పెట్లు తాళములతోటి ఆర్భాటప్రకటనము ఉండదుగదా! ఇటువంటిపనిలో శ్రద్ధాళువులైనవారు తమపూర్వీకులయెడల తమధర్మమునునిర్వహించి విజ్ఞానమునుగోరు తమతరువాతివారికి దానిఅందించితిమనుతృప్తి పొంది సుఖింతురు. ఈశాస్త్రులవారు చిరాయువులై తమప్రజాహితసేవనుసాగించి సంస్కృతము తెలుగువాఙ్మయములఅభిమానుల అభివాదనములనందుదురుగాక! ఇది సాధారణప్రజ్ఞగలనాప్రార్థన.

# అహింసాపూర్వక సామ్యసంఘము : గీతోద్దేశము

(శ్రీ ఎం. వి. వి. కే. రంగాచార్యులు, బి. ఏ., ప్లీడరు, కాకినాడ.)

ఈనాడు ప్రపంచమున సత్వగుణోపాయమగు "అహింసను" గూర్చి రచించుట అనుచితధైర్యకృత్యము. మహాభారతయుద్ధప్రేరితమగు భగవద్గీతను దాని కాధారపరచవలె నన్న మరింత సాహసము. "హత్వాపి స ఇమాఁ లోకాఁ...న నిబధ్యతే" (భ. గీ. XVIII, 17) యని స్పష్టీకరించిన శాస్త్రీయస్మృతి ఖండాంతరంబుల నిప్పుడు సమలులో నున్నది. రసాయనపదార్థవిజ్ఞానమంతయు జీవనాశమునకు వినియోగించుచున్నది. "బహు వక్త్రనేత్రం......బహుదంష్ట్రాకరాళం..." XI, 23 "కాలానిలసన్నిభాని" XI, 25 "సర్వే సహైవావనిపాలకంఘైః...వక్త్రాణి తే త్వరమాణా విశన్తి" XI, 26 యనినట్లు చైనా, అబిశీనియా, పోలండు, జెకోస్లవోకియా, నార్వే, డెన్మార్కు, హాలండు, బెల్జియం, ఫ్రాన్సు, గ్రీసురంగములందు అగ్నివర్షములు ప్రజానాశనమునకును రాజ్యభ్రష్టత్వమునకును హేతువులయినవి. ఈయగ్నిగోళపతన మెన్నటికైన యమృతవర్షముగ మారునా? ఖాంబరువిమాన మెన్నడయిన జగత్కళ్యాణభూతమగు కుబేరపుష్పకముగ పరిణమించునా? ఈసమస్యకు గీతయే సమాధాన మిచ్చును?

ఇంకొక సందేహము. "చాతుర్వర్ణ్యం మయా సృష్టం" IV, 13, "బ్రాహ్మణక్షత్రియ విశాం" XVIII 41 "శ్రేయాఁ స్వధర్మో విగుణః" III, 35, & XVIII 47 ఇట్టి ప్రవచనములుగల స్మృతియందు సామ్యసంఘప్రాప్తి కాధారము గలదా? గుణకర్మభేదములచే గలుగు నైసర్గికబుద్ధి బలతారతమ్యములును వీనిచే సంభవించు నైశ్వర్యవ్యత్యాసములను సామ్యవాదముతో సమర్థించు టెట్లు? బలవంతముగ నొకవేళ నార్థికసామ్యత్వ మేర్పరచినను "బహుశ్యాం ప్రజాయేయ" యనినరీతిని స్వాభావికవిరుద్ధముల నణగద్రొక్కు టెట్లు? దీనికిని గీతయిచ్చుప్రత్యుత్తర మన్వేషింతము.

"సమలోష్టాశ్మకాంచనః" VI, 8 & XIV, 24 యని మంటిని బంగారమును సమానముగా పాశ్చాత్యపదార్థతత్వవేత్తలును గ్రహించిరి. అణువు లనునవి atoms ప్రత్యేక సృష్టివిశిష్ట్యములు కావనియు జలవాయువు మొదలు Hydrogen సువర్ణాంతముగల లోహజాతు లన్నిటికిని మూలాధారములగు శక్తికణములు Energy particles సామ్యము

లనియు సత్వరజస్తమోరూపప్రాయములగు Protons, Electrons, Neutrons త్రిగుణాత్మకవివర్ణ్యములనియు శాస్త్రపరిశోధన సాక్షాత్కరించివది. విశ్వమంతయు విద్యుత్తరంగనాట్యమండలి యని radio-magnetic waves లీలావిభూతి వీనిపరిణామ evolution ప్రదర్శనమనియు ఇంద్రియగోచరమయినది అయినను రసాయనశాస్త్రములును భౌతికజ్ఞానమును మానవక్షేమవ్యతిరిక్తములై జీవనమున కాపదపరంపరలను సమకూర్చుచున్నవి శాస్త్రజ్ఞాన మెంత హెచ్చినను దాని నిముడ్చుకొని సదుపయోగములోనికి దెచ్చుకొను అనుభవజ్ఞానము లేమింజేసి, మానవు లిప్పుడు దైవత్వమున కర్హమగుబుద్ధిబల ముండినను మర్కటమునును దగని చిత్తచాంచల్యవంతులుగ నున్నారు. monkeying with life ఏనూతనపరికరము కనిపెట్టినను ఏశస్త్రాస్త్రములు నిర్మించినను తాను జయించు టెట్లు! లోకమును "హనిష్యే చాపరానపి" XVI, 14 యని హింసించు టెట్లు! ఇవియే యాలోచనలు. ఎందుల కీఘాతుకకృత్యములు? దీనిపరమావధి యేమి యనుప్రశ్నలకు చోటే లేదు. రాజసతామసప్రవృత్తులచే నుదయించినజ్ఞానమును scientific knowledge క్రమముగ ననుభవవేద్యమై విజ్ఞానసహిత wisdom మయినప్పుడే అంతఃకరణతృప్తియు "కూటస్థః" అనుయుక్తప్రవర్తనమును గలుగును. VI, 8, VII, 2. & IX, 1.

జాత్యంతరభేదంబుల నారాధించి మూఢులు మనుష్యత్వము నవమానింతురు. వారి జనుల నణగద్రొక్కిన తామసప్రకృతియే ఆర్యులనియు నార్డికువంశులనియు Aryans, Nordic Races జర్మనీలో పిశాచతాండవము సల్పుచున్నది. "అవజానన్తి మాం మూఢా మానుషీం తనుమాశ్రితం" IX, 11. దూరమున నుండుమనువ్యక్తియేది? దూరమందుండు పాత్ర యేదియని శ్రీయాదిశంకరాచార్యస్వామి కిచ్చినసమశ్యయే "బ్రాహ్మణే శ్వపాకేచ, గవి శుని చ, సమదర్శినః" V, 18 యని సమాధానముచేయబడి "పాపయోనయః స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి" IX, 32 యని శ్రీమద్రామానుజసంస్కారముచే సంఘపరిణామమందు చాతుర్వర్ణ్యములకేగాక స్త్రీలకును తిరునారాయణపురమను మేల్కోటమున్నగుక్షేత్రములందు పంచములకును అధికార మేర్పడెను. ఇందులకు ప్రతిబింబకముగ నాళ్వారాదులను సర్వవర్ణ్యభక్తాగ్రేసరులను ఆప్తవచనప్రసాదకులగుటచే నాలయములందు ప్రతిష్ఠించుట జరిగినది. ఇది యానాటిజన్మభేదసమన్వయసూత్రము. పునశ్స్మరణీయము. విశ్వమానవభ్రాతృత్వమునకు పునాది.

ప్రపంచమందలి కాంచనమంతయు నిప్పుడు అల్పసంఖ్యాకులకాంక్షకు లోనైనది. "కామ ఏష క్రోధ ఏష" III, 37 "కామాత్క్రోధోఽభిజాయతే" II, 62 యని కామము

క్రోధముగా పరిణమించును. ఉన్న వారుంచుకొనుటకును మఱి వృద్ధిచేయుటకును లేనివారు సంపాదనకును రాజసతామసకృత్యములచే యోగక్షేమముల నాశింతురు. ఇట్టి విరుద్ధ హేతువుల Contradictions, Classwars, Haves & Have-nots సమన్వయించుటకు మూలకారణంబగు "అహం" "మమ" Possessiveness యను వ్యక్తిగతైకత్వమును నిర్మూలించి "సహానౌ భునక్తు "యని సంఘ మందరకును ద్రవ్యసదుపాయము గలుగునట్లును To each according to the needs "సహవీర్యం కరవావహై" యని యందరు శక్తి వంచనలేక పాటుబడునట్లును From each according to the capacity ఆర్థికకార్మిక సంబంధము గలిగించినచో "సహనావవతు" యని సంఘమంతయు నుజ్జీవించును.

ఖండాంతరంబులందు ప్రయత్నపూర్వకముగ నిట్టి సంఘపరిణామ ముద్దేశించబడినను దేశకాలానుగుణముగ నింకను తామసరాజసవైకల్యము లంతరించక జీవహింసాప్రేరితవిధానములపై నాధారము గలిగియున్నందున సఫలముకాలేదు. సోవియటు రష్యాలోని సామ్యవాదము యింటను బయటను అపాయముల శంకించుచు స్వస్వరూపస్థాపనకొఱ కెన్నియో దుష్కృత్యము లాధారముచేసుకొనెను. యుద్ధభయమధ్యమున నింగ్లాండును ద్రవ్యమంతయు రాజ్యాంగముఖముచేసి సామ్యపచనశాలలు Communal kitchen మున్నగు సంఘీకృతసదుపాయముల నెలకొల్పుచున్నను యీసంకల్ప మెట్లు పరిణమించునో యాతురసంన్యాసమువలె నెప్పు డంతరించునో ఆనాయకులే సూచింపజాలరు. ఒకవిధమైన యార్థికసామ్య మేర్పరుపదలచితివాయని ప్రధానమంత్రి చర్చిలుగారిని అమెరికాసంయుక్తరాష్ట్రాధ్యక్షుడు రూస్‌వెల్టు సందేశమంపినట్లు ప్రస్తుతము వాయుధ్వని వినబడుచున్నది. గాని యిది యహింసాత్మకమగునని యనుకొనజాలము. త్యాగమును అహింసయు దైవీసంపదలోనివి XVI 2. ఋజువర్తన, చిత్తశుద్ధియునట్లే దైవీచిహ్నములు XVI, 1 దైవీప్రకృతియందుగాని యుభయమునకు తావులేదు. రాజ్యములును నియామకులును భయపీడితులై కుతంత్రములు పన్నినంతకాలము మానవక్షేమము చేకూరదు. లోకమున కొందరి కస్వాతంత్ర్యమేర్పడినచో తక్కినవారికిని పరిణామలోప ముండకతప్పదు.

"సంతుష్టో యేన కేనచిత్, అనికేతః" XII,19, యేది దొరకినను సంతుష్టినొందుట, నొకచోట నుండకపోవుట యనునివి మమత్వమును సడలించును. పోషించుబాధ్యతనుండి ప్రత్యేకవ్యక్తుల నివృత్తించుటచే వారి దేహమనోబలములను సంఘమున కుపయుక్తములు జేయును. "అసక్తిరనభిష్వఙ్గః పుత్రదారగృహాదిషు" XIII, 10, ఆసక్తిలేకుండుట దారాపుత్రాదులయందు మమత్వములేకుండుట; స్వంతయిల్లు కాకుండుట; ఇట్టి ఏర్పాట్లు తొలిగ్రీకువేదాంతియైన ప్లేటో "రిపబ్లికు" అనుగ్రంథమునందు సూచించినాడు. సోవియటుపాలనావిధానములో గృహములన్నియు రాజ్యధనములోనివై పిల్లలపోషణయంతయు రాజ్యభారమైయున్నది. ఇట్లే అమెరికాయందును కుటుంబములు ప్రత్యేకపచనభారము వహించక జీవిత

ములను సాంఘికభోజనశాలయందు గడుపుచుందురు. ఇట్టి సామ్యసాంఘికభోజనవిధాన మిప్పటికిని శ్రీజగన్నాథక్షేత్రమునందు నిలచియున్నది. అచటి దేవళములోని పచనశాలలు పురమంతటికి నుద్దేశింపబడినవి. అట్లే శ్రీరంగము తిరుపతి మున్నగు దేవస్థానములలోను రామానుజకూటములందును మఠములందును సాంఘిక భోజనసదుపాయము లేర్పడి ప్రత్యేకప్రయత్నములను కొంతవరకు ననవసరపరచినవి. ప్రసాదవినియోగపద్ధతి Collective feeding సామ్యజీవనమునకు ప్రారంభవిద్య. "పరిగ్రహం విముచ్య నిర్మమః" XVIII, 53, స్వప్రయోజనమును వీడి మమత్వములేకున్న శాంతిగలుగును. దేహధారణార్థము తొట్రుపాటు లేకుండిన వ్యక్తి లోకోపకారి యగును.

వ్యక్తిగతజీవితము భోజనముపై, నాధారపడియుండినట్లే సాంఘికనైతికచరిత్రయు నాహారపదార్థ మెట్లు ప్రాప్తించుచున్నదియో నాయార్థికసూత్రముపై నాధారపడియున్నది. How the food is produced, and in what social relations, determines largely the nature of social life. బానిసత్వమునకు లోనై గానుగయెద్దువలె పనిచేయుచేతులచే తయారయిన భోజనద్రవ్యములను జీర్ణముచేసుకొనుధనికులును నీతిదూరులగుట తప్పదు. మానవపరిణామము ముఖ్యముగ నార్థికసంబంధప్రేరితము. Property relations are the chief factor in social evolution "ఆహారస్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః" XVII, 7, యనునట్లు సాత్త్వికాహార మలవడిననేగాని తామసరజోగుణములు నిర్మూలింపబడనేరవు. దుఃఖశోకామయప్రదములు XVII, 9, రజస్సును, నిర్వ్యసురుకులు సారములేక చెడినవి తినగా మిగిలినవి దుర్గంధసహితములైనవి XVII, 10, తమోగుణమును గలిగించును. తిండివిధానము మార్పుచెందనిది జీవనవిధానము బాగుపడదని గ్రహించిన భౌతికశాస్త్రజ్ఞులు పాశ్చాత్యదేశమందును సంస్కరించుచుండినను యుద్ధపైశాచికబాధితులైన యాదేశీయులు గుడ్డములు కుక్కలు మొదలగువాటిపై నాధారపడియుండుట యందరెరిగినదే. గింజ నొకటినాటి చెట్టు వేరొకటి మొలిపింప వీలులేనట్లే కార్మికప్రభావమునకు తగుఫలిత మనుభవించకతీరదు. ఇది వ్యక్తిగతముగ నెట్లో సాంఘికముగను నట్లే ప్రత్యేకజీవికివలెనే సంఘమునకును యుక్తాహారవిహారాదు లున్నవి. VI, 17, ప్రత్యేకధర్మములన్నిటిని నివృత్తిపలిపి మానవత్వమొక్కటే యవలంబించి కర్మఫలమంతయు నేకైక ముఖముగ నర్పించినచో పాపభీతికి తావుండదు, దుఃఖమునకు కారణమును లేదు. ఇందు వర్ణభేదాది స్వధర్మసమస్యయు హత్యాదిపాపకృత్యదోషమును అందువలన గలుగుభయమును అందుకు సంబంధించిన విషాదమును అంతరింపచేయబడినవి. "సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి, మాశుచః" XVIII, 66, సామ్యసంఘప్రాప్తి విశ్వరూపసందర్శనప్రాయము. అసంఘీయఫలితమే మోక్షసన్న్యాసయోగము.



# జ్యోతి

శ్రీ క్రొవ్విడి రామంగారు, బి. ఏ., బి. టి. యస్., శ్రీ భారతీతీర్థము, విజయనగరము.

సూర్యుడు అప్పుడే పడమటికొండలవెనక దాగుంటున్నాడు. లేఎండ మెరుగులు పశ్చిమాకాశాన్ని వింతరంగులతో అలంకరించడంచేత, ఆదృశ్యం చూడడానికి యెంతో మనోజ్ఞంగా వుంది. అప్పుడే యౌవ్వనం అంకురిస్తున్న కన్యలాగే విడుతూ విడుతూ వున్న కోమలమైన గులాబిపూలు చాలా నేత్రపర్వంగా వున్నాయి. ఈకోమలకుసుమాలలో వుండే మధువును ఆస్వాదించడానికా అన్నట్టుగా మొక్కచుట్టూ తిరిగి కొదమతుమ్మెద ప్రణయగానాన్ని ఆలపిస్తున్నాది. పూలపరిమళాన్ని రాజుగారికి అందించడానికి కాబోలు పిల్లగాలులు పూలగుత్తులను పలకరించుకుంటూ, ఎదురుగావున్న మహాలువేపు ప్రయాణం చేస్తున్నాయి.

అదొక విశాలమైన ఉద్యానవనం. దానిలో శిల్పియొక్క నేర్పును వెలువరించే మహా ప్రాసాదం, ఆప్రాసాదానికి ఆనుకునే నిర్మలమైన జలంతోకూడిన తటాకం వున్నాయి. గౌతముడు ఆవిశాలభవనంలో కూర్చున్నాడు. అత నెప్పుడు భౌతికప్రపంచకంలోనుంచి భావ ప్రపంచకంలోకి ప్రయాణంచేస్తున్నట్టే కనపడతాడు. ఆ అమాయకపు చూపులలో యేదో అవ్యక్తమైన ఆందోళన గోచరమవుతుంది. అతని వేడుకచెలికాళ్లు అనుచరులు అతనికి మనోవికాసం కలిగించడానికి యెంతో తాపత్రయపడతారు. కాని యెంతప్రయత్నించినా, గౌతమునికి మాత్రం యీభోగాలంటే, అట్టే యిష్టంలేకుండా వున్నాయి.

"వేడుకచెలికాడు ఆనంద్ ;—రాజా! నిన్ననే పంచరంగులరామచిలకను పట్టుకున్నామోయ్! అదెంత బాగుందనుకున్నావు!

మరొకడు:—ఆచిలక యెంత అందమైనదో అంత తెలివైంది. ఒక్కసారి చెబితే యెంతక్లిష్టమైన పదమైనా స్పష్టంగా ఉచ్చరిస్తుంది. అదుగో! చూసేవా! మనసంభాషణ విని ఆచిలకకూడా "రాజా! రాజా! అని నిన్ను పలకరిస్తున్నాది." అని ఆ అనుచరుడు చిలకపంజరాన్ని గౌతమునిముందు పెట్టేడు ఆవింతరంగుల పిట్టను చూసి గౌతముడు మురిసిపోతాడని పాపం! అతను భ్రమపడ్డాడు. గౌతముడు అతిదీనవదనంతో, జాలిచూపులతో ఆపక్షిని పరికించేడు. వేడినిట్టూర్పుతో "ఆనంద్" ను దగ్గరకు రమ్మని గౌతముడు సైగచేసేడు.

గౌతముడు:—"ఆనంద్! అనంతాకాశంలో నీలిమబ్బులచాటున పల్టీలుకొట్టుకుంటూ యథేచ్ఛగా విహరించవలసిన యీవిహంగమాన్ని యీపంజరంలో బంధించే రెందుకోయ్? స్వేచ్ఛకోసం యినపగజాల్ని రెక్కలతో టపటపాకొట్టుకుంటూ ఆవేదనతో విలపించే యీచిలకపలుకు యేమంత హృద్యంగా వుంటుందోయ్! చూడు! నీవేపు యీచిలక యెంత దీనంగా చూస్తున్నాదో! ఏపుగాను, సోగగాను పెరిగిన మామిడిపూలతోను, ఆకుపచ్చని పిందెలతోనూ ఆడుకుంటూ, మామిడిగున్నలమీద తిరిగినప్పుడే యీచిలక హాయిని అనుభవించగలుగుతుంది. ఆ అనుభవమే మనకు ఆనందాన్ని కలగజేస్తుంది. కాని యీ అమాయకమైనపక్షి తనవారినుండి విడిపోయి, యింత హింసపడుతూవుంటే, యీహింసవల్ల మనకు కలిగే ఆనందం యేమంత అనుభవయోగ్యంగా వుంటుందోయ్!" అంటూ గౌతముడు పంజరంయొక్క తలుపుతీసేడు. పిట్టఅమితమైన ఆనందంతో రివ్వున ఆకాశంమీదకు యెగిరిపోయింది. ఆస్వేచ్ఛాజీవిని చూసినప్పుడు గౌతముని పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

పడమటికొండలను ఆనుకునివున్న మబ్బుతునకలపైని ఎండమెరుగులు పడి ఆమబ్బుల సొంపును పెంపొందిస్తున్నాయి. ఆమబ్బులలో కొన్ని హరిణశాబకాల్లాగ, మరికొన్ని మదగజాల్లాగ వున్నాయి. ఆప్రకృతిసౌందర్యాన్ని రాజావారికి చూపిస్తున్నాడు. ఆనంద్-రాజావారిమనస్సు యెప్పుడూ ఆనందడోలికలలో వూగుతూవుండేటట్టు చెయ్యడానికి అతను బ్రహ్మాండమైన ప్రయత్నాలు చేస్తాడు. గౌతముడు ఆవైపుతిరిగి చూసేడు. తరువాత ఒక్కసారి వెనకకు తిరిగిచూసేడు. తూర్పునుంచీ కారుమబ్బులు ఆకాశాన్ని కమ్ముకుంటున్నాయి. క్షణంకిందట కనపడిన వింతరంగులు తనకళ్లయెదుటే మాయమైపోతున్నాయి. ఇదంతా చాలాక్షణికంగా వుందని గౌతముడు తనలో తాననుకుంటున్నాడు. ఇంతలో పాలపిట్ట తనముందునుంచే రివ్వున ఎగిరిపోయింది. ఆమరుచటి క్షణంలోనే హృదయవిదారకమైన ఆర్తనాదం వినపడింది. పాడుడేగ యెటునుంచో వచ్చి రెప్పపాటులో ఆపిట్టని పొట్టను పెట్టుకుంది. ఆవిలాపం పిట్ట హృదయంలోనుంచి బయలుదేరి భూనభోంతరాళాల్ని ఛేదించి, యింక యెక్కడికో దూసుకుపోతూన్నట్టువుంది అబ్బా! అంత చిన్నపిట్టకాలూకు గుండెలో యెంత ఆవేదనవుంది. నిండుప్రాణం క్షణంలో కళ్లఎదటే అంతరించిపోయింది. గౌతముడు యీసంఘట్టనను చూసి నిర్విణ్ణుడైపోయినాడు. అతనినాలుక పిడుచకట్టుకు పోయింది. కొంతసేపు తనకళ్లనే తాను నమ్మలేకపోయినాడు.

ప్రపంచకంలో ఒకరికాలూకు దుఃఖంమీద, కష్టంమీద మరొకరికాలూకు ఆనందం సుఖం ఆధారపడి వున్నాయికాబోలు. ఇంతేకాదు, ఒకరు బతకాలంటే మరొకరు అంతరించ

వలసివుంటుందేమో! తన ఆనందం కోసం రామచిలుకను బంధించేరు. డేగ ఆహారంకోసం పాలపిట్టను కబళించింది. ఇన్ని సంవత్సరములనుంచీ స్వప్నసౌఖ్యాన్ని మాత్రమే అనుభవిస్తున్నానని గౌతముడు తెలుసుకున్నాడు. లోకంయొక్క యదార్థస్వరూపం తనకు యింకా పూర్తిగా తెలియకపోయినప్పటికీ, వాటిజాడలుమాత్రం కొంతవరకు అకస్మాత్తుగా నేడు గోచరమయినాయి. మెల్లిగా నాటికి విహారంచాలించి యింటికి బయలుదేరేడు. గౌతముడు-త్రోవలో విగతజీవిని చూడడంకూడా తటస్థించింది. ఈదృశ్యం చూడడంతోనే అతను మరీ బెంబేరుపడ్డాడు. అసలు మరణమంటే యేమిటో అది యేవిధంగా యెప్పుడు ఆసన్నమవుతుందో తెలుసుకోవాలని గౌతముడు తన అనుచరుల్ని యెన్నో ప్రశ్నలు వేసేడు. వారు యీ ప్రసంగం మార్చడానికి విషయంలోనుంచి విషయాంతరంలోకి దుమికేవారు. గౌతముని లేతహృదయంలో యీ అనుభవాలు దృఢంగా నాటుకుపోవడంచేత, యెవరు యెన్నివిధాల మరిపింతాలుపెట్టినా, యీసంఘట్టనలే అతని మనోనేత్రం ముందు ప్రత్యక్షమవుతున్నాయి.

రాత్రి పన్నెండుఘంటలనగా రా పూర్తిఅయింది. నిద్రాదేవి లోకులందర్నీ తనవశం చేసుకుంది. కోటలో పహారావాళ్లు కూడా కునుకుపాట్లు పడుతున్నారు. నాటిసాయంత్రం నుంచీ గౌతముని మనస్సుకూ అంతరాత్మకూ తీవ్రమైన పోరాటం జరుగుతున్నాది. అతనికి ఆహారం కొంచెమైనా రుచించలేదు. ఇంతవరకూ అతనికంటిమీద రెప్పపడలేదు.

మనస్సు:—అతను కళ్లుతెరవని పసిపాప! ఆమె ఎండ కన్నెరుగని ముద్దరాలు. వారు, నీకోసం కనపడినదే ముడికల్లా మొక్కి, పుత్రునికోసం తపించి, తపించి, నిన్ను కన్నతలిదండ్రులు—ఇంతమందినీ విడిచి యెక్కడకుపోతావు. వీరందరినీ ద్రోహంచేయడం పాపం కాదూ!

అంతరాత్మ:—ఇదంతా నిజమే! కాని ఇరవైసంవత్సరాలకు పూర్వం, అంటే నువ్వు యీవిశ్వనాటకరంగంమీద ప్రవేశించకముందు నువ్వు యెవరో నీకు తెలియదు నువ్వు చనిపోయినతరువాత నువ్వేమవుతావో నీకు తెలియదు. సృష్టిరహస్యాన్ని కనుక్కోలేకపోతే నీకూ, పశువుకు భేదమేమిటి?

మనసు:—మనకోటలో నిశితప్రతిభావంతులైన పండితులున్నారు. ఇక్కడే ఆజ్ఞాపసాగిస్తే—

అంతరాత్మ:—ఇన్నిసంవత్సరాలనుంచీ యీపండితులంతా సృష్టియొక్క యదార్థ తత్వాన్ని నీనుంచి మరుగుపరుస్తున్నారు. రాజువిగదా అని ముఖప్రీతికోసం యేవో మాటలుచెప్తారు. తెలుసుకోవలసినవిషయం యింకా మిగిలే వుంటుంది.

మనస్సు:—ఆపసికందునూ, నిన్నే త్రికరణశుద్ధిగా నమ్మినభార్యను శోభపెట్టి, ఆర్జింవ బోయేజ్ఞానం యేమంత శ్రేయోదాయకమోయ్!

అంతరాత్మ:—వెఱ్ఱివాడా! అనంతకోటి జీవరాసుల్ని దుఃఖసముద్రంలోనుంచి తరింప జేయడానికి పూనుకున్నప్పుడు, నీభార్యాపుత్రుడు మాత్రం మిగిలిపోతారా! అజ్ఞానమనే చీకటికూపంలోనుంచి బయటకువస్తే అన్నిసమస్యలు సులువుగా పరిష్కరింపబడతాయి.

మనస్సు:—జ్ఞానోదయం ఎలా కలుగుతుంది?

అంతరాత్మ:—తపస్సువల్ల.

గౌతముడు అకస్మాత్తుగా లేచాడు. అతనిముఖంలో బ్రహ్మాండమైన దీక్ష వ్యక్తమవు తున్నాది. గబగబ మేడమెట్లు దిగి అనంతవిశ్వంలో ఆకటికచీకటిలో యొక్కడికో ఒంట రిగా యాత్రసాగిస్తున్నాడు.

కాలచక్రం పరిభ్రమించింది. కొన్నిసంవత్సరాలు గడిచేయి. గౌతముడు బ్రహ్మాండమైన తపశ్శాలిగామారేడు. ఇంద్రియనిగ్రహం కలగడంచేత, అతనిహృదయంలో యిప్పుడు శోక మోహాలకు తావులేదు. కాని లోకమంతా సంకటభూయిష్టంగావుంది. లోకులకష్టాల్ని తొలగించేమార్గం అతనికి యింకా సరిగా గోచరంకాలేదు. ఆమార్గంకోసం గౌతముడు కొంతకాలం శాస్త్రసాధనను సాగించేడు. వేదాల్ని ఉపనిషత్తులను పూర్తిగా శోధించేడు. మనిషికి ఆత్మపారిశుధ్యం కలగడానికి కావలసినవిషయం వాటిలోవుంది. కాని జనసామా న్యంలో అనేకమంది అజ్ఞానులు. వారికి అక్షరజ్ఞానమైనా లేదు. ఈబ్రహ్మవిద్య వారి కెలా అవగతమవుతుంది? గౌతమునికి యే ఆలోచనా పాలుపోలేదు. తనలక్ష్యాన్ని యేవిధంగా సాధించగలనా అని అతను తదేకధ్యానంతో ఆలోచిస్తున్నాడు. విశాలమైన అశ్వత్థవృక్షం కింద కూర్చుని భావప్రపంచకంలో ప్రయాణంచేస్తుండగా బ్రహ్మాండమైనజ్యోతి అతని మనో నేత్రం ముందు ప్రత్యక్షంఅయింది.

జ్యోతి:—దేనికోసం తదేకధ్యానంతో అలా ఆలోచిస్తున్నావు?

గౌతముడు:—కోట్లకొద్దీ జనం దుఃఖసముద్రంలో మునిగిపోతున్నారు. వారియొక్క వేడికన్నీళ్లు కార్చిచ్చుకన్నా యెక్కువబాధ పెడుతున్నాయి. చిచ్చు చనిపోయినవారిని దహిస్తుంది. అబ్బా! ఆశాభంగంవల్ల కలిగే ఆవేదన బతికుండగానే మనిషిని—ఈయా తనలో తపించేవారందరికీ తరుణోపాయం కావాలి.

జ్యోతి:—అజ్ఞానంచేత వారు దుఃఖపడుతున్నారు. జ్ఞానికి దుఃఖంలేదు.

గౌతముడు:—అంటే?

జ్యోతి:—లోకులు ఊహాప్రపంచంలో గాలిమేడలు కట్టుకుని అవి కూలిపోయి నాయని దుఃఖిస్తారు. అందుచేత అలాంటిమేడల్ని కట్టకపోతే దుఃఖం వుండదు.

గౌతముడు:—"అంటే కోరికల్ని తగ్గించుకోవాలన్న మాట.

జ్యోతి:—ఔను. కోరికల్ని యెంత తగ్గించుకుంటే దుఃఖం అంత తగ్గిపోతుంది.

గౌతముడు:—దుఃఖంనుంచి తప్పించుకోడానికి యిది మంచిమార్గమే—కాని కొంత మంది ఘోరపాపాలుచేసి కూడా దేవేంద్రభోగాల్ని అనుభవిస్తున్నారు. మరికొందరు యెంతో అమాయకులైనప్పటికీ వారు చాలా శోచనీయమైనస్థితిలో వున్నారు. దీనికికారణం?

జ్యోతి:—కర్మానుభవం ఒక్కజన్మతో పోదు. మనం చేసినకర్మయొక్క ఫలం యీ జన్మలోకాని జన్మాంతరంలోకాని మననే కట్టికుడుపుతుంది.

గౌతముడు:—మనకర్మవల్లే మనకు కష్టసుఖాలు సంభవిస్తాయి. అయితే మనం సుఖ పడడంగాని కష్టపడడంగాని మనచేతిలోనే వుందన్నమాట.

జ్యోతి:—ఔను.

గౌతముడు:—అయితే మరి దేవు డెవడు? అతనికి మానవుడికీ వున్నసంబంధం యేమిటి?

జ్యోతి:—నీకర్మవల్ల నువ్వు సుఖపడతావు, లేదా దుఃఖిస్తావు నీకష్టసుఖాలు నీచేతి లోనే వున్నాయి. దేవునిప్రాపు నీకెందుకూ?

గౌతముడు:—అయితే కంటకితమైన యీలోకంలో ఏటికి ఎదురీదేప్రజకు తరుణో పాయం ఏమిటి?

జ్యోతి:—అహింస.

గౌతముడు:—అంటే?

జ్యోతి:—మానవునిలో బ్రహ్మాండమైన శక్తి అణగివుంది. దానిని విశ్వమానవ సౌభ్రాతృత్వంకోసం, లోకకల్యాణం కోసం వినియోగించాలి. మనిషిలోవుండే పశుత్వాన్ని అణగదొక్కాలి. దేవత, రాక్షసి కూడా యెక్కువదీక్షతోనూ శిక్షణతోనూ ప్రచండ శక్తుల్ని సంపాదిస్తారు. కార్పణ్యంతో ప్రతీకారంకోసం తామసగుణప్రధానుడై తనశక్తిని వినియోగించినవాడు రాక్షసి. తనసోదరులలో అనేకమంది అశక్తులు, అజ్ఞానులు వున్నారని

తెలుసుకుని, వారు అశక్తులుకనుకనే వారిని యెక్కువగా ప్రేమించి వారిఅభ్యుదయానికి పాటుపడేవాడు దేవత.

గౌతముడు ఆజ్యోతివేపు తేరిపారి చూస్తున్నాడు. క్రమంగా ఆజీవనజ్యోతి తనలో లీనమైంది—తనసందేహాలన్నిటికీ సక్రమమైన జబాబు వచ్చింది. వెంటనే ప్రశాంత గంభీరమైన స్వరంతో సారనాథ్‌లో గౌతముడు తన అమృతసందేశాన్ని లోకానికి అందజేసేడు. వెంటనే కోట్లకొద్దీ అనుచరులు.

"బుద్ధం శరణం గచ్ఛామి
ధర్మం శరణం గచ్ఛామి
సంఘం శరణం గచ్ఛామి"

అని తనను వెంబడించేరు. ఆజ్యోతి! యీదేశంలోనే కాదు, ఖండ ఖండాంతరాల్లో కూడా నేటివరకు అతని అనుచరులు వెలిగిస్తున్నారు.

[ఈకథ శ్రీభారతీతీర్థలో జరిగిన "బుద్ధజయంతి" నాడు చదువబడినది.]
అధ్యక్షులు: ఆర్. యస్. రామచంద్రరావు, M. A., L. T., గారు.

---

శ్రీ యస్. వి. రామమూర్తిగారు, ఎం. ఏ., ఐ.సి.ఎస్., మదరాసు గవర్నమెంటు ప్రధానకార్యదర్శి, నుంగంబాకము, మదరాసు:—

తెనుగువిద్యావాఙ్మయసేవలో ఎనుబదిసంవత్సరములపూర్ణచరిత్ర మొందిన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్‌వారిని అభినందించుచున్నాను. ప్రస్తుతము ఆంధ్రులపురోభివృద్ధి ఒక్కటేమార్గమున జరుగదగియున్నది. ప్రజాసామాన్యములో విజ్ఞానమువ్యాపించుటకు మాతృభాషకాక వేరుపకరణముసాధ్యముగాదు. అందుచేత వీరింతకాలముచేసినపని ఎక్కువజీవకళగలదియని తోచకపోదు.

తండ్రికితగినపుత్రుడు పేరుప్రతిష్ఠలతో పేరుప్రతిష్ఠలుగలతనతండ్రిసాంప్రదాయమును పోషించినాడు. శ్రీవేంకటేశ్వరశాస్త్రులగారు మెత్తటివాడు. దయాపరుడు. ప్రతిఫలములెక్కింపక ధర్మనిర్వాహణముచేయువాడు. ఈగుణములు అతని మిత్రులకు అతనినిసన్నిహితముచేయుచున్నవి. ఇవియే అతనిప్రజాహితజీవనమునకు వన్నెపెట్టుచున్నవి. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును అతనిసంస్థయు తాము పెట్టుకొనినకార్యక్రమమును విజయపూర్వకముగ చిరస్థాయిగ నిర్వహింపగలుగుదురుగాక!

# శ్రీ శారదామాతృదేవి

శ్రీ మాధవచైతన్య బ్రహ్మచారి,
శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు.

పరమపావనచరిత్రయగు శ్రీశారదామణీదేవి శ్రీరామకృష్ణపరమహంస సహధర్మచారిణి, వనితాలోకమునకు శిరోరత్నము, పరమేశ్వరుడే సంసారమందలి సారమని లోకమునకు జాటిన పరమహంసి. ఈమెనుగూర్చి శ్రీరామకృష్ణు డిట్లు పల్కియున్నాడు:-"ఆమె యట్టి విమలచరిత్రయై యుండనిచో ఆత్మమార్గమున నిర్భయుడనై చరింపగల్గుదునా యని నాసంశయము" "ఆమె వివేకవైరాగ్యములనుగూర్చి యెవ్వరును సంశయింపకుందురుగాక. ఆమెయు (తన్ను ద్దేశించుచు) ఈవ్యక్తియు ఒక్కటియే యని గ్రహింపుడు." శారదాదేవి ఘనతనుగూర్చి పాశ్చాత్యవనితామణియగు సోదరి నివేదిత యిట్లు వక్కాణించియున్నది:— "భారతసతీత్వాదర్శమునుగూర్చి శ్రీరామకృష్ణుని పరమసిద్ధాంతమే శారదాదేవి." భారతసతీత్వాదర్శమునుగూర్చి యననేల, నిక్కముగా ప్రపంచమందలి సమస్తనారీమణుల యాదర్శమునుగూర్చియు ఆమె శ్రీరామకృష్ణసిద్ధాంతస్వరూపమని చెప్పనగును. "భగవన్మాతృత్వమును లోకమునకు దెలుపుటకై గురుదేవుడు నన్నీయిలలో నుంచినాడు" అని శ్రీశారదాదేవియే పల్కియున్నది.

వంగదేశమందలి జయరామవటి యనుగ్రామమున రామచంద్రముఖోపాధ్యాయుడు, శ్యామసుందరీదేవి యను బ్రాహ్మణదంపతులకు 1853-వ సంవత్సరము డిసంబరు ఇరువది రెండవతేదీ (పుష్య బహుళ సప్తమి) నాడు శారదాదేవి జన్మించెను. ఐదేండ్లవయసున వారామెను శ్రీరామకృష్ణున కిచ్చి పెండ్లిచేసిరి. శ్రీరామకృష్ణున కప్పుడు ఇరువదిమూడేండ్ల ప్రాయము. కలకత్తాయందలి దక్షిణేశ్వరమున కాళికాదేవ్యాలయమున శ్రీరామకృష్ణ డపుడు అర్చకుడై పూజాదికములందు నిమగ్నుడై యుండినకతన తరువాతి పదిపండ్రెండేండ్ల పర్యంతము భర్త నామె యొకటిరెండుసారులుమాత్రమే కలిసికొనగల్గెను. నిరంతరభగవదాయత్తచిత్తుడగు శ్రీరామకృష్ణునిగూర్చి లోకు లాతడు మతిభ్రష్టు డయ్యెననియు, సన్న్యసించెననియు, తీవ్రవ్యాధిగ్రస్తు డయ్యెననియు జెప్పుకొనసాగిరి. లోకులు కాకులుగదా. శారదాదేవి యీవదంతులను విని ప్రాణేశ్వరు నెప్పుడు కలిసికొని సేవచేయగల్గుదునా యని పరితపింపసాగెను.

తుద కొకనా డామె తండ్రితో పయనమై విశేషభాగము నడచుచు ఎనుబదియైదు మైళ్లు యాత్ర చేసి, దారిలో పడరానియిడుమలబడి దక్షిణేశ్వరమును జేరెను. శ్రీరామ కృష్ణుని గలిసికొనినపు డామె జ్వరపీడితయై యుండెను. శ్రీరామకృష్ణు డామె నత్యంతముగా ఆదరించి యామె మనశ్శరీరములకు స్వస్థతగల్గించెను. ఆలయమునందలి నహబత్ఖానాలో తన తల్లియొద్ద నామెకు బస నేర్పఱిచి తనతో నివసించుటకై సమస్తసదుపాయముల నొనర్చెను. భర్తృమనోభావమును గ్రహించి సర్వేశ్వరుడే తనహృదయేశ్వరుడని నమ్మి, శారదాదేవి శ్రీరామకృష్ణునకును తనయత్తయగు చంద్రమణీదేవికిని సపర్యల నొనర్చుచు మహానందముతో కాలము గడపుచుండెను. శ్రీరామకృష్ణు డామెకు సమస్తధర్మములను బోధింపసాగెను.

ఐహికసౌఖ్యములు తుచ్ఛములనియు ఆత్మానందమే ప్రాణులకు పరమప్రాప్యమనియు శారదాదేవి బాల్యముననే గ్రహించెను. ఆమెతాత్త్వికబుద్ధిని మనోనైర్మల్యమును దెలుపుట కామెవచనములనే యుదాహరించు టుచితము. "పండువెన్నెలరాత్రులలో చంద్రుని దిలకించి కరములు మోడ్చి యిట్లు ప్రార్థించుదానను: 'నాహృదయ మాచంద్రకిరణములవలె నిర్మలమై వెలయుగాక!' లేదా, 'తండ్రీ! లోకేశ్వరా! చంద్రునిలోగూడ మచ్చ గలదు, కాని నాహృదయము అకలంకమై వెలయుగాక!'' నిర్మలధ్యానమునుగూర్చి యామె యిట్లు వచించును: "ధ్యానమున సుస్థిరులమైనచో హృదయమున భగవానుని విస్పష్టముగా గన వచ్చును; అపు డాతనివాక్కులను వినవచ్చును. ఇట్టి నిర్మలమానసమున నేభావముతోచి నను అయ్యది వెనువెంటనే ఫలించును. అపుడు మీరు దివ్యానందమున నోలలాడెదరు, ప్రశాంతి మిమ్ముల నావరించును, వరించును."

నిత్యకృత్యములవిషయమున శారదాదేవి అత్యంతనియమబద్ధురాలు. బ్రాహ్మీము హూర్తమునకు ముందుగనే లేచి, గంగానదిలో స్నాన మాచరించి సూర్యోదయమగు వఱకు ధ్యాన మొనర్చును. అనంతరము గృహకృత్యములను నిర్వర్తించును. అత్యంతనిరా డంబరముగను ఎవ్వరికంటను బడకుండునంతటి యేకాంతముగను ఆమె మనుచుండెడిది. దివ్యసుందరము, ప్రశాంతమునగు నామెవదన మెల్లప్పుడును చిఱునగవున కాటపట్టై యుండెడిది.

నిరహంకారము ఆమె సుస్వభావమునకు అలంకారమని చెప్పనగును. అప్రయత్న ముగా పరిమళము నల్దిక్కులందును వ్యాపించురీతిని, నిశ్శబ్దముగా కమలములు వికసించి తమసౌందర్యమును ప్రకాశింపజేయుపగిది శారదాదేవి సుగుణములన్నియు అత్యంతసహ జముగా వికాసమునొంది లోకమునకు వెల్లడియయ్యెను.

## శ్రీశారదామాతృదేవి.

శారదాదేవియెడ శ్రీరామకృష్ణునకు అత్యంతగౌరవభావ మనినచో ఆశ్చర్యము కానేరదు. ఆమె నెన్నడును ఆతడు "నీవు" అని సంబోధించి యెఱుగడు. ప్రమాదవశమున నొకప్పు డాత డామె నట్లు సంబోధించి, పిమ్మట క్షమాపణ వేడికొనెను. శారదాదేవి పార మార్థికశక్తిసామర్థ్యములు తనపారమార్థికశక్తిసామర్థ్యములకు తీసిపోవని తెలుపుచు, శారదాప్రసన్నుడు (త్రిగుణాతీతానందస్వామి)అను తనశిష్యుని శ్రీరామకృష్ణుడు ఆమెయొద్ద మంత్రదీక్ష గైకొన నియమించెను. మఱియు నామెతో నొకప్పు డిట్లు వచించెను: "చుట్టు నున్న జనులు చీకటిలో వసించుపురుగులవంటివారు; వారు మీకు రక్షణీయులు." తన యనంతరము శారదాదేవి వేలకొలదిముముక్షువులకు మార్గము జూపవలసి యుండునని గ్రహించియే శ్రీరామకృష్ణు డిట్లు వచించెను.

సాధనసంపదనుబట్టి చూచినను శారదాదేవి శ్రీరామకృష్ణున కెనయగు కామకాంచన విజయిని యనుట కనేకనిదర్శనములు కలవు. లక్ష్మీనారాయణు డనుభక్తు డొకప్పుడు శ్రీరామ కృష్ణునకు పదివేలరూప్యముల నీయబోవ నాతడు నిరాకరించి శారదాదేవి యంగీకరించి నచో నామె కీయవచ్చునని తెల్పెను. భక్తు డంత శారదాదేవికడ కేగ నామె తాను గ్రహించు టొకటియు భర్తగ్రహించుట వేఱొకటియు గాదని తన పరమవిరక్తిని బ్రక టించి మించెను. లక్ష్మీనారాయణు డాదివ్యదంపతుల యఖండవైరాగ్యమును గాంచి యాశ్చర్యచకితు డయ్యెను.

నిరంతర బోధోపదేశములచే శ్రీరామకృష్ణునకు కంఠములో ప్రబలమగు వ్రణము బయలుదేఱెను. నరేంద్రుడు (వివేకానందస్వామి) మున్నగుశిష్యులును శారదాదేవియు నెంతటిశ్రద్ధాభక్తులతో సేవయొనర్చినను విధివశమున వారలప్రయత్నములన్నియు నిష్ఫల ములుకా నాతడు 1886 వ వత్సరమున మహాసమాధి నొందెను. శారదాదేవి దుఃఖసాగర నిమగ్నయయ్యు క్రమమున వివేకవైరాగ్యముల నవలంబించి పదపడి కొలదిమాసముల పర్యంతము తీర్థటన మొనర్చెను.

అనతికాలముననే ముముక్షుజనసహస్రములు శారదామాతృదేవి నాశ్రయింప సాగెను. విధివిరామములనునవి లేక మాతృదేవి వారలకు బోధోపదేశము లొనర్చుచుండె డిది. మాతృప్రేమ యపారము, అగాధము గదా. ఆమెసందర్శనము దివ్యావేశజనకమై యొప్పినచో ఆమెసంభాషణము తత్త్వజ్ఞానదాయకమై దీపించెను. ఆధ్యాత్మికవిషయములందే గాక, ఐహికవిషయములందును మాతృదేవి జిజ్ఞాసువులకు సదుపదేశము లొనర్చుచుండెడిది. ఇందుల కొకటిరెండు నిదర్శనములు. ఒకప్పు డొకభక్తురాలు మాతృదేవిని సమీపించి

యిట్లు తెల్పెను: "అమ్మా! మాయింటిబాధలు నాకు దుర్భరముగా నున్నవి. నాకు ఐదుగురు కూతులు, కాని వారికి పెండ్లియగు తెరువు కానరాకున్నది. కట్నము లిచ్చుటకు నాయొద్ద డబ్బులేదు. ఈబాధ నాకు సహింప నలవికాకున్నది. ఏమిచేయుదును!" మాతృదేవి క్షణ మూరకుండి యిట్లు విమర్శించి పల్కెను; "వారివివాహములనుగూర్చి నీకింత తాపత్రయ మెందులకు? తగినవరులు దొరకకున్నపక్షమున సోదరినివేడిత బాలికాపాఠశాలకు వారల నేల పంపరాదు? అనాయాసముగా వారచట విద్యనేర్వవచ్చునే! అపుడు వారును సుఖ వంతురాండ్రై పరహితమునకై పాటుపడగలరు." మఱియొకనాడు 'గోలప్‌మా' యను మాతృదేవి యనుచరురాలు మాతృదేవిసోదరుని కూతురగు రాధామణిని ప్రాయమువచ్చిన బాలికయనుకారణమున పాఠశాలకు వెడలవలదని నిరోధింప బాలిక విలపింపసాగెను. అది విని మాతృదేవి యిట్లు వచించెను: "ఆమె కేమంత ప్రాయము వచ్చినది? ఆమె కడ్డు తగులక బడికి వెడలనిమ్ము. ఉపయోగకరమగు చేతిపనులను తగినవిద్యను నేర్చికొనినయెడల పరుల కాబాలిక యెంతయో తోడ్పడవచ్చునుగదా. ప్రాజ్ఞతలేనిగ్రామములో ఆమెకు పెండ్లి చేసినారు. విద్యనేర్చుకొనుటవలన తాను బాగుపడుటయేగాక ఆమె తనబంధుగులకును స్వగ్రామములోని యజ్ఞానులకును ఎంతయో ఉపకరింపగలదు." మాతృదేవివచనములను గోలప్‌మా శిరసావహింప రాధామణి యథాప్రకారము పాఠశాలకు వెడలెను.

శారదామాతృదేవి యిట్లు వచించును: "బాలురును బాలికలును సదా పనిపాటలు గలిగియుండవలయును. లేనియెడల దుష్టచింతనలు వారితల కెక్కును. కాబట్టి వారికి పని పాటలు గల్పించుట తల్లిదండ్రులకును ఉపాధ్యాయులకును పరమవిధియై యున్నది. ఇవి నేను స్వానుభవముతో జెప్పుచున్నమాటలు. జయరామవటిలో నాచిన్నతనమున నేదియో యొకపనిలో రాత్రింబవళ్లు నిమగ్నురాలనై యుండుదానను పనిలేనిదే యెచటికిని వెడలు దానను గాను. ఉబుసుపోనిసుద్దులతో—లోకాభిరామాయణముతో—కాలక్షేపముచేయు ట నాకు పరమాసహ్యము. పనిలేనియెడల ఏదియో యొకపని కల్పించుకొనవలయును కాని వ్యర్థసంభాషణలతో శక్తిసామర్థ్యములను దుర్వినియోగము చేసికొనరాదు. సోమరితనము చెడుగునకు పుట్టినిల్లు. కాలము అమూల్యము, పోయినకాలము తిరిగిరాదు."

కళాశాలలో జదువుచుండిన యొకయువశిష్యునకిట్లామె బోధించెను. "మనోనిగ్రహమును నైర్మల్యమును అమూల్యమైనసంపదలు. హృదయనైర్మల్య మున్నయెడల పరంజ్యోతిని నీహృదయముననే గాంచగలవు. అట్టి నీహృదయమున ఏభావము తోచినను వెను వెంటనే ఫలించును. పండ్రెండేండ్లు అఖండబ్రహ్మచర్యవ్రతము పరిపాలించితివేని నీమేథాశక్తి

మొక్కవోకుండును. ఇది మనశాస్త్రవచనము కాబట్టి యెన్నడును వ్యామోహితుడవుగాక సదా మనోనిగ్రహమను కవచమును ధరింపుము; అపుడు నీలో జ్ఞానజ్యోతి దేదీప్యమానమై వెల్గును, ప్రశాంతి నీయధీనమగును. మనఃస్థైర్య మున్నపక్షమున నీవేపనితలపెట్టినను జీవితములో కఠినపరీక్షలన్నిటియందును నిశ్చయముగా దిగ్విజయము పొందగలవు. నిరాశకును దైన్యమునకును అగ్గముగాక శ్రద్ధాభక్తులతో ధైర్యసాహసములతో సదా పనిచేయుము. అపుడు విజయము నిన్ను వరించును."

సర్వజనులందును అనంతప్రేమ, అఖండసానుభూతి, శారదామాతృదేవిస్వభావమునకుగల ప్రధానలక్షణము. ఇవ్విషయమున జాతిమతభేదముల నెన్నడును ఆమె పాటించియెఱుగదు. పరులకష్టములను జూచినచో ఆమె దుర్భరపరితాపము నొందెడిది. ఒకప్పుడు తన్ను సందర్శించుటకై కొందఱు భక్తులు రాగా, దారిలో వారు వర్షముచే దడిసి, నీటితో నిండిన పొలములనుండి నడువవలసివచ్చెనని విని మాతృదేవి ఎంతయో విలపించెను. ఎంతటిపాపులనైనను ఆమె యాదరించి వారలకు సదుపదేశము లొనర్చుచుండెడిది. దీనులయెడలను పాపులయెడలను ఆమెప్రేమ సానుభూతులనుగూర్చి శ్రీరామకృష్ణునిశిష్యుడగు ప్రేమానందస్వామి తనసోదరశిష్యుల కిట్లు వచించియున్నాడు: "మనము హరించుకొనజాలనివిషమును మాతృదేవికడ కంపుచున్నాము. ఎట్టిపాపులకైనను ఆమె తనయాశ్రయము నొసగుచు వారలపాపములను గైకొని స్వయముగా భరించుచున్నది." పాపస్వభావులగు జను లామెపాదములను దాకినచో నామెపాదములు మంట లెత్తెడివి. వారిజ్ఞానప్రతిబంధకపాపముల నామె గ్రహించి బాధారూపమున అనుభవించుటయే యిందులకు కారణమని చెప్పనొప్పును. ఇదియే క్రైస్తవులపరపాపపరిహారసిద్ధాంతము **Theory of vicarious atonement** "కొందఱు నాపాదములను తాకుదురు, అపుడు నాకెంతయో హాయిగానుండును. మఱికొందఱు నాపాదములను తాకినచో కందురీగకుట్టినట్లు పాదములు మంటలెత్తును. ఆతాపము కొంచె ముపశమించుటకై గంగాజలముతో వానిని ప్రక్షాళన మొనర్చుకొందును" అని యామెయే శిష్యుల కొకప్పుడు తెల్పెను. ఈసంగతి నెఱింగిన శిష్యు డొకప్పు డామెపాదములను స్పృశింప సంశయించుచుండ మాతృదేవి యడిగని ప్రేమమీఱ నిట్లు వచించెను: "బిడ్డా! భయపడకుము. మేమిందులకై జన్మించితిమి. పరుల పాపములను దుఃఖములను స్వీకరించి వానిని మేమే భరింపనిపక్షమున మఱియెవ్వ రటుల చేయుదురు! మఱియెవ్వరు పాపులయొక్క—దుఃఖితులయొక్క—బాధ్యతలను భరింతురు!" ఇట్టిసందర్భముననే మఱియొకప్పు డిట్లు తెల్పెను; "నాబిడ్డ ధూళిలో పొరలాడుచుండిన

మొదల వానిని శుభ్ర మొనర్చి యెత్తుకొనుట నాధర్మము కాదా!" వేఱొకప్పు డొకవనిత తానొనర్చినపాపములనుగూర్చి పశ్చాత్తాపము జెంద మాతృదేవి యామెను కౌగలించుకొని దీవించి దివ్యోపదేశ మొనర్చెను. శారదామాతృదేవి యొకప్పుడు మన్నెపుజ్వరముచే బాధపడుచుండ నొకభక్తుడు ఆమెవలన మంత్రదీక్షనొందుటకై దూరదేశమునుండి వచ్చెను. తనస్థితి నెంచి మాతృదేవి తనయనుచరుడగు శారదానందస్వామి యాతని నిరాకరించెనని తెలిసికొని యఖండప్రేమావేశముతో నిట్లు ఘోషించెను: "వలదనుటకు శరత్ (శారదానందస్వామి) యెవరు! నేనిందులకై జన్మించితిని. ఓయీ! నేడేమైన భుజింపుము. రేపు నీ కుపదేశము చేయుదును లెమ్ము." ఏలన, ఉపదేశమునొందనిదే భుజింపనని యాభక్తుడు దీక్షవహించియుండెను. ప్రేమామృతసాగరమే మాతృదేవిహృదయము! అందలి దివ్యప్రేమతరంగములు వెలువడకుండ నెవ్వ రరికట్టగలరు? కంఠములో వ్రణముచే బాధపడుచు మరణశయ్యయందుండి సహితము శ్రీరామకృష్ణుడు ముముక్షువులకు బోధించుట మానెనా! అవసానసమయమునగూడ బుద్ధుడు జిజ్ఞాసువులకు బోధించెనే! ఇదియే కదా పరహితాచరణపరులస్వభావము! శారదామాతృదేవియు తానెంతటిబాధ నొందుచున్నను జీవితాంతపర్యంతము జిజ్ఞాసువులకు జ్ఞానదాన మొనర్చుచునేయుండెను.

దీననారాయణసేవయే ప్రధానధర్మముగాగల శ్రీరామకృష్ణసంఘమునెడ మాతృదేవి యపరిమితప్రేమాదరములను జూపుచుండెడిది. శ్రీరామకృష్ణమతసంఘములనుగూర్చి యామె తనమనోభావముల నిట్లు వెల్లడించెను. "ఆహా! నాబిడ్డలకొఱకై ఎంతగా విలపించి గురుదేవుని ప్రార్థించితినో కదా! ఆహేతువుచే గురుదేవు నాశీర్వాదమువలన ఎల్లెడలను మఠములును సేవాశ్రమములును వెలువడుచున్నవి. అనేకపర్యాయములు నేనిట్లు ప్రార్థించితిని. 'గురుదేవా! మీకొఱకై సంసారత్యాగులగువారికి అత్యంతసామాన్యమగు నన్నవస్త్రములకు లోపము కలుగకుండుగాక' యని నామనఃపూర్వకమగు ప్రార్థన. మిమ్ములను మీబోధనలను ఆశ్రయించుకొని నాబిడ్డలు కలిసిమెలసి నివసింపవలయుననియు సంసారపరిపీడితులగు జనులు వారియొద్దకువచ్చి, వారివలన మీవాక్కుల నాలకించి, యాత్మశాంతి నందవలయుననియు నాహృదయపూర్వకమగు ప్రార్థన."

శారదామాతృదేవిచరిత్ర దివ్యమాతృకథనము. ఆమె యుపదేశము లమృతవాహినులు. ఆధ్యాత్మికసాధనలందు జపమును భగవన్నామసంకీర్తనమును అత్యుత్తమములని యామె ప్రకటించెను. నిష్కామకర్మాచరణ మిందులకు సాధనభూతమనియు మనోనైర్మల్యప్రదమనియు నామె బోధించెను. శ్రీరామకృష్ణసందేశము నిదియే.

శ్రీశారదామాతృదేవి.

శారదామాతృదేవి తనయరువదియాఱవయేట (1920 వ సంవత్సరము జూలై 20 వ తేదీని) మహాసమాధి నొందుటకు ఐదుదినములకు ముందు ఒకశిష్యురాలి కిట్లు బోధించెను. "నీకు మనశ్శాంతి వలసినపక్షమున పరులనెన్నడును నిందింపకుము. సరికదా, నీదోషములను నీవు గుర్తింపుము. సమస్తప్రపంచము నీదే యని తెలిసికొని, నీది గావించుకొన బ్రయత్నింపుము. బిడ్డా! లోకమున నెవ్వరును నీకు అన్యులుగారు. సమస్తవిశ్వము నీదియే!" ఇదియే ప్రపంచమునకు శారదామాతృదేవి చరమసందేశము!!

శ్లో. జననీం శారదాదేవీం రామకృష్ణం జగద్గురుం,
పాదపద్మే తయోః శ్రిత్వా ప్రణమామి ముహుర్ముహుః."

---

దివాన్‌బహదరు. ఎమ్. బాలసుందరం నాయుడుగారు, C. I. E., రాంబాగ్, రిథర్డ్సన్‌రోడు, వేపేరి, మద్రాసు:—

నాప్రాచీనమిత్త్రులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిసేవనుగురించి అభినందనములు వ్రాయుటకు సంతోషపడుచున్నాను. త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాల సంపాదకుడుగాను, సంస్కృతము, తెనుగు, అరవములలో ప్రాచీనవాఙ్మయమును విద్యాప్రబోధకప్రచురణములనువేయు ఉత్తమ ప్రచురణసంఘుయజమానిగ ముప్పదిఏండ్లకు పైబడి నాకు వీరు బాగుగ తెలియును.

తెలుగులో త్రిలిఙ్గయు, ఇంగ్లీషులో దాని అనుయాయి ఫెడరేటెడ్ ఇండియాయు, రాజకీయముగా సాంఘికముగా ఆర్థికముగా అభివృద్ధిమార్గములను ప్రోత్సహించునవి. ఇందులోని సంపాదకీయములు ప్రసిద్ధులయిప్రజాహితులు విద్యాధిక్షితులు రచించిన వ్యాసములు, విప్లవముకాళ పరిణామమునుగోరు వాచకులకు ఎల్లప్పుడును ప్రత్యేకముసమ్మోదమునుగొల్పినవి. ఈరజతోత్సవసందర్భమున ఈపత్త్రికలు చిరసేవ యొనర్చి ప్రతిష్ఠనందు గాక! అని ఆశీర్వదించుచున్నాను.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ అను ప్రసిద్ధసంస్థవారు ప్రకటించు తెనుగు, అరవము గ్రంథములను చదువనుత్సుకులై యుండు వాచక మహాజనమునకు నుపకారమొనర్చుచు నామిత్త్రులు శ్రీ శాస్త్రులవారు చిరంజీవులై యుందురు గాక అని ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

# తాం జానీథాః

శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రిగారు,

c/o పోష్టుమాష్టరుగారు, కొమ్మూరుపోస్టు, (via) చీరాల, గుంటూరుజిల్లా.

ప్రాచీనాలంకారికుఁడైన ఉద్భటుఁడు తన కావ్యాలంకారసంగ్రహములో ఉపమాలంకారమునకు

"యచ్చేతోహారి సాదృశ్యముపమానోపమేయయోః,
మిథో విభిన్నకాలాదిశబ్దయోరుపమా తు తత్."

అని లక్షణము చెప్పి

"యథేవ శబ్దయోగేన సా శ్రుత్యాఽన్వయమర్హతి."

అని విభాగమొనర్చెను.

ఈవిభాగవాక్యమును వివరించుచు ప్రతీహారేందురాజు

"యథేవ శబ్దౌ చాత్ర ఉపలక్షణం అవ్యయాంతరాదపి వాశబ్దాదేః
తేన రూపేణ ఉపమానోపమేయ భావస్యావగతేః. యథా—
తాం జానీయాః పరిమితకథాం జీవితం మే ద్వితీయం
దూరీభూతే మయి సహచరే చక్రవాకీమివైకాం
గాఢోత్కణ్ఠాం గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలాం,
జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం వాఽన్యరూపామ్."

అని మేఘసందేశపద్య ముదాహరించెను. అనగా ఇచట పద్మినీం వా=పద్మినీమివ అన్యరూపాం జాతాం మన్యే అని సమన్వయము గనుక ఇవార్థమునందు వాశబ్ద ముపయోగింపఁబడినదికాన నిదియు శ్రౌతోపమాలంకారమున కుదాహరణమే యగునని తనయభిప్రాయమును తేల్చెను.

ఇక మేఘసందేశమునకు వ్యాఖ్యాతయగు మల్లినాథసూరి తన వ్యాఖ్యానములో ఇందలి చివఱిపాదము నిట్లు వివరించెను.

శిశిరేణ=శిశిరకాలేన, మథితాం పద్మినీం వా=పద్మినీమివ "ఇవ వద్వాయథాశబ్దా"ఇతి దండీ. అన్యరూపాం=పూర్వవిపరీతాకారాం జాతాం మన్యే అని.

మొత్తముమీద నీవ్యాఖ్యాత లిద్దఱును 'జాతాం మన్యే శిశిరమథితాం పద్మినీం

వాఽన్యరూపాం' అను అనుస్వారఘటితపాఠమునే యాదరించి ఇవార్థమునందు వాశబ్ద
ముపయోగింపఁబడినట్లు వివరించిరని స్పష్టముగానే తెలుచున్న దిగదా! ఇది యిట్లుంచుదము.

సాధారణముగ వ్యాఖ్యాతలు గూడ నిజముగా పండితులమని తలచుచు తప్పు
వ్యాఖ్యానములతో తప్పేగాక పూజ్యులైన మహాకవులను గూడ సిగ్గిలఁ జేయుచున్న వారు
కనఁబడుచున్నారు. అది యెట్లనగా—

ఈపై జెప్పిన పద్యములో "గాఢోత్కణ్ఠా గురుషు దివసేష్వేషు గచ్ఛత్సు బాలా
జాతా మన్యే శిశిరమథితా పద్మినీవాఽన్యరూపా" అను నీపాఠము నెఱుగకయే తమ కవి
త్వాటోపమునుఁ గూడ కొంత నచ్చట జూపుచు,అచ్చట నీపాఠమువలనవచ్చు సౌందర్యాతి
శయము నెఱుగక, 'అప్యైమి తదవజ్ఞానాదత్యర్థం పేషో మనోరథః' ఇత్యాదులయందు
సామాన్యముగ వాక్యార్థమును కర్మగా జేయుట చూచుచుండియు, ఇక్కడ 'మన' ధాతు
వున కున్న వాక్యార్థకర్మత్వమును గమనింపకయే 'మన' ధాతువునకు 'బాల' అనుపదమును
కర్మగా తలచుచున్నారు. పద్మినీ+ఇవ అనుచోట సవర్ణదీర్ఘసంధిచే వికారమును పొందిన
ఇవ శబ్దమును భ్రమచేత వాశబ్దమునుగా గల్పించి అపవ్యాఖ్యానముల నారంభించు
చున్నారు. కాని"యిచటగాఢోత్కంఠా గురుషు ఏషు దివసేషు గచ్ఛత్సు సత్సుబాలా శిశిర
మథితా పద్మినీవ అన్యరూపా జాతా మన్యే" అనియే అన్వయము. ఇట్లుగాక వెనుక జెప్పిన
యన్వయము జెప్పినచో అర్థమునకు వైచిత్రి యేమియు కన్పడుటలేదు. పైగా కాళిదాస
మహాకవి ప్రబంధములలో నెక్కడనైన నిట్టియన్వయము కన్పడుచున్నట్లుగా లేదు. కాళి
దాసు వంటి మహాకవి రసనిధానమైనకావ్యములో వ్యాధినిపలె ఇవార్థమునందు వాశబ్ద
ముపయోగించునా?

ఏమీ కాళిదాసునికవిత్వములో దోషములే లేవా? అయినచో చంద్రం
ప్రవృద్ధోర్మి రివోర్మిమాలీ' అని యాయనయే రఘువంశములో నెట్లు ప్రయోగించెను?
అచట రెండుచోట్ల ఊర్మిశబ్దము ప్రయోగించుటవలన కవికి నిర్మాణవిధానములో స్ఖలన
మగుపించుట లేదా? యని ప్రశ్నింపవచ్చును. కాని 'ప్రవృద్ధోర్మిరివోర్మి' అనునప్పుడు 'ఓర్మి'
అను రెండక్షరములకు మైత్రియున్నది. అందువలన ఆరెండిటిని యుచ్చరించినందువలన
శ్లేషసుఖమనుభవించుచు అర్థభేదము నెఱుగనియెవరో కల్పించిన పాఠమేగాని యిది
అసలుపాఠము కానేరదు. అసలు అచటపాఠము 'చంద్రం ప్రవృద్ధో జలధిర్నిశీవ' అనియే
నని యెఱుగవలయును.

కావున కాళిదాసమహాకవి యన్వయగతి యెచటను యిట్లు గాన్పింపదుగనుక
'గాఢోత్కంఠా గురుషు' అనునదియే కాళిదాసరచితపాఠము మఱియొకపాఠయే వ్యాఖ్యా
తలు భ్రాంతిచే గల్పించినది. అని వ్యక్తివివేకకారుఁడగు మహిమభట్టునియభిప్రాయము.

# ఏకాంకనాటిక *

## శ్రీ పి. వి. రాజమన్నారుగారు, అడ్వొకేటు, మదరాసు.

కవిత్వము, సంగీతము, ఇతరకళలు సమకాలీనభావాలకును, నాగరికతకును అనుగుణంగా ఉంటవి. పరిస్థితులు మారుతూవుంటవి. వాటితో ప్రజలవిశ్వాసాలు, ఆదర్శాలు అభిలాషలు మారుతూ వుంటవి ఇతరజాతీయసాహిత్యసంపర్కం కలుగుతుంది.

ఈకారణంచేత కలిగే నూత్నదృష్టికి క్రొత్తభావాలపైన క్రొత్తరూపాలపైన, క్రొత్తవస్తువులపైన ఇష్టము అభిమానము గౌరవము ఉండడం సహజము. ఇట్టి పరిణామము ప్రతి గొప్పభాషయొక్క చరిత్రలోనూ కనబడుతుంది.

నవీనాంధ్రసారస్వతం ఇప్పుడు ఆస్థితిలో ఉన్నది. పూర్వకావ్యపద్ధతులబలం తగ్గిపోయింది. ప్రబంధశైలి అత్యున్నతదశ అనుభవించి తరువాత క్షీణించి గతానుగతికమై నీరసించిపోయింది. సంఘంలో రాజకీయఆర్థికసాంఘికాదిసమస్యలు క్రొత్తవి దినదినము బయలుదేరి ప్రజల జీవితాలను అల్లకల్లోలం చేయుచున్నవి. అట్టిసమయంలో కవి కేవలం గ్రంథస్థమాత్రమైన జీవితాన్ని తనవస్తువుగా స్వీకరించగలడా?

ఇంతవరకు, ఒక్కసంస్కృతవాఙ్మయవాసనమాత్రం కలిగిన ఆంధ్రకవులకు ఇతర వాఙ్మయాలతో కూడా పరిచయం కలిగింది. ముఖ్యంగా ఆంగ్లవాఙ్మయంతో. ఆవాఙ్మయాల్లో ఉన్న క్రొత్తకావ్యభేదాలు క్రొత్తరీతులు క్రొత్తశైలి ఆంధ్రకవులమనస్సును ఆకర్షించినవి. ఆకర్షణ అనుకరణకు కారణమైంది. అనువాదాలేగాక స్వతంత్రంగా రచనలు క్రొత్త మార్గాలలో బయలుదేరినవి. ఇట్టి కావ్యభేదాల్లో ఏకాంకరూపకం ఒకటి. ఏకాంకరూపకం అన్న పేరు ఇంగ్లీషులో One act play కు ముక్కకుముక్కా తర్జుమా-వ్యుత్పత్తిప్రకారం, ఒకటే అంకంగలరూపకం అని అర్థం.

యక్షగానాలు తప్ప తెలుగులో నాటకాలుగాని ఇతరరూపకభేదాలుగాని, మొన్న మొన్నటివరకూ లేవు. సంస్కృతంలోమాత్రం అనేకం ఉన్నవి. పెద్ద లక్షణగ్రంథాలున్నవి. దశరూపకంవంటివి. ఆవాఙ్మయం పరిశీలిస్తే ఇప్పటి ఏకాంకనాటకంవంటి కావ్యరూపం ఉన్నట్లు స్పష్టమవుతుంది. అంతేగాదు. లక్షణభేదాలతో ఈరూపం వివిధంగా

---

* అఖిల ఇండియా రేడియో మద్రాసుకేంద్రమువారి అనుమతితో ప్రచురితము.

ఉపయోగింపబడినట్లు తెలుస్తుంది. ఒక్కొక్కరూప భేదానికి వేరేవేరే పేరుకూడావున్నది. అందులో ముఖ్యమైనవి కొన్ని చెప్తాను. భాణము, వ్యాయోగము, అంకము, వీథి, ప్రహసనము— ఇవిగాక ఉపరూపకాల్లో గోష్ఠి, ఉల్లాప్యము, నాట్యరాసకము, విలాసిక ఇత్యాదులు. వాటిలక్షణాలు వివరించడం ఇప్పుడప్రస్తుతం. మరి ఎందుకు యీప్రస్తావనఅంటే— "ఎరువులసొమ్ము బరువుకుచేటు, విజాతీయవాఙ్మయాల్లోనున్న కావ్యరూపాలు మనకెందుకు, అవి మనకు పనికిరావు" అని ఆక్షేపించే వారికి సమాధానంగా ఈరూపం స్వజాతీయమేనని చెప్పడానికి. ఇది ఒకకారణం. ఇంకోకారణం ఏమిటంటే మననవకవులదృష్టి కొంచెం పూర్వసంస్కృతవాఙ్మయఫక్కీలపైనకూడా ప్రసరిస్తే లాభకరంగా ఉంటుందని సూచించడానికి.

కావ్యసృష్టికి హేతుభూతంగా అనేకవిషయాలుంటవి. వాటినే విమర్శించి కనుక్కోడానికంటే సృష్టింపబడ్డ కృతులను చదివి ఆనందించడం, అవసరం. ముఖ్యం. ప్రతిభాషాచరిత్రలోనూ కొన్నియుగాల్లో సృష్టియెక్కువగా వుంటుంది. ఆంధ్రంలో ఇప్పటియుగం అటువంటిదే. తెలుగులో ఈపదిసంవత్సరాలలో ప్రకటింపబడ్డ ఏకాంకాలసంఖ్య చాలా ఎక్కువని చెప్పక తప్పదు. సంఖ్యమాత్రం వుంటే ఏమితృప్తి? కొన్నివర్షాలకు పూర్వం అసంఖ్యాకంగా నవలలు ఉత్పత్తి అయినవి. ప్రయోజనం? అందులో అనేకం అనువాదాలు, అనువాదాలు కానివాటిలో సారస్వతంలో ఉన్నతస్థానం ఆక్రమించడానికి అర్హతగలవి పట్టుమని పది అయినా లేవు. ఇతరభాషల్లోకి తర్జుమా చెయ్యడానికి తగినవి తెలుగునవలల్లో ఏవి అని కొంతకాలంక్రింద మాలో చర్చజరిగితే, "మాలపల్లి" "ఏకవీర"వంటివి మూడు నాలుగుకన్న తేలలేదు.

నాటకాల్లోనూ, అంటే ఆడడానికి 3, 4, గంటలుకాలం పుచ్చుకునేవి, అంతే వాటిలో ప్రత్యేకవ్యక్తిత్వం అల్లికబిగువు సహజశైలి అనుభవజ్ఞానం రససిద్ధికల స్వతంత్ర నాటకాలు ఎక్కువగా కనబడవు. ప్రతాపరుద్రీయం, కన్యాశుల్కం గొప్పనాటకాలే, కాని రెండునాటకాలతో ఆంధ్రసారస్వతభవనం ఎలా నిర్మించడం?

ఏకాంకాల్లో మాత్రం అలాకాదు. పక్షపాతంచేత మాట్లాడుతున్నానేమో గనుక పూర్తిగా విశ్వసించవద్దుగాని నామతంలో ఇంతవరకూ ప్రకటింపబడ్డ వాటిలోనూ ఇప్పుడు ప్రకటింపబడుతూన్నవాటిలోనూ మొదటితరగతిలో చేర్చతగ్గవి అనేకంగా వున్నవి. అవి ఆంగ్లమువంటి ఇతరభాషలలోని ఏకాంకనాటకాలతో సరిపోల్చి చూచినప్పటికీ తీసిపోవు. శివశంకరశాస్త్రి, చింతాదీక్షితులు, గుడిపాటి వెంకటచలం, విశ్వనాథ కవిరాజు, మల్లాది

అవధాని, నోరి నరసింహశాస్త్రి మొదలయిన నవకవుల ఏకాంకాలు ఏభాషకైనా వన్నె తెస్తవి.

ఈఏకాంకాలలో వివిధరసాలు పోషింపబడుతూన్నవి. ఇతివృత్తం కొన్నిట్లో ప్రఖ్యాతకథావస్తువులు కొన్ని చరిత్రాత్మకాలు కొన్ని పౌరాణికములు. చరిత్రలో, మంచి ఘట్టాలు రసవంతములైన సందర్భాలు ఏకాంకాలకు అద్భుతంగా వినియోగపడతవి మల్లాది అవధానిగారి "పీష్వా" ముద్దుకృష్ణగారి "అనార్కాలీ"లాంటివి. చింతాదీక్షితులు గారి "తిరుప్పాణాళ్వారు" గొప్పకృతి ఈశాఖలోనిదే.

కల్పిత ఏకాంకాలలో ముఖ్యవిభజనలు రెండు ప్రత్యేకంగా వర్ణింపతగ్గవి-వాస్తవికములు, విమర్శకములు. వాస్తవికములంటే ఆధునికజీవితముపై ఆధారపడినవి. వీటిలో ధనవంతులు విద్యాధికులేగాక సామాన్యజనులు పామరులు తక్కువజాతివారు కూడా పాత్రలుగా ఉండడం ప్రశంసనీయం.

"ఐరోపాలోని కవీశ్వరులు కొందరు కాపువారు సైనికులు మొదలయిన తక్కువ వృత్తులవారి బ్రదుకులను వర్ణనార్హములని భావించి యెంతో సుందరముగ కావ్యములలో వ్రాసియున్నారు. మనగ్రంథముల మాత్రము చదివి యీపుణ్యక్షేత్రమైన కురుక్షేత్రము యొక్క పరిస్థితుల నరయజూచువారికి ఈదేశమున బీదసాదులపై నాదరముగలకవి యెవరైన నున్నారా, తుదకు బీదసాదులైన నున్నారా యనుసంశయముపుట్టినను తప్పు వారిది కాదు. అహా! జనసామాన్యముయొక్క ప్రతిదినవృత్తములలో నెంతభావము, రసము, గుణము అవగతములై యున్నవో మనకవులకుం దెలియవుగదా?

"రాజపుత్త్రులను రాజకన్యకలను, చాలనందుకు బ్రాహ్మణులను, వేశ్యలను బట్టి జంఝాటమాడుటతప్పకవితకు మేలయిన యన్యకర్మములు లేవా" అని కట్టమంచి రామలింగారెడ్డిగారి కవిత్వతత్త్వవిచారంలో చాటించిన లోపం యీనాటికలు తీరుస్తున్నవి. జనసామాన్యముయొక్క ప్రతిదినవృత్తములు, కృత్యములు, రసపోషణకు ఎంత ఉచితంగా ఉంటవో యీయేకాంకాలు ప్రదర్శిస్తూ ఉన్నవి. నరసింహశాస్త్రిగారి "గజ్జెలమొలతాడు" "వరాగమనము" విశ్వనాథకవిరాజుగారి వినోదనాటికలు ఉదాహరణములు. ప్రతిమానవుని జీవితంలోనూ ప్రమోదం ఎంతఉందో, విషాదం అంతవున్నదన్న సత్యం చాటుచున్నవి ఇట్టి చిన్ననాటకాలు.

విమర్శకములలో కథకంటె భావమే ప్రధానం. హాస్యరసం పోషింపబడినప్పటికీ, అవి కేవలం నవ్వుటాలకి గావు. మల్లాది అవధానిగారు విశ్వనాథకవిరాజుగారి నాటికలకు తొలిపలుకు వ్రాస్తూ ఇలా అన్నారు.

"ఈనాటికలు ప్రహసనాలు కావు. పుబుసుపోనప్పుడూ కాలక్షేపానికీ చదువుకుందుకు బాగావుండేటందుకు వీటిని రచించలేదు. ప్రతీనాటకంలోనూ భాషమీదనో భావంమీదనో సంఘంమీదనో తీవ్రమైన విమర్శవుండనేవుంది." ఇంగ్లీషులో Satires ఇట్టివే! గుడిపాటి వెంకటచలంగారి ఏకాంకాలుకూడా ఇట్లే సంఘంలో వుండే దొంగవేషాలు దౌర్జన్యాలు దౌర్బల్యాలపైన దెబ్బతీస్తూవుంటవి. యుద్ధనాటికలు అనేపేరుతో మల్లాది అవధానిగారు ప్రకటించిననాటికలు నామమాత్రకంగా చారిత్రికములేగాని నిజంగా ఈశాఖల్లోకి వచ్చేవే. వారి ఉపోద్ఘాతంలో ఇది విదితంచేశారు. "ప్రాచీనాంధ్రచరిత్రనుంచి కథలు తీసుకొని నాటికలు రాశాను. కాని యివి అధునాతనచరిత్రకు చెందిననాటికలు. ఒక్క ఆంధ్రదేశానికే కాదు. ప్రపంచమంతటిలోనూ పాతుకుపోయిన మూఢవిశ్వాసాలను తొలగించే నాటికలివి. ఈనాటికలలోని పాత్రలపేర్లు ఆంధ్రంగా ఉండవచ్చునుగాని పాత్రలు ఆంధ్రులుమాత్రమే కారు. రాజకీయఆర్థికసమస్యల నిరూపణమే అవధిగాగల ఏకాంకాలు వీరి జాతీయాంతర్జాతీయనాటికలు.

ఉదాహరణంగా ఏవో కొన్నిటిని స్వల్పంగా వర్ణించాను. ఇవిగాక వేరేలేవని వినేవారు అనుకోకండి. అయితే ప్రత్యేకంగా శ్రీశివశంకరశాస్త్రిగారి పద్యనాటికలు మాత్రం పేర్కొని తీరవలెను. అవి మననవ్యసారస్వతానికి భూషణాలు. "పద్మావతీ చరణ చారణ చక్రవర్తి", "దీక్షితదుహిత" వంటికృతులు ఏభాషలోనూ ఉన్నతపదవి ఆక్రమించకపోవు.

అంతా పొగడ్తతోనే సరిపుచ్చాననని అనుకుంటారేమో? లోపాలు లేక గాదు. అనేక ఏకాంకాలలో స్వతంత్రత కనబడదు. అనగా ఇతరజాతుల ఆచారవ్యవహారములకు అనుగుణంగా ఆయావాఙ్మయాల్లో వ్రాయబడిన నాటికల్లోనిసందర్భాలు భావాలూ, ఆంధ్రజనుల ప్రస్తుతజీవితంలో ఉన్నట్లు వ్రాస్తున్నారు కొందరు. అట్లే మరికొందరు స్వానుభవవేద్యములుకాని భావాలను, తలపులను చిత్రించడానికి ప్రయత్నిస్తున్నారు. అవన్నీ సత్యాన్ని విసర్జిస్తున్నవి. కనుక సత్ వాఙ్మయానికి చెందజాలవు.

కవి విశ్వజనీనమైన మానవస్వభావప్రవృత్తి ప్రదర్శిస్తేనే కావ్యంగాని, నాటకముగాని, యథార్థంగా గొప్పదౌతుంది. అందుచేతనే మోలియర్ నాటకాలు 300 ఏండ్లు

అయినప్పటికి ఇప్పటికీ హృదయరంజకంగానే వున్నవి. ఈరహస్యం తెలుసుకొని మననవ కవులు వ్రాస్తే బాగుంటుంది. రెండవలోపం; ఏకాంకంలో అల్లికకు పటుత్వం ఉండాలి. భాష ఔచిత్యానికి భంగం కల్గించకూడదు. పొల్లుపదం ఒకటిఉన్నా తప్పే! ఎందుకంటే ఏకాంకం పరిమితి చిన్నది. వ్యర్థవాక్యాలికి చోటులేదు. కొన్నినిమిషాల్లో ప్రేక్షకులకు గాని పాఠకులకుగాని పాత్రలగుణగణాలు కథాసందర్భం తెలిసిపోవాలి! మంచి ఏకాంకం వ్రాయడం చాలా కష్టమని పాశ్చాత్యవిమర్శకుల అభిప్రాయం. కేవలం ఉత్సాహం మాత్రం ఉంటే చాలదు. ఆగుణంమాత్రమే కనబడుతుంది కొన్ని ఏకాంకాల్లో. అభ్యాసం అనుభవం విచారణ ఆలోచన అన్నీ ఉండాలి. ఇట్టిలోపాలున్నప్పటికీ ఉత్తమమైన ఏకాంకాలు అనేకంగా రచింపబడుచుండుట మనకు గర్వకారణమే! అనతికాలంలో ఆంధ్రుల ఏకాంకరచనాసామర్థ్యం లోకంఅంతా మెచ్చుకోగలదని నాఅభిప్రాయం. నానమ్మకం. నాఆశ.

**ఖాన్‌బహదూర్ మహమ్మద్ మూసాసేట్, మదరాసు ఎక్సుషరీఫ్ ఖుదారాద్‌ముర్‌జిల్, కథీడ్రల్‌పోష్టు, మద్రాసు:—**

కడచిన ఇరువదిఏండ్లుగా శ్రీ వీ. వేంకటేశ్వరశాస్త్రిగారిని నేనుబాగా యెరుగుదును. దక్షిణ ఇండియాలో పత్రికాప్రచురణరూపమైనసేవయు మదరాసులో ప్రజాహితజీవనమున అనేకరీతుల ఇతర సేవయుచేసియుండు వీరిని అభినందించుట మిక్కిలి సంతోషదాయకము. తెలుగువారపత్రిక త్రిలిఙ్గను ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియాను వీరు చాల విజయవంతముగ నడిపి ప్రజాప్రబోధమునకు తోడ్పడినారు. దక్షిణఇండియావర్తకసంఘము ఆంధ్రవర్తకసంఘము మదరాసు పోర్టుట్రస్టు మొదలగు వేరు వేరు సంఘములు ప్రజాహితసంస్థలమూలముగ వీరు ప్రజలయొక్క క్షేమమునకు అభివృద్ధికిని సేవచేసినారు. వీరి అభిప్రాయములు నిష్కపటములు. వీరికి జాతి మత విపరీతభావములు లేవు. వీరికి చిరాయువు సకలైశ్వర్యములు సమకూరు గాక!

# వానసవంశము—నారాయణభట్టు—ద్రాక్షారామము

ప్రధానశేఖర శ్రీబుర్రా శేషగిరిరావు ఎం. ఏ., పి. హెచ్చిడి. ఆంధ్రభారతీతీర్థ
విజయనగరము.

ఆంధ్రదేశములో రాజ్యాధిపత్యములు, మంత్రిత్వములు, సేనాధిపత్యములు, కవితా ప్రతిష్ఠలు నెలకొల్పి స్వతంత్రపరిపాలనదక్షతను ప్రకాశమానముచేసిన ప్రాచీనవంశములు కొన్ని కాలక్రమేణా అంతరించిపోయినా, కొన్ని యింకా మిగిలివున్నవి. చాళుక్యవంశం అంతరించిపోయినదని కొందరనుకుంటారు. కాని అది యింకా కళింగములో 'మాడుగుల' లో 'బావాజీబలేంద్రునివారు' అనే కుటుంబముగా నేటికిని వున్నది. విమలాదిత్యచళుక్య చక్రవర్తి మంత్రి నజ్జియప్రగ్గడవంశమింకా 'రావుల'వారన్న పేరుతో పేరాలలో ప్రవర్ధమానముగా వున్నది. 'విశ్వసుందరవిజయము' అనేపేరుతో వేగాయమ్మపేట జమీందారుల వంశచరిత్ర నీమధ్య ప్రకటించి, అందులో శ్రీదూపూరి జగన్నాథశర్మగారు ద్రాక్షారామ ప్రాంతమును క్రొత్తప్రసిద్ధిలోనికి తీసుకువచ్చి, ఆప్రాంతమందు 'నన్నయపేట' అనేమధుర వున్నదనిన్ని, వేగాయమ్మపేట జమీందారులసలాస్థలమువారై యుందురనిన్ని, వేగాయమ్మపేటవరకూ ప్రస్తుతం ద్రాక్షారామం యూనియను అమలుజరుగుతున్నదనిన్ని, ముద్గల గోత్రులైన ఈవేగాయమ్మపేట జమీందారులు ముద్గలుడైన నన్నయభట్టు (ఆంధ్రమహాభారతకర్త) వంశీయులు కానోపుననిన్ని అతిసమర్థతతో ఊహాలు పన్నినారు. వీటినిబట్టి నన్నయభట్టుగారుకూడా ద్రాక్షారామం ప్రాంతీయులు అవుదురు. ఈకొత్తవూహాలు శాంతముగా తత్త్వైకదృష్టితో పరిశీలింపదగియుండడమేగాక, ద్రాక్షారామప్రాంతపుగ్రామముల చరిత్రలు కూడా సూక్ష్మముగా పరిశీలింపవలసిన అవసరము కనబడుతున్నది. కొంతకాలము క్రిందట మౌద్గల్యులైన గోపాలునివారివంశీయులు నన్నయభట్టుగారిజ్ఞాతులను వాదము బయలుదేరినదిగాని అది నియోగివైదికి విభేదపుతగువులాటలలో చిక్కుకొని భ్రష్టమయి పోయినది. 'నన్నయపేట' కట్టించినవారు నన్నయవంశీయులై యుందురు; వారు ద్రాక్షారమువారైతే నన్నయభట్టుగారు మాత్ర మాప్రాంతమువారేల కాకూడదు? నన్నయభట్టుగారిసహాధ్యాయి నారాయణభట్టుగారుకూడా అచటివారేనా అన్నప్రశ్నకూడా రావచ్చును. ఈచిన్నవ్యాఖ్యలో నీయంశము కొంచము విమర్శిస్తాను. విబుధులు శాంతముతో చిత్తగించవలెను.

కొన్ని సంవత్సరముల క్రిందట విజయనగరం మహారాజాస్ కాలేజీ మ్యాగజీన్ **Viziangaram Maharajah's College Magazine** అనే పత్రికను ప్రిన్సిపల్ యేచూరి నరసింహంపంతులుగారి ప్రోత్సాహముతో నేను మొదటి సంపాదకుడుగా నడిపినరోజులలో, మాకళింగములో దొరికిన ఆంధ్రమహాభారతము తాళపత్రప్రతులు కొన్ని పరిశీలించుచుంటిని. వాటిలో కొన్ని శ్రీ అడిదము సూరకవిగారివంశీయులని వాటిలో, కొన్నిటిలో, నన్నయమహోపాధ్యాయినారాయణభట్టువంశము 'వానసధరామరవంశ'మని యున్నది. అనగా 'వానసధరామరవంశవిభూషణుండు నారాయణభట్టు వాఙ్మయధురంధరుడుఁ దన కిష్టుఁడుఁ సహాధ్యాయుడు నైనవాఁ డభిమతంబున దోడయి నిర్వహింపఁగన్' అని భారత పాఠము. ఇది అచ్చుప్రతులలో నేడు 'తానును ధరామరవంశవిభూషణుండు' అని మార్చియున్నది. 'దీనికి కారకులు 'వానస' అన్న మాటకు అర్థము తెలియని లేఖకులో ముద్రాపకులో అయివుండవలెను.' అని ఆరోజులలో నేనూహించి ఈవిషయమై, పరిశీలించితిని శ్రీభారతం లక్ష్మీపతిసోమయాజులుగారి వ్యాఖ్యతోవున్న వ్రాత ప్రతులలో కూడా "వానసధరామరవంశవిభూషణుండు నారాయణభట్టు" అని వున్నట్టున్ను, "వానస" అన్నది 'వైజర్సు', "కామర్సు" అన్నట్టు యింటిపేరనిన్ని నారాయణభట్టు రాజమహేంద్రవరం మిరాశీదారుడనిన్ని శ్రీసోమయాజులుగారి వ్యాఖ్యలో వున్నట్టున్ను శ్రీశ్రీశ్రీ పిఠాపురంమహారాజావారికి ఈభారతం వంశీయులు దాఖలు చేసిన తాళపత్రప్రతులలో కనబడ్డది. కాగా ఈవిషయమై విజయనగరం మహారాజాస్ కాలేజీ మ్యాగజీన్ మొదటిసంచికలో చిన్నవ్యాఖ్య వ్రాస్తిని. నన్నయగారికాలములో "వానస" వంశీయులు "క్షత్రియు"లు కూడా వుండినట్లు శాసననిదర్శన మావ్యాఖ్యలో చూపించి, అందుచేత, నారాయణభట్టుగారిది బ్రాహ్మణవంశమని ప్రత్యేకించి చెప్పబడవలసిన ఆవశ్యకతను చూపితిని. "వానస" ప్రగ్గడ అనే ఉద్యోగము "ప్యాలసుకంట్రోలరు" వంటిదని శాసనములలో స్పష్టపడుతున్నదికాని ఈ "వానసవంశీయబ్రాహ్మణు"ల యుదంత మిట్టి భారతపాఠముపైనే ఆధారపడివున్నదా, లేక దీని కింతకన్న బలమైన సత్తాగల ఆధారము దొరుకునాఅని వెతుకుచునే యుంటిని. దీనికి మరివొకకారణం కూడా వున్నది. ఆంధ్రమహాభారతకృతిపతియైన రాజరాజనరేంద్రునివల్ల "నందమపూండి" గ్రామము అగ్రహారముపొందిన "కవీభవబ్రాంకుశుడు" నారాయణభట్టు అనే బ్రాహ్మణుడు గలడు. ఆయననుగూర్చినశాసనము ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక మొదటిసంచికలో ప్రకటించిన శ్రీజయంతి రామయ్యపంతులుగా రితడే నన్నయభట్టుకు మహాభారతరచనలో సాయపడ్డ

నారాయణభట్టుని స్థిరపరిచినారు. ఆయనది హారితసగోత్రము, పేరు "నన్నినారాయణుడు" శాసనరచయిత "నన్నియభట్టు". ఈసందర్భము లొకటికొకటి పొందియున్నవి. అయితే వీరిది "వానస" వంశమని భారతములో చెప్పబడినట్లీశాసనములో లేదు. వంశముపేరే లేదు. (అందుచేత) "వానసధరామరవంశవిభూషణుండు నారాయణభట్టు" అని భారతములో చెప్పబడిన "వాఙ్మయధురంధరుడు" ఈశాసనములోని ప్రతిగ్రహీత నారాయణభట్టువునా?" అని సందేహము కలుగుతున్నది. శాసనమువల్ల స్పష్టపడని "వానసధరామరవంశము" చాళుక్యరాజాశ్రయము కలది వుండెనా అన్నసందేహము మిగిలేయున్నది. వీటికి సమాధానము తిరిగీ మాకలింగములోనే ముఖలింగక్షేత్రమందలి శాసనములలో కనబడ్డది. యిందుదాహరిస్తున్నాను:—

South Indian Inscriptions Vol. V. No. 176 of 1896 దక్షిణఇండియా శాసనములు. అయిదవసంపుటములో సం. 1896 రపు. నెం. 176 రు. శాసనములో ఇట్లున్నది:–

1 శశిరసఖేందుశకాబ్దే తౌలిని మాసే
2 శశాంకవారే చ సోమగ్రహణనిమిత్తే
3 నగరే మధుకేశ్వరాయ దేవాయ దాక్షా
4 రామనివాసః కాశ్యపగోత్రో వక్రిగ్రామ
5 చమూపతిః, నామనశర్మపుత్రో వాన
6 సభూదేవవంశవారిజ మిత్రః అల్లన
7 శౌరిః ప్రదాద్దీపమఖండం.........ఇత్యాది––

దీనినిబట్టి శా. శ. 1061 అనగా క్రీ. శ. 1139 సం. మందు దాక్షారాములో వానసవంశీయబ్రాహ్మణులు, యోధులు, సేనాధిపతులు, చళుక్యరాజోద్యోగులు కాశ్యపగోత్రులు ప్రసిద్ధిగా వుండినట్లు తేలుచున్నది. నారాయణభట్టుగారివంశంకూడా ఇట్టి "వానస" బ్రాహ్మణులే కావలెను గోత్రములు భేదించినా వారూవీరూజ్ఞాతులేనా అయివుండవలెను. గోత్రభేదము సమన్వయపడితే ఏకకుటుంబస్థులే కావచ్చును. నందంపూడి శాసనంప్రకారం కూడా నారాయణభట్టుగారివంశంలో "కావ్యఖడ్గతా" సంప్రదాయం కాపాటంగా కనబడుతుంది చిత్రమేమిటంటే ఈవానసవంశీయచమూపతులదికూడా ద్రాక్షారామప్రాంతమే. అందులోనే "నన్నయపేట" వున్నట్లిప్పుడు బయలుపడ్డది.

---

# మహాకవిశ్యామలుఁడు—భట్టబాణుఁడు.

**శ్రీ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యుఁడు, యం. ఏ.,**
ఆంధ్రగీర్వాణభాషోపన్యాసకుఁడు, పిఠాపురరాజకళాశాల, కాకినాడ.

సంస్కృతగద్యకావ్యకర్తలలో నగ్రగణ్యుఁ డగుభట్టబాణుఁడు హర్షచరితమున నొకచో నిట్లులు వ్రాసియున్నాఁడు.[1]

'తచ్ఛ్రుత్వా బాణస్య చత్వారః పితామహాముఖపద్మా ఇవ వేదాభ్యాసపవిత్రిత మూర్తయః, ఉపాయా ఇవ సామప్రయోగలలితముఖాః, గణపతిః, అధిపతిః, తారాపతిః, శ్యామల ఇతి పితృవ్యపుత్త్రాః భ్రాతరః, ప్రసన్నవృత్తయః, గృహీతవాక్యాః, కృతగురుపదన్యాసాః, న్యాయవేదినః, సుకృతసంగ్రహాభ్యాసగురవః; లబ్ధసాధుశబ్దాః లోకఇవ వ్యాకరణేఽపి, సకలపురాణరాజర్షిచరితాభిజ్ఞాః, మహాభారతభావితాత్మానః, విదితసకలేతిహాసాః, మహావిద్వాంసః, మహాకవయః, మహాపురుషవృత్తాన్తకుతూహలినః, సుభాషితశ్రవణరసాయనాః, వితృష్ణాః, వయసి వచసి యశసి తపసి సదసి మహసి వపుషి యజుషి చ ప్రథమాః, పూర్వమేవ కృతసంగరాః, వివక్షవః, స్మితసుధాధవళితకపోలోదరాః, పరస్పరస్య ముఖాని వ్యలోకయన్.

అథ తేషాం కనీయాన్ కమలదళదీర్ఘలోచనః, శ్యామలో నామ బాణస్య ప్రియాః ప్రాణానామపి, వశయితా, దత్తసంజ్ఞస్తైః, సప్రణయం, దశనజ్యోత్స్నాస్నపితకకుభా ముఖేన్దునా బభాషే.'

దీనినిబట్టి గణపతి, అధిపతి, తారాపతి, శ్యామలుఁడు ననునలుగురును బాణునికిఁ బినతండ్రి (లేక పెదతండ్రి) కుమారులనియు, యజుస్సామాదివేదవేత్తలనియు, మహాభారతభావితాత్ములనియు, శబ్దశాస్త్రాదిశాస్త్రవిశారదులనియు, మహావిద్వాంసులు కవులుననియు, గుపాధ్యాయులనియుఁ దనకంటె వయస్సునఁ జిన్నవారనియు, వక్తృత్వమునఁ, గీర్తియందుఁ దపస్సునందుఁ, దేజస్సున, దేహపాటవమునఁ బ్రథములనియు, నం దందఱికంటెఁ జిన్నయగు శ్యామలుఁడు బాణునకుఁ బ్రాణములకంటెను బ్రియుఁడనియుఁ దెలియుచున్నది.

1. హర్షచరితము, III ఉచ్ఛ్వాసము, ౩౮ పు. (కాణేపండితుని ప్రతి. 1918.)

పైనలువురలో నధిపతి తారాపతులనుగూర్చి యేమియు విశేషముగఁ దెలియదు. మహావిద్వత్కవులగు వీరిరచన లుత్పన్నమ్ము లైయుండును. గణపతినామకుఁడగు నొకానొక కవిశ్లోకములు సదుక్తికర్ణామృతము, సూక్తిముక్తావళి, సుభాషితావళి, సూక్తిసుందరము, పద్యామృతతరంగిణి యనుసుభాషితకోశములయందు లభించుచున్నవి. కాని వీనియందుఁ జేర్కొనఁబడిన గణపతి యొక్కఁడేయని నిర్ణయింప సాధ్యముకాదు. రాజశేఖరునిరచనగా సూక్తిముక్తావళి[1], సుభాషితహారావళులలో నీక్రిందిపద్యము కానఁబడుచున్నది.

'అథో గణపతిం వన్దే మహామోదవిధాయినం,
విద్యాధరగణై ర్యస్య పూజ్యతే కణ్ఠగర్జితమ్.'

(సూక్తిముక్తా. 45. పు. ౮౨. పద్య)[2]

దీనినిబట్టి 'మహామోద' మనుకృతిని రచించినగణపతికి రాజశేఖరుఁడు నమస్కృతి చేయుచున్నాఁడనియు, 'విద్యాధరగణైః' అనునది శ్లేషగర్భముగఁ గవికిఁ గలగాంధర్వవిద్యావైదుష్యమును సూచించుచున్నదనియుఁ జెప్పనగును. మహామోదము బహుశః నాటకము కావచ్చును. ప్రాచీనములగు సూక్తిముక్తావళి, సదుక్తికర్ణామృతము, సుభాషితావళి, అను కోశములలోఁ జేర్కొనఁబడిన గణపతికవి రాజశేఖరునికాలమునకే ప్రఖ్యాతుఁడగు గణపతి కవి కావచ్చుననియు, నీగణపతియు భట్టబాణునికిఁ బితృవ్యపుత్త్రుఁ డగుగణపతియు నొక్కఁడే యనియు నూహింపఁజనును. ఈతనిరచనలుగాఁ దెలియవచ్చినవానిలో విఘ్నేశ్వరస్తుతిపరమగుపద్యము నుల్లేఖించి తక్కినశ్లోకముల ప్రతీకలమాత్ర ముట్టంకించెదను.

'పాయాద్గజేన్ద్రవదనః స ఇమాం త్రిలోకీం, యస్యోద్గతేన గగనే మహతా కరేణ
మూలావలగ్నసితదన్తబిసాఙ్కురేణ, నాలాయితం తపనబిమ్బసరోరుహస్య.'

(సూక్తిముక్తా. 23 పు. ౪౫. శ్లో. 'గణపతేః;' సు. హారా. 'గణపతేః,' సుభాషితా. ౮౦ శ్లో. 'కస్యాపి')

అ. సదుక్తికర్ణామృతము—[3]

౧. (అన్ధకారము)—'ఉత్సారితో హసిత' —II. 147. ౨ పద్య. (౧౬౪పు.)
౨. (లక్ష్మీశృఙ్గారము)—'తిర్యక్త్వా దబుధః' —I. 68. ౨. ప. (౪౯పు.)
3. (చన్ద్రికళ)—'విగాఢదోషం' —I. 73. 3. ప. (౭౨పు.)

ఆ. సుభాషితావళి—

౪. (ఆశీర్వచనము.)—'భ్రామ్యన్మహాగిరినిఘర్షణ' —౬౧ ప.

2. గైక్వార్ ప్రాచ్యగ్రంథావళి.1938.

3. లాహోరుప్రతి.

ఇఁక శ్యామలునిగూర్చి విచారింపఁదగును. ఈతనిపేరు శ్యామలకుఁడు, శ్యామిలకుఁడు. అని కూడ వ్రాయఁబడుచుండెను. ఈతనితండ్రి ఈశ్వరదత్తుఁడు (=వీరేశ్వరదత్తుఁడు) 'ధూర్తవిటసంవాద' మనుభాణమును రచించెను. ఈభాణమున రంగస్థలము పాటలీపుత్రము (=పాట్నా.) సంభాషణచ్ఛలమున నిందుఁ గామశాస్త్రరహస్యము లనేకములు వర్ణింపఁబడెను. తక్కినభాణములవలెఁగాక నాఁటిసాంఘికపరిస్థితు లనేకము లిం దభివర్ణింపఁబడెను. భోజుఁ డీభాణము తనసాహిత్యగ్రంథములలో నుదాహరించుకొనెను.

శ్యామిలకుఁడు తాను 'ఉదీచ్యుఁడ' నని చెప్పుకొనియున్నాఁడు. శ్రీధరదాసుని సదుక్తికర్ణామృతమున నితఁడు 'కాశ్మీరక-శ్యామలుఁ' డని పేర్కొనఁబడియున్నాఁడు. కావున నీతఁడు కాశ్మీరదేశవాసి యని చెప్పనగును. ఇతఁడు 'పాదతాడితక' మనుభాణమును రచించెను. భరతాచార్యుని 'నాట్యశాస్త్రము' నకుఁ దాను రచించిన 'అభినవభారతి' యను వృత్తిలో మహామాహేశ్వరుఁడగు అభినవగుప్తపాదాచార్యుఁడు (క్రీ. 1015) పాదతాడితకము నిట్టులు పేర్కొనియున్నాఁడు-

'మూలభూతస్య చ పాఠస్య సమ్భావనానుషక్త మాకాశభాషితమపి స్యాత్, పాదతాడితకాది భాషా(ణ?)-రూపక ఇవ'—(నాట్యశాస్త్ర—1సం, ౧౭౦పు. బరోడాప్రతి)

ఈభాణమునందలి శ్లోకములు క్షేమేంద్రుఁడు సువృత్తతిలకము, ఔచిత్యవిచార చర్చలలోను, వల్లభదేవుఁడు సుభాషితావళిలోను, నుల్లేఖించుకొనియున్నారు. ఈతని రచనలుగా మఱికొన్ని సాహిత్య గ్రంథములలోను, సుభాషితకోశములలోను నుద్ధరింపఁబడినపద్యములు తరువాత నుదాహరింపఁబడును.

క్రీ. 10 వ శతాబ్దిలోనుండిన వ్యక్తివివేకకర్తయగు మహిమభట్టు తాను మహాకవి-శ్యామలునిశిష్యుఁడ నని యిట్లు వ్రాసికొనియున్నాఁడు-

'శ్రీధైర్యస్యాఙ్గభువా మహాకవేః శ్యామలస్య శిష్యేణ,
వ్యక్తివివేకో విదధే రాజానకమహిమకేనాయమ్.'

—(వ్యక్తివివేక. III. ౪౫౬ పుట; కాశీప్రచురణము.)

విశేషకాలవ్యత్యాసమునుబట్టి మహిమభట్టుగురువగు మహాకవి శ్యామలుఁడు, భాణుని పితృవ్యపుత్త్రుఁడగు శ్యామలమహాకవికంటె నవీనుఁడు, భిన్నుఁడు ననుట నిస్సంశయము.

రాజశేఖరుఁడు 'కావ్యమీమాంస'లో శ్యామదేవుఁడను నొకసాహిత్యవిశారదుని యభిప్రాయముల మూఁడుసారు లుదాహరించుకొనియున్నాఁడు—

౧. 'కావ్యకర్మణి కవేః సమాధిః పరం వ్యాప్రియతే'—ఇతి శ్యామదేవః.
—4 అధ్యా. ౧౧ పు.

౨. 'త ఇమే త్రయోఽపి కవయః సారస్వతః, ఆభ్యాసికః, ఔపదేశికశ్చ * * *
తేషాం పూర్వః పూర్వః శ్రేయాన్—' ఇతి శ్యామదేవః.—4. ౧3 పు.

3. "ప్రతిభావ్యుత్పత్తిమాంశ్చ కవిః కవి రిత్యుచ్యతే. స చ త్రిధా—శాస్త్రకవిః, కావ్యకవిః, ఉభయకవిశ్చ 'తేషాం ఉత్తరోత్తరీయో గరీయాన్' ఇతి శ్యామదేవః; 'న' ఇతి యాయావరీయః"—5. ౧౭ పు.

ఈశ్యామదేవుఁడు మహిమభట్టుగురువగుశ్యామలుఁడేమోయని సందేహము గలుగవచ్చును గాని కావ్యమీమాంస కాంగ్లవివరణము వ్రాసినపరశీలకు లీశ్యామదేవుఁడు పాదతాడితక కారుఁడగు శ్యామిలకుఁడే కావచ్చునని (౧౯౦ పు) నిరూపించియున్నారు. ఏమనఁ గావ్య రచనమునఁ గవికి సమాధి (=ఏకాగ్రచిత్తత) ముఖ్య మనునభిప్రాయమునకుఁ బ్రమాణమో యనునట్లు 'పాదతాడితకము' న నీక్రిందిపద్యము కానవచ్చుచున్నది-

'ఇదమిహ పదం మాభూదేవం భవ త్విదమన్యథా
కృతమిద మయం గ్రన్థే నార్థో మహా నుపపాదితః,
ఇతి మనసి యః కావ్యారమ్భే కవే ర్భవతి శ్రమః
స నయనజలో రోమోద్భేదః సతాం తమపోహతి'. (3 శ్లో.)

లేక శ్యామిలకుఁడు సాహిత్యసమాలోచకమగుగ్రంథ మేదైన రచించియుండెనో! ఏమైనను శ్యామదేవుఁడును మనశ్యామలమహాకవియు నభిన్నులనుట ప్రమాణాంతరము లుండినఁ గాని నిరసింప వీలులేదు.

ఇక బాణునిపితృవ్యపుత్త్రుఁడగు మహాకవి శ్యామలుఁడే 'పాదతాడితక' కారుఁడగు శ్యామిలకుఁడని నావిశ్వాసము. ఇరువురును విద్వత్కవులే. మయూరుఁడు సూర్యశతకమును రచింపఁగా నాతనికాప్తబంధువగుభట్టబాణుఁడు దానికిఁ బ్రతికావ్యముగా 'చండీశతకము'ను రచించెను. శ్యామిలకుఁడు (=శ్యామలుఁడు) 'పాదతాడితకము' ను రచింపఁగా నట్టినామము తోడనే బాణుఁడు 'ముకుటతాడితకము'ను రచించియుండునని నాదృఢప్రత్యయము. రెండును రూపకములే. గ్రంథనామసాదృశ్య మిట్టి యభిప్రాయమునకు సాధకము. శ్యామలుఁడు మహావిద్వత్కవి యని బాణుఁడు ప్రశంసించినవాక్యమును వ్యాసముమొదటనే చూచియున్నాముగదా! శ్యామలుఁడు బాణునికంటెఁ జిన్నయని బాణునివాక్యమునుబట్టియే

యూహింపనగును. తనకంటె వయస్సునఁ జిన్నదై, పాండిత్యమునఁ గావ్యనిర్మాణమున నందె వేసినచేయియై, యట్టి ప్రశస్యమగుభాణమును రచించి యుండుటచేతనే బాణుఁడు తనకుఁ బ్రియసోదరుఁడగు శ్యామలు నంతగాఁ బ్రశంసించియుండెననుట యసంబద్ధము కాఁజాలదు. బాణుఁడు చిన్నతనంబునఁ జపలకార్యంబులేవేనిఁ జేసియుండునట్లు, హర్షవర్ధనుఁ డీతనిఁగూర్చి 'ఇతఁడు మహాభుజంగుఁడు సుమీ' ('మహానయం భుజఙ్గః') అనువాక్యమునుబట్టి తెలియు చున్నది. తనయోగ్యతం దెలుపుకొనుచు బాణుఁడు 'కా మే భుజంగతా'(=కా మే భుజంగతా=నాభుజమును బొందినస్త్రీ యెవతె?;నాభుజంగత్వమేది?; భుజంగత్వము మన్మథునియందుఁ గలదు. అనఁగా నించుక నేను వెలిచవుల మరగుట వయోదోషముగాని కేవలము నట్టిప్రవృత్తి కలవాఁడనుగాను,) అని సమాధానమిచ్చెనఁట. ఇట్టిస్వేచ్ఛాప్రవృత్తిగలబాణునకు హితబోధ కొఱకో, లేక బాణునివినోదమునకో, బాణుఁడు దేశాటనముచేసి, హర్షచక్రవర్తిసందర్శన భాగ్యము నంది జన్మస్థానమునకుఁ దిరిగివచ్చుసరికి శ్యామలుఁడు విటవృత్తాత్మకమగు 'పాదతాడితకము'ను రచించి చూపియుండును. దానికి వినోదమునంది బాణుఁ డట్టినామముగల 'ముకుటతాడితకము'ను రచించియుండును. లేక బాణునిరూపకమును జూచియే శ్యామలుఁడు తనభాణమును రచించి యుండుననియుఁ జెప్పనగును. ఎట్లైనను పై రెండుగ్రంథములకుఁ దత్కర్తలకుఁ బరస్పరసంబంధ ముండియుండుననుట సుసంభవముగాఁ గన్పట్టుచున్నది.

శ్యామిలకమహాకవి క్రీ. 950 కంటెఁ బూర్వుఁడనుట సిద్ధమనియు, నితనికవిత క్రీ. 6, 7 శతాబ్దులకంటెఁ బూర్వపురీతిగలదిగఁ దోఁచుచున్నదనియు శ్రీమానవల్లి రామకృష్ణ కవిగారు వ్రాసియున్నారు. కవిగారే మఱియు 'పాదతాడితకము' నుగూర్చి యిట్లు వ్రాసియున్నారు-

'ఈభాణము చాలఁ బెద్దది. దీనిలో విష్ణునాగుఁడనురాజశాసనకరుఁడు విద్వాంసుఁడును బ్రాహ్మణుఁడు నైయుండి సౌరాష్ట్రదేశమున సార్వభౌమనరేంద్రపురమున వేశ్యయింట రాత్రి చెల్లించి, వేకువఁ బ్రణయకోపవిశేషముచేఁ గాబోలు దానిచేఁ బాదతాడితుఁడై, వృషలీపాదఘాతమునకుఁ బ్రాయశ్చిత్తము వెదకుచు బ్రహ్మసభకు రాఁగా వారు సమస్తస్మృతులు తిరుగవైచి చూచి యెందును దానికిఁ బ్రాయశ్చిత్తము విధింపఁబడలేదని చెప్ప, నతఁడు శోకించి యగతికుఁడై మొఱ్ఱోయనుచుండ నాసభలో నొకఁడీదోషము శృంగారరసానుభవమున వడచెఁగావున దీనిప్రాయశ్చిత్తవిధానము విటసభలోఁగాని తెల్లముగాదనిరెు. అంత నతఁడంగీకరింప విటసభలో నపరాహ్ణమున విటు లొక్కొకరు ప్రాయశ్చిత్తవిశేషముల యథోచితముగా వివరించి యతని సంతుష్టుం జేసి పంపుటయే దీనిలోనికథ. విటులఁ బిలువఁబోవు

వాఁడే దీనిలోని ముఖ్యపాత్రము. విటసభలో నానాదేశపువిటులు గూడి తమతమచిత్ర ప్రాయశ్చిత్తవిధానము దెలుపుట సరసముగా నుండకతక్కదు.' (సంవత్సరాదిసంచిక—౧౦3 పుట. 1918 సం.)

'భాణము సాధారణముగా నేకాంకపరిమితిగా నొకవిటుఁడో ధూర్తుఁడో ప్రవేశించి, వేశవాటమును వర్ణించుచు నాకాశభాషితమునఁ బ్రశ్నోత్తరములు జరపుచు, శృంగారభావములు విస్తరింపఁజేయురూపకవిశేషము.'

'భాణములు శృంగారరసప్రధానములని విద్వాంసులు చదువనొల్లరు. వానిలో దేశాంతర-కాలాంతర-సాంఘికాచారములు వర్ణింపఁబడియున్నందున దేశచరిత్రకారుల కవి ముఖ్యములే.'– (అదే. ౧౦౨. పు. ౧౦౪ పు.)

'వరరుచి-రీశ్వరదత్త - శ్యామిలక - శూద్రకశ్చ చత్వారః,
ఏతే భాణాన్ బభణుః, కా శక్తిః కాళిదాసస్య.'

అనునొకసుభాషితశ్లోకమునుబట్టి వరరుచి ('ఉభయాభిసారికాభాణము') ఈశ్వరదత్తుఁడు ('ధూర్తవిటసంవాదము'), శ్యామిలకుఁడు ('పాదతాడితకము') శూద్రకుఁడు (పద్మప్రాభృతకము') అనునలువురును భాణకర్తలనియు, నాయాభాణాంతగద్యలనుబట్టి యీనలుగురుఁ బైఁజేర్కొనిన భాణముల రచించినట్లును దెలియుచున్నది."[4] పైశ్లోకమున వీరిభాణనిర్మాణసామర్థ్యముముందు కాళిదాసకవిశక్తి యెంతటి దనుభావము కూడఁ గన్పట్టును.

పై భాణచతుష్టయమునుగూర్చి శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రివర్యు లిట్టులు వ్రాసియున్నారు.

"ఈనలుగురును (వరరుచ్యాదులు) వాఙ్మయప్రసిద్ధులు, ప్రాచీనులు. ఐనను, వీరి యాకృతులలోని రెండుమూడుశ్లోకములు భోజరాజున కీవలిలాక్షణికులు గ్రహించినట్లు కనఁబడుచున్నదిగాని, అతనికావలిలాక్షణికులలో నొకఁడును గ్రహించినట్లు కనఁబడదు. ఇది యిట్లుండఁ బైచాటుశ్లోకము, కాళిదాసుపేర నర్వాచీనులెవరో నిర్మించిన పుష్పబాణవిలాస-శృంగారతిలకాదులు వ్యాపించినపిదపఁ బుట్టినదిగాని ప్రాచీనమైనదిగాదని దాని ధోరణియే చెప్పుచున్నది. పైగా, పద్మప్రాభృతకాదులందలివస్తువు ప్రాచీనమైనను, లోకములోని తక్కిన భాణములను మించి రచనమున వీనిలోఁ గనవచ్చిన మహాగుణమును లేదు.

4. ఈనాలుగుభాణములును 'చతుర్భాణి' అనుశీర్షికతో శ్రీమానవల్లిరామకృష్ణకవిగారిచే బ్రకటింపఁబడెను. (1922.)

అందుచే వీరు రచియించినవని ప్రబలమైన ప్రత్యక్షప్రమాణము కనబడువఱకును వీనికర్తృత్వము సందిగ్ధముగానే యుండును.' (సంస్కృతవాఙ్మయచరిత్ర, II. సం. 353 పు.)

పైయభిప్రాయములు సమంజసములుగాఁ జూపట్టవు. పైభాణకర్తలునలువురు వాఙ్మయ ప్రసిద్ధులు గారు. అందు వరరుచియు, శూద్రకుఁడును మాత్రమే విశ్రుతులు. తక్కినయిరువురును విస్మృతులు. 'ధూర్తవిటసంవాదము' భోజుని 'శృంగారప్రకాశము'న నుదాహరింపఁబడియున్నది. అతనికి సమకాలికుఁడగు అభినవగుప్తుఁడు 'అభినవభారతి' లో 'పాదతాడితకమ:'ను పేర్కొనియున్నట్లు చూచియున్నాము. భోజున కించుక ప్రాక్కాలికుఁడగు మహిమభట్టు 'వ్యక్తివివేకము' నను, భోజసమయవర్తియగు క్షేమేంద్రుఁడు 'సువృత్తతిలకము' నను 'ఆలానం జయకుఞ్జరస్య' అను శ్యామిలకునిపద్యము నుదాహరించుకొనియున్నారు. పూర్వోదాహృతసుభాషిత మెవ రేకాలమున రచించిరో తెలియదుగాని, అది వరరుచ్యాదులు నలువురును, కాళిదాసును విలసిల్లినకాలమునకుఁ బిమ్మట రచింపఁబడెననుట నిశ్చయము. ఈపద్యమున నలువురు కవులును గాలక్రమమునుబట్టియే పేర్కొనఁబడియుండవచ్చునని శ్రీకృష్ణమాచార్యులవారు తమ 'సంస్కృతవాఙ్మయచరిత్ర' [5] (౫౭౦పు)లో వ్రాసియుండిరి కాని పూర్వచర్చలనుబట్టి యిదియు సరిగాదని నిశ్చయమగుచున్నది. ఆచార్యులవారు పైనాలుగుభాణములప్రాక్కాలికతను సహేతుకముగ నిరూపించి, 'ధూర్తవిటసంవాదము' మొదలగువానిప్రాశస్త్యము నుగ్గడించిరి; 'పద్మప్రాభృతకము' సంస్కృతవాఙ్మయమునందలి యుత్కృష్టకృతిరత్నములలో నొకటియని వ్రాసియున్నారు. 'Padmaprabhrtaka is a fine specimen of poetic art and distinctly ranks among the best known works in Sanskrit literature'—Dr. Krishnamachariar's '*Classical Sanskrit Literature*', page 582. ఇట్లు ప్రాచీనాధునికవిద్వన్మండలిచేఁ బ్రశంసింపఁబడిన యీభాణములలోఁ దక్కినభాణములకంటె మించిన 'మహాగుణమును లే' దనుశాస్త్రిగారియభిప్రాయము సమంజసముగఁ గన్పట్టదు.

రుద్రవర్మ, ఆర్యరక్షితుఁడు, ఆర్యకుఁడు ననుకవులను, వరరుచియను సాహిత్యగ్రంథకర్తను శ్యామిలకుఁడు పేర్కొనియుండెను.

(చూ. కృష్ణమాచార్యులవారి 'సం వా. చరిత్ర' ౫౭౧-౭౩ పుటలు.)

బాణుఁడు హర్షవర్ధనునియాస్థానము నలంకరించెను. హర్షుఁడు క్రీ. 590 లో జనించి, క్రీ. 606-647 వఱకు రాజ్యమునేలినట్లు తెలియుచున్నది. (చూ. హర్షచరిత్రపీఠిక, 37 పు.

5. 'A History of Classical Sanskrit Literature' By Dr. M. Krishnamachariar, M. A., M. L., Ph. D. (II Revised Edition, 1937)

ఏ. బి. గజేంద్రగడ్కరుపండితుని ప్రతి.) కావున బాణుఁడును, తత్ పితృవ్యపుత్త్రుఁడు, 'పాద తాడితక' కర్తయు నగు శ్యామలుఁడును క్రీ. 7 వ శతాబ్దికి చెందినవారని నిర్ణయింపఁ దగును.

ఇఁక, 'పాదతాడితకము' నుండి కొన్ని పద్యము లుదాహరింపఁబడును.-

౧. విష్ణునాగుఁడను ఛాందసవిప్రుఁడు వేశ్యాపాదతాడితుఁడై యిట్లు విలపించెను.
'హా ధిక్ పుంశ్చలి! అనాత్మజ్ఞే! యయా త్వయా మమాస్మిక-

శ్లో. ప్రయతకరయా మాత్రా యత్నా త్ప్రిబద్ధశిఖణ్డకే
చరణవినతే పిత్రాఘ్రాతే శిశు ర్గుణవానితి
సకుసుమలవై శ్శాన్త్యమ్భోభి ర్ద్విజాతిభి రుక్షితే
శిరసి చరణో న్యస్తో గర్వా న్న గౌరవ మీక్షితుమ్.'

౨. 'అపి చ ఇదమస్యాః ప్రాయశ్చిత్తం శ్రూయతామ్.
శ్లో. తస్యా మదాలసవిఘూర్ణితలోచనాయాః, శ్రోణ్యర్పితైకకరసంహతమేఖలాయాః
సాలక్తకేన చరణేన సనూపురేణ, పశ్యత్వయం శిరసి మా మనుగృహ్యమాణమ్.'

3. 'లలాటే విన్యస్య క్షతజసదృశం చందనరసం
మృణాలైః క్రీడన్తీ కువలయపలాశైః సకమలైః
సలీలం భ్రూక్షేపై రనుగతసుఖప్రాశ్నికకథా
విరక్తా రక్తా వా శిరశి రుజ మాఖ్యాతి గణికా.'

తరువాత సుభాషితకోశములయందును, సాహిత్యగ్రంథములయందు నుదాహరింప బడిన శ్యామలకవిపద్యము లొసఁగఁబడును-

౧. 'యథా భట్టశ్యామలస్య-
"ఆలానం జయకుఞ్జరస్య, దృషదాం సేతు ర్విపద్వారిధేః
పూర్వాద్రిః కరవాలచణ్డమహసో లీలోపధానం శ్రియః,
సంగ్రామామృతసాగరప్రమథనక్రీడాకృతౌ మన్దరః
రాజన్ ! రాజతి వీరవైరివనితావైధవ్యద స్తే భుజః."
(సూక్తిముక్తావళి, 337 పు, 'భట్టశ్యామలస్య'; వ్యక్తివివేక, 2 ౭౨ పు; తిరువాన్కూరు ప్రతి. సువృత్తతిలక. 2. 45 పు. నిర్ణయసాగరముద్రణము; ఖండప్రశస్తి, 132 పద్య.)

౨. 'ఉత్క్షిప్తాలకమిాక్షణాంతగళితం కోపాంచితాంతర్భ్రువా
దష్టాధోర్ఠ మధీరదంతకిరణం ప్రోత్కంపయంత్యా ముఖమ్,
శింజన్నూపురయా విశృష్య విగళద్రక్తాంశుకం పాణినా
మూర్ధన్యస్య సనూపుర స్సమదయా పాదోఽర్పితః కాంతయా.'
(శ్రీరామకృష్ణకవిగారివ్యాసమునుండి-ఉగాదిసంచిక, 103 పు. 1918 సం.)

3. 'కామ స్తపస్విషు జయ్య త్యధికారకామో
విశ్వస్య విత్తవిభు రింద్రియవాజ్యధీశః,
భూతాని విభ్రతి మహాంత్యపి యస్య శిష్టిం
వ్యావృత్తమాళిమణిరశ్మిభి రుత్తమాఙ్గైః.'

(ఉగాదిసుచిక, 103 పు. 1918 సం (

౪. 'హాస్యరసే... నతు యథా శ్యామలస్య-
"చుమ్బనసక్తః సోఽస్యా దశనం చ్యుతమూల మాత్మనో వదనాత్
జిహ్వామూలప్రాప్తం ఖాడితి కృత్వా నిరష్ఠీవత్."

పైపద్యమును క్షేమేంద్రుఁడిట్లు విమర్శించెను-

'అత్ర హాస్యరసస్య భీభత్సరసాధివాసితస్య లశునలిప్తస్యేవ కుసుమశేఖరస్య అతి జుగుప్సితత్వాదనీప్సితస్య పరమానౌచిత్యేన చమత్కార స్తిరోహితః. వృద్ధాపరిచుమ్బనే జిహ్వామూలప్రాప్తస్య చ్యుతదశనస్య కణ్ఠలోఠినః ష్ఠీవనేన భీభత్సస్యేవ ప్రాధాన్యమ్, న తు హాస్యరసస్య.'—(ఔచిత్యవిచారచర్చ, ౧౩౬ పు కావ్యమాలాప్రచురణము, 1929.)

౫. 'దయితాబాహుపాశస్య కుతోఽయ మపరో విధిః
జీవయ త్యర్పితః కణ్ఠే మారయ త్యపవర్జితః.'

(సదుక్తికర్ణామృత, II. 75. 3 ప—౧౧౮ పు. 'కాశ్మీరకశ్యామలస్య; సూక్తిముక్తావళి, పు. 'శకవృద్ధేః', సుభాషితావళి, ౧౫౭ ప. 'కలశకస్య', శార్ఙ్గధరపద్ధతి, 3330 ప. 'భాసస్య.')

౬. 'విపరీతా యథా భట్టశ్యామలస్య-
"ధృతో గణ్డాభోగే మధుప ఇవ బద్ధోఽఞ్జవివశే
విలాసిన్యా ముక్తో బకులతరు మాపుష్పయతి యః

విలాసో నేత్రాణాం తరుణసహకారప్రియసఖః
స గణ్డూషః సీధోః కథమివ శిరః ప్రాప్స్యతి మధోః."
(సువృత్తతిలక, II. ౧౨ పు. కాశీప్రచురణము.)

౩. 'ప్రాయశ్చిత్తం మృగయతే యః ప్రియాపాదతాడితః
తాలనీయం శిరస్తస్య కాన్తాగణ్డూషశీధుభిః'
(సుభాషితావలి, ౨౫౨ పద్య. 'శ్యామలకస్య'.)

౪. 'సోత్కణ్ఠైరివ గచ్ఛతీతి కమలై ర్మీలద్భి రాలోకితః
ప్రచ్ఛాయై రధిరుహ్య వేశ్మశిఖరా ణ్యుత్సార్యమాణాతపః,
తైః స్పృష్ట్వా చిరమున్ముఖేషు కిరణై రుద్యానశాఖాస్వసౌ
యాత్యస్తం వలభీకపోతనయనై రాతామ్రతారో రవిః'
(ఉగాదిసంచిక, ౧౦౩ పు. 1918సం.)

## భట్టబాణుని 'ముకుటతాడితకము'

ప్రసక్తానుప్రసక్తముగ 'ముకుటతాడితకమును' గూర్చి రెండుమాటలు—బాణుని యుత్పన్నకృతులలో నిదియొకటి. త్రివిక్రముని 'నలచంపువు' నకు చండపాలుఁడు, గుణవిజయగణి రచించినవ్యాఖ్యలో నీకృతి బాణరచితమని నుడువఁబడియున్నది. భోజుని శృంగారప్రకాశమునఁగూడ నీనాటకములోని రెండుపద్యము లుల్లేఖింపఁబడెను. గదా-యుద్ధభాగమును దత్పూర్వకథయు నిందు వర్ణింపఁబడెను. భీముఁడు దుశ్శాసనవధానంతరము ద్రౌపదివేణిని ముడిచి, శపథముచేయుభాగము భోజుఁ డుదాహరించెను.

౧. 'యదాహ ముకుటతాడితకనాటకే బాణః-
"ఆశాః ప్రోషితదిగ్గజా ఇవ, గుహాః ప్రధ్వస్తసింహా ఇవ
ద్రోణ్యః కృత్తమహాద్రుమా ఇవ, భువః ప్రోత్ఖాతశైలా ఇవ
బిభ్రాణాః క్షయకాలరిక్తసకలత్రైలోక్యకష్టాం దశాం
జాతాః క్షీణమహారథాః కురుపతే ర్దేవస్య శూన్యాః సభాః."
(నలచంపూవ్యాఖ్యనుండి. పి. వి. కాణేపండితుని హర్షచరితపీఠిక, ౧౫ పు.)

౨. 'ప్రధ్వస్తాః స్యు ర్ధార్తరాష్ట్రాః సమస్తా
పీతం రక్తం స్వాదు దుశ్శాసనస్య

పూర్ణా కృష్ణాకేశబన్ధప్రతిజ్ఞా
లిఖ్య త్యేకః కౌరవస్యోరుభఙ్గః'. (శృంగారప్రకాశమునుండి)

3. 'ఊరూ నిపీడ్య గదయా యది నాద్య తస్య
పాదేన రత్న-మకుటం శకలీకరోమి
దేహం నిపీతనిజధూమవిజృంభమాణ-
జ్వాలాజటాలవపుషి జ్వలనే జుహోమి'. (శృంగారప్రకాశమునుండి)

పై రెండుపద్యములును శ్రీమానవల్లి రామకృష్ణకవిగారి 'సంస్కృతభాషలోని కొన్ని విస్మృత నాటకములు' అనువ్యాసమునుండి (ఉగాదిసంచిక, 1918 సం. ౯౮ పు) గ్రహింపఁబడినవి. ఈపద్యములు మహాకవిదండినిగూర్చి 'ఆంధ్రపత్రిక-సారస్వతానుబంధము'న (దుందుభి-కార్తిక-శు ౮. 22. 10. 1922.) శ్రీకవిగారు ప్రకటించినవ్యాసమునను నుల్లేఖింపఁబడెను. పైశ్లోకములలో మూఁడవదానిలో రెండవచరణమునుబట్టి యీనాటకమునకు 'ముకుటతాడితక' మని కవి పేరుపెట్టియుండును. ఈనాటకమునుగూర్చి యించుక భారతి (శుక్ల-ఫాల్గునము, 1930) లోఁ బ్రకటించియున్నాను.



దివాన్‌బహదుర్. వి. షణ్ముగమ్‌మొదలియార్, మదరాసు షరీఫ్, గ్రీన్‌ఫీల్డ్సు, కిల్‌పాక్, మదరాసు:—

జనరంజకమైన తెలుగు వారపత్రిక త్రిలింగకును అఖలభారతసంయోజన పద్ధతి నాలోచించిన తరుణమున తగిన ఇంగ్లీషు పత్రిక ఫెడరేటెడ్ ఇండియాకును, సంపాదకులైన శ్రీ. వి. వేంకటేశ్వరశాస్త్రికి ఉత్సవసంచికగ వారికి అభినందనములు అందింపనున్నారని విన్నాను. సంస్కృతము, తెలుగు, అరవములలో వారు ప్రాచీన గ్రంథములను ప్రకటించి చాల ఉపకారకార్యక్రమము నెరవేర్చుచున్నారనుట నిజము! అట్టివారియెడల ఈ కోస్తాప్రజలు కృతజ్ఞులై యుందురనుటకు సందేహము లేదు.

# పూర్ణచతురంగ క్రీడావిమర్శనము

శ్రీ ఆదిభట్ల గౌరీశంకరశాస్త్రిగారు, ఆంధ్రభాషాప్రవీణ, తృతీయకక్ష్య, విజయనగరము.
మహారాజసంస్కృతకళాశాల.

[పూర్వపు చతురంగపు టాటయందుఁ గొన్ని లోపములను గనఁబరచుచు, నవ్వాని సవరించుటకై చతురంగబలమున రాణి సేనానులను రెంటి నధికముగఁ జేర్చి, పూర్ణచతురంగక్రీడయనెడి నామమిడి, శ్రీపంతుల వేంకటసీతారామమూర్తిగారు విక్రమసంవత్సర వైశాఖమాసపు భారతిసంచికలో నొకవ్యాసమును బ్రకటించియున్నారు. పూర్ణచతురంగక్రీడయందే లోపములు గాననగుటచేతను, జతుష్షష్టిభాగసమన్వితమగు నా పూర్వపుటాటయే సమంజసముగా నున్నదని తోఁచుటచేతను, బూర్ణచతురంగక్రీడా విమర్శన మనెడి పేరిటి నీవ్యాసమును వ్రాయఁ దొరకొంటిని]

చతురంగము యుద్ధలోకస్వభావానుగుణముగా నిర్మింపఁ బడినదనియు, నిది యుద్ధప్రవృత్తుఁడగు రాజుసైన్యము ననుసరించి నిర్మింపఁబడినది కావుననే యీయాటయందలి బలమునకు రథగజాదినామము లుంచఁబడినవనియు వచింపుచు, మఱియుఁ బ్రస్తుతము ప్రచారమునందున్న యాటయందుఁ గ్రమము సరిగాలేదనియు, యుద్ధ లోకస్వభావము ననుసరించి, రథగజతురగపదాతు లను క్రమ మంగీకరింపఁబడియుండ రథతురగ గజపదాతి క్రమ మంగీకరించుట మొదట లోపమని వచించియున్నారు. మఱియు లోకమునందు ముఖ్యముగాఁ జూపట్టు సమస్త వాహనారూఢనైపుణ్యప్రజ్ఞావంతుఁడగు సేనాధిపతి యీయాటయందు లేకుండుట రెండవలోపమనియు వచించిరి. మఱియు లోకయుద్ధస్వభావముల ననుసరించి నిర్మింపఁబడిన చతురంగక్రీడయందు లోకమునఁ బోలె రాజునకు రక్షకుఁ డొకఁడైన నుండుట న్యాయము. అట్టిరాజరక్షకుఁ డిందు లేకుండుట మూఁడవలోపమనియుఁ బూర్వపుటాటయందు లోపములఁ గనఁబరచియున్నారు. ఇందులకు సమాధానము లీక్రిందివిధముగా నొసఁగుచున్నాను.

1. లోకమునందు ముఖ్యముగాఁ జూపట్టి సమస్తవాహనారూఢనైపుణ్యప్రజ్ఞావంతుఁడగు సేనాధిపతి యీ పూర్వపుటాటయందు లేకుండుట రెండవలోపమని వచించిరి గదా! మఱియు నట్టిసేనాధిపతి వివిధసైన్యములకు నాధిపత్యము వహించుటచే నాతనికి మంత్రికంటె నధికముగ నశ్వగమనము కూడ నీ క్రొత్తయాటయందు న్యాయముగా నిర్ణయింపఁబడెననియు నిరూపించియున్నారు. సీతారామమూర్తిగారిచే సవరింపఁబడిన యాటయందు మంత్రి,సేనాధిపతు లిరువురును గలరు. సేనాధిపతియు, మంత్రియు లోకమునఁ (అనఁగా

యుద్ధరంగమున) గాననగుచున్నారు. యుద్ధరంగమునఁ బరసైన్యమును జయించుటకు మంత్రి, రాజునకు సామదానభేదోపాయముల నుపదేశించుట కుండవలయును గాని, కేవలను బొమ్మలసహాయముతో జరుపఁబడు నీయాటయం దుండెడిమంత్రి బొమ్మ, రాజు బొమ్మకు నూహఁ జెప్పనవసరములేదు. మఱియు బుద్ధిగా నాలోచించినచో మంత్రిస్థానమాట కానిదై యున్నది. మంత్రియొక్క బుద్ధిబలముచే నెట్లు రాజునకు లోకములో జయము కలుఁగుచున్నదో యట్లే యాటకాని బుద్ధిబలముచే నొకపక్షము జయించుచున్నది. కావునఁ బూర్ణచతురంగక్రీడయందు సమస్తవాహనారూఢప్రజ్ఞావంతుఁడగు సేనాధిపతి యున్నచో మంత్రి యనవసరమని తేలుచున్నది.

మఱియు లోకములోఁ గ్వాచిత్కముగ రాజుకంటె బలవంతుఁడగు సేనాధిపతి యుండుట పొసఁగునుగాని, యాటయందుఁగూడ రాజుకంటె నధికబలవంతుఁడగు సేనాధిపతియుండుట న్యాయముకాదు గదా! పూర్ణచతురంగక్రీడయందలి సేనాధిపతి సర్వగమనములు గలవాఁడగుట రాజుకంటె బలవంతుఁ డగుచున్నాఁడు. ఎట్లన నొక్కసేనానియే రెండవవాని సహాయములేక పరరాజును బంధింపఁ గలుఁగుచున్నాఁడు. అయ్యది యీ క్రిందిగడియందుఁ జూడనగును.

ఎఱ్ఱబలము.

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | బంటు | |
| ఏనుగు | బంటు | | | | | | బంటు | | రాజు |
| | | బంటు | | | | | | శకటు | |
| శకటు | సేనాని | బంటు | | | | | | | అశ్వము |
| | | | | | | | | ఏనుగు | |
| | | | | | | | | శకటు | |
| మంత్రి | | | | | | | | | మంత్రి |
| ఏనుగు | బంటు | సేనాని న. బ. | | | | | | బంటు | |
| రాజు | | బంటు | | | | | | బంటు | |
| | బంటు | | | | | | బంటు | | |

స్వస్థానము.

నల్లబలము.

### పూర్ణ చతురంగక్రీడావివర్ణనము.

రాజరక్షకుఁడు తప్ప చతురంగపుటాటయందలి మఱియే యితరజంతువు నిస్సహాయముగ రాజును బంధింపనేరదు. రాజు నాలుగుమూలలలో నేమూలనున్నను సేనాధిపతి రాజును నిస్సహాయుఁడై బంధించుచున్నాఁడు గదా! పోనిండు. రాజు సేనానిని సంహరింపరాదా? యనినచో సేనాని రాజునకు గడివిడిచి గడిలోనున్నవాఁడు, రాజునకుఁ జతురంగపుటాట నియమముప్రకారము నంతవఱకు నడుచుటకు నధికారము లేదు. పోనిండు. రాజుకంటె సేనాధిపతి బలవంతుఁడుగ నుండరాదా యనినచో 'బలో రాజా యతే పుదాన్యం' అను నియమము ననుసరించి యీతని ప్రభుత్వ మాతఁ డంగీకరింపఁడు. మఱియు లోకములో రాజుకంటె బలవంతులగు సేనాధిపతులు లేరా యనినచో నది క్వాచిత్కముగాని గణనీయము కాదు. మఱియు లోకములో యుద్ధప్రవృత్తులగు రాజులసైన్యములు రెండును సమానముగ నుండవు గదా! ఎవరి కెంతసైన్యమున్న నద్దానితోనే వారు పోరాడుదురుగాని యెదుటివానిసాటిని చూడరు. మఱియు నెదుటివానిబలముకంటె నధికబలము సంపాదింపఁ బ్రయత్నింతురు. ఈ చతురంగపుటాటయందు లోకమందువలెఁగాక యుభయసైన్యములు సమానసంఖ్యగలవై యుండవలయు నను నియమ మున్నది. రెండుబలములు సరిగా నుండవలయు ననునియమ మెట్లున్నదో యట్లే చతురంగపుటాటయందు రాజుకంటె బలవంతుఁడగు (సేనాధిపతి) నితరుఁ డుండరాదను నియమము గూడ నుండుట న్యాయము. లేదా, రాజు నధికముగ నశ్వగమన మొసఁగుట న్యాయము. కాబట్టియే మనపూర్వులు మంత్రికి గజశకటగమనద్వయము నంగీకరించి, యశ్వగమనము నంగీకరింపరైరి. ఇట్లే రాజునకు నని తెలియునది. పై కారణములబట్టి సమస్తవాహనారూఢనై పుణ్యప్రజ్ఞావంతుఁడగు సేనాధిపతి నశ్వగమనరహితునిగ నొనర్పవలయును. పూర్ణచతురంగక్రీడయందు మంత్రి సేనాధిపతు లిరువురిలో మంత్రి యనవసరమని యిదివఱకే నిరూపించితిమి గదా! ఇప్పుడు సేనాధిపతి నశ్వగమనరహితుగా నొనర్చి యేదిన్యాయమని కల్పింపఁబడినదో యది యనవసరమనియు న్యాయదూరప్రసంగవిషయమనియు నిరూపించితిమి. ఇంకఁ బ్రాచీన చతురంగపుటాటయందలి మంత్రియే యీపూర్ణ చతురంగక్రీడయందలి సేనాధిపతియని యనుకొనినచోఁ బ్రాచీననవీనచతురంగక్రీడలకు వ్యత్యాస ముండదు గదా! మంత్రిని సేనాధిపతియనుట యెట్లు పొసఁగుననినఁ బూర్ణచతురంగక్రీడయందు రాజరక్షకునిస్థానమున రాణి నెట్లు నియమించిరో ప్రాచీను లావిధముగ సేనాధిపతిస్థానమున మంత్రిని నియమించిరనుట యుక్తి దూరప్రసంగము కానేరదు గదా! మఱియు మంత్రియే సేనాధిపతి యున్నను లేకపోయినను జతురంగమున నవసరము. కావునఁ బ్రాచీనచతురంగక్రీడయందలి మంత్రి సేనాధిపతి యనియే యెఱుఁగవలయును.

2. మఱియు యుద్ధలోకస్వభావముల ననుసరించి నిర్మింపఁబడిన చతురంగక్రీడయందు లోకమందువలె రాజునకు రక్షకుఁ డొకఁడైన నుండుట న్యాయము. అట్టి రాజరక్షకుఁ డిందు (ప్రాచీనచతురంగక్రీడ) లేకుండుట మూఁడవలోపమనియు వచించియున్నారు. ఇయ్యది సరిగాదు. లోకములో రాజునకు రక్షకుఁడుండుట న్యాయమే గాని, యాటయం దనవసరము ఎట్లన రాజు వ్యూహామధ్యమునకుఁ గాని మఱియే యితరస్థలమునకుఁ గాని, నడుపఁబడినచో వానితో సమానముగ రాజరక్షకుఁడు పోవలయుఁ గదా! అట్లు పోవుటకుఁ జతురంగపుటాటనియమప్రకారము ననుసరించి కొంతకాలము పట్టును. లేదా రాజరక్షకుఁడు స్థానము నతిక్రమింపనిచో నీతఁడు రాజును రక్షింప సమర్థుఁడు కాఁడు. ఎట్లన నీయనకు నశ్వగమనరహితమగు రాజగమనమే గదా నిర్ణయింపఁ బడినది. లేదా రాజరాజరక్షకు లిరువురు నొకేసారి నడుపఁబడుదురనినచో నయ్యది చతురంగక్రీడానియమవిరుద్ధము. పోనిందు రాజరక్షకుని రాజుస్థానమునకుఁ బోవువఱకు నడ్డుచుందుమనిన నింతలోఁ బర సైన్యములు రాజునే ముట్టడించి వశపరచికొనును (అనఁగా నాట కట్టుడుపడును.) కావున నీరాజరక్షకుఁ డజాగళస్తనముపోలె వ్యర్థమగుచున్నాఁడు. మఱియు నీరాజరక్షకుని స్థానమున రాణిని నియమించినామని శ్రీసీతారామమూర్తిగారు వచించియున్నారు. రాణి యబల, లోకములో సాధారణముగా స్త్రీలబలలు, కేవల మమానుషలగు సత్యభామా దులమాట లెక్కయేల! అట్టిస్త్రీలు రాజును రక్షించుటగాని, రాజరక్షిణిగా నియమింపఁ బడుటకాని కేవల మసందర్భమును హాస్యాస్పదము నగువిషయమై యున్నది. మఱి కైక, సత్యభామ, వీరు రాజరక్షిణులుగాఁ బనిచేయలేదా యనినచో వారు భర్తలకుఁ బ్రేమ పాత్రములై యరగినవారే గాని రాజరక్షిణులుగా నరుగలేదు. ఏపురాణమందుఁ గాని యేదేశచరిత్రయందుఁ గాని స్త్రీ, యందును రాణి, రాజరక్షకునిస్థాన మాక్రమించుట విన్న కన్నమాట కాదు. కావున నిట్టియసందర్భము లోకవిరుద్ధము నగువిషయము సీతారామ మూర్తిగారి హృదయాహ్లాదకారి యెట్లో తెలియరాదు పైప్రసంగమునుబట్టి రాజరక్షకుఁడుగాని రాణిగాని యనవసరమని తేలియున్నది. కాగా శ్రీసీతారామమూర్తిగారిచేఁ గ్రొత్తగా నిర్మింపఁబడిన పూర్ణచతురంగక్రీడయం దధికముగాఁ జేర్పఁబడిన రాజరక్షక సేనాధిపతు లిరువురు ననవసరమని నిర్ణయించినాఁడను.

3. ఇక మొదటిదగు సేనాస్థాననిర్ణయవిషయమునుగూర్చి చర్చింతము. పూర్ణచతురంగక్రీడయందుఁ గ్రొత్తగాఁ జేర్పఁబడిన రాజరక్షకసేనాధిపతు లనవసరమనినఁ దరువాతఁ గ్రొత్తప్రాతయాటలు సమానచతురము గలవియే యగుచున్నవి. కాని శ్రీసీతారామమూర్తిగా

రన్నట్లు బలము క్రమముగా లేదు. రథ, గజ, తురగ, పదాతులు లోకశాస్త్రస్వభావము ననుసరించి క్రమముగా నుండఁగా నీ ప్రాతయాటయందుఁ దద్విరుద్ధముగ రథతురగగజ పదాతిక్రమ మంగీకరించుట మొదటిలోపమని శ్రీసీతారామమూర్తిగారు వ్రాసియున్నారు. నియమబద్ధమగు గమనముగల నీ చతురంగపుటాటయందు సేనాముఖమున భటులకుఁ గడాస్థాన మేర్పరుపఁబడినది. అట్టిభటులకు కాపులుంచుట న్యాయము. శ్రీసీతారామమూర్తిగారు సెలవొసఁగినట్లు ప్రాచీనచతురంగక్రీడయందు రథగజతురగపదాతిక్రమ మంగీకరించినచో నశ్వమునకు ముందుండు బంటునకుఁ జతురంగబలము నుంచికొనెడి పేటిక తప్ప వేఱు కాపు కానరాదు. కావుననే జ్ఞానవిశారదులగు పూర్వులు గజాశ్వాన్యోన్యపరివర్తన మొనరించి (అనఁగా రథ తురగ గజ పదాతిక్రమ మంగీకరించి) యట్టిలోపమును బూరించిరి. కావున శ్రీసీతారామమూర్తిగారి దోషత్రయప్రతిపాదన ప్రామాదికమని నామనవి.

మఱియుఁ బూర్ణచతురంగక్రీడయం దధికముగ నాలుగుబంట్లు మాత్రము మిగిలి యున్నవి. అయ్యవి రాజరక్షక సేనాధిపులతోబా టనవసరముగాన వేఱెఁ జెప్ప నవసరము లేదు. మఱియు బలమున క్రమముగ (అనఁగా రథ గజ తురగ పదాతులు) చేర్చుట నేనుఁగులు మొదలగునవి యక్రమపుచావునకుఁ బాల్పడవని సెలవొసంగిరి. ప్రతిజంతువునకు ముందు బంటుండును. తరువాత నాటకాని చాకచక్యముపై బల మాధారపడి యుండును. కావున నిదియొకలోటు కాదు. బుద్ధిబలపరీక్షాస్థానమైన యీయాట యింత స్వల్పకాలములో ముగియుట న్యాయము కాదనిరి. దోషభూయిష్ఠ మగుదానికన్న దోషరహితమగునది జనాదరణపాత్రము గదా! రుచ్యమగునది స్వల్పమైనఁ జాలదా! న్యాయశాస్త్రమున వాది దౌర్బల్యము తప్ప వాదదౌర్బల్యమెట్లు గానరాదో యట్లే నీయాటయందు దౌర్బల్యము లేదు సరిగదా మీదు మిక్కిలి యాటవానిదౌర్బల్యము కలదు. కావున నన్నివిధములచేఁ బూర్ణచతురంగక్రీడ కంటెఁ బ్రాచీన చతురంగపుటాటయే సర్వోత్తమమనుట యుక్తిదూర ప్రసంగము గానేరదు.



# శాస్త్రానుసరణమా! స్వేచ్ఛాచరణమా!

బాలవ్యాస శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, పిఠాపురము.

పాఠకమహాశయులారా! స్వేచ్ఛాచరణమున కలవాటుబడిన మనము శాస్త్రానుసరణమును మాని ఇచ్ఛానుసారము శాస్త్రవిరుద్ధముగా సంచరించుచు మనసంచరణమున కడ్డమువచ్చు శాస్త్రముల ధిక్కరించి మనవిజ్ఞానమునకు గోచరింపనిది శాస్త్రమం దేమున్నదని భావించుచుంటిమి, కనుక మన మొకసారి మనవిజ్ఞానమును బరిశీలించుకొనుటకై ముందు మనపూర్వోత్తరావస్థల గమనింప నొకింత సింహావలోకన మొనరింతము.

మనము జన్మించుటకుఁ బూర్వము జననీగర్భగోళమునఁ గొంతకాలము పడియుంటిమనుట నిర్వివాదమే! అట్లా గర్భగోళమునఁ బడియుండెడి యవస్థకుఁ బూర్వము ఆగర్భముతో సంబంధములేని మఱొకయవస్థ కూడ యుండెననుటయు నిర్వివాదమే? ఇట్లుండ జననీగర్భసంబంధమునకుఁ బూర్వమైన మనయవస్థ యెట్టిదో? ఏరూపమున నుండునదో? ఎట్టియూహాలు కలదో? మనబుద్ధి కిసుమంతయు గోచరింపదు గదా?

ఇఁక గర్భగోళమునఁ బడియున్నయవస్థ నవలోకించినను ఎట్టి సుఖదుఃఖానుభవము కలదో, ఏయూహాలు కలదో, ఎట్టి విజ్ఞానము కలదో, మన కణుమాత్రమైన గ్రహింప శక్యము కాదు గదా?

ఇఁక జన్మించినపిదప మనశైశవావస్థ యన్ననో, అంతకుఁ బూర్వములైనయవస్థలు స్ఫురింపకుండెడి దగుటే గాక స్తన్యమిచ్చి కంటికి రెప్పవలెఁ గాచుచు ఎత్తుకొని త్రిప్పుచు సంరక్షించు కన్నతల్లిని గూడ గ్రహింపలేనియవస్థ, పదచలనము కలిగినది మొదలు పనికిమాలినపనులు దప్ప పనికివచ్చెడిపని యొక్కటైనఁ బట్టి చూడ గానఁబడని యవస్థ. హితాహితము లెఱుంగక యెంత హానికరములగు వస్తువులనయినను గంటఁబడిన నందుకొనఁ బూనుటయు నందినచో నోటఁ బెట్టుకొనుటయు నెంత వారించినను వారింపఁబడకుండుటయుఁ గలిగి, సాధకబాధకజ్ఞానముగాని భక్ష్యాభక్ష్య స్పృశ్యాస్పృశ్యాది వివేకముగాని లేక మెలఁగెడి యవస్థ, పురోభివృద్ధి సాధనములగు విద్యాభ్యాసాదివిధుల నుల్లంఘించి తత్కాలోచితక్రీడలఁ గాలహరణము నపేక్షించెడి యవస్థ.

కౌం

ఇట్టి యీయవస్థ క్రమముగా గడచినంతనే యవతరించెడి యౌవనావస్థ కామినీ జిజ్ఞాస కాస్పదమై కామసుఖము గాక మానవునకుఁ గాంక్షింపఁదగినది మఱొకటి లేదని నిర్ణయించెడి నిరంకుశావస్థ, ముందు వెనుకలు చూడక నింద్రియలౌల్యముచే స్వసంకల్ప సమర్థనసంరంభముచే సంచరించెడి యవస్థ.

ఇఁక నాపై సంప్రాప్తించు వార్ధకావస్థ, వయోవిశేషమువలన ఘనత లేక నంతవఱకుఁ శ్రమించి కష్టముతోఁ బోషింపఁబడిన యాప్తవర్గముచే గర్హింపఁబడుచు, నాగర్హణముల సహింపలేకఁ దామేదో యనుచు, వారివలన దూషింపఁబడుచు, ననంతచింతలతోఁ గాలము గడిపెడి యవస్థ.

ఇట్లు పరిశీలింప మనయవస్థ లీవిధముగా నున్నవి.

ఇఁక మన విజ్ఞానమో? మన మెంతవారమైనను మనజన్మమునకుఁ బూర్వములైన మనయవస్థలే గోచరింపని విజ్ఞానము, ఏవిషయము చూచినను మనము పై కనకున్నను, ఎవ్వనికి వానికే యంతఃకరణమం దిదేమియు గోచరింపకున్న దేమి దైవమా? యని యడుగడుగున కనిపించెడి విజ్ఞానము. నేను చేయలేనిపని యుండెనా యని గర్వించి సర్వవిధసన్నాహముతోడను గార్యసిద్ధికై పూనికతోఁ బ్రవర్తింపఁ దుదకు అయ్యో! పొరఁబడితిమని ఖేదపెట్టెడి విజ్ఞానము, మన దురదృష్టముచేతనే మనకు సంకల్పసిద్ధి కాకపోయెనని మాటిమాటి కనుపించెడివిజ్ఞానము. మనమట్టి దురదృష్టవంతుల మగుట కేమి చేసియుంటిమో? మనకుఁ దెలుపఁజాలని విజ్ఞానము. ఇహపరసాధకములగు హితోపదేశముల నొసర్చిన తపస్సిద్ధులగు మునిపుంగవులను మతిమాలినవారని మనచే మాటలాడింపఁ జేసెడి విజ్ఞానము. విధినిషేధములకు మనలను దూరముచేసి, అందుచే ఘటించెడి దుఃఖపరంపరలను అనుభవింపఁ జేసెడివిజ్ఞానము. పాఠకులారా! ఇట్టి యనర్థదాయకమగు విజ్ఞానమునకు మన మజ్ఞానమని పేరుబెట్టుకొనుట యుచితము కాదా? జన్మించినది మొదలు మనది యజ్ఞాన ఘనస్వరూపము కాదా? అట్టి యజ్ఞానములోఁ దల్లియనియుఁ దండ్రియనియు దేవుఁడనియుఁ దప్పనియు నొప్పనియుఁ గొన్నికొన్ని శిక్షణములను బొంది కదా మనమాయావిశేషముల నొకింత గ్రహింపఁ గలిగితిమి. ఇంతమాత్రముననే యట్టి సామాన్యశిక్షణములవలనను కేవలము పొట్టకై మన మభ్యసించెడి చదువులవలనను బ్రపంచతత్త్వము ఇహపరలోకవృత్తాంతము కరతలామలకముగా గ్రహింపఁబడినదని మనము భావించుట విజ్ఞానమా? యజ్ఞానమా? మన పూర్వోత్తరావస్థలనే గ్రహింపలేని మనవిజ్ఞాన మజ్ఞానస్థానీయ మనుకొనుట కథ్యంతర మేమి? మన లోకజ్ఞానము అతీతానాగత వస్తుజ్ఞాన మగునా? వర్తమాన యావద్వస్తువిశేష

జ్ఞాన మగునా? ఏవో కొన్ని విశేషములు మన చర్మచక్షుస్సులచే మన మలినాంతఃకరణములచేఁ దెలిసికొనినంతమాత్రమున, అతీతానాగత వర్తమాన యావద్వస్తువిశేషజ్ఞానసాధనములును, గర్భవాసాది పునర్జన్మాంత ప్రభేద ప్రతిపాదకములును పుణ్యాపుణ్యకర్మోపదేశకములును, ప్రజ్ఞాతానేకాశ్చర్యకరాంశోపశోభితములును, అగు శాస్త్రములు మన కనావశ్యకము లగునా? కాళిదాసమహాకవి "చక్షుష్మత్తా తు శాస్త్రేణ సూక్ష్మకార్యార్థదర్శినా" యని శాస్త్రమునుబట్టియే చక్షుష్మంతు లనిపించుకొనుట యని నుడువలేదా?

"గావః పశ్యన్తి గంధేన వేదైః పశ్యన్తి పండితాః,
చారైః పశ్యన్తి రాజానశ్చక్షుర్భ్యామితరే జనాః"

అనుసూక్తి యనుభవసిద్ధము గాదా?

మనము సుఖము కలుగవలెననియు దుఃఖము తొలఁగవలెననియుఁ గదా కోరుచుందుము, అట్టి సుఖమునకుఁ గారణ మగుపుణ్యమును జేపట్టక సుఖము కలుగునా? అట్టి దుఃఖమునకుఁ గారణమయిన పాపమునుజేయుట మానక దుఃఖము తొలఁగునా? కనుకనే,

"పుణ్యస్య ఫలమిచ్ఛంతి పుణ్యం నేచ్ఛంతి మానవాః,
న పాపఫలమిచ్ఛంతి పాపం కుర్వన్తి యత్నతః." అని చెప్పఁబడినది.

కనుక పుణ్యఫలప్రాప్తిని పాపఫలనివృత్తిని యపేక్షించు మనకా పుణ్యసాధనములఁ దెలిసికొని వాని నాచరించుటయుఁ బాపసాధనములు తెలిసికొని వానిని విసర్జించుటయుఁ దప్పనపుడు ఆపుణ్యసాధనము లేవియో, ఆపాపసాధనము లేవియో మన కుపదేశించుటకు శాస్త్రములు తప్ప మతేమున్నవి? కాన సుఖప్రాప్తి దుఃఖనివృత్తికాములగు మనకాశాస్త్రలనుసరణీయము లెట్లు కాకుండును?

కనుక నో మహాశయులారా! మనము స్వేచ్ఛాచరణము మాని యథాశక్తి శాస్త్రానుసరణము చేయుచు, శాస్త్రానుసారులగు మహనీయుల నభినందించుచు ఇహాపరసుఖముల నొందుట కుద్యమింతము, అందుచేతనే గదా? శ్రీకృష్ణభగవానుఁడు,

"యశ్శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః,
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్" అని యుపదేశించెను.

ఈ యుపదేశమే ప్రమత్తచిత్తుల మగు మనకు సర్వదా సంస్మరణీయము.



# మౌనమార్గము

## శ్రీమద్జ్ఞానానందస్వామివారి ఆంగ్లకృతి కనువాదము

శ్రీ సాగి వేంకటనరసింహముగారు, యం. ఏ., మద్రాసు, కలకత్తా.
ప్రభుత్వకళాశాల, రాజమహేంద్రవరము.

పలుమరు మన్ముఖంబున నపారముదంబున విన్నయట్టి యా
సలలితసత్యముల్ మఱల సన్మతి నీయెడఁ జెప్పుదున్, నిర
ర్గళముగ దేశమందున విరాజితమై సువిశాలఫక్కి మా
ర్పుల నిరతంబుఁ గాలమునఁ బొందుచు నింద్రియజన్యమైనజ్ఞా
నలవముచేత రూపములు నామములై కనుపించు నీ సమా
కులమగు విశ్వమంతయును గ్రూరమనఃస్థిత శూన్యరూప సం
చలనము, రంగు వాసన రసంబులు నన్నియు నింద్రియేక్షణం
బులకెగయందుఁ జేరు, నిఁక మోసముచేత ననంతవస్తుసం
కలితములై కనన్ విషయకభ్రమఁ గొల్పెడు కాలదేశముల్
దెలియఁగ బుద్ధికిన్ సహజరీతిని నుండెడు రూపముల్ సుమా
వెలయును లోని యావిషయి విస్ఫుటభాగము గాఁగ నివ్వి యెం
దుల లఘుబుద్ధు లంధులయి దౌర్బలముల్ గొని వ్యర్థయత్నతన్
మెలఁగుదు రిట్టి దీవిధము మిథ్యయె యైన జగంబనం జనున్. ౧

కాని సదర్థభావమది గల్గనిచో నసదర్థభావ మిం
తేనియు లేకయుండునటు లెల్ల జగంబును రిత్తయౌను సూ
దానును దోఁచుచుండుటలు, తథ్యము సుమ్మిది నశ్వరం బనం
గాను, మితంబుగాను వెలుఁగంజను విశ్వము మించి యంతమే
లేనిది యేకమైనది పరీక్ష నొనర్పఁగ నిత్య మస్తితా
భానము, వెల్గు నెల్లపుడు బంధురశక్తిని స్వేచ్ఛ నామరూ
పానుగతంబు గాక; యది ప్రస్ఫుటచిత్తముపైన దానియం
దైన విధంబు పైన, మఱి యట్టులె బుద్ధికిఁ దెందు రూప సం

కానముపైన నింకను యథావిధి చిత్తముచేత చోదితం
బైన విశిష్టవస్తువుల యన్నిటిపైనను మించి వెల్గెడున్. ౨

ఏది నిరుక్తవస్తువుల కెల్ల నతీతము గాదొ యయ్యదే
భేద విహీనసత్యముగఁ బెంపు వహించుట యెట్లు సాధ్యమా
కాదె జగంబు చిత్తజవికారతఁ బర్వడు నట్టిదెయ్యెడల్
కాదన కెల్ల భేదము లెకాయకి దాటి స్వయంప్రకాశమై
వాదవిదూరమై పరమవస్తువు సత్తు ననంత మవ్యయం
బై దరిలేనిదై వెలుఁగుఁ బ్రస్ఫుటరీతి నటంచుఁ దార్కికుల్
సాదులు సత్తపోధనులు సమ్మతిఁ గన్గొని రిట్టి సత్యమున్. ౩

ఎపుడస్తిత్వము తద్విరుద్ధముగ నీక్షింపంబడున్ నాస్తితా
విపులోద్వర్తన మస్తితా విధమునన్ వెల్గొందుఁ దార్కారుగా
విపరీతంబుగ సత్యమున్ మొదలె భావింపంబడున్ మిథ్యగా
నెపు డస్లే యనృతంబు సత్యముగ నన్వేషింపఁగా నానా దా
నెపు డీదృష్టియు శాశ్వతంబునెడ బంధింపంబడున్ మూఢమై
యెపు డావ్యర్థము నొందు యత్నము మహాకార్యంబుగా భావితం
బపు డోసూనృతవర్తి! తీవ్రతరఘోరార్తిప్రదంబైనదీ
వపుమృత్యూత్కటబాధగాక యిఁక యేభావంబు వర్తిల్లెడున్. ౪

ఎవఁ డీయజ్ఞత వీడి మిథ్యలగు నీహానేచ్ఛలన్ మాని భా
రవహంబుల్ పలుబంధముల్ దతెగి పూర్వారబ్ధమా సర్వమే
దవివేకంబునఁ జేయఁగాఁబడియె నాయాకార్యమున్ మాయున
ట్లవలంబించి కృతుల్తమంతటనె లీలన్ వేదమం దార్య లే
మి విధానన్ వివరించి రావిధమున్; మీఱంగ జ్ఞాతన్ సము
ద్భవమా జ్ఞానము జ్ఞేయమున్ దుదకు తత్వం బేకమభ్యాసమై
యవలన్ శాంతియు మోక్షమున్ బొఱయు వాఁడత్యంతసంభూతిచేన్. ౫

సారస్వేచ్ఛను బూర్ణమై వెలుఁగు తత్సత్యంబు నద్వైతమే
కారాధ్యం బనుభూతి కెందగను సౌఖ్యంబూని జ్ఞానంబునో
ప్పారంగా నది యేకమంచుఁ దెలియన్ బ్రారబ్ధజన్మాది సం
సారార్తిన్ బరిమార్పఁగోరికను జిజ్ఞాసన్ జేయువాఁడే మహా

ఘోరంబైన జగంబు వీడి స్థిమితస్వచ్ఛందశాంతంబు నా
దూరక్షేత్రముఁ జేరి మోదపదమందుం నిల్చి మెల్మెల్లగా
నారంభించును సాధనంబు విమలుండై సర్వకర్మంబులన్. ౬

మనసు తత్కార్యభావసంభావనములు, నశ్వరంబగు విషయసంతతికిఁ జెందు కారణంబున, మఱి చిత్తకలితమైన, విధములే చిత్తజములైన వివిధవిషయములగుటను, సర్వమును మీఱు పూర్ణతత్వ, మును నెఱుంగగ దేహంబు మనమునెల్ల వాని మీఱు టవశ్యంబు భావ్యమగుట, నతఁడు పల్మారు చింతించి యర్థానిశ్చయం బొనర్పఁగఁ దద్విధి నతని మనసు, భావములనుండి విడివడు శక్తిఁ జేయు క్రమత నందున భావముల్ గడచి వెడలు, సుప్తమనమును సొంతము రిక్తమగును కాని యాభావములఁ ద్రోలి గ్రాలుభావ, మలరు సూక్ష్మతఁ జాగ్రత నతఁడు రిక్తమగు మనస్సును దద్భావ మలరి కాంచు, నచట రిక్తంబునుం మంచి హైనభావములును చెడ్డవి చూచును మూల పొంచి, మఱియు నుచ్చము నీచమై మనిన రసములందు దుముకు నహంకృతి యచటఁ జేరు, వాని నాతఁడు నిశ్చయమూని తఱుము.

అక్రమమైన మార్గములయందుఁ జరింపక నిశ్చలంబుగా
సక్రమసాధనంబుఁ గనఁ జాలినచో చిరకాలమంత ని
ర్వక్రముగా మనంబు తనవర్తనచేతను రిక్తమౌను స్వీ
యాక్రమణంబు వీడియు తనంతట నా సుఖభావ మేగెడిన్. ౮

దాని ప్రదేశమందు నొకదర్పములేని సుసూక్ష్మమైన మం
దానతమైన స్పందనమె యాక్రమణంబు నొనర్చు నంత న
ద్దానికి మాంద్యలక్షణము తద్దయుఁ గల్గియు నిద్రరీతిగా
పూనిక నుండియుం మిగుల పూజ్యసుశక్తినిధాన మద్దియే. ౯

అతితమసంబునం మునిగె నంచుఁ దలంచును మానసంబు నీ
స్థితిగని దుఃఖమొందు నిక స్వీయవిధానము సంశయించుఁగా
ని, తనదు ధర్మవర్తననె నిశ్చయమొందు మనంబుతోడ నీ
స్థితియును నొక్కపెట్టనుచుఁ దీవ్రత నెంచియుఁ గొంతకాలమీ
గతి, మునుముందునం జనఁగఁ గాంచిన, స్పందన మెంతొ సూక్ష్మమై
యతి విమలంబుసత్తును చిదాత్మకముం మఱి మోదరూపముం
యతులు వచించుతత్వము సమార్జనసేయఁగ నిద్ది ప్రస్ఫుటం
బతులితమైన సాధనమటంచును భావనఁ జేయఁ గల్గెడున్. ౧౦

ఇది బ్రహ్మాకారం బౌ,నిది ప్రేమమయంపువృత్తి యిది సూక్ష్మంబౌ
నిది మాయకు వేషంబగు, సదమల తత్వము నిముద్వఁ జాలును దనలోన్. ౧౧

కడకిది వృత్తి యొక్కటియై, గాదిది రెండను భావమొంది యే
ర్పడఁగ తదేకవిజ్ఞత నభంగుర బ్రహ్మసువృత్తి దీప్తమౌ
కడగి మునీశు లిద్ది సవికల్పిక మందురు దీని నాస నె
వ్వడు రుచిమాచు లోకమున కాతఁడు పల్కును నిట్లు సిద్ధుఁడై. ౧౨

"నేను, బ్రహ్మను బ్రహ్మను నేనె నిజము సోహమస్మి నిరంతరం సోహమస్మి" ౧౩

ఎడతెగకుండి స్పందనము నీఘనవృత్తి యొనర్చుచుండి తా
నడగుచు నెమ్మదిన్ వికృతినందును రిక్తము నిల్చి యంతమున్
కడచన స్వస్థితుల్ గడచి బ్రహ్మణి నేకమునందు మగ్నమౌ
నెడపక నిర్వికల్పమను నిట్టి సమాధిని నాతఁ డద్భుతం
బడరఁగఁ గాంచఁ గల్గుటనె బ్రహ్మమతండగు శాశ్వతంబుగన్. ౧౪

---

శ్రీ జి. కృష్ణారావుగారు, యం. ఎల్. ఏ. జమిందారు, కింబర్లి, కిల్‌పాక్, మద్రాసు:—

నామిత్రుడు శ్రీ శాస్త్రులుగారి నిరాడంబరమగుశుద్ధజీవితము కడచిన 25 ఏండ్లుగా నన్నాకర్షించినది. ఈయెల్లకాలము మాస్నేహితమువర్ధిల్లినది. సుప్రసిద్ధుడు, పండితుడు, విద్యానిధిఅగువారి తండ్రి ఆరంభించిన తెనుగుభాషా పునరుజ్జీవన పునర్నిర్మాణముల నీయన జరిపి మహత్తమసేవచేసినందున ఈయనకు 'భాషోద్ధారక'బిరుదము సార్థకముగాగలిగినది.

ఇతడు కొనామొదలు స్థైర్యముగ రొదసేయక వైజ్ఞానికపౌరజీవితముల వెంటను సేవచేయుచువచ్చినాడు. ఎప్పుడును విద్యుద్దీపముల పగటివెలుగులలో కులుకవలెనని ప్రయత్నించినవాడుకాదు.

తెలుగు వారపత్రిక 'త్రిలిఙ్గ'ను ఇంగ్లీషు 'ఫెడరేటెడ్ ఇండియా'ను ఇతడు విజయముతో నడుపుకొనివచ్చినాడు. ఇతనిని సన్నిహితముగా చిరకాలమునుంచి యెరిగినవారందరును త్రిలిఙ్గరజతోత్సము జరుగుచున్నదనిన మహదానందము పొందుదురనుటకు సందేహములేదు.

# శ్రీగురుజాడ అప్పారావుగారు—
# ఆంధ్రభాషాసారస్వతోద్ధారకము

ప్రధానశేఖర శ్రీ బుఱ్ఱా శేషగిరిరావు, ఎం. ఏ., పి. హెచ్. డీ.,
ఆంధ్రభారతీతీర్థ, విజయనగరము.

శ్రీభాషోద్ధారక బిరుదాంచితులై విద్వజ్జనమాన్యులైన మాచిరకాలపుమిత్రులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు ప్రకటిస్తూవున్న "త్రిలిఙ్గ" పత్త్రికకు రజతోత్సవము జరుపుతూ, తదభ్యుదయమునకై యొక ప్రత్యేకసంచిక ప్రకటించుచు, అందులో వారి కనేక విధములుగాతోడ్పడిన శ్రీగురుజాడ అప్పారావుపంతులుగారినిగురించి యేదేనా కొంత వ్రాసిపంపమని కోరిరి. త్రిలిఙ్గసంచికవల్ల నాకున్ను నేను నడుపుతూవున్న భారతీతీర్థమునకున్ను కొంత పండితలోకములో ప్రసిద్ధికలిగివుండుటచేత, [1] అందుకు కృతజ్ఞతగానైనా ఈచిన్నవ్యాఖ్యానము నేనువ్రాసినట్లు చదువరులు భావింపవచ్చును. లేదా శ్రీఅప్పారావు గారినిగురించిన్ని వారిభాషావాదమునుగురించిన్ని కొన్ని విశేషాంశము లిందుమూలముగా జ్ఞాపకమునకు తెచ్చుకోవచ్చును.

## జీవితరహస్యము

శ్రీ అప్పారావుగారికి ఆంధ్రలోకములో వాడుకభాషావాదవ్యవస్థాపకులుగా కొంత విమర్శకలిగినది. వారి నారోజులలో దూషించినవారేగాని వారివాదమును సరిగా అవగాహనచేసుకున్నవారు చాలా తక్కువ. తదుపరి వారి "ముత్యాలసరముల"కానందించి వారిని "కవిశేఖరుల"ని గౌరవించి ఆంధ్రములో నూతనఖండకావ్యకల్పనల కాచార్యునిగా ననేకులుసన్మానించిరి. వారిట్టిదూషణభూషణతిరస్కారముల కేమాత్రమున్ను చలించక, తమపని తాముసాగించుకొంటూనేవచ్చిరి. ఇందుకు శ్రీమదానందగజపతిమహారాజావారి సాహచర్యములో వారవలంబించి అలవరచుకొన్న రాజయోగవిధానమే కారణము. అట్టి "స్వవిమర్శ" యున్ను, తననుతాను దిద్దుకొనుటయున్ను దీక్షగా అవలంబనచేసినవ్యక్తులు మన ఆంధ్రులలోనేగాదు ప్రపంచములోనే చాలా అరుదు. ఆయన డైరీలు, నోటుబుక్కులు, మెమో

1 శ్రీభారతీతీర్థప్రసంగములను, నావ్యాసములను "ప్రత్యేకముగా" త్రిలిఙ్గలో నొకసంవత్సరము శ్రీశాస్త్రిగారు ప్రకటించిరి.

రాండములు, లేఖలు మొదలైనవ్రాతరికార్డులు (ముద్రణకానివి) చూస్తూవుంటే నాకీ అభిప్రాయము రానురాను దృఢపడుతున్నది. కొన్ని డైరీవాక్యములు ఇంగ్లీషున ఉన్నవి ఉదాహరిస్తాను:—

"Anger is caused by a lack of dramatic element in one's nature, of being able to appreciate the motives and the circumstances which prompt those that give offence."[1]

ఈసూత్రము ననుసరించి వ్రాసినవే "మాటామంతి" అనేవ్యాసములలో తన్ను తిట్టినవారి వ్రాతలనుగూర్చిన విమర్శలు.[2]

శ్రీ ఆనందగజపతి మహారాజావా రొకప్పుడన్నారట:—

"A really strong man will not try to traduce you or do you harm when you have insulted him or neglected him, but will be revenged by trying to do you good, by demonstrating that you have dealt unworthily with a worthy man."[3]

ఈవాక్యము లప్పారావుగారు తమ నిత్యజీవితమును నిర్ధారించుసూత్రముగా చేసుకొన్నట్లనేక నిదర్శనములు చూపవచ్చును.

## కళాప్రియత్వము

శ్రీఅప్పారావుగారు విజయనగరంకాలేజీలో ఆంగ్లోపాధ్యాయులుగా వుండినరోజులలో నిత్యమూ శ్రీమదానందగజపతిమహారాజావారిదర్బారులో జరుగుతూవచ్చిన ఆంధ్రగీర్వాణాంగ్లసాహితీప్రసంగములలోనూ చర్చలలోనూ పాల్గొనుచుండినయంశమును నేను "అప్పారావుగారిడైరీలు" అనేవ్యాసములలో ప్రకటించివున్నాను. అప్పటిలో ఇంగ్లీషు బాగానేర్చినవారికి ఆంధ్రముయెడలవుండిన నిరసనభావమునకు వగచుచు వారు వ్రాసుకొన్న డైరీవాక్యములున్ను ఆంధ్రభాషను వారువ్రాయదలచుకొనుచూవచ్చిన కావ్యములకు వస్తువులుదాహరించుకొన్న డైరీవాక్యములున్ను చూస్తే వారికి ఆంధ్రభాషాసాహిత్యోద్ధరణదీక్ష నానాటి కెట్లు దృఢపడుతూవచ్చినదో తేటపడుతుంది.

---

1 Appa Rao's Diary, 1897 page 9

2 మాటామంతి 2 రామానుజాచార్య విద్యాసమితి ప్రచురణము సెం 14 రు.

3 Appa Rao's Diary, 1897 page 44

"1895 సం॥ ఆగస్టు నె 2 దీని డైరీపత్రములో—"వచ్చేశీతాకాలపురోజులలో చెన్నపురిలో చెప్పుటకు ఆంధ్రసారస్వతప్రసంగములు తయారుచేయవలెను" అని [1] జ్ఞాపిక వున్నది.

ఆరోజులలో యెవరుచెప్పినదో వొకశ్లోకము వ్రాసుకున్నారు. ఎట్లనగా:—

"ప్రభుభిః పూజ్యతే విప్ర, కళైవ న కులీనతా,
కలావాన్మాన్యతే మూర్ధ్ని, సత్సు దేవేషు శంభునా" అని.

సకలకళాప్రవర్తకరంగముగా ప్రసిద్ధిచెందిన శ్రీమదానందగజపతిమహారాజావారి ఆస్థానములోగాక ఇట్టి పూజాసూత్రము వేరొకచోట నెట్లు వినబడియుండును? గనుక తదాస్థానికులైన శ్రీఅప్పారావుగారి సాహిత్యవిమర్శలలో "కళాదృష్టి"కి ప్రాధాన్యము కనబడుతున్నది.

## రాజధానినగరము : ఆంధ్రభాష

తమనాడాంగ్లమునకుగల గౌరవాదరణములు ఆంధ్రమునకు లేకుండుటకువగచియు, అట్టిపరిస్థితికి కారణము అప్పారావుగారన్వేషించుచు ఇట్లు వ్రాసికొనిరి:—[2]

### 1 TELUGU *vs* ENGLISH

"Telugu has to run a competition with such a highly cultured tongue like English and hence is neglected by those who, of all men, are best capable of improving it." 3-1-97

### 2 TELUGU

"The disadvantage of Telugu is not having been the exclusive tongue of a metropolis. Bengali and Maharatti prospered by being so. Bengalis and Maharattas profited from the metropolis being fixed among them. To some extent the Tamils also."

"ఆంధ్రులకు రాజధానీనగరం అంటూ వొకటి ప్రత్యేకంగా లేకపోవడమున్ను బంగాళీలకున్ను మహారాష్ట్రులకున్ను అట్టిదికలిగివుండడమున్ను ఆభాషలకుగల అభివృద్ధి

---

1 "2nd August, 1895 To write...A series of Lectures on Telugu Literature to be delivered in Madras next cold season." A Diary Book 1895 (Folio)

2 Appa Rao's Diary Book for 1897

ఆంధ్రమునకు లేకుండుటకు కొంత కారణమైనది. తమిళులకున్ను కొంతవర కీవిషయములో మెరుగే అయినది" అంటారు అప్పారావుగారు.

ఈయంశమునే మరియొకసందర్భములో శ్రీవిక్రమదేవవర్మమహారాజావారికి వ్రాసిన లేఖలో నిట్లుదాహరించిరి:—

"If Madras had been situated 30 miles north of its present site, Telugu would have fared better: if 30 miles south, Tamil would have fared better, where it stands she is a step-mother to Telugu." (Letter dated 26-9-08) [1]

"చెన్నపట్నం యిప్పటిస్థలంలోవుండి తెలుగుకు సవతితల్లిప్రాపకమువలె వున్నది. ఇంతకు 30 మైళ్లుమీదుగావుంటె తెలుగు బాగుపడివుండును; 30 మైళ్లు దక్షిణంగావుంటే తమిళం బాగుపడివుండును" అంటారు. నేటికిన్ని ఆయనవాక్యము లెంత ప్రామాణికములై వున్నవో ఆంధ్రులకు విశదమయ్యేవున్నది. ఇట్టి విపరీతపుపరిస్థితులలో నింతకాలముగా శ్రీవావిళ్లవారివంటి యేరెండుమూడుఆంధ్రులప్రకటనసంస్థలో చెన్నపురిలో ఆంధ్రభాషా సేవ నిరంతరాయముగా చేయగలుగుతున్నవంటే, వారి "భాషోద్ధారకము"న కాంధ్రులు వారినెన్నివిధములుగానైనా గౌరవించతగ్గవిషయమే.

## రసము - కవిత్వము

శ్రీఅప్పారావుగారు సాహిత్యోపాధ్యాయపదవిని సమర్థతగా నడిపినపండితులు. ఆంధ్రాంగ్లగీర్వాణసాహిత్యములలో సవిమర్శకమైన ప్రజ్ఞాపరిజ్ఞానములు సంపాదించినవారు, సరసమైన రచనసాగించ ప్రయత్నించినవారు! వారు ప్రకటించక మిగిల్చిన రచనలు ప్రకటించినవాటికన్న అయిదారురెట్లైనా వుంటవి. వారెంతోసాఫుచేస్తేనేగాని యేరచన అయినా ప్రకటించేవారుకారు. దీనికి వారి "కళాదృష్టి"యే కారణము. ఆంధ్రగీర్వాణకవితలను కళావిలసనదృష్టితో, రసపిపాసతో చదివి చూచినవారు. భాషాపదములను, పదబంధములను, కారకములనుకూడా అట్టిదృష్టినే తిరగాబోర్ల వేసి చూచినవారు. శ్రావ్యతకు, మాధుర్యమునకు, అక్షరరమ్యతకు, రసము చిప్పిలుటకు చొక్కి రచనలలో మనసునిల్పినవారు. వారు చదివిన అనేకగ్రంథములలోనే గాక డైరీలలోను, నోట్సులోను, ఉత్తరములలోను ఇట్టి విషయములనుగురించిన రిమార్కులు కనబడతవి.

[1] Letter to Maharajah Sri Vikrama Deva Varma, dated 26-9-1908.

కవిత్వమునకూ, రసమునకూ వాక్యసరణికి గలఅనుకూల్యమును కళాదృష్టిని పరికించి అప్పారావుగా రిట్లన్నారు:—

"రసం అట్టేలేనితలపులకు గద్యరచన తగివుంటుంది. రసం చాలనిచోట పద్యరచన విరసం. అందుకుతోడు తలపులుతక్కువైతే వృత్తాలునిండడంకోసం గంగిరెద్దు గుడ్డలు మెట్లు పడవలె, ఆగుడ్డలైనా అందముగా అమర్చడం చేతకాకుంటే మాటలుమాసి, అన్వయించెడి పద్యాలు టొంకరినడకలు నడిచి కవిత్వం "కపిత్వం" అవుతుంది." [1]

ఇట్టి విమర్శ తమనాటి ఆంధ్రరచనలకు పట్టించి తమనాటిరచనలలోని సారస్యనైరస్యములు నిరూపించిన అప్పారావుగారి సారస్వతసేవ ఉగ్గడించవలసినదేగదా!

## గ్రాంథికభాషాలక్షణములు

ఆంధ్రగ్రాంథికమును తప్పులతడకలుగా అల్లి డాబులుకొట్టేవాళ్లను చూస్తే ఆయనకు చాలావొళ్లుమండి కొంత లేనిరోషమైనా తెచ్చుకొని "వాడుకభాషలు - గ్రామ్యము" అనే వ్యాసములో ఇట్లు విస్పష్టముగా వ్రాసినారు:—[2]

"సంస్కర్తలఉద్యమములమూలంగా తెలుగులక్షణం మట్టిగలిసిపోతున్నదని యేలుగెత్తేమహానుభావులలో, లక్షణం బాగా తెలియనివాళ్లూ, లక్షణానుసారంగా రాయలేనివాళ్లే మెండు. ఒకతోవాతెన్నూ లేకుండా, యెవడికి తోచినరీతిని వాడు తెనుగులక్షణం అడుగడుగునా పడగొడుతూ, గొప్పకోసం సంస్కృతంమాటలు ప్రయోగించి, కృత్తద్ధితల రూపుమాపి, లింగవ్యత్యయముచేసి, శబ్దౌచిత్యమును చెడగొట్టి, లోకంలో యెన్నడూ, యేదేశంయెరగని, దౌర్భాగ్యపుభాషను రాస్తూ, అది తలుచుకు ఆనందిస్తున్నారు. మనుష్యులకు బుద్ధులులేవా? కళ్లులేవా! ఇన్నివిథాల గ్రాంధికభాష తగలబడుతూవుంటే, యీఉపద్రవమును తొలగించ ప్రయత్నించక, వాడుకభాషరాసినందువల్ల యేమో తెనుగుకు చేటువచ్చునని వగలబోగులుతారేమి?" అని

ఈఅంశమునే పురస్కరించుకొని 'మాటా - మంతి' అనే మరొక వ్యాసంలో తే 24-11-10 దీని శ్రీఅప్పారావుగా రిట్లు వ్రాసిరి:—

"పరిశీలించి చూడగా, శాస్త్రులుగారికిని (అనగా కాశీభట్ట బ్రహ్మయ్యగారు) నాకును అభిప్రాయభేదము చాలా తక్కువ. గ్రాంధికభాష వాడుకచేసేవారు దానినియమములను

---

1 "సుభద్ర-మాటామంతీ" page 197 (రామానుజాచార్య విద్యాసమితిప్రచురణములు సం 34 రు.)

2 పై 8 లో 9 గ్రంథములోనే, పే 196 చూ.

పూర్తిగా మన్నించవలసినదనే నాఅభిప్రాయము. ఆభాషను సాధించలేనివారు అనగా, లోకానికల్లా, బ్రహ్మయ్యశాస్త్రులుగారివంటి పదిమంది తప్ప కడమందరూ, వాడుకభాషలో నుంచి సులభసాధ్యమైన వొకకొత్తగ్రాంధికభాషను కల్పించుకుంటే, శాస్త్రులుగారికి యేమి కొరత?" అని

"కర్నాటకములో 'హాలగన్నడ-హొసగన్నడ' అనేభేదము యిటువంటిదే అయి సర్వజనసమాదరణీయమైవుండగా ఆంధ్రములోకూడా 'కొత్తగ్రాంధికం' యిట్టిదేల అంగీకరింపబడకూడదు" అని శ్రీఅప్పారావుగారనేవారు. ఇక వారిమిత్రులున్ను సహాధ్యాయులున్ను అయిన శ్రీగిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు "ఈబ్రహ్మయ్యశాస్త్రిగారివంటి పదిమంది"కూడా ఆంధ్రగ్రాంథికమును నియమములు చెడగొట్టకుండా వ్రాయలేకపోయినారని నిరాఘాటముగా రుజువుచేసినారు.

## ఆంధ్రభాషోద్ధారకము

శ్రీఅప్పారావుగారు వ్రాసినదెప్పటిదో ఒకవ్యాసం చిత్తునమోనాలో ఆంధ్రమందు వచనము కళానైపుణ్యముతో వ్రాయగలకృతికర్త తమతరములో యింకా బయలుదేరలేదని విచారిస్తూ వ్రాసినవాక్యములు కొన్ని కనబడుతున్నవి. దానినిబట్టి ఆంధ్రభాషోద్ధారకమునుగురించి వారికెంత తాపత్రయముండెనో తెలుస్తుంది. ఇట్లు:—

" English literature which is more widely cultivated in this country than ever Latin or Greek was in the time of the Revival, has failed to introduce any remarkable improvement in literary workmanship. I say this advisedly. There are many now who are satisfied with the progress made, some who think highly of it. I have myself read a fair quantity of modern prose and poetry and confess to a sad disappointment. Not speaking of poems or dramas of any length, not speaking of essays and tales, I would challenge any body to point out one writer, a master of literary technique, I mean one who labours over his sentences and paragraphs as a painter over the canvas."

మరియు—

" As the literary form developes, one genius improves it much more than his predecessors and clothes great thoughts with it. Good works can be written by imitating previously existing works or by rules formed by

deductive and inductive processes. At the present day we have a host of English masterpieces to imitate".

అప్పారావుగారన్నట్టు, English Prose Masters, ఆంగ్లవచనకవులతో పోల్చగల ఆంధ్రరచయిత యింకా బయలుపడవలసియే యున్నది. "ఆంధ్ర స్కాటు" అనీ "ఆంధ్ర అడిసన్" అనీ కొందరి నేదో మాటవరసకు అనడము వింటిమిగాని "ఆంధ్రకార్లైలు" గాని "ఆంధ్రరస్కిను" గాని "ఆంధ్ర థాకరే"గాని, కడకు "ఆంధ్ర డికెన్సు" గాని అనడమునకు మాటవరసకేనా యెవరూ ఆంధ్రములో బయలుదేరలేదు. అవున్న మాటసామ్యము లేనా యేపదిపది హేనువేళ్లు విడిచిన మేనరికములలాగనో వుంటవి. ఇది విచారముతో అంటూ వున్న మాటగాని నిందాగర్భముగాకాదు. లేనిబావకన్న గుడ్డిబావైనా మేలే అని సమర్థించు కొని ఆనందిస్తున్నాము. అట్టిఆనందము అభివృద్ధినరికట్టుతుంది అంటారు అప్పారావుగారు. అంతే.

## వ్యావహారికభాషాసముద్ధరణ తమకు పూర్వముదే

అప్పారావుగారు తీసిన వ్యావహారికభాషాసముద్ధరణవాదం వారికిముందు శ్రీమద్విజయరామగజపతిమహారాజావారి ఆస్థానికులైన విద్వత్కవులు, ఆంధ్రగీర్వాణములలో ప్రతిభావంతులై పేరుపడ్డపండితులు, ఆంగ్లవాసనలేనివారు, లేవదీసినదని అప్పారావుగారు జాగ్రతచేసిన అచ్చుపత్త్రికలప్రతులలో కనబడుతున్నది. ఈసంగతి నేను శ్రీవారితో కలిసి పనిచేయుచుండినరోజులలో అనగా 1910 ప్రాంతములోగాని, తదుపరి గతరెండుసంవత్సరములవరకూగాని యెరుగను. వారిడైరీలనుగురించి "ఆంధ్రపత్త్రిక వీక్లీ"కి వ్రాయుటకు వారి కాగితములూ రికార్డులూ తిరగవేస్తూ వచ్చినప్పుడు కనబడ్డది.

రవీంద్రకవినిగురించి "మాటా-మంతి" అనేవ్యాసములలో ఉగ్గడిస్తూ అప్పారావుగారిట్లు వ్రాసిరి:—

"ఆమహాకవి భాషను యెత్తాడు, తలపులనెత్తాడు, చెయ్యులనెత్తాడు. కీర్తివెన్నెలల దిక్కులు నింపాడు." అని.

ఇట్టి ఆశయముతోనే అప్పారావుగారు ప్రాచీననవీనాంధ్రపద్యగద్యరచనలను కళాదృష్టితో విమర్శగాచూస్తూవచ్చారు. ఇట్టి ఆశయముతోనే ఆంధ్రభాషాసాహిత్యవిమర్శలు వ్రాశారు. ఇట్టి ఉద్ధారకమునే తమవిమర్శలలో ఆంధ్రగ్రంథరచయితలకు బోధించారు. అప్పారావుగారు ధన్యజీవులు.

# ఆంధ్ర వాఙ్మయ వికాసము

శ్రీ చన్నాప్రగడ భానుమూర్తిపంతులుగారు,

*Telugu Translator to the Government of Madras (Retired),*
*Turputatta, (Via) Narsapur, West Godavary Dt.*

శా. శ్రీదాక్షాయణులున్సరస్వతియు హృత్సీమార్ధదేహానన
ప్రాదుర్భూతవిలాసకారణములై భాసిల్ల భక్తాళికా
హ్లాదం బిమ్ముల గూర్పగా సగుణమై యాత్మజ్ఞులౌ వారికిం
దాదాత్మ్యస్థితినచ్ఛమై యెసఁగు నాతత్వంబు ధ్యానించెదన్.

చ. తనునిరవద్యశుద్ధపరతత్వముగా తెలియంగలేని యీ
మనుజులవేషభాషలక్రమంబున నందఱ కన్నిరూపులై
చనుచు ననేకనామముల సర్వజనార్చల నందుచుండు నా
యనుపమదివ్యతేజము నహర్నిశము న్మదిలోఁ దలంచెదన్.

ఉ. భూతములందు నేకగతిఁ బూసలలోపల దారమట్లను
స్యూతత నేకతత్వమయి శుద్ధసువర్ణమనేకభూషలా
ఖ్యాతి నుపాధిభిన్నమయి భాసిలుచుండి వివేకదృష్టికిం
జేతనసారభూతమగుఁ జిన్మయతత్వము నాశ్రయించెదన్.

మనదేశమును బల్వురు భరతఖండమందురు. నామతమున నిదియొక ఖండమే కాదు. ఇందు నిసర్గసిద్ధమైయున్న సరోవర శైలకాననాదిరమ్యవస్తుసంపదను, నేడిందుజేరి సహవసతి గల్గి జీవించుచున్న వివిధప్రజాసంఘములనుగూర్చి పర్యాలోచించినచో నిది చిత్రవిచిత్ర ప్రపంచసృష్టియెల్ల చిత్రవస్తుప్రదర్శనశాలలో వలె, ఒకప్రదేశమున నిమిడియున్న పరిమిత భూమండలమే. గౌరీశంకర ధవళగిరి మొదలగు నుత్తుంగశిఖరములతో నొప్పారి భూలోకమందెల్ల యున్నతమగుహిమాలయపర్వతపఙ్క్తి యీదేశములోనిదే. ప్రవహించుభూభాగమును సర్వసస్యాఢ్యగను, కన్నులపండువుగను జేయుచు నేనదులకును దీసిపోని గంగాయమునాది నదులీదేశములోనివే. సర్వదేశమృగపక్షికోలాహలసంకులంబును సర్వర్తుఫలపుష్పభరిత లతావిటపివితానంబునునై విలసిల్లు నిందలి శైలకాననేందిందిర మఱెందును గానరాదు.

చ. హిమగిరితుంగశృంగములనీక్షణపర్వముగాగ నిల్పునా
ద్గమునను దోచునట్లు విశదంబుగఁ గన్నులగట్టిన ట్లశే
షము గనుపట్టునొక్కయెడ సర్వచరాచరసృష్టి.

అనియును,

శా. ఉత్తాలద్రుమకుంజరంజితమహాకాంతారసంఛాదితాం
పద్మేందీవరఖండమండితలసత్కాంతారసంశోభితాం
ఆలీతాభ్రశిరస్సమంచితమహాశైలైశ్చ కూలంకషై
స్స్రోతోభిస్సమలంకృతాం భగవతీం వందామహే మాతరమ్.

అనియును,

ఉ. శ్రీలలనాధివాసమయి చెన్నెసలారి సరస్వతీవిలా
సాలయమై ధరారమణికంచితనూపురమై పవిత్రమై
ధీలతకాలవాలమయి దివ్యవిభూతులకు న్నిధానమై
గ్రాలు నఖండమై భరతఖండము మండనమై ధరిత్రికిన్.

అనియును,

నొకకవి చేసినవర్ణన ఈభరతఖండనైసర్గికవిభూతియం దేకాంశమైనను ప్రకటింపఁ జాలదు. ఇందలి స్వభావసిద్ధవస్తుసంపద యిట్టిది. ఇందిపుడు చేరియున్న జనసంఘములంటిమా,

చ. కరము విచిత్రమీభరతఖండచరిత్రము పోల్చి చూచినన్
ధరఁ గలసర్వజాతులును దత్ప్రజలై యిటఁ జేరియుం బర
స్పరమతసంప్రదాయములఁ బాయక సోదరబుద్ధి పూని యెం
డొరులయుదాత్తధర్మముల యోజనఁ బెంతురు స్వీయధర్మమున్.

చ. పరిణతి ఈగతిన్నగతి వావిరి జొప్పడ సర్వధర్మముల్
వరలెడు సామరస్యమున వ్యక్తివినాశమునంద కాపయిన్
ధరయొక పీడనంబరగుఁ దత్ప్రజ యేకకుటుంబకల్పమై
నిరవధికాభివృద్ధిమెయి నెమ్మి జరించు నహాస్తదోషయై.

గీ. ధర్మదృష్టి ప్రబలుఁ దలపంగ ప్రాగ్భూమి, స్వత్వదృష్టి ప్రబలు పశ్చిమాశ
నుభయధర్మములకు నొదవె సంఘర్షణ, మరసి చేయవలె సమన్వయంబు.

శా. నిత్యానిత్యవివేకభూమి యిదివో నిక్కంబు క్షేత్రంబు పా
శ్చాత్యప్రాచ్యసమస్తధర్మచయసంస్కారా ప్తికిౕ దక్షముల్
సత్యాసత్యవిచారకార్యనిరతుల్సత్సంప్రదాయాఖిలో
చిత్యగ్రాహులు పుణ్యశీలురు మహర్షిప్రత్నగోత్రోద్భవుల్.

చ. పుడమిని భిన్నజాతులకు బోలినభంగిని బాహ్యభేదముల్
వొడమన నేకరూపమయి పొల్చెడు ధర్మములీశ్వరేచ్ఛని
య్యెడనిపుడెల్లఁ జేరి వసియించుచునందెడు సామరస్యమీా
వడువున సర్వధర్మము లవశ్యముగాంచు సమన్వయంబిలన్.

అనుకవివాక్కులు ఎంతయు సత్యప్రబోధకములు.

## సర్వమానవక్షేత్రము.

2. ఇట్లు గంగాయమునానదీపుణ్యనదీసలిలపవిత్రితమై, శ్రీరామకృష్ణగౌతమబుద్ధాద్యవతారములకు తావలమై, శ్రీశంకర రామానుజపూర్ణప్రజ్ఞ శ్రీరామకృష్ణపరమహంసాది అంశావతారములకును శ్రుతిద్రష్టలగు మహర్షులకును జన్మభూమియై, సర్వసన్మతసహానక్షమైయున్న ఈపుణ్యభూమి సర్వమతధర్మసమన్వయమునకును, సర్వరాష్ట్రసమష్టిసిద్ధికిని, సర్వమానవసౌభ్రాత్రలబ్ధికిని, విశ్వమానవకుటుంబనిష్పత్తికిని, ఈశ్వరోద్దిష్టక్షేత్రమని విస్పష్టమగుచున్నది. ఈసిద్ధాంతమును సోపపత్తికముగ స్థాపించుపని యొక ప్రత్యేకోపన్యాసమునకు విషయము. ప్రకృతమున నీసిద్ధాంతము నభ్యుపగమమొనర్చి ప్రస్తుతాంశవివరణమునకు గడంగుదము.

## దేశభాషావాఙ్మయములు.

3. సర్వమానవలోకతారకమగు పైచెప్పిన దుష్కరోద్యమము సాగించుపనికి గాను, ఈదేశవాసులందఱును, హిందువులైనను, మహమ్మదీయులైనను, బౌద్ధులైనను, జైనులైనను, పారసీలైనను, క్రైస్తవులైనను, ఈమంటఁ బుట్టి, ఈమంటఁ బెఱిగి, ఈమంటఁ గలియువారుగాన నీదేశమునందు మాతృభావమును దేశజనులయందు భ్రాతృభావమును గల్గి అందలి ప్రతివ్యక్తియు తాను హైందవుడననికాని మహమ్మదీయుడననికాని, బౌద్ధుడననికాని, జైనుడననికాని, పారసీననికాని, క్రైస్తవుడననికాని ఎంచుకొనుటకు మున్ను తానీ దేశమాతసంతానమని భావించి, స్వదేశాభిమానపూరితుడై, ఈదేశమున రాబోయెడి భాగ్యోదయమునకు వలయుసముద్ధరణమును సర్వతోముఖముగా సాగింపవలెను. ఎట్టి

మహోద్యమమును వాఙ్మయాభివృద్ధిలేక సఫలము కానేరదు. కావున వివిధభాషావలంబులై యిందు వసించు సర్వసంఘములవారును వారివారిభాషావాఙ్మయమును సర్వతోముఖవికాసము నందఁజేయవలెను. ఇప్పు డభ్యుదయమునందియున్న ఆంగ్లేయుల వాఙ్మయాభివృద్ధి యీసందర్భమున మనకాదర్శముగా నుండఁదగినదిగాన దానిని సంగ్రహముగ నిరూపింపవలసియున్నది. ఆంగ్లవాఙ్మయమున Shakespeare, Milton లోనగు మహాకవుల కావ్యనాటకరూప కేవలసాహిత్యగ్రంథములే కాక, Sonnets, Ballads, Odes, Elegies, Lyrics మొదలగు నమూల్య ఖండకావ్యసంపద చాలఁగలదు. అట్టి స్వతంత్రకావ్యములే కాక, Greek, Latin మొదలగు పాశ్చాత్యభాషలలోను, సంస్కృతము, పాలీలోనగు ప్రాచ్యభాషలలోనుగల కావ్యనాటకాది సాహిత్యగ్రంథముల యనువాదములు లెక్కకు మిక్కిలిగా నున్నవి. ఇట్లే తత్వశాస్త్రము మొదలగు శాస్త్రగ్రంథములవిషయమున స్వతంత్రగ్రంథములును అనువాదములును సమగ్రముగనున్నవి. చరిత్రలు, నవలలు, వ్యాసములు, మహావక్తల ఉపన్యాసములు లోనగు వచనరూపాంగ్లవాఙ్మయము శాఖోపశాఖలతో విరాజిల్లునొకమహాసముద్రముగ నున్నది. Encyclopedia Britannica సారస్వత సర్వస్వము. మనదేశభాషలలోఁగూడ నిట్టి సారస్వతసమృద్ధి గల్గవలెను. కావున ఆంధ్రమున పురాతనాధునాతనసారస్వతసామగ్రి నించుక వివరించి భావికార్యగతి నిరూపించుకొందము.

## ఆంధ్రభాష—భావప్రకటన.

4. ఇందుల కుపోద్ఘాతముగా భావప్రకటనవిషయమున నాంధ్రభాషకు గల శక్తియు సామగ్రియు నించుకచూపవలసియున్నది. ఈవిషయమున "దేశభాషలందు తెలుఁగు లెస్స", "ఆంధ్రమతిరమణీయమ్," "Telugu is Italian of the East" అను పొగడ్తల గన్న మనయాంధ్రభాష, తిక్కనాది కవిబ్రహ్మలలేఖినీసాహాయ్యమున దేశభాషలనే కాక దేశాంతరభాషలను గూడ మించనైయున్నది. దీనదశాపన్నమగు మనయాంధ్రదేశమున నేటివరకును జరిగిన వాఙ్మయాభివృద్ధి యిందుకు నిదర్శనముగాను భావివృద్ధికి సూచకముగాను ఉన్నది. ఇంతవరకు, భారతరామాయణాది కావ్యపురాణేతిహాసములును, మనువసుచరిత్రాది ప్రబంధములును, శతకములును లోనగుపద్యకావ్యములును, అధ్యాత్మరామాయణ కీర్తనలు, త్యాగరాయకృతులు, లంకాయాగము, కుశలవకథలోనగు పదకవిత్వరచనలును మాత్రము ఖిలమైపోగ మిగిలిన యాంధ్రవాఙ్మయముగా నున్నది. ఉన్నమట్టు కిదియే యితరభాషావాఙ్మయమునకును దీసిపోకుంటయే కాక, ఇంచుక మించునదై యున్నది. అందుకుఁ గారణమును గలదు.

## ఆంధ్రములోని వన్నెలు.

5. బంగాళీ, మరాటీలోనగునవి సంస్కృతభాషాభవమగు ప్రాకృతభాషాపరిణామములు. అందు రమ్యమగుసంస్కృతపదములు వర్ణలోప, వర్ణాగమ, వర్ణవ్యత్యయముల నందియున్నవి. ఆంధ్రముననన్నో మూర్తి వికృతి నందకయే, డుమువుప్రత్యయములతో సంస్కృతనామవాచకములును, ఇంచుగాదిప్రత్యయసాహాయ్యమున సంస్కృతక్రియాపదములును తత్సమరూపమున, నందమై నిల్చుచున్నవి. ఇంతియకాక సన్నంతములు, సంస్కృతసమాసములును, సంస్కృతవాక్యములును గూడ మూర్తివికారము లేకయే యాంధ్రమునకుఁ బ్రాప్తియున్నవి. ఇందు కుదాహరణములు:—

1. గోమేధికప్రభాంకూరమిథ్యామధుద్రవలిలిహానిమిళత్ఫల్లుకంబు.
2. సుత్రామసఖయాయజూకసామాజికంబు.
3. సింహానఖాంకురచ్ఛిన్న వారణకుంభజనితముక్తాఫలశర్కరిలము.
4. అర్థావాగ్విభవమ్మహోవచనకవ్యాహారము.
5. ఇత ఊర్ధ్వమేతాదృగీహితాన్యపి నృణాం సిద్ధేయురితి వదత్సిద్ధచయము.
6. శ్లో. దేవ రంగేశ తే నమస్తే నమోఽస్తు.

... ... ... ... ...

సర్వసాక్షీ భవాన్సమస్తమపి వేత్తి.

ఇదియిట్లుండ లలితపదజాలమును, రమ్యంబగునుడికారమునుగల యచ్చతెలుఁగు పదసామగ్రి యాంధ్రభాషకు నిరుపమానమగుఁ బ్రకృతిసిద్ధసంపద. ఇందులకుదాహరణములు:—

1. ఎలదీఁగెఁగప్పినలలితపరాగంబుక్రియ మేన మేదినీరేణువొప్ప
2. కిసలయంబులతోడ కెంగేలుదడవెట్టి విరులపై నఖకాంతి విజ్జిరాల్చి
3. చేర్చుక్కగానిడ్డ చిన్నిజాబిల్లిచే సిందూరతిలకంబు చెమ్మగిలఁగ
4. చిన్నివెన్నెలకందువెన్నుదన్నిసుధాబ్ధిఁ బొడమినచెలువ తోబుట్టు మాకు
5. చెలికుకాటుకకంటిసొలపుజూపెదలోన బట్టియుండెదు ప్రేమఁబట్టియయ్య

రమ్యంబగు నుడికారముగల యచ్చతెలుఁగుపదములు తత్సమతద్భవపదములతో సమపాలుగఁ గలిసి మెలసినచో శిరీషకుసుమపేశలంబులై వినువారికి రత్నంబుపొందున

జిగిమించుకాంచనాభరణమువోలె, మనోహరమై 'వీనులవిందై యమృతపుసోనలు గురియించుచు' సంస్కృతమును సంస్కరించును. తెలుఁగుపదము లజంతప్రాయములగుటచే గానకలకు కలలువెంచును. త్యాగరాయకృతు లిందుకునిదర్శనము. మరియు తెలుఁగుకావ్యములలోని సమాసములు కమ్మచ్చున లాగినబంగారుతీఁగెలు. అచ్చతెలుఁగుసమాసములు ముత్యాలకోవలు. ఇందుకు దృష్టాంతములు:—

1. జలధివిలోలవీచివిలసత్కలకాంచిసమంచితావనీతలవహనక్షమము.
2 మదమాతంగతురంగకాంచనలసన్మాణిక్యగాణిక్యసంపదలు.
3. గగనకల్లోలినీకల్లోలమాలికాహల్లీసకములతో నవఘళించి.
4. కాత్యాయనీదత్తకర్ణావతంసకర్పూరఖండామోదపూరితంబు.
5. ఐందవగ్రావాకల్పితకాయమానజటిలద్రాక్షాగుళుచ్ఛంబులు.
6. మేలుపసిండిగాజులసమేలపుపచ్చనికీల్కడెంపుడాకేలు.

ఇట్టి మహావకాశము లొదవియుండుటచే నాంధ్రభాష రసభావసమృద్ధికిఁ గావలసిన శబ్దసామగ్రికిం దడవుకొనంబనిలేదు. ఏరసము పుట్టింపవలెనన్న నారసమున కాంధ్రభాషలో శబ్దసామగ్రి సమగ్రముగాఁ గలదు. కావుననే తిక్కనవంటికవిబ్రహ్మల లేఖని యలవడినప్పుడు ఆంధ్రవాఙ్మయసృష్టి యానంత్యమునను, వైచిత్ర్యమునను బ్రహ్మసృష్టిని మఱపింపఁజాలియున్నది. ఈకారణమున దక్షులగువారిప్రాపున ప్రపంచవాఙ్మయసర్వస్వసంగ్రహణసమర్థమై సర్వభాషల నతిక్రమించి మించనున్నది.

## కవిత్రయమువారిది స్వతంత్రసృష్టి.

6. ఈసందర్భమున ప్రాకృతులమనములలోనేకాక ప్రాజ్ఞులమనములలోఁ గూడ ప్రబలియున్న యొకగొప్పయపోహ తొలఁగింపవలసియున్నది. కవిత్రయమువారిభారతము, భాస్కరాదికవుల రామాయణాదిపురాణములును కేవల పరివర్తనములుగాన స్వతంత్రగ్రంథములు గావనియు, ఆంధ్రమున స్వతంత్రగ్రంథరచన పెద్దనార్యుని మనుచరిత్రముతో ప్రారంభింపఁబడెననియు, ఆతండాకారణమున నాంధ్రకవిపితామహుఁడనియు, ఇటీవలికావ్యములనుకరణములనియు, కావున నేటివరకును తెలుఁగున నెన్నఁదగిన వాఙ్మయము లేదని పలువురుతలంచుచున్నారు. ప్రాచీనాంధ్రకవికృత భారతాదిపురాణేతిహాసములనవలసుంచిన ఆంధ్రవాఙ్మయోత్కర్ష శూన్యప్రాయమగును. ఆగ్రంథములు కథ సంస్కృతపురాణేతిహాసముల సిద్ధముగానుంటచే వాటినొకపరి చదివియో చదివించియో విని తిక్కనాదులు తత్ప్రతన

శ్రవణములగల్గిన హృదయపరిపాకముచే స్వతంత్రగ్రంథరచనయే చేసి, కొన్నికట్టుల కుదించియు,కొన్నిపట్టుల పెంచియు, ఎక్కువ రసపోషణచేసి వ్రాసినారు. మనగ్రంథములప్రాశస్త్యము పాశ్చాత్యవిద్వాంసులు చదివి తెల్పినగాని ఇటీవలిమనవారికి అగమ్యగోచరము. నేటి మనవిద్వాంసులకు శాకుంతలనాటకముయొక్క యుత్కర్ష Jones, Goethe మొదలగు పాశ్చాత్యవిమర్శకులమూలమున విస్పష్టము. తెలుగుభాష సంస్కృతమంత ప్రసిద్ధము గానందున పాశ్చాత్యపండితుల నాకర్షించి యుండలేదు. పాశ్చాత్యరసజ్ఞులే ఆంధ్రమహాభారతమును జదివియున్నచో అదియేభాషలోని యుద్గ్రంథమునకును దీసిపోదని వేనోళ్లం బొగడందియుండును. ఈవిషయవిమర్శ యొక ప్రత్యేకోపన్యాసమునకు అంశముకాదగినది. తిక్కనాదికవులు సంస్కృతగ్రంథముల నేలపరిశీలించిరన, కథాంశమందు సిద్ధముగానున్నందుననే. Shakespeare కవి మహానాటకములలో నుత్తమమయినవి పూర్వగ్రంథస్థకథాంశములను పరిశీలించి వ్రాసినాడు. ఇదియొకకొదువ గానేరదు. ప్రకృతగ్రంథమందలిగుణమును బట్టి దానియుత్కర్ష నిశ్చయింపవలెను. మరియు భారతకథ వ్యాసాదిసంస్కృతకవుల సొత్తే కాదు. అది గ్రహించుటకు మనదేశవాసులందఱును సమానవారసులే. కావుననే స్వప్రతిభచే రచింపబడిన ఆంధ్రమహాభారతాది యుద్గ్రంథములు స్వతంత్రరచనలై యాంధ్రభాషాపోషకమూల్యభూషలై యావాఙ్మయశాఖలో యాంధ్రభాష యేభాషకును దీసిపోదని చాటుచున్నవి. ఇట్లే కంబనారు తులసీదాసాదిమహాకవుల రామాయణములు వారిద్రమిళాదిభాషలయొక్కయుత్కర్షను చాటుచున్నవి.

7. ఒకభాషయొక్క తత్త్వము మరియొకభాష కుండదు. ఒకభాషలోని లోకోక్తులు, నుడికారములును, ఛందస్సంబంధమైనవృత్తములు మరియొకభాషలో నలవడవు. కావున ఇతరభాషలోని సాహిత్యగ్రంథముల పరివర్తనవిషయమున కొంత స్వాతంత్ర్యమే యవలంబింపబడవలెను. ఈవిషయవిపులవిచారము మరియొకయుపన్యాసమున కంశముగాఁగలదు.

## కావ్యప్రబంధసామగ్రి

8. ప్రాజ్ఞుల కుపకరించు కావ్యప్రబంధసామగ్రివిషయమున నాంధ్రవాఙ్మయ మేదేశవాఙ్మయమునకునుదీసిపోదు.అల్పజ్ఞులకును జనసామాన్యముకును ఉపకరించుచు నాంధ్రమున గలశతకములు, కృతులు, పాటలులోనగునవి కొంతఆంధ్రవాఙ్మయమున్నదికాని, ఈవిషయమున నింకను చాల సృష్టి జరుగవలసియున్నది. ఈవిషయమున నాధునికవాఙ్మయస్రష్టలలో నూతనోత్సాహముదయించి కొంతపని సాగుచున్నది. ఇదికేవలనూతనోద్యమము కాదు-

పల్నాటివీరచరిత్ర, త్యాగరాజకృతులు, లంకాయాగము, కుశలవకథలోనగుపూర్వరచన లీసృష్టికిదివరకే అస్తిభారము దీర్చినవి కాని ఇంకను నీవిషయమున విపులముగఁ బని సాగ వలసియున్నది. వచనరచనవిషయమునఁ దిక్కనాదులగద్యభాగముల ననుసరించి చిన్నయ సూరియు, నాయనరచనను కొంతథారాళ మొనరించి వీరేశలింగప్రభృతులును గొంత యుపక్రమము చేసియున్నారుగాని, ఆంగ్లములో Addison, Goldsmith, Scot, Macaulay, Dequency, Carlyle, Ruskin, Gibbon లోనుగాగల మహావచనకావ్య కర్తలు, పలురుచులతోడను, వివిధశయ్యలతోడను గావించిన వచనరచన కెనవచ్చువచన మాంధ్రభాషలో వెలయించుట కేడులుపూడులు పట్టును. ఈవిషయమున ననేల జన సామాన్యమున జ్ఞానవిజ్ఞానప్రబోధము గావలసియున్న నేడు ఆంధ్రకావ్యసృష్టి సర్వతోముఖ ముగ సాగవలసియున్నది. ఇట్లు సాగుసృష్టి కొంతకాలము విశృంఖలముగా సాగినవెనుక, "వాక్యం రసాత్మకం కావ్యమ్" అనులక్షణమును బట్టి విమర్శకు నిల్చుదానిని బ్రసిద్ధసాహి త్యాంతర్భాగముగ నంగీకరింపవలెను. ఇట్లు కావ్యసృష్టియు విమర్శకార్యమును అన్యో న్యోత్తరోత్తరాభివృద్ధిసంధాయకములై సాగుచుండవలెను.



# కవిపోషణ

*శ్రీ నేలనూతుల సుబ్బరాయుడుగారు, బి. ఏ., బి, యల్.,
అడ్వకేటు, నెల్లూరు.

ఏదేశమునందుగాని అందలి వాఙ్మయము దేశములోని నాగరకతయొక్క కొలపాత్ర మైయున్నది. వాఙ్మయము లేనట్టియు వాఙ్మయమును చూచి గర్వించనట్టియు దేశము అనాగరీకమనియు మోటుదేశమనియు విస్పష్టముగా వచింపవచ్చును. వాఙ్మయమునకు కవులు భూషణములు. అట్టి కవులను పోషించి వారిచే కవిత్వము చెప్పించి దేశమునకును భాషకును సేవచేయుట భాషాభ్యుదయమును కోరునట్టి ప్రతిమానవునియొక్కయు ముఖ్య కర్తవ్యమైయున్నది.

## దాతలు కారణభూతులు

పూర్వము మనదేశములో రాజులు, మంత్రులు, ఉన్నతోద్యోగులు, భూస్వాములు కవులకు పట్టుకొమ్మలైయుండిరి. మనయాంధ్రభాషలో ఏప్రాచీనగ్రంథమును పరిశీలించినను ఆగ్రంథరచనకు ఒక మహాదాత కారణభూతుఁడైనట్లును, ఆమహామహుఁడు గ్రంథరచనకు పూర్వము కవిని రచనకు ప్రోత్సహించినట్లును, రచనానంతరము కవికి ధన, ధాన్య, అగ్రహారాది మహాదానముల నొసంగి ఆదరించినట్లును కన్పట్టుచున్నది. అట్టి మహాదాతలు లేకుండి యుండినచో భారతాది మహాకావ్యములు, రామాయణాది పురాణములు, మనుచరిత్రాదిప్రబంధములు, రాఘవపాండవీయాది ద్వ్యర్థికావ్యములు, కవికర్ణరసాయనాది ప్రౌఢకావ్యములు మన ఆంధ్రలోకమునకు అలవడుట కవకాశములే లేవు.

## కవులు దరిద్రులే

కవులు ఆనాడును ఈనాడును మనదేశమునందే గాక అన్నిదేశములందును గూడ దరిద్రులే. దరిద్రులు కాని కవిపుంగవులను మనచేతి వ్రేళ్లపై లెక్కించవచ్చును. రసవంతమగుకవిత్వము చెప్పుటకు దైవసంకల్పము, భగవదనుగ్రహము ప్రాధాన్యము

* వీరు కొంతకాలము త్రిలింగపత్రికను చక్కగ నిర్వహించిరి. న్యాయవాదివృత్తినవలంబించినప్పుడు త్రిలింగపత్రికతో సంబంధమును వదలుకొనిరి.

లైనను పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవివంటి మహానీయుఁ డొకఁడు తనయిష్టదైవము నుపాసించి ఒక్కరాత్రిలో జైమినీభారతమహాగ్రంథమును రచియించినట్లు ప్రతీతి యున్నప్పటికిని 'పొట్టలోఁ గూడున్నప్పుడు...' అని యొకమహాకవి వచించినట్లు సామాన్య కవులకు తినుట కైనను ఆహారము పుష్కలముగా నుండవలయును గదా! అల్లసానిపెద్దనామాత్యుఁడు కృష్ణరాయలచే ఎన్నాళ్లో ప్రోత్సహింపఁబడినప్పటికి, గ్రంథరచనకు పూనుకొననికారణ మరయ కవిపుంగవుఁడు ఈరీతిగా ప్రత్యుత్తర మొసంగెనట:

చ. నిరుపహతిస్థలంబు రమణీప్రియదూతిక తెచ్చియిచ్చుక
ప్పూరవిడె మాత్మకింపయిన భోజన ముయ్యెల మంచ మొప్పుత
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖకపాఠకోత్తముల్
దొరకినఁగాక యూరక కృతుల్ రచియింపు మనంగ శక్యమే.

విషయమును కృష్ణరాయలు గ్రహించి మహాకవికి సన్నివేశమును గల్పించి మను చరిత్రసృష్టికిఁ దోడ్పడెను.

## కవులపోకడలు.

కొందరు కవులు రాజులను దూషించినారు: 'శా. రాజుల్మత్తులు వారిసేవ నరక ప్రాయంబు వారిచ్చునం,భోజాక్షీచతురంతయానతురగీభూషాదులాత్మ వ్యథా, బీజంబుల్...' అని ధూర్జటికవీంద్రుఁడు వచించెను. మరికొందరు వారలను శపించినారు;

'శా. శ్రీకంఠుండు భుజంగభూషణుఁడు భస్మీభూతపంచాస్త్రుఁడ
స్తోకాటోపబలప్రతాపరిపురక్షోదక్షసంశిక్షణుం
డాకాశోజ్వలకేశపాశుఁడు త్రిశూలాంకుండు రుద్రుండుతా
వీఁకం జీమలకొండ సింగనృపతిన్ వీక్షించు నేత్రత్రయిన్.

అని జగ్గకవి వాక్రుచ్చెను. మహాకవులు కొందరు మానవమాత్రులకు తమ కవితాకన్యలను. కృతియొసంగుట నీచమనిరి. భక్తిప్రపూర్ణుఁడగు పోతనామాత్యుఁడు,

"ఉ. బాలరసాలసాలనవపల్లవకోమలకావ్యకన్యకం
గూళలకిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్
హాలికులైన నేమి. ... ... ... ...

## రాజాదరణ.

అని వర్ణించి తనకృతిని భగవంతునికే కృతి యొసంగెను. ఇట్టికవులు కొందరు కోపోద్దీపితులుఁ గానో, భక్తిప్రపూర్ణులుఁగానో ఇట్లువచించినను వేరెన్నికఁగన్న మనయాంధ్రకవులు అత్యధిక

సంఖ్యాకులు రాజాదరమునకు పాత్రులై తమకృతులను చిరస్థాయిగా నెలకొల్పఁ గల్గిరి. తమ్మాదరించి పోషించిన మహాదాతలమరణానంతరము తమశోకావేశమును వివిధరూపముల వర్ణించియున్నారు. ఆంధ్రకవితాపితామహుఁడు కృష్ణరాయలనిర్యాణమునకు వగచి ఈప్రకారము విలపించెను.

సీ. ఎదురైనచోఁ దనమదకరీంద్రము నిల్పి కేయూఁతయొసఁగి యెక్కించుకొనియె
కోకటగ్రామాద్యనేకాగ్రహారంబు లడిగిన సీమలయందునిచ్చె
మనుచరిత్రం బందుకొనువేళఁ బురమేఁగఁ బల్లకిఁ దనకేలఁ బట్టియెత్తె
బిరుదైనకవిగండపెండేరమునకీవె తగుదని తానె పాదమునఁ దొడిగె
'ఆంధ్రకవితాపితామహ అల్లసాని, పెద్దనకవీంద్ర' యని నన్నుఁ బిలుచునట్టి
కృష్ణరాయలతోఁ దివి కేఁగలేక, బ్రదికియున్నాఁడ జీవచ్ఛవంబనగుచు.

కవిసార్వభౌముఁడు గూడ తన్నాదరించిన దాతలందరు దివంగతులగుట కెంతయు శోకించి ఈపద్యమును రచించెను.

సీ. కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి రత్నాంబరంబు లేరాయఁడిచ్చు
రంభఁగూడెఁ దెనుంగురాయరాహుత్తుండు కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁడయ్యె విస్సనమంత్రి మఱి హేమపాత్రాన్న మెవ్వనిపంక్తిఁ గలదు
కైలాసగిరిఁ బండె మైలారువిభుఁడేఁగి దినవెచ్చ మేరాజు తీర్పఁగలఁడు
భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగెఁ, గలియుగంబున నిఁకనుండఁ గష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనఁగ, నరుగుచున్నాఁడు శ్రీనాథుఁడమరపురికి.

అందువల్ల మనఆంధ్రభాషయొక్క ప్రస్తుతస్థితి అట్టాని పురాతనప్రాశస్త్యము, పాశ్చాత్యునిచే ప్రాచ్యఖండములోని భాషలన్నింటిలో పేరెన్నికఁగన్నదని పొగడ్తను వడయుటయు ఇవియన్నింటికిని ముఖ్యకారణము మనప్రాచీనులకవిపోషణయే అని యొప్పుకొనకతప్పదు.

## పరిస్థితులు మారినవి

ఈనాడాపరిస్థితులు పూర్తిగా మారిపోయినవి. కవికి గచ్చెడుకవళము నైతము వేయువారు అరుదైనారు. దేశము పరరాజులహస్తగతమైనది. కవులకు రాజాదరణ పరిపూర్ణముగా నశించిపోయినది. ఆంగ్లదేశమునందేమి మరి యేపాశ్చాత్యదేశమునందేమి ప్రభుత్వమువారు కవులను అత్యాదరముతో మనదేశములో పూర్వము భోజుఁడు, గుప్తవంశపు చంద్రగుప్తుఁడు, రాజరాజనరేంద్రుఁడు, కృష్ణదేవరాయలు మొదలగుమహారాజుల

వలెనే పోషించుచున్నారు. కవులసంస్థను పొయిట్ లా రెట్ అను పేరుగల్గిన ఆస్థానకవీంద్రుని ద్వారా ఆంగ్లప్రభుత్వమువారు ఆదరించి పోషించుచున్నారు. కాని మనదేశమునందు మాత్రము ప్రభుత్వమువారు కవిపోషణ చేయుటలేదు ఇంతియకాక కొందరు మహాకవులు రచించిన అపూర్వగ్రంథములను నిషేధించి ప్రచురకులను ముద్రణాపకులను నిందార్హులనుగాఁ జేసి కొన్నిగ్రంథరాజములను పాఠకుల కలభ్యములుగాఁ జేసినారు.

## నేటికవిపోషణ

ఇట్టిపరిస్థితులలో మనఆంధ్రదేశములోని జమీాందారులు, దాతలు అనేకులు బయల్వెడలి ప్రభుత్వమువారి అనాదరణవలన కవులు నశించిపోకుండ అత్యంతకవిపోషణ భాషాపోషణ చేయుచున్నారు తమఆస్థానములయందు కవులకు అత్యంతగౌరవస్థానముల నొసంగి వారికి భోజనాదివసతులను కల్పించియున్నారు. వారు రచించుగ్రంథరాజములను అచ్చొత్తించి వాటివ్యాప్తికి తోడ్పడుచున్నారు. అయితే కారణాంతరములవలన రసికులును, కవిపోషణాకుతూహలులునుఅగు జమీాందారులసంఖ్య క్షీణించుచున్నది. ఆర్థికశక్తి కూడా తగ్గిపోవుచున్నది. మరియు 'ఏపుట్టలో ఏపామున్నదో ఎవరికెరుక' యనునట్లు మనదేశములోని కుగ్రామవాసులగు కవులెందరో దాతలను కానలేక తమఉత్కృష్టకృతులను దీర్ఘనిద్ర చెందఁజేయుచున్నారు.

## కృతుల వ్యాప్తిచెందించవలయు

నూతనముగా కవిత్వముచెప్పఁగల్గిన కవులకు తమకృతులు వ్యాప్తిచెందఁగల మార్గము నన్వేషించుట కర్తవ్యమైయున్నది. ఎందరోకవులు ఎంతో శ్రమపడి ఒకకృతిని నిర్మించినచో వారికెంతేని ఆనందము జనింపఁగలదు. కాని ఆకృతి ఎన్నాళ్లకును అచ్చువేయు భాగ్యము లభింపమిచే కవులు విఫలమనోరథులై వారియుత్సాహము బహుళాహ్వయపక్షశశాంకునిరీతిగా దినదినమును క్షీణించి అచిరకాలములోనే తుదముట్టును. అటుతర్వాత కవిత్వము బయల్వెడలదు. అనేకమంది కవులు ఒక్కొక్కరు ఒక్కకృతిని మాత్రమే రచించి దిగంతవిశ్రాంతయశఃప్రకాశులైరి. ఒక్కకృతిని మాత్రమే రచించి విమర్శకాగ్రేసరులచే మహోన్నతబిరుదంబుల నార్జించియున్నారు. ఒక్కకృతిసహితము రచింపక కొన్నిపద్యములను మాత్రమే రచించి ఆంధ్రవాఙ్మయమునందు ఉన్నతస్థానముల నలంకరించు కవులున్నారు. ఇంకను మనగల ఒక్కపద్యమును వ్రాసి ఘోరసంగ్రామమందు క్లిష్టపరిస్థితులలో అత్యంత ప్రతిభతో రిపునెదుర్కొని పోరి తనప్రాణముల నర్పించినపేరుతెలియనివీరాగ్రేసరునిచాడ్పున

చాటుధారలను రచించి దివంగతులైన మహామహు లెందరో వాఙ్మయమున్నంతకాలము మానవులహృదయసీమలలో అగ్రస్థానము నలంకరించువారున్నారు. ఈక్రిందిచాటువులను ఏమహానుభావులు ఎప్పుడు రచించిరోగాని అవి ఎంతరసవంతముగానున్నవో, జూడుఁడు!

శా. ఆకల్హాదదదేమొ నేఁడు పవనుండాకాశవాపీతటా
 శోకానేకవనాళిఁ గ్రుమ్మఱుచు నచ్చో డాగెనో; లేక గం
 గాకల్లోలవతీప్రవాహముల నూఁగంబోయెనో; లేక కాం
 తాకర్పూరకపోలపాళికల నిద్రాసక్తుఁడై యుండెనో!

చ. చతురులలోన నెంతయును జాణవటంచును నేను గౌఁగిలిం
 చితి నటుమాఱుమోమిడఁగఁ జెల్లునె యోరసికాగ్రగణ్య? య
 ద్భుతమయినట్టిబంగరపు బొంగరపుంగవఁబోలునీకుచ
 ద్వితయము ఱొమ్మునాటి యలవీఁపున దూసెనటంచుఁ జూచితిన్.

ఇట్టివి ఎన్ని వ్యాప్తిలేక నశించిపోయినవో ఎవరు చెప్పఁగలరు? కనుక కృతులను వ్యాప్తి నొందించుట సంఘముయొక్క కర్తవ్యమైయున్నది. కవిపోషణలో నిది యొక ముఖ్యమైన విషయముగా గ్రహించి ఆంధ్రప్రముఖులు పాటుపడవలయును.

## నేటికవులపోషణయెట్లు?

ఇప్పటికాలములో కవిపోషణ జనసామాన్యము చేయవలసినట్టు లేర్పడియున్నది. ప్రతిమండలమందును సారస్వతసంఘము లేర్పడి ఆమండలములోనికవులు రచించినకృతులను సభలలోనైనను చదివించి కవులకు కొద్దిపాటి ప్రోత్సాహమైనను నీయవలయును. కృతి ముద్రణమునకు యోగ్యమైనయెడల దానిని ఎట్లయినను ముద్రించి ప్రచురపరచుటకు తగుప్రయత్నములు చేయవలయును. కొన్నిమండలములలో సారస్వతసంఘములు లేకపోయినప్పటికిని కృతులను సభలలో ప్రచురపరచుటకు వ్యక్తులు పూనుకొని అట్టిసభలను సమావేశపరచి కొన్నికృతులను ఆవిధముగా ప్రచురపరచి కవులకు కొంతయుత్సాహమును కల్పించుచుండుట ఇటీవల ఒకశుభసూచకముగా కాన్పించుచున్నది ఈపద్ధతినైనను అన్నిమండలములలోను వ్యాపింపఁజేసి ప్రతికృతియు కొద్దిపాటిజనులకైనను ప్రచురపడునట్లును, కవులకు కొంతయుత్సాహము కల్గునట్లును పాటుపడుట భాషాసేవకులకు విధ్యుక్తధర్మమైయున్నది.

## వావిళ్లవారిసేవ

కృతులప్రచురణవిషయమందు ముద్రాపకులకును పత్రికానిర్వాహకులకును అవకాశములు మెండుగానున్నవి. అట్టి అవకాశములను జారవిడువక శ్రీవావిళ్లవారు ఈవిష

యమునందు అపారమైనసేవఁ జేసియున్నారు. ఎప్పుడో రచియింపఁబడి ఏమూలనో చెదలు నకు ఆహుతియగుచుండిన గ్రంథరాజముల నెన్నింటినో తెప్పించి శుభ్రప్రతులను తయారు చేయించి నేత్రానందజనకముగా అచ్చొత్తించి సర్వసామాన్యజనుల కందుబాటులోనుండు నట్లు వెలల నిర్ణయించి ఆంధ్రభాష కద్వితీయమైనసేవఁ జేసియున్నారు. శ్రీజనమంచి రామా యణాదిఆధునికకవిపుంగవులకృతుల నెన్నింటినో అచ్చొత్తించి ప్రచురపరచి వాటివ్యాప్తికి కారణభూతులై యున్నారు. ఇంతియ కాదు.

## త్రిలిఙ్గపత్రికా ప్రశంస

త్రిలిఙ్గపత్రిక ఈవిషయమున అత్యంతఉపయోగకారిగా నుండియుండినది. వార్తా పత్రికలు సామాన్యముగా రెండురకములుగా నున్నవి. వార్తలను మాత్రమే పాఠకుల కందఁజేయుచుండునవి మొదటిరకము. వార్తలకొరకే అనేకులు వార్తాపత్రికలను కొను చున్నారు. వార్తలతోపాటు ఇతరవిషయము అందు ముఖ్యముగా సాంఘికములను వాఙ్మయవిషయములను వార్తలతో మేళవించి వార్తలకొరకై పత్రికలను కొనువారికి సహితము ఇతరవిషయములందు రుచిని కల్పించి ప్రోత్సాహము నొసంగునవి రెండవరకపు పత్రికలు. మనత్రిలిఙ్గపత్రిక ఈరెండవరకపుపత్రికలలో నగ్రస్థానము వహించియున్నది. ఈ పత్రికారాజము తొలుత మాసపత్రికగా జననమొంది వాఙ్మయాభివృద్ధియే ప్రధానోద్దేశ్య ముగాఁగల్గియుండి కొంతకాలమునకు రెండవఆశ్రమమున వారపత్రికగా మారి మత, ఆర్థిక, సాంఘిక, వాఙ్మయవిషయములతోటి వార్తాహారిగా త్రిలిఙ్గదేశమందంతటను విహరించు చున్నది. అనేకకవుల ప్రథమకృతులను ప్రచురించుచు ఈపత్రికారాజము వారికెంతో ఉత్సాహము కల్పించుచు వారలను నూతనకృతులకు ప్రోత్సహించుచున్నది. ఇట్టి కవిపోష ణతో సమానమైనభాషాసేవ మరియొకటి కాన్పించదు. తనపద్యములను నల్గురు చదివి ఆనం దించుటయే కవికి మహాభాగ్యము. అట్టిభాగ్యమును అనేకకవులకు ఈపత్రికారాజము కల్గించుచున్నది. త్రిలిఙ్గపత్రికలో పద్యములు అచ్చుపడినకవులెందరో అనేకగ్రంథరాజ ములను రచియించియున్నారు. ఇటీవల ఈకృతిప్రచురణవిషయము సినిమాథాటికి గురి యైనట్లున్నను త్రిలిఙ్గభాషాసేవకు అగ్రస్థానము నొసంగఁగలదని నమ్ముచున్నాను. మరియు ఆంధ్రదేశములో ప్రచురింపఁబడు ఆంధ్రగ్రంథములపట్టికను అప్పుడప్పుడు ఈపత్రికారాజ మొసంగుచుండినచో భాషకు మరింత సేవఁజేసినట్లగును. ఇట్టి త్రిలిఙ్గపత్రిక ఇంకను విరివిగా వర్ధిల్లి ఇతరవిషయములతోపాటు కవిపోషణకు శాశ్వతస్థానము నొసంగి నూతనకవనల ప్రచురణకు ఒక్కపుటయైనను ప్రత్యేకింపబడి ఆంధ్రభాషకు అత్యంతసేవ చేయుగాకఅని కోరుచున్నాను.



# కావ్యము – జీవితము.

**విద్వాన్ శ్రీ విశ్వనాథ నరసింహముగారు, బి. ఏ., బి. ఇడి.,**
ఆంధ్రపండితులు, రాయలసీమకళాశాల, అనంతపురము.

కావ్యమనుపదమును వినినంతనే మనమనంబులకు గోచరించునది యాదికావ్యమగు శ్రీమద్రామాయణము. ఆసేతుశీతాచలపర్యంతమును వ్యాప్తినిఁ బొంది యనంతజనసందోహములచే నామోదమునందిన శ్రీమద్రామాయణము హిందూదేశములో నెన్నెన్ని భాషలు ప్రచారములో నున్నవో అన్నిభాషలలోను ఆకావ్యము వెలయుచుండుటయే కాదు. పాశ్చాత్యభాషలలోఁ గూడ నాకావ్యము భాషాంతరీకరింపఁబడినది. అట్టియాది కావ్యము వాల్మీకిమహర్షిచే రచియింపఁబడినదనునంశ మెల్లరకును తేటతెల్లమగు విషయము. అట్టిరామాయణమహాకావ్యమును వాల్మీకిమహాముని వ్రాయుటకుఁ గారణమైనది బోయవాఁడు క్రౌంచపక్షిదంపతుల దగ్గఱి యందు మన్మథపరవశమగు నొకదానినిఁ జంపుటయే. అప్పుడాతనినోట నప్రయత్నముగా భావావేశముతోఁ గూడియుండిన ఛందోబద్ధమగు

> "మా నిషాద ప్రతిష్ఠాం త్వమగమశ్శాశ్వతీస్సమాః,
> యత్క్రౌంచమిథునాదేకమవధీః కామమోహితమ్."

అను శ్లోకము వెలువడినది. ఈశ్లోకము వాల్మీకినోటనుండి వెలువడుటకు కారణమేమి? క్రౌంచపక్షులజంటలో నొక్కదాని బోయవాఁడు చంపుట. తన్మూలమున ఆపక్షుల వియోగమునుఁ గాంచిన వాల్మీకిహృదయమునందు జనించిన భావావేశము. అట్టియావేశములో నొడలు మఱచినవాఁడు ఋషీశ్వరుఁడు. అట్టి తన్మయత్వములో పూర్వజన్మ సంస్కారమునుబట్టి అప్రయత్నముగా నాతనినోటనుండి వెలువడినవి యావాక్కులు. అవి ఛందోబద్ధములైనవి. తరువాత నాతనికి బ్రహ్మదేవునిసాక్షాత్కారముఁ గల్గినది. బ్రహ్మదేవు నెదుర్కొని పూజావిధుల నిర్వర్తించినతరువాత నాతఁడు సమ్ముఖమునందుండినప్పుడు గూడ వాల్మీకిమహర్షికి క్రౌంచపక్షిని గూర్చిన చింతయే ఆతనిహృదయము సంపూర్ణముగా నన్యాయత్తమై యుండెను అంత బ్రహ్మదేవుఁ డాతనితో నాశ్లోకమునుఁ బురస్కరించుకొని శ్రీరామచరితమును శ్లోకములఁ జెప్పుమని యాజ్ఞాపించి యంతర్ధానంబు నొందెను. ఇదియే ఆదికావ్యమైనది.

## ఆ ల ం కా రి కు లు

ఆదికావ్యము రామాయణమును, తత్కర్త వాల్మీకిమహర్షి ఆదికవియనియును సుప్రసిద్ధవిషయములు. దీనివలనఁ దెలియనగు సామాన్యవిషయ మేమనఁగా కావ్యమును రచించినవాఁడు కవియనుట. మఱియు కవికృతంబయినది కావ్యము. అయిన కవి యెట్టివాఁడనుప్రశ్నకు సమాధానము తెలియవలెనన్న కావ్యస్వరూపము నిర్ణయించుకోవలెను. కావ్యస్వరూపమును నిర్ణయించుటలో సంస్కృతలాక్షణికులు వేర్వేఱురీతుల నిర్వచించియున్నారు. అట్టి కావ్యనిర్వచన మొనర్చిన లాక్షణికులను స్థూలముగాఁ బరిశీలించి రెండు తెగలక్రింద నేర్పరింపవచ్చును. అందు మొదటివారు ఆలంకారికులు. "రీతి రాత్మా కావ్యస్య" అను వామనుని మొదలుకొని కొందఱు లాక్షణికులు

"అదోషౌ సగుణౌ సాలంకారౌ శబ్దార్థౌ కావ్యమ్" అని మల్లినాథుఁడును,

"గుణాలంకారసహితౌ శబ్దార్థౌ దోషవర్జితౌ,
గద్యపద్యోభయమయం కావ్యం కావ్యవిదో విదుః"

అని విద్యానాథుఁడును నిర్వచించియున్నారు. ఈప్రకారముగా మొదటి తెగకుఁ జెందినవారి యభిప్రాయములో నలంకారములకుఁ బ్రాశస్త్యమీయఁబడినది.

## ర స వా దు లు

ఇఁక రసవాదులనఁబడు రెండవ తెగవారిలో

"ఇష్టార్థవ్యవచ్ఛిన్నా పదావలీ కావ్యమ్" అని దండియు,
"రసాత్మకం వాక్యం కావ్యమ్" అని విశ్వనాథుఁడును,

"రమణీయార్థప్రతిపాదకశబ్దః కావ్యమ్" అని జగన్నాథపండితుఁడును వెల్లడించియున్నారు. కడపటి పండితరాయలవాక్యమే నేటికిని ప్రమాణముగా నెంచఁబడుచున్నది ముందెట్టులేలాక్షణికులు చెప్పుదురో చెప్ప శక్యము కాదు.

## ఆధునిక మతములు

ఇది యిటులుండ నాధునికప్రపంచమున నాంగ్లభాషాప్రౌఢ్బల మధికమై యువజనుల హృదయములలో పాశ్చాత్యగ్రంథరచయితల నిర్వచనము లెన్నియేని నాటుకొనియున్నవి.

"కావ్యము ప్రకృతిప్రతిబింబమ"ని యొక్కరును,

కావ్యము జీవితమును విమర్శించి యుత్తమజీవితపథమును జూపించి మానవునకు స్థైర్యమును, సంతోషమును, శాంతిని గూర్చునని వేఱొకరును,

కావ్యము సర్వశాస్త్రములయొక్క సారమును రమణీయస్వరూపమునై యున్నదని మఱియొకరును,

ఆనందపరవశులగు సహృదయుల సహృదయానందదాయకములగు విషయనిర్మాణమే కావ్యమని యింకొక్కరును నిర్వచించియున్నారు.

## చింతామణి మూలసూత్రము

ఆంధ్రవాఙ్మయమున వాగనుశాసనుఁడగు నన్నయభట్టు తనయాంధ్రశబ్దచింతామణిలో మొట్టమొదట "విశ్వశ్రేయః కావ్యం తదదోషౌ పరిష్కృతౌ చ వాగర్థౌ" అని సూత్రించియున్నాఁడు. విశ్వశ్రేయః కావ్యమ్ అనుటలోఁ బ్రపంచోపయోగమైనది కావ్యమని యాతని యభిమతమనియు విశ్వశ్రేయస్సు నిచ్చునది కావ్యమనఁగా గాలి విశ్వశ్రేయస్సు నిచ్చును గాలి కావ్యమా కావున నీసూత్రమునకు సంపూర్ణత సిద్ధింపలేదు, అని కీ॥ శే॥ వంగూరి సుబ్బారావుగారు తమయాంధ్రవాఙ్మయచరిత్రమునందు విమర్శించియున్నారు. అయినను పైనవివరించిన చింతామణిమూలసూత్రమును విమర్శించునపుడు తిక్కనసోమయాజి కాదు — తత్కవీంద్రుఁడు భారతగ్రంథమున నవతారికలో నిజకావ్యప్రాశస్త్యమునుఁ గూర్చి చెప్పిన విషయముల స్మరింపవలయును.

"అమలినతారకాసముదయంబుల నెన్నను సర్వవేదశా
స్త్రముల యశేషసారము ముదంబునఁ బొందను బుద్ధిబాహువి
క్రమమున దుర్గమార్థజలగౌరవభారతభారతీసము
ద్రముఁ దఱియంగనీదను విధాత్రునకైనను నేరఁ బోలునే."

"అయినను దేవా! నీయనుమతంబున విద్వజ్జనులయనుగ్రహంబునం జేసి నానేర్చు విధంబున నిక్కావ్యంబు రచియించెద" నని నన్నయభట్టు నుడివెను. బ్రహ్మదేవునకేని సాధ్యముకాదని నిర్వచించుటలోఁ దాను కించిజ్జ్ఞుఁడనని వేఱుగఁ జెప్పనక్కఱలేదు. మహాకవులట్టులనే చెప్పుకొనియున్నారు.

"మందః కవియశఃప్రార్థీ గమిష్యామ్యుపహాస్యతామ్" అనుకాళిదాసోక్తులు సుప్రసిద్ధములు గదా. మఱియు వాగనుశాసనుఁడు భారతప్రాశస్త్యమును వక్కాణించునపుడు "ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రంబని యధ్యాత్మవిదులు వేదాంతమనియు" అని యుల్లేఖించి

యున్నాఁడు. భారతము ననేకు లనేకవిధములుగాఁ బరిగణింతురు. ధర్మశాస్త్రమని కొందఱి యభిమతము. మఱికొందఱి కది వేదాంతము. అయ్యదియే నీతిశాస్త్రముగా నితరులచేఁ బరిగణింపఁబడుచున్నది. కవీశ్వరులద్దానినే మహాకావ్యమనుచున్నారు. లక్షణకర్తల కయ్యదియే శరణ్యముగా సర్వలక్షణసారముగా నున్నది. ఇఁకనయ్యదియే కొందఱి కితివాసము. పౌరాణికులకయ్యది బహుపురాణసముచ్చయము. ఈరీతి నిందఱెన్నివిధములుగా శ్లాఘించుచు నాయాగుణవిశేషముల భారతమునుండి చేకొనుచున్నారని తెలియవలెను. కావ్యము విశ్వశ్రేయస్సు సమకూర్చుననుటలోఁ గల యభిప్రాయము భారతప్రాశస్త్యమునుఁ దెలిసికొనినంతనే వంగూరివారి "గాలి కావ్యమా" అనువిమర్శనము సహృదయుల హృదయములలోనే పూర్వపక్షమగుననుటకేమియు సందేహము లేదు. అందుచేతనే ఆంధ్ర వాఙ్మయమునందలి భారతము ప్రమాణలక్షణగ్రంథముగా నేడుఁ గూడ పండితమండలిచే నెంచఁబడుచున్నది.

## పింగళి సూరన

తరువాత నాంధ్రకవిచంద్రులలో సుప్రసిద్ధుఁడైన సూరనార్యుఁడు కవితాస్వరూపమును, ప్రభావమును వర్ణించుచు భావనాశక్తియును, భాషాశక్తియు నత్యంతావశ్యకములని వచియించుసందర్భమునఁ దనకళాపూర్ణోదయమున,

"చలువఁగలవెన్నెలలచెలువునకు సౌరభము
గలిగినను, సౌరభము చలువయుఁ దలిర్పం"

అనుపద్యములో చలువగలవెన్నెలలు, సౌరభమును శైత్యమునుఁ గల్గిన కప్పురపుఁ బలుకులు సౌరభశీతలత్వములేకాక కోమలత్వముఁ గూడఁ గల్గిన మలయమారుతపోతములుఁ గూడ సుకవిపలుకులకు సరిరావని నిర్వచించినాఁడు. ఏలన సుకవిపల్కులలో మాధుర్యమను విశేషలక్షణమొకటి యున్నది. మఱియు నాతఁడే

"పొసఁగ ముత్తైపుసరుల్ పోహళించిన లీలఁ
దమలోనఁ దొరయు శబ్దములఁ గూర్చి
యర్థఁబు వాచ్యలక్ష్యవ్యంగ్యభేదంబు
లెఱిఁగి నిర్దోషత నొసఁగఁ జేసి"

యని కవిత్వలక్షణముల నిర్వచించి కడపట నారీతి

"కవితఁ జెప్పంగనేర్చు సత్కవివరునకు
వాంఛితార్థంబు లొసఁగనివారు గలరె"

అని యుద్ఘాటించియున్నాఁడు.

## సు క వి జ ను లే మౌ ను ల్.

అట్టి ప్రశస్తకావ్యరచయితలగు కవులు మహర్షులుగా నెంచఁబడుటలో నేమి యాశ్చర్యము. గీర్వాణభాషలోని యాదికావ్యకర్త వాల్మీకిఋషీశ్వరుఁడు కదా. "నానృషిః కురుతే కావ్యమ్" అనునార్యోక్తి విననగుచున్నది. దీనిఁ బురస్కరించుకొని యాంధ్ర లాక్షణికుఁడైన అప్పకవి తనలక్షణగ్రంథములో

"ఇమ్మహిని మునులచే వెలసె మ్మును గావ్యములు నానృషిః కురుతే కా
వ్యమ్మను వచనార్థంబే, సమ్మతి గలవేళ సుకవి జనులే మౌనుల్"

అని వచియించుటలోఁ గలియుగంబున సుకవిజనులే మునీశ్వరులని ముందంజవేసి చెప్పినాఁడు.

## మూ డు తె ఱ ం గు ల కా వ్య ము లు.

మఱియు మూఁడుతెఱఁగులగు కావ్యములఁ గూర్చి చెప్పవలసియున్నది. ఇతర లక్షణములన్నియు సమముగానుండ గద్యకావ్యములు, పద్యకావ్యములు, గద్యపద్యాత్మకమగు చంపూకావ్యములు అనుమూఁడువిధములగు విభజనము కానవచ్చుచున్నది. సంస్కృతసారస్వతములో నేమి, మన యాంధ్రవాఙ్మయమునందేమి తొలుత గద్యకావ్యములుకానరావు. అపౌరుషేయములగు వేదములు ఛందోబద్ధముగానే యున్నవి. తరువాత గీర్వాణభాషలోని పురాణేతిహాసములేమి కావ్యములేమి అన్నియును పద్యాత్మకముగానో చంపూపద్ధతినో వ్రాయఁబడియున్నవి. ఇఁక సంస్కృతములోనున్న సుప్రసిద్ధకావ్యములు బాణునికాదంబరి, హర్షచరిత్రయును, దండిమహాకవి దశకుమారచరిత్రమును కేవలగద్యగ్రంథములు. అయిన నయ్యవి పద్యకావ్యములకంటె వేయిమడుంగులు హెచ్చగుప్రౌఢత్వముతో వెలయుచున్నవి. సర్వసామాన్యముగా కతలు సెప్పువారి గద్యకవనము కాఁబోదు. అయిన నాకావ్యములవలన నేమి ప్రయోజనమను విషయమును విస్తరించెదను.

ప్రాచీనార్వాచీనులచే నింతగా స్తుతింపఁబడిన యీకావ్యము లెందుకొఱకు నిర్మింపఁబడినవి? అట్టికావ్యమునకును లౌకికజీవితమునకు నెట్టిసంబంధమున్నది? స్థూలదృష్టిలోఁ

జూచిన కావ్యజీవితములకుఁ బరస్పరసంబంధముండియే తీరునని సహృదయులగువారల కందఱకును తేటతెల్లమగును. ఏలన శిష్టజనసంఘములేమి సామాన్యజనసందోహములేమి ఎల్లరును కావ్యజీవితములకు నిరంతరముగు సంబంధమేలేనియెడల ఎందులకు వారందఱును కావ్యపఠన మొనర్తురు.

## కవి ఎవఁడు?

“అపారే కావ్యసంసారే కవిరేకః ప్రజాపతిః” అనునార్యోక్తిప్రకారము కావ్య సంసారమును సృష్టించుటలో కవి ముఖ్యుఁడగు సృష్టికర్త. అందుచేతనే కవిత్వదృష్టికిని శాస్త్రదృష్టికిని భేదమున్నది. ప్రపంచవస్తువులనే కవి వేఱుకన్నులఁ జూచును. కవితా ప్రపంచము వేఱుగా నున్నది. సామాన్యమానవుల కందరాని ప్రత్యేకప్రపంచములో సంచారము చేయువాఁడు కవి. సామాన్యులు గాంచలేని చోద్యములెన్నో రహస్యము లెన్నో కవికనుల కగపడును. అట్టినిశితవీక్షణములు గలవాఁడగుటచేతనే

“రవిగాననిచోఁ గవిగాంచకుండునే” అనునార్యోక్తి కలిగినది. మఱియు “నిరంకుశాః కవయః” అనునట్లు కవి నిరంకుశప్రజ్ఞకలవాఁడగుటచే శాస్త్రాదేశము కవిని బంధింపఁ జాలదు. కావ్యమొకప్పుడు దేశకాలపాత్రముల నాధారముగాఁ గొనును. ఒకప్పుడు వాని కతీతమై స్వచ్ఛందసంచారమొనర్చుచుండును. కవి నూతనమును ప్రత్యేకమునగు కావ్య ప్రపంచమును సృష్టింపఁ జాలును అట్టి నూతనసృష్టి చేయఁజాలువాఁడే కవి యనఁదగు. తత్కవిసంకల్పితకావ్యప్రపంచమంతయు సుఖమయముగానుండు నూతనప్రపంచమనుట కేమియు సందేహము లేదు. ఆంధ్రవాఙ్మయమునందు వాగనుశాసనుని కణ్వమహాముని యాశ్రమ మెటులున్నది.

“శ్రవణసుఖంబుగా సామగానంబుసఁ జదివెడు శుకముల చదువుఁదగిలి
కదలక వినుచుండు కరులయుఁ గరికర శీతలచ్ఛాయఁ దచ్ఛీకరాంబు
కణముల చల్లనిగాడ్పాసపడి వానిఁ జెంది సుఖంబున్న సింహములయు
భూసురప్రవరులు భూతబలుల్ దెచ్చి పెట్టు నీవారాన్నపిండతతులు
కడఁగి భక్షింప నొక్కటఁ గలసియాడు, చున్న యెలుకలపిల్లులయొందు సహజ
వైరిసత్వంబులయు సహవాసమపుడు, చూచి మునిశక్తికెంతయు చోద్యమంది.

ఇట్టి నూతనస్వర్గము మునీశ్వరుని తపశ్శక్తివలనఁ గలిగినది. మునీశ్వరుని తపో మహిమయైనఁ గావచ్చును. లేదా కవీశ్వరుని దివ్యలేఖనీప్రభావమని నొక్కి వక్కాణింప

వచ్చును. సుకవులే కలిపేళ మునీశ్వరులని యంగీకరించినచో మఱియుఁ బ్రశస్తముగా నుండును. తత్ప్రభావమున పాఠకుల కానూతనప్రపంచములోని వైషమ్యరాహిత్యము, ప్రేమప్రపూర్ణహృదయమును ఆనందజనకములగును.

కవితల్లజుఁడైన కాళిదాసు తన ఋతుసంహారములో
"ఫణీ మయూరస్య తలే నిషీదతి"

"విషాగ్ని సూర్యాతపతాపితః ఫణీ, న హంతి మండూకకులం తృషాకులః" అనియును వర్ణించియున్నాఁడు. అట్టికావ్యసృష్టితో మానవజీవితమున కేమిసంబంధమనిన కావ్యము ధర్మార్థకామమోక్షములగు చతుర్విధపురుషార్థములను సమకూర్చునదియని యొక్కవాక్యమునఁ జెప్పనగును.

## కావ్యప్రయోజనము

"ప్రయోజనమనుద్దిశ్య న మందోఽపి ప్రవర్తతే" అనున్యాయముంబట్టి కావ్యమునకు జీవితముతో ముఖ్యముగా సంబంధముండియే తీరునని నిర్ధారింపవలసియున్నది. ఇంతియ కాక కావ్యమునకుఁ బ్రయోజనము లనేకములు. చతుర్విధపురుషార్థసాధకమగు కావ్యము వేదపురాణేతిహాసములకన్న విలక్షణముగా నుండును. అట్టికావ్యమే ప్రేయసివలె సుకుమారవంతుల కాస్వాదముఖమున హితోపదేశ మొనరించును.

కాళిదాసాదులు కావ్యరచన మొనరించి శాశ్వతకీర్తిని సంపాదించిరి. భోజమహారాజు సత్కవులకక్షరలక్షలిచ్చెననుటచే కావ్యమువలన ధనసంపాదన మెంతవఱకగునో తెలియనగును. ఈసందర్భములో నొకగాథను పేర్కొనవలెను. భోజునికాలములోఁ గవిత్వమురానివాని నటనుండి వెడలగొట్టవలెనని రాజభటులు వెదకి వెదకి యొకసాలెవానిఁ గొనితెచ్చిన నాతఁడు

"కావ్యం కరోమి న హి చారుతరం కరోమి
యత్నాత్ కరోమి యది చారుతరం కరోమి,
భూపాలమౌళిమణిరంజితపాదపీఠ
హేసాహసాంక కవయామి వయామి యామి"

అనుశ్లోకము నుడివి సన్మానముల నందెననియుఁ జెప్పుదురు. ఇందలిసత్యాసత్యము లెటులున్నను ఆకాలములో కవితాకళ మిక్కిలి యభివృద్ధిలోనుండి రాజాదరణపాత్రముగా నుండెనని నిశ్చయింపవచ్చును. కావ్యములవలన పూర్వరాజచరిత్రమును లోక

వ్యవహారమును, ఆయాకాలముల పరిస్థితులును తెలియుచున్నవి. స్వీయకవితాశక్తిచే మయూరకవి సూర్యునారాధించి కుష్ఠరోగవిముక్తి నందెను. ఇఁక ఆంధ్రవాఙ్మయమునం దన్ననో

"రాజరాజేంద్రసామ్రాజ్యభోగములందు, నన్నయభట్టు పాల్గొన్నవాఁడు
మనుమసిద్ధిక్షమాచక్రమరుదారఁ, దిక్కన్న తనచేతఁ ద్రిప్పినాఁడు
వీరభద్రారెడ్డి విరివియౌవిభవంబు, శ్రీనాథుఁ డెంతో భుజించినాఁడు
రాయలయొద్ద గారవమంది పెద్దన్న, యెక్కి యందలము నూరేగినాఁడు"

అను వసురాయని చాటువువలన నాంధ్రకవు లెంతగాఁ బ్రభువులమన్ననలకుఁ బాత్రులైరో తెలియుచున్నది. "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అనుసూక్తిని పూర్వపక్షమొనరించుచు "పుణ్యశ్లోకస్య చరితముదాహరణమర్హతి" యనువిద్యానాథుని నిర్వచనము కానవచ్చును.

మఱియు,

"కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే,
సద్యః పరనిర్వృతయే కాంతాసమ్మితతయోపదేశయుజే"

అనులాక్షణికసూక్తి కావ్యప్రయోజనముల విశదీకరించుచున్నది.

## నీతియుద్దేశితము

మఱియు నాధునికవిమర్శకులలోఁ గొందఱు కావ్యప్రయోజనము కేవలమానందజనకత్వమే యనియు, కావ్యమునకును నీతిబోధకును సంబంధము లేదనియు చెప్పుచున్నారు. వారిదృష్టిలోఁ గావ్యములు నీతిశాస్త్రములు కావు. నీతిబోధ తదీయశాస్త్రములపనియై యున్నది. కావ్యమున కట్టిప్రసక్తి యనవసరము. కేవలమానందజనకత్వమే కావ్యముఖ్యోద్దేశమని వారిమతము. అయినఁ గాంతాసమ్మితములగు కావ్యములలో నీతిబోధ ప్రత్యక్షముగా నుండనక్కఱలేదు. కాని పరోక్షమునఁ గవి వ్యంగ్యవైభవముతో లోకోత్తరమగు నీతులఁ దనకావ్యములో వెల్లడించుచున్నాఁడని చెప్పవలెను. అట్టినీతులు పాఠకులహృదయకుహరములలో శాశ్వతనివాసమొనరించుచున్నవి. ఇందులకు దిఙ్మాత్రముగాఁ గొన్నిసూచనల గమనింపఁదగు.

"ఉత్తరే రామచరితే భవభూతిర్విశిష్యతే" అని పండితులామోదించునట్లు శ్రీరామచరితములో నుత్తరభాగమును దృశ్యకావ్యముగా రచియించిన భవభూతి లోకోత్తరము

లగు నీతివచనములను శ్రీరామునినోటఁ బల్కించినాఁడు. ప్రథమాంకమునం దష్టావక్ర మహాముని వచ్చినప్పుడు, అతనితో

"స్నేహం దయాం చ సౌఖ్యం చ యది వా జానకీమపి
ఆరాధనాయ లోకస్య ముంచతో నాస్తి మే వ్యథా"

అని శ్రీరాముఁడు వచియించియున్నాఁడు. ఇందు సీతాదేవియందలియనురక్తికన్న ప్రజారంజనాభినివేశము ఎక్కుడుగా స్పష్టపఱిచినాఁడు. వ్యంగ్యమర్యాదచే లోకోత్తరమగునీతిని, రాజధర్మము నుపదేశించినాఁడు. "నాటకేషు శకుంతలా" యని యెన్నికఁగాంచినకాళిదాస ప్రణీతమగు నభిజ్ఞానశాకుంతలములోఁ గణ్వమహర్షి

"శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీవృత్తిం సపత్నీజనే
భర్తుర్విప్రకృతాపి రోషణతయా మాస్మ ప్రతీపం గమః,
భూయిష్ఠం భవ దక్షిణా పరిజనే భోగ్యేష్వనుత్సేకినీ
యాన్త్యేవం గృహిణీపదం యువతయో వామాః కులస్యాధయః."

అని శకుంతలకుఁ జెప్పుహితవాక్యములు పూజ్యములై నాటికిని నేటికినిఁ గూడ ప్రచారములో నున్నవి. తలిదండ్రు లీహితమునే కూఁతుల కుపదేశింపవలసియున్నది. పైఁజెప్పిన రెండును దృశ్యకావ్యము లగుటచేతఁ గవికి ప్రత్యక్షముగా మాటాడునవకాశములేదు. అందున నారీతి పాత్రలచే లోకపూజ్యములగు సత్యవాక్యములఁ బలికించినాఁడు. ఇటులనే కాళిదాసునిరఘువంశములో నిట్లు చెప్పఁబడినది.

"త్యాగాయ సంభృతార్థానాం సత్యాయ మితభాషిణాం,
యశసే విజిగీషూణాం ప్రజాయై గృహమేధినాం
శైశవేఽభ్యస్తవిద్యానాం యౌవనే విషయైషిణాం,
వార్ధకే మునివృత్తీనాం యోగేనాంతే తనుత్యజామ్."

ఇందు రఘువంశపురాజులసద్గుణకీర్తనఁ జేయుచు తక్కుంగలవారలకాదర్శమునుఁ జూపుటయే కవియభిమతమని తెలియవలెను.

వాగనుశాసనుని సుప్రసిద్ధమగు సత్యవాక్యనిర్వచనము జనాదరణీయమగు లోకోత్తరసత్యమెటులఁ దెలుపుచున్నదో గమనింపుఁడు.

నుతజలపూరితంబులగునూతులు నూఱిటికంటె సూనృత
వ్రతయొకబావి మేలు మఱిబావులు నూఱిటికంటె నొక్కసు

తృప్తితువది మేలు తత్కృతులకతంబునకంటె సుతుండు మేలు త
త్సుతశతకంబుకంటె నొకసూనృతవాక్యము మేలు చూడఁగన్.

ఇందు సారాలంకారశోభితంబగు సారోదారహితవాక్య మెల్లరయుల్లంబులఁ బల్లవింపఁ జేయుసు. నలోపాఖ్యానమునందలి యాయమూల్యపద్యరత్నంబున తృతీయపురుషార్థంబున నలదమయంతు లెట్లు విరాజిల్లిరో తెలియఁగలదు.

"నలదమయంతులిద్దరు మనఃప్రభవానలబాధ్యమానలై
సలిపిరి దీర్ఘవాసరనిశల్ విలసన్నవనందనంబులన్
నలినదళంబులన్ మృదుమృణాలములన్ ఘనసారపాంశులన్
దలిరులశయ్యలన్ సలిలధారల చందనచారుచర్చలన్."

ఇందు రాజదంపతులకేళీవిలాసంబు లత్యంతరమ్యముగా నపూర్వభావనాశక్తితోడ వర్ణింపఁబడెనని సరసమతు లెఱుంగఁగలరు. ఇఁక కవిబ్రహ్మయుపదేశముల గమనింపదగును.

"ఒకటిఁ గొని రెంటి నిశ్చలయుక్తిఁ జేర్చి, మూఁటి నాల్గింటి కడువశ్యములుగఁ జేసి
ఏనిటినిఁ గెల్చి యాఱింటి నెఱిఁగి యేడు, విడిచి వర్తించువాఁడు వివేకధనుఁడు."

ఇందు మానవుఁడు జీవితములో నెట్లు సంచరింపవలెనో తెలుపఁబడినది. ఎంత సూక్ష్మముగా నెట్టి మహత్తరమగు హితోపదేశ మొనరింపఁబడినది. ఇదియే కావ్యపఠనమువలన జీవితములోఁ గల్గుప్రయోజనము.

తరువాత సుప్రసిద్ధప్రబంధమగు మనుచరిత్రఁ జూడుఁడు. పెద్దన్నగారి నందల మెక్కించినది యాకావ్యమే—కావ్యప్రబంధములు సమానార్థకములని సహృదయులకు విదితమే కదా—ఆప్రబంధమునందలి ప్రవరునియనుష్ఠానాదికములు వైదికసంప్రదాయమును చక్కగా వెల్లడించును. ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ వామనస్తోత్రముతో లేచినదిమొదలు ప్రవరుఁ డెట్టికర్మల నాచరించెనో మిక్కిలి హృద్యముగా వర్ణింపఁబడినది. ఆయాకర్మలు మానవజీవితములో నవశ్యాచరణీయములు. మఱియు ద్వితీయాశ్వాసములోని హృదయంగమమగు వరూధినీప్రవరులసంభాషణ మందఱకును విదితమైనదే. అనంతరము వరూధిని తమకంబునఁ బ్రవరునిపైఁ బడుసందర్భమునందలి "ప్రాంచద్భూషణ" అనుపద్యములో వరూధిని ప్రవరుని పరీరంభ మొనరించుకొనుట, ఆతఁడు పొమ్మంచుం ద్రోచుటయుఁ గలసన్నివేశమును మనకనులకచ్చుపడునట్లు చిత్రించినాఁడు పెద్దన్నగారు. కడపట

శ్రీ శిల్పరజతోత్సవము

"కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అనునర్థాంతరన్యాసములో నపూర్వ వ్యంగ్యవైభవముతో పెద్దన్నగారు స్వీయాభిప్రాయమును, కవిసందేశమును లోకము కొఱకు వెల్లడించినాఁడు. తరువాత ప్రవరునియాదర్శశీలమును "దానజపాగ్నిహోత్రపర తంత్రుఁడ నేని..." అనుపద్యమునఁ గాంచనగును.

## ప్రకృతిప్రతిబింబమే కాదు

ఇచట నొక్కవిషయము గమనింపఁదగు. కావ్యము కేవలప్రకృతిప్రతిబింబమే కాదు. వెలవ విశాలమైన ప్రకృతిరామణీయకమును జూచి మనమానందింపవచ్చును. కాని ప్రకృతి ప్రతిబింబమును మాత్రమే చూచి యేల తుష్టినొందవలెను. హృదయాహ్లాదకరంబులగు మనోహరప్రకృతిదృశ్యములఁ జూచి తన్మయత్వమునందుదుమే కాని ప్రకృతిప్రతిబింబ మును చూచినంత నానందింపఁ జాలము. ప్రకృతిలోని దృశ్యములనే కవీంద్రుఁడు కళా వంతమగునట్లు తనకల్పనాచమత్కృతి జూపి జీవితవిమర్శనము చేయుసందర్భమున కేవలము నైహికజీవితవిమర్శనము మాత్రమే చేసి యూరకొనక లోకకల్యాణముకొఱకు, విశ్వ శ్రేయస్సుకొఱకు పురోభివృద్ధికారణమగు మార్గమును సూచించును. మఱియుఁ గావ్యము కాంతాసమ్మితమగుట మనోహరము పైనుదహరించిన పెద్దన్నగారి ప్రవరునిపాత్ర యెంత హృదయరంజకముగా నున్నదో అందఱెఱింగినది అయిన నాకథ మారనమార్కండేయ పురాణములో నున్నది. కాని ఆపురాణములోనిపుటలను త్రిప్పి ప్రత్యేకదృష్టితో నా ప్రవరోపాఖ్యానమునుఁ జదువువారలు చాలతక్కువమందియని చెప్పనగును. అందుచేతఁ గావ్యములయుత్కృష్టతఁ దెలియనగును.

ఆధునికకృతులలోని సౌందరనందమున నెన్నియేని ఘట్టములు పాఠకుల నాకర్షించు నవిగా నున్నవి. సుందరీనందులప్రేమైకజీవితము హృద్యముగా నున్నది. ఆరాజదంపతులకు కేవలమానవకోటితో సంపర్కములేదు. కృతికర్తలు వారలకొక ప్రత్యేకానందదాయక ప్రపంచమును సృష్టించినారు. మఱియొకసన్నివేశములో వజ్రపుతునుకవంటి పద్యమును రచించి లోకోత్తరమగు నాదర్శమార్గమున సందేశమును వెలిపుచ్చిరి.

"పగఁ గొనుత్రాఁచుఁబాముగతి ప్రాణిజనించినదాది వెంబడిం
దగిలి చరించు మృత్యువు విధాతయు దానివశంబె యన్నచో
మిగిలినభూతజాలముప్రమేయముచెప్పఁగనేల నిత్యమై
నెగడెడి దొండులేదు కననేరదు లోకము కన్నులుండియున్.

ఇందలిపదములపొందిక, అలంకరణచాతుర్యము మున్నగుకావ్యగుణములే కాక, మోహ సముద్రములోఁ బడి దరిగాననివారలకు నూతనప్రబోధము సలిపియున్నవిషయము తెలియఁగనగు. సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినపాఠకుల కందలి 'కవిసందేశము' బుద్ధభగవానుని నోట వెలువడినది కేవల మెక్కనందునకే కాదు. లోకమంతటికినిఁగూడ నయ్యదియే చక్కని యుపదేశము. ఆదర్శమార్గసూచకము. కాంతాసమ్మితములగు కావ్యములోని సందేశము లీరీతిగా నుండవలెనని సహృదయు లెఱుంగనగును.

కాఁబట్టి కేవలమానందజనకత్వమే కాక ఇహపరసాధకమగు సత్యంబాదర్శమార్గ సూచకమునై, అన్ని వేళల నిలిచియుండు సత్యపథమును సూచించుటయే కావ్యప్రయో జనమని చెప్పనొప్పును. ఈరీతి కావ్యము చతుర్విధపురుషార్థసాధకమని చెప్పనగును. అందున కావ్యమునకు జీవితముతో నెట్టి సంబంధమున్నదో ఎట్టి ప్రయోజనమున్నదో సహృదయులకు తెలియఁగలదు. కావున సహృదయులలో జీవితమున కావ్యపఠన మత్యంతోపయుక్తమను భావము స్థిరముగా నాటుకొనునుగాక !



**శ్రీ కపిలేశ్వరపురము జమీందారుగారు, (తూర్పుగోదావరి జిల్లా.)**

ప్రతిభాయుత 'త్రిలిఙ్గ' రజతోత్సవము త్వరలో జరుగనున్నదని విని చాల సంతసించితిని. దేశమున కీపత్రిక గొప్ప సేవ చేయుచున్నది. ఈతరుణమున ఈపత్రికకు అభివందనములు. ఇతోధికముగా నిది ప్రజారంజకమగుచు అభివృద్ధి నందుగాక !

కొన్ని పదులఏండ్లుగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని వారివాఙ్మయ సేవను నేనెరిగియున్నాను. వాఙ్మయమున కూడిగముచేయుటద్వారా ప్రజాసేవ చేయుటయందు శ్రీశాస్త్రులవారు తండ్రిని మించినపుత్రులయినారు. ఆంధ్రవాఙ్మయ పోషణ నొనర్చిన ఈకుటుంబమున కాంధ్రదేశము బాగా ఋణపడియున్నది. సంస్కృతవాఙ్మయానికి శ్రీశాస్త్రులుగారుచేసిన సేవయు గణ్యము. వారికి చిరా యురారోగ్యైశ్వర్యములగును గాక!

# సంస్కృత సమాసములు

వ్యాసకర్త: శ్రీపరవస్తు వేంకటరామానుజస్వామి, ఎమ్. ఏ.,

అధ్యక్షుడు, మహారాజసంస్కృతకళాశాల, విజయనగరము.

1. సంస్కృతమునందును తత్సంబద్ధములగు నితరయిండో-యూరపియన్ భాషలలోను ప్రాతిపదికలు చాలావరకు వ్యుత్పన్నములనియు ప్రత్యయములు పదజన్యములనియు భాషాశాస్త్రమున నంగీకరింపబడుటచే నీభాషలలో ప్రాతిపదికలకు సమాసములు మూలమని స్పష్టపడుచున్నది. అందుచే నీభాషలచరిత్రలలో పదవ్యుత్పత్తివిమర్శకు పూర్వము సమాసవిమర్శ ప్రసక్తమగుచుండును.

2 భాషాశాస్త్రవేత్తలు ఇండో-యూరపియన్ భాషలలోని సమాసములను రూపభేదములనుబట్టియు నర్థభేదములనుబట్టియు రెండు వేరువేరు విధములుగా విభాగముచేసి యున్నారు. రూపభేదములనుబట్టి యీక్రిందివిధముగా నాలుగు భాగములు చేసి యున్నారు.

(1) నామవాచకప్రాతిపదికనుగాని సర్వనామప్రాతిపదికనుగాని పూర్వపదముగాగల సమాసములు. పరస్పరసదృశములగు రూపములు జన్యభాషలలో నధికముగా లేకపోయినను నిట్టి సమాసములు ఇండో-యూరపియన్ మాతృభాషలో విశేషముగా నుండినవని తలంపవలసియున్నది. సంఖ్యాపూర్వము లధికముగా నుండినవి. ఉదా. సం. ద్విపద్, గ్రీ. **Dipous,** లా. **Bipes,** ప్రా. ఇం. **Twifete.** సం త్రిదన్త్, లా. **Tridens.** సం. శతపద్, లా. **Centipes.** సం. పురుదంశ, గ్రీ. **Poludenea.** సం. ఆశుపత్వన్, గ్రీ. **Okupetes.** సం. నృమనః. ఇట్టి సమాసములలో పూర్వము సంధిచేయబడినట్లు కనబడదు. ఉదా॥ వై. యుక్తఅశ్వ, ప్రాస్లై **Belo-oku.** పూర్వపదము నకారాన్తమైనచో అది తరచుగా అకారాన్తము చేయబడుచుండెను. ఉదా॥ సం. శీర్షబంధన, నామధా, ఉక్షాన్న. పదాన్తరసాదృశ్యమున పూర్వపదముయొక్క అంతము మారుట కూడ గలదు. ఉదా॥ ద్వౌ అనుపదము త్రిపాద్ అనుసమాసములోని త్రిపదముననుసరించి ద్విపాద్ అను సమాసమున ద్వి అనురూపమును పొందినది. పూర్వపదప్రాతిపదికస్థానమును విభక్తిరూపమాక్రమించుట కూడ గలదు. ఇట్లు అగ్రగః అనుప్రాచీనసమాసస్థానమున అగ్రేగః అను నవీనసమాసము వ్యవహారము

లోనికి వచ్చినది. పూర్వపదము విభక్తిప్రత్యయముతోనున్న సమాసములలోకూడ కొన్ని ప్రాచీనములవలె తోచుచున్నవి. ఉదా॥ అష్టాపద, గ్రీ. Oktopous, లా. Octojugis, వేదమునందలి అష్టకర్ణ మొదలగు సమాసములు ప్రాచీనరూపయుక్తములు కావనియు సప్తపదసాదృశ్యముతో నూతనముగా నుద్భవించినవనియు తలంపవలసియున్నది. ఇట్లు ప్రాతిపదికకుబదులుగా విభక్తిరూపములు కొన్నిప్రత్యయములకు పూర్వము కూడ నిలువ నారంభించినది. ఉదా॥ తదీయ, కింయు, దివాతన, ఉచ్చైస్తరామ్.

(2) మనకు తెలిసినంతవరకు ఇండో-యూరపియన్ భాషలలో దేనియందును నెప్పుడును ప్రత్యేకపదముగా బ్రయోగింపబడనట్టియు సమాసమునందె గనబడునట్టియు ప్రాతిపదికను పూర్వపదముగాగల సమాసములు. ఉదా. సం. అమృత, అమర్త్య, అనశ్వ, ఆర్మీ. Anget, గ్రీ, Ambrotos, Anippos, లా. in-somnis (సం. అస్వప్న), ప్రా. ఐ. Etromm, ప్రా. హై. జ. Unende (సం. అనన్త). సం. దుర్మనస్, గ్రీ. Dusmenes, ప్రా. ఐ. Dochruth. ఇట్టి సమాసములలో పూర్వపదము లెప్పుడైనను స్వతంత్రపదములుగానుండినచో నవి మాతృభాషలోనే స్వతంత్రప్రయోగార్హతను నష్టపోయి యుండవలయును.

(3) ప్రత్యేకప్రయోగార్హమగు నవ్యయమును పూర్వపదముగాగల సమాసములు. వీనిని యనేక యవాంతరకక్ష్యలుగా విభాగముచేయవచ్చును. వానిలో కొన్ని నిర్దేశింపబడును. ఉపసర్గకును ధాతువులకును సమాసములు. ఉదా. సం. అపిహిత, గ్రీ Epithetos, సం. అపచితి, గ్రీ. Apotisis· సం. నీడ, ఆర్మీ. Nist, లా. Nidus, ప్రా. ఐ. Net ప్రా. హై. జ. Nest సం. పరిస్రావ, గ్రీ. Perirros. ఉపసర్గలకును నామములకును సమాసములు. ఉదా. సం. ఉపరిమర్త్య, గ్రీ. Uperanthropos లా. Intervallum. సం. అన్తర్హస్త, అపకక్ష నిషేధార్థకనశబ్దమాశబ్దములకును సర్వనామములకును సమాసములు. ఉదా. సం. నకిః, అవె Naecis విధు. Nekas ప్రా. స్లా. Nikuto సం. మాకిః, గ్రీ. Metis.

(4) సమాసోత్పత్తిసమయమున ప్రత్యేకప్రయోగార్హమగు నామవాచకవిభక్తిరూపమునుగాని విభక్తిప్రతిరూపకమగు నవ్యయమునుగాని పూర్వపదముగాగల సమాసములు. ఇట్టి సమాసములు మాతృభాషలో స్వల్పముగా నుండినవి కాని జన్యభాషలలో నధికమైనవి. వీనిలో చాలాభాగము ప్రాచీనసమాసముల సాహచర్యము వలన జన్మించినది కాని సమాసవిధాయకనియమముల ననుసరించి యేర్పడినది కాదు. ఈ క్రింది సమస్తపద

ములు మాతృభాషలోనే యుద్భవించినవని యంగీకరింపవచ్చును. సం. ద్వాదశ, అవె. **Dvadasa** గ్రీ. **Dodeka** లా. **Duodecim.** సం. త్రయోదశ, లా. **Tredecim** హైజ. **Drizehen** సం. దివోరుచ్, గ్రీ. **Diosdotos** సం. దివిజాః, దివిజాత, తద్వశ, గ్రీ. **Podapos.**

ఈ విభాగము పరస్పరభేదముల ననుసరించునది కాదు. సామాసచరిత్రమును వివరించుటలో సౌలభ్యము కొరకు చేయబడినది. ఇటీవల ప్రత్యేకభాషలలో అనేకరూప సాంకర్యములు సంభవించి పైవిభాగములు సంకీర్ణములైనవి.

పైవిభాగములలో మొదటిదానికి యథార్థసమాసమనియు, చివరదానికి అయథార్థ సమాసమనియు వ్యవహారము కలదు.

పైనాలుగు విధములగు సమాసములును పురుషనామములుగా వ్యవహరింపబడు చుండెను. మాతృభాషలో పురుషులను నిర్దేశించుటకు యిదియే ముఖ్యమగురీతిగా నుండెను. ఉదా. అశ్వమేధ, దివోదాస, విశ్వామిత్ర.

3. మూలార్యభాషలో పైవిభాగములు విశేషమగు మార్పులను పొందలేదు. కొన్ని అకారాన్తపూర్వపదములు రూపాన్తరసాదృశ్యమున ఆకారాన్తములుగా మారినవి. ఉదా. సం. అశ్వామఘు, గ్రీ. **Ippozugos.** సం. గూర్తావసు.

4. సంస్కృతమున సమాసములసంఖ్య విశేషముగా వృద్ధిపొందినది. వైదికభాషలో కంటె లౌకికసంస్కృతమును యింకను అధికముగా పెరిగినది. వేదమునను బ్రాహ్మణమునను ద్విపదసమాసములేకాని బహుపదసమాసము లతిస్వల్పముగానున్నవి. లౌకికసంస్కృతమున మొదటివిభాగములోచేరిన బహుపదసమాసము లత్యధికముగా నున్నవి. అర్వాచీనకవుల గ్రంథములలో అతిదీర్ఘసమాసములు కలవు.

సంస్కృతమున మొదటి మూడుకక్ష్యలలోను విశేషమగు మార్పులేమియు సంభవించలేదు. నాల్గవకక్ష్యలో నీక్రింది విశేషములు గమనింపతగినవి. సం. పితామహ అను సమాసము పితా మహః అనువ్యస్తపదములనుండి యుద్భవించియుండవలయును. సమాసముగా స్థిరపడిన పిదప పితామహీ యను స్త్రీలింగరూప ముత్పన్నమైనది. సం. దివోజాః, దాస్యాఃపుత్ర, బ్రహ్మణస్పతి, శుభస్పతి, దివాకీర్త్య, యుధిష్ఠిర మొదలగుసమాసము లీకక్ష్యలో చేరును. ఇవి ప్రాచీనములని యంగీకరింపవచ్చును.

ప్రాతిపదికస్థానమున విభక్తిరూపములనుంచుటచే నీయలుక్సమాసములసంఖ్య క్రమముగా పెరిగినది. ఉదా. సం దివిక్షిత్, అప్సుక్షిత్, అగ్రేగ, వాజంభర, అగ్నిమిన్థ మొ. ఇట్టి సమాసములలో నుత్తరపదము ప్రత్యేకప్రయోగానర్హము కనుక నవి వ్యస్తపదములనుండి యుద్భవించినవని తలంచుటకు వలనుపడదు. ఇతర యలుక్సమాసముల సాదృశ్యమున నివి బయలుదేరినవని చెప్పవలసియున్నది. ఈవిధముగా సమాసాన్తరసాదృశమున గొన్ని సమాసములు జన్మించినపుడే యన్యపదార్థప్రధానముగా నుద్భవింపవచ్చును. ప్రత్యయార్థమును వివక్షింపక కేవలరూపసాదృశ్యము నాధారముగాచేసికొని యుద్భవించినసమాసములగుటచేతనే కొన్నింటిలో పూర్వపదమునకు వ్యస్తముగానున్నపుడు సంభవింపని ప్రత్యయము లగపడుచుండును. ఇట్లు వనస్పతి అనుసమాసము షష్ఠియందు అస్ ప్రత్యయమునుగ్రహించు పూర్వపదముతోనుండు బ్రహ్మణస్పతి అను మొదలగు సమాసముల సాదృశ్యమున యుద్భవించినది. ఇట్లే వసుంధర అనుసమాసము ధురంధర, కులంధర అను మొదలగుసమాసముల సాదృశ్యమున నుద్భవించినది. క్రమముగా సమాసములలోని ప్రత్యయములయర్థము వివక్షింపబడక యవి యనర్థకములుగా తలంపబడుటచే కేవలసాదృశ్యము మీాద ప్రత్యయార్థకవిరుద్ధములగు సమాసములు గూడ నేర్పడినవి. ఇట్లు అప్సుక్షిత్ అను మొదలగువాని సాదృశ్యమున అపాంయోగ లేక అప్యోగ (అథర్వవేదమున సోమయోగ అనుసమాసముకలదు) అనుసమాసమునకు మారుగా అప్సుయోగ అనుసమాసమేర్పడినది. ఇట్లు సర్వనామములలోగూడ తద్ అను నపుంసకలింగరూపముతోనుండు సమాసముల సాదృశ్యమున మకారాన్తనపుంసకలింగరూపములతో కూడ సమాసము లేర్పడినవి. ఉదా. ఇదంరూప, కింకారణ.

మూలార్యభాషకాలమునుండియు రెండుద్వివచనరూపముల సంయోగము తరచుగా సంభవించుచుండెను. ఇందుభయపదములును విభక్తిప్రత్యయములను గ్రహించుచుండెను. ఉదా॥ మిత్రావరుణా, అవె. **Ahura mithra, ahuraeibya mithraeibya.** వీనితోగూడ మిత్రావరుణాభ్యాం, మిత్రావరుణయోః అనుప్రయోగములు కనబడుచుండెను. ఇవి ద్వాదశభిః, త్రయోదశభిః అను మొదలగు ప్రయోగములకు సదృశములుగా నున్నవి. విభక్త్యంతరము లుత్తరపదములకు మాత్రము చేర్పబడుటచే ఇందు సమాసత్వము కొంతవరకు సిద్ధించినదని చెప్పవచ్చును. వీనిసాదృశ్యమున యాకారాన్తపూర్వపదములతో నుద్భవించిన మరికొన్ని ప్రయోగములలో కూడ సమాసత్వ మంగీకరింపవలసియున్నది. ఉదా॥ అగ్నావిష్ణూ. అకారాన్తపూర్వపదమునకు ప్రత్యామ్నాయముగా

అకారాన్త ప్రాతిపదికతో కొన్ని ప్రయోగము లుండుట కూడ నవి సమాసములుగా దలంపడినట్లు సూచించుచున్నవి. ఉదా॥ పర్జన్యవాతా, పర్జన్యావాతా. తద్ధిత ప్రత్యయాన్త రూపములు కూడ వీనికి సమాసత్వము సిద్ధించినదని నిరూపించుచున్నవి. ఉదా॥ మిత్రా వరుణవత్.

పితాపుత్రౌ, మాతాపితరౌ, హోతాపోతారౌ అనుసమాసములు పితా పుత్రః, మాతా పితా, హోతా పోతా అనువ్యస్తపదములనుండి యుద్భవించియుండవలయును. ఇవి సమాసములుగా తలంపబడిన పిదప ద్వివచన ప్రత్యయము చేర్చబడియుండవలయును. అన్యోఽన్యమ్ (అన్యః అన్యమ్), పరస్పరమ్ (పరః పరమ్) అనుపదసముదాయములు సమాసములుగా దలంపబడినపిదప విభక్త్యన్తరములతో పూర్వపదము సమసింపవలసి వచ్చినప్పుడు కూడ ఆవిభక్తులను విడచి ప్రథమారూపమే యెల్లెడలను ప్రవేశపెట్టబడినది. ఉదా॥ అన్యోన్యామ్ (అన్యా అన్యామ్), అన్యోన్యమ్ ప్రతి (అన్యస్య అన్యం ప్రతి.)

౫. ప్రప్రథమమున ఇండో-యూరపియన్ మూలభాషలో పూర్వపదము ప్రాతిపదిక రూపముననుండు సమాసములలో పూర్వపదమున కుత్తరపదముతోనుండు సంబంధమస్పష్టముగా నుండెను. సమస్తపదముచే బోధింపబడు నర్థమునుసరించి యది మారుచుండెడిది. విభిన్న సమాసములలో విభిన్నముగానుండెను. సూర్యపదము చన్ద్రపదముతో చేరి యుండినప్పు డొకవిధమగుసంబంధమును, కిరణపదముతో చేరియున్నప్పుడు మరియొకవిధమగు సంబంధమును బోధించుచుండెను. ఇట్లే హననశబ్దము మనుష్యశబ్దముతో చేరి యుండినప్పు డొకవిధమగుసంబంధమును, బాణశబ్దముతో కలిసియున్నపు డింకొకవిధమగు సంబంధమును సూచించుచుండెను. సమానసంబంధబోధకములగు సమాసములన్నియు నొకజాతివిగా తలంపబడుచుండును. మాతృభాషలో నిట్టిజాతులు స్వల్పముగానుండి జన్యభాషలలో నభివృద్ధిచెందియుండవచ్చును.

పూర్వపదము విభక్తిప్రత్యయవిశిష్టముగా నున్నసమాసములలో పూర్వోత్తరపదములకుండు సంబంధము స్పష్టముగానుండును. ఉదా॥ దివిజా, దివోరుచ్. కాని క్రమముగా వీనిలో విభక్త్యర్థము తిరస్కృతమగుచుండును.

మనవారును పాశ్చాత్యులును గూడ నర్థమునాధారముగా జేసికొని సమాసములను విభాగముచేయుటకు గొప్పపరిశ్రమను సలిపియున్నారు. కాని సమస్తపదముల నుపయోగించువారిమనస్సులో నాపదములకుండుసంబంధ మస్పష్టముగానుండును గాని విమర్శకుల

మనస్సులో నుండునంతస్పష్టముగా నుండదనువిషయమును మనము మరువరాదు. అందు చేతనే సమాసములను విభాగముచేయబూనినవారికి కొన్నిసమాసము లేకక్ష్యలో చేరునను విషయము సందేహగ్రస్తముగానుండును. ఇట్లు సఖిగణశబ్దము తత్పురుషమా కర్మధార యమా యనుసందేహము కలుగును. మరియు పితృఘాతకశబ్దమున పితృశబ్దము ద్వితీయార్థ మును బోధించునో షష్ఠ్యర్థమును బోధించునో సందేహముగానుండును. సామాన్యముగా నీపదముల నుపయోగించువారిమనస్సులలో నీసంబంధవిశేషములు నిశ్చితములుగానుండవు. వైయాకరణులు శాస్త్రముకొరకు నిర్ణయములనుచేయుచుందురు. నిజముగావీరివిభాగములు పరస్పరభిన్నములు కావు. అవాంతరభేదములమూలమున నొకదానితోనొకటి సంబంధిం చియే యుండును.

6. అర్థముననుసరించి సమాసములను విభాగముచేయుటకు మాతృభాషనుండియు వచ్చుచున్న రెండుముఖ్యమగు నియామకములు కలవు వీనిలో ఉభయపదార్థప్రధాన ములు, ఏకపదార్థప్రధానములు అనునది మొదటిదియు, అన్యతరపదార్థప్రధానములు, అన్యపదార్థప్రధానములు అనునవి రెండవదియునై యున్నవి. ఈవిభాగములుకూడ పర స్పరముయసంకీర్ణములు కావు.

మనవారు సమాసములను నాలుగుకక్ష్యలుగా విభాగముచేసియున్నారు. 1. ఉభయ పదార్థప్రధానములు. 2. పూర్వపదార్థప్రధానములు. 3. ఉత్తరపదార్థప్రధానములు. 4. అన్యపదార్థప్రధానములు మనవారివిభాగమున పాశ్చాత్యుల పై రెండు విభాగములును కలసియున్నవి.

7. ఉభయపదార్థప్రధానములలో రెండుపదములును సమప్రధానములుగానుండి వాని సముచ్చయార్థము సమాసముచే బోధింపబడుచుండెను. అందుచే నివి చార్థకములని చెప్పబడుచున్నవి. ఏకపదార్థప్రధానములలో నొకపదము రెండవపదముమీద యాధార పడియుండును. ఒకపదముయొక్క యర్థము ప్రధానముగానుండి రెండవది దానికి విశేషణ ముగానుండును.

ఇండో-యూరపియన్ మాతృభాషలోను తజ్జన్యములగు భాషలలోను గూడ నేక పదార్థప్రధానములగు సమాసములే అధికముగానుండెను. సంస్కృతభాషయందుమాత్రము ఉభయపదార్థప్రధానములగు సమాసములు విస్తారముగా జన్మించినవి. ఆ యేకపదార్థప్రధా నములగు సమాసములలో పూర్వపదమున కుత్తరపదముతో నుండుసంబంధము విభిన్న

ములుగానుండెను ఈసంబంధభేదము లత్యధికముగా నుండెను. జన్యభాషలలోని సామ్య ములనుబట్టి యీక్రింది భేదములు మాతృభాషలోనే స్థిరపడినవని చెప్పగలము.

(1) సం. రాజర్షిః, గ్రీ. Iatro-mantis 'వైద్యముని', లా. angui-pes 'సర్ప పాదః', ప్రా. ఐ. rig-faith 'రాజజ్యోతిష్కుడు', గాధి. thiu-magus 'సేవకబాలః', ప్రా. హై. జ gold-ring 'స్వర్ణాంగులీయకం', విథు. obel-medis 'బదరీవృక్షః', ప్రా. స్లె. konje-clov$_{ek}$u 'నరాశ్వః'.

(2) సం. మాతృష్వసా, ఆర్మీ. skesr-air 'శ్వశ్రూభర్తా', గ్రీ. matr-adelphos 'పితృభ్రాతా', లా. mus-cerda, 'మూషికపురీషః', ప్రా. ఐ rig-thech 'రాజసౌధము' గాధి. thiudan-gardi 'రాజసౌధము', విథు. brol-avaikis 'భ్రాతృవ్యుడు', ప్రా. స్లె. brato-ceda 'భ్రాతృదుహిత.' మాతుష్వసా మొదలగు అలుక్సమాసములు గూడ నిందే చేర్చదగియున్నవి.

(3) సం. అధరహను, ఆర్మీ. kaj-air 'వీరపురుషుడు', గ్రీ. akro-polis 'ఊర్ధ్వ పురము', లా. pleni-lunium 'పూర్ణచంద్రుడు', గాధి. hrainja-hairts 'నిర్మలహృద యుడు', ప్రా. హై. జ. junc-frouwa 'బాలయోషిత' విథు. jud-varnis 'నల్లకాకి', ప్రా. స్లె. krivo-nosu 'వక్రనాసికః'.

(4) సం. సప్తర్షయః, [illegible]రాత్రమ్, ఆర్మీ. hing-am 'పంచవత్సరాణి', గ్రీ. tri-pous 'ముక్కాలిపీట', లా. bi-pes 'ద్విపాత్తు', ప్రా. ఐ. tre-choste 'ముక్కాలిపీట', ప్రా. హై. జ. zwi-houbit 'ద్విశీర్షము', విథు tri-razis 'త్రిశృంగః', ప్రా. స్లె. tri-zabu 'త్రిదన్త.'.

(5) సం. తామ్రధూమ్రః, గ్రీ. okhro-xanthos 'శ్వేతపీతః', ప్రా. ఐ. dub-glass 'కాలనీలః', హై. జ. bleich-gruene 'శ్వేతహరితః', విథు. jud-beris 'కాలరక్తః'.

(6) సం. వేదవిద్, గ్రీ. bou-plex 'గవాజ్యుకోశము', లా. ju-dex 'న్యాయదాతా.'

ఇట్లింకను ననేకరకములు చూపవచ్చును. కాని వానిపారస్పరికభేద మవిస్పష్టముగా నుండును.

ఉభయపదార్థప్రధానములగు సమాసములు సంస్కృతమునందే విశేషముగా నభి వృద్ధిపొందినవి. మిగిలినభాషలలో నభివృద్ధిపొందలేదు. సంస్కృతమునందుగూడ వేదము

నందుకంటె లౌకికవాఙ్మయమునం దధికముగా గనబడుచున్నది. బహుశః ఇండో-యూరపియన్ మాతృభాషయొక్క ప్రాథమికావస్థలో పూర్వపదము ప్రాతిపదికరూపముతోనుండు ద్వంద్వసమాసములు లేవని చెప్పవచ్చును. పూర్వపదము ప్రాతిపదికరూపముతోనుండు నేకపదార్థప్రధానములగు సమాసముల సాహచర్యముననే పూర్వపదము ప్రాతిపదికరూపముతోనుండు ద్వంద్వసమాసము లుద్భవించి యుండవచ్చును. ద్వంద్వసమాసములలో నిట్టి మార్పు ప్రత్యేకభాషలలో నిటీవలగూడ సంభవించినది ఉదా॥ పర్జన్యావాతా అను ప్రాచీన వాఙ్మయములోనిసమాసము నవీనవాఙ్మయమున పర్జన్యవాతా యనురూపముతోనున్నది. ఇట్లే పూర్వః పూర్వః అనుసమాసము పూర్వపూర్వః అనురూపమును పొందినది. పూర్వపదము ప్రాతిపదికరూపమును పొందగనే సమాసత్వము దృఢపడును. ఏకపదార్థప్రధానములగుసమాసములలో ననేకములు పూర్వోత్తరపదములకుండు సంబంధములో ద్వంద్వసమాసములను పోలియుండుట కూడ ద్వంద్వసమాసములలో పైమార్పుకలుగుటకు సహకారిగ్గైనది. ఈ రెండువిధములగు సమాసములకును పూర్వము విశేషభేదమేమియును లేకుండెను.

పూర్వపదము ప్రాతిపదికరూపముననున్న ద్వంద్వసమాసములు మూలార్యభాషలో నుండినవనువిషయము సందేహగ్రస్తముగానున్నది. ఋగ్వేదమునందు పూర్వపదము ప్రత్యయవిశిష్టముగానున్న ద్వంద్వము లధికముగానున్నవికాని ప్రాతిపదికరూపముతో నున్నవి యతిస్వల్పముగానున్నవి. ఉదా॥ అజావయః (అజ+అవయః). పూర్వపదము ప్రాతిపదికరూపముతోనున్న ద్వంద్వము లభివృద్ధిచెందుటయే సంస్కృతభాషకు విశేషము. ఈ యభివృద్ధి క్రమముగా జరిగినది. చివరకు సంస్కృతమున బహుపదద్వంద్వములు కూడ విశేషముగా వ్యవహారములోనికి వచ్చినవి. ఉదా॥ రామలక్ష్మణభరతశత్రుఘ్నాః. ముఖబాహూరుపాదతః. ఆర్యేతరభాషలలో పూర్వపదము ప్రాతిపదికరూపముతోనుండు ద్వంద్వము లతిస్వల్పముగానున్నవి. నిఃసందేహములగు నుదాహరణములు ప్రాచీనగ్రీకు భాషలో లేవు. నవీనగ్రీకుభాషలోనే కలవు. కెల్టిక్, జర్మానిక్ భాషలలో లేనేలేవు.

8. అన్యతరపదార్థప్రధానములు, అన్యపదార్థప్రధానములు అనుభేదము ఇండో-యూరపియన్‌మాతృభాషలో కలిగిన యర్థపరివర్తనమువలన నేర్పడినది. ఈపరివర్తనము మాతృభాషలో ప్రారంభమై తజ్జన్యభాషలలోగూడ తరచుగా సంభవించుచుండెను. ఇట్లు దుష్టమనస్సను నర్థమునిచ్చు 'దుర్మనాః' అనుసమాసము దుష్టమనస్సుకలవాడనునర్థమును గ్రహించినది. ఇచ్చట నామము విశేషణములోనికి మారుటయే ముఖ్యమైనవిషయము.

విశిష్టపదార్థవాచకత్వము విడువబడి గుణవాచకత్వము గ్రహింపబడినది. ఇట్టిమార్పు వ్యస్తపదములలోగూడ నగపడుచుండును. ప్రాచీనభాషలలో నిట్టినామసమాసములు విశేషణప్రత్యయము (య) చేర్చి స్పష్టమగు విశేషణములలోనికి మార్చబడునలవాటు కలదు. ఉదా॥ దశమాసీయ. అందుచే నిట్టిసమాసములు ప్రథమమున నామములుగా జన్మించి తరువాత యర్థపరివర్తనమునుపొంది విశేషణములుగా మారినవని మనము దృఢముగా చెప్పవచ్చును. రెండురూపములకును స్వరములో భేదము ప్రథమమునగుండ నుండనోపును.

అన్యతరపదార్థప్రధానములగు సమాసములకు ముఖ్యసమాసములనియు(Primary), నీచసమాసములనియు (Lower) నామాంతరములు కలవు. అన్యపదార్థప్రధానములగు సమాసములకు (బహువ్రీహిసమాసములకు) గౌణసమాసములనియు (Secondary), ఉచ్చసమాసములనియు (Higher) నామాంతరములు కలవు.

నామవాచకములతో నేర్పడిన యేకపదార్థప్రధానములగు సమాసములును నుభయపదార్థప్రధానములగు సమాసములును గూడ అన్యపదార్థప్రధానములుగా మారవచ్చును. ఉదా॥ సం. అధరహనుః (నామము) హిరణ్యకేశః (విశేషణము) అకుమారః (నామము) అపుత్రః (విశేషణము). ఇండోయూరపియన్ భాషలలో సామాన్యముగా నామములకును విశేషణములకును భేదములేదనియే చెప్పవచ్చును.



**శ్రీ ఎస్. బీ. పీ. పట్టాభిరామరావుగారు, బి. ఏ., కవిలేశ్వరపురం కుమారజమీందారుగారు (తూర్పుగోదావరి జిల్లా.)**

కడచిన పాతిక శతాబ్దముగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తమ యావచ్ఛక్తిని వినియోగించి త్రిలిఙ్గను ప్రతిభాయుతము గావించినారు. ఆపత్రికకు రజతోత్సవము జరుగుచుండు నీతరుణమున నాహృదయపూర్వకాభివందనములు సమర్పించుచున్నాను.

సంస్కృతాంధ్రగ్రంథప్రచురణమునకు శ్రీవావిళ్లవారిసంస్థ ప్రాచీనసంస్థ ఆసంస్థ యజమానిగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరులుగా రాంధ్రప్రజకు సమర్పించిన వాఙ్మయకోశరాసులకై వారికందరును నుతులొనర్పవలసి యున్నది. వారు రాజకీయంగా ఈశాస్త్రాలో చేసినసేవయు గొప్పది. మద్రాసు నగరంలోని అనేక సంస్థలతో వారికి సంబంధ మున్నది. వారి హృదయము సుహృదయము. వారి మార్గము నయమార్గము. బీద భాగ్యవంతు డనుభేదముగాని పిన్న పెద్దయను భేదముగాని లేక యందరకును వారు మిత్రులు. వీరు చిరంజీవులయి సౌఖ్యసంపద లనుభవింతురు గాక.

# ముద్రణకళ

కర్త: శ్రీ యం. యస్. వెంకయ్యగారు,
పండిట్, వావిళ్ల ముద్రణాలయము, మద్రాసు.

ఈయది త్రిలిఙ్గపత్రికా రజతోత్సవ సంపుట మగుటవలనను, పత్రికాప్రచారమునకు ముద్రణమే ప్రధానసాధనమై యొప్పుటంబట్టియు, ముద్రణకళావిషయక మగువ్యాసము నిందుఁ జొందుపఱచు టసంగతము గాఁజాలదని భావించి యట్టి వ్యాసరచనకుం గడంగుచున్నాఁడ.

ఈరోజులలో విజ్ఞానప్రచారమునకుఁ బెక్కుమార్గము లనుసరింపఁబడుచున్నవి. కొందఱు తపాలామూలమున శిష్యబృందమునకు విద్య గఱపుచున్నారు. కొందఱు విద్యుద్వాహకయంత్రములమూలమునఁ బరస్పరసల్లాపము లొనరించుకొనెదరు. ఉపన్యాసములేమి, శాస్త్రపాఠములేమి, పాటకచ్చేరీలేమి, నాటకప్రదర్శనములేమి, దేశదేశాంతరవార్తాప్రకటనములేమి, సర్వము మాటలయంత్రములమూలమునను, ఆకాశవాణిమూలమునను నిర్వహింపఁబడుచున్నవి. ఛాయగ్రాహకవిద్యుద్యంత్రములగుండ దేశదేశాంతరములందు నాటకప్రదర్శనములు గావింపఁబడుచున్నవి. కాని, యీసాధనము లన్నియుఁ దాత్కాలికములు. వక్తలు యంత్రముఖమునఁ జెప్పినంతవఱకే, శ్రోతలు విన్నంతవఱకే. ఆపైని, వక్తలు ప్రసాదించిన విజ్ఞానరూపమగు శబ్దజాలమంతయు శ్రోతలవిస్మృతితోఁ గూడి మహాకాశమునందు లీనమైపోవును. ఒకవేళ ధారణాశక్తిసంపన్ను లగుశ్రోతలు గొంద ఱాకాశవాణీముఖమున విన్నవిషయమంతయు నానుపూర్వి తప్ప కితరులకు బోధింపఁగల్గినను వక్తృముఖమున వినినట్టుల సుబోధమైయుండు టసంభవము. కాని, మాటలయంత్రములగుండ బోధింతు మందురా? అది యెన్నఁటికిని సాధ్యముగాదు. నిదర్శనమునకు రేఖాగణితశాస్త్రమును దీసికొందము. దీనినిగూర్చి బోధించునపు డెన్నియో విషయములు చిత్రలేఖనపురస్సరముగాఁ దెల్పవలసియుండును. ఇదెట్లు సాధ్యమగును? శాస్త్రమంతయుఁ బూర్తియగుట కెన్నియో తట్టలు-Plates గావలసియుండును. ఈతట్టల నొక్కొక్కటిగా యంత్రమునం దిముడ్చుటకే యెంతయో కాలము వ్యయమగును. ఇఁక నాశాస్త్రవిషయమును విని మనస్సున కెక్కించుకొనుట యెప్పుడు? ఇట్లు లొక్క శాస్త్రమునకే యెన్నియో తట్టలు గావలసివచ్చిన,

నితరశాస్త్రముల కెన్నితట్టలు గావలసి యుండునో ! విద్యార్థిగది యంతయు నీతట్టలకే చాలకపోవును. శాస్త్రములు గ్రంథరూపమున నున్నచో, సులభముగా చొక్కా జేబులలో నిముడ్చుకొనవచ్చును. నడచునపుడేమి, శకటములందుఁ బోవునపుడేమి, ఉద్యానములందు విహరించునపుడేమి, పరుండుకొని యున్నపుడేమి, గ్రంథకంచుకరూపం బగు మేఘము దొలఁగింపఁబడినదే యాదిగా, విజ్ఞానభానునికిరణములు సర్వత్ర ప్రసరించి పాఠకునిహృదయకమలమును వికసింపఁజేయును. గ్రంథమునందుఁ బఠించిన విషయమేదేని స్మృతిపథమ్మునకు రాకున్నచోఁ బుస్తకము నొక్కమాఱు తిరుగవేసినఁ జాలు; సర్వము నవగతంబగును. ఇట్టి పట్టున నాకాశవాణిగాని, మాటలయంత్రముగాని యుపకరింపఁగలదా? జమాఖర్చులెక్కల పద్ధులుగాని, వర్తకవిషయములగు ఖరారునామాలుగాని, ఉత్తరప్రత్యుత్తరములుగాని, వ్యవహారసంబంధములగు నిబంధనలుగాని, క్రయవిక్రయముల దస్తావేజులుగాని, మాటలాడు యంత్రములందును, ఆకాశవాణియందును నిమిడ్చి భద్రపఱచి యుంచుకొనుటకు సాధ్యము లగునా? ఇఁక రహస్యముగ భద్రపఱచి యుంపవలసిన విషయములగతి యేమగు? వీని నన్నింటిని బర్యాలోచించియే శబ్దజాలము నక్షరరూపమున నిబద్ధించుపద్ధతి యెల్లదేశము లందును నవలంబింపఁబడిన దననగు. అక్షర మనఁగా నాశరహిత మైనదని భావము అనాది నిధనుండగు సర్వేశ్వరుండు నక్షరశబ్దవాచ్యుఁడు. ఇట్లక్షరము లవ్యయములై భగవత్స్వరూపంబు లగుటకతన, నొక్కభగవంతునే పెక్కురూపముల భిన్నభిన్నమతస్థు లుపాసించురీతి నొక్కొకదేశీయు లొక్కొక యాకారమున వానిని భావించుచున్నా రననొప్పెడి. ఇట్లు భావింపఁబడిన యక్షరములయాకృతులే రేఖారూపమునఁ బత్రములపై లిఖింపఁబడుచున్నవి. వీనినే యెల్లరు సామాన్యముగా నక్షరము లనెదరు. ఇట్టియక్షరములతోడనే శిలాశాసనాదులు చెక్కింపఁబడినవి. అవి నేఁడు పెక్కుశతాబ్దములకు ముందు జరగిన చారిత్రకవిశేషములకు సాక్ష్యమిచ్చుచుండుటను మనము గనుచున్నారము. ఈతీరున రేఖారూపములగు నక్షరములు లిఖింపఁబడిన పత్రసంచయమే గ్రంథ మన నొప్పుచున్నది. కావున, విద్వాంసులు తమ విజ్ఞానధనమును లోకమునందు భద్రపఱచి యుంచుటకు గ్రంథనిబంధనముకంటె వేఱొండు మార్గము లేదని రూఢియగుచున్నది.

ఇట్టి గ్రంథములు పూర్వకాలమునందుఁ జేతితో వ్రాసి యుంచుకొనఁబడుచుండెడివి. ఏదేని యొకగ్రంథమునకు నకలు కావలసియుండినచో నెంతయో వ్యయప్రయాసములకు లోనై చేతితో వ్రాసి తెచ్చుకొనవలసినదే. ఒకప్రతిని తయారుచేయుటకే యెంతయో కాలము పట్టును. ఇఁక రెండుమూఁడు ప్రతులు గావలసివచ్చినచోఁ జెప్పెడిదేమి! దేశ

దేశాంతరములందలి గ్రంథములు గగనకుసుమములే. ఎంతయో సొమ్ము వెచ్చింపఁగల మహారాజులకునైన నవి లభించుట యరుదైయుండెను. ఎన్నియో యుద్గ్రంథములు క్రిమిదష్టములై నామావశిష్టము లైనవి. ఇక్కారణమునఁ బూర్వకాలమునందు గ్రంథ ప్రచారము చాల విరళముగ నుండెను. అంతఁ బదపడి కొంత కాలమున కక్షరముద్రణ విధానము గనిపెట్టఁబడినందునఁ, జేతితో వ్రాసి గ్రంథములకు నకళ్లు తయారుచేయు శ్రమము తొలంగెను. నేఁడు గ్రంథప్రచార మవిరళముగ సాగుచున్నది. గ్రంథము లెల్లరకు నందుబడిలోనికి వచ్చినవి. ఏస్వల్పమూల్యమునకో యేగ్రంథమయిన లభించు భాగ్య మొనఁగూడినది. ఇట్లు గ్రంథసంరక్షణమునకును, గ్రంథప్రచారమునకుఁ దోడ్పడుచు, లోకమునకు మహోపకార మొనరించు నీముద్రణవిధానమువలని లాభముల గుర్తించి సంతసించుటకు మాఱుగా, మనలోఁ గొంద ఱింకయు ముద్రణ మనినను, ముద్రణాలయము లనినను, ముద్రాపకు లనినను, ముద్రణకార్యకరు లనినను జాల తేలికగాఁ జూచుచుండు టెంతయు వింతఁగొల్పుచున్నది. ఇపుడు గ్రంథకర్తలకును, ముద్రణవిధానమునకును శబ్దార్థములకువలె నవినాభావసంబంధ మేర్పడియున్నది. గ్రంథకర్తలు తమ గ్రంథములు లోకమునఁ బ్రసిద్ధికెక్కవలెనని కోరుచో వారి కీముద్రణవిధానమే శరణ మనవలయు. గ్రంథకర్తలు రీతులతోడను, శయ్యలతోడను, పాకములతోడను, అర్థాలంకారశబ్దాలంకారములతోడను దమ కావ్యకన్యకల నలంకరించెదరు. మఱి యీముద్రణ విధానమో రకరకములగు నక్షరంపుముత్యాలపేరులతోడను, అలంకారవర్ణము లను నాభరణములతోడను సైసేసి, గ్రంథబంధకకువిందానీతనూతనకౌశేయవస్త్రపరిధానం గావించి, సువర్ణాక్షరపుఁదిలకంబు దిద్ది, గ్రంథరూపముందాల్చిన యాకావ్యకన్యకను సర్వాలంకారసుశోభితం గావించి, సత్పాఠకవరకరగ్రహణయోగ్యం గావించుచున్నది. ఇట్లు గ్రంథకర్తలకును, ముద్రణవిధానమునకు నన్యోన్యాశ్రయ మేర్పడినది. ముద్రణ విధానమువలనితోడ్పాటు లేక గ్రంథకర్త తన పనిని బూర్తిగ నిర్వహించుకొనలేఁడు. కావున, ఇవన్నియుఁ బర్యాలోచించి చూచువారి కీముద్రణవిధానము సర్వజనోపకారకం బనియు, ననవసరంబని తలంచి త్యజించునట్టి యొకతుచ్ఛవిషయము గాదనియుఁ దోఁపక పోదు. ఇంత యుపయోగకరం బగుటంబట్టియే యిది యొక కళగా భావింపఁబడి, యూరపు దేశస్థులచే నహరహము భక్తిప్రపత్తులతో నారాధింపఁబడుచున్నది. ఇఁక నీముద్రణకళాభివృద్ధిప్రచారములంగూర్చి కొంత యెఱుంగుట తెఱంగగు.

ఈ ముద్రణమునందుఁ బ్రత్యేకముగా నవలంబింపఁబడు మూఁడు భిన్నపద్ధతులు గలవు. అవి క్రమముగా తామ్రఫలకముద్రణము **Copper-plate printing**, శిలాఫలక ముద్రణము **Lithographic or chemical stone printing,** అక్షరముద్రణము **Letter press printing** అని పిల్వఁబడును.

తామ్రఫలకముద్రణమునందు ముద్రణీయములగు నక్షరములుగాని, చిత్రములుగాని మొదట రాగిరేకులపైఁ జెక్కఁబడును. అంత నట్టిరేకుల నొక్కొక్కటిగాఁ దీసి వానికొఱకుఁ బ్రత్యేకముగ నిర్మింపఁబడిన యంత్రమునం దిమిడ్చి రేకుపై నంతటను గాటుక పట్టించి తుడిచివేయఁగా నందలి యక్షరములు మున్నగువానిరేఖలు గల నిమ్నప్రదేశము లందు మాత్ర మాకాటుక నిలచియుండును. ఇట్లు కాటుక పట్టింపఁబడిన రేకుపై నీటితోఁ దడిపి సిద్ధముచేసి యుంపఁబడిన కాగితముల నొక్కొక్కటిగాఁ బఱచి యంత్రమును నొక్కనచో, ఫలకమునందలి రేఖ లాకాగితమునందు ముద్రింపఁబడును. ఇట్లు ముద్రించు పద్ధతినే తామ్రఫలకముద్రణ మందురు. ఈపద్ధతి సామాన్యముగా చిత్తరువులు మున్నగు నవి ముద్రించుటకుఁ జాల ననుకూలించుచున్నది.

శిలాఫలకముద్రణమునందు ముద్రింపవలసిన యక్షరములుగాని, చిత్రములుగాని, అందుకొఱకై ప్రత్యేకముగ నౌషధద్రవ్యములు పట్టించి సిద్ధముచేసి యుంపఁబడిన కాగితముపై నౌషధద్రవ్యములతోఁ దయారైన యొకరకపు సిరాతో మొదట లిఖింపఁబడును. అంత నాకాగిత మౌషధద్రవ్యములు పూయఁబడిన దగు నొకతరహా పసుపురంగుగల సున్నపుఱాతిపలకపైఁ బఱచి యంత్రమునం దుంచి నొక్కఁబడఁగా, నందలి యక్షరములుగాని, చిత్రములుగాని, యాఱాతిపై నంటుకొనును. వెంటనే యాకాగితమును దీసివైచి యౌషధద్రవ్యపూరితమగు నీటితోఁ గడిగి శుభ్రపఱుపఁగా, నాశిలాఫలకమునం దట్లు మార్పఁబడిన ముద్రణీయవిషయము స్థిరముగ నుండిపోవును. అట్టి ఱాతిపలకపై నొక మాఱు నీరముఁ బట్టించి, యాపైఁ గాటుక పూయఁగా నది యాఱాతిపైఁగల ముద్రణీయ విషయమునందు మాత్రమే యంటుకొనును. వెంటనే యాఱాతిపైఁ గాగితమును బఱచి యంత్రమును నొక్కఁగా దానిపైఁ గలవిషయ మాకాగితమునందు ముద్రితమగును. ఇట్టు లొక్కొక్కమాఱును మొదట సీరును, వెనుక కాటుకయుఁ బూయుచు ముద్రింతురు. ఈ శిలాఫలకముద్రణమునకై ప్రత్యేకముగా ముద్రణయంత్రములు నిర్మింపఁబడియున్నవి. ఇట్టి లీశిలాఫలకముద్రణపద్ధతిని గ్రంథములును, పెక్కురంగులతోఁ గూడిన చిత్రపటములును ముద్రింపఁబడుచున్నవి. శ్రీరవివర్మగారి చిత్రపటము లన్నియుఁ బ్రచురింపఁబడునట

కీశిలాఫలకముద్రణవిధానమే తోడ్పడినది. మొన్న మొన్నటివఱకు త్తరహిందుస్థానమునందు గ్రంథములను శిలాఫలకముద్రణముమూలమునఁ బ్రచురించుచుండిరి. ఉర్దూభాషాగ్రంథములు మాత్రము నేటికి నీశిలాఫలకముద్రణపద్ధతినే ప్రచురింపఁబడుచున్నవి. ఉర్దూభాషావార్తాపత్రికలు సైతమీపద్ధతినే ముద్రితము లగుచున్నవి. కాని, ముద్రణీయములగు విషయము లంతయుఁ జేతితో వ్రాయవలసి యున్నందున నీపద్ధతిని గ్రంథముద్రణమునకుఁ గొంత యాలస్యమగును. కాని, రంగులతోఁ గూడిన చిత్రపటముద్రణమునకు విశేషముగ నుపకరించున దీశిలాఫలకముద్రణవిధానమే యనవలయు. ఎంత పెద్దపటమైనను ముద్రింపవచ్చును. నేఁడు ప్రకటింపఁబడెడి వ్యాపారసంబంధములగు చిత్రపటములు, సర్కసు కంపెనీలవారి చిత్రపటములు, సినిమా కంపెనీలవారి చిత్రపటములు మున్నగునవన్నియు నీపద్ధతినే ముద్రింపఁబడుచున్నవి. ఇట్లు ముద్రించుపద్ధతినే శిలాఫలకముద్రణ మందురు.

ఇఁక నిప్పటికిఁ బ్రస్తావనార్హమైనది మూఁడవదగు నక్షరముద్రణవిధానము. ఇందక్షరము లుబ్బెత్తుగ సీసముతో నిర్మింపఁబడి ముద్రణమునకై వినియోగింపఁబడును. ఈనిర్మాణపద్ధతి సామాన్యముగా ఏకాక్షరనిర్మాణము Mono-typy, శ్రేణ్యక్షరనిర్మాణము Lino-typy, ఫలకాక్షరనిర్మాణము Stereo-typy అని ముత్తెఱంగులై యొప్పు.

ఏకాక్షరనిర్మాణపద్ధతియం దొక్కొక్కయక్షరరూప మొక్కొక్క సీసపుఖడ్డితలపై నపసవ్యముగ నుబ్బెత్తుగా నిర్మింపఁబడియుండును. ఇట్లు శిరోభాగములం దక్షరాపసవ్యరూపములుగల సీసపుఖడ్డీలనే అచ్చక్షరము Types లందురు. చూడుఁడీ క్రింది పటము:—

ఇందు 'ఓ'అనునచ్చక్షరము చిత్రింపఁబడినది ఈయచ్చక్షరమందలి ప్రధానభాగముల వివరణము పటమునందు సూచింపఁబడిన యంకెలనుబట్టి యిట్టు లెఱుంగవలయును. 1. సీసపుఖడ్డి తలపైఁగల 'ఓ' అనునచ్చక్షరముయొక్క అపసవ్యాకారము. దీనినే అచ్చుమొగము Type-face అందురు. 2. అచ్చక్షరపు స్థౌల్యపరిమాణముయొక్క వెడల్పు. 3. అచ్చక్షరపు స్థౌల్యపరిమాణముయొక్క పొడవు. 4. అచ్చుమొగపు పైభాగము. 5, 6. అచ్చుమొగపుఁ గ్రిందిభాగమును సూచించు గంట్లు Nicks. 7, 8. అచ్చక్షరంపుఁ బాదములు. A—B. అచ్చక్షరపు టౌన్నత్యము Height. ఈ యౌన్నత్యపు కొలత సామాన్యముగా $\frac{92}{100}$ అంగుళము. ఇది అచ్చక్షరముయొక్క స్వరూపము.

పటము. ౧

ఇట్లు భాషయందలి యక్షరము లన్నింటికిని అచ్చక్షరములు యంత్రమూలమున సీసముతోఁ గరఁగించి పోయఁబడును. ఇట్టియచ్చక్షరము లాయాయక్షరములు నియమిత స్థలమునం దుంచుట కనువగు పెక్కు గళ్లతోఁ గూడిన విరివియగు మ్రానిపెట్టెయందు వెవ్వేఱుగాఁ బ్రోగుచేసి భద్రపఱుపఁబడును. ఇట్టు లచ్చక్షరములతో నిండినపెట్టెయే ముద్రాక్షరమంజూష Type case యనఁబడును. ఇట్లు సిద్ధముచేసి యుంపఁబడిన యచ్చక్షరములను అచ్చుకూర్పరులు Compositors గ్రంథస్థవిషయానుసరణిని మంజూషనుండి యొక్కొక్కటిగాఁ దీసి కూర్పుడుబల్ల Stick పైఁ బంక్తులు పంక్తులుగాఁ గూర్తురు. చూడుఁడీక్రింది పటము:—

ఇందుఁ గూర్పుడుబల్లయు, అం దచ్చక్షరములతో "ఓం నమః శివాయ" అని కూర్పఁబడిన వాక్యమును చిత్రింపఁబడినవి. వీని వివరణములను బటమునందు సూచింపఁబడిన యంకెలు మున్నగువానిని బట్టి యిట్టు లెఱుంగవలయు.



పటము. ౧

A. అచ్చుకూర్పరు లెడమచేతితోఁ బట్టుకొని, కుడిచేతితో మంజూషలోని యచ్చక్షరముల నొక్కటొక్కటిగాఁ దీసి పంక్తులుపంక్తులుగాఁ గూర్చుట కనువగు కూర్పుడుబల్ల. B. కూర్పుడుబల్లయందు అచ్చక్షరములతోఁ గూర్చి యుంపఁబడిన "ఓం నమః శివాయ" అనువాక్యము. 1, 2 అంకెలు పదములకు నడుమఁ గొంత యెడము గల్గించుట కుపయోగింపఁబడిన వ్యవధానపుఁగణికల సూచించును. ఈ వాక్యమును అచ్చుకూర్చునపుడు కూర్పరి మొదట "ఓ" యను నచ్చక్షరమును, అంత "ం" అనునచ్చక్షరమును మంజూషనుండి తీసి కూర్పుడుబల్లయం దుంచును. ఆపై "నమః" అనుపదమునకు ముందుఁ గొంత యెడము Space కావలసియున్నందున మంజూషనుండి వ్యవధానపుఁగణిక Quad యనుసీసపుబిళ్లను దీసి "ం" అనునచ్చక్షరమునకుఁ బ్రక్కన నుండునట్టులఁ గూర్పుడుబల్లఁయం దుంచును. ఆపైని "న-మ-ః" అనునచ్చక్షరములను దీసి వరుసగఁ గూర్చి, వానిప్రక్కన వ్యవధానపుఁగణికను దీసి కూర్చును. పదపడి "శి-వా-య" అను నచ్చక్షరములను మంజూషనుండి వరుసగఁ దీసి కూర్పుడుబల్లయం దుంచును. ఇట్టులే గ్రంథములందలి విషయము పంక్తులు పంక్తులుగాఁ గూర్పుడుబల్ల నిండువఱకచ్చక్షరములతోఁ గూర్పఁబడును. ఇది విడివిడియగు నచ్చక్షరములను గూర్చుపద్ధతి.

ఇట్లు కూర్పుడుబల్ల అచ్చక్షరములతో నిండినవెంటనే, ఆయచ్చక్షరపంక్తు లందుండి తీయఁబడి, యవి యుంపఁబడుట కనువగు నిత్తడితట్టయందు భద్రపఱచి యుంపఁబడును.

ఇట్టి లచ్చుతక్షరములపంక్తులతోఁ నిండిన తట్టయే అచ్చుతబుకు Galley అని చెప్పనొప్పు. చూడుఁ డీక్రింది పటము:—




ప ట ము. 3

ఇందు అచ్చుతబుకు చిత్రింపఁబడినది. చిత్రములో A అచ్చుతబుకును, B కూర్పుడు బల్లనుండి తీసిభద్రపఱచియుంపఁబడిన అచ్చుతక్షరముల పంక్తులను సూచించును.

ఇట్లు కొన్ని అచ్చుతబుకులు నిండువఱకు గ్రంథస్థవిషయము నచ్చుతక్షరములతోఁ గూర్చి, అంత నాముద్రాక్షరరూపమగు గ్రంథవిషయమును Matter పుటలు పుటలుగా విభజించి, అందుకై యేర్పఱుపఁబడిన పారటకూర్పుడుతాతిపై Imposing Stone ముద్రణానుకూలమగు పుటలవరుస ననుసరించి కూర్చి యినుపకట్టు Chase తో బంధింతురు. ఈకార్యమునే పారటకట్టుట Imposing యందురు. చూడుఁ డీక్రింది పటము:—

ఇందుఁ బొరటకట్టెడు విధానము చిత్రింపఁబడినది. ఈచిత్రములో A పారట కూర్పుడుతాతిని, B పారట కట్టిన ముద్రణవిషయమును బంధించుటకై యుంచిన యినుపకట్టును సూచించును. C విషయఖండమును ఇనుపకట్టుతో బిగించుట కుపయోగింపఁబడిన కఱ్ఱచట్టములను, D కఱ్ఱచట్టముల నినుపకట్టుతో దృఢముగ బంధించుట కుంపఁబడిన బిగింపుఁగఱ్ఱ మేకుల Quoins ను, 1 మొదలు 8 వఱకు గల యంకెలు పుటలుగా మార్పఁబడిన ముద్రణవిషయమును, పుటలు గూర్పవలసిన వరుసక్రమమును దెల్పును.




ప ట ము. ౪

ఇట్లు పొరట కట్టి సిద్ధముచేయఁబడిన ముద్రణీయవిషయమును Printing matter ముద్రణవిషయఖండము Forme అందురు. అట్టి విషయఖండమును ముద్రాయంత్రము నందుఁ బొందుపఱచి, దానిపైఁ గాటుక పట్టించి, దానిపైఁ గాగితమును బఱచి యాకాగితము నదుమునట్లు యంత్రమును నడిపింపఁగా, దానియందలి ముద్రణీయవిషయము కాగితముపై ముద్రింపఁబడును. ఇట్లు లొక్కొక్క మాఱును విషయఖండముపైఁ గాటుక పట్టించుచును, కాగితమును బఱచుచును ముద్రించునటుల యంత్రమును నడపుచుండవలయును. ఇట్లు గ్రంథమంతయుఁ బూర్తియగువఱకుఁ గ్రమముగా విషయఖండములను Formes సిద్ధముచేయుచు యంత్రమునం దిమిడ్చి ముద్రించుచు రావలయును. ఈతీరున విడివిడి యక్షరములతో గ్రంథవిషయమును గూర్చుచు ముద్రించుటయే యేకాక్షరనిర్మాణ పద్ధతి గల యక్షరముద్రణవిధాన మనఁబడు. ఈవిధానముననే యెల్లెడలను గ్రంథములు మున్నగునవి సామాన్యముగా ముద్రింపఁబడుచున్నవి.

*శ్రేణ్యక్షరనిర్మాణపద్ధతియందు ముద్రాక్షరాకారపు గర్భకోశములు గల Matrices యచ్చులతో గ్రంథస్థ విషయము ననుసరించి నిర్ణీతమగు విషయప్రమాణము నకు Gauge సరివచ్చురీతి నందుకై ప్రత్యేకముగ నిర్మింపఁబడిన పోతయంత్రమునందుఁ బంక్తిగాఁ గూర్చి యంత్రమును నడపఁగా, నాయచ్చులు వేఱొందు స్థలమునకుఁ దీసికొని పోఁబడి, యట సిద్ధముగఁ గరఁగి యుండిన సీస మాయచ్చులలోని యక్షరాకారపు గర్భ కోశములందుఁ బొఱి, వెంటనే యక్షరపంక్తిలోఁ గూడిన యొక పట్టెగా నేర్పడును. అంత నది యటనుండి యాయంత్రపు టడుగుభాగమం దమర్పఁబడిన అచ్చుతబుకులోనికిఁ దీసికొని పోఁబడి యందు భద్రపఱుపఁబడును. ఇట్లు గ్రంథవిషయము నచ్చక్షరములు గల సీసపుఁ బట్టెలుగాఁ బోయుచుఁ గొన్ని యచ్చుతబుకులు నిండువఱకుఁ గూర్చి, యాపై వానినిఁ బొరటకూర్చి విషయఖండముగ మార్చి యంత్రమునం దుంచి ముద్రింతురు. ఈపద్ధతియం దచ్చక్షరములు విడివిడిగాఁ బంక్తులు తీఱి యుండుటకు మాఱుగా నుపరిభాగమునం దుబ్బెత్తుగా నపసవ్యాకారపు టక్షరములు గల సీసపుఁబట్టెలు యంత్రమునం దెప్పటికప్పుడు కరఁగించి పోయఁబడును. గ్రంథమంతయుఁ బూర్తియగునంతవఱ కిట్టులే చేయవలయు. చూడుఁ డీక్రిందిపటము:—

---

* ఈపద్ధతి తెలుఁగుముద్రణమునందు లేకున్నను, సౌలభ్యమునకై తెలుఁగక్షరములతో నుదాహరణమును స్పష్టీకరించితి.

౯ం దచ్చుతెబుకును, అందు "ఓం నమః శివాయ" అను నక్షరములును బ్రదర్శింపఁ బడినవి. ఈవాక్యమును గూర్చునపుడు మొదట "ఓ" అను ముద్రాక్షరాకారపు గర్భకోశముగల యచ్చును, అంత "ం" అను ముద్రాక్షరాకారపు గర్భకోశము గల యచ్చును, ఆపైఁ గొంత యెడము గావలసి యున్నందున, వ్యవధానపుకణిక యొక్క యాకారము గలయచ్చును, ఆ



ప ట ము. ౫

వెంట "న-మ-ః" అనుముద్రాక్షరాకారపు గర్భకోశములు గల యచ్చులును, వానిప్రక్కన వ్యవధానపుకణికకుఁ జెందినయచ్చును, ఆవెనుక "శి-వా-య" అను ముద్రాక్షరాకారపు గర్భకోశములు గల యచ్చులును యంత్రసహాయమునఁ గూర్పఁబడును. ఇట్లు కూర్పఁబడిన యచ్చులు పోఁతపోయుట కనువుగ యంత్రమునం దమర్పఁబడిన వేఁటొండుకడకుఁ దీసికొని పోఁబడి యట సిద్ధముగఁ గరఁగి యుండిన సీసము వీనిలోఁ బొఱునట్లు యంత్రమును నడపఁగా నట పటమునందు B లోఁ బ్రదర్శింపఁబడినట్టుల శిరోభాగమునం దుబ్బెత్తుగా నక్షరాపసవ్యాకారములుగల సీసపుపట్టె Bar పోఁతపోయఁబడి యంత్రముక్రిం దమర్పఁ బడిన A అను అచ్చుతెబుకులోనికిఁ దీసికొనిపోఁబడును.

ఇట్లక్షరముల యచ్చులు పంక్తులు పంక్తులుగాఁ గూర్చి పోఁత పోసి గ్రంథములు ముద్రించుటయే శ్రేణ్యక్షరనిర్మాణ పద్ధతి గల యక్షరముద్రణవిధాన మనఁబడు. ఈవిధానము విశేషముగా వార్తాపత్రికలముద్రణమున కుపకరించుచున్నది.

ఫలకాక్షరనిర్మాణపద్ధతియందు గ్రంథస్థవిషయ మేకాక్షరనిర్మాణపద్ధతినిగాని, శ్రేణ్యక్షరనిర్మాణపద్ధతినిగాని యచ్చుకూర్పఁబడి విషయఖండముగ సిద్ధము చేయఁబడిన పిమ్మట, ఆవిషయఖండాకారపు గర్భకోశముగల యచ్చును దీసి దానియందు సీసమును గరఁగించి పోయఁగా నుపరిభాగమునం దుబ్బెత్తుగా నపసవ్యాకారములు గల యక్షరపంక్తులతోఁ గూడిన విషయఖండముగల సీసపుఫలకము నిర్మితమగును. చూడుఁడు పటము—౮. అందు ఎనిమిదిపుటలుగాఁ గూర్పఁబడిన విషయఖండము ప్రదర్శింపఁబడినది. ఒకొక్క యంకెయు నొక పుటను సూచించును. విషయఖండమునందలి యక్షరపంక్తు లపసవ్యాకారములుగ నుండునుగావ నందలిపుట సంఖ్యలును నపసవ్యాకారములుగఁ జూపఁబడినవి. అట్లు సిద్ధము

చేయఁబడిన విషయఖండముపై గర్భకోశముగల యచ్చును తయారుచేసి యంత్రమునం దిమిడ్చి దానిలోని గర్భకోశమునందుఁ గరఁగిన సీసము పాఱునట్లు చేయఁగా, నావిషయ ఖండమునం దుబ్బెత్తుగా నపసవ్యాకారముల నుండెడి యక్షరపంక్తులతోఁ గూడిన సీసఫలకముఁ నిర్మితమగును.

ఇట్లు నిర్మింపఁబడిన యక్షరఫలకమును ముద్రాయంత్రమునం దిమిడ్చి ముద్రింతురు. గ్రంథమంతయుఁ బూర్తియగునంతవఱ కిట్టులే చేయవలయును. ఇట్లచ్చక్షరములు గూర్చి ఫలకములుగాఁ బోఁతపోసి గ్రంథములు ముద్రించుటయే ఫలకాక్షరనిర్మాణపద్ధతిగల యక్షర ముద్రణవిధాన మనఁబడు. ఇట్టి ముద్రాక్షరఫలకములను తుత్తనాగపురేకులపైఁగాని, రాగిరేకులపైఁగాని విద్యుచ్ఛక్తిమూలమున తయారుచేయుపద్ధతిని విద్యున్ముద్రాక్షరనిర్మాణము **Electro-typy** అని యందురు. ముద్రాయంత్రములు వేగముగా నడచుచుండుటచే నీఫలకములందలి ముద్రాక్షరాకారములు చెక్కుచెదర కట్టులే యుండుటవలన నిర్దుష్టముగ లక్షలకొలఁదిగా గ్రంథప్రతులు ముద్రించుట కీఫలకాక్షరనిర్మాణపద్ధతిగల యక్షరముద్రణ విధాన మెంతయు నుపకరించుచున్నది.

ఈ యక్షరముద్రణవిధానమునందు చిత్రములు మున్నగునవి కావలసివచ్చినచో, నవి లోహపు దిమ్మెలపై ముద్రింపఁబడుచున్నవి. ఆపద్ధతి సామాన్యముగా రెండు తెఱఁగులై యుండు. రేఖారూపములగు చిత్రముల నుబ్బెత్తుగా తుత్తనాగపు రేకులపైఁగాని, రాగిరేకులపైఁగాని యంత్రసాహాయ్యమున నిర్మించుపద్ధతి ద్రావకాంకితరేఖాచిత్రఫలక నిర్మాణము **Etching or Process engraving** అనఁబడును. ఆలేఖన మొనర్పఁబడిన చిత్రపటములను, ఛాయాపటములను నుబ్బెత్తుగల చిన్నచిన్న బిందువులు **Dots** గా తుత్తనాగపు రేకులపైఁగాని, రాగిరేకులపైఁగాని యంత్రసాహాయ్యమున నిర్మించుపద్ధతి ఛాయా బిందూకృతచిత్రఫలక **Half-tone** నిర్మాణము అనఁబడును. ఇట్లు నిర్మింపఁబడిన దిమ్మెలం గొని యొక్కరంగుతోఁ గూడినవియుఁ, బెక్కురంగులతోఁ గూడినవియునగు చిత్రపటములు ముద్రింపఁబడుచున్నవి. ఇట్లు స్థూలముగా నీముద్రణవిధానమునందలి పద్ధతులను గూర్చి కొంత యిటఁ జెర్కొంటి. ఇట్టి యక్షరముద్రణము సాగుట కెన్నియో విధములగు ముద్రాయంత్రములు నిర్మింపఁబడినవి. అట్టి యంత్రములఁ గూర్చి కొంత యెఱుంగు టెంతయు నావశ్యకము.

*ఈ యక్షరముద్రణవిధానము యూరపుఖండమునందుఁ బ్రవేశపెట్టఁబడి యిప్పటికి రమారమి 400 యేండ్లు గావచ్చుచున్నవి. క్రీ. శ. 1571-1638 ప్రాంతమున విల్లెం

ఇందలి విషయములు కొన్ని ఎన్సైక్లోపీడియా బ్రిటానికా అనునాంగ్లగ్రంథమునుండి గ్రహింపఁబడినవి.

జేన్సుజేన్ బ్లో Willem Janszon Blaeu అనునాతనిచే మ్రానితో నొక ముద్రాయంత్రము నిర్మింపఁబడెను. దానిని బ్లోగారి దారుమయహస్తముద్రాయంత్రము Blaeu's wooden hand press అని పేర్కొందురు. అంత క్రీ. శ. 1753-1816 ప్రాంతమునం దీమ్రాని యంత్రమునకన్నఁ గొంత మేలుగ నుండునట్టుల ఆల్బియన్ యంత్రము Albion Press, కొలంబియన్ యంత్రము Columbian press అనునవి నిర్మింపఁబడినవి. వీనినే స్టాన్ హోపుగారి లోహమయహస్తయంత్రములు Stanhope's Iron Hand Presses అందురు ఈయంత్రములందు కాటుక పట్టించుట, కాగితముఁ బఱచుట, ముద్రించుట, మున్నగు పనులన్నియుఁ జేతితోడనే నిర్వహింపవలసియున్నందున, స్వల్పసంఖ్యాకములగు ప్రతులు మాత్రమే ముద్రించుకొనుటకు వీలగుచుండెను. అంత, అధికసంఖ్యాకములగు ప్రతులను స్వల్పకాలముననే ముద్రించుకొనుట కనువగు యంత్రనిర్మాణ మత్యావశ్యకమని తలంపఁబడినందున, క్రీ. శ. 1774-1833 ప్రాంతమున ఫ్రెడ్రిక్ కోనిగ్ Friedrich Konig అను జర్మనిదేశీయునిచే మొట్టమొదట సిలిండరు ముద్రాయంత్రము Cylinder Machine నిర్మింపఁబడినది. ఇట్టీయంత్రములగుండ ముద్రణము సాగుచు ¦వచ్చుచుండఁగా, పందొమ్మిదవ శతాబ్దమధ్యమునందుఁ బలుతెఱంగులగు ముద్రాయంత్రములు నిర్మింపఁబడినవి. అవి యీక్రింది తరగతులఁ బేర్కొనంబడు:—

1. ఆల్బియన్, లేక కొలంబియన్ హస్తముద్రాయంత్రములు.—ఇవి కొద్దిప్రతులు మాత్రమే ముద్రించుట కుపయోగించును.

2. చిన్నవి యగు ప్లేటను యంత్రములు Small platen machines.— వీనిని కాలితోఁగాని, విద్యుదాది శక్తులమూలమునఁగాని నడపనగు. ఇవి చిన్నచిన్న కరపత్రములు, ప్రకటనలు, చీటీలు మున్నగు చిల్లర యచ్చుపనులు చేసికొనుట కుపకరించును.

3. ఒంటి సిలిండరుయంత్రములు Single Cylinder machines.—వీనినే సామాన్యముగా నింగ్లీషునందు వార్ఫుడేల్సు Wharfedalesఅని యందురు. ఈయంత్రములందు పని వేగముగ సాగును. కాని, వీనియం దేకకాలమునఁ గాగితము నందలి యొకప్రక్క మాత్రమే ముద్రింప వీలగును.

4 విభిన్నకార్యనిర్వాహకములగు రెండుసిలిండర్లతోఁ గూడిన పరిపూరకయంత్రములు Perfecting machines.— ఈయంత్రములందు పనులు చాల వేగ

ముగా సాఁగఁగలవు. వీనియందుఁ బ్రవేశించిన కాగితములు రెండుప్రక్కలను ముద్రింపఁబడిన పిమ్మటనే వెలికి వచ్చును. ఇట్లు కాగితములఁ బూర్తిగ అనఁగా రెండువైపుల నేకకాలమున ముద్రించి యిచ్చుచుండునుగాన, నివి పరిపూరక యంత్రము లనఁబడుచున్నవి.

5. ద్విపరిభ్రమణయంత్రములు Two revolution machines.—ఇవియొక్కసిలిండరుతోఁ గూడియుండినను, నధికసంఖ్యాకములగు ప్రతులను శ్రేష్ఠతరమగు రీతిని ముద్రించుట కనువైయుండుటవలన, రెండుసిలిండర్లతోఁ గూడిన పరిపూరక యంత్రములకన్న మిన్నలై వానిస్థానము నాక్రమించినవి.

6. ద్వివర్ణకయంత్రములు Two colour machines.—ఇవి యొంటి సిలిండరుతోఁ గూడియుండినను, యంత్రములయొక్క రెండుకొనలయందును నొక ముద్రణ తలమును, వర్ణకోపకరణమును నుండున ట్లమర్పఁబడియుండును. ఒకొక్కప్పుడీయంత్రములు రెండుసిలిండర్లతోఁ గూడ నిర్మింపఁబడుటయుఁ గలదు. ఇవి యేక కాలమున రెండురంగులతో ముద్రించుట కనువైయుండు.

7. వలయగతియంత్రములు Rotary machines.—ఇవి మిక్కిలి పొడవుగల కాగితపుఁ జుట్టలపై ఫలకాక్షరంపు రేకులతోఁగాని, విద్యున్ముద్రాక్షరంపు రేకులతోఁ గాని ముద్రించుట కనువైయుండు. ఈయంత్రములు ముఖ్యముగా నధిక సంఖ్యాకములగు ప్రతులుగల వార్తాపత్రికలు, పక్షపత్రికలు, మాసపత్రికలు మున్నగునవి ముద్రించుట కెంతయు నుపకరించుచున్నవి. ఈయంత్రములం దుపయోగింపఁబడెడి కాగితపుఁజుట్టల పొడవు 5 మైళ్లుండును.

ఇటీవల విశేషములగు మార్పులతో నీముద్రాయంత్రనిర్మాణవిధాన మెంతయు నభివృద్ధిపఱుపఁబడినది. ఏకకాలముననే పెక్కురంగులు ముద్రించుట కనువగు యంత్రములు సైతము నిర్మింపఁబడినవి. ఇది ముద్రాయంత్రములయొక్క స్థూలవర్ణనము. ఇఁక నిట్టి యంత్రములమూలమున గ్రంథముద్రణ మొనరించుటకై నిర్మింపఁబడెడి ముద్రాక్షరము లందలి విశేషములఁ గొంత యెఱుంగు టత్యంతావశ్యకము.

ఈ ముద్రాక్షరముల స్థూలపరిమాణములు Bodies బిందువు Point అనునొక కొలతనుబట్టి నిర్ణయింపఁబడుచున్నవి. ఒకబిందువు పైకా Pica అను నక్షరప్రమాణము నందు $\frac{1}{12}$వ భాగము. ఇట్టి బిందువు నాధారముగఁగొని పెక్కురకములగు నక్షరపరిమాణములు నిర్ణయింపఁబడియున్నవి. వానిలోఁ గొన్నింటి నిటఁ జేర్చుచున్నాఁడను. చూడుఁడీప్రక్కపుటలోని పట్టికను:—

## అక్షరపరిమాణములు.

| పరిమాణనామములు | పరిమాణ రూపములు | బిందు వులు |
|---|---|---|
| గరిష్ఠప్రాథమికము=గ్రేటుప్రయిమరు Great primer | ■ | 18 |
| దివ్యము=ఇంగ్లీషుబాడి English body | ■ | 14 |
| పైకము=పైకా Pica | ■ | 12 |
| కనిష్ఠపైకము=స్మాలుపైకా Small pica | ■ | 11 |
| కనిష్ఠప్రాథమికము=లాంగుప్రయిమరు Long primer | ■ | 10 |
| నాగరకము=బర్జాయిసు Bourgeois | ■ | 9 |
| హ్రస్వము=బ్రివియరు Brevier | ■ | 8 |
| సుందరము=మినియను Minion | ■ | 7 |
| నిరుపమము=నన్పేరిలు Nonpariel | ■ | 6 |
| మౌక్తికము=పెరల్ Pearl | ■ | 5 |
| వజ్రము=డయమండు Diamond | ■ | 4½ |

ఇట్లు 96 బిందువులపరిమాణమువఱకచ్చక్షరములు నిర్మింపఁబడుచున్నవి. ఈబిందు ప్రమాణము అమెరికా-యూరపుల కొలతలఁబట్టి యించుక భిన్నముగ నుండు. నేనిట నమెరికాపద్ధతినే పేర్కొంటి. ఈయచ్చక్షరముల ముఖనిర్మాణమునందు ముత్తెఱంగులగు భేదములు పాటింపఁబడుచున్నవి:—

1. సామాన్యాక్షరములు Roman types.— ఇవి యక్షరముఖములు పలుచనై సన్నని యూర్ధ్వరేఖలతోడను Up stroke lines, నించుకస్థూలములగు నధోరేఖలతోడను Down stroke lines గూడియుండునట్లు నిర్మింపఁబడును.

2. స్థూలాక్షరములు Antique types.— ఇవి యక్షరముఖములు స్థూలములగు నూర్ధ్వరేఖలతోడను, స్థూలతరములగు నధోరేఖలతోడను గూడి యుండునట్లు నిర్మింపఁబడును. ఈయక్షరములు చూచుటకు స్థూలములై కన్పట్టుచుండు.

3. నమ్రాక్షరములు Italic types — ఇవి యక్షరముఖము లించుక యేటవాలుగా కుడివైపునకుఁగాని, యెడమవైపునకుఁగాని యొఱిగి యుండునట్లు నిర్మింపఁబడి యుండును ఇవి సామాన్యాక్షరములుగను, స్థూలాక్షరములుగను గూడ నిర్మింపఁబడెడిని.

సామాన్యాక్షరముద్రితవిషయమధ్యమునం దేవేని ముఖ్యము లగుపంక్తులు చూచిన వెంటనే కనులకు గోచరించునట్లు ముద్రించుట కీస్థూలాక్షరములును, నమ్రాక్షరములును నుపకరించుచున్నవి. ఇట్లు ముత్తెఱంగులగు నీభేదములఁ బాటించుచు నెన్నియోరకము లగు నక్షరముఖములు గల్పింపఁబడెడిని. ఒక్కొక రకముతోఁ గూడిన ముద్రాక్షర సముదాయ మొక్కొక పేరుకుఁ జెందినయక్షరపరంపర Type Series క్రింద సూచింపఁ బడును. ఆపరంపరలఁ గొన్నింటి నిట పేర్కొనెద. అవి అలెక్జాండ్రా Alexandra, అగస్టన్ Augustan, చాట్సువర్త్ Chatsworth, చెల్టనుహాం Cheltenham, క్లారెండన్ Clarendon, కొలంబియన్ Columbian, డివైన్ De vinne, జియార్జియన్ Georgeon, మెకాలె Macaulay, సాక్సను Saxon, షేక్సుపియరు Shakespeare, వేవర్లి Waverley మున్నగునవి. ఎన్నియని వ్రాయఁగలను! ఇట్టి యక్షరపరంపర లెన్నియో గలవు. ఒక్కొక పరంపరయందును 4½ బిందువులనుండి, 96 బిందువులవఱ కచ్చక్షరములు గలవు. "వ్రతానాముత్తమం వ్రతం" అనునట్టుల దేని కది మిన్నయై యొక్కొక్క పరంపరయుఁ గన్నులకు విందొనరించుచుండు. ముద్దులు మూటగట్టు నీరోమ కాక్షరముఖముల Roman type faces నెంతసేపు చూచినను మఱల మఱలఁ జూడవలయుననియే యుండునుగాని తనివి గలుగదు. ఇఁక నిట్టి ముద్రాక్షరములతో నచ్చొత్తించుట కనువుగ నిర్మింపఁబడెడి కాగితములఁ గూర్చి కొంత యరయుదము.

కాగితములలో సాధారణముగా వ్రాఁతకాగితములనియు, అచ్చుకాగితము లనియు రెండు ప్రధానవిభాగములు గలవు. అచ్చుకాగితములు సామాన్యముగా స్థూలపత్రములు Rough papers, స్నిగ్ధపత్రములు Glazed papers, పర్ణభారపత్రములు Feather weight papers అని ముత్తెఱంగు లైయొప్పు:—

1. స్థూలపత్రములు.—ఈకాగితములు మఁతుకలై యుపరిభాగములందుఁ గఱకు గల్గి యుండును. ఇవి కరపత్రములు, సూచీపుస్తకములు, ప్రకటనలు మున్నగు తాత్కాలికములగు ప్రచురణములు ముద్రించుట కనువై యుండు. శోధనపత్రములు Proof sheets సాధారణముగా నీకాగితములందే ముద్రితము లగుచున్నవి. ఈకాగితములందుఁ బలుతెఱంగులగు రంగులతోఁ గూడినవియుఁ గలవు.
2. స్నిగ్ధపత్రములు.—ఈకాగితములు మందములై యుపరిభాగములందు నునుపు గల్గి యుండును. ఇవియే సామాన్యముగా గ్రంథముద్రణమున కుపయోగింపఁ బడుచుండును. ఈకాగితముల దళసరి హెచ్చుకొలఁది వీనియందు ముద్రితము లగు గ్రంథములబరువు హెచ్చుచుండును. వీనియందుఁ బెక్కురకములు గలవు.

3. పర్ణభారపత్రములు.—ఈకాగితములు మందములుగ నున్నను జాలతేలికగ నుండును. వీనిలోఁ గొన్ని రకములం దుపరిభాగము నునుపుగను, కొన్నిరకములం దుపరి భాగము కఱకుగను నుండును. ఈకాగితము లెంత దళసరులైనను, జేతఁ బట్టినచో నీఁకవలెఁ జాల తేలికగ నున్నందున, పర్ణభారపత్రము లనఁబడుచున్నవి. ఇవి గ్రంథ ముద్రణమున కత్యుత్తమము లైనవి. ఈకాగితములతో ముద్రితములైన గ్రంథ ములు వందలకొలఁదిగ యేండ్లు గడచినను నేమాత్రము నశింపకుండును. ఇట్టి యీ పత్రములపై నచ్చొత్తింపఁబడిన పుస్తకము లెంత లావైనవిగ నున్నను, జేతఁ బుచ్చుకొనినపుడు తూలమువలెఁ జాల తేలికవై చేతి కేమాత్రమును శ్రమము గల్గింపక పాఠకులకు వింత గొల్పుచుండఁగలవు.

పైనిఁ జెప్పఁబడిన ముత్తెఱంగులగు కాగితములు గాక, విధవిధములగు రంగులతోఁ గూడి పెక్కు రకముల నొప్పుచుండునవియుఁ గలవు. ఇరువది దస్తాలు—అనఁగా 500 కాగిత ములు గల రీము Ream అను కాగితపు దొంతరయొక్క తూనికనుబట్టి యీకాగితముల దళసరి నిర్ణయింపఁబడుచుండు. ఈయచ్చుకాగితములు భిన్నభిన్నములగు ప్రమాణములు గల పుస్తకముద్రణముల కనుకూలించురీతి భిన్నభిన్నములగు పరిమాణములు గల్గియుండు. అట్టి కాగితపుఁబరిమాణములఁ గొన్నింటి నీక్రింద సూచించుచున్నాఁడః—

**కాగితపుఁబరిమాణములు.**

| పరిమాణనామములు | వెడల్పు వైపుకొలత అంగుళములు | మడత వైపుకొలత అంగుళములు |
|---|---|---|
| ఉత్తమద్వయము=డబుల్ రాయలు Double Royal | 25 ×40 | 20 ×25 |
| ఖండద్వయము=డబుల్ డెమ్మి Double Demy | $22\frac{1}{2}$×35 | $17\frac{1}{2}$×$22\frac{1}{2}$ |
| శేఖరద్వయము=డబుల్ క్రవును Double Crown | 20 ×30 | 15 ×20 |
| మూర్ఖశిరస్కద్వయము=డబుల్ ఫూల్సుకేపు Dbl. Foolscap | 17 ×27 | $13\frac{1}{2}$×17 |
| శ్రేష్ఠము=ఇంపీరియల్ Imperial | 22 ×30 | 15 ×22 |
| అత్యుత్తమము=సూపరు రాయల్ Super Royal | $20\frac{1}{2}$×$27\frac{1}{2}$ | $13\frac{3}{4}$×$20\frac{1}{2}$ |
| ఉత్తమము=రాయల్ Royal | 20 ×25 | $12\frac{1}{2}$×20 |
| మధ్యమము=మీడియం Medium | 18 ×23 | $11\frac{1}{2}$×18 |
| ఖండము=డెమి Demy | $17\frac{1}{2}$×$22\frac{1}{2}$ | $11\frac{1}{4}$×$17\frac{1}{2}$ |
| శేఖరము=క్రవును Crown | 15 ×20 | 10 ×15 |
| మూర్ఖశిరస్కము=ఫూల్సుకేపు Foolscap | $13\frac{1}{2}$×17 | $8\frac{1}{2}$ ×$13\frac{1}{2}$ |

ఇట్లు కాగితములఁ గూర్చి యిట కొంత సంగ్రహముగ ముచ్చటించితి.

పైనిఁ జెర్కొనఁబడిన పలుతెఱంగులగు ముద్రాయంత్రములు, చిత్రవిచిత్రములై నేత్రానందసంధాయకములగు ముద్రాక్షరములు, రకరకములగు కాగితములు, పలువన్నెలు గల కాటుకలు, మున్నగు నిట్టి పరికరములతో నేఁ డమెరికా యూరపుఖండములందు ముద్రణకార్యములు నిర్వహింపఁబడుచున్నవి. పాకెట్టు క్లాసిక్కు Pocket classics లేమి, పీపిల్సు లైబ్రరీ సీరీసు People's Library Series లేమి, స్కాట్సు లైబ్రరీ సీరీసు Scott's Library Series లేమి, సెల్ఫు స్టడీ షేక్సుప్పియరు Self-study Shakespeare లేమి, పిక్చరు షేక్సుప్పియరు Picture Shakespeare లేమి, ప్లెయిన్ టెక్స్టు షేక్సుప్పియరు Plain text Shakespeare లేమి, గ్లోబు ఎడిషను Globe Editions లేమి, లైబ్రరీ ఎడిషను Libray Editions లేమి, ప్రెజంటేషను వాల్యూము Presentation Volumes లేమి, ఇట్లు పెక్కు పేరులతో వందలకొలఁదిగ గ్రంథమాలలు వెలువడుచున్నవి. ఒక్కొక గ్రంథమును మూర్ధశిరస్కము, శేఖరము, ఖండము, మున్నగు ప్రమాణములలో వెవ్వేఱు విధములగు కాగితములతో, వెవ్వేఱు విధములగు ముద్రాక్షరములతో ముద్రితమై పలురకముల వెలయుచున్నవి. ఏరకమును జూచినను గొనవలయుననియే యుండును. ఏగ్రంథమాలప్రచురణమును జూచినను గొనవలయుననియే యుండును. పుస్తకములా పలువన్నెలు గల వస్త్రాచ్ఛాదనములతో నలంకృతములై, సువర్ణాక్షరనామాంకితములై, చూపఱుల కనులకు మిఱుమిట్లు గొలుపుచుండును. పామరజనులకు సైతము గ్రంథమును జేతఁ బుచ్చుకొని చూడవలయునను యాసవొడమక మానదు. ఇఁకఁ బండితులవిషయమై చెప్పెడిదేమి? ఈతీరున గ్రంథప్రచారరక్షణములకుఁ బ్రధానసాధనమై యీయక్షరముద్రణవిధానమెంతయు నగ్రస్థానము వహించియున్నది. ఇట్టి యీముద్రణకళ మిక్కిలి శ్రద్ధతో నమెరికా-యూరపుఖండములం దెంతయేని నభివృద్ధికిఁ దేఁబడినదని వాకొనుట కెంతయు సంతసము గల్గుచున్నది. ఇట్టి యపూర్వశక్తిగల యీశిల్పము

> "అక్షరములనుగాని, చిత్రములు మున్నగువానినిగాని, కాటుకమూలమునను, పలుతెఱంగులగు రంగులమూలమునను, కాగితములమీఁదనైనను, స్నిగ్ధములగు లోహంపురేకులు మున్నగువానిమీఁదనైనను, బలముగు సంఘట్టనమువలన నంటుకొనునట్లు చేసెడి శిల్పము ముద్రణకళ యనఁబడు."

అని నిర్వచింపఁబడినది. ఈముద్రణకళయందలి విషయము లన్నియు వ్రాయఁబూనినచో, నదియొక గొప్పగ్రంథము కాఁగలదు. అట్టి రచన కిది యదను గాదుగాన, నీకళయందలి ప్రధానాంశముల స్థూలవర్ణనము మాత్రము గొంత సంగ్రహముగ నొనరించితి. నేఁ డీముద్రణకళ భారతదేశమునం దెల్లకడలను వ్యాపించి, పెక్కు భారతీయభాషలలో గ్రంథములు మున్నగునవి ముద్రితములై వెలువడుచున్నవి. అట్టిభారతీయభాషాశ్రేణిలో మూఁడవదై యొప్పుచున్నదని పేరెన్నికగన్న మన యీ తెలుంగుబాసలో నీముద్రణకళ యెంతవఱకభివృద్ధిం గాంచినదో కొంత యిట విచారించు టప్రస్తుతముగాఁజాలదుగాన, నావిషయముం బరికింతము

రమారమి క్రీ. శ. 1806-వ సంవత్సర ప్రాంతమున నీయక్షరముద్రణవిధానము మన తెలుఁగువారియందుఁ బ్రారంభమైన దనియు, నంతకుఁ బూర్వ మొక శతాబ్దమునకు ముందుండియే అఱవవారిలో నీముద్రణవిధానము వాడుకలో నుండినదనియు, క్రీ. శ. 1830 వఱకు తెలుఁగుముద్రణ మంతగా వృద్ధిపఱుపఁబడ లేదనియు, నించుమించుగా క్రీ. శ. 1835-వ సంవత్సరమునుండియే మద్రాసునగరమునందుఁ దెలుంగునందును, సంస్కృతమునందును గొన్ని పద్యకావ్యములు ముద్రింపఁబడినవనియు, అనంతరము అనఁగా క్రీ. శ. 1852 మొదలు హిందువులచే నిర్వహింపఁబడుచుండిన తెలుఁగు ముద్రణాలయములనుండి యవిచ్ఛిన్నముగ గ్రంథములు ముద్రితములై వెలువడుచుండినవనియు, నప్పటి కాంగ్లేయుల నిర్వహణముక్రిం దుండినవి గాక, హిందువుల నిర్వహణముక్రిం దథమపక్ష మెన్మిది తెలుఁగు ముద్రాక్షరశాలలు పనిచేయుచుండినవనియు, తెలుఁగునందును నఱవమునందును వార్తాపత్రికలు గలవనియు సి. పి. బ్రౌనుదొరగారి వ్రాఁతనుబట్టి తెలియుచున్నది.* ఆరోజులయం దచ్చుయంత్రములు, కాగితములు, కాటుకలు మున్నగు ముద్రణోపకరణము లాంగ్లేయులమూలమున లభించుచుండినవి. వానిం గొని మన యఱవమిత్రులు తమబుద్ధిబలమును వినియోగించి, ముద్రణానుకూలముగ నుండు రీతిని దమ ద్రవిడభాషావర్ణములన్నింటి కచ్చక్షరములను నిర్మించుకొని తమయక్షరముద్రణవిధానమును గ్రమక్రమముగ వృద్ధిలోనికిఁ దెచ్చుచువచ్చిరి. మన తెలుఁగుభాషయందును నట్టులే భాషయందలి యక్షరము లన్నింటి కచ్చక్షరములు నిర్మింపఁబడి ముద్రణము సాగుచుండెను.

---

* "Printing has been used among the Tamils for more than a century. Among the Telugus it commenced about the year 1806 but made little progress until 1830. About 1835 some of the Telugu and Sanskrit poems were printed at Madras. At present many volumes continually issue from Telugu presses managed by Hindus alone. There are at least eight such presses, at work, besides those which are under the management of Englishmen. Native news papers, both Telugu and Tamil exist."

Preface to Telugu-English Dictionary by C. P. Brown, published in 1852 A. D.

కాని, అఱవమునందు సాగినంత వేగముగాఁ దెలుఁగునం దచ్చుపనులు సాగుటకు వీలుగా కుండెను. కొన్ని తెలుఁగు ముద్రాక్షరము లచ్చుకూర్పరులకుఁ జాల విసుగుఁ బుట్టించుచుఁ, దెలుఁగునం దచ్చుకూర్చుట చాల శ్రమమని యనిపించుకొనుచుండెను. అందు ముఖ్యముగా రేఫముయొక్క రూపాంతరమగు నర్ధచంద్రాకారపు [◡] క్రారావడి మిక్కిలి శ్రమమును గల్గించుచుండినది. దీనిని సి. పి. బ్రౌనుదొరగారు సంస్కరించి "ు, ౣ" యిట్టిరూపములతో నిర్మించినందునఁ, గూర్పరులకు శ్రమము గొంత తగ్గి, అచ్చుకూర్పుడుపను లించుక వేగముగ సాగుచువచ్చెను. నాఁటినుండి యీక్రొత్తరకపు రేఫరూపాంతరములకు "బ్రౌను క్రారావళ్లు" అని ప్రసిద్ధి గల్గెను.* ఇట్టు లీతెలుఁగు ముద్రణము సాగుచుండఁగా, కాలక్రమమున తెలుఁగు ముద్రణమునందు గ్రంథములకు పుటసంఖ్యలు వేయుట, పుటల యుపరిభాగములందు వరుసక్రమమున గ్రంథనామాదు లుంచుట; వాక్యాంశబిందువు (,) బిందువు (.), అర్ధబిందువు (;), న్యూనబిందువు (:), ప్రశ్నార్థకచిహ్నము (?), రాగచిహ్నము (!) మున్నగు విరతులను; గ్రంథపృష్ఠాధోభాగమందలి వివరణముల Foot notes సూచించు తారకము (*), ఖాయు (†) మున్నగు చిహ్నముల నుపయోగించుట; గ్రంథాధ్యాయవిభాగము చేయుట, పదములమధ్యములం దెడము వదలుట, యను నీపద్ధతులు క్రొత్తగఁ బ్రవేశపెట్టఁబడి నానాఁటి కవి విశేషముగా వాడుకలోనికి వచ్చుచుండినటుల క్రీ. శ. 1860-1870-వ వత్సరములందు ముద్రింపఁబడిన తెలుఁగుగ్రంథములనుండి తెలియుచున్నదని సి. పి. బ్రౌనుదొరగారివ్రాఁతనుండి మనము గ్రహించుచున్నారము. † దీనినిబట్టి యాలోచింపఁగా, తెలుఁగునం దక్షరముద్రణవిధానము తలపెట్టఁబడి నేఁటికి 135 వత్సరములు గావచ్చుచున్నవనియు, తెలుఁగునందు గ్రంథముద్రణము ప్రారంభమై రమారమి 100 వత్సరములు గావచ్చుచున్నవనియు, తెలుఁగులిపికిఁ గల సంస్కరణావశ్యకత యానాఁడే కనుఁగొనఁబడినదనియు, విరతులు మున్నగు చిహ్నములు తెలుఁగుముద్రణమునందుఁ బ్రవేశపెట్టఁబడి యిప్పటికి 71 వత్సరములు గావచ్చుచున్నవనియు సారాంశము తేలినది.

ఇట్లింతకాలముగాఁ దెలుఁగునం దచ్చుపనులు సాగుచున్నను, ముద్రణవిధానము మాత్రము పెక్కు లోపములకు లోనై, తోడి ద్రావిడభాషలకన్న నెంతయో వెనుకఁ

* "In those days Telugu printing was tedious because the (Crara) letter R was shaped as a cup containing another letter. To remedy this I invented two substitutes, one resembling a rectangle like "L" the other like the numeral "9". The compositors found that this contrivance removed the difficulty."
C. P. Brown.

† "Numerals of pages, running titles, printer's stops, divisions of chapters, and (in a slight degree) spaces between words; all these and other innovations are coming more and more into vogue as I perceive in the Telugu volumes printed in 1860 and 1870."
C. P. Brown.

బడియున్న దనక తప్పదు. గ్రంథములు హృదయాకర్షకములుగ నుండునట్లు ముద్రించుటకుఁ బలురకములగు ముద్రాక్షరము లత్యావశ్యకము లైయున్నవి. అవి మనకుఁ జాల తక్కువ. మనకుండునవెల్ల గ్రేటుప్రయిమరు హెడింగు Great primer heading, టూలైను ఇంగ్లీషు బాడి Two line English body, గ్రేటుప్రయిమరు Great primer, ఇంగ్లీషు బాడి English body,* లాంగు ప్రయిమరు Long primer, అను నీయైదురకములగు నచ్చుక్షరములే. అందు గ్రేటుప్రయిమరు, ఇంగ్లీషుబాడి అను నీరెండురకములగు నక్షరములే సామాన్యముగా గ్రంథవిషయముద్రణమున కుపకరించుచున్నవి. ఇట్లుండఁగాఁ గొంతకాలమునకు గ్రేటుప్రయిమరు నందు ఆంటిక్కులు-అనఁగా స్థూలాక్షరములు గల్పింపఁబడినవి. ఈముద్రాక్షరములతోడనే నేఁటికిని తెలుఁగుముద్రణము సాగుచున్నది. ఇటీవల అనఁగా క్రీ. శ. 1935, 1937, 1938, సంవత్సరములందుఁ గొన్ని ముద్రాక్షరనిర్మాణకార్యాలయములందు 10 బిందువులనుండి 108బిందువులవఱకుఁ బరిమాణములుగల యచ్చుక్షరములు క్రొత్తగ నిర్మింపఁబడినవి. కొన్ని యక్షరముఖములకు శంకర్, భవాని, మారుతి, రంగనాథ్ మున్నగు పరంపరనామము లిడఁబడినవి. నెల్సను సీరీసులును, నెల్సను ఆర్న మెంటల్-అవుటు లైను-స్టారులను నలంకారవర్ణములు Ornamental Types ను, ఆరుముగం సీరీసులును వెల్వడినవి. ప్రకటనల కనుకూలించు పెద్దపెద్ద యక్షరములు గూడ వెల్వడినవి. తెలుఁగు ముద్రాక్షర చరిత్రమునందిది యొక నూతనయుగప్రారంభ మనఁజను. ఇట్లు నూతనముగ ముద్రాక్షరములను బిందుపరిమాణపద్ధతిని నిర్మించి యీముద్రాక్షరనిర్మాణకార్యాలయాధిపు లాంధ్రభాషాసేవ యొనర్చిన దెంతయుఁ బ్రశంసనీయము. వీరందఱును ముద్రాక్షరసంఖ్యను తగ్గించుటకుఁ బ్రయత్నించిరి. ఒకరు 14 బిందువులనుండి 54 బిందువులవఱకక్షరపరిమాణముగల ముద్రాక్షరములసంఖ్యను 428 కిని, ఒకరు 24 బిందువులనుండి 72 బిందువులవఱకక్షరపరిమాణముగల ముద్రాక్షరములసంఖ్యను 266 కును, ఒకరు 10 బిందువులనుండి 24 బిందువులవఱకక్షరపరిమాణము గల ముద్రాక్షరములసంఖ్యను 405 కును, 30 బిందువులనుండి 108 బిందువులవఱకక్షరపరిమాణముగల ముద్రాక్షరముల సంఖ్యను 140 కిని వచ్చునట్లు ముద్రాక్షరనిర్మాణపద్ధతియందుఁ గొంత మార్పు గల్గించి, యక్షరసంఖ్యను గొంతవఱకు తగ్గించిరి. కాని, 10 బిందువులనుండి 30 బిందువులవఱకక్షరపరిమాణముగల ముద్రాక్షరములసంఖ్యను మాత్ర మెవ్వరును 405 కంటె తగ్గింపలేరైరి. ఏల? గుణితాక్షరములను స్వరవర్ణరూపాంతరములతోఁ గలిపి పోయుటవలన. అట్లు చేయక ఇకార-ఎకారముల

* దీని క్రమపడి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారే మొదట పోతపోయించిరి.

రూపాంతరములగు గుడి ( ి ), ఎత్వము ( ె ) ఈరెండువర్ణములు తప్ప మిగిలిన స్వరవర్ణ రూపాంతరముల నన్నిటిని వ్యంజనవర్ణముల ప్రక్కన నతికించుకొనునట్లు విడివిడిగా నిర్మించి యుండినచో నక్షరసంఖ్య యెంతయో తగ్గియుండును గదా. అదెట్లు సాధ్యమగునందురా? చెప్పెద నాలకింపుఁడు. మన తెలుఁగులిపియందలి స్వరవర్ణముల రూపాంతరములకును, దీని సోదరీలిపులగు నాగరీ, బెంగాలీ, గుజరాతీ, ఓఁడ్రము, కన్నడము, అరవము, గ్రంథము, మలయాళము మున్నగువాని స్వరవర్ణరూపాంతరములకును బరస్పరసంబంధము గలదు. ఆలిపులన్నింటియందును స్వరవర్ణముల రూపాంతరములు చాలవఱకు వ్యంజనవర్ణములకుఁ బ్రక్కన నతికించుకొనుట కనుపైయుండఁగా, తెనుఁగునందు మాత్ర మట్టులేల లేకపోవును? ఉదాహరణమునకు దీర్ఘమును దీసికొని పరీక్షింతము. చూడుఁడీక్రింది పట్టికను:—

ा, া, ા, ା, ಾ, ா, ா, ാ

ఇవి క్రమముగా నాగరీ - బెంగాలీ - గుజరాతీ - ఓఢ్ర - కర్ణాటక - ద్రవిడ - గ్రంథ-మలయాళ దీర్ఘములయాకృతులు. ఇవన్నియు వ్యంజనవర్ణముల ప్రక్కనఁ జేర్పఁబడుచున్నవి. ఇందు వట్రువలగు నాకారములుగల కర్ణాటకమలయాళలిపులదీర్ఘములు లిప్యనుగుణముగా నట్లు వలయాకృతులం దాల్చినవో కనుఁడు. ఈకర్ణాటక (ಾ) దీర్ఘమే మన తెలుఁగుదీర్ఘము ( ా ). శాసనలిపులనుబట్టి చక్కఁగఁ బరీక్షించి చూతుమేని, తెలుఁగు స్వరవర్ణరూపాంతరములును, ఇతరభాషాస్వరవర్ణరూపాంతరములును నొక్కటే యనుట తెల్లము గాకపోదు. ఇట్లీ స్వరవర్ణరూపాంతరములఁ బరీక్షింపఁగా, ఇకార-ఎకారములు మాత్రము కొన్నిలిపులందుఁ గొద్దిగ వ్యంజనవర్ణములమీఁదికి వాలియున్నవనియు, ఇతర స్వరవర్ణరూపాంతరములు సాధారణముగా వ్యంజనవర్ణముల ప్రక్కన నంటియున్నవనియుఁ దెలియుచున్నది. ఇంత యేల? మన తెలుఁగులిపికి సన్నిహితమగు కర్ణాటకలిపిని బరీక్షింపుఁడు. అందు ఇకార ( ి ) ఎకార ( ె ) ములు మాత్రమే వ్యంజనవర్ణముల శిరస్సులపై నెక్కినవి; తక్కినవన్నియుఁ బ్రక్కనఁ జేర్పఁబడునవే. విషయమిట్టు లుండఁగా నది యేమి కర్మమో గాని నేటికిని మనతెలుఁగునందలి స్వరవర్ణరూపాంతరము లెల్ల వ్యంజనవర్ణముల తలలపై నెక్కింపఁబడుచున్నవి. ఇట్లు చేయుటవలనఁ గల్గెడి నష్ట మేమిటో యెవ్వరైన నాలోచించిరా? గుణితాక్షరములను గలిపి పోయవలసినట్లు లేర్పడినది. తన్మూలముననక్షరములసంఖ్య 405 కంటె తగ్గించుటకు వీలుగాకపోయినది. అందువలన రకరకములగు నక్షరముఖములు నిర్మించుట దుష్కరములైనవి. ఇట్లు గ్రంథముద్రణమున కావశ్యకములగు స్థూలాక్షరములును, సూక్ష్మాక్షరములును లేకపోవుటవలన నొక అకారాదినిఘంటువును

సలక్షణముగ ముద్రించుటకుఁ దెలుఁగునందు సాధ్యము గాకున్నది. మచ్చునకు శబ్దరత్నాకరమునుండి యొక పదమునకుఁ జెందిన ముద్రణము నీక్రిందఁ బ్రదర్శించుచున్నాఁడ. చూడుఁడు:—

> కుముద. సం. వి. అ. స్త్రీ. 1. గుమ్మఁడు; 2. టేఁకు. అ. న. ము. 1. ఎఱ్ఱదామర; 2. తెల్ల గలువ. పుం. ము. 1 నిర్ఋతిదిక్కునందలి యేనుఁగు; 2 ఒకానొకపాము.

ఇట్లు ముద్రింపఁబడినది. ఇందు కుముద అనుపదమునకు మూఁడు లింగములందును నర్థములు తెల్పఁబడినవి. అట్లు తెల్పునపుడు స్త్రీలింగరూపము మొదటనే యున్నందునఁ గొంత తెలియుచున్నది. నపుంసకలింగరూపమునకును, బుల్లింగరూపమునకును అమహద్వాచకమును సూచించు మువర్ణకములు మాత్రము చేర్పఁబడి యున్నందున, వానిని వెదకి కనుఁగొనవలసియున్నది. ఇవియే స్థూలాక్షరములతో ముద్రితము లై యుండినచోఁ దడుముకొనక పదముల నెక్కడివక్కడ సులభముగఁ గనుఁగొనవచ్చును. చూడు డీక్రింది పటము:—

> **కుముద. సం. వి. అ. స్త్రీ. 1 గుమ్మఁడు; 2 టేఁకు. అ. న. కుముదము. 1 ఎఱ్ఱదామర; 2 తెల్లగలువ. పుం. కుముదము. 1 నిర్ఋతిదిక్కునందలి యేనుఁగు; 2 ఒకానొకపాము.**

పటము. ౧

ఇందు మొదటగల స్త్రీలింగరూపమగు "కుముద" అనుపదమును, నపుంసకలింగ పుంలింగములందలి యమహద్వాచకములగు "కుముదము" అనుపదములును నందలి యర్థవివరణపదములకన్న నెంత స్ఫుటముగఁ గనఁబడుచున్నవో గమనింపుఁడు. ఇట్లు ముద్రించుటకు స్థూలాక్షరము లత్యంతావశ్యకము లై యున్నవి. అవి మనకేవీ ?

ఈపటమునందుఁ బ్రదర్శింపఁబడిన యక్షరములు ప్రాచీనశాసనముల ననుసరించి సంస్కరింపఁబడినవి. వీనియుపరిభాగములును, నధోభాగములును నెగుడుదిగుడుగా నుండక సమాంతరరేఖలలో నడంగి చక్కఁగఁ బంక్తులు దీరి యుండుటం గనుఁడు. విడివిడిగా నిర్మింపఁబడిన స్వరవర్ణములరూపాంతరములు వ్యంజనవర్ణములతో నెట్లు గలిసికొను

చున్నవో గమనింపుఁడు. ఈయక్షరములం దికార-ఎకారములు ( ి - ె ) మాత్రమే వ్యంజనవర్ణముల శిరోభాగములందుఁ గూర్పఁబడుచున్నవి. ఇతర స్వరవర్ణరూపాంతరములన్నియు వ్యంజనవర్ణముల ప్రక్కనఁ గూర్పఁబడునవే. ఈయక్షరముల రేఖలచివళులందుఁ గన్పట్టెడు సన్నని యడ్డుగీట్లు అక్షరములకును నక్షరపంక్తులకును శోభను గల్పించుచు, స్వరవర్ణములరూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ గూర్పఁబడునపుడు వానికూడికలు విడివిడిగా నుండక చక్కఁగఁ గలిసికొనునట్లు చేయుట కెంతయు నుపకరించుచున్నవి. ఇట్టి వర్ణాంతరేఖలను నాంగ్లమునందు సెరీఫు Serifs లందురు. అవి లేనివర్ణములు సాన్‌ సెరీఫు Sans-serifs లనఁబడు. ఈవర్ణాంతరేఖలు Serifs నేను గల్పించినవి గావు. అవి ప్రాచీనపుఁ దెలుఁగుశాసనములం దుండునవియే. వీనివలన లిపి కెంతయో లాభము గలదు. చేతి వ్రాఁతయం దీవర్ణాంతరేఖలు లేకయే వ్రాసికొనవచ్చును. ముద్రాక్షరముఖములందుఁ గూడఁ గొన్ని వర్ణాంతరేఖలతోడను, గొన్ని వర్ణాంతరేఖలు లేకయు నిర్మించుకొనవచ్చును. ఈపద్ధతియే రోమకాక్షరనిర్మాణమునందు ననుసరింపఁబడుచున్నది. విజ్ఞులీవర్ణాంతరేఖలవలని లాభముల గుర్తింపకపోరని నాదృఢవిశ్వాసము. ఇప్పటి చేతివ్రాఁతలలో విశేషముగా నీపటమునందుఁ బ్రదర్శింపఁబడిన యాకృతులు గల యక్షరములు గన్పట్టుచునే యున్నవి. ఈనూతనాక్షరములందుఁ దెలుఁగులిపిరూపము చెక్కుచెదర కెప్పటియట్టులే యుండుటం గననగు. కావున, ముద్రాక్షరనిర్మాణ-ముద్రణ-ముద్రాక్షరలేఖనములందలి సౌకర్యములఁ బర్యాలోచించి, యిట్టి క్రొత్తయక్షర నిర్మాణ ప్రచారములకుఁ బూనికొనుట సహృదయులగు భాషాభిమానులకు విధియై యున్నది.

ఇఁక 24 బిందువులనుండి 108 బిందువులవఱకు కక్షరపరిమాణములు గల క్రొత్త ముద్రాక్షరముల నిర్మాణపద్ధతిని గూర్చి కొంత విచారింతము. ఇందు వ్యంజనవర్ణములును, స్వరవర్ణ రూపాంతరములును విడివిడిగాఁ బోయఁబడియు, నవిచారితముగా వ్యంజన వర్ణముల శిరస్సులపై స్వరవర్ణరూపాంతరముల నతికించునట్లు కల్పింపఁబడినవి. ఈపద్ధతి వలన నీలిపి కెంతయు నపకారము వాటిల్లిన దనక తప్పదు. దీర్ఘము ( ా ), ఒత్వము ( ొ ), ఓత్వము ( ో ), ఔత్వము ( ౌ ), వీనిని వ్యంజనాక్షరములతోఁ గూర్చునపుడు ప్రక్కన కావ్వడ్లు పెట్టి సర్దవలసియున్నది గుడి ( ి ), గుడిదీర్ఘము ( ీ ), ఎత్వము ( ె ), ఏత్వము ( ే ), ఇవి వ్యంజనాక్షరములతోఁ గూర్పఁబడునపుడు కొన్నియక్షరములతోఁ జక్కఁగ నంటక విరూపముల నొందుచున్నవి. ఉదాహరణమునకీక్రింది యక్షరములఁ జూడుఁడు:—

# చి చీ చె చే త్రి త్రీ త్రె త్రే నె నే

ఇందు స్వరవర్ణములరూపాంతరములు వ్యంజనవర్ణములతోఁ జక్కఁగ నంటుకొనక యెంత వికారముగఁ గన్పట్టుచున్నవో గమనింపుఁడు. ప్రస్తుతము నిర్మింపఁబడెడి తెలుఁగు ముద్రాక్షరములలో నిట్టివికారరూపములుగల యక్షరము లెన్నియో గలవు. ఇవిగాక, యీముద్రాక్షరములందలి ముఖ్యములగు లోపము లేమందురా! అక్షరములయుపరి భాగములు సమానములుగఁ గాక యెగుడు దిగుడుగా నుండుటవలన, అక్షరముల యాకారములు సమాంతరేఖలలో నిమిడి చక్కఁగ పంక్తులు దీరి యుండక, కొన్నిపట్ల చాల వంకటింకరలై మిక్కిలి వికారములై కన్పట్టుచుండు. చూడుఁ డీక్రింది యక్షరములను:—

రా జా వా రి క శా శా ల యా ?

ఈయక్షరములందలి దీర్ఘములన్నియు సమానరేఖయం దిముడక యెగ్లుగుడుదిగుడులై యసహ్యముగఁ గన్పట్టుచున్నవో గమనింపుఁడు. ఇట్లే యితరస్వరవర్ణరూపాంతరములును గొన్నిపట్ల వికారముగఁ గన్పట్టుచుండు. అక్షరాకారపురేఖలు **Outlines of letters** శుద్ధములుగఁ జెక్కఁబడక పోవుటవలన ముద్రాక్షరముల ముఖములు మకమకలాడు చుండు. ఇంక నిట్టిలోపములు చాల గలవు. విస్తరభీతిని మానితి. **ప్రాచీనశాసనములఁ బరిశీలించి తదనుగుణముగ సంస్కరింపఁబడక పోవుటవలననే మన తెలుఁగుముద్రాక్షరములం దిన్ని లోపము లేర్పడినవి.** బ్రహ్మాండమగు నక్షరమంజూష గావలసి వచ్చినది. అంత పెద్ద మంజూష యుండియు నుపరిమంజూషయందలి **Upper Case** యక్షరములలో నాయాయక్షరమునకుఁ జెందిన యర్ధాక్షరము **Half-body type** నాయా యక్షరపు గడిలోనే కలిపి యుంచునట్లు లేర్పడినది. అట్లు చేయక పోయినచో మంజూష నింకను బెద్దదిగ నిర్మింపవలసి యుండెడిది. కన్నడలిపియందు ముద్రాక్షరము లన్నియు నొక యుపరిమంజూషతోడను, నొక యధోమంజూషతోడను గూడిన యంత చిన్నమంజూషలో నిమిడిపోఁగా, ఆకన్నడలిపికి సాక్షాత్ప్రియసోదరి యగు నీతెలుఁగులిపికిఁ బట్టిన గ్రహచార మేమిటోగాని యింతపెద్దకేసు కావలసివచ్చినది. పైఁ జెప్పఁబడిన లోపములు సంస్కరింపఁబడక పూర్వమే ముద్రాక్షరవిలేఖనయంత్రమును దొందరపడి నిర్మించినందున నిరువది సంస్తంభనకుంచికలు **Dead keys** గావలసినట్లు లేర్పడినది. ఈలిపిసంస్కరణ విషయమంతయు "తెలుఁగులిపియుఁ దత్సంస్కరణమును" అనుశీర్షికతో క్రీ. శ. 1931-వ

సంవత్సరము ఆగస్టు నెలయందు భారతిలోఁ బ్రకటితమైన వ్యాసమునందు సప్రపంచముగ చర్చించి, తెలుఁగుముద్రాక్షరసంఖ్యను ౧౦౪ అక్షరములకును, ౧౪౫ అక్షరములకును తగ్గించుపద్ధతిని సూచించుచు రెండువిధములగు ముద్రాక్షరమంజూషలను బ్రదర్శించి యున్నాఁడగాన, నింతకన్న దీని నిటఁ బెంచి వ్రాయు టనవసరమని మానినాఁడ.

మన లిపికి సన్నిహితమగు కన్నడమందేమి, అఱవమందేమి, మలయాళమందేమి, గ్రంథమునందేమి, యెన్ని యోరకములగు నచ్చక్షరములు నిర్మితములై గ్రంథములు హృదయాకర్షకములై యొప్పునట్లు ముద్రింపఁబడుచున్నవి. మన మేల యట్లు చేయ కూడదు? ముద్రాయంత్రములు, కాటుకలు, రంగులు, కాగితములు మున్నగు సాధనము లన్నియు మనకు విదేశీయులు సరఫరా చేయుచున్నారు ఇఁక నొక్క యక్షరనిర్మాణలోప సంస్కరణమే గదా మన కవశ్యాచరణీయమగు కార్యము. ఈస్వల్పకార్యముఁ గూడ మనము నిర్వర్తింపఁజాలక పోవు టెంతయు నవమానకరమగు విషయము. నన్నయభట్టారక-తిక్కనసోమయాజి-ఎఱ్ఱాప్రెగ్గడ - శ్రీనాథ - పోతనామాత్యాదిమహాకవులదివ్యనామములతో నూతనపద్ధతిని ముద్రాక్షరపరంపరలు పలురకములగు ముద్దుమోములతో వెలయవలదా? నాఁటికి గదా మన తెలుఁగులిపి యితరలిపులతో సరితూఁగఁగలదు! ఇఁకనైనను సహృదయులగు మన యాంధ్రమహాజను లీవిషయమునందు శ్రద్ధవహింతురు గాతమని యాశించుచున్నాఁడ.

## ఉ ప సం హా ర ము.

మన యాంధ్రభాష సర్వతోముఖముగ నభివృద్ధిఁ గాంచవలసియున్నది. ఆయాశాస్త్రములకు, నాయాకళలకుఁ జెందిన యుద్గ్రంథములు వెల్వడవలసియున్నది. అట్టులే ముద్రణకళకు సంబంధించిన గ్రంథములెన్నియేని వెల్వడవలసియున్నది. ఆయాకళకుఁ దగిన పారిభాషికపదములు మాత్రము సాధ్యమైనంతవఱకు సంస్కృతభాషాసాహాయ్యముంగొని మనభాషలోనే నిర్మింపఁబడవలయును. అట్లు సాధ్యముగానిపట్ల నన్యదేశ్యముల వాడుకొనవచ్చును. ఇదియే పెద్దలు శాసించిన మార్గము. దీని ననుసరించియే నాకుఁ దోఁచినరీతి నీవ్యాసమునం దాయాసందర్భములకుఁ దగిన పారిభాషికపదములను గల్పించి ప్రయోగించి యున్నాఁడ. అవియే యుత్తమములని నాతలంపు గాదు. అంతకన్న సాధువులగు పదములు లభించినయెడల, వానినే వాడుకొనఁగలను. ఇందు ముద్రణకళనుగూర్చి కొంత సంగ్రహముగఁ దెల్పితి. తెలుఁగుముద్రాక్షరనిర్మాణపద్ధతియందలి లోపములఁ గొంత సోదాహరణముగఁ జర్చించి లిపిసంస్కరణావశ్యకతను సూచించితి. సామాన్యాక్షరములు, స్థూలాక్షర

ములు, నమ్రాక్షరములు పెక్కు బిందుపరిమాణములలో నిర్మింపఁబడు టత్యంతావశ్యక మైయున్నది. ఇవన్నియు నుండినచే యాంధ్రగ్రంథములు హృదయాకర్షకము లైయుండు రీతి సలక్షణముగ ముద్రింప వీలగును.

85 వత్సరములనుండి—అనఁగా నించుమించుగా లోఁగడఁ జెప్పినట్లు క్రీ. శ॥ 1852-వ సంవత్సరమునందు తెలుఁగుగ్రంథముద్రణము ప్రారంభమైనదాదిగా—సంస్కృతాంధ్రగ్రంథముద్రణప్రచారములకు బద్ధకంకణులై బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామి శాస్త్రులవారు ప్రారంభించిన వావిళ్లముద్రణాలయమును నాఁటినుండి నేఁటివఱ కవిచ్ఛిన్నముగ సాగించుచు నమూల్యములగు పెక్కు సంస్కృతాంధ్రగ్రంథములరక్షణప్రచారములఁ గావించుచుండెడు మహామహులగు భాషోద్ధారకులు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవా రీయక్షరనిర్మాణవిషయమునందుఁ గూడఁ గొంత యాదరణము చూపువారగుచు, గరిష్ఠప్రాథమిక Great Primer పరిమాణమునందు స్థూలాక్షరముల Antique types ను క్రొత్తగ నిర్మింపించిరి. ఈస్థూలాక్షరములతో బాలవ్యాకరణము, బాలవ్యాకరణ సారస్యసర్వస్వపేటిక, మేఘసందేశము అనునీగ్రంథములలోని సూత్రములును, శ్లోకములును ముద్రింపఁబడుటవలనఁ బుస్తకమును దెఱచినవెంటనే యిది మూలగ్రంథము, ఇది వ్యాఖ్యానమని స్ఫుటముగఁ దెలియుచుఁ బాఠకులకు హృదయతోషకము లైయున్నవి.

ఇట్లు సంస్కృతాంధ్రగ్రంథసంస్కరణప్రకటనము లొనర్చుచు "భాషోద్ధారకు"లై వెలయుచుండునట్టులే, యిఁకముందు తెలుఁగులిపియందలి లోపములను గూడఁ బ్రాచీన శాసనానుసరణి సంస్కరింపించి నూతనముద్రాక్షరములఁ బెక్కురకముల నిర్మింపఁజేయుచు, "ఆంధ్రముద్రాక్షరోద్ధారక" బిరుదవిభ్రాజమానులై, ఆయురారోగ్యభాజనులై, బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవా రితోఽధికశ్రేయఃపరంపరల నందుచు, సర్వోత్కృష్టులై వెలయుచుండున ట్లనుగ్రహింతురు గాతమని యాద్యులును త్రయీవేద్యులు నగు శ్రీధవోమాధవవాగ్ధవులను భక్తిమెయిఁ బ్రార్థించుచు నింతటితో విరమించుచున్నాఁడ. స్వస్తి! సమ స్తసన్మంగళాని సంతు!!



# నన్నయ భారతము

## నిర్దుష్టమైన పాఠభేదములతో మరల ముద్రించి ప్రకటించవలసిన ఆవశ్యకత

డాక్టర్: గిడుగు వేంకటసీతాపతిగారు, బి. ఏ., ఎల్. టి., డి. లిట్.

ప్రాచీనాంధ్రకావ్యాలలో ఒక్కటయినా ఇంతవరకు నిర్దుష్టంగా ముద్రితం కాలేదన్నవిషయం ఆంధ్రసారస్వతపరిశోధకులందరికీ తెలిసినవిషయమే; కాని, నిర్దుష్టమైనపాఠములతో గ్రంథము లచ్చువేయించవలెనన్నపట్టుదల పండితులకుగాని ప్రకాశకులకుగాని ఇంకా బాగుగా కలుగలేదు. వ్రాతప్రతులన్నీ దోషభూయిష్ఠము లంటారు. నిజమే; కాని, లేఖకప్రమాదములు సులభంగా తెలుసుకోవచ్చును. వీటికంటె ముద్రితగ్రంథాలలో పరిష్కర్తలవల్ల కలిగినతప్పులు ఎక్కువగా ప్రాచీనాంధ్రభాషాలక్షణజిజ్ఞాసువులను బాధిస్తూ ఉన్నవి. ఈపరిష్కర్తలు పండితులే అయినా నిష్పక్షపాతహృదయంతో భాషాలక్షణం విమర్శించే ఉద్దేశంకలవారు కారు. పరిశీలనము లెస్సగా చేయక లక్షణంచెప్పిన అప్పకవి, చిన్నయసూరి మొదలయినలాక్షణికులు రచించిన లక్షణగ్రంథాలు మాత్రం చదువుకొని స్వతంత్రబుద్ధితో స్వయంగా భాషాలక్షణం విమర్శించనిపండితులకు వ్రాతప్రతులలో సరియైనపాఠములు కనబడుతూ ఉన్నా అవి తాము నేర్చుకొన్న లక్షణసూత్రాలకుసరిపడలేదన్నకారణంవల్ల సరియైనపాఠములు కావన్న అభిప్రాయం ఏర్పడుతుంది. అందుచేత, అట్టిపరిష్కర్తలసవరణలవల్ల వ్రాతప్రతులలోని సరియైనపాఠములకు మారుగా అపపాఠములు అచ్చులో కనబడుతూ ఉంటవి. ఇవే సరియైనపాఠములనుకొని ఈగ్రంథములు చదువుకొన్నవారికి సరియైనపాఠములే అపపాఠములుగా కనబడవచ్చును. నిర్దుష్టమైనది దుష్టంగాను, దుష్టమైనది నిర్దుష్టంగాను కనబడేటంతదురవస్థ మనప్రాచీనాంధ్రభాషకు కలిగిందనడానికి ఒకనిదర్శనం చూడండి.

చిన్నయసూరి "భూతంబున లజికి లిడంతంబగు నగు ధాతువనుప్రయుక్తంబగు"అని సూత్రం రచించినాడు (చూ. బాలవ్యా. క్రియా. 114) ఈ యసంపూర్ణవ్యాకరణసూత్రములను వేదవాక్యములుగా గ్రహించిన కళాప్రపూర్ణ వేదం వేంకటరాయశాస్త్రులవారికి మహామహోపాధ్యాయ కొక్కొండ వేంకటరత్నముపంతులువారు రచించిన ఆంధ్రప్రసన్నరాఘవములోని "పంపలేడయ్యెదుగ", ఎక్కడఁబడదయ్యెడు" అనే ప్రయోగములు

కడుదుష్టములుగా కనబడినవి. శాస్త్రులవారు పంతులవారి గ్రంథమును 1898 లో విమర్శిస్తూ ఈప్రయోగములను ఖండించడానికి పైనిచెప్పినసూత్రమును ప్రమాణముగా చూపించి "ఏతత్సూత్రరీతిని వ్యతిరేకమునకు భూతమున అగుధాతువు భూతార్థము అనుప్రయుక్త మగునుగాని లాడాదికములు కానేరవు" అని తమ అభిప్రాయము మరింత స్పష్టముగా తెలియజేసినారు. మరి 15 సంవత్సరములు గడచినతర్వాత, 1913 లో శ్రీనాథుని శృంగార నైషధమునకు సర్వంకషవ్యాఖ్య వ్రాయవలసివచ్చినప్పుడు "చేయరయ్యెదరు" (ఆ. 7. ప.72), "లేఁడయ్యెదుఁ" (ఆ. 8. ప. 185) అనే ప్రయోగములు కనబడినవి. పంతులవారు తమకు సమకాలికులున్ను, విరోధులున్ను గనుక శాస్త్రులవారు వారిని ఎక్కువగా నిరసించినారు. "నలువదియేండ్ల యాంధ్రపండితుల యాంధ్రవ్యాకరణజ్ఞానము ఎట్లు రేఁగుచున్నదో యెర యుఁడు...వీరే క్రొత్తవ్యాకరణము చేయవలసినవారు" అని ఈవిధముగా వ్రాసిన శాస్త్రులవారికి శ్రీనాథుని ప్రయోగాలు కనబడగానే పంతులవారిని ఆక్షేపించినట్లు శ్రీ నాథుని ఆక్షేపించుటకు సాధ్యముకాదు గనుక 'చేయ రయ్యెదరు' బా. వ్యా. క్రి. 114 లో లజికి (=వ్యతిరేకార్థమునకు) అగుధాత్వనుప్రయోగమును (భూతంబున మాత్రము) చెప్పుట తదితరస్థలంబులందు తదనుప్రయోగవైరళ్యమును తెలుపుట కని కొందఱిమతము" అనిన్ని "లేఁడయ్యెదుఁ"—బా. వ్యా. క్రి. 114 వలన "లేఁడయ్యెఁ" అనుప్రయోగము సిద్ధించును. ఈప్రయోగమునకు గతి మృగ్యము. 'లేఁడయ్యెఁ జూ' అని ('లేఁడయ్యెఁ బో' అనియేని) మార్చిన సరిపడును. 'చేయ రయ్యెదరు'—ఇత్యాదిప్రయోగంబులంబట్టి బా వ్యా. లో 'భూతంబున లిడంతంబు' అనుట ప్రాయోవాదమని తలంపవలయును" అని తమ ఆగ్రహము కాస్త సడలించి వ్రాసినారు. అయితే, ప్రాచీనకవిప్రయోగాలు లెస్సగా పరిశీలించక ఆధునిక లాక్షణికుడు చెప్పినలక్షణము అసంపూర్ణంగానో దుష్టంగానో ఉన్నా దానినిబట్టి శ్రీనాథునివంటి ప్రాచీనాంధ్రకవి ప్రయోగమును సవరించడానికే పూను కొన్నారు; గాని, ఈప్రయోగాలు నిర్దుష్టములయినవే అని గ్రహించలేకపోయినారు. 1920 లో మా తండ్రిగారు, రావుసాహెబు రామమూర్తిపంతులుగారు తమ "తెలుగు" పత్రికలో "ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజము" అనే వ్యాసమందు ఈవిషయ మెత్తు కొని కొక్కొండ వేంకటరత్నముపంతులుగారుచేసిన ప్రయోగాలు నిర్దుష్టములయినవనిన్ని, అటువంటిప్రయోగాలు శ్రీనాథుడేకాదు, అతనికిపూర్వము కవిత్రయమువారే చేసినార నిన్ని తెలియజేస్తూ "నమ్మనేరనయ్యెద" (ఆది vi. 29), "వృష్టిలేదవు" (ఆది iv. 250), "ఈజాలనయ్యెద" (అర. vii. 204), "పలుకంగఁ జాలఁడయ్యెదు నాకటా" (విరా. ii. 141)

—ఈవిధముగా ఇరవై భారత ప్రయోగాలు కనబరచినారు. ఈప్రయోగాలు చూచిన తర్వాత శాస్త్రులవారు ఇటువంటిరూపాలు సాధువులని గ్రహింపక తప్పినదికాదు.

చిన్నయసూరి రచించిన బాలవ్యాకరణము అసంపూర్ణము, దుష్టము అయినా దాని ప్రాభవము గ్రంథపరిష్కర్తలపై నెంత ఎక్కువగా ఉన్నదో చూపించడానికి మరియొక నిదర్శనము. చిన్నయసూరి తనబాలవ్యాకరణములో "ఎడుతలద్రుతంబున కచ్చుపరంబగు నపుడు మకారంబగు - నీకు మేలుగలుగుత మనిరియును" (క్రియా. సూ. 28) ఈసూత్రమును ఆధారముగా చేసుకొని వ్రాతప్రతులలో "కలిగెడమని, అయ్యెడమని" మొదలయినరూపాలుంటే అవి తప్పనుకొని "కలిగెడుమని, అయ్యెడుమని" అని దిద్దుతున్నారు. ప్రాచీనాంధ్రకావ్యాల వ్రాతప్రతులలో ఇటువంటిరూపాలన్నీ '-ఎడమని'–అకారసహిత డకారముతోనే కనబడతవి. కేతన తన ఆంధ్రభాషాభూషణములో "దీవెన కెడమయుఁ గాతయుఁ। గావుతయును దెనుఁగుకవుల కబ్బంబులలో। శ్రీవెలిగెడ మధిపుడు మే। ల్గావించుం గాత మేలు గావుత యనఁగన్" అని ఉన్నది. పరిశీలనం లెస్సగాచేయక లక్షణం చెప్పిన చిన్నయసూరిసూత్రమునుబట్టి ప్రాచీనాంధ్రలాక్షణికుడున్ను మహాకవిన్ని అయిన కేతనచెప్పిన లక్షణస్వరూపమే తారుమారుచేసి ఈపద్యము ఎట్లు మార్చి అచ్చువేయించినారో నేటి పరిష్కర్తలు! వావిళ్లవారిప్రతిలో "దీవెనలగు నెడఁగాతయుఁ। గావుతయున్ దెనుఁగుకవుల కబ్బంబులలో। శ్రీవెలిఁగెడు నధిపుఁడు మే। ల్గావించుం గాత మేలు గావుత యనఁగన్" అని కనబడుతున్నది. ఆంధ్రకౌముది వ్రాతప్రతిలో "తెనుంగున నాశీర్వచనరీతి యయ్యెడ। గావుత బ్రోవుతగా తనతగు నావెన్నునిదయ మేల్గావుత బ్రోవుత కరుణన్ రక్షించుగాత శుభము లయ్యెడనారమ్ము సెయ్యుము లెమ్మన విధ్యర్థమయ్యె నివ్విధము లింక" అని ఉంటే ఆంధ్రసాహిత్యపరిషత్తువారు చిన్నయసూరిచెప్పిన తప్పులక్షణమునుబట్టి ఆంధ్రకౌముదిలోగల లక్షణస్వరూపమే మార్చి ఈపద్యము ఎట్లు అచ్చువేయించినారో చూడండి "తెనుఁగున నాశీర్వచనరీతి యయ్యెడఁ గావుతఁ బ్రోవుతఁగా తనగు। నావెన్నునిదయ మేల్గావుతఁ బ్రోవుతఁ గరుణన రక్షించుఁగాత శుభము లాయెడునా రమ్ము చేయుము లెమ్మన విధ్యర్థమయ్యె నివ్విధము లింక" పూర్వలాక్షణికులు చెప్పినలక్షణమునుబట్టి చూడగా చిన్నయసూరిచెప్పిన "లుఙ్లు ముఙ్లున కెడుతవర్ణంబులు ద్రుతాంతంబులగు" అనేసూత్రమున్ను, దాని ననుసరించి చెప్పిన "ఎడుతలద్రుతంబున కచ్చు పరంబగునపుడు మకారంబగు" అనేసూత్రమున్ను తప్పులనక తప్పదు. భారతాది గ్రంథాలలో గలలక్ష్యాలు పూర్వలాక్షణికులు చెప్పినలక్షణాలకు ఆధారములుగానే

ఉన్నవి. అయితే ఆలక్ష్యాలు వ్రాతప్రతులలోనేకాని అచ్చుపడ్డగ్రంథాలు చూస్తే కన బడవు. ఎందుచేతనంటే, చిన్నయసూరి బాలవ్యాకరణము చదువుకొన్న పండితులు పరిష్కర్తలయి గ్రంథాలలోని పాఠాలు సవరించారు గనుక అని చెప్పక తప్పదు. ఈసవ రించడం వెర్రి ఎంతమట్టుకు సాగిందంటే శాసనాలలోగల పాఠాలునైతము సవరించడానికి పూనుకొన్నారు పండితులు. ఉపర్పల్లి శాసనంలో "-గాచుచుండెడమ్" అని ఉంటే "-గాచుచుండెడుం" అని దిద్ది అచ్చువేయించారు. అచ్చులో ఉన్నది చూచి మాతంగ్రి గారు అనుమానించి, నైజాం ఆర్కియెలాజికల్ శాఖాధికారిగారికి జాబు వ్రాసి శాసనంలో ఉన్న అసలుపాఠము తెప్పించుకొని చూడగా రహస్యం బయలుపడినది.

భారతంలో "అపాండవం బయ్యెడ మని...అట్లుగాకుండెడ మని" (ఆది. i 52) "నీకు సంజీవని వని సేయకుండెడ మని" (ఆది. iii 131) "నాయొద్దన యుండెడ మని" (ఆది. iv. 160), "పునర్దర్శనం బయ్యెడ మని" (ఆది. vi. 136) "ఉత్తముండై పొందెడ మంచు" (ఆది vii. 181) "భవత్పునర్దర్శన మయ్యెడ మరుగుం డని" (సభా. ii. 283) "నీయూరుయుగళంబు భగ్నం బయ్యెడ మని శాపం బిచ్చిన" (అర. i 103) "నీకీర్తి నిత్యంబై శబ్దబ్రహ్మంబు కలయంతగాలంబును వర్తిల్లుచు నుండెడ మని శిబికి వరం బిచ్చి" (అర. iii. 237)—ఈవిధముగా '°ఎడమ-' అనియేకాని '°ఎడుమ-' అని వ్రాతప్రతులలో కనబడదు. వ్రాతప్రతులంటే పూర్వకాలపువ్రాతప్రతులేకాని ఇటీవలి వ్రాతప్రతులు కావు. చిన్నయసూరిగారిసూత్రముబట్టి ఈరూపములకు అచ్చులో అన్యాయం జరిగినది. సాధురూపము దుష్టరూపముగాను, దుష్టరూపము సాధురూపముగాను కనబడుతున్నది.

ఇటువంటి నిదర్శనాలు ఇంకా అనేకముగా ఉన్నవి. ముద్రితగ్రంథాలవల్ల ప్రాచీన భాషాలక్షణము ఇటువంటివిషయాలలో మరింత ఎక్కువగా మరుగుపడిపోతున్నది. అందు చేత, ప్రాచీనాంధ్రకావ్యాలన్నీ నిష్పక్షపాతబుద్ధితో, ప్రాచీనాంధ్రభాషాలక్షణము తెలుసు కోవాలన్నదీక్షతో పండితులు వ్రాతప్రతులలోని పాఠములను లెస్సగా పరిశీలించి మరల ప్రకటించవలసియున్నది. ఈపనికి శ్రీభాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారే మార్గ దర్శకులు కావలెను. ఆంధ్రసారస్వతములో మనకు తెలిసినంతమట్టుకు నన్నయభారతమే ప్రాచీనతమమయిన కావ్యము గనుక నిర్దుష్టమైన పాఠభేదములతో దానిని మరల ముద్రించి ప్రకటించవలసినదని శ్రీశాస్త్రులవారిని ఆంధ్రులందరితరపునా ప్రార్థిస్తున్నాను ఇది ఎట్లు సంప్రతించి ప్రకటించవలసి ఉంటుందో సూచనగా నామిత్రులు డాక్టర్ చిలు కూరి నారాయణరావుపంతులుగ్గారు నన్నయభారతమందలి ఆదిపర్వములోని ద్వితీయా

శ్వాసమునగల గరుడోపాఖ్యానఘట్టము 120 పద్యములు సంప్రతించి ప్రకటించినారు. వీరు ప్రాచీనాంధ్రభాషాలక్షణము, అందులో నన్నయకాలం తెలుగుభాష లెస్సగా పరిశీలించిన వారే అయినా కొన్నిచోట్ల సాధుపాఠములను పుటదిగువున సూచించి అపపాఠములనే ఎందుకు గ్రహించి మూలగ్రంథములో కనబరచినారో తెలియదు. గ్రంథాదినున్నవచనములో "మీకోఱినవరంబు" అని మూలంలో కనబరచి పుట అడుగున 'మీారుగోరిన', 'మీాగోరిన' అనేపాఠములు చూపించినారు. నన్నయభాషాలక్షణ మనుసరించి 'మీాకోరిన' అని ఉండవలెను; గదా, 'కోరు' పదమందు గలరేఫము శకటరేఫముగా ఎందుకు కనబరచినారో తెలియదు. ఈవచనము తర్వాతనున్న తరలపద్యములోను ఇంకా పెక్కుచోట్లను ఈపదము రేఫముతోనే కనబరచినవారు ఇక్కడెందుకు శకటరేఫముతో కనబరచినారో! అచ్చుతప్పనుకొన్నానుగాని శుద్ధపత్రికలో ఇది సవరణకాకపోవుటచేత చూపించవలసివచ్చినది. (వినుత) వినత-ఇది తెలుగుశబ్దముకాదు. కశ్యపప్రజాపతి భార్యలపేళ్లు—కద్రూః (కద్రూః), వినతా; ఇవి సంస్కృతభాషారూపములు. ఇందులో మొదటిది తెలుగుభాషలో ధేనువువలెనే "కద్రువు" కావలెనా! లేక చిన్నయసూరి "కద్రువనాగమాత" (తత్స. 51. సూ.) అని చెప్పినట్లు "కద్రువ" కావలెనా! అన్నసందేహము కలుగవచ్చునేమో కాని వినతవిషయములో అట్టి వికల్పమునకు ఎడమే లేదుకదా. 'వినత' అనేరూపము వ్రాతప్రతులలో కొన్నింటనైనా కనబడుతూ ఉండగా 'వినుత' అనే రూపమునే సాధువుగా ఎందుకు గ్రహించి మూలగ్రంథములో చేర్చుకొన్నారో తెలియదు. 1 ఈగరుడోపాఖ్యానములోనే 72, 94 పద్యాలలోగల 'వైనతేయు' అనే వినతాశబ్దతద్ధితరూపమును గ్రహించియున్నారే. 'కొండ్కొకగాలంబ్బునకు' (ప. 4)—'ఒక' శబ్దముపై గసడదవాదేశము రాదని మాతండ్రిగారును నేనును మాపరిశీలనమువల్ల తెలుసుకొన్నాము. వస్తుందనడానికి తగిన ప్రమాణము ఏమున్నదో! 'తఱువంద్గఱువఁ' (ప. 15)—త్రచ్చు (చూ. ప. 13)—దీని రూపాంతరము 'తరుచు' ఇందులో రేఫమేకాని శకటరేఫము లేదు. "తరువఁబడు నబ్ధిక్రియసేనకు తిరుగఁబడియె" భార. భీష్మ. ఆ. 3. ప. 194. శకటరేఫమైనందుకు తగినప్రమాణము నాకు కనబడలేదు. ఈ 15 వ పద్యములోనే 'చెచ్చెఱఁ' అనేశబ్దము శకటరేఫముతో నారాయణరావుగారు ఎందుకు గ్రహించవలసివచ్చినదో తెలియదు. నన్నయ సభాపర్వములో ఈశబ్దము-అందలి రేఫము ప్రాసస్థలమందు వచ్చునట్లుగా–రెండు చంపకమాలావృత్తములలో ప్రయోగించినాడు. "కురుపతికిఁ...చెచ్చెరఁ గొనిరమ్ము..." (1. 5); "కురువిభురాజసూయమునకుఁ...విభీషణుండు సెచ్చెర స్వహదేవుశాసనము..." (1. 260.)

వీటినిబట్టి నన్నయవాడుకలో చెచ్చెరశబ్దమం దున్నది రేఫమేకాని శకటరేఫముకాదని స్పష్టము. ఇంకా ఇటువంటిలోపాలు కొన్ని ఉన్నా డాక్టర్ నారాయణరావుగారు నన్నయ భారతము ఎట్లు సంప్రతించి ప్రకటించవలెనో తెలియజేసినవా రయినారు.

ఇదివరకు ప్రకటితములైన ప్రతులు—వావిళ్లవారిదిగాని, వేమూరివారిదిగాని, తక్కినవిగాని చూచినయెడల అందులో నన్నయభాషకు విరుద్ధములయిన శబ్దరూపము లనేకముగా కనబడుతున్నవి. నన్నయకాలమునాటి యాంధ్రభాషాలక్షణము లెస్సగా పరిశీలించని పండితులే వ్రాతప్రతులలోని పాఠములు పరిష్కరించినారని చెప్పక తప్పదు. నన్నయభాషలో గసడదవాదేశము రావలసినచోట్ల నిత్యముగా వస్తుంది; రాగూడని చోట్ల రానేరాదు. ఇందులో వికల్పములేదు. రావలసినచోట్ల ఆదేశము లేకుండ పరిష్కరించినందుకు నిదర్శనాలు:—'శుద్ధాన్నంబుపెట్టినాఁడ' (ఆది. 1. 100), 'కడుం బెద్దదవ్వుపోయి' (ఆది. 1. 117) 'కశ్యపప్రజాపతి తొల్లి పెద్దకాలంబు తపంబు' (ఆది. ii. 4) మొ.— వావిళ్లవారిప్రతిలోను; 'పెద్దకాలంబు' (ఆది. ii. 4), 'గంధర్వులు పదార్వురు' (ఆది. iii. 64) మొ. వేమూరివారిప్రతిలోను ఉన్నవి. రాగూడనిచోట్ల ఆదేశముంచి పరిష్కరించినందుకు రెండుప్రతులలోను 'శర్మిష్ఠసేసిన యెగ్గు' (ఆది. iii. 145) 'ధృతరాష్ట్రదుర్యోధనులచేసిన లాక్షాగారదాహదాహప్రయోగంబువలన' అనుటకుమారుగా '...దుర్యోధనులు సేసిన ...' అని రెండుప్రతులలోను కలదు. (ఆది. vii. 220 వే; 222 వా.)

"అయ్యయాతి సత్సంగతిం జేసి తానును దౌహిత్రులు నూర్ధ్వలోకంబునకుం జనిరొ నని" వావిళ్లవారిప్రతిలో నన్నయభాషాలక్షణ మనుసరించినపాఠ మున్నది; గాని, వేమూరివారిప్రతిలో "...దౌహిత్రులు నూర్ధ్వలోకంబునకుం జని రని" ఆధునికభాషా లక్షణము ననుసరించి నన్నయభాషాలక్షణమునకు విరుద్ధముగా పరిష్కర్తలు సవరించిన పాఠ మున్నది.

ఇచ్చి పుచ్చు, చెప్పి పుత్తెంచు, అడిగి పుత్తెంచె మొదలయినరూపాలు ప్రాచీనాంధ్ర భాషలో ఉండేవి. ఈవిషయము లెస్సగా గ్రహించక కళాప్రపూర్ణులయిన వేంకటరాయ శాస్త్రులవారే కొక్కొండ వేంకటరత్నంపంతులవారు "ఇచ్చి పుచ్చినది" ప్రయోగించినా రని ఆక్షేపించినారు; శ్రీనాథుని శృంగారనైషధంలో "కెలన యున్నాళ్లు నడిగి పుత్తేఁడు నిన్ను" (iii. 123) అని ఉంటే "అడుఁగఁ బుత్తేఁడు..." అని సవరించినారు.

ఇచ్చి పుచ్చు అడిగి పుత్తెంచు వంటిరూపములు భారతకవులు ముగ్గురున్ను ప్రయోగించినారు. ఈరూపములను మార్చకుండానే పరిష్కర్తలు గ్రహించి ప్రకటితములయిన

ప్రతులలో కనబరచినారు; కాని, అరణ్యపర్వమందలి ద్వితీయాశ్వాసములో మాత్రము (మా. 185) "దమయంతి... కేశిని యనుదానిం బిలిచి... బాహుకుం డనువాఁ డెవ్వండో... వానికడకుం బోయి యుతింగి రమ్మని పంచిన నది వోయి బాహుకుం గని దమయంతి నీ కుశలం బడుగఁ బుత్తెంచె..." అని ముద్రింపించినారు. వ్రాతప్రతులలో 'అడిగి పుత్తెంచె' 'అడిగిరమ్మని పుత్తెంచె' అని పాఠములు కనబడుతున్నవి. నన్నయాదిప్రాచీనకవులవాడుకలో 'అడిగి పుత్తెంచె'వంటి రూపాలు ఉండేవి. తక్కినచోట్ల ఇటువంటిరూపాలు వాడిన నన్నయ ఇక్కడకూడా ఈరూపమును వాడి ఉంటాడని నమ్మవచ్చును. గనుక పరిష్కర్తలుచేసిన సవరణ తప్పు.

నన్నయ మధ్యాక్కరలు కొన్నిచోట్ల ఏఛందోలక్షణమునకున్ను సరిపడకుండా అచ్చుపడ్డప్రతులలో కనబడుతున్నవి. "తనదివ్యశక్తి నప్పాశముల విడిచి । తన్మునినాథు" (ఆది. vii. 123 వావిళ్ల; 122 వేమూరి) "నం గురుకులహానికరుఁడయి ధారుణీ । నాథ నీసుతుఁడు" (సభా. ii. 182). వావిళ్లవారిప్రతిలో "నం గురు కులహానికరుఁడు ధారుణీ । నాథ నీసుతుఁడు" అని లక్షణసమ్మతముగా సవరించినపాఠ మున్నది. "సమరంగ ధర్మువు రక్షించుఁ బ్రీతి । నని శత్రులందు (అర. i. 225), గలుగు టెఱిఁగి యుపాయపూర్వమున । గడఁగి తత్సిద్ధి" (అర. i. 234) "పదుండ్రబోలెడుసుతుల నూర్వురఁ । బడయంగ వలతో । పదుండ్రనూర్వుర కెనయగుసుతులఁ । బడయంగ వలతో" (అర. ii. 343) "అరిగె నీశానుదిక్కునకు నీయనుజుఁ । డనిలవేగమున (అర. iii 373) "తోనేఁగె నుత్తరము మించి ధర్మని । త్యుఁడు ధర్మజుండు (అర. iv. 3), కొన్నిపాదములలో అప్పకవిచెప్పిన గణలక్షణము కనబడినా నన్నయనాటిభాషాలక్షణమునకు విరుద్ధమైనప్రయోగాలు కనబడడం వల్ల ఛందోలక్షణం సరిపెట్టడానికి సవరించినపాఠాలువలె కనబడుతున్నవి. "సీపరోక్షంబున రాజుగావలె । నెమ్మి నిల్పఁగ" (ఆది. iv. 175 వేమూరి; 177 వావిళ్ల) నన్నయ "కావల యును" అని ప్రయోగించిఉంటాడు గాని 'కావలె' అని ప్రయోగించి ఉంటాడా అని సందేహించవలసి ఉన్నది. (మా. ఆది. viii. 144) "వంశనిస్తారకుండు గావలయు" "నెల కొని యతనికి నశ్వహృదయ మ । నెడివిద్య యిచ్చి" (అర. ii. 128) నన్నయ "అశ్వ హృదయ మనియెడి,—యెడు,—మన్—విద్య అని ఉంటాడుగాని"—అనెడివిద్య అని ఉంటాడా! "ఏమేము మున్ను పూజింపుదుము రుద్రు । నిందనివేడ్క" (అర. ii. 255.) పూజింతుము అనే రూపమేకాని పూజించుదుము, పూజింపుదుము అనే రూపాలు మరి

యొక్కడను నన్నయగ్రంథములో కనబడలేదు; గనుక ఈపాఠము సరికాదని తోస్తుంది. ఈవిషయము ఇదివరలో అనంతునిఛందోదర్పణపీఠికలో కొంతవరకు చర్చించియున్నాను.

నన్నయ సీసములందును, ఆటవెలది తేటగీతులందును పాటించిన నియమమును బట్టి, ఆయాపద్యాలలోగల పాఠభేదాలలో ఏవి సరియైనవో నిర్ణయించడానికి కొంత అవకాశమున్నది. ఈవిషయము మాతండ్రిగారు సంపాదకులుగా ప్రకటించిన "తెలుగు" పత్రిక రెండవసంచికలోను, అప్పకవీయమునకు మేము వ్రాసిన పీఠికలోను కొంతవరకు విమర్శించియున్నాను. సీసపద్యమునందలి పెద్దపాదముల నాల్గింటను సర్వత్రా యతిగాని, సర్వత్రా ప్రాసముగాని, పూర్వఖండములం దన్నింటను యతిన్ని, పరఖండములం దన్నింటను ప్రాసమున్నుగాని, పూర్వఖండములం దన్నింటను ప్రాసమున్ను, పరఖండములం దన్నింటను యతిన్నిగాని అట్లే ఎత్తుగీతిలో—అందలి నాలుగుపాదములున్ను రెండువరుసలలో పెట్టిచూచినప్పుడున్ను యతి, ప్రాసనియమములు పాటించి నన్నయ సీసములు రచించినాడు. సీసములతో సంబంధములేని ఆటవెలది తేటగీతులందున్ను ఇట్టి నియమములనే పాటించినాడు. ఈనియమములను అనుసరించి వ్రాతప్రతులలోని పాఠములను సవరించవలసి యుంటుంది.

నన్నయభారతములో 251 సీసము లున్నవి. ఆనందముద్రణాలయముద్రితమైన వేమూరివారిప్రతిచూస్తే వీటిలో 15 పద్యములందు మాత్రము పైనిచెప్పిననియమము ఒక్కొక్కచోట తప్పుతూ వచ్చినది.

"జనమేజయుని చేయుసర్పయాగమునకు, విఘ్నమందఱము గాఁవింత మఱఁదు
ధర్మార్థి గావున । ధారుణీసురులమై, <u>యడుగుద</u> మీఁక్రతుఁ<u>వుడుగు</u> మనియు..."
ఆది. II. 127.

ఇది సర్వత్రా వడినియమము గలసీసము కావలసినది. ఒక్క రెండవచరణమందలి రెండవ ఖండమందు మాత్రమే వడికిమారుగా ప్రాసమున్నది. గాని, పెక్కుతాళపత్రప్రతులలో "యడుగుదమిష్టి సేయకుమటనియు" అని యున్నది. వావిళ్లవారిప్రతిలో ఈపాఠము పుటదిగువున సూచించినారు. ఇందు వడినియమ మున్నది. ఇదియే సరియైనపాఠమని గ్రహించవలసి ఉంటుంది.

"అతిసమర్థుండు బృహద్రథుం డనువాఁడు, మగధాధినాథుఁ డుగ్రస్మార్గదూరు
* * * * * * * * *
* * * * * * * * *
సమరంగఁ బెండ్లియై కి సమమైనప్రీతి న,య్యిరువురయందు భోగేచ్ఛ సలిపె."

సభా. I. 134

ఇదికూడా సర్వత్రా వడినియమముగల సీసము కావలసినది. కాని 4 వ చరణమందలి మొదటి ఖండమందు మాత్రమే వడికి మారుగా ప్రాసమున్నది, గాని, పెక్కు వ్రాతప్రతులలో "సమరంగఁ బెండ్లియై కి యనుపమప్రీతి" అని వడినియమముగలపాఠము కలదు. ఇదే సరియైనపాఠము.

"ఇన్నలోపాఖ్యాన కి మెప్పుడు దత్త్రావ, ధానులై వినువారుఁ కి దవిలి సభలఁ..."

అనేసీసపద్యము (అర II. 230) కూడా సర్వత్రా వడినియమముగలదే కావలసియుండెను; గాని ఎత్తుగీతిలో మూడవచరణము "సుతచరిత్రుఁడైన కి ఋతుపర్ణుఁ గీర్తింప" అని ఉండడంవల్ల వడినియమము తప్పినది; గాని పెక్కు వ్రాతప్రతులందు "ఋజుచరిత్రుఁడైన", "ఋషిచరిత్రుఁడైన" అనేపాఠములు కలవు. వావిళ్లవారిప్రతిలో సైతము సూచించినారు

ఈవిధముగా వ్రాతప్రతులలో సరియైనపాఠములు కనబడుతూ ఉంటవి. పరిష్కర్తలు నన్నయసీసములందును, ఆటవెలది, తేటగీతులందును పాటించిననియమమునకు విరుద్ధములుకాని పాఠములు ఎంచుకోవలసిఉంటుంది.

డాక్టర్: చిలుకూరి నారాయణరావుగారు గరుడోపాఖ్యానము సంప్రతించి ప్రకటించినట్లుగా భారతమంతా కాకపోయినా నన్నయరచించిన భారతభాగమైనా ప్రకటించవలసిన ఆవశ్యకత ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు గ్రహించియుండవలసినది. ఆపని వారు చేయనప్పుడు ఆంధ్రసారస్వతవ్యాప్తికి సహాయులుగాను పోషకులుగాను పనిచేస్తూఉన్న భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారే ఈ శుభకార్యము సైతము నిర్వహింతురుగాక!



# గ్రంథవ్యాప్తి

శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు
తెలుగు జూనియర్ లెక్చరర్, మద్రాసు యూనివర్సిటీ, మద్రాసు.

గ్రంథములు వ్యాపించుట లేనిచో లోక మంధప్రాయమగును. గ్రంథమనఁ గూర్చిన పదజాలమును కూర్చినపత్రజాలమును గూడ నగును. పత్రజాలమున కెక్కని పదజాలమునకు నిలుకడ యెట్లుండును? పత్రజాలమగు గ్రంథము కవిరచనారూపగ్రంథము నిలఁబడుట కాధారమైనది. మనప్రాచీనులు గ్రంథముల నెట్లు నిలఁబెట్టిరో కొంచెము జ్ఞప్తికిఁ దెచ్చుకొందము.

**లిపి:—**

ప్రపంచమునఁ బ్రజలమనోగతభావములను వ్యక్తపఱచుటకుఁ గొన్ని సంకేతము లుండుట సహజము. అవి హస్తసంజ్ఞలు, కనుసన్నలు, తలయూఁపులు, ధ్వనిచేయుటలును. ఆధ్వనిని విభజించినచో చిన్నచిన్న ధ్వనివిభాగములగును. అవి మాటలు, పలుకులు, పదములు, వాక్కులు. ఏమన్నను ఒకటే. వానిధ్వనిసామ్యమునుబట్టి విభజించి నిరూపించినపుడు అక్షరములగును. అవి యుచ్చరించినవెంటనే పోవును. క్షణికములు. వానికొక సంకేత మేర్పఱచుకొని యాసంకేతములను చిత్రకారుఁడు గోడమీఁదనో బట్టమీఁదనో తూలికతో రంగులు రాచి చిత్తరువు సిద్ధముచేసినట్లు గుడ్డలమీఁదనో చెట్టుపట్టలమీఁదనో రెల్లుపుడుక మొదలగువానితో ఏదైన రంగుతో రాచుచుండెడివారు. రంగులతో లేపనము చేయుటచేత లిపియనియు, వర్ణము నుపయోగించుటచే వర్ణము లనియుఁ బైసంకేతములకు నామములు వచ్చినవి. ఆలిపిపని చేయువాఁడు లిపికారుఁడు. ఆపద్ధతినే మనము మసి లేక సిరాతో కాగితములపైని అక్షరము లెక్కించుచున్నాము

**లేఖనము, చెక్కడము:—**

ఆయక్షరసంకేతములను మఱొకవిధముగాను నిలఁబెట్టిరి. రాతిపైని బొమ్మలు చెక్కినట్లు రాతిపైని గాని రాగిమొదలగు లోహములరేకులపైని గాని శాణము మొదలగు వానితో అక్షర సంకేతములను చెక్కెడివారు. అదే గండరించుట కొందఱు గండరువు అందురు. సంస్కృతమున లేఖనము అందురు. దానినుండియే గ్రంథలేఖనము అనుప్రసిద్ధి కలిగినది.

ఆమాదిరినే తాటియాకులమీఁద నినుపగంటములసన్నని మొనలతో నక్షరములను మనవారు చెక్కెడివారు. అందు నైపుణ్యము పెరిగినకొలఁదిని సూక్ష్మాతిసూక్ష్మముగఁ దాటియాకులమీఁది వ్రాఁత పరమావధి నొందినది. అది యొక కళవంటిది. ఆలేఖనమును వ్రాయడము అని వాడెడివారు. దాననే అక్షరములకు వ్రాలు అనుపేరు వచ్చెను. వ్రాయువారు వ్రాయసకాండ్రు అయిరి. వ్రాఁత, వ్రాయుట సుప్రసిద్ధము లైనది. రాఁత అనియు వాడుక కలదు. అది కొందఱు తప్ప అందరుగాని రంగులతో రాచుట లేక రాయుట వలన నేర్పడిన లిపిని రాఁత అనవచ్చును క్రమముగా లిపికి లేఖనమునకు భేదము పోఁగా రాఁత యనియు వ్రాఁతయనియు వాడుక వచ్చియుండును. పయి తాటియాకులమీఁది వ్రాఁత మూలముననే గ్రంథములకు వ్యాప్తి గలిగినది.

**అచ్చు, ముద్రణము:—**

కఱ్ఱమీఁదఁగాని లోహముమీఁదఁగాని చెక్కినయక్షరములు చిత్తరువులు మొదలగునవి తడిమట్టిమీఁదఁగాని కరఁగిన లక్క లోహము మొదలగువానిమీఁదగాని నొత్తిన యెడల నాయక్షరములో చిత్తరువులో సరిగా నంటును. అవి ఆఱినతర్వాత అక్షరాదులు స్పష్టముగాఁ గనఁబడును. దానినే అచ్చు అనెడివారు. ఆపని యచ్చొత్తుట. దానికి సంస్కృతమున ముద్రణమని పేరు. అవి యతిప్రాచీనకాలమునుండియుఁ గలదని కొన్ని నిదర్శనములు తెలుపుచున్నవి కాని గ్రంథముల కది యుపయోగింపలేదు. కొయ్యదిమ్మలును లోహపు దిమ్మలును చెక్కి దానికి మసి వ్రాసి దాని ప్రతి కాగితముమీఁద నంటునట్లు ఒత్తుట ఇప్పటి యచ్చు. దానిలో నాగరిక, నైపుణ్యము పెరిగి పలుదినుసులగు అచ్చుఁబను లేర్పడినవి.

ఈముద్రణము నాల్గువందల సంవత్సరములకు మున్నే యితరదేశములలో స్థిరపడినది. మనదేశభాషలలో ప్రకృతముద్రణము ప్రారంభమయి ఇన్నూటేండ్లకులోఁపు. అందులో మనతెలుఁగుగ్రంథములముద్రణము నూటయేఁబదిసంవత్సరము లయి యుండును అది తర్వాతఁ జాతము.

మన ప్రాచీనులు లిపి లేఖనముల కెంత ప్రోత్సాహము గలిగించిరో చూడుఁడు.

అతిప్రాచీనకాలమున నొక రుచ్చరించినమాటలనే వినువా రుచ్చరించెడివారు. అట్లుచ్చరించుటకు సంతచెప్పుకొనుట యని పేరు. అది కొంత లొంగినతర్వాత మరల మరల నావృత్తిచేయువారు. అదే వల్లివేయుట, వల్లించుట యనఁబడును. వేదములు నేటికిని సంతచెప్పుకొని వల్లెవేయుచున్నారు. అవి స్వరప్రధానము లగుటచే నట్లు జరిగినచో సంప్రదాయము నిలుచును. ప్రతిభాషలోను ప్రతివాక్యమునను స్వరభేదమునుబట్టి యర్థభేద [illegible]

భేదములు గలుగుట సహజమే. కాని యవి కాలపరిణామమునుబట్టి మాఱవచ్చును. పామరులు వ్రాంత తెలియనివారు పాటల నట్లే దేశమున నిలఁబెట్టిరి ఒకరు పాడినరీతిని బట్టు వఱచుకొని యట్లే పాడుట లోకమునఁ గలదు గదా. కావ్యపురాణేతిహాసాదులు పెరిగిన కాలఁదిని కంఠపాఠపద్ధతి చాలినది కాదు. అక్కడక్కడఁ గొందఱు పురాణాదులలోని కొన్ని ఘట్టములు కంఠపాఠము చేయుట నేటికిని గలదు. అయినను వ్రాంత యావశ్యకమయినది. గ్రంథఫలశ్రుతులలో లేఖనము ముఖ్యస్థానము వహించినది. ఆదికవియగు వాల్మీకి రామాయణము రచించి ఫలశ్రుతిలో శ్రీమద్రామాయణము పఠించినవారికిని విన్నవారికి శుభప్రాప్తి కలుగునని చెప్పి అది లిఖించినవారికి స్వర్గసుఖములు గలుగుననెను.

"యే లిఖంతీహచ నరాస్తేషాం వాసస్త్రివిష్టపే."

దానియనువాదమగు భాస్కరరామాయణమునఁ గవి.

"ఈరామాయణసంహిత, సారమతిఁ విన్న వ్రాయఁ జదివినదురితా
పారజలరాశిఁ గడతురు, ధీరులు ధర్మార్థకామవీపితవృత్తుల్.

అని రచించెను. ఇతరకవులు నట్లు రచించిరి.

ఈసంప్రదాయము శైవకవులలోను గలదు.

"ఆరూఢమతి మల్లికార్జునపండి,తారాధ్యచరితమాద్యంతంబువినినఁ
జదివిన వ్రాసిన సంగ్రహించినను, ముదితాభిమతఫలంబులఁ బొందుటరు చె
కావున నీకృతి గారవించినను, వావిరిఁ జదివిన వ్రాసిన విన్న
నరుడొంద వారల కభిమతార్థములు, కరుణించు శివుఁడు మంగళమహాశ్రీలు."

పండితారాధ్యచరిత్ర.

రాజశిఖామణియుఁ గవిరాజశిఖామణియు నగు నన్నిచోడదేవుని కుమారసంభవమున ఫలశ్రుతి రీతిచూడుఁడు.

"వెలయ మత్కృతి సదువుఁడు వినుఁడు వ్రాయుఁ
డీశ్వరాంబికాగురుహ లిత్తు రీప్సితములు
వారి మేమెయిఁ గొనియాడువారి కోర్కు-
లొనర జంగమ మల్లికార్జునుఁడు నొసఁగు."

ఇట్లే అన్నిభాషలలోను కవు లనేకులు గ్రంథలేఖనమును బ్రశంసించిరి.

త్రిలిఙ్గరజతోత్సవము

ధనవంతు లనేకులు రామాయణాదిగ్రంథములు వ్రాయించి వ్రాతగాండ్రను బోషించుటయు వ్రాయసమువారును తమపోషకులను వ్రాసినగ్రంథముచివర నాశీర్వదించియు స్తుతించియుఁ దమకృతజ్ఞతను దెలుపుటయుఁ గొన్ని వ్రాతప్రతులచివరం గలదు. కొందఱు శ్రీరామార్పణముగా స్వోపయోగమునకై వ్రాసికొన్నటుల వ్రాయుదురు. మచ్చున కొకటి చూతము. నన్నిచోడకుమారసంభవముప్రతి వ్రాసినయాతఁడు అష్టమాశ్వాసముచివర నిట్లు వ్రాసెను—

"శ్రీమద్రాజాధిరాజ మహారాజ సహజిరాజ భూపాలకసార్వభౌమస్య యిష్టార్థః (ర్థాః) భవానీశంకరకృపయా సఫలాః సంత్తు "ఉమామహేశ్వరో రక్షతు" శివాయ నమః.

అంతే కాదు లిపి ప్రజలజీవనవృత్తులలో నొకటి యని జైనగ్రంథములు చాటుచున్నవి.

"అసిర్మషిః కృషిర్విద్యా వాణిజ్యం శిల్పమేవ చ,
కర్మాణీమాని షోఢా స్యుః ప్రజాజీవనహేతవః.
తత్ర వృత్తిం ప్రజానాం స భగవాన్ మతికౌశలాత్,
ఉపాదిశత్సరాగో హి స తదాసీజ్జగద్గురుః.
తత్రాసికర్మ సేవాయాం మషిర్లిపివిధౌ స్మృతా,
కృషిర్భూకర్షణే ప్రోక్తా విద్యా శాస్త్రోపజీవనే,
వాణిజ్యం వణిజాం కర్మ శిల్పం స్యాత్కరకౌశలం,
తచ్చ చిత్రకలాపత్రచ్ఛేదాదిబహుధా స్మృతమ్"

పయివానిలో అసి అనఁగా ఖడ్గధారణము, మషి యనఁగా మసితో (సిరాతో) వ్రాయుట. అది లిపికర్మ యని అచటనే వివరించెను.

ఆదిపురాణము. ౧౬ పర్వ. ౧౭౯ మొదలు.

అట్టి వనేకములు తార్కాణములు గలవు.

మనలో వ్రాయసమువారను ఇంటిపేరు గలవారున్నారు. వారిపూర్వులా వ్రాఁతపని చేయుచుండిరి కాఁబోలు. వ్రాయువారు లేనిచో గ్రంథములకుఁ గాని కవులకుఁగాని వ్యవహారమునకుఁగాని వ్యాప్తి యెక్కడిది? నిలుకడ యెక్కడిది?

**ప్రతులగతి:—**

ఆవ్రాఁతలలో శాశ్వతముగా నుండవలసిన రాజశాసనములు, దాన ధర్మాదులు రాళ్లమీఁదను రాగిరేకులమీఁదను జెక్కించెడివారు. సాధారణముగా గ్రంథములు తాటి యాకులమీఁద వ్రాయుచుండెడివారు. కొన్ని గ్రంథములు రాగిరేకులమీఁదఁ జెక్కించువా రుండెడివారు. తాళ్లపాకవారిగ్రంథములు చెక్కినరాగిరేకులు తిరుపతిలోనున్నవి. వాని ననుసరించియే యాగ్రంథములు ముద్రింపించిరి. అట్లే మహాగ్రంథములు కొన్ని రాగి రేకులమీఁదఁ జెక్కించి యుందురుగాని దేశోపద్రవములలో శత్రువులయొత్తిడిచేతనే దారిద్ర్యపుబాధచేతనో వానిలోఁ జాలభాగము (డేగిషా)గాఁగుడుబిందెలక్రిందను, వంట పాత్రలక్రిందను మాఱిపోయియుందునేమో! ఎంతంత దేశోపప్లవములలో సంభవించినవి. పోనిండు, తాటియాకులమీఁద వ్రాసినవైనను అప్పటివి లభించునేమో యన్న నదియు శూన్యమే. మన తెనుఁగున లభించిన గ్రంథములు నన్నయ్య భారతప్రభృతులే. అనఁగా ఇప్పటికి రమారమి తొమ్మన్నూఱు సంవత్సరములకాలపువి. అప్పుడు వ్రాసిన తాటి యాకులు ఇంతదీర్ఘకాలము నిలువయుండుట దుర్ఘటము. సహజముగా నవి చివికిపోవును గదా. ఆమాతృకలు చూచి వ్రాసినప్రతులు గూడ లభింపవు. తాటియాకు నాలుగువందల సంవత్సరములకంటె నెక్కువకాలము నిలువయుండ దందురు. అట్లు కొన్నితరములవారు వారివారికి లభించిన ప్రతులనుబట్టి వ్రాసినప్రతులు మాతృకలకుఁ బుత్రికలు గావు సరి గదా. ప్రపౌత్రికలుగూడఁ గాఁజాలవు ఎప్పటివో యొకప్పటివి ఏదోరూపముతో నిలిచి యున్నవి మనకు లభించినవి. అదే మనకు గొప్ప యదృష్టము. మతద్వేషము, జ్ఞాతిద్వేషము, రాజకీయద్వేషము మొదలగు ద్వేషాగ్నులలో దగ్ధము గాఁగా అన్నిగండములు దాఁటి నవి మనకు లభించినవి.

భాషాపోషకులు లభించినపుడు గూడఁ గొన్ని గ్రంథములు చెల్లాచెదరై యుండును. పండితులును గవులు భాషాపోషకు లున్న దేశములకుఁ బోవుట సహజము. వారితో వారి గ్రంథసామగ్రి కూడఁ దీసికొని పోదురు. రెండుమూఁడుతరములు వారికుటుంబ మచట నివసింప వారియనంతరపురుషులు విద్యాభిమానులు గాకున్నచో నవి యాదేశమున మ్రగ్గి పోవలసినదే గదా గ్రంథములు విద్వత్కవులతో శ్రీకృష్ణదేవరాయలకాలమున విద్యా నగరప్రాంతములకు, రెడ్లపరిపాలనాకాలమున వారున్న ప్రాంతములకును నాయకరాజుల కాలమున తంజావూరు మధురప్రాంతములకును ప్రయాణములు చేసినవి. ఎక్కడను లభింపని నన్నిచోడకుమారసంభవ, సోమన హరివంశాదులు తంజావూరులో లభించినవి. ఎన్నెన్ని

చోట్లకో చెదరిపోయినవి. అందాక ఎందులకు? ఆంగ్లేయులపరిపాలనాప్రారంభమున ఏతాటియాకుకట్టలతోనో మనతెలుఁగుగ్రంథములు లండనులో ఇండియా ఆఫీసుకును, బోడ్లియను లైబ్రరీకిని చేరిన వఁట! అవి అన్నియో వానిలోఁ గొన్నియో శ్రీబ్రౌనుదొర గారిధర్మమా అని మరలఁ జెన్నపురికళాశాలాభాండాగారమునకుఁ జేరి చివరకుఁ బ్రాచ్య లిఖితపుస్తకభాండాగారమునకుఁ జేరినవఁట. ఈవిషయము బ్రౌనుదొరగారు వ్రాసిరి. ఆ బ్రౌనుదొరగారు తెలుఁగుజిల్లాలలో జడ్జీ ఉద్యోగములో ఉన్నపుడు క్రైస్తవశకము 1825 ప్రాంతమునుండి ముప్పదినలువదిసంవత్సరముల కాంధ్రభాషకుఁ జేసిన మహోపకారము లన్నిటికంటె గొప్పది. మనపూర్వగ్రంథములను నిలఁబెట్టుటయే. ఆసంగతి మనము చెప్పు కొని తీఱవలెను. ఆయన భారతదేశమున సుద్యోగములో నియుక్తుఁడైనప్పటికి వారికిఁ దెలుఁగు తెలియదు. అప్పటికాలములో దొరలు ఏదేశములో ఉద్యోగముచేయుదురో ఆదేశభాష వ్యవహారమునిమిత్తము తెలిసికొనియుండవలెనని నిబంధనము కాకపోయినను దొరతనమువారియభిప్రాయ ముండెడిది. మసూలిపటము, కడపా మొదలగుచోట్ల జడ్జీపదవి లోనున్న బ్రౌనుదొరగారు తెలుఁగు నేర్చుకొనుటయే కాక మేధావంతులుగాన తమతోటి దొరలు తెలుఁగు నేర్చుకొనుట కనువైన గ్రంథములు కొన్ని వ్రాసి ఇంగ్లీషు-తెలుఁగు, తెలుఁగు-ఇంగ్లీషునిఘంటువు వ్రాయఁబూనినాఁడు. దానికి సామగ్రి సంపాదించుటలో ప్రబంధములు, భారతాదిగ్రంథములు సంపాదించిరి. తాను ధనవ్యయముచేసియు ధనముతో సాధ్యముకానియెడల మంచితనముతో ప్రవర్తించియుఁ గొంతమంది పండితులవలన విద్యయు, గ్రంథములుఁ గూడ సంగ్రహించెను. ఆయనకాలమునకు ఇతరదేశభాషలయందువలెఁ దెనుఁగునఁ గూడ ముద్రణము ప్రారంభమయినది.

**తెనుఁగుముద్రణము:—**

కొన్ని క్రైస్తవగ్రంథములును బ్రౌనుగారు కాంప్‌బెల్లు రచించిన తెలుఁగు వ్యాకరణమును, ఇంగ్లీషు తెలుఁగునిఘంటువును, కారీదొరగారు రచించిన తెనుఁగు వ్యాకరణము మొదలగునవి తెనుఁగు నేర్చుకొనదలఁచిన దొరల కుపయోగమైనరీతిని ముద్రింపఁబడినవి. మిగిలినవి క్రైస్తవమతప్రచారనిమిత్తమైనది. అప్పటికి మనదేశమున తాళపత్రగ్రంథములును అవిపఠించిన భాషావేత్తలును ఆంధ్రకవులును అక్కడక్కడఁ గలరుగాని ఆప్రతులన్నియుఁ దెలిసియుఁ దెలియనివ్రాఁతలతో వేలువేలుపాఠములతో నుండెను. అనేకగ్రంథము లిప్పటికిని వట్లే యున్నవి. బ్రౌనుదొరగారు మనుచరిత్రప్రతులు గొన్ని సంపాదించి ముద్రణమునకు శుద్ధమైన ప్రతి సిద్ధపఱుప యత్నించి కొందఱు పండితులను

నియమించి యొక్కొక్క ప్రతిలోని పద్యములను జదివించి యందు వేఱువేఱుపాఠములు గలచోటఁ బండితసాహాయ్యమునఁ గవిరచించిన పాఠ మిది యని తీర్మానించుకొని యొక ప్రతి యేర్పఱచి దానికి జూలూరి అప్పయ్యగారను పండితునిచే వ్యాఖ్య వ్రాయించి ముద్రింపించిరి. ఆరీతిగా భారతమునకుఁ గొన్ని ప్రతులు సంపాదించి యందలిపాఠభేదములను గుర్తించుచుఁ గాగితములమీఁద వ్రాయించెను. వెనుక గ్రీకు ల్యాటినుల గ్రంథములట్టియవస్థలో నుండఁగాఁ గొంతమంది భాషాభిమానులు బహుగ్రంథములను సరిచూచి వానిననుసరించి కవి గ్రంథమును ఏర్పఱచి ముద్రింపించిరి. మనదొరగా రాపద్ధతులనే యవలంబించి ముద్రణమునకుఁ దెనుఁగుపుస్తకములను తయారు చేసిరి. తప్పులు లేని పుస్తకము ఒకటియు దొరకలేదు. ఆసమయమున సంగ్రహించిన భారతపదములును వాని యర్థముతోను లక్ష్యములతోడను తన నిఘంటువునఁ జేర్చెను. తననిఘంటువునకుఁ బ్రమాణముగా గ్రహించిన ప్రబంధములను తదితరగ్రంథములను వానివానిప్రతులు సంపాదించి పండితసాహాయ్యమునఁ బాఠములును అర్థములును నిర్ణయించి నిఘంటువు కూర్చెను. ఆసందర్భమున బహుపాఠభేదములతో నున్నగ్రంథములను పరిశీలించి సాధ్యమగునంతలోఁ గవిప్రయుక్తపాఠ మిది యని నిర్ణయించి శుద్ధమగుప్రతి సిద్ధపఱచుమార్గము చూపినయాతఁడాతఁడే. గ్రంథములను సంపాదించుట కాతఁడు ఎన్నెన్నో వ్యయప్రయాసములను సహించెను. దొరతనమువారియుద్యోగులద్వారా ఆయామండలములలోని గ్రంథములప్రతులనేకములు సంపాదించెను. ఆయన యొకమాఱు ఇంగ్లండుకు వెళ్లినపుడు ఇండియాహౌస్ లైబ్రరీలోను గల పుస్తకములను బరీక్షించుచు నందున్న తెనుఁగు కన్నడగ్రంథములు చూచి యవి మద్రాసు పంపుట కేర్పాటుచేయింప దొరతనమునకు సలహానిచ్చెను. వారిసలహామీఁద ఆగ్రంథములను మద్రాసు పంపగాఁ దాము చూచి యుపయోగించి యవి మద్రాసు కళాశాలాభాండాగారమునకుఁ జేర్చిరి. చిట్టచివరఁ దాను సంపాదించిన గ్రంథములప్రతులను గూడ నక్కడకే చేర్చిరి. అవి యన్నియుఁ గలుపగా నేర్పడినదే(ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సులైబ్రరీ) ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారము. ఆబ్రౌనుదొరగారు తయారుచేయించిన భారతములప్రతులును ఇతరగ్రంథములప్రతులును ఆభాండాగారమున నున్నవి. వారికాలమునకే మెకంజిదొరగారు ప్రోవుచేసిన కైఫీయతులు మొదలగునవి బ్రౌనుదొరగారు కొంత యుపయోగించి వానికిఁ బ్రణాళికలు వ్రాయించిరి.

ముద్రణరీతులలో గొన్ని మార్పులుగావించి ఆంధ్రగ్రంథములను ప్రకటింపఁ బూనుకొని తానుగావించిన యాంగ్లానువాదముతో వేమనపద్యములును మనుచరిత్రాదులును

ప్రకటించెను. అప్పటికి రావిపాటి గురుమూర్తిగారి తెలుఁగువ్యాకరణమును ద్వాత్రింశ త్సాలభంజికకథలును, విజయవిలాసము, మరి కొన్ని చిన్నపుస్తకములును మాత్రము ముద్రిత మైనవి. భారతాదిగ్రంథములను బ్రకటించుటకు దేశీయులప్రోత్సాహము లేదు సరి గదా. వానిని ముద్రించి ప్రకటించుట వాని నపవిత్రము చేయుటగా భావించుచుండెడివారని వారు వ్రాసిరి. అప్పుడు లోకానుభవముగల మన బ్రౌనుదొరగారు గ్రంథప్రకటనమును పుస్తకములవర్తకులు లాభకారి యగు వ్యాపారముగాఁ జేపట్టినఁగాని తెలుఁగువాఙ్మయము వృద్ధిలోనికి రాఁజాలదని గ్రహించి దానికిఁ దగిన మార్గములతో వర్తకులకు సలహా లిచ్చుచుండెడివారఁట. దానికి ఫలితముగా తెలుఁగుముద్రణవ్యాపారము బాగుగాజరిగినదని వారే వ్రాసిరి.

బ్రౌనుదొరగారు 1850 సం॥ మునకుఁ బూర్వమే సంస్కృతశ్రీమద్భాగవతము తెలుఁగులిపిలో ముద్రింపఁబడినది చూచితిమని వ్రాసియున్నారు.

శ్రీభాగవతము మొట్టమొదట తెలుఁగులిపిలో ముద్రింపించినవారు శ్రీవావిళ్లరామ స్వామిశాస్త్రులవారు అని తెలియుచున్నది. ఆప్రాంతముననే శంకరవిజయము శ్రీమద్రామా యణము అమరము, గురుబాలప్రబోధిక అనుసంస్కృతగ్రంథములను తెలుఁగులిపిలో రామస్వామిశాస్త్రులవారు ప్రకటించిరి. గ్రంథవ్యాప్తికి వారు ముఖ్యులయిరి. వారు తెనుఁగుగ్రంథములను గూడ ముద్రింపించుచుండెడివారు. అందులో లీలావతి యను గణితగ్రంథమునకు తడకమళ్ల వేంకటకృష్ణరావుపంతులుగారను సుప్రసిద్ధులు తెనుఁగున లెక్కల యుదాహరణములతో నాంధ్రీకరించిరి. దానిని ప్రకటించినవారు వావిళ్ల రామ స్వామిశాస్త్రులవారు వారిరువురకును జరిగిన యుత్తర ప్రత్యుత్తరము లాగ్రంథము మొదట బ్రకటింపఁబడినవి. 1861-వ సంవత్సరమున నది ముద్రితము. అంతకుముందే రామస్వామి శాస్త్రులవారు బహుగ్రంథప్రకటనము గావించినవారని స్పష్టముగాఁ దెలియుచున్నది.

తెనుఁగుముద్రణము పరిశీలింపఁగా నిట్లున్నది.

మన చెన్నపురమున హిందూభాషాసంజీవిని యనుపేరఁ గొందఱొక సంఘమేర్పడి తెలుఁగులిపిలో సంస్కృతగ్రంథములును తెనుఁగుగ్రంథములును బ్రకటించుచుండెడివారు. కొంతకాలమున కాసంఘమువారిలోఁ గొందఱు తప్పుకొనిరి. చివరకు నిలిచినవారు, 1. సర స్వతి తిరువేంగడాచార్యులువారు, 2 వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు, 3. వావిళ్ల అనంత నారాయణశాస్త్రులవారు (వీరు రామస్వామిశాస్త్రులవారి సోదరులలో నొకరు) వారు మువ్వు రును ఆ పేరనే కొంతకాలము గ్రంథప్రకటనము గావించుచుండిరి.

## గ్రంథవ్యాప్తి.

వావిళ్ల రామస్వామిశాస్త్రులవారికిని వారిపెద్దయన్నగారగు అనంతనారాయణ శాస్త్రులవారికిని వివేకరత్నాకర మనుపేర వేతొక ముద్రాలయము కలదు. దానిలో వారుభయులకును సమానాధికారముండెను. రామస్వామిశాస్త్రులవా రప్పటికే ఆదిసరస్వతీ నిలయమను ముద్రాలయమునకు యజమానులయి యుండిరి. ఈరెండు ముద్రాక్షరశాలల ప్రశంసయు చెన్నపురీవిలాస ప్రబంధమునఁ గలదు.

వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు వ్యవహారనిపుణులు. ముద్రణవ్యాపారనిరూఢులు. గ్రేటు ప్రయిమరను చిన్నయక్షరములముద్రణము జరుగుచుండుకాలమున ఇంగ్లీషు బాడీ అను పెద్దయక్షరముల పద్ధతి (మోలి) కనిపెట్టినవారు వారఁట. సంస్కృతాంధ్ర భాషలలో నిరూఢమైన పాండిత్యముగలవారు. వారు చక్కని వ్యాఖ్యాతలు. వారు మనుచరిత్రకును ఆముక్తమాల్యదకును రుచిసమాఖ్యవ్యాఖ్యలు రచించిరి వారిపదపదార్థ విజ్ఞాన మందు స్పష్టము. ఆవ్యాఖ్యానముల చివర గద్యములు చూడుఁడు.

"శ్రీదక్షిణామూర్తిమంత్రోపాసనాసమాసాదితాఖండసాహితీధురీణుండు నాత్రేయ గోత్రపవిత్రుండు వావిళ్లవంశపయోరాశిరాకాసుధాకరుండు నగు రామస్వామిశాస్త్రిచేత ననేకపూర్వవ్యాఖ్యానాభిప్రాయంబులఁ బర్యాలోచించి రచియింపబడిన రుచిసమాఖ్యానం బగు ప్రతిపదార్థరూపంబగువ్యాఖ్యానంబునందు...."

దీనివలన వారివంశప్రశస్తి వారియుపాసనాబలము పాండిత్యప్రకర్షము స్పష్టమగు చున్నది. మఱియు వారిపాండిత్యవిశేషమును గ్రంథప్రకటనమును చూచి సంతసించి విజయ నగరము, బొబ్బిలి, వేంకటగిరి మొదలగుసంస్థానముల ప్రభువులును, నెల్లూరుమండలము లోని రెడ్డిప్రభువులును శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారి నెంతయో యాదరించి బహు విధముల సన్మానించుచుండిరి. వీరికి గొప్పసాహాయ్యము చేయుచు అప్పటి వల్లూరిజమీాం దారులు వీరి నెంతయో గౌరవించుచుండెడివారు. ఆవిషయమును చెన్నపురీవిలాసమను ప్రబంధము చాటుచున్నది.

చెన్నపురీవిలాసమునుగుఱించి కొంచెము ప్రశంసించి యాతనిగ్రంథమునుండి యుదాహరించుట యుచితము గదా. 1864 సంవత్సరమునఁ జెన్నపురిలో వల్లూరి ప్రభువగు బొమ్మదేవర నాగభూపాలుఁడు నివసించుచుండెను. ఆప్రభువుసన్నిధిని మతుకుమల్లి నరసింహ శాస్త్రి యను విద్వత్కవి యుండెను. ఆకవీశ్వరుఁడు నాగభూపాలుని ప్రార్థనమీాఁదఁ జెన్నపురీవిలాసమను పద్యప్రబంధము రచించెను. తద్గ్రంథపీఠికలో కవి కృతిపతిని వర్ణించుచు

"ప్రబలు రాజాబహద్దరు ప్రభృతి నిభృత
బిరుదపుంఖితధక్కాగభీరనినద
భీతభీతాఖిలాహితవ్రాతుఁ డగుచు
బొమ్మదేవరకుల నాగభూవిభుండు.

మ. జనులెల్లన్ జగతీమహేంద్రుఁ డనఁగా సామ్రాజ్యసంపూర్తిఁ జే
ర్కొన వల్లూరు వసంతవాడ మఱియుం గూడూరు నాఖ్యాతిఁగాం
చిన రాజ్యంబు లనంతధాన్యధనలక్ష్మీపూర్ణతన్మించఁగాఁ
దనరున్నాగనరేంద్రుఁ డుద్భటభుజోద్దామప్రతాపోన్నతిన్.

ఉ. అయ్యవనీతలాధిపజనాగ్రణి గోర్నరమెంటువారి క
ట్టయ్యవిభూతిచే నమితసంఖ్యమహాశకటప్రచారసా
హాయ్యముపేర్మి సైన్యముల కాహవసన్నహనోద్యమంబులన్
జయ్యనఁ జేసి మేల్గను నజస్రతదార్జితవైభవోన్నతిన్.

... ... ...

మ. మహిమం జాకలిపేటఁ దంజపురి రామానాయనింగారిచే
విహితంబౌ మహితాగ్రహారమున నావిర్భూతశాఖానికా
యహిమప్రాయతలద్రుశోభితతదీయారామసౌధంబులో
రహి మీఱి న్నివసించి యాత్మపరివారవ్రాతముల్ గొల్వఁగాన్."

ఈపద్యమునఁ జేర్కొనఁబడిన శ్రీతంజపురి రామానాయుడుగారు గావించినఘన కార్యములలో నొకమహాకార్యము మనము స్మరించుకొందము.

శ్రీరామానాయుడుగారు "బ్రాహ్మణులకు ఒకగొప్ప అన్నసత్రము సంస్కృతపాఠ శాల యొకటి జాకలపేటలో స్థాపించి సమస్తశాస్త్రములను బోధింపఁజేయుచుండెడివారు. విద్యార్థులభోజనసదుపాయమునకు నన్నసత్ర మొకటి నెలకొల్పిరి. ఆపాఠశాలలో విద్య నభ్యసించినవారనేకులు గొప్పపండితులై మహాప్రసిద్ధి నొందిరి.

మనరామస్వామిశాస్త్రులవా రాపాఠశాలకుఁ బరీక్షాధికారులుగా చిరకాలము పని చేసిరి. ఆపాఠశాలయు నన్నసత్రమును శాశ్వతముగా జరుపుట కారామానాయుడుగారు తగిననిబంధనలు గావించి ధర్మకర్తను నేర్పఱచిరి. కాని, ఏకారణముననో ధర్మకర్త లవి సాగింపరైరి. దాని పునర్నిర్మాణము గావించి మరల ఆపాఠశాలయు సత్రమును జరగునట్లు

చేయించుట మనకు విధి.ఆమహానుభావునికీర్తియు దానివలన దేశములోఁ గొందఱకుఁగలుగు విద్యావకాశమును పునరుద్ధరణముచేయుట నూతనసత్రాదులు పెట్టుటకంటె గొప్పది గదా. ఆమహాకార్యమును సమర్థులు పూనుకొందురుగాక. ఇంక చెన్నపురివిలాసములోని తత్ప్రాతి భాగము చూతము.

గొలువ నిండుకొలువై యుండి.

నను మాల్యాద్రి ... ... సమీూ

... ... ...

... ... ...

పనివిప్పున్న రసింహపండితుని సంభావించి పల్కెన్ దయన్.

... ... ... నృసింహశాస్త్రి.

చ. పురములలోనఁ జెన్నపురి పూర్ణవిలాసము వర్ణనీయమై
ఖరి యగుఁ గానఁ దత్పురవికస్వరచారువిలాసవర్ణన
స్ఫురణనొనర్ప నొక్కకృతి భూరిగభీరతరార్థగుంభన
ర్మరసభరంబుగా మతుకుమల్లి నృసింహకవీంద్రశేఖరా.

అని పగౌరవంబుగా నానతియొసంగిన......రచించిన చెన్నపురివిలాసప్రబంధమున అప్పటి చెన్నపురిస్థితియంతయు వర్ణింపఁబడెను. అందు ముద్రాక్షరశాలాప్రకరణమునఁ జెప్పినది మనకుఁ బ్రసక్తమైనవిషయము. చూడుఁడు.

మ. పురిముద్రాక్షరశాలికానికర మొప్పున్ యంత్రసంకీలితా
క్షరభాస్వద్వసుకోశసంతతి కళాకాంతుల్ పరీక్షింప నా
దర మొప్పన్ విబుధాధినాథులు నితాంతప్రౌఢి రక్షింపఁగా
నరుదారన్ మహి భారతీమహితభాండాగారసంభావనన్.

సీ. విద్యానిలయ మాదివిద్యానిలయము కళానిధి జ్యోతిష్కళానిధియును
శారదానిలయంబు జ్ఞానసూర్యోదయంబు నలసూర్యాలోకనము సరస్వ
తీనిలయంబు నాదిసరస్వతీనిలయంబు వివేకరత్నాకరంబు
నన వివేకాదర్శ మన వర్తమానతరంగిణియు ననంగ రమణఁ జెందు
నందు హిందూప్రశస్త ముద్రాక్షరాల
యము లశేషమనీషిజనాభినంద్య

త్రిలింగరజతోత్సవము

మానవిభవాన్వితంబు లై మాననీయ
శారదాటంకశాలికాచారురేఖ.

జనులెల్లన్ దినవర్తమానియును బోర్డ్సుం జార్జి గేజెట్టిన్ గ్రం
టన మిష్నేరియు నాఁగ మెచ్చనగు నచ్చాఫీసు లాయింగిలీ
షున్ృపన్యస్తము లప్పురేంచిరతనుం జూడంగ నేలెంచు మా
తృనికాయంబున కూన్చు నావసుధ భూరిశ్రీ దనర్చుంబురిన్.

ఆముద్రాక్షరశాలలందు మహితం బౌతండియాశ్వేటస
ద్ధామం బాదిసరస్వతీనిలయ ముద్రావర్ణసద్మంబు సా
యామశ్రీవిలసిల్లుఁ దత్పురిఁ దదధ్యక్షుండు వావిళ్ల స
ద్రామస్వామివిపశ్చిదగ్రణి ప్రసిద్ధప్రఖ్యఁ గాంచున్ ధరన్.

శ్రీమత్పావనబొమ్మదేవరకులక్షీరాబ్ధిరాకాసుధా
ధామశ్రీయగు నాగభూపతి జగత్ప్రఖ్యాతిగా వీటనా
రామస్వామి మనీషిచే నిఖిలసద్గ్రంథాలి ముద్రింప లో
కామోదంబగున ట్లొనర్చె ధనసాహాయ్యంబు వాటించుచున్.

ఈరామస్వామిమనీషియే వావిళ్ల రామస్వామి శాస్త్రులవారు. చెన్నపురీవిలాసము వీరే మొదట ముద్రించినవారు.

చెన్నపురీవిలాసము ౧౭౮౬ శాలివాహనశకము క్రీస్తు 1864 సంవత్సరమున రచింపఁబడినది. రౌద్రిలో రచింపఁబడిన యిది దుందుభిశ్రావణమున రామస్వామిశాస్త్రులవారి ముద్రాక్షరశాలలందు ముద్రింపఁబడినవి.

చూడుఁడు దానిముఖపత్రము.

శ్రీమదభంగురశ్రీతరంగితమంగళత్రిలింగదేశ
ధీశ్వరులును

పట్నాలగోత్రపవిత్ర నిర్మల బొంమదేవరవరవంశవారిజవాసేశ్వరులు నగు శ్రీమన్నాగ వహీశ్వరమహేశ్వరులు నిజశాసనంబువలన నిజసభాలంకారహీరమణులగు మతుకుమల్లి నృసింహవిద్వన్మణులచే ప్రణీతంబగు

చెన్నపురీవిలాసంబను ప్రబంధంబు

మహోల్లాసంబగునట్లు కృతి యందుకొని లోకప్రఖ్యాతంబుగా సకలజనమానసోల్లాసం బగునట్లు

శ్రీమచ్చెన్నపురీ నగరాభరణాయమానతండియార్పేటశాఖానగరనిహితాదిసరస్వతీనిలయ వివేకరత్నాకరముద్రాక్షరశాలాధికారులగు వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిచే తదీయ ముద్రాక్షరశాలయందు భద్రముద్రాక్షర ముద్రితము చేయించి బ్రసిద్ధినొందించిరి.

దుందుభినామసంవత్సర శ్రావణమాసము.

ఈగ్రంథమును శ్రీవేంకటేశ్వరశాస్త్రులు నేడందఱకుసమర్పించి తమయభిమానమునుజాటిరి.

అప్పటినుండి వావిళ్లవారు నేటివఱకు బహుగ్రంథములను బ్రకటించిరి. ప్రకటించుచున్నారు, ప్రకటింపఁగలరు. మన వావిళ్లప్రకటనము నూఱుసంవత్సరములనుండి జరుగుచున్నది. ఈవఱదైర్ఘ్యమవిచ్ఛిన్నమన్నారు పెద్దలు. ఒకేధాటిగా నూఱుసంవత్సరము లొకకుటుంబమువారు గావించిన గ్రంథప్రకటన కిదే యుదాహరణము. అద్వితీయము. చిరకాలము జరుగుటలోనే కాదు. వివిధవిషయగ్రంథప్రకటనమున సుందరబంధబంధురత్వమున సర్వవిధముల నద్వితీయము. వీరిప్రకటనములలో ఆంధ్రము ప్రధానస్థాన మాక్రమించుటచేత ఆంధ్రలోకము ధన్యమైనది. శ్రీరామస్వామిశాస్త్రులవారి కుమారులు శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అనుపేరనే వ్యాపారము జరుపుటచే నింతశాశ్వతకీర్తి వారికి లభించినది. బహుగ్రంథవ్యాప్తికి వారే ప్రధానులయిరి. వీరును అన్నిటిలో ఆంధ్రమునకు ముఖ్యాభివృద్ధి గావించుటచే ఆంధ్రలోకము కృతజ్ఞమై వీరికి భాషోద్ధారకబిరుద మొసఁగి సమ్మానసభలఁ గావించి గౌరవించినది. ఇప్పుడు గౌరవించుచున్నది. గౌరవింపనున్నది. ఇండియన్ ఎక్స్ప్రెస్సు, లీడరు మొదలగుపత్రికలావిషయమును దిగంతములవఱకు వ్యాపించునట్లు మ్రోగించినవి.

త్రిలిఙ్గపత్రిక తెలుఁగుల నందఱ నాకర్షించినది. మూలమూలల నున్న మతవిషయములను సాంఘికరాజకీయములను బోధించుచున్నది. దానికి రజతోత్సవము జరుగుటయే దానిప్రతిష్ఠను చాటుచున్నది. ఆవిషయమున ననేకులు ప్రసంగించిరి గదా! ఫెడరేటెడ్ ఇండియా అను ఆంగ్లపత్రిక మనఖండముననేకాక ఇతరఖండములలోను వ్యాపించుట సర్వవిదితమే కదా.

తెలుఁగొకటేకాదు. సంస్కృతము (అందులో నాగరలిపి, తెలుఁగులిపులు), తమిళము, (అందులో గ్రంథాక్షరి, తమిళ లిపి), కన్నడము, ఇంగ్లీషు, అన్నిటిలో గ్రంథప్రకటనము, పత్రికాప్రకటనుగావించి సుప్రసిద్ధనామము సంపాదించిన మన శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారికి ఇతోధికైశ్వర్యారోగ్యాయుష్యములనొసంగి భగవంతుఁడు రక్షించుగాక!



# ఆశంసనము

## విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు, మదరాసు.

యక్షపత్యాశదక్షవాట్యభవమూర్తి యామ్యదిశయందు శ్రీకాళహస్తివిభుఁడు,
వరుణదిక్కున శ్రీశైలవాసి శివుఁడు, సాఁకుదురు వేంకటేశ్వరశాస్త్రి నెపుడు.

విప్రులతెగ లెన్ని విలసిల్ల? వవి పేరు వడెను? 'పుదూరు ద్రావిడ' తెగగతి,
వంశమ్ము లవి యెన్నివఱలవు? విఖ్యాతిఁ బడసెనె? 'వావిళ్ల' వంశ మట్లు,
పండితోత్తము లెంద ఱుండరు!, కనిరె ప్రశస్తి? రామస్వామిశాస్త్రిమాడ్కిఁ,
దనయు లెందఱు లేరు? తండ్రియుద్దేశము లీడేర్తురే? వేంకటేశ్వరువలె,
నన్నిగుణములు నొకచోట నమరు టరుదు, అరరె! వావిళ్ల వేంకటేశ్వరునియందు
నమరు టన్నియుఁ బూర్వపుణ్యమ్ముగాదె?, కీర్తికన్య వరింపదె కోరి యతని?

వావిళ్లవారిచేఁ బ్రచురింపఁబడినగ్రంథమ్ము లేనట్టిగృహ మ్మొకండు,
వారాని కొకతేప వార్తలతోఁ 'ద్రిలింగ' యనుపత్త్రికరానిగ్రామ మొకఁడు,
భాషాభిమానులఁ బల్కుచో వేంకటేశ్వరశాస్త్రిఁ జేకొనిప్రాజ్ఞుఁ డొకఁడు,
వారిచే, దొరకినవఱకు కచ్చువడనిపురాతనకవికృత-గ్రంథ మొకఁడు,
గనఁబడదు నేటిదాఁకను దెనుఁగునాట, మాట లేటికి మనతెల్వితేఁటలెల్లఁ
బేఁటలకుఁ జాట నాంధ్రులపేర్మి నాట, బాటఁ జూపిన వావిళ్లవారె ఘనులు.

గొనబౌ పాండితి యుండినన్ ధనమదంగున్, సంపదల్ గూడినన్
వినయం బొప్పదు, తద్గుణంబుఁ దనరన్ విద్వత్సమారాధనం
బొనరంబో దది లభ్యమైన జనసేవోత్సాహ మింతేనియుం
గనరా దన్నియు నాశ్రయించె నిను వేడ్కన్ వేంకటేశాగ్రణీ!

దాదాపొక్కశతాబ్ద మాంధ్రజనవిద్యావ్యాపకోద్యోగదీ
క్షాదక్షత్వ మెసంగు పండితులఁ గాంచం జాలు వంశం బిలన్
మీదేకాక మఱొక్కఁ డేది? సురవాణిం దెల్గుబాసం గడుం
బ్రోదిం జెందఁగ నీవుగా కొరుఁడు సూరుం డేడి? విద్వన్నుతా!

హెచ్చరిక:-

కొలుతు నవరసము లొలుకఁగఁ, బలుకు చలంకృతుల మెఱసి బహులలితక్రీ
డల నృపులమదుల దొంగిలఁ, గలధన్యను సుకవి మాన్యఁ గవితాకన్యన్.

పుయిలోడక భయమందక, నయగారితనంబు వెలయ నానాధరణీ
దయితులసభలను నృత్య, క్రియ లొనరఁ గవిత్వకన్య కీర్తివహించున్.

"యతియుం బ్రాసముఁ గూర్చుమాత్రఁ గవియే యామాత్రపుం దెల్వి యీ
క్షితి యంబ్రహ్మలకుండ దెందఱ" కటా శ్రీవేంకటేశోక్తి సూ
నృత, మాటీరు కవీంద్రులే ఋషులన న్విజ్ఞోత్తమాదిష్టముల్
వితథైనన్ జగము ల్వడంకవొకో? దేవీ యాంధ్రభాషారమా!

"కవితము సెప్పగల్గు" మని గ్రామము గ్రామము చుట్టి చుట్టి హే
యపు నరపాలి కాశువులటం చఱగానికి నాఱుపద్దెముల్
దెప తెప చెప్పు నాకుకవిదేబెల కెల్లను కొంప పెట్టెదున్
నృపతి సభావిహార సుకవీంద్రకృతీందిర సారె సారెకున్.

చీకొట్టుల్ గురియించులోభు లిడఁగాఁ జేకొన్నసాల్వల్నగల్
గోకల్ షోకుల జోకులౌఁ బతకముల్ గోరాడ్విభూషాంకముల్
గోకొమ్మంచు మహీశ్వరుల్ పిలిచి యీఁగూర్మిన్ సమర్పించు వ
స్త్రాకల్పంబు లనల్పముల్, పతకముఖ్యంబుల్ సుకీర్త్యంకముల్

భిక్షించి తెచ్చికొనియెడు, రక్షణపుఁ రేకు లాభరణములు సాల్వల్
కుక్షింభరతం దెలిపెడు, లక్షణములు, కవిత కవ్వి లక్షణములొకో!

కవితాకుమారి! నీ వవివేకి వయితివే! నుడివినంతన వచ్చి నోటఁ దక్క,
బిరుదమా! నీవింతపేలవం బయితివే! పిలిచినంతన వచ్చి పేరి నెక్కఁ,
చెండేరమా! నీవు బీరంబు వీడితే! యడిగినంతన వచ్చి యడుగుఁ ద్రొక్క,
సాలువా! నీవేమి చాకింటి మడతవే! తలఁచినంతన వచ్చి తలను నెక్కఁ,
బొట్టబొడిచిన ముక్క లేనట్టివార, లెల్ల భాషామహాదేవి నేడిపింపఁ
గవులమని లేచి యరుదెంచుకాలమందుఁ, గోవిదులు కవులౌట సిగ్గులకుఁ జేటు.

ఊరి

త్రిలిఙ్గరజతోత్సవము

అభినవవ్యాసాంక మందవచ్చునుగాక, బహుపురాణాఖ్యానపటిమ మేడ!
వ్యాఖ్యాతృచక్రవర్త్యాఖ్యఁ గల్గునుగాక, శబ్దభావజ్ఞానశక్తియేడ!
కవిసార్వభౌమవిఖ్యాతి యబ్బునుగాక, డిండిమభట్టు నోడించు టేడ!
గండపెండారంబు గాల వెల్గునుగాక నవ్యప్రబంధసంధాన మేడ!
వట్టి 'డబుడక్క' వేసాల వశ్య మగునె!, పాండితియుఁ గవితయు నెట్టివానికేని
రెండునుంగల్గి నృపబుధాఖండలులకు, వేడ్కఁబుట్టించు కవులకే బిరుదు లొప్పు.

'కవిసార్వభౌముఁ'డన్ ప్రస్తవము నాఁటికి నేఁటికగు నొకనికె రెండవతని కగునె!
'శబ్దశాసన' సద్యశంబు నాఁటికి నేఁటికగు నొకనికె రెండవతని కగునె!
'కవితాపితామహ' ఖ్యాతి నాఁటికి నేఁటికగు నొకనికె రెండవతని కగునె!
'సహజపాండిత్య' ప్రశస్తి నాఁటికి నేఁటికగు నొకనికె రెండవతని కగునె!
నేఁటికవు లేడ! యేడ ఆనాఁటికవులు!, 'వాసుదే' వాఖ్య యున్నంతఁ బౌండ్రకుండు
యదుకులుం డౌనె! కవులార! యదరిపడక, 'నక్కవాఁతల' కత మదిం దలఁపుఁడయ్య!

పరిణయసభల, గర్భాధానతల్పంబు కడ, నామకరణంబు నడుచుచోట,
రాజకీయోద్యోగి రాకపోకలుసాగుపట్టున నరసికప్రజలయొద్ద
మేజువాణీచెంత రాజపీఠముపొంతఁ బట్టనిర్మాణంపు సభ్యసరస
సంగీతహరికథాసందర్భములయందుఁ గాటిలోఁ బీనుఁగు కాష్ఠమునెడ
నెల్ల యిక్కల నీవరై యేడ్తువేల, పద్దెములతోడ, నీపని పాడుగాను,
కవితకుం బెద్ద లిడినట్టి గౌరవంబు, గంగపాల్సేసి తెక్కటా! కవికుమార!

గొప్పయుద్యోగముల్ గోరినసమయమం దధికారి జనముల యండ కంపి,
కాసువీసముల కేకారినయదనున సిరిగల్గు లుబ్ధుల చెంత కంపి,
"సర్టిఫికేట్సు" గాంచఁగ నెంచినప్పుడు పలుదొడ్డవారలపజ్జ కంపి,
యింటిబత్తెము గడియింపఁ బూనినతఱి యరసికపశువుల సరస కంపి
కనఁబడిన యొల్లమనుజులకడకు నంపి, సారమును జంపి కవిత బజారిఁజేసి
రకట, యీనాఁటికవు లిఁక నామె పెక్కు, వ్యాధులకుఁ బాలువడి కుందు టబ్బురంబె!

'చకచక' చెప్పుదు మని యే, కొక్కిబిక్కి యల్లికలో నాల్గు గూర్చిన సరియా?,
సుక వీయనిచో మది కవి, 'తుకడా' పద్దెములె, వానితోఁ బనియేమీ?

రాణించ, విలసిల్ల, రంజిల్ల, భాసిల్ల దీపించఁ, గ్రాలంగఁ, దేజరిల్ల,
ఎలమి, నెమ్మిని, గూర్మి, నింపుఁ బెంపెసలారఁ, జెన్నలరారఁగ, వన్నెమీఱ,
ముద మెదఁ బొదలంగ, మోదంబు గూడంగ, పొరయంగ, వఱలంగ, సరగ, మించ,
తతము, ననారత, మతులితము, సతంబు, నమర, సిరులుగుల్క, నసువుగ, వెస
చెలువుగ, నలువుగ, చెలఁగఁగ, దలడుగ, పొందుగ, నెనయగ, పొలుపు, పేర్మి
అరయ, తగ, రహి, తనరఁగ, నల, కనంగబగి, మఱియు, నెంచ, చూడఁగ, నొప్ప, నొనర
లలిని మానుగ, వెలయఁగ, నలర, పరగ, నవ కవులకూఁతకట్టి లీనాఁటికృతుల.

బెండుముక్కలశబ్దరాజియు, బెండబంకసమాసముల్,
మొండిసంధులు, మిట్టపల్లపుమోటుదారులశయ్యలున్,
గుండెఁ గాల్చెడుపాకముల్, చవి గూల్చునట్టిరసంబులున్
మెండు, కొండఱ నేఁటి కైతలమెత్తురే యవి పండితుల్.

ప్రాసముల్ యతులు, వ్యర్థపదాళి పద్యంబులను జొర హేతువులను నొకండు,
చచ్చుపురాణముల్ చాలించి ఖండకావ్యముల రచింపుఁడం చనునొకండు,
పాతలక్షణములవంకఁ జూడక గ్రామ్యమును నాదరింపుడం చనునొకండు,
మునుపటికృతుల నేడనొ దొరలిన దోసమును గని యది లక్ష్య మనునొకండు,
ఇట్టి విపరీతభావంబు లెన్నియేని, యుబుకుచున్నవి నవపండితోత్తములకు
మనములం, దిఁక నెట్లు వాఙ్మయము బ్రదుకుఁ? దెలుఁగువారల యశ మెట్లు తేజరిల్లు?

వృత్తియా? కడుపు నింపికొను దేవిరిగొట్టుకవుల నోళ్లనుబడి నవయువృత్తి,
రీతియా? భావాతిరిక్తార్థవిజ్ఞానభరితమౌ ఖండకావ్యములరీతి,
గుణమా? విలక్షణోల్బణపండితంమన్యదుర్గ్రామ్యవాదబంధురగుణంబు,
లసదలంకారంబులా? యపార్థాదిసాంకర్యశోభలయలంకారవిధులు, [బలము,
అలవడియెఁ గావ్యరమకు నేఁ డబ్బురముగఁ, బూర్వదార్ఢ్యము నశియించెఁ, బోయె
బక్కచిక్కిన దిఁక మీరు ప్రాజ్ఞులార!, లెండు లెండు చికిత్స సేయుండు వేగ.

# సందేశములు

## 1

### కవిసార్వభౌమ మహామహోపాధ్యాయ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు,
రాజమహేంద్రవరము.

శా. శ్రీవావిళ్లకులాబ్ధిచంద్రుఁ డయి వాసిం గాంచి మద్రాసునన్
దా విన్నాణము నొంది విజ్ఞుఁ డగుచుం దత్తాతపాదాత్తవి
ద్యావైశద్యము పెంపునం బ్రబలి దివ్యాంధ్రప్రబంధంబులన్
జేవల్ దేరగ సంస్కరించి ప్రకటించె న్వేంకటేశుం డిలన్.

ఉ. వేలకు వేల్ వ్యయం బయిన విత్తము మొత్తము లెక్కసేయ కా
శీలవదగ్రగణ్యుఁడు కృశించి నశింపఁగ నున్నగ్రంథముల్
పోలఁగ సంస్కరించి పొలుపు న్మెలపుం గలయక్షరంబులన్
శ్రీ లెసఁగన్ సుముద్రణము చేసి ప్రసిద్ధికిఁ దెచ్చెఁ వానినిన్.

ఉ. ఏ పిదపన్ గమింతు నని యేర్పడియుండినతప్పుపాఠమున్
నే వెనుకన్ గమింతు నని నేర్పున దిద్ది కవీంద్రు నొక్కనిం
బ్రోవగ నాట కాక జగముం బొదలించు మహోపకారముం
జేవ నొసర్చినట్టిఁ డయి చెన్నలరారె నతండు దండిమై.

శా. రామస్వామికి వేంకటేశ్వరుఁడు పుత్రశ్రేష్ఠుఁడై పుట్టి త
ద్ధామం జేర్పడఁ దత్ప్రియత్నము సమస్తంబున్ ఫలింపంగ ని
త్యామోదంబునఁ జేసి నట్టిఁడయి విఖ్యాతిం గనెన్ వేంకటే
శామాన్యాహ్వయుఁ డాంధ్రభూమణిసువర్ణాలంక్రియాభూతుఁడై.

ఉ. స్తుతిమతి సాధుపాఠములతోఁ గృతులం బ్రకటించునట్టిస
త్కృతి కగుచుం "త్రిలిఙ్గ" యని తెల్పఁగ నొప్పెడు తెల్గుపత్రికన్
జతురత నిల్పి యిర్వ దగుసంఖ్యకు మించినయేండ్లు దాని నం
చితగతి నిర్వహించి వినిచెన్ రజతోత్సవ మాతఁ డిత్తతిన్.

తే. అల త్రిలిఙ్గపత్రికయందు నఖిలశాస్త్ర, సంప్రదాయములును ధర్మశాస్త్రవిషయ
ములు గళావిశేషము లాంధ్రములును గలిగి, యొప్పుచుండు లోకమునకు నుపకరించి.

చ. ఇటు రజతోత్సవంబునకు నేర్పడియున్న త్రిలిఙ్గ యింక మీఁ
దటఁ గనకోత్సవంబుఁ గొనఁ దగ్గది యై ప్రథితప్రభావవి
స్ఫుటగతిసంపదల్ గలిగి సూరివరేణ్యులమెప్పు లందుచున్
దిటపడి యెల్లదేశములు ద్రిమ్మరుచున్ వెలుఁగొందుచుండుతన్.

## 2

## శ్రీపండితారాధ్యుల నాగభూషణకవిగారు, ముమ్మిడివరము, తూర్పుగోదావరిజిల్లా.

క. శుభము శుభంబు త్రిలిఙ్గా!, శుభ మగు నీకున్ సతంబు సుచరిత్రవు నీ
విభవంబు సుకవి సూరి, ప్రభు సంస్తోత్రార్హ మై విభాసిలు మిగులన్.

చ. ఇరువదియైదువత్సరము లేగెఁ ద్రిలిఙ్గ! జనించి నీవు నేఁ
డురువిభవం బెసంగ రజతోత్సవముం గనుభాగ్య మబ్బె నీ
కిరవుగ నిట్టులే కనెద వింక సువర్ణమహోత్సవంబునున్
వెరవరి వేంకటేశ్వరుని విస్తృతమైన సమాదరంబునన్.

క. సురుచిరపత్రంబులతో, నరుదగు నక్షరవిలాస మమరఁ ద్రిలిఙ్గా!
నరుదెంతు సోమవారము, మురువొప్పఁగ సార్థకాఖ్యబుధు లలరంగన్.

చ. తెలియక కొందరుం దెలిసి ద్వేషమతిన్ మరికొంద రుద్ధతిం
జలిపెడిదుష్ప్రచారము లణంచి సనాతనధర్మముల్ నిరా
కులత యథాగతి న్నిలుపఁ గోరి నిరంతరముం బొనర్చు నీ
యలఘుపరిశ్రమంబు గొనియాడఁదరంబె! త్రిలిఙ్గ! యేరికిన్.

సీ. ప్రకటించుచున్నాఁడు పత్రికాద్వితయంబు ప్రతివార మాంధ్రాంగ్లభాషలందు
ముద్రించుచున్నాఁ డపూర్వంబు లైనట్టి వివిధప్రబంధముల్ వెదకి తెచ్చి
నిరసించుచున్నాఁడు నిగమాగమవిరుద్ధ దుష్ప్రబోధనదురుద్యోగములను
వినిపించుచున్నాఁడు విశ్వప్రపంచవార్తావిశేషంబు లుత్కంఠ మీర
తే. గారవించుచు నున్నాఁడు కవిబుధాళిఁ, బడయుచున్నాఁడు మన్ననల్ ప్రాజ్ఞసభల
వినుతిపాత్రుండు వావిళ్ల వేంకటేశుఁ, డాయురారోగ్యవిభవంబు లందుఁగాక!

## 3

శ్రీ అల్లాడి జగన్నాథశాస్త్రిగారు, బి. ఏ., ఎల్. టి.,
ప్రధానోపాధ్యాయులు, శ్రీవేంకటగిరిరాజాగారి హైస్కూలు, వేంకటగిరి.

**పద్యతారహారము:—**

శ్రీవిద్యావిభవంబు లేకమయి సంప్రీతిం బ్రవర్తింప ధీ
ప్రావీణ్యామలరాజితాక్షరయశఃప్రఖ్యాతుల న్మించుచున్
శ్రీవిశ్వోద్భవముఖ్యకృత్యముల సంసిద్ధాత్మయా దేవియున్
వావిళ్లాన్వయ వేంకటేశ్వరకళానాథున్ దయం బ్రోవఁగా
నోవిప్రోత్తమ శ్రద్ధమైఁ బనుపు దూరూరన్ బహుగ్రంథకో
థావేశంబునఁ బండితోత్తముల నత్యంతంబుఁ బోషింతు వెం
తే వెచ్చించి పరిష్కరింతువు మనోహృద్యంబుగా ముద్రితం
బై వెల్గొందుటకాక ధర్మముగ భాండాగారకాండంబులన్
తీవి న్భాసిలు నీయుదారతకు సాటి స్వైరోక్కానం బాటియే
భావింపంగను నాంధ్రభాష బహుసేవల్గాక గీర్వాణవా
ణీవైదగ్ధ్యము నాంధ్రవర్ణముల బూన్కిన్ వ్యాసతత్సంభవ
శ్రీవల్మీకభవోక్తివాసన దిశల్ జృంభింపఁగాఁ జేయవే
లేవా పుస్తకముద్రణాలయము లీలీలన్ జనానందకృ
ద్భావం బొప్పెడిపుస్తకంబులు లసత్పత్రంబులున్ స్వచ్ఛవ
ర్ణావిర్భావము లౌర యాంధ్రకృతభాగ్యంబంచు ఘోషింప నా
నావేదోపనిషత్పురాణములు మంత్రదృశ్యకావ్యాదులున్
భావప్రజ్ఞలు యక్షగానములు సర్వంబుం బ్రకాశించు తే
జోవైశాల్యత యట్టులుండఁ గవితాశ్రద్ధాదు లట్లుండఁగా
తావు ల్గూర్చెడిసంస్థ లొక్కదెస విద్వద్గోష్ఠి వేరొక్కచో
భూవిభ్రాంతిఁ త్రిలిఙ్గముఖ్యసువచగపుంజంబులం గాలమున్
ధీవిజ్ఞానవికాసభాసురముగాఁ దృప్తి న్నియోగింప నా
కావీథిన్ ద్రవిడాంగ్లహిందిలిపు లక్రాంతప్రచారంబులం
గావింపన్ బహుభంగులం గృతమతిం గంఠోక్తిగాఁ బల్కవే

యావిద్యావినయంబు లాముఖకళాహ్లాదంబు లాదానథా
రావిన్యస్తమనఃప్రశస్తియును మిత్రానందదఖ్యాతియుం
బూవుం దావియుఁ దేనెగాఁ బొసఁగు నీపుణ్యాం బగణ్యంబెకా
శ్రీవావిళ్లజ వేంకటేశ నిఖలశ్రేయఃప్రమోదాళిల
క్ష్మీ వాణీవృత సత్కృపంగనుత మామి త్రా జ శాస్త్రిప్రథన్.

4

## శ్రీ పెనుగు తమ్మిరాజుగారు, అగస్త్యాశ్రమము, కాపేశ్వరము, తూర్పుగోదావరిజిల్లా.

శ్రీవావిళ్లకులాంబుధి, జైవాతృకు డఖిలవిబుధసమ్యక్పూజా
భావితుడు వేంకటేశ్వరు, డీ విపుల మెలంగుగాత నెల్లశుభములన్.
వావిళ్ల వేంకటేశ, శ్రీవంశప్రభవరౌ విశేషపవిత్ర
ప్రావీణ్యమై త్రిలిజ్గ స,దా వెలయుత ప్రాజ్ఞు లలర ధాత్రీస్థలిలోన్.
ఇరువదిరెండేండ్లు మహా,దరభంగి చరించి కవిబుధస్తుతు లలరన్
మెరుగెక్కి సోదరాంధ్రుల, కరముల మెలగెదు త్రిలిజ్గ కవితాసంగా.
సకలవార్తాసస్యసముదయక్షేత్రంబు దేశాభ్యుదయమార్గదివ్యజ్యోతి
బుధజనామోదసంపూర్ణసుధానిధి అఖిలజనావళి కమృతధార
కవిజనాకర్షణకల్పితపీఠంబు పండితవాదోపవాదసీమ
భాషాభ్యుదయయశోభాగ్యంబునకు తావు శారదాహస్తప్రశస్త ముకుర
మిట్టి పత్రికామణులందు నెల్ల మేటి,యై త్రిలిజ్గ నిరంతరవ్యాప్తి గాంచి
ఆంధ్రసోదరసోదరీహస్తకమల,ములను నాచంద్రతారకముగ వెలయుత.
ఏను త్రైలిజ్గదేశమందే జనింప, నాకు త్రైలిజ్గభాష ప్రాణంబటంచు
జన్మజన్మకు నెలుగెత్తి చాటువాడ, చేతను త్రిలిజ్గపత్రిక చెలువమొప్ప.
భాషాయోషాభ్యాస సు,భాషితభూషిత విశేషపరిపూర్ణకృపా
న్వేష త్రిలిజ్గపత్రిక, భాషోద్ధారకులప్రాపుబడయు తిరముగన్.

5

## విద్వాన్ శ్రీ శింగరాజు రామలింగశాస్త్రిగారు,

ఆంధ్రప్రధానోపాధ్యాయులు, పచ్చయప్పకళాశాలాహైస్కూలు, మద్రాసు.

శా. శ్రీవిద్యామహిమోన్నతిం గని భవత్సేవాసమాసక్తతన్
దేవేంద్రాదులు మెచ్చ జన్మముల నెంతే మోద మొప్పంగ భూ
దేవాదుల్ నుతియింప వేదముల సందేహంబులం దీర్చు నీ
వావిళ్లాన్వయవంశముం శివ! సదా వర్ధిల్లగాఁ బ్రోవుమా.

చ. వసుధఁ బుదూరు ద్రావిడులవంశము సన్నుతికెక్కినట్టు లిం
పెసఁగఁగ నేకులం బలరెఁ, బేర్మిని నందెను వావిళాన్వయం
బసదృశవైదుషీమహిమ నయ్యమరేశగురుండునైనఁ దా
గొసరెడుజ్ఞానసంపదను గోరికతోడుత నెల్లవేళలన్.

సీ. విద్యావివేకంబు వెలసె నెయ్యెడ నన నలపుదూర్ద్రావిడు లందకాదె
షట్శాస్త్రమహిమంబు సంధిల్లె నెట నన నలపుదూర్ద్రావిడు లందకాదె
యజనయాజనముల విజయ మెచ్చోటన నలపుదూర్ద్రావిడు లందకాదె
శ్రీవిద్యగరిమంబు చెలఁగె నెయ్యెడ నన నలపుదూర్ద్రావిడు లందకాదె
తే. యట్టివంశంబునను జన్మమంది వేంక,టేశ్వరాఖ్యను వెలయుచు నీప్సితములఁ
బడయుచుండెడునతనిని బద్మగర్భ, పుండరీకాక్ష శంకరుల్ బ్రోతు రెపుడు.

సీ. వైరాగ్యమహిమంబు భాసిల్లె నని చెప్పఁ జిన్నాయనాఖ్యుండు చెలఁగు సాక్షి
వేదపురాణముల్ వెలయుచుండిన దన నలహాయగ్రీవుండె యలరు సాక్షి
సర్వశాస్త్రోద్ధారసరణి సాగె నన రామస్వామిశాస్త్రులె మహిత సాక్షి
మంత్రవైదుష్యంబు మహిమగాంచిన దన సుందరరాముఁడె యందు సాక్షి
వివిధభాషాజ్ఞానవిభవంబునకు శేష,గిరిశాస్త్రులే చాలు ధరను సాక్షి
సరసంబులౌ వ్యాఖ్యవిరచన యెట నన, వేంకటరాయండు వెలయు సాక్షి
తే. యింక నెన్నేనివిద్యల కేర్పడంగ, సాక్షు లున్నార లీవంశసాంద్రవిబుధ
కూటమున యందునట్టి దిక్కుంభులకును, వేంకటేశ్వరుఁడేమాత్ర వెలితిపడఁడు.

శా. వావిళ్లాన్వయ వేంకటేశ్వరుని సంభావింప నేనెంత యీ
భూవిఖ్యాతిని గాంచుచుండె సరసుల్ మోదంబునుం గాంచఁగా

శ్రీవిద్యాధికతం బ్రసన్నమహిమం శ్రేయంబులం బొందుచున్
భావాగమ్యశుభంబు లందుత హరిబ్రహ్మప్రసాదంబులన్.

మ. వివిధగ్రంథములం బఠించుచు సదా విద్యావిశేషంబునన్
సువిమృష్టం బగుపాఠభేదముల సంశోభిల్లగా నేర్చి కూ
ర్చి వివాదం బగుచోటఁ బండితులమేల్చిత్తంబు లక్లేశపడన్
భువిగ్రంథంబుల వ్యాప్తిఁజేయుఘనునిం బోల్పంగ సామాన్యమే.

శా. వావిళ్లాన్వయవార్ధిచంద్రుఁడు గుణభ్రాజిష్ణుఁ డాంధ్రావళిన్
భావింపందగువాఁడు సుందరుఁడు వాక్పారుష్యదూరుండు తా
నేవిద్యాధికుఁ డాశ్రయించినను లేదే యంచు నాడండు సం
భావింపందగుఁగాదె యీతఁడు మహీపాలుర్ ప్రశంసింపఁగన్.

ఉ. భక్తిని విద్యనేర్వఁగను బ్రార్థనసేయఁగ నేరికైనఁ దా
యుక్తమ యంచు నెంచి తగనూర్జితరీతిని నిచ్చు బంధులన్
భుక్తిని గూర్చి యొందఱినొ బ్రోచుచు నుండు యశంబు నందు నా
సక్తిని గాదు దైవికమ సాధన యంచుఁ దలంచు నిచ్చలున్.

చ. వెలసెడు నాంధ్రభాష పృథివీస్థలి నెయ్యెడ నన్ని గ్రంథముల్
గలుగఁగఁ గాదె యట్టి ఘనకావ్యములం బ్రచురింపఁగోరఁగాఁ
గలిమి సుసాధ్యమే! తలఁపఁ గల్గునె తప్పులు చక్కఁజూచి భూ
విలసితరీతిభాసిలెడు విజ్ఞత మెచ్చఁగరాదె యీతనిన్.

సీ. ఆంధ్రు లెల్లరు భువి నాహ్లాదమును గాంచ సద్గ్రంథజాలముల్ సరవి నిల్పి
బహుపురాణంబుల భాసిల్లు ముఖ్యమౌ సంగతుల్ వేర్వేరఁ జక్క నేర్చి
పామరజనులైన నేమాత్రమును సంశయంబు లేకుండంగ నఱయఁజేసి
గద్యరూపంబు వ్యాఖ్యానసంతతిఁ దీర్చి కావ్యజాలంబు సంభావ్యరీతిఁ

తే. బ్రచురణంబును జేసినభాగ్యమహితు, వనధి గంభీరు వేంకటేశ్వరుని నుతుల
నర్చితుం జేయ నెంచుట యందఱకును, భవ్యసమ్మోదమును గూర్చు నవ్యరీతి.

చ. పలువురు మెచ్చుభావములఁ బ్రస్ఫుటరీతి నవార్యవైదుషీ
విలసితభాషలన్ భువిని విశ్రుతరీతిని నింపి పత్రికన్
వెలయఁ ద్రిలింగనామమున వృద్ధిని గాంచఁగఁజేసె నీతనిన్
గలుములరాణి భాగ్యముల గణ్యతఁగూర్చుచుఁ బ్రోచు నెప్పుడున్.

సీ. చర్చించి చూచిన సర్వజ్ఞతాశక్తి వేంకటేశ్వరునంద వెలయుచుండు
పరికించి చూచిన నిరుపమౌదార్యంబు వేంకటేశ్వరునంద వెలయుచుండు
భావించి చూచిన బహుదేశసన్నుతుల్ వేంకటేశ్వరునంద వెలయుచుండు
తర్కించి చూచిన దంభరాహిత్యంబు వేంకటేశ్వరునంద వెలయుచుండు
తే. నాంధ్రభాషామహాసేవ యధిక మనుచు, జనకునాజ్ఞను బాలించు ఘనయశునకు
భవ్య వావిళ్ల వేంకటేశ్వరున కెపుడు, నాయురారోగ్యసంపద లలరుఁగాత.

6

## శ్రీ అర్చకం పెరుమాళ్లాచార్యులుగారు, పెద్దమండడి.

క. వావిళ్లవేంకటేశ్వర, కోవిద! నీధర్మకర్మ గురుతరభాషా
సేవారూపము దాల్చెను, పావనత్వత్కీర్తి దిశల బ్రాకుచు నుండున్.
ఉ. ధీనిధి వేంకటేశ్వరసు,ధీమణి! పామరపండితేంద్రులకా
జ్ఞానసుధాబ్ధి దేల్చు తమగాఢకృషిన్ గని పద్మనాభుస
న్మానితమత్స్యరూపకథ మార్గములే స్మృతి కెక్కుచుండ వి
ద్యానిధులెల్ల మిమ్ము గొనియాడెద రెప్పుడు హర్షచిత్తులై.

7

## శ్రీ బులుసు సీతారామశాస్త్రిగారు, రామారావుపేట, కాకినాడ.

పంచవింశతి సంఖ్యాకవత్సరముల, నుండి తెలుఁగునాఁడునకు సత్యున్నతంపు
సేవఁజేయుచుఁ బ్రఖ్యాతిఁ జెందినట్టి, యల ద్రిలింగ వెలయుత దీక్షాయు వగుచు
ప్రథిత వావిళ్లవంశానఁ బ్రభవ మొంది, సకలదిశలయు శోమయూఖములఁ జల్లి
సంఘమతవాఙ్మయాదిక సకలవిషయ, సహృదయాహ్లాద చర్చల సలుపుచుండి
సకలపండితరచితభూషల ధరించి, వన్నె మీఱఁగ రజతోత్సవాభ్యుదయముఁ
గను త్రిలిఙ్గ త్రిమూర్తుల కరుణవలనఁ, బృథివి శాశ్వతముగఁ బ్రకాశించుగాక!

8

## శ్రీ బి. రంగమ్మగారు, దాగంటివారిపాలెం, గుంటూరుజిల్లా.

సీ. అలరు భాషోద్ధారకాహ్వాయబిరుదంబు గాంచిన జగదుపకారకుండు
మాలమూలలఁబడి మాల్గుపుస్తకముల బయలుపెట్టిన లోకబాంధవుండు

పేరులే తెలియనిపెద్దల రప్పించి గౌరవించిన రసికప్రకాండుఁ
డంథకారావృతి నలరనిమణు లనఁదగుకవులను బ్రోచు తజ్జ్ఞవరుఁడు

తే. తెలుఁగు వావిళ్ల సద్వంశసింధుచంద్రుఁ, డాశ్రితావననిరతిశయానురాగుఁ
డైన వేంకటేశ్వరశాస్త్రి నన్వహంబు, కరుణ శేషాద్రినాథుండు కాచుఁగాత!

ఉ. ఏమిట నీదు నీ కితరు లెందఱో విస్తృతి నొందఁగోరి యీఁ
భూమికి భారభూతులయి పొల్చుచునుందురు నీవె వాక్సతిఁ
గోరి భజించి సాధువులకుం దగురీతి భజింప నర్హమౌ
దారిని జూపినాఁడ విబుధస్తుతుఁడ వౌదువు వేంకటేశ్వరా.

క. కులరత్నంబవు సద్గుణములకుఁ ఖని వరయఁ గవిసమూహమునకు ను
జ్జ్వలకల్పమహీరుహమవు, జలజాక్షుఁడు నీకు సర్వసంపద లిడుతన్.

## 9

### శ్రీశ్రీశ్రీ గద్వాల శ్రీమహారాణి శ్రీఆదిలక్ష్మీదేవమ్మగారు, గద్వాలసంస్థానము.

"గత ఎనిమిది పదివత్సరములనుండి నాకు తమపత్రికామతల్లియగు "త్రిలింగ"తో పరిచయము గలదు. ఈపత్రికామతల్లి తనఅభ్యుదయమాది నేటివరకు తెలుగుజాతికి, తెలుగుభాషకు, తెలుగుసంస్కృతికి చేసినసేవ అభివందనీయము. ఇటులనే ముస్ముందు ఆంధ్రదేశసౌభాగ్యమునకై మరింత ఉత్సాహముతో తనవిధిని నెరవేర్చునను పూర్ణ విశ్వాసము నాకు కలదు. పత్రికాధిపతులగు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు ఇందులకు జనాదరణపాత్రులు; పోషణార్హులు."

## 10

### శ్రీ లక్కరాజు సుబ్బారావుగారు, బి. ఏ., బి. యల్., అడ్వకేటు, కాకినాడ.

గొప్పశాస్త్రగ్రంథములను, ప్రాచీనమగు ఆంధ్రప్రబంధములను పండితులచే బరిష్కరింపఁజేసి చక్కని విమర్శగల పీఠికలతో ప్రచురించి వావిళ్లవారు ఆంధ్రప్రపంచమునకు మహోపకారము జేసియున్నారు. పల్చనిపాతకాగితములమీద తప్పులతడకగ ముద్రిత మయిన అలికిపుస్తకముల జదువుబాధ వావిళ్లవారి సుందరగ్రంథములవలన వదిలినది. నాగరిలో ఉత్తమసంస్కృతగ్రంథములను తమిళములో కొన్నిపుస్తకములను ప్రచురించినారు.

త్రిలిఙ్గపత్త్రికద్వారాను వారు హిందూధర్మమునకు విశేషసేవ జేసియున్నారు. సంస్థానసమస్యలనుగూర్చి వారు ఫెడరేటెడ్ ఇండియా అను ఆంగ్లపత్త్రికలో చక్కఁగ చర్చింపుచుందురు

ఆంధ్రప్రాంతపువ్యాపారవృద్ధిలోను ఆంధ్రులపురోభివృద్ధికిని ఆంధ్రరాష్ట్రోద్యమమునకును శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు విశేషకృషిచేసియున్నారు. వీటిఅన్నిటికిని వారిపత్త్రికలురెండును తోడ్పడుచున్నవి. ఈపత్త్రికలు చిరకాలము వృద్ధిఅయి ఇంకను దేశసేవకు తోడ్పడుగాక! ఇట్లు తమద్రవ్యమును కాలమును ప్రజాసేవకు దేశసౌభాగ్యమునకు వినియోగించు వావిళ్లవారు చిరాయువులై వర్ధిల్లుదురుగాక!!

**11**

**శ్రీ తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రిగారు, మాంబళము, మదరాసు.**

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని ప్రథమపర్యాయము ౧౯౩౦-వ సంవత్సరములో చూడడం సంభవించింది. మిత్త్రులు శ్రీ జయంతి సత్యనారాయణమూర్తిగారు పరిచయంచేశారు. ఆరోజుల్లో ఇంగ్లీషు మాసపత్త్రిక పెట్టవలెనని మా ఆశయం. శ్రీశాస్త్రిగారు మమ్మల్ని చాలా ఆదరించారు. వారి ప్రసన్నముఖమూ సౌమ్యమూర్తీ నన్ను ఆకర్షించినవి.

శ్రీశాస్త్రిగారు పూర్వకవులగ్రంథరాజములు ప్రకటించి ఆంధ్రసారస్వతానికి ఇచ్చిన పుష్టి సర్వజనవిదితమే. రమారమి ౨౫ సంవత్సరములనుంచి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు 'త్రిలిఙ్గ' పత్త్రిక నడుపుతూ సనాతనధర్మపరులకు సంతోషదాయకములైన విషయాలు వ్యాప్తిచెయ్యడం చాలా హృద్యం.

వీరు విద్యాసంస్థలలో ప్రజోపయోగకరములైన సత్కార్యములు అనేకము చేశారు. ఇట్టి ప్రసిద్ధఆంధ్రపుత్త్రుని సత్కరించడం సమంజసము. ఇతి శివమ్!

**12**

**శ్రీ ఎన్. సీ. నరసింహాచార్యులుగారు, బి. ఏ., ఎల్. ఎల్. బీ., అడ్వొకేటు, బొంబాయి.**

మీరు తలపెట్టినఉద్యమము త్రిలిఙ్గపత్త్రికద్వారా తెలుగుప్రజలకు సఫలమగుగాక అని పర్మేశ్వరుని ప్రార్థించుచున్నాము. అనేకసంవత్సరములు త్రిలిఙ్గ వర్ధిల్లుగాక! దేశమున నెచటనున్నను తెలుగుప్రజలు త్రిలిఙ్గపత్త్రికోద్దేశ్యముల పాటించి వర్ధిల్లుదురుగాక! త్రిలిఙ్గ

పత్రికపేరు సార్థకముగా తెలుగుప్రజలందరు ఏకమైనయెడల వారిబలసంపత్తి కొంతమాత్రమును లోపముండకపోవుట నిశ్చయము. తెలుగును మరచినవారుసహితము, మీపత్రికానామము విన్నంతలోనే తెలుగు ప్రజలెల్లరును తమభాషీయులకు సంబంధించినదని వేరుమాట చెప్పకనే విశ్వసింతురు. అట్టి విశ్వాసమునకు కారణమైన మీపత్రికకు రజతోత్సవము సఫలముగా జరిగి పత్రిక శాశ్వతముగా తెలుగుప్రజాశయముల వెల్లడించుచుండునుగాక అని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను బొంబాయి రాజధానినిగల తెలుగుప్రజలెల్లరును మీపత్రిక దినదిన ప్రవర్ధమానమై తమందరి శ్రేయోభివృద్ధికి చేసినకృషికి కృతజ్ఞులుగనుందురని నమ్మకము.

మీకనేకవత్సరములు సర్వేశ్వరుడు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యముల నొసంగి మీప్రయత్నములన్నియు సఫలీకృతము సేయుగాతఅని కోరుచున్నాను.

## 13

### శ్రీ భైరవను హనుమంతరావుగారు, ఛీఫ్ రిపోర్టరు, టైమ్సు ఆఫ్ ఇండియా, బొంబాయి.

త్రిలిఙ్గపత్రికకు రజతోత్సవము జరుగనుండుట చాల సంతోషకరమైన విషయము. ఈపత్రికాసంపాదకులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ఇందులకు అభినందనీయులు. అన్యరాష్ట్రమునందలి పత్రికాకార్యాలయమునపనిచేయుచుండుటచేతను పత్రికారచయితవృత్తిని ప్రథమమున తెలుగుపత్రికయందేఆరంభించియుండుటచేతను ఈజ్యూబిలీసంచికకు నాలుగువాక్యములను వ్రాయుట కుతూహలించుచుంటిని.

ఆంధ్రదేశమునందుండువారు ప్రత్యేకరాష్ట్రమునకై ఎటుల వాంఛించుచుండిరో విశాలాంధ్రమునందుగూడ నాబోంట్లును అట్లే వాంఛించుచుంటిమి. బొంబయిఅందు ఆంధ్రులు, తమిళులు, మలయాళీలు, కన్నడులు, మహారాష్ట్రులు స్నేహభావమున మెలగుచుందురు. కాని ప్రత్యేకరాష్ట్రములేనందున కొన్నివ్యవహారములలో ఆంధ్రులు అగ్రస్థానమువహించుట దుర్లభముగనున్నది. ముప్పదిసంవత్సరములనుండి ఆంధ్రరాష్ట్రమునకై ఆందోళన గావించితిమి. శ్రీగాంధీమహాత్ముడు 1920-వ సం॥న సహాయనిరాకరణోద్యమమును ఆరంభించినపుడు ఆంధ్రోద్యమనాయకులు ఆయుద్యమమునందు జేరిరి. ఇప్పటికిని ఆంధ్రదేశమునందు కాంగ్రెస్సుపలుకుబడియే అధికముగ నున్నది. ఇట్లుండినను ఆంధ్రులకోర్కెలను సఫలీకృతములగావించుటయందు కాంగ్రెస్సు ఎంతవరకు సాయపడినదో సావధాన

ముగ ఆలోచించుకొనుట యుక్తము. మనకన్న వెనుక ప్రత్యేకరాష్ట్రములనుకోరిన ఉత్కళులు, సింధువాసులు జయమొందినారు. మనయుద్యమమువలన ఇతరులు లాభము పొందుటయు మనము కారాగారములకువెళ్లుటయు తటస్థించినది. ఏదైన ఒకకార్యక్రమమును నిర్ణయించుకొనవలదా!

బొంబయిరాష్ట్రమున నెందరో తెలుగువారున్నారు అనేకులు కార్మికులు. వందమందిలో 80 మందికి చదువను వ్రాయను రాదు. వారికి వయోజనవిద్య గరపవలసియున్నది. వారిపిల్లలచదువుకై పాఠశాలలను నెలకొల్పవలసియున్నది. వారిసాంఘికాచారములును కొంతసంస్కారమునకు లోనుగావలసియున్నది. ఈయంశములను దృష్టియందుంచుకొని బొంబయి తెలుగుసేవాసంఘము కొంతవరకు కృషిసలుపుచున్నది. ప్రత్యేకాంధ్రరాష్ట్రముండి ఆంధ్రరాష్ట్రపరిపాలన ఆంధ్రులఅధీనముననే యుండిన తెలుగుసేవాసంఘమువారిప్రయత్నముల కెంతోబలము గలుగగలదు. లేనందులకు విచారపడుట లేదుకాని రాష్ట్రసంపాదనాప్రయత్నము దృఢముగనైన లేదు. త్రిలిఙ్గ ఈయంశములను విమర్శించి ఆంధ్రదేశమునకును విశాలాంధ్రమునకును సరియైనమార్గమును చూపునని ఆశించుచున్నాను.

## 14

## శ్రీ రాజా వి. వెంకటరంగారాయణింగారు, కాళహస్తి.

మీరు రజతోత్సవవిషయమై దయతోపంపిన విజ్ఞప్తి అందినది. తాము పితృభక్తితో మీతండ్రిగారు ప్రారంభించిన ప్రచురణసంస్థ విడువక పట్టుదలతో సక్రమముగా సాగించుట మిక్కిలి శ్లాఘనీయము. మరియు మీరు ఆంధ్రభాషా ప్రపంచమునకుచేయుసేవవలన ఆంధ్రులకందరికిని కడువందనీయులు. మీరు ప్రచురించు 'త్రిలిఙ్గ' అను తెనుగుపత్రికవలన ఆంధ్రులకును, Federated India అను ఆఙ్గ్లపత్రికవలన అఖిలభారతదేశమునకును వాగాడంబరములేక సలుపుకృషి యెంతయు కొనియాడదగినది. మరువతగినదికాదు. ప్రతిఫలాపేక్షలేక తమవలెదేశసేవచేయుమహనీయులు మనదేశమున చాల తక్కువ. మాతృభాషాభక్తి, దేశసేవానురక్తి, స్వలాభవిరక్తిగల తమబోటిదేశనాయకులసంఖ్య వృద్ధియగుపట్ల అనతికాలములోనే ఈభరతమాత ధన్యురాలగును. కడుప్రాయమువచ్చిన త్రిలిఙ్గకన్య వయోపరిపక్వముఅధికమగుకొలదిని యెక్కువ జనోపకారియగుగాత! దయామయుండగు భగవానుడు మీత్రిలిఙ్గను ఆశీర్వదించి దినదినాభివృద్ధిచేయుగాత!!

## 15

### శ్రీ మామిడిపూడి వెంకటరంగయ్యగారు, ఎం. ఏ.,

ప్రొఫెసరు, ఆంధ్రవిశ్వవిద్యాలయము, విశాఖపట్టణము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని అభినందించుటకై మీరు చేయుప్రయత్నము ఎంతో కొనియాడదగియున్నది. శ్రీశాస్త్రులుగారు ఆంధ్రభాషకు చేసినట్టియు చేయుచుండునట్టియు సేవ అమూల్యము. అముద్రితగ్రంథములెన్నిటినో వారు పరిష్కరించి ముద్రింపించిరి. క్రొత్తగ్రంథములనేకములను వ్రాయించిరి. ప్రస్తుతకాలపు ఆంధ్రగ్రంథకర్తలలో అనేకులు వారిసహాయమును పొందియున్నారు. పత్రికానిర్వాహణమునందు వారు చూపుచుండుకార్యదీక్ష స్వాతంత్ర్యము కడుప్రశంసార్హములు. ఆంధ్రదేశములోని గ్రంథాలయములకు వారు గావించినసహాయమధికమైనది. ఆంధ్రమహాసభావిషయమునను ఆంధ్రరాష్ట్రసంపాదనార్థమును ఆంధ్రవాణిజ్యసంఘముతరఫునను వారుచేయుచుండుసేవ ఇతరులకు మార్గదర్శకములు. అట్టి భాషాభిమానులు దేశాభిమానులు శతవత్సరజీవులై సిరిసంపదలతో తులతూగుచు ప్రజలకుపయోగములగు ధర్మకార్యములలో పాల్గొనవలయునని వాంఛించుట మన అందరియొక్క విధి. వారు చేయుసర్వకార్యములందు పరమేశ్వరుడు వారికి తోడ్పడుగాక!

## 16

### శ్రీ గూడవల్లి రామబ్రహ్మంగారు, బి. ఏ., లాయిడ్సురోడ్, రాయపేట, మదరాసు.

ఆంధ్రగ్రంథముల సుందరముద్రణకు పేరుమోసిన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ ప్రొప్రయిటర్లు అయిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు ప్రచురిస్తూవున్న 'త్రిలిఙ్గ' పత్రికకు ఇరవైఐదేళ్లు నిండినసందర్భంలో ఆంధ్రమహాశయులు ఆ పత్రికకు రజతోత్సవంచేయ తలపెట్టడం నాకెంతో సంతోషాన్ని కూరుస్తూవుంది. తెనుగుదేశంలో పత్రికానిర్వహణం కష్టబహుళం అట్టిసందర్భంలో పాతికేళ్లుగా పత్రికను నిరంతరాయంగా నిర్వహించడం సామాన్యవిషయంకాదు.

ఇట్టి అసామాన్యవిషయానికి తార్కాణమైవున్న 'త్రిలిఙ్గ' పత్రిక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిప్రాపున స్వర్ణోత్సవ, వజ్రోత్సవాలనుకూడా జరుపుకొనేటట్లు వర్ధిల్లుగాక అని హృదయపూర్వకంగా కోరుతూవున్నాను.

## 17

### శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారు, ఎం. ఏ., లెక్చరరు, పి. ఆర్. కాలేజి, కాకినాడ.

ఒక జాతికిఁగాని, వ్యక్తికిఁగాని విజ్ఞానమే ప్రాణము భారతజాతికిఁ గలవిజ్ఞానము పరమపవిత్రము; విశ్వకల్యాణనిర్మాణసమర్థము; ధర్మార్థకామమోక్షసిద్ధిదాయకము; అవ్యయము; అప్రతిమానమునై యున్నది. మానవజాతినాగరికతను నిర్ణయించువిధాన మెద్ది యన జాతిలోనిపశుత్వ మెంతతగ్గినది, దైవత్వ మెంత ఆవిష్కృతమైనదని విమర్శించుటయే. దైవత్వావిష్కరణాలంబనములు పరిపూర్ణముగాగల భారతీయవిజ్ఞానము, నిత్యనూతనమై అవిచ్ఛిన్నమై యుగాంతరములనుండి నేఁటివఱకు నిలువఁగల్గినది. ఈపరమపావన విజ్ఞాన సంరక్షణమహాకార్యములో వావిళ్లవారికుటుంబము చిరప్రతిష్ఠనార్జించి ధన్యతం గాంచినది. కీర్తిశేషులైన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రి, కీర్తనీయులైన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిని గన్న సంస్కృతాంధ్రసాహితీమాతవిదుషీమతల్లియై వెలసినది. త్రిలిఙ్గపత్రికారాజము, ఫెడరేటెడ్ఇండియా, వావిళ్లముద్రాసంస్థ యీమూడును ఆంధ్రులపరమభాగ్యమున త్రిలిఙ్గత్వమునంది త్రిమూర్త్యాత్మకమై విజ్ఞానవిద్యుద్దీపకాంతులచే చెన్నరాజధానిలోనిఁ జీకటిఁ గూకటివ్రేళ్లతో పెఱికివైచినది. భగవానుఁడు శ్రీ వావిళ్లవంశమును వావిళ్లసంస్థలను స్థిరప్రాయముగ నాశీర్వదించి రక్షించుఁగాక!

## 18

### శ్రీ రావుబహదూరు ఎల్. లక్కరాజుపంతులుగారు, బి. ఏ.,

రిటైర్డు ఆఫీషియేటింగు కలెక్టరు, రాయపేట, మదరాసు.

మీరు అనేకసంవత్సరములనుంచి మనమాతృభాషయగు ఆంధ్రమునకు చేయుకృషి అమితకష్టమైనదియు అపారమైనదియు అయియున్నది. మీరెంతయో వ్యయప్రయాసములకోర్చి సాధారణముగాదొరకనటువంటి అమూల్యమగుగ్రంథములు సేకరించి వాటిని అచ్చువేయించుటవల్ల అశ్రద్ధచే జీర్ణముకానున్న తెలుగుభాషకు తిరిగి ప్రాణముపోసినవారైతిరి. ఆంధ్రలోకమునకు వారిపూర్వసారస్వతమునుగురించి సరియైనఅభిప్రాయములు కలిగించినవారైతిరి. లోకవిఖ్యాతులగు తమతండ్రిగారు ఈపని ప్రారంభించియుండిరి నిజమైన పితృభక్తితో వారికత్యంతప్రియమైన ఈపనిని కొనసాగించి తమరు పితృఋణమును తీర్చుకొనినవారైతిరి. ఇంకను ఈవిషయములో చేయవలసినపని చాలయున్నది. తెలుగుభాషలో వ్రాయబడిన ఇంకను బయలుపడనట్టి అనేకసద్గ్రంథములున్నట్లు తెలియుచున్నది. అట్టి

గ్రంథములు ప్రకటించి మాతృభాషకు మాతృదేశమునకు శ్లాఘాపాత్రమైనసేవచేయుటకు భగవంతుడు తమకు ఆయురారోగ్యైశ్వర్యములిచ్చుగాతయని భగవానుని బ్రార్థించెదను.

## 19

## మంత్రశాస్త్రప్రవీణ హనుమదుపాసక శ్రీశిష్ట్లా చంద్రమౌళిశాస్త్రిగారు, పెదపాడు.

మీతండ్రిగారగు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారు సంస్కృతాంధ్రద్రావిడ భాషలలో ప్రాచీననవీనకావ్యముల బ్రచురణసంస్థమూలముగా బ్రచురించి భారతదేశమునకు మహోపకారముగావించినారు వారికాలమున బ్రచురింపబడిన సంస్కృతమహాభారత తులసీరామాయణేత్యాదిపవిత్రగ్రంథముల నేటికిని ప్రచురించుచు దేశమునకు గావించుచున్న శ్రీశాస్త్రిగారిభాషాసేవ శ్లాఘాపాత్రమైనది.

శ్రీశాస్త్రిగారు త్రిలిఙ్గ అనువారపత్రికను ప్రచురించి తన్మూలకముగ బ్రజానుమతిబొందియున్నారు రాజకీయవిషయముల ఆచారవ్యవహారనైతికవిషయముల మృదుమధురశైలిలో బ్రచురించుచు లోకజనరంజకులైయున్నారు.

ఇంతియకాక వీరు మరొక్క ఆంగ్లపత్రిక 'ఫెడరేటెడ్ ఇండియా'ను ప్రారంభించి దేశవిషయముల భావిపరిస్థితుల జక్కగా అమృతోక్తులతో బ్రచురించుచున్నారు. వీరు చేయుచున్న మేలు బహుశ్లాఘనీయముగా నున్నది.

—

## 20

## శ్రీ నందూరి బంగారయ్యగారు, బి. ఏ., బి. ఎల్., రాజమహేంద్రవరము.

మీత్రిలిఙ్గపత్రిక రజతోత్సవమును బ్రాప్తించినదని వినుటకు మిక్కిలి సంతోషముగ నున్నది. అప్పుడప్పుడు మీపత్రికలోని సారస్వతవ్యాసములు చదివి అవిచేయుచున్న భాషాసేవకు హర్షించెడివాడను. మీపత్రికాముఖమునకంటెను పుస్తకప్రచురణమువలన మీరు చేసినభాషాసేవ ప్రశంసనీయమైనది. ఉభయతారకమైనదికూడను. ఎక్కడను లభ్యములు కాని ఎన్నో అమూల్యగ్రంథములు మీప్రచురణశాఖలో లభించుననుట సువిదితము. చిరకాలమునుండి మీరును పూజ్యులైనమీతండ్రిగారును సలిపినభాషాసేవను కృతజ్ఞతాపూర్వకముగా స్మరింపని యాంధ్రుడుండడని నామతము ఇకముందు వెనుకటికంటెను శ్రద్ధ వహించి మరింతనిర్దుష్టముగ నమూల్యగ్రంథములను ప్రచురించుచు ఆదినుండియు సరస్వతీనిలయమైన మీవంశము ఆంధ్రభాషకును ఆంధ్రజాతికిని సేవచేయునుగాక అని యాశించుచున్నాడను.

## ౨౧

## శ్రీ సూరంపల్లి రెడ్డిశ్రేష్ఠిగారు, విజయనగరము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిసన్మానము సర్వజనాదరణీయముగ నుండగలదు. వీరి తండ్రిగారగు శ్రీ॥ శే॥ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారిపరిచయము 1869-వ సంవత్సరమునుండి నాకు గలదు. కేవలము పరిచయము లేకాదు, నాకు ప్రాణస్నేహితులుగాకూడ నుండిరి. వారు వేదములు, శాస్త్రములు, భాష్యములు మున్నగు మతగ్రంథముల పెక్కింటిని తరచి సారమును గ్రహించినమహనీయులు కావుననే శ్రీ శ్రీ శ్రీ శృంగేరిపీఠమునకు ముఖ్యపండితులుగ కూడ నుండగలిగిరి. మదరాసునందలి శృంగేరిపీఠమునకు ప్రతివత్సరమును నవరాత్ర మహోత్సవములను తమస్వంతఖర్చులపై జీవితాంతమువరకును చన్నపట్నములో జయప్రదముగ జరిగించుచుండిరి. మరియు విశేషశ్రమలకులోనై పురాతనతాళపత్రగ్రంథముల దెప్పించి తమపాండిత్యాతిశయముచే అందలి దోషములనుసవరించి చక్కగ ముద్రించి ప్రజాలోకమునకందజేసిరి. కావున వీరుగావించిన మతసేవయు భాషాసేవయు మిక్కిలి కొనియాడదగియున్నవి వీరిధర్మసూక్ష్మత న్యాయశాస్త్రతత్పరతనుబట్టి ప్రధానన్యాయస్థానము High Court నందుకూడ వీరిసలహాలనుబొంది న్యాయవాదులు కూడ Judges తమధర్మసందేహముల బాపికొని తీర్పులుచెప్పుచుండెడిసంగతి నేను బాగుగా నెరుగుదును. వీరును నేనును అనేకవ్యవహారములను సంప్రతించుకొనుచుండెడివారము. అన్నివిధముల శ్రీ శ్రీ॥ శే॥ వావిళ్లరామస్వామిశాస్త్రిగారు నాకు సోదరతుల్యులు. అకారణముచే వారిపుత్రరత్నము చిరంజీవి భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని ఆశీర్వదింపవలసినవాడనేగాని పొగడదగినవాడనుకాను. అయినను శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు సర్వవిధముల తండ్రిగారికీర్తినినిలబెట్టి తాము కృతార్థులైనందులకును విశేషించి "భాషోద్ధారక" బిరుదవిరాజితులైనందులకును మిక్కిలి సంతసించుచున్నాను. పరమేశ్వరుడు వీరి కాయురారోగ్యభాగ్యముల నొసంగి భాషాసేవను నిర్విఘ్నముగ కొనసాగింపనొనర్పుగాతయని ప్రార్థించుచున్నాను.

## ౨౨

## శ్రీ అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరులు,

రిటైర్డు పండితులు, ప్రెసిడెన్సీకాలేజి, గుత్తికొండ, గుంటూరుజిల్లా.

అప్పటికీ యిప్పటికీ మార్గం భేదించినా మీ ప్రకాశకత్వపుటోడ్పాటుతో త్రిలిఙ్గకు నామకర్తను ప్రవర్తకుడను నేనేగనుక 25 సంవత్సరాలప్రౌఢవయస్సును ప్రాపించినదని

మిక్కిలీ ఆనందిస్తున్నాను. త్రిలిఙ్గను ఆరంభించిన కొద్దిరోజులకే "తెలుఁగులో అనుప్రాసము కలదా?" అనే విషయాన్ని గురించి మదరాసు ప్రెసిడెన్సీ కాలేజీలో శ్రీ వావిలికొలను సుబ్బారావుగారు అధ్యక్షులుగావుండినసభలో నేనుపన్యసించినప్పుడు "త్రయాణాం లింగానాం సమాహారస్త్రిలింగీ" అని వుండవద్దా! త్రిలిఙ్గ అని మీపత్రికకు నామకరణ మెట్లాచేశారని ఒకరు ప్రశ్నించారు. వారిపేరు మరచాను.

అందుకు,

"యైర్దేశస్త్రిభిరేష యాతి మహతీం ఖ్యాతిం త్రిలిఙ్గాఖ్యయా" అనే విద్యానాథపంక్తిని వినిపించి,"త్రయోలింగరూపాః శ్రీశైలనాథాదయో దేవా యస్మిన్ దేశే స త్రిలిఙ్గః" అనే రత్నాపణవాక్యాల ననుసరించి విగ్రహంచెప్పినట్లు స్మృతి. బహువిషయాలనుగురించివుండే త్రిలిఙ్గలోనివార్తలు పత్రికకు వైలక్షణ్యాన్ని వెలయిస్తున్నవని నాఅభిప్రాయము. Comment అనే అర్థంలో యూనివర్సిటీపరీక్షాపత్రాల్లో మొట్టమొదట నేనువాడిన వ్యాఖ్యాశబ్దాన్ని త్రిలిఙ్గ ప్రస్ఫుటదీప్తిమంతం చేయడం నాకు సమ్మోదప్రదంగా వున్నది. రాజకీయాల్లో నాకంతగా ప్రసక్తి లేకపోయినప్పటికీ విషాప్రవర్తకవ్యాసాల్లో సమంజస విచారణ నేను కనుగొనగలిగినాను పరమేశ్వరకృపవలన ప్రవర్ధమానఅవుతూ త్రిలిఙ్గపత్రిక చిరస్థాయిని అయి ఉచితపథాల వాఙ్మయానికీ లోకానికీ శ్రేయోభ్యుదయాలను సమకూర్చుగాక! అని అభిలషిస్తున్నాను.

## 23

### శ్రీ మల్లాప్రగడ రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.,

మేనేజింగుడైరక్టరు, అమృతాంజనముకంపెనీ, జార్జిటవును, మదరాసు.

భారతదేశమందంతటను 'అమృతాంజనము' అంటే సర్వోత్కృష్టతలనొప్పిమందని స్ఫురించునట్లు, "వావిళ్ల" అనుపదమునకు "చక్కటి ఆంధ్రగ్రంథప్రకాశకులు" అను నిఘంటుఅర్థము తెచ్చిన శ్రీ భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులకు త్రిలిఙ్గరజతోత్సవ సందర్భమున నాహృదయపూర్వక అభివందనములు.

## 24

### శ్రీ డాక్టరు: చంద్రాభట్ల సూర్యనారాయణమూర్తిగారు, యల్.ఐ యం., విజయనగరము.

శ్రీశ్రీశ్రీభాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని సన్మానించుటకు భాషాప్రవీణులే అర్హులు. అయినను వారుగావించుచున్న నిరంతరభాషాసేవ, వారినిరాడంబరజీవ

నము, స్వమతాభిమానము, ధర్మతత్పరతమున్నగుసుగుణసంపత్తి యెవరినైన నాకర్షింపక మానదు. వీరిసన్మానము పండితపామరజనరంజకముగ నుండగలదనుట అతిశయోక్తి కానేరదు. జీర్ణావస్థయందున్న ప్రాచీనశాస్త్రముల వెక్కింటిని చక్కనిప్రచారమునకు తెచ్చి రనుటకు వీరిసంస్కృతాంధ్రముద్రితగ్రంథములును, ఆంధ్రాంగ్ల, తమిళములందు వెలువ రించుచున్న పత్రికాత్రయమును ప్రబలనిదర్శనములు. అనేకపండితులకు తమగ్రంథములను పత్రికలను ఉచితముగబంపి వీరు భాషాసేవచేయుచుండుట లోకవిదితము. మరియు కొన్ని గ్రంథాలయములకు గ్రంథముల నుచితముగ నొసంగి తమత్యాగమును జూపుచున్నారు. ఇంకను సాంఘిక రాజకీయాదివిషయముల వెక్కింటిని నిష్పక్షపాతబుద్ధితో విమర్శించి ప్రచు రించున్యాయమార్గప్రదర్శకులు.

ఇట్టి పత్రికానిర్వహణసమర్థుడగు మహనీయునిసన్మానము త్రిలిజ్గ రజతోత్సవసందర్భ మునసేగాక ఎల్లవేళలను సర్వజనశ్లాఘాపాత్రముగనుండగలదనుటకు సందేహములేదు.

ఇట్టినిర్మలచరితుని ఛాయాపటములు ప్రతిగ్రంథాలయమునందును విద్యాసంస్థ యందునునుంచినచో వీరు ప్రతిభారతీయయువకునికిని ఆదర్శప్రాయముగ నుండగలరని నమ్ముచున్నాను.

ఇట్టి సుగుణరాశినిగన్న భారతభూమి ధన్యవంతమైనది. ఇట్టి త్యాగశీలునిగన్న ఆంధ్రమాత పవిత్రమైనది. ఇట్టి మహనీయుని ఆశ్రయించినపండితబృందము సార్థకమైనది. ఇట్టి ధర్మమూర్తిని సృజించినవిరిఞ్చి కృతార్థుఁడు. ఇట్టి నిరంతరభాషాసేవకునిగన్న భాషా లలామ కడునదృష్టవంతురాలు.

శ్రీశాస్త్రిగారు నిరంతరభాషాసేవయొనర్చి ధన్యులగుటకును ఆంధ్రరాష్ట్రస్వాతంత్ర్య వాంఛ సత్వరముగ నెరవేరి ఆంధ్రులందరును కృతార్థులగుటకును పరమేశ్వరుడు వీరికి ఆయురారోగ్యముల నొసంగుగాత అని కోరుచున్నాను.

## 25

### శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, ఓరియంటల్ ఇన్‌స్టిట్యూటు, తిరుపతి.

ముప్పదియేండ్లనుండి శ్రీ శాస్త్రులుగారిని నే నెఱుఁగుదును. వారితండ్రిగారు పెక్కేండ్లు సమధికచాతుర్యముతో సాగించిన పుస్తకవ్యాపారము వారియనంతరము యథాయథలుకాఁగా బాలకులయ్యును, నానాఁడు శ్రీశాస్త్రులుగారల్పారంభముగా మరల నుపక్రమించి పిత్ర్యమగు గ్రంథవ్యాపారమును క్రమక్రమముగా పెంపొందించిరి. ఈశ్వర

కృప వారిచేర్పునకుఁ దోడుకాఁగాఁ గడచినయుద్ధమున వారివ్యాపారము మిక్కిలి పెంపొందినది. ఒడుదుడుకులుపోకనీకుండ నిర్వక్రముగా వ్యాపారము సాగింపగలచాకచక్యమును జాగ్రత్తయు, వ్యాపారప్రసక్తమగు ప్రామాణికతయు శ్రీశాస్త్రులుగారికిఁ గలవు ధనవ్యాపారవిషయములందంతగా జాగ్రత్తవహింపకపోయినను శ్రీనాగేశ్వరరావుగారీశ్వరానుగ్రహమున సంకల్పించిన సర్వకార్యములను నిర్వర్తింపఁగలవారై మహైశ్వర్యమహితులయిరి. శ్రీశాస్త్రులుగారీశ్వరానుగ్రహముతో వ్యాపారనైపుణియుఁగలవారై ధనము వమ్ముపోనీక జాగ్రత్తగా మెలఁగుచు గవులసంపదలఁబడసిరి. శ్రీనాగేశ్వరరావుగారివలె వీరును ననేకధర్మకార్యములకు ధనసాహాయ్యము జరపుట యెల్లరు వినుచున్నవిషయమే. అనేకసంస్కృతాంధ్రగ్రంథములు శ్రీశాస్త్రులుగారు ప్రకటించిరి. సమర్థులగు గ్రంథవిక్రేత లిట్టివారు వర్ధిల్లుటచే ఆంధ్రదేశమున ప్రశస్తగ్రంథప్రకటనము సాగినది ఆంధ్రదేశమున కీవిధముగా వీరు చాలమేలుచేసిరి. 'త్రిలింగ' యని తెలుగుపత్రికను వీరు ప్రకటించుచున్నారు. పెక్కేండ్లకుముందు దానిని జూచితిని. అదికూడ సనాతనపత్రికయై దేశమున కుపకారము జరపుచున్నది. ఆంధ్రదేశమున కింకను చిరకాలము శ్రీశాస్త్రులుగా రుపకారకులుగా వెలయుదురుగాక.

## 26

## శ్రీగొల్లపూడి సీతారామశాస్త్రిగారు, బీ. ఏ, బి. ఎల్, వినయాశ్రమము.

కీర్తిశేషులగు తమతండ్రిగారును, తత్సాంప్రదాయానుసారముగా తామును ఆంధ్రదేశమునకు చేసిన మహోన్నతసేవ మిక్కిలి కొనియాడతగియున్నది. మతమునకు సంబంధించిన యుద్గ్రంథములను సంపాదించుటలోను, ఆంధ్రములో ప్రకటించుటలోను, సంస్కృతగ్రంథములను ఆంధ్రానువాద మొనరించుటలోను, చేయబడినకృషి నిరుపమానము. ఆంధ్రవాఙ్మయమును, సమగ్ర మొనర్చుటకు ఎంతో సాయపడితిరి ప్రఖ్యాతిగన్న గ్రంథాలయములకు మీ ప్రచురణముల నుచితముగా నిచ్చుచు విజ్ఞానవ్యాప్తికి తోడ్పడితిరి.

దైవము తమకు చిరాయురారోగ్యైశ్వర్యములిచ్చి మీ సేవను మరింత జయప్రదముగా సాగునట్లు అనుగ్రహించుగాక.

## 27

## శ్రీ పరిటాల హనుమంతరావుగారు, వెంకట్రావుపేట, ఏలూరు

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుర్లువారు. వీరు సుప్రసిద్ధతెలుగుపత్రిక. "త్రిలిఙ్గ" సంపాదకులు, వీరియశశ్చంద్రికలను వీరిపత్రిక దశదిశలు వెదజల్లుచున్నది భాషోద్ధారక

అనుబిరుదము వీరికెంతయు తగియున్నది. వీరు వీరిపత్రికయందు వెల్లడించువిమర్శలు అద్భుతము. వీరు సారస్వతమునకు చేయుచున్న సేవ అపారము. ఎన్నిజన్మలకయినను మరువరానిది. అయ్యది చిరస్మరణీయము.

ప్రస్తుత ఆధునికయుగము పీల్చివేయబడిన పిప్పివంటిది. నిస్సారమై, నిర్వీర్యమై, రొండి బీటలువారియున్నది ఇట్టిసమయములో, ఈస్థితిలో అంధకారములో అణగిమణగి క్రుగ్గిఉన్న దేశమునకు ప్రాణములనుపోసి జ్యోతిర్జ్వాలలను మనదేశముమీాద వికసింపచేసినారు. ఒక్క మన ఆంధ్రజాతికేకాక అన్ని జాతులకును "ఫెడరేటెడ్ ఇండియా" అను ఆంగ్లపత్రికచేతను, "బాలవినోదిని" అను అరవపత్రికచేతను, "త్రిలిఙ్గ" అను మన తెలుగుపత్రికచేతను అమూల్యమగు సేవచేసి ఏకకంఠముగ మన్ననలనంది తమజన్మ సార్థకము గావించుకొనినారు.

మనభారత దేశమున సనాతనధర్మము నశించిపోయి పాశ్చాత్యనాగరికత పెచ్చుమీారిన యీాదినములలో సనాతనధర్మమును పునరుద్ధరించుటకు వీరు సమకట్టినారు. పత్రికనడుపుటలోనేమి, వేటిలోనైనను అనేకకష్టనష్టముల కోర్చి వీరుచేయుచున్నకృషి వేనోళ్ల పొగడతగియున్నదని ఘంటాపథముగా చెప్పతగియున్నది. కొద్దికాలములోనే వీరు తమ త్రిలిఙ్గను దైనికపత్రికగా నొనర్చి ఆంధ్రాభ్యుదయమునకు, సనాతనధర్మమునకు తోడ్పడుటకు పరమేశ్వరుడు దీర్ఘాయురారోగ్యభాగ్యముల ప్రసాదించుగాక యని ప్రార్థించుచున్నాడను.

## 28

## శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారు, ఎం. ఏ.,

ప్రిన్సిపాలు, సంస్కృతకాలేజీ, కొవ్వూరు.

"త్రిలిఙ్గ"కు రజతోత్సవము జరుగనున్నదని వినినపు డేయార్యవిజ్ఞానాభిమానిహృదయము పొంగదు! ఆంధ్రదేశములోని సనాతనులకందఱకును "త్రిలిఙ్గ" ఆప్తబంధువు. ఈనడుమ నాంధ్రరచయితలహృదయకుహరములలో బయల్వెడలిన ప్రాచీనధర్మవిజ్ఞానసంప్రదాయాభిమానావేశసంజనితభావతరంగములు, దరిద్రులమనోరథములవలె లోలోపలనే నశింపకుండ, వానినన్నిటి నేకోన్ముఖములుచేసి, తనలోనికి ప్రవహింపచేసికొని యభయమను నానకట్ట నేర్పరచి స్వీయసంచికాకుల్యలమార్గమున వాని నాంధ్రదేశములో వాడవాడలకు ప్రవహింపజేసి ప్రజలహృదయక్షేత్రములలో సనాతనధర్మసస్యబీజములు నిర్వీర్యముకాకుండ కాపాడి యవి మొలకలెత్తి నవనవలాడునట్లు చేయుచున్నది త్రిలిఙ్గపత్రికాప్రవంతి. ఈ

పత్రికాభాగీరథి చిరకాలమవిచ్ఛిన్నముగ ప్రవహించి తానుపూనినపవిత్రకృషిని పూర్ణ ఫలపర్యవసాయి చేయగల్గునట్లాశీర్వదింపవలెనని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇతరవిధములుగగూడ 'త్రిలిఙ్గ' ఆంధ్రాళికి ప్రశంసనీయమైనసేవను చేయక పోలేదు. కాని యన్నిటికంటెను పేర్కొనదగినదిదియని నాయభిప్రాయము.

ఏతత్పత్రికాస్థాపకులును, సంపాదకులును, నిర్వాహకులునైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు సహస్రసంఖ్యాకములైన గ్రంథములను బ్రకటించి దేశభాషాదేవభాషలకుచేసినసేవ నిరుపమానమని నిస్సంకోచముగనుడువవచ్చును.

## 29

## శ్రీ దద్దనాల లక్ష్మీసత్యనారాయణయ్యగారు, "పద్మనాయక" సంపాదకులు, నూజవీడు.

తమయొక్క "త్రిలిఙ్గ" పత్రిక ఇరువదియైదుసంవత్సరములప్రాయము మీరి ప్రౌఢయై రజతోత్సవకుతూహలియై యున్నదని ఆకర్ణించుట కెంతయు సంతసించుచున్నాము. ఇట్టి శుభసందర్భమున అపత్రిక నింతవరకు బోషించుకొనివచ్చిన భవదీయ కృషి నెంతయు గొనియాడుచున్నాము.

తమ "త్రిలిఙ్గ" పత్రిక సర్వాలంకారసంశోభితయై వ్యాసవార్త వ్యాఖ్య విశేషములతో నలరారుచు ఎప్పటివలె స్వర్ణోత్సవమును, ఆవెనుక వజ్రోత్సవమును, ఉచితకాలములో ఆశించగలదనివాంఛించుచున్నాము.

తామొనరించుభాషాసేవకు ఆంధ్రదేశము తమయెడ కృతజ్ఞురాలై యుండకతప్పదు.

## 30

## శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు,

సంపాదకుడు, 'ఆంధ్రి,' పల్లిపాలెము, ఈస్టు గోదావరిజిల్లా.

ఆంధ్రసారస్వతమున కవ్యాజసేవచేసిన మదరాసువాస్తవ్యు లిద్దఱే. వీరొకరికొకరు తీసిపోని మహావ్యక్తులు. ౧. కాశీనాథుని నాగేశ్వరరావు, ౨. వావిళ్ల రామస్వామిశాస్త్రి. వీరిరువురు నేడు కీర్తిమాత్రశేషులు.

ఈమహాశయుల నిర్వురశక్తి పుడికిపుచ్చుకొని నేడు తెలుఁగునాటికిఁ దెలుఁగుబాసకు విలువగలయుపకారము సలుపుచున్నవ్యక్తి, ఒక్క శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారే.

ఈయనదగ్గఱ పాండిత్యమునకు దగినసౌజన్యము వ్యవహారజ్ఞానమునకుదగిన ఉ
వైచిత్ర్యము కార్యశూరతను మించిన దీర్ఘాలోచనముకలవనుట స్వభావోక్తి.

రాష్ట్రోద్యమములో 'నేనని' ముందు నిలఁబడి వర్తకసరణిలో పలువురచేత 'ఆహా'
అనిపించుకొని, పెద్దమనుష్యులలో నింత త్వరగాఁ పేరుతెచ్చుకొనిన ఆంధ్రులు మఱ
రాసులో నరుదు.

వావిళ్లవారి ప్రచురణములేనికుటుంబము తెలుఁగున లేదనవచ్చును. ఆంగ్లమునఁ
బ్రచురింపఁబడు "ఫెడరేటెడ్ ఇండియా" పత్రికయేగాక ఆంధ్రమున వావిళ్లవారిచే నడపఁ
బడు 'త్రిలిఙ్గ' చాల ప్రసిద్ధికెక్కినది. ప్రసిద్ధబుద్ధులగు వేంకటేశ్వరశాస్త్రిగారి సముచిత
సంపాదకత్వమున నీపత్రిక కిరువదైదేండ్లు నిండినవి.

దీని మూలమున వీరు చేసిన భాషాసేవ, సనాతనసంఘసేవ, రాజకీయసేవ మఱవ
రానివి.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి భాషాకృషికి, వివిధప్రాంతములలోని ప్రము
ఖులు వారికి చేయుచున్న గౌరవములే తార్కాణ.

ఈ సన్మానసందర్భములఁ దమతండ్రిగారిని స్మరించుకొనుచు మాట్లాడెడుమాటలే
శ్రీశాస్త్రిగారి వినయవాదమునకు కాణాచి.

'త్రిలిఙ్గ'కు రజతోత్సవములేగాక శతాబ్దోత్సవము లసంఖ్యముగా జరుగుఁగాక!

## 31

## శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిగారు, తెనుఁగుగుడి, అనకాపల్లి.

శాస్త్రిగారూ! తెనుఁగువారి కెందఱకో ఎన్నితెఱంగులనో మేలుచేసి వారికెల్లర
కును నెయ్యులై మీరు వెలయుచున్నారు. నాపొత్తములనుగూర్చి మీపొత్తపుజాబి
తాలో వెల్లడించి అవి కొన్నికొన్నియేండ్లు కొని నాకు మేలుచేసితిరి; అందువలన నాకును
మీరు నెయ్యులైతిరి. తోడివారికి పెక్కురకు పనికివచ్చుచుండు మీపుట్టుకయే పుట్టుక!

కీ॥ శే॥ మీతండ్రిగారు రామస్వామిశాస్త్రిగారు ౮౦ యేండ్లక్రిందటనే చెద చిమ్మట
యెలుకలు మొదలగువానిపాలుగానీయక ఎందెందో పడియున్నపొత్తములను పైకితెప్పించి,
అవి అచ్చొత్తించుటచే పలుకుతల్లి కొలువొనర్చి, తెనుఁగువారికి మేలుచేకూర్ప మొదలిడి,
ఆపనిలోనే తమమనుగడయెల్ల కడపి, ఎంతో మన్నన పొందఁజాలిరి. మీరును వారిమొదల
తలనిడికొని ఎడతెగనిపట్టుదలతో ఆకడంక విడువక పెంచి ఎంతోడబ్బు వెచ్చించి వారిని

మించి పనిచేయుచున్నారు. పిల్లలకును పెద్దలకును పనికివచ్చు పెక్కుపొత్తములు తెనుఁగు-సంస్కృతము-తమిళము మున్నగు ఎన్నోపలుకులలో తెనుఁగు-నాగరము-తమిళములోనగు ఎన్నో వ్రాలలో ముద్దులుమూటఁగట్టున ట్లచ్చువేయించి, అవిచూచి-వానివలన మేలొందినవారందఱు మిమ్ము మెచ్చుకొనునట్లొనరించి భాషోద్ధారకబిరుదము గడించి, పెక్కుచోట్ల మన్ననలందుచున్నారు. అచ్చెరువగునట్లు మీ నేర్పుచే పలుకుకలిమిచెలువలకు పొత్తు కుదిర్చి వారు మీయింట నెలకొనిమెలంగునట్లు చేయఁజాలుచున్నారు.

ఇంతేకాక, తెలుఁగున 'త్రిలిజ్గ', ఇంగ్లీషున 'ఫెడరేటెడ్ ఇండియా', తమిళమున 'బాలవినోదిని' అనుపత్రికలు నెలకొల్పి, మతనీతిసాంఘికవిషయములను గూర్చియు, ఆర్థికరాజకీయసమస్యలనుగూర్చియు భాషలు మొదలగువానినిగూర్చియు సదభిప్రాయములు వెల్లడించుచు, నాటిపలుకుకొలువులు కొలుచుచున్నారు. ఒకపత్రికనడపుటయే కడుకడిందిపని; అట్టిచో మూఁడుపత్రికలను నడపుబరువు భరించుపస ఎంతయేని మెచ్చఁదగినదని వేఱే చెప్పవలయునా?

మఱియు పెక్కుసంఘములకును-సభలకును అధ్యక్షులయ్యు, కార్యదర్శులయ్యు, కార్యనిర్వాహకులయ్యు, గౌరవదండనాధికారులయ్యు, కార్యదీక్షతో నాయాపనులు నెఱవేర్చి-నెఱవేర్చుచు పాటుపడిరి; పాటుపడుచున్నారు. మునుపు కీ॥ శే॥ బాలగంగాధరతిలకు మొదలగు గొప్పవారిస్నేహగౌరవములకు పాత్రులైరి; ఇప్పు డట్టివారిస్నేహగౌరవములకు పాత్రులగుచున్నారు. సత్యమని నమ్మినది మొగమోటపడక వక్కాణించుటలో చూపు ధైర్యమునుబట్టి మీరు ధీరులనెంతయు మెప్పింపఁగల్గుచున్నారు.

ఇంకను, ఆంధ్రభాషాభిమానమును - ఆంధ్రకావ్యాభిమానమును - ఆంధ్రగ్రంథాలయాభిమానమును-ఆంధ్రరాష్ట్రాభిమానమును పలుచందముల వెలయించి, పొగడికలు పడయఁగలుగుచున్నారు.

ఇట్టిభాగ్యము మీకు లభించుటకు మీపూర్వజన్మపుణ్యఫలముతోపాటు ఇప్పటి మీసుగుణసంపదయు కారణమే!

ఇట్టియెడ వెండి-బంగరు-మగతాపండుగలు మెండుగాసాగుచుండు బ్రిటిషుదొరతనపుతఱిని, ౨౫ యేండ్లఈడువచ్చిన మీముద్దుబిడ్డ త్రిలిజ్గ మీచే తనకు వెండిపండుగ చేయించుకొన వేడుకపడుట వింతకాదు. తెనుఁగునాటికి త్రిలిజ్గ చేసినమేలు మఱవరానిది; బిరుదులుకలవారికేకాక వలయువారికి అందఱకును ప్రోత్సాహమిచ్చుటచే అందఱమెప్పులను చూఱగొనఁజాలినది.

కాన, త్రిలిఙ్గ వెండిపండుగ యెల్లతేనికనికరమున కొంతయుతగినదై చక్కఁగా సాగుఁగాక! అందువలన మీ దెందము మేరమీఱినహాయి కదలికొరటపుటుయ్యాలలో బాగుగా ఊఁగుగాక!! మీ యీముద్దుబిడ్డను నానాఁటికి పెంపొందించి, వలయునెడ దిన పత్త్రికగా మార్చి, దాని బంగారుమగటాపండుగులును ముస్ముందు మీరొనర్చి, కడుంగడు నలరారెదరుగాక!!! తోడివారి నలరించెదరుగాక!!!! ఆరోగ్యైశ్వర్యములు సత్కార్యదీక్షచే మీకు హెచ్చుగుచుండుఁగాక!!!!!

గీ. వేంకటేశ్వరశాస్త్రి! నిశ్శంకమేలు, పనులుకావింప వావిళ్లవంగడంబు
వాసికాంచె; 'త్రిలిఙ్గ'యు వాసికాంచె, ధన్యుఁడైతి; వెప్పటికిని ధన్యుఁడగుదు.

## 32

## శ్రీ గునుపాటి యేనాదిరెడ్డిగారు, ఇందుకూరుపేట, నెల్లూరుజిల్లా.

బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిమైత్రి నాకు చిరకాలముగ గలదు. వీరి నాయనగారైన కీర్తిశేషులు వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిని చక్కగ నెఱుగుదును మహాపండితులును, పూజ్యులునగు శ్రీచదలువాడ సుందరరామశాస్త్రులవారును, వీరును కలిసి తొలుత ఆదిసరస్వతీముద్రాక్షరశాలను స్థాపించి చివికి శిదపురువులపాలయి జీర్ణించు చున్న సంస్కృతాంధ్రగ్రంథకోశములను రక్షించి పెక్కుగ్రంథములను ముద్రించి ఆంధ్ర లోకమునకు అర్పించుచుండిరి. పిమ్మట శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు ప్రత్యేకముద్రాల యమును స్థాపించి పెక్కుగ్రంథరాజములను మూలములుగను సవ్యాఖ్యానములుగను ముద్రింపించిరి. మాతాపితృపూజయే అత్యావశ్యకమని యెఱింగిన శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు నాయనగారు స్థాపించిన ధర్మమునందు పట్టువదలక మూలమూలలనున్న యుద్గ్రంథములను చక్కని అక్షరములతో మంచికాగితములలో సంస్కృతాంధ్రాంగ్ల అక్షరములతో సయితము ముద్రించుటయేగాక ఉద్గ్రంథములకు టీకలు వ్రాయించియు, నాయనగారు రచించిన టీకలతోసయితము ప్రచురించుచు ప్రచురణకార్యము నవిచ్ఛిన్న ముగ కొనసాగించుచున్నారు. పితృపితామహస్వస్థానమగు వావిళ్లనామమును ఆచంద్రా ర్కముగ అన్నిదిశలను స్థాపించిరి. కేవలగ్రంథప్రచురణాదికార్యములేగాక రాజకీయముగ దేశసేవాధురంధరులై 'త్రిలిఙ్గ' యనువారపత్రికను స్థాపించి, రాజకీయ, సాంఘిక, సారస్వత, మతవిషయములను బోధించువ్యాసరాజములను పండితులచే వ్రాయించి ప్రచురించుచు ఆంధ్రలోకమునకు మహోపకారము నొనరించుచున్నారు. అట్టి త్రిలిఙ్గపత్త్రికకు రజతోత్స

వము జరుగుచున్నందుల కెంతయు సంతోషము. ఇతోధికముగ ఆపత్త్రిక వెంపొందును గాక అని ఆశించుచున్నాడను.

## 33

## శ్రీ సాగి రామనాథశర్మగారు, కారెంపూడి, గుంటూరుజిల్లా.

తాము త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున సంచిక నొకదానిని ప్రచురింపించి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి గౌరవార్థము సమర్పించుట కడుంగడు ముఖ్యధర్మము. అట్టి తమమనోరథ మీడేరుటకు భాషాభిమానులను ఉత్తమములగు వ్యాసములను వ్రాసి పంప మని కోరియుంటిరి. అనన్యవిషయములకు తాము తావొసంగినను ప్రస్తుతసమయమున శ్రీవావిళ్లవారి చిరస్మరణీయమై దేశహితముకొరకై చేసినసేవను ప్రస్తుతించుటయే ముఖ్యధర్మమని నేనును శ్రీవావిళ్లవారి సాహసమనుపేరుతో నీచిన్నవ్యాస మొకదానిని వ్రాసి సమర్పింపదలచితిని. శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారినిగాని, వేంకటేశ్వరశాస్త్రుల వారినిగాని చూడనివా రనేకులు గలరు. కాని వారు ముద్రింపించిన వివిధగ్రంథజాలము వలన చిరపరిచయులగుటయేగాక, పూజనీయులు గూడ నైరి. "అవశ్యం పితురాచార" మన్నట్లు తమతండ్రిగారనుష్ఠించిన సారస్వతసేవయే నేటివరకు కడు దీక్షతో నెన్ని అంత రాయము లొదవినను ద్రవ్యమునులెక్కచేయక సంస్కృతాంధ్రములయందలి తమకుగల అభిమానమును లోకమునకు వ్యక్తపరచుచున్నారు.

ప్రస్తుతకాలమున నొకగ్రంథకర్త గ్రంథమును వ్రాసి ప్రకటింప దలచినచో తనకు గల ద్రవ్యలోపమునుగూర్చి విచారమునొందుచు, ఇతరులపై మోపిన తత్కార్యభారము నకు వెనుదీయుదురేమోయని దిగులొందుచు, ముద్రణకానిపక్షమున తనశ్రమయంతయు వ్యర్థమని చింతాసముద్రమున మునుంగు ఎందరో కవులయొక్క వాంఛితమును, కీర్తిశేషు లైన పూర్వకవులయొక్క గ్రంథపునరోద్ధరణభారమును, ఏప్రభుపుంగవులో, ఏధనాధి పతులో, నిర్వహించవలసియుండ, ఒక్కబ్రాహ్మణుడు ధైర్యముతో పట్టుదలతో నిర్వ హించుట వావిళ్లవారిసాహసముగాక మరేమగును?

మనపూర్వులచే వ్రాయబడిన రామాయణముగాని, మరియేయితరగ్రంథముగాని శిథిలమైనచో, తిరిగి వ్రాయించుటకై వారు ఎంతయో ప్రయాసపడి, ఒకవ్రాయసకాని నియమించుకొని భోజనాదిసౌకర్యములొసగుచు, గ్రంథముముగియగనే గొప్పబహుమాన మొసగి యిప్పటికి మనయింటియందు తిరిగి యీగ్రంథమున్నదని ఎంతయో సంతోషపడెడి

వారు. ఇంకను వారు ఇతరగ్రంథములను సేకరింపదలచినచో ఎంతవ్యయప్రయాసలకు లోనుగావలసివచ్చెడిదో గమనింపుడు. అట్టిది శ్రీశాస్త్రులవారి అనుగ్రహమున సులభముగ అందరకు అన్నిగ్రంథములు అందజేయుట ఆంధ్రదేశమునకుజేసిన అమూల్యమైనమహోప కారముగాదా !

పూర్వమునందు రాజులు పండితులను, కవులను తమ సంస్థానములయందుంచుకొని కుటుంబములతో పోషించి, వారిచే ఉత్తమములగుగ్రంథములను వ్రాయించి భాషాభివృద్ధిని జేసిరి. అటులనే శాస్త్రిగారును వారి ఆదిసరస్వతీనిలయమునందు పండితులను పోషించి, గ్రంథములను చాల పరిశోధింపించి, ఆరాజన్యులయొక్కయు గ్రంథకర్తలయొక్కయు కీర్తిని విస్తరింపచేసినవారగుటయేగాక భాషకువచ్చుచున్నముప్పును తప్పించుచు, భాషాభివృద్ధిని చేయుచున్నవారు గాదా !

సనాతనధర్మవృక్షమును సమూలముగ పెకలింపవలయునని మననవనాగరకులు కొన్ని పత్రికలు తమయావచ్ఛక్తిని వినియోగించుచున్న నీసమయమున సనాతనధర్మరక్షణాపక్షులగు శ్రీశాస్త్రిగారు సనాతనులచే వ్రాయబడినవ్యాసములకు త్రిలిజ్గఅందు తావొసంగుచు తమశక్తివంచనలేక పాటుపడుచున్నందులకు సనాతను లెంతయు కృతజ్ఞులు గాకుందురా !

ఏరాజాశ్రయుడు రాజువలెను, ఏపండితసముడు పండితపోషకుడుగను, ఏభాషాసేవకుడు భాషోద్ధారకుడుగను మూర్తీభవించెనో అట్టి శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారిపుణ్యవిశేషముగాక మరేమగును ?

ఇట్టి మహనీయుని "పరగుణపరమాణూ౯ పర్వతీకృత్యనిత్యం నిజహృది వికసన్తస్సంతి సన్తః కియన్తః" అని చెప్పబడినట్లు ప్రప్రథమమున కడపమండలవాసులు గౌరవించుటయు, ఇట్లే ఇతరమండలవాసులు ప్రస్తుతించుటయు, పరమధర్మము హితాచరణమునై యున్నది. దేశహితాభిలాషులును, సనాతనధర్మాసక్తులునగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి ఆయురారోగ్యైశ్వర్యముల నభివృద్ధినొందించి ఇతోధికముగ భాషోద్ధారకుడగునట్లు పరమేశ్వరు డనుగ్రహించుగాక అనికోరుచున్నాడను.

## 34

## శ్రీ దేశపాండ్య సుబ్బరావుగారు వకీలు, నంద్యాల.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వర్లుగారు ఆంధ్రసారస్వతమునకు జేసినసేవ అపారము. ఆంధ్రపరిచితులనేకులకు "వావిళ్ల" ముద్రితములనియే తెలుసునుగాని పూర్తిపేరు తెలియదేమో

అని నాసంశయము. మంచివారికీర్తి మరి యేడుతరములవఱకు అనులోకోక్తి వీరివంశమువల్ల అర్థపుష్టి కలిగింపబడినది. వారిసేవ వారివంశమునకు కీర్తితెచ్చుటయేకాక ఆంధ్రపాత్రములన్న వావిళ్లవారిసొమ్ము అని నమ్మకము పుట్టించిరి.

లోకమాన్యులశ్రీగీతారహస్యమును ఆంధ్రలోకమునకు అందుబాటుచేయుటయందు వారుచేసినకృషి మరువలేము. భారతేతరులు గూడ గీతయందలి ఉత్కృష్టతను గమనించి అందలితత్త్వమును తమజీవితమునందు లీనముచేయవలెనని ఆమర్దయుండుకాలములో భారతీయజనసామాన్యము గీతాసందేశమును మరచి రాజకీయతరంగములలో కొట్టుకొనిపోబడినప్పుడు లోకమాన్యునిగంభీరభాష్యమును మిక్కిలి మృదుమధురశైలిలో వ్రాయించి గీతనందలి అభిరుచి శంకరరామానుజాదులభాష్యము అవగతముచేసుకోలేనిప్రజాసామ్యమునకు గీతయొక్క పునాది "కర్మయోగ"మని చాటింపు శ్రీతిలకుమహాశయుని "రహస్యము" ఆంధ్రరాజకీయవేత్తలను "కర్మయోగ"మునందు పురికొల్పజేసిన వావిళ్లవారికి ఏ ఆంధ్రుడు జోహారు లర్పింపడు !

ఇంతియగాక కారణాంతరములచే నాగరలిపి జనసామాన్యమునకు వ్యవహారికముగాలేని ఆకాలమందు సంస్కృతపుస్తకములను ఆంధ్రలిపిలో అచ్చొత్తించి భారతీయ వేదవేదాంతములందు చొరవజేసికొన నవకాశమిచ్చిన వావిళ్లవారికి ఆంధ్రులందరు కృతజ్ఞతచూపుటకు నేడు మంచితరుణమని వేరుజెప్పనేల? కృష్ణరాయలకాలమందు విద్యారణ్య ప్రభృతులు భారతీయవిజ్ఞానమును పునరుద్ధరించినటుల, బ్రిటిషుసామ్రాజ్యతత్వముచే భారత సారస్వతమునకు సాహిత్యమునకు త్రుప్పుపట్టి విస్మరించునప్పుడు ఉపనిషత్తులు, సంస్కృత భారతరామాయణాదిగ్రంథములను ఆంధ్రలిపిలో అచ్చొత్తించి కొన్నిటికి ప్రతిపదార్థము కూడ వ్రాయించి ఆంధ్రలోకమును భారతీయవిజ్ఞానమునకు పరిచితులచేసినది వావిళ్లవారని ఆంగ్లవిద్యాధికులగు ఆంధ్రులు మరువరని నానమ్మకము. శాకుంతలాదికావ్యముల రసస్వాదును అనుభవింపజేసి, రామాయణమహాభారతాదిపురాణములలో ఆధ్యాత్మిక తత్వముచే ఆంధ్రలోకమును పునీతముజేసినది వావిళ్లవారుగాక మరెవ్వరు. ఆంధ్రలిపిలో నుండబట్టియే గదా "రఘువంశము", "మేఘసందేశము" ప్రతిగృహమును అలంకరింపజేసినవి. ఇక భర్తృహరి, భజగోవిందస్తోత్రములు, వ్రతకల్పములు మొదలగుపుస్తకములను చిన్నచిన్నపాత్రములలో అచ్చొత్తించి సుందరకాండ మొదలగువాటిని కిత్తాను నారబైండుచేయించి పామరజనులచేతిలోనుంచినది వావిళ్లవారిపుణ్యమే.

ముఖ్యముగా నేటివిద్యావంతులకు అర్థశతాబ్దమునాటి అచ్చుసుబోధకముగాకుండిన కష్టములు తెలిసియుండవు. వావిళ్లవారి ముద్రణాలయమునకు పూర్వము అలసానివాని అల్లికబిగియును ముక్కుతిమ్మన ముద్దుపలుకు తెలిసికొనవలెనని ఏసాహిత్యప్రవీణులకో తప్ప ఇతరులకు అప్పటిపుస్తకములు చదువుటకే మనసొప్పకుండెడిది అని నేను దృఢముగా చెప్ప గలను. వసుచరిత్రకు టీకయుండినను ఆటీకలోని స్ఖాలిత్యములు, అపాత్తముల ఉనికి వాటి యందు ఈసడింపు కలుగజేసెడివి. నేడో వావిళ్లవారిముద్రణము రమ్యమై, అర్థసులభపు నకు సహకారియై, పుస్తకములసొంపు మనముల నింపుజేయుచు, గ్రంథములపైందు ఆకర్షింప జేసి, బీదజనులకుకూడ అందుబాటగుక్రయముగలవై, ఆంధ్రసారస్వతమునందలి అభిరుచిని రెట్టింపుజేసి,ఆంధ్రావనినంతయు వేరెన్నికగాంచిన వావిళ్ల వారిముద్రణాసౌష్ఠవమే కారణ మన్న అతిశయోక్తిగాదు.

రెండుమూడుదశాబ్దములనాడు వీరు చిన్నివయసుననుండి నేటిప్రఖ్యాతిరుచుల చవి చూడనికాలమందుగూడ వీరు పుస్తకభాండాగారోద్యమమునకు పాటుపడినవిషయము లోకవిదితము. ఏపల్లెలో లైబ్రరీస్థాపనజేసిన పుస్తకములను అర్ధఖరీదుకు నిచ్చుటకు ఏర్పాటు జేసి ఆయుద్యమమునకు దోహదమిచ్చిన వావిళ్ల వేంకటేశ్వరులుగారు మొదటివారు. నేటి వరకు ఇంకొకరులేరన్న వీరియశస్సు ఇనుమడించుననుటకు సందియములేదు.

త్రిలిఙ్గ, Federated India పత్రికలను నిర్వహించి ఆపత్రికలకు రజతోత్సవకాల మున వావిళ్లవారు యశఃకాములై ఆచంద్రార్కముగ వారిముద్రణాలయము ఆంధ్రా వనికి ఆంధ్రసారస్వతముద్వారా కీర్తిప్రతిష్ఠలు తెచ్చుగాక అని ఆశీర్వదించు రాయలసీమ ఆంధ్రుడు దేశపాండ్య సుబ్బారావు.

## 35

## శ్రీ చెన్నుభొట్ల భానుమూర్తిగారు, బి. ఏ., యల్. టి., యస్. డి.,

హెడ్మాష్టరు, బోర్డుహైస్కూలు, రేపల్లె.

"త్రిలిఙ్గ"కు 25 సంవత్సరములు నిండినవి. నూత్నయౌవనము దీరి ప్రౌఢమునకు దిగబోవుచున్నట్లు స్పష్టమగుచున్నది.

పత్రికానిర్వహణము అందులో తెలుగుపత్రికలను నడుపుట అనునది ప్రవాహ మున కెదురీతవంటిది. బాలారిష్టముల నెదుర్కొని అష్టకష్టములకు లోనై వ్యయప్రయా సలకు గురియై గతయిరువైఅయిదుసంవత్సరములు నిర్విఘ్నముగా మన "త్రిలిఙ్గ" నడిపించు

కొనగలదన్న అందుల కాంధ్రులందఱును మీకు కృతజ్ఞులు మొదటినుండియు నైతిక సాంఘికమతవిషయములందు జోక్యముకల్గించుకొని ఉన్న తాదర్శములనుద్దీపింపజేయుచు ఆంధ్రసోదరులను నూతనపక్కిగ నిష్టాగరిష్ఠులుగ జేయగలదీపత్త్రికయే గదా! మీరు, మీతండ్రిగారు ఆరంభించినకార్యమును విడువకకొనసాగించుచుండుట ముదావహము.

"త్రిలిఙ్గ" రజతోత్సవము జరిపించుకొని, పూర్వమువలెనే చక్కని సువిచారితాభిప్రాయముల ప్రచార మొనర్చి ప్రయోజనమునునిరూపించుకొనినట్లే, సువర్ణోత్సవకుతూహలిరై యుండగలందులకున్నూ, తదవకాశము ఆంధ్రులు గర్వముతో జరిగించెదరని విశ్వసిస్తూ భగవత్ప్రార్థనజేయుచున్నాను. నమస్తే.

## 36

### శ్రీ చిట్టా సుందరరామయ్యగారు, బి. ఏ., బి. ఎల్., మచిలీపట్నము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తమతండ్రిగారు తెలుగుభాషామతల్లికి గావింప మొదలిడినసేవను ద్విగుణముగా సాగించుటయేగాక, పత్త్రికారచనమునకు దమ 'త్రిలిఙ్గ', 'సంయుక్తభారత' Federated India ల మూలమున ఎంతయో ప్రోత్సాహ మొనర్చినారు. సామాన్యపత్త్రికలవలె ఏదో నొకరాజకీయశాఖకుచెందిన యభిప్రాయములను వెల్లడిపరచుటతో తృప్తినొందక, స్వతంత్రమయినట్టియు వివిధాభిప్రాయభేదమును సమన్వయము చేయునట్టియు సూచనలతో శ్రీశాస్త్రులవారిపత్త్రికలు నిండియుండును. మొదటిలో వారితండ్రిగారును పిమ్మటవారును ఎనుబదిసంవత్సరములనుండి తెలుగుసాహిత్యమునకుగావించినసేవ వర్ణనాతీతము. శ్రీశాస్త్రులుగారికి ఆంధ్రోద్యమముయెడగల గాఢాభిమానము వారు ఆంధ్రమహాసభస్థాయిసంఘకార్యదర్శిగాచేసినశ్రమవలననే విదితము. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారిని త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున అభినందించుటకు నాకెంతో యానందముగా నున్నది.

## 37

### శ్రీ న్యాయభూషణ పేరి లక్ష్మీనారాయణశాస్త్రిగారు, విజయనగరము.

శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల్లుగారి త్రిలిఙ్గపత్త్రికకు 25 వత్సరములు గడచినవి. రజతోత్సవమునుగోరుచున్నది గాన మీరు ఒకవ్యాసమును వ్రాసి పంపించినచో ఉగాదిసంచికలో అచ్చువేయడమగునని దయతో నాపేర వ్రాయగా జేయబోవు ఉత్సవములో త్రిలిఙ్గపత్త్రికకు సాంఖ్యదర్శనసారమనేవ్యాసము వ్రాసి దాఖలుజేసు

కున్నాను. వీరిప్రెస్సు ఆంధ్రలోకమునకు ఆంధ్రాక్షరములలో కీ॥ శే॥ వీరితండ్రిగారైన వావిళ్ల రామస్వామిశాస్త్రుల్లుగారిచే స్థాపింపబడినది. తెలుగుపురాణములు, సంస్కృతములో కావ్యములు, నాటకములు, భారత-భాగవత-రామాయణాలు చాలాఅచ్చువేసి ఆంధ్ర లోకమునకు చాలా విజ్ఞానమును ఇచ్చి యెంతయోఉపకరించిరి. వారు స్వర్గస్థులైనపిదప "సర్వత్ర జయమన్విచ్ఛే త్పుత్రాదిచ్ఛేత్పరాజయం" అనుఆర్యోక్తిననుసరించి శ్రీవేంకటేశ్వరశాస్త్రుల్లుగారు సంస్కృతముద్రణాలయము కూడా ఉంచి దేవనాగరలిపిలో సంస్కృత గ్రంథములు, శాస్త్రగ్రంథములు గూడా అచ్చువేయుచు ఆంధ్రదేశమందేగాక దేశాంతర మందుండుపండితులకువిజ్ఞానము విదచిమ్ముతూ రాచకీయవిషయములతో గలసిన త్రిలిఙ్గ పత్రికను స్థాపనచేసి యెంతయో ఉపయోగిస్తూయున్నారన్నది అతిశయోక్తిగాదు. ఉదయనాచార్యకృతమైన న్యాయకుసుమాంజలికి నేనువ్రాసిన ఆంధ్రతాత్పర్యటీకను స్వయముగా నావల్లయేమియును ద్రవ్యమునపేక్షింపక అచ్చువేయుటయే వారిఔదార్యమును సూచిస్తూనున్నది. ఇటులనే శాస్త్రగ్రంథముకూడా అచ్చువేయుచూ చిరకాలము వీరిప్రెస్సును, త్రిలిఙ్గపత్రికయు ఆచంద్రార్కస్థాయిగా నడిపింపగలందులకు భగవంతుని ప్రార్థిస్తూ ఇంతతో విరమించుచున్నాను.

## 38

### శ్రీ చిలుకూరి మాడభూషి వేంకటరాఘవాచార్యులుగారు, గద్వాలసంస్థానము.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారి కుమారులైన శ్రీవేంకటేశ్వరశాస్త్రులువారు త్రిలిఙ్గరజతోత్సవమును జరుపుచున్నారనేవిషయము తెలిసినది. ఈపత్రిక ఆర్థికరాజకీయ సమస్యలయందును మతసాంఘికవిషయములయందును భాషాప్రపంచమునకు చాల ఉపయుక్తముగ నున్నది. వీరు ఈత్రిలిఙ్గపత్రికకొరకును సంస్కృతాంధ్రద్రావిడాదిగ్రంథముద్రణముకొరకున్ను చాల శ్రమపడియున్నారు. ఈత్రిలిఙ్గపత్రిక ఇంకా విశేషముగ అభివృద్ధియై విశేషోన్నతిని పొందవలయునని ఈపత్రికకు సువర్ణరత్నోత్సవాదులున్ను జరుగవలయుననియు మాకులదైవమైన శ్రీకేశవస్వామిని ప్రార్థించుచున్నాము ఇట్లే అన్ని కార్యములను వేంకటేశ్వరశాస్త్రులవారు విడవకకొనసాగించుచుండగలరని నమ్ముచున్నాను. శ్రీవిద్వద్గద్వాలసంస్థానరాణీగారి ఆజ్ఞానుసారముగ ఈసందేశమును పంపుచున్నాను.

## 39

### శ్రీ సురభి తులసీదాసుగారు, సబ్‌జడ్జి, ఏలూరు.

బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు నాకుముప్పదిసంవత్సరములు పైకాలము నుండి పరిచితులు. వారిజనకులు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు సంస్కృ

కాంధ్రభాషలయందు అసామాన్యపాండితీగరిమగలవారై సంస్కృతాంధ్రవాఙ్మయాభివృద్ధికి కృషిసల్పి మనుచరిత్రాదికావ్యములకు వ్యాఖ్యానములు లిఖించి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ పేరిట గ్రంథప్రచురణములుచేసి దిగంతవిశ్రాంతి కీర్తి నొందిరి. శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారును వారిజనకులమార్గముననే నడచి సంస్కృతాంధ్రగ్రంథరాజములను పండితవరేణ్యులచే సంస్కరింపఁజేసి చక్కనిఅచ్చుతోముద్రింపించి ప్రచురించుచు వచ్చినారు. శ్రీశాస్త్రిగారు వ్యాపారమే పరమావధిగా పెట్టుకొనియుండినయెడల యేవాచకములనో యేవిద్యాశాలల కుపయోగమగు యేపఠనీయగ్రంథములనో ప్రచురించి తమ పలుకుబడిని వినియోగించి ద్రవ్యార్జనఁజేసియుందురు. వారు భాషాసేవయే పరమావధిగ నిడుకొని సంస్కృతాంధ్రములలో సద్గ్రంథములను ప్రచురించి వేలకువేలు రూపాయిలు గ్రంథరూపమున మార్చియున్నారు. వారు అధికధనము వ్యయముచేసి ఆసేతుహిమాచల పర్యంతము వాసిఁగన్న సంస్కృతమహాభారతమును బ్రకటించి తమభాషాసేవదీక్షను నలుదిశలవ్యాపింపఁజేసిరి. ఆంధ్రమున శ్రీతులసీదాసురామాయణమును లోకమాన్యతిలక్ మహాశయుని శ్రీగీతారహస్యమునుఁ బ్రచురించి ఆంధ్రలోకమన్ననలకు పాత్రులైరి.

శ్రీశాస్త్రిగారికి నెట్టివిఘాతములుఁ గలిగినను తమభాషాసేవను మాత్రము విడనాడ లేదు. శృంగారప్రబంధములలోఁ గొన్నిటియందు అసభ్య అశ్లీలవర్ణనము లుండినందున వానిని ప్రభుత్వమువారు నిషేధించినను ధైర్యసాహసములను విడనాడక భాషాసేవయందు యేవిధమైనకొఱత లేకుండగను సారస్వతాభిమానుల కుపయుక్తముగ నుండునట్లు ప్రత్యేక కూర్పులను యేర్పాటుఁగావించి కార్యశూరులైరి.

శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి భాషాసేవ అనన్యసామాన్యము. వారు ప్రచురించినగ్రంథరాజములు జాతీయజీవనమునకు సకలవిధముల సాహాయ్యపడును. మత, నైతిక, సాంఘిక, రాజకీయార్థికపారస్వతగ్రంథములను పుంఖానుపుంఖములుగఁ బ్రచురించి జాతీయజీవనము సర్వతోముఖాభివృద్ధిఁగాంచుట కవకాశముఁ గలుగఁజేసి ఆంధ్రాభ్యుదయమునుఁ బెంపొందింపఁజేసిన మహనీయులలో శ్రీశాస్త్రిగారు అగ్రస్థానము నాక్రమింపఁగలరు.

శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు త్రిలిఙ్గవారపత్రికను 25 సంవత్సరములక్రిందట స్థాపించి నిర్విఘ్నముగను జయప్రదముగను నడిపి విజ్ఞానప్రచారముఁగావించి ధన్యులైరి. ఎన్నియో కష్టనిష్ఠురములకోర్చి తమపత్రికారాజమును 25 సంవత్సరములు నిరంతరాయముగాను బహుసమర్థతతోను నిర్భయముగాను భానిసమానసికప్రకృతి Slave mentality కి లోనుగాక న్యాయైకబుద్ధితో నిర్వహించి పత్రికానిర్వహణమునందు ఆదర్శప్రాయులైన శ్రీ

శాస్త్రిగారికి ధన్యవాదములు. త్రిలిఙ్గపత్రిక రజతోత్సవసందర్భమున శ్రీశాస్త్రిగారిని అఖిలాంధ్రప్రపంచము గౌరవముఁజేయుట యెంతయును సమంజసము.

శ్రీశాస్త్రిగారు ఉదారఆశయములుగలవారని వారిపత్రికలే చాటుచున్నవి. "ఫెడరేటెడ్ ఇండియా" అను ఆంగ్లపత్రికను అతినిపుణతతో నడిపి భావిభారతరాజ్యాంగసమస్యలను విశాలదృష్టితో విమర్శించి తమదూరదృష్టిని సక్రమదృక్పథమును వ్యక్తపఱచుచున్నారు.

శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు నిరాడంబరజీవనులు. దయార్ద్రహృదయులు. పాత్రమెఱిఁగి దానముచేయువారు. వారి నాశ్రయించి అనేకబీదకుటుంబములు జీవితయాత్రను జఱుపుచున్నవి. బీదవిద్యార్థులెందరికో ధనసాహాయ్యముఁజేసి విద్యాదాన మొసఁగుచున్నారని వినుచున్నాను. పండితులు కవులు గ్రంథకర్తలు శ్రీశాస్త్రిగారివలన ఉపకారముఁ బొందనివారు అత్యల్పసంఖ్యాకులు. వారిజీవితము "పరోపకారార్థమిదం శరీరం" అను మహావాక్యమునకు ప్రబలనిదర్శనము.

శ్రీవావిళ్లవారు ఆంధ్రసారస్వతాభివృద్ధికి గావించినసేవ అపారము. ఎన్నటికిని మఱువదగినదికాదు. శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు ఆంధ్రభాషామతల్లికి తులసీదాసురామాయణమును, గీతారహస్యమును గానుకగాసమర్పించి తమనామము చిరస్మరణీయముచేసినట్లు ద్రవిడభాషయందు దివ్యకీర్తిఁబడసిన "కురళ్" మొదలగు ఉద్గ్రంథములును ఆంధ్రమున అనువదించి ప్రకటించి ఆంధ్రభాషామతల్లికి కానుకలుగా నొసంగి ఆంధ్రులకృతజ్ఞతకుఁ బాత్రులగుదురుగాక అని మనవిచేయుచున్నాను. ఆంధ్రభాష జీవించియుండువఱకు శ్రీవావిళ్లవారియశశ్చంద్రికలు దిగంతవిశ్రాంతములు వ్యాపించుననుటకు సందియములేదు.

శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి అపారసేవను ఇప్పుడిప్పుడైనను ఆంధ్రదేశము గుర్తించుట శుభసూచకము. శ్రీశాస్త్రిగారు "భాషోద్ధారక" అన్న బిరుదముచే అక్కడక్కడ సన్మానింపఁబడుచున్నారు ఈబిరుదము సమంజసముగానున్నను శ్రీశాస్త్రిగారి జీవితములో ఒకప్రధానపక్షమును మాత్రమె సూచించుచున్నది. వారిసమగ్రజీవితలక్ష్యమును వెల్లడిఁ జేయుబిరుదము ఆంధ్రమహామహులు ఒసంగి అఖిలాంధ్రావనికృతజ్ఞతనుఁ బ్రకటింతురుగాక! శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు శ్రీపరమేశ్వరానుగ్రహమువలన ఆయురారోగ్యైశ్వర్యసంపదలతో తులతూగి తమసేవనుద్విగుణీకృతముచేసి ధన్యులగుదురుగాక!

## 40

## శ్రీమాన్ శ్రీమత్తిరుమల శ్రీగుదిమెళ్ల వరదాచార్యులుగారు, ఎం. ఏ.,

శ్రీనారసింహకళాశాలాధ్యక్షులు, చిట్టిగూడూరు, బందరు.

తాముపక్రమించిన 'త్రిలిఙ్గ' యనువారపత్త్రికకు రజతోత్సవావసరము ప్రాప్తించిన దని తమకును దమపత్త్రికకును నాయభివందనములు.

ధనార్జనమున కుపకరింపక తద్వ్యయమునకు మాత్రమే యుపయోగించు లోకోప కారకములగు కార్యములందుఁ బ్రథమప్రవృత్తియే కష్టము. అందును నిరువదియైదుసంవ త్సరములు తదేకదీక్షగా నట్టికార్యములను గొనసాగించుట కష్టతరము.

తమ లోకోపచికీర్షను దృఢవ్రతత్వమును వ్యక్తీకరించుట కియ్యదియే చాలును. కాని, యింతకంటెను నాంధ్రలోకపుశాశ్వతకృతజ్ఞతకు మిమ్ములను బాత్రముగాఁ జేసినది మఱియొక్కటి గలదు. స్మరణీయకీర్తులగు తమతాతచరణులచే నుపక్రమింపఁబడిన ఆంధ్ర గ్రంథముద్రణము తమచే సహస్రగుణములఁ బెంపొందింపఁబడినది. ఆంధ్రగ్రంథములనే గాక సంస్కృతగ్రంథములను గూడఁ దాము ముద్రించుచుండుటచే నాంధ్రేతరులకు సయి తము తామభినందనీయులు. సంస్కృతమునందలి శాస్త్రీయగ్రంథములకు మహాపండితులచే ననువాదములువ్రాయించి ధనవ్యయమునుగణింపక వాని నచ్చొత్తించుట తమవిద్యా పక్షపాతమునకుఁ బ్రబలసాక్షియై యున్నది. గ్రంథమాలలపేరిటఁ గతిపయగ్రంథములను మాత్రమే ముద్రించి వెలువరించిన తిరువాన్కూరు, మైసూరు, బరోడా మున్నగుసంస్థాన ములు స్తుతిపాత్రములగుచుండఁ బరస్సహస్రములగుగ్రంథములను బ్రకటించిన తామెంతటి సమ్మానమున కర్హులో ప్రాజ్ఞలోకము నిర్ణయింపవలయును. తమ ముద్రణాలయము లేకుండినయెడ ఆంధ్రగ్రంథప్రకాశన మెట్టిస్థితియందు నుండెడిదోగదా!

ఇట్టి మహోపకారులగు తమకు భగవానుఁ డితోఽధికముగ సత్కార్యనిర్వహణ మునకై ఆయురారోగ్యాదు లొసంగుఁగాత!

## 41

## శ్రీ గొట్టిముక్కల రామశాస్త్రిగారు, కవులకుంట్ల.

మన ఈత్రైలింగ్యదేశంబున పండితరాజకవిసార్వభౌములగు శ్రీకృష్ణదేవరాయల వారు ఇతరులగు తెలుఁగురాజులును దివంగతులైననాటనుండియు తెలుఁగుతల్లియు తదా శ్రయులగు కవిపండితులును కడుంగడు కష్టములపాలగుట లోకవిదితమే గదా! అందులకు

కారణంబులు అన్యపరిపాలనాఽవాంతరంబు లంకురించుటయు, అన్యభాషాప్రచారంబును, ఆధునికసంస్కారంబులును, ఆర్యమతాఽశ్రమాఽచారవిదారణంబును, అపౌరుషేయములగు వేదములను ఆర్షేయములగు పురాణములను ఆక్షేపించుకాలమాసన్నమగుటయు, కవి పండిత గ్రంథమండలినాదరించు ప్రభుసమ్మాన్యు లంత మొందుటయు నయ్యె. అట్లు అంత మొందుటచే గ్రాంథికకృషియు తత్సమంబయ్యె. అందుచే కవిపండితమహామహులే అహర హంబును గ్రాసాఽవాసములకై ప్రాకులాడ మొదలిడిరి. అప్పు డితరులు వారిని ఏమియని అడుగ ఆవిద్వద్వరేణ్యులు తమ ఆత్మశాంతికై 'విద్వత్సు దారిద్ర్యతా' యనుసూక్తిని సూచింప తెలుసుకొని ఆప్రచారంబె అనాఽనుకూలంబనియు ఆరితేరిన పండితేంద్రు లబుక్కున్నదేమనియు ఆవిద్యాప్రపంచంబు నీసడించి తుదకు ఆర్యమతాఽవలంబనమే అసహ్యమని అన్యసేవాఽకరంబగునట్టియు ఆధునిక వ్యవహారిక రాజకీయవృత్తులకాకరంబగు ఆంగ్లప్రపంచంబునఁ దిగి అమాయికులై అధోగతిపాలైరి. రానురాను అనాదిసిద్ధంబులగు వృత్తులయం దాసక్తియు ఆధునికంబులయందే వృత్తియుఁ గల్గి అటు ఇటు అడ్డగోడమీఁద దీపశిఖయుఁబోలి కొటకలాడుచు తమ హయాము గడుపువారు కొందఱు. ఆర్యమతమే ప్రసిద్ధమని అవలంబించి ఆర్థికరహితులై ఆకలికి మలమలమాడుచు ఆదరించువారు లేనికార ణముచే అనాదిగా నుండెడు గృహాఽరామక్షేత్రములను అక్కరపడినపుడెల్లను, అరఁగాసున కొక్కటి దిగవిడుచువారు కొందఱును, ఒకరీతి నవలంబించి మరియొకవృత్తిపై వ్రాలి తుదకు రెంటికిఁజెడిన రేవనిచందమగువారు కొందరు, మరికొందరు "స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః" అనుధర్మమును స్మరించి ఏమియుఁ దోపక ఎటులనో కాలముఁ గడుపుచు గ్రంథాఽవలోకనమే శరణ్యమని తలంచి తగుగ్రంథంబులకొఱకై ప్రాకిసలాడ అయ్యవి దొరకకుండు. దొఱకినచో పూర్వము తాళపత్రంబులగుటచే ముఖ్యఘట్టంబుల శిథిలంబులై యుండు ముద్రణాలయంబులుసహా అరుదు. ఒకవేళ ఉండెపో వలసినగ్రంథంబు లుండెడివి గావు. ఉండినచో అవిఘ్నమస్తు అనుచోట లపిస్స్నతుస్సు అనియుండు ఏపత్రమునందైనను ప్రత్యక్షరగండమే. అయినను శ్రమపడి ఆగ్రంథములనే సంపాదించి పరికించి భాషాదైన్యముచే తప్పొప్పులెఱుంగలేక తప్పులనే చదువుచు అవకతవక అర్థంబులఁ నంటగట్టి అపభ్రంశంబునుఁబట్టి అన్నియు అప్రామాణ్యంబులని వాదించు అచలవేదాంతు లయం దగ్రపీఠి నలంకరించి "అనిత్యానిచ భూతాని-అందరసొమ్ము మాకే కానిమ్మ"ను ముఖ్య మంత్రం బుపదేశించు సంఘముగల ఈకాలమున శ్రీచన్ననగరవాస్తవ్యులగు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిని శ్రీరామచంద్రమూర్తి ప్రబోధించి ఈకాలపరిణామ

విూవిధమనియు కవిపండితగ్రంథాఽదరణంబు ముఖ్యమనియు సద్గ్రంథోద్ధరణంబు ఇహపరంబులకు మూలకారణంబనియు అందుచే బ్రహ్మపదము బొందగలవనియు దెల్పెనా? అన్నట్లు శ్రీశాస్త్రులవారు సుమారు ౨౫ సంవత్సరముల క్రిందట తమపట్టణంబున ఆదిసరస్వతీముద్రణాలయమను నొక ప్రచురణసంస్థను నియమించి అందు తగు పండితసహాయంబుచే భారతభాగవతరామాయణ ధర్మశాస్త్రపురాణేతిహాసంబుల గీర్వాణాంధ్రద్రావిడభాషలయందు ముద్రింపించి భాషాసేవ యొనర్చిరి. ఇట్లు ప్రాచీనగ్రంథములేగాక ఈమండలవాస్తవ్యులును శ్రీబ్రహ్మాండ బ్రహ్మకౌమారికాఖండ అభినవాంధ్రవాల్మీకిరామాయణాద్యనేక పురాణగ్రంథకర్తలును, కళాప్రపూర్ణేత్యాద్యనేకబిరుద విభ్రాజితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారియొక్కయు, శ్రీసమాసాఽలంకారః ఛందోదర్పణాది లాక్షణికగ్రంథకర్తలును, విద్వాన్ కావ్యపురాణతీర్థ బిరుదాంచితులును కడప మున్సిపల్ హైస్కూలు ప్రధానాంధ్రపండితులగు బ్రహ్మశ్రీ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారియొక్కయు, ఈసీమలోని (బద్దెప్రోలు) బద్వేలుతాలూకా కవులకుంట్ల పురవాస్తవ్యులగు నట్టియు హనుమత్సందేశగ్రంథకర్తలునగు, శ్రీ కామరాజు సీతారామకవిగారియొక్కయు, ఇతరమండలంబులయందలి ప్రాచీననవీనకవులయొక్కయు గ్రంథంబుల సక్రమంబుగ సలక్షణంబుగ శ్రీశాస్త్రులవారు వారికుమారులగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు సలక్షణంబుగ ముద్రింపఁజేసి ఆంధ్రలోకరబున కెంతయోమహోపకారంబుఁ జేసిరి. కొంతకాలముక్రిందట శ్రీరామస్వామిశాస్త్రులవారు దివంగతులైరి. వారు సర్వదా శాశ్వత బ్రహ్మానంద మనుభవించుచుందురుగాక అని శ్రీపరమేశ్వరుని ప్రార్థించుచున్నాము. శ్రీరామస్వామిశాస్త్రులవారికుమారులగు శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు వారితండ్రిగారిచే ప్రారంభింపబడి జరుపుచున్న ఉద్యమమును శ్రీపరమేశ్వరానుగ్రహంబున నిర్విఘ్నంబుగ జరుపుచు భారతప్రజాసమ్మతమగునట్టియు ఆర్థిక రాజకీయ మత సాంఘిక వైజ్ఞానికచర్చలచే అలరారు 'త్రిలిజ్గ' అను వారపత్రికాసంపాదకులై ౨౫ సంవత్సరములుగా జరుపుచు, లోకానుభవజ్ఞానము చదువరులకలవరుచుచు 'ఫెడరేటెడ్ ఇండియా' అను ఆంగ్లపత్రికా సంపాదకులై ఆంగ్లేయఆంగ్లభాషాభిమానులెల్లరను సంతసింపఁజేయుచున్నారు. త్రిలిజ్గయను వారపత్రిక ప్రాయముగలదగుటచే రజతోత్సవమాకాంక్షించుచున్నది. అనతికాలంబుననే ఆరజతోత్సవ పట్టభద్రతనొంది నియమితకాలంబున సువర్ణోత్సవంబును జరుపుకొనుగాక అని శ్రీపరమేశ్వరుని వేడికొనుచున్నాము. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పైగ్రంథంబులే గాక శ్రీ బాలగంగాధరతిలకుగారి గీతారహస్యాంధ్రీకరణంబును శ్రీతులసీదాసు రామాయ

ణంబును దక్షిణదేశప్రచారగీర్వాణమహాభారతంబును ౧౮ సంపుటములుగా నాగరిలిపి యందు ముద్రింపించఁజేసిరి. పిదప వారికుమారులగు బ్రహ్మశ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు తండ్రిగారియుద్యమమును జరుపుచు భాషోద్ధరణబద్ధకంకణులై గద్య-పద్యకావ్యప్రబంధ నాటక నవలశతకంబులన్నితము రేఫ అనుస్వారంబులఁ బోనిదక బాగుగా విజ్ఞానులనుండి అజ్ఞానులవరకును పఠింప యోగ్యముగునట్లు ముద్రింపించి తగుమూల్యంబునకే చదువరుల కందఁజేయుటయేగాక భాషాస్వరూపం బిట్టిదయని లోకంబునకుఁ దెలియునట్లుఁజేయుటయు దేశంబున పండితపుత్రులవద్ద వారితాతతండ్రులచే మిక్కిలి శ్రమించి వ్రాయబడినగ్రంథ ములు పెద్దలు నశించి వీరికి యాలోకముగాని తగుసహాయముగాని లేక మూరుమూల లంబడి యుండ ఆప్రాచీనతాళపత్రగ్రంథంబులకై తగువ్యయప్రయాసలఁబడి సేకరించి పండితసహాయంబుచే నుద్ధరించి ముద్రింపించుటయు కవిపండితలోకం బానందింపుచుండ మన భాషామతల్లిని ఆనందవారిధి నోలలాడించుటయు మొదలగు ఘనకార్యములఁ జేయుటచే ఈ ఆర్యావర్తంబున పండితప్రకాండులచే "భాషోద్ధారక" యను బిరుదంబు శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారందగలిగిరి. ఇట్లు భాషాభిమానులగునట్టియు ఉదారస్వభావు లగునట్టియు వైదిక-లౌకిక-సాంప్రదాయ-వేత్తయగునట్టియు శ్రీభాషోద్ధారకబిరుదాంచితులై నట్టియు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని వారికుటుంబమునకు సభాధ్యక్షులకును కార్యనిర్వాహకులకును ఇతోఽధిక ఐశ్వర్యవిజ్ఞానంబుల నొసంగి రక్షించుగాత అని శ్రీపరమేశ్వరుని ప్రార్థించుచున్నారము.

## 42

### శ్రీ పి. యస్. శర్మగారు, అడ్వొకేట్, హైకోర్టు, మదరాసు.

ఎడిటర్ ఇన్ ఛీఫ్, మెడ్రాస్ బర్తుకంట్రోలు బులిటెన్.

మహాశయా! తమయొక్క "త్రిలిఙ్గ"రజతోత్సవసందర్భమున, తమకు, అమందానంద కందళితహృదయారవిందముతో నాయొక్క అభినందనములను తెలియజేయుచున్నాను. "త్రిలిఙ్గ" గడచిన 25 సంవత్సరములనుండి ఆంధ్రదేశమునకు చేసిన సేవ అపారము. ఆం ధ్రులకు తమయొక్క "త్రిలిఙ్గ","ఫెడరేటెడ్ ఇండియా" అత్యద్భుతసేవ జేయుటయే కాక, నూతనాశయములను నూతనోత్సాహము నొసంగినవి. అట్టిపరిస్థితులయందు "త్రిలిఙ్గ" రజతోత్సవ మెంతయు సమంజసమైయున్నది. తమతండ్రిగారైన కీ॥ శే॥ శ్రీవావిళ్ల రామ స్వామిశాస్త్రులుగారు, ౮౫ సం॥ క్రిందట ప్రచురణసంస్థ నొకదానిని నెలకొల్పి, సంస్కృతాంధ్ర ద్రావిడఆంగ్లగ్రంథము లెన్నియో అచ్చువేసి, ఆంధ్రవాఙ్మయముకు తీరని కొరతను దీర్చిరి.

మీరు వారియొక్క కృషిని పూర్ణముగా ననుసరించి, వారిఉద్దేశములను సఫలీకృతముగ నొనర్చుటకు, తమరుచేయుచున్న సేవను ఆంధ్రులెల్లరు గుర్తించుటయే కాక తమకు ఆంధ్రులమైన మేమెల్లరము మాయొక్క అభినందనములను తెలియజేయుట మావిధియై యున్నది.

తమరు నాయొక్క అభినందనములను గ్రహింపవలెననియు త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాలకు భగవంతుడు దీర్ఘాయువునొసంగవలెననియు ఆచంద్రతారార్కము తమ తండ్రిగారియొక్కయు తమయొక్కయుసేవ చిరస్థాయిగానుండవలెననియు తమకు భగవంతుడు సంపూర్ణాయురారోగ్యైశ్వర్యములననుగ్రహింపవలెననియు తమకిందుమూలముగ సందేశమునంపుచున్నాను.

## 43

## కవిమండలమండన శ్రీ మంగళగిరి కృష్ణద్వైపాయనాచార్యులుగారు,

సంస్కృతోపాధ్యాయులు, మునిసిపల్ హైస్కూలు, విజయనగరము.

శ్రీకరంబగు నఖిలకేశుండును రామకృష్ణాద్యనంతావతారధారియగు శ్రీమన్నారాయణుని కారుణ్యప్రేమలకుఁ బాత్రమగు నీభరతఖండ మనాదిగా విద్యాధిక్యతచే మిన్నయని వన్నెకెక్కినది. అఖిలావతారములు నీఖండమందగుట యొకటియు తత్తత్క్షేత్రతీర్థస్వరూపాధ్యక్షతలతో భగవంతునివ్యక్తులెటుఁజూచినను గానవచ్చుట యొకటియు వేదవిహితకర్మాచరణచణులగు ననేకఋషులును తమతమబుద్ధ్యనుసారముగా నాస్తికమతనిరాసద్వారమున నాస్తికత్వస్థాపనాధికశక్తులగు మహనీయుల నీఖండముననే బుట్టింపఁజేయుట యొక్కటియు, నీఖండమునందు భగవంతుండగు నారాయణునికిఁగలయనుగ్రహమునకుఁ దార్కాణము. అనాదిగానట్టి సద్విద్యలకునికిపట్టగు నీభరతఖండము కాలాతిశయముచేతనో భగవదిచ్ఛచేతనో "రాజా కాలస్య కారణ" మ్మనువాక్యముఁబట్టి రాజగుణలోపముచేతనో నానాటి కన్యవిద్యాలోలత్వము కుక్షింభరిత్వముతోపాటు పెరుగుటచే పూర్వాచారవ్యవహారనిరాసములు పూర్వగ్రంథధిక్కారములు అపూర్వపూర్వహేళనలు ప్రబలి గ్రంథరాజములడుగంటుకాలము తటస్థింపఁగా శ్రీ శ్రీ శ్రీ శృంగేరిపీఠాధికారాస్థానగౌరవకార్యనిర్వాహణధుర్యులగు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులువారు సద్గ్రంథోద్ధరణదీక్షాపరాయణులై క్షీణమగుచున్నగ్రంథముల తమ "ఆదిసరస్వతీనిలయ"మను సార్థకనామధేయముగల ముద్రాక్షరశాలలో ముద్రింపించుచు నింతలో నియమితకాలధర్మమునొందిరి.

అట్టి పితృవియోగసమయమునకు శ్రీ శ్రీ శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిపుత్రులును సజ్జనసారవిదులును పండితభక్తులును భగవదనురక్తులును విద్యాంగనాసక్తులును,

## త్రిలిఙ్గరజతోత్సవము

లౌకిక రాజకీయాద్యనేకసత్ప్రసక్తులును అనేకవిద్యాధురీణులును దీనావనబద్ధకంకణులును దాతలును సజ్జనమనోరథసంఘాతలును నేతలును సద్గురువినీతులును మరియు ననేకసద్గుణ వ్రాతలు నగు శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు బాలురైనను దిలీపాదులచే దీరనిగంగానయన క్రియాధురీణత్వమునఁ బ్రసిద్ధికెక్కిన బాలభగీరథునిమాడ్కి స్వతాతపాదులచేఁ బూర్తి కాని గ్రంథోద్ధారక్రియాదక్షులగుటయేకాక, లోకవంద్యులగుటట్లుండగా ఖండాంతర రాజకీయగౌరవచిహ్నలను వీరిసారస్వతసేవవలనఁ గాంచగలిగిరి.

సుమా రిప్పుడు వీరిక్రింద నూఱ్గురు వేతనములఁ బడయుచున్న యుద్యోగులుండి యుండిరి వీరాంగ్లద్రావిడాంధ్రహిందీసంస్కృతభాషాపంచకమున ప్రవీణులు. వీరికుశాగ్ర బుద్ధి వర్ణనాతీతము.

వీరు పండితసహవాససై పుణ్యమున జదువకయే గొన్నిఁటిని శ్రవణమాత్రముననే గొన్నిఁటిని నిరీక్షణమాత్రమునఁ గొన్నిఁటిని నించుమించుగా చౌషష్ఠివిద్యలను సంపా దింపఁగలిగిరనుట యుత్కర్షోక్తి కాదు. "ప్రవేదిరేప్రాక్తనజన్మవిద్యా" అనునానుడి మహ నీయు లెఱుఁగనిదికాదు. ఇప్పటి కెనుబదియైదువత్సరముల క్రింద శ్రీరామస్వామిశాస్త్రుల వారిప్రచురణసంస్థలో కావ్యనాటకాలంకారాదిగ్రంథములఁ బ్రచురించిరి. ఆంధ్రద్రావి డాదిగ్రంథములను బ్రచురించిరి.

వారిమనోరథములలోనిదేయగు శ్రీమన్మహాభారతమును నిన్నగాక మొన్నను దేవ నాగరిలిపిలో 18 పర్వములను బ్రచురించిరి. శ్రీరామస్వామిశాస్త్రులవారు నెలకొల్పినముద్రా లయముకంటె సంస్కృతాదివర్ణములతో గూడ నచ్చొత్తింపగల్గి యన్నిముద్రాశాలలలో నెన్నదగిన వన్నెగలదానిగ జేసి మిన్నయనిపించిరి. మరియు తులసీదాసురామాయణమును, లోకమాన్యబాలగంగాధరతిలకుగారిచే సంకలితమగు భగవద్గీతారహస్యమును, అరవమున తొలుకాప్యము మరి యెన్నియో గ్రంథరాజములను లోకహస్తగతము చేయుతలంపుతోనే యచ్చొత్తించిరి. అచ్చొత్తించుచున్నారు. అచ్చొత్తింపఁగలరు. వీరిసదుద్యమములు నెన వేరఁ గలవు వీరు ఓరియంటల్ లైబ్రరీలోని పుస్తకముల వ్రాయుటకును తప్పులదిద్దుటకు పండితు లకును అచ్చుఁగూర్చుటకు సేవకులకును వేతనములను వెదఁజల్లుచున్నారు. వ్యయప్రయా సములకు వీరులెక్కింపక లోకోపకారులగుచున్నారు. ఆంగ్లాదివిద్యార్థులకును పేదలకును వారమునకు మాసమునకును వీరు సుమారు మున్నూఱురూపాయ లిచ్చుచుండిరి. ఇతరవేత నాదులవగ్గై రాల కొక్కసంచి (1000) రూపాయలకు తక్కువకాని ఖర్చుసేయుటట్లుండగా అతిథులకు కొందరికి పంక్తిలో సత్కారగౌరవపూర్వకముగా భోజనము నిచ్చుచున్నారు. ఇదియది అననేల, శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారిసహాయములేని సత్కార్యము లేదు.

సత్కార్యమునకు ముందంజవేయువారిలో మొదటివారు శ్రీవేంకటేశ్వరశాస్త్రిలవారు. ఈమాట నొక్కి వక్కాణింపఁగలను. వీనితో నింక దనివి దీరక, ఆర్థికరాజకీయసమస్య లందును మతనైతికసాంఘికవిషయములందును పేరుఁగొన్న "త్రిలిఙ్గ" యను వారపత్రికను ఆంధ్రాళికిని, "ఫెడరేటెడ్ ఇండియా" అను నాంగ్లపత్రికను తద్భాషావిదుల కిష్టముగా బ్రచురించుచున్నారు. వీరిజీవితములోని దినపరిమాణములోని యిరువదినాలుగుగంటలలో నిరువదిగంటలు విద్యావినోదములలో కాలము గడుపుచున్నారనుటలో నతిశయోక్తిలేదు. మరియు వీరు గ్రంథనిర్మాణాసక్తులై కవిత్వమును గూడ నేర్చిరి. శ్రీరామస్వామిశాస్త్రిల వారు మనుచరిత్రాదుల కర్థముల వ్రాసినట్లు వీరు కాళిదాసమేఘసందేశమునకు "సందేశసుధ" యనువ్యాఖ్యానము రచించిరని కింవదన్తి. దానిఁ జూచుభాగ్యము మన కెప్పుడబ్బునో చెప్పఁజాలము.

ఇతరులను సోదరభావముతో జూతురనుదానికి తార్కాణము వీరిచెంత శ్రీకాళహస్తి చంద్రమౌళీశ్వరశాస్త్రిగారు జనులందఱికి వేంకటేశ్వరశాస్త్రులవారికి సోదరులేమో యను బుద్ధి పుట్టించుటయే. వీరు ఆనరరీ మేజస్ట్రేటుపదవినిగూడబొందిన నీతివేత్తలు. గవర్నరుకౌన్సి లులో మెంబరుగా కొన్నిరోజులుండిరి. పచ్చయప్పకాలేజిలో అధికారపదవిని గాంచిరి. స్వార్థము వీడిన లోకోపకారులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి కాభోగాచల వేంకటేశ్వరు డాభోగమగు నాయురారోగ్యైశ్వర్యాభివృద్ధులతో నితోధికజనానురాగో న్నతత్వములఁ బ్రకాశింప పరాత్పరునివందనపూర్వకము బ్రార్థించుచుంటిని.

## 44

## శ్రీ వైద్యవిద్వాన్ పండిత నారునాగనార్యగారు, ఆర్యవైద్యశాల, కోడూరు.

శ్రీభాషోద్ధారకునిపరిచయము కడప కళాప్రపూర్ణులసాహచర్యమున నాకు లభించినది. శ్రీశాస్త్రిగారిదైనందినజీవితము శతథా, సహస్రధా నిష్కలుషితము. శాంతస్వభావమునకుఁ దోడు విశాలదయాంతఃకరణము. నవనీతమునకు మృదుత్వమును సుధాపరిణతికి ధావళ్య ముంబోలె నొండొకటి యొడఁబాయనివి. ఆంధ్రభాషాభిమానమన్న వీరికానాటియుగ్గు పాలపోఁతతో బయలుదేరినది. జీర్ణగ్రంథోద్ధరణవిషయమే ఇష్టహోమహూని యానువంశిక నిత్యకృత్యము. పండితాదరణమన్ననో సుందరాకాండపారాయణపరాయణసదృశము. ఇఁక నీయనుపమానసారస్వతసేవకుఁ బట్టుగొమ్మయగు శ్రీరామస్వామిశాస్త్రులవారి పట్టినపట్టు నెర వేర్పుటలో వీరిది "భల్లూకపుఁబట్టే" ఇటు తిరుగదు. అటు తరుగదు. మతత్రయముంబోని

పత్రికాపుత్రికాత్రితయము మాత్రమే, సంతానసౌభాగ్యచిహ్నములని భావిచరిత్రకారుల కాధారసూచకములు. కరుణారసమన్నఁ గవుల కెంతసొంతమో! కరుణారసము వర్షించుట లితని కంత చక్కెరపానకము. చక్కని నైష్ఠికత—ఉక్కుమిగిలిన దేహపటిష్ఠత—ఈ రెండును చంద్రచంద్రికాన్యాయముంబలె నెల్లప్పు డానుషంగికములు. బీదసాదలయెడఁ వేదవిద్యార్థులకడ నీవదాన్యుని యతిశయప్రేమ. ముత్తైపుంబిప్పలకు స్వాతివర్షాగమసమము. చల్లనిమాట, సరళప్రసన్నతలుగల మొగముతేట ఈస్వార్థత్యాగికిఁ బెట్టనిసొమ్ములు. శీతవాతోత్పన్నప్రదేశములఁ జిత్రమూలము జనించుట ప్రకృతి కెట్లు సహజమో? ఆంధ్రభాషాసేవకొఱఁతవడిన ఇక్కాలమున వీరుద్భవించుటయు నట్టియవసరమే!

ఇఁక రాజకీయవాతావరణములోఁ దగుల్కొనలేదను రాయిడియేగాని రాష్ట్రసిద్ధ్యర్థమై పోరాడుటలో వీరిది అందెవేసినచేయి. శ్రీవిశ్వదాత—అమృతాంజనమెఱుఁగని మానవుడు, శ్రీ వావిళ్లవారిగ్రంథము లెఱుఁగనిఆంధ్రుఁడును నాఁడు-నేఁడు-లేఁడు. అట్టి పేరుప్రతిష్ఠలఁగన్న ఈసంపన్నునిఁగూర్చి వేఱపొగడనేల, మామిత్రమండలిచే బహూకృతమగు "భాషోద్ధారక" బిరుద మొక్కటి ప్రబలతమమైనసాక్షి కాఁజాలదా?

సంస్కారప్రియులట్టి వీరియడుగుజాడలఁ బట్టకున్నను సువిశాలహృదయమునకు సువిచారితాభిప్రాయములకు తెలుఁగువెలుఁగు ననారతమారాధించుటకుఁ దెలుఁగుగడ్డలోఁ బుట్టినతెనుఁగుబిడ్డలు వీరికి సుస్వాగత మీయక తప్పదు. పెక్కుమాటలేల! ఇట్టి రసహృదయులు దీర్ఘాయుష్మంతులై ఆంధ్రిలోఁ గొఱఁతవడిన శాస్త్ర-చరిత్రగ్రంథసముదయము నితోధికాభివృద్ధ్యర్థమై పాటువడి సుకృతియగుట కప్పరమేశ్వరిసంకల్ప మొదఁగూర్పుఁగాతమని పొరింబొరిఁ బ్రార్థన మొనర్పువాఁడ.

**45**

## శ్రీమల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, ఆంధ్రవిశ్వకలాపరిషత్కళాశాలాధ్యాపకుఁడు.

సంస్కృతాంధ్రసారస్వతవిజ్ఞానము తాళపత్రపుస్తకశరణముగా నున్నపూర్వకాలమునఁ జెన్నపురిలో నెలకొల్పఁబడిన ప్రచురణసంస్థలలో శ్రీ వావిళ్లవారి దగ్రగణ్యమనుట సువిదితము. దానిని స్థాపించినవారు కీర్తిశేషులగు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు. సంస్కృతాంధ్రద్రవిడభాషాపండితులైనవారు జన్మచే పుదూరుద్రావిడులయ్యు భాషాసేవచే నూటికినూఱుపాళ్లు ఆంధ్రులైనవారు. వారు దాదాపుగా నొకశతాబ్ది క్రిందట స్థాపించిన ఈసంస్థ నిరంతరాయముగా నోత్తరవృద్ధిగా సర్వతోముఖమై వ్యాపించుటకు వారిసత్సంకల్పమును వారియాంధ్రభాషాభిమానమును ముఖ్యకారణములు.

"అవశ్యం పితురాచార" మ్మనుసూ_క్తి ననుసరించి బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులుగారు తమతండ్రిగారారంభించిన సత్కా_ర్యము దేశమున సహస్రముఖముల వ్యాపించునట్లుగా వారు ప్రకటించిన వానిని, ప్రకటింపఁగా మిగిలినవానిని మరల మరల మనోహరముద్రణమునఁ బ్రకటించుచువచ్చుటయేకాక, ఆంధ్రభాషయందు దొరకినంత వఱకు వివిధవిషయకగ్రంథముల నచ్చొ_త్తించి ఆంధ్రసారస్వతవిజ్ఞానము దేశము నలుఁ గడలఁ బ్రసరింపఁ బాటుపడుచున్నారనుట అనుభవసిద్ధము. మఱియు సంస్కృతాంధ్ర గ్రంథము లనేకములు సమర్థులైనపండితులచేఁ బరిశోధింపఁజేసియుఁ బరిష్క_రింపఁజేసియు నుభయభాషాసేవయుఁ బండితపోషణమునుగావించుచుఁ దమప్రచురణసంస్థ నుభయతార కముఁ జేయుచున్నారనుట సత్యము.

అదియట్లుండ శ్రీ శాస్త్రిగారు దేశహితాభిలాషతో వ్యయప్రయాసలకోర్చి పాతిక సంవత్సరములుగా నిరంతరాయముగా నడపుచున్న రెండుపత్రికలును వారిభాషాసేవకు దేశసేవకుఁ బరమోదాహరణము లనఁదగును. అందఱురాన్యులైన యాంధ్రులందఱికిని స్వదేశపరదేశరాజకీయవిషయములు ప్రజాహితవిషయములు వివిధసారస్వతవిషయములు కరతలామలకము చేయుచున్న 'త్రిలిఙ్గ' రజతోత్సవము గాంచుట దేశభాగ్యముగాక మఱేమి? అట్టి దేశభాషాహితాభిలాషియగు పరోపకారపరాయణు నభినందించుట ప్రతి యాంధ్రుని విధియనుట నిరాక్షేపము. వారిగ్రంథప్రచురణ పత్రికాప్రచురణసంస్థలు రెండు నర్థార్జనసాధనము లనుటకంటె దేశహితార్థసాధనములనుట సముచితమని నేను నమ్ముచున్నాను. శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు చిరకాల మిట్లే దేశహితముం గోరుచు దీర్ఘా యురారోగ్యభాగ్యములతో వర్ధిల్లెదరుగాత! సరస్వతీకరుణాపాత్రములైన వారిసంస్థలు విజయశ్రీ సముల్లసితములై వెలయుఁగాత!!

## 46

అభినవసరస్వతి సంగీత సంస్కృతరత్న

### శ్రీమతి సి. సరస్వతీబాయిగారు, లేడీ భాగవతరు, తిరువల్లిక్కే_ణి, మదరాసు.

తే. ద్యుమణి పద్మాకరము వికచముగఁ జేయు
కుముదహర్షము గావించు నమృతసూతి
అర్థితుఁడుగాక జలమిచ్చు నంబుధరుఁడు
సజ్జనులు తారె పరహితాచరణమతులు. (భ_ర్తృహరి.)

మహాశయులారా! ఈశుభకార్యమునందు అకించనసైన నాకుఁగూడా నొకభాగ మిచ్చినందులకు నెంతయో కృతజ్ఞురాలను.

త్రిలిఙ్గరజతోత్సవము

దేవునిపెండ్లికి అందరును పెద్దలే, అనేన్యాయముకూడ కలదుగదా. అందువల్ల ఇట్టియెడ నాబోటివార్లకు ప్రత్యేకాహ్వానములు అనవసరములు. మనఃపూర్తిగా నే నీకార్యమునందు కుతూహలినై బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని దివంగతులైన వారితండ్రిగారగు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిని ఎంతయో ప్రశంసించుచున్నాను. శ్రీరామస్వామిశాస్త్రులవారు లేకయుండినచో ఆంధ్రగ్రంథములకు యెట్టిదుర్గతి పట్టియుండెడిదో చెప్పలేము. నాచిన్నతనమందు ఆంధ్రగ్రంథము చదువుటయన్న పెద్ద రోతగా నుండెడిది. ఎటువంటిపుత్తమగ్రంథమైనను తప్పులతడికయై అప్పళమువలె ముట్టుకొన్నమాత్రన యెక్కడికక్కడ ముక్కముక్కలుగా విరిగిపోవుచుండుకాగితములపై ముద్రింపబడుతుండెడివి. గ్రంథపఠనమునందు నిజమైన అభిలాషగలవారు చదివితే ఇట్టి గుజిలీపుస్తకమునే చదువవలెను, లేదా తాళపత్రగ్రంథములకొరకై తడుములాడుకొనవలయును. ఆతాళపత్రగ్రంథములైనను చూచెడిదాతలు లేక చివికి శిథిలములై పల్లెటూళ్ల యందు అటకలపై పడియుండినవి.

ఇట్టిమహాసంకటసమయమునందు తలయెత్తియుండినవారు శ్రీ రామస్వామిశాస్త్రులవారే. అప్పుడప్పుడే ప్రచారములోనికి వచ్చుచుండిన ముద్రాయంత్రములను వ్యయప్రయాసములకోర్చి యెట్లో సేకరించి ఈమహోద్గ్రంథములను ముద్దులుమూటకట్టునట్లు అచ్చువేయించి లోకమునకు ఇయ్యబూనిరి. కాబట్టి ఈమహాశయుని ఆంధ్రగ్రంథసముద్ధర్త అనిచెప్పుట అతిశయోక్తికాదు.

ఈపనిచేయుమని వారి నెవ్వరుకాని ప్రేరేపించియుండలేదు. మరియు ఈపనికి బూని లక్షలకొద్ది ధనమార్జించమనే ఆకాంక్షయును వారికిలేదు. ఎందువల్లననగా ఆంధ్రము మొదలైన మాతృభాషలలో గ్రంథములను అప్పుడు చదివెడివారే అరుదు. అందువలన శ్రీశాస్త్రులవారు తాము అచ్చొత్తించినగ్రంథములు చలామణిఅగుటయే పెద్ద కష్టము. అట్టి విషమపరిస్థితులయందు లాభములకు ఆశించుటకు అవకాశమేది! మరియొకవిశేషము యేమనగా శ్రీరామస్వామిశాస్త్రులవారు పెద్దపండితులు. నామమాత్రావశిష్టములైయుండిన అనేకగ్రంథములను వ్యయప్రయాసములకోర్చి పల్లెటూళ్లవెంబడి తిరిగి తిరిగి సంపాదించి రమ్యతరముగా ముద్రించి ఆంధ్రులకృతజ్ఞతాభివందనములకు పాత్రులైనారు. వారికుమారులే ఈశ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు. కాలదోషమువలన సనాతనధర్మములు అడుగంటినవి. వీటిని పెల్లగించి వీటియందున్నగొప్పతనమును పరప్రత్యయనేయబుద్ధులగు తమ ఆంధ్రసోదరులకు ప్రత్యేకముగా చూపించుటయందు త్రిలిఙ్గపత్రికకు నున్నవోపిక మరియొకపత్రికకు లేదనుట సాహసముగాదు.

## సందేశములు.

నాగరికత పెచ్చుపెరిగిపోవుచున్న ఈకాలమునందు సనాతనధర్మప్రచారమునకు తిరస్కృతితప్ప ఆదరణము కలుగదు. అయినను దానిని సహించి శ్రీ వేంకటేశ్వరశాస్త్రిల వారు ఇరువదిఅయిదుసంవత్సరములు ఈపత్రికను నడిపించుకొనివచ్చుచుండుట తమకు గల సహజసాత్త్వికభావమును వెల్లడించుచున్నది. 'తుల్యనిందాస్తుతిర్మానీ' అను ఇత్యాది కర్మయోగిలక్షణములకు శ్రీశాస్త్రిలవారు స్థానభూతులై యున్నారు. ఈత్రిలిఙ్గపత్రికవలన గాని లేక తాముచేయుచున్న జీర్ణగ్రంథవుద్ధరణమునందుగాని వారికి లాభమురాని నష్టము రాని లోకులవల్ల దూషణరాని భూషణరాని సరకుసేయక ఈధీరుడు విఘ్నవిహన్య మానులగుచును ప్రారబ్ధార్థమును వుజ్జగింపకుండుటవలననే దేశమునందు ఆబాలగోపాల మును ఈసమయమందు వీరిని అభినందించుచున్నారు, ఆశీర్వదించుచున్నారు, ఆనందించు చున్నారు, ఇంతకంటె యేమికావలె. అర్థకామములు అశాశ్వతములు. కీర్తిఒకటియే సుశాశ్వతమైనది. ఇది నేడు శ్రీశాస్త్రిలవారిని వరించి వచ్చుచున్నది. తండ్రిగారు పూని యుండిన పవిత్రకార్యదీక్షకు యేమాత్రమును భంగముకలుగకుండునట్లు తాము నడుము కట్టుకొని నిలువబడుట యెంతయో సుప్రశస్తవిశేషము. అంతేకాదు. వీరు తలయెత్తిన నాటికి కాలము మారినది. దానితోపాటు దేశముకూడ మారినది. రాజకీయసాంఘికనైతిక విషయములయందు ప్రజాసామాన్యము మంచిశ్రద్ధ తీసుకొనజొచ్చినది దేశభాషలకు అపూర్వఆదరణము గలిగినది. మహాసభలయందు దేశభాషాప్రసంగములే వినబడజొచ్చినవి. దీనిని చక్కగా గురుతించి కుశాగ్రబుద్ధులగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిలవారు "త్రిలిఙ్గ" అనుపత్రికను నెలకొల్పి తెనుగువారికి మహోపకారమును గావించిరి. ఈత్రిలిఙ్గపత్రిక దేశమునందు అంతటను వ్యాపించి పండితులకును పామరులకును కూడ సమానముగ సంతోషదాయకమై నొప్పుచున్నది. దీనియోగ్యత తెలియని ఆంధ్రులు లేరు. అతివాద ములకు పోక అనర్థకరవిషయములకు తావియ్యక ఈపత్రిక నొకవంక రాజకీయపక్షముల వారికిని నొకవంక సామాన్యులకును ఆమోదము గూర్చుచున్నది. దీనియందు మరియొక గొప్పవిశేషముకూడ కద్దు. వార్తాపత్రికలయందు సర్వసాధారణముగ మతవిషయములు మృగ్యములై యుండునుకాని ఈత్రిలిఙ్గపత్రికయందు మాత్రము అవి అగ్రస్థానము ఆక్ర మించియుండును. కాబట్టి మనమందరమును దీనికి మనసార సుస్వాగతమిచ్చి దీనిని సర్వ తంత్రస్వతంత్రముగా చేయవలయును. ఇది మనకందరకును పరమవిధి. ఇట్టివిధిని నడుపుట యందు నేను లోపములను గలిగియుండవచ్చును. అయినను రసికులు వాటిని మన్నించెద రని నమ్ముచున్నాను.

## 47

## శ్రీ వరిగొండ సత్యనారాయణమూర్తిగారు,

'యవనదత్త', 'బాలాదిత్యా'దిగ్రంథకర్తః వాణిజ్యశాధ్యాపకుఁడు, బోర్డుహైస్కూలు, గూడూరు.

త్రిలిఙ్గసంస్థాపకులును సంపాదకులునగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి దివ్యచారిత్రాదిగుణగణములను ఇప్పటికే త్రిలిఙ్గదేశ మెఱిఁగియుండుదానికంటె నేనే గాదు మఱెవ్వరుగాని ఎక్కువగ నెల్లెఱింగింపఁగలరు? మఱి, ముత్యములవంటి అక్షరసరములతో ముద్దులొలుకు క్యాలికోచీరలుధరించి గిల్టునామములతో సౌందర్యవిభాసితలైన కావ్యకన్యలాంధ్రావనియం దింటింట నలంకరించి శ్రీశాస్త్రులుగారు తెలుఁగుదేశమునకుఁజేసినట్టియు చేయఁగలట్టియు సారస్వతసేవ నుగ్గడించుచునే యున్నారుగదా! నిజతేజఃకిరణములచే జగమును ప్రభావంతమొనరించు లోకబాంధవు నెఱుకపఱచుట కెవరు కావలయును?

దాదాపు శతాబ్దమునకుఁ బూర్వము ముద్రితగ్రంథము లంతగా నుండినవిగావనియు, ఉండిన కొద్దిగ్రంథము లేవియో ముద్రణాస్ఖాలిత్యదుష్టములై బక్కచిక్కి కళలేనికాగితములతో నుండినవనియుఁ, మీకును నాకును, మఱి తెలుఁగువారికందఱకును దెలిసినవిషయమే గదా! అంతమెందుగా లేక అనదరణీయుండిన ఆంధ్రసరస్వతిని ఆనాఁడు దగ్గఱకుఁదీసి కీ॥ శే॥ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు కొంత ప్రాణను గలిగించి, ఆచంద్రతారకముగ నాంధ్రులకు స్మరణీయులై తనరిరి. అనంతరము మన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు తండ్రిగారు చూపినమార్గమునఁ జని సారస్వతసేవచేయ మొదలిడిరి. పూర్వకవిప్రణీతములగు గ్రంథము లెన్నియో మాఱుమూలలఁబడి క్రిమికీటకసందష్టములై పోవుచున్నవని వారు గ్రహించిరి. ఎన్నియో కావ్యరాజములు కాలగర్భమునఁబడి కొట్టుకొని విలీనములై పోవుచున్నవని వారు గమనించిరి. వెంటనే శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు వ్యయప్రయాసలకోర్చుకొని శక్తివంచనచేయక వానినన్నిటిని సేకరించి సర్వాంగసుందరముగ ముద్రించి ఆంధ్రమహాజనుల కందఁజేసిరి. అందఁజేయుచున్నారు; అందఁజేయఁగలరనియు నా విశ్వాసము.

ఇప్పటికి నూఱేండ్లక్రిందట అక్షరాస్యు లింద ఱెక్కుఁడున్నారు? గ్రంథముల కింత ప్రచార మెక్కడిది? దేశ మింత శాంతిసుభిక్షులతో నెక్కడుండినది? అటులయ్యును శ్రీ శాస్త్రులుగారు మాత్రము కేవలము దేశసేవాసక్తులై, భాషాపోషకాభిలాషులై, అవిచ్ఛిన్నముగా నేటిదనుక సనాతనాధునాతనకవికృతగ్రంథములను లాభముపైఁ గొంచెమైనను గన్నిడక ఆంధ్రులకుఁ బ్రసాదించుచున్నారు. వావిళ్లవారిగ్రంథములను బఠింపక పాండిత్య

మలవఱచుకొనిన కవికుమారుఁ డుండడు. వావిళ్ల వారిగ్రంథములేని పుస్తకభాండాగారము లేదు. వావిళ్ల వారిగ్రంథస్థితమగు విజ్ఞానదీప్తి ప్రసరింపని కుగ్రామమైనను లేదు.

కాని ఈవికి, మేఘునిరీతి యంత మెక్కడిది? కాంతిప్రసరణకుఁ గడ యెక్కడిది? శ్రీశాస్త్రులుగారు సేవాభిలాషులై అంతతో నిలువక విజ్ఞానదీప్తులతో నాంధ్రదేశము నింకను ఉద్దీపింపఁజేయ సంకల్పించి పాతికయేండ్లఁ బూర్వమే 'త్రిలిఙ్గ'ను స్థాపించి తన్మూలమునఁ దెలుఁగువారిని వైదికసాహిత్యవార్తామృతబిందువులతోఁ దనుపుచున్నారు. ఐహికాముష్మికవిషయవిరాజితమై పాఠకజనాహ్లాదకరమైయుండు 'త్రిలిఙ్గ'ను బోలినపత్రిక 'త్రిలిఙ్గ' తప్ప మఱిలేదన అతిశయోక్తి కానేరదు.

ఇంతయేందులకు? ఇప్పటి వావిళ్లవారి భాగవతప్రతిని గన్నచో పోతనామాత్యుఁ డుప్పొంగఁడా? ఇప్పటి మహాభారతసంపుటములను దిలకించినచో కవిత్రయము మురియదా? ఇప్పటి శ్రీమద్రామాయణసంపుటములను వీక్షించినచో వాల్మీకి భాస్కర రంగనాథాదులు సంతోషింపరా? సనాతనకవీంద్రు లాత్మకృతగ్రంథజాలము లలంకరించుకొని యుండువైఖరిని గాంచి ముదితహృదయులు గాకుందురా? సంస్కృతాంధ్రద్రావిడమహాకవీశ్వరుల ఆశీర్వాదపరంపరలతో శ్రీశాస్త్రులుగారికి సమధికైశ్వర్యారోగ్యములు కలుగక తప్పవు. అదిఫలముగ వారియుత్సాహ మాంధ్రమహాజనులకు సారస్వతమహాభాగ్యమును బ్రసాదించినది.

ఇంతకును శ్రీశాస్త్రులుగారు ధన్యాత్ములు. వారినిలయము పావనము. దివ్యక్షేత్రము. వారిగృహమున సకలభాషావిశారదులగు కవీశ్వరులు సర్వకాలముల గోష్ఠియుందురు. వారిసదనమున సంతతము సూతుఁడు శౌనకాదిమహామునులకుఁ బురాణములను శ్రుతపరచుచుండును. శ్రీకృష్ణభగవానుఁడు గీతల నుపన్యసించుచుండును. తుంబురుఁడు తాళమువేయ, నారదుఁడు తంబురమీఁట, వాణి వీణియను మేళవింప, త్యాగరాజు కృతులం బాడుచుండును. శ్రీశాస్త్రులుగారికృషికి ఫలముగ నిజభావనాబలముచే నాంధ్రమహాజను లెల్లకాలము నవరసముల ననుభవించుచు సప్తస్వరసంగీతనినాదముల నాలకించుచు ముదితాత్ము లగుచునే యున్నారు.

శ్రీశాస్త్రులుగారు తమ 'త్రిలిఙ్గ' పుత్రికారత్నమును పెంచి పెద్దచేసి ఆమెకు 'రజతోత్సవము'ను జరుపుసందర్భమును బురస్కరించుకొని వారికిఁ గానుకగా 'రజతోత్సవసంపుటి' నిచ్చుట ముదావహము; ప్రశంసనీయము. ఆంధ్రు లిట్లు తమధర్మమును నిర్వహించి శ్రీశాస్త్రులుగారియెడఁ గృతజ్ఞతఁ జూపినందులకు సంస్తుతిపాత్రులు.

త్రిలిఙ్గరజతోత్సవము

త్రిలిఙ్గకు 'సువర్ణోత్సవము'ను, 'వజ్రోత్సవమును' గూడ యథావిధిగ నిర్వర్తింపఁ జేయుటకై శ్రీశాస్త్రులుగా రాంధ్రమహాజనుల కవకాశమిచ్చునట్లు భగవానుఁ డనుగ్రహించుగాక!

సారస్వత, సాంఘిక, దరిద్రనారాయణసేవల నిట్లే కలకాలము చేయుచుండునట్లు సర్వేశ్వరుఁడు శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారికి దీర్ఘాయురారోగ్యభాగ్యములఁ బ్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాను.

## 48

## శ్రీభాషాకల్పలత.

### శ్రీ కామరాజు సీతారామకవిగారు, కవులకుంట్ల; బద్వేలు, కడపజిల్లా.

అఖిలభారత విద్వన్మిత్ర మండలికి విజ్ఞప్తి.

### 1. భా ష.

సుహృదయమహాశయులారా! కృతత్రేతాద్వాపరయుగంబుల, "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" అను గీతావాక్యప్రకారము ఒక్కొక్క లోకోపకారఘనకార్యోద్ధరణకై శ్రీమన్నారాయణుండు తదనుకూలావతారంబులనెత్తి జనహితంబొనర్చినవిషయములు పురాణము లుద్ఘోషించుచున్నవి కదా? "కలౌ వేంకటనాయకః" అనుఆర్యోక్తి ననుసరించి కలియుగమునందలి ప్రజాహితకార్యోద్ధరణకై, శ్రీశేషాచలాధివాసుఁడగు శ్రీవేంకటేశ్వరస్వామి కొందఱువిజ్ఞుల హృదయపీఠముల నివసించి ఆయాకార్యముల నెరవేర్పఁగలఁడని ఆస్తికజనుల కందఱకును సంపూర్ణమగు నమ్మకము.

### 2. సాదృశ్యము—భాషోద్ధరణము.

ఏతద్విషయమున భాషోద్ధారకబిరుదవిభ్రాజితులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి స్వనామధేయమును, స్వసామర్థ్యమును, స్వపాండిత్యమును, స్వసంపూర్ణకటాక్షమును, శ్రీ వేంకటేశ్వరులేయొసగి నామారు నీవీకార్యమునకు బద్ధకంకణుఁడవై నెరవేర్పుమని ప్రోత్సహించి దృఢసంకల్ప మొసంగుటచేతనే వీరీకార్యమున నింత శ్రద్ధాసక్తులైరని సర్వవిద్వన్మండలియభిప్రాయము. వీరిజనకులగు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులగారు 85 వత్సరములక్రిందట మద్రాసునందాదిసరస్వతీముద్రణాలయ మనుపేర ప్రశస్తముద్రణా

లయమును బ్రతిష్ఠించి ప్రచురణసంస్థ నెలకొల్పి అందపూర్వములైన సంస్కృతాంధ్ర ద్రావిడభాషాగ్రంథము లసంఖ్యాతములుగా పరిశుద్ధముద్రణ మొనర్పజేసి శ్రీభాషావ ధూటికొల్వుదీర దివ్యసభాభవనమేర్పఱచి పండితకవిబృందముల నానందవార్ధి నోలాడఁ జేసి కీర్తిశేషులై బ్రహ్మైక్యపరులైరి.

"సుపుత్రః కులదీపకః" అనునార్యోక్తిరీతి తండ్రిగారు కొంతవఱకు కార్యముల నడపి నిలిపియుంచిన శ్రీసంస్కృతమహాభారతమును, దేవనాగరలిపిలో 18 సంపుటములుగను, శ్రీతులసీదాసరామాయణమును సంపూర్ణముగను, లోకమాన్య శ్రీబాలగంగాధరతిలక్ గారి గీతారహస్యమును ఆంధ్రభాషయందును విడువనిపట్టుదలతో ముద్రణకార్యము నెరవేర్పజేసి శ్రీ వేంకటేశ్వరశాస్త్రులగారు ఆధునికకవిపండితబృందములకు తద్గ్రంథపఠ నానందభాగ్యము నందజేసిరి.

## 3. విదేశవృత్తాంతములవ్యాపకము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు మనహిందూదేశమున నెందెందో "కూపస్థ మండూకములవలె" నివసించి దేశస్థితుల నేమియునెఱుంగని గ్రామవాసులగు పామరజను లకును పురవాసులగు నాగరికజనులకును "త్రిలిఙ్గ" పత్రికాముఖమున వారమున కొక తడవ ఆర్థిక, రాజకీయ, మత, నైతిక, సాంఘికవిషయములు మున్నగుభాషాప్రపంచమును దర్పణమునందు ముఖప్రతిబింబమువలె, "కరతలమునం దామలకమురీతి" సకృల్లును గని వినియానందించు మహోపకార మొనరించిరి.

మఱియు "ఫెడరేటెడ్ ఇండియా" అను ఆంగ్లపత్రికాసంపాదకులై చాలకాలము నుండి నడపుచు, రాజకీయోద్యోగులకేమి, ఆంగ్లభాషావిశారదులకేమి తదితరులకునేమి, సంపూర్ణానంద మందఁజేసిరి. రజతోత్సవకుతూహలి యైయున్న "త్రిలిఙ్గ" పత్రికాభాషా వధూమణి సత్వరమున నాకార్యమును నెరవేర్పఁజేసికొని అచిరకాలముననే సువర్ణోత్సవ మును నందుభాగ్యమును బొందుగాక యని మేము జగదీశ్వరునిఁ బ్రార్థింపుచున్నారము.

ఈకాలమున ద్రవ్యార్జనావిషయమున గలిగినంతశ్రద్ధాఽసక్తులు ధర్మకార్యముల యందు సామాన్యుల కందఱకును యుండదనుట సర్వజనవిదితమే. "అనిత్యాని శరీరాణి విభవో నైవ శాశ్వతః, నిత్యం సన్నిహితో మృత్యుః కర్తవ్యం ధాన్యసంగ్రహ"మ్మని పాటుపడు గాఢవైరాగ్యోపేతులు 100 టికి 99 మంది కాన్పించుచున్నారు. "కర్తవ్యం ధర్మసంగ్రహ"మ్మను నార్యోక్తి దప్పకుండ శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు స్వలాభాపేక్షకులు

గాక, మానవకోటి కిహపరసార్థకమగు భాషోద్ధరణమే కృత్యమనుదీక్షచే ధనవ్యయ ప్రయాసములనోర్చి సంస్కృతాంధ్ర ద్రావిడభాషలయందు మునుముందెందును వెలువడని అపూర్వ గ్రంథముల నెన్నిటినో ఆర్జించి మంచిగ్లేజు కాగితములపయి నాణిముత్యముల శ్రేణు లుంచినవిధంబున ముద్రణమొనర్పఁజేసి శాశ్వతములైన బైండుచే సలంకృతములైన గ్రంథముల నందఱును సులభసాధ్యముగా వెలకుదీయగలంతటి సామాన్యచౌకధరలచే వెలువరించిన గ్రంథమండలి "నక్షత్రములనైన గణనసేయ నగునుఁగాని" గ్రంథము లిన్నియని లెక్కింపసాధ్యముగాదనిపించిరి.

వరప్రసాదకులగు పూర్వపుకవులొనర్చినగ్రంథములు ఆకాలమున తాళపత్రముల యందు వ్రాతప్రతులై, వ్రాతలో క్రమక్రమముగఁ బొరపాట్లు గలిగియుండినవానిని ముద్రణాలయము లేర్పడినపిమ్మటగూడ ధనార్జనావిషయమున గలిగినంత శ్రద్ధ భాషను చక్కని స్థితిలో పోషింపవలెననెడిఆదరణమును తదధికారులచే పొందనిముద్రణాలయముల ముద్రితములై పంక్తికి పదితప్పులుగ నేర్పడి చదువ సాధ్యముఁగాని పుస్తకములను పండొలిచి చేతనుంచి భక్షణోపయుక్తమొనర్చినట్లు సామాన్యభాషాజ్ఞానము గలయందఱకు నర్థమగురీతి సటీకాతాత్పర్యములనుఁజేసి కవిచరిత్రముల నెలకొల్పి పుస్తకమును చేనందికొన్న సంపూర్ణముగఁ జదువునంతవఱకు విడువసాధ్యముగానంతటి విద్యానందవిషయ గ్రహణానందములం జదువరులకు గలిగించిరి.

ఆధునికకవిపండితోత్తములగు కళాప్రపూర్ణ కావ్యస్మృతితీర్థ, అభినవాంధ్రవాల్మీక్యాదిబిరుదవిభూషితులగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మగారి కృతములగు బ్రహ్మాండ పురాణము, బ్రహ్మపురాణము, అభినవాంధ్రవాల్మీకి రామాయణము, కౌమారికాఖండము, మున్నగుజగత్ప్రసిద్ధమహోన్నత గ్రంథసమితియు, కడపమునిసిపల్ హైస్కూల్ ప్రధానాంధ్రపండితులును కావ్యపురాణతీర్థ విద్వద్బిరుదాంకితులగు, బ్రహ్మశ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మగారి కృతములై అలరారు భాషావిషయకమగు సమాసాలంకారఛందో దర్పణాది అమూల్యగ్రంథములను నానాదేశవాసులగు ఆధునికపండిత కవిశిరోమణు లొనర్చిన అనేకలోకోపకార దివ్యగ్రంథములను కావలెనని వెదకినను గూడ కూర్పుపొర పాటుచే నొకతప్పైనను లేకుండునట్లు పండితులచే సవరణపరపించి శోభాయమానములగు దివ్యబైండింగుచే నలంకృతములైన గ్రంథరాజిని ఆసేతుహిమవత్పర్యంత మహీమండల మున పండితులు పరమానందమొంద నిండింపజేసిరి.

శ్రీ భాషాపతి తాననవరతము చేతధరించియుండు పాత్రమును కొంతతడవటు లుంచి ప్రత్యహము శ్రీవావిళ్లముద్రణాలయమునందు ముద్రితములైనగ్రంథములను ఒక్కొక్కదానిని చేకొని తదలంకారమునకును తత్పారిశుద్ధ్యతకును తద్విషయవిమర్శనమునకును పూర్ణానందభరితయై పఠించుచు ముద్దిడుకొనుచు వక్షః పీఠిన నిడికొని సంతోషార్ణవమున నోలలాడునంతటిగౌరవౌన్నత్యములను గ్రంథమండలికి గలిగించిరి.

## 5. వాఙ్మయము

శ్రీమదఖండసచ్చిదానంద పరిపూర్ణనిర్గుణపరబ్రహ్మంబునం దారోపితప్రపంచోత్పత్తి ప్రారంభమున ఆకాశాద్వాయుః, వాయోరగ్నిః,అగ్నే రాపః, ఆపః పృథివీ, అనుక్రమంబున ప్రప్రథమమున శబ్దగుణకమగునాకాశము, దానివలన స్పర్శగుణకమగువాయువు, దానివలన రూపగుణకమగునగ్ని, దానివలన గంధగుణకమగు పృథివియు నేర్పడినవగుటచే, శబ్దము సర్వభూతగుణప్రథానంబయ్యె. దానివలననే యైంద్రజాలతుల్యమగు ప్రపంచనటన జరుగుచున్నది. 84 లక్షలజీవరాసులయందును మానవజన్మమే సర్వోత్కృష్టతనువహించినది. జననాదిసర్వవిషయగ్రహణమున కాదికారణమైనది శబ్దమే. అది నానురాను, విద్యారూపిణియై సర్వకార్యముల కాటపట్టై మానవజన్మము సార్థకపఱుప నాధారమైనది. పశుపక్షిమృగాదులుసహితము తమతమధ్వనులచేతనే దేహయాత్రలు గడపుట చూచుచున్నాము. విచిత్రములగు నానావిధములగు నాధ్వనులను వినుచున్నాము గదా!

## 6. వేదశాస్త్రపురాణములు.

ఏతద్విమర్శనకుగానే వేదశాస్త్రపురాణము లేర్పడినవి. సృష్ట్యాది సర్వప్రపంచమును, శబ్దబ్రహ్మమయమై యున్నది. మహనీయులగుమునిసత్తములు ప్రపంచైంద్రజాలమును తమతమస్వానుభవములచే నెఱింగి జన్మపరంపరలచే జీవకోట్లుపడుశ్రమల నరసి అనేకజన్మార్జితపుణ్యపుంజపరిపక్వముచే లభియించిన మానవజన్మములు వృథాప్రయాసముల కాలవ్యయమై చర్వితచర్వణమురీతి మరలమరల నానావిధజీవరాసులయం దుద్భవిల్లి శ్రమలందబోవుటని తెలిసి కృపామతులై మానవకోటిని తరింపజేయ వేదశాస్త్రపురాణము లుద్ధరించి అందు పునరావృత్తిరహితశాశ్వత బ్రహ్మానందసామ్రాజ్యము నందికొనుటకు ధర్మార్థకామమోక్షములను, చతుస్సోపానములు మార్గముగా నేర్పరించి ఈత్రోవను మీరు నడచి అఖండసౌఖ్యానందము ననుభవింపుఁడని కటాక్షించియున్నారు.

## 7. కవిత్వము.

ప్రపంచమునం దడఁగియుండిన సర్వవిషయములు బహిర్వ్యాపకమై ప్రకాశించుటకు కవిమనస్సే కారణభూతమైనది. "రవి గాననిచో కవి గాంచు" ననెడిలోకోక్తియుఁ గలదు. కవికష్టము. బహిప్రకాశమగువరకును కానరానికష్టము. కవిమనం బెప్పుడును నూతన విషయములను గనిపెట్టఁ బ్రయత్నించుచు బ్రహ్మాలోకపర్యంతమును పర్యటనము సలుపు చుండును. కవిత్వమనునది జన్మాంతరకృషిచే లభ్యమగునదికాని ఇతరవిద్యలవలె నెంత కష్టించినను చేకురునది కాదు. పూర్వకాలమున మహర్షిసత్తములు తపోధనార్జనులై దీర్ఘా యుష్కులై సకలవిద్యానిధులై ప్రౌఢమతులై వశ్యవాక్కులచే చర్చించినవిషయములు, యుగతారతమ్యమునుఁబట్టియు నియ్యాధునికకాలస్థితినిఁబట్టియు ఆధునికులవిద్యామన స్థితులఁబట్టియు తదభిప్రాయముల దెలిసికొనుట దురవగాహములై అందేమి కలదని 'అంధ నకు చంద్రోదయప్రయోజనమువలె' నిరసించి వదలివేయువారు కొందఱును భావికాల మున యౌన్నత్యదశకు రాబోవుజన్మములుగలవారు "బుద్ధిః కర్మానుసారిణి" అనువాక్య ప్రమాణమున మంచిమనస్సుతో నెట్టులైన వాని సాధింపవలయు నను పట్టుదల గలిగి ప్రయాసపడుచు తద్భాషాపరిశ్రమప్రాప్తినందమిచే "చంద్రునిస్పృశింప మరుగుజ్జమను ష్యుఁడు జేతినెత్తినవిధంబున" నిష్ఫలప్రయత్నులై యుండువారు కొందఱు నైయుండు టను గాంచి పూర్వఋషీశ్వరుల యంశభూతులై ఇక్కాలమున నవతరించిన కొందఱు మహామహులు "పరోపకారార్థ మిదం శరీ" రమ్మనునార్యసిద్ధాంతమునుఁబట్టి పరమకృపా మతులై దేవభాషాగ్రంథసమితిని దేశభాషయందు సర్వులు గ్రహియింప సాధ్యమగు నట్లు సులభశైలిని గద్యపద్యాత్మకములుగా వ్రాసి మహోపకార మొనర్చియున్నారు. అందు ప్రథమమున సంస్కృతభారతమును నాంధ్రీకరించి లోకోపకార మొనర్చిన నన్నయ తిక్కనాదికవులును ప్రకృతకాలమున దేవభాషాగ్రంథాంధ్రీకరణ బద్ధకంకణులై, శతాధికగ్రంథముల నాంధ్రీకరించిన, కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారును, ఇంకను మహోన్నతసంస్కృతగ్రంథముల దేశభాషలకు మార్చిన మహోపకారులగు పూర్వ కవులును ఆధునికకవిపండితశిఖామణులును పూర్వఋష్యంశసంభూతులే.

## 8. కవిజనాదరణము.

పూర్వకాలమున కవిమనః ప్రయాసముల స్వానుభవపరులై గ్రహించెడిప్రభువులు వారినాదరించుటచే కవులు పూజ్యులైయుండిరి. ఈకాలమున నట్టియాదరణము నరుదు.

డాంబికమునకై కాక కేవల బీదరికమును యనుభవింపుచు ఏదియో జన్మాంతరకృషివలన నేర్పడిన కవితావిధాయకము ననుసరించి భగవద్భక్తివిధాయకములగు కొన్ని గ్రంథ ములను వ్రాసి వానిచే తమకే స్వలాభమును కాంక్షింపక పరమేశ్వరార్పణమని భగ వంతున కంకితమిడి ఈచేసినకృషి లోకమున వెలువడు నెట్లు పాఠకజనులహృదయముల సంతసింపజేయునెట్లు జన్మసార్థకము గలుగునెట్లని మనఃఖేదముచే పరితపించుచుండెడివారు.

పరహృదయవిమర్శనాజ్ఞానసంపన్నులును భగవదంశసంభూతులును సర్వవిద్యా నిధులుననగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు నిక్కమగు నిరుపేదలనెఱింగి అట్టికవులు ముద్రణమునకై కష్టార్జిత మెంతమాత్రము సమకూర్చుకొన్న నంతమాత్రము ద్రవ్య మును గ్రహించి కార్యమును నెఱవేర్చుచు తక్కిన ద్రవ్యమును వారెన్నిపాట్లబడియో యార్జించుకొని తెచ్చియిచ్చువఱకు నెంతయో కాలవిడంబన మొసగి "స్వకుటుంబము నందలి ఆత్మీయునిచందమున" కవులనాదరించు పారమార్థికులగుటచే నిపుడు మేనుల ప్రాణలుగలిగి కవులు సంచరింపగలిగిరి.

## 9. ఆ శీ స్సు.

గీ. అవని వావిళ్లవంశసుధాబ్ధిపూర్ణ, చంద్రుడగు వేంకటేశ్వరశాస్త్రి కెపుడు
ఆయురారోగ్యపుత్రపౌత్రాభివృద్ధి, వెలయుగాత రమేశునివిపులకృపను.

త్రయత్రింశత్కోటిదేవబృందములు శ్రీ శాస్త్రిగారికి అష్టైశ్వర్యవిభవములొసగి రక్షింతురుగాక ! మఱియు నేతద్విషయిక వ్యాససంపుటి నొనగూర్ప సత్సంకల్పయుతులై సకలవిద్వన్మండలికి నీసమయమున వారియుపకారములనెఱింగి వారినాశీర్వదించి కృతజ్ఞత నెరప నవకాశముగల్పించిన యుదారులు చిరస్మరణీయులు.

## 49

## గ్రంథకర్త్రి: శ్రీ కణ్ణానుబ్బలక్ష్మమ్మగారు, శ్రీ కాళహస్తి.

**బోధానందము:—**

సర్వాలంకారసంయుతయై శారద తనప్రాణసఖ యగు సుమతిసదనంబున కరుదెంచి కన్నులమూసికొని యెద్దియో యోచించుచుండెను. ఇంతలో సుమతివచ్చి యామె కనుం దమ్ములం దనకరకమలంబుల గట్టిగ మూసి మిన్నకుండెను.

సుమతి:—(శారద కరకమలంబులు తనహస్తపల్లవంబుల నంటి.) శారదా! నీ వెప్పుడు వచ్చితివి? శారదవని తెలిసికొంటిని వదలుము.

శారద:—(సుమతిం గని కిలకిలనవ్వుచు) కన్నులు మూసికొనియున్న నీవు నన్నెట్లు గాంచితివి?

సుమతి:—చెవులకుఁ జూపులున్నవిగదా? ఆహా! నీశింజానమంజుమంజీరనినదంబు నీవు శారదవని నాచెవులు తెల్పినవి తెలియదా?

శారద:—నీకన్ను లేమయినవి?

సుమతి:—చూపునుమాపు నీకేలుఁదమ్మి నలంకరించినవి.

శారద:—కన్నులున్నవని యెట్లెఱుంగుదువు? మనసుచేతనేగదా?

సుమతి:—శారదా! ఇఁక నూరకుండుము, నామనస్సేమియు బాగుగలేదు.

శారద:—ఏల?

సుమతి:—నీవు నాచెంతకువచ్చినపుడు మనమిరువురముఁ గలసిమనపురోపవనశృంగారమునుగురించి నీతో నెద్దియో ముచ్చటింతమని భావించియుంటిని కాలమహిమచే నాభావలన్నియు నిప్పుడభావములైనవని విచారించుచున్నాను.

శారద:—సుమతీ! నీవిచారము లనన్నింటిని సాగరమునఁ గలిపివేసి నీవు సువిచారవై నాతో నించుక ముచ్చటింపుము. ఇంతకుమున్ను నామనంబేమియు బాగుగలేదంటివి. మనస్సు నెఱుంగునదెద్ది? బుద్ధిపంచకమని పెద్దలందురు. బుద్ధికిఁ బేరుగలదా?

సుమతి:—ఆహా! కలదు. కుశలమేధాశ్రౌతప్రతిభ పండ-అని. ఇదిట్లుండె నీతో నేనేమి చెప్పుచున్నది. నాకు జ్ఞప్తిలేకున్నది. తప్పుల సవరించి చక్కఁగ బోధింపుము. శారదా! మఱొక్కవింత "మొన్న మాయత్తగారింట నొకయవివేకప్రభునైశ్వర్యగర్వముచేఁ బంచాంగము పేరుభొట్టును కసరికొట్టినాఁడు. పేరుభొట్టు కన్నులెఱ్ఱజేసి వెడనవ్వులతో వెక్కిరించుచుఁ బ్రభువువంకజూచి సిరిచింతకాయలు తిని శిరమునకు శీతలమెక్కినది. కలికమునకు నీచెంత జ్ఞానాంజనము కలదైనది. ఇంచుక జ్ఞానాంజనము ఆకన్నయ్య శ్రేష్ఠిగారి యంగడిలోనైన కొనితీసికొని పోరాదా అని యన్నాఁడు. అప్పుడాప్రభువుగారు గొప్ప పట్టణములన్నియుఁ దిరిగి అంగిడి యంగడియుఁ దిరిగి యెచ్చటను గానక కన్నయ్యసెట్టిగారి యంగడికివెళ్లి బంగారమైన వెండియైన నిచ్చెదను జ్ఞానాంజనమిమ్మని యడిగినాఁడు. కోటి కోట్లనిచ్చినను దొరకని వెలలేనివస్తువుగదా? జ్ఞానాంజనమన్న నేమనుకొంటివయా? అవి

వేక ప్రభువా? అన్నాఁడట మేధావియగు కన్యయ్యసెట్టి. అప్పుడు తనసార్థకనామధేయము నకు సంతసించి ఆయవివేక ప్రభువు నిజనివాసముకు వెళ్లినాఁడు. వింటివా?

శారద:—(వికవిక నవ్వును.)

సుమతి:—(శారదా ముఖచంద్రునియందమును వెన్నెలలు వెదజల్లు చిన్నిదొయియా రపుఁ జిఱునగవులసొగసులను దిలకించి) చెలీ! శారదా! నీరూపమునకుఁ దగినపేరు, పేరునకు దగినగుణము, గుణమునకు వన్నెబెట్టునలంకారము నీకే చెల్లు. నీనగు మొగము నాకెంతో యానందముఁ గూర్చుచున్నది.

శారద:—(సుమతిం గాంచి సంతసంబలర) సుమతీ! నీవింతకుమున్ను నాబుద్ధి కొద్దియు జ్ఞాపకములేదంటివి. బుద్ధిని బరిశీలించున ద్దేదేనియుం గలదా?

సుమతి:—కలదు. జ్ఞానవిజ్ఞానప్రజ్ఞానములని విందు.

శారద:—సుమతీ! ఈజ్ఞానత్రయముల వివరించి చెప్పుము.

సుమతి:—శారదా! నాకిందేమియుం దెలియదు. నీవే తెలియఁజెప్పుము.

శారద:—సుమతీ! వినుము. జ్ఞానమన సర్వజంతుసామాన్యము. విశేషములను బరి శీలించి తెలిసికొనుటయే విజ్ఞానము బ్రహ్మభావమును బ్రతిష్ఠించునదే ప్రజ్ఞానమని తెలిసి కొమ్ము. ఇఁక నావెంటరమ్ము.

సుమతి:—శారదా! ఎచ్చటికి?

శారద:—(ఇంచుక యోజించి) ఎచ్చటికివెళ్లుటకుఁ దోఁచకనే నిప్పు డిచ్చటికి వచ్చితి. ఏమిచెప్పుదు. కొందఱు నాటకములను గొందఱు హరికథలను కొందఱు కావ్యాలంకార మొనర్పను కొందఱు గృహలక్ష్మీచీదరలకును రమ్మని నన్ను బ్రతిమాలుచుండ నాకవన్నియు రుచింపకున్నవి.

సుమతి:—ఏల?

శారద:—ఆనాటకములన్నియు బూటకములు. కథలన్నియు వెతలు. పురాణములన నపరాష్ణములే. గృహలక్ష్మిగాథలు నన్నూరకవేధించుటచేతను తుంటరి కొడుకును వెంట బెట్టుకొని ఇల్లిల్లుదూరుచున్న అత్తపోరున నణగి మణగి ఆకులలో బిల్లినై నాల్గునాల్కలు సాచి వదరుభర్తతో వాదులాడలేక విసువుజెంది కీర్తిప్రతిష్ఠలుగల త్రిలిఙ్గకు వెళ్లదలఁచి నీచెంత కరుదెంచితిని.

సుమతి:—త్రిలిఙ్గ యననేమి?

శారద:—సుమతీ ఎఱుఁగవా వాయురాకాశతేజోమిళితమే. త్రిలిఙ్గతేజమును తనలో నిమిడించుకొని వాయురాకాశగమనంబున శీఘ్రగమనంబున నెల్లెడలంగల సుజను

లయం దీతేజమును జొనిపి సుభాషితములఁ బ్రకాశింపఁజేసి యానందముం గలిగించును. శీఘ్రముగ బోవుద మలంకరించుకొనుము.

సుమతి:—(శారదనుగాంచి) సుమతీ! నాచెంత నొక్కకాసైనను లేదే, నేనెట్లలంకరించుకొందును.

శారద:—ఊఁ కాసువీసములెందుకు? ఇట్టి యాశాపిశాచమును పాఱఁద్రోలి విద్య నలంకరించుకొనుము.

సుమతి:—విద్యచే నలంకార మెట్లు గల్గును?

శారద:—సుమతీ! విద్యవలన వినయమును వినయమున వివేకమును విద్యావినయ వివేకాలంకార మొప్పినచో విజ్ఞానవతివని పిలువఁబడుదువు. అప్పుడీవభిజ్ఞవు. నేను విశారదను. మనమిరువురముఁ గలసి మెలసి యొందేగినను నానంద మే.

సుమతి:—ఆనందమం దేమున్నది?

శారద:—అమృతమున్నదని యెఱుంగవా?

సుమతి:—ఎటింగితిగాని ఆయానందామృత మెందుదయించె?

శారద:—ఆయమృతకరునియందే.

సుమతి:—అతఁ డెందుఁ బుట్టె?

శారద:—(మందస్మితవదనారవిందయై) సుమతీ! వావిళ్లవంశాబ్ధిసోముఁడని వినవా?

సుమతి:—శారదా! నీబోధానంద మెంత బ్రహ్మానందమే నాకిట్టియానందము గూర్చిన భాషామతల్లివగు నీకిప్పు డొద్దేని నవీనభూషణం బలంకరింపవలదా! శారదా! ఈపద్యమాలికాలంకృతవు గమ్ము.

తే. వెల:దినవ్వులు వెన్నెయల్ వెక్కిరింపఁ, బల్కు లమృతంపుసోనలింపలరుచుండఁ
గలికి నేత్రోత్పలంబులు కాంతిమీఱ, నందమలరెను నీమోముచందమామ.

తే. చూడవే చెలి చూడవే చూడ్కు లలర, సుమతి వావిళ్లవంశాబ్ధిసోముఁడైన
వేంకటేశ్వరముద్రణా వెలసినట్టి, మన త్రిలింగను గాంతము తనివి దీఱ.

తే. ఘనకవీంద్రుల హృత్పద్మ కాననమునఁ, బ్రోదిగాంచిన కవితాలతాదులందు
నవ్యతరమగు మవ్వంపుఁబువ్వుగుత్తు, లంటి ముద్దిడి పరిమళ మరసికొనఁగ.

తే. అదె త్రిలిఙ్గాఖ్యమనుదివ్యహాయము నెక్కి, బాలపవమానుఁ డల్లనఁ బరువులిడుచుఁ
బండితాఖండలులదండ నిందు వేడ్క, వీవఁబోవుచున్నాఁడదే వేగమె పద.

## 50

## శ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారు, బి. యే,. రిటైర్డు ప్లీడరు, తిరుపతి.

సుమారు 100 సంవత్సరముల క్రిందట మనదేశములో ముద్రాక్షరశాలలు ఇంగ్లీషు భాషయందు కొన్నియుండినవికాని స్వదేశలిపిముద్రాక్షరశాలలు అతివిరళములుగా నుండెను. కావున సంస్కృతాంధ్రగ్రంథములు తాళపత్రములలోనే లిఖింపఁబడియుండినందున భాషలయందు విశేషాదరాభిరుచులు గలకొందఱికి మాత్రమేకాక సర్వజనులకు సుకరముగా లభింపకయుండెను. ఈహేతువుచేత భాషలకు ప్రచారమును మిక్కిలి స్వల్పముగానుండెను. రామాయణభారతభాగవతాది గొప్పగ్రంథములను జదువఁగోరువారు బహుళప్రయాసములకోర్చి స్వయముగా లిఖించుకొనుచునో, కాదేని యధికధనంబులొసంగి లేఖకులచేత వ్రాయించుకొనుచునో యాగొప్పగ్రంథములను సేకరించుకొనుచుండిరి. సంస్కృతశ్రీమద్రామాయణము షట్కాండములును ఆంధ్రభాగవతమును ఒక్కొక ప్రతికి 100 రూపాయలిచ్చి లేఖకులచే పెద్దలు వ్రాయించుకొనుచుండినది తాము స్వయముగా నెఱుఁగుదుమని కీర్తిశేషులగు మాజనకులుగారు నాకుఁ జెప్పియుండిరి. ఇఁకను సంస్కృతభారతమును లిఖించుకొనుటకు లేఖకుల కెంతయిచ్చుచుండిరో దానిని జదువరు లూహించుకొనవచ్చును.

అట్టికాలమున గొప్పసంస్కృతాంధ్రగ్రంథములను లోకోపకారార్థము తెలుఁగు లిపియందు ముద్రాక్షరాంకితమొనర్చి ప్రకటింపఁబూనినవారలలో ముఖ్యముగాఁ జెప్పఁ దగినవారు కీ. శే॥ శ్రీవావిళ్ల అనంతనారాయణశాస్త్రిగారును, వారిసోదరులు శ్రీరామస్వామిశాస్త్రిగారును. వీరిరువురుంగలిసి వివేకరత్నాకరమనుముద్రాశాలను స్థాపించి యందు దనేక యుద్గ్రంథములను దోషరహితమగునట్లు పరిష్కరించి ముద్రించి ప్రకటించి వినుతిగాంచిరి. శ్రీపురాణం హయగ్రీవశాస్త్రిగారు వివేకాదర్శమనుశాలను స్థాపించి శ్రీమద్రామాయణము మూలము,ఆంధ్రభాగవతము మొదలగుపుస్తకములను ముద్రించి ప్రకటించిరి. శ్రీపాల్కురికి కుమారయ్యగారు కళానిధియనుశాలను నెలకొల్పి, అందు సవ్యాఖ్యానసంస్కృత మాఘకావ్యము, ఆంధ్రభారతము, భాస్కరరామాయణము మున్నగుగ్రంథములను ముద్రితము గావించిరి. శ్రీసరస్వతి తిరువేంగడాచార్యులు, శ్రీవంగీపురము రామకృష్ణమాచార్యులుం గలిసి సరస్వతీనిలయమనుపేర ముద్రాశాలను స్థాపించి యందు సవ్యాఖ్యానమగు శ్రీమద్రామాయణము, బ్రహ్మసూత్రశంకరభాష్యము మొదలగుపెక్కుగ్రంథములను ముద్రింపించిరి. ఇంకను జ్ఞానసూర్యోదయముద్రాశాలాధ్యక్షులగు శ్రీభువనగిరి రంగయ్యసెట్టిగారు మొదలగు పలువురు గ్రంథముద్రణము గావించినవారు గలరు.

ఇటులున్నను వావిళ్లసోదరులు తొల్లిటిముద్రాశాలాధ్యక్షులలో ముఖ్యులై సద్గ్రంథప్రకటనమునకు మార్గదర్శులనంబరఁగిరి. వివేకరత్నాకర మనుశాలయేకాక శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారు ఆదిసరస్వతీనిలయమనుపేరుతో మఱియొకముద్రాశాలను స్థాపించి యందు జ్ఞానవాశిష్ఠము, పరాశరమాధవీయము, శంకరవిజయము, ఆముక్తమాల్యద మొదలగు ననేకసద్గ్రంథములను ముద్రించి బ్రకటించి లోకమున కత్యంతోపకారము గావించిరి. వీరు ప్రథమమున శ్రీమద్రామాయణము మూలమును దమశాలలో ముద్రించి నట్లు వినికిగలదుగాని యాప్రతి యిప్పుడు చిక్కుటలేదు. వారికుమారులును దమయొద్ద నప్పటిముద్రితగ్రంథములేవియు లేవని తెలిపిరి. వారు ప్రకటించినగ్రంథములను ద్రవిడ దేశమువారుంగొందఱు తెప్పించుకొని చదువుచుండిరి. విద్యార్థిదశయందుండినపుడు నేను వారియంగడికిఁ బలుమాఱులు పోయి వారితో సంభాషించియున్నాను. వా రాంధ్రలోక మునకుఁ జేసిన మేలు గొప్పది

కీ. శే॥ శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారికుమారులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు తమముద్రాక్షరశాలను గ్రమమున నభివృద్ధిపఱిచి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అని తమతండ్రిగారినామధేయమే యుంచి యందు గణనాతీతములగు ననేక సంస్కృతాంధ్రగ్రంథములను మిగుల రమణీయమగునట్లు మేలుకాగితములమీఁద సుందర మైనయక్షరములతో ముద్రింపించి సొగసుగా (బైండు) అట్టలుకట్టించి ప్రకటించుచుండుట యాంధ్రదేశమునం దంతటను నాబాలగోపాలము విదితమైయున్నది. వీరు ప్రకటించిన పుస్తకములు వేదవేదాంతగ్రంథములు, పురాణములు, కావ్యములు, నాటకములు, ఇతి హాసములు, వైద్యగ్రంథములు, ఇతరశాస్త్రగ్రంథములు, స్తోత్రములు, కథాపుస్తకములు, ఇతరభాషాగ్రంథముల యాంధ్రీకరణములు మఱియు ననేకవిధములై యొప్పారును. నాగరలిపిలో శ్రీమద్రామాయణము, స్తోత్రరత్నాకరము మున్నగు పెక్కుగ్రంథములను ముద్రించియున్నారు. శ్రీరామాయణమును ఆంధ్రతాత్పర్యసహితముగాఁ జిన్న యాకృతిలో ముద్రితము గావించిరి. ఎన్నియోపుస్తకములకుఁ బండితులచేఁ బీఠికలును, వ్యాఖ్యలును వ్రాయించి యచ్చొత్తించిరి. ఆంధ్రమున వచనభారతమును భాగవతమును క్రొత్తగాఁ విద్వాంసులచే వ్రాయించి ముద్రింపించిరి. బ్రహ్మసూత్రము, శంకరభాష్యమును దెలుఁగున వ్రాయించి ప్రకటించిరి. అనేకగ్రంథములను నూతనముగా వ్రాయించి ప్రకటిం చిరి. తత్ప్రకటితగ్రంథములను పేర్కొనఁబూనిన నీవ్యాసమే యొకగ్రంథమగును.

ఇట్లు శ్రీవావిళ్ల వేంకటేశ్వరులు అనేకవిధములను భాషాసేవచేయుచుండుటయేకాక "త్రిలిఙ్గ" యనుపత్రికను 25 సంవత్సరములకుముఁనుపు ప్రకటింపనారంభించి యందుఁ

బండితులచే భాషావిషయకమగు ననేకచర్చలను, విమర్శములను లిఖింపించుచు మనభాషకు విశేషప్రచారము గావించుచుండుటయేకాక ఇంగ్లీషుభాషయందు "Federated India" అనుపేరుతో రాజకీయపరిస్థితులనుగూర్చి వివిధోపన్యాసములను విమర్శలను గలిగిన యొక మాసపత్త్రికను 15 సంవత్సరములుగాఁ బ్రకటించుచున్నారు. ఇప్పుడు ఆంధ్రదేశంబున 30, 40 సంవత్సరములనుండి వీరుప్రకటించినగ్రంథములే బహుళప్రచారముగలిగి సర్వజనసమాదరణీయములై యున్నవనుటకు సందియములేదు. వీరితండ్రిగారికంటెను నెక్కువగా వీరు ఆంధ్రలోకమునకుఁ జేయుచువచ్చుచున్న మహోపకారము మిక్కిలి ప్రశంసనీయము. సర్వేశ్వరుఁడు వీరికి చిరాయురారోగ్యములు ప్రసాదించి యనుగ్రహించుగాక యని కోరుచున్నాఁడను.

## 51

## శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యగారు, బి. ఏ., బి. యల్., వకీలు, నెల్లూరు.

శ్రీవావిళ్లవారు చెన్నపట్టణము జేరక పూర్వము వీరిది నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా దండిగుంట యని తెలియుచున్నది. తొలుత వావిళ్లలోనుండి తరువాత కొంత కాలమునకు వీరు దండిగుంట చేరియుందురు. వావిళ్లయు దండిగుంటయు అండదండగ్రామములు. ప్రథమమున వావిళ్లలోనుండి తరువాత దండిగుంటచేరినందున వావిళ్లనుండివచ్చిన వారని వావిళ్లవారని యింటిపేరు కల్గియుండును. వావిళ్లకుటుంబములకు వావిళ్లలో పొదువుగ నొకమాన్యమున్నదట.

వీరు పుదూరుద్రావిడులనబడు ద్రావిడబ్రాహ్మణులు. దాదాపు నన్నూరేనూరేండ్ల క్రిందట తంజావూరుజిల్లాలోని కండ్రమాణిక్యగ్రామమునుండి కొన్నిశ్రోత్రియబ్రాహ్మణకుటుంబములు వలసపోయి నెల్లూరుజిల్లా జేరి శ్రీవేంకటగిరి ప్రభువులయభిమానమును బొంది నాయుడిపేటచేరువనుండు పుదూరను గ్రామము నగ్రహారముగ సంపాదించుకొనిరి. ఈగ్రామనామమె దీనికిగల ద్రావిడసంబంధము ననుక్తముగ చాటుచున్నది. పుదూరనగ నరవమున క్రొత్తయూరు (పుదుమై=క్రొత్త)

అట్లీవలసవచ్చినవారందరు *"బృహచ్చరణ" శాఖీయులు. "బృహచ్చరణ" శబ్దార్థము స్పష్టపడలేదు. వీరు తొలుత కండ్రమాణిక్యమునుండి వచ్చినవారైనందునను మరేకారణముననో వీరికి కండ్రమాణిక్యబృహచ్చరణమువారను సంకేతమేర్పడినది.

* (బృహచ్చరణశాఖవారిలో కండ్రమాణిక్యశాఖగాక మలనాడులోనను కొన్నియితరశాఖలును గలవు.)

ఇట్లు వెడలివచ్చిన కుటుంబములలో గొప్పసంస్కృతపండితులును వేదశాస్త్రప్రవీణులును శ్రౌతస్మార్తప్రక్రియానుష్ఠానపరులును యాజకులును పలువురుండిరి. ఆకుటుంబముల వారిప్పటికిని తమయిండ్లలో నొకతీరగు అరవభాషనె మాట్లాడుదురు. వారిరూపరేఖ లింకను పూర్ణముగ ద్రావిడత్వవిముక్తములు కాలేదు. నెల్లూరుమండలము బ్రవేశించిన పిదప కాలక్రమముగ యరవభాషాప్రసక్తి శ్లథముకాజొచ్చినది తత్థ్సానమున దేశభాషయు దేశభాషలలో నెల్ల లెస్సయు యరవమునకంటె మృదుమధురతరమగు తెలుగును వీరభ్యసించి యపారమగుపాండిత్య మాభాషయందును వీరిలో కొందరు గడించిరి. మనకాలమున మహాప్రసిద్ధిజెందిన కీర్తిమూర్తులు మహోపాధ్యాయ వేదము వేంకటరాయశాస్త్రి కళాప్రపూర్ణలీశాఖవారే శ్రీమంతులు ఆయుష్మంతులు మద్రాసు అడ్వొకేటుజనరల్ గారు సర్: అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారును వీరివారే.

ప్రాయికముగ నీకుటుంబపురుషులలో ననేకులు వేదశాస్త్రసాహిత్యవిద్యలందు మహావిద్వాంసులుగ నుండినందున వీరు సంస్థానములలోను గొప్పగొప్ప పట్టణములలోనను జేరి ప్రసిద్ధులుగనుండిరి. కుంఫిణివారిదినములలో మద్రాసుకోటను ఫోర్టుసెంటుజార్జికాలేజి అనునొక కాలేజియుండినది.1820ప్రాంతములనాపాఠశాలయందు శ్రీవేదంపట్టాభిరామశాస్త్రుల వారు ప్రధానపండితులుగ నుండిరి.ఇండియనులగు "లా"*విద్యార్థులకు వీరు సంస్కృతమున తర్కము వ్యాకరణము ధర్మశాస్త్రమును తెలుగున నన్నయభట్టీయము లోనగుగ్రంథములను పాఠములు చెప్పుచుండిరి. వీరు పుదూరుద్రావిడులు. వీరిస్థావరము ఆత్మకూరుతాలూకా వీరూరని తెలియుచున్నది. ఇండియనులగు విద్యార్థులకు Native Law Students కు వీరు తర్కవ్యాకరణధర్మశాస్త్రములున్ను తెలుగునన్నయభట్టీయాదులును చెప్పుచుండిరి.

గతశతాబ్దమున మద్రాసుప్రెసిడెన్సికాలేజి తెలుగుపండితులుగనుండిన శ్రీచదలవాడ సీతారామశాస్త్రులవారును పుదూరుద్రావిడులే. వీరూ గొప్పసంస్కృతపండితులు. సాంగవేదాధ్యయనపరులు. తెలుగున శ్రీచిన్నయ్యసూరిగారి కెనయని ప్రఖ్యాతులయి యుండిరి.

ఇట్టి పండితపారంపర్యముగల ఈపుదూరుద్రావిడులు ధైర్యసాహసవిక్రమములుగల వారై కొన్నికుటుంబములవారు దాదాపు ఎనుబది తొంబది ఏండ్లక్రింద చెన్నపట్టణశాఖా నగరమగు తండయార్పేటలో నధినివిష్టులయిరి ఈవిక్రమగణములో నిపుడు ముఖ్యముగ జేర్కొననగువారు శ్రీపురాణం హయగ్రీవశాస్త్రులవారు, శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రుల

* Native Law Students (vide Guide: to the Records of Nellore District 1801 to 1885, page 179.)

వారు, శ్రీవఝుల పాపాశాస్త్రులవారు లోనగువారు. వీరెల్లరు గొప్పపండితులగుటచే అచ్చుకూటముల సాగించి శ్రీమద్రామాయణాద్యుద్గ్రంథముల తెలుగుఅక్షరముల నచ్చువేయదొడగిరి. శ్రీహయగ్రీవశాస్త్రులవారి వాల్మీకిరామాయణమును భాగవతమును నిర్దుష్టప్రతులుగ నుండినవి. అవి యిపు డెచటనైన దొరకగలవా యని యౌత్సుక్యము కలుగుచున్నది. ఆంధ్రదేశమునం దంతయగాక కొన్నియితరమండలములందును ప్రసిద్ధిగాంచిన యాస్వల్ప పరిధిలో విశ్వకోశ (యన్‌సైక్లోపీడియ) ప్రాయమగునట్లు యా "తెలుగుబాలశిక్ష" యను నుత్తమగ్రంథమును వఝులవా రొకరు వ్రాసిరని వినికిడిగలదు. ఇక వావిళ్ల రామస్వామి శాస్త్రిలవారన్నచో దాదాపు డెబ్బదెనుబదియేండ్లనుండియు వీరిముద్రాంకనా ప్రకాశములు అత్యంతవ్యాప్తిగలిగియున్నవి. స్థాలీపులాకమున నొక్క యుదాహరణము జాలును 1927 లో ప్రకటింపబడిన శ్రీవేంకటరాయకశాప్రపూర్ణలవారు తమ ఆముక్తమాల్యదోపోద్ఘాతమున అప్పటికి ఏబదిఏండ్లక్రిందనె శ్రీరామస్వామిశాస్త్రిలవారి పురస్సరముగ ఈయాముక్తము సవ్యాఖ్యానముగ బ్రకటింపబడినట్లు తెలిపియున్నారు.

నెల్లూరివారును ద్రావిడ శ్రీవైష్ణవులును మహాపండితులునగు కీర్తిశేషులు శ్రీమాన్ ఆసూరు సరస్వతి తిరువేంగడాచార్యులవారును మనశాస్త్రులవారును చెన్నపట్టణపు తండయార్పేటలో శ్రీసరస్వతీనిలయముద్రాక్షరశాల"నొకదానిజరుపుకొనుచునాలుగువ్యాఖ్యానములతో గూడిన వాల్మీకిరామాయణమును మరికొన్ని ప్రాచీనసంస్కృతగ్రంథములను యచ్చువేయించుచుండిరి. ఆకాలమున నవి బహువ్యాపకము కలిగియుండినవి. తరువాత కొంతకాలమునకు వీరిరువురును వేరువేరు అచ్చుకూటములను స్వంతముగ నెలకొల్పుకొనినటులున్నది. సరస్వతీనిలయమును శ్రీతిరువెంగడాచార్యులవారే నిలుపుకొనినట్లును శ్రీశాస్త్రులవారిముద్రాంకనశాలకు "ఆదిసరస్వతినిలయముద్రాక్షరశాల" యని పేరుపెట్టుకొనబడినట్లును తెలియుచున్నది. నాటినుండియు శాస్త్రులవారు స్వతంత్రముగ పండితసహాయమున ననేకసంస్కృతాంధ్రగ్రంథముల నచ్చువేయించి ప్రకటించిరి వీరిముద్రాక్షరశాలయు వీరి గ్రంథవిక్రయశాలయు కోస్తాయందంతయు ప్రసిద్ధములయినవి

1891 సంవత్సర ప్రాంతమున శ్రీశాస్త్రులవారు స్వర్గస్థులుకాగ పితృతుల్యగుణసంపదచే నొప్పినవారును మాన్యులునగు వారికుమారులు చిరంజీవులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పితృపీఠము నలంకరించి తతోఽధికమగు కీర్తిప్రతిష్ఠలతో నీపైతృకవ్యాపారమును నిర్వహించుచున్నారు. వీరచ్చొత్తించి ప్రకటించిన గ్రంథసందోహమునెడలను వీరివిజయవిక్రమముల నెడలను నెల్లూరునందలి వర్ధమానసమాజమువారు (ప్రొగ్రెసివు యూనియన్)

1917 లో వీరిని మెచ్చుకొనుచు వీరికొకబంగారుపతకమున మహాసభాముఖమున నర్పించిరి. అప్పటికి వేంకటేశ్వరులుగారు చిన్నవారు. ఈవల వీరు లోకానుభవము మెండుగ గడించి అనేక భాషలలో అనేకలిపులలో అనేక గ్రంథముల నచ్చువేయించి ప్రకటించి తదేకదీక్షతో కార్యనిర్వహణముజేయుచు ముద్రాంకన ప్రకటన ప్రపంచమున అద్వితీయప్రథగలవారై నాయకులై వెలయుచున్నారు.

వర్తమానకవుల ననేకుల ప్రోత్సహించి వారిగ్రంథములను తమముద్రణాగారమున నచ్చువేయించి ఇచ్చిరి. వారి వీరి జేరొక్కానవేల. బ్రహ్మశ్రీ కావ్యతీర్థ మహామహోపాధ్యాయ జనమంచి శేషాద్రిశర్మ కళాప్రపూర్ణులుగారు రచించిన రామాయణ, దేవీ భాగవతాద్యసంఖ్యాకములగు నుత్తమగ్రంథముల వీరు కేవల నిష్కృ్రియనిరపేక్షులరై అచ్చువేయించుచుండునట్లు శ్రీశర్మగారు నెల్లూరిలో నొకమహాసభాముఖమున నూదిజెప్పిరి. ఈశర్మగారిరచనలె యొకచిన్నలైబ్రరి గావచ్చును.

వీరిపుస్తకశాల నీవ్రాయసకాడు తొలుత 1886 లో చూచియుండెను. అప్పుడది పచ్చైయప్పకాలేజివెంబడి పశ్చిమమున నొకచిన్నగదిలో నిమిడియుండినది. ఈవల జరిగిన యర్ధశతాధికావధికాలమున వీరికార్యస్థానమును వీరిపుస్తకప్రదర్శనవిపణిస్థానములును అత్యంతముగ వృద్ధియై ఇతోధికములగు నభివృద్ధులను సర్వముఖముల నార్జింప సమర్థములై వెలయుచున్నవి. వీరిదేశసేవను గ్రంథప్రకటనవిస్తృతిని యుపలక్షించి కొన్ని తెలుగు మండలముల ప్రముఖులు వీరి నిటీవల ఆహ్వానించి యథాయోగ్యములగు సపర్యాసన్మానములచే గౌరవించి తదంకితములగు స్వర్ణపతకములగూడ సమర్పించిరి.

వీరు అచ్చుకూటమునందును పుస్తకప్రకటన వ్యాపారమునందును మాత్రమేగాక లౌక్యపౌరజానపదప్రసక్తములగు వ్యాపృతులందు మెలగుచున్నారు. ఈనాటి ఈరజతోత్సవభాజనమగు "త్రిలిఙ్గ" పత్రికను విజయప్రదముగ ప్రవర్తింపజేయుచు శాస్త్రీయ, వైదుష్య, రాజకీయ, వ్యావహారికాది సకలప్రకరణములను ఆంధ్రలోకమునకు సుగమము జేయుచు నాంధ్రలోకప్రియము నాచరించుచున్నారు. ఇంతియగాక నింగిలీషున "ఫెడరేటెడ్ ఇండియా" యను నొకపత్రికనుగూడ శ్లాఘ్యముగ నడపుచున్నారు.

మరియు లౌక్యవిషయములందును పాల్గొనుచు లోకసంగ్రహమున కుపకరించుచున్నారు. కొంతకాలము మద్రాసుకార్పొరేషనుసభ్యులుగ నుండిరి. పచ్చయప్పకాలేజి నిర్వాహకసభాసభ్యులుగనుండి కొంతకాల మాసభాపతిత్వమునుగూడ వహించిరి. పుస్తక

విక్రేతలగు హిగ్గిన్‌బాథముగారు పూర్వమొకమారు మద్రాసునగర షెరీఫు Sheriff గా నియమింపబడియుండిరి. ఈయానుపూర్వినాశ్రయించి యీకాలమున నీయాయుష్మంతులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారును తాముగడించియుండు ప్రసిద్ధివలనను ప్రాభవము వలనను ఆ షెరీఫుపదవినందదగినవారుగ నున్నారు.

వీరిఅచ్చుకూటమున నిపుడు తెలుగు-అరవము-గ్రంథము-నాగరి (సంస్కృతము - హిందీ) ఇంగిలీషులోనగు భాషాగ్రంథములచ్చు అగుటకు కావలయునక్షరసామగ్రియు ఇతరపరికరములును కొరవలేకయున్నవి ఇంకను వృద్ధికాగలయవకాశముల వీరెదురుచూచు చుందురు. మద్రాసు ఆనందముద్రాక్షరశాలవారు తెలుగుభాగవతము నచ్చువేయునపుడు అందుకొరకొకక్రొత్తయాకృతిగల్గి (బాడి) సొంపుగలనక్షరముల బోతపోయించి అచ్చు వేయించిరి. కీర్తిశేషులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుగారు టైపురైటింగును పోలిన యక్కరములతో కూర్చినభాగము కొంత "భారతి" యందపుడపుడు కనుపరచు చుండిరి. ఈశ్రీవేంకటేశ్వరులుగారును ముద్రాంకనవ్యవసాయమున తమపేరు నిలుచునట్లుగ నొక క్రొత్త ఆకృతి (Body) అక్షరముల నిర్మించుటయో అచ్చువేయువిషయమునగాని అచ్చుయంత్రనిర్మాణమునందుగాని యొకనూతనవిధానమును ప్రవేశపెట్టిదాని అనుష్ఠానము నకు దెచ్చుటయో వీరికి కీర్తిప్రదముగనుండగలదు.

ఈనాటి త్రిలిఙ్గ రజతోత్సవప్రసక్తముగ వీరు సర్వవిధముల సంస్తుత్యభినందనపాత్ర మగుచుండుట యెల్లరకు సంతసావహముగ నుండగలదు. వీరును వీరభిమానించి పోషించు చుండు త్రైలిఙ్గోద్యమమునుచిరాయువులయి చిరస్థిరకీర్తులయి ఇతోధికములగు స్వజన స్వదేశోపకారముల వెలయుచుండుగాత!

## 52

### శ్రీ పింగళి వేంకట్రామయ్యగారు, బి. యస్. సి. (ఆనర్స్),

ఆధ్యక్షులు, విజ్ఞానమండలి, అనంతపురము.

భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు తమ త్రిలిఙ్గపత్రికద్వారా ఆంధ్రభాషకును తన్మూలముగ ఆంధ్రదేశమునకును చేసిన మహోపకారమునకు విజ్ఞానమండలి వారు శ్రీశాస్త్రులవారినెంతయు అభినందించుచున్నారు. వారాపత్రికను తదేకదీక్షతో సర్వజనాంగీకారముగ ఇరువదియైదుసంవత్సరములు నడిపి అందు వివిధములగు విషయ ములపై వ్యాసములను ప్రచురించి ఆంధ్రభాషయందు పత్రికానిర్వహణోద్యమమును బలపరచియున్నారు. శ్రీశాస్త్రులువారు తమ త్రిలిఙ్గపత్రికయందు ఆధునికవిజ్ఞానవిషయ

ములపైకూడ వ్యాసములను ప్రచురించి త్రిలిఙ్గదేశమునందంతటను విజ్ఞానమును వెదజల్లుదురుగాక అని ఈవిజ్ఞానమండలివారాశించుచు వారికి శ్రీ భగవంతు డాయు రారోగ్యముల నొసంగుగాక అని ప్రార్థించుచున్నారు.

## 53

## శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిపంతులుగారు, తూర్పుతాళ్ల, పశ్చిమగోదావరి.

వార్తాపత్రికానిర్వహణము, ముఖ్యముగా మనదేశపరిస్థితులలో దుర్ఘటకార్యము. "అప్రియస్యచ పథ్యస్యవక్తా శ్రోతాచ దుర్లభః" అనునభియుక్తోక్తిప్రకారము హితమును ప్రియముగా నుండునట్లుపదేశించుటకు అసాధారణప్రతిభ కావలసియున్నది. వార్తాపత్రి కలకార్య మిట్టిది. మనదేశములో పత్రికానిర్వాహకుడెంతప్రతిభాశాలియైననుగూడ వ్యయప్రయాసలకును కష్టనిష్ఠురములకును లోనైయుండవలసినవాడు.

త్రిలిఙ్గవంటిప్రధానపత్రికనిర్వహణము నింతకాలము కడుసమర్థతతో సాగించిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిపరిశ్రమ మెంతయు ప్రశంసాపాత్రమని చెప్పబూనుట జగమెఱిగినబ్రాహ్మణునకు జందెమువేయజూచుట వంటిది.

ఇట్టిదియే వీరివంశమువారు తరతరములనుండి చేయుచున్న భాషాసేవను ప్రశంసింప బూనుటయును.

## 54

## శ్రీ వావిలాల వేంకటసుబ్బయ్యగారు, శారదాగ్రంథాలయ కార్యదర్శి,

పెదకొత్తపల్లి, ఒంగోలుతాలూకా.

### అ భి నం ద న ప త్రి క.

త్రిలిఙ్గ పత్రికా రాజమా! జయము.

ఇఱువదియైదుసంవత్సరములుగ మా 'త్రిలిఙ్గ' దేశాభివృద్ధికిని మత సాంఘికరాజ కీయాభ్యుదయమునకును కంకణముగట్టుకొని దిగ్విజయముగాంచినట్టిన్ని గ్రంథనిర్మాణము నందును నిర్వహణమునందును మార్గదర్శకులై సార్థకబిరుదాంకితులగు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి సంపాదకత్వమున ధన్యతగాంచినట్టిన్ని త్రిలిఙ్గ పత్రికారాజము ఇతోధికాభివృద్ధినై వెలుగొందుగాక!

## 55

## శ్రీమల్లెల శ్రీరామమూర్తిగారు, బెజవాడ.

భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు చెన్నరాష్ట్రముననేగాక రాష్ట్రేతరములలోఁగూడ ఖ్యాతివహించిన ఆంధ్రప్రముఖులు. ఆంధ్రభాషకు 'వావిళ్ల' వారి వంశముచేసిన నిరుపమానమగుసేవ బహుప్రశంసనీయమైనది. ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మత, వైదిక, వైద్య, వేద, శాస్త్ర, పురాణాదిగ్రంథములలో వావిళ్లవారు ప్రచురింపని గ్రంథములేదు. శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారిజనకులు శ్రీరామస్వామిశాస్త్రులుగారు గొప్ప సంస్కృతవిద్వాంసులు వారనేకఉత్తమసంస్కృతగ్రంథములకు వ్యాఖ్యానములు టీకా తాత్పర్యములు వ్రాసినారు. స్వర్గీయ శ్రీరామస్వామిశాస్త్రుగారిచే స్వల్పముగ ప్రారంభింపబడిన 'వావిళ్ల' ప్రచురణములు వేంకటేశ్వరశాస్త్రులుగారిహయాంమున వేయిరెట్లధికమై వావిళ్లవారిపుస్తకములు దశదిశల వ్యాపించినవి. చక్కని అచ్చు, ఇంపైనబైండు, సుందరమగుకాగితములు వావిళ్లవారిగ్రంథములకు ఆటపట్టు. నేడాంధ్రదేశమున వావిళ్లవారి గ్రంథములేని గ్రామములేదనిచెప్పుటతిశయోక్తికాదు శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు చెన్నరాజధానికిప్రధాననగరమైన చెన్నపురిలో చాలఖ్యాతినిసంపాదించి నగరప్రముఖులుగనున్నారు. శ్రీశాస్త్రిగారు కేవలము గ్రంథప్రచురణములతోనేగాక అనేకప్రజాహితసంస్థలలో ప్రధానులుగనుండి ప్రజాసేవచేయుచున్నారు. 1927 సం॥ న చెన్నపురినజరిగిన అఖిలభారతకాంగ్రెస్సుమహాసభాహ్వానసంఘకోశాధ్యక్షులై వ్యవహరించిరి. వీరు చాలసంవత్సరములు చెన్ననగరమున గౌరవప్రెసిడెన్సిమేజిస్ట్రేటుగను చెంగల్పట్టుజిల్లాలో మొదటితరగతి గౌరవమేజిస్ట్రేటుగను నుండి కీర్తిగాంచిరి. చాలసంవత్సరములు పచ్చయప్పట్రస్టుబోర్డు సభ్యులుగ నెన్నుకొనబడుటయేగాక ఒకతూరి అధ్యక్షులుగఎన్నుకోబడిరి. చెన్నపురి విశ్వవిద్యాలయసెనెటుసభ్యులుగను, చెన్నపురికార్పొరేషనుసభ్యులుగను, అణ్ణామలైవిశ్వవిద్యాలయతెలుగుపరీక్షాధికారిగ చాలకాలముఉండియున్నారు. ఆంధ్రవాణిజ్యసంఘము స్థాపించినదాదిగౌరవకార్యదర్శిగ ఎన్నుకోబడుచు వాణిజ్యాభివృద్ధికై కృషిసలుపుచున్నారు. ఆంధ్రదేశగ్రంథాలయసంఘ ఉపాధ్యక్షులుగనుండి గ్రంథాలయోద్యమసేవచేసి అనేకగ్రంథాలయములకు పుస్తకములు యిచ్చియున్నారు. శాస్త్రిగారు ఆంధ్రరాష్ట్రనిర్మాణమునకై చేసినకృషి శ్లాఘనీయము. 1938 లో చెన్నపురిలో జరిగిన 20-వ ఆంధ్రమహాసభాహ్వానసంఘాధ్యక్షులుగనుండి 'చెన్నపురి ఆంధ్రులదను' విషయమై శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు చేసినఉపన్యాసము బహుచరిత్రాంశము. రాయలసీమ-సర్కారాంధ్రులమైత్రికి వీరు

చేయుకృషి నిరుపమానము. వీరనేకమందివిద్యార్థులకు గుప్తముగ పుస్తకములు, ధనము సహాయముచేయుదురు. తెలుగుపండితులలో చాలమంది వీరిసత్కారమును పొందినవారే నని చెప్పవచ్చును. నిజముగ వావిళ్లవారిప్రచురణశాల లేకపోయినచో ఆంధ్రభాషలో నిపుడు లభించెడిపుస్తకము లభించెడివి గావు. అనేకపురాతనవ్రాతప్రతులు నశించెడివి అట్టి అవస్థలేకుండ వావిళ్లవారు పూనుకొని చిన్నపెద్ద తారతమ్యములేక స్తోత్రములదగ్గర నుంచి తెలుగుభాషలో ప్రచురించి, తెలుగుభాషకు అమూల్యమగుసేవచేసిరి. ముఖ్యవిషయ మేమన శ్రీశాస్త్రిగారు 25 సంవత్సరములనుంచి 'త్రిలిఙ్గ' అను తెలుగువారపత్రికను జయ ప్రదముగ నడుపుచున్నారు. ఆంగ్లమున 'ఫెడరేటెడు ఇండియా' అనువారపత్రిక తమిళ మున 'బాలవినోదిని' అనుపత్రికను జయప్రదముగ నిర్వహించుచున్నారు. ఇన్నివిధముల భాషాసేవ దేశసేవ యొనర్చువీరికి 'భాషోద్ధారక' అనుబిరుద మెంతయు తగియున్నది. వీరికి అనేకచోట్ల సన్మానోత్సవములు జరుగుచున్నవి. నిఖిలాంధ్రదేశపక్షమున శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారిని సన్మానించుబాధ్యత ఆంధ్రులపైనున్నది. అట్టితరుణము త్వరలో రానున్నదని తలచుచున్నాను. శ్రీశాస్త్రులుగారికి గొప్పగొప్పవారితో స్నేహముగలదు. శ్రీశాస్త్రిగారు నిగర్వచూడామణి. నాకు చిరకాలమిత్రులు—పూజనీయులు—అట్టి శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారికి శ్రీకృష్ణభగవానుడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నొసంగి ఇంకను భాషాసేవ దేశసేవ యొనర్చునట్లనుగ్రహించుగాక అని ప్రార్థించుచున్నాను.

## 56

## విద్యాసుందరి గానకళావిశారద శ్రీబెంగళూరునాగరత్నము, మదరాసు.

పరమపవిత్రమయిన భారతభూమియను సభాభవనము నలంకరించిన పండితప్రకాండులయొక్కయు విద్వత్కవివరేణ్యులయొక్కయు మహానుభావుల యొక్కయు దివ్యపాదారవిందములసన్నిధిలో భక్తిపురస్సరముగ వందనమాలికలనర్పించుచు తెలిసియో తెలియకయో 'ఉడుతభక్తి' సామెతగా నాకు తోచినమాటలు వ్రాసిపంపించుకొని కృతార్థురాలనయినట్టు సంతోషభరితస్వాంతనయి గుణగ్రహణపారీణుల ఆశీర్వాదములనుబొంద కుతూహలపడు చున్నదానను. ప్రకృతము శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి సత్కార్యదీక్షనుగురించి వ్రాయుటకు ఉవ్విళ్లూరుచున్నందులకు కారణంబేమి? సద్గ్రంథములను చదువుటచేతను శ్రావ్యమైనగానమును వినుటచేతను ఆకలిదప్పికలు మాన్పుమహదానందము గలుగునని చెప్పియున్న మహాత్ముల-పెద్దలవాక్యామృతములు నేడసత్యము లగునా? ఎన్నటికిని కానేరవు.

బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారి పూర్వపుణ్యకల్పవృక్షమున కమృతరసపూరిత దివ్యఫలమనదగు శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు నిజముగా దేవాంశసంభూతులు ఆయేడుకొండల వేంకటేశ్వరులే ఈవేంకటేశ్వరశాస్త్రులుగారుగానవతరించిరనుటయే నిజమయిన మాట. అట్టి వీరు "శ్రీరామం సర్వకర్మసు" అన్నట్లు సంస్కృతాంధ్రద్రవిడాదిగ్రంథములను త్రిమతప్రతిపాదితభేదబుద్ధిలేక ఉద్ధరించినారు, ఉద్ధరించుచున్నారు. ప్రాతఃస్మరణీయులును పూజ్యపాదులునయిన తమపితృపాదులవారు ప్రారంభించి తమకప్పగించిన ఈగ్రంథముద్రణప్రచురణాదిభారమును వహించి నిరంతరమును భాషాస్వరూపిణియు, ఆవిసరస్వతియునగు విద్యాధిదేవతను తను ధనమననములచేత నారాధించుచున్నారు. ఇట్టి పుత్త్రరత్నమును బడయుటచేత నామహనీయులు "న స పునరావర్తతే న స పునరావర్తతే" అను ఉపనిషద్వాక్యముచొప్పున, పునరావర్తనములేని శాశ్వతపుణ్యలోకములయందు సంభావితులగుచు తనకుమారరత్నము చేయుచున్న అపారమైన భాషాసేవను సంస్మరించుచు అమందానందతుందిలహృదయారవిందు లగుచుందురనుట ముమ్మాటికిని ధ్రువనక్షత్రమువలెనే ధ్రువము. "పుత్త్రాదిచ్ఛేత్పరాభవ" మ్మను ప్రమాణవాక్యము ఇట్టి సత్పుత్త్రులనుబడసిన శ్రీరామస్వామిశాస్త్రులవారియెడలనే నిజముగ చరితార్థమయినది. "ఆత్మావై పుత్త్రనామాసి" అను వేదవాక్యముచొప్పున శ్రీవారు శ్రీవేంకటేశ్వరశాస్త్రి ముఖతః మనఅందఱకును ప్రత్యక్షమగుచునే యున్నారు.

ప్రారంభవిద్యార్థులు మొదలుగా పరిపూర్ణపాండితీధనులవఱకును ఆబాలగోపాలము చదువుకొనుట కుపయుక్తములయిన పెద్దబాలశిక్ష, తరగతులవాచకములు మొదలు మహాభారతమువఱకునుగల భక్తి, యుక్తి, శక్తి, అనురక్తి, విరక్తులను బుట్టించెడు ననేకవిధములయిన సద్గ్రంథములను ప్రకటించియు, ప్రకటించుచునున్నారు. వీరు ప్రకటించిన గ్రంథముల ప్రకటనపుస్తకమే ఒక మహాగ్రంథమంతగా నొప్పారుచున్నదనగా నిక నేమిచెప్పవలెను! మూలమూలలలో తాళపత్త్రసంపుటములలో దాగి శిథిలీభూతములగున వెన్నియో గ్రంథములను వీరు వెలయించినారు. ఇక భారత భాగవత రామాయణాదులు, వేదవేదాంగాదులు, ఉపనిషత్తులు, భాష్యములు, కావ్యనాటకాలంకారములు మొదలగు గ్రంథముల నెన్నియో ప్రకటించిరి. అన్నింటికంటెను సర్వదా స్మరణీయమైనది సంస్కృతమహాభారతము పదునెనిమిదిపర్వములను దేవనాగరాక్షరములలో పదునెనిమిదిసంపుటములుగా ముద్రించి ప్రకటించుటయే. ఈసమర్థత వీరిఒక్కరికేచెల్లినది! వీరు సంకల్పసిద్ధులు కనుకనే "ఏగ్రంథమునైనను ముద్రింపవలయు ననెడుసంకల్పము కలుగుటయే తడవుగా కొలది

రోజులలో ముద్రించి వెలువరచుచుందురు. వీరికార్యదీక్ష మెండు. వీరిమనశ్శక్తి యతి దృఢము. సర్వజనోపయుక్తము లగుస్తోత్రములను సంపుటీకరణముగావించి స్తోత్రరత్నాకరమనుపేరను భాగములుగా ప్రకటించినారు. వీరే పూననిచో నితరభాషలోనుండు శ్రీతిలకుగారిభగవద్గీతాభాష్యము మనకు తెలుగులోదొరకుట దుర్లభము గదా! వీరేపూననిచో తులసీరామాయణమును తెలుగులో మనము చూడగల్గుట దుర్లభముగదా!! పితృవాక్యపరిపాలకుడన్నబిరుదము త్రేతాయుగములో ఒక్కశ్రీరామచంద్రభగవానునికే చెల్లినది. కలియుగములో శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికొక్కరికే చెల్లినది కాదన యెవరు సాహసించెదరు? వీరు విద్వాంసులకును,కవీశ్వరులకు కల్పవృక్షము వంటివారు. పలు దేశములనుండి యేతెంచెడు పండితులను కవులను సాదరముగ సత్కరించుచున్నారనుట అందఱు నెఱిగినవిషయమే కదా! విద్వత్కవివరేణ్యులు శ్రీవారియశోలతను తమకీర్తివృక్షమున కంటగట్టి దిగ్దంతములయందు అనశ్వరముగా ప్రాకించుచున్నారు. భాషాసుందరికి ముత్యాలసరములు దిగవేసినట్లు సొగసయిన అచ్చుఅక్షరములతో గ్రంథములను కూర్పించి యున్నారు. శ్రీతిరుపతి వేంకటేశ్వరునివలెనే వీరును ధనమును సంపాదించుచున్నారు. ఆదేవుఁడు ధనమును దాచుకొనుచున్నాడు, ఈభూదేవుడు సత్పాత్రములయందు విని యోగించుచున్నాడు. ఇదియే ఆయనకును ఈయనకును భేదము. ఇక వీరిదేశసేవాపరాయణత్వమును గురించి చెప్పనే అవసరములేదు. పచ్చయప్పకాలేజీలో గౌరవసభ్యస్థానమేండ్లతరబడిగా నలంకరించినారు. మఱియు నితరసంస్థల నెన్నింటిలోనో గౌరవపదవుల నలంకరించి తమచేతనైనసాహాయ్యముచేయుచు గౌరవింపబడుచున్నారు. అంతియేకాని ధనసంపాదన కాశించి పదవులకుకోరుట శశవిషాణప్రాయమనుటయే వీరిపట్ల తగును. అయినను ఇట్టివీరుమహాఘనతవహించిన గవర్నరుగారికి సలహాలనిచ్చు ముఖ్యమంత్రి కాలేదే అనుచింత మాత్రము నాస్వాంతమును బాధించుచున్నదని యథార్థముగా మనవిచేసికొనుచున్నాను. అదియును వీరికి కొలదికాలములోనే లభించియేతీరునని నానమ్మిక. వీరు సుమారు 25 సంవత్సరములనుండి "త్రిలిఙ్గ" అను ఆంధ్రవారపత్రికను నిరంతరాయముగ నిష్పక్షపాతముగ ప్రకటించుచు సనాతన-అధునాతనుల కానందమును గలిగించుచున్నారనుట సర్వవిదితము. దానికే నిపుడు రజతోత్సవము జరపింపనున్నారు. మఱియు ఇంగ్లీషులో నొకపత్రికయు, అరవములో నొకపత్రికయు వీరు నడపించుచున్నారు. ఈవిధమయిన భాషాసేవ దేశసేవ వీరియొక్కచేతిమీదుగా జరగుచున్నదనిన నెంతటియాశ్చర్యకరవిషయమో మీరే యోచింతురుగాక!

ఇట్టి లోకమాన్యులయిన మహానుభావులనుగురించి యేమివ్రాసినను అతిశయోక్తి చెందక స్వభావోక్తికే చెందుననుట యథార్థోక్తియే అగును. "యత్రాకృతిస్తత్ర గుణా" అను కాళిదాసోక్తి వీరియెడలనే సార్థకమగుచున్నది. మహాకవులు వర్ణింపదగిన వీరిగుణగణములనుగురించి వ్రాయుటకును పొగడుటకును నావంటిదానికి సాధ్యముకాదు వీరిని నేను సుమారు ముప్పదిరెండుసంవత్సరములనుండి బాగుగా నెఱుఁగుదును వీరు తమ త్రిలిఙ్గ పత్రికను సదా నాకుపంపించుచున్నారు. ప్రకటించిన ప్రతిపుస్తకమును ముందుగా నా కందించియే తరువాత విక్రయించుచున్నారు. శ్రీత్యాగరాజస్వాములవారి కుంభాభిషేక మహోత్సవసమయమున గోకలేమాలులో ఇతరప్రముఖులలో తామును ఒక్కరై చేసిన సహాయమునకు యావజ్జీవముకృతజ్ఞతాబద్ధురాలనైయున్నాను. భగవంతుని నెన్నివిధములచేతను వర్ణించినను తనివితీరనటులు వీరినిగూర్చి యెంతవ్రాసినను తనివితీరదు. కనుక వీరందఱకును శ్రమకలుగకుండునట్లు ఈలిఖితమును ప్రేమభక్తిపురస్సరముగ సమర్పించుకొనుచున్నదానను. శ్రీత్యాగరాజస్వాములవారి పాదారవిందములను ధ్యానించుచు వీరు చిరాయురారోగ్యపుత్త్రపౌత్త్రాదిసకలసంపద్భరితులుగా నుండుట చూచి ఆనందింపఁగోరుచున్నదానను. నిజమునకు వీరియుత్సవవైభవములు ఆంధ్రదేశమునకు రాజధాని అయిన చెన్నపట్టణమునసే జరగవలసినవయ్యును ఆభాగ్యమున కానగరము నోచుకొనకపోయెనే అని విచారించువారిలో నేనొకతెను. కడపలోను ఇతరచోట్లయందును మహాజనులుజరపిన వీరియుత్సవములనయినను చూచుభాగ్యము నాకు కలుగకపోయెనే యని మాత్రము సదా మదిలో విచారించుచున్నాను. పుట్టుకచేత ఆంధ్రురాలనగు నేను శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారికి ఆంధ్రదేశమునందుజరగిన జరగుచున్న జరగగల యుత్సవసమ్మానములు నాకే జరగునట్టుగా భావించి అమందానందమును పొందుచున్నాను.

57

## శ్రీమాన్ సీ. విజయరాఘవాచారిగారు, మాజీ దేశీయమహాసభ అధ్యక్షులు, "ఆరామ", సేలము :—

త్రిలిఙ్గపత్త్రికరజతోత్సవము జరుగుచున్నదని విని సంతసించితిని. ఈపత్త్రిక దేశములోని ఉత్తమపత్త్రికలలో నొకటి అని అందరనుకొందురు. కడచిన 25 ఏండ్లుగా ఆంధ్రరాష్ట్రములో జరిగిన రాజకీయప్రబోధమునకును వైజ్ఞానికపునరుజ్జీవనమునకును ఈపత్త్రిక చేసినదోహదము అనల్పము. నాయనుంగుమిత్త్రులు వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిసమర్థసంపాదకత్వమున ఈపత్త్రిక యెప్పటివలెనే జనరంజకమై దినదినాభివృద్ధికాంచునుగాక ! అని

అందరితోగూడి నేనును ఆశీర్వదించుచున్నాను. శ్రీశాస్త్రులవారినిగురించి నాసదభిప్రాయము ఒక్కమాట చెప్పనిండు. మదరాసులో ప్రజాసేవకు అందరివిశ్వాసమును గౌరవమును వీరు చూరగొన్నారు. తెలుగు సంస్కృతవాఙ్మయములకు వీరు చేసినసేవ ఇంతయని లెక్కవేయుటకు నేను సమర్థుడను కాను గాని తగినవారిఅభిప్రాయమున వీరుగొప్పగౌరవముపొందినవారు. శ్రీశాస్త్రులవారు నిజమునకు ఇంకను చిన్నవారు. దేశసేవ జేయుటకు వీరికి దీర్ఘాయువు అగుగాక! అనియు వీరు సుఖులౌదురుగాక! అనియు ప్రార్థించుచున్నాను.

## 58

## శ్రీ గా॥ రావుబహదూరు జస్టిస్ పీ వెంకటరమణారావుగారు,

హైకోర్టుజడ్జి, "గౌతమి", విక్టోరియాక్రెస్సెంటు, ఎగ్మోరు, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తెలుగు వాఙ్మయమునకు చేసిన సేవనుగురించిన నాఅభినందనములు మిక్కిలి నమ్రతతో పంపుకొనుచున్నాను. సుప్రసిద్ధ ప్రౌఢకావ్యాల ప్రకటనచే వారు తెలుగువాఙ్మయాన్ని పుష్టిపరచినదేగాక తెలుగుభాష తెలుగుసారస్వతాల అభ్యాసానికి నిజమయిన ప్రోత్సాహమును కలుగజేసినారు. మనదేశము వైజ్ఞానికముగ అభివృద్ధికావలెనంటే దేశభాష లెంతయావశ్యకమనేవిషయము అందరికిని అర్థమయియున్నది కాబట్టి శ్రీశాస్త్రులవారు చేసినసేవయొక్క విలువ ఆంధ్రుడొక్కక్కడు నిర్ణయించుకోగలడు. అందులో త్వరలో ఆంధ్రరాష్ట్రమేర్పడుతుందని ఎదురుచూచుచుండడముచేత ఇది చాలా బాగ తెలియగలదు ఇంత అర్హత శ్రీశాస్త్రులవారికి ఉండడముచేత వారికి భాషోద్ధారకబిరుదమిచ్చినది చాల యుచితమని తేలుచున్నది. వారినిరాడంబరత్వము నయస్వభావము, కలుపుగోలుతనము, దయాళుత్వము–వీనివల్ల వీరు అందరుమిత్రులకును ప్రేమపాత్రులయినారు. స్వభావముచేత సానుభూతిపరులు కావడముచేత అర్హమైనకార్యాలన్నిటికిని వీరిసహాయము దొరుకుతుంటుంది. దేశాభివృద్ధివిషయాలలో వారికుండే అభినివేశము వారనేకసంస్థలతో పెట్టుకొన్నసంబంధంచేత వ్యక్తమవుతున్నది. ఈదేశానికి ముఖ్యంగా ఆంధ్రదేశానికి వీరుచేసేసేవ బాగాసాగడానికి వీరికి చిరాయురారోగ్యము లగునుగాకయని కోరుచున్నాను.

## 59

## గా॥ న్యాయమూర్తి కే. పీ. లక్ష్మణరావుగారు, బీచ్‌బరో, అడయారు.

ఇరువదియేండ్లకు పైబడి నేను శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి నెరుగుదును. వారు తెలుగువాఙ్మయానికి పత్రికాప్రచారానికి చేసినసేవ శ్లాఘింపదగ్గది.

## 60

### శ్రీ తలిశెట్టి రామారావుగారు, జయపూరుసంస్థానము, రాయఘడ.

శ్రీ శాస్త్రులుగారికి దైవము చిరాయువు ఒసంగుగాక! వారు ఆంధ్రవాఙ్మయసేవ ఇంకను చేయుదురుగాక!! వికటచిత్రాలు త్వరలో పంపుచున్నాను.

## 61

### పి. చెంచయ్య, ఎస్క్వైయర్, యం. యల్.,

చీఫ్ జడ్జి (రిటైర్డు), ఛుడుక్కోర్టై, ఎగ్మూరు, మద్రాసు.

రమారమి ముప్పాతికశతాబ్దముగా "వావిళ్లవారంటే ఆంధ్రవిద్యార్థికి పండితునికి నాలుకమీదిమాటగా ఏర్పడిపోయినవి. పండితుడుతీర్చేదానికంటె ప్రచురణకర్తదిద్దడంచేత బాగుపడవలసిన దినాలు తెలుగుభాషపునరుజ్జీవఘట్టములో నుండినవి. ఎందువల్లనంటే ప్రాచీనప్రౌఢరచనలు బాగాజుర్తి ఆనందించిన తరువాతగాని ఏజాతిన్నినవీనమార్గాలలో గడువలేదు. అట్టితరుణముకలిగినప్పుడు ఆకొరతను తీర్చడానికి శ్రీవావిళ్లరామస్వామి శాస్త్రులవారు సిద్ధమయిరి. తెలుగువాఙ్మయములోనిరత్నాలను ఒక్కొక్కరికి అందుబాటులోనికి వచ్చేటట్లుగ ప్రకటించిన శ్రీవావిళ్లవారికి ఈతరమువారు చాలకృతజ్ఞులుగనున్నారు. వావిళ్లవారు ప్రచురణకార్యములలో ఎల్లప్పుడుసాహసించి మార్గదర్శిత్వము వహించినారు. తెలుగులోని ప్రౌఢరచనలను ప్రకటిస్తూఉండినప్పుడే సంస్కృతములోని వజ్రపుతునకలకన్నిటికిని తెలుగుపరివర్తనము కావించిరి. ఈప్రచురణకర్తలు నిరంతరాయముగాచేసినకృషి చాలవరకు తెలుగుసారస్వతపునరుజ్జీవా[illegible] తోడ్పడినది.

వీరు పండితులుగ ఉండడమేగాక తమచుట్టును అనేకపండితులను చేర్చుకోవడముచేత వీరు మహోపకారము చేయగలిగినారు. నేటిక్రొత్తకాలము ప్రాతపండితులకు మృత్యుప్రాయము. వావిళ్లప్రచురణసంస్థవారు వారికిజీవధారపోయకపోతే వారెన్నడో అదృశ్యులైయుందురు. ప్రాతకాలపుపండితులను సర్వకళాశాలలు ఉపయోగించుకోలేరుగదా! కాబట్టి వారునిలవడానికి ఆసరావావిళ్లవారిబోటి ప్రచురణకర్తలే.

రాబోయేనవీనాంధ్రనిర్మాణానికి త్రిలిఙ్గ తనపాలు తానుపుచ్చుకొన్నది.

వావిళ్లకుటుంబమువారి ఉదారసేవ నుగ్గడించి శుభముహూర్తమున వారినిఅభినందింపగలిగినందులకు సంతోషపడుచున్నాను

62

## దివాన్ బహద్దరు శ్రీవి ఎన్. విశ్వనాథరావుగారు, మద్రాసుకలెక్టరు, మద్రాసు.

తెలుగు సంస్కృత వాఙ్మయములపరముగా శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చేస్తున్న ఉత్తమకృషికి వారినభినందించడములో నేను హృదయపూర్వకముగా పాల్గొనుచున్నాను. వారిభాషలలోని ప్రసిద్ధకావ్యాలకు కల్పించిన రూపముచేత అవి అందరికి అందుబాటులోనికి వచ్చినవి. వారినిరంతరకృతజ్ఞత వీరిపై నిల్చినది. వారిప్రజారంజక "త్రిలిఙ్గ"కు రజతోత్సవమేర్పడినసమయాన వారినిఅభినందించుచున్నాను అది తరతమ ప్రయోజనకారి అగునని నావిశ్వాసము. తెలుగు తెలిసినవారందరికి నిది మేల్బంతి యొజ్జయగుగాక!

నేను శ్రీశాస్త్రులుగారిని అనేకసంవత్సరములుగా నెరుగుదును వారిసౌహృదయాన్నెల్లప్పుడు చూచి ఆనందించినాను. వారినిష్కపటస్వభావము దేశభక్తి కొనియాడదగినది. ఆంధ్రదేశములో వారికులము దర్జాలలో కల ఉత్తమగుణాలకు వారు ప్రతినిధి. తెలుగువారికింకా ఇతోధికముగా సేవచేయడానికి వారికీశ్వరుడు చిరాయురారోగ్యాలు ప్రసాదించుగాక!

63

## శ్రీ ఓ. పుల్లారెడ్డిగారు, ఐ. సి. ఎస్.,

మద్రాసు కార్పొరేషన్ కమీషనరు, రిపన్ బిల్డింగ్సు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి ప్రజాహితసేవను పొగడడమంటే చంద్రునికి వంకదిద్దడమవుతుంది. వారు దేశసేవయందు ప్రాతచేయిఅయియున్నారు. ఎంతచిన్నపని చేసినా ప్రకటనను కోరే మహాశయులుండే ఈదినాలలో నిరాడంబరజీవితము నడుపుకొన్నారు. తెలుగువాఙ్మయాభివృద్ధికి వారుచేసినకృషి కర్మకరులకు పరహస్తముగా వారు చేసినమేలు పట్టణహితప్రజాహితకార్యాలలో వారికుండేశ్రద్ధ అందరికీ బాగా తెలిసినవే ప్రత్యేకించి వర్ణింపనక్కరలేదు శ్రీశాస్త్రులవారికి ఆయురారోగ్యములు గల్గి వారింకను ప్రబలతరసేవ చేయుదురుగాక!

64

## శ్రీ రావుబహదూరు ఎం. నరసింహంపంతులుగారు, బి. ఏ., బి. ఎల్., కలెక్టరు,

(రిటైర్డు)మెంబరు పబ్లిక్ సర్వీసుకమిషన్, 45 పీటర్సురోడ్డు, కథీడ్రలుపోస్టు, మద్రాసు.

ఈకోస్తాలలో తెలుగు సంస్కృత వాఙ్మయాలకు వావిళ్లవంశమువారు అద్వితీయ సేవచేసినారు. చాలముఖ్యమై అపూర్వమైనగ్రంథాల నెన్నిటినో ముద్రించి ప్రకటించి ఆ

వాఙ్మయాలకు వన్నె దెచ్చినారు. ఈకార్యక్రమంలో శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిలవారు తండ్రిగారిపేరును ప్రతిభతో నిలవబెట్టినారు.

తెలుగుగ్రంథాలవరకు దేశములో వావిళ్లసంస్థకు తరువాతిదే మరియేసంస్థ అయినా అని నేను నిస్సందేహముగా చెప్పగలను.

**65**

**ఖాన్‌బహదూరు ఆదము హాజీమహమ్మద్ సేయిట్‌గారు, మద్రాసు మాజీషెరీఫ్,**

రిజర్వుబ్యాంకు ఆఫ్‌ఇండియా కేంద్రబోర్డులో డైరెక్టరు, మహమ్మద్‌భవనము, బందరువీథి, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని పెక్కేండ్లుగా నేనెరుగుదును. వారనేక సంవత్సరాల అనుభవముగల పత్రికారచయితలు. వారు పత్రికాప్రచురణశాఖకు చేసిన సేవ అమూల్యము నేను దూరమునుంచి వారికార్యమును మనసారగౌరవించుచున్నవాడను. వారికి విజయమగుగాక!

**66**

**శ్రీ దివాన్‌బహదూరు గోవిందదాసు చతుర్భుజదాసుగారు, మాజీషెరీఫ్,**

మర్చెంటు, బ్యాంకరు, కమీషన్‌ఏజెంటు, 459, టంకసాలవీథి, పార్కుటౌన్, మద్రాసు.

వారి తెలుగువారపత్రిక త్రిలిజ్జరజతోత్సవసమయమున నా గౌరవమిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులుగారికి అభినందనాలతోకూడిన సమ్మానసంపుటి సమర్పింతురని వినుటకు చాల సంతసముపొందితిని.

శ్రీశాస్త్రులవారిని ఇరువదియేండ్లకుపైబడి తెలియును. నిరాడంబరులు, నిష్కల్మషులు, సుస్వభావులు శ్రీశాస్త్రిలవారగుటచేత వారిని చూచినవారందరును వారిని ప్రేమింతురు. సుప్రసిద్ధులయిన వారితండ్రిసాంప్రదాయాన్ని వారు చక్కగా పరిపాలించుచున్నారు. సంస్కృత, తెలుగువాఙ్మయాలకు వారు అపారసేవచేసినారు. మతవిషయకాలు, తదితరాలు అయిన ఉపయుక్తగ్రంథాలను అపురూపకృతులను అనేకము ప్రకటించి ప్రజల కందుబాటులో నుంచినారు.

మద్రాసులో అనేకప్రజాహితసంస్థలతో శ్రీశాస్త్రిలవారికి సంబంధముగలదు దేశానికి వారుచేస్తుండే ఉదాత్తసేవ నిరంతరము జరుగడానికి వారికి చిరాయువును సౌఖ్యసమృద్ధియును అమరుగాకయని కోరుచున్నాను.

## 67

## శ్రీ పిఠాపురము మహారాజుగారు, అడయారు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు బహుకాలముగ తెలుగువాఙ్మయమునకు మహోదారసేవ చేయుచున్నారు. మిక్కిలివిలువగల అనేకప్రాచీనకావ్యములను ఆకర్షణీయముగా ప్రకటించినారు. అనేకసందర్భములలో నష్టపడియుండికూడ వీరు తమ సత్కార్యములను సాగించుచున్నారు. ఆంధ్రదేశము వీరికి నెక్కువగా ఋణపడినది. ఎక్కువగా కృతజ్ఞతకూడపడియున్నది. వారికి విజయంబగుగాక!

## 68

## శ్రీ కే. శ్రీరాములునాయుడుగారు, ఎక్సుమేయరు, మదరాసు కార్పరేషన్, కందప్పచెట్టి వీథి, జార్జిటవున్, మద్రాసు.

ఒకపత్రికకు ఇరువదిరెండేండ్లునిండడమంటే అసామాన్యవిషయము అందరును ఇంతదీర్ఘకాలము పత్రికనువిజయవంతముగ నడుపలేరు. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి రక్తములోనే పత్రికానిర్వహణశక్తి ప్రవహించుచుండుటచేతనే వీరికది సాధ్యమయినది. డబ్బాదబాయించి పేరుప్రతిష్ఠలకొరకు ప్రాకులాడే ప్రకృతిలేని వారీయన. జాతీయ జీవనములోను వాఙ్మయములోను శాశ్వతముగానుండదగినభాగాన్ని భద్రపరచి, దానికి సానపెట్టి, దానిని వృద్ధిపరచి పెంచడము గొప్పతనపు లక్షణము. మరియొకప్పుడు ఆత్మకు ఆత్మకు ప్రపంచమంతటనుగల సమరసభావమును ప్రత్యక్షపరచి జాతిఅంతటను నిగూఢమయిన ఐక్యమును సాహచర్యమును ఏకశృతిని కనుపరచుటయు తల్లక్షణమే. అందుచేత మానవభ్రాతృత్వము పెంపుదలఅగుటే కాక సత్యస్వరూపములోని నానాముఖముల స్వభావము గుర్తింపబడి వానియెడల గౌరవప్రేమలుగలిగి పరస్పరసహానము పెరుగును. బహుజనపఠితములగు త్రిలిజ్గ, ఫెడరేటెడ్ఇండియాలు మూలకముగానేగాక అన్ని మత విభాగాలకు చెందిన ఆధ్యాత్మికవాఙ్మయములను ప్రకటించుటచేతనుగూడ శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారీమహాకార్యమును సాధించినారు.

వీరు ప్రచారకోత్సాహశ్రద్ధలే లేకపోతే ఎన్ని యోదివ్య సంస్కృతకృతులును తెలుగు ప్రబంధరత్నములును వెలుగు కనక నశించియుండును. ఇండియాఅంతయు ముఖ్యముగ ఆంధ్రదేశమును ఈవిషయమున వీరికితీర్చరానిరీతిని ఋణపడియున్నది.

ప్రజాహిత జీవితములోను వీరు ప్రతిష్ఠనందినారు. వీరు తదేకదీక్షగా ఆంధ్ర ఛేంబర్ ఆఫ్ కామర్సునెడలచేసిననిరంతరసేవయే వీరిని మనకు చిరగౌరవనీయులను చేయదగియున్నది. పచ్చయప్పవారి అనేక ధర్మములతో వీరికి బహుకాలముగ నున్న సంబంధము ప్రత్యేకము పేర్కొనదగినది. అభినందింపదగినది. వీరికి మద్రాసు నగరపాలకసంఘములోను కొంతకాలము సంబంధముండుట వారిపౌరసేవాపరత్వమునకు నిదర్శనము. వీరికి కాంగ్రెస్సుపార్టీయెడల చాలసన్నిహితత్వమున్నా తప్పనిసరిగా పార్టీ శిక్షణకు లోబడవలసిననిర్బంధముకలుగునకే కారణముచేత వీరాజాతీయసంస్థనుండి దూరమునయున్నారు. తనఆత్మసాక్షిని మరియొకవ్యక్తియొక్క ప్రబలతరసంకల్పమునకు లోబరచుట దేశానికి అరిష్టమని వీరిదివరలో నమ్మినది. ఇప్పటికీ నమ్మునది ఒక్కమాటలో చెప్పదలచుకొంటే ఈయన ఏజాతికిగాని ఏదేశానికిగాని ఆభరణముగా నెంచదగ్గవాడు.

ఒకానొక గొప్పపండితుడేమన్నాడంటే ఇతరులకొరకెవరిజీవన ముపయోగపడదో వాడొకడే ఈ విశాలప్రపంచమునం దేకాకి అన్నాడు. ఈమాటలను సార్థకపరుస్తూ ఇంకను విస్తారతరవిస్తారతరంగాపెరిగే పరిధిలో ప్రజాసేవచేస్తూఉండడానికి వీరికి పరమాత్ముడు చిరాయురారోగ్యములు ప్రసాదించునుగాక!

## 69

### శ్రీ ఎస్. సత్యమూర్తిగారు, యం. యల్. ఏ., ఎక్సమేయరు, మదరాను.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులగారికి సన్మానసంపుటి బహూకరింపనున్నారని విని సంతసించితిని. ఈసన్మానమున నేనును మహదానందముతో చేరుచున్నాను. సారస్వతంగాను ఇతరరీతిని అతడు కావించిన చిరకాలసేవకై అతనినభినందించుచు హృదయపూర్వకాశీస్సుల నతని కందజేయుచున్నాను.

## 70

### శ్రీ సీ. బాసుదేవ్, బి. ఏ., బి. ఎల్., మద్రాసు మేయరు, కిల్పాకు, మదరాను.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పత్రికాముఖమున గ్రంథప్రకటనమునచేసిన సేవ అత్యుదారము. వారికి తోడిమానవునితోను మానవసంస్థలతోనుగలచిరపరిచయానుభవములను వారు పత్రికాధిపతిగా చక్కగా నుపయోగించుకొనినారు. వారిఅభిప్రాయములయందును విమర్శలయందును శాంతివివేకములు ప్రతిఫలించినవి. వారు ప్రచురణకర్తగా ప్రసిద్ధప్రాచీనగ్రంథముల నెన్నిటినో ప్రకటించినారు. చదువుకొన్నవారు వీనిని

గొప్పగానుపయోగించి ఫలముపొందగలరు. కార్యోద్యమనుకొన్నిలయనాను ఇతరసంబంధములను నేను వారిని చక్కగా నెరుగుదును. వారికి ప్రజాహితవిషయములు బాగా తెలియును. త్రిలింగ రజతోత్సవమంగళమువార్తమున ఆపత్రికాసంపాదకులకు చిరాయురారోగ్యైశ్వర్యములగునుగాక అని దీవెనలంపనిందు.

## 71

## రావుబహాదర్ ఎం. సి. రాజాగారు, ఎం. ఎల్. ఏ., సేయింటుథామసు మవుంటు.

ఏవ్యక్తి ప్రజాహితజీవితంలోనైనా అతను నెలకొల్పిన ఏసంస్థజీవితములోనైనా 25 ఏండ్లు కావడమంటే గొప్పసంగతే. ఇంతటికాలంలోపల శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు అపారసేవను సాగించి నెరవేర్చినారు. ప్రజారంజకమయిన తెలుగువారపత్రిక త్రిలింగను, ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియాను చక్కగా నడిపినారు. ఆర్థికరాజకీయ ఆధ్యాత్మికసాంఘికావసరాలనుతీర్చే విస్తారవాఙ్మయమును ప్రకటించినారు. ప్రపంచము వీరికి ఋణపడినది. అందుచేత వీరిసేవను స్మరించడమనేది కర్తవ్యము.

శ్రీశాస్త్రులవారికి సన్మానమొసగి వందనాలుఅర్పించడము నాకు పరమప్రీతి. ఎల్లకార్యములను విజయమందుటకు వారికి చిరాయురైశ్వర్యంబు లగుగాక!

## 72

## శ్రీ రాజసేవాప్రవీణ ఖాన్‌బహదూరు జి. ఎస్. కరీంసాహేబ్‌గారు, ఎం. బి. ఇ.,

పోలీసుఇనస్పెక్టరుజనరలు, తిరువనంతపురం, తిరువాన్కూరుసంస్థానము.

నాచిరకాలప్రియమిత్రుడు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు పత్రికాప్రకటన ద్వారా చేసినసేవకు వారిని సన్మానించుచున్నారని విని చాలా ఆనందమందితిని. ఈయనిలో ఆయన జీవితమంతటను శ్రమపడి దానిని ధారపోసినాడు. తనభాషకు దేశానికి సేవ చేయుచు అతడు చిరాయువగుగాక!

## 73

## శ్రీ ఎస్. గురుస్వామిగారు,

ఆల్ ఇండియా రయిల్వేమెన్సు ఫెడరేషను కార్యదర్శి, పెరంబూరు, మద్రాసు.

'త్రిలింగ', 'ఫెడరేటెడ్ ఇండియాల' సమర్థసంపాదకులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారికి త్రిలింగరజతోత్సవసందర్భమున అభినందనపూర్వకముగ నాహృదయపూర్వక

సన్మానమును తెలుపుకొనుచున్నాను. పదేండ్లకుపైబడి వారిని నేనెరుగుదును. వారిది విశాల హృదయము. వారు నిరాడంబరముగ, రాజకీయనిర్బంధితులకు కూలీలకు చేసినసహాయము ఇచ్చినతోడ్పాటు ముఖ్యముగ యజమానులకు కర్మకరులకు విషమక్లిష్టసమస్యలేర్పడి నప్పుడు వానినితీర్చుటలో వారుచేసినకృషి నాకు తెలియును. రాజకీయముగ వారు శ్రీ తిలకు మతమువారనవచ్చును. గాంధీతత్త్వము బయలుదేరడము వారి రాజకీయజీవితానికి దెబ్బ. కాబట్టి ఆయన స్వాభావికముగానే తీవ్రరాజకీయాలలోకిరాకుండా నిర్మాణోద్యోగంలోకి వెడలినారు. మద్రాసురాష్ట్రీయలేబరుబోర్డుయొక్కయు ఆంధ్రఛేంబరు ఆఫ్ కామర్సు యొక్కయు కార్యకర్తగానేమి, పచ్చయప్పధర్మాలధర్మకర్తగానేమి, సుప్రసిద్ధపత్రికాసంపా దకులుగానేమి, ప్రచురణకర్తగానేమి, మద్రాసులోని తనకాలపు ప్రజాహితజీవనములో వీరిమూర్తి ప్రత్యేకప్రతిభావంతముగ ప్రకాశించినది.

ఐరోపియనులు, ఇండియనులును అందరికిని ఈయనయందు విశ్వాసమే. దేశసేవా పరుడయి నిరంతరము పాటుపడడాని కితనికిదీర్ఘాయురైశ్వర్యములగుగాక!

## 74

## శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు, సర్వెంట్సు ఆఫ్ ఇండియాసొసైటీ, రాయపేట.

'త్రిలిఙ్గ' పత్రిక రజతోత్సవసందర్భమున తత్పత్రికసుప్రసిద్ధసంపాదకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి నాహృదయపూర్వకాభివందనములు పంపుట నాకు విధ్యుక్త ధర్మము. ముఖ్యముగ తెలుగువాఙ్మయాభివృద్ధికిగాను వావిళ్లకుటుంబమువారుచేసినస్థిర సేవకై వారికి తెలుగుదేశము ఋణపడియున్నది. కృతజ్ఞతగ నుండతగినది వీరుచేసిన సేవ వాఙ్మయప్రేమతో చేసినదిగాని లాభాలుజుర్రుకోవలెనని చేసినదికాదు. కొన్నియుప యుక్తప్రచురణాలు చేతిచమురువేరమవుతవని ప్రచురణకర్తలందరికిని తెలిసినవిషయమే. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారు ఇట్టి నష్టాలన్నిటిని లక్ష్యపెట్టక మనకోస్తాసభ్యజీవితాన్ని పెంపొందించే కృషిచేసినారు. వీరికి చిరాయువగుగాక! శ్రీ వేంక టేశ్వరశాస్త్రిగారికి వారిశక్తిసామర్థ్యములకు ఉచితమయిన ప్రజాహితావకాశాలు ఇంకను హెరాళముగ సమకూరుగాక!!

## 75

## రావుబహదూరు ఎం. రామరావుగారు, బి. ఏ., యం. యల్. సీ.,

త్యాగరాయనగరము, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి నాఅభివంద నములు. శ్రీవారికి చిరాయురైశ్వర్యంబులగుగాక అని ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

శ్రీశాస్త్రులవారిని 15 ఏండ్లకుపైబడి నేనెరుగుదును. ఈకాలములో వారిని నేను ప్రేమపుర స్సరముగా గౌరవింపదగినవారని ఎరింగినాను. సంపాదకులుగా, గ్రంథప్రచురణకర్తగా, ముఖ్యముగా అపురూపమైనప్రాచీనవాఙ్మయప్రచురణకర్తగా, ప్రముఖప్రజాహితదాతగా వీరికి ఉచ్చస్థానము గలదు.

వీరిఅభిప్రాయాలు శాంతాలు వివేచనాపరములు. వీరు మంచిస్నేహపాత్రులు; అన్నివిథాలా పెద్దమనిషి.

## 76

### డాక్టరు: పీ. వరదరాజులునాయుడుగారు,

జనరల్ సెక్రటరీ, అఖిలభారతహిందూమహాసభ, త్యాగరాయనగరు, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవము త్వరలో జరుగనున్నదని విని సంతసించితిని. తన రెండుపత్రికల ద్వారానేగాక సంస్కృతము, తెలుగు, అరవములలో ఎన్నోప్రాచీనప్రౌఢగ్రంథములను ప్రకటించుటమూలకముగాకూడ దేశానికి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు మేలుచేసినారు. కీ. శే॥ శ్రీమాన్ వీ. ఓ. చిదంబరంపిళ్లెగారు అరవపుస్తకాలు అచ్చువేసుకోడానికి ప్రకటించుకోడానికి వీరెంతసహాయంచేసినది నాకు స్వయముగా తెలిసినవిషయము. వీరు వివేచనాయుతముగా పనిచేసే ప్రజాహితజీవి. వీరికి సర్వైశ్వర్యములగుగాక!

## 77

### శ్రీ కే. వైకుంఠరావుగారు, బి. ఏ., ది ఫీస్టిక్ ఎండెవర్ సొసైటి, పర్లాకిమిడి.

ఈ త్రిలిఙ్గరజతోత్సవసమయమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని అభినందించే అవకాశముగలుగుతుందని నేనెదురుచూచియుండలేదుగావున నాకు మహదానందము కలిగింది.

'జగమెరిగినబ్రాహ్మణునికి జందెమెందుకు' అనేది తెలుగులోకోక్తి. ఏగ్రామములోనైనా తెలుగుచదివే మానవుడొక్కడైనాఉంటే ఆగ్రామము వావిళ్లవారినిగురించి వినకుండ ఉండడానికి వీలులేదు. వావిళ్ల అంటే తెలుగుప్రచురణ. తెలుగుప్రచురణఅంటే వావిళ్ల. చాలా అసహ్యముగా చదువడానికేరాకుండాఉండిన అనేకగ్రంథాలకు ఆకర్షణగలఆకారాన్ని మొదట నిచ్చినవారు వారు నాలుగుపేజీలకరపత్రముతో ఆరంభించి వేయిపత్రాల మహాకావ్యమువరకు ఉండే వేలసంపుటాల అచ్చులో మొదలుపెట్టింది వారు. వావిళ్లవోటి సంస్థ వారిపనిని శ్లాఘించడమంటే వట్టిమాటవరుస అవుతుందిగాని వేరేగాదు.

ఇది తెలిసికూడ ఈఉత్సవాలలో నేనెందుకు పాల్గొనుచున్నానంటె నాకు వావిళ్లకు ఉండే సంబంధాలు మాటమర్యాదవిగాని వ్యాపారవ్యాపారదృష్టివిగాని కావు. ప్రస్తుతపు యజమాని శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నాకు మిత్రుడు. ఆయన ముద్రాపకుడు, ప్రచురణకర్త, ఎడిటరు హోదాలు గొప్పవేవినా ఆసంబంధాలు నాతోటివి రావు. అంత వెనుక్కిలాగుకొనేవాడు. పిరికి అనిగూడ అనబోయినాను. అంత నిరాడంబరుడు, ఆప్రాత చూపు, ఖద్దరుకోటు, ఆగ్రామబడిపంతులతలపాగావాడుఅయిన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులేనా ఏదో కొద్దిపాటి ఉపక్రమంగాఉన్న వావిళ్లసంస్థను కైకొని నేడఖండసంస్థగానుండే వావిళ్ల ముద్రణాలయాన్ని పెంచినవాడు అని తెలియనివారు అనుమానపడకుండా తప్పదు. ఈ యన నేటిదినము చట్టప్రకారము వావిళ్లముద్రణాలయానికి స్వంతదారుడు. కాని, నిజా నికి అది తెలుగుప్రజలబహిరంగసంస్థ. అంతతీరికలేనిసేవ ఈసంస్థ ప్రజలకు చేస్తూవుంది. తానుచేసిన తెలుగుప్రకటనకార్యానికంటే వ్యక్తి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులే గొప్ప వాడంటే అది సాంప్రదాయానుసారంగానే ఉంది. ఈసంస్థను ఉపక్రమించిన వీరితండ్రి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులకు ఏపెద్దభౌతికబాధోఉండి ఆరంభించినపని ఇదిగాదు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులు స్వభావముచేతనే మితధోరణికలవాడు. "అభివృద్ధి మార్గాలవారు" తీర్చే అనేకకార్యాలను తీర్చడంలో ఆయన తప్పుచుంటాడు. ఈయనకొక విక్టోరియా (గుర్రపుబండి) ఉండేది. మద్రాసులో ఈపేరిప్పుడు నశింపుచెందిపోతున్నది. కారులు ప్రచారంలోనికివచ్చినవి. ఈయనకంటే చాలా తక్కువపనిగలవాళ్లు అసలే పని లేనివాళ్లు ఎందరో కారులుపెట్టుకొన్నారు. ఈయన ఆపాతకుక్కి గుర్రపుబండిని వదల కుండా పెట్టుకున్నాడు. తాను పిల్లవానిప్రేమతో చూస్తుండిన గుర్రంపోయింది. తరువాత గాని ఈయన విక్టోరియాను వదలలేదు. కాబట్టి ఇటువంటిప్రకృతికలవానిదగ్గరనుంచి సాంఘికాచారాలలోగాని వ్యక్తిగుణాలలోగాని క్రొత్తక్రొత్తమార్పులుగలుగునని నేనెదురు చూడను. జీవితంలోని ఆచారాలను త్రోసిపుచ్చే గండాగుండితనం ఈయనకు లేకున్నా నిష్కల్మషమనోవృత్తిగలవాడని తాను నమ్మేవాడెంత ఊరూపేరూలేనివాడైన వాడు సాహసిస్తే వానికి అండగావడంలోమాత్ర మెప్పుడూ వెనుదీయడు.

అనేకసంవత్సరాలు అనుదినము ఈయన వ్యవహారాలు నేను గమనించడానికి అవ కాశముండింది. ఈయన కాష్‌కీపరులు ఈయనపంపించే 'డెబిట్' స్లిప్పులను (అంటే ఫలాని వారికొర కింతకర్చువ్రాయమనేచీటీలు) డబ్బు చాలా ఇక్కట్టుగా నున్నప్పుడుకూడ సణుగుకొంటూఅయినా గౌరవింపవలసివచ్చుచుండేది. నామాట మీరు నమ్మండి. ఈకర్చు

లేమిటంటె అవసరమైనవానికష్టం తీర్చడానికో ఇతరదిక్కు లేని మంచికార్యాలకు సహాయ పడడానికో ఇచ్చినధర్మాలు. ఆయనకుకలిగే ఈధర్మసంవేదనలన్నిటిని అదుపులోపెట్టి ఈ చిన్న దానాలన్నిటిని ఏ ఒక్క సంస్థనిర్మాణానికో కేంద్రీకరింపగలిగితే వావిళ్లసంస్థఅంటె సారస్వతశాఖలో అజరామరణంగానున్నట్లే ఇతరశాఖలలో ప్రఖ్యాతిపడియుండేదని నా విశ్వాసము.

ఈవిధంగా వేరుఊరులేనివారి కొద్దికొద్దిబాధలను పోగొట్టడానికి అసంఖ్యాకమగు చిన్న ఉపకారాలుచేయడంతో ఈయన తృప్తిపడుచున్నాడు కదా అని నాకీయనయందలి గౌరవ మధికమయినది. తనకు కీర్తిగాని తాను సాయపడేసేవాపరునికి పేరుగాని రాక పోయినా చింతింపకుండా తోడ్పడేస్వభావ మెంతగణనీయము!

## 78

### సర్: ఫ్రెడరిక్ జేమ్సుగారు, కేటి., ఎం. ఎల్. ఏ.(సెంట్రల్), వెస్టరన్‌రోడ్డు, న్యూ ఢిల్లీ.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి అభినందనములువ్యాసములతో చేరిన సమ్మానసంపుటిసమర్పింప నెంచి మీరువ్రాసినఉత్తరమందినది.

కొన్నిసంవత్సరాలుగ శ్రీశాస్త్రులవారి నెరుగుదును. వారి ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియా పరిచయమును నాకు గలదు. వారిసారస్వతశక్తినెడల నాకెప్పుడును గౌరవము గలదు. ఫెడరేటెడ్ఇండియా శైలిమాట అట్లుండ, దానికి సబబయిన స్వాతంత్ర్యదృష్టి కలదు. శ్రీశాస్త్రులవారు ధైర్యోత్సాహములతో తమస్వతంత్రాభిప్రాయాలను వెల్లడించి చాల ప్రశంసాపాత్రులయినారు.

నాఅభినందనములను దెలుపుటకవకాశముకలిగినందునకు సంతసించుచున్నాను. వారి అనేకముఖాల అనేకరీతుల నడిపే ప్రజాహితమునుగురించిన ఈ నాల్గుమాటలను స్వీకరింతురుగాక!

## 79

### సర్: జమ్నాదాసుమెహతాగారు, ఎం. ఎల్. ఏ., బొంబాయి.

వాఙ్మయానికి పత్రికాప్రచురణానికి నామిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు చిరకాలంగా చేసినసేవ నభినందిస్తూ సన్మానసంపుటిని వారికి సమర్పింపనున్నారని విని చాలాసంతోషమయినది. నేను శాస్త్రులుగారి నిప్పటికి 15 ఏండ్లుగా నెరుగుదును. తెలుగు

సారస్వతాన్ని గురించి అభిప్రాయమీయడానికి నాకర్హతలేదుగాని వారు సామర్థ్యముతోను ప్రతిపత్తితోను ప్రచురించే 'ఫెడరేటెడ్'ఇండియాను ఆనందముగా చదువువాణ్ణి. అతడు పరుగులాడే రాజకీయవాదిగాడు. ప్రజాహితవిషయాలనుగురించి చక్కగా మాగిన అభిప్రాయాలను ధైర్యముగా ప్రకటించే పెద్దమనిషి. గాంధీతత్త్వాలలో పడిపోయి ఈదేశములోని మతిమంతులు మతివంతులుగాని ఈదినాలలో శ్రీశాస్త్రులవారుకనుబరచు స్వతంత్ర్య అభిప్రాభిప్రాయాలు మనుష్యులవిషయంలోగానీ సంఘవాలవిషయంలోగాని ప్రత్యేకంగా మెచ్చుకోతగియున్నవి.

## 80

### యం. యస్. ఆణేగారు, బి. యల్., యం. యల్. ఏ. సెంట్రల్,

యోత్మాల్, బేరారు, సీ. పీ.

శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు నడుపుచుండు ప్రజారంజకమగు త్రిలిఙ్గపత్రికరజతోత్సవముజరుగనున్నదని విని చాలసంతసమయినది. జాతీయత, వైజ్ఞానికదేశభక్తి—ఈరెండు ఆదర్శములుగాగల కొద్దిపత్రికలలో త్రిలిఙ్గయొకటి. మద్రాసుకోస్తాలో ఇదితప్ప ఇంకొకటిలేదు. శ్రీశాస్త్రులవారి అభిరుచు లనంతములు అతనికార్యక్రమము బహుళము. వారు సంస్కృతవాఙ్మయానికి చేసినసేవ సుప్రసిద్ధము. లోకమాన్యబాలగంగాధర తిలకు గీతారహస్యమునకు ప్రకటించిన తెలుగు అనువాదము గోస్వామి తులసీదాసుని రామాయణభాషాంతరీకరణము ఇతరభాషలలోని ఉత్తమవాఙ్మయమునెడల వారికిగల ఆదరాభిమానములను వ్యక్తపరచుచున్నవి. తెలుగుభాషను ఇతరవాఙ్మయరత్నములతో వెలిగింపనున్న దీక్షను స్పష్టపరచుచున్నవి. వీరు ఫెడరేటెడ్ ఇండియాలో ప్రకటించే అభిప్రాయాలు దేశమంతటా జాగ్రత్తగా చదువుదురు. వట్టి ఊహాప్రపంచంలో ఆదర్శాలలో మునిగిపోయే రాజకీయపంథా వీరిదికాదు. కార్యరూపానికిదివచ్చునా అనేధోరణిని ధైర్యంగా గుద్దిచెప్పేవారుకావడంచేత వీరికి భారతీయపత్రికాప్రపంచంలో ప్రత్యేకంగా గణనీయస్థానం కలదు త్రిలిఙ్గ భవిష్యత్తున బహుకాలము వర్ధిల్లుగాక! శ్రీశాస్త్రులుగారికి చిరాయురారోగ్యములుకలిగి వారిసేవ నిరాతంకముగ సాగునుగాక!

## 81

### శ్రీ డాక్టర్: బి. యస్. మూంజిగారు, జనరలుసెక్రటరీ,

సెంట్రలు మిలిటరీ ఎజుకేషన్ సొసైటీ, భోంస్లా మిలిటరీస్కూల్, నాసిక్.

ప్రజారంజకమగు తెలుగువారపత్రిక త్రిలిఙ్గకు రజతోత్సవము జరుగనున్నదట! మహానాయకుడు శ్రీఎన్. సీ. కేల్కారు అధ్యక్షతవహింతురట! నాకింతకన్న కావలసినదేమి!

శ్రీలోకమాన్యతిలకమహాశయుని ఎత్తుకెత్తుసహాకారవిధానాన్ని అనుసరించేపత్రికలు పత్రికలో లేనేలేవనవచ్చును. త్రిలిఙ్గమాత్ర మున్నది. సముద్రాని కెదురీదుతూ ఈపత్రిక పని చేయుచుండడము చాలా గణింపదగినవిషయము. దాని కెల్లశుభంబులగుగాక!

## 82

### శ్రీ టీ. జి. ఖపర్డేగారు, బి. ఏ., యల్. యల్. బి., అడ్వొకేటు, యం. యల్. ఏ.,

మాజీమంత్రి, మధ్యపరగణాలు, అమరావతి, (బేరారు).

‘త్రిలిఙ్గ’ రజతోత్సవసందర్భమున త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాల సంపాదకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి అభినందాలు. వ్యాసాలుగల సన్మానసంపుటిని సమర్పింతురనివిని బహుసంతోషించితిని.

శ్రీశాస్త్రులవారు తనమాతృభూమికి—ముఖ్యముగా తెనుగుభూమికి—తనత్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాలమూలముగా చాలకాలముగ జాతీయతాప్రబోధముచేసి విశేష సేవచేసినారు. వీరు రాజకీయాలలో శ్రీతిలకుసిద్ధాంతానుకారులు గురువు నావరించి అంధకారబంధురముగ వివాదాలుసాగుతున్నపుడు చలింపకుండా వీరు గురువును నిలవబెట్టినారు. వీరివలె జయమే పరమావధియనుకోకుండా తానమ్మినసూత్రమువదలకపోరువారే ధీరులుగదా!

వీరును వీరితండ్రిన్నీ హిందూస్థానపు ప్రాచీనవాఙ్మయమునకుచేసిన అపారసేవ దేశాభిమానియగు ప్రతిహైందవుడును మెచ్చుకొనకతప్పదు. ఇటీవలనే నేను వీరిముద్రాశాలను చూచుభాగ్యము గల్గినది. అట చూచినది నాకు తృప్తిగొల్పినది. ఆసంస్థ నిర్మాణము, దక్షతతో కూడిననిర్వహణము ఉదాహరణప్రాయంగా ఉంది. వీరితో సహవాసముచేసినవారెవ్వరుకాని వీరి సౌహార్దాన్ని, నిరాడంబరత్వాన్ని, గాంభీర్యాన్ని గుర్తింపకనుండలేరు. విజయము వీరికి సమకూరినదంటే అర్హతనుబట్టే సమకూరినది. ఇంకను సమకూరుగాక! త్రిలిఙ్గరజతోత్సవముతలపెట్టిజరుపుచున్నందులకు మిమ్మభినందించుచున్నాను.

## 83

### శ్రీ రామరావు దేశముఖిగారు, బార్-అట్-లా, యం. యల్. ఏ., దీవాన్, సీ. పీ.

త్రిలిఙ్గరజతోత్సవమాదిగాగల పండుగలసమయాన నా అభినందనాలు ఆశీస్సులు అందజేయుచున్నాను. సంపాదకులును వారికార్యక్రమమున్ను బహుకాలము వర్ధిల్లుగాక!

ఈపిచ్చిగందరగోళపు ప్రపంచమున కుమార్గాలు, మిథ్యావాదాలు, సత్యాపభ్రంశాలు, ప్రజలను దారితప్పించడాలు మామూలయిపోయినది. ప్రజాస్వామ్యానికి మానవుడు ప్రేమించేదివ్యసత్యాలకు ఇవి మంచిదినాలుగావు. సమత్వదృష్టి పెట్టుకోడం చాల కష్టం కావడమేకాకుండా నిందార్హముకూడా అయినది. భారతనాయకాగ్రేసరులలో కడపటివారైన లోకమాన్యతిలకు "ఎత్తుకెత్తు సహకార" మనే స్థిరసూత్రాన్ని ప్రసాదించినాడు. నడవడికంతా అది సూత్రంగా అంగీకరించినా అంగీకరించకున్నా ప్రజాస్వామ్యానికి మాత్రము తప్పనిమార్గము. అట్లుండిన్నీ తాకితేనశించేవి,మిథ్యలుఅయినసిద్ధాంతాల కిప్పుడు కాలముగా ఉంది. ఈసిద్ధాంతమును అనుసరించేవారే దీనిని అంగీకరించడానికి వెనుదీస్తున్నారు.కొందరు సిద్ధాంతమంగీకరిస్తారుగాని దీనిచెప్పినవారి దేమిగొప్పయని ఆక్షేపిస్తారు ఇట్టి పిచ్చిప్రపంచంలోఉంటూ సమబుద్ధిపెట్టుకోవడం కష్టము. రాజకీయాలు, తత్త్వశాస్త్రాలు, సిద్ధాంతాలు వీనికినికరమయిన విలువగట్టడమూ కష్టమే. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు మాత్రము అట్టిసమబుద్ధిజ్ఞాపగల బహుకొద్దిమందిలో నొకరు. మహానాయకుడందిచ్చిన దివిటీని వెలుగుతగ్గకుండా పట్టుకోగలధీరులు. ఇట్టివ్యక్తికి అభివాదాలు చెప్పడమంటే నిజముగా గొప్పసంతోషం, గొప్పతృప్తి కాదు గొప్పగౌరవమే.

దైవము వీరికి చిరాయురైశ్వర్యాలిచ్చి మహానాయకునిపని తీర్చడానికి ఇతోధిక సేవచేసే అవకాశాలిచ్చుగాక! సత్యము జయించుగాక! నమ్మికతో ముందునడుతముగాక!

## 84

### శ్రీ జీ. వి. దేశముఖిగారు, బార్-ఎట్-లా, యం. యల్. ఏ.,
(సెంట్రలు), దంతోళి, నాగపూరు, (సీ. పీ.)

రజతోత్సవసందర్భమున త్రిలిజ్గకుచిరాయువుసుకోరుచున్నాను. ఇదిశ్రమతో చేరియేయుండగలదు. ఐశ్వర్యము బహుశః లేకపోవచ్చు. ఆంధ్రులను జీవితశాఖలన్నింటను ప్రబోధించుకార్యక్రమ మీపత్రిక పెట్టుకొన్నది. ఎన్నదగినంతవిజయముకూడ పొందినది.

దీని కీర్తిఅంతయు పండితులును దేశాభిమానియునైన సంపాదకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి చెందదగినది. ఆయన తనశక్తులను చాలద్రవ్యాన్ని ఇందుకయి వినియోగించినారు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తెలుగుభాషోద్ధరణకయిన్నీ సంస్కృత విజ్ఞానవ్యాప్తికయినస్పృహస్తపరహస్తాలుగా చాలా శ్రమచేసినారు.

వీరికి భాషోద్ధారకబిరుదు లభించినది.

నిజమాడదలచుకొంటే ఈయన జ్ఞానజ్యోతిని వెలిగించి ముందునడచే మార్గదర్శి. వీరి ఈప్సితము నెరవేరడానికి ఈశ్వరుడు వీరికి చిరాయువునిచ్చుగాత!

## 85

### శ్రీ పీ. సీ దాఙ్లేగారు, బి. ఏ., యల్. యల్. బీ, రాహురీ, అహమ్మదనగరుజిల్లా.

మద్రాసునకు చాలాదూరములో ఉండే అహమ్మదనగరం జిల్లానివాసిని నేను 'త్రిలిఙ్గ', 'ఫెడరేటెడ్ ఇండియా' ద్వారాను ఇతరత్రాను పండిత సంపాదకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు వాఙ్మయానికీ దేశానికీ చేసినసేవకు అభినందనాలందిచ్చే ఈశుభ ముహూర్తముకలిగినందుకు సంతసిస్తున్నాను. నేను శ్రీలోకమాన్యతిలకుని భక్తుణ్ణి. అందు చేత శ్రీతిలకుసిద్ధాంతానికిచెందిన ఈపెద్దల గౌరవించడమంటే నాకు ప్రత్యేకమానందం భారతావనిలోబుట్టిన ఆ ఉత్తమరాజనీతివేత్తను నేటి కందరూ అభిమానించుచున్నారు. ఇండియాస్వతంత్రమయ్యేవరకయినా ఆయనసిద్ధాంతమే శరణ్యము. కాని, ఆసిద్ధాంతాన్ని అనుసరిస్తామనేవాళ్లందరూ దాన్ని సత్యంగా అనుసరించడంలేదు. అదూరానఉండే మద్రాసు కోస్తాలో లోకమాన్యునిపంథావారు కొద్దిగనున్నారు. అందులో శ్రీశాస్త్రిగారు బాగా కనుపించేవారు. అయితే ఇపుడు మార్పవుతూ ఉంది. దేశమంతా మద్రాసుకోస్తాతో కూడా తిలకైటు అవుతూఉన్నది. హిందూమహాసభపొందుతుండే విజయము దీనికి తార్కాణము. ఈమార్పుకలిగిందంటే దీనికీర్తి చాలభాగము శ్రీశాస్త్రులవంటివ్యక్తులకు తప్పకుండా చెందదగినది. ఉత్తమనాయకుని నిర్యాణానంతరము అతనిసిద్ధాంతపువెలుగును నిలవబెట్టినవారు వీరేకదా!

శ్రీశాస్త్రులవారు పండితులు. సంస్కృతభాషా సుధారసలోలురు. మనప్రాచీన వాఙ్మయానికి మహాసేవచేసినవారు. హిందూవికాసానికి, తత్త్వానికి ఈయనచేసినమేలుకు భారతావనిఅంతయు కృతజ్ఞము. హిందూవికాసము, హిందూమతము, హిందూతత్త్వాన్ని పోషించడానికి ఈశ్వరుడీయనకు దీర్ఘాయువిచ్చుగాత! హిందూధర్మమునకు జయ్!

## 86

### రావుబహదూర్, యన్. కే. కేళ్కరుగారు, అడ్వొకేటు, బాలఘాటు, (సీ. పీ.)

త్రిలిఙ్గకురజతోత్సవము జరుగనున్నదనివిని సంతసించితిని. ఆసందర్భాన తాతా సాహెబ్ శ్రీకేళ్కరుగారు రధ్యక్షతవహించడ మింకా ఎక్కువ సంతోషకరము. నేను ఆ అవ

శాశానికి హాజరుకాలేనందుకు వగచుచున్నాను. నన్ను మన్నింతురుగాక! శ్రీ వేంకటేశ్వర శాస్త్రులవారిని వ్యక్తిగతముగా నేనెరుగను. అంతటిసమర్థులు దేశభక్తులునైనవారితో మైత్రికలుగడము ఒకగొప్పే. నాకు వారు పరిచయములేకపోయినా మొత్తముమీద వారు దేశానికిచేసినసేవనుగురించి ముఖ్యముగ పత్రికాముఖమున చేసినసేవ నాకు తెలియును కీ. శే॥ లోకమాన్యతిలకు పంథావారు వారని తెలియడముచేతనే ఆనందించినాను. వారిది వరలోసాధించినపనికి వారికి అభివందనాలు పంపుచున్నాను. ముందుకు వారికి శుభంబులగు గాక యని ప్రార్థించుచున్నాను. రజతోత్సవసందర్భమున త్రిలిఙ్గకు నాయాశీస్సులు. ఈపత్రిక చిరమువర్ధిల్లి ఇట్టిఉత్సవాలెన్నిటినైన గాంచుగాక!

## 87

### శ్రీ వేంకటరావు శిష్టాగారు, బొంబయి, ఆంధ్రమహాసభాధ్యక్షులు, దాదర్, బొంబయి.

త్రిలిఙ్గ చిరంజీవియగు తెలుగుపత్రికలలో నొకటి దానిరజతోత్సవసందర్భమున నాపరముగాను మాబొంబయి ఆంధ్రమహాసభపరముగాను సుప్రసిద్ధులైన తండ్రి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారు 85 ఏండ్లక్రిందట తెలుగువాఙ్మయప్రీతిచే నుపక్రమించిన కార్య క్రమాన్ని ఎంతోచక్కగా కొనసాగించిన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి కభివంద నాలుసమర్పించుచున్నాను.

మొత్తముమీద తెలుగుజాతికి అందులో ముఖ్యముగా వారిభాషకు వావిళ్లవంశము వారుచేసినమహోదారసేవను ఎరుగని ఆంధ్రుడు పెద్దలలోగాని పిన్నలలోగాని యెవ్వరును లేరు. అన్నిమూలలనున్న తెలుగువాళ్లందరికీ త్రిలిఙ్గపత్రిక వారిసభ్యతనువికాసాన్ని అంత పూర్ణముగాను పంచిపెట్టింది.

ఈపత్రికను ప్రోత్సహించడానికి ప్రతిఆంధ్రుడు గర్వపడవలెను. తనధర్మముగా ఎంచుకోవలెను. ఇందులోనిప్రతివ్యాసము సువర్ణాక్షరాలతో మనదివ్యసాంప్రదాయాలను చిరప్రతిభను స్మరింపజేస్తుంటుంది.

ఈరజతోత్సవసంచికకు ఆంధ్రవాఙ్మయవికాసోద్యమమునకు విజయమగుగాక!

## 88

### కె. యఫ్. నారిమన్‌గారు, యల్. యల్. బీ. యం. యల్. ఏ. కోర్టుహౌసు, బొంబయి.

కోట్లలెక్కగానుండే తెలుగుప్రజల జీవితవాఙ్మయాల అభివృద్ధి కుద్దేశింపబడి భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి సంపాదకత్వమున వెలువడు త్రిలిఙ్గ

పత్రికరజతోత్సవసమయమున వారినభినందించుటకు నేను సంతోషించుచున్నాను. వారు చిరస్థాయిగానుండగలఅట్లు పత్రికాప్రచురణసారస్వతాలలోచేసిన ఉద్యముడసేవ నాకు తెలుసును. వారిప్రయత్నముచేత ఒక్కటి స్పష్టమయింది. ముద్రణాలయం-వానిసంస్థరమారమి ఒక్కశతాబ్దముగ పనిచేయుచున్నట్లు తెలియుచున్నది. ఈదేశపుప్రజాహితజీవితములో ఎంత చక్కని ప్రయోజనమును సాధింపవచ్చునో వ్యక్తమయినది. త్రిలిఙ్గపత్రికను పాతికశతాబ్దముగ ఇంతవిజయవంతముగ నడిపి చేసిన వీరి సేవవిషయము దేశప్రజ ముఖ్యముగ తెలుగుదేశములోని నామిత్రులు వారికి చాల కృతజ్ఞులుగ నుండదగును. త్రిలిఙ్గకును తత్సంపాదకును శుభంబగుగాక!

## ౮౯

## శ్రీ ఆళూరు వేంకటరావుగారు, బి. ఏ., యల్. యల్. బీ. సాధన్‌కేరీ, ధార్వార్.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారిని నేను వ్యక్తిగతముగా ఎరుగను. కాని, అనేకసంవత్సరాలుగ ఉత్తరప్రత్యుత్తరాలమూలకముగాను, పెశరే బెడ్ ఇండియాపత్రికమూలకముగాను మాకిద్దరకును చాలాబాగాపరిచయముకలిగింది. 23 ఏండ్లక్రిందట శ్రీలోకమాన్యతిలకు తన గీతారహస్యానికి తెలుగుపరివర్తనము చేయడానికేర్పరచమని నన్ను కోరినప్పుడు తెనాలి వకీలు కీ. శే॥ పెద్దిభొట్ల లక్ష్మీనరసింహం, బి. ఏ., గారు ధార్వారులో నాఅతిథిగానుండి వెంటనే శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని దేశభక్తిగల ముద్రాపకులు ప్రచురణకర్తలని సలహాచేసిరి. అనేకమాసములకాలము గీతారహస్యపు నాకన్నడభాషాంతరీకరణము అచ్చయినఫారాలు వారికి పంపుచుంటిని. మరాఠీకంటె ఆప్రాంతాలలో కన్నడమే సులభతరముగా అర్థముకావడముచేత శ్రీలక్ష్మీనరసింహంగారు చూచుకోవడానికి కన్నడమునే కోరిరి. కాని, నాకు బాగా జ్ఞాపకమున్నది. కన్నడప్రచారకులు నాకన్నడము పూర్తిచేసే దానికిముందే శ్రీ శాస్త్రులవారు తెలుగుపరివర్తనము పూర్తిచేసి ప్రకటించిరి.

నన్నుగురించీన్ని కర్నాటకాన్నిగురించీన్ని వారువ్రాసే సంపాదకీయాలు నేను చదివిన మీదట వారికి ప్రాంతాభిమానాతీత్వము ఎంతకలదో అర్థమయినది. సోదరరాష్ట్రములవారి కెంతసానుభూతిచూపగలరో తేటపడింది.

కొన్ని ఆంధ్రసారస్వతసమావేశాలు జాతీయసమావేశాలకు నేను హాజరయినాను. అందుచేత సంతోషపూర్వకముగా ఆంధ్రులెంత అభివృద్ధిఅయినది గుర్తించినాను. ఈయభినందనాస్ని శ్రీశాస్త్రులవారియెడల వ్రాస్తున్నానంటే ఆంధ్రాభివృద్ధిని సూచించడముగావున ఆంధ్రులను మరిమరిఅభినందించుచున్నాను.

## 90

### దివాన్‌బహాదరు సి యస్. రత్నసభాపతిమొదలారిగారు, కోయంబత్తూరు.

త్రిలిఙ్గరజతోత్సవము జరుగనున్నదనియు తత్పత్రికకు సుప్రసిద్ధసంపాదకులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని సమ్మానింతురనియు విని చాలసంతసించితిని. ఈదేశములో ఇట్టియుత్సవాదులు తఱుచు జరుగుటలేదు. పత్రికాప్రచురణయంటె మనకు సముద్రానికెదురుఈదడమే పత్రికానిర్వహణానికి ఎంతో ఓపిక ఎంతో శ్రద్ధ ఆవశ్యకము. అందుచేత ఈసన్మానము గణనీయమయినది. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును, త్రిలిఙ్గయు సాంప్రదాయకములు. తండ్రితాతలనుండి తరతరముగావచ్చేసంస్థ వీరిది కాబట్టి ఈసంస్థకు ముందు విజయము నిత్యము శ్రీశాస్త్రులవారికిని వారిఅనుంగుబిడ్డ త్రిలిఙ్గకును హృదయపూర్వకాశీస్సులు. ఈపత్రిక చిరస్థాయియయి మహత్తరసేవచేయుగాక!

## 91

### జె. నట్టాల్ ఎస్క్వ్యయర్, యం. యల్. ఏ, ప్రెసిడెంటు,

మదరాసు ఛేంబరు ఆఫ్ కామర్సు; మానేజింగుడైరెక్టరు, బిన్నీ అండ్ కంపెనీ, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి అభినందనాలు వ్యాసాలుగల సమ్మానసంపుటి సమర్పింతురనివిని కుతూహలపడితిని. ఈకోస్తాలోని తెలుగుభాషాపుత్రులకయి శ్రీశాస్త్రులవారు గొప్పసేవచేసినారు. ఆయనకార్యపరత్వానికి ఆయనవారపత్రిక త్రిలిఙ్గే సాక్ష్యము.

'ఫెడరేటెడ్ ఇండియా'నుగురించి గర్వపడతగియున్నది. అందులో నెప్పుడును నిష్పాక్షికాభిప్రాయాలే ప్రకటితమగును. శ్రీశాస్త్రులవారు విశాలహృదయులు. వారి ప్రజాహితజీవనము చూస్తే నాకెప్పుడూముచ్చటవేసేది.

## 92

### జి. హెచ్. హాడ్గుసన్, ఎస్క్వ్యయర్, యం. యల్. ఏ., మేనేజింగు డైరెక్టర్,

ప్యారీ అండు కంపెనీ లిమిటెడ్, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున మీరును మిత్రులును శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి సన్మానసంపుటిసమర్పింపగలరనివిని సంతోషమయినది.

తెలుగుపత్రికాచరిత్రలో త్రిలిఙ్గకు ప్రముఖస్థానము గలదు. దానినిగురించి చాలామందిప్రశంసను విన్నాను.

ఫెడరేటెడ్ ఇండియావిషయము నాకు బాగా తెలుసును. దాని చాలకాలముగా నేనెరుగుదును. చదువరులు అనేకులు ఈపత్రికలోని చక్కనివివేచనాయుతాభిప్రాయాలను చదివి ఆనందించినారు.

ఈకోస్తాలో శ్రీశాస్త్రులవారు వాఙ్మయసేవ, పత్రికాసేవ చక్కగా చేసినారు. వారికి వారిప్రచురణములకు నిరంతరశుభంబగుగాక!

## 93

## జి. ఈ. వాకర్, ఎస్క్వాయర్, యం. యల్. ఏ.,

మద్రాసు యిరోపియన్ ఛేంబరు ఆఫ్ కామర్సు, మద్రాసు.

దక్షిణఇండియాలో పత్రికాప్రచురణసేవలో సుప్రసిద్ధులై విస్తారముగా గౌరవము పొందే శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సన్మానసంపుటి సబహుమానముగా ఇవ్వ దలంచిన మీయుద్దేశానికి నేను సంతోషించుచున్నాను.

వారికి వారికిసంబంధించినపత్రికలకు ఇకముందెల్లప్పుడు మహత్తరవిజయమగుగాక అని హృదయపూర్వకముగ కోరుచున్నాను.

## 94

## రావుబహదూర్ శ్రీ సీ గోపాలమీనన్‌గారు,

కెడిల్‌స్టన్, పార్‌థియన్ రోడ్డు, ఎగ్మూరు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు పచ్చయప్పకళాశాలలో విద్యార్థిగనున్న నాటినుంచి 35 ఏండ్లుగ నేనతన్నెరుగుదును. వారు వ్యాపారవిద్యలో నావద్ద తరిబీతయిరి. అప్పుడు నేను చెంగల్వరాయనాయకరు వ్యాపారవిద్యాశాల సూపరింటెండెంటును,వ్యాపార విద్యాబోధకుడను. వారు బాలుడయియుండగానే తనతండ్రి శ్రీరామస్వామిశాస్త్రులవారి గ్రంథప్రచురణ ముఖ్యముగాఆంధ్రగ్రంథప్రచురణ సంస్థలో చేరవలెననియే అతని యూహ. తదనుగుణంగా ఆట్టిపనికి అర్హుడుకావడానికి వట్టివ్యాపారశక్తి ఒక్కటేయుంటే చాలదని వ్యాపారవిజ్ఞానముకూడా ఉండవలెనని అతనికి తోచినది. అందుచేత వ్యాపార విద్యాలయంలో ఆయన శిక్షణపొందినాడు. ఆతరిబీతు పూర్తిఅవుతూనే తండ్రిగారి కార్యక్రమములో ఈయన శ్రద్ధచూపుట కారంభించినాడు. వారు గతించినపిదప సర్వనిర్వ హణాధికారము వీరు స్వీకరించినారు. సంస్కృతము, తెలుగు, అరవములలో గ్రంథ ప్రచురణచేయడముతో వీరు సంతృప్తిపడలేదు. ప్రజారంజకమగు వారపత్రిక త్రిలిజ్ఞను

తెలుగులోను, ఫెడరేటెడ్ ఇండియాను ఇంగ్లీషులోను, స్థాపించిరి. నేను వారి ఇంగ్లీషు పత్రిక చదివేవాడను. భారతభూమిలోని ఉత్తమపత్రికలలోనిదియొక్కటి. విమర్శచేయ వలసినచోట ఈయన చక్కగావిమర్శించును.

పత్రికాసేవ వాఙ్మయసేవలుమాత్రమే శ్రీశాస్త్రులవారి నభినందించుటకు కారణాలను కావలదు. వీరిరాజకీయప్రజాసేవయు గణింపదగినవి. ఇండియాలో అగ్రగణ్యసంస్థగానుండిన మద్రాసుమహాజనసభలో వీరు సభ్యులుగానుండిరి. ఆద్వారా వీరనేకదేశీయమహాసభలకు హాజరైరి. రాజకీయముగా ఈయన జాతీయవాది. రాజ్యాంగానికి లోబడి ఆందోళనచేసి స్వాతంత్ర్యాలు సంపాదింపనగునని వీరి గట్టివిశ్వాసము. వీరికి వ్యాపారసంఘాలతో-దక్షిణ ఇండియావ్యాపారసంఘం, ఆంధ్రవ్యాపారసంఘం—వీనితో సంబంధము కలదు. కొంత కాలము వీరు పచ్చయప్పధర్మాలకు ధర్మకర్త. కొంతకాలము మద్రాసు కార్పొరేషనులో సభ్యులు. ఇంకా ఈయన బహుకాలము ప్రజాహితజీవనము గడుపదగినవాడు. తాను అను కొన్నమిత్రులలో పనిచేయుటకు మంచిఅర్హుడు. అతనిభవిష్యత్తు శుభప్రదంబగుగాక !

## 95

### గా॥ శ్రీ నారాయణదాసు గిరిధరదాసుగారు, మదరాసు.

తెలుగువారపత్రిక 'త్రిలిఙ్గ' రజతోత్సవమురానున్నది. అప్పుడు శ్రీ వావిళ్ల వేంక టేశ్వరశాస్త్రులుగారికి సన్మానసంపుటి సమర్పింతురు. దానిలో చేర్చడానికి నాఅభినందాలు పంపుటకు కుతూహలపడుచున్నాను. తెలుగుభాషకు వాఙ్మయానికి వారుచేసిన అపారమగు నూడిగము జగత్ప్రసిద్ధము. వారికి సంస్కృతమంటె నెక్కడలేని ప్రీతి. ఆంధ్రుల ఆర్థిక సాంఘికలాభాలకై త్రిలిఙ్గ శ్రమచేసినది. ఇతరప్రాంతాలలోని తెలుగువారిమేలును సాధించింది. ఇరువదేండ్లకుపైబడి శ్రీశాస్త్రులవారికి నాకు దగ్గరిస్నేహము. వారి స్నేహపాత్రత మూలకముగా నేడు మహదానందముతో నేను వారినభినందించుచున్నాను.

నామిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని వారిత్రిలిఙ్గకును చిరాయు రైశ్వర్యము లగునుగాకఅని హృదయపూర్వకముగ కోరుచున్నాను.

## 96

### దివాన్‌బహాదరు శ్రీ జి. నారాయణస్వామిచెట్టిగారు, సి. ఐ. ఈ, మదరాసు.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారినిగురించి నాలుగుముచ్చటమాటలు వ్రాయడము నాకు మిక్కిలిసంతోషప్రదము. శ్రీవావిళ్లరామస్వామిశాస్త్రులుఅండ్‌సన్స్‌సంస్థకు వీరేకైక

యుజమాని. తెనుగువాఙ్మయములోని ఉద్గ్రంథాలను చక్కగ ప్రకటించి తెనుగుభాషకు సభ్యతకు అత్యంతోపకారముచేసినారు. ఆయన ఫెడరేటెడ్ ఇండియా అనే ఇంగ్లీషు పత్రికకు సంపాదకులు. కార్యపరము వివేచనాయుతములయిన వ్యాఖ్యలకాపత్రిక ప్రసిద్ధి గన్నది. నగరములోని అనేక ప్రజాహితసంస్థలతో వారికి సంబంధముకలదు. అందులో వీరు చేసినసేవకు ప్రజలు కృతజ్ఞులుగానుండదగును. ముందు నిండుకాలము ఇంకాఎక్కువసేవ చేయడానికి చిరాయువగుగాక!

## 97

### శ్రీ జనాబ్ యూసుఫ్ సేట్, బహదరు, బి. ఏ., మద్రాసు.

పత్రికానిర్వహణ మీకాలంలో కష్టతమము అట్టియుగములో కదలక నిలిచియుండే ఒకపత్రికకు రజతోత్సవమంటే ఆనందింపదగినది. ముందుబోతే బావి వెనుకకుపోతే గొయ్యిగానుండే పరిస్థితులను తప్పించుకొని జాతీయతయూ ప్రత్యేకసాంఘికతత్త్వమూ స్వయంపూర్ణత్వమూ సర్వమానవసంబంధమూ అను సుడిగుండాలను తప్పించుకొని పత్రిక నడపడమంటె చాలా గొప్పసమయస్ఫూర్తి చాకచక్యము కలిగియుండవలెను. త్రిలిఙ్గ విజయవంతముగా ప్రయాణము సాగించి మైలురాయి చేరింది. దీనికి నామిత్రులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి తొణకనిప్రతిభే ఇందుకు కారణము ఈపత్రిక చిరస్థాయిగ్రైు దేశ సేవను సాగించుగాక!

## 98

### శ్రీ పి. సీతారామశెట్టిగారు, ఛేర్మన్, మునిసిపలు కౌన్సిలు, సేలం.

అనేక తెనుగుసంస్కృతగ్రంథాలను చక్కగస్ఖాలిత్యరహితముగా ప్రకటించడములో శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండుసన్స్ వారిసేవ గణనీయము. ఈప్రచురణాలు బహు కాలముగా లోకమునెదుట నున్నవి. వీని నెప్పుడు ఒరపెట్టనేల!

వీరు ప్రాచీనవాఙ్మయానికిచేసినయూడిగానికి లోకము వీరికి చాలఋణపడియున్నది. ఈసంస్థ యెల్లరమన్ననలను కొల్లగొనదగినది.

## 99

## శ్రీ యం. వీ. గోపాలశెట్టిగారు, సెక్రటరీ,

సేలం ఛేంబరు ఆఫ్ కామర్సు, మునిసిపల్ కౌన్సిలరు, సేలం.

పండితుడు గ్రంథకర్త పత్రికారచయిత రాజకీయవేత్త వ్యాపారపారీణుడు ఆంధ్రదేశభక్తుడునగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి అభినందనమునర్పించుట నా భాగ్యము. మంచికి నిష్కల్మషత్వానికి అభివృద్ధికి ప్రయోజనానికి గాంభీర్యానికి ఈయన భారతావనిలో ప్రఖ్యాతుడు.

వీరిని ఎరిగినవారెవ్వరును వీరిని ప్రేమించకయుండలేరు. ఈవశీకరణయోగాని నేను తప్పించుకొన్నవాణ్ణిగాదు. తల్లిభారతభూమిలో అతడు కావించినకార్యములు అనేకములు, విస్తారములు. అందులో ఆంధ్రదేశవిషయములో చెప్పనే అక్కరలేదు. వీరిగౌరవార్థము ప్రజాపరముగా సమ్మానసంపుటి తయారుచేయుచున్నారంటె దాన్నిసమర్థింపవలసిన పనీలేదు. అందుకని వీరుచేసినఅపారసేవనువర్ణింపనూ పనిలేదు.

గోల్డుస్మిత్తు (స్వర్ణకారుడు)వలె ఈయన తాకిందంతా బంగారమే చేసినాడు. అందువల్ల ప్రజలహృదయాలలో సారస్వతజీవిగా ఈయనకసమానస్థానమేర్పడింది అని చెప్పితే చాలు. ఈకీర్తితోకూడా ఈయన సుహృదయుడు ప్రేమపాత్రుడు నమ్రుడు స్నేహావర్ధిష్ణుడు అనేప్రఖ్యాతిని గడించినాడు. ఇతడొకరిని ఆగ్రహపరచనూలేదు. ఇతనింకొకరియెడ నాగ్రహపడనూలేదు ఈగుణము ప్రజాహితజీవులకుండేదికాదు. అందరినీ ప్రేమిస్తూ అందరిచేత ప్రేమనుపొందే ప్రత్యేకత్వము ఇతనికొకనికే దక్కింది.

ఇతనిదృక్పథము ఉదారము. జగద్వ్యాప్తిగలది. ఇతని మర్యాద అప్రతిమానము. ఇతడెల్లప్పుడు జ్ఞాపకముంచుకొనదగినవాడు. మనఅభినందముల కర్హుడు.

## 100

## శ్రీ కొత్తూరు రంగనాయకులుశెట్టిగారు, మర్చెంటు, మదరాసు.

త్రిలిఙ్గరజతోత్సవము జరుపడానికి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఈకోస్తాలో తెలుగుసంస్కృతవాఙ్మయాలుకు చేసినసేవకై వారినభినందించడానికి చేసినయేర్పాటు చాల కొనియాడదగినది. శ్రీశాస్త్రులవారును సుప్రసిద్ధులయిన వారితండ్రి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారును తమవాఙ్మయసేవచే లోకానికి మహదుపకారము చేసినారు, కృతజ్ఞముగావించినారు.

శ్రీశాస్త్రులవారి కీశ్వరుడు శుభమునిచ్చుగాక అని ఈతరుణమున హృదయపూర్వ కముగ ప్రార్థించుచున్నాను.

## 101

### శ్రీ హెచ్. డీ. రాజాగారు, మేనేజరు, వాన్‌గార్డుఇన్‌ష్యూరెన్సుకంపెనీ, మద్రాసు.

కడచిన 10 ఏండ్లుగా నేను శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారినెరుగుదును. వీరు తెలుగు సంస్కృతవాఙ్మయాలకు చేసినసేవ అపారము. విలువకట్టరానిది. వీరు కనుపరచిన శ్రద్ధ భక్తియుత్సాహములు దొరకనియెడల ఎన్నోప్రసిద్ధగ్రంథాలు మూలనపడిపోయి యుండును.

నిరాడంబరుడు సుహృదుడు నిగర్వి శ్రీశాస్త్రులవారిపరిచితులందరికి ప్రియుడు. చక్కని ప్రతిభాశాలియైనందున మనుష్యులయోగ్యతాయోగ్యతలను ఇతడు గురిగానిర్ణ యించుకోగలడు. చాలాచిక్కులలో పడిపోయేమద్రాసులోని వాఙ్మయజీవులకు పత్రికా రచయితకు ఈయన చాలసహాయపడువాడు. మంచిపనికిదేనికైనాసరే ఈయన దేశభక్తి మయి తోడ్పడువాడు.

శ్రీశాస్త్రులవారు తెలుగువారపత్రిక త్రిలిఙ్గ, ఇంగ్లీషులో ఫెడరేటెడ్ ఇండియా రెండూనడుపుచున్నారు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున దానికి నాయభినందనాలు.

శ్రీశాస్త్రులవారికి నానతులు. వారికి చిరాయువును విజయంబునునగుగాక!

## 102

### శ్రీ ఏ. వరదప్పశెట్టిగారు, ఆనరరీప్రెసిడెన్సీమేజస్ట్రేటు,
దక్షిణమాడవీథి, మైలాపూరు, మద్రాసు.

ఆంధ్రా రాజకీయచరిత్ర వ్రాసేటప్పుడు దీని రాజకీయపరిణామాన్ని దిద్దడానికి త్రిలిఙ్గయును దాని ఎడిటర్ శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును చేసినసేవకు ప్రముఖ స్థానం ఇచ్చితీరవలసిఉంటుంది. మొత్తముమీద ఆంధ్రాకున్నూ ప్రత్యేకముగా మద్రాసు కున్నూ శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారుచేసిన లెక్కలేని ఉపకారాలను వర్ణించడము కష్టము. ఆంధ్రఛేంబర్ ఆఫ్ కామర్సు అనేది ఒకటున్నదంటె అతడే కారణము. ఈశాఖలో శ్రీశాస్త్రులవారాంధ్రులకత్యంతవిలువగల సేవచేసినారు. శ్రీశాస్త్రులవారికంటె గాఢపండితుడు రాజనీతివేత్త, రాజకీయసేవకుడు మరియొకరిని కనిపెట్టడము కష్టము. సర్వోత్కృష్టుడు, సర్వజ్ఞుడు

ఆయిన ఈశ్వరుడు శాస్త్రులవారిపై సర్వకల్యాణములను గురిపించి వారు మాతృదేశానికి చేసేసేవ నిరంతరాయముగా జరుగడానికి వారికి చిరాయువొసంగుగాక అని ప్రార్థించు చున్నాను.

## 103

### శ్రీ వి. యమ్. బాలసుబ్రమణ్యమొదలియారుగారు, బి. ఏ, బి. యల్.,

60 కొల్లావారిఅగ్రహారము, తండియార్పేట, మద్రాసు.

త్రిలిజ్గరజతోత్సవం త్వరలో జరుగుతుందని విని సంతసించితిని. ఈసందర్భాన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి కభినందనాలు. వారికి చిరాయురారోగ్యాల వారిత్రిలిజ్గకు స్వర్ణోత్సవవజ్రోత్సవములు జరుపగలట్లు ప్రసాదించునుగాక యని దేవుని ప్రార్థించు చున్నాను.

ఈ సందర్భాన శ్రీశాస్త్రులవారిసేవ నుగ్గడించడము అప్రస్తుతముకాదు కార్మికులపర ముగా ఈయన కానరానినిరాడంబరసేవ చేసినాడు. కార్మికులకు యజమానులకు వివాదాలు వచ్చినప్పుడు ఈయన పంచాయతీదారుగ పనిచేసినది నాకు తెలుసును. ఎప్పుడూ సమాధానము కుదుర్చి ఈనగరంలోను బయటను అనేకులు కార్మికులకు సాయపడినాడు. ఎప్పుడూ చప్పట్ల జనరంజకత్వాని కీయన బారలుచాచువాడు కాడు. తనచేత ఏప్రజాహిత కార్యమున్నా తటస్థంగాతీర్చి కనిపించకుండాదూరమవుతాడు.

అతని ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియాలో వ్యక్తులసంబంధంగాను వ్యవహారాల సందర్భముగాను ఈయనవ్రాసేవ్యాఖ్యానము న్యాయముగాను నిజాయితిగాను ఉంటుంది. హృదయపూర్వకము. నిష్కల్మషముఅయిన అభిప్రాయాలయినందున నే యెల్లప్పుడు వాటిని చాల గౌరవింతును.

## 104

### గా॥ శ్రీయం. సీటీ. యం. చిదంబరంచెట్టియార్, చెఫ్ఫ్రస్టుహౌవుసు, వేపేరి, మద్రాసు.

త్రిలిజ్గరజతోత్సవం త్వరలో జరుగుతుందని సంతోషిస్తున్నాను. తెలుగుదేశస్థులు ఈతెలుగుపత్రికను చాల గౌరవంతో చూస్తారు. ఈగొప్పతనానికి కారణము దాని ఎడిటరు గొప్పపండితులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుగానుండుట. వాఙ్మయానికీ పత్రికా ప్రచురణానికీ తెలుగులో ఇంగ్లీషులో రెంటా ఇండియాలో వీరుచేసినఉపకారము చాలవిస్తా రము ప్రయోజనకరము. ఆరోగ్యైశ్వర్యాలతో చేరిన చిరాయువు పరమాత్ముడు వీరికిచ్చు గాక! పత్రికారచన శ్రీశాస్త్రులవారిసహాయసంపత్తి చిరకాలముపొందుగాక!!

## 105

## ఖాన్ బహాదరు మహమ్మదుసాదుల్లా సాహెబ్ బహాదరుగారు.

మద్రాసు లెజిస్లేటివుకౌన్సిలు మాజీమెంబరు, ఫాక్ స్టైడ్, 9, రండల్సురోడ్డు, వేపేరి, మద్రాసు.

రజతోత్సవసమయాన త్రిలిఙ్గ కభినందనాలు పంపడమంటె నాకు చాలా సంతోషంగా ఉంది ఇది ముద్రణాశాసనపుకాలము; విపరీతపురాజకీయవివాదాలయుగం. ఏపత్రిక గూడ గండంగడచి ప్రయాణంలో ఒకమెట్టుచేరడం కష్టం. చాలప్రయోజకత్త్వముతో గూడ ప్రజారంజకత్త్వాన్ని సంపాదించిన త్రిలిఙ్గను ఆకారణంచేత హృదయపూర్వకముగ అభినందిస్తున్నాను.

నాగౌరవమిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిప్రాయసత్త్వము నాయకత్త్వాలక్రింద ఈపత్రిక నిరంతరశుభం బడయుగాక!

## 106

## శ్రీ యన్. రామరావుగారు, బి. ఏ., బి. యల్.,

యునైటెడ్ ఇండియా ఫైర్ అందు జనరలు ఇన్షూరెన్సుకంపెనీ లిమిటెడ్, ఎస్ప్లనేడ్, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవము జరపడానికిని కడచిన 25 ఏండ్లుగా శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చేసినప్రజాహితమునకై వారికి చెందతగిన అభినందనాలతోచేరిన సమ్మానసంపుటిని వారికిసమర్పించడానికిని ఏర్పాటులగుచున్నవని విని యానందించితిని. మీయుద్దేశానికి విస్తారమయినసహాయముండునని నావిశ్వాసము.

నాకు శ్రీశాస్త్రులవారు అనేకసంవత్సరాలుగ పరిచయము. వారనేకముఖములుగ జరిపే కార్యక్రమాన్ని శ్రద్ధతోను ఎక్కువగౌరవముతోను కనిపెట్టియున్నాను. వారికి విద్యాసంస్థలతో గలసంబంధమును వారందులకయిచేయుశ్రద్ధయు లోకానికి బాగాతెలిసినవే. వీరు యజమానులుగానుండే ప్రచురణసంస్థవారు తెలుగులో చాల నుపయుక్తము అపురూపములయిన అనేకరకాలగ్రంథాలు అచ్చువేసి ప్రకటించినారు. వీరు పూర్ణతేజస్సుకలవారుగానుండడం సంతోషింపదగినవిషయము వీరిదివ్యారోగ్యముకూడాఉంది. వీరి ఉపయుక్తసేవను సాగించడానికి వీరికీశ్వరుడు చిరాయువును ప్రసాదించును గాక అని హృదయపూర్వకముగ ప్రార్థించుచున్నాను.

## 107

### రావుసాహెబ్ యం. బి. కృష్ణయ్యశెట్టిగారు, యఫ్. టి. యస్., ఇనాందారు,

ఆనరరీ బెంచిమేజస్ట్రేటుకోర్టుఅధ్యక్షులు,

ధర్మపురి సబ్ జెయిలు నాన్ అఫిషలు విజిటరు, పాలకోడు, సేలంజిల్లా.

త్రిలిజ్గిలో ప్రసిద్ధపురుషుల మంచివ్యాసములు అనేకములు కలవు. దీనికి నాకు పరమ సంతోషము. ఈవారపత్రిక వైజ్ఞానికముగాచేయడానికి సంపాదకులు శ్రద్ధవూనుచున్నారు. దీనికి మహద్విజయమగుగాక!

## 108

### రాజసేవాసక్త దివాన్‌బహదూరు డాక్టరు యస్. కృష్ణస్వామిఅయ్యంగారుగారు,

ఎం. ఏ., పి. ఎచ్ డి (గౌరవ), ఎఫ్. ఏ.; ఎస్, బీ "శ్రీపాదము" బ్రాడీసురోడ్డు, మైలాపూరు, మద్రాసు.

తనతండ్రిసాహసముచేస్థాపితమయి ప్రాచీనప్రచురణసంస్థలలో పేరెన్నికపొంది యుండు తెలుగు, సంస్కృతప్రచురణసంస్థకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు యజమాని. శ్రీమద్రామాయణమునేగాక అన్ని తెలుగు, సంస్కృతగ్రంథాలు నిర్దుష్టముగాను చక్కగాను తెలుగు, గ్రంథలిపులలో ప్రకటించి దక్షిణఇండియాను తనకు ఋణపడజేసికొనినారు. వీరితండ్రి శ్రీ వావిళ్ల, రామస్వామిశాస్త్రులవారు. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులగారి యాజమాన్యమారంభమగునాటికే ఈసంస్థ చక్కనిపేరు సంపాదించుకొన్నది తండ్రిచేసినసత్కార్యాన్ని కుమారుడు సాగించడమేగాక చాల విస్తృతముగూడ చేసినాడు. తెలుగుతోమాత్రము తృప్తిచెందక ఈయన దేవనాగరిలోను ఇతర దక్షిణఇండియాలిపులలోను వీరు అచ్చువేయుట నడిపినారు. సారస్వతగ్రంథప్రచురణతోనేనిలువక వీరు ఇటీవల అరవము, తెలుగు, సంస్కృతములలో అనేక జనోపయోగమగుపుస్తకాలు, బళ్లపుస్తకాలు ప్రకటించినారు. బాగాచదువడానికి పనికివచ్చేపుస్తకాలు ముద్దుగాఅచ్చువేసి తయారుచేసినవి అరవములో రమారమి 50 వరకు వీరు ప్రకటించినారు ఇట్టివి తెలుగులో 500 ఉండును. అనుదినోపయోగానికి చేతపట్టుకొని పోవడానికి వీలైనఆకారంలో అనేకసంస్కృతగ్రంథాలు వీరు వేసినారు. ఇటీవల వీరు చాలా గొప్ప ప్రయత్నమారంభించిరి. దివ్యముగా పరిష్కరించి భారతరామాయణాలకు దక్షిణఇండియా అధికారయుతపాఠములు ప్రకటింపనిశ్చయించిరి. మహాభారత మిప్పటికి ప్రకటితమైనది రామాయణమును అట్లె ప్రకటితమగునుగాక అని విశ్వసింపదగియున్నది. ఈసంస్థవారే

త్రిలిఙ్గరజతోత్సవము

తెలుగువారపత్రిక త్రిలిఙ్గను ప్రకటించుచున్నారు. ఆపత్రికకే ఈరజతోత్సవము జరుగు చున్నది.

ఈసారస్వత విద్యాప్రబోధవిషయాలలోనేగాక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు రాజకీయాది ఇతరప్రజాహితజీవితములోను పాలుపుచ్చుకొనుచున్నారు. ఫెడరేటెడ్ ఇండియా అనుమాసపత్రిక నారంభించి విజయవంతముగా సాగించుచున్నారు. వీరికి చిర కాల మీవిధసేవనుచేయడానికి వీరికి ఆయురారోగ్యావకాశాలు సమకూరుగాక!

## 109

## శ్రీ రావుబహదూర్ ఆర్. కృష్ణరావుభోంస్లేగారు, ఐ. యస్. వో,

గవర్నమెంటుపరీక్షల కమీషనరునకు కార్యదర్శి, మద్రాసు యూనివర్సిటీసెనేటు, అకడెమిక్ కౌన్సిల్ల మెంబరు, గౌ॥ జిల్లాస్కౌటుకమీషనరు, "స్ట్రోక్ గిఫ్టు", త్యాగరాయనగరు', మద్రాసు.

మూర్ఛదేల్పేది చిరాయువునిచ్చేది "సంజీవి"అనేమూలిక. జరామరణరాహిత్యాన్ని కలుగజేసేది "అమృతము." మహామహోపాధ్యాయ డాక్టరు: వీ స్వామినాథయ్య,డీ.లిట్ గొప్పపండితులు. శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు వీరిరువురును అరవము తెలుగులకు సంజీవి వంటివారు. వీరు ప్రాచీనవాఙ్మయములోనికి త్రవ్వి అందులోనుండి వజ్రపుతునకలను పైకి లాగికొనివచ్చినారు. వారి అత్యంతపాండిత్యము నిరంతరశ్రద్ధ అప్రతిమానపరిశ్రమలింత ప్రతిఫలించి ప్రకాశించును.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ 1856 లో స్థాపితమయ్యెను. రామా యణమహాభారతాలచ్చువేయడములో వారే మొదటివారు. వీటిప్రతులు ఏనుగలమీద అంబారీలలోపెట్టి మంగళవాద్యాలతో పూర్వము నూరేగింపబడినవి.

శ్రోత్రియమువారు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తండ్రిఅనే ప్రాతవజ్రము లోనుంచియూడిపడిన చక్కనివజ్రపుతునుక. తాళపత్రాలఅడవిలోనుంచి చెదలు తిని పోకుండా రామబాణాలమూలకముగా నశింపయిపోకుండా అనేకసద్గ్రంథాల నీయన బయటికి తీసినాడు.

సంస్కృతములో 'పుస్తకం హస్తభూషణం' అనుసూక్తి యున్నది. సరస్వతీదేవి కుడి చేత తాటియాకులసంపుట మొక్కటి ధరించునట్లు చిత్రింతురు. ఆయమ చదువులకు దేవత. కోరువారికి విద్యనిచ్చునది. జర్మోల్డుపండితుడు పుస్తకము గొప్పసహవాసి యనియె. చక్క గా ఏర్పరచుకొందుమేని గ్రంథముజీవితాంతమువరకు మనకుతోడిమిత్రము.

నవీయను ఇంగ్లీషుకవి యన్నాడుగదా
గ్రంథముల్ నాకు జారని గట్టిచెలులు
మాటమంతుల వారితో మనుదు నెపుడు
సుఖము కలిగినవారితో చూరగొందు
దుఃఖమయినను వారితో తొలగద్రోతు.

ఒకప్పుడు అఖండపండితులు మాక్సుమ్యూలరను గోతీర్థవాసి (ఆక్సుఫర్డు రెసిడెంటు, ఆక్సు=గో, ఫర్డు=తీర్థము, రెసిడెంటు = వాసి). ఆయన మోక్షమూలభట్టాచార్య అంటె ఆయన ఉప్పొంగిపోయినాడు. ఋగ్వేదమునుసంపాదించి ప్రకటించడానికి ఆయనకు కుంపిణీవారు 40 వేలసవరనులిచ్చిరి. శ్రీకృష్ణదేవరాయలిప్పుడు బ్రతికియుండి శ్రీవావిళ్లవారిని పోషించగలిగితే యెంతబాగుండేది! తెలుగువాళ్లు మంచి కార్యసాహసులు అక్బరుపాదుషా కొలువునలంకరించిన ఆబిర్బల్ మహనీయుడు గోదావరితీరవాసియైన తెలుగువాడు.

అచ్చయినగ్రంథము వరప్రసాదమువంటిది ఉపయోగకరమయిన పుస్తకాలువేయువారు ప్రజానీకానికి గొప్పసేవచేసేవారు 'ఇండియాగతం'లో మాక్డొనాల్డుపండితుడు ఈ దేశములో ప్రాచీనవాఙ్మయమంతయు వాచకమాత్రంగానే ఉండిందని వ్రాస్తాడు. పండితులైన పురోహితులమెదళ్లే ఆనాళ్లలో గ్రంథాలయాలు. ఈవాచకసాంప్రదాయమువల్ల చదువుకోదలచినవాడొక్కొక్కడు గురువు నాశ్రయించి వినికిడివల్ల నేర్చుకోవలసినదని యేర్పడినది. ఆదినాలుపోయినవి. చవుకఅయిన అచ్చుపుస్తకాలాస్థానాన్నాక్రమించినవి తెలుగుకవి తత్త్వవేత్తఅయిన వేమనయోగిశతకము సీ. పీ. బ్రౌను ఇంగ్లీషుతర్జుమాతో గూడ బహుస్వల్పవెలకిప్పుడు వావిళ్లవారిస్తున్నారు. తెలుగులో ఇది 'కురళ్'. దీనిని తంజావూరులో నేను సంపాదించిన వేమనయోగిపటాన్ని నేను నాగ్రంథాలయంలోని ధనంగా దాచుకొన్నాను.

ఇప్పుడు పుట్టగొడుగులవలె పత్రికలు పుట్టి చస్తూఉండడను విషాదకరము. కాబట్టి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి తెనుగువారపత్రిక త్రిలిఙ్గకు రజతోత్సవము జరుగుచున్నదంటె మహదానందము కలుగుచున్నది. ఈపత్రిక చక్కగాసాగి స్వర్ణోత్సవము,వజ్రోత్సవము, శతవార్షికోత్సవము అన్నిటిని పొందునుగాక అని నేను ఆశించుచున్నాను. దాని జనరంజకత్వమును ప్రయోజనమును చూడగా నాయాశనిజమగుననుటకు సూచనలుగనున్నవి.

శ్రీ శాస్త్రులుగారు ఫెడరేటెడ్ఇండియాకును సంపాదకులు. ఈపత్రిక ఏపక్షమున కునుపూనక చక్కనిప్రజాభిప్రాయమును వ్యక్తపరచును.

శరశి

శ్రీ శాస్త్రులు సామాన్యపండితులు పత్రికారచయిత అనుకోవలదు. ఆయన ఇతరత్ర చాల గొప్పపౌరుడు, ప్రజాహితజీవి. అనేకవ్యాపారప్రజాసంస్థలతోను సంబంధముగలవాడు. అన్నిసంఘాలవారిప్రేమను సంపాదించినవాడు.

## 110

### ప్రొఫసర్ యస్. రంగనాథంగారు,

ఆంధ్రయూనివర్సటీసెనెటు, సిండికేటుమెంబరు, ఆరోగ్యవరము, మదనపల్లి.

20 ఏండ్లకు పైబడి నాకును శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులగారికిని చిరపరిచయమైనందున నాకుతెలిసినంత వారిగొప్పతనానిన్ని వివరించడము తప్పవుతుంది. ఆయన స్వతహాగా పండితులే కావడమేకాక నాజన్మభూమియైన నెల్లూరుజిల్లా పుదూరిద్రావిడవంశమువారు. వీరు తరతరాలుగ సంస్కృతములోను తెలుగులోను పాండిత్యానికి ప్రఖ్యాతిపొందినారు. ఇంగ్లీషు మరిఇతరప్రౌఢరచనలప్రకటనలకు ఆక్సుఫర్డు, కేంబ్రిడ్జి యూనివర్సిటీ లెట్లవో తెలుగుసంస్కృతప్రకటనలకట్టిదయినసంస్థకు వీరు యజమానులు. వీరికి శ్రీశాస్త్రులుఅనే పేరు వీరు ప్రౌఢతెనుగుకావ్యాలన్నిటికిని సర్వష్టమయిన దివ్యమయిన కూర్పులు ప్రకటించడముతోగూడ నవ్యతేజోవిభాసితముగాఉండే తెనుగువాఙ్మయకర్తలకు కాలానుగుణమగు అభిరుచులను వికసింపజేసే నవ్యసాహితీప్రాంగణపురోహితులకు గొప్పప్రోత్సాహము కలుగజేసినారు. విపరీతవికారాలుకలిగించే విచిత్రరాజకీయవాతావరణము ప్రబలిన ఈదినాలలో సంస్థానాలు పండితపోషణచేయలేనిస్థితిలో విశ్వవిద్యాలయాలు తమతమపరిశోధనములపేరిట వట్టిప్రగల్భాలు ప్రకటించేపట్టున వీరు తెనుగువాఙ్మయపోషకులుగ ప్రోత్సాహకులుగ పనిచేసినారు. అచ్చము సాదా తెలుగుమానవుని ఆశలకు మనసునకు ప్రతిబింబముగా అతనికి కావలసినసర్వవిషయాలప్రకటనకును త్రిలిఙ్గ తోడ్పడినది. 25 ఏండ్లుగా శక్తివంతముగా త్రిలిఙ్గనడపిన జీవితానికి నేనంతోషిస్తున్నాను. యౌవనప్రాదుర్భావమున నీపత్రిక ఇదివరలోకంటెనెక్కువబలముగా మనప్రజలకు నాయకత్వము వహించి సేవచేయునుగాకఅని ప్రార్థించుచున్నాను. శాస్త్రులగారికిని శ్రీత్రిలిఙ్గకును జయంబగుగాక!

## 111

### శ్రీ పీ. శేషాద్రిగారు, యం. ఏ., యం.బి ఇ., ప్రిన్సిపాలు, గవర్నమెంటుకాలేజి, అజ్మీరు.

త్రిలిఙ్గరజతోత్సవసమయమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికర్పించే అభినందనములలో నాదీ యొకపుష్పము సమర్పించుకొనుచున్నాను. తెలుగువాఙ్మయానికి ఆయనచేసినసేవ అపారము. అతనితండ్రి సంప్రదాయాన్నతడు అద్భుతముగ సాగించినాడు.

తెలుగులోని ప్రౌఢప్రబంధాలు ప్రజాహితమయినవి. అతనిపోషణలేకుంటే బయటికి రాలేనిగ్రంథాలనెన్నిటినో అతడు ప్రకటించినాడు. మద్రాసునగరాని కాయన అనేక భంగుల సేవచేసినాడు. తనకాలములో ఏమంచి ప్రజాహితకార్యానికైనా యెవ్వరిసహాయము సిద్ధంగాఉండినదంటే వీరిదే అనుసత్కీర్తి వీరికి బహుకాలము నిలువగలదు. ఈకాలపు తెలుగువాఙ్మయచరిత్రవ్రాయడము తటస్థించినప్పుడు ఇతని ఇతనిసంస్థను కృతజ్ఞతతో పేర్కొనగలరు.

## 112

### డా॥ వి. శివరామ్‌గారు, యం. ఏ., పి. యచ్. డీ. (హార్వర్డు) యఫ్. ఆర్. (హిస్టరీ) యస్.,

రాజకీయశాస్త్రశాఖాధిపతి, పండితులు, లక్నోయూనివర్సిటీ,
కొంతకాలము జినీవాలో లీగ్ ఆఫ్ నేషన్సు కార్యాలయములో సభ్యులు, లక్నో.

ఆంధ్రనూతనోత్తేజానికి వాఙ్మయానికి పత్రికాలోకానికి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు అపూర్వమైన సేవచేసినారు. మంచిగ్రంథాలప్రకటనలో అతనికి సములను జూపవలెనంటె ఇంగ్లాండులోని విక్టర్ గోలంక్జు, జార్జి ఆలన్, అన్‌విన్నులను జూపవలసినదే. వాఙ్మయోపయోగానికిగాను వీరు మంచిగ్రంథాలను కొంతనష్టపడియైనా ప్రకటిస్తారు. శ్రీ శాస్త్రులవారి అనేకముఖములయిన ప్రజాహితజీవితము కడచిన 25 ఏండ్లుగ ప్రజలకు ముఖ్యముగ ఆంధ్రప్రజలకు చాల ప్రయోజనకారిఅయినది ఇట్టిజీవితాలు చాలకొద్దే. సుప్రసిద్ధ తులసీదాసురామాయణమును తర్జుమాజేసి అనువదింపించడము వాఙ్మయానికి మహోదారసేవ. ముఖ్యముగా ఆంధ్రనవ్యతేజస్సుకు దోహదము. లక్నో ఆంధ్రసంఘము తరఫున, కాశీ, ఉత్తరఇండియాలతరఫున నాతరఫున అతనికి అతని ప్రకటనసంస్థకు చిరాయురైశ్వర్యంబులగుగాక అని కోరుచున్నాను. ఇంతకాలముగా చేస్తూవున్నపని చిరకాలము వారు సాగింత్రుగాక!

## 113

### డాక్టరు కె. ఆర్. శ్రీనివాసయ్యంగారు, యం. ఏ., డి. లిట్, ప్రొఫసరు, బెళ్గాం

మద్రాసులో ప్రముఖమైనమానవులలో శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి అగాధమయినవ్యక్తి యెవ్వరునుండరు. అతనిపలుకుబడి చాలగలదని అతనియందు మందరికీఉన్నదని అందరకును తెలియును. కాని, అది యెట్లుకలిగింది, ఏలకలిగింది ఒక్కరూ చెప్పలేరు. ఎవ్వరికీ తెలియదన్నమాట. మద్రాసు సాంఘికరాజకీయజీవితః

'వావిళ్ల'ను ఏమిలెమ్మని త్రోసివేసేవారుండినా ఉండవచ్చును కాని, దానివల్ల వారికి లాభముమాత్రము గాదు. అర్థముకానిది లేదని త్రోసివేయడము పొరపాటు. అట్లుచేసిన యెడల పూర్ణజీవితాని కపకారమవుతుంది.

ఇట్లనుటనుబట్టి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులనుగురించి గొప్పరహస్యమున్నదను కోరాదు. ఎనుబదేండ్లక్రిందట స్థాపితమయిన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌కు ఆయన యజమాని. దక్షిణఇండియాలో భారతరామాయణాలను రెండుమహాగ్రంథాలను మొట్టమొదట అచ్చువేసినవ్యక్తి. సంస్కృతములోని ప్రౌఢగ్రంథాలను వీరిసంస్థవారు తెనుగుదేవనాగరలిపులరెంటను ప్రకటించినారు. వారి ఇటీవలి ఘనప్రయత్నము 18 సంపుటాలలో శ్రీమన్మహాభారతము ప్రకటించుట. ఇదిగాక శ్రీశాస్త్రులవారు తులసీదాసురామాయణభాషాంతరీకరణాన్ని లోకమాన్యతిలకుని గీతారహస్యాన్ని తెనుగులోని కనువదింపించి ప్రకటించినారు. మరిరెండు వార్తాపత్రికలు సామర్థ్యముతో నిర్వహించినారు. త్వరలో రజతోత్సవముజరుపుకొననుండు త్రిలిజ్గ అందులో నొకటి రెండవది ఇదివరలో వారపత్రికగనుండి ఇటీవల మాసపత్రికయైన ఫెడరేటెడ్ ఇండియా. ట్రస్టీగా, మదరాసుయూనివర్సిటీ సెనేటరుగా, ఆంధ్రచేంబరు ఉపాధ్యక్షుడుగా మరిఇతరహోదాలలో అతడనేకప్రజాహిత సంస్థలతో సంబంధముకలవాడు. శ్రీశాస్త్రులవారి మద్రాసుప్రజాహితజీవితానికి విలువగట్టవలెనంటే ఈబహిశ్చిహ్నములగణన చాలును. పండితుడు, వ్రాయసకాడు, సంపాదకుడు, అనువాదకుడు, కర్మకరనాయకుడు, మూలధనస్వామి, ప్రకటనకర్త, గ్రంథవిక్రేత, గౌరవ మేజస్ట్రేటు, ప్రజాహితజీవి ఎన్నెన్ని చిత్రసంయోగాలు ఈ వావిళ్ల వేంకటేశ్వరులు శీలాన్ని తీర్చేవి.

వీరు చాలకాలముగా మద్రాసులోని కర్మకరులు ఉద్యమముతో సంబంధముకలవారు. పోరాటములో ఇతడు కన్పించినాడా కర్మకరుడు యజమాని ఇరువురకును ఇతడు విశ్వాసమును కలిగింపగలవ్యక్తి. వీరు మార్క్సుతప్ప వేరే దేవతలేదని ప్రమాణముచేసే సోషలిస్టుసిద్ధాంతమును పట్టుబట్టువాడుగాడు. లెనినురాద్ధాంతములను చేపట్టువాడునుగాడు. వీరు కర్మకరులసమ్మెలు వగైరా తీవ్రపద్ధతులను ప్రోత్సహించువారు కారనుట నమ్మకము. ఇండియాలోని కర్మకరోద్యమము యిరోపాలోని ఉద్యమమునకు నకలు కానక్కరలేదని వారిమతము. పోరాటముకోసరము పోరాటము పెట్టుకోడముతో సంఘానికి ఫలములేదనడము వీరినమ్మకము. పరిణామమార్గమే ప్రవృద్ధికి ఆధారమనడము వారిపద్ధతి. విప్లవాలు గిట్టవు. శ్రీవేంకటేశ్వరులుగారిని ఫేబియన్‌సోషలిస్టనవచ్చును.

ఏవిషయమైనా తనంతటతానాలోచించుకొనుచు ఇతరులఅభిప్రాయాలను నెమ్మదిగా త్రోసిపుచ్చుటచేత శ్రీవావిళ్ల వేంకటేశ్వరులవారందరికిని గూఢముగా తోచడానికి కారణ

ముచున్నది. శ్రీసత్యమూర్తిగారికి శ్రీనివాసయ్యంగారు నమ్మకాలధైర్య ముందని ఒకప్పు డొక్క హాస్యోక్తియన్నాడొకాయన. అట్టియుక్తి వీరియెడల పనికిరాదు. ప్రతివిషయాన్ని దాన్ని మంచిచెబ్బరలమీద ఆధారపరచి విమర్శించడ మితనిపత్రికలవిధానము గతాను గతికముగా ప్రచారమయ్యే అభిప్రాయాలకు తనపత్రికలయభిప్రాయాన్ని సరిపుచ్చడానికి తంటాలుపడుబాబతుగాడు కాడు. దీనిపర్యవసానమేమంటే ఏప్రశ్నను గురించియైనా కాంగ్రెస్సుపత్రిక యేమిచెప్పుతుందా ముస్లింలీగుపత్రిక ఏమిచెప్పుతుందా అనేవిషయాలలో కొంత ముందుజోస్యముచెప్పవచ్చునుగాని ఫెడరేటెడ్ ఇండియా, త్రిలిజ్గ లేమిచెప్పునో అదే రీతి నూహించడానికిరాదు పరస్పరవిరోధాలుండవచ్చును. ఆభాసలుకూడ కలుగవచ్చును కాని వీరి కదిలక్ష్యములేదు నిజముగా నీపత్రికలు స్వతంత్రములు భయవిరహితములు పార్టీకిచెందక ఈవిధముగా భయవిరహితంగా, స్వతంత్రముగా ప్రకటించే ఇట్టిపత్రికలకు పలుకుబడి మీదే ప్రజాస్వామికపు జయ మాధారపడుతుంది.

రాజకీయాలలో అతివాదియైనవాడు, శ్రీ వేంకటేశ్వరులను వెనుకంజవాడనను. కాని ఇండియాలోని మితవాదులనాయకులలో అగ్రపీఠముననుండు డాక్టరు సర్: సీ. వై. చింతామణిగారు వీరిని తమ లిబరలువాదానికిని కాంగ్రెసునకును మధ్యసీమవాడని వీరిని వర్ణించినారు. కాని శ్రీవేంకటేశ్వరులవారినిగురించి బల్లగుద్ది యేమిన్నీ చెప్పుటకురాదు. వీరు కీ. శే॥ లోకమాన్యతిలకుచేలాలలో నొకరుగానుండు అదృష్టముపొందిరి. అది గర్వింప దగినవిషయము. ఇరువదులలో శ్రీ యస్. శ్రీనివాసయ్యంగారు కాంగ్రెసురాజకీయాలలో ఉద్దండుడుగా నున్నప్పుడు శ్రీ శాస్త్రులవారు రాజకీయముగా చాల చురుకుగానున్నారు. 1927-వ సం॥పు మద్రాసు కాంగ్రెసుకు కోశాధిపతిగా అతడు జాతీయకార్యనిర్వాహణమున ప్రముఖుడై యుండినాడు. ఎప్పటికీస్వభావముచేతనే శ్రీవేంకటేశ్వరులు త్రొక్కుకొని దూరి పోయి విరిచేదో నిర్మించేదో చేసేయుత్సుదులతో నుండడు. జాగ్రత్త, వివేచన, మితధోరణు లలో ప్రజానీకమును ప్రబోధించు ప్రజాహితజీవనానికి వీరికంపలేని దేశాభిమానమును సువ్యక్తోత్సాహమును గొప్పసాధకములే అగును.

రాజకీయవిశ్వాసాలు కార్యాచరణనుగురించియు నిమ్నజాతుల నుద్ధరింప నతను చేయు నిరాడంబరసేవనుగురించియు అతడుపక్రమించియుండు గ్రామపునర్నిర్మాణకార్య క్రమమునుగురించియు అతనితెలుగువ్రాతలఉద్దండప్రతిభనుగురించియు (పండితులాడి కొన్నసంగతి), హిందూమతమును సభ్యతను వికలముగానీక నిలుపుటకుచేయు ధీరకృషిని గురించియు అతని ప్రకటనోద్యోగప్రతిభనుగురించియు ఎంతచెప్పినను మద్రాసులోను

ఆంధ్ర దేశములోను శ్రీ వేంకటేశ్వరులవ్యక్తిత్వానికిగల విలువ పూర్తిగా కట్టినవారము కాలేము. అద్భుతమయిన ఇతనిజనరంజకత్వానికి కారణము ఇతరులమైత్రిని సంపాదించుటలో నితనికిగలసామర్థ్యము—కాదు ప్రతిభ—అని చెప్పకతప్పదు. ఈయన సాదామానవుడుగా—అసంవేదనలు,అసంతోషాలు, అవ్యత్యస్తాలు అన్నిటిలో—నుండ నిచ్ఛగించును. నేనే మహాసమర్థుడనని కండ్లుబికి్కరించి గొంతుచించుకొని గడబిడపడుబాపతుగాడు. స్నేహపాత్రుడు, కలుపుగోలుస్వభావముకలవాడు, జారిపోయేవాడునైన శ్రీవేంకటేశ్వరులు స్నేహమునకు విలువకట్టే ప్రాతపద్ధతివాడు నిజము. సంతోషముగా కబురులుచెప్పుకొని ఆనందించేవాడు నిజము భోజనానంతరము ఖులాసాగా మాటలపూబంతులు రువ్వుకోను వెనుదీయనివాడు నిజము. ఈయంత్రయుగంలో గిరగిరతిరిగే కదురుగందరగోళమున ఇది యంతయు మునిగిపోవునట్లున్నది. ఇదంతా ప్రవృద్ధిమార్గమే అందామా? అవునుగాక. అయినా ఆర్థికాలలో వ్యాపారాలలో తామే నెపోలియనులనుకొని విరగబడేయోధులును మానవతత్త్వంలోని వానరతత్త్వంలోని అన్నిసంభవాలను అహింస దిమ్మెచ్చులు, పాకిస్థాందిమ్మెచ్చులు వగైరా ఎన్నో దిమ్మెచ్చులలో ఏకతంత్రుల క్రిందికి లాగెదమను రాజకీయనాయకులును వెలసిన ఈకృత్రిమ నరేతర అసాధ్యప్రపంచమునందు ఎంతటిక్లిష్టపరిస్థితు లెదురొ్కన్నను, మానవునకున్న స్వభావజనితసంవేదనలను సంతోషములను వదలవని విల్లియము జేమ్సు పశువుగావర్ణించిన బుద్ధిజాడ్యమునకు తావీయని శ్రీ శాస్త్రులవంటివారిని కలిసికొనుట ఆనందదాయకము. కావుననే కాలము గడచినకొలది శ్రీ వేంకటేశ్వరులవారి మిత్రవర్గము పెరుగుచున్నది. వావిళ్ల అంటె మానవప్రేమకు అంకముగా నోటినుండి నోటికి వ్యాపించుచున్నది.

## 114

### రావ్ సాహెబ్ యన్. కే. వెంకటేశపంతులుగారు, యం. ఏ., యల్. టీ.,

రిటైర్డు లెక్చరరు, (మద్రాసువిద్యాశాఖ), అనంతపురము.

ఆంధ్రవాఙ్మయప్రపంచములో పటాటోపాలులేక సేవచేయుచువచ్చుచుండు నాపురాతనమిత్రులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని సమ్మానింపనెంచిన తమయుద్దేశము పొగడదగినది. నేను వారిని ముప్పదియేండ్లకు పైబడి యెరుగుదును వారితండ్రినిగూడ కొంతవర కెరుగుదును. బృహదారణ్యకోపనిషత్తులో (వావిళ్ల 108 ఉపనిషత్తులముద్రణము పుట. 279) పితాపుత్రులిరువురును ఒకేబ్రహ్మమును ఒకేయజ్ఞమునని కుమారునికి తండ్రి చెప్పుచున్నాడు. కావున కుమారుడు తండ్రికార్యమును సాగింపవలెనట. ఆమార్గాన ఇచ్చట

కుమారుడు తండ్రి ఆరంభించిన మహాకార్యాన్ని తనజీవితమంతటను సాగించుచున్నాడు. యజుర్వేదభాష్యానికి తెనుగుకూర్పు నాకు కావలసివచ్చినది. మొదటికాండము నాకు వావిళ్లవారిఅంగటియందే దొరకినది. ఇప్పటికీ నావద్ద నున్నది. తండ్రికొమారులు పని పంచుకొని తెలుగుసంస్కృతవాఙ్మయాలనుగాలించి ఒకతరమువారు పూనిచదివినా తరుగనిఅంత గ్రంథసామగ్రిని ప్రకటించినారు. ఇటీవలనే నొకక్రొత్తరీతిపుస్తకాన్ని తెలుగులో ప్రకటించితిని. అది హరిహరగీతము. జయదేవునిగీతగోవిందమును శ్రీచంద్రశేఖరేంద్రసరస్వతిస్వామిజీ (కామకోటిపీఠాధిపతులలో 62-వవారు) వారి శివగీతామాలను ప్రక్కప్రక్కగా ప్రతిశ్లోకముక్రిందను నావ్యాఖ్యతో ప్రకటించితిని. మొదటిభాగపు ప్రతులు త్వరగా అమ్ముడుబోలేదు. నేను దానికి సిద్ధపడియే యుంటిని. 1937 సం॥ నవంబరులోనే వ్రాతప్రతి సిద్ధమైనా యుద్ధముకారణముగా మిగతభాగము నేనుప్రకటింపదలచి యుండలేదు. ఇప్పుడు దానిని తామేప్రకటింపనెంచి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు వ్రాతప్రతిని నావద్దనుండి తీసికొన్నారు. ఆయన ఇండియన్ ఛేంబరుపెద్దలలో సభ్యులుగానున్నా మద్రాసుపోర్టుట్రస్టులో పచ్చయప్పధర్మాలలోనున్నా ముద్రణాధికారిగా ప్రకటనకర్తగా నేపరిశుద్ధాత్మతోపనిచేయుట వీరికలవాటో ఈనిదర్శనముచేత వ్యక్తముకాగలదు. తెలుగుగ్రంథప్రచురణములో ఈయన వట్టివ్యాపారలాభమును చూడలేదు. వారికిందులో లాభముపుణ్యమును మనకృతజ్ఞతయు.

త్రిలిజ్గ సంపాదకులుగా నతడు ఆంధ్రులరైక్యమును సమకూర్చుచు, ఆంధ్రదేశోద్యమమునకు వీరిని సిద్ధపరచుచున్నాడు. ఫెడరేటెడ్ ఇండియా సంపాదకులుగా ఎన్నడో ఒకరోజు సాధితముకాగల ఫెడరేటెడ్ ఇండియా ఉద్యమానికి చాలసేవచేసినారు. నేను వారికివిషయాలకుసంబంధించి వ్యాసపరంపర పంపితిని. చీలిపోయినఇండియాకు మనభరతమాతకు శాంతిసమకూర్చిన యూనియన్ జాక్ పతాకముక్రింద ఐక్యతను సంపాదించడానికి శాంతముగాపాటుపడే ఆపత్రికలో అవి ప్రకటనపొందినవి.

## 115

### ప్రొఫెసర్ యస్. కె. యజ్ఞనారాయణఅయ్యరుగారు, ఎం. యే.,

'కుమారి', మైలాపూరు, మద్రాసు.

ఇప్పటి కిరువదియేండ్లక్రింద నేనును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును ఇండియన్ పబ్లిషింగ్ హౌసులో డైరెక్టరులుగ నుంటిమి. నాటినుండి వారికిని నాకును పరిచయము. తరువాత నేను పచ్చయప్పకలాశాలలో బోధకుడయి మద్రాసుకువచ్చితిని.

అనతికాలములోనే వారు పచ్చయప్పధర్మకర్తలలో నొక్కరై బహుకాలమావహోదా యందుండుటచేత మామైత్రి చాల అభివృద్ధియయినది. వారి ఫెడరేటెడ్ ఇండియాకు గ్రంథవిమర్శ నేను కొంతచేసిపెట్టితిని. అందు నాకానందము మెండుగదొరకినది.

వీరు వాఙ్మయానికిని పత్రికాప్రచురణమునకు ఉద్దండసేవచేసినారు. ఈనగరజీవితములోని ప్రజాహితులలో ప్రముఖులుగ నున్నారు వారికి సమ్మానసంపుటిసమర్పించి బహూకరించుప్రయత్నమన్ని విధముల విజయమందుసుగాక! ఆగౌరవమునకు వారెంతయు దగినవారు.

## 116

### విద్యాసాగర విద్యావాచస్పతి పీ. పీ. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, బి. యే. (ఆక్సన్), ఎం. యే,

సంస్కృతము తారతమ్యశబ్దశాస్త్రములపండితుడు, గవర్నమెంటు ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారము క్యూరేటరు, ప్రెసిడెన్సీకాలేజీ, మద్రాసు.

రమారమి ఒకశతాబ్దిగ పండితులకుప్రజాహితులకు వావిళ్లవారిసంస్థ బాగా పరిచయమయినది. సంస్కృతవాఙ్మయములోను తెనుగువాఙ్మయములోను అపూర్వములు గంభీరములునయిన గ్రంథప్రకటనకు వీరు మార్గదర్శకులు.

దక్షిణఇండియాలోని దేశభాషావాఙ్మయమున పత్రికాప్రకటనవిషయమున శ్రీ వావిళ్లవారికి ప్రత్యేకస్థానమున్నది. కాబట్టి త్రిలిఙ్గకు రజతోత్సవముజరుపునట్టి ఈసందర్భమున గతకాలపుసేవకయి శ్రీవావిళ్లవారికి ఆసేతుహిమాచలము అభినందనము లర్పించడము ఉచితము. వావిళ్లసాంప్రదాయమునందిప్పుడు యజమానియయి ఆసాంప్రదాయమును గభీరముగాసాగించుకొనవచ్చు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి ఈశ్వరకృప కలుగుగాక అని ప్రార్థింపతగియున్నది.

## 117

### శ్రీ పీ. ఆర్. రామచంద్రదీక్షితరు, యం. యే.,

ఇండియన్ హిస్టరీ, ఆర్కియాలజీలలో మద్రాసుయూనివర్శిటీ లెక్చరరు, మద్రాసు.

భారతవాఙ్మయానికి చేసినమహత్తమసేవకయి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి నభినందించుమిత్రమండలిలో సంతోషపూర్వకముగ చేరుకొనుచున్నాను. తనతండ్రి ఆరంభించిన ప్రచురణకార్యక్రమాన్ని శ్రీశాస్త్రులవారు సాగించినారు. వీరిప్రచురణములు ముఖ్యముగా తెలుగులో విస్తారప్రశంసపొందియున్నవి. సభ్యతమొదల అభిమా

నముకలిగి ప్రచురణకార్యమునకు పూనుకొను ప్రచురణకర్తలే ఏభాషనైనా వృద్ధిపరచ గలరు; ప్రజాప్రేమకు పాత్రముచేయగలరు. శ్రీశాస్త్రులవారట్టివారలలో నొక్కరని వేరుగా చెప్పబనిలేదు. దీనికి తార్కాణముకావలెనా? సంస్కృతమహాభారత, రామాయణ, భాగవతములు వారుప్రచురించినవి చూడుడు అన్నీ దక్షిణభారతపాఠములు. మహాభారత భాగవతములు చేతపట్టగలఆకృతిని ప్రకటించడమనేది శ్రీశాస్త్రులవారికితోచిన చక్కటి ఆలోచన.మహాభారతము 18 సంపుటములు, భాగవతము 2 సంపుటములు అందుచేత మనకు లభ్యమయినవి. రాయలు ఏషియాటిక్ సొసైటీవారిపత్రికలో (జూన్, 1940) ఈ రెండవ దానిని విమర్శించుచు ప్రొఫెసరు ఈ. జే. థామసు అనువారీచక్కనివాక్యాలు వ్రాసిరి.

"ఇందులోని సంపుటములఏర్పాటు తయారు చాల ఉత్తమము. ఈవిధముగా ఆటోపమయి ఎక్కువ నుపయోగపడు ఆకృతిని ప్రకటించిన ప్రచురణకర్తల కార్యధోరణి ప్రశంసనీయము."

ఈవిధముగ శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు భారతవాఙ్మయానికి చేసినసేవ విలువతోగూడ ప్రయోజనమును సమకూర్చినది. ఇంకా విస్తారముగా ఇట్టిసేవచేయడాని కతనికి దీర్ఘాయువగుగాక!

## 118

### ప్రొఫెసరు బీ. వీ. రామనరసుగారు, డి. బి. ఆర్. మిల్సు, సికంద్రాబాదు (దక్కన్).

తండ్రులకార్యక్రమాన్ని నెత్తినపెట్టుకొని నిర్వహించేకొమారులు ఈదినము మన దేశములో అంతనెక్కువగాలేరు. శ్రీశాస్త్రులవారు ఇందుకు మినహాయింపు. రాజుల పోషణ సర్కారుపోషణలేకుండా శూన్యచరిత్రకావలసినదినాలు తీపి గాంభీర్యములు రెండూగలభాషకు పట్టేవేళలో ఇతడు దివ్యమైనసంస్థ నొకటి నేర్పరచి యిచ్చి సంరక్షించి నాడు. ఇతడు సాదాపౌరుడేకాని రాజధర్మము నెత్తినవేసుకొన్నాడు. వీరితెనుగుపత్రిక త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున వేయబోయేసమ్మానసంచికకు నేను "భారతనావికావృత్తి"ని గురించి వ్యాసము పంపతలపెట్టినాను.

## 119

### శ్రీ సి. యచ్. బాలకృష్ణశాస్త్రిగారు, యం. యే., యల్. టీ, బందరు.

సుప్రసిద్ధుడగు తండ్రియుపక్రమించిన తెనుగుభాషాగ్రంథప్రచురణకార్యమును సా గించుచు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు తెనుగువాఙ్మయానికి ఉద్దండమయిన సేవ

చేసినారు. సనాతనధర్మము ఉన్నమతాలలో ఉత్తమమతము. త్రిలిఙ్గసంపాదకులుగ వీరా మతమునెడల చాల గొప్పఅభిమానమును పురికొల్పినారు ఫెడరేటెడ్ఇండియా సంపాదకులుగ వీరు ఈప్రాచీనభారతభూమికి సంయుక్తరాష్ట్రవిధానమే రాజకీయముక్తికి మార్గమని ప్రబోధించినారు. వేదవాఙ్మయము, ఉపనిషత్తులు, తత్త్వశాస్త్రము, పురాణములు ఇన్నిటిభావాలను వీరు తెలుగుభాషలో ప్రకటించడముచేత సత్యాన్వేషణజ్ఞానాన్వేషణ జేసేవారందరికిని ఈరహస్యవాఙ్మయమంతయు సులభసాధ్యమయినది.

సర్వమంగళప్రదాతయగు భగవానుడు శ్రీకృష్ణుడు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారికి చిరాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించి మహత్తరసేవకు వారికవకాశ మొసంగుగాక అని ప్రార్థించుచున్నాను.

## 120

### రావుసాహెబ్ మహాకవి సాహిత్యభూషణ ఉల్లూరు యస్. పరమేశ్వరఅయ్యరుగారు,

ఎం. ఏ., బి, ఎల్., దివాన్ పేష్కార్ (రిటైర్డు), శారదానికేతనము, జగతి, తిరువనంతపురము.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని నేను చాల బాగా ఎరుగుదును. వారు పూర్ణస్వార్థత్యాగముతో తెనుగుసంస్కృతవిద్యలకు చేయుచుండు మహదుదారసేవకు నేనువారిని కడుంగడు మెచ్చుచున్నాను. 18 సంపుటములలో వారు మహాభారతము దక్షిణ పాఠము ప్రకటించడమనేది వారిగాఢపాండిత్యానికి గొప్పఔదార్యానికి తార్కాణముగా ఉన్నది. తెనుగులో గ్రంథకర్తగాను ప్రజాహితజీవిగాను ఆయన తరుగులేనికీర్తినిసంపాదించినాడు. మద్రాసులో ఉపయోగకరమయిన ఏప్రజాహితకార్యక్రమముసాగినా దానితో ఆయనకు సంబంధముంటున్నది. బహుకాలముగా ఆయన మితజీవియై అమితప్రతిభాధురంధరుడుగా జీవనముచేయుచున్నాడు. వారియెడల స్వదేశజులకు గలగౌరవాన్ని గనపరచడానికి వారికి సన్మానసంపుటి ప్రకటించి సమర్పించుట మిక్కిలి ఉచితము. ఈకార్యమునకు విజయమగుగాక! ఆంధ్రదేశవికాసవ్యాప్తికి సేవజేయడానికి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి చిరాయురారోగ్యము లమరుగాత!!

## 121

### శ్రీ జె. గంగన్నగారు, ప్రధానోపాధ్యాయుడు, శ్రీ వీరేశలింగముహైస్కూలు,

రాజమండ్రి.

బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరులబోటి అంతస్థుగల ప్రజాహితజీవితాన్నిగురించీన్ని అతనిసేవనుగురించీన్ని అభిప్రాయమిచ్చుటకు బయలుదేరడము నాబోటివానికి నాఅంతస్థు

వానికి అధిక ప్రసంగమవుతుంది. కాని వారితో చాలాకాలముగా స్నేహముకలవాణ్ణి కాబట్టిన్ని అతనిని చాల సన్నిహితముగా ఎరగడానికి నాకవకాశములు ఎక్కువగా కలుగబట్టిన్ని వారు ప్రశంసింపదగినవారుగా నామానసము నన్నుపురికొల్పబట్టిన్ని ఇట్టిశుభ ముహూర్తాన నాఅల్పప్రశంసచేయబూనడానికి కారణాలేర్పడినవి.

కవులలో అతనికతడే సాటిగా కాళిదాసు నెల్లెన్నుతారో అక్షరజ్ఞులకు తెలిసిన పేర్లలో "వావిళ్ల" కూడ దానికదియే సాటిగా దక్షిణఇండియాలో నెన్నదగినది. వర్ణమాలలోని అక్షరాలు తడుముకొనే చిన్నకుర్రడు మొదలు మహాక్లిష్టవిషయాలకయి విజ్ఞానసర్వస్వాలు తిరుగవేసేఅఖండపండితునివరకు తల్లి, తండ్రి, అన్న, అక్కలపేర్లెంతపరిచయమో అందరికీ అరవ, తెలుగు, సంస్కృతవాఙ్మయాలలో అంతపరిచయమైనపేరిది.

తండ్రి సంక్రమింపజేసిపోయిన ఈవ్యాపారమును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు లాభదాయకవృత్తిగాపరిగణింపక పవిత్రధర్మసంస్థగా నాలోచించి పునర్నిర్మించి విస్తృతముజేసి దినదినము మారుతూ ఉండేదేశపరిస్థితుల కనుకూలపరచడంలో వీరు త్యాగము కనుపరచినారు. అది ఒకటే అనుకోబోకండి. ప్రస్తుతమున కుచితముగాబట్టి చెప్పుచున్నాను. వావిళ్లవారిపత్రికాప్రకటనోద్యమము ప్రత్యేకముగా శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారిప్రయత్నము. విషయాలు ప్రకటించడములో సత్యానికేమాత్రము దూరముకాకుండ చూడడము, వాటివివరణలో స్వతంత్రముగా ప్రవర్తించడము, అభిప్రాయాలు చెప్పేటప్పుడు న్యాయమునుమించకుండా ఉండుటకు ప్రయత్నించడము—వీరిపత్రికలలక్షణాలు. ప్రబోధానికని తమపార్టీకార్యాల కనిపెట్టుకొన్నపత్రికలకు వీటికి సంబంధములేదు. ఇప్పుడు రజతోత్సవముజరుగనుండే త్రిలిఙ్గపత్రిక ముఖ్యంగా తెలుగుదేశంలోని సర్వతోముఖపునర్వికాసానికి చాల తోడ్పడినది. భవిష్యత్తున సంస్థాపకులజీవితకాలంలోనే స్వర్ణవజ్రోత్సవాలు ఈపత్రికకుజరుగగలదనియు అంతలోపుగా ఇదివరలో చేసినసేవకంటె అనేకరెట్లు హెచ్చుగాసేవచేయగలదనియు నావిశ్వాసము.

ఫెడరేటెడ్ఇండియా విస్తారతరప్రపంచములో విహరిస్తుంది ఎక్కువదక్షా ప్రజలచిత్తవృత్తుల మారుస్తున్నది. ఆపత్రికకును త్వరలో రజతోత్సవము నడచుగాక! అంతకుముందే శ్రీశాస్త్రులవారి కనుంగగు నీపత్రిక మూడవయవతారమెత్తి దినపత్రికయయి యుండగలదని నమ్ముచున్నాను.

శ్రీశాస్త్రులవారు సర్వతోముఖప్రజాసేవను చిరకాలము చేయడానికి చిరాయురారోగ్యములు సమకూరుగాక అని కోరుచున్నాను.

122

## శ్రీ టీ. బీ. వెంకటరావుగారు, ఎం. ఏ., ఎల్. టీ.,

శ్రీరామకృష్ణనిలయము, శ్రీరామకృష్ణాపురము, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవమంటే ఆంధ్రదేశచరిత్రలో కాదు భారతమాతచరిత్రలోనే ఒకయుగపూర్తిఅన్నమాట. మనవిజ్ఞానానికి సంస్కృతము గొప్పగని. ఆపిత్ర్యాన్ని ప్రజలకు పంచిపెట్టడానికి ఇతరదేశభాషలతోగూడ తెలుగున్నూ ద్వారాలుతెరిచే బీగము చెవిగా నుపయోగపడింది. భారతరామాయణాదులను ఇతరపవిత్రవాఙ్మయాన్ని మనభాషలోనికి పరివర్తనముచేసినపెద్దలు మనకు మహోపకారము గావించిరి. ఈ ఉద్దండశిల్పుల చేతిలో మాతృకలోకంటె నెక్కువసుందరస్వరూపాలు గ్రంథాలకేర్పడి విలువహెచ్చినది.

కాలాలు మారినవి. సంస్కృతమును పూర్వమువలే చదివేవారు లేరు. అర్థముచేసికొనేవారంతకంటె తక్కువ శతాబ్దాలుగా తెలుగుభాషకూడ పరివర్తనము పొందుతూ వస్తూఉంది. ఇందులో ప్రాచీనులువ్రాసినకావ్యాలభాష నేటిసామాన్యజనులకు కాదు, కొంతచదువుకొన్న ఆంధ్రులకే, అర్థముకావడముకష్టమయినది.

సకాలములో ఆంధ్రదేశచరిత్రలో సుప్రసిద్ధులయిన వావిళ్లవారు సిద్ధపడి ముందుకు వచ్చిరి. సంస్కృతము తెలుగులలోని ప్రౌఢరచనలను విస్తారటీకలతో వ్యాఖ్యానాలతో భాషాంతరీకరణాలతో ప్రకటించి తమసోదరాంధ్రులకు వినియోగార్థము సమర్పించిరి. అంతటితో వారు తృప్తిపడి నిలువలేదు. ఇతరదేశభాషలలోని ప్రౌఢరచనలవైపునకుగూడ దృష్టినిగిడ్చిరి. ఒక్కఆంధ్రుడైనా బ్రతికియున్నంతకాలము వీరుచేసినసేవ మరువడానికి రాదు. ఆంధ్రయువకుడు ఆర్యసంస్కృతి, ఆంధ్రసంస్కృతుల సభ్యతల సాంప్రదాయముల మరచిపోయేతరుణానికి సరిగా వీరు రంగంమీదికి దుమికి పైకురికివచ్చుచున్నవెల్లువ నరికట్టి మనపిత్ర్యాన్నినిలిపి మనస్వభాష స్వసాంప్రదాయములంటే మనము గర్వపడేటట్లు గావించిరి.

వావిళ్లవారి తెనుగుపత్రిక త్రిలిఙ్గ ఆంధ్రవిజ్ఞానరథపు పగ్గములనుచేతబట్టి ప్రజల మత, సాంఘిక, ఆర్థిక, సారస్వత, రాజకీయజీవితములను సభ్యమార్గాలలో నడుపుటకు ప్రయత్నించినది. ఈసేవ ఒక్కొక్కరికిని అందేట్టుచేయవలసిన ఆవశ్యకము మాత్రమున్నది. ఏభారతీయుడును మనపూర్వీకులు నేర్పినపాఠమును మరువరాదు. చూడుడు.

"ఏకం సత్ విప్రా బహుధా వదన్తి", "సర్వదేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి", "మమ వర్త్మానువర్తన్తే మనుష్యాః పార్థసర్వశః"

ఇదియే భారతభూమి ప్రపంచానికిచ్చిన ఉత్తమసందేశము. ఇచట మన మభిప్రాయభేదాలను గౌరవింప నేర్పడినవారము. "మార్గాలు వేలు, కాని గమ్యస్థాన మొక్కటే" అనునీతిని ధృవపరచుటకు కార్యసాధనచేయుకర్మభూమి ఇది. ప్రాతపొంతలకే క్రొత్తగా కంకరవేసినా వేయుదముగాక! ప్రక్కలనీడకు చెట్లునాటిన నాటుదుముగాక! కాని బునాదులును మార్గాలును అప్పుడూ ఇప్పుడూ ఒక్కటే.

మనకు జాతీయంగా నొకక్లిష్టకాల మేర్పడునట్లున్నది. మనమిప్పుడు విభేదాలు పెంచుకొనదగియుండలేదు. వివిధత్వములోనుండే ఏకత్వమును మనము గుర్తింపవలసియున్నాము. భిన్నత్వమునం దేకత్త్వము ప్రకృతినిర్దేశము. కాబట్టి మనకుగల సామ్యభాగాన్ని గట్టిగా గ్రహించుకొందాము. ఒక్కటేవేదిక నేర్పరచుకొందాము. ఈశ్వరసృష్టిలో భిన్నంగా నుండినా సుందరంగా నుండేగుణాలను ప్రశంసించుకొందాము. ఒకరినొకరు ప్రేమించుకొని జీవింతము. పురాణభారతమాత మనకీపిలుపును ప్రసాదించింది. నేటియుగాన కావలసింది ఐకమత్యము, ఏకకార్యదీక్ష, కేంద్రీకృత ప్రయత్నము. సార్వజనికసహానాన్ని అలవరచుకొని-కాదు అంగీకరించి—మన మీప్రయత్నముచేయగలమో అంతవరకే మనకు మోక్షము.

కావున ఈపాఠము విస్మృతము కాకుండుగాక! త్రిలిఙ్గయు, వావిళ్లవారును చిరకాల ప్రవర్ధమానమంది సేవచేసి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి ఆత్మకేదిశాశ్వతశాంతి సమకూర్పగలదో దానిని సాధింతురుగాత!

## 123

### దివాన్‌బహదూరు సర్: అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు,

ఆడ్వోకేటు జనరలు, లజ్, మైలాపూరు, మద్రాసు.

ఈసమ్మానసంపుటి సమర్పణోత్సవమున పాల్గొనుటకు సంతసించుచున్నాను. ఇప్పటికి 47 ఏండ్లయినది. వావిళ్లసంస్థ స్థాపకులైన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారి నప్పుడే నేనెరిగితిని. వారిపేరీసంస్థకుండడ ముచితముగదా! ఈసంస్థకావించినమార్గదర్శక సేవనుగురించి ఆలోచన పారడముతో ఇదియంతయు గమనములోనికివచ్చినది. శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారి స్ఫురద్రూపము, వారిజరీశాలువ, వారితలపాగా, వారికంఠాన్ని అలంకరించిన రుద్రాక్షమాల నాకంటికి గట్టినట్టులున్నది. సంస్కృతతెనుగుగ్రంథముల అందరకందుబాటులోనికి రావడానికి వారుచేసిన ప్రథమకృషి సుప్రసిద్ధము. వివరణ మక్కరలేదు. శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారు తెలుగుసంస్కృతాలలో అఖండపండితులు కావడమేకాక తమ

చుట్టును తమకోటిఅఖండుల నవేకులచేర్చుకొనిరి. అందులో బహుశాస్త్రాభ్యాయి ప్రతిభాశాలి వారిఅల్లుడు శ్రీ చదలువాడ సుందరరామశాస్త్రులవారుండిరి. వారు తెలుగుకుచేసిన సేవ ముఖ్యముగా శ్రీరామాయణాదిమహాకావ్యములభాషాంతరీకరణము సర్వజనామోదమునుపొందినది. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు గతించినతదనంతరము వారిపుత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు తండ్రిచూపినమార్గము ననుసరించినాడు. తెలుగుసంస్కృత వాఙ్మయాలలో ఇతడు నెమకనియట్టి ఒక్కశాఖయు లేదు. దానినంతటిని సామాన్యపాఠకునికి అందుబాటులోనికి తెచ్చినాడు. ఆంధ్రదేశమంతటను వావిళ్ల ముద్రాక్షరశాలయు వావిళ్ల వ్యాపారసంస్థయు ప్రతినోటను అదేపేళ్లయినవి. సంస్కృతము తెలుగు వాఙ్మయాభిమానులొక్కొక్కరిఅభినందనాలును ఈమహాప్రచురణకర్తలకు చెందదగియున్నవి.

## 124

## రావుబహదూరు శ్రీ ఆర్. ఎన్. అయ్యంగారు,

బారిష్టర్-అట్-లా, ఇండియన్ లా రిపోర్టులయెడిటరు, (మద్రాసు) హైకోర్టు, మద్రాసు.

"నేను చిన్నతనములో పండితులను ఋషులను పలుమారు దర్శించితిని. తత్త్వం ఆదులనుగురించి వాదాల నెన్నిటినో వింటిని. కాని ఎప్పుడూ పోయినద్వారంలోనుంచే వెనుకకువచ్చి చేరుచుంటిని."

కాని ఆక్షేపించరానిసత్య మొక్కటి కనిపిస్తున్నవి. అది ఈజీవితము నేనుజీవించుచున్నాను. అందులో 'ప్రకృత'ముత్తమము. ఏదోగతజీవితాన్ని పొగడడంతోను రాబోయే జీవితాన్ని పెంచి ఊహించుకోవడముతోను ప్రస్తుతాన్నెంతదిగద్రోసే ప్రయత్నంచేసినా మనము ఇప్పుడు నేడు జీవిస్తున్నామనడము నిజము. మంచో చెడుగో ఏదో మనకేర్పడినపరిస్థితులలో ఒక్కొక్కరము శక్తికొలది గడ్పించుచున్నాము. మనలో ప్రతియొక్కరు అంతో ఇంతో మేలుచేయడానికి మనకవకాశాలున్నవి. ఏదో ఘనకార్యముచేయడానికి వీలున్నది. నామట్టుకు నాకు ఏవ్యక్తిజీవితముత్తమంగా కనిపిస్తుందంటే తనకుండే మితుల లోపలనే తనసంపూర్ణజీవితాన్ని నడుపుకొంటూ సర్వప్రపంచజీవితపు టభివృద్ధికి తోడ్పడే జీవితమే ఉత్తమము. తనమేలుకోరుకోవలసిందే. తనచుట్టునుండే ప్రపంచాన్ని కుటుంబము రాష్ట్రము దేశముగా విస్తరింపజేసికొంటూ దానిమేలు సాధింపవలెను. తన గొప్పకుటుంబ సాంప్రదాయాన్ని శ్రద్ధాభక్తులతో సాగించినవారిని తనప్రజలు దేశముకొసరము నిరంతరము పాటుపడినవారిని తనభాషను వాఙ్మయమును అభివృద్ధిచేయడానికి తనకలమును

కలిమిని వినియోగించినవారిని గ్రంథాలు పత్రికలు ప్రకటించినవారిని వ్యాసాలువ్రాసి ఉపన్యాసాలిచ్చినవారిని స్వకార్యాన్నీ ప్రజాహితాన్నీ అతిప్రయోజనకరముగా మేళవించిన వారినిగురించి ప్రస్తావించడ మెట్టివారికిని తృప్తికరము, సంతోషప్రదము. ఇన్నిటితో చేర్చి అట్టివ్యక్తి శాంతభావము, నమ్రవృత్తి, ఉదారాకృతి, స్నేహపాత్రత, సహృదయము కలవాడగునేని ప్రజారంజకుడగునేని తనతోసంబంధముకలవారందరిప్రేమను చూరగొను నేని, తన చక్కనివ్యాపారధోరణితో ఉదారవితరణనుజోడించగలడేని ఇంకకోరవలసిన దేమియుండును!

వారి తెనుగు వారపత్రిక 'త్రిలిఙ్గ' రజతోత్సవసందర్భమున శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారికి నేను హృదయపూర్వకముగా అభినందనములుసమర్పిస్తూ నమోవాకములు చెల్లించుచున్నాను.

## 125

### రావుబహాదరు ఎం. చెంగయ్యపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.,

రిటైర్డుకమీషనరు, హిందూధర్మాదాయములబోర్డు, మైలాపూరు, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవసమయమున శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సమర్పింప బోవు సమ్మానసంపుటితో మైత్రిపొందుటకుసంతసించుచున్నాను.

ఇట్టి శుభముహూర్తాన శ్రీశాస్త్రులవారిసుప్రసిద్ధపితరులు నాకు జ్ఞాపకము వచ్చు చున్నారు. కాలేజీలో చదువడముకోసరము నేను ఏబదియేండ్లకంటే ఇంకాముందే మద్రాసుకువచ్చితిని. అప్పటికే శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారిపేరు ఈనగరములో సుప్రసిద్ధంగా ఉండెను. వారితెగ చిన్న దే. కాని, వేదాధ్యయనసంస్కృతపాండిత్యాల కదిపేరు మ్రోగినది. అందులో కీ శే॥ అల్లాడి మహాదేవశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రి, చదల వాడ సీతారామశాస్త్రి వగైరా లెందరోజన్మించిరి. ఆకాలపు ఇతరపండితులవలెగాక శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారొకనవీనపంథా త్రొక్కిరి. వారుత్రొక్కిన ఆపంథాలో వారే మార్గదర్శకులు. మనదేశములో యుగాలుగాపాండిత్యాన్ని పోషించేవారంటే రాజులు, ప్రభువులు అనే ప్రతీతేర్పడింది పండితులు వారికొలువుకూటాలలో మెదిలే అలంకారములు. ఒకొకప్పుడు వీరు గొప్పగౌరవాలుపొందడముకూడ ఉండినదిగాక, వ్యక్తిస్వాతంత్ర్యాభి ప్రాయాలు అభివృద్ధిమార్గానుసరణాలు తలకెక్కినసమాజములో పాండిత్యానికి తన్నిర్మాణ కార్యక్రమానికి ఉండేవితులు ఉల్లంఘింపబడక తప్పదు. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రుల వారు ప్రాతయుగానికి నూతనయుగానికి సంధిలోనుండిరి. ఎవ్వరో కొందరిమెప్పులకంటె

అందరి మెప్పులంటె కాలముచూపు మేరలోనున్నదని గ్రహింపగల్గిరి. వారికి స్వభావముచేతను సాంప్రదాయముచేతను ఏర్పడియుండిన మితులను తుడిచివైచి క్రొత్తమార్గాన్ని అనుసరించడముచేత తెలుగుగ్రంథకర్తలనేకులు స్వతంత్రులయినారు. తెనుగుసంస్కృతవాఙ్మయాలకెంతో మేలైనది.

ఆదయాళువు ఆకర్షణీయమూర్తి నాకు భాగ్యాజ్ఞాపకమున్నది. ఆయనను చూస్తేనే చాలును. తెలుగుసంస్కృతాలయందభిమాన మెవరికైనా కలుగుచుండేది. ఈ రెండుభాషలలోని ప్రౌఢరచనలను ప్రజారంజకముచేయదగు ననునభిలాష కలిగేది. ఆయనపనిలో సహాయపడడానికి తనచుట్టును తెలుగుసంస్కృతపండితులను చేర్చుకొనియుండేవాడు.

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారికి సాంఘికోద్దేశాలుకూడగొప్పవి. ఎన్నో సారస్వత సార్వజనోపయోగసంస్థలతో వారికి సంబంధముండేది.

ఈయభినందాలుపొందే శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు వారికుమారులు. తండ్రిసాంప్రదాయాలను చక్కగాఅనుసరించి తనవిద్యకుతగినట్లు సంస్థానిర్మాణశక్తిచేత వానిని విస్తరిల్ల జేసినవారు.

వీరు త్రిలిఙ్గసంపాదకులుగా నొకగొప్పగుణము చూపినారు. ప్రజాహితజీవితములో తాత్కాలికముగా తకతయ్యలాడే ఉద్యోగాలలోపడిపోకుండ ఎదురుతిరుగగలిగినారు. ప్రశాంతముగా శాస్త్రరీత్యా రాజకీయ, సాంఘిక, సారస్వతవిషయాలను జాగ్రతగా విమర్శించేధోరణిని నడిపించినారు.

వీరు నడపుచున్న ఫెడరేటెడ్ ఇండియాప్రయత్నానికి వీరు శ్లాఘాపాత్రులు.

ప్రచురణ, పత్రికాప్రకటనలేగాక వీరితరప్రజాహితకార్యక్రమములోను పాల్గొన్నారు. సంవత్సరాలతరబడిన వీరు పచ్చయప్పధర్మాలకు ట్రస్టీగా నుండిరి. మద్రాసు కార్పొరేషను, పోర్టుట్రస్టు, ఆంధ్రఛేంబర్ అఫ్ కామర్సు మరి ఇతరసంస్థలలో సేవచేసిరి.

సుస్థిరకీర్తిగడించిన ప్రచురణకర్త, పత్రికారచయిత, ప్రజాహితసాంఘికసేవాసక్తుడు నగు ఇట్టి ఇతనికి సమ్మానిసంపుటిసమర్పణోత్సవము జరుపుట అన్నివిధములను తగియున్నది.

**126**

## రావుబహదూరు ప. ఎస్. కృష్ణరావుపంతులుగారు, బి. ఏ., బి. ఎల్.,

అడ్వకేటు, నెల్లూరు.

తెలుగువాఙ్మయము, వార్తాప్రచారముశాఖలలో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుచేసినఉదారసేవకు అభినందనాలుచెప్పడము భాగ్యమని తలంచెదను. ఈయన ఈయన

తండ్రి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు—వీరిరువురు—చూపిన వ్యగ్రోత్సాహమే లేకపోతే సంస్కృతము తెలుగుగ్రంథాలు మనపెద్దలు నించిపెట్టిన విస్తారవిజ్ఞానమును అఖండపాండితియు ప్రజానీకానికి,ముఖ్యముగా సంస్కృతమురానితెలుగువారికి దొరకియే ఉండవు. వీరు ప్రకటించు తెనుగు 'త్రిలిఙ్గ', ఇంగ్లీషు 'ఫెడరేటెడ్ఇండియా'లమూలకముగా రాజకీయవిషయాలలోను మతవిషయాలలోను కార్యపరమైన సదభిప్రాయాలు వ్యాప్తమయినవి. వీరికింకను మంచిభవిష్యత్తు కలదు. ఇంకను ఎక్కువ శ్రద్ధతో ఎక్కువ నుత్సాహముతో వీరు ముందుపరిశ్రమచేయగలరని నావిశ్వాసము.

## 127

### రావుబహాదర్ కే. వీ. కృష్ణస్వామి అయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్.,

అడ్వకేటు, మైలాపూరు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారుజరుపుచుండే ప్రజాహితసేవనుగురించి బహిరంగముగా అభినందనాలు తెలుపడమనేది మనధర్మముమాత్రము గాదు. అది మనకే గౌరవము. భారతభాషలప్రచారానికి ఆయన చేసినసేవఅపారమని వ్రాస్తే అందులో అతిశయోక్తి ఏమీలేదు. త్రిలిఙ్గను ఒడుదుడుకులు లేకుండా 20 ఏండ్లకుపైబడి జరిపినాడంటే ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ఇండియాను జరుపుచున్నాడంటే ఆయన పత్రికానిర్వాహణశక్తి నెంత మెచ్చుకోదగినదో అర్థమవుతుంది.

## 128

### రావుబహాదరు కే. వి. శేషఅయ్యంగారు, ఎం. బీ. యి., బి. ఏ., బి. ఎల్.,

మైలాపూరు, మద్రాసు.

నాకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిపరిచయము పదేండ్లకుపైబడి కలదు. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్సంస్థ వారికార్యక్రమముతోడి పరిచయము అంతకంటే చాలప్రాతది. తమతండ్రిసాంప్రదాయాన్ని అనుసరించి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారేపటాటోపములేక చేసినసేవయు వారిసంస్థచేర్చినపనియు అప్రతిమానములు.

తెనుగువారుగాని ప్రజలలో శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్పేరు చక్కనిసంస్కృతగ్రంథముద్రణముతో సమ్మిళితమయి యున్నది. సంస్కృతములో నిర్దుష్టముగా ముద్రితమయినగ్రంథాన్ని కోరేవాడొక్కడౌకడు మొట్టమొదట వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్సన్స్ను జ్ఞాపకముచేసికొనక తీరదు.

పెడరేటెడ్ ఇండియా మూలకముగా శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు తేటుకర మును అభివృద్ధికరమార్గాలను రాజకీయాభివృద్ధికి తగినవిజ్ఞానాన్ని వెదజల్లుచున్నారు. క్లిష్టమయిన భారతసంయుక్తరాజ్యాంగసమస్య ముళ్లువిప్పుటలో ఫెడరేటెడు ఇండియాచేసిన సేవ గణింపదగియున్నది.

నాకు తెలుగుతెలియదు కావున త్రిలిఙ్గనుగురించి అభిప్రాయమిచ్చుట కష్టము కాని తెలుగువచ్చినవారిలో ఇది చాల ప్రజారంజకముగా ఉండడము మాత్రము నే నెరుగుదును.

శ్రీశాస్త్రులసేవ అట్లుండగా ఆమనిషే సంతోషముకలిగించేవ్యక్తి. స్నేహితులను సంపాదించడములోను వారినినిలుపుకోడములోను ఈయనకప్రతిమానప్రతిభ కలదు.

త్రిలిఙ్గ రజతోత్సవసమయాన అతనిమిత్రులందరి ఆశీస్సులును అతనిపైనను అతని కార్యముమీదను నిలుచుననడానికి సందేహము లేదు.

## 129

## శ్రీ కే. బాలసుబ్రహ్మణ్యఅయ్యరుగారు, బి. ఏ., బి. ఎల్.,

అడ్వకేటు, 'ఆశ్రమ,' మైలాపూరు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుచేసిన వాఙ్మయసేవ పత్రికాప్రచురణసేవలను గురించి అభినందనములు చెప్పడానికి అవకాశము కలిగినందులకు సంతసించుచున్నాను. శ్రీశాస్త్రులవారిని అనేకసంవత్సరాలుగ నేనెరుగుదును. మనదేశములో సంస్కృతవాఙ్మ యమును ప్రచారముచేసే సందర్భమునందు నాకతనితో నెక్కువసంబంధము కలిగినది. విశేషభాగము వారి పరిశ్రమచేతనే మహాభారతము దక్షిణఇండియాపాఠము 18 సంపు టాలును ప్రకటితమయినవి. చాలా సంవత్సరాలాయన పచ్చయప్పధర్మకర్తలలో నొకరుగా నుండిరి. చాలకాలముగా ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ఇండియాకు ఎడిటరుగా నున్నారు. ఆపత్రిక గట్టిగా నిర్భాగమాటముగా ప్రజాహితవిషయాలలో అభిప్రాయమిచ్చేది. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు స్వతహాగానే దిట్టమయిన స్వతంత్రుడు నిర్భాగమాటము గాను ధారాళముగాను అభిప్రాయప్రకటనముచేసేవాడు. త్రిలిఙ్గ వారపత్రికరజతోత్సవ సందర్భమున వీరికి అభినందనాలు వ్యాసాలతో చేరిన సన్మానసంపుటి సమర్పింపనున్నారని విని సంతసించుచున్నాను.

## 130

### శ్రీ కే. భాష్యంగారు, బి. ఏ., బి. ఎల్., ఎం. యల్. ఏ., లజ్, మైలాపూరు, మద్రాసు.

తెనుగువారపత్రిక త్రిలిఙ్గ ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడుఇండియాలకు సంపాదకులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి ఈఅభినందనాలతో జేరిన సమ్మానసంపుటి సమర్పింతురని ఆనందించుచున్నాను.

వారు నాకు వ్యక్తిగతముగా మిత్రులు. అదిగాక వారు వారి పండితపితరులు శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు ఒక్కశతాబ్దికాలముగా సంస్కృతము, తెనుగు, అరవములకు చేసినసేవ లెక్కపెట్టరానిది. వారు దక్షిణపాఠము మహాభారతానికిసిద్ధపరచి ప్రకటించినారు. తులసీదాసురామాయణము, లోకమాన్య తిలకుగారిగీతారహస్యము తెలుగుఅనువాదములు ప్రకటించినారు. సాధారణవిద్యాప్రచారానికి వారుచేసినకృషియు తీసివేయరానిది.

త్రిలిఙ్గపత్రిక రాజకీయఆర్థికతదితరదేశోపయోగవిషయాలలో వివేచనతోకూడిన జాగ్రదభిప్రాయాలనిచ్చునని ప్రసిద్ధి ఈపత్రికరజతోత్సవము త్వరలో జరుగనుండడము చాల తృప్తికరమయినవిషయము.

ఫెడరేటెడుఇండియాసంగతి నేచెప్పదలచుకొన్నదొక్కమాటే. ఇదివరలో దానికి దొరకినపోషణకంటె ఇంకా చాల యెక్కువకది అర్హము. నానాటి ముఖ్యప్రజాహితవిషయాలలో ఈపత్రికవ్రాసే గట్టివిమర్శలు చక్కగా గ్రహింపబడుచున్నవి. అనేకవిషయాలను పూసగ్రుచ్చినట్లు విప్పిచెప్పుటలో ఈపత్రికప్రసిద్ధిచెందినది.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి చిరాయురారోగ్యములుకలిగి వారు ప్రకటించుపత్రికలు బహుకాలము వర్ధిల్లుగాక!

## 131

### శ్రీ కే. కృష్ణస్వామిఅయ్యంగారు, బి. ఏ. బి. యల్., అడ్వకేటు, రాయపేట, మద్రాసు.

కాలము గడువనుగడువ ప్రాతనాటిసంతోషములకు తియ్యదనము హెచ్చును. నాకును శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని నెల్లూరే బాల్యతనమునాటి యునికి. ఆమాతమాకుఆంధ్రసభ్యత పాటలుపాడి ఉయ్యెలలోనూచినది. తెనుగుసారస్వతానికి పట్టుగొమ్మ వారితండ్రి. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారువారికొలువ చాల చిన్నతనములోనే శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులభుజాలపై బడినది. అమితోత్సాహములోను మహాప్రతిభతోను

తండ్రి కార్యక్రమాన్నీయన నిర్వహించినాడు. నేడు "వావిళ్ల" ఇంటింట తెలిసినపేరైనది. వావిళ్లప్రచురణాలలంకరింపని తెలుగుస్త్రీపురుషులహస్తములు నేడులేవు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు తెలుగువాఙ్మయాన్ని బలపరచినాడంటే దాని కంటె యెక్కువగ తండ్రిగారునాటిన వికాసబీజాలఫలముగా తానూ చాల బాగుపడినాడు. ఈయన విశేషగుణశాలి. ఇతని కందరు మిత్రులే. శత్రువులు నహి. ఇతనిఔదార్యమే ఇతనిలోనిదోషము. నిరాడంబరుడు. కాని, ప్రజాహితకార్యము ప్రతిదానిలో మొదటి వాడే. విద్యావిషయాలలో ఇతనికి కడుశ్రద్ధ. ఎన్నేండ్లో పచ్చయప్పధర్మకర్తగానుండినదే దానికి గుర్తు. మద్రాసు కార్పొరేషనులో కౌన్సిలరు. చాల ప్రజానుకూలాలకాదిమ కారణము. పత్రికాలోకములోనా త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాలు అతనిశ్రద్ధను చెప్పక చెప్పును. గోష్ఠిలో శ్రీశాస్త్రులు ప్రతిభావంతుడు. సంభాషణ కుద్దీపకుడు. ధైర్యముతో నిశితముగా అభిప్రాయమిచ్చేశక్తి. తెలుగువాఙ్మయాన్ని పునర్జన్మింపజేసిన ప్రచురణకర్త. అన్నిటికంటె గొప్పయేమంటె అప్రతిమానుడగుగృహస్థు.

మనదేశానికి ముఖ్యముగా ఆంధ్రదేశానికి సేవచేస్తూ ఈయన చిరాయువుగా వర్ధిల్లుగాక!

## 132

## శ్రీ ఆర్. సూర్యారావుగారు, బి. ఏ., బి. యల్,

హిందూధర్మాదాయాలబోర్డు మాజీ అధ్యక్షులు, వాల్తేరు.

తెలుగువారపత్రిక త్రిలిఙ్గరజతోత్సవము జరుగుతుంది. తత్సమయమున ఆపత్రికకును ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియాకునుసంపాదకులైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారికి అభినందనపూర్వకముగా సమ్మానసంపుటిసమర్పింతురు. వారు వారికుటుంబము ముద్రాపకులుగా ప్రచురణకర్తలుగా తెలుగుసంస్కృతాలకుచేసినసేవ తలంపునకు రాగా ఈక్రిందివాక్యాలు వ్రాసిపంపుచున్నాను.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారితండ్రి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు తెలుగుసంస్కృతాలలో అఖండపండితులు. వేదాగమవేత్త. 19-వ శతాబ్దపుమధ్య కాలములో వారు మద్రాసుకువచ్చిరి. అదివరకు తాళపత్రాలలో వ్రాసియుంచిన తెలుగు సంస్కృతగ్రంథాలనేకములను ప్రాతకాలమునాటివానిని ముద్రించి ప్రకటింపనారంభించిరి. వారు సంపాదించడము అచ్చువేయడము ప్రకటించడములలోచూపినశ్రద్ధ ఉత్సా

హాయములే ఉండకపోతే ఇవియేవీ బయటపడియుండవు. తరువాతిసంతతులకు దొరకి యుండవు.

సుప్రసిద్ధులైన ఈ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌సంస్థవారు ప్రకటించిన యేదో ఒకగ్రంథముపెట్టుకోని మధ్యతరగతిఇల్లు తెలుగుదేశములో ఒక్కటికూడా లేదంటే అతిశయోక్తికాదు.

తమగ్రంథాలు ముద్రింపించి ప్రకటించుకోలేని బీదతెనుగుకవులు గ్రంథకర్తలు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని కలసికొన్నారా సాధ్యమైనంతత్వరలో తగినరీతిగా వారిఅభీష్ట మీడేరిందన్నమాట. శ్రీశాస్త్రులు తండ్రికార్యాన్నిసాగించి యెన్నో తెలుగు సంస్కృతగ్రంథాలను లోకానికి ప్రసాదించినారు. వీరినాంధ్రదేశము గుర్తించి భాషోద్ధారక బిరుదము వీరికిచ్చియుండడము న్యాయము.

కాని, శ్రీశాస్త్రులవారిజీవనము సారస్వతసేవతో నిలిచిపోలేదు. వీరు త్రిలిజ్గ అనే తెలుగువారపత్రిక, ఫెడరేటెడుఇండియా అనే ఇంగ్లీషుపత్రిక ఆరంభించిరి. వీటికి మంచి ప్రచారమున్నది. అతివాదులు లోకాభిప్రాయాన్ని పెడదారికి లాగుకొనిపోయేసందర్భా లలో ఈపత్రికలు ప్రజానీకానికి చక్కనిత్రోవ చూపించి రుజుమార్గమునకు తేజూచు చున్నవి శ్రీశాస్త్రులవారి అభిప్రాయాలు ఎల్లప్పుడుస్వతంత్రములు, చక్కటివి.

వాఙ్మయములో నేమి పత్రికాప్రచారములో నేమి ఆంధ్రదేశానికి శ్రీశాస్త్రులవారు చేసినసేవ నిజముగా చాలగొప్పది. వారి వారపత్రిక త్రిలిజ్గకు రజతోత్సవముజరిగే ఈ సందర్భములో వారు ప్రతిఆంధ్రుని అభినందనాలుపొందడానికి పూర్ణముగా అర్హులు.

వారు చేస్తూఉండేకృషి బాగాసాగించడానికి శ్రీశాస్త్రులుగారికి చిరాయువగుగాక!

## 133

## శ్రీ సీ. సాంబశివరావుగారు, బి. ఏ, బారిస్టరు, మైలాపూరు, మద్రాసు.

ఆంధ్రదేశానికి తెలుగువాఙ్మయానికి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు త్రిలిజ్గ పత్రికప్రకటించి చేసినట్టియుపకారము చాలగొప్పది. ఆపత్రిక రజతోత్సవసమయమున నేనును ఆయుత్సవాలలోపాల్గొనుటకు మిక్కిలిసంతసించుచున్నాను. వారితండ్రి, వారి కుటుంబములోని ఇతరపండితులు ఆరంభించినమహాత్కార్యాన్ని సాగించుకొనివచ్చి వారు ఆదర్శాను నిలుపుకొనివచ్చినారు. వీరు ప్రౌఢరచనలను తెలుగునందు అచ్చువేసి ప్రకటించడముచేత ఆంధ్రులకు వానిని చదువుకోడము మిక్కిలి సుళువైనది. చక్కని

వ్యాఖ్యానాలు అందులోనిరసాన్ని వారికి పంచిపెట్టినవి వారికి సహజముగా అలవాటయిన మర్యాద, వారిధర్మబుద్ధి, ఉదారస్వభావము వారని అందరికిని ప్రేమపాత్రులగావించు చున్నవి. వారు ప్రజాహితజీవితముచేత సంపాదించిన ప్రజారంజకత్వాన్ని ఇనుమడింపజేయు చున్నవి.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారును వారిత్రిలిఙ్గయు చిరకాలము వర్ధిల్లుగాక!

## 134

### శ్రీ ఈ. వినాయకరావుగారు, మదరాసు లిబరలు లీగుసెక్రటరీ, అడ్వకేటు,

మైలాపూరు, మద్రాసు.

నామిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిసంపాదకత్వమున వెలువడే త్రిలిఙ్గ పత్రికరజతోత్సవంజరుగునని విని సంతోషముపొందితిని త్రిలిఙ్గ సోదరపత్రిక ఫెడరేటెడు ఇండియాతోకూడ మనరాజకీయజీవితానికి ముఖ్యముగా ఆంధ్రదేశములో మంచిదోహదము చేసినది. సంస్కృతములోని ప్రౌఢరచనలను మహాజనులకు రుచిగలుగునట్లుగా ప్రచారముచేయడమేకాకుండా వీరు తెలుగువాఙ్మయములో బ్రహ్మాండమయిన ప్రచురణసాగించినారు. మద్రాసులోని ఆంధ్రఛేంబరు ఆఫ్ కామర్సుకు ఈయన ఆయువుపట్టు. కార్యదర్శిగానుంటున్నారు. ప్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణప్రబోధములో వీరు గొప్పభాగరులు వీరిసారస్వత జీవితములో ఇతరప్రజాహితజీవితములో మనప్రాచీనసభ్యతను నేటి నవీనవాతావరణముతో మేళవించితే నెంత మేలుసమకూర్చవచ్చుననేది స్పష్టపరచినారు. చక్కని కార్యపరమార్గములో ప్రజాధారకరాజకీయసంస్థలను నడుపుకొనెంచు ఈరాష్ట్రములో ప్రజలలో విజ్ఞానాన్ని విస్తారముగా దేశభాషలమూలకంగాను ఇంగ్లీషుమూలకముగానూ వెదజల్లడమావశ్యకము. ఈదృష్టితో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారును వారిసంస్థయు మన ప్రజాహితజీవితానికి జాతీయధోరణిగా గొప్పయుద్దీపకాన్ని కల్పించినారు. రజతోత్సవ పుణ్యకాలములో సహజముగానే అనేకమందిమిత్రులు శ్రీశాస్త్రులవారి కర్తృరీతిని అభివందనాలు సమర్పింపగలరు. ఈపత్రిక చిరమువర్ధిల్లి మహత్తరసేవ గావించుగాక!

## 135

### శ్రీ కే. యల్. నరసింహారావుగారు, బి. ఏ, బి. యల్, అడ్వకేటు, హైకోర్టు, మద్రాసు.

కడచిన ఇరువదియేండ్లుగా నేను శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని చాలా సన్నిహితముగా ఎరుగుదును. బ్యాంకింగు, కో ఆపరేటివ్ ఉద్యమాలతో ఆయనకు సంబం

ధము కలదు. మద్రాసుసెంట్రలు కోఆపరేటివు బ్యాంకిలో రెండుపర్యాయములాయన డైరెక్టరుగా నుండిరి.

వారు మనకోస్తావ్యాపారవ్యవహారాలతో సంబంధముగలవారు. దక్షిణఇండియా ఛేంబరు ఆఫ్ కామర్సులో ప్రముఖులయినసభ్యులు. ఆంధ్రఛేంబర్ ఆఫ్ కామర్సుస్థాపకులు, గౌరవకార్యదర్శి. మద్రాసుపోర్టుట్రస్టులో సభ్యులుగా నుండిరి ఇప్పుడు మద్రాసు ఇండస్ట్రీసుబోర్డు (పరిశ్రమలబోర్డు) లో సభ్యులుగా నున్నారు. మదరాసు ప్రచురణకర్తల సంఘమునకు చాలాకాలముగ ఉపాధ్యక్షులుగనున్నారు.

వారికి విద్యాశాఖాసంబంధాలున్నవి. పచ్చయప్పధర్మకర్తగానుండిరి. హిందూ థియలాజికల్ హైస్కూలుకమిటీలో పెక్కేండ్లు వారు సభ్యులు. కొంతకాలము మద్రాసు విశ్వవిద్యాలయసెనేటులోను, బోర్డు ఆఫ్ స్టడీసులోను సభ్యులుగానుండిరి. అణ్ణామలై విశ్వవిద్యాలయమున తెలుగుబోర్డు అఫ్ స్టడీసులో మెంబరుగానుండిరి.

వీరు మునిసిపలుపరిపాలనతోను సంబంధముకలవారు. మద్రాసుకార్పొరేషనులో సభ్యులుగానుండిరి. వీరికి కార్మికులసమస్యలలో శ్రద్ధ. ఇండియన్ ఫెడరేషన్ అఫ్ లేబరు కమిటీలోనున్నారు. అట్లే ట్రేడుయూనియన్ యూనిటీకాన్ఫరెన్సులోనుండిరి. మద్రాసులోను ఇతరజిల్లాలలోను యజమానులకునుకార్మికులకును తగాదాలు కలిగినప్పుడు ఇరుపక్షానికిశాంతికుదురడానికి శ్రద్ధతోపనిచేయుచున్నారు. వీరికి ఆటలు, విందులు వగైరాలలోను శ్రద్ధ కలదు.

వీరు మద్రాసు ఫిల్ముసెన్సరుబోర్డులో మెంబరు. నగరములోని ప్రజోపయోగబహిరంగసభలలో అనేకములతో వీరికి సంబంధమున్నది.

వీరు విజయముపొందినపత్రికానిర్వాహకులు. నేడు రజతోత్సవముజరుగుచుండే తెనుగు త్రిలింగపత్రికను ఇంగ్లీషు ఫెడరేటెడ్ ఇండియాను నడుపుచున్నారు. ప్రసిద్ధప్రాచీనప్రౌఢకావ్యాలను ఉత్తమముగ ప్రకటించడమేగాకుండా ఎన్నో నవీనకావ్యాలను గూడప్రోత్సహించి వీరు తెలుగుసంస్కృతవాఙ్మయాలకు మహత్తరసేవచేసినారు. ఒకపాతికశతాబ్దిగా వీరుతెలుగురచనకు మిక్కిలిప్రోత్సాహము కలిగించుచున్నారు.

రాజకీయాలలో ఈయన గట్టిజాతీయవాది. లిబరలు, కాంగ్రెసువాదాలకు మధ్యస్థానమాక్రమించువాడు. ఏదో ఒకపార్టీటికెట్టు సంపాదించుకొని ఈయన ముందునకు త్రోసికొనివచ్చియుండగలవాడు; కాని, ఆగోతిలోపడుటకీయన ఇచ్చగింపలేదు. ఈయన ఆంధ్రుడుకావున ఆంధ్రరాష్ట్రసంపాదనపరుడు. ఆంధ్రమహాసభకు కొంతకాలము గౌరవ

కార్యదర్శి. ఇటీవల మద్రాసులో సమావేశమయిన ఆంధ్రమహాసభ ఆహ్వానసంఘానికీయన అధ్యక్షుడు.

వ్యక్తిగతముగా ఈయన చాలా మైత్రిపరుడు శాంతుడు ఉదారస్వభావుడు. ఏమంచి ఉద్యమానికి ఏఅర్హవ్యక్తికీ ఈయన కొద్దోగొప్పోసహాయముచేయక నుండలేదు. ఈయన సిరి, సంపద, పలుకుబడి ఇన్నీయున్నా ఈయన యెల్లప్పుడు నిగర్వి, నమ్రుడు, సుస్వభావుడు.

ఆంధ్రదేశములో వాఙ్మయవికాసాలుసేవచేయడానికి ఈశ్వరు డీతనికి దీర్ఘాయు రారోగ్యము లొసంగునుగాక!

## 136

## శ్రీ ఈ. ఎల్. అయ్యరుగారు, బి. ఏ., బార్-అట్-లా, వేపెరీ, మద్రాసు.

హిందూ రాజులు సారస్వతపోషకులుగనుండిరి. వారిపోషణ లేకపోయియున్న యెడల నేటివాఙ్మయమే ఉండియుండదు. మనము రాజులను బలపరచేవారము. వారు ప్రజలను తల్లిదండ్రులవలె కాపాడేవా వారు. మనదినకృత్యాలు చేసుకోవలసింది మనకష్టాల వారుకనిపెట్టి వాటిని తీర్చేవారు. మనము కుడిచేయిచాచవలసిందే. మన ఆయుర్వేద వైద్యులు మనకుండేరుజ యేమాఅని చెప్పేవారు. జ్యోతిష్కునికి మనజాతకము చేతికివ్వ వలసినది—జాతకము లేకపోతే పుట్టినదినము చెప్తే చాలు—అతడు మన భూతభవిష్య ద్వర్తమానాలను చెప్పేవాడు. మన ప్రాతాచారాలు కాలానుగుణముగా మారవలెను.

త్రిలిఙ్గయు వావిళ్లముద్రణాలయమును తెలుగువాఙ్మయాభివృద్ధికి చాలా తోడ్పడి నవి. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ప్రాచీనవాఙ్మయోద్యానములో చాలా నెక్కు వగ దూరి విహరించినారు. తాళపత్రాలలో దాగియున్న పారిజాతపుష్పాలను ప్రపంచానికి ప్రసాదించినారు. ఇందులో వారు వారితండ్రిగారిమహోద్యమాన్ని చక్కగ సాగించినారు. "త్రిలిఙ్గ", "వావిళ్లముద్రణాలయము" ఇవి రెండూ విద్యావికాసాలనువెదజల్లే రెండు ప్రజాహితసంస్థలక్రింద లెక్కకట్టతగ్గవి. శ్రీశాస్త్రులవారు ప్రాతనాటిరాజుల ధర్మాలలో నొకధర్మాన్ని నిర్వహించుచున్నారు. త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున వారికి సమ్మానసంపుటిని ప్రజలిచ్చి బహూకరించుట ఉచితము.

## 137

## శ్రీ జే. సత్యనారాయణమూర్తిగారు, ఎం. ఏ., బి. ఎల్., మైలాపూరు.

త్రిలిఙ్గరజతోత్సవము త్వరలోజరుగగలదని విని అపారసంతోషముపొందితిని. నాకు తృప్తిని ఆనందమునుఇచ్చిన తెలుగువారపత్రికలలో త్రిలిఙ్గ నొకటి. నేను కలకత్తాలో విద్యార్థిగనుండి బంగాలీవాఙ్మయమునెడ శ్రద్ధచేయుచున్నప్పుడు ఈపత్రిక ఆంధ్రవాఙ్మయ పునరుజ్జీవభావాల నాకు ప్రత్యక్షమొనర్చుచుండినది. ఉత్తర, దక్షిణదేశాలవాఙ్మయాలను తారతమ్యపరిశీలన చేయదగియున్నదని నన్నిదిపురికొల్పినది. కావున నాకు త్రిలింగతోగల సంబంధము ఫలప్రదము, పవిత్రము. అందువలన ఈపత్రిక ఆంధ్రనాగార్జునగిరినెక్కి రజతోత్సవమందుచున్నదనిన నాఆనందమునకు మేరలేదు.

త్రిలిఙ్గ విజయవంతముగ ఒకవయోపరిపాకమందినందులకు అభినందనాలు చెప్పుతూ, భారతభూమి పత్రికారచయితలకుండే-ముందుగొయ్యి వెనుకనుయ్యి కష్టాలన్నిటిని తప్పించి దీనినినడిపించిన శ్రీశాస్త్రులవారికి అభివాదనములు సమర్పించుచున్నాను. వాఙ్మయపునరుజ్జీవము కలిగితే తప్ప ఏదేశముగూడ పునర్జన్మ స్వీకరింపలేదనేసూత్రాన్ని తండ్రివలె వీరును గ్రహించి దేశసేవకు తమ ఆయువును సమర్పించినారు. ప్రపంచవాఙ్మయచరిత్రలోనికి కొంతతొంగిచూస్తే కార్లయిలు చెప్పినట్టుగా యోగదృష్టిగలప్రచురణకర్తలే సర్వసమవర్తిత్వహృదయాలుకలవారే గొప్పసారస్వతప్రయత్నాలు సాధింపగలుగుతారనేది స్పష్టము కాగలదు. తమఆదర్శాలు గట్టెక్కడానికి వారే ఉత్తమప్రతిభావంతులగురచయితలను ప్రోత్సాహపరచి వారిచేత వాఙ్మయసృష్టిచేయింపగలరు. మనభారతావనిలో నొకదురదృష్ట పరిస్థితి కలదు. ఎల్లప్పుడు తమలాభదృష్టితోనే చూచి రచయితల అపారశ్రమను దమ్మిడీకి కేరముచేసేధోరణిని ప్రచురణకర్తలెప్పుడును కనుబరతురు. ఉత్తరమున శ్రీగురుదాసబెనర్జీ అండ్ సన్స్‌ను, దక్షిణమున వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌ను జాతీయత, పరోపకారచింత, ఆదర్శముకలవారుగ కన్పించుట సంతోషింపదగినవిషయము. శ్రీబాబూ గురుదాసబెనర్జీయు, శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారును సమకాలికులు. ఒక్కరినొక్కరు ఎరుగకయే వారు బంగాళము ఆంధ్రములవాఙ్మయాలకు వీరు కొరలేని శ్రద్ధాభక్తులతో గొప్ప సేవచేసిరి. బెనర్జీ గారికుమారునివలెనే వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తణ్డ్రిబరువు తమ భుజముమీదపడడంతో దానినుత్సాహంగ నిర్వహించడము జరిపినారు. వీరిదృష్టాంతాన్ని ఇంకాకొందరు ప్రచురణకర్తలనుసరించి దాగివశక్తులను ప్రతిభను సరస్వత్యారాధనకయి

బయటికిలాగిన భాగుండును. అప్పుడు మానవహృదయము సంస్కారముపొంది ప్రజా నీకానికి శాంత్యానందములు సమకూరియుండును.

తెలుగుదేశములో అనేక ప్రాంతాలలో శ్రీశాస్త్రులవారిని గౌరవించడములో ఆంధ్రులు తమ్ము తాము గౌరవించుకొన్నారు. ఆంధ్రభారతిని భారతమాతను ఆరాధించుట కీతనికి చిరాయువగుగాక!

వారి త్రిలిఙ్గకు విస్తారతరప్రచారప్రఖ్యాతులమరుగాక!

## 138

### శ్రీ సీ. ఆర్. పట్టాభిరామన్‌గారు, బి. ఏ., బి. ఎల్.,

బారిష్టరు-ఎట్-లా, తేనాంపేట, మద్రాసు.

దక్షిణఇండియాలో ప్రాచీనవాఙ్మయప్రచారానికి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు చాలకృషిచేసినారని వ్రాయుటకు సంతసించుచున్నాను. ఆవాఙ్మయమభ్యసించే ఏ అభ్యర్థిగాని శ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌సంస్థను పరిచయములేనివారుగా నుండుటకు వీలులేదు. ఈసంస్థ చిరస్థాయియై తనకార్యక్రమమును సాగించునుగాక!

## 139

### శ్రీ యస్. ముత్తయ్యముదల్యారుగారు, సి. ఐ. ఈ,

మాజీమంత్రి, మైలాపూరు, మద్రాసు.

ప్రచురణకర్తగా ప్రజాహితజీవిగా శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని నేను బహుకాలముగా నెరుగుదును. కొన్నిసందర్భాలలో అతనితోకలిసిపనిచేసినాను. వారు ప్రక టించినకొన్ని అరవప్రచురణాలు వారు దయతో నాకిచ్చిరి. నేను వానిని శ్రద్ధతో చదివితిని. తెలుగుభాషతో నాకు పరిచయములేదు. కాని, నేను వారిఫెడరేటెడుఇండియాను చదివి నాను. కాబట్టి త్రిలిఙ్గలోనిసంభవాలవ్యాఖ్యలు చక్కనిదృష్టిలోనుండునని ధైర్యముగా చెప్పగలను. ఈదేశములో అయిదేండ్లకుపైబడిజీవించేపత్రికలు చాలతక్కువ. త్రిలిఙ్గ రజ తోత్సవముజరుగుతుండంటె శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి స్థిరప్రజ్ఞను నిరూపిస్తుం దన్నమాట. వారిపరిశ్రమకు తార్కాణమన్నమాట. ఇవియే స్వర్ణోత్సవాన్నికూడ సాధ్యముచేయగలవనుట ధృవము. త్రిలిఙ్గకును శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని అభివందనాలు.

## 140

### శ్రీ తేకుమళ్ల రామచంద్రరావుగారు, యం. యే., బి. యల్., అడ్వకేటు, మచిలీపట్టణము.

తెలుగువాఙ్మయాన్ని వికాసాన్ని ప్రకటనచేయడానికి మనకు తెలిసినంతవరలో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారితండ్రి చేసినంతకృషి యెవ్వరూచేయలేదు. తెలుగుదేశ మంతటా అక్షరజ్ఞుడుప్రతియొక్కడూ వావిళ్లపేరు నెరుగును; దానిని గౌరవిస్తాడు. తెలుగు ప్రజలకు వీరియెడలగల ప్రేమమర్యాదలను కనుపరచడానికి వీరికి భాషోద్ధారకబిరుదము నిచ్చియున్నారు.

ఈదినాలలో రాజకీయాందోళన మహత్తమము మానవులకు శాంతియుండుట అరుదు. వివేచనకంటె సంవేదనమందు పరుగెత్తుతుండును. త్రిలిఙ్గ ఫెడరేటెడ్ ఇండియా లలో వారముతరువాత వారములో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ప్రకటించేవిమ ర్శలలో ఈభావముద్యోతకమవుతుంటుంది. మాంచెస్టరుగార్డియను చదివితే ఎటువంటి సన్నివేశాలు మనసుకు గోచరించుచుండునో ఈపత్రికలు చదివినా అట్టివే గోచరించు చుండును.

శ్రీశాస్త్రులవారిజీవితాన్నినడిపే సూత్రమేమిటా అంటె ప్రజాహితజీవితమునెడల అరగొరలేనిశ్రద్ధ. వారాక్రమించినహోదాలు వారు శాంతంగా నిరాడంబరంగాసలిపిన శాశ్వతోపయోగకరసేవ వర్ణింపదలచుకొని వివరాలకుదిగితే ప్రత్యేకము గ్రంథంవ్రాయ వలసిందే. ఇంతశ్రద్ధతో స్వధర్మనిర్వహణచేసే యిట్టివారిని నేనెందఱనో చూచియుండలేదు. ఈయన ఒక్కొక్కరియెడల చాల దయాళువుగానున్నారు. ఒకవేళ అది ఆయనలో దోష ముగా పరిణమించేఅంత విస్తారగుణమనిపించును. ఆర్థికంగా, పౌరరీత్యా, వైజ్ఞానికంగా వీరు వ్యక్తిగతంగాను త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాల మూలకముగాను నిర్వహిస్తుండే అప్రతి మానసేవ నిరంతరముజరుగుటకు వీరికి చిరాయువగుగాక !

## 141

### శ్రీ బీ. వెంకటపతిరాజుగారు, సీ. ఐ. ఈ., విశాఖపట్టణము.

తెలుగు, సంస్కృతము, అరవములలో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు వారి తండ్రి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారుచేసిన గొప్పప్రచురణకార్యక్రమమునకై దేశము వారికి కృతజ్ఞమయి యుండదగును. త్రిలిఙ్గ చాల ప్రయోజనయుతపత్రిక. సన్మానసంపుటి ప్రచురణము అర్హకార్యము. పునావాసి నాప్రాచీనమిత్రుడు శ్రీ ఎన్. సీ. కేల్కారుగారు

అధ్యక్షులుగానుండ అంగీకరించినారు. దేశసేవచేయడానికి శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారికీశ్వరుడు చిరాయువిచ్చి రక్షించుగాక! దేశానికంతటికిని, ముఖ్యముగా ఆంధ్రదేశానికి, మేలు చేసే ప్రచురణములను ప్రకటించుచు వావిళ్లసంస్థ ప్రవర్ధిల్లుగాక!

**142**

**శ్రీ పీ. సోమసుందరంగారు బి. ఏ, బి. యల్.,**

అడ్వకేటు, 4, దక్షిణమాడవీథి, మైలాపూరు, మద్రాసు.

వాఙ్మయ, పత్రికారచన, రాజకీయజీవితములో 25 ఏండ్లయుగమునుసాధించిన మామకమిత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి నాహృదయపూర్వకాభివందనములు. వారితో ఎవరుసంభాషించినను అతనిమోహములో పడకుండా తప్పించుకోడానికిరాదు. వ్యక్తిగతానికతీతంగా వీరు మనుష్యులనుగురించి సంభవాలనుగురించిచేసేవిమర్శలు క్రొత్తదనపుసొంపుకలవిగానుండడమేగాక నిలవబెట్టి ఆలోచనచేయించేవిగాకూడ నుండును. పెద్దచిన్న లభేదములేకుండా ఇతని కోరడాతగులుతుంది. రాజకీయసన్యాసులకుచేష్టలను బయటబెట్టడములో నితడుద్దండుడు. ఉన్నస్థితి పరిశీలించడము న్యాయము నిర్ణయించడము ఇతని అభిప్రాయములలోనిగుణము. ఇతనికి ప్రతిపక్షులెవ్వరైనాఉంటే ఒక్కవిషయము వారుకూడ ఒప్పుకోకుండతప్పదు. ఎదుటివానిలో సత్తాయేముందోకనుగొని దానికి విలువ పెట్టుధోరణి వీరికి కలదు.

వీరిసేవలో ఉత్తమమయినది-నిజంగా శాశ్వతముగా ఉండేది-వీరుచేసినవాఙ్మయసేవ. తెలుగుప్రజలు తెలుగువాఙ్మయముమీద అభిమానముగలఇతరులు అందరూ ఇతడును ఇతనికుటుంబమున్నూ తెలుగువాఙ్మయానికిచేసినసేవకు వీరికెల్లకాలము ఋణపడియుండగలరు. సంస్కృతవాఙ్మయపునరుజ్జీవనానికి వీరుచేసినసేవయు అనల్పము. ఎన్నో ప్రౌఢగ్రంథాలను బయటకుదీసి వీరు జాగ్రత్తగాపరిశోధించి ప్రకటించినారు. ప్రచురణకర్తల ప్రపంచములో వీరు పాశ్చాత్యసుప్రసిద్ధగ్రంథప్రచురణకర్త లెవ్వరికినితీసిపోరు. శ్రీశాస్త్రుల వారికి ఈశ్వరుడు చిరాయువిచ్చి ముందుకార్యములు సాగింపించుగాక!

**143**

**శ్రీ ప. సూర్యనారాయణయ్య, బి. ఏ, బి. యల్.**

అడ్వకేటు, 'బెస్సామీర్', పూనమల్లిహైరోడ్డు, కీల్పాక్, మద్రాసు.

25 ఏండ్లకుపైబడి నాకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిపరిచయము గలదు. వారియోగ్యతయు సుగుణాలును ఈలోకప్రజలకు బాగా తెలియును. వారివద్దకు సహా

యార్థముపోయినవారెవ్వరును వృథాగాలేదు. వారనేకప్రజాహితధర్మసంస్థలతో సంబంధముగలప్రజాహితజీవి. వానికి లాభము వీరికికీర్తిఆసంబంధముచేత నిశ్చయములు. వీరు నిరాడంబరముగా మౌనముగా సేవచేసేబాబతు ఎప్పుడూ మహాజనకరతాళధ్వనులు కోరే బాబతుగాదు. మనదేశపురాజకీయపరిణామానికి స్వభావముచేతనే మితులున్నవి ఆమితులకులోబడి ఈయనకార్యసాధనచేయడానికిబూనిన నికరపుకాంగ్రెస్సువాది.

కాని ఈయన ప్రత్యేకసేవావీథి వాఙ్మయమని చెప్పితీరవలెను. తెలుగువాఙ్మయాన్ని చక్కగా సంరక్షించి ఈయన నిలవబెట్టుటలో విజయధంకాకొట్టినారు. వీరు వీరి పవిత్రపితరులసేవ ఎప్పుడూమరువరానిది. విలువకట్టరానిది.

వీరికి వీరిసంస్థకు చిరాయువగుగాక! త్రిలిఙ్గపత్రిక రజతోత్సవసమయమునకు వీరికి నాఅభినందనాలందించుచున్నాను.

## 144

### రావుబహదరు వారణాసి రఘునాథరెడ్డిగారు, రేగల్లు, వీలేరు, చిత్తూరుజిల్లా.

తెలుగుభాష సాధారణముగా ఉపయోగించడానికినేర్చిన ఎవ్వరుగూడ శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తెలుగువాఙ్మయానికీ పత్రికాప్రచారానికీ గావించిన ఉత్తమ సేవను గురుతింపలేకపోరు. అట్టిసందర్భమున నాకుగలగౌరవమును నేను బహిరంగముగా ఈతరుణములో చెప్పలేకపోతే ధర్మముచేసినవాణ్ణి గాకపోవుదును.

శ్రీవావిళ్లవారిప్రచురణమేదోఒకటిలేనిగ్రంథాలయముగాని ఇల్లుగాని తెలుగుదేశములో ఎక్కడాలేదు. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు తెలుగుదేశానికి చేసిన సేవ అప్రతిమానము, ప్రథమగణ్యము.

వారు స్వయముగా తలధరించినకార్యక్రమాన్ని ఉత్సాహముతోను శ్రద్ధతోను నెరవేర్చడానికి వారికి చిరాయువు స్థైర్యములగుగాక అని ప్రార్థించుచున్నాను.

## 145

### శ్రీ రేబాల పట్టాభిరామిరెడ్డిగారు, జమీందారు, స్టోన్‌హౌసుపేట, నెల్లూరు.

త్రిలిఙ్గ షష్ఠ్యబ్దపూర్తిఉత్సవముకూడ చూడడానికి చిరాయువగుగాక అని ప్రార్థించుచున్నాను.

146

**శ్రీ నిరంజనానందస్వామిగారు, సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై.**

తెనుగుభాషకు వాఙ్మయానికి పాతికశతాబ్దముగా సేవచేసి త్రిలిఙ్గరజతోత్సవ మనుభవించుచున్నదని విని సంతసించితిమి. మనదేశపు పవిత్రవాఙ్మయాన్ని పునరుజ్జీవింపజేయడానికి సుమారుశతాబ్దముక్రిందటనుపక్రమించిన వావిళ్లవారిప్రచురణకార్యక్రమానికి శ్రీభగవానునికృపచేత విజయమగుగాక! భగవానునిఆశీర్వాదములతో మాఅభినందనాలు కైకొనుడు.

147

**శ్రీ బీ. వీ. నరసింహస్వామిగారు, 74, లాయ్డ్సురోడ్డు, రాయపేట, మద్రాసు.**

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులుగారియెడల నాకుగలగౌరవాదరాలు తెలుపుటకు సంతసించుచున్నాను. వారు వైజ్ఞానిక ఆధ్యాత్మికగ్రంథరాజిని అచ్చువేసి ప్రకటించి ప్రచారము చేసినందులకు ధర్మప్రీతిగలవారొక్కొక్కరును వారిని జ్ఞాపకముంచుకొని వారిసేవను కృతజ్ఞతాపూర్వకముగా గురుతింపదగును.

148

**శ్రీ సచ్చిదానందసంఘముఅధ్యక్షులు శ్రీ స్వామి రాజేశ్వరానందగారు,**
**44, నాగప్పయ్యరువీథి, ట్రిప్లికేన్, మద్రాసు.**

హిందూమతానికి ప్రత్యేకముగా తెలుగువాఙ్మయానికి ప్రత్యేకముగా భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చేసినసేవ వర్ణనకుమీరినట్టిది. వారితండ్రియుపక్రమించినకార్యాన్నిసాగిస్తూ వీరు మనమతసంబంధమయిన అనేకగ్రంథాలను ప్రకటించినారు. సంస్కృతప్రౌఢగ్రంథాలను చక్కటిశుద్ధమయిన తెలుగులోనికి పరివర్తనముచేసి తమకు అందించినందులకు తెలుగుచదువరులెల్లకాలమును వీరికి కృతజ్ఞులయియుండగలరు. 'త్రిలిఙ్గ', 'ఫెడరేటెడ్ ఇండియా' అనేపత్రికలను ప్రకటించి శ్రీశాస్త్రులవారు తనప్రత్యేకమార్గములో తాను భారతభూమికంతటికిని తత్ప్రతినిధిగా అఖండసేవచేయుచున్నారు. వారిఔదార్యమును సదాచారములును వారిమానజీవితములో ప్రతిఫలించి ఇతరులకు మార్గదర్శకులుగానున్నవి. వారిభాషోద్ధారకబిరుదము సార్థకము. అంతేఅనుకోరాదు. వారు విజ్ఞానమువెద

జిల్లేవారు కాబట్టి విద్యాప్రకాశకులనియు అనవచ్చును. వారికి చిరాయువగుగాక! విజ యమువెంబడివిజయంబగుగాక!! వారిసేవ ఇతోధికముగా పెరుగునుగాక!!!

## 149

### దివాన్‌బహదరు టి. ఏ. రామలింగంశెట్టియారుగారు,

బి. ఏ., బి. ఎల్., ఎం. ఎల్. సీ., కోయంబుత్తూరు.

త్రిలిఙ్గరజతోత్సవసమయమున సమ్మానసంపుటిప్రకటించి శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారి ప్రజాహితసేవనుకొనియాడుదురనివిని సంతోషించుచున్నాను. వారిముఖము ప్రీతిజనకము. వారు స్నేహపాత్రులు. ఫెడరేటెడుఇండియాద్వారా వారు స్వదేశసంస్థా నాలకును వారిభారతదేశప్రజలకును చేసినసేవ సుప్రసిద్ధము. వారికి చిరాయువును సౌఖ్య మును అగుగాక!

## 150

### లెఫ్టి నెంటుకల్నల్ వీ. మహాదేవన్‌గారు, ఐ. యం. యస్., మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భాన హృదయపూర్వకఆశీస్సులు. తత్సంపాదకులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికభివందనములు.

ఒకధర్మసంస్థనిర్వాహణసంబంధముగా నేను శ్రీ శాస్త్రులవారిని పెక్కేండ్లుగానెరుగు దును. విజయవంతముగా పత్రికనడపడానికి కావలసినసుగుణాలతోకూడ అతడు ఇతర సంస్థలను నడుపడానికి తగినసామనస్యము చక్కనివివేచనగలవాడని ఈసంబంధముచేత నాకు అర్థమయినది. శ్రీ శాస్త్రులవారి ప్రత్యేకకృషిచేతనే ఈపత్రిక ఇంత విజయవంతముగా జరిగినదనడాని కేవిధమయినసందేహమునులేదు.

త్రిలిఙ్గపత్రికయు తత్సంపాదకులును చిరకాలము వర్ధిల్లుదురుగాక!

## 151

### డాక్టరు. డి. యస్. రామచంద్రరావుగారు, యం. ఏ., యం. డి.,

అనంతభవన్, బసవన్‌గుడి, బెంగళూరు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులను పెక్కేండ్లుగానేనెరుగుదును. వీరు మద్రాసు లోనిఆంధ్రులకు విదువనిమిత్రులు. వీరి త్రిలిఙ్గ, ఫెడరేటెడ్‌ఇండియాలు మద్రాసుకోస్తా అంతటను పేరుపొందినవి. వాని వివేచనాయుతాభిప్రాయములకు అవి మెప్పునందినవి.

గ్రంథప్రచురణకర్తగా వీరిపేరాంధ్రదేశమంతటను తెలియును. విధిలేనిసందర్భాలలో తెలుగుపుస్తకము కొనవలెననుకొంటే తప్పక వావిళ్లవారిసంస్థకు పోవలసినదే.

వీరికి చిరాయువై వీరు ఎక్కువనెక్కువగా నవీనయుగవాఙ్మయప్రకటనకు పూనుకొని ఆంధ్రవాఙ్మయము భారతభూమి భాషావాఙ్మయములలో అగ్రస్థానము వహించునట్లు చేయుదురుగాకఅని కోరుచున్నాను.

వీరికిని త్రిలిఙ్గకును సదాకల్యాణంబై విజయంబగుగాక!

## 152

## రావుసాహెబు శ్రీ కె. రంగస్వామినాయడుగారు,

కోఆపరేటివ్ సొసైటీల జాయింటురిజిస్ట్రారు, త్యాగరాయనగరు, మద్రాసు.

తెలుగువారపత్రిక త్రిలిఙ్గరజతోత్సవసమయమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారికి సమ్మానసంపుటిని సమర్పింపవలసినదిగ మిత్రులుచేసినసంకల్పమున నేను భాగరి కాగలిగినందులకు సంతసించుచున్నాను.

నయమైనమనిషి, నిరాడంబరుడు స్నేహపాత్రుఁడు నగు శ్రీశాస్త్రులవారికి మిత్రులు మెండు. వీరితో మెలగడమంటే వారికి కడుప్రీతి. కథకుడుగా అతనికి మించినవాడు లేడను కొందును. వ్యక్తులనుగురించి అతనికిగలజ్ఞానముఅద్భుతము. ఆవిషయమున నతడొక విజ్ఞానసర్వస్వపుటంతటివాడు.

పత్రికారచయితగావున అతనిపత్రిక చాలపేరుపొందినది. అతడు తండ్రిసాంప్రదాయాన్ని చక్కగానిర్వహించినాడని గర్వపడదగియున్నది.

ప్రచురణకర్తగా అతనిపేరుప్రతిష్ఠలు మరియొకరికి ఉండడమరుదు. ముఖ్యముగా ఆంధ్రవాఙ్మయములో ప్రౌఢకావ్యాలు ప్రకటించుటలో ఈయన ప్రసిద్ధిపొందినాడు.

ఒక్కపాతికశతాబ్దిప్రచురణమయి త్రిలిఙ్గ నేటిస్థితిలోనున్నదంటే అదిఅంతయు శ్రీ శాస్త్రులవారిసామర్థ్యము, కార్యదీక్ష, శ్రద్ధలకు తార్కాణము. వారికిని వారిపత్రికకు చిరాయువును అభ్యుదయమును కలుగుగాక!

## 153

## శ్రీ కే. శ్రీనివాసన్‌గారు, మేనేజింగ్ ఎడిటరు, హిందూపత్రిక, మౌంటురోడ్డు, మద్రాసు.

త్రిలిఙ్గరజతోత్సవముజరిగేశుభమువార్తమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారిని మీతోనందరితోచేరి నేనుఅభినందించుచున్నాను. ప్రాచీనవాఙ్మయప్రచురణకై శ్రీ

శాస్త్రులవారు చేసినసేవ ప్రత్యేకముగా వర్ణింపనే అక్కరలేదు. అపురూపమై అఖండ ప్రయోజనకరములయ్యు వ్రాతప్రతులుగాపడియున్న సుప్రసిద్ధగ్రంథాలను తక్కువవెలల కందరకి అక్కేటట్లుగా అచ్చువేసి పంచిపెట్టినవారువీరంటు ప్రజ ముఖ్యముగా ఆంధ్రదేశప్రజ ఎల్లప్పుడు కృతజ్ఞముగాఉంటుందనడానికి సందేహము లేదు.

శ్రీశాస్త్రులవారింకను చిరకాలము ఇట్టి ప్రయోజనకరసేవచేయుటకు ఈశ్వరుడు వీరి యెడల ప్రసాదించుసుగాక. ఈయుత్సవమునకు జయంబగుగాక!

**154**

**డాక్టరు సర్: సీ. వై. చింతామణిగారు, ఎడిటరు, "లీడరు", అలహాబాదు.**

ప్రత్యేకముగా హిందువులుమొత్తముమీద ప్రాచ్యవాఙ్మయాభిమానులందరును మద్రాసు వావిళ్లప్రెస్సుయజమానులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు అసంఖ్యాకములయిన ఉద్గ్రంథములను ప్రకటించినందులకు వారికి కృతజ్ఞులయి ఉండదగియున్నది. మతములు, తత్త్వములకు సంబంధించినగ్రంథాలంటే వారికి మక్కువ నెక్కువ. వానికంటె ముఖ్యముగా ఈప్రచురణములు ప్రజాసమూహానికి అనేకముగుకష్టాలు నివారించి ఉపకారము చేయగలిగినవి. ఇట్టిసేవచేయడమనేది శ్రీశాస్త్రులుగారి వ్యక్తిగతము మాత్రము గాదు. అది వారికిపారంపర్యముగా వచ్చినది. వారితండ్రి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారాదిని ఈవిషయములో కార్యము బహుసాహసముతోను బహుశ్రద్ధతోను ఆరంభించి మార్గదర్శకులయిరి వారు స్వయముగా గొప్పపండితులు, బ్రాహ్మణులు కాబట్టి వారికీపని వట్టి వ్యాపారముగ ఏర్పడలేదు. ప్రపంచప్రీతిచేత ఇదితమధర్మమని తలధరించిన సేవారీతిగా నేర్పడినది. వారిస్నేహముపొందడానికి తగినవయస్సునాకప్పుడు లేదు. నాతండ్రిగారు వారిని చక్కగనెరుగుదురు. వారుచెప్పగా నేను శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారినిగురించి తెలిసికొంటిని. వారికుమారునితో నాపరిచయమయినను 1929-వ సంవత్సరము డిసెంబరు నుండి ఆరంభమయినది. ఈకొలదికాలములో ఆపరిచయము స్నేహముగా మారడము నాకు లాభప్రదమయినది. అందుకు నేను కృతజ్ఞుడను. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు ఇంకను కొద్దివయసువాడే. కాని అతనిప్రజాహితజీవితాన్నిగురించి అతడును అతనిమిత్రులు మిగుల గర్వపడదగినంతపనిని అతడు నిర్వహించెను.

పరంపరగావచ్చినప్రచురణకార్యాన్ని విపులముచేసి విస్తారముగానడపడమే కాకుండ వీరు తెనుగులో త్రిలిఙ్గపత్రికను ఇంగ్లీషులో ఫెడరేటెడ్ ఇండియాను నడుపుచున్నారు.

వీరు కార్మికులఅభివృద్ధికిని కృషిచేయుచున్నారు. కాంగ్రెస్సురాజకీయాలకును మితవాదుల రాజకీయాలకును మధ్యస్థముగాఉంటాయి వీరిరాజకీయాలు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారు వ్యక్తిగతముగా వీరు సద్గృహస్థులు, మిత్రులుగా ఉపకారపరులు, పౌరులుగా ప్రజా హితజీవులు. ఈశ్వరుడుతలిస్తే వీరు సేవచేయడానికి ఇంకను దీర్ఘకాలావకాశములు కలవు. వీరికి మహోజ్వలభవిష్యత్తు కలుగుగాక అని వీరిమిత్రులందరిఆశీస్సు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిదివరలోనే శ్రీరామాయణమువగైరాలు ప్రకటించినారు. దక్షిణదేశపాఠములతో మహాభారతమును దేవనాగరిలిపిలోసవిమర్శగా ప్రకటించుమహోద్యమము ఇప్పుడు తలనధరించినారు. ఈపనికిచక్కనిసంపాదకునిసంపాదించినారు. మద్రాసు ప్రెసిడెన్సీకాలేజీలో సంస్కృతమునకు ప్రొఫెసరున్ను తంజావూరుమహారాజా సర్ఫోజీసరస్వతిమహాలు సంస్కృతగ్రంథాల సవిమర్శసూచినిప్రకటించిన సమర్థుడు అయిన శ్రీపీ. పి. ఎస్. శాస్త్రి, బి. ఏ (ఆక్సన్), ఎం , ఏ గారిని నియమించుకొన్నారు వీరు మొదటి సంపుటమునకువ్రాసిన ఉపోద్ఘాతము మిక్కిలి ఆకర్షణీయముగాఉన్నది. 1934 మొదలు చాల మంది ఇండోలజిస్టులు—అంటే భారతవాఙ్మయప్రేమీయులు—భారతాన్ని విమర్శతో చదువుచువచ్చినారు నవీనమార్గాలలో విమర్శాపూర్వకముగా ఆలోచించి సశాస్త్రీయముగా నిగ్గుతేల్చినపాఠాలతోకూడినకూర్పు చాలఆవశ్యకమని అభిప్రాయమేర్పడియున్నది ప్రాచ్య విద్యాప్రచారకసంఘాల ప్రపంచసమావేశాలలో ఈవిషయమాలోచనకువచ్చి తగినచర్య పుచ్చుకోడానికి 6000 సవరనులు చందాఅయినది. ఇట్లు విషయము ఆలోచనయందుండగా యుద్ధముపైబడి ఈసంగతి నిలిచిపోయినది. అప్పటినుంచి సహజముగానే ఈదేశంలోనే ఒకమహాప్రయత్నమారంభమయినది. శ్రీసూక్తంకర్‌ను ఎడిటరుగాపెట్టుకొని పూనా భండార్కరు ఇన్స్టిట్యూటువారీప్రయత్నముచేసిరి. 1927-వసంవత్సరము1931సం॥ల మధ్య అయిదు నమోనా ప్రచురణలువేసిరి. మహాభారతము ఉత్తరదక్షిణపాఠములు రెండుప్రసిద్ధమయినవి గలవని డాక్టరుసూక్తంకరు వారిఉపోద్ఘాతమున వ్రాసిరి. అందులో వాసు చతురబ్రహ్మాగణేశ కథయని వర్ణించినది తరువాత ఉత్తరపాఠమునుండి వచ్చిచేరినది. దక్షిణపాఠమునలేదు. మరి ఈరెంటికి ఇంకొకభేదమేమంటే అధ్యాయాలు శ్లోకాలసంఖ్యరెండిటిలో ఒక్కటిగా కన్పింపదు. ఉత్తరపాఠము ఏదోఒకరూపాన ఇదివరకే అచ్చయి ప్రచారముననున్నది. దక్షిణపాఠములేదు. అని శ్రీశాస్త్రిగారువ్రాసిరి. అందుచేత శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారిప్రయత్నాన్ని పరిశోధకులు పండితులును ఎక్కువమన్నింపగలరు.

పూనామున్ద్రణము వ్యాసులవారిరచనకు దగ్గరదగ్గరగా ఉన్నదున్నట్లు ప్రకటించు చున్నదట! కాని ఈదక్షిణపాఠప్రచురణలో మల్లినాథునిమతమును అంగీకరించినారు. 'నామూలం లిఖ్యతే కించిత్ ?' 'నమ్మకమైన ఒక్క వ్రాతప్రతిని ప్రధానప్రతిగా అంగీకరించి దానిని మూలముగావేయడము దక్షిణపాఠము తప్పకకలవని నిర్ణయమయి ప్రాతినిధ్యము నకుదగిన మరినాల్గువ్రాతప్రతులను పరిశీలించి పాఠభేదాలలో ముఖ్యమైనవానిని అక్కడికి అక్కడ సవిమర్శగాసూచించడము వీరవలంబించినారు. శ్రీ శాస్త్రిగారు ఈభారతము ప్రకటనకుగాను 5 వ్రాతప్రతులుపయోగించినారు. నాలుగు తంజాపూరుమహాలుగ్రంథాల యానికిచెందినవి. శ్రీ అప్పయ్యదీక్షితులజీవితచరిత్రవ్రాసిన శ్రీ శివానందయోగీంద్రుల వారిది మరిఒకటి.

ఈప్రచురణము పూర్తిగా 18 సంపుటములయినది. సంపుటము చక్కనిఅనుకూలా కృతిలోనున్నవి. అచ్చు ఆకృతి మెచ్చదగినవిగానున్నవి. మరిఇంతకంటె మేలురకముప్రతిని కోరనువీలులేదు. వెల మితము. బహుజాగ్రత్తగాపరిశోధించి ఇటువంటికూర్పు ప్రకటింప వలయునంటే అపారమగువ్యయముఅవుతుంది. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఆర్థికముగా ఎంతోసాహసించిచేసిన ఈప్రకటనను మాటలతోగాక కార్యదృష్టితో భారత భూమి ఆసేతుహిమాచలమున గల హిందూప్రజప్రోత్సహించునుగాక అని కోరుచున్నాను. భారతదేశమహాగ్రంథమగు ఈమహాభారతము అన్నిసంపుటములును లేని ఒక్క గ్రంథాలయ ముండరాదు.

## 155

## శ్రీ ఖాసా సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్., యల్. టీ,

ఎడిటర్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, మద్రాసు.

త్రిలిజ్గరజతోత్సవము త్వరలో జరుగును. అభివందనాలసంపుటి ఒకటి సంపా దకుడు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిచ్చి సన్మానింతురు. ఆంధ్రదేశములో పాండిత్య సారస్వతాలకు చాల గొప్పసేవచేసినారు. వారికి పుస్తకాలంటే అతిప్రీతి. ఇది చాలమంచి గుణము. కాని, దీనిచేత అందరికీపాండిత్యముమీద గౌరవమని కాని లేదా గ్రంథములో ఏముందో చిత్తముపెట్టితెలుసుకొందామని ఆసక్తికాని వ్యక్తమౌతుందనుకోనవసరము లేదు. ఇది వేరు, అది వేరు. కాని, ఇవి రెండుగుణాలు చాలవరకు అనేకులలో ఏకముగా కలిసి ఉండడము గలదు. తెలుసుకోవలెననేచిత్తవృత్తి ఈదినాలలోఉంటే కష్టమే అగునేమో. అనేకఇతరగుణాలలోవలె ఇదీఅనుభవముతో పెరుగుతూవస్తుంది. క్రమక్రమముగా అందింద

వీలులేనిదౌతుంది. మరిచూతామా నేడువిజ్ఞానభూమి విస్తారతరమయిపోయింది. ఎంతమేధాశాలికైన దీని ఎల్లలుఅందడములేదు. తెలుసుకోదగినదంతా తెలుసుకోడము సాధ్యముకాదు. అనంతస్వరూపముధరించి ఎప్పుడూ పెరిగేవిజ్ఞానాన్ని తనకుండే మితప్రజ్ఞతో ఆకళింపుకు తెచ్చుకోవలెనను ప్రయత్నముచేత విజ్ఞానరహస్యాలను వెదకడములో తృప్తిపొందగోరే మేధస్సుకు అంతములేనిచింత యేర్పడిపోతుంది. గ్రంథాలుచదువడానికి తప్పితే వారికి వేరే అవకాశమేయుండదు. అప్పుడూన్ను గ్రంథాలుచదువడానికి వారికి వ్యవధిచాలదు. సంఘజీవితములోని అన్నిప్రవాహాలకు వీరిని దూరముచేసివేసే మహావ్యసనముగ ఇది పరిణమిస్తుంది. ప్రపంచము వారిని భయభక్తులతో చూడవచ్చునుగాని వారిని తనఅనుదిన సోదరగుణములో నొక్కరినిగామాత్రము గణింపదు. గ్రంథాలలోతిరిగేపురుపులివియని వారిని తిరస్కారముగా దూరమువదలుతుంది.

*    *    *    *

గ్రంథప్రీతి ఇంకొకరకముగలదు. అది నెక్కువ ఆనందప్రదము. మంచిగుడ్డలంటే కొందరికి, మంచిమేజాలుకుర్చీలంటే కొందరికి, మంచిపటాలంటే కొందరికి ప్రీతియున్నట్లే మంచిపుస్తకాలంటే కొందరికి ప్రీతి. అది సహజంగావచ్చే ఒకగుణము. యౌవ్వనములో అకాలమరణముచెందిన కీ. శే॥ ఎ. వెంకట్రామణవంటిపుస్తకప్రీతిగలవారి నింకొకరినిఎరుగను. ఆయన మహాదీక్షగాపుస్తకాలుచేర్చేవాడు. వాటిని చదువనీచదువకపోనీ వాటిసాహచర్యమతనిని పులకరింపజేసేది. భార్యాబిడ్డలయెడల అందరూ ప్రత్యేకముగాచూపించే ప్రేమఅంతా ఆయన పుస్తకాలమీద ధారపోసేవాడు. ఎవరైనా ఒకపుస్తకము తీసికొనిపోయి సకాలములో మరల్చి ఇవ్వకపోయిరా ఆయనకు కలిగేదుఃఖానికి మేరలేదు. నావిశ్వాసమేమిటంటే ఆయనపుస్తకాలను పిల్లలవలె లాలించేవాడు. శ్రీ టీ. టీ. కృష్ణమాచారిగారు గ్రంథప్రేములలో ఇంకొకఅద్భుతవ్యక్తి. కాని, ఈయన వట్టిఅట్టలసొంపుజూచి ఆనందించువాడుగాదు. ఈయన గ్రంథాలయములో ఏరిపేర్చిన మహత్తమవర్గమున్నది. దివ్యభవనములో నిది సంస్థాపితము. అందులో ఈయన సంతోషిగ మెదడుకు బరువని తోచకుండా కాలముగడుపుతాడు. కొన్నిటినిజాగ్రత్తగా పఠిస్తాడు. కొన్నిటిని అలమయిరాలలో నలంకరింపనిస్తాడు.

శ్రీ వావిళ్లకు పుస్తకాలంటే ఉండేప్రీతి తనివిపొందేదిగాదు. ఎందరో ప్రచురణకర్తలనుండి ఎన్నివిధాలయినపుస్తకాలో తెప్పిస్తాడు. వీరిఫెడరేటెడుఇండియాద్వారా చాలా గొప్పగ్రంథసామగ్రిసమకూడే అవకాశముకూడకల్గింది. దానిలోనిగ్రంథవిమర్శభాగం

చూస్తే అంతవిస్తారముగా మొదటిరకందినపత్రికలుకూడ కొన్ని పనిచేయలేమని బెంగపెట్టు కొనుసేమో. వీరికిదొరికే ఈపుస్తకాలను వీరు జాగ్రత్తగాసంరక్షించుకొంటారు. చాలా కొద్దిమందికే, అదీ వివేచనతోనే, అక్కడికీకొంతపిసినిగొట్టుగానే, ఈపుస్తకాల ఎరువిత్తురు. వారిమాటతీరు ముఖమురీతి వారినిఉదారులనిపింపవు. కాని, వారిఔదార్యము చాల గొప్పది.కష్టములు నివారించడానికైనాసరే తనకునచ్చిన కార్యక్రమము జరుపడానికైనాసరే ఆయన డబ్బు ధారాళముగావదలుతాడు. కాని, పుస్తకాలదగ్గరికివచ్చేటప్పటికి సంరక్షణ దృష్టితో చాలలెక్కపెట్టిగాని ముందడుగువేయడు. ఇది విమర్శకదృష్టితో ఆయననసే మాటగాదు. ఎరవుతీసుకొన్నట్లుగాతీసుకొని మరిఇతరవిధాలప్రవర్తించి పుస్తకాలుచేర్చు కొని పుస్తకప్రియులవర్గము చాలాఉంది కాబట్టి ఈవిషయాలలో వివేకియైనపుస్తక ప్రియుడు జాగ్రత్తగా ఉండవలసిన ఆవశ్యకముంది. అట్లలేకపోతే దుడుకుదుండగీలు గ్రంథాలు కాజేయడము నిజము. కాబట్టి శ్రీశాస్త్రులవారు తమవద్దిగ్రంథసామగ్రిని కంటికి రెప్పవోలె కాచుకొంటారు. నాలుగుడబ్బులా స్వేచ్ఛగా ఇచ్చివేస్తారు. చాల సన్నిహితు లుగాఉండేవారికితప్ప వారు పుస్తకముల ఎరువీయరు. సంతోషముగా దానివిలువమొత్తమున కన్న అనేకరెట్లు తానువలచినపనికి దానముచేసివేస్తారు.

* * * *

ఈవిధముగా వీరికి పుస్తకాలయెడ ఉండేప్రేమయనేది ఆంధ్రదేశానికి మహోపకా రంగా పరిణమించింది. ఎందుకంటే దీనిమూలకముగా శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌కార్యక్రమమునకు ఆత్మయేర్పడి అది రమారమి ప్రజాహితసంస్థగా పనిచేసినది. శ్రీ శాస్త్రులవారు వారితండ్రితరువాత వ్యాపారములోనికి వచ్చేటప్పటికి అది అంతమంచిస్థితిలో లేదు. కాని ఇతడు దానిని తనదక్షతచేత తెలుగుప్రాంతములో మిన్నయైనప్రచురణసంఘ ముగా తీర్చగల్గినాడు. కీ. శే॥ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు అద్భుతమైన స్థిరప్రజ్ఞకల మనిషి కావలెను. తాళపత్రాలలో మూతపడినప్రాచీనవిజ్ఞానరత్నాలను బయటికిదీసి లోకానికి వానితేజాన్ని పంచిపెట్టడములో ముద్రణాయంత్రమెంతప్రబలసాధనమో వారు గుర్తించిరి. అంతట అచ్చువృత్తిలో ముఖ్యముగా తెలుగువాఙ్మయాన్ని విస్తారముగా ప్రచారముచేయడములో వారు మార్గదర్శకులయిరి ఈవిధముగ ప్రజావిస్తారోద్యమము ఆరంభమయి రమారమి ఒక్కశతాబ్దికాలముగ మనవరకు జరిగివచ్చినది. ప్రౌఢప్రబంధా లన్నీకూడా ఈకాలములో ప్రతిఇంటాచేరడానికవకాశమయినది. అంతేకాదు. రచ యితలు పుష్టించి పరిమళించడానికి వాతావరణము సమకూరినది. వారు పేరుప్రతిష్ఠలు

పొందగలిగినారు. వారికి సంపదలో కానికి ఆనందము ప్రాప్తించినవి. ఈశతాబ్దికాలపు నిరంతరప్రచురణఅనేదీవననే మనము పొందకపోతే మనమేస్థితిలో నుండియుందుమో ఊహించుకోడమే భయానకము.

తెలుగుమాట్లాడేప్రపంచానికి సారస్వతబుద్ధిని ప్రేరేపడములో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు అప్రతిమానసేవచేసినారు. వారు చక్కనివిద్యావంతులుకావడముచేత సంస్కృతములోగాని తెలుగులోగాని ఏమైనా విలువగలదున్నదంటే చాలచౌకగా ప్రపంచానికి ప్రకటించిఇచ్చేవరకు ఆయన నిద్రచెందలేదు. అట్లని గుణములేనిచౌకదనమును కోవలదు. ప్రచురణశాఖలో వారుచక్కనిసంస్కారాలుచేసి కళానైపుణ్యము సాధించినారు. మంచికాగితము ఏర్పరచడము చాల సొంపైనదిష్మే అక్షరా లుపయోగించడము గట్టి సొగసైనఅట్టకట్టడము, సుందరమైన అలంకరణమట్టలకుతీర్చడము, మొదలగువివరాలు దిద్దడముచేత వీరు ప్రచురణమొక్కొక్కటి కళాప్రదర్శకమయి కంటికి హాయికల్పించుచుండును. కృతజ్ఞులైన ఆంధ్రులితనికి భాషోద్ధారకబిరుదమిచ్చి సన్మానించినారు. రాయలసీమలోను సర్కారులలోను అనేకపట్నాలలో వీరికి బంగారుపతకాలు స్వర్ణపుగడియారాలు బహుమానాలు సమర్పించినారు. తెలుగుజిల్లాలలో వీరియెడలగలగౌరవాదరాలకివి ప్రబలసాక్ష్యముకదా!

దక్షతతో విజయవంతముగజరిపేవ్యాపారపరిధిలోనే యెంత ప్రజాహితకార్యము చేయడానికి వీలుందనునది తార్కాణముగ చూపించడము వీరిప్రజ్ఞావిశేషము. ఈయన సరియైనఅంచెనావేసి ఆర్థికవ్యవహారాలునడిపే సున్నితమగుకుశాగ్రబుద్ధిగలవాడు ఇతరులను గురించి చెప్పగలిగినకథలీయన మెదడులో కోటానుకోట్లుండును. వారినిఉపాలంభించడమున కొంత ఈయన ఆనందం పొందడముకలదు. కాని ఈయనప్రకృతిమాత్రము మిక్కిలి సభ్యము. అనేకరీతులదానాలకుగాను ఈయననిరాడంబరముగ చాలఎక్కువకర్చుపెట్టుతాడు. దీనికి ప్రకటనకోరేస్వభావమతనికిలేదు. ఈయన ఉదారముగాచేసేధర్మాలచేత చాలామంది బీదవిద్యార్థులు చదువుకోగలుగుచున్నారు. చె తనివిపొందేదిగొప్ప ఇతడు బైబిలులోని ధర్మాత్ముడును 'సమారిటను'నుబోలినవాడు. కష్టాలనున్న స్నేహితులకు మిత్రుడు. అగోచరముగా ఇతరులకు మేలుచేయనెంచువాడు.

## 156

## శ్రీ సీ. ఆర్. శ్రీనివాసన్‌గారు, ఎడిటర్, స్వదేశమిత్రన్, మద్రాసు.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికీనాకు 25 ఏండ్లపరిచయము. దేశీయులలో వారి యెడల నెంతప్రేమ, గౌరవముఉందో కనబరచడానికి తగినఅవకాశమొకటి యేర్పడినదని సంతోషిస్తున్నాను. నిరాడంబరుడు, మెత్తనిమాటకారి, సభ్యతలోనిగర్వి, సేవలో పటాటోపములులేనివాడు, శ్రీశాస్త్రులు సాగించినపని గణింపదగినవి, గర్వింపదగినది. కాని, అతని స్వభావములో గర్వమనేపదార్థములేదు. ఎక్కడకూడా అతడు ముందుకుత్రోసుకొనివచ్చి ప్రగల్భముగా బయలుదేరేవాడేకాదు. రాజకీయాలలో ఏదోమూలనుండడానికే నిశ్చయించుకొన్నాడు. అవకాశముకలిగినప్పుడు కలిగినంతవరకుస్థిరచిత్తముతో తన్నినిలిచి రాజకీయమను సుడిగుండాలలో కొట్టుకొనిపోయి కార్యపరత్వముతో సేవచేయుట కెల్లప్పుడు సంసిద్ధుడు. కడచినఏనుబదిఏండ్లుగా శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ ప్రవాహముగా ప్రకటిస్తూ ఉండేగ్రంథప్రకటనలచే బలము వికాసముపొందిన ఆంధ్రలోకము వీరికుటుంబానికి—తండ్రికుమారులకు—బాగా అప్పుపడియున్నది నాకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులకు ఉండేస్నేహము నిర్మొగమాటమయినవి. ఆయనకు గౌరవముజరిపే సందర్భములో హృదయపూర్వకముగా అందులో నేనుపాల్గొందును.

## 157

## శ్రీ కే. పున్నయ్యగారు, ఎడిటర్, ది సింద్‌అబ్సర్వర్, పోస్టుబాక్సు నెం. 1609, కరాచి.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నాకుప్రాచీనమిత్రులు. వారిని నేనుకడచిన 30 ఏండ్లుగా నెరుగుదును. వారింకాబాల్యములోఉండగా వారిప్రసిద్ధపితరులకాలువబరువు వారిమీదపడినది. అప్పటినుండి వారు ప్రసిద్ధమగుతెలుగుప్రచురణకార్యక్రమాన్ని వాఙ్మయముమీదిభక్తిశ్రద్ధలతోను కార్యప్రతిభతోను నడుపుకొనివచ్చినారు ఈప్రచురణకర్తలే లేకపోయియుంటే తెలుగుగతి ఏమైయుండునా అని నేనొకొక్కప్పుడు విస్మయపడుచుంటాను. శ్రీశాస్త్రులవారు వ్యాపారాన్ని చాలాగొప్పదేశాభిమానముతో మేళవించినారు. వీరిసహాయమునుకోరే బీదగ్రంథకర్తలుపత్రికారచయితలవిషయములో డబ్బురూపముగానైతేనేమి తమముద్రణాలయసహాయము మూలకముగానైతేనేమి చాల ఉదారముగా తోడ్పడినారు. వీరిసుగుణసంపత్తితోగూడ వీరు ధర్మనిర్వహణాసక్తిని సేవానురక్తిని జోడించి పనిచేసినారు. ఈసమ్మేళనము మనప్రజాహితజీవులలోనుండడము అరుదు. పత్రికా

రచయితగా వీరు ప్రసిద్ధిపొందినారు. త్రిలింగరజతోత్సవము తలపెట్టినఆంధ్రదేశాన్ని అభినందిస్తున్నాను. ఆంధ్రులకు ప్రబలతరసేవచేసి ఇయ్యదివజ్రోత్సవమునుగూడ అనుభవించును గాక!

## 158

## శ్రీ పి. ఎస్. వెంకట్రామన్‌గారు,

ఎడిటర్, న్యూఇండియా, ధంతోలి, నాగపూరు. ("హితవాద", "డెయిలీన్యూసు"లకు ఇదివరలో ఎడిటరు.)

తెలుగువాఙ్మయానికి పత్రికాప్రచురణానికి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చేసినసేవను కొనియాడడానికి ప్రకటించే సమ్మానాభినందలాలో నేనును చేరికొనుటకు సంతసించుచున్నాను. నేను మద్రాసువదలి 18 ఏండ్లకు పైబడినది. కాని నాజన్మరాష్ట్రములోని నాప్రాతమిత్రులేయేచరిత్రలు నిర్మించుకొంటున్నారో కనిపెట్టుకొనే యున్నాను మా ఇరువురికి సమమిత్రుడుగౌరవపాత్రులునైన శ్రీ ఎస్. శ్రీనివాసయ్యంగారువారిభవనములో 1920 లో నేను శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి పరిచయము మొదట పొందితిని. మద్రాసునగరములో నేనును పత్రికారచనలో ప్రేలుపెట్టుతూఉండినాను. శ్రీ శాస్త్రులవారు నాయందుప్రీతినుంచి నన్నుకొంతప్రోత్సహించేవారు. నాకుకొంత సహాయపడేవారు.తండయారుపేటలోని వీరి ప్రచురణాలయాన్ని,ఎస్ప్లనేడులోని వీరిపుస్తకవిక్రయశాలను పలుమారుదర్శించేవాణ్ణి. వావిళ్లవారిసంస్థనుండి శీఘ్రరీతిని వెలువడేగ్రంథజాలాన్ని చూచినప్పుడేచకితుడయ్యేవాణ్ణి. తమప్రచురణాలనుపంపండని ఆంధ్రదేశముమూలలనుండి శ్రీవావిళ్లవారికిఅందిన నూర్లజాబులను అనుదినము శ్రీశాస్త్రులవారువిప్పుతూఉంటేచూస్తుండేవాణ్ణి. అటుతరువాతసంవత్సరాలలో ఈప్రచురణకార్యము చాలాపెరిగి యుండవలెను. తెలుగుగ్రంథాలు పత్రికలు ప్రకటించడములోనేగాకుండా శ్రీశాస్త్రులవారు ఇతరప్రజాహితజీవితములోగూడ చాలశ్రద్ధగపనిచేసినారు.మద్రాసులో ఏబహిరంగకార్యంజరుగవలసియున్నను శ్రీశాస్త్రులవారులేకుండ జరుగలేదు. తెలుగువాఙ్మయానికివారుచేసినసేవ మరువనేరాదు. ప్రసిద్ధులైనతండ్రిగారిఇష్టాన్ని నడపడమేగాని ఆమార్గముననే విస్తారతమకృషి వీరు చేసినారు. మనప్రాచీనసాంప్రదాయాలు సభ్యతపునాదులుచేసే నవీనభారతావనిని నిర్మింపదగును. ఈరంగములోనే శ్రీశాస్త్రులవారికార్యక్రమము అతివిలువగలదిగ నెన్నదగినది. వేలకొలదిఆంధ్రులకు శ్రీవావిళ్ల వారిసంస్థ ఆధ్యాత్మికఉన్నతిని, తేజమును ప్రసాదించింది. స్నేహపాత్రుడు, మరువరానివిగ్రహుడునగు శ్రీశాస్త్రులవారు సన్మిత్రుడు, ఉదారుడగు

స్నేహితుడు. 25 ఏండ్లుగ వారుచేయుచుండు పుణ్యకార్యాన్ని కొనసాగించడానికి వారికి దీర్ఘాయువును శక్తియు కలుగుగాక అని ఈశుభముహూర్తమున ప్రార్థించుచున్నాను.

## 159

### శ్రీ ఎస్. పీ. శర్మగారు, ఎడిటర్, కర్రెంటు అఫేర్సు, కటకము.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి అభినందనాలతో చేరిన సన్మానసంపుటినిచ్చి బహూకరించడము విషయమున నేను మిక్కిలిసంతసించుచున్నాను.అయినను ఒకవ్యక్తిక్రింద గణింపరాదు అతడేనొకసంస్థ. అతడు సభ్యతకుచేసినసేవ అనేకముఖమైనది. మద్రాసున దురవస్థచెంది తనకులాడుచుండేయెంవరోరచయితలకు గ్రంథకర్తలకు అతడు వ్యక్తిగతముగ చాలసహకారియైనాడు. ఆయనకుగలనమ్రతచేత ఈసుగుణమునుగురించి స్తోత్రపాఠము చేయుట ఆయనకురుచింపదుగాన వుఇంతటితో దాని విరమింతును.

ఆయన రెండుపత్రికలు—త్రిలిఙ్గ ఆంధ్రలోకములోను, ఫెడరేటెడ్ ఇండియా భారతావనిలోను బుద్ధిమంతులమానసములలో గొప్పపట్టును సంపాదించినవి. మద్రాసు పత్రికా ప్రపంచాన్ని వీనిమినహా ఆలోచించడానికేవీలులేదు. సాంఘికరాజకీయవిషయాలలో ఇవి యెల్లప్పుడు స్వతంత్రము పరిపక్వమునందినయభిప్రాయములనువ్యక్తముచేసినవి. అధికారులకురుచింపకున్నా ప్రజామోదముకలుగకున్నా లక్ష్యపెట్టక తనమనస్సాక్షికిన్యాయమని తోచినవిషయాన్ని నిరాఘాటముగా ప్రచురపరచినవి.

ప్రాచీనవాఙ్మయాని నవీనమైనతొడుగులుతొడిగి ప్రజారంజకముచేయడానికి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారుచేసినకృషి ప్రత్యేకముగా నొక్కిచెప్పదగినది. విజ్ఞానవంతులయినప్రజలేనిది ప్రజాస్వామ్యానికర్థములేదు. శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారు ఆంధ్రదేశములోనిమారుమూలలకు అఖండవిజ్ఞానతేజాన్ని తీసికొనిపోవడములో అద్భుతపరిశ్రమచేసినారు. ఇదేపనిలో ఇంకొకవిభాగాన్నికూడ వీరునిర్వహించినారు. వాఙ్మయసారస్వతాలలోను సభ్యతలోను భారతభూమిలోని ఒకవర్గమెంతవిలువగలదో ఇతరవర్గాలకు అర్థముకావడానికిగూడ తోడ్పడినారు. తులసీదాసురామాయణభాషాంతరీకరణము తిలకుగీతారహస్యపుటనువాదములు నామపనులోనున్నవి. హిందీపుత్రులు మహారాష్ట్రపుత్రులమహాదాదర్శాలిందులోగలవు. తెలుగువారు వీనినితెలిసికొని లాభపడడానికిమూలకముగా వీలయినది శ్రీశాస్త్రులు మరియేమీచేయక ఈరెండుపనులే ఆంధ్రదేశానికిచేసియున్నట్లయినా ఆంధ్రప్రజలవ్యాదయాలలో సురక్షితస్థానానికర్హుడయి

యుండును. వారు అరవానికిచేసినసేవనుగురించి మొదటిపర్యాయమిప్పుడేవింటున్నాను. నాకు చాలాసంతోషము తెలుగువారు తమభాషలోనే కురళు ఇతర అరవప్రబంధములు వగైరాలలోని భావాలను తెలుసుకోగలరుగాక!

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు కార్యరూపముగా ప్రజాహితజీవనము సలిపినవారు. ఆభాగాన్ని గురించి వ్రాయడానికి నాకు అర్హతలేదు.

వాఙ్మయపత్రికారచనలలో ఇంకా ప్రబలతరసేవజేయడానికి శ్రీశాస్త్రులవారికి చిరాయువు అగునుగాక అనికోరుతూ ఈశ్వరుని ప్రార్థించుచున్నాను.

## 160

## శ్రీ ఏ. పద్మనాభయ్యర్‌గారు, గ్రంథకర్త, పత్రికారచయిత, కరమనై, త్రివేంద్రము.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు ఇరువదియైదేండ్లుగా మెచ్చుకోదగినప్రజాహితోత్సాహముతోను సామర్థ్యముతోను త్రిలిఙ్గపత్రికనుసాగించినారు. దీనికి రజతోత్సవముజరుగనున్నది. ఆసమయాన అభినందనాలతోగూడిన సమ్మానసంపుటిని బహుమానపురస్సరముగానిచ్చుటకేర్పరచడము సంతోషింపదగినసంగతి త్రిలిఙ్గ తమ్ముడు ఫెడరేటెడ్ ఇండియా ఎడిటరుగా నేను శ్రీశాస్త్రులవారిని యెక్కువసన్నిహితముగా నెరుగుదును. వారి ప్రజాహితానురక్తి, దేశాభిమానము, తనకు సాధ్యమయినసేవచేయుటయందుగలయభినివేశము, నన్ను ముగ్ధునిచేసినవి. స్వయంకల్పితమగు నీకార్యనిర్వహణములో స్వధర్మనిర్వహణదృష్టియే ఉత్తమముగావీరికిగలదు. వీరిది ఉదాత్తశీలము. ప్రజాహితజీవులలో ఇది చాలఅరుదు. ధర్మముమీదనే ఏకైకదృష్టి, చక్కని శ్రద్ధ, సంపూర్ణమగున్యాయశీలత, నిష్కళంకమగుకలుపుగోలుతనము జాతిమతభేదాలకు సంబంధములేకుండా అందరిని ఇతనికి స్నేహితులనుగావించినవి. పత్రికయొక్క ఆర్థికపక్షాన్ని మాత్రము తానెప్పుడును లక్ష్యపెట్టినదిలేదని ఆయనపలుమారులు నాతో అన్నాడు. ప్రజాలాభానికి ఏదితనకు అత్యావసరమనితోస్తున్నదో దాన్ని చేయడమతనిపరమధర్మముగా ఎంచుకొన్నాడు ఫెడరేటెడ్ ఇండియా అనే వీరిపత్రిక అభిప్రాయభేదాలుకలిగినప్పుడు తూనికతప్పనిదిగా ఉండడమేగాక అభిప్రాయప్రకటనలో దాపరికములేక స్పష్టముగాఉండే అలవాటుకలది పత్రికారచయిత అర్హతకుతగిన ప్రత్యుపకృతి యెప్పుడూపొందడనడము లోకానికి బాగుగా తెలిసినదే. ఎన్ని బెడదలు కష్టాలువచ్చినా వెనుదీయక నిగ్రహానుగ్రహాలను లక్ష్యపెట్టక వీరుధర్మనిర్వహణ చేయుచున్నారు. ఈవిధముగా వారినిప్పుడు సమ్మానించడము వారికుద్దీపకమగునని నావిశ్వాసము. ఈశ్వరుడు వారికిచిరాయురారోగ్యములిచ్చి సకలకల్యాణములు సమకూర్చుగాక!

## 161

### శ్రీ జీ. వి. కృపానిధిగారు, ఎం. ఏ., బి. ఎల్.,

హిందుస్థాన్ టైమ్సు, 29, నరేంద్రప్లేసు, పార్లమెంటువీథి, న్యూఢిల్లి.

త్రిలిఙ్గరజతోత్సవముహూర్తమున నాయాశీస్సులనందజేయునిందు. కాలపరీక్షకు తాళినపత్రికనాశీర్వదించుట పత్రికరచయితలకు ప్రత్యేకసంతోషముకలిగించునట్టివిషయము. కాలపరీక్షకు నిలువడముగాకుండా పత్రికగాపేరుపొందడమేగాకుండా, ప్రజాహితసంస్థగా తనస్థానాన్నిసంపాదించుకొన్నదంటే ప్రజలలో నెంతోపట్టుసంపాదించిందన్నమాట. ఇండియాలో పత్రికలు ప్రజాభిప్రాయాలసవిమర్శకమయిన అన్నిపరీక్షలకు నిలువవలసియున్నవి. అట్లాతృప్తిపరచడానికి గొప్పగుణములావశ్యకములగుచున్నవి శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు వారికార్యసాహసానికి ప్రజాహితానురక్తికి ప్రసిద్ధులుకాబట్టి ఆయనతో సంబంధమున్నదనడమే దక్షిణఇండియాప్రజలదృష్టిలో విజయసాధకముగానుండును. సేవాపరత్వముగలదని వారు విశ్వసింతురు. శ్రీశాస్త్రులవారితో కొన్నివిషయాలలో భేదపడినా వారినెరిగి గౌరవించడానికలవాటుపడినమనము త్రిలిఙ్గపత్రికలో వారివ్యక్తిత్వము స్పష్టముగా కనిపించేది; నిర్ణయాలలో స్వతంత్రము, అందరియెడల దయాన్వితదృష్టి, విమర్శలలో దిట్టము. ఇక ముందీపత్రికకు ముదురువయసురాగలదు. అప్పుడు కడచిననాళ్లలోకంటె నెక్కువతేజోవంతమయినజీవితము దీనికికలుగుగాకఅని ఆశించుచున్నాను.

## 162

### శ్రీ ఏ. స్వామినాథయ్యర్ గారు, బి. ఏ.,

ఎడిటర్, ధర్మరాజ్య, 22, బ్రాడీస్ రోడ్, మైలాపూరు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిని వారుయజమానులుగాఉండే "వావిళ్ల" ప్రచురణసంస్థకును అభినందనాలుచెప్పే ఈయవకాశాన్ని నాకు గలిగించినందుకు నేను హృదయపూర్వకముగా నాకృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను. సంస్కృతము తెలుగువాఙ్మయాలలో "వావిళ్ల" పేరుచెప్పితేనే చాలు—అంతప్రఖ్యాతి. వారు హిందూవిజ్ఞానము, వికాసము, సభ్యతలకుసంబంధించిప్రకటించిన ప్రౌఢరచనలను చదివేవేలజనములలో నేనూ ఒకడను. ఈసంస్థస్థాపకులగు శ్రీశాస్త్రులవారి తండ్రిగారిపరిచయముండడము నాభాగ్యము. 1870సం॥ న కొల్లావారిఅగ్రహారమున శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారిఇంటికి కొన్ని ఇండ్లువదలి నేనువిద్యార్థిదశలో నివసించుచుంటిని వారిఇంటిలో గంటలకొలదిఉండేవాణ్ణి.

వారిఇంటిబయటితిన్నె వారివిద్యకుగరడి. అచ్చట వారు తెలుగుసంస్కృతగ్రంథాలు వ్రాత ప్రతులు నిరంతరముపరిశీలిస్తూ పండితులనుజేర్చుకొని విమర్శిస్తూఉండేవారు. నేను పలు మారు ఇటుపోతూఅటుపోతూ వారిదర్శనము నాకుకలుగుతూఉండేది. వారిసమర్థపుత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికిన్నీ వారిసుగుణాలనేకములు చక్కగా అబ్బినవి. వారు వాఙ్మయప్రపంచములో గొప్పగాసేవచేసినారు. అంతేకాక ఇతరప్రజాహితశాఖల లోను ప్రముఖముగాసేవచేసినారు. రాజకీయసాంఘికమతవిషయకసమస్యలలో వీరివివేచ నాయుత గంభీరాభిప్రాయాలెల్లకాలము గౌరవమునుపొందినవి. వారిపరిచయలాభము ఒక్క పాతికశతాబ్దముగా నేనుపొందినాను. సమ్మానసంపుటి బహూకరణముపొందడానికి ఇంత కంటె ఎక్కువఅర్హుడైనవ్యక్తి ఇంకొకడులేడని నావిశ్వాసము. వారుచేయుప్రయోజనకర కృషిసాగించుచు వారు బహుకాలము వర్ధిల్లుదురుగాక !

**163**

## శ్రీ ఏ. ఆర్. భట్, యం. కాం., మేనేజరు, కేసరీ అండు మహరాటాకార్యాలయములు, పునహా.

'త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ఇండియాల' సంపాదకులు మన్మిత్రులునైన శ్రీ వావిళ్ల వేంకటే శ్వరశాస్త్రులవారికి నాహృదయపూర్వకాభివందనాలు తెలుపుటకీతరుణముఅబ్బినదని సంతో షించుచున్నాను.

శ్రీశాస్త్రులవారివ్యక్తిపరిచయము నాకు 10 ఏండ్లుగా కలిగింది. స్వదేశమిత్రస్వర్ణో త్సవముజరిగినప్పుడు శ్రీకేళ్కారుగారితో నేనుంటిని అప్పుడు నాకు వీరిపరిచయముసంభ వించినది. అప్పటినుండి మాపరిచయముపెరిగిపెరిగి మైత్రిగ నేర్పడినది.

శ్రీశాస్త్రులవారు బహువిషయాలలో సమర్థులు. లోకమాన్యతిలకుగారి అప్రతిమాన రచనయగు గీతారహస్యాన్ని తెలుగులో ప్రకటించిన ప్రసిద్ధప్రచురణకర్తగా మహారాష్ట్ర మున మేము వీరిని సమ్మానించెదము.

ఆంధ్రశిక్షకార్యక్రమములోను ఆంధ్రఛేంబరు ఆఫ్ కామర్సు విషయములోను శ్రీ శాస్త్రులవారు మార్గదర్శకులుగా పనిచేసినారు. అనేకఇతరప్రజాసంస్థలలో ఈయనచేసినపనిని బట్టి ఈయనకుగలరాజ్యాంగపరిజ్ఞానమున్ను ఇతరప్రజాహితజీవితరహస్యజ్ఞానమును సువ్యక్తమయినవి.

సంస్కృత, తెలుగు, అరవవాఙ్మయాలకు వీరిముద్రణాలయము మహత్తరసేవచేసినది

కాబట్టి త్రిలిజ్గరజతోత్సవసందర్భమున వీరికి అభినందనసంపుటినిచ్చి సమ్మానించడము చాలఅర్హమగుకార్యము.

శ్రీశాస్త్రులవారు ఫెడరేటెడ్ ఇండియాలో వ్రాస్తూవచ్చిన వ్రాతలు నేనుచదివినాను. వానియెడల నాకు చాలాగౌరవముగలిగినది. వారి అభిప్రాయాలతో ఎల్లప్పుడు ఏకీభవింపక పోవచ్చును. అతనిశత్రువులుకూడ ఒక్కవిషయమొప్పుకోకుండాతప్పదు. అతనుచేసే విమర్శ యెప్పుడునిర్మాణదృష్టితో చేసేదేగాని వట్టివిమర్శకోసముచేసేదిగాదు

పూనాలోజరిగిన మొదటి అఖిలభారత ముద్రాపకులమహాసమావేశమునకు వీరధ్యక్షులు. అప్పట వారిచక్కనినాయకత్వము వ్యక్తమయినది.

కేసరిమరాటాసంస్థలతో శ్రీశాస్త్రులవారికెల్లప్పుడు చక్కనిమిత్రబంధము గలదు. వారు మాలోనొక్కరని మేమెల్లప్పుడును భావించినారము.

## 164

## శ్రీయన్. సుబ్రహ్మణ్యయ్యర్ గారు, ఎం. ఏ, ఎడిటర్, ది ఇండియన్ థింకర్, త్రివేండ్రం.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారిని యెరిగేభాగ్యము నాకుకలుగలేదు. కాని సమర్థులు ప్రేమపాత్రులుఅయిన వారిపుత్రుల నెంతోబాగానెరుగుదును. భారతవికాసానికి సభ్యతకు తండ్రికుమారులు చేసినఅఖండసేవకు వారియెడలనాకుగలగౌరవాదరణములను హృదయపూర్వకముగా ప్రకటించుచున్నాను.

## 165

## శ్రీ ఎన్. ఎస్. శ్రీనివాసయ్యరుగారు, "ఇండియన్‌ఎక్సుప్రెస్సు" మైలాపూరు, మద్రాసు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారినిగురించి సంబంధములేనివానివలె వ్రాయడము నాకుసాధ్యముకాదు. నాకతడు 20 ఏండ్లకాలముగా తెలుసును. అందులో తుదిభాగములో చాలసన్నిహితముగ వారితో మెలగినాను. కాని వారినెరిగినవారికెవరికైనా వారిపరిచయము కావడముతోటే సువ్యక్తమయ్యేముఖ్యగుణశీలాలు కొన్ని వారిఅందుగలవు. తానుచేసిన పనిని తానెప్పుడూ చెప్పుకొనే అలవాటు శ్రీశాస్త్రులవారికిలేదు. వ్యక్తులకు ప్రజాహిత కార్యాలకు వారుచేసేదానము ధారాళముగానుఉంటుంది గట్టిగానుఉంటుంది. కాని ఆయనతో ఎంతసంభాషించినా వీటినిగురించినవివరాలేవీ బయటపడవు. వాటిసాక్ష్యమువినిచ్చుకోవలసినదే. తానుచేసేసహాయములో తనకుప్రతిఫలముకలుగుతుందని ఎప్పుడు నెదురుచూడడు.

సహాయముపొందినవారు కృతజ్ఞతసూచనేచూపకున్నను ఆయనకందున ఆశ్చర్యమేమీయుండదు. మరియొకవిశేషమేమిటంటే తన్నుగురించి ఇంకొకడు ఏయభిప్రాయముపెట్టుకొన్నాడా అనేదూసే అతనికక్కరలేదు. ఎదుటివాడు జీవితములో ఏఅభిప్రాయాలుకలిగియున్నా ఏఅంతస్థులోనున్నా ఆయనకొక్కటే ఆయనకుకావలసినదంతా ఎదటివానివ్యక్తి. గవర్నమెంటునౌకరులు, కాంగ్రెసువారు,లిబరలులు,జస్టిసువారు,సోషయలిస్టులు,విద్యార్థులు, అభిప్రాయాలేలేనివ్యక్తులుఅందరు అతనిచుట్టు ఏవిధమయినఅసౌఖ్యములేకుండ చేరగలరు. ఆయనకు ముఖ్యముగాగలమానవబంధము రచ్చలు రాద్ధాంతాలతీక్ష్ణాన్ని మూలచ్ఛేదము చేస్తుంది. భేదాభిప్రాయాలనణస్తుంది. అందరిమీదస్నేహసమ్మోహన మాయనప్రయోగించగలడు.

చూడడానికి దర్జాగాంభీర్యమున్నట్లుతోచినా అతడు నఖశిఖపర్యంతం ప్రజాస్వామ్యప్రకృతివాడు. ఆయన కర్మకరులకు మిత్రుడు; పెట్టుబడిదారులకుమిత్రుడు. వారిఇరువురలాభాలొక్కటేఅనిఆయనవిశ్వాసము. కాబట్టి వారికిసమాధానముకుదుర్చుటకు అహరహము పనిచేస్తాడు. ఈయన ఆదర్శకభూస్వామి. అరియలూరనుఈయనజమీనులో రైతులకీయన యెడల అపారమైనప్రేమ. ముద్రణాలయయజమానిగా ఈయన కర్మకరులయెడ చర్యలో మార్గదర్శి. ఇతనిదృష్టాంత మితరులంగీకరింపదగినది. సంస్కృత, తెలుగువాఙ్మయాలురెంటను ఇతనికిభక్తి. వానకాలపుఈరెండువాఙ్మయాలప్రచురణకర్తలలో ఈయన అతిసమర్థుడు విజయవంతుడు. ముప్పదిఏండ్లప్రజాహితజీవనజ్ఞానముగల పత్రికారచయిత. మహారాష్ట్రవర్గములో ఈయనకు ప్రియమిత్రులున్నారు అన్నిటికంటె నెక్కువది ఈయనచాలపెద్దమనిషి. శీలవంతుడు. నాకీయన చాలగొప్పఉపకారాలు వ్యక్తిగతముగాచేసినాడు. ఈయనదయవల్ల మేలుపొందినవారు ఇంకాలెక్కలేనంతమందియున్నారు. త్రిలిజ్గ రజతోత్సవసందర్భాన విస్తారమిత్రబృందమును పరిచితులును మహాజనమును శ్రీ శాస్త్రులవారిపటాటోపరహితభక్తియుతత్యాగసహితప్రజాసేవకై తగినరీతిని వారినభినందింతురని నమ్మదగియున్నది.

## 166

### శ్రీ జే. లక్ష్మన్నగారు, బి. యే., బి. యల్.,

జనరల్ సెక్రటరీ, ఆంధ్రరాష్ట్రపత్రికారచయితలసంఘము, ఏలూరు.

త్రిలిజ్గరజతోత్సవసమయాన నాఅభివందనాలు దయచేసి అందికొనుడు. తెలుగు పత్రికలజీవితములో ఇరువదియైదేండ్లు కొద్దియుగముకాదు. నూర్లకొలదితెలుగుపత్రికలు ఉసిళ్లవలె నెలలుసంవత్సరాలుజీవించి నశించినవిగలవు ఆవర్జాకట్టేటట్టుగాఉంటే తెలుగుపత్రిక

జీవితము నెలలుక్రిందికివచ్చి తేలుతుందికావలెను. శిశుమరణాలిందునచాల నెక్కువ. కాబట్టి 25 ఏండ్లుగడచి ఇంకాయౌవనములోనుండి ముందుగట్టిజీవితాన్ని సూచిస్తూ త్రిలిఙ్గ ఉండగలిగినదంటే చాలాగొప్పసంగతి. మద్రాసులోని 'హిందూ' పత్రికకూడ ఆరంభదినాలలో వారపత్రికగానుండెను కాని సమర్థులయిననాయకులుకలుగడముచేత వార్తనివ్వడము చేత ఇండియాదినపత్రికలలో నాయకత్త్వమువహించే పత్రికలలోచేరినది. త్రిలిఙ్గకుకూడ ఇట్టిభవిష్యత్తుగలదని నాఅంచనా. ఇందులో అన్నివిథాలైనవార్తలు ఉన్నవి. రాజకీయము, సాంఘికము, విద్య, సినీమాలతోసహా సంపాదకత్త్వములోనూ ఏలోటూలేదు. తెలుగున సారస్వతవ్యక్తిత్వమసాధారణముగాగల శ్రీ వావిళ్ల వేంకటేశ్వరులవారి సమర్థనాయకత్త్వము ఈపత్రికవిజయానికి చాలమట్టుకుకారణము. ఆంధ్రరాష్ట్రీయపత్రికారచయితల సంఘముతరఫున నేనీపత్రికచిరాయువయితేజోవంతమయి వర్ధిలుగాక అని కోరుచున్నాను.

## 167

### బాబూ శ్రీఅమల్‌హోంగారు, ఎడిటర్, ది కలకత్తా మునిసిపలు గెజెట్,

సెంట్రలు మునిసిపలుకార్యాలయము, కలకత్తా.

త్రిలిఙ్గరజతోత్సవసంపుటమునకు వ్యాసమువ్రాయవలసినదని మీరువ్రాసినప్పటినుండి నేను చాలజబ్బుగానున్నాను. ఇప్పుడే కుదురుబాటగుచున్నది. కాబట్టి, మీకోరికను నెరవేర్పలేనందులకు చాలచింతించుచున్నాను. త్రిలిఙ్గరజతోత్సవమునకు విజయమగుగాక!

## 168

### మేడం సోఫియా వాడియాగారు, ఎడిటరు, ది ఇండియన్ పి. ఈ. యన్.,

22, నారాయణదభోల్కర్‌రోడ్డు, మలబార్‌హిల్, బొంబయి.

ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్‌ఇండియాకేగాక ఈసంవత్సరము రజతోత్సవమును అనుభవించుచుండే తెలుగువారపత్రిక త్రిలిఙ్గకుకూడ సంపాదకులుగనుండే శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని అభినందిస్తూ వారువాఙ్మయాభివృద్ధికి ప్రచురణకుచేసిన చేయుచుండు కృషినిగురించి ఆనందిస్తూవ్రాయడము నాకుచాలసంతసమును కలిగించినది. వారి ఈరెండు పత్రికలకృషి, వారికార్యక్రమంలో రెండుశాఖలుమాత్రమనేది గమనింపదగినది.

త్రిలిఙ్గ తనవిగావిమర్శించే విషయాలవంటివిషయాలలో చక్కనితూచినఅభిప్రాయములు ప్రచారముకావడానికంటే నిప్పుడు ఎక్కువఆవశ్యకము ఇందేమీలేదు కాబట్టి ఇట్టిప్రయత్నాలు పూర్వముకంటె నేడు చాలనెక్కువగా కావలసియున్నవి.

అఖిలభారత పీ. ఈ. ఎగ్. కేంద్రముపక్షమున వారిదివరలోచేసినకృషికి శ్రీశాస్త్రుల వారినభినందిస్తూ ఇకముందుగూడ వీరిప్రయత్నాలకు శుభంబగుగాక అని కోరుచున్నాను. ప్రజాప్రయోజనమునకయి ముఖ్యముగభారతభూమిప్రయోజనమునకయి వీరిలేఖిని చిరకాలము సుస్థిరముగ తాండవించుగాక !

**169**

**ఏ. ఏ. హాయిల్సు,ఎస్క్వ్యాయరు,ఎడిటర్, ది మద్రాసుమెయిల్, మవుంటురోడు, మద్రాసు.**

మెయిలుపత్రికతో ఇప్పుడులీనమైపోయియుండు ఒకానొకప్రాచీనపత్రికతో సమకాలికముగా ఎనుబదియేండ్లక్రిందట శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిసంస్థ స్థాపితమయి ఇంతకాలముచేసినకృషికిగాను వారికి నేను అభినందనాలు తెలుపుచున్నాను. వీరు పత్రికారచయితధర్మాలతోగూడ తెనుగుప్రాచీనప్రౌఢరచనల ప్రకటనధర్మమునుగూడ జోడించినారు. ఈదేశపుప్రాచీనతత్వాన్ని నవీనపరిస్థితులకుజోడించి ఈదేశపుక్రమాభివృద్ధిని సాధించదగునని వీరిమతము. వీరిపత్రికలలోనొకదానికిప్పుడు రజతోత్సవముజరుగుచున్నదంటే ప్రజలు వీరిమార్గానికంగీకారము సూచించినారన్నమాట. వీరికృషిఫలించిందన్నమాట. వీరికి నిరంతరమువిజయమగుగాక!

**170**

**శ్రీ యస్. కణ్ణన్‌గారు, ప్రొప్రైటరు, శ్రీనివాసవరదాచారి అండ్ కంపెనీ,**

**మేనేజింగు ఎడిటర్, ది ఎడుకేషనల్ రివ్యూ, మవుంటురోడు, మద్రాసు.**

మాశ్రీనివాసవరదాచారిఅండ్‌కంపెనీయే చాలప్రాచీనసంస్థ. శ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రులు అండ్‌సన్స్ ఇంతకంటె ప్రాచీనతరసంస్థ. వారికార్యారంభము రమారమి ఒక్కశతాబ్దమునకు ముందైనది. అట్టిసంస్థ ఎడతెగకదక్షతతోసలిపినకృషికి మాసంస్థ అభినందనాలుపంపించడము సంతోషప్రదము. ఈసంస్థవారు మనప్రాచీనవాఙ్మయాలను—ముఖ్యముగ తెనుగుసంస్కృతవాఙ్మయాలను—పునర్నిర్మించడములో నాశనమునుండిసంరక్షించడములో చాలగొప్పప్రయత్నముచేసినారు. సంస్థాపకులు ఉపక్రమించినఉత్తమకార్యాన్ని వారిపుత్రులు తరువాతియజమానులునైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు 30 ఏండ్లకుపైబడి సాగించినారు. వీరు తండ్రికార్యక్రమాన్ని చాలరెట్లుపెంచినారు. చాల హెచ్చుఖర్చుతగిలి లాభమేమీరాజాలని ప్రచురణకార్యాన్నిగూడ చేపట్టినిర్వహించినారు. మహాభారతము దాక్షిణాత్యపాఠముల 18 సంపుటాలవంటి మహోత్కృష్టగ్రంథప్రచారము

గావించినారు. శ్రీఅరవిందఘోషు, శ్రీస్వామివివేకానంద, శ్రీలోకమాన్యతిలకు మరిఇతర పండితులరచనలను లోకమునకిచ్చినారు. పెక్కేండ్లుగా వీరు తెనుగువారపత్రిక త్రిలిజ్గను ఇంగ్లీషుపత్రిక ఫెడరేటెడ్ ఇండియాను గంభీరాభిప్రాయయుతముగా విజయవంతముగా ప్రకటిస్తూవచ్చినారు త్రిలిజ్గరజతోత్సవమువార్త మాసన్నమునావడము మిక్కిలి హృదయానందదాయకము. శ్రీశాస్త్రులవారు నిరాడంబరయుత ప్రజాహితజీవి. మద్రాసునగరమున అనేకసత్కార్యాలతో సంబంధముగలవారు ప్రచురణకర్తలసంఘముతో ఆదినుండి వారికిగల సంబంధము చాలపవిత్రసంబంధము. ప్రజాహితజీవిగా వారొనర్చిన అప్రతిమాన సేవకును ప్రచురణకర్తగాను మనదేశపుప్రాచీనవిజ్ఞానసంరక్షకుడుగను పునరుజ్జీవనపరుడుగాను, వారిని అభినందించడము నాకు ముదావహము.

## 171

## శ్రీటంగుటూరు ప్రకాశముపంతులుగారు, బారిఅట్‌లా, మద్రాసు.

శ్రీశాస్త్రులవారిపరిచయము నాకందరికంటే ఎక్కువగాకలదు. శ్రీశాస్త్రులవారిపేరు ప్రఖ్యాతులు వ్యాపింపనిగ్రామమొక్కటికూడలేదు వీరిప్రచురణాలులేనిగ్రంథాలయమొక్కటియునుండదు. వీరుపండితులు ప్రచురణకర్తలు పత్రికారచయితులుమాత్రమేగాదు. మనదేశరాజకీయాలలోకూడ గొప్పఅభినివేశముగలవారు.

## 172

## జే. ఏ. ఏట్సు, ఎస్క్వైయర్, యం. ఏ., స్కూళ్లఇనస్పెక్టరు, బెంగుళూరు.

మీదిచాలాదివ్యప్రయత్నము. ఇంతమంచిపని మీరుచేస్తూఉండడము నాకుచాల సంతోషము. మీప్రయత్నము తప్పకఫలప్రదమగునని నావిశ్వాసము. నాచేతనయిన సహాయము నేనెప్పుడూతమకు చేయగలనని నమ్ముడు.

## 173

## డాక్టరు శ్రీకట్టమంచి రామలింగారెడ్డిగారు,

ఉపాధ్యక్షులు, ఆంధ్రవిశ్వకళాశాల, వాల్తేరు.

మీప్రచురణములువాత్తములు. ఏసంస్థఅయినా అట్టివానికై గర్వపడతగినవి. మీతండ్రిగారాంధ్రభూమికి అద్భుతతేజోలంకారముగ నొప్పిరి. వారిపాండిత్యప్రకటత్వము పట్టు అఖండములు. మీరుతప్పక వారిపనినిసాగింతురని నావిశ్వాసము.

**174**

## శ్రీ పీ. శేషాద్రిగారు, ఎం. ఏ., ఎం. బీ. యి., ప్రిన్సిపాలు, గవర్నమెంటు కాలేజీ, అజ్మీరు.

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అను మద్రాసు తెనుగుసంస్కృతముద్రాపకులు ప్రచురణకర్తలు సంస్కృతము తెనుగులలో నిర్వహించిన మహోత్కృష్టకార్యక్రమము గమనింపదగినది. దక్షిణఇండియాలో తెనుగుసంస్కృతవాఙ్మయాలు ప్రచారము కావడానికి వారువిస్తారకృషి చేసినారు. మనపవిత్రవాఙ్మయములోని గ్రంథాలన్నిటిని అనేక కూర్పులుగా దేశభాషలలోనికి ఇంగ్లీషులోనికి పరివర్తనములతోసహా ప్రకటించినారు. తెలుగువాఙ్మయములోని ప్రసిద్ధగ్రంథరాజినంతటిని దివ్యరూపముగా వెలువరించినారు. కడచినయెనుబదియేండ్లుగ మన ఈప్రాచీనవాఙ్మయాలకు వీరుచేసినసేవను ప్రత్యేకముగ గుర్తించడము చాలఅర్హమైనకార్యము. వారి ప్రచురణములన్నీ చక్కనిరూపముతో వివరమైనఉపోద్ఘాతాలతో శోభిల్లుచుండును. దీనియజమాని శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుల వారు సంస్కృతము, తెలుగు, ఇంగ్లీషుసారస్వతాలలో నేర్పరులు. అనేకులగు గ్రంథకర్తలు, కవులు, పండితులకుసహాయపడుటేగాక వీరు ఆంధ్రదేశములో అనేకగ్రంథాలయాలకును తోడ్పడినారు. అన్నిప్రజాహితజీవితశాఖలలో వీరుఅభినివేశమునుచూపినారు. అనేకకళాశాలలలోవిద్యాలయాలలోచదువువిద్యార్థులనేకులకు ఇరువదేండ్లుగసహాయపడుచున్నారు.

**175**

## ప్రొఫెసర్ శ్రీ పీ. ఆర్. కృష్ణస్వామిగారు, యం. ఏ., కుంబకోణము.

మీచేతిలో తెనుగువాఙ్మయలాభము చక్కగ పెంపొందినదని సంతోషిస్తున్నాను. మీగ్రంథాలుచదువడముచేత నాకుకలిగినఆనందమే దీనినివ్రాయడానికి నన్ను పురికొల్పినది.

**176**

## దేశభక్త శ్రీ కొండా వేంకటప్పయ్యగారు, బి. ఏ., బి. యల్., గుంటూరు.

మీరు మీతండ్రిగారు అనేకప్రాచీనప్రౌఢగ్రంథాలను అర్వాచీనగ్రంథాలను చాలచక్కగ ప్రకటించి మనప్రాచీనవాఙ్మయానికి సేవచేసినారనడములో ఏలాటిసందేహమును లేదు. ఆంధ్రదేశముకొరతను మీరు పూర్తిచేస్తున్నారనడము నిజము. మీకు విజయమగుగాక!

## 177

### డాక్టరు శ్రీ భో. పట్టాభిసీతారామయ్య, బి. ఏ., యం. బి. అండు సీ. ఎమ్. మచిలీపట్నము.

ప్రాచీనఅర్వాచీన ఆంధ్రవాఙ్మయప్రవృద్ధికి మీరు ఎంతఉత్సాహముతో ఎంతస్వార్థత్యాగముతో సేవచేసియుందేదిన్ని ఆంధ్రదేశముఅంతా చాలాబాగానెరుగును.

## 178

### శ్రీ పి. వి. యస్. అవధానులుగారు, బి. ఏ., సబ్ జడ్జి (రిటైర్డు), మచిలీపట్టణము.

మద్రాసుకుచెందిన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ అనుముద్రాపక గ్రంథప్రచురణసంఘాన్ని లోకానికెరుకపరచడానికి మిగులసంతసించుచున్నాను. వీరు 80 ఏండ్లుగా పనిచేయుచున్నారు. వారుచేసే మహోపయోగకార్యాన్నిగురించి ప్రత్యేకముగ వివరింపబనిలేదు.

## 179

### శ్రీ యం. వి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యెల్., అడ్వొకేటు, నెల్లూరు.

తెలుగుసంస్కృతవాఙ్మయముల ప్రచురణవిషయములో మీరుచేసినకృషికి బహూకరణముగా నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియన్ వారు మీకు స్వర్ణపతకమియ్య తీర్మానించినారు. ఇది శ్రీతిక్కనజయంతిసందర్భమున టౌనుహాలులో నిర్వహింతురు. మహామహోపాధ్యాయ తాతాసుబ్బరాయడుశాస్త్రులుగారు అధ్యక్షతవహింతురు. పతకాన్ని స్వీకరించడానికి ఆతరుణమున మీరుహాజరగుదురుగాకఅని కోరుచున్నాను.

## 180

### శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు, బి. ఏ., సి. బీ. యి., బుచ్చిరెడ్డిపాలెము.

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుఅండ్ సన్స్ వారిపేరు తెలియని అక్షరజ్ఞకుటుంబమొక్కటికూడ తెనుగుదేశమునందులేదు. కీర్తిశేషులగు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారు గొప్పపండితులు, కవి, తెనుగుముద్రాపకప్రచురకచక్రవర్తి. వారారంభించిన ఘనకార్యక్రమాన్ని వారిసుపుత్రులు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు చక్కగ సాగించినారు. ఉత్సాహశ్రద్ధలలో వీరికి వీరే సాటి. తెనుగుసంస్కృతవాఙ్మయములలో ప్రకటితముకాని యొక్కొకపుస్తకమును దేశీయశాస్త్ర, కళలకు సంబంధించినగ్రంథములును

శ్రీశాస్త్రులుగారు ప్రకటించి లోకానికిఅందజేసినారు. ప్రకటితముకాని పుస్తకాలనుప్రకటించి లాభముచేసుకోవలెననేది వారిముఖ్యోద్దేశముకాదు. వాటిని నశింపుగాకుండ సంరక్షించడమే ఆయనధర్మముగా ఆలోచించినారు. ఆయనకుచాలానష్టమయినా ఆయాశమును ఆయనఫలింపజేసుకొనినారు. తానుచేసేపని ఆయనకుతెలియును. నిజానికి ఇప్పటికి అమ్మకముకానిపుస్తకాలు ఏనాడోఆయనప్రకటించిరి అవి అమూల్యగ్రంథములు అదియే ఆయనకు తృప్తి.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి ప్రజాహితజీవితచర్యలు బహుభంగులవి. సరియైనపనిని సరియైనమార్గానచేయడము ప్రజలకుమంచిని హృదయపూర్వకముగ సమకూర్చడము నిక్కచ్చిగానడవడిఉంచుకొనుదీక్ష ఇవిగలుగుటచేత వీరు ప్రజలయనురాగమును చూరగొనగలిగినారు. వీరు చాలనుపయోగకరమయినసంస్థకు యజమాని. స్వయముగా ఈయన ఉపకారి. మైత్రిపాత్రుడు.

ఇంకా నెక్కువఫలప్రదముగా లోకసేవచేయడానికి ఇతనికి చిరాయురారోగ్యాలగునుగాక అని అందరినిరంతరప్రార్థన.

## 181

## శ్రీ కాళహస్తి సుబ్బయ్యశాస్త్రిగారు,

తెలుగుపండితులు, తొండైమండల హైస్కూలు, శ్రీగురుగుహాశ్రమ్మసీ, 10 సుబ్బయ్యరువీథి, జి. టి. మదరాసు.

శ్రీత్రిలిఙ్గపత్రిక రజతోత్సవసందర్భమును సర్వవిధములఁ గొనియాడుట నాకానందదాయకమైన విషయమని నుడువుట కెంతయు సంతసించుచున్నాఁడను. ఏతత్పత్రికాధిపతులగు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారు నాకు బాల్యమునుండి పరిచితులైయుంటంజేసి వారిసుగుణగణాదికముల గణింప నాకెంతయు ముదావహంబగుచున్నయది. శ్రీశాస్త్రులవారు త్రిలిఙ్గపత్రికను వ్యాప్తికిదెచ్చుటలో సాధారణమేధాధురీణతనువహించి అన్నివిధముల లోకమునను దోడ్పడుచుండుట సర్వజనవిదితము. పత్రికాంతరములవలెగాక రాజకీయములేగాక వాఙ్మయమునకును, ధర్మమునకును, మతప్రచారమునకును ఇతరవిధములను నీపత్రికఁ దోడ్పడుచుండుట శ్రీశాస్త్రులవారివిజ్ఞానవైఖరిని జాటుచున్నది.

అసదృక్షవాఙ్మయాభివృద్ధికై ఈపత్రికతోడ్పడుటయేకాక వీరిచేఁ బ్రచురింపఁబడు గ్రంథజాలమును నిర్దుష్టమై ఆంధ్రజనైకమాన్యమై అలరారుచున్నది. ఈగ్రంథప్రచురణముగాని పత్రికాప్రచురణముగాని యేదేని లాభమునులభింపఁజేయుచున్నదన నదియు నీతి

దాతృత్వతకుఁ దోడ్పడుచున్న దేగాని స్వలాభమునకుమాత్రమే కాదనుట యెల్లరెఱింగి నదియే. విద్యార్థిలోకము చాలవఱకు వీరిఆదరణనుగొనియే తమవిద్యాభివృద్ధిని గాంచఁ గలిగియున్నది.

శ్రీశాస్త్రులవారిమతోద్ధారణయు, వాఙ్మయసేవయు, నిరాడంబరజీవికయు వారికి దీర్ఘాయురారోగ్యములంగూర్చి వారియశశ్చంద్రికల నెల్లదిశలవ్యాపింపఁజేయఁగలందులకు దైవమును బ్రార్థించుచున్నాను.

త్రిలిఙ్గపత్రిక అభ్యుదయపరంపరాభివృద్ధినిగాంచుచు నీరజతోత్సవవైభవమునకన్న మిన్నయైనస్వర్ణోత్సవమును నత్యంతవైభవమునగాంచుతమని ఆశించుచున్నాను.

## 182

### శ్రీ వెల్లాల రామకృష్ణశాస్త్రిగారు, బి. ఏ., జర్నలిస్టు, కడప

తెనుగువారపత్రికయై చెన్నపట్టణమునుండి గత ౨౫ సంవత్సరములుగ అవిచ్ఛిన్నముగ ప్రజాసేవజేయుచున్న "త్రిలిఙ్గ" పత్రికరజతోత్సవము ఈఆగస్టుమొదటివారములో రాజధానిప్రధానపట్టణమైనచెన్నపురియందే జరుగనున్నదనుశుభవార్త తెనుగుసీమలోనుండుప్రతివారికిని ఆనందదాయకమైయుండుననుటకు సందేహము లేదు. ఈతెనుగుభూమియందు అనేకపత్రికలుద్భవించినను పట్టుమనిపదియేండ్లయినను ప్రజాసేవచేయక అనేకపత్రికలు బాల్యావస్థగడవకమునుపే అస్తమించినవి. ఇట్టిపరిస్థితులలో ఏవోకొన్నిపత్రికలు మాత్రమే బాలారిష్టదోషములనెదుర్కొని రజతోత్సవమునుజరుపుకొనగల్గుస్థితికి రాగలుగుట తెనుగుపత్రికలజీవితములో ఒకగొప్పవిశేషమనకతప్పదు. "త్రిలిఙ్గ" పత్రికకు ఇట్టి అపూర్వగౌరవమబ్బగలుగుటచే ఈపత్రిక తనజీవితమును సార్థకపరచుకొనినదనియు ప్రజల ఆదరణపొందగలిగినదనియు ఋజువైనది. ఇందులకు ఈపత్రికావ్యవస్థాపకులును సంపాదకులునైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారెంతయు అభివందనీయులు. సాహిత్యచర్చలకును, మత, రాజకీయ, ఆర్థిక, శాస్త్రజ్ఞానాభివృద్ధికిని ఈచిన్నివారపత్రిక పాటుపడుచున్నది ఈపత్రికనిర్వాహకులును సంపాదకులును అగుశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు ఈపత్రికను ఏరాజకీయపక్షముతోనుజేర్పక అన్నివిషయములలోను ప్రజాభిప్రాయములను నిర్భయముగ ఈపత్రికద్వారా వెల్లడించుటకు అవకాశమొసగుచున్నారు. గ్రామసీమలలోని ప్రజాసామాన్యములో ప్రబోధముగలిగించుటకు దేశభాషావారపత్రికలే ఉత్కృష్టసాధ

నములని రూఢిగనమ్మినవారిలో ఒకరు. ఈయుద్దేశముతోనే శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రి గారు ఈ "త్రిలిఙ్గ" పత్రికనునడుపుచు ప్రజాసేవయొనర్చుచున్నారు.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు సర్వతోముఖపాండిత్యముగలిగి నిరాడంబర జీవినై, సర్వజనసులభుడై, సంపూర్ణమైనరాజకీయవిజ్ఞానముగలరాజయోగి, తత్వజ్ఞాని. కూలినాలిచేసికొని బ్రతుకుచున్న కష్టజీవులమీదను విద్యార్థులయెడలను అపారమైనప్రేమ గలదయాళువు. కార్మికులయెడలను విద్యార్థులయెడలను వీరుచూపుచున్న విశ్వాసమే వీరిని అనేకమైనకార్మికసంఘముల ప్రతినిధిగ శాసనసభలలో ప్రవేశించి ప్రజాసేవయొనరించు నటులచేయునని నాకుదృఢవిశ్వాసముగలదు. జీవితమంతయు ప్రజావిజ్ఞానము సర్వవిధముల అభివృద్ధిచేయుటకై వినియోగించుచు ప్రజాసేవజేయుచున్న ఈదేశసేవాతత్పరుడైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి ఆయురారోగ్యములనొసగి ఇంకను అనేకసంవత్సరములు దేశసేవచేయుటకు అవకాశముగలుగునటుల ఆశీర్వదించుగాక అని ఈ "త్రిలిఙ్గ" పత్రికా రజతోత్సవసందర్భమున పరాత్పరుని ప్రార్థించుచున్నాను.

ఈ క్రిందిఅభినందనాలను కీర్తిశేషులైనపెద్దలు
శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారికిబంపినవి.

**183**

**రాజా సర్: టీ. మాధవరావుగారు, బరోడా-తిరువాన్కూరుల దివాను.**

మీరు సంస్కృతము తెనుగులకుచేసిన అమూల్యమయినసేవనుగురించిన్ని వేదములు దర్శనములలో మీకుగలఅఖండపాండితినిగురించిన్ని నేను శ్రీమహారాజావారికి తెలియపరచినాను. మీరిప్పుడారంభించేనుప్రక్రమములో మీకువిజయంబగుగాక ! మహారాజాగారి అనుమతిఅయినది. మీవ్యాఖ్యానముతోగూడా ఋగ్వేదాన్ని మొదటప్రచురింపవలసినది. మీరును పెద్దవారగుచున్నారు. అందుచేత ఈపనిని ఆలస్యముచేయవలదు.

**184**

**ఆనరబిల్ రావుబహదర్ శ్రీ పీ. ఆనందాచార్యులుగారు,**

విద్యావినోదవిశారద, బి. ఎల్., సి. ఐ. ఈ., మాజీకాంగ్రెస్సు ప్రెసిడెంటు, మదరాసు.

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు తమకాలమున సారస్వతములో నియంతలు అనడము అర్థవంతమైనవర్ణన. వీరు పండితులు కవులను పుంఖానుపుంఖములుగ పుట్టించినమండల పుత్రులు. అంతేగాక మనశాస్త్రులవారు ప్రత్యేకముగొప్పపండితకుటుంబానికి చేరినవారు. వీరు సంస్కృతము తెలుగులలో అఖండపండితులు, విమర్శకులు. వీరు వేదవేదాంతశాఖలలో ప్రవీణులు. ప్రాచీనము అపురూపమునైన మహద్గ్రంథాలనుసంపాదించి విమర్శపూర్వకముగ ప్రకటించడానికి తగినగుణసంపదయంతయు వీరికిగలదు. వీరిసంస్కృతతెనుగుగ్రంథముల వేనవేలుకూర్పులను ప్రపంచమాదరించునుగాక అని కోరుచున్నాను.

**185**

**గౌ॥ శ్రీ పల్లె. చెంచలరావుపంతులుగారు, సీ ఐ ఈ.**

సంవత్సరాలకొలదిగ మీరు సంస్కృతము తెనుగువాఙ్మయాలకుచేసిన అపారసేవను గురించి శ్రీగవర్నరుగారికిచెప్పడానికి అవకాశముదొరకలేదు. ఎంతత్వరగసాధ్యమయితే అంతత్వరగ తమవిషయము గవర్నమెంటువారినెదుటికితెచ్చేప్రయత్నముచేస్తాను. మన

ప్రాచీనస్మృతివేదాంతగ్రంథాలను వివరించడానికి మీకుమాత్రమే అర్హతయుండడముచేత మీరీపని వెంటనేఆరంభింపవలసినదని కోరుచున్నాను. ఈయన్నిటిని అచ్చువేయించేదాని కయ్యేవ్యయము నేనుభరించడానికి సిద్ధముగనుండగలను.

## 186

### దివాన్‌బహాదరు శ్రీ కే. రామానుజాచారిగారి, ఎం. ఏ, బి. ఎల్, యల్. టీ.

ప్రిన్సిపాలు, మహారాజావారికళాశాల, విజయనగరము.

మీరుపంపినపుస్తకముల వందనములతోఅందుకొన్నాను. అవి దివ్యముగానున్నవి. తక్కినప్రౌఢగ్రంథములన్నీకూడా త్వరలో మీరుప్రకటింతురుగాక అని కోరుచున్నాను

## 187

### రావుబహాదరు శ్రీకందుకూరి వీరేశలింగంపంతులుగారు, రాజమండ్రి.

తెనుగువాఙ్మయప్రచారానికి ఈయెనుబదిసంవత్సరాలుగ మీసంస్థచేయుచుండే పరిశ్రమ చాలగొప్పది. నాకుసాధ్యమైనంతత్వరలో మిమ్ములనుగలిసేప్రయత్నముచేస్తాను. మీతండ్రిగారుమీసంస్థ చేసినఅసమానమయినపనినిగురించి బహిరంగముగచెప్పవలసివచ్చినప్పుడు నేనేమాత్రమువెనుదీయనని మీరునమ్ముడు.

## 188

### మహారాజామిర్జా శ్రీఆనందగజపతిరాజ్ మన్నేసుల్తాన్‌బహదర్,

విజయనగరముమహారాజావారు జి. సీ. ఐ. ఈ.

మనప్రాచీనవాఙ్మయాలపరముగ మీరుచేస్తున్నసేవనుగురించి నేను చాలా సంతోషపడినాను ఆమూలాగ్రమయినవ్యాఖ్యానముతో తెనుగులో మీరుప్రకటిస్తూఉండే బ్రహ్మాండమైనశ్రీరామాయణమునకుగాను నేనుపంపే ఈవిరాళమును పుచ్చుకొందురుగాక అని కోరుచున్నాను. మీకుండే అప్రతిమానపాండిత్యమున్ను వ్యవహారనైపుణియుకారణముగ మీరీకార్యక్రమాన్నిదివ్యముగాసాగింపగలరని నావిశ్వాసము.

## 189

### శ్రీ వెలుగోటి శ్రీ రాజగోపాలకృష్ణయాచేంద్రబహదరువారు, కే. సీ. ఐ. ఇ., శ్రీ వేంకటగిరిమహారాజాగారు.

తెలుగు వాఙ్మయమునకు మీరు చేస్తూఉండే అపార సేవను కొనియాడుచున్నాను. గోపీనాథ రామాయణము అచ్చువేయుపని వెంటనే ఆరంభించండి. దీని అచ్చు, బైండుఖర్చులు రెండూ నేను భరింపగలను.

## 190

### రాజా శ్రీ ఏ వి జగ్గారావు బహదూరుగారు, యం. ఆర్. ఏ. యస్., యఫ్. యం. యు, విశాఖపట్టణము.

తాము తెనుగుసారస్వతానికి చేస్తూఉండే సేవను గుర్తించి కొన్ని క్రొత్త ప్రచురణాల కయ్యేకర్చు నేను పెట్టుకోడానికి తీర్మానించికొన్నాను.

## 191

### గౌ॥ శ్రీ న్యాపతి సుబ్బారావుపంతులుగారు, ఇంపీరియల్ లెజిస్లేటివుకౌన్సిలుమెంబరు, రాజమండ్రి.

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారు చదువను పీఠిలైన ఉపయుక్త గ్రంథసామగ్రి తెనుగులో ప్రకటించడమేగాక ప్రాచీన ప్రౌఢ కావ్యాలన్నిటినిగూడ మంచి కాగితపులు ముచ్చటైన అక్షరాలతో పునర్ముద్రణ చేయుచుండడము చాలా సంతసింపదగినది తెలుగు వాఙ్మయపరముగా వారు చేసే కృషికి తెనుగులోకము వారికి చాలకృతజ్ఞతగా ఉండగలదు.

## 192

### దివాన్‌బహదూరు శ్రీ వై జానకిరామయ్యపంతులుగారు, జిల్లాజడ్జి, గుంటూరు.

సంస్కృతము తెనుగువాఙ్మయాలకుగాను మీరు చేస్తుండే ప్రయత్నానికి మిమ్ముల అభినందించుచున్నాను. మీరు వెలువరచబోయే త్రిలిఙ్గకు వ్యాసాలు వ్రాయుచుందును. ఇందుకునాఅభ్యంతరము లేదు.

193

**శ్రీ గుర్జాడ అప్పరావు పంతులుగారు, బి. ఏ., యఫ్. యం. యు.,**

విజయనగరము మహారాజాకుమారికసాహెబాగారి ప్రైవేటుసెక్రటరీ.

తెనుగుసంస్కృతవాఙ్మయాలసేవకై మీరు చేయుచుండు దివ్యమైనకృషికిగాను అభినందనములు అర్పించుచున్నాను.

194

**శ్రీ కే. చెంగయ్యపంతులుగారు, బి. ఏ., ప్లీడరు, తిరుపతి.**

మీకూర్పులు అన్నివిధాలఅప్రతిమానములు. దేశానికి ఉపకారకరకార్యముల మీరు నిర్వహిస్తున్నారని నేను గర్విస్తున్నాను.

195

**స్వామి శ్రీ విద్యానందపరమహంసగారు, బి. ఏ.**

శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారు నేటిఉత్తమఅర్వాచీనరూపములో తెనుగుప్రాచీనప్రౌఢరచనలను ప్రకటించుమహాకార్యముతలపెట్టుకొన్నారు. వసుచరిత్ర స్వరూపతీర్మానముసంపాదన బహుచక్కగానున్నది. వారు ఈగ్రంథాలనుపరిశీలించి సిద్ధ పరచడానికి పండితులనుపెట్టి పనిచేయించుచున్నారు కాబట్టి, ఈమార్పులు స్ఖాలిత్యరహిత ముగాఉండగలవనుటకు సందేహములేదు.

196

**శ్రీ బీ. రామకృష్ణరావుగారు, బి. ఏ, పాలెస్‌కంట్రోలరు, మైసూరు.**

తమకెప్పుడనుకూలమో అప్పుడు మీరు శ్రీమహారాజాగారిని చూడనురావచ్చును. మీప్రచురణసంస్థచేసేసేవకు వారునేనుఆనందించుచున్నాము.

197

**శ్రీ వై. నారాయణమూర్తిపంతులుగారు, బి. యే.,**

విజయనగరముమహారాజావారికి ప్రైవేటుసెక్రటరీ.

మీకు బంగారుపతకమివ్వదలచినారము. ఆంధ్రమహాసభసమావేశమున దీని ఇవ్వ డము ఉచితము. ఈవిషయమున మీరునాతో నేకీభవింతురని నమ్మకము. గా॥ శ్రీ పోలవరము

జమీందారుగారికిని గా॥ శ్రీమోచర్ల రామచంద్రరావుగారికిని సమావేశ కార్యక్రమములో దీనిని చేర్చవలసినదని జాబులు వ్రాయుచున్నాను.

## 198

### శ్రీ జి. హనుమంతరావుగారు, బి ఏ.,

మేనేజరు, గవర్నమెంటుఅద్వకేటు ఆఫీసు, బెంగళూరు.

మీ పానవలలుకొన్ని చదివితిని. చాలచక్కగనున్నవి నేను వానిని కొందరుస్నేహితులకిచ్చితిని. వారు వానిచదివి కన్నడములోనికి పరివర్తనముచేస్తే మంచివాఙ్మయమవుతుందని అభిప్రాయపడిరి. పరివర్తనము చేసుకోడానికి మీరు అంగీకరింతురుగాక అని కోరుచున్నాను.

## 199

### శ్రీ టి. వి. స్వామినాథఅయ్యరుగారు, బి. యే, యల్. టీ, తిరుచినాపల్లి.

కాశీ భారతధర్మమహామండలివారికొన్సిలు ఉత్తరువుమేరకు మీరు సంస్కృతభాషాప్రచురణవిషయమున చేసినతమఅమోఘమయినసేవను గుర్తించుటకయి "శాస్త్రప్రచారభూషణ" అనుబిరుదముతోకూడ ఇందుతోజతచేసిన డిప్లోమాను తమకు సమర్పించుకొనుచున్నాను.

## 200

### పండితశ్రీ అల్లాడి మహాదేవశాస్త్రిగారు, బి. ఏ,

క్యూరేటరు, ప్రాచ్యపుస్తకభాండాగారము, మైసూరు.

మద్రాసునందలి శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ యజమానులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని ప్రజలకుపరిచయపరచడానికి బహుసంతోషపడుచున్నాను. ఈసంస్థ రమారమి ౭౫ ఏండ్లుగా పనిచేయుచున్నది సంస్కృతము, తెనుగు, అరవము, ఇంగ్లీషుభాషలలో వేద, వేదాంత, ధర్మశాస్త్ర, ప్రౌఢకావ్యములు రమారమి 700 వీరు ప్రకటించినారు. అర్వాచీనగ్రంథాలు అనేకములు వెలువరచినారు. వీరిప్రచురణములు దోషరాహిత్యమునకు చక్కనిరూపకల్పనకు పేరుగన్నవి. ఈసంస్థసంస్థాపకులు సుప్రసిద్ధులు, పండితులు. అంతటివారు వారికుమారులు, ప్రస్తుతయజమాని. వీరిదక్షమగునిర్వాహణక్రింద

ఈసంస్థ కాలానుగుణప్రవర్తన కనబరచెను. ప్రకటనలన్నిటిని ఉత్తమఅంతస్థుకు తెచ్చెను. ఈసంస్థకు దక్షిణఇండియాలో మంచిపేరున్నది. ఎన్ని ప్రజాహితసంఘాలో ఎన్నియో బహిరంగసంస్థలో మేము మేమనిముందుపడి వీరినిబహూకరించినవి. ప్రచురణకార్యముల నడుపుటలో దీనియజమాని యెందరోపండితులను పోషించినాడు. అన్ని విధాలా ఈసంస్థను ప్రోత్సహించుట ప్రజలధర్మము.

## 201

### కీర్తనాచార్య శ్రీ సీ. ఆర్. శ్రీనివాసఅయ్యంగారు, బి. ఏ., మైలాపూరు, మద్రాసు.

తెనుగువాఙ్మయములోని ఉదాత్తప్రౌఢరచనలఅన్నిటికిని శాశ్వతరూపముగల్పించి చక్కగాప్రకటించిన శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సునుగురించి తెనుగుప్రజలు న్యాయముగానే గర్వముతో చెప్పుకుంటారు. నిర్ణయసాగర, గోపాలనారాయణ, లక్ష్మీవేంకటేశ్వర, ఆనందాశ్రమ అనుపౌత్తరేయప్రచురణసంస్థలొక్కొక్కటికి అన్నింటికిసరిపోవు దక్షిణదేశప్రతినిధి ఈసంస్థ. వీరు వాఙ్మయములోని అన్ని శాఖలను—ఆధ్యాత్మిక, ఆధిభౌతికాలను, గట్టితేలికలను—ఆదరించిపనిచేసినారు. వారుపట్టినదంతయు బంగారమే చేసినారు. సునిశితదృష్టి, సూక్ష్మాంశములనెడల జాగ్రత్త, గ్రంథప్రచురణకార్యములో అన్ని శాఖలలో వైరళ్యము, ఏరుటలోచాకచక్యము, సుందరకళాన్వితరూపకల్పన—ఇన్నిట వీరు పొగడ్తగన్నారు. గొప్పపండితులు, బిరుదాంచితులు, ఉన్నతోద్యోగులు, త్వరగా తృప్తిపడనిగ్రంథకర్తలు, తప్పులువెదకే కళావిమర్శకులు—అందరువీరిని మెచ్చుకొన్నారు. భారతమాతకు నమ్మకమైనపుత్రులు వీరు. పూర్ణముగా 'స్వ' లేనివారు మితిలేనిఉదారులు. వీరు ఆంధ్రజాతికి జాతీయవాఙ్మయానికి అపురూపమైనసేవచేసినారు. కాలప్రవాహము నడచినట్లెల్లా వీరిఉపయోగమునువిస్తరించుచునేపోగలదు.

---



వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము, చెన్నపురి.—1941.

# త్రిలిఙ్గరజతోత్సవసభలు 14, ఆగస్టు, 1941

అధ్యక్షులు :

## శ్రీ నృసింహచింతామణి కేల్కారు, బి. ఏ., యల్. యల్. బీ.

శ్రీ ఎన్. సి. కేల్కారుగారిఅధ్యక్షతను తే 14-8-41 ది సాయంత్రము గోఖలే హాలులో భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున అఖండపౌరసన్మానము జరుపబడి రజతపేటికలో గౌరవచిహ్నసంపుటము సమర్పింపబడెను. సభకు ప్రముఖులగు స్త్రీలు పురుషులు పెక్కుమందివిచ్చేసిరి.

సభకువచ్చినప్రముఖులు:—

1. శ్రీ పిఠాపురము మహారాజాగారు, 2. సర్: వేపారామేశముగారు, 3. శ్రీ ఉయ్యూరురాజాగారు, 4. శ్రీ కపిలేశ్వరపురము జమీందారుగారు, 5. శ్రీ కపిలేశ్వరపురము కుమారజమీందారుగారు, 6. డాక్టరు: దివాన్‌బహదరు ఎస్. కృష్ణస్వామిఅయ్యంగారు, 7 శ్రీ సర్. అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు, 8. శ్రీ సర్: ఏ. పీ. పాత్రోగారు, 9. శ్రీ ఓ. పుల్లారెడ్డిగారు, 10. శ్రీ గౌ॥ న్యాయమూర్తి, పి. వేంకటరమణరావునాయుడుగారు, 11. రావుబహదర్ జి. ఏ. నటేశన్‌గారు, 12. దివాన్‌బహదర్ ఆర్. వి. కృష్ణఅయ్యరుగారు, 13. రావుబహదర్ యం వేంకటరామయ్యగారు, 14. రావుబహదర్ యం. రామప్పగారు, 15. శ్రీ కే. పి. విశ్వనాథఅయ్యరుగారు, 16. శ్రీ కే. బాలసుబ్రహ్మణ్యఅయ్యరుగారు, 17. రావుసాహెబు ఐ. వెంకటసుబ్బయ్యగారు, 18. ఖానుబహదూర్ సాదుల్లా పాషాసాహేబుగారు, 19. రావుబహదూర్ ఆర్. యన్. అయ్యంగారు, 20. శ్రీ బషీర్ అహమ్మదుసాహేబుగారు, 21. శ్రీ కే. సంజీవకామత్ గారు, 22. శ్రీ ఈ. వినాయకరావుగారు, 23. శ్రీ సి. రంగనాయకులుశెట్టిగారు, 24. శ్రీ వి గోవిందరాజాచారిగారు, 25. శ్రీ యం. సుదర్శనముఅయ్యంగారు, 26. శ్రీ కే. శ్రీరాములునాయుడుగారు, 27. శ్రీ కాశా సూర్యనారాయణరావుగారు, 28. శ్రీ భావరాజు వేంకటకృష్ణరావుగారు, 29. రావుబహదర్ ఆర్. కృష్ణరావుభాన్స్లేగారు, 30 శ్రీ పి. వి. మురుగయ్యశెట్టిగారు, 31. శ్రీ యస్. శంభుప్రసాదుగారు, 32. శ్రీ ఎస్. వేంకటేశఅయ్యంగారు, 33. రావుబహదూరు శ్రీ కే. వీ. శేషఅయ్యంగారు, 34. శ్రీ ఎస్. వి. నారాయణఅయ్యరుగారు, 35. శ్రీ కే. కృష్ణస్వామిఅయ్యంగారు, 36. శ్రీ ఆర్. చక్రవర్తిగారు, 37. ప్రొఫెసరు సి. యస్. శ్రీనివాసాచారిగారు,

38. శ్రీఏ. వెంకటాచలముగారు, 39. శ్రీఎస్. కణ్ణన్‌గారు, 40. శ్రీఅల్లాడి సుబ్రహ్మణ్యముగారు, 41. శ్రీయం. ఎన్. సభగోపాలుగారు, 42. శ్రీకే. ఉమామహేశ్వరముగారు, 43. శ్రీ ఎస్. లక్ష్మీపతిశాస్త్రిగారు, 44. డాక్టరు దంటు సుబ్బావధానిగారు, 45. శ్రీ చిటేలుగారు, 46. డాక్టరు: జి. వి. సీతాపతిగారు, 47. శ్రీ రావుసాహెబు యన్. బాలకృష్ణశెట్టిగారు, 48. శ్రీఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, 49. శ్రీజే గంగన్నగారు, 50. కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు, 51. పండిత శ్రీ కే. వాసుదేవశాస్త్రిగారు, 52. శ్రీ యం సుబ్రహ్మణ్యముశాస్త్రిగారు, 53. శ్రీఈ. భాష్యకాచార్యులుగారు, 54 శ్రీ ఆరుముగముపిళ్లెగారు, 55. శ్రీ మంశాల శ్రీపతిగారు, 56. శ్రీ యన్. డి. వరదాచారిగారు, 57. శ్రీ బి. విశ్వనాథ అయ్యరుగారు, 58. శ్రీ ఖాసా సుబ్బారావుగారు, 59. శ్రీ కే. చంద్రశేఖరముగారు, 60. శ్రీరామనాథగోయిన్‌కాగారు, 61. శ్రీపి సోమసుందరముగారు, 62. శ్రీ వై. సూర్యనారాయణగారు, 63. శ్రీ వి. కృష్ణరావుపంతులుగారు, 64. శ్రీ చల్లా జగన్నాథముపంతులుగారు, 65. శ్రీ ఎస్. ఆశీర్వాదముగారు, 66. శ్రీ పి. యం. బాలసుబ్రహ్మణ్యమొదలియారుగారు, 67. శ్రీటి. ఎ. వి. నాథన్‌గారు, 68. రావుబహదర్ యం. రామన్‌గారు, 69. శ్రీ కే. హంసరాజసాహుకారుగారు, 70. శ్రీజి. జానకిరామశెట్టిగారు, 71. శ్రీ పండిత చల్లా సత్యనారాయణగారు, 72. శ్రీ వం. కృష్ణమాచారిగారు, 73. ప్రొఫసరు శ్రీ యం రామానుజరావునాయుడు, 74. వి. శ్రీపాండురంగరావుగారు, 75. శ్రీ కే. చంద్రమౌళీశ్వరశాస్త్రిగారు, 76. కే. శ్రీసుబ్బయ్యశాస్త్రిగారు, 77. శ్రీ ఏ. రంగనాథమొదలియారు, 78. శ్రీ పి. వి. జోషిగారు, 79. శ్రీ జే. సత్యనారాయణమూర్తిగారు, 80. శ్రీ ఎస్. సూర్యప్రకాశముగారు, 81. శ్రీ సి. అప్పారావుగారు, 82. శ్రీ యం. ఎస్. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, 83. శ్రీ జి. యస్. యన్. ఆచార్యగారు, 84. శ్రీ సి. యస్. శాస్త్రిగారు, 85. శ్రీ వి. కృష్ణమోహన్‌గారు, 86. రావుబహదరు యం. నరసింహముపంతులుగారు, 87. శ్రీ పి. యం. ఆదికేశవులునాయకరుగారు, 88. శ్రీ జి. హరిసర్వోత్తమరావుగారు, 89. శ్రీ డాక్టరు: ఏ. లక్ష్మీపతిగారు, 90. శ్రీ టి. రాఘవేంద్రరావుగారు, 91. శ్రీ ఆర్. మదనగోపాలునాయుడుగారు, 92. శ్రీ ఆర్. చిన్నస్వామిఅయ్యంగారు, 93. శ్రీ ఆకొండి పరబ్రహ్మశాస్త్రిగారు, 94. శ్రీ ఎస్. రామలింగశాస్త్రిగారు, 95. రావుబహదర్ పి. సంబంధముమొదలియారుగారు, 96. శ్రీ ఎ. ఆర్. వి. ఆచార్యగారు, 97. శ్రీ పి. కామేశ్వరరావుగారు, 98. శ్రీ ఏ. ఏ. హెల్సగారు, 99. శ్రీసి. సాంబశివరావుగారు, 100. శ్రీ కే. యల్. నరసింహరావుగారు, 101. శ్రీ పండిత బి. వేంకటేశ్వరశర్మగారు, 102. శ్రీ ఆర్. సూర్యనారాయణరావుగారు, 103. శ్రీ టి. టి కృష్ణమాచారిగారు, 104. శ్రీ టి. పట్టాభిరామఅయ్యరుగారు, 105. రావుబహదర్ సి. గోపాలమీనన్‌గారు, 106. దివాన్‌బహదర్ వి. షణ్ముఖ

మొదలియారు, 107. శ్రీ కే. సుబ్బనామాత్యగారు, 108. శ్రీ జే. రామమూర్తిగారు, 109. శ్రీ జి. సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, 110. శ్రీ కే. ఓ. ఆంతోనిగారు, 111. శ్రీ కే. చిన్నయ్య శెట్టిగారు, 112. శ్రీ యం. వి. శర్మగారు, 113. శ్రీ టి. సుందరరావునాయుడుగారు, 114. శ్రీ వి. మంగళవేద్కరుగారు, 115. శ్రీ యస్. నరసింహముగారు, 116. శ్రీ డాక్టరు యస్. వేంకటరమణయ్యగారు, 117. శ్రీ వి. వేంకట్రాయశాస్త్రిగారు, 118. శ్రీ ఎస్. రాఘవాచారిగారు, 119. రావుసాహెబు ఎస్. వేణుగోపాలశెట్టిగారు, 120 శ్రీ నేతి సుబ్రహ్మణ్యము గారు, 121. శ్రీ నేతి చలపతిగారు, 122. శ్రీ కొత్తా శ్రీరామశాస్త్రిగారు.

1 శ్రీమతి విద్యాసుందరి బెంగళూరు నాగరత్నముగారు, 2. శ్రీమతి ఎస్. సి. కేల్కారుగారు, 3. శ్రీఎస్. సి. కేల్కారుగారి సోదరిగారు, 4. శ్రీమతి యం. కే. దండేకరుగారు, 5. శ్రీ జి. యం దండేకరుగారు, 6 విద్వాన్ శ్రీమతి కాంచనపల్లి కనకమ్మగారు, 7. శ్రీమతి డి. ఎస్. అవధానిగారు, 8. శ్రీమతి సీతమ్మగారు, 9. శ్రీమతి సుభద్రమ్మగారు, 10. శ్రీమతి లక్ష్మీకాంతమ్మగారు.

శ్రీమతి బెంగళూరు నాగరత్నముగారు దైవప్రార్థనగావించిరి.

హిందూపత్రికాసంపాదకులు శ్రీ కె. పీ. విశ్వనాథఅయ్యరుగారు, శ్రీయన్. సి. కేల్కారుగారిని అధ్యక్షతవహింపమని ప్రతిపాదించుచు ఇట్లుచెప్పిరి సుప్రసిద్ధపత్రికారచయితయు మనపురవాసులలో ప్రముఖులును అగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని గౌరవించుటకు మనమిచ్చటనేడు సమావేశమైతిమి. పత్రికారచయితలలో శ్రీ కేల్కారుగారి నామము పవిత్రతరమై చిరకాలముగ అలరారుచున్నది. వారివ్రాతలు మనకందరికిని మిక్కిలి ఉత్సాహమునుగలిగించినవి. అట్టివారు నేటిసభకు అధ్యక్షతవహించుట నెంతయు సమంజసము.

శ్రీఈ. వినాయకరావు, బి. ఏ., బి ఎల్, రావుబహదరు శ్రీకృష్ణరావుఖాన్లేగారలు తీర్మానమును బలపరచినమీదట శ్రీ ఎన్. సి. కేల్కారుగారు అధ్యక్షపీఠమలంకరించిరి.

కాంచి శ్రీకామకోటిపీఠాధిపతులగు శ్రీజగద్గురు శ్రీ శంకరాచార్యులవారితరఫున వారి ఆశీర్వాదములతో శ్రీ కె బాలసుబ్రహ్మణ్యఅయ్యరు, బి. ఏ, బి. ఎల్., గారు శ్రీశాస్త్రి గారికిశాలువనుగప్పి పండితమర్యాదనుగావించిరి.

తదనంతరము శ్రీజమ్నదాస్ మెహతా, శ్రీమనుసుబేదార్, శ్రీపర్లాకిమిడి మహారాజా, శ్రీ కిర్లంపూడిరాజా, గౌ॥ జస్టిసు యస్. చంద్రశేఖరఅయ్యరు, శ్రీగంగాధర దేశపాండ్యా, సర్: కె. వి రెడ్డినాయుడు, సర్: యం. వెంకటసుబ్బరావు, సర్: మీర్జా ఇస్మయిల్, డా॥ కట్టమంచి రామలింగారెడ్డి, సర్: జార్జి బోగ్, జి. టి. రథర్ఫర్డు, శ్రీబి జి. ఖపర్డీ, శ్రీపిఠాపురము యువరాజా, కలెక్టరు శ్రీ పి. వి. సుబ్బారావు, శ్రీ పెద్దాడ కామేశ్వరమ్మమొదలగు ప్రముఖులనుండి వచ్చిన సందేశములను ప్రొఫసరు సి. ఎస్. శ్రీనివాసాచారి గారు చదివిరి.

# సందేశములు

## 1. శ్రీ శృంగేరి శ్రీజగద్గురుసంస్థానము.

శ్రీమత్పరమహంసపరివ్రాజకాచార్యవర్య పదవాక్యప్రమాణ పారావారపారీణ యమనియమాసన ప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణసమాధ్యష్టాఙ్గయోగానుష్ఠాన నిష్ఠతపశ్చక్రవర్త్యనాద్యవిచ్ఛిన్నగురుపరంపరా ప్రాప్త షడ్దర్శనస్థాపనాచార్య వ్యాఖ్యానసింహాసనాధీశ్వర సకలనిగమాగమ సారహృదయసాంఖ్యత్రయ ప్రతిపాదకవైదికమార్గప్రవర్తక సర్వతన్త్రస్వతంత్రాది రాజధానీవిద్యానగర మహారాజధానీ కర్ణాటకసింహాసన ప్రతిష్ఠాపనాచార్య శ్రీమద్రాజాధిరాజ గురుభూమండలాచార్య ఋష్యశృఙ్గపురవరాధీశ్వర తుంగభద్రాతీరవాసి శ్రీమద్విద్యాశంకరపాదపద్మారాధక శ్రీజగద్గురు శ్రీమత్సచ్చిదానందశివాభినవనృసింహభారతీస్వామి గురుకరకమల సంజాత శ్రీజగద్గురు శృంగేరి శ్రీచంద్రశేఖరభారతీస్వామిభిః అస్మదత్యంతప్రియశిష్య శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రివిషయే శ్రేయోఽభివృద్ధయే శ్రీపరమేశ్వరప్రార్థనాపూర్వకవిరచితాశిషస్సముల్లసన్తుతరాం.

## 2. శ్రీశ్రీశ్రీ జగద్గురు శ్రీకాంచికామకోటిపీఠాధిపతులు శ్రీశంకరాచార్యస్వాములవారు, నాగపట్నము. (మకాము.)

ఆగష్టు తే 14 దీ జరుగనున్న త్రిలిఙ్గరజతోత్సవసమయమునందు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి మంత్రాక్షతాశీర్వాదపూర్వకముగ శ్రీజగద్గురు శ్రీశంకరాచార్యస్వాములవారిఆజ్ఞానుసార మొకశాలువను పంపుకొంటిమి. దయచేసి ఆమహోత్సవమునాడు శ్రీశాస్త్రులుగారికి సమర్పింపఁగోరినాము. ఇట్లు,

మేనేజరు

## 3. శ్రీ సర్: కే. వీ. రెడ్డినాయుడుగారు, అణ్ణామలైనగరు.

తాముపంపిన ఆహ్వానముఅందినది. నేనుమదరాసునయున్నప్పుడు తే 14 దీన జరుగుసభకు రాఁగలనని నమ్మియుంటిని. ఆనాఁడు జరుగనున్న Young Women's Christian Association వారివస్త్రప్రదర్శనమును బహిరంగపరచుటకుగూడ అంగీకరించియుంటిని. కాని తే 14 దీన అణ్ణామలైనగరమున శ్రీచెట్టినాడురాజాగారిపోషణమున జరుగనున్న సంగీతవిద్వాంసులసమ్మేళనమునకు నేను ఇచ్చట ఉండవలసినట్లు నిన్ననే నాకు తెలిసినది. అందువలన తే 14 దీ జరుగనున్న త్రిలిఙ్గరజతోత్సవమునకు వచ్చుటకు వీలులేనందుకు చింతిల్లుచున్నాను. సభ జయప్రదముగ జరుగునని కోరుచున్నాను. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ముద్రణమునకును గ్రంథప్రకటనమునకును ఆంధ్రసారస్వతాభివృద్ధికిని గావించినంతమహోపకారము మరెవ్వరును చేయలేదని నేనుచెప్పగలను. ఇట్టిభాషోద్ధారకునివిషయమున ఆంధ్రులందరును కృతజ్ఞులైయుండుట ఎంతయుఁదగియున్నది. ఇట్లే దేశసేవ చేయుటకు శ్రీశాస్త్రులుగారికి ఆయురారోగ్యములు కలుగుగాక అని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను.

## 4. శ్రీ సర్: ముత్తా వెంకటసుబ్బారావుగారు, నాగపూరు, సీ. పీ.

తే 14 దీ జరుగనున్న త్రిలిఙ్గరజతోత్సవఆహ్వానము నాకుపంపినందులకు వందనములు. ఆమహోత్సవమునకు రాలేనందుకు విచారపడుచు, సభ నిర్విఘ్నముగ జరుగగలదని ఆశించుచున్నాను. ఈనాసందేశమును శ్రీశాస్త్రులుగారికి అందించఁగోరినాను.

5. సర్: మీర్జా యం. ఇస్మయిల్, బెంగళూరు.

ఆగస్టు తే 14 దీ జరుగనున్న త్రిలిఙ్గరజతోత్సవమునకై పంపినఆహ్వానమునకై త్రిలిఙ్గరజతోత్సవసంఘ సభ్యులకు వందనములు. ఆమహోత్సవము జయప్రదముగజరుగవలయునని నాఆశీస్సుల ప్రీతితోపంపుచున్నాను.

6 శ్రీ డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డిగారు, డి. లిట్., వాల్తేరు.

ఆగస్టు తే 14 దీని శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి త్రిలిఙ్గరజతోత్సవసంపుటమును సమర్పించుటకై జరుగనున్నమహోత్సవమునకు నాకు ఆహ్వానము అందజేసినందులకై త్రిలిఙ్గరజతోత్సవ ఆహ్వానసంఘసభ్యులకు వందనములు అర్పించుచున్నాను. అట్టిశుభసమయమున నేను అచ్చటికిరాజాలనందుకు ఎంతయు చింతిల్లుచున్నాను. సభ జయప్రదముగజరుగునని ఆశించుచున్నాను

7. శ్రీ డాక్టరు సచ్చిదానంద సిన్హాగారు,

బారట్లా, వైస్ ఛాన్సలరు, పాట్నా యూనివర్సిటీ, ఎడిటరు, 'ది హిందుస్థాన్ రివ్యూ', పాట్నా.

"ప్రీతిపూర్వకముగు తమ త్రిలిఙ్గరజతోత్సవాహ్వానమును వందనపురస్సరముగ అందికొంటిని. ఆమ్మహోత్సవమునందుఁ బాల్గొన లేకున్నందుల కెంతయు చింతిల్లువాడనై, ఆమ్మహోత్సవము జయప్రదముగ జరపేరునట్లు ఆశించుచున్నాను."

8. సర్: జార్జిబోగుగారు, ఊటీ.

వేరేనిర్ణీతకార్యకలాపమున్నందున రాలేకపోయితినని చింతించుచున్నాను.

9. యఫ్. జీ. రథర్ఫర్డుగారు, సి. యస్. ఐ, సీ. ఐ. ఈ,

నాడు గ్రామమునసుండను కావున తమఆహ్వానమంగీకరింపవీలులేదు.

10. డాక్టరు: జి. యస్. అరండేలుగారు, అడయారు.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి త్రిలిఙ్గరజతోత్సవసంపుటమును సమర్పించు రజతోత్సవఆహ్వాన సంఘమువారికి అనేకవందనములు సమర్పించుచున్నాను. ఈమహోత్సవమునకు రాజాలనందుకు విచారపడుచు ఇది జయప్రదముగసాగునట్లు కోరుచున్నాను.

11. శ్రీవిజయనగర మహారాజ కుమార్ సర్: విజయ, విజయనగరరాజభవనము, కాశీ.

త్రిలిఙ్గ రజతోత్సవమునకు 1941 ఆగష్టు తే 14-వ దిని దయచేయవలసినదని ఆయుత్సవకమిటీవారు ప్రీతితోపంపిన ఆహ్వానమునకు వందనములు సమర్పించుచున్నాను కాని, దూరముకావడముచేత రాలేకపోయి నందున హృదయపూర్వకముగచింతించుచున్నాను.

12 శ్రీపర్లాకిమిడిమహారాజాగారు, పర్లాకిమిడి.

హృదయపూర్వకాభినందనములు. (తంతి)

13. శ్రీపిఠాపురము యువరాజుగారు, వసంతశోభ, మదరాసు.

వందనాలు. వేరేనిర్ణీతకార్యమున్నందున రానేనందుకు చింతిలుచున్నాను.

14. రాజా శ్రీ రామకృష్ణరంగ రావు బహదరుగారు, కిర్లంపూడి జమీందారు, బొబ్బిలి.

వందనములు. రాలేను, ఉత్సవము విజయోపేతముగా జరుగుగాక! (తంతి.)

15. శ్రీ తేకుమళ్ల రామచంద్రరావుగారు, యం. ఏ., బి. ఎల్., బందరు.

కడానిమిషమున నిలిచిపోవలసివచ్చినది. త్రిలిఙ్గద్వారా జరిగిన శ్రీ శాస్త్రులవారి అపారవాఙ్మయసేవకు మత సేవకు నా అభివందనములు వారికందింపుడు.

16. శ్రీ ఏ. వీ. థామసుగారు, అలప్పే.

ఇతర కార్యభారముగలదు గాన రాలేదు. విజయంబగుగాక!

17. శ్రీ గంగాధర రావు దేశపాండ్య, బెల్గాము.

ఆగష్టు తే 14 దీ జరుగనున్న త్రిలిఙ్గరజతోత్సవమునకై తాము దయతో పంపిన ఆహ్వానము అందినది. రజతోత్సవమునకు రాజాలనందుకు చింతిల్లుచున్నాను. ఆమహోత్సవము జయప్రదముగ జరుగగలదని ఆశించుచున్నాను. శ్రీ శాస్త్రులుగారికి నావందనములు అందచేయుడు. శ్రీ శాస్త్రులుగారికి ఆయురారోగ్యములు కలుగుగాక అని ప్రార్థించుచున్నాను.

18. శ్రీ బీ. జీ. ఖపర్డేగారు, యం. యల్. ఏ., అమరావతి. సీ. పీ.

త్రిలిఙ్గరజతోత్సవఆహ్వానము పంపినందులకై మిగులసంతోషము. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు భారతదేశమునకును ప్రాచీనవాఙ్మయమునకును గావించినఅపారసేవను నేనెంతయు శ్లాఘించుచున్నాను. హిందూదేశమందలి స్త్రీపురుషులుఅందరును వారియెడ కృతజ్ఞతగలిగియుండవలయును. వారిభాషాసేవకై తాముగావింపనున్న ఈమహోత్సవమునకు నేనెంతయు కృతజ్ఞుడను. నేను అచ్చటికిరాజాలనందుకు చింతిల్లుచున్నాను. శ్రీ కేల్కరుగారిఅధ్యక్షతక్రింద ఈమహాసభ జయప్రదముగజరుగునని నేనునమ్ముచున్నాను. నావందనాశీర్వాదములను శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారికి అందచేయవలయునని కోరుచున్నాను.

19. శ్రీ రాజసేవాప్రవీణ ఖాన్ బహదూరు జి. ఎస్. ఏ. కరీంసాహెబ్, ఎం. బీ. ఇ, ఇనస్పెక్టరుజనరల్ ఆఫ్ పోలీసు, తిరువనంతపురము.

వందనములు. ఇతరకార్యాసక్తతచే ఈదేహమటకురాలేదు. కాని, నాఆత్మమాత్ర మచ్చటనే యుండగలదు. జయ విజయీభవ!

20. శ్రీ ఏ. ఎస్. పి. అయ్యరు, ఎం. ఏ, ఐ. సి. ఎస్, బార్-ఆట్-లా, డిస్ట్రిక్టు అండ్ సెషన్సుజడ్జి, వేలూరు.

అనేకవందనములు. పనితొందరలచే రాలేను. ఉత్సవము విజయవంతముగుగాక!

21. శ్రీ జి. పీ. కేల్కర్, ఎడిటర్, 'మహరాటా', పూనహా

శ్రీ కేల్కరుగారితో రాదలచితిని కాని అనారోగ్యము ఆటంకమయినది. మిత్రులు శ్రీ ఎన్. సి. కేల్కరుగారి అధ్యక్షతనీరజతోత్సవ మత్యంతవిజయమంది మరువరానిఆఖ్యాయికగనుండునని విశ్వసించుచున్నాను.

22. శ్రీ జి. ఏ. జాన్సన్ గారు, ఎడిటర్, మద్రాసుమెయిలు, మదరాసు

వందనములు. ఉత్సవమునకేర్పరచినగంటకు నేనురాలేను.

23. శ్రీ ఎస్. పి. శర్మ, మేనేజింగ్ ఎడిటర్, 'కర్రెంటు అఫేర్సు', కలకత్తా.

కడుదూరంబగుట స్వయముగవచ్చి ఆనందింప అడ్డుకలిగినది. శ్రీశాస్త్రులవారు త్రిలిఙ్గమూలకముగను ఇతరప్రచారముల మూలకముగను తెలుగువాఙ్మయపునరుజ్జీవానికి చేసినసేవ లెక్కపెట్టరానిది...మరాఠావాఙ్మయకర్తలలో అగ్రపీఠమలంకరించు శ్రీకేల్కరుగారధ్యక్షులగుట ఉచితము...వారి ఈసంబంధము తెనుగుమహారాష్ట్ర వాఙ్మయముల సంబంధముగ ఏర్పడి పరస్పరసాహచర్యముచే మనవాఙ్మయమంతయు పెంపొందునని కలలుగనుచున్నాను. షష్టిపూర్తివాలాడు ఈలోకములో ఇట్టికలలుగాంచువారే ధన్యులని నామతము. శ్రీశాస్త్రులవారి దీక్షాబద్ధసేవకు వారినభివందించుచున్నాను. విజయంబగుగాక!

24. శ్రీ రావుబహాదరు లక్కరాజుపంతులుగారు, రిటైర్డుకలెక్టరు, బి. ఏ., బెజవాడ.

వందనములు. ఆరోగ్యమంతపూర్ణముగలేదు. రాలేను. దేవునికృపచే ఉత్సవము విజయంబందునని విశ్వసించుచున్నాను.

25. శ్రీ రేబాల పట్టాభిరామరెడ్డిగారు, స్టోన్‌హౌసుపేట, నెల్లూరు.

ఇంతటిశుభసమయమున హాజరుకాలేకపోతినని చింతించుచున్నాను. ఉత్సవము విజయంబందుగాక!

26. శ్రీ రావుసాహెబ్ ఎం. బీ. కృష్ణశెట్టిగారు, ఎఫ్. టీ. ఎస్, ఇనాందార్,
2-వ తరగతి బెంచిమేజిస్ట్రేటు కోర్టు ప్రెసిడెంటు, ధర్మపురి,

వందనములు. ఇది తెలుగుపత్రికలచరిత్రలో ఎన్నడూజరుగని మహోత్సవము. శ్రీవేదమూర్తులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి కెల్లకాలము శ్రేయముగోరు వారిలో నేనొకడను.

27. శ్రీ సి. హెచ్. బాలకృష్ణశాస్త్రిగారు, యం. ఏ, యల్. టి., బందరు.

శ్రీకృష్ణజన్మదినమగుచున్నది. రాలేకున్నాను. శ్రీశాస్త్రులవారికి శ్రీకృష్ణభగవానుడు కల్యాణపరంపరల సమకూర్చుగాక!

28. విద్వాన్ శ్రీ టి. అప్పన్నగారు, బి. ఓ ఎల్, అణ్ణామలైవిశ్వవిద్యాలయము.

వందనములు. కుటుంబపుచిక్కులవల్ల రాలేకనున్నాను. త్రిలిఙ్గ నాకు ఆప్తపత్రిక. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి సంపాదకత్వమున ఇయ్యది పరంపరాభివృద్ధిగ వర్ధిల్లుగాక!

29. శ్రీ ఎస్. హనుమంతరావుగారు, యం. ఏ, ఎల్. టీ,
చారిత్రప్రొఫసరు, నైజాముకాలేజీ, హైదరాబాదు.

వందనములు. రాలేను. శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి హృదయపూర్వకాభివందనము. పరమేశ్వరుడు వారికి ఇతోధికసేవచేయుటకు చిరాయువొసంగుగాక!

30. శ్రీ ఎన్. రామరావుగారు, బి. ఏ., బి. యల్., యునైటెడ్ ఇండియా ఫైర్ అండ్ జనరలు ఇన్స్యూరెన్సుకంపెనీ, మద్రాసు.

ఆహ్వానమునకు కృతజ్ఞుడను. ఉత్సవమునాటికి మద్రాసులో నుండనిస్థితి యేర్పడినది. శ్రీశాస్త్రులవారికి హృదయపూర్వకాభినందనములు.

31. శ్రీ వి. అప్పయ్యశాస్త్రిగారు, బి. ఏ., రిటైర్డుసబ్ రిజిస్ట్రారు, బందరు.

వందనములు. శ్రీకృష్ణలెండింగులైబ్రరీతరఫున శ్రీశాస్త్రులవారికి అభినందనములు. వారిభాషాసేవ ఆంధ్రులు మరువలేరు. మాపితృవ్యసోదరులు శ్రీ వావిలాల వేంకటశివఅవధాని 81 ఏండ్లవృద్ధులు శ్రీశాస్త్రులవారికి నాద్వారా అభినందనములు తెలుపుచు ఉత్సవమునకు విజయము కోరుచున్నారు.

32. శ్రీ కె. సుబ్రహ్మణ్యముగారు, యునైటెడ్ ఆర్టిస్ట్సుకార్పొరేషన్, మద్రాసు.

వందనములు. మదరాసులో నాడుండను. రాలేనందులకు చింతిలుచున్నాను.

33. అభినవసరస్వతి సీ. సరస్వతీబాయిగారు, తిరువల్లిక్కేణి, మదరాసు.

తే 14 దిః అణ్ణామలైనగరు వెళ్లకతప్పలేదు. మీఉత్సవానికి రావలెనని ఎంతో నువ్విళ్లూరుచుంటిని. నాడు 15 గీతలు పాడుటకును సిద్ధపడియుంటిని, విధిలేకవచ్చినది. క్షమింతురుగాక. ఉత్సవము జయోపేతంబుగ జరుగుగాక!

34. శ్రీ బీ. వీ. గోపాలకృష్ణరావుగారు, సెక్రటరీ, ఇండియన్ ఫైన్ ఆర్ట్సు సొసైటి, మద్రాసు.

వందనములు. శ్రీశాస్త్రులవారు చేసినసేవ పవిత్రము. పరమపూజ్యులు మాతండ్రిగారికి శ్రీశాస్త్రులవారు దగ్గరి మిత్రులు. నేనురుజాగ్రస్తుడనయి పడకలోనున్నాను. రేపు ఆస్పత్రిలో చేరుచున్నాను. కావున శ్రీశాస్త్రులుగారికి హృదయపూర్వకాభినందనములు.

35 ప్రొఫసరు యం. కే. మునుస్వామిఅయ్యరు, అణ్ణామలై విశ్వవిద్యాలయము.

నేను రాలేకున్నాను. త్రిలిఙ్గరజతోత్సవసమయమున నాఅభినందనము లందుకొనుడు.

36. శ్రీ ఎస్. తులసీదాసునాయుడుగారు, బి. ఏ, బి. ఎల్., సబార్డినేటుజడ్జి, ఏలూరు.

వందనములు. నాకు పనితొందరమెండు. రాలేకయున్నాను. శ్రీశాస్త్రులుగారు ఆంధ్రవాఙ్మయమునకు చేసినసేవ ఆంధ్రులు మరువలేరు. వారికి హృదయపూర్వకాభివందనములు.

37. శ్రీ పి. మార్కండేయులుగారు, ఎం. ఏ, బి. ఎల్., సబుజడ్జి, దేవకోట.

సమ్మానసంచిక శ్రీవఝల వేంకటేశ్వరశాస్త్రులుగారికి సమర్పించుట వారు చేసినమహత్తరసేవకు ఉచిత గౌరవము. వారికి చిరాయురైశ్వర్యములలరుగాక!

38. శ్రీ ఎస్. వీ. సుబ్బరావుగారు, ఆంధ్రపత్రికారచయిత సంఘోపాధ్యక్షులు, బందరు.

ఆంధ్రపత్రికారచయితసంఘముతరఫున శ్రీశాస్త్రులవారికభినందనములు. ఈరజతోత్సవము త్రిలిఙ్గచరిత్రలోమాత్రము సువర్ణాక్షరములతో వ్రాయదగినదనరాదు. ఆంధ్రపత్రికారచనచరిత్రలోనే సువర్ణాక్షరముల లిఖింపదగినది. త్రిలిఙ్గకును శ్రీశాస్త్రులవారికిని చిరాయురారోగ్యైశ్వర్యంబు లగుగాక.

39. శ్రీమతి బి. కామేశ్వరమ్మగారు, బి. ఏ., మెంబరు, అఖిలభారతస్త్రీసమావేశముకమిటీ.

అత్యవసరకార్యముమీద రాజమండ్రికి వెళ్లుచున్నాను. కాబట్టి 14 వ తేదీ ఉత్సవాన పాల్గొనలేను. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి నాఅభినందనములు తెల్పుచు ఈరజతోత్సవమున వారికొక బిరుదము గూడ నిచ్చియుండిన బాగుగనుండును.

40. శ్రీ డాక్టరు సి. హెచ్. ఎస్. మూర్తిగారు, ఎల్. ఐ. ఎం, విజయనగరము.

చిరిగిపోయినవాఙ్మయప్రసూనము శ్రీ వీ. వీ. శాస్త్రులనిరంతరకృషిచేత క్రొత్తరూపము, తేజము, వాసన పొందినది. రజతోత్సవమునకు విజయంబగుగాక!

41. శ్రీ పి. శేషాద్రిగారు, ఎం. ఏ., ప్రిన్సిపాల్, గవర్నమెంటుకాలేజి, అజ్మీరు.

శ్రీశాస్త్రులవారికి రజతోత్సవసందర్భమున హృదయపూర్వకాభినందనములు.

42. రావుబహాదరు జస్టిసు శ్రీ చంద్రశేఖరయ్యరుగారు, హైకోర్టుజడ్జీ, మదరాసు.

నేడు గోకులాష్టమి త్వరగా ఇల్లుచేరవలెను కావున రాలేకున్నాను. శ్రీశాస్త్రులవారి కభినందనములు.

43. శ్రీ ఎస్. ఆర్. శర్మగారు, జిల్లాట్రాఫికుసూపరింటెండెంటు, ఎం. ఎస్. ఎం. రైల్వే, మద్రాసు.

వందనములు. నేను మద్రాసులో తే 14 ది నుండను. రజతోత్సవమునకు విజయంబగుగాక! తత్సంపాదకులు దీక్షాదక్షులునగు శ్రీ శాస్త్రులుగారికి నతులు.

44. శ్రీజమ్నదాస్ మెహతాగారు, ఢిల్లీఅసెంబ్లీసభ్యులు, బొంబాయి.

వందనములు, రాజాలనందులకు చింతిలుచున్నాను. ఉత్సవము విజయవంతముగా నడచుగాత!

45. శ్రీమనుసుబేదారుగారు, ఢిల్లీఅసెంబ్లీసభ్యులు, బొంబాయి.

హృదయపూర్వకాభినందనములు. విజయీభవ. (తంతి.)

46. శ్రీ వీ. రామకృష్ణశాస్త్రిగారు, బి. ఏ, జర్నలిస్టు, కడప. (టెలిగ్రాము.)

పత్రిక ప్రకాశించుచున్నది. నిలచితివి. క్షమింపుడు. విజయీభవ!

### 47. రావుసాహెబ్ శ్రీమా. [illegible] గారు, [illegible] ఎల్. టి. [illegible] రు, [illegible]

ఉత్సవము జయప్రదమగుగాక! శ్రీవాగ్గేయకారోత్సవ [illegible] మాకు [illegible]. వారు తెలుగువాఙ్మయమునకు ఫలప్రదసేవ చేసినారు. వారికి చిరాయువగుగాక.

### 48. శ్రీవాగ్గేయకారక హరినాగభూషణముగారు, బి. ఏ., షష్టుగ్రేడుప్లీడరు, మచిలీపట్టణము.

శరీరఅనారోగ్యముచేత తమత్రిలిఙ్గరజతోత్సవాహ్వానమునకు ప్రత్యుత్తరమియలేకపోయితి. తమయుత్సవము జయప్రదమైయుండినందులకు నేనెంతయు సంతసించెద. సర్వేశ్వరుండు తమ్మనుగ్రహించుగాక!

### శ్రీఎస్. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ, ఎల్. టీ, పి. ఎస్., హైస్కూలు, మైలాపూరు.

ఈనెల 14-వ తారీఖున ప్రవర్తిలిన త్రిలిఙ్గరజతోత్సవమునందు గొన్నియె చదువుటకు వీలగునట్లు తమకందిన అసంఖ్యాకములగు అభినందనపత్రములనుజూచి నాకు గల్గినఆనందమును దమకు దాన్కగానిడుట కంగీకరింపవలెనని యెంతయు వినేయుండనై ప్రార్థించువాడ. ఇట్టి శుభసమయమున శ్రీమాన్ యస్. శ్రీనివాసయ్యంగారును, నాప్రియసోదరుడు యస్. సత్యమూర్తియు లేకున్నందుకు నాకు గల నిష్కళంకమగు విచారమును వెలిబుచ్చుట కంగీకరింప వేడెద. వీరిలో నొకరు దివంగతులైరి; ఒకరు కారాగారమలంకరించిరి. ఈరజతోత్సవము కొన్నిరోజులు గడచినవెనుక జరుగునట్లేర్పడియుండినచో నాతమ్ముడు శ్రీసత్యమూర్తి ఈసమయమున గావింపబడిన అభినందానందగానమునకు దోడై అసాధారణమగు తనధోరణి నుపన్యసించుట కెంతయు నుత్సాహముగ అభిమానమును గల్గియుండెడివాడు.

### 50. శ్రీ వీ. వాసుదేవరావుగారు,

డెయిలీన్యూసు ఎడిటరు, ఇంగ్లీషుప్రొఫెసరు, 61, రామస్వామిస్ట్రీటు, మన్నడి, మదరాసు.

రెండు విషయాలలో మీరు నన్ను క్షమించవలసినదని కోరుటకు నాకు అనుజ్ఞ ఇడుడు. "త్రిలిఙ్గ" రజతోత్సవసందర్భమున గోఖలేహాలులో మన సుప్రసిద్ధదేశసోదరులు, పండితులు, దేశభక్తులునగు శ్రీఎన్. సీ. కేల్కరు అధిపత్యమునజరిగిన మహాసభలో నేనుపాల్గొనకపోవుట నొకటి. మనమాతృభాషయగు వితెనుగునైతే మీవంశమువారు రెండుతరాలకాలముగ మహాకృషిచేసిపోషించి ఆంధ్రులహృదయాలలో చిరంజీవిఅగు స్మారకచిహ్నమును నిర్మించుకొన్నారో ఆతెనుగుభాషకు మహాపచారము కావించుచు ఈయుత్తరము ఇంగ్లీషులో వ్రాయడము రెండవది.

ఎవ్వరిశృంగారరసపూరితకావ్యసృష్టి ఇంగ్లీషువాఙ్మయప్రేమికుల హృదయములకు శాశ్వతముగ అప్పౌరువుగ ఆనందముకలిగించుచున్నదో ఆట్టికీట్సునుగురించి ఆంగ్లభావకవిసార్వభౌముడగు షెల్లీవ్రాసినవాక్యాలనీసందర్భమున నన్నునుడివింపనిండు.

"భవిష్యత్సంతతులం తమగతచరిత్రనే మరచిపొయ్యేటంతటి సామానముకు నొడిగట్టేవరకు ఆతని అదృష్టకీర్తులం కాలాంతమువరకు ప్రతిధ్వనించుచు లోకమునకుపట్టిన దివ్వెగా వెలుగగలవు."

[illegible]

త్రైలింగసంగతి కృతజ్ఞుల మనోరథము. ఆకాశమునల్లిన భూమినిగల మనకోసమునకేదు లేదా కావ్యశైలిని అలంకార ప్రాయముగ వినిపింపుటమునియు అనుకొనవలదు; అది ఉన్నసత్యము నన్ను మాటలలో వాక్రుచ్చుటకప్పవేరుగాదు.

1904-వ సంవత్సరము మొదలు శ్రీ గోపాలకృష్ణగోఖలే బాధాలతకమూర్చొని ఇంగ్లీషుభాష, వాఙ్మయము నేర్పడము, అదిగాక సన్నిహితముగాను అట్లులేకుండాను శ్రీ వాచా, మెహతా, చంద్రవర్కారు, తిలాంగుటోటి మహాపురుషులతో సాంగత్యభాగ్య మనుభవించడము— నేను వీరి పేర్లక గౌరవచిహ్నము లేవియు తగిలించలేదు. ఆసేతుహిమాచలము ఈ చిహ్నములు లేకుండనే ఈ పేర్లంటేనే మహామంత్రాలుగ పనిచేయగలవు. వీరికంత గౌరవమున్నది.—నాకు కలుగుట సంభవించినది. ఆయనుభవాలనుబట్టి పూజనీయమిత్రులు నాయకులునైన యన్. సీ. కేల్కారుగారీసమయమున అధ్యక్షత వహించడము పూర్ణముగా ఉచితమని నేను చెప్పగలను.

దేశానికిని ఆంధ్రావనికిని సేవచేయడానికి మిమ్ము ఈశ్వరుడు సర్వదా సంరక్షించునుగాక అని ప్రార్థించుచున్నాను.

## 51. శ్రీ ఎస్. వి. నరసింహారావుగారు, బి. ఏ., డి. పి. ఇ, బి. ఎల్., అడ్వొకేటు, నెల్లూరు.

శ్రీ ఎన్. సీ. కేల్కారుగారి అధ్యక్షత క్రింద మీకు జరిగిన మహాసన్మానమును గురించి పత్రికలలో చదివి చాల సంతోషించితిని. ఆసన్మానమునకు మీరు అర్హులు, పూర్ణముగ అర్హులు అని నేను వ్రాసినయెడల అది అతిశయోక్తి కాజాలదు. మీకా సన్మానము చేయుటలో సభ చాల బాగుగ జరిగినదని నాయూహ. మీరుదయచేసి సన్మానసంపుటము ప్రతిని సభావృత్తాంతము ప్రతిని నాకుపంపగలిగినయెడల కృతార్థుడనగుదును. శ్రీ విద్యార్థిసంఘమువారిచ్చిన సన్మానమప్పుడు సిద్ధముచేసిన ప్రతితోగూడ ఈ సంపుటమును సేకరించిపెట్టుకొనవలెనని అభిలషించుచున్నాను. మిమ్ముకు మరియొకపర్యాయ మభినందించుటకు నాకెంతో సంతోషమగుచున్నది.

## 52. శ్రీ ఆళూరు వేంకటరావుగారు, బి. ఏ., యల్. యల్. బీ., ధార్వార్.

త్రిలింగరజతోత్సవసభకు తాముపంపిన ఆహ్వానము అందినదిగాని రాజాలనందుకు చింతిల్లుచున్నాను. సుప్రసిద్ధ దేశభక్తులును పత్రికారచయితలునగు శ్రీ యన్. సీ. కేల్కారుగారి అధ్యక్షతను సభ జయప్రదముగ జరుగునని ఆశించుచున్నాను. శ్రీ కేల్కారుగారికిని శ్రీ శాస్త్రులుగారికిని నావందనముల తెలియచేయకోరుచున్నాను.

## 53. యస్. ఆర్. బాలసుందరం గారు, సెక్రటరీ,
### ది మద్రాసు హిందు గుడ్ టెంప్లర్సు లీగ్సు, మద్రాసు.

ఈ త్రిలింగ రజతోత్సవశుభావసరమున దమ అభినందనములను దమ కందజేయవలయునని మాలీగువారు నన్ను గోరియున్నారు. పత్రికారచనవృత్తిని పోషించు తమకాయురారోగ్యములను ప్రసాదించుచు, దమ పత్రికారత్నమగు త్రిలింగ ఈవరకు చేయుచుండినట్లులే ఇక ముందుగూడ దేశాభివృద్ధికరములగు సత్కార్యము లొనరించుచు చిరకాలము వర్ధిల్లునట్లుల ననుగ్రహించుగాకయని పరమేశ్వరుని బ్రార్థించుచున్నాడ.

## 54. విద్వాన్ కావ్యతీర్థ శ్రీ మద్దులపల్లి వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
కవితాసామ్రాజ్యము, నంద్యాల.

మ. అమితోదార్యుఁడు ధర్మతత్పరుఁడు విద్యావంతుఁ డంచున్ బద
క్రమముల్ మీఱ నుతింతు రెల్లరు, యథార్థం బెవ్వ రీక్షింత్రు? స
త్యముగా వాణిశ వేంకటేశ్వరుఁడు తద్దర్శిష్ణుఁడే యైనచోఁ
గ్రిమికీటాదులకోట మన్నిదుగదే? మన్కిన్ దిగంబడె వాణిశా? 1

మ. తమిమైఁ గాటుకఁ బాళపత్రములఁ బొందన్ జేరి తత్తత్పదా
ర్థములన్ లోఁగొనుచున్ నిరక్షరతఁ బొఱంద్రోలు చున్నట్టి యా
క్రిమికీటాదుల యక్షరాభ్యసన మార్గింపంగ లే కెంత కా
లము సంబెంచితి? యేమి న్యాయ మిది యొంచన్? వేంకటేశాన్వయా! 2

ఉ. ఊరక వారు వంగ నగునో! యొకనాలుకవారిభాష యొ
వ్వారికిఁ జైన సాదరణపాత్రమ యయ్యెడుఁ గాని వీరల
వ్వారిగ రెండునాలుకలవారలభాషయు నాదరింతు, రీ
తీరగుచేని వాఙ్మయము తీఱదె? వాణిశ వేంకటేశ్వరా! 3
(ఒకనాలుకభాష—గంటము వ్రాఁత, రెండునాలుకలభాష—కలము వ్రాఁత).

శా. లబ్ధాగ్రేసరచక్రవర్తి యనఁ దోలున్ గాక, లేకేమి? య
ప్రస్తుత్వంబున నంత కంత పరమార్థప్రాప్తికై హెచ్చుగా
లబ్ధిన్ గోరి పదార్థకోశముల నీలా గిత్తువో! యేమి ప్రా
ర్థ్యం బియ్యది? యే మనంగ నగు? నార్యా! వేంకటేశాన్వయా! 4

మ. కడు నాపత్తున నుండి కావు మని మ్రొక్కన్ నిల్వ దోఁచింపఁ, జే
ర్వడగాఁ గొండలపాలు సేయు, దరిఁ జేరన్ దోడి గొట్టించు మా
ర్పడ, నాతిర్పతి వేంకటేశ్వరుఁడు; మావాణిష్ఠ శ్రీవేంకటే
శుఁడో! యిచ్చున్ దరిఁ జేర్చి మెచ్చు, మఱి హెచ్చుం దగ్గ లింతేసుఁడీ! 5

## 55. శతావధానులు శ్రీ గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు,
గద్వాలాస్థానవిద్వత్కవులు, ఉన్నతపాఠశాలాప్రధానాంధ్రోపాధ్యాయులు, గద్వాల.

క. శ్రీవాణిష్ఠమహాన్వయ, పావనకృషియా త్రిలింగభాషోద్ధార
ప్రావీణ్యము రజతోత్సవ, సేవామహామిద్ధి విమలిచేయుము కవితా. 1

మ. పరభాషావిమహార్ఘ్యకావ్యపదమై ప్రాదుర్భవిత్రీ రమా
కరకయ్యున్ బవళించియున్న మనభాషాదేవి యుష్మద్దయా
మరకల్లోలినిలో సుధల్ దవిలి నవ్యగ్రాసలావణ్యమున్
వర మందం దగెనో త్రిలింగభువనవార్తావత్రిశారత్నమా. 2

క. వర్ణాశ్రమధర్మంబుల, నిర్ణేతృత్వంబు సకలనిగమోక్తకళా
ఘూర్ణావలోకనములకు, కర్ణేజప మరయ నీవొకండె త్రిలింగా. 3

సీ. సారస్వతమున భాషాభేదిని సదప్పి తెక్కలివాదాల ద్రొక్కి ద్రొక్కి
ప్రాఖ్యసనాతన పరమధార్మికమతదూరుల కెదురొడ్డి పోరి పోరి
వర్ణాశ్రమములసర్వస్వాపహారణవినోదులకుత్తుకల్ నొక్కి నొక్కి
అజ్ఞసంస్కారప్రక్రియంభావుకోపద్రవములలో నానాటఁ గుమిలి కుమిలి
గీ. చావ కసుగందకుండ నీ పరమధర్మ, మతము వర్ణాశ్రమములనేమమును మూడు
సంగములంగా కొసంగు త్రిలింగసైన, నీచరిత్రము చిరవర్ణనీయమమ్మ. 4

క. తమపయన మెచటి కన నశ్యము తా నెటువోవునటులె పయనంబనుచున్
సమయానుకరణపత్రిక, లమితంబుగఁ బుట్టుఁ జచ్చు వసుధిమువమునన్. 5

ఉ. పూని క దొక్కటై నిగమపూజ్యపథం బొకడే పథంబనూ
చానపథావలంబనమె సంస్కృతిపాత్రమటంచు నిట్టు టాం
టానిసదంబులన్ బ్రతిభటప్రతిభారటనాగపాటన
జ్ఞానకళాంతరంబు వెదఁజల్లుట కొల్లయె పత్రికామణీ. 6

ఉ. వేదసృతంబొకింతయుఁ ద్రిలింగ భవత్పరితఃప్రసారణన్
వేదమదంగగమ్యపదవీపదవీయసనాతనార్యహిం
దూదయమార్గనిర్గమనయోగ్యము లెల్లెడ భిన్నభిన్నభా
షోదయకల్పనల్ కథలపోయట పృగ్యము లెంత చూచినన్. 7

సీ. సమయధర్మము విరుద్ధముల కాకరమయ్యెఁ బ్రతికూలవాయువుల్ సుతికి మించె
ప్రభుపోషణములు నథశ్రుప్పతతియయ్యెఁ బ్రజలయాదరమొక పాటియయ్యెఁ
విద్యాధికులదృష్టి వికృతికాశ్రయమయ్యె రసికులు నిష్ఫ్వలై వినువుగొనిరి
శ్రీమంతకోటి కజీర్ణత సిద్ధించె మనుగడే గొప్పసమస్య యయ్యె
గీ. కటకటా యాత్రిలింగ యేకాసువీన, మొకడొసంగని దుర్బలకములోన
ప్రకృతిబుుకుసంపదలఁ బెంచుచునిది దోఁచె, నిమ్మహితలి నీప్రచారమ్ము తల్లి. 8

ఉ. భూచిదితం బిదే సదులభూరితరంగములెంత రాచినన్
వాచిలిభూరుహాంబులు లవంబును నూగవు గాక కొండ వా
వాచిసలే ధరామరవివర్ధనవంశ్యకరీరమూర్తులై
చేవ సముద్ధరించె నిను చిత్రము లేదిట పత్రికామణీ. 9

56. విద్వాన్ శ్రీ కే. వి. సుబ్బరాఘవకవిగారు,
వేదాంతపాఠశాల ఆంధ్రోపాధ్యాయులు, ప్రాతమాంబకము.

శ్లో. వాచిష్ఠవంశవనరాజీవసంతకాలః, శ్రీవెంకటేశ్వరకృపాపరిబద్ధతేజః
శ్రీవెంకటేశ్వరఇతిప్రథితాభిధాఖ్యః, శ్రీమాన్ విరాజతు సదా కవిలోకభోజః. 1

సీ. వాసిష్ఠవంశాబ్ధిపర్వేందుఁడౌ వేంకటేశ్వరశాస్త్రిగా రీశ్వరాంఘ్రి
కంజాతపూజనాఖండమాహాత్మ్యుండరీతుండు మహాప్రస్థానకోండుఁ దనరుఁ
గనకగిరిమూర్తిగాంభీర్యధుర్యుండు విద్యావిలాసి తయావిబుధవేత
నాంధ్రవాగ్యువతి నీరంధ్రకీర్తిజ్యోతిరై మించె నాంధ్రకావ్యములు ప్రకటి
తే. తములు గాఁగ; ముదంబునఁ దనరె నాద్య, కనదు గీర్వాణకావ్యముల్ విమలకీర్తి
ప్రచురితములుగనైన; నా ప్రౌఢలిద్ధ, అఖిలవిద్యావిలాస విద్యానధన్యమాన్య,సౌజన్య జన్యమూర్ధన్య శైరి.
శా. చారీచాలనిపాఁగచుట్టి మడిపంచల్ మేన మాత్రించి తా
లీలన్ బాడిదపూసి యతిపరముల్ ప్రేలాడ యాచ్ఛాపృథా
లీలాలోకనసామప్రంబ్రియవచో లేఖాకరగ్రామంతై
ప్రోలన్ నిల్చెదునక్కపీశ్వరుల నమ్మోదంబునం జేల్పవే! 3
ఉ. ఎందఱో యాంధ్రపండితుల యందఱో శాస్త్రవిశేషశేముషీ
గుందిలితాత్ము లెందఱో విధూతవిధాతలు మిమ్ముఁ జేర నం
క్రందనతుల్యభోగములఁ గ్రందుగ నిచ్చెదు వేంకటేశ్వరా
ఖ్యం దగునిందుమౌళిభజనాత్తమనీషుల కెన్నదుర్తిమున్. 4
చ. పరములు పండితుల్ బుధులు సాధుజనుల్ వినుతింప నక్కవీ
శ్వరులు ముదంబునం దెలఁగి సారవరుఁకరనైకపద్యబం
ధురమణిహారముల్ తమకుఁ దోరమ్మఁప్రీతి సమర్పణంబు స
త్వరమునఁ జేయఁ జేకొనుము వాసిశవంశపయోధిచంద్రమా! 5
తే. ఆంధ్రమాతకుఁబంబు మీరాంధ్రరచన, దద్భుతావహకావ్యవ్యాఖ్యానపద్య
ఫలదమావారపోష్మసటిమఁ గాంచు, ద్విజకవీశగణంబుల వెలయుందురిట. 6
శా. వాసిష్ఠాన్వయవర్ధనుల్ తమరు సంవర్ధిష్ణువిద్వత్కళా
ప్రావీణ్యరుత్రిలింగనాయకము వార్తాపత్రికన్ వెల్వడం
గాచిం చెంతయుం గొంచి యంచితపతింగా వేంకటేశాఖ్యకన్
మీయింపం దొరకొంటి రాంధ్రసురవాక్పీఠంబినుల్ మెచ్చఁగన్. 7
తే. సదయుఁలౌ వేంకటేశ్వరశాస్త్రిగారి, కాయురారోగ్యభోగభాగ్యములఁ గూర్చి
శంకరుఁడఖిలలోకవశంకరుండు, నగుదు నాచంద్రతారకముగను బ్రోచు. 8

57. కావ్యపురాణతీర్థ విద్వాన్ జనమంచి వేంకటసుబ్రహ్మణ్యశర్మగారు,

ప్రధానపండితుఁడు, మునిసిపలు హైస్కూలు, కడప.

సీ. శ్రీమన్మహారాజసింహాసనప్రభాభ్రాజత్సభాస్థానవరములందు
షట్శాస్త్రవిద్వత్ప్రశస్తమూరిపరేణ్యకోటివాగ్వాదసద్గోష్ఠులందు
రాజకీయోద్యోగరాజిపూజితకార్యసదవిధానవిభాగశాలలందుఁ
గ్రయవిక్రయాగతోత్కటజనసమ్మర్దవిస్తృతాఖిలపణ్యవీథులందు

తే. జాతకర్మ క్షణమందె జనపదముల, నందు నిందనేల యొకందువలను
డెందముల కొనఁగూర్చువానంద మింత,యంత యనఁజాల నో త్రిలింగా ! జగమున. 1

సీ. పదిని పచ్చాతసాభ్యుదయంబు పొదలఁగాఁ దత్ప్రచారమొనర్చు కతిఁ దలంచి
రాజకీయంబులఁ దేశంబు మీఱ సందోహించు పదమున నూహనుంచి
శాస్త్రచర్చల బుధసమితి మెచ్చఁగ సంశయములఁ దీర్చుచును వాత్మ నెంచి
దేశోపకారసందేశములను బూని చరియించు వెల్లిద గరిమఁ బెంచి

తే. పొట్ట లుబ్బంగ నవ్వింపఁ బూని హాస్యభణితులను బల్కుచుందువు గణన మించి
సకలవిధముల జనులకు సంతసంబు, గలుగఁజేయుదు వో త్రిలింగా ! జగమున. 2

సీ. పుట్టినప్పటినుండి రొట్టి యిక్కట్టుల రట్టులఁ జెంద వెక్కుట్టునందుఁ
బరుషోక్తు లాడక విరసము ల్బాపక సరళసంచరణంబు జరపుచుండు
తల్లియు నొంది లోపమ్ముక దఱ్ఱున దబ్బఱలాడవు నిబ్బరముగ
సంతతం బెంతయు స్వాంతంబునందున సంతసంబును భువి సంతరింతు

తే. పహహా ! నీసత్ప్రచారంబు సాత్మ నెంచి,సంస్తుతి యొనర్ప గాఁజాలు చతురుఁ డెవఁడు ?
జనని రజతోత్సవంబంది శాశ్వతముగ, వఱలుము త్రిలింగ వేంకటేశ్వరులకరుణ ! 3

తే. నిత్యసత్యప్రచారంబు నియతరీతిఁ, బుట్టినప్పటినుండి పెంపుగను భువిని
జరపుచున్నావు వేంకటేశ్వరమనీషి,వర్యపోషితవై ముదావహ ! త్రిలింగ ! 4

తే. జనకుఁడు త్రిలింగనాథుఁడు సచ్చరితుఁడు, సార్థకాఖ్యుఁడు వేంకటేశ్వరవరదుఁడు
నీవును త్రిలింగసంజ్ఞవు నిత్యకీర్తి, సుస్థిరత మనవమ్మ యాశోణిఁ దమిని. 5

తే. బాల్యపౌగండములు దాఁటెఁ బ్రౌఢవైతి, బుధులు రజతోత్సవమొనర్చి రధికభక్తి
నింక నిశ్శంక సకలోపకృతిఁ జిరంబు, ధన్య ! మనవమ్మ ! యాచంద్రతారకంబు. 6

## 53. కవిరాజ శ్రీ పట్టిసపు శ్రీరామమూర్తిగారు,

శ్రీజయపురాధీశుల అభిమానకవి, శ్రీరామాంధ్రగ్రంథాలయవ్యవస్థాపకులు,
వరహాపురము, గవరవరము పోస్టు, విశాఖపట్టణముజిల్లా.

తాముపంపినఆహ్వానపత్రిక చేరినది. ఆనందమొందితిని. కాని, కార్యాంతరములచే రాజాలకపోయి నందుకు వచ్చిచూచెడిభాగ్యము లభించకపోయినందుకు విచారించుచున్నాడను.

శ్రీవారిద్దవారు త్రిలిఙ్గపత్రికాపుత్రికను కన్నవారు. ఈపత్రికాంగనప్రాయము ఇప్పటికి ఇరువది ఐదేండ్లు. పుట్టిననాటినుండియు ఆర్థికరాజకీయమతసాంఘికవిషయములను బోధించుచుండుటయే గాక ఆంధ్ర వాఙ్మయమున కత్యంతోపయుక్తములగు విమర్శనలు పరిశోధనలు శాస్త్రచర్చలు ప్రపంచవృత్తాంతములుగూడ ముచ్చటించుచు జనసమ్మతము బడయుచున్నది. ఈనాటికి అభిమానులెల్లరు రజతోత్సవముగూడ గావించు చున్నారు. సమకనువనుండి పుత్రికారజతోత్సవము కన్నులార చూచి ఆనందించువారిభాగ్యమే భాగ్యము. "జనులా పుత్రుని గనుగొని పొగడగ పుత్రోత్సాహంబునాడు పొందును" అనుఆర్యోక్తికి ప్రబలనిదర్శనమై యున్నవి.

వావిళ్లవారన తక్కువవారా? కీ. శే॥ శ్రీరామస్వామిశాస్త్రులుగారు సుమారు 90 సంవత్సరములకు పూర్వమే ఒకప్రచురణసంస్థను నెలకొల్పి సంస్కృతాంధ్రద్రావిడగ్రంథములను ప్రాచీనకావ్యములను తాళపత్ర గ్రంథములనుండి సేకరించి నిర్దుష్టముగ ప్రచురించిరి. అట్టి శ్రీరామస్వామిశాస్త్రులవారిపుత్రులే మన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు. వీరు సంస్కృతమహాభారతమును దేవనాగరలిపిలో పదునెనిమిదిసంపుటములుగ ప్రచురించిరి. శ్రీ తులసీరామాయణమును, శ్రీ తిలకురచితగీతారహస్యమును ప్రకటించిరి.

శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారు తమతండ్రిగారారంభించినకార్యమును కొనసాగింపజేయుటయేగాక నూతన పోకడలతో నడుపుచు ఈసంస్థకు మఱికొంత వన్నెపెట్టుచున్నారు.

వావిళ్లవారు ఈసంస్థనే నెలకొల్పనియెడల అమూల్యప్రాచీనకావ్యాదులెల్లను చెదపుట్టలకో ఆహారమై పోయియుండుటయు ఆంధ్రసంస్కృతభాషామతల్లు లీనాడీమాత్రమైనా తలయెత్తితిరుగుట కవకాశములేకపోవు టయు జరుగవలసినదే కదా? వావిళ్లవారు భాషామాతకుచేసిన పోషకత్వము గూర్చి ఇంతంతయని చెప్పతరము కాదు.

వావిళ్లపుస్తకములని వావిళ్లనిఘంటువులని వావిళ్లప్రెస్సుఅని వావిళ్లవాచకములని దినదినము ఆంధ్రదేశీయు లెల్లరకు వావిళ్లజపమె కదా?

వావిళ్లవారిగ్రంథముచదువని భాషాభిమానియుండడనియు వావిళ్లవారిగ్రంథములేని భాషాసంస్థయేయుండ దనియు చెప్పుటలో అతిశయోక్తి ఏమున్నది?

వ్యయప్రయాసలకోర్చి లక్షలాదిగ్రంథముల ప్రచురించి ఇంతభాషాసేవచేయుటచేకదా ఆనాడు కడ పలో మిత్రమండలివారు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారిని సన్మానించి "భాషోద్ధారక" బిరుదమిడిరి.

ఈనాడు శ్రీకృష్ణదేవరాయలేయున్న శ్రీ శాస్త్రులవారిని తనగద్దెపైనుంచుకొనుట కాని, పెద్దనయేయున్న తనమనుచరిత్రలింగులుబాచి తనగండపెండేరమును శాస్త్రులవారి కాలున తొడుగుటగాని, కాళిదాసాదులు పోతనాదులు ఉన్న కౌగిలించుకొనుటగాని జరిగితీరవలసినసమయముకదా? వావిళ్లవారిగ్రంథసుందరు లానందము గొల్పుదురు.

గీ. ముంచిముత్యాలయక్షరమాల లలర మోములందున గిల్టులో నామములిడి
క్యాలికోచీరలందముగా ధరించి, దనరువావిళ్లగ్రంథసుందరుల గనమె.

ఇట్టిగ్రంథసుందరుల నవలోకించుకొనుచు, పత్రికాపుత్రికల ముద్దుముచ్చట లరసికొనుచు, ఇంకను పలుతెలుంగుల దేశోపకారులై బరగునట్లు భగవంతుడు భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి ఆయురారోగ్య సౌభాగ్యములు ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నాడను.

## 59 ఆయుర్వేదభూషణ శ్రీ యేటూరు శ్రీనివాసాచార్యులుగారు, నెల్లూరు.

తమఆహ్వానము నేడే నాకు చేరినది. త్రిలిజ్గపత్రికారజతోత్సవసందర్భమున తజ్జనకులు భాషాపోషకులు మామిత్రులు శ్రీశ్రీ వావిళ్లవేంకటేశ్వరశాస్త్రిగారికి ప్రశంసాభినందనవ్యాసరత్నసంపుటము బహూకరించు విషయము దెలిసి అమందానందకందళితహృదయారవిందుండనైతి. ఈమహోత్సవమునకు రాజాలనందుకై చింతిలుచున్నాడను. రేపుమహోత్సవ జయప్రదముగ జరుగవలెనని కోరుచు, అమూల్యసారస్వతసేవరయుతర్ఫు, శ్రీశ్రీ వావిళ్లవేంకటేశ్వరశాస్త్రిగారికి నా నమస్కారము లిందుమూలకముగ దెలుపు వేడెద.

## 60. శ్రీఎఱ్ఱగుంట్ల సుబ్బరావుగారు,
## ప్రధానోపాధ్యాయులు, బోర్డు ప్రాథమికోన్నతపాఠశాల, చిట్వేలి.

నేనీసభకురా నెంతో ప్రయత్నించితిని. భగవత్సాహాయ్యములేమి రాఁజాలమికి మిగులఁ జింతిల్లుచున్నాను. చిరకాలాపేక్షితమైన ఈసదవకాశమును బురస్కరించుకొని మహాశయుల దర్శించుభాగ్యము నాకుఁ జేకూరమికి నన్నేమి సేయమనెదరు!

భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి భాషాకృషి పురాతనము, అమోఘము, శ్లాఘాపాత్రమునని నుడువునంతటిసామర్థ్యమే నాకుఁగలదు.

వ్యావహారికమున నేమి, సాహితీవిషయమున నేమి, మతాభిలాషాప్రకటనమున నేమి ఈమహాశయునిచే అవిచ్ఛిన్నముగ నడుపఁబడుచుండు నీత్రిలిఙ్గ పత్రికారాజము సర్వవిధముల ప్రశంసాపాత్రమని త్రికరణశుద్ధిగ జెప్పుచున్నాఁడను.

ఈత్రిలిఙ్గరజతోత్సవము పండితజనమాన్యమై జయప్రదముగ శ్రీకేల్కరుమహాశయుని యాజమాన్యమున భగవత్కృపచే నెఱవేరుగావుత అని ఆశించుచున్నాఁడను.

ఈపత్రికాసంపాదకుల కాయురారోగ్యభాగ్యముల శ్రీశుఁడు ప్రసాదించి ఈపత్రికాపుత్రికకు అమూల్యాభరణమై తనదివ్యదీప్తుల దశదిశలకు వ్యాప్తమగునట్లు వరము ప్రసాదించుగాక! రజతోత్సవమునటులనే స్వర్ణోత్సవముఁగూడ దర్శింపఁజేయుభాగ్య మబ్బునుగాక!

## 61. బ్రహ్మశ్రీ గాజులపల్లి హనుమచ్ఛాస్త్రిగారు, వేదసంస్కృతకళాశాల, నెల్లూరు.

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున ఉభయభాషోద్ధారకులు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి గౌరవచిహ్నసంపుటమును సమర్పించుట శ్లాఘ్యము. ఇమ్మహోత్సవము పరమేశ్వరానుగ్రహమున జయప్రదముగ జరుగుగాత!

## 62. ఆంధ్రవ్యాసనిపుణ శ్రీఅవ్వారి సుబ్రహ్మణ్యశర్మగారు, వంగిపురము, గుంటూరుజిల్లా.

శ్రీభాషోద్ధారకుని సమ్మానమొనరించుయుత్సవములకు భాషోద్ధారకుని త్రిలిఙ్గరజతోత్సవమునకురావలయునని చాలారోజులనుండి నాకుసంకల్పముఁగలదు. అవ్యవధిగానందుటచే రాకాలనందులకు క్షమింప గోరుచున్నాను. శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుఁగారికి నా నమస్కారములనందింపుఁడు. ఈసభలకు శ్రీకేల్కారుగారధ్యక్షులుగా నుండుట ముదావహమైనవిషయము. వారు పెద్దలు, విద్యాధికులు. ఈసభలు నిర్విఘ్నముగ జరుగునని ఆశించుచున్నాను. అట్టులుజరుగవలయుననియే శ్రీయఃపతిని ప్రార్థించుచున్నాను. మీరిందు పరిశ్రమించినపరిశ్రమను గొండాడుచున్నాను. భగవానుడు శ్రీశాస్త్రులవారిని త్రిలిఙ్గను నిమ్ములను దీర్ఘకాలమాయురారోగ్యైశ్వర్యాదులొసంగి కాపాడుగావుతమని కోరుచున్నాను.

## 63 శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, రాజమహేంద్రవరము.

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిభాషాసారస్వతసేవలు నిరుపమానాలు. త్రిలిఙ్గవ్యాఖ్యలద్వారా దేశీయులకు సరియైనరాజకీయపరిజ్ఞానం కలిగించడంలో వారు కనపరుస్తున్న ధైర్యసాహసోత్సాహాలున్నూ స్తుతిపాత్రాలు. వారిని సన్మానించడానికి పూనుకోడంలో మీరు చాలా వైచక్షణ్యం కనపరిచారు.

ఇరవై ఆరేళ్లుగా వారితో నాకుగలపరిచయం నా అదృష్టాలలోనొకటిగా భావించుకుంటున్నాను. నిరాడంబరమూ నిత్యప్రసన్నమూ అయినశాస్త్రిగారిమూర్తి ఎలాంటివారికిన్నీ ఎలాంటిపరిస్థితుల్లోనూ కూడా శాంత సౌజన్యాలను పురికొల్పుతుంది.

వదాన్యతసందర్భంలో మద్రాసు ఆంధ్రులలో, ఇవాళ వారినిచెప్పి మరొకరిని పేర్కొనవలసివుంటుంది.

ఆకుటుంబంలో చిరసంచితమైన వైదికవిజ్ఞానము శ్రీశాస్త్రిగారిలో మూర్తీభవించివుంది.

ఈమహోత్సవసమయంలో వారిని సందర్శించాలని ఎంతో ఉబలాటపడిన్నీ విఫలుణ్ణయినాను.

శ్రీశాస్త్రిగారికి దీర్ఘాయువూ, సిరీ, సంపత్తూ కలగాలని వాంఛిస్తూ, మీపూనిక ప్రశంసిస్తున్నాను.

## 64. శ్రీవిద్వాన్ శివపురపు వేంకటనరసమ్మగారు,

మ్యునిసిపాలటీ హయ్యరుఎలిమెంటరీబాలికాపాఠశాల, బెజవాడ.

నేనీపాఠశాలలో నూతనముగఁ ప్రవేశించుటచే సెలవునీయరు. కనుకఁ దయయాహ్వానముప్రకారము రాఁజాలనందుకు మన్నింపవేడుచు నీయుత్సవము జయప్రదముగజరుగును గాక అని భగవంతుని ప్రార్థించుచున్న దానను.

## 65. శ్రీగుమ్మడిదల వేంకటసుబ్బారావుగారు, బి. ఏ,

అధ్యక్షులు, 'గోష్ఠి', 'స్వరాజ్యపార్టీ', 'రామదండు', బెజవాడ.

మన తెనుగుదేశమున కెప్పుడు వచ్చెనోగాని 'త్రిలిఙ్గదేశ' మని పేరువచ్చెను. అట్టిత్రిలిఙ్గసీమలో నవతరించిన 'త్రిలిఙ్గ' పత్రిక తెనుగువారి కెల్లరకును ఆత్మీయము. ఈపత్రికాస్థాపకులు సంపాదకులునగు మామిత్రులు బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారీపత్రికద్వారా ఆంధ్రసారస్వతమునకును, విజ్ఞానమునకును, మతమునకును, సాంఘికరాజకీయములకును నొనర్చుచున్నసేవ ప్రశంసనీయము. మనదేశమందలి ఇక్కాలపు పత్రికలలో బహుసంఖ్యాకములవలె గాక 'త్రిలిఙ్గ' పత్రిక అన్నిపాక్షికసిద్ధాంతములకు తావొసంగుట తెనుగువారి నిష్పాక్షికబుద్ధిని వెల్లడించును. ప్రకృతమున నీదేశమునావహించిన శ్రీగాంధీవ్యామోహముతగ్గినపిమ్మట ఈపత్రిక ఆంధ్రులందరకును ఒనర్చుచున్నసేవను ఆంధ్రులు మరింతగ గ్రహింపగలరని నమ్ముచు 'త్రిలిఙ్గ' చిరంజీవిగను పలుసంపదలతోడను వర్ధిల్లుగాక అని ఆశీర్వదించుచున్నాడను.

## 66. శ్రీ ఒంగోలు వేంకటరంగయ్యపంతులుగారు, బి. ఎ., బి. ఎల్., ప్లీడరు,

రంగనాయకులపేట, నెల్లూరు.

శ్రీశాస్త్రులవారు పారంపర్యముగ తమఅచ్చుకూటమువలన సంస్కృతాంధ్రములకు జేయుసేవఅమేయమై యున్నది. శ్రీశాస్త్రులవారు చిరాయువులై పూర్ణముగ ఆరోగ్యైశ్వర్యసంపదల జెన్నలరారుచు ఇతోధికముగ దేశసేవయు భాషాసేవయు జేయుచుండుదురనియు వారిత్రిలిఙ్గయు తెలుగువారి కితోధికముగను సుకృతిసాధనముగనెలయుచు చిరజీవియైవర్ధిల్లుగాతమనుచు సౌహార్దముగ గోరుచుండు భవదీయసేవకుడ.

## 67. శ్రీ విద్వాన్ శ్యాడి వేంకటశాస్త్రిగారు, శ్రీసారస్వతపరిషత్తు, మాడుగుల.

భవత్ప్రమాదరగౌరవాహ్వానపత్రిక కనంతసంతుష్టితస్వాంతుండనయ్యు ప్రస్తుత స్వకీయానారోగ్యవశత్వమున కెంతయుఁజింతాక్రాంతుండనై అంతటిమహనీయ సమావేశవిశేషమునకు దూరస్థుడనైతిగదా అని తలంచితిని.

నాలుగుదినములనుండి యెటులయిన రాఁగలుగుదునేమో అని యూహించుచు క్రియకిట్లు వ్రాసికొనినందులకు మనీషులెంతయు క్షమించెదరుగాక.

చ. పరనవిశేషమానసవిచక్షణతాచరణీయకార్యమీ
శ్వరుఁడలిసమ్మదాత్మ ననిశంబును గాంచుచు సర్వసద్గుణో
త్తరఘనవేంకటేశ్వరబుధప్రవరుం బరివర్ధితోద్రమా
కరమహనీయకీర్తిని నగణ్యునొనర్చుచుఁ బ్రోచుతన్ ఘనిన్.

## 68. సాహిత్యవిశారద శ్రీ కొత్తపల్లి వేంకటరామ లక్ష్మీనారాయణశర్మగారు,

పాల్వంచ సంస్థాన విద్యాశాఖాధికారి, ఆంధ్రవాఙ్మయసేవాసమితి కార్యదర్శి.

మారుమూలనందుండి మన్నెప్రాంతములుగ నెంచబడుచు విద్యావైజ్ఞానికవిషయములందు మిక్కిలి వెనుకబడియున్న ఈపాల్వంచసంస్థానఆంధ్రసోదరులభాషాప్రయత్నముల కడుశ్రద్ధతో తొలుత నాలకించి తమ నూరునందలి శ్రీదేశోద్ధారక ఆంధ్రభాషానిలయమునకు పదిపన్నెండేండ్లవరకు 'తమత్రిలిజ్గ, ఫెడరేటెడ్ ఇండియా' పత్రికాసహాయమనుగ్రహించి ఆగ్రంథాలయము పరశురామప్రీతికాగా అందులకు పరితపించుచు భారతభాగవతాది గ్రంథసహాయమొనరించి ఆంధ్రమహాజనుల సహాయార్థము విజ్ఞప్తిచేసినవారిలో ముఖ్యులుగ నుండి నేటివరకు ఆంధ్రవాఙ్మయసేవాసమితికి త్రిలిజ్గపత్రిక నుచితముగానంపుచు సభ్యులకవితారచనలను, కార్యకలాపములను తమపత్రికయందు ప్రకటింపజేయుచు అనేకవిధముల మాప్రారంభప్రయత్నముల ప్రోత్సహించుచున్నట్టియు ప్రాచీనసంస్కృతాంధ్రగ్రంథముల నెన్నిటినో పునరుద్ధరించి, భాషాపోషకులై విరాజిల్లుచున్న భాషోద్ధారకబిరుదాంచితులు పత్రికాధిపతులు ఆంధ్రసేవాపరాయణులునగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి వారిత్రిలిజ్గపత్రికా రజతోత్సవసందర్భమున మాసంస్థానవివిధవిద్యాభాషా సంస్థలపక్షమున మాకృతజ్ఞతాభివందనముల నర్పించుచు పరమేశ్వరుడు వారిచే నింక ఆంధ్రవిజ్ఞానచారిత్రకోద్ధరణ గడంగుటకు చిరతరాయురారోగ్యైశ్వర్యవిజయ వైభవంబుల ప్రసాదించుగాక అని ప్రార్థించుచున్నారము.

## 69. శ్రీ కొడాలి శివరామకృష్ణరావుగారు, కోడంబాకము.

శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని సన్మానింతురని విని ముదమందితిని. శ్రీశాస్త్రిగారిని సన్మానించుట అన ఆంధ్రులు తమ్ము తా గౌరవించుకొనినయట్లే.

వీరితండ్రి శ్రీరామస్వామిశాస్త్రులుగారేమి కొమరులు శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారేమి ఆంధ్రభాషకు ఎనలేని సేవ చేసియున్నారు. ఆంధ్రగీర్వాణగ్రంథములనెన్నియో వెలువరించియు పునర్ముద్రణగావించియు ఆంధ్రులకెంతయో మహోపకారము గావించియున్నారు. పండితులను సత్కరించియు గుప్తదానముల గావించియు భాషాభివృద్ధికి తోడ్పడిరి. ఆంధ్రమున గ్రంథము చిక్కవలెనన్న వావిళ్ల వారే దిక్కయినారు. శ్రీవేంక

టేశ్వరశాస్త్రిగారు "త్రిలిఙ్గ" ను 25 సంవత్సరములు నడపినది బహుశ్లాఘ్యము. దానికై వారుపడినశ్రమ అవృత్తియందు జీవితమును గడపినవాళోటివాంధ్రకు తెలిసినట్టు ఇతరులకు తెలియుట కష్టము. ఆంధ్రమున వందలకొలది పత్రికలుపుట్టినవి గాని 25 ఏండ్లు జీవితమును గడపినవి చన్నవాటిలోగాని ఇపుడున్నవాటిలోగాని 5,6 కన్నలేవు. అట్టిస్థితిలో "త్రిలిఙ్గను"25 సంవత్సరములు నడపిన శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారి పట్టుదల, సమర్థత మెచ్చతగియున్నవి. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులుగారు ఇతోధికముగా ఆంధ్రభాషకు, ఆంధ్రపత్రికారచనకు సేవజేయ వారికి భగవానుడు ఆయురారోగ్యైశ్వర్యములనిచ్చి మనుచుగాక!

## 70. శ్రీ భావరాజు వి. కృష్ణారావుగారు, యం. ఏ, బి. యల్,. రాజమహేంద్రవరము

మీరంపినశుభలేఖ అందినది. మీరు చూపినమన్ననకు కృతజ్ఞుడను. శ్రీ వేంకటేశ్వరశాస్త్రులవారికి మీరు చేయుచున్నసన్మానమును మహాగ్రంథసంపుటమును సమర్పించు సందర్భమున జరుపుమహోత్సవమును విజయవంతమగుటకు ఫలసిద్ధి నొందుటయు నావంటి మిత్రునికోర్కితములు, భగవత్కటాక్షమున అట్లేఅగును. శ్రీ శాస్త్రుల వారు చిరంజీవులై వర్ధిల్లి భాషాసేవ నిరంతరము అప్రతిహతసంకల్పముతో చేయుచుందురుగాక! ఒక్కొక్కప్పుడు వారును పూజ్యులైన వారితండ్రిగారునుచేసిన ఆంధ్రభాషాసేవ తలచుకొన్నప్పుడు సంతోషాతిశయమున కృతజ్ఞతాసూచకముగ ఆనందబాష్పములు తమంతటతామే ప్రవహించి నన్ను పరవశుని చేయుచుండును.

## 71. శ్రీ జమ్ములమడక శ్రీ మాధవరామ శర్మగారు, వైస్ ప్రిన్సిపాల్, సంస్కృత కాలేజి, తెనాలి

ఈనెల 14 వ తేది గురువారమునాడు శ్రీ కేల్కర్ గారి అధిపత్యమునజరుగు త్రిలిఙ్గరజతోత్సవాహ్వానమును సాదరముగా నందుకొన్నాను. సభ, లోకాదర్శప్రాయముగాజరుగుగావుత! అందరును రజతోత్సవసంపుటి వంటి గ్రంథమును ప్రకటించి, లోకోపయోగమును సంపాదింతురుగాత! శ్రీ వావిళ్లవారి తమకర్తవ్యదీక్షాపరతంత్రులుగా లోకమునకు మార్గదర్శకులవుదురుగావుత!!

సభకెట్లేని రాదలచితిని. మహోత్సవమును జూడదలచితిని. కాని, ప్రస్తుతపు ఆర్థిసౌకర్యమున రాజాలనందులకు మన్నింపవేడుదు.

## 72. సాహిత్యవినోది శ్రీ జాగరగల్లు సుబ్బరాయుడుగారు, గుంతబజారు, కడప.

మీరుపంపిన ఆహ్వానమందినది. అచ్చటికివచ్చి పండితోత్తములఇష్టాగోష్ఠి కన్నులపండువుగా జూచి యానందింప నిచ్చగించితినిగాని కొన్నిపరిస్థితులవలన రాలేకపోవుదను. ఇక చేయునదిలేక ఈచిన్నిపద్యమును పంపుకొన్నాను, ఆమోదింతురు గాక!

అత్తవై నాడు దేశంబు హాడలజేసి, కోడలై నేడు మిగిలిన కొనలజూచి
'అత్తకాలంబు కొన్నినాళ్లయినపిదప, కోనను కోడలికాలంబగు కలకాల'
మనుట సత్యమని పలికి తమాషా యిట్టి, లేతవయసునసే యో! త్రిలిఙ్గపడతి!

## 73. శ్రీ మల్లెల శ్రీ రామమూర్తిగారు, బెజవాడ.

తామ దయతో పంపిన ఆహ్వానము చేరినది. నేను కార్యాంతరములచే సికింద్రాబాదువచ్చియుండుటచే 14-8-41 నాటికి చెన్నపురికి రాజాలనందుకు మిక్కిలి విచారపడుచున్నాడను. త్రిలిఙ్గరజతోత్సవసభ జయ

ప్రథమముగ జరుగుగాకఅని కోరుచు త్రిలిఙ్గస్థాపకులు యజమానులు సంపాదకులునగు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారికి శ్రీకృష్ణభగవానుడు దీర్ఘాయురారోగ్యైశ్వర్యముల నిచ్చుగాకఅని ప్రార్థించుచు త్రిలిఙ్గ చిరంజీవిగనుండుగాక అని కోరుచున్నాడను. సభకు రాజాలకపోయినందులకు మరల నావిచారమును తెలుపుచున్నాను.

## 74. శ్రీ క్రొవ్విడి రామంగారు, బి. ఏ., మఠంవీధి, విజయనగరము

తమరు దయతో పంపిన ఆహ్వానపత్రిక చేరినది. మాననీయులైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి ప్రశంసనీయమైన కృషికి ఫలితముగా త్రిలిఙ్గపత్రిక ఇరవైయైదుసంవత్సరములనుంచి పండితులమన్ననలను పొందుతూ ఆంధ్రదేశంలో అభివృద్ధిపొందుతున్నది. శ్రీశాస్త్రిగారు ఈపత్రికతోపాటు ఎన్నోఅమూల్యమైన గ్రంథాల్ని ప్రచురించి తెలుగువెలుగును అత్యద్భుతంగా వ్యాపింపజేసేరు. భాషోద్ధారకులైన వీరికృషిని అభినందించి ప్రతిభావంతులైన పండితులందరూ వీరికి వ్యాసకసంపుటాన్ని బహూకరిస్తూన్నందుకు సహృదయపూర్వకమైనసంతోషాన్ని తెలియజేస్తున్నాను.

ఈమహోత్సవం దిగ్విజయంగా జరిగేటట్టుచేయవలసినదనిన్నీ నిరంతరమూ శారదాసమారాధనచేసే శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారికి అభ్యుదయపరంపరలను అనుగ్రహించవలసినదనిన్నీ యీశుభసమయంలో దయామయుడైన పరమేశ్వరుని నేను త్రికరణశుద్ధిగ ప్రార్థిస్తున్నాను.

## 75. శ్రీ నల్లాన్‌చక్రవర్తి నరసింహాచార్యగారు,
## అడ్వకేటు, హైకోర్టు, పికెట్టు రోడ్డు, కాల్బాదేవి, బొంబాయి.

తాము త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున శ్రీ భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి గౌరవచిహ్న సంపుటమును సమర్పించుటకుగాను గావింపనెంచిన ఆగస్టు 14 తేదీనాటిసభకు, నేను రాజాలనందుకు విచారించుచున్నాను.

బొంబాయి ఆంధ్రులందరితరఫున శ్రీవారిగౌరవార్థము జరుపు ఈసభ నిర్విఘ్నముగా కొనసాగవలయునని సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను. ఈసభ శ్రీనృసింహచింతామణికేల్కారుగారిఅధ్యక్షతక్రింద జరుగుట చాలాశుభావహమని నాఅభిప్రాయము.

## 76. శ్రీ చింతలపూడి సన్యాసిరావుగారు, విజయనగరము.

భాషోద్ధారకులగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారును, వారిజనకులు కీ॥ శే॥ శ్రీ రామస్వామి శాస్త్రులవారును పండితసహాయమున సంస్కృతాంధ్రవాఙ్మయములకు గడచిన యిరువదియైదుసంవత్సరములనుండి చేయుచున్నఅపారసేవకు నాంధ్రలోకము శ్రీవారికట్టువడియున్నది. ప్రస్తుతము వారి 'త్రిలిఙ్గ' పత్రికకు రజతోత్సవము నొనర్చుచు నాంధ్రసోదరులు శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారి నితోధికముగా సన్మానింప దొరకొనినందుల కెంతయు ముదమొదవుచున్నది.

శ్రీవారు యథారీతిని సంస్కృతాంధ్రవిజ్ఞానముల ఆంధ్రసోదరుల కందించగలందులకు వారికి పరమేశ్వరుడు చిరాయురారోగ్యైశ్వర్యములను ప్రసాదించుగావుత!

### 77. సాహిత్యవిద్యాప్రవీణ శ్రీ అవ్వారి వాసుదేవశాస్త్రిగారు,

కొత్తూరు, చీరాల, గుంటూరుజిల్లా.

శ్లో. భారతీ దయయా దద్యాత్ "భాషోద్ధారక" శాస్త్రిణే,
విశద్గౌరవసంభావ్యసభ్యైశ్వర్యాయురున్నతిమ్.

తమఆహ్వానమందినది. కార్యాంతరవ్యగ్రతచే నీగౌరవచిహ్నసంపుట సమర్పణమహోత్సవము కనులార నేత్రపర్వముగ గాంచజాలనందుకు మిగుల తపించుచు, నాయీకార్యాంతరవ్యగ్రతను తమకు మనవిచేసికొను చున్నాఁడను. ఈమహోత్సవము జయప్రదముగను, ఆనందసంధాయకముగను నెరవేరుగాక!

భాషోద్ధారక శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారి అఖండయశస్సును, విశద్గౌరవసంధాతలగు తమకీర్తిపుంజమును, ఆచంద్రతారార్కము దిగంతముల వ్యాపించుచు నుండుగాక!

### 78. శ్రీ వరిగొండ సత్యనారాయణమూర్తిగారు,

కమెర్షియల్ ఇన్‌స్ట్రక్టరు, బోర్డు హైస్కూలు, గూడూరు, నెల్లూరుజిల్లా.

మీ ఆహ్వానమందినది; వందనములు. ఇచట కొన్ని ఇబ్బందులచే సన్మానసభకు రాఁజాలనందుకు చింతించు చున్నాను; మన్నింపుఁడు.

శ్రీవేంకటేశ్వరశాస్త్రులుగారు ఆంధ్రభాషకు జేయుకృషిని, తన్మూలమున ఆంధ్రప్రజకుఁ జేయుసేవను గుర్తించి 'త్రిలిఙ్గ' రజతోత్సవముసందర్భమున మీరు వారిని సన్మానింపనుకట్టుట సంస్తవనీయము. ఆంధ్ర లోకము మీకుఁ గృతజ్ఞతను జూపవలసియున్నది. శ్రీశాస్త్రులుగారిని దైవము సర్వదా, సంరక్షించుచుండుఁగాక!

### 79. వ్యాకరణవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ, శ్రీ పోతుకుచ్చి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,

3/41, ఈశ్వరదాసు లాలావీథి, ట్రిప్లికేన్, మదరాసు.

శ్లో. వాణిక్ష్మ వేంకటేశ్వరశాస్త్రిణ మాంధ్రావనీశిరోరత్నం,
శ్రీమంతం దీర్ఘాయుష్మంతం శ్రీవేంకటేశ్వరః కుర్యాత్.

మ. చిరకాలంబుగఁ దాళపత్రములలో జీర్ణించి ప్రాణంబె దు
ర్భరమైచుండెడు నాంధ్రభారతినిఁ జేరందీసి మీతంత్రి కా
వరయం ద్రోచెను, దానికీవు, తగుప్రాపై నిల్వవే, వేంకటే
శ్వరశాస్త్రీ! భవదీయభాగ్యమిది, సంభావింప సామాన్యమే!

### 80. వైయ్యాకరణకేసరి శ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిగారు,

ముంగండఅగ్రహారము, అంబాజీపేటపోస్టు.

శ్లో. వాణిశ్వాన్వయదుగ్ధసింధుజనిత శ్రీవేంకటేశద్విజా
ధీశోద్యద్యశకౌముదీబుధజనారాధ్యా త్రిలింగాభిధా,
యాష్ఠీ శ్రీరజతోత్సవం వహతి సత్పంథూహితం సత్కళా
పారానల్పసుధాప్రదా జయతు సా వ్యాఖ్యానపద్యా భువి.

తత్సంపాదకవేంకటేశవిబుధాధీశాధ్యసన్మాన్యస
న్మాన శ్రీసమితిః ప్రమోదభరకృత్క్షేత్రశ్రియా సాధ్యతాం,
భాషోద్ధారకవేంకటేశ్వరబుధో గణ్య స్సుపుణ్యాత్మభి
ర్గణ్యోఽఖణ్డావనిమాళిభూషణమణిశ్రీయాచ్చిరం భారతే.

### 81. శ్రీ ఉమర్ అలీషాకవిగారు, ఢిల్లీఅసెంబ్లీసభ్యులు, పిఠాపురము.

శా. శ్రీవావిళ్లకులాబ్ధిచంద్రుఁడు జయశ్రీలోలుఁ డానందవ
ల్లీవాల్లభ్యుఁడు వేంకటేశ్వరుఁడు శాస్త్రీలోకచూడామణిన్
శావంణాలుశుభాల నుత్సవములన్ సైఁజేసి సర్వేశ్వరుం
డేవేళన్ గృపతోఁ ద్రిలిఙ్గతెలుఁగై యిష్టార్థముల్ కూర్చెఁగన్.

సీ. ఆంధ్రసారస్వత మాదర్శముగఁ జేసి పెక్కుకావ్యంబుల వెలయఁజేసె
తెలుఁగుబాసకుఁ బునాదులు వెట్టగాఁ ద్రిలిఙ్గసుపత్రికను బెట్టి నడుపుచుండె
బహుభాషలను దెచ్చి పరివర్తనము జేసి పాశ్చాత్యతత్త్వంబు బయటపెట్టె
తనదారిలో సనాతనము శుద్ధంబని బ్రహ్మవిద్యలకు దావలము జూపె

తే. సరయ వావిళ్ల వేంకటేశ్వరునివంటి, మేటి మనదేశమున వేరు సాటి కలఁడె
వర్ధిలి త్రిలిఙ్గ రజతోత్సవంబు గాంచె, సరిగ నిరువదియైదువత్సరము లగుట.

తే. ఈ ప్రభాతాలు కొన్ని దివ్యప్రపత్తి, రాగములఁ దేల్చి యానందరత్నవృష్టి
గూర్చు నందీత్రిలిఙ్గ యెక్కుడుగఁ దెలుఁగు,భూమి వసువులు గురిసె నింకేమివలయు.

### 82. శ్రీ కాభూరి వ్యాసమూర్తిగారు, విజయనగరము.

ఈనెల తే 14 దీని భాషోద్ధారకులైన మహారాజశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి త్రిలిఙ్గరజతోత్సవసంపుటమును సమర్పించుమహాసభ జరుగనున్నదని తమరువ్రాయించిన ఆహ్వానపత్రికను జూచి మిగుల సానంద మొందితిని. సభ జయప్రదముగ జరుగవలయునని ఆశించుచున్నాను.

### 83. విద్వాన్ శ్రీవి. కృష్ణమాచార్యగారు, తెనుగుపండితులు, పచ్చయప్పకళాశాల, మద్రాసు.

శా. వావిళ్లాన్వయవంశవార్ధిశశి, భావాలిప్రగల్భుండు భా
షావాచస్పతి దానకల్పక మశేషాశావకాశాంతర
స్పందాసక్తిరకీర్తి కాంతగుణుఁ డజ్ఞాతాత్మసద్భక్తునిన్
శ్రీవాణీగిరిజాంబ లోమత మహిన్ శ్రీవేంకటేశున్ సదా.

గీ. సరససారస్వతోద్ధారకరణి గాంచ, పూర్వమార్గానుసారితాపూర్వరీతి
తీర్థమైనట్టి కబ్బముల్ జీవనంబు, చేసితివి వేంకటేశ్వర! వాసి గనితి.

క. ఉత్సాహము నిండెను రజతోత్సవకల్యాణసమయ మొనఁగూడఁగనే
సత్సేవ సేయుం త్రిలింగకు, నుత్సవంబు గూడెఁ బండితోత్తములమదిన్.

# సమ్మానపత్రములు

పిదప శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి నాలుగుసమ్మానపత్రికలు సమర్పిత మయ్యెను.

## 1
## రజతోత్సవకమిటీవారిపత్రిక

ఈ క్రిందిరీతిని కమిటీవారిపక్షమున మదరాసునగర మేయరు శ్రీ గోపతి జానకి రామశెట్టిగారుచదివి వినిపించిరి.

అభినందన ఆశీర్వాదపురస్సరముగ

'త్రిలిఙ్గ' రజతోత్సవసందర్భమున తత్సంపాదకులు

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, వావిళ్ల ముద్రాక్షరశాల యజమానులు నగు

### శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి

సమర్పించిన సన్మానపత్రిక.

అయ్యా, సుప్రసిద్ధ పత్రికారాజమగు 'త్రిలిఙ్గ' రజతోత్సవసందర్భమున మీ మిత్రులు, యశోభిలాషులు అనురక్తులు, నగు మేము ఆపత్రికసంపాదకులు, యజమాని, ప్రచురణకర్తలునైన మీకు హృదయపూర్వకాభినందనములు సమర్పించి వందనములిడు చున్నాము. రాజకీయ, వైజ్ఞానిక, సాంఘికవిషయములలో దేశభాషాపత్రికాప్రపంచ మెంతో బాగుగ ప్రబోధముగల్పించినది. ఈ ప్రయత్నములలో తెనుగుదేశము తనభాగమును తాను నిర్వహించినది. రెండుకోట్లకుపైబడిన తెనుగుప్రజల అభీష్టములను దీర్చునుద్దేశముతో తెనుగుపత్రికలిటీవలసంఖ్యయందు గణనీయాభివృద్ధినందినవి. ఒడుదుడుకులులేని చక్కని అభిప్రాయము లేర్పరచుటలో 'త్రిలిఙ్గ' గణింపదగినకృషి చేసియున్నది. నేడు తెనుగుపత్రికలలో అగ్రశ్రేణియందున్నది. ధైర్యముతో అభిప్రాయములనిచ్చుటచేతను, స్వతంత్రదృష్టి పథము ననుసరించుటచేతను, వివేచనతో వ్రాసిన సంపాదకీయవ్యాసములు, ఇతరవ్యాసములు పొందుపరచుటచేతను, ఇన్నిటికంటె నెక్కువైనది గవర్నమెంటుతో కాని బలీయమైనవ రాజకీయపార్టీతోగాని సాహచర్యముసలుపకుండుటచేతను ఈ పత్రికవాక్కు గంభీరమని గౌరవింపదగినదని ప్రతిష్ఠగలదని ప్రఖ్యాతికలిగినది. ఒక్కమాటతో విషయముచెప్ప

దలచుకొంటే మీనాయకత్వమున త్రిలిఙ్గ ప్రజాభిప్రాయమును తొణకుబెణుకులేనిదిగ చేయుటయందు చాలసేవ చేసినది.

ఒక్కపత్రికా ప్రచారముమూలకముగనే మీరు మాకుగౌరవ పాత్రులయినట్లున్నవలదు. పండితులసాయముతో తెనుగు సంస్కృతములలోని ప్రౌఢరచనలను చవుకగను చక్కగను ప్రకటించి సామాన్యమానవుడీదేశపు మహాసంప్రదాయముల అర్థము చేసికొనునట్లొనర్చితిరి. ఈ విషయముగ సుప్రసిద్ధులు మీతండ్రిగారునగు శ్రీరామస్వామి శాస్త్రులవారు మీకునిర్ణేతలు. మీసంస్థవలె ప్రౌఢరచనలను ప్రకటించినసంస్థ మరియొకటి లేదు.

పత్రికారచనలో నేమి గ్రంథప్రచురణమున నేమి మీరుద్రవ్యసంపాదనమే ఉద్దేశముగ నుంచుకొను బురదలో పడలేదు. బీదలు తగినవారునగువిద్యార్థులకు వారిచదువులకు కావలసిన అనుకూలములు చేసిఇచ్చి వారభివృద్ధిఅగుటకు తగిన సహాయము చేయుటకు మీ రెల్లప్పుడును ప్రయత్నించితిరి. మీ నిరాడంబరదానశీలతచే అన్నితెగలబీదలును లాభపడినారు. మీసుహృద్భావమును నయప్రవర్తనమును పరోపకారము చేయుటకు మీకుగలశ్రద్ధయు మీమిత్రులకు మిమ్ములను బహుసన్నిహితులను గావించినవి. అందుచే మదరాసునగరమున మీరు ప్రముఖులయి ప్రేమపాత్రులయినారు. మీ అభిప్రాయముల ద్రఢిమమూలకముగను మీ స్వతంత్రదృష్టికారణముగను మీరు పూర్ణముగ నొకపార్టీతో చేరియుండుటకు నిరోధము అయినను ఇరువది సంవత్సరములకు పైబడి మీరు శ్రీతిలకు పంథా కాంగ్రెసుమతమువారని మాలో చాలమందికి తెలియును. మాకొకవిశ్వాస మెప్పుడునుగలదు. మీరు ఉదారాశయులును శ్రద్ధాళువులును అగు దేశభక్తులుగనున్నారు. ఉండగలరు. దేశక్షేమమునకయి పరిశ్రమచేయుటకు ఎల్లప్పుడును మనఃపూర్వకముగ సిద్ధపడగలరు.

వైజ్ఞానిక, సాంఘిక, రాజకీయప్రయత్నములలో భారతజాతికి ఉచితసేవ చేయుటకయి ఈశ్వరుడు మీకు చిరాయువొసంగుగాక సంవత్సరములుగడచినకొలది ప్రజారంజకత్వము త్రిలిఙ్గ ప్రబలతరంబగుగాక!! ఆంధ్రదేశపు ఋజునాయకత్వమున వహించి తత్సత్యవాక్కుగా నెగడి తన ఉదారాశయములను సాగించు గాక!

మద్రాసు.
14-ఆగస్టు-1914.

ఇట్లు, భవద్విధేయులు,
త్రిలిఙ్గరజతోత్సవకమిటీసభ్యులు.

# 2

# చెన్నపురి ఆంధ్ర పండితమండలిపత్రిక

చెన్నపురి ఆంధ్రపండితమండలివారిపరముగ వారుసమర్పించిన ఈక్రిందిసమ్మాన పత్రమును పండిత శ్రీచల్లా సత్యనారాయణగారు శ్రుతపరచిరి.—

భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి
త్రిలిఙ్గపత్త్రికారజతోత్సవావసరమున
చెన్నపురాంధ్రపండితమండలి సమర్పించు

## సన్మానపత్త్రము

**గ్రంథోద్ధారకా!**

దాదాపుగ నొక శతాబ్దికిఁ బూర్వము యుష్మజ్జనకులు, పూజ్యపాదులు, కీర్తిశేషులు బ్రహ్మశ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారు క్రిమికీటాదులచే శిథిలములై నశింపనున్న గీర్వాణాంధ్రగ్రంథజాలము నుద్ధరించి పండితసాహాయ్యమునఁ బరిష్కరించి ప్రకటించి యుండుట జగద్విదితము. పితృపథముననే మీరును భాషాసేవ నవిచ్ఛిన్నముగఁ గొన సాఁగించు చున్నందుకు మా మనఃపూర్వక ధన్యవాదములు.

**విద్యాపోషకా!**

సుప్రసిద్ధ పండితవంశంబున జన్మించిన మీకు విద్యాపోషకత్వము ప్రకృతిసిద్ధమే. చెన్నపురి, అణ్ణామలై విశ్వకలాపరిషత్తులందును, పచ్చయప్పకళాశాల, హిందూథియలాజి కలుపాఠశాలాదిపాలకవర్గములందును బహువత్సరంబులుండి, విద్యావిధానమందలి అనేక సంస్కరణములకును, విద్యార్థులయు నధ్యాపకులయు శ్రేయస్సులకును గారకులయిన మిమ్ము నేమని స్తుతింపఁగలము!

**సారస్వతప్రియా!**

మీకు సారస్వతప్రియత్వము వెన్నతోడఁ బెట్టినది! కవులను బండితులను బోషించుచు, వారిచే గీర్వాణాంధ్రాదిభాషలలో రసవద్గ్రంథములను రచియింపఁజేసిన మీ ఋణమును నాంధ్రలోకమెన్నటికిని దీర్చుకోఁజాలదు. ఉత్కృష్టాంధ్రశృంగారప్రబంధముల మీఁది అర్థములేని నిషిద్ధమును దొలంగించుటకు మీరు గావించిన పరిశ్రమకు మా

జూపారులు. ప్రభుత్వమువారి సంకుచిత దృష్టిచే మీ ఈయుద్యమము కొంతవఱకే సఫలమైనను మీరిద్దానిని సాంతము కొనసాఁగింతురని విశ్వసించుచున్నాము.

**పత్త్రికానిర్వహణదక్షా!**

ఆంగ్లమున "ఫెడరేటెడ్ ఇండియా", ఆంధ్రమున "త్రిలిఙ్గ", తమిళమున "బాలవినోదిని" అనెడి పత్త్రికారాజముల మూలమున మీరొనర్చు నైతిక సాంఘిక రాజకీయ సారస్వతసేవ నిరుపమానము. అందు ముఖ్యముగా త్రిలిఙ్గపత్త్రిక ఆంధ్రజాతి పురోఽభివృద్ధికయిపాటుపడి తనప్రబోధముచేఁ బ్రత్యేకాంధ్రరాష్ట్రనిర్మాణోద్యమమునకుఁ జేయూఁతయొసఁగినది. అల్పాయుష్కతయే పత్త్రికల ముఖ్యలక్షణమైన మనదేశములో మీ పత్త్రికాపుత్త్రికలిన్ని వత్సరము లప్రతిమానముగ వర్ధిల్లుట మీనిష్పాక్షిక దృక్పథమునకును మీ విశాలభావసంపత్తికిని నిదర్శనములు. రజతోత్సవకల్యాణపీఠము నేఁ డలంకరించిన త్రిలిఙ్గపుత్త్రిక తన చెల్లెండ్రతోఁ జిరాయువయి మనుగాత మని మా యాశీర్వాదము.

**ఉదారహృదయా!**

లక్ష్మీసరస్వతులకు నిలయురగు మీ నిరాడంబర జీవనము దానవీరత్వము మా హృదయములఁ జూఱగొన్నవి. మీరు పోషింపని రచయిత కోరి మీసాయముఁ బొందని విద్యార్థి మీ యౌదార్యముఁ జవిచూడని సంస్థ యాంధ్రదేశమున నుండవు. ఇట్టి మీకుఁ బరమేశ్వరుఁడు చిరాయురారోగ్యైశ్వర్యములఁ బ్రసాదించి మీచే దేశ, భాషాసేవల నితోఽధికము చేయించును గాత మని మఱిమఱి ప్రార్థించువారము.

చెన్నపురి.<br>14-8-1941.

ఇట్లు,<br>**చెన్నపురాంధ్రపండితమండలి.**

# 3

# మదరాసుహిందూమహాసభ పత్రిక

హిందూమహాసభపక్షమున ఈ క్రిందిపత్రికను రావుబహాదరు యు. రామప్ప, మదరాసు సిటీజడ్జీగారు సమర్పించిరి.—

మదరాసు హిందూమహాసభ అధ్యక్షులును సభ్యులును

'త్రిలిఙ్గ' రజతోత్సవ సుముహూర్తసందర్భమున

## శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి

### సమర్పించిన సన్మానపత్రము

అయ్యా,

త్రిలిఙ్గరజతోత్సవసందర్భమున మీకు సమ్మానసంపుటిని సమర్పించు ఈసుముహూర్తమున మద్రాసు హిందూసభ అధ్యక్షులు, నిర్వాహకులు, సభ్యులు నైన మేము మీకు హృదయపూర్వకాభినందనములను సమర్పించుచున్నాము.

అయ్యా! తమరు చేసినసేవయందు ప్రాచీనభాషావాఙ్మయములసంరక్షణ ప్రధానమయినది. తాళపత్రాదులమీద వ్రాసియుంచిన సంస్కృతాంధ్రగ్రంథములను సంరక్షించి యుద్ధరించి నశింపుగాకుండ వేవిధముల కాపాడిన మీ అప్రతిమానకృషి దేశసారస్వతజీవితమున అతిగణనీయమయి యున్నది. ఈవిధముగ దక్షిణఇండియాలో సంస్కృతము, తెలుగు, అరవము భాషలలోనివాఙ్మయమును పోషించి వ్యాపింపజేసి మనసభ్యతజ్ఞానమును విస్తారముగ మీరు వెదజల్లినారు. సంస్కృత ద్రావిడసారస్వతాభిమానులు, ముఖ్యముగ హిందువులు, మీకు కృతజ్ఞులు. అయ్యా! వివిధములగు అమూల్యగ్రంథ ప్రకటనమున మీరు చూపిన ఉత్సాహపరిశ్రమలచేత ప్రాచీనహైందవ వికాసమును నీతియు సురక్షితమయి నెగడినవి. ఈ కార్యక్రమనిర్వహణమున తమరు ప్రాచీనరాజులు ప్రభువులవలె నెందరో ప్రసిద్ధులు ప్రచండులునైన హిందూవిద్వాంసులను పోషించినారు. ఈకొద్ది అవకాశములో మీబహుముఖసేవను వివరించుట సాధ్యముగాదు. కాని, లోకమాన్య శ్రీతిలకుగారి గీతారహస్యము తెనుగునాటికి మీరు ప్రసాదించి తెనుగువారిని మీప్రేమపాత్రులు గావించినది నుడువక యుండలేము. అయ్యా! ఇంకా అధికతరశ్రద్ధతో జాతీయవాఙ్మయమును పోషించుటకును హిందూసమస్యలకును హిందూవాఙ్మయము హిందూధర్మములకును సానుభూతి సహాయము లొసంగుటకును ఈశ్వరుడు మీకు చిరాయురైశ్వర్యము లిచ్చుగాత మని కోరుచున్నాము.

ఇట్లు, తమవిధేయులు,

మదరాసు హిందూమహాసభఅధ్యక్షులు, సభ్యులు.

## 4
# మదరాసుఆంధ్ర మహాసభ పత్రిక

చెన్నపురి ఆంధ్రమహాసభతరఫున శ్రీ యం. రామానుజరావునాయడు, ఎం. ఏ, గారీక్రిందిసన్మానపత్రమును సమర్పించిరి.—

భాషోద్ధారక బ్రహ్మశ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి
త్రిలిజ్గపత్రికారజతోత్సవసందర్భమున
**చెన్నపురి ఆంధ్రమహాసభాసభ్యులుసమర్పించు**

# సన్మానపత్రము.

**ఆంధ్రసోదరా!**

ఆంధ్రమాతృగర్భశుక్తిముక్తాఫలమనఁదగు తమరీ చెన్నపురి ఆంధ్రమహాజనులకొఱకై కావించుచున్న సర్వాంగీణసేవ జగత్ప్రసిద్ధము. రాష్ట్రమండలములందును, రాష్ట్రేతరమండలములందును దమ కీర్తిచంద్రికలు పొగడ్తఁగాంచిన పిదపనైనను తమకు ధన్యవాదములర్పించుట కీ అవకాశపులిబ్బిమా కబ్బెను కదా యని మే మెంతయు నుబ్బుచున్నాము.

**దేశసేవాధురీణా!**

తొమ్మిదికోట్లకుఁ బైపడిన ఆంధ్రుల సర్వతోముఖాభివృద్ధికై యొక ప్రత్యేకరాష్ట్ర మావశ్యకమని యాందోళన సల్పువారిలోఁ దామగ్రగణ్యులై తమ యావచ్ఛక్తిని తత్సంకల్పసిద్ధికై వినియోగించుచుండుట లోకమునకుసువిదితము. ఆంధ్రమహాసభాస్థాపకులలో నొకరై, ఆంధ్ర చేంబరు ఆఫ్ కామర్సు ఇత్యాదిసంస్థలలోఁ బాల్గొనుచు, మీరు కావించు నైతిక సాంఘిక రాజకీయ సారస్వతసేవకునంజలి ఘటింపని ఆంధ్రుఁ డెవ్వఁడు?

**గ్రంథోద్ధారకా!**

సంస్కృతాంధ్ర కర్ణాటక తమిళగ్రంథముల నెన్నిటినో పండితప్రకాండులచేఁ బరిష్కరింపఁ జేసి ముద్రించి ప్రకాశింపఁజేసిన మీ ఋణమును విద్వల్లోక మెట్లు తీర్చికొనగల్గును? నేఁటి ఓటుపరిపాలకులకన్న ఎన్నో రెట్లు రసహృదయులు, ఆత్మస్వాతంత్ర్యప్రియులు యుక్తాయుక్తవిచక్షణచణులు నగు ప్రాచీన రాజశేఖరులచేఁ జిరకాలము మన్నింపఁబడ్డ ఆంధ్రశృంగారకావ్యజాలముపైనున్న ప్రభుత్వనిషేధమును రద్దుచేయించుటకై మీవడ్డ పరిశ్రమమునకు మాఅభినందనములు.

వైదుష్యశేముషీమంతా!

విద్వద్వంశమునఁ బుట్టిన మీకు సారస్వతప్రియత్వము పండితపోషకత్వమును సాజమైనగుణములు. మీ కరగ్రహణమును బొంది వికాసిల్లని వ్యక్తులును సంస్థలును లేవు. తమిళాంధ్రాంగ్లములందుఁ బత్రికాత్రయమును సాగించి, తన్మూలమున ఆంధ్రుల పత్రికా నిర్వాహణశక్తిని, కార్యదక్షతను లోకమునకుఁ జాటిన మీ కార్యనిర్వాణకౌశల మనన్య సామాన్యము. బాలారిష్టాదులను దప్పించుకొని మీ పత్రికాపుత్రిక లిన్నిసంవత్సరము లప్రతిమానముగ వర్ధిల్లుట మీ సదమలహృదయమునకును విశాల దృక్పథమునకును సాక్షులు. నేటిదినము రజతోత్సవమంగళపీఠి నలంకరించిన మీ త్రిజ్ఞలిపత్రిక తన చెల్లెండ్రతోఁబాటు చిరాయువై మనవలయునని మాఅందరిఆశయము.

సజ్జనావతంసా!

లక్ష్మీసరస్వతులకు నిలయులరైన మీకు సాధురక్షకుడగు భగవంతుఁడు ఇతోధిక భద్రములఁ జేకూర్చి, శ్రేయఃపరాపరాక్షతలను మీ యుత్తమాంగముపై నిరంతరమును వర్షించుగాత!

మద్రాసు.
14-8-1941.

ఇట్లు, భవచ్ఛ్రేయోభిలాషులు,
చెన్నపురి ఆంధ్ర మహాసభాసభ్యులు.

---

తదుపరి సభ్యులకరతాళధ్వనులు హర్షమున్నుమిన్నుముట్టుటనుసూచింప శ్రీ ఎన్. సీ. కేల్కారుగారు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారికి సన్మానసంపుటమును సమర్పించిరి.

ఇది బహుపుటసంపుటమై, అందముగ అచ్చొత్తింపబడినది. అందు 180 సందేశములు ఆంగ్లభాషలో ఉన్నవి, 60 ఆంధ్రభాషలో నున్నవి. 15 వ్యాసములు ఆంగ్లభాషలోను 76 వ్యాసములు ఆంధ్రభాషలోను 5 సంస్కృతములోను ఉన్నవి.

ఈసన్మానముజరుపుమువాఁర్తమున శ్రీకేల్కారుగారిరీతిని అధ్యక్షోపన్యాసమును గావించిరి:—

## శ్రీ నృసింహచింతామణి కేల్కరు, బి. ఏ., యల్ యల్. బీ., గారు

# త్రిలింగరజతోత్సవసభలో గావించిన అధ్యక్షోపన్యాసము

సోదరీమణులారా! సోదరులారా!!

ఈరజతోత్సవకార్యనిర్వాహకులు ఈతరుణమున అధ్యక్షత వహింపవలసినదని నన్ను కోరి నాకు వారుచేసినగౌరవమునకు నేను వారికికృతజ్ఞుడను.

ఈనగరముననే 1932 సం॥లో ఇదేరీతిగ జరిగిన "స్వదేశమిత్రను" పత్రిక స్వర్ణోత్సవసందర్భమున నన్ను అధ్యక్షతవహింపమని మిత్రులుకోరడము నాకు స్మరణకు వచ్చుచున్నది. నాడు జరిగినయుత్సవము అరవపత్రికది. నేడుజరుగునట్టి ఈయుత్సవము తెనుగుపత్రికది. భావముల ప్రకటించుటకేర్పడిన భాషామూలమేదయినను ఈరెండుపత్రికలకును దేశాభిమానసంవేదన సమానము. భారతజాతి పురోభివృద్ధికి తోడ్పడవలెనను వాంఛ సమానము. జీవితమంతయు పత్రికారచయితగ గడపినవాడనయినందున ఈరెండుపత్రికల స్నేహాదరములు వారివారి ఉత్సవాలసమయములయందు అంతదవ్వుననున్నను నన్ను వచ్చి అధ్యక్షతవహింపవలసినదని కోరునంతటి గాఢముగనున్నందుకు నేనుగష్టపడుచున్నాను.

వెంటనే జరుగనుండు ప్రస్తుతోత్సవముసందర్భముగ నాకును శ్రీ శాస్త్రులవారికిని పరిచయముగలిగినసుముహూర్తము స్మరింపదగినది. లోకమాన్యులు శ్రీతిలకుమరణించుటకు కొన్నిసంవత్సరములకుముందు వారు శ్రీశాస్త్రులవారిని యువకులయినస్వంతమిత్రులుగ భావించురోజులవి. లోకమాన్య శ్రీతిలకుగారియెడల సమకాలికులయినవ్యక్తులుగనబరచిన గౌరవము, భక్తి, మర్యాదలతారతమ్యమును సూచించుట చాలకష్టము; సంభావ్యముకూడ కాదేమో. కాని, శ్రీతిలకుమహాశయునితో మిక్కిలి సన్నిహితముగ నున్నవాడనుగావున ఒక్కభేదము నేనుగుర్తింపగలను. బుద్ధిబలముచేత ఒకరిగొప్పతనమునుతూచి గుర్తించి వారియెడలచూపు గౌరవాభిమానము లొకరీతివి. హృదయముప్పొంగ పరవశులయిచూపు గౌరవాభిమానములు మరియొక్కభంగివి. శ్రీశాస్త్రులవారి రెండు తెరగులలో దేనికి చెందినవారనిన నేను స్పష్టముగ వీరిని రెండవతెగలో చేర్చుదును. శ్రీతిలకుమిత్రులు భక్తులలో ఆయనచెప్పునది సరియా తప్పా అని విచారింపకనుగూడ అతనిదే వేదవాక్యముగ పరిగణించు బృందమున వీరొక్కరని నావిశ్వాసము. వీరిఅభిప్రాయానుసారము శ్రీతిలకుతప్పే చేయడు. ఆయనలో ఒకవేళ ఏవోకొద్దిలోపములు తోచినా వాటిని వీరుత్రోసిపుత్తురు. కారణమేమంటారా? ఆయన నిజమైనదేశభక్తుడు. రాజకీయాలలో ప్రజాహితజీవితమున అతడు స్వప్రయోజనమునుకోరినదిగాదు. రాజకీయపరిజ్ఞానము, ధైర్యము, ఆత్మత్యాగములలో వారు అప్రతిమానులు. విమర్శకునిచే గౌరముపొందుటలోను భక్తునిహృదయపూర్వకమగు ప్రేమనందుటలోను భేదమున్నది. మహారాష్ట్రమహాపురుషులగు శ్రీతిలకుమహాశయులహృద

యమర్పించిపూజించినభక్తులలో శ్రీశాస్త్రులుగారొక్కరని నేనెప్పుడును లెక్కవేసికొని యున్నాను. ఇట్టిభక్తులు ప్రతిరాష్ట్రములోను కొందరుండడము నిజమునకు ఆతని భాగ్యము. దీనిని యెందుకింత నొక్కిచెప్పుచున్నానందురా! శ్రీతిలకుదేశభక్తిని ప్రశ్నించిన వారెక్కడను లేరుకాని విమర్శకులు, విముఖులు, శత్రువులుగూడ, తనరాష్ట్రముతోసహా అన్ని రాష్ట్రాలలోనుయుండిరి. ప్రేమించిగౌరవించునట్టిమిత్రులు గలవారాయనకావడము మహాభాగ్యమని అంగీకరింపకతప్పదు.

శ్రీశాస్త్రులవారికిని శ్రీతిలకుమహాశయునికిని రాజకీయములు మాత్రమే స్నేహబంధములనుకొనవలదు. శ్రీతిలకునందు అద్భుతసభ్య విజ్ఞానమఖండముగనుండినది. దానిచేత వారిమిత్రులు భక్తులేగాక విముఖులు వైరులుగూడ వారిని అభిమానింపవలసియుండినది. శ్రీతిలకు నిజమైన వైజ్ఞానికోపాసకుడు. అందులోను ఆయన ప్రాచీనహిందూసభ్యతను సమర్థించినిలవబెట్టి దానిఅభ్యుదయమునుసాధించునట్టి వైజ్ఞానికోపాసకుడు. మాండలెలో తానునిర్బంధమునందుండగా ,ఆయనవ్రాసిన మహద్గ్రంథముగుగీతారహస్యము వెంటనే హిందూదేశమున ఆసేతుహిమాచలము నవీనతాత్త్వికజీవనసిద్ధాంతము నేర్పరచునట్టి మహోపదేశమని ప్రఖ్యాతిపొందెను. ఈగీతారహస్యమును మహారాష్ట్రేతరభాషలోనికి తర్జుమాచేసి అచ్చువేయడానికి అమితోత్సాహమున సిద్ధమైన కొద్దిమందిమిత్రులలో శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారొక్కరు. నాకు స్వయముగ తెలిసియుండేవిషయాలనుబట్టి తెనుగుతర్జుమా తక్కినభాషలలోని పరివర్తనాలన్నిటికంటెను ఎక్కువప్రకటనపొందినదని ఎక్కువప్రజారంజకమయినదని చెప్పగలను.

శ్రీశాస్త్రులుగారు గీతారహస్యమునకుచేసినసేవకు వారికి శ్రీతిలకు మహాశయుని యెడలగలభక్తియొక్కటే కారణమనరాదు. ఒకశతాబ్దమునకుమున్నే హిందూసభ్యత నుద్ఘాటించు వాఙ్మయమును తనప్రజకుపంచిపెట్టవలెనను మహదుదారాశయముతో వావిళ్ల ముద్రణాలయమునుస్థాపించిన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారితండ్రి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రులవారే దీనికిబీజమువైచియుండిరి. డబ్బుసంపాదింపదలచుకొన్నవారెవరైన ముద్రణాలయము ఎన్నెన్నివిధముల వినియోగించుకొనుటకు వీలున్నదియు మనమెరుగుదుము. శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారివిషయములోనో ప్రధానముగ హిందూసభ్యతప్రచారము ప్రధానోద్దేశముగ కన్పించును. ఈముద్రణాలయము ప్రకటించియుండు పవిత్రగ్రంథాలపరంపరయే దీనికితార్కాణము. వంశాచారమును కుమారులుమన్నించి సాగించినట్లు స్పష్టము. ఒకముద్రణాలయము విజయవంతముగ పనిచేసినదంటే ఆయజమానికి ద్రవ్యము పలుకుబడి రెండును కలిగినవన్నమాట. ఇవిరెండును మళ్లీప్రజాహితమునకు విశ్వప్రేమసాధనకు—ఈ వావిళ్లముద్రాలయసందర్భమున జరిగినరీతిగ—వినియోగపడవచ్చును. ఈయిద్దరుశాస్త్రులపేళ్లు—తండ్రికుమారులవి—రాజకీయముగాని, మతవిషయికముగాని, వైజ్ఞానికముగాని మరియేదైననుగాని—గుప్తదానముచేయడములో ప్రసిద్ధమయినవని నేనువిన్నాను.

శ్రీశాస్త్రులుగారు తనకాలములో మహత్తరసేవచేసెను. ఒక్కఉదాహరణము చెప్పనిండు. మహాభారతము దాక్షిణాత్యపాఠముల సవిమర్శకముగసవరించి ప్రెసిడెన్సీ కాలేజీ ప్రొఫెసరు అగు పీ. పీ. ఎస్. శాస్త్రిగారిసంపాదకత్వమున ప్రకటించిరి. వ్యాప్తియందు పనిచక్కదనమున పలుకుబడిని ప్రతిష్ఠప్రయోజనాల వావిళ్లవారి ముద్రణాలయముతో పోల్చదగినది మావైపున బొంబయిలో నిర్ణయసాగరముద్రాలయము మాత్రమే గలదు.

ఈవావిళ్లప్రెస్సువారు తెనుగుభాషకు వాఙ్మయమునకుచేసినసేవ వారు సంస్కృతమునకుచేసినసేవకంటె చాలనెక్కువయని తెలియుచున్నది. ఇంగ్లీషుభాష ప్రచండముగ వ్యాపించి దేశభాషలమీదికి దాడివెడలుచుండు ఈదినములలో దానికి విజయవంతముగ నెదురుకొనవలసినయెడల భారతీయముద్రణాలయములు సంస్కృతము దేశభాషలప్రకటనలకుగలిగింపగలశక్తిబలములే ఆధారము. ఈవిధమయిన ఎదురుద్యమము అన్నిప్రాంతములలోను గన్పించును. బ్రిటిషుప్రభుత్వమెంతకాలముండునో అంతకాలము ఇంగ్లీషుభాషకు ప్రధానాధికారముండుట నిజమేఅయినను దేశభాషలు త్వరలో .అగ్రస్థానమాక్రమింపగలవు. చాలపైదర్జాపరిపాలనకార్యక్రమాలలోతప్ప తక్కిన అన్నిచోట్లలోను ఇంగ్లీషుస్థానమును ఆక్రమించుకొనగలవు.

తెనుగుదేశభాషను పునరుజ్జీవింపజేయడములో వావిళ్లప్రెస్సు చాలాగొప్పసేవ చేసినది. వారిప్రెస్సు సంస్కృతవాఙ్మయమునకిచ్చిన ప్రోత్సాహమునాలోచించినా తెనుగున అచ్చువేసిన సేవనాలోచించినా ఇటీవల శ్రీశాస్త్రులుగారికొసగబడిన 'భాషోద్ధారక'బిరుదము ఔచిత్యముతోకూడుకొన్నదై సార్థకముగనున్నది.

ఆంధ్రదేశమునెడలను తెనుగుభాషయెడలను శ్రీశాస్త్రులుగారికిగలప్రేమ సుప్రసిద్ధము. వారిఉపన్యాసములలో నొక్కట—కడప మిత్రమండలివారు జరిపినసన్మానసభలో వారు ప్రత్యుత్తరమిచ్చునప్పుడు కాబోలును—వీరు మద్రాసును తెనుగునగరమని వర్ణించునంతవరకును సాహసించిరి. మద్రాసునగరమును తెనుగువారు తమదని అరవవారు తమదని కోరుకున్నేసందర్భము సంతోషప్రదము. అందులో అంతర్ఖ్యాతమయ్యేగిజాగులాటనుక్లిష్టతను తప్పించుకొనుటకు ఈనగరము తానిరువురకుచెందదని అనిన ఇంకను తమాషాగానుండును; కాని, ఈతగవులాటే ఈయిరువాగులవారికి తమతమమాతృభాషలయెడలగల గొప్ప అభిమానమునకు తార్కాణము. ఇందువల్లగలిగే పరోక్షప్రయోజనమునుగలదు. భారతభూమిని భాషాధారకప్రాంతములక్రిందవిభజింపడము వివేకమను భావోత్పాదనయే ఆప్రయోజనము. వ్యక్తిగతముగ నేనుమాత్ర మీప్రయోజనము త్వరలో సమకూరును గాక అని ఆశింతును.

సంస్కృతము తెనుగుభాషలు వాఙ్మయములనెడలగల భక్తిప్రేమలుమాత్రమే శ్రీశాస్త్రులవారికిని వారిమిత్రులకు భక్తులకునుగల స్నేహబంధమనరాదు. నేడు వీరికి సమ

ర్పింపబడ్డ సమ్మానసంపుటిని నేను ముందుగనే విప్పిత్రిప్పడము జరిగినది. దానినిబట్టిచూడగా శ్రీ శాస్త్రులవారు అన్ని రాజకీయాభిప్రాయాలవర్గములు—అందులో రమారమి అందరు ప్రముఖనాయకులు—వీరిఅందరగౌరవమును మైత్రిని లేదా గౌరవమును పొందినారు. ఈ విధముగ తనసమకాలికులలో తానింత అల్లారుముద్దుగ నుండడమనేది సాధారణముగ లభ్యమయ్యేవిషయముగాదు. ఈమిత్రులు, భక్తులు అందరునుగూడ శ్రీశాస్త్రులుగారిని సామాన్యసంసారిగాను ప్రజాహితజీవిగాను ఈయనయందుగల గుణగణములకయి హృదయపూర్వకముగను ఉత్సాహముతోను అభినందించినారు.

సంస్కృతము తెనుగువాఙ్మయగ్రంథములను ప్రకటించుటతోనే శ్రీశాస్త్రులవారి కార్యక్రమము ముగియలేదు. వారితండ్రిసాధనకు వీరు క్రొత్తరంగులుగల్పించినారు. వీరు రెండుపత్రికలను నడపుచున్నారు—ఒకటి తెనుగులో, ఒకటి ఇంగ్లీషులో. ఇంగ్లీషుపత్రికయైన 'ఫెడరేటెడ్ ఇండియా'ను నేనెల్లప్పుడు చదువుదును. తెనుగు త్రిలిఙ్గపత్రికకూడ దీని ఆశయముతో దీనిప్రక్కనినడుచుచున్నయెడల ఈరెండుపత్రికలును వివేచనతోగూడిన పత్రికారచనకు బాగుగతోడ్పడుచున్నవనుటకు సందేహములేదు.

పత్రికయన నేటిరోజులశక్తి; వట్టిరాద్ధాంతసిద్ధాంతాలుగాని వైజ్ఞానికవిషయములుమాత్రముగాని ప్రకటించడముతో తృప్తిపడునెడల శక్తి రూపముదాల్పజాలదు. సమకాలికసంభవములనుగురించి సాంఘికరాజకీయజీవితశాఖలన్నిటికిని సంబంధించిన వ్యాఖ్యానములచేసి విషయవ్యాప్తిచేయుట అవసరము. ఈపనిని వార్తాపత్రికలు మాసపత్రికలు చేయగలవు. ఏకాలమున ఏస్వరూపమును ప్రపంచముగ్రహింపవలెనో దానిని ప్రజాభిప్రాయమేతీర్చును. సభ్యవిజ్ఞానము పోషింపదగినదేశాని రాజకీయసాంఘికసేవల అభిమానము ప్రజలభావములలో ప్రవేశించి వారిని కార్యపరులనుజేయునట్లు ప్రాధాన్యము పొందజేయుట ఆవశ్యకము.

శ్రీశాస్త్రులుగారికొసగిన సమ్మానపత్రములలో నొక్కట వారివర్ణన ఇట్లున్నది. "వీరుస్వయముగ పూర్వాచారపరాయణులేగాని ఏవిషయానికిసంబంధించియైనా రెండుపక్షాలవాదమును తమపత్రికలలో ప్రకటించుటలో వీరు సార్వజనికవాదులు." పూర్వాచారపరాయణత్వముండిన యుండుగాక! ఇరుపక్షాలవాదమును వినవలెనంతటి అసహనము విపరీతహేత్వాభాస ఏలకలుగవలెనో నాకుఅర్థముగాదు. ప్రాతకాలపుపండితులు ఇరుపక్షాలవాదమును—నిజమైనవాదమును, ఒకొకప్పుడు వాదముకొరకైనవాదమునుకూడ—వినుటగుణముగనెంచుచుండిరని నాభావము. వారికి రాద్ధాంతసిద్ధాంతాలు—ప్రాచీనకాలపుగ్రీకుపండితులకువలె—ఆనందదాయకములు. దీనివల్ల తమప్రతిభను సునిశితముగపెట్టుకొనుటయేగాక వారు శాస్త్రచర్చలనద్భుతరీతిని సూక్ష్మతరసూక్ష్మతమము చేయగలిగిరి.

ఎట్టినను ప్రాచీనఅర్వాచీనములలోగల ఉత్తమగుణమును తనలో జీర్ణింపజేసికొనుట ఎవ్వరికైననుగొప్పసాధన. అందరి అభిప్రాయాలనుబట్టిచూడగా శ్రీశాస్త్రులుగారికీసాధనగలదనడము స్పష్టమగుచున్నది. దీనికి నేను మిక్కిలి సంతసించుచున్నాను.

ముగింపున ఒక్కమాటచెప్పనిండు. శ్రీశాస్త్రులుగారు తనకాలములోనే తనప్రెస్సునకు పత్రికలకుసంబంధించిరాబోవు ఇతరమహోత్సవములజరిపి తనసంఘమునకు దేశమునకు ఇంకనుసేవచేయుదురుగాక అని కోరుచున్నాను.

పిదప కొందరుసభాసదులు శ్రీశాస్త్రిగారిని, వారి వావిళ్లప్రచురణాలయసంస్థను, త్రిలిఙ్గపత్రికను ప్రశంసించుచు ప్రసంగించిరి. అందు

## శ్రీపిఠాపురముమహారాజావారు

శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారిని గౌరవించుట మనలనుమనము గౌరవించుకొనుటే అగును. ఇంతవరకు తగురీతిని వారినిగౌరవింపకపోవుట మనలోపమే. ఇప్పుడైనా ఆలోపముతీరుట సంతోషకరమైనవిషయము. సారస్వతసేవయే వారిఆశయము. వారు సారస్వతమునకు ఇదివరకు చేసినసేవగాని ఇప్పుడుచేయుచున్నసేవగాని తెలియనివారు బహుస్వల్పసంఖ్యాకులు ఆంధ్రావనియందు ఉందురు. ఇకవీరు సంస్కృత ఆంధ్రగ్రంథముల పెక్కుడుప్రచురించియున్నారు. అందులో హెచ్చుగ తాళప్రతులుసేకరించి వానినిఉద్ధరించి తగినపండితులనియమించి ధనమునువెచ్చించి తప్పులనుపరిష్కృతంబొనర్పించి చక్కని కాగితములపై చక్కగ అక్కరములతోముద్రింపించి పఙ్క్తికి పఙ్క్తికి మధ్య తగినంతస్థలము వదలి చదువుటసుకరముచేసి ఆంధ్రులకుజ్ఞానదానముచేసియున్నారు. వీటియందు తగినలాభము రాకున్నను దీక్షతో సంస్కృత, తమిళ, ఆంధ్రకర్నాటక భాషలయందుగ్రంథముల ప్రచురించియున్నారు. ఇంకను ప్రచురించుచున్నారు. ఈవిధముగ తాము భాషాసేవ గావించుచు ధన్యులై, విద్యావంతులై గుణగ్రహణపారీణులైయుండుటగూడ మరింత స్తోత్రము చేయదగినవిషయము. వావిళ్లప్రెస్సునుగూర్చిగాని ఈసంస్థనుగూర్చిగాని తెలియని వారుగాని వారిగ్రంథముల చదువనివారుగాని ఉండరని నాఉద్దేశము. వీరుకొన్ని శృంగార గ్రంథములుప్రకటించి ప్రచురించుచుండెడివారు. కాని, కొన్ని కారణములవల్ల ప్రభుత్వము వాటిప్రచురణను నిషేధించియున్నారు. ఈసమస్యనుగూర్చి కొందరు లెజస్లేటివుకౌన్సిలులో ఆక్షేపణ తెలిపియున్నారు. భాషోద్ధారకులైన వీరికి ప్రభుత్వముగలిగించిన అపకారమును తొలగించుటకు తిరిగి వీటిని ప్రచురించుటకు అనుమతినివ్వవలెనని ప్రభుత్వముపై కొంత వత్తిడితెచ్చియున్నారు. ప్రభుత్వము సంతృప్తికరమైనసమాధానమిచ్చినను క్రియలోనిషేధమును తొలగింపలేదు. ప్రభుత్వమువారు ఇప్పటికైనను ఈవిషయమును ఆలోచించి వారీ గ్రంథములను తిరిగిప్రచురించుటకు అనుమతినివ్వకోరుచున్నాను.

వీరు గ్రంథప్రచురణమేగాక ఇతరసన్మార్గములు అవలంబించి తన్మూలమున మన ఆంధ్రదేశమునకేగాక కర్నాటకులకును తమిళులకును ఉపకారముచేయుచున్నారు. ఆంధ్రులేగాక తదితరులుగూడా ఈనాడు వీరికృషిని గుర్తించుచు వారినిగౌరవించుట ఎంతయుసమ్మతముగనున్నది. వారిపత్రికలద్వారా రాజకీయములలో వారిఅభిప్రాయములను వెల్లడించుచున్నారు. ఇట్టివారికి భగవంతుడు సర్వశ్రేయస్సులను, దీర్ఘాయురారోగ్యమును ఒసంగి చిరకాలము వారిసేవమనకులభింపచేయునని ఆశించుచున్నాను.

## సర్ : శ్రీ వేపా రామేశముపంతులుగారు

పిమ్మటపెక్కుమాటలుగాక హృదయానురక్తమైన ఒక ఆదరవాక్కుపలికినను చాలుననియు శ్రీవావిళ్ల వారిపుస్తకశాల 40 సం॥ ల క్రింద ఎస్ల్పనేడుకురాకముందునుండి ఎఱుగుదుననియు, తెలుగుకవులరచనలు నవలలు ప్రబంధములు ఏవికావలసినను వారిషాపులోనే దొరికెడివనియు, సంస్కృతగ్రంథములను తెలుగుగ్రంథలిపులలో ప్రచురించి ఎంతో మందిజిజ్ఞాసువులకు సాయపడిరనియు, శ్రీ శాస్త్రిగారు వివిధరంగములలో ప్రజ్ఞనుసంపాదించిరనియు, ఫెడరేటెడ్ ఇండియాలో రచనలు చాలగంభీరములై వివేచనాయుతములై ప్రతిభాసమన్వితములై యుండుననియు ఆ మార్గమునే ముందు ఆపత్రికవిడనాడనందున దానికేమియులోటుఉండదనియు నుడివిరి.

తెనుగువారు అరవవారునగు అఖండసంస్కృతపండితులు నాగరలిపిలో సంస్కృతమునుచదువుటలేదు. తెనుగులిపి గ్రంథలిపులలోనే వేదములు మొదలు స్తోత్రములవరకు అన్నిటినిచదువుదురు. అట్టివారికి వావిళ్లవారేర్పరచినసౌకర్యము సుఖముప్రయోజనముయొన్నరానివి.

## సర్ : అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు

సర్ : అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు శ్రీశాస్త్రిగారు తమ పుదూరుద్రావిడ వంశమునకే చెందినవారై ఇట్టిమహాసన్మానముపొందుచున్నందులకు తాము గర్వించుచున్నామనియు, శ్రీ శాస్త్రిగారితండ్రిని చిన్ననాటగోలె తామెరుగుదుమనియు, అట్టిమహాపండితుని సంప్రదాయమునే అనుసరించి శ్రీ శాస్త్రిగారు తండ్రికితగినపుత్రులనిపించిరనియు రాజాధిరాజులు పండితులన్నను గ్రంథములన్నను ఆదరమివ్వకున్నట్టి ఈ దినములలో పండితుల పోషించి గ్రంథోద్ధరణమునకు వీరుకంకణముగట్టుకొనుట సాహసకార్యమైనను అత్యంత ప్రశంసనీయమనియు శ్రీ శాస్త్రులుగారు అన్నివిధములగు రాజకీయాభిప్రాయములతోను దగ్గరసంబంధము కలిగియున్నారనిచెప్పిరి. "ఒకొక్కప్పుడతనేఅభిప్రాయపక్షమునకుచెందినవాడో చెప్పుటకష్టమగును. అయినా ఇందులో ఒకమోస్తరు లాభముకూడగలదు. అన్నిపక్షములయందు అందువల్ల అతనికి గౌరవముంటున్నది. ఇందువల్ల అతను సాహి

త్యముద్వారాచేయగలసేవ మిక్కిలి ప్రశంసనీయమగుచున్నది. అతనేదో ఒకపక్షమునకు చెందియుండినట్లయితే ఈకార్యము అంతసులభముగ చేయలేకపోయియుండును" అనిరి. స్తోత్రములను స్త్రీలు సులభముగ మననముచేయుటకు వీరు ప్రచురించిన పుస్తకము లే కారణము లనియు ధీశాలులైనకవులను పండితులను పేర్గాంచినతరువాతగాక తొలిదినములందు వీరు సాకుటయే గణనీయమనియు వచించిరి.

## కళాప్రపూర్ణ శ్రీ జనమంచి శేషాద్రిశర్మగారు

ప్రపంచోపకారకవస్తువులలోఁ బ్రధానములు పంచమహాభూతములు. అందు వాయువు జగదుపకారమునఁ బ్రప్రధానము. అట్లే మానవజీవితమున ముఖ్యతమము జ్ఞానము. దానికాధారము విద్యయేఅని ప్రాయికముగాఁ జెప్పవచ్చును దానికిమూలము పుస్తకములు. పుస్తకధనవంతుఁడు పండితుఁడు. పండితునకుఁ బుస్తంకృతియనిపేరు. ఈశబ్దము మనదేశమున వాడుకలోలేదు. "వరకాశికరాజకీయ విద్యాలయపుస్తంకృతినా సుధాకరేణ" అని ప్రయోగము ఇట్టివనేకపదములు కాశీప్రాంతముల నలవాటులోనున్నవి. అట్టిపుస్తకముల కాధారము వావిళ్ల వంశసురతరువు. ఈకల్పమహీరుహము శాఖోపశాఖావంతమై ప్రపంచము నల్లుకొన్నది. వృక్షములలోవటవృక్షము మహత్తరమనియందురు. అట్టిది వేఱొకఁడు సృష్టిలో లేదని వినఁబడియెడు. భగవంతునిరూపము దానితోఁబోల్పఁబడుటకు హేతువిదియే. దానిబీజ మత్యల్పము. ప్రళయకాలమున భగవంతుఁ డట్టిరూపముననుండు నని పెద్దలందురు. సకలప్రాణులు తనయందుండఁగా నంతయల్పరూపముననుండి సమయము రాఁగా సకలబ్రహ్మాండరూపమున నుండును. "అణోరణీయా న్మహతో మహీయాన్" అన్న శ్రుతి ఈయర్థమునే యనువదించుచున్నది. ప్రకృతము శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిసురభూరుహము బహువిధశాఖలుగలదియై మర్త్యభువనమునందంతట వ్యాపించినది. ఇంకను వ్యాపింపఁగలదు.

పండితపామరజనసాధారణముగా గ్రంథరత్నముల నీశాఖలీనుచుండును. వృక్షమునకు ఋతుభేదము వృద్ధిక్షయకారణమగుచుండును. ఈవృక్షమునకు సర్వర్తుధర్మములున్నవి. చిన్నపిల్లలకుఁ బెద్దవారికివలయుగ్రంథము లిందుఁగనఁబడును. వర్ణాశ్రమముల కనువగునవియుఁ గనఁబడును. అవియివియననేల? అన్నియు నిందుఁగలవనవచ్చును. ఆంధ్రప్రబంధములు మూలలంబడి కృమికీటకచ్ఛటాచ్ఛాదితములై కొన్ని జీర్ణించి కొన్ని జీర్ణింపనుండినవి. కొన్ని పేరులుకూడఁ దెలియకయుండినవి. వానిని వ్యయప్రయాసములకోర్చి లాభమునే పాటింపక యీయది భగవత్సేవగాభావించి పండితులఁబిలుపించి పరిశోధనములఁజక్కఁజేసి ముక్తాఫలములంబోలు సద్వర్ణములముద్రించి ప్రకటించి శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు వాసిగాంచిరి. పురాణములు నాటకములు కథలు కావ్యములు లోనగువాని నిట్లేముద్రించిరి. వైదికగ్రంథములు కూడ నిట్లే ప్రసిద్ధినొందఁజేసిరి. ముఖ్యముగాఁ దెనుఁగుదేశమున నాంధ్రదేశమునఁ గవులు వీరిమూలమునఁ బేరుగాంచిరనవచ్చును. నూతనకవు లీమహావంశ

కల్పవృక్షము నాశ్రయించి ఫలములనొందిరని, యొందఁగలరని యొందుచున్నారని మాటికి ముమ్మాటికి నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. నావంటిఅల్పమతు లీమహాకల్పవృక్షాశ్రయ మునఁ బేరుఁగాంచిరనుట యతిశయోక్తిగాదు.

సంస్కృతమున మహాభారతమును బహుదేశములనుండి పాఠభేదములం దెప్పించి చక్కఁగాసంస్కరింపజేసి,

'సంశోధ్యవర్ణ మపహ్నృత్య దురక్షరాణి, రూపం విభూష్య విమలాఖిల వాసనాభిః.' అనునట్లు మనోహరస్పష్టతర దేవనాగరాక్షరములముద్రించి ప్రకటించిరి. దానికొఱకుఁబడిన శ్రమము తలంచుకొన్న నాకే వేదనకలుగును. ఇట్లు సకలశాస్త్రపురాణేతిహాసముఁ బ్రకటించి ప్రకటించుచుఁ బ్రకటింపఁదలంచుచునున్న నీవావిళ్లవారిఋణము నాంధ్రత్రిలింగదేశ వాసులు తీర్చుకొనఁజాలరను టతిశయోక్తిగానేరదు. మఱికొంద ఱీపనికిబూనిరిగాని విగతో త్సాహులైరి. ఏయింటఁజూచినను విద్యాగంధమేమాత్రము పరిమళించినను వావిళ్లవారి గ్రంథము వెలయునని దృఢముగాఁజెప్పఁగలను. కాలమత్యల్పము. వక్తవ్యాంశములనేక ములుగలవు. మహానీయు లుపన్యసింపఁగోరుచున్నారు. కాన నేనింక విరమింపఁదలంచెదను. నేను జెప్పినవిషయములు మాఇంటిపేరు జనమంచివారుగానఁ బలికితిననిభావింపకుఁడు. సత్యము లనినమ్మవలయును. ఇట్టిభాషాసేవకులకు మ-రా-రా-శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులు గారికి భగవంతుఁడు కరుణానీరధి ఆయురారోగ్యభాగ్యములను గ్రహించి ఈభాషోపాసన పెంపొందఁజేయ వరమొసంగుఁగాతమని భావించుచున్నాను.

విద్వాన్ శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకమ్మగారు, శ్రీ శాస్త్రిగారిని ప్రశం సించుచు తెలుగుపద్యములను, వైద్యరాజ శ్రీదంటు సుబ్బావధానిగారు సంస్కృతశ్లోక ములను పఠించిరి.

### త్రిలిఙ్గరజతోత్సవము
### శ్రీతిరుమల శ్రీనివాసత్రిలింగమహావిద్యాపీఠామోదము
### కవితిలక కవితావిశారద శ్రీకాంచనపల్లి కనకాంబా

వి ర చి త ము

మ. ఒకనూఱేండ్లు త్రిలింగదేశమున కెంతో చేయువావిళ్లవా
రికి సత్కారమునేయఁ బెద్దలిటు సంప్రీతిన్ సభన్ గూడి నా
రు కదా! కెల్కరునాయకత్వమున ధీరుల్ ధీరుమన్నింప తె
క్కకువచ్చున్ గుణగౌరవంబిచట నిక్కంబయ్యె నీనాడహో. 1

శా. ఏరాజన్యులుప్రోదిచేసిరని వీరీకృత్యముల్ సేయుచు
న్నా ? రవ్వారికిగ్రంథరాజములపైనన్ జూపులే దట్టిచో

సారా! వావిళ వేంకటేశ్వరుఁడు ధైర్యంబూని సద్గ్రంథముల్
ధారాళంబుగ నచ్చుగూర్చు తనసద్వంశస్వధర్మంబుగన్. 2

ఉ. అట్టులఁగాగితాల గలయందము చెందము విందుగూర్పలో
నెట్టులనుండునద్ది కవియే యెఱుఁగం దదె మేలటందు రె
ప్పట్టుల నొండ్లొకళ్లయవి పాడుదురెంతయు మెచ్చుకొంచు జ
ప్పట్టులగొట్టసభ్యులు ప్రభావకవిత్వమహత్వ మల్పమే. 3

క. సీమంబించుక లేని సి,సీమాలకుపోను *మానినీదూషణకుగ్
గ్రామీణవాక్కులకు సం,గ్రామాలకు నకట పత్రికలుపుట్టెనొకో. 4

గీ. కొండచిలువగాక కోడెత్రాచునుగాక, యాదిశేషు నటుసహస్రముఖము
లలర మాత్రిలింగ యాంధ్రరంగమునందు, నాదుకొనును ధర్మమన్నిగతుల. 5

* విడియాకులచట్టములు మొదలగునవి మానముగల మానినులకు దూషణము, అట్టివానితోఁ బత్రికలు నింపుదురనుట.

## శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహావిద్యాపీఠస్యసంతోషః,

పండితరాజ శ్రీదంటు సుబ్బావధానివిరచితః.

శ్లో. రామస్వామిసుతః ప్రాజ్ఞో వావిళ్లాబ్ధిసుధాకరః,
త్రిలింగపత్రికాధీశో, వేంకటేశః ప్రపూజ్యతే.
సారస్వతసపర్యాయాం, యావజ్జీవంధృతవ్రతః,
స్వధర్మనిరతశ్శిష్ట, శ్శిష్టధర్మప్రచారకః.
శాంతశూరః ప్రసన్నాత్మా, దేశభాషాప్రవర్తకః,
ఆంధ్రాంగ్లామరభాషాసు, శిష్టభావప్రబోధకః.
ఖపర్దీతిలకశ్చైవ, మూంజీఖేలాకరస్తథా,
వీరశావార్కరశ్చైతే, మరాటా దేశనాయకాః.
తిలకస్యబహిఃప్రాణ తస్య సందేశహారక,
ఖేలాకర నృచిత్తేషు గద్య గ్రథనశేఖర!
స్వాగతం నారసింహార్య! చింతామణిరహోభవాగ్,
మరాఠా కేసరఖ్యాత! దేశభక్తావతంసక!
త్రిలింగాఖ్యే హ్యయాం దేశః, పత్రికాచప్రజా అపి!
ద్రావిడా అపితేహ్యంధ్రాః, యేధీరా స్సదసిస్థితాః.
శ్రీశైల శ్చైవశైలశ్చ, విద్యారణ్యమహాయశాః,
మల్లినాథోజగన్నాథ శ్చాన్నంభట్టాదికా బుధాః.
త్రైలింగ్యాః ప్రథితాస్సార్వకాలీనా స్సర్వసమ్మతాః,
వ్యాఖ్యాతృయే ఛాంగవిద్యాసు సాహిత్యేచ కళాస్వపి.

త్రిలింగాః కీర్తితాలోకే, హ్యాదునాకపి పురాయథా,
ఇయంచ పత్రికాతేషాం త్రిలింగా ప్రాధభాషణే.
జీయాత్సహస్రవర్షాణి, ధర్మమార్గానుసారతః,
నిరాతంక ప్రచారస్యా ద్వేంకటేశః కలౌయుగే.

## శ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు

శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు శ్రీవావిళ్లవారు చెన్నపురీవిలాసము మొదలు గాగల గ్రంథప్రచురణకు కారకులై దాదాపు నూరుసంవత్సరములుగ భాషాసేవగావించి భాషోద్ధారకులైరి

ఈసభ సమావేశమగుట త్రిలిఙ్గరజతోత్సవమునకు గదా! త్రిలిఙ్గ, తెలుగు, ఆంధ్ర అన్నవి ఒకటే. తెలుగువారమను పెద్దలందరును అభిమానము చూపినసమయము ఇది మంచిసమయము. సమావేశమయినస్థలము చెన్నపట్టణము తెలుగువాడయిన చెన్నప్ప పేరగట్టినపట్టణము. ఈపట్టణము ఆంధ్రోత్పన్నము. ఈపట్టణమునుగురించి శ్రీమతుకుపల్లి నరసింహశాస్త్రులుగారు 1860 సం॥ ప్రాంతములో రచించిన చెన్నపురీవిలాసమున పట్టణస్థితి అంతయు వర్ణింపబడినది. ఇక్కడ ఆంధ్రులెందరో నివసించిరి. వారిలో శ్రీరామానాయనిం గారు తండయార్పేటలో గొప్పపాఠశాలయు సత్రమునుస్థాపించిరి. ఆపాఠశాలలో మొదట విద్యసంపాదించి కొంతకాలమునకు ఆపాఠశాలలోనే పరీక్షాధికారులయి గ్రంథప్రకటన చేయుచు రెండుముద్రణాలయములకు అధికారి అయి గొప్పకీర్తిని సంపాదించినవారు శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులుగారు. వారు చెన్నపురీవిలాసమును మొదట ప్రకటించిన వారు. మన శ్రీవేంకటేశ్వరశాస్త్రులవారు ఇప్పుడు మరల దానిని ముద్రించిరి. శ్రీరామ స్వామిశాస్త్రులవారు పూనిన సంస్కృతాంధ్రగ్రంథప్రకటనమును శ్రీవేంకటేశ్వరశాస్త్రుల వారు దీక్షతో కొనసాగించుచున్నారు. ఇప్పటికి రమారమి ఒకశతాబ్దినుండి గ్రంథప్రకటన గావించుచున్నవారు మన వావిళ్లవారు. శ్రీరామస్వామిశాస్త్రులవారికి అప్పటిజమీందారు లును ప్రభువులును గొప్పసాహాయ్యముచేయుచుండువారు. మన వేంకటేశ్వరశాస్త్రులవారి కిని ఇప్పటి మహారాజులు కొంతతోడ్పడుట కలదు. కాని, స్వసమర్థతచేతనే గ్రంథప్రకటన మును పత్రికాప్రకటనమునుచేయుచు భాషోద్ధారకప్రసిద్ధినిసంపాదించిన మన వేంకటేశ్వర శాస్త్రులవారి కితోధికాయురారోగ్యైశ్వర్యములు గలుగుగాక అనిరి.

శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులవారికాలమున ప్రతిష్ఠితమయిన పాఠశాలయును సత్రమును కారణాంతరములవలన నిలిచిపోయినవి. ఆసంస్థకు ద్రవ్యము దగ్గరగా లక్ష రూపాయిలున్నవట! దానిని సమర్థులయిన మనపెద్దలు పునరుద్ధారముచేయ ప్రయత్నింప గోరుచున్నాము. అప్పుడు ఒక గొప్ప ఆంధ్రసంస్థను ఉద్ధరించినవారగుదురు. ఆసంస్థ చెన్నపురి వారికందరకు ఉపయోగించును అని చెప్పిరి.

# శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారి

## ప్రత్యుత్తరము

అందుమీదట శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారు అందరకును కృతజ్ఞతను తెలియ బరచుచు నీక్రిందియుపన్యాసము గావించిరి.

**శ్రీ నృసింహచింతామణి కేల్కారుమహాశయులకును సభ్యమహాజనులకును నమస్కారములు —**

నేడు మీరందరును నాయెడచూపిన ఆదరానురాగములు నాకు లజ్జనుగలిగించు చున్నవి. ఏదిచేయను నాకుతోచకున్నది. నాజీవితములోని ఉత్తమవిశేషములలోనొకటిగా ఈఉత్సవము నాజ్ఞప్తిసీమను పవిత్రస్థానము పొందియుండును

మహాజనులారా! మీరు నాకుగావించిన ఈగొప్పగౌరవమునకు తగినరీతిని నా కృతజ్ఞత వ్యక్తీకరింపజాలను. శ్రీ కేల్కారుమహాశయా! దయాపూర్వకముగ మీరునన్ను గూర్చినుడివిన ప్రశంసావాక్యములకును ఆశీర్వాదములకును నేను అత్యంతకృతజ్ఞుడను. స్వల్పముగా నేను పడినపాటును, మాతండ్రిగారు రమారమి శతాబ్దముక్రిందటస్థాపించిన వావిళ్లముద్రాలయము సల్పియున్న కార్యసాధనమును మీరీవిధముగ సత్కరించుటచూడ నాహృదయము తొట్రిల్లుచున్నది. ఇటీవల ఈ రాష్ట్రమందును ఇతరస్థలములఅందునుజరిగిన అనేకసభలలో నాకులభించినగౌరవము నేటిసత్కారముమూలముగ సంపూర్ణమగుచున్నది.

పూజ్యులైన మాతండ్రిగారుగావించినసేవనుగూర్చి మీరు ప్రసంగించియున్నారు. ఆయన నిజమైనమార్గదర్శకుడు. ఆయనపూనినయత్నము మహాఫలపూరితమైనది. భారతీయ సభ్యతాసంస్కారములు శాశ్వతస్థానమునుపొందుటకు మనప్రాచీనవాఙ్మయముద్రణము అత్యవసరమని గుర్తింపగలసూక్ష్మదృష్టి ఆయనకుఉండెను. ఏకాగ్రచిత్తులై ఆయన ఆకార్యమునుపూనిరి. ధనసంబంధమైనవిషయములపాటింపక ఆయన తనపనిని విశేషమైనపట్టుదలతో సాగించుచు తుదకు అనల్పకార్యసిద్ధినిపొందిరి వారిమూలసూత్రములనే ఆధారముగచేసు కొని, వారికార్యమును కొనసాగించుప్రయత్నము నేపూని, మనదేశీయవాఙ్మయములోని ఉత్తమగ్రంథములు ప్రజాసామాన్యమునకు అందుబాటులోనుండునట్లు నేను అచ్చొత్తించు చున్నాను.

స్వీయపూర్వార్జితవిధానమును విసర్జించి పరమార్గావలంబనముచేయుజాతి నశించి తీరునని నేను మీకుచెప్పనవసరములేదు. స్వకీయవాఙ్మయసంస్కారప్రచోదితమైన సంప్ర

దాయములయెడ శ్రద్ధవహింపకుండిన ఏజాతియు ఆత్మగౌరవమును నిలుపుకొనజాలదు. హిందూదేశముయొక్క జ్ఞానవిజ్ఞానసంప్రదాయములు భాగ్యవశమున ప్రపంచములోని ఉత్తమోత్తమములైనవానిలో పరిగణింపవచ్చును. అట్టిభాగ్యమునుపేక్షించి ఈదేశము జీవింపజాలదు. నేటిప్రపంచము మహాసంక్షోభముపడుచున్నది. అట్టిస్థితిలో ప్రతిభారతీయుని కిని తనదేశముయొక్క ప్రాచీనవిద్యాదీపమును ప్రకాశవంతముగావించుటయు, తనపూర్వుల సంప్రదాయసంస్కారములను సంపూర్ణముగ అవగాహనముచేసుకొనుటయు, తాను జీవిత సమస్తమునను భారతీయవ్యక్తిత్వమును నిల్పుకొనుటయు, ప్రస్ఫుటమైనవిధ్యుక్తధర్మమై యున్నది. అదియే ప్రతిభారతీయునియుద్దేశమునై యుండవలయును.

హిందూమతసంస్కారములకును, ఇతరభారతీయమతసంస్కారములకును సంబంధించినగ్రంథములు వందలకొలది శ్రుతులు, స్మృతులు, పురాణములు, కావ్యములు, నాటకములు, ఇతిహాసములు, నవలలు మొదలుగాగలగ్రంథములును, వైద్యజ్యోతిషాదిశాస్త్రగ్రంథములును మాప్రచురణాలయమున ప్రచురింపబడెను. ఇంకను అనేకగ్రంథములు అచ్చుపడని నిక్షేపములున్నవి. వానినిపరిశీలించి మనము ఉపయోగించుకొనవలసియున్నది ఇప్పటికంటె ప్రోత్సాహముకొంతకలిగినయెడ నేను వానినిగూడ ముద్రింపగలను. అయితే అట్టివాఙ్మయవ్యాప్తికి నేటివాతావరణము అనుకూలముగలేదు. ఎట్టిఅమూల్యములైనను, భారతీయగ్రంథములు అందుముఖ్యముగ ప్రాచీనరచయితలగ్రంథములు—పాశ్చాత్యప్రచురణాలయముల ప్రచురణములకు—అవియెట్టిసామాన్యగ్రంథములైనను సరే—చెల్లుబడిని బట్టి సరిరాకున్నవి. మనస్త్రీలుసైతము మనదేశీయసంప్రదాయములయెడను, వాఙ్మయము నెడను, మతమునెడను, ఉపేక్షవహించియున్నట్లు నాకుతోచుచున్నది. రామాయణము, మహాభారతము, కాళిదాసాది రచయితలగ్రంథములును, మనసనాతనమతసంస్కారసారములకు మూలస్థానములు. అవిఅపారములు, అగాధములు. వానినుండియే మనము ఆసారమునుగ్రహింపవలయును. కాని, ఏతద్గ్రంథములలోనివిషయముల నెంతమందిభారతీయనారీమణులు తమబిడ్డలకు నేడుచెప్పగలరో నాకుసందేహముగనున్నది. అట్టివానికి బదులుగ మనశిశువులు ఆంగ్లబాలగీతముల నేర్పుచుందురు. ఈశిశువులు బాల్యమువదలి యౌవనులగుసరికి మనోధైర్యముగాని కార్యదీక్షగాని విశ్వాసముగానిలేని అమాయకులుగ తయారగుచున్నారు. దీనికంతకును కారణము ఆధునికగ్రంథములకును అన్యదేశీయరచనలకును తగినభాషాంతరీకరణముల లేమియే అని నాకుతెలుసును. అందుచే మనభాషనువిజ్ఞానమును అభివృద్ధిలోనికితేవలయునన్న ఇతరభాషలలో ప్రచురింపబడెడుముఖ్యగ్రంథములన్నియు తెనుగులోనికి భాషాంతరీకరణము చేయకతప్పదు. మాసంస్థ స్వతంత్రగ్రంథములనేకాక ఈరీతిభాషాంతరీకరణములనుగూడ ప్రచురింపదలచియున్నది. ఇంకను

అన్యశాస్త్రభాషాస్వతంత్రగ్రంథములుకూడ వెంటనే తెనుగులోనికివచ్చినకాని హైందవ విజ్ఞానాధిక్యము ప్రత్యేకత నాగరికత తెలిసికొనజాలము.

శ్రీకేల్కారుమహాశయా! స్వవిషయమునుగూర్చి రెండుమాటలు చెప్పుటకు అనుజ్ఞ వేడుచున్నాను. నేనొనర్చిన అత్యల్పమైనప్రజాసేవనుగూర్చి తమరు ఉదారహృదయముతో ముచ్చటించియున్నారు. కీర్తిశేషులైన శ్రీ లోకమాన్యబాలగంగాధరతిలకుమహాశయులు నాకు యావజ్జీవము పూజ్యులగుటయేగాక వారికిస్నేహపాత్రుడనగు మహాభాగ్యముకూడ నాకు కొంతలభ్చినది. వారివలె స్వాతంత్ర్య సమత్వసహానములతోకూడిన వాతావరణము నందు జాతీయజీవనవిధానమునకనువగు స్వరాజ్యభవన నిర్మాణమునకు ప్రతిభారతీయుడును నిరంతరకృషిసలుపవలెననునమ్మకముగలవాడను. శ్రీమతి డాక్టరు ఆనిబిసెంటుగారి Home Rule ప్రచారముతోనాకు సంబంధముండెను. చెన్నపురికార్మికసంఘములన్న నాకుచాల అభిమానము. ఇక్కడ కార్మికసంఘములకు సరియైనకట్టుబాట్లుగాని బలముగానిలేకపోవుట కడువిచారకరము. దీనికికారణము కార్మికులకష్టనిష్ఠురములనుగూర్చి వారుపడుఅగచాట్లను గూర్చి ప్రజాసామాన్యమునందు తగుప్రచారములేకపోవుటయే. ఏనాటికైనను మనజాతీయ వాదమునకు కావలసినబలము ఈకార్మికులవలననేగలుగునని నాదృఢవిశ్వాసము అందుచే దేశాభిమానులగువారందరును ఈకార్మికసంస్థలఅభివృద్ధికి పాటుపడవలసియుండును.

సర్: .సీ. వై. చింతామణి, శ్రీకస్తూరిరంగఅయ్యంగారు, శ్రీ ఏ. రంగస్వామిఅయ్యంగారు, శ్రీ కే. వ్యాసరావుమున్నగుపత్రికారచయితలతో స్నేహభాగ్యముకూడ నాకు లభించియుండెను. దేశబంధు శ్రీచిత్తరంజనదాసు, పండిత శ్రీమోతీలాలుగార్లు స్థాపించిన స్వరాజ్యపార్టీతో కొంతకాలము నాకుసంబంధముండెను. ఆపార్టీ వెనుకపడుటయు చివరకు అంతరించుటయు ఇటీవలిభారతీయప్రజాజీవనములోని శోచనీయవిషయములలో నొకటిగ పరిణమించెను. నాజీవితమున నేనుపొందినఉపకారములలో నొకటి నేనుప్రత్యేకించి వివరింప వలసియున్నది. కీర్తిశేషులైన శ్రీమాన్ యస్. శ్రీనివాసఅయ్యంగారియెడ నాకుగలగాఢమైనగౌరవము, ప్రేమ, కృతజ్ఞత నేను మాటలతోచెప్పజాలను. ఆయన సర్వవిషయముల లోను నాకువేరుచేయనిసుహృదుడు. ఆయన నాయెడచూపిన నిష్కపటనిరంతరవాత్సల్యము నాకు కడుమేలుచేసియుండెను. ఆయన భారతీయసంస్కారమును, జాతీయగౌరవోద్రేకమును, దేశస్వాతంత్ర్య ప్రజాసమ్మేళన సూత్రములును, నిష్కపటబుద్ధివికాసమును, సమర్థించినిల్పినమహనీయుడు. సర్వవిధముల నేనుగాని ఇతరభారతీయులుగాని ఆయనను మరువనువీలుగాదు. ప్రస్తుతము కాంగ్రెస్సునాయకులతోను వారిఅభిప్రాయములతోను నేను ఏకీభవింపలేకపోయినను, తప్పనిసరియైనప్పుడు నాఅభిప్రాయములను ప్రజలకువిస్పష్టపరుప

తలసినప్పుడు ఒకటిరెండుసార్లు వార్తాపత్రికలలో వ్రాయుటకంటె, వారినివిమర్శించుటకుగాని వారికివ్యతిరేకముగ పనిచేయుటకుగాని అవసరమెన్నడును నాకుగలుగలేదు. అవిమర్శలు కూడ నేటికిని నాకుఅత్యంతగౌరవార్హులు మిత్రులునైన శ్రీటంగుటూరు ప్రకాశముగారి వంటినాయకులు సహృదయముతో అర్థముచేసికొనిరనిచెప్పుటకు సంతసించుచున్నాను.

శ్రీగాంధీమహాత్ములన్న మిక్కుటమగుగౌరవములేనిభారతీయుడులేడు. అయినను వారిరాజకీయమార్గమును అనుసరింపజాలనిఅనేకులలో నేనొకడను. మహాత్ముని రాజనీతి దుర్గ్రాహ్యము, వారితర్కము దురవగాహము. అందుచేత వారిని అనుసరింపవలెనన్న వారియందు అపారమైనవిశ్వాసము వారిన్యాయమునందు తీర్పునందు అంతులేనినమ్మకము ఉండితీరవలెను. సామాన్యులగు తనఅనుచరులకు గోచరించునట్లు ఆయనప్రవర్తింపరు. తమ కార్యకలాపమును వారిబుద్ధికివిశదమగునట్లు విప్పిచెప్పరు. వారిప్రతికార్యమును శాసించునది వారిఅంతరాత్మ. ఆయంతరాత్మయొక్క నిశ్చితమునుగాని సమర్థతనుగాని నిర్ణయించుటకు పరులకు అధికారములేదు. వారివలెనే మనకును విశ్వాసముండినగాని వీలులేదు. శ్రీలోకమాన్యుని ప్రణాళికలుఏవియు మానవతర్కమునకు మించిపోలేదు. రాజకీయములు భౌతికసంబంధములగుట ఆపద్ధతులలోనే అవియుండవలెనని వారిఅభిప్రాయము. అట్లుండుటయే మానవకళ్యాణము. ఐహికములలో ఆధ్యాత్మికజనితములగు రాజనీతులనవలంబింపమనుట మనలనొకవిధముగ బలవంతపెట్టిబాధించుటయే.

ఈవిషయమింత చర్చించుటకు శ్రీమహాత్మునిగాని వారి అనుచరులనుగాని విమర్శించుటకు కాదుగాని నేనువారి రాజకీయమార్గావలంబకుడను గాకపోవుటకు నాకుగల ఇబ్బందులను మనవిచేయుటకే. అదిగాక సాంఘికసమస్యలేవియు—నిమ్నజాతులసమస్యగాని, వివాహసమస్యలుగాని—మతసంబంధమైనవిగాని చట్టరూపమున అమలులోనికిదెచ్చి ప్రజలను బలవంతపరచుట మంచిదిగాదని నాఅభిప్రాయము. ఆకారణముననే హిందీకూడ పాఠశాలలో ప్రవేశపెట్టి విద్యార్థులకు బలవంతముగనేర్పరాదు. హిందీకాని ఆంగ్లముకాని మన మాతృభాషకానికారణమున ఐచ్ఛికముగనేఉండవలెకాని నిర్బంధములుగాకూడదు. ప్రతి భారతీయునకును హిందీనేర్చితీరవలసిన సమయమువచ్చినది. దానివలన మనకు మిక్కుటమగు ప్రయోజనముకలదు. ఒకకార్యదీక్షతో ఒకఆదర్శముతో తమపిల్లలకు విద్యగరపు తలితండ్రులకీవిషయముతెలిపినచాలును. బలవంతముగహిందీని పిల్లలనోటనెక్కించుటకంటె అందుకుతగిన వాతావరణమునేర్పరచి ప్రచారముసాగించినచో ఎక్కువమంది ఎక్కువ ఉత్సాహముతో హిందీభాషనవలంబింతురని నానమ్మకము. ఇట్టిఅభిప్రాయములనే నాత్రివేణిలోను, ఫెడరేటెడ్ ఇండియాలోను తరుచువెలిబుచ్చుచుండెడివాడను. మహాత్మునిఆదర్శములకును

కార్యప్రణాళికలకును వాక్సహాయముమాత్రముచేయు మహాత్మునిఅనుచరులుకొందరు ఎట్టి విమర్శలను అడ్డంకులను సహింపజాలకుండిరి. కాని, అట్టివారికి నావ్రాత లెంతకష్టముగ నున్నను ఈపత్రికానిర్వహణమునందు నాయనస్వాతీచూపినమార్గమునే అవలంబించు చుంటిని. ఏనాడు మనఅభిప్రాయములనన్నిటిని ఒక్కమూసలోపోసినట్లు తయారుచేయు దురో ఆనాటినుండి మనఅభివృద్ధినశించునని నానమ్మకము. అదిగాక పత్రికానిర్వహణము నందు పక్షనిర్మాతల నాయకులమూర్ఖవాదములకు లోబడకుండ ఆత్మగౌరవము స్వాతంత్ర్యము నిలుపవలసినబాధ్యత మనకున్నదను మతముగలవాడను. తమవంటిమిత్రులసహాయము పోషణ ఆశీర్వచనములు ఉన్నచో త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాపత్రికలు మునుపటి వలెనే ఇకముందుకూడ అభివృద్ధికరము దేశోపయోగము అగుకార్యములను నిర్వహింప గలవు.

శ్రీకేల్కారుమహాశయా! ఈసన్మానసందర్భమున తమరాక తమరాడినప్రశంసా వాక్యములు నాకార్యదీక్షను ద్విగుణీకృతమొనర్చుచున్నవి. మహాజనులారా! శ్రీకేల్కారు మహాశయులు ఈఉత్సవమునందుపాల్గొనుట నాకమితానందముగనున్నదని వేరేచెప్పనవసరములేదు. నాకుపూర్వముగురువులును కీర్తిశేషులునైన శ్రీలోకమాన్యతిలకుగారి ప్రథమ శిష్యులు శ్రీకేల్కారుగారు విశేషించి గొప్పపత్రికారచయితలు; దేశమునకనేకరీతుల అనేక ఉద్యమములవర్ణింపనలవికాని సేవనొనర్చినవారు. పత్రికారచయితగను గ్రంథకర్తగను జాతీయవిజ్ఞానమును తేజోమయముగచేసినవారు.

మహారాష్ట్రదేశము ముఖ్యముగ వారికీవిషయములో కృతజ్ఞతచూపుచున్నది. దేశభక్తి, న్యాయోత్కృష్టత, శ్రీలోకమాన్యుని ఆదర్శములు. అందులకే ఆయనజీవితమును ధారపోసెను. ఈఆదర్శములకే వీరును ఇన్నిసంవత్సరములు నిరభ్యంతరముగ నిరంతరాయమానముగ కృషిసల్పుచున్నారు. మహారాష్ట్రసారస్వతజాతీయజీవనమున మహోన్నతులుగ శ్రీ కేల్కారుగారు గౌరవింపబడుచున్నారు. అన్నిటినుండియు విరమించియు ఈవయసున ఇచ్చటకు దయచేసి నన్నాశీర్వదించి నాయెడలచూపినఆదరమునకు గౌరవమునకు వారికి నేనుకృతజ్ఞతావందనము లర్పించుచున్నాను.

మహాశయులారా! నామిత్రులు ప్రొఫసరు సీ. యస్. శ్రీనివాసాచారిగారు, శ్రీయం. శేషాచలపతిగారు ఈసభజయప్రదమగుటకు అనేకవిధముల సహాయపడిరి. అన్ని పనుల చక్కగ నిర్వహించుటయేగాక మిత్రులు అనేకులసందర్శించి వారిసానుభూతిని పూర్తిగసంపాదించి ఈరజతోత్సవసభ సంపుటప్రచురణములకై ఆరుమాసములకాలము

పాటుబడిన శ్రీపీ. యస్. ఆర్. ఆంజనేయులుగారి మేలును యెన్నడును మరవజాలను. ఆశీర్వాదములనంపిన శ్రీజగద్గురువులకును సన్మానఅభినందనపత్రముల చదివినవారికిని అనేక సందేశములను వ్యాసములనంపినవారికిని నావందనములర్పించుచున్నాను ఈసభాకార్యక్రమమునపాల్గొన్న పెద్దలు శ్రీపిఠాపురముమహారాజాగారు, సర్ : వేపారామేశముగారు, సర్ : అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు, హిందూపత్రికాసంపాదకులు శ్రీకే. వీ. విశ్వనాథ అయ్యరుగారు, శ్రీ ఈ వినాయకరావుగారు, కళాప్రపూర్ణ శ్రీశేషాద్రిశర్మగారు, శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, శ్రీయం. రామానుజరావునాయుడుగారు, కవిరాజు దంటు సుబ్బావధానిగారు, శ్రీ శిం. రామలింగశాస్త్రిగారు, విద్వాన్ శ్రీకనకమ్మగారు, .శ్రీమతి బెంగళూరు నాగరత్నముగారు నన్నుగూర్చి నాసంస్థనుగూర్చి చెప్పిన ప్రశంసావాక్యములకు కృతజ్ఞుడను. వావిళ్లముద్రణాలయము త్రిలిఙ్గపత్రిక నాజీవితమునెల్లప్పుడును ప్రియభారతదేశమునకే వినియోగమగునని మనవిచేయుచు తరమందరు నాకునేడుచేసిన అపూర్వసత్కారణమునకు వందనములర్పించుచు విరమించుచున్నాను.

సుప్రసిద్ధన్యాయవాది శ్రీ మైదవోలు శేషాచలపతి, యం. ఏ., బి. ఎల్., గారి అభినందనములతో మంగళముగసభముగిసెను.

రాత్రి త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున 'ఉడ్‌లాన్డు'లో శ్రీశాస్త్రిగారికి విందు జరుపబడెను. శ్రీకేల్కరు, పురప్రముఖులు అనేకులు, ఈవిందునపాల్గొనిరి.

---

## త్రిలిఙ్గరజతోత్సవమునుగూర్చి

# పత్రికల అభిప్రాయములు

### ఆంధ్ర ప్రజ.

శ్రీవావిళ్ల వారి త్రిలిఙ్గరజతోత్సవసంచిక మాకార్యాలయము నలంకరించినది. త్రిలిఙ్గ రజతోత్సవము సుప్రసిద్ధదేశభక్తులు, శ్రీఎన్. సి. కేల్కర్, బి ఎ, ఎల్. ఎల్. బి,గారి అధ్యక్షతను తే 14-8-41దీని మద్రాసునందు గోఖలేహాలులో జరుపబడెను. భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి ఈరజతోత్సవసందర్భమున అఖండపౌరసన్మానము జరుపబడి రజతపేటికలో గౌరవచిహ్నసంపుటము సమర్పింపబడెను. మహారాజులు, జమీందారులు, రావుబహద్దూరులు, దివాన్‌బహద్దూరులు, సర్‌లూ, కవులు, నాయకులు, రచయితలు మొదలగు అనేకమంది ప్రముఖగణం పెక్కుమంది స్త్రీలూ ఈసభకు విచ్చేసిరి. సభ జయప్రదముగ జరిగెను ఈరజతోత్సవసందర్భమున ఈసంచికను వెలువడజేసిరి ఇందు రజతోత్సవసభా వృత్తాంతములు, సందేశములు, సన్మానపత్రములు, అధ్యక్షోపన్యాసము, రజతోత్సవసభ కమిటీనివేదిక, శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి ఉపన్యాసము, ఇతరమహనీయుల ఉపన్యాసములు, వివిధవ్యాసములు, ఛాయాపటములు మొదలయినవి అనేకరకములు గలవు ఈసంచిక 62 పేజీలుగలిగి ఆంధ్రులకెంతో ఉపయుక్తమగురీతిని ప్రచురింపబడినది. శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారికి భగవంతుడు చిరాయువొసంగుగాక! త్రిలిఙ్గ చిరకాలము వర్ధిల్లుగాక!

### మాతృ సేవ.

1941 సం॥ము ఆగస్టు తే14-వ దీని మదరాసు గోఖలేహాలులో శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులువారిని గౌరవించుటకుగాను సభజరిగినది. ఒక్కఆంధ్రదేశములోని సుప్రసిద్ధులైన వ్యక్తులేకాక యావత్తుభారతదేశమునుండీ ఎందరోనాయకులు శ్రీశాస్త్రులుగారుచేసిన భాషాసేవనుపొగడుచు సందేశములు పంపించినారు. దాదాపు ఒకశతాబ్దకాలమునుండి వావిళ్ల వంశస్థులు ఆంధ్రభాషాసేవనుచేస్తున్నారు. మారుమూలలలోపడిన ఎన్నో మహత్తరములైన గ్రంథములను వావిళ్లవారు అచ్చొత్తించి భాషాసేవనుచేశారు. పత్రికారచనలోను గ్రంథప్రచురణలోను వావిళ్లవారు ద్రవ్యసంపాదనా యుద్దేశమునే పెట్టుకొనక ఆంధ్రభాషాసేవయే తమఆదర్శముగా పెట్టుకున్న మహనీయులు. వావిళ్లవారు ఈయుద్యమమునకు ఊత నియ్యకపోయినయెడల ఎన్నో సంస్కృతాంధ్రగ్రంథములు మూలపడిపోవుననుటలో ఆశ్చర్యములేదు. శ్రీశాస్త్రులుగారికి భగవంతుడు దీర్ఘాయురారోగ్యముల నొసగి భాషాసేవ చేయుటకు ఇంకను ఎక్కువప్రోత్సాహమును కలుగజేయుగాక అని ప్రార్థించుచున్నాము

## గోలకొండపత్రిక.

ఆంధ్రమునభ్యసించినవారిలో "త్రిలిఙ్గ" పత్రికనుగాని తదధిపతులనుగాని యెరుగని వారుండరనుట అతిశయోక్తికాదు. ఆంధ్రముఖ్యులు, సుప్రసిద్ధపండితులును, భాషోద్ధారకులును, త్రిలిఙ్గపత్రికాసంస్థాపకులు నగు కీ॥ శే॥ శ్రీవావిళ్లరామస్వామిశాస్త్రిగారు తమయసమానభాషాభిమానమును వ్యక్తపరచుటకై తమముద్రణాలయముద్వారా సంస్కృతాంధ్ర భాషలకుచేసినసేవ నిరుపమానము. అట్టిభాషాసేవతోపాటు ప్రజాసేవకూడ చేయదలంచి త్రిలిఙ్గపత్రికను తత్సాధనముగ నుపయోగించినారు. శ్రీరామస్వామిశాస్త్రిగారిఅనంతరము వారిపుత్రులగు శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు ఈరెండుసాధనములను చేబట్టి తమతండ్రిగారి సేవకు తీసిపోనట్టివిధమున సేవచేసినారు. అట్టిత్రిలిఙ్గపత్రికకు ౧౯౪౧ సంవత్సరము. ఆగస్టు తే ౧౪ దీన త్రిలిఙ్గాభిమానులును, శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారి మిత్రబృందమునుగలిసి రజతోత్సవముజరిపినారు. దానిరజతోత్సవసంచిక మాకార్యాలయమునకు చేరినది.

ఇందు పలువురుప్రముఖులచే రజతోత్సవసందర్భమున పంపబడినసందేశములు, ఆశీస్సులు, అభినందనములునుగలవు. ఇందు పలువురుపండితులచే వ్రాయబడిన, భాషా, సాహిత్య, విజ్ఞానాదివిషయములకు సంబంధించినవ్యాసములుగలవు వావిళ్లముద్రణాలయమునున్నగు వానిచిత్తరువులిందుగలవు. దేశీయవార్తలు, కవితావిషయములునుగలవు ఇది హృదయామోదము గూర్పగలిగియున్నది శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు త్రిలిఙ్గపత్రికద్వారా చేసినదేశసేవనుగమనించి అభిమానులు వారికిని త్రిలిఙ్గకునుచేసిన ఈరజతోత్సవరూపగౌరవమెంతయు ప్రశంసాపాత్రమైయున్నది ఈవిషయమున శ్రీశాస్త్రిగారికి మాహార్దికాభినందనము లర్పించుచున్నాము. ఈపత్రికామణి ఇట్లేముమ్ముందు స్వర్ణాద్యుత్సవములగాంచి వర్ధిల్లుగాకఅని కోరుచున్నాము.

## రెడ్డిరాణి

చెన్నపురి తండయార్పేటనుండి భాషోద్ధారక శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారి సంపాదకత్వమున వారపత్రికగ వెలువడుచున్న 'త్రిలిఙ్గ' పత్రికయొక్క రజతోత్సవము తే 14-8-1941 దీని మదరాసు నందలి గోఖలేహాలునందు పూనావాస్తవ్యులును, మహారాష్ట్రా, కేసరిపత్రికలసంపాదకులును అగు శ్రీ నృసింహచింతామణి కేల్కారు, బి ఏ., ఎల్. ఎల్. బి, గారి అధ్యక్షతను జరుపబడినది. మదరాసునందలి ప్రముఖులనేకులు సభకు విచ్చేసిరి. పండితులు, మిత్రులు అనేకులు శుభసందేశములను, ఆశీస్సులను బంపిరి. ఈ సమయమునవే శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి అఖండపౌరసన్మానము జరిగినది. వారి జనకులు శ్రీరామస్వామిశాస్త్రిగారు తెలుగులిపిలో సంస్కృతాంధ్రగ్రంథము లనేకములు ప్రకటించి భాషాసేవయొనరించినారు. శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారును జనకునిమార్గము నవలంబించి గ్రంథప్రచురణ మొనరించుటయేగాక తెలుగున 'త్రిలిఙ్గ' పత్రికను; ఆంగ్లమున "ఫెడరేటెడ్ ఇండియా" అను పత్రికను; అరవమున "బాలవినోదిని" అనుపత్రికను సక్రమముగ

వెల్లడించుచు అధికముగ భాషాసేవ, ప్రజాసేవగావించుచున్నారు. వీరు అనేకసంస్థలలో సభ్యులుగనుండి ప్రజలకు మేలొనరించుచున్నారు. అనేకులకు దానధర్మము లొసగుచు సహాయపడుచున్నారు. వీరి ముద్రణాలయమున ఉత్కృష్టగ్రంథముద్రణము హెచ్చుగ సాగించుచున్నారు. వీరి పేరు ప్రతిష్టలు రాజధానియంతటను విశేషించి ఆంధ్రదేశమునను హెచ్చుగ వ్యాపించినవి వీరికి మంచి పలుకుబడి కలదు. మొదటినుండియు వీరు ఆంధ్రో ద్యమమున నడుముకట్టుకొని పనిచేయుచున్నారు. వీరికీసందర్భమున చెన్నపురి ఆంధ్రపండిత మండలి, చెన్నపురి ఆంధ్రమహాసభ మున్నగుసంస్థలు సన్మానపత్రములను సమర్పించుట ప్రశంసింపదగినది. తే 25-8-41 దీనివెలువడిన త్రిలిఙ్గ రజతోత్సవసంచికలో సందేశములు, ఆశీస్సులు, ఉపన్యాసములు, సన్మానపత్రములు, సభావృత్తాంతములు, ఇతర వ్యాసములు, వార్తలు పెక్కుచేర్పబడియున్నవి. వావిళ్లవారి ఘనతను దెలిసికొనదలచిన ప్రతియొక్క రును ఈసంచికను చదివితీరవలెను. కార్యదక్షులైన శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారి నీ సం దర్భమున అభివందించుచు మేము ఇతోధికాయురారోగ్యైశ్వర్యముల నొసగి రక్షించు టకు శ్రీ సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాము.

## ది అడ్వర్టయిజర్

1941 సం॥ము ఆగష్టు తే 14 దీని మదరాసునగరంలో గోఖలేహాలునందు "త్రిలిఙ్గ" రజతోత్సవసందర్భమున భాషోద్ధారక శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి అఖండసన్మానము జరిగింది. వంశపారంపర్యముగ భాషాసేవజేయుచున్న వావిళ్లవారికీనాడు పురజనులు పత్రికారచయితలు, భాషాభిమానులు—వారు,వీరు అననేల దేశీయులందరును సన్మానించా రంటే ఆశ్చర్యమేముంది? ఈసన్మానమహోత్సవానికి శ్రీపిఠాపురము మహారాజావారు సర్ వేపా రామేశంగారు, శ్రీసర్: అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు, శ్రీసర్: ఏ. పి. పాత్రో గారు మున్నగు సుప్రసిద్ధులు హాజరయారు మహారాటా, కేసరీపత్రిక సంపాదకులు దేశాభిమానులయిన శ్రీ నృసింహచింతామణి కేల్కర్, బి. ఏ, యల్. యల్. బి., గారు అధ్యక్షత వహించారు.

శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారు దైవప్రార్థన యొనర్చినమీదట సభప్రారంభిం బడెను. కంచి శ్రీ కామకోటిపీఠాధిపతులగు శ్రీ జగద్గురువు శ్రీ శంకరాచార్యులవారి త పునవారి ఆశీర్వాదములతో అడ్వకేటు శ్రీ కె. బాలసుబ్రహ్మణ్యఅయ్యర్ గారు శ్రీశాస్త్రి గారికి శాలువనుగప్పి పండితమర్యాదచేశారు. తదనంతరము సభకురాజాలని ప్రముఖు సందేశాలు చదువబడెను.

. త్రిలిఙ్గ రజతోత్సవ సంఘసభ్యుల నివేదిక శ్రీసి. యస్. శ్రీనివాసాచార్యులు, ఎం. ఏ గారు చదివారు. తరువాత అధ్యక్షులు శ్రీకేల్కర్ గారు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగా నిరంతర భాషాసేవయు, పత్రికాసేవయు, సంఘసేవయుగూర్చి చక్కగాముచ్చటించి రజత

త్సవకమిటీవారు సమర్పించిన సమ్మానసంపుటమును శ్రీశాస్త్రులవారికి అర్పించిరి. అది బహు సంపుటమై అందముగు అచ్చుతోనుండెను. 175 సందేశము లందుగలవు. 32 వ్యాసములు గలవు; అందు ఆంగ్లభాషలో 67 వ్యాసములు గలవు.

ఈ సందర్భమున అనేకసంస్థలు శ్రీశాస్త్రులవారియెడల తమకృతజ్ఞతను కనపరచుచు తమతమ అభినందనపత్రముల సమర్పించారు. వాటి అన్నిటికి శ్రీవావిళ్ల వేంకటేశ్వర శాస్త్రులవారు తమ సహజధోరణిలో మృదుమధురమగు ప్రత్యుత్తర మొసంగినారు. వీరి తండ్రిగారగు శ్రీ రామస్వామిశాస్త్రులవారు నిజముగు మార్గదర్శకుడనియు ఆయన బూనిన యత్నము మహాఫలపూరితమైనదనియు, ధనసంబంధమైన విషయముల పాటింపక ఆయన విశేషమగు పట్టుదలతో తనపనిని సాధించేవ్యక్తియనియు ఆమూలసూత్రములనే ఆధార ముగ చేసుకొని వారికార్యమును కొనసాగించు ప్రయత్నమునేవూని మన దేశీయవాఙ్మయములోని ఉత్తమగ్రంథములు ప్రజాసామాన్యమునకు అందుబాటులో నుండునటుల ఆహ్వానించుచున్నామనియు సెలవిచ్చారు.

ఈ మహోత్సవమున విద్వాన్ కవితిలక శ్రీమతి కంచనపల్లి కనకమ్మగారు పద్యాలు చదివారు; శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు, కళాప్రపూర్ణ జనమంచి శేషాద్రిశర్మ, సర్: వేపా రామేశం, పిఠాపురము మహారాజావారు మొదలగు ప్రముఖులు మాట్లాడారు. శ్రీమైద వోలు శేషాచలపతిగారి అభివందనాలతో సభ ముగిసింది. రాత్రి వుడ్‌లాండ్సులో డిన్నరు జరిగింది.

ఇంత బ్రహ్మానందమయిన మహోత్సవసన్మానము శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి జరిపి ఆంధ్రావని తరించింది. శ్రీవావిళ్లవారివంశము పండితవంశము. వీరితండ్రిగారు శ్రీరామస్వామిశాస్త్రిగారి నాటనుండి శారదాసమారాధన జరుపబడుతూంది. ఇంక ముందు గూడ శ్రీశాస్త్రులవారి చేతులలో నెన్నో అముద్రితగ్రంథాలు అచ్చులోనికి వచ్చినవి. తెలుగువెలుగును అత్యద్భుతంగా లోకానికి వీరు వెదజల్లుతారని ఆశిస్తాము.

## చిత్రగుప్త.

త్రిలిఙ్గ పత్రికాధిపా!

త్రిలిఙ్గపత్రిక రజతోత్సవము శ్రీయుత్. కేల్కారుగారి అధ్యక్షతక్రింద విజయవంత ముగా జరిగినది. ఆదేసమయములో ఆపత్రికా సంపాదకులయిన మీకుగూడా నగరసన్మానము జరిగింది. ఒక పత్రికకు పత్రికాధిపతికి ఇటువంటి గౌరవము జరిగిందీ అంటే తోడి పత్రికలవారికి యెంతో సంతోషమని వేరే మీకుచెప్పనవసరములేదు.

మనదేశంలో అందులోనూ ముఖ్యంగా తెనుగునాడులో పత్రికలు ఈనాటికీ కూడా చాలావొడుదుడుకు జీవితమునే గడుపుతూవున్నవి. అటువంటి సమయంలో త్రిలిఙ్గపత్రిక—మధ్యలో ఆగకుండా ఇరవైయైదు దీర్ఘవత్సరముల కాలము వెలువడిందంటే అదియెంతో స్తవనీయమైనవిషయము. ఈ సంతోషసమయమున మిమ్ము అభినందింపకతప్పదు.

శాస్త్రిగారు! మీరు పత్రికను నిర్వహిస్తూ రావడముగాకుండా వందలకొలది ప్రాచీన గ్రంథములను ప్రచురించారు. ప్రబంధముల కాలూకు శుద్ధప్రతులు కావాలంటే వావిళ్లవారికే వ్రాయాలి అనేలాచేశారు. ఇది గొప్పసంగతి.

పుస్తకప్రచురణ ఒక బహుళవ్యాపారంగా చేయగలిగినమీరు ఆధునికసారస్వత ప్రచురణవిషయమైకూడా కొంతశ్రద్ధ వహించాలని నాకోరిక. ఈనాడు గ్రంథకర్తలు యెవరిమట్టుకువారు తమరచనలను యెలాగో ఒకలాగున ముద్రించుకొంటున్నారు. కాని ఆలాముద్రించు కొంటున్న గ్రంథాలను విడుదలచేయడానికి విక్రయించడానికీ దారి తెన్నులులేక అవస్థపడుతున్నారు. అటువంటివారికి మీసహాయం అవసరం. అందువల్లమీకు అధనపు వ్యాపారము వుంటుంది; వారికిసహాయమూ వుంటుంది. దీనికితోడు మీరు ప్రబంథాలుప్రకటించినట్లే ఆధునికరచనలనుకూడా ప్రకటించడానికి ప్రారంభించండి. ఈ ఆనంద సమయంలో నేను మిమ్ములను అర్థించేది ఇంతే.

## జ మీ న్ రై తు

శ్రీ వావిళ్ల ముద్రణాలయాధిపతులును; 'త్రిలిఙ్గ', 'పెడరేటెడ్ ఇండియా' పత్రికాధిపులునునగు శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రుర్ల గారిని ఈసందర్భమున సన్మానించుటకుగాను మదరాసు గోఖలేభవనమునందు తే15 దిన శ్రీయన్. సి. కేల్కార్ గారి యాజమాన్యమున సన్మానసభ జరిగినది. శ్రీ పిఠాపురము రాజాగారు, సర్: అల్లాడి, సర్: కె. వి. నాయుడు, సర్: ఏ. పి. పాత్రో, సర్: వి. రామేశం మొదలగు ప్రముఖులు సభకు విచ్చేసిరి. పెక్కండ్రు తమ సందేశములను ఆశీర్వాదములను పంపిరి. శ్రీమతి బెంగుళూరి నాగరత్నము గారి ప్రార్థనలతో సభప్రారంభమాయెను.

సన్మానపత్రములు.

రజతోత్సవకమిటీనివేదిక చదువబడిన అనంతరము మద్రాసుమేయరుగారు కమిటీ తరఫున శాస్త్రులవారికి సన్మానపత్రములర్పించిరి. ఆంధ్రపండిత మండలివారును, ఆంధ్ర మహాసభవారును, హిందూమహాసభ వారును సన్మానపత్రములను సమర్పించిరి. తర్వాత ప్రశంసా వ్యాస సంపూర్ణ పేటికను కానుకగా అధ్యక్షులవారు అర్పించిరి ఈసంపుటములో 175 సందేశ

ములు ఆంగ్లములోను, 58 ఆంధ్రములోనుగలవు. 15 ఆంగ్లవ్యాసములును, 67 ఆంధ్ర వ్యాసములును గలవు.

తర్వాత అధ్యక్షునిఉపన్యాసము జరిగినది. శ్రీవేపారమేశంగారు, శ్రీఅల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు, పిఠాపురంమహారాజా, శ్రీకాంచనపల్లి కనకమ్మ, శ్రీ డి. యస్. అవధాని, శ్రీలక్ష్మీపతిశాస్త్రి మొదలగు ప్రముఖులు ప్రశంసించారు. శాస్త్రులవారు నయవినమిత ప్రత్యుత్తరముతో సభముగిసినది వుడ్‌ల్యాండ్ పార్కులో విందుజరిగినది. శ్రీ కేల్కార్ గారును, పురప్రముఖులును ఇందు పాల్గొనిరి.

## శాంతి

శ్రీ ఆచంట లక్ష్మీపతిగారు, 43, హారిసురోడ్డు, మౌంటురోడు, మద్రాసు, ఈపత్రికలో ఇట్లువ్రాసిరి:—

శ్రీ వావిళ్లవారు చరకసంహిత మున్నగు అనేకవైద్యగ్రంథముల తెనుగున అచ్చువేయించిరి. సుశ్రుతముకూడా త్వరలో ప్రచురించుటకు ఉద్యుక్తులైయున్నారు. ఈ కార్యము శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారు ఎట్టికష్టమున్నకైనను ఓర్చి అచిరకాలమున నెరవేర్పగలరని మిక్కిలి కోరుచున్నాను. 25 సంవత్సరములనుండి విడువక ఆంధ్రభాషకు సేవచేయుచున్న 'త్రిలిజ్గ' పత్రిక జయంతిఉత్సవము ఇంకను ముందుముందు అధికోత్సాహము చూపుటకై శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి తోడ్పడగలదని మిక్కిలి కోరుచున్నాను.

తెనుగునాటగల పత్రికలలోఅవిచ్ఛిన్నముగను నిర్విఘ్నముగను ఇరువదైదుసంవత్సరములు భాషాపోషకత్వమున నలరారినదిత్రిలిఙ్గాఖ్య పత్రికే. దీనికిజరిగిన రజతోత్సవమాంధ్రులకానందదాయకము ఈసంచికలో కాకతీయులనాటి ఆంధ్రవాణి, శ్లేషలోని చమత్కారములు, నవయుగపురుషులు మున్నగువ్యాసములు వజ్రపుతునకలవలె పొగడబడియున్నవి. శ్రీవేంకటరమణమూర్తి శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని దీర్ఘాయురారోగ్యములతో నాంధ్రవాణీ వరివస్యాసక్తంజేయుగాక!

## సుబోధిని

"ఉత్తమ జనకునికి ఉత్తమ పుత్రుడు" అనునది నేడు శ్రీశాస్త్రులువారిపైని కురిపించిన ప్రశంసావాక్యములకెల్ల తరళప్రాయమై అనుభవమునంతటిని ప్రతిధ్వనింపచేసినది. శ్రీ శాస్త్రులువారు తమతండ్రిగారి అడుగుజాడలలోనడచి తనకేగాక తనకుటుంబమునను, మన భారతదేశపు సత్కుటుంబ విద్వత్సంప్రదాయమునకుకూడ గర్వింపదగినకీర్తిని సము

కూర్పునని ప్రతియొక్కరును వక్కాణించిరి. సభను అలంకరించినవారిలో శ్రీ పిఠాపురము మహారాజావారు, సర్: అల్లాడి కృష్ణస్వామిఅయ్యరు, సర్: కె వి. రెడ్డినాయుడు, సర్: ఎ. పి పాత్రో, సర్: వేపా. రామేశం, డాక్టరు: యస్. కృష్ణస్వామి అయ్యంగారు, డాక్టరు: లక్ష్మీపతి, జస్టిస్ పీ. వెంకటరమణారావు, ఓ. పుల్లారెడ్డి, జి. జానకిరామ్ శెట్టి (మేయరు), దివాన్‌బహదరు ఆర్. వి. కృష్ణఅయ్యరు, రావుబహదర్ జి. ఎ. నటేశన్, టి టి కృష్ణమాచారి, బషీర్ అహమ్మద్ సయ్యద్, జి. హరిసర్వోత్తమరావు, పి. సంబంధ ముదలియారు, కె. శ్రీరాములునాయుడు, ఖాసా సుబ్బరావు, రామనాథ గోయింకాగారలు గలరు శ్రీ కె. పీ. విశ్వనాథ అయ్యరు, శ్రీ యన్. సి. కేల్కరుగారిని అధ్యక్షత వహించమని ప్రతిపాదిస్తూ ఇట్లు చెప్పెను. సుప్రసిద్ధ పత్రికారచయితయు మనపురవాసులలో నొకరునుఅగు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారిని గౌరవించుటకు మనమిచ్చట నేడు సమావేశమైనాము. పత్రికా రచయితలలో శ్రీ కేల్కరు నామముపవిత్రతరమై అలరారుచున్నది అతనివ్రాతలు మనకందరికీ మిక్కిలి యుత్సాహమును కలిగించినవి. అట్టివారు నేటిసభకు అధ్యక్షత వహించుట నెంతయు సమంజసము.

శ్రీ ఐ. వినాయకరావు, రావుబహదరు క్రిష్ణరావు భాన్సలేగారలు ఆ ప్రతిపాదనను బలపరచిరి. జగద్గురు శ్రీ కామకోటి పీఠాధిపతి శంకరాచార్యస్వామిజీవారు శ్రీ కె. బాల సుబ్రహ్మణ్యయ్యరుగారిద్వారా శ్రీ శాస్త్రులువారికి శాలువనుబహుమానంగా పంపించిరి.

శ్రీ సి. యస్. శ్రీనివాసాచారియరు, యం. ఏ, గారు వివిధదేశనాయకులు పంపిన సందేశములను పఠించిరి. సర్: యం. వెంకటసుబ్బారావు, సర్: మీర్జాఇస్మాయిల్, సర్: జార్జిబోగ్, టి. జి. రూదర్‌ఫోర్డు, పిఠాపురము యువరాజా, డాక్టరు: O. R. రెడ్డి, డాక్టరు: G. S. అరండేలు, జమ్నదాసు మెహతా, మనుసుబేదారు, గంగాధరరావు దేశపాండే, బి. జి. కపర్ది, జి. జాన్సన్, వి. యన్. విశ్వనాథరావు, శ్రీమతి సి. సరస్వతిభాయిగారలు సందేశములను పంపించిరి. శ్రీమతి బెంగుళూరు నాగరత్నంగారి ప్రార్థనతో సభ ప్రారంభమైనది.

సమ్మానపత్రములు.

త్రిలిఙ్గ రజతోత్సవకమిటీవారి నివేదిక పిమ్మట చదువబడినది ఆకమిటివారి తరఫున మదరాసు మేయరు శ్రీ జి. జానకిరాము శెట్టిగారు శ్రీ వావిళ్ల శాస్త్రులుగారికి సన్మానపత్రమును అర్పించిరి అందు త్రిలిఙ్గ పత్రికయొక్కకృషి సలక్షణముగ వివరింపబడినవి.

ఆంధ్ర పండితమండలివారు, ఆంధ్రమహాసభవారు, హిందూమహాసభవారును సమ్మాన పత్రములను పిమ్మట అర్పించిరి. సభ్యులు కరతాళధ్వనులు చేయుచుండగా, అధ్యక్షులు శ్రీ శాస్త్రులువారికి ప్రశంసావ్యాస సంపుటమును కానుకగా అర్పించిరి. అది బహుంపుట

సంపుటమై అందముగా అచ్చొత్తించబడినది. అందు 176 సందేశములు ఆంగ్లభాషలో ఉన్నవి 53 ఆంధ్రభాషలోనున్నవి.

అధ్యక్షునిఉపన్యాసము.

శ్రీ కేల్కారుగారు తమ అధ్యక్ష ఉపన్యాసములో ఇట్లు చెప్పిరి. "శ్రీ శాస్త్రులు గారితో నాకు చిరకాలముగ స్నేహముగలదు. లోకమాన్య శ్రీ తిలకు మరణించుటకు ముందే కొన్నిసంవత్సరములకుముందు వారు శ్రీ శాస్త్రులుగారిని తమమిత్రులుగా భావించి పలువురితో చెప్పుచుండెడివారు. అప్పటినుంచి శ్రీ తిలకుగారి "యువకమిత్రుని" నేను ఎరుంగుదును. శ్రీ తిలకు మిత్రులలోను ప్రశంసకులలోను ఒకరినిగా నేనెంతోకాలం క్రిందటనే శ్రీ శాస్త్రులగారిని లెక్కపెట్టుకున్నాను. తిలకు చెప్పినత్రోవ సరియైనదికానీ, కాకపోనీ అతని అడుగుజాడలలో నడుచుటకు దీక్షపట్టి వారిలో ఈయన ఒకరు మహారాష్ట్రులలో కెల్లఘను"డగు శ్రీ తిలకుని శ్రీ శాస్త్రులుగారు అట్టినిష్కళంక గౌరవంతో పరికిస్తున్నారు. శ్రీ శాస్త్రులగారికి శ్రీ తిలకుగారికిగల సంబంధం కేవలం ఒక్క రాజకీయములలోనే కాదు తిలకు మాండాలే జెయిలులోనుండగా భగవద్గీతమీద వ్యాఖ్యానం వ్రాసిరి. నూతన కర్మతత్వసిద్ధాంత ప్రచారమునకు మార్గదర్శకంగా అది సత్వరముగా ఇండియా దేశమంతటను ప్రశంసింపబడినది మహారాష్ట్రేతర భాషలలోనికి ఆగ్రంథమును తర్జుమాచేయుటకు ముందుగా ఉత్సాహంగావచ్చిన మిత్రులలో శ్రీ శాస్త్రులుగారొకరు. నా అనుభవమును బట్టి నేను చెప్పగలిగినంతమట్టుకు గీతారహస్యంయొక్క తెలుగు తర్జుమా ప్రజాహితంగా లోకంలో వ్యాపించి నంతమట్టుగా వేరేభాషలోని తర్జుమాయు వ్యాపించలేదు.

వావిళ్లముద్రణాలయమునకు పోల్పదగిన ముద్రణాలయము సంస్కృత సాహిత్యమున నిర్ణయసాగరముద్రణాలయం వావిళ్లముద్రణాలయం తెలుగు సాహిత్యమున కొనరించినసేవ అంతకు మించియున్నదనికూడా నాకు తెలుసును. పత్రికా నిర్వహణమునను శ్రీ శాస్త్రులవారు త్రిలిఙ్గ, ఫెడరేటెడ్ ఇండియాల ద్వారా గొప్ప దేశసేవజేయుచున్నారు. వీరిట్లే యింకను చిరకాలము దేశసేవభాషాసేవ జేయుచుందురుగాక అని కోరుచున్నాను.

పిమ్మట సర్: వేపా రామేశంపంతులుగారును, సర్: అల్లాడి కృష్ణస్వామయ్యగారును, పిఠాపురము మహారాజావారున్నూ, కవితిలక శ్రీ కాంచనపల్లి కనకమ్మగారును, శ్రీ దంటు సుబ్బావధానులుగారును, శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారును, ఇంకా కొందరు తెలుగుపండితులును శ్రీ శాస్త్రులవారిని ప్రశంసించిరి.

తర్వాత శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు ప్రత్యుత్తరమిచ్చుచు ఉపన్యసించిరి.

వక్తలకును సభికులకును శ్రీ మైదవోలు శేషాచలపతి, బి. ఏ, బి. ఎల్., గారు సమ్మానసంఘపక్షమున వందనములర్పించిరి.

## ఆ నం ద వా ణి

1941 సం॥ ఆగస్టు తే 14 దీ గురువారము శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి "త్రిలిఙ్గ" రజతోత్సవ సందర్భమున పౌరసన్మానము శ్రీ ఎన్. సి. కేల్కారుగారి అధ్యక్షతను జరుపబడింది. శ్రీ శాస్త్రిగారి సారస్వతసేవను కొనియాడుతూ పలువురుపుర ప్రముఖులు పండితులు ప్రశంసించిరి. అధ్యక్షులు శ్రీకేల్కారుగారు శ్రీశాస్త్రిగారి సేవను పేర్కొని, "ఆంధ్రదేశమునెడలను తెనుగుభాషయెడలను శ్రీ శాస్త్రులుగారికిగల ప్రేమ సుప్రసిద్ధము. వారి ఉపన్యాసములలో నొక్కటి కడప మిత్రమండలివారు జరిపిన సన్మానసభలో వారు ప్రత్యుత్తరమిచ్చునప్పుడు వీరు మద్రాసును తెనుగునగరమని వర్ణించునంతవరకును సాహసించిరి. "మద్రాసునగరమును తెనుగువారు తమదని, అరవవారు తమదని కోరుకొనే సందర్భమున సంతోషప్రదము. అందులో అంతర్భూతమయ్యే గిజుగులాటను క్లిష్టతను తప్పించుకొనుటకు ఈ నగరము కానిరువురకు చెందదని అనిన ఇంకను తమాషాగానుండును. కాని, ఈ తగవులాటే ఈ యిరువాగులవారికి తమ తమ మాతృభాషలయెడలగల గొప్ప అభిమానమునకు తార్కాణము. ఇందువల్ల గలిగే పరోక్షప్రయోజనమును గలదు. భారతభూమిని భాషాధారకప్రాంతములక్రింద విభజింపడము వివేకమును భావోత్పాదనయే ఆ ప్రయోజనము. వ్యక్తిగతముగ నేను మాత్ర మీప్రయోజనము త్వరలో సమకూరును గాక అని ఆశింతునని" చెప్పిరి.

"తెనుగుభాషను పునరుజ్జీవింపజేయడములో వావిళ్లప్రెస్సు చాలా గొప్పసేవ చేసినది. వారి ప్రెస్సు సంస్కృత వాఙ్మయమునకిచ్చిన ప్రోత్సాహము నాలోచించినా తెనుగున అచ్చువేసిన సేవనాలోచించినా ఇటీవల శ్రీ శాస్త్రులుగారి కొసగబడిన 'భాషోద్ధారక' బిరుదము ఔచిత్యముతోకూడుకొన్నదై సార్థకముగనున్నదని"కూడ చెప్పిరి.

శ్రీ శాస్త్రిగారు వారి కృతజ్ఞతను వెలిబుచ్చుచు ఈ ప్రకారం చెప్పారు:

హిందూమత సంస్కారములకును, ఇతర భారతీయమత సంస్కారములకును సంబంధించిన గ్రంథములు వందలకొలది శ్రుతులు, స్మృతులు, పురాణములు, కావ్యములు, నాటకములు, ఇతిహాసములు, నవలలు మొదలుగాగల గ్రంథములును, వైద్యజ్యోతిషాదిశాస్త్రగ్రంథములును మా ప్రచురణాలయమున ప్రచురింపబడెను. ఇంకను అనేక గ్రంథములు అచ్చుపడని నిక్షేపములున్నవి. వాని పరిశీలించి మనము ఉపయోగించుకొనవలసి యున్నది. ఇప్పటికంటె ప్రోత్సాహముకలిగినయెడ మేము వానినిగూడ ముద్రింపగలము. అయితే అట్టివాఙ్మయవ్యాప్తికి నేటి వాతావరణము అనుకూలముగలేదు. దానికంటెకును కారణము ఆధునిక గ్రంథములకును అన్యదేశీయరచనలకు తగిన భాషాంతరీ

కరణములులేమియే అని నాకు తెలుసును. అందుచే మన భాషను విజ్ఞానమును అభివృద్ధిలోనికి తేవలయునన్న ఇతరభాషలలో ప్రచురింపబడెడు ముఖ్యగ్రంథములన్నియు తెనుగులోనికి భాషాంతరీకరణముచేయక తప్పదు. మాసంస్థ స్వతంత్రగ్రంథములనే గాక ఈ రీతి భాషాంతరీకరణములనుగూడ ముందు ప్రచురింప దలచియున్నది. ఇంకను అన్యరాష్ట్రభాషా స్వతంత్రగ్రంథములుకూడ వెంటనే తెనుగులోనికి వచ్చినగాని హైందవవిజ్ఞానాధిక్యము ప్రత్యేకత నాగరికత తెలిసికొనజాలము.

## ప్ర జా మి త్ర

'త్రిలిఙ్గ'పత్రికకు పాతికేళ్లు నిండినసందర్భంలో ఆపత్రిక సంపాదకమహాశయులైన శ్రీవావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి 1942 సం॥ ఆగస్టు తే 14 దీని మదరాసులో మహనీయమైన సన్మానము జరపబడడం సమంజసమై వుంది. శ్రీవారు పత్రికాసంపాదకులు మాత్రమే కారు. మద్రాసులోని పెద్ద తెనుగుప్రెస్ ప్రొప్రయిటర్లలో ఒకరు వారు సుప్రసిద్ధ సంస్కృతాంధ్రగ్రంథప్రచురణకర్తలుకూడాను. ఇన్నిరీతుల వారు భాషాయోషకు ఊడిగం చేస్తున్నారు. కాబట్టే ఆంధ్రప్రజాసంఘం వారికి 'భాషోద్ధారక' బిరుదాన్ని ఇచ్చింది.

బహుముఖాలుగా భాషాభగవతిని సేవిస్తూవున్న శ్రీ శాస్త్రిగారు పూర్ణపురుషాయుష జీవులై వెలయాలని హృదయపూర్వకంగా కోరుతూవున్నాము.

## ఆంధ్రప్రభ

"ఆంధ్ర సంస్కృత సాహిత్యములకు అఖండ సేవచేస్తున్న నిరాడంబరజీవి".

త్రిలిఙ్గ రజతోత్సవసందర్భమున శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులుగారికి

జరుపబడిన మహాసమ్మానము

"జనకుని అడుగుజాడల నడచిన తనయు"డని పెక్కురు ప్రముఖులవల్ల ప్రశంసలు.

పండితులు, విద్వత్పోషకులు, అనేక విధములైన భేదాభిప్రాయములు గల రాజకీయవేత్తలు అసంఖ్యాకులుగ 1941 సం॥ఆగస్టు తే 14 దీని సాయంకాలము గోఖలేహాలులో సమావేశమై "వావిళ్ల ముద్రణాలయము"ద్వారా ఆంధ్రసంస్కృత సాహిత్యములకు శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులువారు చేసిన సేవలను ఉగ్గడించిరి. మరియు "త్రిలిఙ్గ", "ఫెడరేటెడుఇండియా" పత్రికలద్వారా ఈ దేశంలో సవ్యమగు రాజకీయ విజ్ఞానం అభిప్రాయం వ్యాప్తిపొందుటకు ఆయనచేసినసేవలను ప్రశంసించిరి.

త్రిలిఙ్గ పత్రిక రజతోత్సవమును జరుపుటకును, ఆ సందర్భమున శ్రీ వేంకటేశ్వరశాస్త్రులువారికి వారుచేసిన మహాసేవలను వారిగుణగణములను ప్రస్తుతించుచు

పలువురు వ్రాసిన పద్యగద్య వ్యాసయుక్తమైన సంపుటమును అర్పించుటకును "త్రిలిఙ్గ" రజతోత్సవసంఘమువారు ఈ సభను యేర్పాటుచేసిరి.

తెలుగు సాహిత్యమును ఉజ్జీవింపచేయుటకు వావిళ్ల ముద్రణాలయము అఖండమైన సేవచేసినది. సంస్కృత సాహిత్యమునకై తేనేమి తెలుగు సాహిత్యమునకై తేనేమి, శ్రీ శాస్త్రులువారు సమకూర్చిన మహాసహాయమును బట్టి చూస్తే వారికి ఇవ్వబడిన "భాషోద్ధారక" బిరుదము వారుచేసిన సేవలకు కృతజ్ఞతను తెలుపునట్టిదే కాక, సార్థకమైనదని కూడా తెలియగలదు" అని ఆసభకు అధ్యక్షత వహించిన శ్రీయన్. సి. కేల్కరుగారు వాక్రుచ్చిరి.

## పత్రికల ప్రశంస

త్రిలిఙ్గరజతోత్సవసంచిక మా కార్యాలయమునకు చేరి మిక్కిలి సంతోషమును చేకూర్చినది త్రిలిఙ్గ పత్రిక దేశమునకును భాషకును నూతన నాగరికతామహోద్యమమునకును జేసినసేవ వేనోళ్ల కొనియాడదగియున్నది. తెలుగు పత్రికలయందు మిక్కిలి వన్నె గడించుటలో ప్రథానమైనదని చెప్పక తప్పదు. దీనికంతయు శ్రీయుత వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రిగారికృషి యెంతయో ప్రశంసింపదగియున్నది. ఈ పత్రికారాజము సర్వాంగసుందరమై స్వర్ణోత్సవమునుగూడ పొందునట్లు భగవంతు డనుగ్రహించుగాక!

## ఆంధ్ర పత్రిక.

మద్రాసులోఉండే తెనుగువాళ్లను చాలాకాలమువరకు "ఉత్తరాదివాళ్లు" అని పిలవడము ఆచారముగాఉండేది. ఇప్పటికీ మద్రాసులో అక్కడక్కడ మారుమూలవీథులలో "ఇక్కడ ఉత్తరాదిబ్రాహ్మణులకు భోజనమువేయబడును" అని పెద్దఅక్షరాలతో వ్రాయబడిన ప్రకటనబల్లలు కొన్ని పూటకూళ్ల ఇండ్లవెలుపల కట్టబడినవి కన్పిస్తూఉంటాయి ఈ మద్రాసులో ఉత్తరాదివాళ్లు అంటే పట్టణవాసంగాని, నాగరికతావాసనగాని లేని అనాగరికులనే భావంతో మద్రాసులో ఉన్న దక్షిణాదివారు చాలాన్యూనతగా చూస్తూ ఉండేవాళ్లు.

కాని, ఈ న్యూనత క్రమేణ గత పాతికముప్పదిఏండ్లనుంచీ మూడు ముప్పాతిక మువీసం తొలగిపోయింది. మొదటి ఆంధ్రమహాసభ 1913 సంIIలో జరిగింది. ఆంధ్రోద్యమ రథం సాగింది. ఆంధ్రపత్రికాకార్యాలయం 1914 సంII లో మద్రాసులో ప్రతిష్ఠింపబడింది తదాదిగా కీII శేII శ్రీ నాగేశ్వరరావుపంతులుగారు మద్రాసులో ఆంధ్రవిజయయాత్రను సాగించారు.

ఆంధ్రరాష్ట్రానికి ప్రధాననగరంగా ఆఖరుకు ఈ మద్రాసునగరమునే తీసికొంటాము అని ఖాహాటంగా నిర్భయంగా కొలదిసంవత్సరముల క్రిందట మద్రాసులో జరిగిన ఆంధ్ర

మహాసభలో బల్లగుద్ది పట్టికుగాఅడిగినారు. ఆసభకు ఆహ్వానసంఘాధ్యక్షులైన శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారే ఈ హక్కుపిటీషను దాఖలుచేశారు ఆ సభలో.

శ్రీ వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రిగారికి ఈమద్రాసునగరం ఆంధ్రరాష్ట్రముఖ్యనగరం కావలెననే కోరిక కలిగింది. ఈ ఆంధ్రాభిమానం వారిలో అదివరకే చాలాకాలంనుంచీ చాలాగాఢంగా వేరుపారివున్నదే గాని, తలవనితలంపుగా కలిగిందికాదు.

1941 సం॥ ఆగస్టు నె 14 దీని వీరికి మద్రాసులో గోక్లేహాలులో లోకమాన్య శ్రీ తిలకుగారి ప్రియశిష్యులును అంతేవాసులునై కేసరీ, మహారాటాపత్రికల సంపాదకులుగా నుండినట్టి, శ్రీ యన్. సి. కేల్కారుగారి అధ్యక్షతను జరిగిన సన్మానసభయందు శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు ఆంధ్రోద్యమానికి ఆంధ్రసాహిత్యానికి చేసినసేవ వేనోళ్ల కొనియాడబడింది.

వీరు నిర్వహిస్తూ ఉన్న త్రిలిజ్గపత్రికకు 25 సంవత్సరములవయస్సు నిండింది. ఇప్పుడు పహిలా పచ్చీసులో ఉన్న ఆపత్రికకు రజతోత్సవం చేశారు. విందులతోసహా వేడుకగా వైభవంగా చేశారు.

వీరేకాదు. వీరితండ్రిగారైన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారే మొట్టమొదట ఆంధ్రసాహిత్యగ్రంథాలకు తాళపత్ర బంధవిమోచన కలుగజేయడానికి పూనుకొన్నారు. తాను తరించి లోకాన్ని తరింపజేసే సద్వ్యాపారం చాలా సమర్థతతో పట్టుదలలతో సాగించారు.

అనేక తెనుగుగ్రంథాలు ప్రబంధాలు అంతకుపూర్వం ప్రాతతాటాకుగ్రంథాలుగా ఉండేవి. ఆంధ్రపండితులకేవిధంగా గౌరవమర్యాదలు క్షీణించిపోయినో, యీ తాటాకు గ్రంథాలుకూడా అదేవిధంగా బూజుపట్టిఉండేవి. అచ్చుయంత్రాలు వచ్చినతర్వాత, ఆంధ్రసరస్వతియొక్క కాటుకకంటినీరు తుడిచి నల్లనికాటుకతో తెల్లనికాగితాలమీద ముచ్చటగా ముద్రించుటలో ముందంజవేసిన భాషాసేవకులు కీ॥శే॥ శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రిగారు. తండ్రిగారి సాహిత్యసేవనే శిరసావహించిన సరసాగ్రగణ్యులని సన్మానం పొందారు శ్రీవేంకటేశ్వరశాస్త్రిగారు.

ఇంకా మనుచరిత్ర, విజయవిలాసము మొదలగుప్రబంధాలను రంగుల చిత్రపటములతోకూడా ముద్రించి అధికమైనఅభిరుచిని ఆంధ్రులకు ఆంధ్రసాహిత్యంలో వారు కలుగజేయడానికి చాలాఅవకాశము కలదు.

ఈ సన్మాన సభలో శ్రీ వేంకటేశ్వరశాస్త్రిగారు ఒక్కవిషయం చెప్పారు. గాంధీ మహాత్మునితత్వం ఏమిటో అగమ్యగోచరంగా ఉన్నదన్నారు. మహాత్మునిఉపదేశాలు ఆయన

ఆత్మప్రబోధములుగా ఉన్న వేగాని, యుక్తియుక్తంగా సహేతుకంగా కన్పించలేదన్నారు. అందువల్లనే తాము ఆయనఉపదేశాలను అనుసరింపలేకపోతిమన్నారు.

కార్మికుల నుద్ధరించుటకు ప్రజాప్రముఖులు పట్టుదలగా ఇంకాపనిచేయడం లేదన్నారు.

మహాత్మునిఉపదేశాలలో ఏదైనా ఒకపెద్ద సూక్ష్మవిషయము, అహింసాసిద్ధాంతం వంటిది, వారికి అర్థముకాలేదు. అంటే హర్షింపవచ్చుకాని, కార్మికులను ఉద్ధరించడానికి, దేశపరిశ్రమలను ఉద్ధరించడానికి మహాత్ముడుబోధించిన ఖద్దరుఉద్యమములో శ్రీ శాస్త్రి గారికి అర్థముకానిదేమున్నది! గ్రామోద్ధరణ వల్ల గృహపరిశ్రమోద్ధరణమువల్ల కార్మికులను బాగుచెయ్యవచ్చునుగదా! మనపొలాలు సేద్యముచేసి పంటలుపండించే హరిజనులను అంటరానివారిగా అణగద్రొక్కితే ఆకార్మికకర్షకజనసంఘముమీద తిరుగుబాటు చెయ్యక మానరు. అంటరానితనం తొలగించడం శ్రీశాస్త్రిగారుకోరిన కార్మికోద్ధరణానికి ఉపకరణము కాదా! హిందీభాషాగ్రంథ ప్రచారముకూడా వారికి నచ్చలేదా! మహాత్ముడు చెప్పినదేది, ఎందుకు, వారికి బోధపడలేదో తెలియకుండాఉంది. ఈ విషయమే వారిఉపన్యాసంలో తేటతెల్లంగావివరింపక అగమ్యగోచరంగా విడిచిపెట్టారు.

శ్రీ శాస్త్రిగారు ఇంకా సత్యాన్వేషణము, సాహిత్యసేవచేస్తూ శాశ్వతమైన కీర్తి గడించి ధన్యచరితులు కావలెనని ఆంధ్రలోకము కోరుతూఉంది.

శ్రీగూడూరు రామచంద్రుడుగారు,

సేవాశ్రమము, గుడివాడ, కృష్ణజిల్లా.

తమపత్రికారాజముల పంచవింశతివార్షికోత్సవము సెంతయు సంతోషావహము. మనదౌర్భాగ్యవశమున ఏయుద్యమముగాని చిరకాలముసాగుటగాంచుభాగ్యము మనకు లేదు. అందు పత్రికాప్రయత్నమునకు అట్టిభాగ్యము మరింతతక్కువ. అట్టిసందర్భములలో పాతికశతాబ్దకాలము తాము రెండుపత్రికలునిర్వహించుట దేశీయులెంతయు గర్వింపదగిన సంగతి. రాజకీయముగ అతివాదనీతిని నడపుపత్రికలకు విశాలప్రచారము లభించుటకద్దు. తాము అట్టినీతిని అవలంబింపకున్నను జాతీయతకు ఎంతమాత్రమును భంగములేకుండ దేశమునకు నిరంతరఉత్కృష్టసేవజేయుచు వానికి విశాలప్రచారముసంపాదించుట ఎంతయు శ్లాఘనీయము. రాజకీయము, సాంఘికము, విద్య, ఆర్థికము మొదలగువివిధవిషయములనుగురించి తమపత్రికలలో ప్రచురమగు భావములన్నిటితో అందరు నేకీభవింపలేకపోవచ్చును. పత్రికాసేవ సాధారణముగ మెప్పులేనిది. అయినను అట్టిప్రయత్నమున తాము వ్యక్తపరచుపట్టుదలయు, శక్తిసామర్థ్యములును ఆదర్శప్రాయము. తమప్రయత్నములు ఆచంద్రార్కముసాగునట్లు శ్రీరాముడు తమకు దీర్ఘఆయురారోగ్యములు కృపజేయుగాక!

## 'ఆంధ్రవాల్మీకి' శ్రీయుత వావిలికొలను సుబ్బరావుగారు,

ఆంధ్రపండితులు, ప్రెసిడెన్సీకాలేజీ, మదరాసు.

మీరుపంపిన పుస్తకములం గైకొని యాంధ్రభాషాగ్రంథకోటికి దుర్దశాకాలంబుదొలంగింప మీరు సమకట్టినందుకై చాలనానందించితి. పుస్తకములుచూడ మనోహరములై చదువుటకుం బ్రేరించుచున్నవి. మునుపటి "చేంటభారతము" రూపములంగాక చేతిలోనికి నణంగునవియై-పద్యములు పాదములు వేఱువేఱుగ ముద్దులొలుకు చక్కనిపెద్దయక్షరములతో మేలుకాగితములపై ముద్రింపంబడినవియై యుండుటచేం బ్రథమపాఠకులకు నుత్సాహంబుం గలిగించుటయేగాక యేదైనం బ్రయోగము వెదకుకవులకుం బండితులకు మిక్కిలి సహాయపడుచున్నవి. "గుజిలీ" పుస్తకములవలెంగాక పండితులచే సవరింపించి యుండుటచేం బానకములోని పుల్లలవంటి ముద్రాదోషంబులచే విడువంబడి ధారాళముగం జదువందగి యున్నవి. కేవలధనలాభమునందే దృష్టిలేక భాషాభిమానముచే మీరు గ్రంథముల ముద్రించువారుగ నున్నారుగావున నాంధ్రంబునంగల యుత్తమగ్రంథంబులనెల్ల నిట్లే యచ్చొత్తించి యాంధ్రులకు నాంధ్రభాషకు మేలొనరింతురని కోరుచున్నాండను.

17-10-1910

## మహామహోపాధ్యాయ శ్రీయుత కొక్కొండ వేంకటరత్నముపంతులుగారు,

రాజమహేంద్రవరము.

### స్వాభిప్రాయప్రదర్శిక.

సకలసద్గుణసమృద్ధమనియు, సర్వపాపాపహమనియు, సమస్తపుణ్యావహమనియు, సన్నుతాఖిలపురుషార్థప్రదమనియు, నన్నియెడల మిక్కిలి ప్రసిద్ధికెక్కియున్న ప్రాచీనగ్రంథరాజములగుఱించి యిక్కడనేనేదియు వక్కాణింపనక్కఱలేదు. ఐన నీసంస్కృతాంధ్రగ్రంథముల ననేకులు పలుమాఱు ముద్రించిరికాని, యాపొత్తకములయచ్చు కమ్మచ్చు. కాగితములుల్లిపొరలు. పొత్తములు వితంతువులు. అట్టలు పట్టువదలం జంద్రహాసవిచ్ఛిన్నపక్షజటాయుఃప్రాయములు. అటులయినంగాంతుమన్న అవ్యక్తాక్షర పరబ్రహ్మీభూతములు. ఇంక వానిమాట యిటనేటికి? ఇపుడన్ననో యాంధ్రమహాజనులభాగ్యము పండెనన నమ్మహాగ్రంథములు పండితులచేం బరిశోధింపంబడి వావిళ్లముద్రాశాలలో మంచికాగితములపై మిక్కిలిచక్కంగ ముద్రింపంబడి దిట్టములయినయట్టలతోం గట్టిగం గూర్పంబడి, కన్నులపండువుగం గన్పట్టుచున్నవి. బ్రహ్మశ్రీ వావిళ్లరామస్వామిశాస్త్రి తత్పుత్రసంఘమువారిచే సమ్మృతఘుటికాఘుసృణాంచిత రత్నఖచితకాంచనపేటికనాంగం బ్రకటింపంబడుచున్నది. వేయేల!

"వెల స్వల్పము, ఫలమధికము." అనునానుడి యీ గ్రంథరత్నములకే తద్దయుఁ దగియున్న దనుకొనుచున్నాను. ఇద్ది, శ్రీరామోదితమని భావించికొని కొని కైకొనిపఠించువారిదే భాగ్యమ్మని నెమ్మనమ్మునన్నమ్ముచున్నాను. 20-10-1910.

### ఆంధ్రరత్న శ్రీదుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారు,

రామనగరు, చీరాల.

మీ త్రిలిఙ్గపత్రిక నాకిచటికందినది. చూచి చాలా ఆనందముగల్గినది. వ్యవహారవిషయములన్నియు శాంతముగా సరసముగా విమర్శింపబడుచున్నవి. అందలిభావములు కొన్నిటితో నేనేకీభవింపకపోయినప్పటికి పత్రికయొక్క తరహామాత్రము చాలాఆదరణీయమై యున్నది కౌన్సిల్‌కు వెళ్లవలసినదేయను యభిప్రాయమొక్కటిమాత్రము నేనేకీభవింపజాలను. ఏదోయొకవిషయములో భేదమున్ననేమి. త్రిలిఙ్గపత్రిక మనముతాలోది గనుక నాకు పరమాప్తవర్గములోది. 28-11-1922.

### శ్రీ ఎ. వి. నరసింహంపంతులుగారు,

ఆంధ్రపండితులు, క్వయిక్ మేరీస్ కాలేజీ, మదరాసు.

సీ. ఆంధ్రకావ్యావలి-కభినవాలంకృతి, నలరించె నేఘనుం-డధికరక్తి
విబుధవర్గముపాలి-విబుధాగమైయొప్పి, రహిఁగూర్చె నెవఁడు వి-జ్ఞానముల
నేయుత్తముఁడు సుహృ-ద్హృదయాంబుజాళికి, మిత్రరూపంబున-మిసిమిఁదెచ్చె
గురువర్గములఁ బ్రోవఁ-గొనబారుసద్భక్తి, యెవ్వానిదీప్తాయు-వెలమిఁదెల్పె

తే. వఱలునాతండు వావిళ్ల-వంశవార్ధి, తుహినకిరణుండు సౌజన్య-ధుర్యకీర్తి
వేంకటేశ్వరశాస్త్రి మా-వేంకటేశు, కరుణఁ జెంపొంది ప్రాభవ-కలితుఁడగుచు.

16-10-1915.

### శతావధాని బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారు, బందరు.

క. మీరంపినపుస్తకముల, నారసితిఁ, సంతసంబునందితి మిమ్ముఁ
ధీరులు పూర్వకవీంద్రులు, సారయశోదారులగుచు సాకుదు రెందున్. 1

చ. వెనుక మహాకవీశ్వరులు వేల్పులబాసను దెల్గుబాసయం
దును దగుకబ్బముల్ మనకు దొంతులుదొంతులుగా రచించి రా
ధనమది ముద్రణంబునెడఁ దద్దయుఁ దప్పులకుప్పయయ్యె, నే
డనఘుఁడు వావిళాన్వయజుఁ డందలిలోపముఁ బాపె నెంతయున్. 2

ఉ. చక్కని యక్కరంబులును జక్కని కాగితముల్ వెలుంగ ము
న్నెక్కడఁ గాని తెల్గుకృతు లింపొనరించుట చూడఁబోము నేఁ
డక్కడ నక్కడం గనిన నందును దప్పులు తోఁచుచుండు నీ
విక్కడి వావిళాన్వయముచేఁ గవిరాజికిఁ దప్పె నొప్పుగన్.

5-9

**శ్రీ ఘడియారము వేంకటకృష్ణకవిగారు.**

**పంచరత్నములు.**

శా. శ్రీమాహేశ్వరభక్తశేఖరు సుధాశ్రీరమ్యకీర్త్యాకరున్
సోమాచ్ఛాననుఁ బావిళాన్వయజనున్ సూరీంద్రచంద్రుప్పనున్
కామాకారుని సద్గుణాకరుఁ గలాకాంతున్ ధరాదేవునిన్
రామస్వామిసుశాస్త్రి నెంతు బ్రియమారంగ న్సదా మన్మదిన్.

తే. సకలభాషాఘనోద్గ్రంథచయము నెల్ల, నచ్చువేయించి ధాత్రి నార్యాళి కుప
కారియై ఖ్యాతిగాంచెడు ఘనవరేణ్యు, సద్గుణాఢ్యు రామస్వామిశాస్త్రి నెంతు.

తే. స్థిరసువిద్యావినోదంబుచే బ్రబలుచు, ధీరులై యుండు మావంటివారి కెల్ల
భూరిశబ్దార్థసంకల్పభూజమైన, సద్గుణాఢ్యు రామస్వామిశాస్త్రి నెంతు.

తే. చన్నపట్టణవాస్తవ్యు సన్నుతమతి, సకలవిద్యామృతాబ్ధిని శాస్త్రనిధిని
పరమువావిళ్లవంశాబ్ధిహారి శుభాఢ్యు, చంద్రకీర్తి రామస్వామిశాస్త్రి నెంతు.

క. సోమామలసత్కీర్తిని, ధీమాన్యుని భూసురేంద్రు దివ్యాత్మకు శ్రీ
రామస్వామిసుశాస్త్రిని, ప్రేమన్మది సన్నుతింతు వేడుక లూరన్.



చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1941.